మాండలిక

# వృత్తిపదకోశం

ద్వితీయసంపుటం

## చేనేతపదాలు


సంకలనకర్త, సంపాదకుడు

భద్రిరాజు కృష్ణమూర్తి

సహాయకుడు

పోరంకి దక్షిణామూర్తి






ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి

సైఫాబాదు : హైదరాబాదు

1971

# మా మాట

1957 వ సంవత్సరములో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి యేర్పాటు జరిగినది. మొట్టమొదటి కార్యవర్గసమావేశములోనే తెలుగుభాషలో ఆధునిక భాషాశాస్త్ర పద్ధతులప్రకారము మాండలికపదకోశాలను సిద్ధముచేసి ప్రకటించవలెనని అకాడమి నిశ్చయించినది. భారతీయభాషలలో ఇటువంటి ప్రయత్నానికి మార్గదర్శకమైనది ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి అని యీ సందర్భములో మనవి చేయవలసి ఉన్నది. ఇటువంటి వృత్తిపదకోశాల నిర్మాణానికి వ్యవసాయము, చేనేత, వాస్తు, మత్స్యపరిశ్రమ కుమ్మరము, కమ్మరము మొదలగు వృత్తులను స్వీకరించి యీ పనిని సమర్థవంతమైన సంపాదకవర్గానికి అకాడమి అప్పగించినది. డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారి అధ్యక్షతన డా. దొణప్ప, డా. జి. యన్. రెడ్డి, డా. బూదరాజు రాధాకృష్ణ సభ్యులుగా ఈ సంపాదక వర్గము ఏర్పాటు జరిగినది.

1962 లో డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారి సంపాదకత్వాన తొలిసంపుటమైన వ్యవసాయపదకోశము ప్రకటితమైనది. తరువాత 1968 లో డా. బూదరాజు రాధాకృష్ణ గారి సంపాదకత్వాన వాస్తుకోశము ప్రకటితమైనది. ప్రస్తుతము డా. దొణప్పగారి సంపాదకత్వాన మత్స్యపదకోశము డా. జి. యన్. రెడ్డిగారి సంపాదకత్వాన కమ్మరము, కుమ్మరము, కంసాలిపని మొదలగు వృత్తుల పదకోశముల పని యించుమించుగా పూర్తియై యిప్పుడు వ్రాతప్రతులు సిద్ధమవుతున్నవి. 1972 లో ఈ రెండు గ్రంథాలు అచ్చుకాగలవని ఆశిస్తున్నాను.

డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారి సంపాదకత్వములో సిద్ధమైన యీ చేనేత వృత్తిపదకోశాన్ని యీ సందర్భములో అకాడమి ఆంధ్రమహాజనులకు అందజేస్తున్నది. డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయ భాషాశాస్త్రశాఖకు అధిపతులు; ఆర్ట్సు కళాశాలకు అధ్యక్షులు. అన్నిటికన్న ముఖ్యముగా భాషాశాస్త్రములో, వ్యాకరణములో నిష్ణాతులైన పండితులు. ఇట్టి ప్రామాణికులు యీ సంపుటానికి సంపాదకులుగా నుండుట సంతోషకరమైన సంగతి. సుమారొక సంవత్సరము విదేశవిశ్వవిద్యాలయములలో పనిచేయవలసివచ్చినప్పటికిని, అనేక పరిశోధనకార్యక్రమములలో నిమగ్నులైనప్పటికిని, డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు శ్రమకోర్చి అమూల్యమైన సమయము వినియోగించి యీ గ్రంథమును సిద్ధముచేసినారు. వారికి అకాడమి పక్షాన ధన్యవాదాలు.

ఈ గ్రంథాన్ని చక్కగా అచ్చువేసిన శివాజిముద్రణాలయమువారు అభినందనీయులు.

**22-11-1971.**

— దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# విషయసూచిక

# తొలిపలుకు

తెలుగుదేశమంతటా దేశీయవృత్తుల్లో జానపదులు వాడే మాటలన్నిటినీ మాండలిక భేదాలతోసహా కోశరూపంలో వెలువరించాలని ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ 1957లో నిర్ణయించింది. ఆ నిర్ణయంమేరకు వ్యవసాయవృత్తిలో ఉన్న పదాలతో మాండలిక వృత్తి పదకోశం మొదటిసంపుటం 1962లో వెలువడ్డది. గృహనిర్మాణ సంబంధమైన పదజాలం (వాస్తుపదాలు) మాండలికవృత్తిపదకోశం నాలుగోసంపుటంగా 1968లో వెలువడ్డది. చేనేతపదాలతోకూర్చిన ఈ కోశం ఈ వరసలో రెండోది. మత్స్యపరిశ్రమ, పడవల నిర్మాణానికి సంబంధించిన పదాలు మూడో సంపుటంగాను కమ్మరం, కుమ్మరం, వడ్రంగం, కంసాలి వృత్తుల్లో వాడేపదాలు అయిదోసంపుటంగాను మరో ఏడాదిలో వెలువడతాయి.

దేశభాషల్లో వృత్తిపదకోశాల నిర్మాణం మొదటిసారిగా మనభాషలోనే జరిగింది. వీటికూర్పులో ఏర్పరిచిన శాస్త్రీయవిధానానికి మరెక్కడా సమానాలు లేవు. స్వతంత్రంగా కల్పించిన ఈ విధానం ఇతర భాషాప్రాంతాలకు మార్గదర్శకమైందని చెప్పటంలో అతిశయోక్తి లేదు. ఇప్పుడు కన్నడం, మలయాళం, హిందీ, మరాఠీ మొదలైనభాషల్లో ఈ ప్రక్రియ ఒరవడిగా వృత్తిపదకోశాలు నిర్మించే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

పదసంగ్రహణం ఒక ఏడాదిలో పూర్తి అయింది. కోస్తా, తెలంగాణా, రాయలసీమ ప్రాంతాల్లో అయిదుగురు పర్యటన పరిశోధకులు పర్యటించి పదసేకరణ చేశారు. శ్రీ పోరంకి దక్షిణామూర్తి 33, శ్రీ లింగుట్ల కోనేటప్ప 25, శ్రీ నిమ్మగడ్డ సుబ్బారావు 17, శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి 11, శ్రీ ఎదిరె చెన్నకేశవులు 10 గ్రామాలు పర్యటించారు.

ఈ కోశనిర్మాణం విజయవంతంగా సాగటానికి ఈ కింద పేర్కొన్నవారందరూ తోడ్పడ్డారు ; వారందరికీ కృతజ్ఞతలు :

వేతనం తక్కువయినా ప్రయాణక్లేశాలకు ఓర్చి నిర్ణయవిధేయంగా పదసంగ్రహణం చేసిన పర్యటన పరిశోధకులకు ; కోస్తాప్రాంతంలో పదసేకరణ కార్యక్రమం పర్యవేక్షించిన డా. తూమాటి దొణప్పకు ; నేను విదేశాల్లో ఉన్న కాలంలో పదకోశంలో కొన్ని

భాగాలకు ఆరోపనిర్ణయం, రూపాంతర పర్యాయపదవివేచనల్లో తోడ్పడ్డ డా. చేకూరి రామారావుకు ; ముద్రణకార్యక్రమంలో కడపటి ప్రూఫులు ఎక్కువభాగం ప్రత్యేక శ్రద్ధతో చూసిన డా. బూదరాజు రాధాకృష్ణకు ; పర్యటన పరిశోధకులతోబాటు దాదాపు 50 గ్రామాలు పర్యటించి అర్థస్పష్టత లక్ష్యంగా చక్కటి రేఖాచిత్రాలు గీసిన శ్రీ లాభి వెంకట హనుమంతరావుకు.

పదసేకరణ మొదలు ముద్రణవరకూ అన్నిదశల్లోనూ నాకు చేదోడువాదోడుగా ఉన్నవాడు శ్రీ పోరంకి దక్షిణామూర్తి. ఈ పదకోశనిర్మాణానికి ఏర్పరిచిన విధానం మేరకు సుమారు సగభాగానికి ఆరోపనిర్ణయం, రూపాంతర పర్యాయపదాల నిరూపణ, అర్థనిర్ణయం మొ. పనులు అతనే చేశాడు.

పర్యటనపరిశోధకుల నియోగంలోను, కోశనిర్మాణవిధానంలోను సంపూర్ణస్వేచ్ఛ ఇచ్చి ఎన్నోరకాల సహకరించిన అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుకు, వారి ఆఫీసు సిబ్బందికి, ముచ్చటగా నిర్దుష్టంగా అచ్చువేసిన శివాజీప్రెస్ అధికారులకు ప్రత్యేక కృతజ్ఞతలు.

హైదరాబాదు
22 నవంబరు, 1971

—భ. కృ.

# రేఖాచిత్రాలపట్టిక

# చేనేతపని

## కథనాత్మకవివరణ

మనదేశంలో తరతరాలుగా అనుసరిస్తున్న వృత్తుల్లో సేద్యం తర్వాత చెప్పుకోవలసింది చేనేతపని. దారప్పోగులు ఒక వరసలో పొడుగ్గా మగ్గానికి అమిర్చి, వాటిసందులో అడ్డంగా మరొక దారప్పోగు వచ్చేటట్టు కండె వేస్తూ ఆ పోగు దగ్గరపడేటట్టు ఒక కొయ్యపలకతో ఒత్తుతూ ఉంటే బట్ట తయారవుతుంది. స్థూలంగా చెబితే, నేత అంటే ఇదే.

పోతే, చేనేతలో విశేషమేమిటంటే, అడ్డానికివచ్చే దారపుకండె ఒకనాడెలో అమిర్చి ఒకవేపునుంచి మరో వేపు చేత్తోటి విసురుతారు. దీనికి భిన్నంగా, కొన్ని దశాబ్దాలక్రితం యంత్రసాధనాలు వాడుకలోకి వచ్చి నేతపనివాడు శ్రమపడి చెయ్యవలసిన పనులు చాలా వరకు తగ్గిస్తున్నాయి. కాని ఈ యంత్రసాధనాలన్నీ సామాన్యులకు అందుబాటులో ఉండవు. ఏ షావుకారో, ఏ కంపెనీయో అయితే బాగా పెట్టుబడిపెట్టి వాటిని వినియోగించుకోవచ్చు. అయినప్పటికీ కొంతలో కొంత పనివాడికి సౌకర్యం కలిగించే మగ్గాలు వాడుకలోకి వచ్చాయి. వీటిని మరమగ్గాలంటున్నారు (చూ. మరమగ్గం). ఈ రకం మగ్గంలో విశేషమేమిటంటే పన్నె, పలక ఒక కొయ్యపట్టెలచట్రం (చూ. మగ్గంచట్టం.)లో అమరుస్తారు. చట్రం కిందిభాగంలో పానుపుపట్టెకు ఈచివరా ఆచివరా సొరుగుచెక్కలు ఏర్పరుస్తారు. నేసేటప్పుడు పేకనూలుకండె అమిర్చిన మరనాడె పడుగుదారంగుండా, అడ్డంగా, ఒకవేపుసొరుగులో నుంచి మరోవేపుసొరుగులోకి పరుగెత్తుతూ ఉంటుంది. అలా పరుగెత్తేటట్టుచెయ్యటానికి సొరుగులపైన ఉడతలు అనే కొయ్యబిళ్ళలు రెండు అమిర్చి, రెండువేపుల ఉడతలకూ పైనకట్టిన తాళ్ళను ఒకకుచ్చుతో కలుపుతారు. ఆ కుచ్చుకుపైన మరో రెండుతాళ్ళు కట్టి వాటి పైకొసలు మగ్గంచట్టం నిలువుపట్టెలకు బిగిస్తారు. ఈ ఏర్పాటువల్ల కలిగే సౌకర్యమేమిటంటే నేతపనివాడు కుచ్చుపట్టుకొని ఏవేపు గుంజితే సొరుగులో ఉన్ననాడె ఆవేపు పరుగెత్తుతుంది. పడుగులోకి పేకనూలు వెళ్ళి నేత చెకచెకా సాగుతుంది. చేతిమగ్గం నేతకూ మరమగ్గం నేతకూ ముఖ్యంగా ఇంతే తేడా. అయినా ఈ రెండు రకాల మగ్గాలమీదినేతా చేనేతకిందికే వస్తుంది. ప్రక్రియలో దీనికి భిన్నమైంది మిల్లునేత.

మనం కట్టుకొనే ఒట్టలు, కప్పుకొనే కండువాలు, దుప్పట్లు, ఒళ్ళుతుడుచుకొనే తువాళ్ళు, జేబురుమాళ్ళు, తలపాగలు మొదలైనవేకాక జంబుఖానాలు, మడతమంచంగుడ్డలు, కుర్చీగుడ్డలు, మంచంనవారు వంటివికూడా పత్తిదారంతో నేసేవే. చీరలు, ఓణీలు, రవికలగుడ్డలు, చొక్కాగుడ్డలు, రుమాళ్ళు మొదలైనవి పట్టుదారంతో కూడా నేస్తుంటారు. గొంగళ్ళు, తివాసీలు ఉన్నిదారంతో నేస్తారు. గోగు, జనుమువంటి మొక్కల నారతో పట్టాలు నేస్తారు.

చేనేతవృత్తిమీద జీవించేవాళ్ళు మన రాష్ట్రమంతటా ఉన్నారు. నూలుబట్టలు నేసేవాళ్ళు ముఖ్యంగా పద్మశాలివారు, దేవాంగులు, తొగటవారు, సేనాపతులు, కరికాలభక్తులు, హరిజనులు, క్రిస్టియన్లు మొదలైనవారు. వీరిలో పద్మశాలి, దేవాంగులతోబాటు పట్టుసాలెలనే తెగవారుకూడా పట్టుబట్టలు నేస్తారు. ఇకపోతే, ఉన్నిగొంగళ్ళు నేసేవారు కురమలు. గొర్రెల మందలు పెంచుతూ వాటి ఉన్నితో గొంగళ్ళు నేస్తారు. తివాసీలు నేస్తున్నవారు ఎక్కువగా సాయెబులు. మొత్తంమీద. కేవలం నేతపనిమీద పొట్టపోసుకొనేవాళ్ళేకాదు దానికి అనుబంధమైన ఇతర పనులుచేస్తూ బతుకుతున్నవాళ్ళు కూడా ఎందరో ఉన్నారు. అయితే నానాటికీ వస్తున్న రాజకీయ, ఆర్థిక, సాంఘికాది పరిణామాల మూలంగా సాంప్రదాయిక వృత్తులకు కట్టుబడేవాళ్ళ సంఖ్య క్రమంగా తగ్గిపోతోంది కాబట్టి ఈనాటివరకు నిలిచిఉన్న పదాలయినా కోశస్థంచేయవలసిన అవసరమేర్పడింది. వాటి సంపూర్ణావగాహనకు కోశంలో ఇచ్చిన అర్థాలతోబాటు కథనాత్మకవివరణ మరింత తోడ్పడుతుంది.

నేతకు పనికివచ్చే ముడిసరుకుల్లో ప్రధానమైంది పత్తి అని మనకు తెలుసు. ఇది రేగడినేలల్లో పండిస్తారు.

నేతపనివాళ్ళు రైతులదగ్గరనుంచి పత్తికాయలు కొనుక్కొచ్చి ముందు ఎండేస్తారు. తరవాత కాయలు విడిపించి దుమ్మూధూగరా బాగా దుళ్ళగొట్టి గింజలు తీసేస్తారు. గింజలు తియ్యటానికి రెండుమూడు పద్ధతులున్నాయి. చేపదవడతోగాని, కొమ్ముపు (చూ. పుట 88)తో గాని, పత్తిరాట్నంతోగాని గింజలు విడిపిస్తారు. పత్తిరాట్నానికి రూళ్ళకర్రల్లాటివి (చూ. గిరక) రెండు ఒకదానిమీదొకటి దగ్గరదగ్గరగా అమర్చి ఉంటాయి. వాటిమధ్యకు పత్తి అందిస్తూ గిరకపిడి పట్టుకొని తిప్పితే గింజలు వాటికి ఇవతలే రాలిపోయి దూది అవతలివైపుకు వెళ్ళి పడుతుంది.

ఆ దూది తీసుకొచ్చి మళ్ళీ ఎండేస్తారు. తరవాత దూదేకులాయనచేత ఏకిస్తారు. దూదేకులవాళ్ళు సాయేబులేకాని. సాధారణంగా తెలుగే మాట్లాడతారు. దూదేకే సాధనం పేరు కమాను. దానికి ఒక నరం కట్టి ఉంటుంది. ఆ నరం దూదిమీద ఆనేటట్టు కమాను పట్టుకొని ఒకకొయ్యగుండుతో దాన్ని కొడుతూ ఉంటారు. నరం కదలికకు దూది విడివడుతుంది. అప్పుడది ఏకులు చేస్తారు. ఒక పీటమీద దూదిపరిచి దానిమీదొక పుల్ల పెట్టి ఆపుల్లమీద ఒకచెక్క ఆనించి దొర్లిస్తే దూది పుల్లకు చుట్టుకొని ఏకు తయారవుతుంది. దానిని ఏకు పొత్తి (చూ. చిత్రం 17క)లోగాని అరటిపొత్తిలో గాని పెట్టి ఎడంచేత్తో పట్టుకొని దారంతీస్తారు.

మామూలుగా, నూలువడికే పద్ధతులు రెండు విధాలు. చేత్తో కదురుపట్టి తిప్పుతూ వడకటం ఒక పద్ధతి; రాట్నంతిప్పుతూ వడకటం మరోపద్ధతి. అయితే చేత్తో వడికేకదురుఉరువు రాట్నంకదురు (చూ. చిత్రం 15చ.1) కంటె కొంచెం పెద్దది. పూర్వం నేతపనివాళ్ళే కాకుండా ఇతరులుకూడా నూలువడికి పడుగుతోడి ఆసుపోసి మగ్గాలకు అందిస్తూ ఉండేవారు. ఇప్పుడంతటా మిల్లునూలు వాడకమే ఎక్కువ కాబట్టి నేతపనివాళ్ళతోబాటు ఇతరులుకూడా ఆ పని మానుకున్నారు. అయితే నూలువడికేవాళ్ళు ఇప్పటికీ మన రాష్ట్రంలో లేకపోలేదు. ముఖ్యంగా శ్రీకాకుళంజిల్లా పొందూరులో బహుసన్నటి దారం తీసేవాళ్ళుకూడా ఉండటం విశేషం.

మిల్లునూలు పెట్టెల లెక్కన అమ్ముతారు. పెట్టె బరువు మామూలుగా పదిపౌన్లు ఉంటుంది. పెట్టెలో నూలు ఏ నెంబరుదయితే అందులో లడీ(చూ. పుట 340)లు అన్ని ఉంటాయి. లడీకి పది చిలపలూ చిలపకు ఏడు పొట్టెలూ ఉంటాయి. పోగు సన్నదనాన్నిబట్టి నూలు నెంబరు నిర్ణయమవుతుంది. సంఖ్య పెద్దదయినకొద్దీ పోగు మరింత సన్నగా ఉంటూంటుంది. ఉదాహరణకు, ముతకబట్ట నెయ్యటానికి పలభయ్యోనెంబరునూలు వాడితే సన్నబట్టల నేతకు నూరు నెంబరు నూలు వాడతారు.

ఏ షావుకారుదగ్గరినుంచో సహకారసంఘంలోనుంచో నూలుపెట్టెలు తెచ్చుకొనివచ్చి లడీలు విడదీసి నీళ్ళలో బాగాతడిపి ఎండేస్తారు. వేసేబట్టనుబట్టి నిలువువరసకు కావలసిన నూలు ఎంతో అడ్డవరసకు కావలసినదెంతో నిర్ణయించుకొంటారు. ఎండినలడీలు గుమ్మటంలాఉండే రాటికి తొడుగుతారు. లడీపోగు తీసుకొని పంటెకు చుడతారు. పాతకాలపు పంటెలకు పొడుగాటి కాములుంటాయి. కామ చేత్తో పట్టుకొని తిప్పుతూంటే రాటికి తొడిగిన దారం పంటెకు చుట్టుకొంటుంది. అలాకాకుండా, ఒకరకం రాట్నానికి చెలక పంటె అమిర్చి రాట్నం తిప్పుతూంటే నూలు చుట్టుకొంటుంది. చెలకపంటెల బదులు రేకుడబ్బాలకుకూడా చుడుతూ ఉంటారు. ఈ ప్రక్రియకే నూలుతోడటం అని వాడుక.

నేసేదిరంగు వస్త్రమయితే నూలుతోడే ముందే రంగులు వేస్తారు. ఈ రంగులు స్థూలంగా రెండు రకాలని చెప్పవచ్చు - ఇండెంత్రీన్‌రంగులు, నెప్తాల్‌రంగులు. రంగుపొడి వేణ్ణీళ్ళఅండాలో కలిపి నూలులడీలు దాంట్లో వేసి ఉడకబెడతారు. ఆ ప్రక్రియకువాడే రంగులు ఇండెంత్రీన్‌రంగు లంటారు. అట్లాకాకుండా చన్నీళ్ళలో కలిపి, నూలుకు పట్టించే రంగులను నెప్తాల్‌ రంగులంటారు. సాధారణంగా ఇండెంత్రీన్‌రంగులు చాలాకాలం నిలబడతాయి. నెప్తాల్ రంగులు రాను రాను వెలిసిపోతాయి.

ప్రస్తుతం కంపెనీలవాళ్ళు సరఫరాచేసే రంగులే వాడుతున్నారు. కాని పూర్వం నేతపనివాళ్ళే రంగులు సొంతంగా తయారుచేసుకొనేవారు. ఉదాహరణకు, నూలుకు ఎర్రరంగు అద్దాలనుకోండి, సిత్వేరుచెక్కగాని మడ్డిచెక్కగాని తెచ్చి పొడికొడతారు. నువ్వులకంప తెచ్చి కాల్చిన బూడిద, పైనచెప్పిన చెక్కపొడి, పేడ ఒకతొంకెలో కలిపి నూలులడీలువేసి చేతులతో బాగా పిసుకుతారు. లడీలకు రంగు బాగా అంటిన తరవాత వాటిని నీళ్ళతో జాడించి ఎండేస్తారు. అప్పుడు నెత్తుటి వన్నెతో మిసమిసలాడుతూంటుంది నూలు.

సాంప్రదాయికమైన అద్దకంరంగుల్లో మరొకటి నీలివన్నె. నీలిమొక్క వేత్తులు, ఆకులు పెద్దకుండల్లో

ఊరబెట్టి పైతేట తీసుకొని నూలుకు అద్దుతారు. నీలి కుండలను చాలా పవిత్రంగా చూసుకొంటారు నేతపనివాళ్ళు. అశుచిగా ఉన్నవాళ్ళు వాటిదగ్గరకు వెళ్ళనే కూడదు. వాటిని అమ్మవారికి ప్రతీకగా కొలుస్తారు.

ఇంతకుముందు చెప్పుకొన్నట్లు పంతెలకు నూలు తోడిన తరవాత పడుగుకు కావలసిననూలు ఆసు పోస్తారు. ఆసు (చూ. పుట 27) అనే కొయ్యపనిముట్టు మూడునాలుగు రకాలుగా ఉంటుంది. వాటిలో ఎక్కువ చేతిఆసులు. అంటే చేత్తో నూలుపోసే ఆసులు. ఆసు పట్టెలకు జానెడేసిపొడుగు పుల్లలు కొన్ని లెక్క ప్రకారం వరసగా బిగించి ఉంటాయి. ఆ పుల్లల సందుల గుండా పోగు పోనిస్తూ నూలు చుడతారు. అలా చుట్టేటప్పుడు పడుగులో అనులు (చూ. అని) వేస్తారు. ఆసుపోయటమంటే స్థూలంగా ఇదే. దీనికి అవసరమైన మరొక ముఖ్యసాధనం ఆసుగొట్టం. పూర్వం ఎముక ముక్కలే ఆసుగొట్టాలుగా వాడుతుండేవారట. ఇప్పుడు కొయ్యగొట్టాల వాడకం ఎక్కువయింది. పంతెకు తోడిన నూలుపోగు తీసుకొని, దానికొన గొట్టంలో ఒకవేపుదూర్చి, గొట్టంరెండోవేపు నోట్లోపెట్టుకొని లోపలికి గాలి పీల్చుకొంటే పోగుగూడా గొట్టంవెంబడి పైకి వస్తుంది. అప్పుడు పోగుతీసుకొని కొలికివేసి ఆసుపట్టెపుల్లకు తగిలించి గొట్టం కుడిచేత్తో పట్టుకొని పద్ధతి ప్రకారం ఆసుపోస్తారు.

అలాకాకుండా చక్రంలా తిరిగే మరాసుకు పడుగు చుట్టే పద్ధతికూడా ఉంది. ఒక గోతిలో ఈ వేపూ ఆ వేపూ రెండురాటలు పాతి మరాసుఇరుసు వాటిమీద మోపి ఉంచుతారు. దాన్ని తిప్పుతూ ఉంటే డబ్బాలకు చుట్టి ఉంచిననూలు మరాసుపట్టెలకు చుట్టుకొంటుంది. ఈ విధంగా తక్కువశ్రమతో ఎక్కువ పడుగులు ఒకేసారి పోయటానికి ఈ సాధనం బాగా ఉపయోగపడుతున్నది.

ఆసుపోసేటప్పుడు పడుగులో అనులు పడటం ప్రధానమైన అంశం. మొదట, చివర వచ్చేవాటిని కోత్తల లంటారు. ఆసుపోసేసిన తరవాత అనులు విడివడకుండా ఉండేటట్టు కట్లుకడతారు. తరవాత పడుగు ఆసుమీంచి తీసేసి చుట్టచుడతారు.

ఇక ఇప్పుడు జరగవలసింది పడుగేరటం; అంటే పడుగుపోగులు ఒకదానికొకటి అంటుకుపోయినా, చిక్కులుపడ్డా అన్నీ జాగర్తగా సాపుచెయ్యటం. ఈ పనికి కావలసినవి ఊడైలు, సరిగుంజలు, పడుగేరు కర్రలు, లాకలు, దొగ్గసం మొదలైనవి. వీధిలోకాని, ఇంట్లో ఆరుబయటకాని పడుగేరతారు. ఆ ప్రదేశం పడుగుబయలు. అక్కడ నేలలో ఒకచిన్న ఇసపగూటం పాతి దానికొక చేంతాడుకట్టి తాడుచివర ఒక గిలక కాని, దుప్పికొమ్ముకాని, వంకెరకట్టెకాని కడతారు. ఊడై అడ్డపట్టెకు లావుపాటి మోకు ఒకటి వేసి గిలకకు తగిలించటమో దుప్పికొమ్ముకు కట్టటమో చేస్తారు. ఊడై నిలబెట్టి మోకు బిగిస్తారు. అలాగే రెండోవేపు కూడా మరొక ఊడై అయినా నిలబెడతారు, సరిగుంజ అయినా అమరుస్తారు. అటు ఊడైకూ ఇటు సరిగుంజకూ ఇసపగొలుసులు తగిలిస్తారు. వాటిబదులు, కొందరు గుదులు తగిలిస్తారు.



ఆసుపోసి చుట్టినపడుగు ఊడైదగ్గరికి తెచ్చుకొని విప్పుతారు. రెండు కోత్తలల్లోకి రెండు పడుగేరు కర్రలు ఎక్కిస్తారు. ఊడైగొలుసు కొక్కేలకు ఈ పడుగేరు కర్రలు తగిలిస్తారు. ఒకవేళ, ఊడైకూ సరిగుంజకూ గొలుసులబదులు గుదులు వేసినట్లయితే పడుగేరు కర్రలను ఆ గుదుల్లోకి దూరుస్తారు. దాంతో పడుగంతా ఆ రెండిటికీమధ్య సాగుతుంది. పడుగులో అనులున్న చోట్ల లాకలు దూర్చి అంతకుముందు కట్టినకట్లు విప్పేస్తారు. అప్పుడిక, పడుగేరుకర్రలమీదా లాకలమీదా పోగులు వరసగా పరుస్తారు. అంటుకుపోయినవి విడదీస్తారు; మెలతలుపడ్డవి సాపుచేస్తారు; తెగిపోయినవి అతుకుతారు. ఈ విధంగా పడుగేరటం అయిపోయిన తరవాత నూలు మళ్ళీచుట్టేసి గంజిపెట్టటానికి తీసుకు వెళ్తారు.

అన్నం వార్చినగంజి ఒకతొట్టెలో పోసి తెచ్చుకొంటారు. తడపవలసినపడుగు ఒక బండమీదగాని కొయ్యదుంగలమీద గాని అడ్డంగాపెట్టి కొద్దికొద్దిగా విప్పుతూ గంజిలో ముంచిన పిడచతో గట్టిగా తడతారు. పడుగంతకూ గంజి బాగాపట్టేటట్టు తట్టినతరవాత మళ్ళీ చుట్టేసి సరిచేయటానికి (చూ. సరిచేయు) ఊడైదగ్గరికి తీసుకువెళ్తారు.

ఇంతకుముందు చెప్పినట్లే, ఆరుబయట పడుగు చాపుతారు. కుంచె తీసుకొని పడుగుమీద మోపి, దాన్ని ఆవేపు ఒకరూ ఈవేపు ఒకరూ పట్టుకొని పడుగు దువ్వుతారు. గంజి సరిగా అంటనిచోట్ల అలుక్కుంచెతోకాని వెంపలిమండలతోకాని గంజి చిలకరిస్తారు. గంజి ఎక్కువగా అంటినచోట్ల కుంచెతో దువ్వితే పోగులు సాపవుతాయి. పడుగు ఆరుబదునుమీద ఉన్నప్పుడు విర్లుకుంచెవేస్తారు. ఈ ప్రక్రియలో పడుగుబాగా ఆరి, పోగులు బిరుసెక్కుతాయి. ఇంక పడుగు చుట్టేసి అచ్చుతకటానికి (చూ. అచ్చుతుకు) తీసుకువెళ్తారు.

చేనేతసాధనాల్లో అచ్చు, పన్నెకూడా ముఖ్యమైనవే. అచ్చుకట్టేవాళ్ళూ పన్నెకట్టేవాళ్ళూ వేరే ఉంటారు. అచ్చుకట్టే జంత్రానికి రెండు పొడుగాటికర్రలు బిగించి రీలుదారం అల్లుతారు. ఆ పనికి కావలసినవి జంత్రంకాక, వడిదారం, అచ్చుబిళ్ళ, బిగుబిళ్ళలు మొదలైనవి. పన్నె కట్టే జంత్రం వేరేవిధంగా ఉంటుంది. దానికి కావలసినవి వడిదారం, జొన్న ఈనెలు, దండెలు, సాపుకత్తి, గీరుకత్తి, రంపం, బట్టి మొదలైనవి. కొత్తగా అచ్చుకట్టినప్పుడు జానెడేసి పడుగుపోగులు అచ్చులోకీ పన్నెలోకీ దూర్చి అనులువేస్తారు. ఆ పోగులే నేయవలసిన పడుగుకు అతుకుతారు. అలాకాకుండా అచ్చు పాతదే వాడినప్పుడు, అంతకుముందు నేసి విడిచిన బద్దెలో పోగులు కొత్తపడుగుకు అతుకుతారు. పడుగు కొల్లల తెంపి కిందిపోగు బద్దెపోగుకు అతుకుతారు. అలా అతికేటప్పుడు చేతికి చెమటపట్టకుండా ఉండటం కోసం వేళ్ళకు బూడిద అద్దుకొంటారు. అచ్చతికిన తరవాత అల్లుచేస్తారు. దీనికోసం పడుగును మళ్ళీ ఆరుబయట చాపుతారు.

అల్లుచేయటానికి కావలసినవి మలగట్టుకర్ర, లచ్చన లాక, సూరెలు మొదలైనవి. నేయవలసినబట్టల నిడివిని బట్టి ఒక్కొక్కసారి ఎంతవరకూ నెయ్యాలో అన్ని మలలుగా విడదీసుకొని పడుగుమీద మసిగుర్తులు పెట్టుకొంటారు. లచ్చనవేయటమంటే అదే. అలా గుర్తులు పెట్టటానికి ముందుగా పడుగును కొలిచే లాకను లచ్చన లాక అంటారు. మలచివరిపోగులు కట్టేకర్ర మలగట్టు కర్ర. కొన్నిచోట్ల అలా కట్టకుండా కర్రలకు చుడతారు. తరవాత పోగులన్నీ మళ్ళీ సాపుచేసుకొని మగ్గందగ్గరికి పడుగు తీసుకొనివస్తారు.

చేనేతమగ్గాల్లో ప్రధానంగా చేతిమగ్గం, మరమగ్గం అని రెండురకాలుంటాయని ముందే చెప్పుకొన్నాం. కేవలం అంచులుమట్టుకే నేసేదాన్ని అంచుమగ్గమంటారు. నిలువూ అడ్డం ఎక్కువ ఉండే తలపాగలు వగయిరాలు నేసేవి పెద్దమగ్గాలంటారు. జంబుఖానాలు, కుర్చీ గుడ్డలు మొదలైనవి నేసేవి మామూలు వాటికి కొంచెం కొంచెం భిన్నంగా ఉంటాయి. నవారుమగ్గం అన్నిటికంటె చిన్నమగ్గం.

నేతపనివాడు కూర్చునే చోటికి ఎదురుగా మగ్గం ఉంటుంది. అతని కుడిచేతికి దగ్గరగా చేతికొయ్య ఉంటుంది. మగ్గంనేతమోకు రెండోకొన దీనికి బిగిస్తారు. పనివాడికి దగ్గరగా అడ్డంగా ఉండే బెత్తెడు వెడల్పు కొయ్యదూలాన్ని దోనె అంటారు. దానికి ఒకవేపు గాడిఉంటుంది. అందులో అరంగుళం పొడుగువి సన్నపాటి పుల్లలు బిగించి ఉంటాయి. వాటిని పండ్లంటారు. పడుగు మొదటి కొనపోగుల్లో దూర్చిన చువ్వ ఈ గాడిలోకి ఎక్కిస్తారు.

దోనెనుమోసే కొయ్యలు రెండు. కుడివేపుది నాలికొయ్య, రెండోవేపుది బొడ్డుగొయ్య. దోనెకు సుమారు మూరెడుదూరంలో పన్నె, అచ్చు పైనించి వేలాడదీసి ఉంటారు. మరమగ్గానికయితేపన్నె మగ్గం చట్టంలోనే అమర్చి ఉంటుంది. అచ్చుకర్రలకు కింద రెండు గుదులుంటాయి. అవి మగ్గంగుంటలోకి వేలాడుతూంటాయి. వాటిని పూనుగర్రలకు తగిలిస్తారు. పూనుగర్రలకు దిగువ ఉండే గుదులు పావుచెక్కలకు తగిలిస్తారు. ఈ ఏర్పాటువల్ల నేతపనివాడు పావుచెక్క తొక్కినప్పుడు అచ్చులోకి ఎక్కించిన పడుగులో అని తెరుచుకొంటుంది. పావుచెక్కమీంచి కాలు తీసేస్తే అని మూసుకొంటుంది.

అచ్చుకు అవతల మూరెడుఎడంలో దండె అమరుస్తారు. అది రెండుగుంజలమీద ఆనుకొని పడుగు దిగబడిపోకుండా మోస్తుంది. దానిదగ్గర పడుగులో ఎక్కించిన చువ్వ దిగజారిపోకుండా మధ్యగా ఒకతాడు కట్టి దానికి చివర ఒకగుండు కడతారు. ఆ గుండే నవలకుగుండని ప్రసిద్ధి. దానికి సంబంధించి తమాషా కథ కూడా చెబుతారు. దండెకు అవతల లాకలు, పొట్టెలకోల, మలగట్టుకర్ర, పెడకోల, మిడిగూటం వరసగా ఉంటాయి. మగ్గంమీద మిగిలిన పడుగును చుట్టి పెట్టుకుంటారు. దాన్ని ఎంటి అంటారు.

నేతనేసేటప్పుడు బట్టబిర్రుగా ఉండటానికి అడ్డంగా చేడుకర్రలు పెడతారు. కర్రల చివరిముళ్ళు బట్టఅంచు కొసలో గుచ్చుతారు. దానివల్ల బట్ట ముడుచుకుపోకుండా ఉంటుంది.

నేతపనికి కావలసిన మరొక ముఖ్యసాధనం నాడె అని ముందే ప్రస్తావించటం జరిగింది. చేతిమగ్గంతో నేసేవాళ్ళు బర్రెకొమ్ముతో చేసిన నాడె వాడతారు. మరమగ్గంతో నేసేవాళ్ళు కొయ్యనాడె వాడతారు. నాడెలలో ఒక ఇనపముల్లు ఉంటుంది. దానికి పేకదారంకండె గుచ్చి నాడెబెజ్జంలోంచి పోగుకొస బయటికి తీస్తారు. జంబుఖానాలు నెయ్యటానికి, అంచులు నెయ్యటానికి వాడేనాడెలు కొద్దిగా వేరుగా ఉంటాయి.

మరమగ్గంమీద నేసేటప్పుడు నేతలో డిజైన్లు రావటానికి డాబీ అనే సాధనం అమరుస్తారు. చేతిమగ్గం

మీదయితే అన్ని పనులూ చేత్తోనే చేసుకోవాలి. ముఖ్యంగా కుప్పడం నేతనేసేటప్పుడు నేతపనివాడికితోడు మరొకడు సాయంచేస్తూ ఉండాలి.

నేతలో అంచులకు, కమ్ములకు, డిజైన్లకు, ఎన్నో రకాల పేర్లున్నాయి. ఉదా: నెమలికన్నంచు, కళావరంచు, గద్వాలంచు, పూసాకమ్మి, తురంజీలకమ్మి; జొన్నలరాసిచీర, రాసికడం, బుటాలచీర, ముత్యాలపందిరి, కూనలమ్మచీర, ఆనందచీర, కనకాంబరంచీర, పీతాంబరం మొ.వి.

నేతవస్త్రాల్లో కొన్నికొన్ని ప్రత్యేకసందర్భాల్లో వాడేవి, ప్రత్యేకంగా కొన్నితెగలవాళ్ళు వాడేవి ఉన్నాయి. ఉదా: నాగులకోకలు, గడ్డికండువాలు, గొల్లకుప్పడాలు. కొన్నిబట్టలకు, నేసేసినతరవాత రంగులు, డిజైన్లు అద్దుతారు. సాంప్రదాయికమైన వాటిలో కలంకారీఅద్దకం ఒకటి. ఇందులో, చెట్ల సంబంధమైన రంగులే వాడటం విశేషం.

చేనేతపనివాళ్ళు చేసుకొనే ముఖ్యమైన పండుగలు వినాయకచవితి, నూలుపున్నమి. ఆరోజున మగ్గం సామాన్లన్నీ కడిగి బొట్లుపెట్టి పూజచేసుకొంటారు. నేతపనివాళ్ళలో పద్మశాలివారికి మార్కండేయ పురాణం, దేవాంగులకు దేవాంగపురాణం పవిత్ర గ్రంథాలు. ప్రత్యేకంగా పద్మశాలివాళ్ళదగ్గరకు అడుక్కోటానికి వచ్చేవాళ్ళను కూనపులివాళ్ళని, దేవాంగులదగ్గర అడుక్కొనేవాళ్ళను జంగాలని అంటారు. పూర్వం బ్రాహ్మలదగ్గర కనుకట్టులాంటి వినోదవిద్యలు ప్రదర్శించే వాళ్ళను విప్రవినోదులన్నట్లే పద్మశాలివాళ్ళదగ్గర వినోదవిద్యలు ప్రదర్శించే వాళ్ళను సాధనాశూరులనేవారట. అలాగే ఉన్ని గొంగళ్లు నేసే కురమలదగ్గర బీరప్పమల్లప్పల కథలు చెప్పేవాళ్ళను ఒగ్గివాళ్ళంటారు.

మొత్తంమీద చేనేతపనికీ పనివాళ్ళకూ సంబంధించిన కథాసంగ్రహమిదీ. అయితే పట్టు, ఉన్ని, నార నేతలు దీంతో కొద్దిగా భేదిస్తాయి కనక, కొన్నికొన్ని సాధనాలూ ప్రక్రియలూ మారుతూంటాయి కనక వాటిలో ముఖ్యమైనవి కొంతవరకు పరిచయం కావటం అవసరం.

సాధారణంగా, పట్టు మల్బరీ, నేరేడువంటి చెట్ల ఆకులు తిని బతికే పురుగులనుంచి తీస్తారు. రసాయన ప్రక్రియల ద్వారా కృత్రిమంగా తయారుచేసింది కూడా వాడుతున్నారు. కాని సహజమైనదాని విలువ ఎప్పుడూ ఎక్కువే.

ముదురుగోధుమవన్నెలో ఉండే ఒకరకం పట్టును దసలి అంటారు. సీతాకోకచిలకమాదిరి ఒకరకం పురుగు పెట్టిన గుడ్లు పగిలి పిల్లలు వస్తాయి. వాటిని పట్టి చెంద్రవంకెలవంటి బుట్టల్లో పెడతారు. పురుగు ముక్కురంధ్రాల్లోనుంచి వచ్చేద్రవం దారంమాదిరిగా దాని చుట్టూ అల్లుకొంటుంది. దాన్ని గూడు అనీ కాయ అనీ అంటారు. వాటిలో ఆడకాయలూ మగకాయలూ వేరుగా గుర్తుపడతారు. పట్టుకాయ ఆకారం సాలగ్రామం మాదిరిగా ఉంటుంది. వాటిని పేర్పులో పోసి పైన వరిగడ్డివేసి వాసెనకట్టుకట్టి నీళ్ళఅటికె మీద బోర్లించి పొయిమీద ఉడకబెడతారు. ఉడకబెట్టటంవల్ల లోపలి పురుగులు చచ్చిపోతాయి. అప్పుడు వాటిని ఒక పళ్ళెంలో పోసి ఒక్కొక్కపోగే తీసుకొని పూన్పుతో వడుకుతారు. వడికాక డోలికి చుట్టి దాని మీంచి పెద్దరాట్నానికి తోడి పురిపెడతారు. పురిపెట్టిన దాంట్లో పడుగుకుకావలసిందీ పేకకుకావలసిందీ వేరు చేసుకొంటారు. పడుగుదారం అనుపోస్తారు, పేకదారం కండెలుపడతారు. అచ్చుతుక్కొని మగ్గానికి తగిలిస్తారు. పట్టునేత చాలావరకు చేతిమగ్గాలమీదే జరుగుతుంది. నూలుబట్టలకుకూడా పట్టంచులు నెయ్యటం, పట్టు వాటికి జరీపోగులు పెట్టి నెయ్యటం కూడా వాడుక.

గొంగళ్ళునెయ్యటానికి అవసరమైంది గొర్రెబొచ్చు. ఏడాదికి రెండుసార్లు గొర్రెలకు బొచ్చు కత్తిరిస్తారు. ఉగాది వెళ్ళినతరవాత కత్తిరిస్తే ఆవిటి కత్తిరింపు అంటారు. చలికాలంలో కత్తిరిస్తే మాగికత్తిరింపు అంటారు. కొదమగొర్రె ఉన్ని మృదువుగా ఉంటుంది.

ఉన్ని కత్తిరించి శుభ్రంచేసి ఏకువిల్లుతో ఏకి వడుకుతారు. ఆడవాళ్ళు వడికే కదురువేరు, మగవాళ్ళు వడికే కదురువేరు. వడికిన ఉన్నిదారంలో పడుగుకు కావలసింది అనుపోస్తారు. అంటే నేలమీద లెక్కప్రకారం కొన్ని గూటాలుపాతి వాటికి దారం చుడతారు. తరవాత చింతంబలితో తడిపి కుంచెతో దువ్వి అచ్చుకట్టి మగ్గందగ్గరికి తెచ్చుకొంటారు. నూలుబట్టలు నేసే చేతిమగ్గానికి, గొంగడిమగ్గానికి కొంచెంతేడాలున్నాయి. దీనికి పన్నె ఉండదు. గుంటలో పావుచెక్కలుండవు. నేతనేసేటప్పుడు, పడుగులో పైపోగులను, కిందిపోగులకు విడదీయ్యటానికి జంత్రం అనే పనిముట్టు ఒకటి ఉంటుంది. దాన్ని అచ్చుగోలకు కడతారు. పేకదారం వెయ్యటానికి నాడె ఉండదు; పేకగొట్టం వాడతారు. అంటే పేకదారంచుట్టినకర్ర ఈ గొట్టంలోకి దూరుస్తారన్నమాట. దీని బెజ్జంలోనుంచి పోగు బయ

టికి వస్తుంది. నేతనేసేటప్పుడు అలి తెరిచి ఈ పేక గొట్టం అందులోకి దూర్చి మళ్ళీ అలి మూస్తారు. ఇట్లా గొంగడినేత అంతా చేత్తోనే చెయ్యవలసివస్తుంది.

ఉన్నితో నేసేవాటిలో తివాసీలు ప్రత్యేకంగా చెప్పుకోవలసినవి. మేలిరకం ఉన్ని తెచ్చి శుభ్రంచేసి రంగులద్దుతారు. మందపాటి నూలుపోగులు పురిపెట్టి, సరిచేసి, అచ్చుకట్టి మగ్గానికి అమరుస్తారు. తివాసీమగ్గం మామూలు చేతిమగ్గంలాంటిది కాదు. మామూలు మగ్గం నేలమీద పొడుగుతా ఉంటే తివాసీమగ్గం కింది నించి పైకి అమర్చి ఉంటుంది. నేతపనివాడు దానికి ఎదురుగా కూర్చుని నెయ్యదలచిన డిజైన్నుబట్టి ఆయా రంగుల ఉన్ని చేత్తోటే పడుగులోకి దూరుస్తూ పంజాతో ఒత్తుతూ కత్తితో సాపుగా కోస్తూ అని తెరిచి పేక పోగువేస్తూ నేస్తారు. తివాసీ డిజైన్లలో ఎన్నో రకాలున్నాయి ఉదా: సాంపోం కాహూనర్, చిల్కాపరి డిజైన్ మొ. వి.

—పోరంకి దక్షిణామూర్తి

# గ్రంథ పరిచయం

## ప్రస్తావన

తెలుగుదేశంలో వ్యవసాయంతరవాత ఎక్కువ మందికి జీవనాధారం కల్పించేవృత్తి నేతపని. తిండి, బట్ట, ఉనికి ఏ సమాజానికయినా కనిష్ఠావసరాలు కాబట్టి వాటికి సంబంధించిన వృత్తులు ఆ సమాజంలో అతిప్రాచీనమైనవిగా ఉంటాయి. కొన్నివేల సంవత్సరాల నుంచి తెలుగునాట పరంపరగావస్తున్న ఈ దేశీయ వృత్తుల్లో సామాన్యులకు తెలియనిపదజాలం ఎంతో మరుగుపడిఉంది. ఇది అక్షరజ్ఞతలేని పామరులు తమ వ్యవహారావసరాలనుబట్టి తెలుగు నుడికారానికి సరిపడేట్టు సృష్టించుకున్న పదజాలం. ఆయా వృత్తుల్లో వాడే పనిముట్లు, పనులు, కొలతలు, లెక్కలు, పండగలు, నమ్మకాలు కాలాంతరంలో ఆ వృత్తిలోవచ్చిన పరిణామాలు - స్థూలంగా అవృత్తిలో ఉన్నవాళ్ళ సంస్కృతీ అంతా వాళ్ళు ఉపయోగించుకునే మాటల్లో ప్రతిఫలిస్తుంది. తెలుగులో వచ్చిన కావ్యసాహిత్యం కొన్ని పైతరగతుల రచయితలకు, పాఠకులకుమాత్రం పరిమితం కావటంవల్ల దేశీయ వృత్తుల్లో వ్యవహరించే పామరుల జీవిత విధానంగాని వారి వాడుకగాని దీనిలో అట్టే కనిపించదు. ఆ సాహిత్యం ఆధారంగా కూర్చిన కోశాల్లో అతిప్రాచీనమైనవయినా ఎన్నో వృత్తిపదాలు కనిపించకపోవటం ఆశ్చర్యంకాదు.

పారిశ్రామికాభివృద్ధితో దేశీయవృత్తుల స్వరూపం మారిపోతుంది. ఆయా వృత్తులతోబాటు వెలుగు చూడకుండా ఎన్నో దేశ్యశబ్దాలు అంతరించిపోతాయి. అసలు దేశభాష సామాన్యుల నోళ్ళలో ఎలాపెరుగుతుందో అర్థంచేసుకోవాలంటే వృత్తిపదాలు పరిశీలించాలి. ఈ పరిశీలనవల్ల ఆధునికశాస్త్రజ్ఞానానికి పరిభాష ఎలా ఏర్పరుచుకోవలసిందీ మనకు తెలుస్తుంది. తెలుగు భాషకు ప్రమాణమైన నిఘంటువు చారిత్రకసూత్రాల మీద నిర్మించటానికి మాండలికపదాలన్నిటినీ సేకరించాలి. వృత్తిపదసంగ్రహణలో దేశ్యశబ్దాలు చాలావరకు కోశస్థమౌతాయి.

## పదసంగ్రహణం

ఈ పదకోశనిర్మాణ కార్యక్రమంలో మొదటి దశ పదసేకరణ. ఇది 1962 నవంబరులో మొదలైంది. ఇందుకోసం నియమితులైన పర్యటనపరిశోధకులు అయిదుగురు : శ్రీ పోరంకి దక్షిణామూర్తి, శ్రీ లింగుట్ల కోనేటప్ప, శ్రీ నిమ్మగడ్డ సుబ్బారావు, శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి, శ్రీ ఎదిరె చెన్నకేశవులు. నేతపనికి సంబంధించిన పనిముట్లు, పనివరుసలు మొదలైనవి స్వయంగా చూసి బొమ్మలువేసి పంపటంకోసం నియమితులైన చిత్రకారుడు శ్రీ లాభి వెంకట హనుమంతరావు. వీరిలో శ్రీ పోరంకి దక్షిణామూర్తి నాలుగు నెల్లపాటు 33 గ్రామాలు, శ్రీ లింగుట్ల కోనేటప్ప రెండున్నర నెల్లపాటు 25 గ్రామాలు, శ్రీ నిమ్మగడ్డ సుబ్బారావు దమారమి రెణ్ణెల్లపాటు 17 గ్రామాలు, శ్రీ బెల్లకొండ చంద్రమౌళిశాస్త్రి నెలపైచిలుకు 11 గ్రామాలు, శ్రీ ఎదిరె చెన్నకేశవులు నెలపైచిలుకు 10 గ్రామాలు పర్యటించారు.

నేతపనిమీద జీవించేవారి వ్యాప్తినిబట్టి పరిశోధకులు పర్యటించవలసిన గ్రామాలు కోస్తాప్రాంతంలో 37, తెలంగాణాలో 33, రాయలసీమలో 24 నిర్ణయించుకున్నాం. మొట్టమొదట, హైదరాబాదుకు ఇటు అయిదారు మైళ్ళ దూరంలో ఉన్న 'కారవాన్' లోను, అటు పదహారుమైళ్ళదూరంలో ఉన్న 'పోచంపల్లి'లోను నమూనాపదసేకరణ జరిగింది. దాన్ని ఆధారంచేసుకొని పదసంగ్రహణప్రణాళిక ఒకటి రూపొందించాం. దాంట్లో ఇచ్చిన విషయవిభాగాన్ని బట్టి పర్యటన పరిశోధకులు వ్యవహర్తలదగ్గరినుంచి సమాచారం సేకరించారు. వ్యవహర్తను ఎన్నుకొనేటప్పుడు, పదసేకరణచేసేటప్పుడు పరిశోధకుడు గమనించవలసిన నియమాలు మాండలికవృత్తిపదకోశం (వ్యవసాయపదాలు) మొదటిసంపుటం (పుటలు 10-12)లో వివరించటం జరిగింది.

పదసేకరణకార్యక్రమం మొదట అయిదారు ఊళ్ళలో జరిగిన తరవాత వచ్చిన అనుభవాన్ని పురస్కరించుకొని పదసంగ్రహణప్రణాళికను మరింత విస్తరించి ప్రమాణీకరించటం జరిగింది.

## పదసంగ్రహణప్రణాళిక

**1.** నూలుకు ఉపయోగించే ముడిసరుకు వివరాలు :

(i) పత్తి—పత్తిలో రకాలు : కొండపత్తి, కాయపత్తి, పయిడిపత్తి, సీరంగిపత్తి,

జెడపత్తి, కరుంగనిపత్తి, కాంబోడియా పత్తి, తినీపత్తి, దేవతాపత్తి మొ.వి.

పత్తి విడదీసే సాధనాలు: గిరక రాట్నం మొ.వి., భేదాలూ భాగాలూ.

(ii) పట్టు—పట్టులో రకాలు: దసలి,కృత్రిమపు పట్టు, మల్బరిపట్టు, ఎరిపట్టు, ముగాపట్టు మొ.వి., ఉత్పత్తిచేసే పరికరాలు.

పట్టుపురుగులు : జాతిభేదాలు.

ఆహారం: విప్పాకం, చెన్నంగిచెట్టు, గుంపెన, నల్లమద్ది, బుడ్డదర, రేగి మొ. చెట్ల ఆకులు.

పెంపకం, పరిణామదశలు :

పట్టుకాయలు తెచ్చుకునేవరకూ చేసే పనులూ సాధనాలూ భేదాలూ.

(iii) నార — నార ఉత్పత్తికి మూలమైన మొక్కలు: గోగు, జనుము, ఎల్లిగిసె, చైనాగడ్డి, కొబ్బరినార, అరటినార మొ.వి.

నార — తీసే పద్ధతులు, పనులు, పనిముట్లు, భేదాలు.

(iv) ఉన్ని — గొర్రెల వయస్సునుబట్టి, రంగునుబట్టి, ఉన్ని మెత్తదనాన్నిబట్టి, జాతినిబట్టి, గొర్రెల్లో భేదాలు.

ఉన్ని కత్తిరించటం, బాగుచేయటం మొ. పనులకు ఉపయోగించే పనిముట్లు, భేదాలూ భాగాలూ.

**2. ఏకటం :**

(i) పత్తిఏకే సాధనాలు—ఉండేలుబద్ద, పలక, కమాను మొ.వి. భేదాలూ భాగాలూ; పింజెలూ ఏకులూ చెయ్యడం, సాధనాలూ భేదాలూ భాగాలూ.

(ii) పట్టుదారం తియ్యడానికిముందు కాయలు ఉడకబెట్టడం, సాధనాలూ భేదాలూ పనిచేసే పద్ధతులూ.

(iii) నార ఏకటం—సాధనాలూ, భాగాలూ.

(iv) ఉన్ని ఏకటం—సాధనాలు: ఉండేలుబద్ద మొ.వి. భేదాలూ, భాగాలూ.

**3. నూలు వడికే సాధనాలు :**

(i) పత్తినూలు వడికే సాధనాలు—రాట్నం, కదురు,తకిలి మొ.వి. భేదాలూ భాగాలూ పనులూ.

(ii) పట్టు వడికే సాధనాలు — పూన్పు, పెద్ద రాట్నం మొ.వి. భేదాలూ, భాగాలూ, పనులూ.

(iii) పట్టు వడికే సాధనాలు — భేదాలూ భాగాలూ పనులూ.

(iv) ఉన్ని వడికే సాధనాలు—కదురు మొ.వి. భేదాలూ భాగాలూ పనులూ.

**4. నూలు :**

(i) మూలపదార్థాన్నిబట్టి భేదాలు: పత్తి నూలు, నారనూలు, పట్టునూలు, కోరా, ఉన్ని; బరువు, సన్నదనం, మెత్తన, పురి — ఇతరగుణాల్నిబట్టి ఒక్కొక్క దానిలో భేదాలు.

మరనూలూ చేత్తో వడికిందీ కూడా ఇవ్వాలి.

(ii) చుట్టేపద్ధతినిబట్టి, పోగుల సంఖ్యనిబట్టి, పరిమాణాన్నిబట్టి భేదాలు — ఇచ్చెలు, చిట్టెలు, చిలపలు, జిల్లలు, కండెలు, బోట్లు మొ.వి.

**5. నూలుతోడటం :**

పత్తి, పట్టు, నార మొ. వాటికి విడివిడిగా.

(i) సాధనాలు—రాట్నం, రాటి, చెలకపంటె, పంటె, డబ్బా. బుడ్డిరాట్నం, బొందు రాట్నం, భేదాలూ, భాగాలూ,

(ii) కథనాత్మకంగా : గంజిలో పిసకటం, పిండి ఎండెయ్యటం మొ. పనులు కూడా.

**6. నూలు పడుగుపోయటం :**

(i) సాధనాలు—ఆసు: చేతిఆసు, పెద్దాసు, తానెపీట, బీమ్, ఆసుబుర్ర, పూసలకట్టె, మొ.వి. భేదాలూ భాగాలూ పనులూ.

(ii) పోసిననూలు పేర్లు— పడుగు, పాగడ, తోట్నం మొ.వి.

(iii) లెక్కలు — పోగులు, కొలుకులు, ఎనికెలు, సవళ్ళు, పుంజాలు మొ.వి.

(iv) పనులు — అనులకు కట్లుకట్టి పడుగు తీసి చుట్టటం.

*7.* *పేకకు కండెలుపట్టటం (నూలుమట్టటం):*

పత్తినూలు, పట్టు, నార మొ. వాటికి విడివిడిగా.

కండెలరాట్నం మొ. వి., భేదాలూ భాగాలూ చుట్టిన నూలుపేర్లూ. ఉదా: కండెలు, బోట్లు మొ.వి.

6వ అంశంలో ఇచ్చిన రాట్నంభాగాల కంటె వేరుగాఉన్నవాటిని ప్రత్యేకంగా సూచించాలి. వడికేరాట్నానికీ, కండెలరాట్నానికీ భేదంలేని భాగాలు మళ్ళీ ఇక్కడ ఇవ్వక్కరలేదు.

*8.* *పడుగేరటం:*

(i) సాధనాలు — ఊడ్తెలు, దొగ్గసం, కొండ్లకర్ర, లాకలు. సరిగుంజ, సరిగూటం, కొంకి, గొలుసు మొ.వి.

(ii) పనులు: కోలలేరటం, కోలలు దిద్దటం, కచ్చుతేయటం, గంజిపెట్టేందుకు చుట్టి తేవటం మొ.వి.

*9.* *గంజిపెట్టటం:*

(i) గంజిరకాలు — బెల్లపుగంజి, బియ్యపు గంజి, జొన్నల గంజి, తైదలగంజి, కాచగడ్డల గంజి మొ.వి. తయారుచేసే పద్ధతులు, సాధనాలు, పనులు; గంజిలో తోడుకలిపే పదార్థాలూ వాటి తయారు, సాధనాలు, పనులు.

(ii) గంజిపెట్టే సాధనాలు — గంజిబండ, తొట్టి, పిడచ.

(iii) పనులు—గంజిపెట్టటం. తట్టటం మొ.వి. కథనాత్మకంగా.

*10.* *సరిచేయటం:*

(i) సాధనాలు — కుంచె: పొడుక్కుంచె, అలుక్కుంచె; భేదాలూ భాగాలూ.

(ii) పనులు—గంజి పిండటం. పోగులు నెరపటం, కుంచె గుంజటం, ఈరగుంచెవెయ్యటం, మొలచెయ్యటం, కుంచె వేసే పదును అలుక్కుంచెతో వాండ్ల దువ్వటం ఎంటి కట్టటం మొ.వి.

*11.* *అచ్చుకట్టటం:*

(i) సాధనాలు—జంత్రం, అచ్చుబిళ్ళ, బిగు బద్దలు మొ.వి.

(ii) పనులు.

*12.* *అచ్చుతకటం:*

(i) సాధనాలు — అచ్చుపన్నె, దబ్బపన్నె, డిక్కుపన్నె, కర్రపన్నె. భేదాలూ భాగాలూ.

(ii) పనులు — బద్దెకోయటం, అచ్చుతకటం మూగ, పొర, సిస్తచ్చు మొ.వి.

*13.* *అల్లుచేయటం:*

(i) సాధనాలు — మలగట్టుకర్ర, సూరెలు, అచ్చునకర్ర మొ.వి.

(ii) పనులు—పొట్లెలుకట్టటం, మలగట్టటం అచ్చునేయటం, కరకేరటం మొ.వి. మగ్గ మీదికి తీసుకురావటం.

*14.* *మగ్గం:*

నిర్మాణాన్నిబట్టి, పరిమాణప్రయోజనాలనుబట్టి భేదాలు.

ఉదా. చేమగ్గం, గుంటమగ్గం, బీమ్‌మగ్గం, లాటుమగ్గం, మరమగ్గం, కోరుమగ్గం, అంచుమగ్గం మొ.వి.

ప్రతిదాని భాగాలూ ఇప్పుడు వాడుకలో లేకపోయినా వాటి భేదాలూ, భాగాలూ పనులూ ఇవ్వాలి.

భాగాల ఉపయోగాన్నిబట్టి అవి మగ్గంలో ఏస్థానంలో ఉండి ఏపని చేస్తాయో వాటి వినియోగం కూడా ఇవ్వాలి.

ఉదా. దోనె—గుండుదోనె, పడుగుదోనె మొ.వి.

బొద్దుగొయ్యకూ, నాలికకొయ్యకూ నడుమ అడ్డంగా ఉండే నాలుగుపలకల కొయ్యదూలం; దోనెలో గాడి, పండ్లు, చువ్వ మొ.వి. బట్ట నేసినంతవరకూ దోనెకు చుడతారు.

నాడె—కర్రనాడె లేదా సట్టరునాడె, కొమ్మునాడె లేదా చేతినాడె మొ.వి.

నాడెభాగాలు — ఉంగరం, ముల్లు, గాడి, బొద్దెలు మొ.వి. పేకకు వేసే కండెనాడెముల్లుకు చెక్కి వేస్తారు.

పలక, సూరెలు, దండె, సవలతుగుండు, లాకలు, మగ్గంగుంట, పావుకోడుచెక్కలు మొ.వి.

పట్టుపనిలో ప్రత్యేకంగా వాడేవి– పరుపు, చిక్కులు, పేటుపలక, మొలలు, అంచు నాడెలు మొ.వి.

పింజెర (డాబీ) భేదాలూ భాగాలూ పనులు.

*15. నేత :*

రకాలు : సాదానేత, సరినేత, మారునేత, కుప్పడంనేత.

డాబీపని

కలనేత

డిజైన్ నేత - పడుగుతోపు, పేకతోపు మొ.వి.

నేతపని కథనాత్మకంగా వివరించాలి.

*16. అంచులు, పనివరసలు :*

(i) అంచుల ఆకారాన్ని బట్టి రకాలు—చిలక పేటు, చిత్రపేటు, నెమిలికన్నంచు, గువ్వ కన్నంచు, కళావరంచు, ఏనుగులంచు మొ.వి.

(ii) అంచులు వేయటాన్ని బట్టి రకాలు—పొరపేటు,ముగ్గుపేటు, పట్టుమూటమంచు.

*17. వస్త్రాలు, రకాలు :*

చీరలు :

(i) అంచుల రకాన్ని బట్టి- చెక్రంపేటుచీర మొ.వి.

(ii) పనివరసల్ని బట్టి : మద్దికాయలచీర, గంగ సరం, రాసికడం, జొన్నలరాసి, పగడ సారవల్లె, కాక్రేడుచీర, బుటాలచీర, ముత్యాలపందిరిచీర, కొలికిముంగిచీర, గళ్ళచీర మొ.వి.

చిటుకులో రకాలు : లింగాలమంటపం, రుద్రాక్ష మొ.వి.

(iii) రంగులరకాల్ని బట్టి–నీలంచీర,ఆనందచీర, సంపెంగచీర, కనకాంబరచీర మొ.వి. రంగులపేర్లూ వాటి వివరణా ఇవ్వాలి. ఉదా. కెంపురంగు = ఎరుపులో నలుపు వన్నె. వీలుంటే ఆ రంగుల దారంపోగులు జతపరచడం మంచిది.

(iv) కమ్ముల రకాల్ని బట్టి — పట్టెలకమ్మి, బోనుకమ్మి, పూనాకమ్మి, తురంజీల కమ్మి మొ.వి. ఇదేవిధంగా ధోవతులు, తువాళ్ళు,చాపులు,కండువాలు, దుప్పట్లు, పాగాలు, కనుములు, మడుపులు, గొల్ల కండువాలు, గొల్లధోవతులు మొదలైన వస్త్రాలకు అంచుల్ని బట్టి, పనివరసల్ని బట్టి, కమ్ముల్ని బట్టి రంగుల్ని బట్టి ఉన్న రకాలన్నీ వివరంగా ఇవ్వాలి.

పెళ్ళిళ్ళలోనూ ఇతర ప్రత్యేకసందర్భాల్లోనూ ఉపయోగించే చీరలు, పంచెలు, కండువాలు మొ. వాటి పేర్లు ఇవ్వాలి. గొల్లవాళ్ళూ గమళ్ళవాళ్ళూ తదితరులూ కొన్నికులాలవాళ్ళు ప్రత్యేకంగా కట్టే చీరలూ పంచెలూ కండువాలూ వివరించాలి. పీతాంబరాలూ మడిపంచెలూ జరీబట్టలూ గొంగళ్ళూ తివాసీలూ జంబుఖానాలూ నవారు మొదలైనవాటి వివరాలుకూడా సమగ్రంగా ఇవ్వాలి. అంచులూ డిజైన్లూ నమూనాలు రాసి పంపాలి. వీలుంటే అంచుల ముక్కలు తీసుకుని పంపడం మంచిది.

*18. రంగుల అద్దకం :*

రంగు తయారుచేసే పద్ధతులు - పాతవీ ఇప్పటివీకూడా. సాధనాలూ భేదాలూ భాగాలూ.

రంగులో తోడుకలిపే వస్తువులు-తయారు

చేసే పద్ధతులు; సాధనాలు భేదాలూ భాగాలూ

ఉకారు, కారాలు తయారుచేసే పద్ధతి - రంగు పీల్చుకునేది ఉకారు; Base for the colour dye.

అద్దెవిధానం, సాధనాలు

(i) సాదాఅద్దకం - పూర్వపద్ధతి: సిల్వేరుచెక్క రంగు, మడ్డిచెక్క రంగు, పీపారంగు మొ.వి. అద్దకం, పద్ధతులు, సాధనాలూ భేదాలూ భాగాలూ. ఇప్పటిపద్ధతి - ఇండంత్రీన్స్, నెఫ్తోల్స్ తయారుచేసి అద్దే విధానాలు విడివిడిగా.

సాధనాలూ భేదాలూ భాగాలూ; బానలు, తొట్లు, సలాకలు, ఉకారగుంజ, కుంకెలు, గురుగులు మొ.వి., పనులు.

(ii) డిజైన్ అద్దకం - సాధనాలూ భేదాలూ భాగాలూ

ఇనపకాగులు, పాలంగురుగులు, కళాయిలు మొ.వి; పనులు.

(iii) కలంకారీఅద్దకం - సాధనాలూ, భేదాలూ భాగాలూ.

ఉదా. పలకలు: పేటుపలకలు, పూలపలకలు మొ.వి.

(iv) చిటుకుఅద్దకం - సాధనాలూ భేదాలూ భాగాలూ.

ఉదా. అడ్డకొంగుపట్టె, చిటికాసు మొ.వి.

(v) పట్టుఅద్దకం - సాధనాలూ భేదాలూ భాగాలూ

వారాలవాళ్ళ అద్దకం కూడా ఇవ్వాలి.

*19. చేనేతవారి పండుగలు, ఆచారాలు, వంశచరిత్రలు :*

చేనేతవృత్తికి సంబంధించిన పండుగలు, ఆచారాలు.

ఉదా. వినాయకచవితి, నూలుపున్నమి (జంధ్యాల పౌర్ణిమ) మొ.

చేనేతవారి జీవితపద్ధతులూ పెళ్ళిళ్ళూ పేరంటాలూ. మొత్తం వారివారి కులాచారాలూ పూజలూ. మార్కండేయవంశకథ, దేవాంగనాటకకథ, బీరప్పమల్లప్పల కథ, వారాలపుల్లయ్యకథ మొ.వి.

చేనేతవారి కులదేవతలూ గురువులూ పురోహితులూ వారికి ప్రత్యేకంగా కథలు చెప్పేవారు, వినోదవిద్యలు ప్రదర్శించేవారు. ఉదా. ఒగ్గోళ్ళు, కూనపులోళ్ళు, సాధనాశూరులూ మొ. వారు.

చేనేతపనిలో వాడే పనిముట్లును ప్రత్యేకంగా తయారుచేసేవారు. ఉదా. పన్నెగట్టోళ్ళు, గోనెబ్రెలోళ్ళు, కుంచెరకలోళ్ళు మొ. వారికి సంబంధించిన వివరాలన్నీ ఇవ్వాలి.

*20. పరిశిష్టం :*

ఒకే ఊరిలో కులభేదాల్నిబట్టి మాటల్లో భేదాలుంటే ఆయాకులాల పదాలకు ప్రత్యేకమైన రిపోర్టులు పంపాలి.

చేనేతవృత్తిలో ఉన్నవారి కులాలకు సంబంధించిన వివరాలు—

ఉదా. పద్మసాలీలు, దేవాంగులు, పట్నాలీలు, పడసాలె, తొగట, పత్తిబలిజెలు, కుర్నోళ్ళు, దూదేకులవాళ్ళు, పత్కారివాళ్ళు, కురమలు, గూనచాకళ్ళు, మాలవాళ్ళు మొ. వారు ఏ కులాలవారు ప్రత్యేకంగా ఏ పనిలో ఉన్నదీ వివరాలు ఇవ్వాలి.

ఉదా. కురమలు - గొంగడినేత, పట్టుసాలెలు = పట్టునేత, దేవాంగులు = దసలి. వారాలవాళ్ళు = రంగులఅద్దకం.

ఒక్కొక్కపదానికి ఏకవచన బహువచన రూపాలు, వ్యతిరేకార్థకశబ్దాలు, అర్థవివరణలు, ఇన్ఫార్మెంటు చెప్పిన కథనాత్మక వివరణలు చాలా జాగ్రత్తగా ఉచ్చారణవిధేయంగా సేకరించి ఇవ్వాలి. పనిముట్లలో కాని, డిజైన్లలో కాని మార్పులరకాలు కనిపించినచోట నకలు బొమ్మలు కూడా వేసి పంపాలి.

ఈ ప్రణాళికలో విశేషమేమిటంటే వ్యవసాయ పదకోశంలో మాదిరిగా పదసేకరణ మాత్రమేకాక ఆయా పనులకు సంబంధించిన అంశాలన్నీ సమగ్రంగా

వచ్చేటట్లు కథనాత్మక వివరణ వ్యవహర్తచేత చెప్పించి ఉచ్చారణ విధేయంగా రాసుకోవాలని నిర్దేశించటం. దానివల్లనే ఈ సంపుటంలో క్రియాపదాలు ఎక్కువగా కనిపిస్తాయి.

నిర్దేశించిన గ్రామాల్లోనేగాక పర్యటన పరిశోధకులు చుట్టుపక్కల చేనేతకు ప్రసిద్ధిపొందిన ఇతర గ్రామాలకు కూడా వెళ్ళి పదసేకరణ చేశారు. అందువల్ల కొన్ని గ్రామాలను సూచించే సంఖ్యలకు పక్కన A, B అనే సంకేతాలు చేర్చవలసి వచ్చింది.

## కోశనిర్మాణప్రక్రియ

సేకరించిన పదాలను పర్యటనపరిశోధకులు పంపిన రిపోర్టుల నుంచి - మాట, అది వాడుకలో ఉన్న ఊరి నెంబరు, అర్థం, చొప్పున-ఒకే అర్థంతో వేరు వేరు చోట్ల ఉన్న మాట లన్నిటినీ ఒకచోట చేర్చటం మొదటి దశలో జరిగింది. ఈ విధంగా తయారుచేసిన పదపట్టికల నుంచి ఉచ్చారణలో మార్పులేని ఒక్కొక్క పదాన్ని ఒక్కొక్క ఆరోపం (entry) కింద రాసి దాని అర్థం. అది వాడుకలో ఉన్న ఊళ్ళ నెంబర్లు ఒక్కొక్క కార్డు మీద రాయించటం రెండోదశ. ఈ విధంగా వచ్చిన సమానార్థకశబ్దాలను కొన్నినియమాలు ఆధారంగా ఉచ్చారణభేదాలుగాను,రూపాంతరాలుగాను, పర్యాయపదాలుగాను వేరుచేశాం. చారిత్రకంగా ఒకే మాటకు మండలభేదాన్నిబట్టిగాని, వర్గభేదాన్ని బట్టిగాని, వ్యవహర్తల ఉచ్చారణలో ఏర్పడ్డ రూపభేదాలనే రూపాంతరాలంటాం. ఇలాటి రూపాంతరాల్లో ఒక ప్రాంతానికిగాని, వర్గానికిగాని విలక్షణంగా లేకుండా, అవ్యవస్థితంగా ఉన్నవాటిని అప్రధానమైన ఉచ్చారణభేదాలుగా గ్రహించాం. అలాటివాటికి ఆరోపాలివ్వలేదు.

| ప్రధానారోపం | ఉచ్చారణభేదాలు | రూపాంతరాలు |
|---|---|---|
| | | ఊడెత్తు |
| | ఊడిలి | ఉడ్త |
| (1) ఊడ్తె | ఊడిలె | ఊడ్తెల |
| | ఊడ్త | |
| | ఊడ్డి | |
| | ఊడ్తు | |
| (2) గుదిపె | గుదిలి | గుతువ |
| | గుదిలె | గుదువ |
| | | గుమితె |
| | | చెమక |
| | | చెమిక |
| | | చెముక |
| | | చెమ్క | చేకి |
| (3) చెమికె | | సెంక |
| | | సెమక |
| | | సెమిక |
| | | సెమికి |
| | | సెమ్క |
| | | సెవిక |

ఈ విధంగా వచ్చిన సమానార్థకశబ్దాల్లో ఎక్కువ ప్రాంతంలో వాడుకలోఉన్న మాటను ప్రధానారోపంగా ఇచ్చి దానిపక్కన ఉచ్చారణభేదాలు, ఆ తరవాత రూపాంతరాలు, వాటిని అనుసరించి పర్యాయపదాలు ఇవ్వటం, ప్రధానారోపం వాడుకలో ఉన్న ఊళ్ళలో ఇచ్చిన అర్థాలన్నీ కలిసివచ్చేట్టు సులభమైన వాడుకభాషలో అర్థం నిర్ణయించి రాయటం, బొమ్మల్లో ఉన్న భాగాలను అవసరమైనచోట్ల ఈ అర్థంతో సమన్వయించటం మొదలైన పనులన్నీ మూడోదశలో జరిగాయి. స్థూలంగా కోశనిర్మాణ విధానమంతా వృత్తిపదకోశం మొదటి సంపుటంలో వివరించినట్టుగానే జరిగింది (చూ. మాండలికవృత్తిపదకోశం, మొదటి సంపుటం, వ్యవసాయపదాలు, పుటలు 21-30).

మొదటి సంపుటానికీ దీనికీ నిర్మాణ ప్రక్రియలో ఒక్కతేడా మాత్రం ఉంది. వ్యవసాయపదకోశంలో పదాలన్నిటినీ పదసంగ్రహణప్రణాళికను అనుసరించి కొన్ని శీర్షికలుగా విభజించి ఒక్కొక్కశీర్షికకింద అకారాదిక్రమంలో ఆరోపాలను ఇవ్వటం, ఆ చివర రేఖాచిత్రాలు కూర్చటం జరిగింది. అందువల్ల కోశం చివర చిన్న శీర్షికలకింద వచ్చిన పదాలన్నిటికీ ప్రత్యేకంగా అకారాదిపదసూచి ఇవ్వవలసివచ్చింది. ఈ సంపుటంలో ఆరోపాలను విషయానుసారంగా గాక అకారాదిగానే ఇవ్వాలనీ ఉపారోపాలు లేకుండా అన్నీ ప్రధానారోపాలే ఉండాలనీ రేఖాచిత్రాలన్నిటినీ కోశంచివర ఇవ్వాలనీ సంపాదకమండలి నిర్ణయించింది. ఈ పద్ధతే మిగిలిన సంపుటాలకు కూడా వర్తిస్తుంది.

## ఫలితాలు, ప్రయోజనాలు

1. ఈ కోశంలోనే మొదటిసారిగా కనబడుతున్న దేశ్యవైకృతశబ్దాలు కొన్నివందలున్నాయి;

మచ్చుకు; అముడు, అలు, ఇరవ, ఇరి, ఉడత, ఎర, ఒగ్గె, ఒగ్గెర, ఒది, ఒలి, ఒలిమి, కరి, కిక్కు మొ.వి.

2. ఇదివరకు కోశాల్లో ఉన్న పదాలకు కొన్నిటికి స్పష్టమైన అర్థాలు, అర్థవిశేషాలు ఈ కోశంలో దొరుకుతాయి, ఉదా. అచ్చు : 'a weaver's reed, బట్ట నేసేటందుకు ప్రధానమైనది' (బ్రౌ.); 'సాలెవానిసాధన విశేషము' (శ. ర.); 'సాలెవాఁడు ఉపయోగించు నేత పనిముట్టు' (సూ. రా. ని.). ఈ కోశంలో "అచ్చు" అరోపంకింద ఇచ్చిన అర్థవిశేషాలను పై వాటితో పోల్చి చూస్తే పాఠకులకు ఈ కోశ ప్రయోజనం స్పష్టంగా తెలుస్తుంది.

3. ఇతరకోశాల్లో ఒకే రూపంతో ఉన్న మాటలకు ప్రాంతీయంగా ఏర్పడ్డ రూపభేదాలు, అవి తెలుగు దేశంలో ఎక్కడ వాడుకలో ఉన్నదీ ఈ కోశాన్నిబట్టి తెలుస్తుంది. ఉదా : "ఊడ్తె". దీనికి ఉచ్చారణ భేదాలు "ఊడితి, ఊడితె, ఊడ్త, ఊడ్డి, ఊద్దు"; రూపాంతరాలు—"ఊడెత్తు. ఊడ్తలి, ఊడ్తెల" (శ. ర., సూ. రా. ని.ల్లో "ఊడిత" అని ఒకే రూపం ఉంది.) ఇతర వివరాలు ఈ కోశంలో "ఊడ్తె" అరోపం కింద చూడవచ్చు.

4. కావ్యభాషలో వచ్చిన వృత్తిపదాలకు స్పష్టమైన అర్థాలు ఈ కోశంలో దొరుకుతాయి. 'పడుగు, పేక' అన్న పదాలు నన్నెచోడుని కుమారసంభవంలో కనిపిస్తాయి. (కు. సం. 11-694). హంసవింశతిలో ఈ కింది పద్యంలో ఉన్న చేనేతపనివారి మాటలకు ఉపలభ్య కోశాల్లో సరిఅయిన అర్థాలు దొరకవు.

> "కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గంబు
> పరకె ద్రొక్కుడుపట్టె పలక దోనె
> పరిపరి యచ్చులు చరికుండ యూడిత
> చీడుదబ్బలు దండె నాడె క్రోవి
> కోఁతిపుల్లలు నాల్క కుడుతరికొయ్యలుఁ
> జొప్పయాచలుఁ గోఁతచూఱుకత్తి
> కారంపుఁబడుగులు గంజెలు కప్పెర
> గోలము లాకలు నీలికడవ
> గంప డొల్ల కళాసంబు కదురు చెమికె
> నూలురాట్నంబు జాలంబు గ్రాలు గోడ
> వఱల నా శుభభద్రు నివాసభూమి
> యప్పురంబున సంతతం బొప్పుచుండు".
> (ఆశ్వాసం 2, పద్యం 12.)

పరికెతిప్పటం, నూలుతోడటం, రాట్నంతిప్పటం, కండెలుచుట్టటం, పడుగుచేయటం మొ. పనులను కూడా 'నారాయణామాత్యుడు' పేర్కొన్నాడు.

కావ్యాల్లో వచ్చే అని=యుద్ధం, కోత్రలచేయు=రణోద్యోగం, మొదలైన పదాలు చేనేతపని వాడుకలో నుంచి తరవాత అర్థవిశేషాలతో ఏర్పడ్డవిలా కనిపిస్తాయి.

## పదబంధకల్పన

ఏ భాషలో నయినా ప్రాథమిక శబ్దాలు- అంటే పడుగు, అను, కట్టె, కోల, కర్ర-మొదలైనవి తక్కువ సంఖ్యలోనే ఉంటాయి. వీటిని అంతకంటె చిన్నవిగా విరవటానికి వీలుగాదు. ఇలాంటి పదాలను కొత్తగా సృష్టించటం చాలా అరుదు. కాని కొత్తభావాలకు మాటలు అవసరమైతే అన్యభాషాసంపర్కంలేని జానపదులు పాతమాటల కలయికతో అర్థవిశేషాల్లో కొత్త పదబంధాలు సృష్టించుకొంటారు. ఒక భాష వచ్చినవాళ్ళందరికీ ఆ భాషాజ్ఞానగతంగానే నూతన పదబంధాలు కల్పించే శక్తి అలవడుతుంది. అంటే ప్రాథమిక శబ్దాలు నేర్చుకొని గుర్తుంచుకొంటే కాని రావు. వాటి కలయికతో కొత్త పదబంధాలు కూర్చే విధానం కొన్ని నియమాలను అనుసరించి జరిగినా భాషావ్యవహర్త ప్రత్యేకంగా ఆయా నియమాలు నేర్చుకోవలసిన అవసరంలేదు. ప్రాథమికపదాలకు, పదబంధాలకు ఉన్న సంబంధం అంకెలకు, సంఖ్యలకు మధ్య ఉన్న సంబంధంలాంటిది. అంకెల్ని అందరం నేర్చుకుంటాం. వాటికి ఏ స్థానంలో ఏ విలువ ఉన్నదీ (ఒకట్లు, పదులు, వందలు మొ.వి.) కూడా నేర్చుకుంటాం. కాని వాటి కలయికవల్ల ఏర్పడే ప్రతిసంఖ్యా ప్రత్యేకంగా నేర్చుకోనవసరం లేదు. 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 0—ఈ పొడి అంకెలతో లెక్కలేనన్ని సంఖ్యలు మనం సృష్టించుకోటం సాధ్యమవుతుంది. అలానే భాషలో ఏయే నియమాల ననుసరించి ఏ అర్థవిశేషాల్లో కొత్త పదబంధాలు ఏర్పడతాయో పరిశీలించటానికి వృత్తిపదకోశంలో సామగ్రి లభిస్తుంది.

ఒకభాష పెరుగుదలకు ప్రధానమార్గాలు రెండు: (1) ఇతరభాషల్లోనుంచి ఎరువు తెచ్చుకొన్న భావాలతోబాటు వాటి మాటలు కూడా తెచ్చి కలుపుకోటం; (2) కొన్ని నియమాలకు కట్టుబడి దేశ్య శబ్దాలతోనే కొత్త పదబంధాలు సృష్టించుకోటం. చేనేత పనివారు విరళంగా అన్యదేశ్యాలను వాడుకలో కలుపు

కొన్నారు. ఇలాటి పదాలు చారిత్రకంగా ఆవృత్తిలో వచ్చిన మార్పులవల్ల ఇటీవల ఏర్పడ్డవి. దేశీయవృత్తుల్లో ఉన్నవాళ్ళకు అన్యభాషాసంపర్కం తక్కువగా ఉంటుంది. కాబట్టి దేశ్యశబ్దాలతోనే కొత్తమాటలు కల్పించుకుంటారు. రెండుమూడు మాటలు కలిసినప్పుడు వాటిమధ్య ఏయే కారకసంబంధాలు, క్రియార్థాలు ఇమిడిఉంటాయో తెలుసుకోటానికి తెలుగులో పరిశోధన జరగాలి.

రెండు పదాల కలయికతో ఏర్పడే పదబంధాల్లో ఈ కింది రకాలైన సంబంధాలు తరచుగా కన్పిస్తాయి. రెండు పదాల్లో మొదటిది X అని, రెండోది Y అనీ అనుకోండి.

(1) X వైపు (/గా/న/) ఉన్న Y ⟶ XY (Y=ఒక పనిముట్టుగాని, దాని భాగంగాని; X=ఒక దిక్కునుగాని, కొలతనుగాని సూచించేపదం).

ఉదా : అడుగుపట్టె, అడుగుబల్ల, అడుగుపీట, అడ్డకట్టె, అడ్డకమ్మి, అడ్డకొయ్య, అడ్డపలక, అడ్డపీట; ఎదురుగుంజ; కడకట్టు, కడగుంజ. కడదబ్బ; వెనకబల్ల; దిగుబద్ద, దిగువకోత్తల; ఎగువకోత్తల; ఎగువమగ్గం; మేలుకొయ్య; తలకొయ్య, తలపట్టె, తలపీట, తలబల్ల.

(2) X ఉన్న Y (X Y లో ఉంటుంది; X=ఆధేయం; Y=ఆధారం) ఉదా : అంబటికుండ. కారంతొట్టి, కండె(ల)గంప, ఉన్నిగంప, వెయ్యిగళ్ళకోక, పేకుపొత్తి.

(3) Xతో చేసిన Y (Xతో Y చేస్తారు; X=ఒక ఉపకరణంగాని, ముడిసరుకుగాని; Y=ఆ ఉపకరణంతో తయారైన వస్తువు).

ఉదా : అరటిపొత్తి, ఇనపగొట్టం, వెదురులాక.

(4) X వంటి గుర్తులున్న Y; X గుర్తులతో ఏర్పడ్డ Y (Y=కొన్ని X గుర్తులు; Yలో X గుర్తులుంటాయి).

ఉదా: అరకపేటు, హంసపేటు, గువ్వకన్నంచు, గజ్జెలపేటు, ఉయ్యాలపేటు.

(5) X పేరుగల Y (X=విశేషనామం; Y=సామాన్యనామం; ఉదా : చింతచెట్టు, గులాబిపువ్వు మొదలైన పేర్లలో చెట్టు, పువ్వు, సామాన్య పదాలు, జాతివాచకాలు; చింత, గులాబి ఆయా తెగలకు చెందిన కొన్ని వస్తువుల పేర్లు). ఉదా: ఉగాదిపండుగ, వినాయకచవితి, కారునీళ్ళు.

(6) X లాంటి Y (Y, X లాగా ఉంటుంది; X=ఒక వస్తువు; Y=రంగు) ఉదా : అరటిపచ్చ, చిలకపచ్చ, వంగపండురంగు, రెక్కమాను, కత్తెరమాను, బెండకాయచెక్రం.

(7) Xలో (భాగంగా) ఉన్న Y (X=పనిముట్టు పేరు; Y=ఆ పనిముట్టులో భాగం; Y, Xతో కలిసి ఉంటుంది). ఉదా : ఇరుసుచెవి, అనుగుంజ, కుంచెకర్ర, కుంచెదెంప, కుంచెపుల్ల, మగ్గంపలక, మగ్గంతాడు, మగ్గంబల్ల, ఊడైకాలు, ఊడైగోలుసు.

(8) X ప్రయోజనానికి Y (ఇక్కడ X-Yల మధ్య చాలారకాల సంబంధా లుంటాయి).

ఉదా : ఆసు (పోసే) గొట్టం, గంజి (పట్టించే) పిడచ, మగ్గంగుంట, మగ్గంబయలు. పిర్రపట్టు, ఉన్నికత్తెర, కావుబద్ద, కండెలపీట, కుంచెపుల్లలు (కుంచె కట్టటానికి పుల్లలు), గంజిగడ్డలు, గంజిపలక, గంజిబండ.

(9) X నుంచి తీసిన Y (X నుంచి Y తయారవుతుంది; X=మూలం; Y=దాన్నుంచి ఉత్పన్నమయ్యే పదార్థం; 'ఆవుపాలు'లాగా). ఉదా : వరిగంజి.

(10) X=ఒక పనిపేరు; Y=ఆ పనితో సన్నిహిత సంబంధం ఉన్న వస్తువుపేరు (Y=ఒక పనిని తెల్పే క్రియకు (X కు) కర్తగాగాని, కర్మగాగాని ఉంటుంది).

ఉదా : ఆడుగర్ర (ఆడేకర్ర), పూనుగర్ర, తొక్కుడుకర్ర. ఎత్తుపుల్ల, పేకుడుకర్ర, కట్టుకమ్మి, గీరుకత్తి, గుచ్చుకర్ర, పేకువిల్లు, పేకునార, చీరులాక, చుట్టుకట్టె.

(11) Xలో ఉన్న Y (X=ఆధారం; Y=ఆధేయం) ఉదా : కండెనూలు (డబ్బాపాలు లాంటిది).

(12) X వల్ల గుర్తించదగిన Y (X=Yలో ఒక భాగం, అవయవం; Y=ఆ భాగంవల్ల గుర్తించదగిన పనిముట్టుగాని వ్యక్తిగాని).

ఉదా : గళ్ళచీర, ఆకులరాట్నం, కుచ్చుమగ్గం, గుంటమగ్గం, గాడికుంచె, గడ్డంకురమలు.

(13) X=ఒక ఊరు లేక దేశంపేరు; Y=ఒక వస్తువు (Yకి ప్రసిద్ధమైన X ఉన్నప్పుడు సాధారణంగా ఇలాటి పదబంధాలు ఏర్పడతాయి).

ఉదా : గద్వాలచీర, గుంటూరుచీర, గద్వాల అంచు.

(14) X = గుణవాచకంగాని, పరిమాణార్థకంగాని, సంఖ్యావాచకంగాని; Y=విశేష్యం (ఇలాటివి అసంఖ్యాకంగా ఉంటాయి).

ఉదా: ఎర్రఉన్ని, ఒరపోగు, అరపిడి, గుండు దోనుగ, గట్టి నేత.

(15) ద్వంద్వసమాసం X + Y = XY. ఉదా. పడుగుంబేకలు, సరింబేకలు.

(16) X=ఒక ఋతువునుగాని కాలభాగాన్నిగాన్ని సూచిస్తుంది; Y=ఆకాలంలో తయారయ్యే వస్తువు పేరు.

ఉదా. అగిటిఉన్ని, మాగిఉన్ని, వేసంగిఉన్ని.

ఇలాటి నిర్మాణాలు శతాధికంగా తెలుగులో ఉంటాయి. అందులో కొన్ని చాలా తరుచుగాను మరికొన్ని విరళంగానూ ఉంటాయి. తెలిసిన మాటలు అవయవాలుగా కొత్తమాటలు సృష్టించి వాటిని అవగాహనచేసుకొనే శక్తి మనకు భాషాజ్ఞానగతంగా అలవడుతుంది. ఆధునిక విజ్ఞానశాస్త్రాలు నేర్పటానికి కొత్తమాటలు సృష్టించేవారు ఈ నియమాలు గ్రహించకుండా మాటలు కల్పిస్తే వాటికి చెలామణి అట్టే ఉండదు. అంటే–అవయవాల కలయికతో అవయవి అర్థం చప్పున తెలియనప్పుడు ఆ పదబంధాలు చదువుకునేవారు మొత్తంగా గుర్తుపెట్టుకోవలసివస్తుంది. భారతభాషలన్నిటికీ పారిభాషికపదాలు ఒకేరకంగా ఉండాలన్నవాళ్ళకు ఈ భాషానియమం తెలియకపోవటం శోచనీయం.

ఇవిగాక నుడికారాలుగా మారిపోయిన పదబంధాలెన్నో ఉన్నాయి. అంటే అవయవపదాల అర్థాన్నిబట్టి అవయవి (పదబంధం) అర్థం నిష్పన్నం చెయ్యటం సాధ్యంకానప్పుడు వాటిని నుడికారాలంటాం. ఉదా: ముక్కుతాడు, మిడతకన్ను, ఆలుమగలపోగులు, రాయబారపుతాడు, కాలుగుంజ, గద్దగోరు మొ. వి.

## మాండలికభేదాలు

వ్యవసాయవృత్తిపదకోశంలో జరిగిన పదపరిశోధన్నిబట్టి తెలుగుదేశాన్ని నాలుగు భాషామండలాలుగా విభజించవచ్చుననీ ఆ విభజనకు రాజకీయ, సాంస్కృతిక కారణాలున్నాయనీ నిరూపించాం. ఆ మండలాలు:

(1) పూర్వాంధ్రం (=కళింగమండలం) (శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు).

(2) దక్షిణాంధ్రం (రాయలసీమ, నెల్లూరు, ఒంగోలు జిల్లాలు, గుంటూరుజిల్లాలో వినుకొండ తాలూకా; మహబూబ్‌నగర్ జిల్లాలో దక్షిణభాగం)

(3) ఉత్తరాంధ్రం (తెలంగాణా జిల్లాలు, మహబూబ్‌నగర్‌లో ఉత్తరభాగంతో కలుపుకొని).

(4) మధ్యాంధ్రం (మిగిలిన ఉభయగోదావరులు, కృష్ణా, గుంటూరు జిల్లాలు – వినుకొండ, పల్నాడు తాలూకాలు తప్ప).

ఈ విభజన స్థూలంగా చేనేతపదాల వాడుకలోనూ ప్రతిబింబిస్తుంది. ఈ విభజన ఏర్పడకముందు ఉత్తర దక్షిణాంధ్ర మండలాలు (ఇప్పటి రాయలసీమ, తెలంగాణా జిల్లాలు) కొన్ని శతాబ్దాల కిందట ఏకైక భాషామండలంగా ఉండేవని ఊహించవచ్చు. మాండలిక పదపటాల్ని అర్థంచేసుకోటానికి ఈ కింది సూత్రాలు గమనించాలి:

(1) ఒకమాట నాలుగు మండలాల్లోనూ కనిపిస్తే మాండలికభేదాలు ఏర్పడకముందే దేశం అంతటా –ఆ పదం వాడుకలో ఉండి ఉండాలి – లేకపోతే – చాలా ఆధునికంగా అన్యా అన్యభాషాప్రభావంవల్ల ఆ మాట అంతటా ఇటీవల వ్యాపించి ఉండాలి.

ఉదా: రాట్నం (దేశ్యం); చెరఖా (అన్యదేశ్యం) (చూ. పటం 12).

[చెరఖా దేశం అంతటా ప్రజలకు అర్థమవుతూ ఉన్నా పటంలో చూపలేదు].

(2) మూడు మండలాల్లో ఒక మాట, నాలుగో మండలంలో మరొకమాట పర్యాయపదాలుగా వాడుకలో ఉన్నప్పుడు, నాలుగో మండలంలో వచ్చినమాట ఆధునికం అయి ఉండాలి. మిగిలిన మండలాలతో ఈ మండలానికి సాంస్కృతిక సంబంధం, రాకపోకల సంబంధం చాలాకాలం లేకపోవటంవల్ల ఇలాటి పరిస్థితి ఏర్పడుతుంది (చూ. పటం 3; 'ఆసు' దేశ్యం, 'తానె' ఉర్దూ ప్రభావంవల్ల తెలంగాణాలో మాత్రం వ్యాపించింది). కాని నాలుగోమండలంలో దేశ్యపదమూ, మిగిలిన మండలాల్లో అన్యదేశ్యమూ వాడుకలో ఉంటే దేశ్యపదమే ప్రాచీనమైందని గుర్తించాలి. ఉదా: రాయలసీమలో 'కొమ్ము'; మిగిలిన మండలాల్లో నాడె, మొ.వి. (చూ. పటం 8).

(3) ఇటీవలిదాకా రాకపోకల సంబంధం లేకుండా దూరంగా ఉన్న రెండు మండలాల్లో ఒకమాట వాడుక పరిమితంగా లంకల మాదిరిగా కన్పిస్తే ఆమాట అతి ప్రాచీనం అనీ, ఆ తరవాత వాడుకలోకి వచ్చిన మరొక రూపం వ్యాప్తివల్ల దీనివ్యాప్తి కాలక్రమాన సంకుచితం అయిపోతున్నదనీ ఊహించాలి.

ఉదా: పరిగెలు, పంగెలు — ఈ రెంటికీ ప్రాచీన రూపం పరింగెలు అయి ఉండాలి (చూ. పటం 9); చెవుడు - చెముడు - పూర్వాంధ్రంలోను, దక్షిణాంధ్రం లోను అక్కడక్కడా కనిపిస్తుంది. చేడు అర్వాచీనం (చూ. పటం 5).

(4) ఇప్పుడు సంబంధంలేని రెండు మండలాల్లో రెండేసి దేశ్యపదాలు వాడుకలో ఉండి వాటికి సమానంగా మిగిలినచోట్ల వాటిల్లో ఏదో ఒక పదం వ్యాప్తిలో ఉన్నప్పుడు సూక్ష్మమైన అర్థభేదం లోపించటంవల్ల ఒకేమాట ఆ రెండిటి అర్థాల్లోనూ వ్యాపించిందని గ్రహించాలి.

ఉదా: అని, కచ్చి (చూ. పటం 1).

(5) పై నియమానికి విరుద్ధంగా ఒకమాటకున్న అర్థవిశేషాలను విరిచి ఆ మాటతోబాటు మరో కొత్త మాట అర్వాచీనంగా ఒకప్రాంతంలో కల్పించుకున్నప్పుడు ఆ మార్పు ఏదో ఒక మండలంలోనే ఉంటుంది గాని ఇప్పుడు సంబంధంలేని రెండు మండలాల్లో ఉండదు.

ఉదా: అసు, అసుమాను (రాయలసీమ), అసు (ఇతర మండలాలు) (చూ. పటం 3).

(6) ఒకే అర్థంలో రెండు మాటలుండి అందులో ఒకటి ఎప్పుడూ సమాసగతంగానూ రెండోది వ్యస్తంగానూ వాడుకలో ఉంటే సమాసగతంగా వచ్చేపదం ఆ రెంటిలోనూ ప్రాచీనం అనీ, అది ఒకప్పుడు ఆ ప్రాంతంలో వ్యస్తంగాఉండిఉండవచ్చనీ గ్రహించవచ్చు. ఉదా: చెవుడుకర్ర, చెముడుగర్ర, చెవుడుకట్టె; చేడు వ్యస్తంగా గూడా వస్తుంది (చూ. పటం 5).

## వర్గమాండలికాలు

చేనేతపనిచేసే కులాలు చాలా ఉన్నాయి; పద్మశాలీలు, దేవాంగులు, తొగట సేనాపతులు, కురమలు, హరిజనులు, తురకలు. కులభేదాల్నిబట్టి కొన్ని పనిముట్లపేర్లు, పనులపేర్లు వేరువేరుగా ఉంటాయి. ఈ మాటల తేడాలు చేనేతవృత్తిలో ఉన్న కులాల హెచ్చుతగ్గులకు గుర్తులుగా నిలిచిపోయినాయి.

**అనె:** తె. 27లో కురమల వాడుక. అదేఊళ్ళో పద్మశాలీలు అనె అంటారు.

**కచ్చి:** కో. 7, 12, 20, 21, 23-26, 28, 29, 32, 33, 35-37; తె. 17, 24; రా. 3 కేంద్రాల్లో దేవాంగులవాడుక.

కో. 22, 27 కేంద్రాల్లో తొగట సేనాపతుల వాడుక.

**దాప:** రా. 3లో దేవాంగుల వాడుక (వేరే వాళ్ళు ఊడై).

**పాక:** తె. 27, 28 కేంద్రాల్లో కురమల వాడుక. అదేఊళ్ళలో ఇతరుల వాడుక పేక.

**పైట:** కో. 9, 13 కేంద్రాల్లో హరిజనుల వాడుక; పద్మశాలీల వాడుక పంగె.

**ఫనీ:** కో. 4, 5 లో పన్నెగట్టేవాళ్ళ వాడుక (వేరేవాళ్ళు పన్నె).

**ఖూటా:** కో. 5లో పన్నెగట్టేవాళ్ళ వాడుక (వేరేవాళ్ళు గూటం).

**బొంగరం:** కో. 9లో తొగటవాళ్ళ వాడుక (వేరేవాళ్ళు రాటి).

**మట్టుగర్ర:** కో. 8, 9లో హరిజనుల వాడుక (ఇతరకులాలు పూనుగర్ర).

**మడుపుకట్టె:** రా. 19లో హరిజనుల వాడుక; (ఇతరకులాలు మలగర్ర).

**మడుపుకర్ర:** కో. 6, 9; తె. 13; రా. 21 కేంద్రాల్లో హరిజనులవాడుక (ఇతరకులాలు మలగర్ర).

**తకలా:** కో. 5, 14లో అచ్చుకట్టే సాయెబుల వాడుక.

**నరాట:** కో. 8; రా. 4, 6, 11, 13-15, 17-19 కేంద్రాల్లో తొగట సేనాపతుల వాడుక (వేరే కులాలు ఊడై).

**సరిగెద్దు:** కో. 4లో తొగట సేనాపతుల వాడుక; వేరే కులాలు ఊడై.

**సరెద్దు:** కో. 6, 8, 9; తె. 13; రా. 21 కేంద్రాల్లో హరిజనుల వాడుక; వేరే కులాలు ఊడై.

**చమిగెద్దు:** రా. 9, 12 హరిజనుల వాడుక; వేరే కులాలు ఊడై.

**సాంబ్** : కో. 7లో పన్నె గట్టేవాళ్ళ వాడుక: ఇతరకులాలు **గూడు**.

**సాటా** : కో. 5, 7; రా. 24 పన్నె గట్టేవాళ్ళ వాడుక; ఇతరకులాలు **దండె**.

**సింగ్** : కో. 5లో అచ్చుకట్టేసాయెబుల వాడుక; ఇతరకులాలు **దిద్దు (డు) బిళ్ళ**.

**హరిచిన్నీ** : తెల్ల ఉన్నికి వేసిన ఆకుపచ్చవన్నె; తివాసీ నేతపనివాళ్ళ వాడుక.

<u>హే</u>క : కో. 1, 3, 7, 12; తె. 2, 6, 21, 22 కేంద్రాల్లో దేవాంగుల వాడుక.

## అన్యదేశ్యాలు

చేనేతపనివారికి ఇతరభాషలతో ఉన్న పరిచయాన్నిబట్టి, రాజకీయ కారణాల్నిబట్టి, ప్రాంతాన్నిబట్టి, చేనేతవృత్తిలో కాలక్రమాన వచ్చిన మార్పుల్నిబట్టి ఉర్దూ, పర్షియన్, అరబిక్, ఆంగ్లం మొదలైన భాషల నుంచి కొన్నిపదాలు వారి వాడుకలో ప్రవేశించాయి.

**కమాను** : దూది ఏకే పలక ; పర్షి. **కమాన్** విల్లు, వంపు.

**కచ్చారంగు** : తొందరగా వెలిసిపోయేరంగు : హిందీ కచ్చారంగ్ తొందరగా వెలిసిపోయేరంగు.

**కసీదా** : అంచుల్లో పూలు పడేటట్టు నేసిన ఒక డిజైను : అర. క్‌సీదా. ఒక రకం పద్యం.

**చోళీగుడ్డ** : ఆడవాళ్ళ రవికెల కోసంనేసిన బట్ట: హిం. **చోలా** చిన్న జాకెట్టు.

**ఫద్దు** : పక్కమీద పరుచుకునే దుప్పటి : **హిం. ఛద్దర్.**

**జరీ** : సన్నటి మెరుపుదారం : పర్షి. **జరీ** బంగారురంగు దారంతో అల్లినది.

**జల్తారు** : బట్ట అంచులకుగానీ కమ్ములకుగానీ డిజైన్లకోసం పెట్టే సన్నటి మెరుపుదారం ; పర్షి. **జర్‌తార్** బంగారుదారం.

ఇలానే ఏక్ గోలేకావాలుసార్, గోటు, గోల్బు నాయినేత, చెముడాముల్లు, చేదస్త్రీ, **జాలిపింజెర**, జోడా, జెంటర్, దబ్బా, డాబీ, డాబు, డామ్‌గడి, మొదలైన అన్యదేశ్యాలు సుమారు రెండు **మూడు** వందలుదాకా ఉన్నాయి.

'అణి, కణుము, కోళివి' మొదలైన శబ్దాలు కన్నడభాషా ప్రభావంవల్ల ఆ దగ్గరి గ్రామాల్లో వినిపిస్తాయి.

## ముగింపు

ఈ వృత్తిపదకోశాలవల్ల తెలుగుభాషా విస్తృతి తెలియటమే కాకుండా దేశీయవృత్తుల సాంస్కృతిక చరిత్ర పునర్నిర్మించటం కూడా సాధ్యం అవుతుంది.

భాషలో వచ్చే మార్పులు, సంఘానికీ భాషకూ ఉన్న పరస్పరసంబంధం, భాష పెరుగుదలలో ఉన్న తత్వం శాస్త్రీయంగా పరిశీలించటానికి వృత్తిపద కోశాల్లో మౌలికమైన సామగ్రి దొరుకుతుంది.

# పరిశోధకుల పర్యటన వివరాలు

| ప్రాంతం ఊరి నెంబరు* | పర్యటించిన ఊరు | తాలూకా | జిల్లా | పేరు | కులం | వయస్సు | ప్రధానవృత్తి | ఉపవృత్తి | చదువు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
| కో. 1 | సూళ్ళూరుపేట | సూళ్ళూరుపేట | నెల్లూరు | పెన్నెం చెంగల్రాయంసెట్టి | దేవాంగులు | 50 | చేనేత | — | 6వ తరగతి |
| కో. 2 | వెంకటగిరి టౌన్ | వెంకటగిరి | ,, | చల్లా చినవెంకటస్వామి | కర్ణశాలి | 55 | ,, | — | అక్షరజ్ఞానం |
| కో. 3 | బుచ్చిరెడ్డిపాలెం | కావలి | ,, | చల్లా వీరాస్వామి | దేవాంగులు | 67 | ,, | — | — |
| | | | | పాలా రంగయ్య | పద్మశాలి | 60 | ,, | — | అక్షరజ్ఞానం |
| కో. 4 | వింజమూరు | ఉదయగిరి | ,, | నీలం చినవెంకటయ్య | తొగటబలిజె | 58 | ,, | — | — |
| కో. 5 | కందుకూరు | కందుకూరు | ,, | ఆకురాతి రెడ్డెమ్మ | పద్మశాలి | 60 | ,, | — | — |
| కో. 6 | చీమకుర్తి† | ఒంగోలు | గుంటూరు | పోకూరి తిరువెంగళం | ,, | 70 | ,, | — | — |
| | | | | చావలత్తిన చిన్నయ్య | హరిజనులు | 60 | ,, | — | — |
| కో. 7 | చీరాల† | బాపట్ల | ,, | అనబం వెంకయ్య | పద్మశాలి | 75 | ,, | — | — |
| | (జాండ్రపేట) | | | బుండపల్లి సదాశివయ్య | దేవాంగులు | 60 | ,, | — | — |
| కో. 8 | ఫిరంగిపురం | సత్తెనపల్లి | ,, | మాయకుంట్ల లూర్దు మరియన్న | తొగట | 70 | ,, | — | — |
| | | | | దేవరపల్లి పిచ్చెయ్య | హరిజనులు | 45 | ,, | — | అక్షరజ్ఞానం |
| కో. 9 | మాచెర్ల | పల్నాడు | ,, | పున్నా నరసయ్య | పద్మశాలి | 50 | ,, | — | ,, |
| | | | | నాగిండ్ల సామేలు | హరిజనులు | 50 | ,, | — | — |
| | (చెర్లగుడిపాడు) | | | పల్లా సైదయ్య | తొగట | 45 | ,, | — | — |

* కో. = కోస్తాజిల్లాలు ; తె. = తెలంగాణా ; రా. = రాయలసీమ.

† గుర్తుగల ఊళ్ళు ఇటీవల 'ప్రకాశంజిల్లా'లోకి చేరినవి.

[3]

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 10 | మంగళగిరి | మంగళగిరి | ,, | దామర్ల రత్తయ్య | పద్మసాలి | 70 | చేనేత | — | — |
| కో. 11 | ఘంటసాల | దివి | కృష్ణా | కేతన లక్ష్మిపెరుమాళ్ళు | ,, | 60 | ,, | — | కొద్దిపాటి |
| కో. 12 | మచిలీపట్నం | బందరు | ,, | నార్ని చిననానయ్య | దేవాంగులు | 50 | ,, | — | 4వ తరగతి |
| | (చింతగుంట పాలెం) | | | గుత్తి వెంకటసుబ్బయ్య | — | 50 | ,, | — | కొద్దిపాటి |
| | (పెడన) | | | | | | | | |
| కో. 13 | మైలవరం | విజయవాడ | ,, | పిట్ల నరసింహం | పద్మశాలి | 65 | ,, | — | ,, |
| కో. 14 | జగ్గయ్యపేట | నందిగామ | ,, | దూసా మల్లయ్య | ,, | 60 | ,, | — | ,, |
| కో. 15 | ఆత్కూరు | గన్నవరం | ,, | చిట్టా నరసింహస్వామి | ,, | 40 | ,, | — | ,, |
| కో. 16 | ఏలూరు | ఏలూరు | ప. గోదావరి | బూడిద సోమలింగం | దేవాంగులు | 48 | ,, | — | 5వ తరగతి |
| కో. 17 | నర్సాపురం | నర్సాపురం | ,, | ఆకాశపు శంకరయ్య | ,, | 52 | ,, | — | ,, |
| కో. 18 | వేల్పూరు | తణుకు | ,, | తాడిచెట్టు నెలబాలుడు | కరిణెబత్తులు | 56 | ,, | — | — |
| కో. 19 | నిడదవోలు | కొవ్వూరు | ప. గోదావరి | బత్తుల సుబ్బారావు | పద్మశాలి | 55 | ,, | — | 5వ తరగతి |
| కో. 20 | బండారులంక | అమలాపురం | తూ. గోదావరి | చింతా బసవయ్య | దేవాంగులు | 50 | ,, | — | కొద్దిపాటి |
| కో. 21 | అంగర | రామచంద్రపురం | ,, | మచ్చా మల్లికార్జునుడు | ,, | 50 | ,, | — | ,, |
| కో. 22 | కోరుకొండ | రాజమండ్రి | ,, | నీలి అప్పలనరసయ్య | సేనాపతులు | 60 | ,, | వ్యవసాయం | — |
| కో. 23 | పెద్దాపురం | పెద్దాపురం | ,, | పడాల బుల్లెబ్బాయి | దేవాంగులు | 65 | ,, | — | 5వ తరగతి |
| కో. 24 | ఉప్పాడ | పిఠాపురం | ,, | కాసిన చినవీరభద్రుడు | ,, | 70 | ,, | — | — |
| కో. 25 | తుని | తుని | ,, | బల్లా వీరభద్రరావు | ,, | 55 | ,, | — | కొద్దిపాటి |
| కో. 26 | పాయకరావుపేట | యలమంచిలి | విశాఖపట్నం | కాసిన నూకరాజు | ,, | 50 | ,, | — | ,, |
| కో. 27 | లక్కవరం | వీరవల్లి | ,, | కాకి రామన్న | సేనాపతులు | 50 | ,, | అచ్చుకట్టడం | ,, |
| కో. 28 | గోవాడ | ,, | ,, | మావూరి సాంబమూర్తి | దేవాంగులు | 45 | ,, | — | — |
| కో. 29 | విశాఖపట్నం | విశాఖపట్నం | ,, | కాలిక సోమయ్య | ,, | 50 | ,, | — | — |
| కో. 30 | కశిమి | ,, | ,, | చుక్కల యర్రన్న | సేనాపతులు | 50 | ,, | — | — |
| కో. 31 | గంగబూడి | శృంగవరపుకోట | ,, | నేసెట్టి వీరన్న | ,, | 70 | ,, | — | కొద్దిపాటి |
| కో. 32 | విజయనగరం | విజయనగరం | ,, | మావూరి అప్పారావు | దేవాంగులు | 50 | ,, | — | ,, |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 33 | పాందూరు | చీపురుపల్లి | శ్రీకాకుళం | అంకం గురుమూర్తి | ,, | 40 | చేనేత | — | ,, |
| | | | | అల్లంసెట్టి అప్పయ్య | పట్టుసాలె | 50 | ,, | — | కవిత్వంచెప్పేచదువు |
| | | | | వడగ అచ్చాయమ్మ | ,, | 40 | ,, | — | — |
| కో. 34 | కొంతలకోడూరు | ,, | ,, | గుంటుకు లింగరాజు | ,, | 40 | ,, | — | కొద్దిపాటి |
| కో. 35 | బొబ్బిలి | ,, | ,, | కాలెపు సత్యనారాయణ | దేవాంగులు | 40 | ,, | — | ,, |
| కో. 36 | నరసన్నపేట | బొబ్బిలి | ,, | గోరు స్వామి | ,, | 50 | ,, | — | ,, |
| | | | | కాకర్ల సత్యం | ,, | 45 | ,, | — | — |
| కో. 37 | జింకభద్ర | నరసన్నపేట | ,, | సప్పటి గురవయ్య | ,, | 50 | ,, | — | కొద్దిపాటి |
| | (సోంపేట) | సోంపేట | | సంకా శ్రీరాములు | పట్టుసాలె | 55 | ,, | — | ,, |
| తె. 1 | అలంపురం | అలంపురం | మహబూబ్‌నగర్ | పాలాది రోశప్ప | పద్మశాలి | 70 | ,, | — | — |
| తె. 2 | మొల్దకల్లు | గద్వాల | ,, | రంగా ఈదన్న | ,, | 56 | ,, | పోస్టుపని | కొద్దిపాటి |
| | (గద్వాల) | | | మద్దెలబండ తిమ్మన్న | హరిజనులు | 50 | ,, | — | ,, |
| తె. 3 | తాడూరు | నాగర్‌కర్నూలు | ,, | కుకుడాల బాలకిష్టయ్య | పద్మశాలి | 55 | ,, | — | — |
| | | | | దిగ్గెన వెంటయ్య | కురమ | 55 | గొంగడినేత | — | — |
| తె. 4 | అచ్చెంపేట | అచ్చెంపేట | ,, | మాకం నారాయణ | పద్మశాలి | 55 | చేనేత | — | — |
| | | | | వనం ముత్యాలు | ,, | 40 | చేనేతసంఘం ఉద్యోగి | — | కొద్దిపాటి |
| తె. 5 | ఆమనగల్లు | కల్వకుర్తి | ,, | గాజులు చెన్నయ్య | ,, | 85 | చేనేత | — | — |
| | | | | చెన్న పాండురంగయ్య | ,, | 55 | పట్టునేత | — | — |
| తె. 6 | నారాయణపేట | మక్తల్ | ,, | సోమరప్ప | కురమ | 60 | గొంగడినేత | — | — |
| | | | | బుగ్గప్ప | దాసరి | 20 | నవారునేత | — | — |
| తె. 7 | కోస్గి | కొడంగల్ | ,, | ఆడికె పాపయ్య | కురినిసెట్టి | 70 | చేనేత | — | — |
| | | | | బాజర్ల రామయ్య | అటకర్లు | 60 | దసలినేత | — | — |
| | (తిమ్మాయపల్లి) | | | పాపకంటి బసప్ప | కురమ | 58 | గొంగడినేత | — | — |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తె. 8 | కారవాన్ | హైదరాబాదు | హైదరాబాదు | గద్దె నారాయణ | పద్మశాలి | 70 | ,, | — | 4వ తరగతి |
| తె. 9 | మిట్టకోడూరు | పర్గి | ,, | దుద్యాల బిచ్చయ్య | పద్మశాలి | 58 | ,, | | కొద్దిపాటి |
| | | | | ముత్యం సాయన్న | కురమ | 60 | గొంగడినేత | — | — |
| తె. 10 | పోచంపల్లి | భువనగిరి | నల్లగొండ | శీతా నరసయ్య | ,, | 60 | ,, | — | — |
| | | | ,, | తంగెళ్ళ వెంటయ్య | కురమ | 45 | గొంగడినేత | వ్యవసాయము | — |
| తె. 11 | రామన్నపేట | రామన్నపేట | | గోరిగె రాజయ్య | ,, | 50 | ,, | — | — |
| | (సిరిపురం) | | ,, | అప్పం గోపయ్య | పద్మశాలి | 80 | చేనేత | — | — |
| తె. 12 | దేవరకొండ | దేవరకొండ | | సిలివేరు ముత్యాలు | ,, | 68 | ,, | — | — |
| | | | | గుండ బుచ్చయ్య | ,, | 53 | పట్టునేత | — | అక్షరజ్ఞానం |
| తె. 13 | మిర్యాలగూడెం | మిర్యాలగూడెం | నల్లగొండ | రావిరాల రామయ్య | పద్మశాలి | 50 | చేనేత | — | — |
| తె. 14 | సూర్యాపేట | సూర్యాపేట | ,, | తాటి ముత్తెయ్య | ,, | 59 | ,, | — | — |
| తె. 15 | ఖమ్మం | ఖమ్మం | ఖమ్మం | కటకం గట్టయ్య | ,, | 60 | ,, | — | — |
| తె. 16 | సుజాత్‌నగర్ | ఇల్లెందు | ,, | మిడతనపల్లి రామయ్య | ,, | 78 | ,, | — | — |
| తె. 17 | వరంగల్లు | వరంగల్లు | వరంగల్లు | ఇంగాల బాలయ్య | ,, | 70 | ,, | — | అక్షరజ్ఞానం |
| | | | | ఎంగల లక్ష్మయ్య | ,, | 70 | జంబుఖానానేత | — | — |
| | | | | దాసరి భద్రయ్య | హరిజనులు | 40 | తివాసీనేత | — | — |
| | (హసన్‌పర్తి) | | | గుండబోయిన చెంద్రయ్య | పత్తిబలిజ | 60 | రంగుల అద్దకం | వ్యవసాయం | — |
| | ,, | | | పొలాస భద్రయ్య | దేవాంగులు | 50 | దసలిపని | — | వ్యవసాయం |
| తె. 18 | ఇస్మాయిల్ ఖాన్‌పేట | సంగారెడ్డి | మెదక్ | గూడా రాధయ్య | పద్మశాలి | 70 | చేనేత | — | అక్షరజ్ఞానం |
| తె. 19 | జహీరాబాద్ | జహీరాబాద్ | ,, | చాగలేటి అంతప్ప | ,, | 45 | ,, | — | — |
| | | | | కె. విశ్వనాథం | | | (వివరాలుఇవ్వలేదు) | | |
| తె. 20 | జోగిపేట | అంధోల్ | ,, | గుజ్జరి జోగయ్య | ,, | 50 | ,, | — | — |
| | (డాకూరు) | | | రంగపేట మల్లయ్య | కురమ | 35 | గొర్రెలకాపు | గొంగడినేత | — |
| తె. 21 | సిద్దిపేట | సిద్దిపేట | ,, | బూర వీరయ్య | పద్మశాలి | 65 | చేనేత | — | కొద్దిపాటి |
| | | | | వడ్డేపల్లి బాలకిష్టయ్య | ,, | 55 | పట్టునేత | — | — |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తె. 22 | నారాయణఖేడ్ | నారాయణఖేడ్ | ,, | మంతిరి హనుమయ్య | ,, | 55 | చేనేత | — | — |
| | | | | లడ్డి గుండన | కురమ | 45 | గొంగడినేత | మందకాయటం | — |
| తె. 23 | పిట్లం | బన్సువాడ | నిజామాబాద్ | అన్నరామలింగం | పద్మశాలి | 58 | చేనేత | వ్యవసాయం | — |
| తె. 24 | ఆర్మూరు | ఆర్మూరు | ,, | బ్రహ్మదండి పోతయ్య | ,, | 54 | ,, | — | కొద్దిపాటి |
| | | | | జక్కుల బాజన్న | దేవాంగులు | 60 | ,, | వ్యవసాయం | ,, |
| తె. 25 | దోమకొండ | కామారెడ్డి | ,, | వల్లకాటి రామలింగం | పద్మశాలి | 45 | ,, | — | — |
| | | | | పెద్దోల ఆగన్న | కురమ | 60 | గొంగడినేత | మందకాయటం | — |
| | | | | పనాస చిన్నరామయ్య | పరికె | 52 | గోనెపట్టానేత | వ్యవసాయం | — |
| తె. 26 | కరీంనగర్ | కరీంనగర్ | కరీంనగర్ | లింగన్న | కురమ | 52 | గొంగడినేత | కూలిపని | — |
| | | | | శ్రీపతి మల్లయ్య | పద్మశాలి | 75 | చేనేత | ఉద్యోగం | — |
| తె. 27 | జగత్యాల | జగత్యాల | కరీంనగర్ | సిరిపురి బక్కయ్య | పద్మశాలి | 60 | చేనేత | — | — |
| | | | | పుల్ల ఆశాలు | కురమ | 55 | గొంగళ్ళనేత | కైకిలి (కూలి) | — |
| | | | | గుండేటి మల్లయ్య | పద్మశాలి | 65 | నవారునేత | — | — |
| తె. 28 | మెట్టుపల్లి | మెట్టుపల్లి | ,, | శ్రీకోట సాయన్న | కురమ | 51 | గొంగళ్ళనేత | కూలిపని | — |
| | | | | జోగ గంగారాం | పద్మశాలి | 60 | చేనేత | — | — |
| తె. 29 | నిర్మల్ | నిర్మల్ | ఆదిలాబాద్ | రాజుల కర్రెన్న | ,, | 65 | చేనేత (ఖద్దరు) | — | — |
| తె. 30 | లక్షట్టిపేట | లక్షట్టిపేట | ,, | పురండ్ల రాజం | ,, | 65 | ,, | — | — |
| తె. 31 | చెన్నూరు | చెన్నూరు | ,, | గుండేటి అప్పయ్య | ,, | 50 | ,, | — | — |
| | | | | బండారు చంద్రయ్య | ,, | 40 | ,, | — | — |
| తె. 32 | దసనాపురం | ఆసిఫాబాద్ | ,, | పొన్న మల్లయ్య | ,, | 70 | ,, | — | — |
| | | | | పొన్న సాంబయ్య | ,, | 50 | ,, | — | కొద్దిపాటి |
| తె. 33 | ఆదిలాబాద్ | ఆదిలాబాద్ | ,, | బంగి మల్లయ్య | ,, | 50 | ,, | — | — |
| రా. 1 | నారాయణవనం | పుత్తూరు | చిత్తూరు | ఆదెం చెంచయ్య | ,, | 60 | ,, | — | 3 వ తరగతి |
| రా. 2 | చిత్తూరు | చిత్తూరు | ,, | శ్రీరాములుసెట్టి | ,, | 40 | ,, | — | — |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రా. 3 | కుప్పం | కుప్పం | ,, | పేటాల నంజుండప్ప | దేవాంగులు | 50 | చేనేత | — | — |
| రా. 4 | బాలేపల్లి | మదనపల్లి | ,, | భోజనపు నారాయణ | తొగటచెట్టి | 41 | ,, | — | — |
| రా. 5 | చీనేపల్లి | వాయలపాడు | ,, | శరం సుబ్బయ్య | దేవాంగులు | 70 | ,, | — | 3 వ తరగతి |
| రా. 6 | దిగువఅబ్బవరం | రాయచోటి | కడప | బొల్లు వెంకట్రామయ్య | తొగట | 50 | ,, | వ్యవసాయం | — |
| రా. 7 | పుల్లంపేట | రాజంపేట | కడప | నూకల నారప్పగారి సుబ్బయ్య | పద్మశాలి | 63 | ,, | — | — |
| రా. 8 | మాధవరం | సిద్ధవటం | ,, | బోడగల వెంకటసుబ్బయ్య | ,, | 60 | ,, | — | 5 వ తరగతి |
| రా. 9 | చింతకొమ్మదిన్నె | కాజీపేట | ,, | పొట్టపేగుల వెంకటపతి | తొగట | 50 | ,, | — | — |
| రా. 10 | పోరుమామిళ్ళ | బద్వేలు | ,, | ఆవారు చిన్నపోలయ్య | పద్మశాలి | 64 | ,, | — | 4 వ తరగతి |
| రా. 11 | సింహాద్రిపురం | పులివెందుల | ,, | చింతా నారాయణ | తొగట | 60 | నవారునేత | — | — |
| రా. 12 | జమ్మలమడుగు | జమ్మలమడుగు | ,, | బడిగించెల నారాయణ | ,, | 55 | చేనేత | — | — |
| రా. 13 | తాడిపత్రి | తాడిపత్రి | అనంతపురం | జింకా పెద్దరంగప్ప | పద్మశాలి | 60 | ,, | — | — |
| రా. 14 | ధర్మవరం | ధర్మవరం | ,, | సపారు నాగప్ప | పట్టుసాలి | 65 | ,, | — | — |
| రా. 15 | ముదిరెడ్డిపల్లి | హిందూపురం | ,, | పల్లా నరసప్ప | తొగట | 72 | పట్టునేత | — | — |
| రా. 16 | కల్యాణదుర్గం | కల్యాణదుర్గం | ,, | కంఠె హనుమంతప్ప | తొగట | 68 | చేనేత | అంగడి | 5 వ తరగతి |
| రా. 17 | ఉరవకొండ | ఉరవకొండ | ,, | బెల్దోన్ ముద్దప్ప | ,, | 64 | ,, | — | — |
| రా. 18 | పత్తికొండ | పత్తికొండ | కర్నూలు | పుట్లూరు నారాయణప్ప | ,, | 53 | ,, | — | 5 వ తరగతి |
| రా. 19 | నూనెపల్లి | నంద్యాల | ,, | లంకె పేతూరు | క్రిస్టియన్ | 80 | ,, | కాపుదనం | — |
| రా | 19A సంబవరం | ఆళ్లగడ్డ | ,, | పొబ్బత్తి పెద్దసీరన్న | మాల | 55 | ,, | కూలిపని | — |
| రా. | 19B జూలెపల్లి | సిరివెళ్ళ | ,, | రెడ్డి సంజీవరాయుడు | దేవాంగులు | 55 | ,, | వ్యవసాయం | 5 వ తరగతి |
| రా. 20 | క్రిస్టంసెట్టిపల్లి | గిద్దలూరు | ,, | ఉక్కడపు వెంకటస్వామి | పద్మసాలి | 56 | ,, | — | 3 వ తరగతి |
| రా. 21 | ఎర్రగొండపాలెం | మార్కాపురం | కర్నూలు | గుంటి నాగయ్య | మాల | 50 | చేనేత | కూలిపని | — |
| రా. 22 | ఆత్మకూరు | నందికొట్కూరు | ,, | పులిపాటి లింగయ్య | పద్మశాలి | 53 | ,, | — | 2 వ తరగతి |
| రా. 23 | కర్నూలు | కర్నూలు | ,, | మాదం శీనన్న | తొగట | 56 | ,, | — | 6 వ తరగతి |
| రా. 24 | ఎమ్మిగనూరు | ఆదోని | ,, | పోలి ముసలప్ప | పద్మశాలి | 55 | ,, | — | — |


ఒరిస్సా రాష్ట్రం
మధ్యప్రదేశం
మహారాష్ట్రం
మైసూరు రాష్ట్రం
తమిళనాడు
బంగాళాఖాతం
కిలో మీటర్లు
మైళ్ళు
ప్రాంతపు సీమ (కొస్తా, తెలంగాణా, రాయలసీమ)
రాష్ట్రపు సరిహద్దు
జిల్లా సరిహద్దు
పదసంగ్రాహకులు పర్యటించిన ఊళ్ళు
ఆంధ్ర ప్రదేశం




పటం 1




పటం 5


ఒరిస్సా రాష్ట్రం
మధ్యప్రదేశం
మహారాష్ట్రం
బంగాళాఖాతం
మైసూరు రాష్ట్రం
తమిళనాడు
కిలోమీటర్లు 32 0 32 64 96
32 0 32 64
మైళ్ళు
డాలీ (ఉ. డాబ్, డాలి, డాబు, డాఖీ, డోలి)
పింజెర (ఉ. పింజర, పింజెరం, పింజెరి, పెంజెర)
పింజెన్
గిలక
టాపేటు (ఉ. టాపీటు, టాపెట్టు)
పేటుపెట్టె
నవిషీ పేటు
ఖిషను

పటం 6


కిలోమీటర్లు 32 0 32 64 96
32 0 32 64
మైళ్ళు
ఒరిస్సా రాష్ట్రం
బంగాళాఖాతం
మైసూరు రాష్ట్రం
తమిళనాడు
▲ దోనె (ఉ. దోని)
△ దోనిగ (ఉ. దోనిగ, దోనెగ)
దోనుగ (ఉ. దోనగ, దోనుగు, దోన్గ, దోన్గు)

పటం 7


ఒరిస్సా రాష్ట్రం
మహారాష్ట్రం
బంగాళాఖాతం
మైసూరు రాష్ట్రం
తమిళనాడు
కిలోమీటర్లు 32 0 32 64 96
మైళ్ళు 32 0 32 64
పన్నె (ఉ. పన్ని)
పని
పనె
పైన (ఉ. పయన, పైని, పైనె)

పటం 10


ఒరిస్సా రాష్ట్రం
మధ్య ప్రదేశం
మహారాష్ట్రం
కిలోమీటర్లు 32 0 32 64 96
32 0 32 64 మైళ్ళు
బంగాళాఖాతం
మైసూరు రాష్ట్రం
తమిళనాడు
ఆంధ్ర ప్రదేశ్
▲ పోగు
△ పోము
పోపు

పటం 11


ఒరిస్సా రాష్ట్రం
మహారాష్ట్రం
మధ్యప్రదేశం
బంగాళాఖాతం
మైసూరు రాష్ట్రం
తమిళనాడు
కిలోమీటర్లు 32 0 32 64 96
32 0 32 64
మైళ్ళు
రాట్నం
రాటం
రాట్టం
రాట్లం (ఉ. రోట్లం)
చెరకా

పటం 12

# ప్రధానసంకేతవివరణ

ఉ. = ఉచ్చారణభేదం (–భేదాలు)
కన్న. = కన్నడం
కో. = కోస్తాజిల్లా
క్రి. = క్రియాపదం
చూ. = చూడు
తమి. = తమిళం
తె. = తెలంగాణా
పర్యా. = పర్యాయపదం (–పదాలు)
రా. = రాయలసీమ
రూ. = రూపాంతరం (రూపాంతరాలు)
వి. = విశేష్యం
విణ. = విశేషణం
హిం. = హిందూస్తానీ
[ < > ] చారిత్రక నిష్పత్తి సూచనకు గుర్తు; మొనవైపున్నరూపం అర్వాచీనం (నిష్పన్నం) రెండో వైపున్నది ప్రాచీనం (మూలరూపం)

# వృత్తిపదకోశం 2

## అ

**అక్షింతలపేటు** ఉ. అక్షింతలప్లేటు. అంచులో నేసే ఒకరకం డిజైను. చూ. చిత్రం 146 (కో. 11).

**అగిటిఉన్ని** ఉ. అగిటిఉన్నె. ఉగాది వెళ్ళిన తరవాత ఆవిటి (=మృగశిరకార్తె ప్రారంభం)లో కత్తిరించిన ఉన్ని: ఇది తెలికగా ఉంటుంది (తె. 3).

**అగ్గిపెట్టెగడిచీర** నిప్పెట్టె మాదిరి గళ్ళుపడేట్టు నేసిన చీర (కో. 20; రా. 7).

**అంకాలమ్మచీర** బొద్దు(పోగు)లు పెట్టి నేసిన ఒక రకం నేతచీర (రా. 10).

**అంకెంగుడ్డ** కుంచెకట్టుబడిలో, కుంచెచెంపలు కుట్టిన పట్టా; చూ. కుంచెచెంప (కో. 34. 36).

**అంగవస్త్రం** ఉ. అంగత్రం; రూ. అంగాస్త్రం, అంగోస్త్రం(1); పర్యా. కొల్లాయిగుడ్డ, గావంచా. మగవాళ్ళు మోకాళ్ళ వరకూ కట్టుకొనే ఒక రకం చిన్న బట్ట: సన్నటిఅంచు పెట్టి 2-5 మూరల పొడుగున పలచగా నేస్తారు; కొన్నిచోట్ల, ముతకది; కొన్ని చోట్ల తువ్వాలు మాదిరిగా దీంతో ఒళ్ళు తుడుచుకొంటారు; కొందరు మడిగట్టుకోటానికి వాడతారు (కో. 22, 23, 31; తె. 6).

**అంగాస్త్రం** చూ. అంగవస్త్రం (కో. 18, 19, 21).

**అంగోచ** ఒకరకం తలపాగాగుడ్డ; ఎరుపులో తెల్లటి గీరలు పడేట్టు నేసింది (తె. 18).

**అంగోస్త్రం** ఉ. ఆంగోస్త్రం. **1.** చూ. అంగవస్త్రం (కో. 16, 20, 21, 24); **2.** మగవాళ్ళు పైన వేసుకొనే కండువా (=సెల్లా). (కో. 3, 17).

**అచ్చతుకు** (అచ్చు+అతుకు; క్రి.) పర్యా. పడుగతుకు, పాగడఅతుకు, వడిఅతుకు, సరిఅతుకు. బద్దె పోగులకు పడుగు పోగులు కలిపి వడిపెట్టటం (కో. 1-19, 21-37; తె. 1-15, 17, 18, 20-22, 26-33; రా. 1-13, 15-19, 21-24).

**అచ్చతుకుపుల్ల** ఉ. అచ్చతుకుపుల్లి; పర్యా. చూ. ఎత్తుపుల్ల. అచ్చతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండు పుల్లలకు తాడుగట్టి మడతమంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి, రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (కో. 5, 6; రా. 8-21).

**అచ్చీనె** (< అచ్చు+ఈనె) పర్యా. చూ. ఈనె (1). పన్నె కట్టుబడిలో, దంతెల మధ్య, దువ్వెన పండ్ల మాదిరిగా, వరసగా కట్టిన, కలప, జొన్న, గలుగు, వెదురు, కొండచీపురు మొ. వాటి పుల్ల(లు); కొన్ని చోట్ల, పట్టునేతకు ఇనుము, ఇత్తడి, ఉక్కు మొ. వాటి ఊచలు వాడతారు. చూ. చిత్రం 88క. 8 (కో. 37).

**అచ్చు 1.** (-అతుకు,-ఒగ్గు,-కట్టు,-కుట్టు,-కూర్చు,-కోయు,-పన్ను,-పన్నెయు,-పొందించు,-పొందేయు). పర్యా. రచ్, వడి (4). నేత నేసేటప్పుడు పడుగులో పై పోగులను కిందికీ కిందిపోగులను పైకీ జరపటానికి వీలుగా నాలుగు కర్రలకు వడిదారాలతో లంకెలు వేసిన పనిముట్టు; పన్నె గూళ్ళలో దూర్చిన పోగులు అచ్చువడుల కొలుకుల్లోకి ఎక్కిస్తారు; నేత నేసేటప్పుడు, ఒక పావుచెక్కను కాలితో తొక్కితే, అచ్చులో ఒక వైపు కిందికి దిగి, అనిపోగులు విచ్చుకొంటాయి. కాలు తియ్యగానే అచ్చు మామూలుగా వచ్చి అనిపోగులు మూసుకొంటాయి. చూ. చిత్రం. 100 (కో. 1-36; తె. 1-23, 25-33; రా. 1-24); **2.** నవారుమగ్గంలో, కర్రలకు వడిదారాలు అల్లిన పనిముట్టు; చూ. అచ్చు (1). చూ. చిత్రం 324 చ. 2 (తె. 6, 27); **3.** తివాసీ మగ్గంలో వడిదారం అల్లిన పనిముట్టు; చూ. అచ్చు (1). చూ. చిత్రం 320. 3 (తె. 10); **4.** (-పోయు) గొంగడి నేతలో పడుగు పైపోగులను, కిందిపోగులను విడదియ్యటానికి ఒక కర్రకు ఉన్ని పోగులు అల్లిన సాధనం. (తె. 10, 11, 22, 25-28); **5.** పర్యా. పన్నె (1). జొన్న, వెదురు, కలప, గలుగు మొ. వాటి ఈనెలు గాని, ఇత్తడి, ఇనుము, ఉక్కు మొ. వాటి ఊచలు గాని, దువ్వెనపండ్ల మాదిరిగా వరసగా బిగించిన ఒకరకం పనిముట్టు; అచ్చు కట్టేటప్పుడు, ఈనెల మధ్య సందుల్లో నుంచి బద్దెపోగులు దూరుస్తారు; నేత నేసేటప్పుడు, పడుగుపోగులు వీటిల్లోనుంచి వస్తాయి. చూ. చిత్రం 90 (కో. 37); **6.** చేత్తో డిజైన్లు అద్దే కొయ్యచెక్క. చూ. చిత్రం 283. 1 (కో. 7).

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు); కో. = కోస్తాజిల్లాలు; క్రి. = క్రియ; చూ. = చూడు; తె. = తెలంగాణా; పర్యా. = పర్యాయపదం (-పదాలు); రా. = రాయలసీమ; రూ. = రూపాంతరం (రూపాంతరాలు).

**అచ్చుకట్టు** (క్రి.) అచ్చుకట్టే జంత్రంమీద, కర్రలకు వడిదారాలుకట్టి అచ్చు తయారు చెయ్యటం; చూ. అచ్చు (1). (కో. 1-36; తె. 1-23, 25-33; రా. 1-24).

**అచ్చుకట్టుదారం** పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు, అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100. 5 (కో. 4).

**అచ్చుకట్టుబిళ్ళ** పర్యా. అచ్చుబిళ్ళ. అచ్చుకట్టేటప్పుడు వడిదారం చుట్టే కొయ్య; దీనికి చుట్టిన వడిదారం అచ్చుకర్రకు దూరుస్తారు. చూ. చిత్రాలు 92 క, చ. (కో. 19, 33).

**అచ్చుకట్టె** 1. పర్యా. చూ. అచ్చుకర్ర (1). అచ్చులో వడిదారం కట్టిన కర్ర; అచ్చుకట్టేటప్పుడు, దీన్ని జంత్రంకొయ్యలకు బిగిస్తారు; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; బోనచ్చుకు ఎనిమిది ఉంటాయి. చూ. చిత్రాలు 91 క. 7, 100.1, 121 క. 8 (తె. 9; రా. 4, 6, 9, 11-15, 19); 2. పర్యా. చూ. జంత్రం(పీట). అచ్చువడి కట్టటానికి అచ్చుకర్రలు బిగించే కొయ్య పనిముట్టు; రెండు అడ్డపట్టెలను మధ్య నిలువుపట్టెకు బిగించింది; అచ్చుకట్టేటప్పుడు, అడ్డపట్టె కొయ్యలకు అచ్చుకర్రలు కడతారు. చూ. చిత్రం 91 (రా. 18); 3. సవారుమగ్గంలో, వడిదారాలు అల్లిన కర్ర(లు). చూ. చిత్రం 324 క. 4 (తె. 6); 4. పర్యా. చూ. ఎత్తుపుల్ల (2) అచ్చతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండుపుల్లలకు తాడుగట్టి, మడత మంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (తె. 7, 9).

**అచ్చుకదురు** పర్యా. కదురు(6). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుబిళ్ళకు చేర్చే వడిదారంచుట్టే పుల్ల; మామూలుగా కట్టెపుల్ల; కొన్నిచోట్ల, ఇనపది; దీని బెజ్జంలో దూర్చిన దారం అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు; చూ. చిత్రం 92 క. 1 (తె. 15).

**అచ్చుకర** (-అతుకు) పర్యా. చూ. బద్దె (1). అచ్చతుక్కోటానికి, సుమారు బెత్తెకు వెడల్పువేసి, చివర జేనెడుపొడుగు దారాలు వదలిగుడ్డ; ఒకసారి నేత పూర్తిచేసిన తరవాత, అచ్చులో బద్దెకోసి మరొక పడుగుకు అతుకుతారు. చూ. చిత్రాలు 102. 2, 144. (రా. 21).

**అచ్చుకర్ర** ఉ. అచ్చుగర్ర. 1. పర్యా. అచ్చుకట్టె (1), అచ్చుకోడు, అచ్చుకోల(1), కట్టె (2), కర్ర (2), కోలకర్ర (2), బిగువుకర్ర, వడికోల, వడిగర్ర. అచ్చులో వడిదారం కట్టిన కర్ర; అచ్చుకట్టేటప్పుడు, దీన్ని జంత్రం కొయ్యలకు బిగిస్తారు; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; బోనచ్చుకు ఎనిమిది ఉంటాయి. చూ. చిత్రాలు 91 క. 7, 100.1, 121 క. 8 (కో. 1-13, 16-20, 22, 24-27, 29-36; తె. 5, 10-17; రా. 2-5, 7, 8, 10, 19-21); 2. పర్యా. అచ్చుకోల (2). సరిచేసిన ఉన్నిపడుగు మీద, లావుపాటి పోగులతో అనులువేస్తూ అల్లి, అచ్చుకట్టే కర్ర. చూ. చిత్రం 315 క. 7 (తె. 22); 3. పర్యా. చూ. ఎత్తుపుల్ల (2). అచ్చతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండు పుల్లలకు తాడుగట్టి మడతమంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (రా. 9); 4. లివాసీ మగ్గం అచ్చులో, వడిదారాలు అల్లిన కర్ర; ఇటువంటివి, రెండుంటాయి. చూ. చిత్రం 320.4 (తె.10.)

**అచ్చుకర్రు** నేతపడుగులో చివర లాక తరవాత దూర్చే వెదురుబద్ద (రా. 19 బి).

**అచ్చుకుట్టు** (క్రి.) అల్లుచేసేటప్పుడు అచ్చులో, అనిపోగు వెంబడి కమ్మి దూర్చటం (రా. 2).

**అచ్చుకొండి** అచ్చుగుది చివర వేసిన కొక్కెం. చూ. చిత్రం 127 (తె. 12).

**అచ్చుకొలికి** ఉ. అచ్చుకొలికె; పర్యా. చూ. కొలికి (3). అచ్చుకట్టేటప్పుడు, రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె; నేతనేసేటప్పుడు, పడుగు పోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ లంకెల్లో నుంచి బెంతుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (తె. 29; రా. 13).

**అచ్చుకోడు** పర్యా. అచ్చుకర్ర (1). అచ్చులో వడిదారం కట్టిన కర్ర; అచ్చుకట్టేటప్పుడు, దీన్ని జంత్రం కొయ్యలకు బిగిస్తారు; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; బోనచ్చుకు ఎనిమిది ఉంటాయి. చూ. చిత్రాలు 91 క. 7, 100.1, 121 క. 8. (రా. 16, 17, 24).

**అచ్చుకోయు** (క్రి.) పర్యా. బద్దెకోయు. అచ్చులో బద్దెపోగులుగాని, బెంతుపోగులుగాని వరసగా కొయ్యటం. అచ్చతికేటప్పుడు, పడుగులో అతుకులు సరిగా రావటానికి అచ్చుపోగుల కొసలు కత్తితో కోస్తారు; నేత అయిపోయిన తరవాత బద్దెపోగులు కొయ్యటం (కో. 11, 16, 18, 20, 21, 23, 28-31).

**అచ్చుకోల** ఉ. అచ్చుగోల. 1. పర్యా. చూ. అచ్చుకర్ర (1). అచ్చులో వడిదారం కట్టిన కర్ర; అచ్చుకట్టేటప్పుడు, దీన్ని జంత్రం కొయ్యలకు బిగిస్తారు; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; బోన

చ్చుకు ఎనిమిది ఉంటాయి. చూ. చిత్రాలు 91 క. 7, 100.1, 121 క. 8 (కో. 28; తె. 1, 2, 4, 6, 7, 18-30, 32, 33; రా. 18, 22, 23); **2.** పర్యా. చూ. అచ్చుకఱ్ఱ (2). సరిచేసిన ఉన్నిపడుగు మీద, లావుపాటి పోగులతో అనులువేస్తూ అల్లి, అచ్చుకట్టే కఱ్ఱ. చూ. చిత్రం 315 క. 7 (తె. 3, 9, 10, 11, 25-28).

**అచ్చుగట్టుదారం** పర్యా. చూ. పడి(దారం) (3). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుకఱ్ఱలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల మిషనుకీలు (=దారబ్బండి) దారం వాడతారు; మొదట అచ్చుబిళ్ళకు చుట్టి, తరవాత కఱ్ఱకు దూరుస్తారు; చూ. వసి (కో. 14).

**అచ్చుగట్టువాళ్ళు** ఉ. అచ్చుకట్టువాళ్ళు, అచ్చుకట్టోళ్లు, అచ్చుగట్టేల్లు, అచ్చుగట్టోల్లు; పర్యా. అచ్చుగట్లవాళ్ళు. మగ్గంలో అమర్చే అచ్చులు తయారుచేసే వాళ్ళు; తురకసాయబులు (రా. 9, 12, 19, 20).

**అచ్చుగట్లవాళ్లు** పర్యా. అచ్చుగట్టువాళ్ళు. మగ్గంలో అమర్చే అచ్చులు తయారుచేసేవాళ్ళు; తురకసాయబులు (తె. 1, 21, 28).

**అచ్చుగిరక** పర్యా. చూ. గిరక (6). మగ్గంమీద, అచ్చుగుదులు తగిలించే కొయ్యకప్పీ; దీన్ని మగ్గం పై దండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 11 (తె. 32).

**అచ్చుగుది** (బహు. అచ్చుగుదులు, అచ్చుగుదుళ్ళు). ఉ. అచ్చుగుతి. **1.** పర్యా. అచ్చుసూత్రం (1), గుది (3), వడిగుది, సూత్రం (దారం) (1). అచ్చుకఱ్ఱకు పైనకట్టిన దారం; సుమారు జేనెడు పొడుగుది; ఇటువంటివి, కఱ్ఱకు రెండేసి కడతారు; అచ్చును మగ్గానికి అమర్చటానికి వీటితో వేలాడదీస్తారు; కిందిగుదులు అడుగఱ్ఱల తాళ్ళకు కడతారు. చూ. చిత్రాలు 91 క. 8, 100.9, 100.11, 121 క. 10 (కో. 1-9, 12, 14, 17, 22-37; తె. 10, 11, 17, 20, 22, 25, 29, 32, 33; రా. 4, 10, 14, 16, 21, 23); **2.** పర్యా. అటుకోలగుది, అడుగఱ్ఱతాడు (2), అడుగుది, అడుగోలగుది, కిందిగుది, గుది (9), తానెకోలకట్టెతాడు, తానెగుదితాడు, నిలువుదారం (2), పూనుగఱ్ఱతాడు (2), మట్టుగఱ్ఱతాడు. మగ్గంలో, పూనుగఱ్ఱకు కట్టిన దారం; అచ్చులో కిందికఱ్ఱకు ఉండేది; ఇటువంటివి, కఱ్ఱకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (తె. 2, 6, 7, 10, 13, 18, 19, 22, 32); **3.** పర్యా. చూ. పావతాడు. పావుచెక్కనూ పూనుగఱ్ఱనూ కలిపే తాడు; ఇటువంటివి, కఱ్ఱకు రెండేసి ఉంటాయి, (తె. 31)

**అచ్చుగూటకట్టె** పర్యా. చూ. ఎత్తుపుల్ల (2). అచ్చుతికేటప్పుడు, అచ్చుకఱ్ఱలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు): రెండుపుల్లలకు తాడుగట్టి, మడతమంచం కోళ్ళమాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి చూ. చిత్రం 102 క. 1 (తె. 7).

**అచ్చుగూడు** పర్యా. చూ కొలికి (3). అచ్చుకట్టేటప్పుడు, రెండు అచ్చుకఱ్ఱల పడిదారాలకు వేసినలంకె; నేత నేసేటప్పుడు, పడుగుపోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ లంకెల్లోనుంచి బెంతుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (కో. 4, 6, 8, 10; తె. 11, 14, 16; రా. 18).

**అచ్చుచివర** ఉ. అచ్చుసివర; పర్యా. అచ్చుచువ్వ (2). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుపోగుల్లో అనివెంబడి పోగులు చెదరకుండా ఉండటానికి దూర్చిన సన్న బెత్తం; ఇటువంటివి రెండుంటాయి. (రా. 23).

**అచ్చుచివ్వ** ఉ. అచ్చుచివ, అచ్చుసివ. **1.** పర్యా. చూ. బద్దెగుచ్చుకఱ్ఱ. అచ్చుతికిన తరవాత, బద్దెలో పోగులు చెదరకుండా దూర్చిన సన్నబెత్తం; కొన్నిచోట్ల, వెదురుబద్దగాని, ఇనపకడ్డీగాని దూరుస్తారు; అల్లుచేసేటప్పుడు దీన్ని ఊడ్తెగుదులకు తగిలిస్తారు; కొన్నిచోట్ల గూటానికి కడతారు. చూ. చిత్రం 102 (కో. 32); **2.** పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం (=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్ల గుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల. ఇనపచువ్వగాని, వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 30, 32, 37).

**అచ్చుచువ్వ** ఉ. అచ్చుసువ్వ. **1.** పర్యా. అచ్చుపుల్ల (6). అచ్చునూరెం. దండె దగ్గర పోగులు నెరపటానికి, అచ్చుదగ్గర దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి దండెకు రెండు వైపులా ఉంటాయి; నేత అవుతున్నకొద్దీ, వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127. 3 (కో. 5, 9). **2.** పర్యా. అచ్చుచివర. అచ్చుకట్టేటప్పుడు, అనివెంబడి పోగులు చెదరకుండా దూర్చిన సన్నబెత్తం. ఇటువంటివి రెండుంటాయి. (కో. 5; తె. 15)

**అచ్చుచెమికె** పర్యా. చూ. చెమికె. పన్నెసందుల్లో నుంచి అవతలికి దూర్చన పోగుల్లో (బెంతుదారాలుగాని, బద్దెదారాలుగాని) అచ్చతకటానికి కోసిన కొసలు, లేక పాయ. చూ. చిత్రం 102 చ. 6 (తె. 30).

**అచ్చుతాడు** పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు, అచ్చుకఱ్ఱమీది మొలికల్లో దూర్చన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100. 5 (కో. 8).

**అచ్చుదండె** పర్యా. దండె (3). పన్నె కట్టుబడిలో

ఈనెల బిగింపు కోసం అడ్డంగా కట్టిన వెదురు బెత్తం; ఇటువంటివి, పైనా కిందా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (కో. 37).

**అచ్చుదారం 1.** పర్యా. చూ. కొండితాడు. అచ్చు కట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు, అచ్చుకర్ర మీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చు కదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100. 5 (రా. 1, 2, 4, 11, 13); **2.** పర్యా. చూ. వడిదారం (5). ఉన్ని పడుగు మీద అచ్చుకోలకు అనులువేస్తూ అల్లిన లావుపాటి పోగులు; మామూలు పోగులు ఏడేసి కలిపి పురిపెడతారు (తె. 9, 10).

**అచ్చుదిద్దకంతాడు** పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు. అచ్చుకర్ర మీది మెలికలో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురులో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (రా. 19 బి).

**అచ్చుపన్ను** (క్రి.) అచ్చుకట్టేటప్పుడు జంత్రానికిగాని, అచ్చతికేటప్పుడు ఎత్తుపుల్లలమీదగాని అచ్చును పెట్టటం; కొన్నిచోట్ల, నేలమీద పెట్టి అచ్చతుకుతారు (తె. 5. 15, 23, 26, 31, 33; తె. 13, 17, 31).

**అచ్చుపాయ** పర్యా. చూ. గుదిపాయ. అచ్చు వళ్ళలో అచ్చుకర్రకు గుది కట్టినచోట పాయగా చీలిన భాగం; ఇటువంటివి, మామూలుగా నాలుగు పాయ లుంటాయి; అచ్చు కట్టిన తరవాత గుదిపాయలు స్థిరంగా ఉండటానికి అచ్చుకర్ర మీద, కొమ్ముతో రుద్దుతారు (కో. 37).

**అచ్చుపుల్ల 1.** పర్యా. చూ. కదురు (6). అచ్చుకట్టేటప్పుడు, అచ్చు బిళ్ళకు చేర్చ వడిదారం చుట్టేపుల్ల; మామూలుగా, కట్టేది; కొన్నిచోట్ల, ఇనపది; దీని బెజ్జంలో దూర్చిన దారం అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు. చూ. చిత్రం 92 క. 1 (కో 26); **2.** అచ్చు బద్దెలో ఎక్కించిన సన్న బెత్తం; చూ. బద్దెచువ్వ (తె. 29); **3.** పర్యా వడిపుల్ల (2). అచ్చుకట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు, అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన సన్నపుల్ల; మామూలుగా, కొబ్బరిఈనె (కో. 1, 37): **4.** పర్యా. చూ. ఎత్తుపుల్ల (2). అచ్చతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండు పుల్లలకు తాడుగట్టి మడతమంచం కోళ్ళ మాదిరగా నిలబెడతారు ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (కో. 22, 24, రా. 1, 3, 20); **5.** పర్యా. చూ. అచ్చులాక. అచ్చుపోగుల్లో, అని వెంబడిపోగులు చెదరకుండా దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 102 చ. 6 (తె. 29); **6.** పర్యా. చూ. అచ్చుచువ్వ (1). దండెదగ్గర పడుగుపోగులు నెరపటానికి, అచ్చు దగ్గర దూర్చిన సన్న బెత్తం; ఇటువంటివి దండెకు రెండు వైపులా ఉంటాయి; నేత అవుతున్న కొద్దీ, వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127. 3 (తె. 21)

**అచ్చుపొట్టె** ఉ. అచ్చుపొట్టి; పర్యా. చూ. చెమికె. పన్నె సందుల్లోనుంచి దూర్చిన పోగుల్లో అచ్చతకటానికి కొసిన కొసలు. తేక పాయ. చూ. చిత్రం 102 చ. 6 (తె. 5).

**అచ్చుపోగు 1.** పన్నె సందులగుండా దూర్చి, అచ్చు వడిలోకి ఎక్కించినపోగు (రా. 11, 24); **2.** పర్యా. ఆడపోగు. అనుపోసేటప్పుడు, కిందినుంచి పొయ్యేపోగు (తె. 22, 25); **3.** పర్యా. చూ. వడిదారం (5). ఉన్ని పడుగుమీద అచ్చుకోలకు అనులువేస్తూ అల్లిన లావుపాటి పోగు(లు); మామూలుగా, ఏడేసి పోగులు కలిపి పురిపెడతారు (తె. 7, 22).

**అచ్చుపోయు** (క్రి.) సరిచేసిన ఉన్నిపడుగుమీద, అచ్చుకోలకు. లావుపాటి పోగులతో అనులువేస్తూ అల్లటం; అచ్చుకట్టడం; ప్రతిపడుగుకూ ఎప్పటికప్పుడు అచ్చు కట్టుకొంటారు (తె. 9. 11, 26-28).

**అచ్చుబద్ద** పర్యా. చూ. అచ్చులాక. అచ్చుపోగుల్లో అని వెంబడి పోగులు చెదరకుండా దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 102 చ. 6 (కో. 11)

**అచ్చుబద్దె** పర్యా. చూ. బద్దె (1). అచ్చతుక్కోటానికి. సుమారు బెత్తెడు వెడల్పునేసి చివర జానెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తి చేసిన తరవాత, అచ్చులో బద్దెకొని మరొక పడుగుకు అతుకుతారు. చూ. చిత్రాలు 102.2, 144 (తె.1.30)

**అచ్చుబిళ్ళ** ఉ. అచ్చుబిల్ల; పర్యా. అచ్చుకట్టు బిళ్ళ, కట్టుబిళ్ళ, చేంచె, జంత్రపుబిళ్ళ, దంత్రంపుల్ల, బిళ్ళ (10). బెంతి, వడిబిళ్ళ (2). అచ్చుకట్టేటప్పుడు, వడిదారం చుట్టేకొయ్య; దీనికి చుట్టిన వడిదారం, అచ్చు కర్రకు దూరుస్తారు. చూ. చిత్రం 92క. చ. (కో.1-7, 10-13, 15-17, 20, 21, 26, 27, 31, 35, 37; తె. 4 5, 13, 15; రా. 11, 13, 15, 18, 24).

**అచ్చురి** (< అచ్చు + ఉరి); పర్యా. చూ. కొలికి (3). అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన కలంకె, నేతనేసేటప్పుడు పడుగుపోగులను పైకి లేపటానికి. కిందికి దింపటానికి, లంకెలో నుంచి బెంతుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం. 100.3 (కో. 32).

**అచ్చురేవు(లు)** నేతనేసేటప్పుడు, అచ్చువడుల్లో పడుగుపోగులు జరగేభాగం (రా. 13, 17, 17, 18, 24).

**అచ్చులాక** పర్యా. అచ్చుపుల్ల (5), అచ్చుబద్ద, అనికట్టె (1), అనికర్ర (1), అనిలాక (2). అచ్చు పోగుల్లో, అనివెంబడి పోగులు చెదరకుండా దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 102 చ. 6 (తె. 18, 23).

**అచ్చువడి** (-కట్టు) ఉ. అచ్చడి, అచ్చోడి; పర్యా. చూ. వడి (5). అచ్చుకట్టేటప్పుడు. రెండు అచ్చుకర్రలకు కట్టిన పురిదారానికి. లంకెపడేట్టు వేసిన అల్లిక; నేత నేసేటప్పుడు అనిపోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి పనికివస్తుంది. చూ. చిత్రం 100.2 (కో. 1-6, 9-12, 25-34 36; తె. 9. 11. 12. 15. 19. 20, 22. 26-28, 33; రా. 13, 14, 21, 22, 24).

**అచ్చుసుబిరె 1.** చూ. అచ్చుసూరె (తె.23); **2.** నేత అయిన తరువాత, అచ్చుబద్దె పోగుల్లో దూర్చిన సన్న బెత్తం (= సుబిరె). (తె. 20).

**అచ్చుసూత్రం** ఉ. అచ్చుసూత్త్రం. **1.** పర్యా. చూ. అచ్చుగుది (1). అచ్చుకర్రకు పైన కట్టినదారం; సుమారు జానెడు పొడుగుది; ఇటువంటివి, కర్రకు రెండేసి కడతారు; అచ్చును మగ్గానికి అమర్చటానికి వీటితో వేలాడదీస్తారు; కిందిగుదులు అడుగర్రల తాళ్ళకు కడతారు. చూ. చిత్రాలు 91 క. 8, 100.9, 100. 11, 121 క. 10 (తె. 2, 6, 19-21); **2.** పర్యా. కోతికట్టె తాడు, కోతితాడు, కోతిదారం, కోతిసూత్రం, చిట్టె సూత్రం, పుల్లదారం, పడిసూత్రం, సూత్రం, సూత్రం తాడు, సూత్రందారం (2). అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు; దీనికి కొన్నిచోట్ల, కోతిపుల్ల కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 గ. 1 (తె. 2, 6, 20, 21, 25, 29, 32, 33).

**అచ్చుసూరె** రూ. అచ్చుసుబిరె (1); పర్యా. చూ. అచ్చుచువ్వ (1). దండెదగ్గర పడుగుపోగులు నెరవటానికి, అచ్చుదగ్గర దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి. దండెకు రెండు వైపులా ఉంటాయి; నేత అవుతున్న కొద్దీ, వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127.3 (తె. 10).

**అజంతా** గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు (కో. 12; తె. 26).

**అంచ** (-పట్టు) చూ. అంచు (కో. 7, 34, 37; తె. 15 25; రా. 18).

**అంచగీరుడు నేత** దోనెనుంచి పన్నెవరకూ నేసిన నేత (రా. 8).

**అంచగుదిపాయ(లు)** పర్యా. కడగుదిపాయ, చిన్న గుదిపాయ, వారుగుదిపాయ. అచ్చుగుదిపాయల్లో చివరది; ఇటువంటివి కుడివైపున, ఎడమవైపున రెండుంటాయి. చూ. చిత్రాలు 100.6, 100.8 (కో. 3; రా. 8, 20).

**అంచగుప్పినేత** పర్యా. చూ. కుప్పడంనేత. అంచులో వేరే రంగు పేకదారాలు పెట్టి, డిజైన్లు, పువ్వులు, మొగ్గలు, ఆకులు మొ.వి పడేట్టు నేసే నేత; అంచులకు వేరుగా రెండు నాడెలు, మధ్యభాగానికి మరొక నాడె, పెట్టి చేతిమగ్గంమీద నేస్తారు; కొన్నిచోట్ల, జరిపోగులు కలుపుతారు; ఈ నేతకు ఎడమవైపున మరొక మనిషి కూర్చొని అంచుపోగులు మలపాలి (కో. 22 23).

**అంచ(న)పట్టు** (క్రి.) కుప్పడంనేతలో అంచు పడుగు వరకు వేరే రంగు పేకపోగులు మార్చి నెయ్యటం (తె. 5, 15).

**అంచనాడె** చూ. అంచునాడె (తె. 16).

**అంచపొగడ** (-అతుకు) నేతలో అంచులకు పెట్టే పడుగునూలు (రా. 11).

**అంచపేటు** అంచులో నేసిన డిజైను (రా. 12).

**అంచపోగులకుంచె** నరిచేసేటప్పుడు, పడుగులో చివరి అంచుదారాలు దువ్వే కుంచె; సుమారు రెండు జేనల పొడుగు ఉంటుంది; దీంతో, ఆరుబయటులో ఉన్న పడుగుమీద గంజికూడా చిలకరిస్తారు; చూ. అలుకుంచె. చూ. చిత్రం 79 (కో. 8).

**అంచలచక్కి** ఉ. అంచలసక్కి. నేతపడుగు పక్క భాగం (= అంచు) లో అతికే పోగులు (తె. 11).

**అంచలు** అంచు నేతకు వాడే దారాలు; పడుగులో అతికినవి; వీటిని, వేరే పుల్లలకు చుట్టి పెట్టుకొంటారు (కో. 8; రా. 24).

**అంచు** రూ. అంచ. నేతబట్ట పొడుగు వైపుకొన; మామూలుగా, ఒకరంగు పడుగుకు, మరొక రంగు దారాలు (కొన్నిచోట్ల, జరి పట్టు మొ.వి) అంచుగా పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, దీంట్లో గీరలు, పువ్వులు, ఆకులు గళ్ళు మొ. నమూనాలు నేస్తారు (కో; తె; రా).

**అంచుకోపు** పర్యా. చూ. లోఅంచు. అంచులో పడుగు వైపు భాగం. చూ. చిత్రం 148.1 (రా. 11).

**అంచుగడి** అంచులో నేసిన గడి; పదిహేను కొలుకుల జమిలి పోగులు బెత్తెడు వెడల్పున నేసి పన్నెండు లాకల జరితో గళ్లు నేస్తారు. (కో. 2).

**అంచుచెక్క(లు)** అద్దకంలో, అంచులకు వేరే రంగు అంటకుండా బిగించిన కొయ్యచెక్క(లు); అంచులు వీటిలో బిగించి, మిగిలిన భాగం రంగులో ముంచుతారు; డేచెక్క. చూ. చిత్రం 283 జ. 1 (కో. 7).

**అంచుఝాలు** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి చేతి మగ్గంపడుగుమీద వంతెన మాదిరిగా కట్టిన లావు దారాలు; చూ. అడ్డబేలు (తె. 2).

**అంచునాడె** రూ. అంచనాడె, అంచులాడె. పర్యా.

సాల్నా డె. అంచునేతకు ప్రత్యేకంగా వాడే కొమ్ము నాడె; చిన్నది. చూ. చిత్రం 131 ట (తె. 21).

**అంచునేత** పడుగు అంచులకు డిజైన్లు వచ్చేటట్టు నేసిన నేత (రా. 14-17, 23, 24).

**అంచుపడుగు** అంచునేతకు ప్రత్యేకంగా వాడే పడుగునూలు; సుమారు రెండున్నర గుల్లె లుంటుంది; గుల్లె 80 పోగులు (కో. 36).

**అంచుపొగడ** ఉ. అంచుపొగడి. అల్లుచేసే పడుగులో, అంచుల్లో కలిపే నూలు; సరచేసింది (కో. 7).

**అంచుపోగు** (-అతుకు) నేతలో పడుగుకు పక్కభాగంలో అతికిన పోగు (రా. 2).

**అంచుబుటా** అంచులో నేసిన చిన్న డిజైను(కో. 11)

**అంచుబుటాచీర** అంచులో డిజైన్లు (=బుటాలు) నేసిన చీర (కో. 11).

**అంచుమలుపునేత** పర్యా. చూ. కుప్పడంనేత. అంచుల్లో వేరేరంగు పేకదారాలు పెట్టి డిజైన్లు, పువ్వులు, మొగ్గలు, ఆకులు మొ.వి పడేట్టు నేసేనేత; అంచులకు వేరుగా రెండు నాడెలు, మధ్యభాగానికి మరొక నాడె పెట్టి చేతిమగ్గం మీద నేస్తారు; కొన్ని చోట్ల, జరిపోగులు కలుపుతారు; ఈనేతకు, ఎడమ వైపున మరొక మనిషి కూర్చొని అంచుపోగులు మలపాలి (కో. 20, 21).

**అంచులాడె** చూ. అంచునాడె (తె. 2).

**అంచువాయి** మగ్గంమీద చూపిన పడుగులో, నడిమి పాయనుంచి కుడివైపు (కో. 34).

**అంజలి** లేతనీలిరంగు; తార అనీ అంటారు. చూ. చిత్రం 288 (కో. 3).

**అటకర్ వాళ్ళు** దేవాంగులు; నేతపనిచేసే వాళ్ళలో ఒక తెగ (తె. 7).

**అటుకోలకర్ర** ఉ. అటుగోలకర్ర, అట్కోలుకర్ర; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగున్నా, అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రలతాళ్ళూ, మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 23, 26, 29, 35, 36).

**అటుకోలగుది** పర్యా. చూ. అచ్చుగుది(2). మగ్గంలో పూనుగర్రకు కట్టిన దారం; అచ్చులో కింది కర్రకు ఉండేది; ఇటువంటివి కర్రకురెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121క. 6 (కో. 35).

**అటేరన్** వడికిననూలు చిలపలుగా చుట్టే కొయ్యపనిముట్టు; సుమారు ఒక అడుగు పొడుగుంటుంది. చూ చిత్రం. 37 (తె. 28).

**అట్టిగుది** పర్యా. చూ. నరిమట్టుగుది. నరిగుంజల అడ్డపట్టెకు వేసినతాడు; మామూలుగా, ఇటువంటివి రెండుంటాయి; వీటికి పడుగేరు కర్రతగిలిస్తారు; చూ. చిత్రం 65ట. 1 (తె. 23).

**అతార** నేతబయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి, నిలువురాటలకు అడ్డంగా మంచెమాదిరిగా బిగించిన కర్రలు; మగ్గంగుంటకు పైన ఎత్తుగా వేస్తారు. చూ. చిత్రం 116 (కో. 12.)

**అడ 1.** రూ. అడి; పర్యా. దడి. నేతలో డిజైన్లు పడటంకోసం, డాబీకోలలకు కట్టిన దారాలు. చూ. చిత్రం 132 క. 5 (కో. 6, 7, 10, 24; రా. 7, 8); **2.** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి, మగ్గానికి పైన అమర్చిన దొడ్డినించి కిందికి వేలాడే లావుదారాలు. చూ. చిత్రం 134 చ. 5 (కో. 34, 37).

**అడకపేటు** ఉ. అటకపేటు, అట్కపేటు; రూ. అడికిపేటు; పర్యా. బత్తీస్‌పేటు, బద్దపేటు. ఒకరకం హారంలో బిళ్ళ(=అడక) మాదిరి డిజైను; చీర అంచుల్లో నేస్తారు. చూ. చిత్రం 155 (తె.5, 12,13).

**అడగుదులు** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి, మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో, అడకుచ్చునుంచి కిందికి వేలాడేతాళ్ళు. చూ. చిత్రం 134 చ. 5 (కో. 24, 34, 37).

**అడచెక్క** ఒకరకం డిజైను వేసుకోటానికి నూలు చుట్టే కొయ్యపనిముట్టు; మేకులు బిగించింది. చూ. చిత్రం 287 (కో. 7).

**అడతాడు 1.** పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీఅడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసిన దారం; డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు; చూ. చిత్రం. 132 చ. 10 (కో. 6, 7); **2.** మగ్గానికి బిగించిన పడుగులో, ధూర్చిన పెద్దలాకలు జారిపోకుండా, అడ్డంగా కట్టినదారం (రా. 1).

**అడదొడ్డి** పర్యా. చూ. బొట్లపింజర. ఒకరకం డాబీ; దిండుకు బొడిపెలు చేసింది; దిండు తిరిగినప్పుడు బొడిపెలు కోలలను పైకి లేపుతాయి (కో. 26).

**అడనిచ్చెన** పర్యా. చూ. పేటుపన్నె. పేటుదారాలు దూర్చి రెండు పాయలుగా విడదీసిన చిన్న పన్నె; డాబీఅడకు కొంచెం కిందగా అమరుస్తారు. చూ. చిత్రం 132 చ. 8 (కో. 24).

**అడపన్నె** పర్యా. చూ. పేటుపన్నె. పేటుదారాలు దూర్చి రెండుపాయలుగా విడదీసిన చిన్న పన్నె డాబీఅడకు కొంచెం కిందగా అమరుస్తారు. చూ. చిత్రం 132 చ. 8 (కో. 7).

**అడపూత** డాబీ మగ్గంమీద, పేటుఅడ కట్టి, నేసిన డిజైను (కో. 2.)

**అడబల్ల** పర్యా. చూ. పేటుపలక. చేతిమగ్గం మీద డిజైన్లు నేసేటప్పుడు, అని తొక్కగా లేచిన పోగులను నిలిపి ఉంచటానికి పడుగులో గాని అడ్డపేలులో గాని దూర్చే చెక్క. చూ. చిత్రం 136 క. 2 (కో. 24).

**అడమగ్గం** డిజైన్లు నెయ్యటానికి పేటుదారాలు కట్టిన ఒకరకం మగ్గం. చూ. చిత్రం 114 (కో. 12).

**అడవడి** పేటుదారాల నుంచి, అంచుపడుగులోకి వేలాడే వడిదారాలు; చూ. వడి (కో. 24).

**అడవాల్లు** పర్యా. చూ. వాయిదారి. మగ్గందోనెకు దండెకు మధ్యభాగం (కో. 37).

**అడసూత్రాలు** మగ్గండాబీనించి కిందికి వేలాడే లావుదారాలు; పేటుదారాలు. చూ. చిత్రం 132 చ. 10 (కో. 25; తె. 31).

**అడి** చూ. అడ (1). (రా. 12).

**అడితి** ఉ. అడ్డి; పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య, నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118. 9 (తె. 10-12).

**అడియార్‌కొంగు** ఒకరకం చీరకొంగు; బెత్తెడు వెడల్పు పట్టె, రెండుపక్కలా జరీగీరలు పెట్టి నేస్తారు (రా. 14).

**అడిచీర** పెద్దఅంచు పెట్టి నేసిన ఒకరకం చీర (రా. 14).

**అడుగు** అంచు డిజైనులో మొగ్గ, పిందె మొ. వాటికి ఊనికగా కనబడేట్టు కింద నేసిన నమూనా. చూ. చిత్రం 156 (తె. 13).

**అడుగుగుండు** ఉ. అడుగ్గుండు. **1.** పర్యా చూ. పానుపుపట్టె. మరమగ్గంలో, పన్నె బిగించిన కింది కొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండుచివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 1; రా. 1); **2.** పర్యా. చూ. గుండు (4). చేతిమగ్గంపన్నె బిగించిన కిందికొయ్య; రోకలిమాదిరిగా, గుండ్రంగా ఉంటుంది; దీన్ని పలక సీలలతో పై పలకకు బిగిస్తారు. చూ. చిత్రం 109 చ. 7 (రా. 1).

**అడుగుపట్టె** ఉ. అడుగుపట్టి; పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు, దీనిమీద నాడె ఆడుతుంది. దీనికి రెండుచివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం. 118.9 (రా. 11, 17, 22, 23).

**అడుగుపీట** **1.** ఉ. అడుగుపీటె; పర్యా. చూ. పీట (2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (తె. 5, 27, 28; రా. 15); **2.** గిరక పంటె (= ఒకరకం రాటె) కింద నాగవాసం బిగించిన కొయ్యమొద్దు (తె. 17); **3.** పర్యా. చూ. పానుపు పట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (రా. 15).

**అడుగుబల్ల** పర్యా. చూ. పీట (2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (కో. 32).

**అడ్డ** **1.** పర్యా. చూ. అడ్డపీట (1). పత్తిరాట్నం కింది పీట. చూ. చిత్రం 1.2 (కో. 3, 8, 14; తె. 4, 16); **2.** పర్యా. చూ. పీట (2). రాట్నం నిలువులు బిగించిన పీట. చూ. చిత్రం 15 క. 1 (కో. 3, 8, 9, 14; తె. 13 16; రా. 21). **3.** పర్యా. చూ. దిండు (1). రాట్నం రెండుచెక్రాల (ఆకుల)నూ వేరుచేసే కొయ్య. ఇరుసు దీనిమధ్య ఉంటుంది. చూ. చిత్రం 15 క. 5 (కో. 11 13-16 22-37); **4.** పర్యా. చూ. పీట (5). దబ్బారాట్నం నిలువులు బిగించిన కింది పీట. చూ. చిత్రం 41 క. 1 (కో. 6 10); **5.** పర్యా. చూ. దిండు (3). దబ్బాలరాట్నం చెక్రం ఆకుల మధ్య, బిగింపుకు అమర్చిన కొయ్య. చూ. చిత్రం 41ట. 1 (కో. 21, 25-28, 35); **6.** పర్యా. చూ. గొట్టం (2). రాటె ఆకులు బిగించిన వెదురుగొట్టం; దీన్ని నూలానికి మార్చి రాటె తిప్పుతారు. చూ. చిత్రం 31 త. 1 (కో. 34); **7.** పర్యా. చూ. అను పీట. అనుకొయ్య(= అనుకు బిగించిన నిలువు పుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె(లు); ఇటువంటివి మామూలుగా మూడు. కొన్నిచోట్ల రెండు ఉంటాయి, చూ. చిత్రం 45 క. 1-3 (కో. 6,9; తె. 12-14); **8.** కుంటిపుల్ల (= అనుపోసేటప్పుడు పోగు సాపుగా రావటానికి నిలబెట్టిన పుల్ల)కు ఆధారంగా ముక్కుకు బిగించిన గొట్టం. చూ. చిత్రం 49. 2 (కో. 34); **9.** పర్యా. చూ. ఊత్తెదండె. ఊత్తె పై పైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (తె. 5, 7, 13, 18, 19, 22; రా. 15); **10.** పర్యా. చూ. దిండు (7). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు; బోట్ల పింజెర దిండుకు బొడికెలు, తొల్లపింజెర దిండుకు గాళ్లూ ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు (దీనికి గొలుసు తగిలిస్తారు); కొన్నిచోట్ల దీనికి చివర ఇనప ఊచలచెక్రంగాని, (రేకు)పళ్ళచెక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (కో. 25, 33, 36; తె.

18-20, 22, 25); **11.** పర్యా. చూ. అడ్డపట్టె (14). మరమగ్గం చట్రంలో, మేరువుపలకకు కిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు కడతారు. చూ. చిత్రం 118 క. 2. (కో. 1); **12.** పర్యా. కానికట్టె. కానిగుంజకు అమర్చిన అడ్డకట్టె; తడిపిన నూలు లడీలు దీనికి తగిలించి కర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 2 (తె. 13); **13.** అడ్డ కొంగుపట్టె కొయ్యలకు ఆధారంగాఉండే పొడుగుపట్టె. చూ. చిత్రం 286 చ (తె. 17).

**అడ్డకట్టుపంచె** పర్యా. చూ. లుంగీ(1). మగవాళ్ళు నడుముకు చుట్టుకొనేబట్ట; 2-4గజాల పొడుగు నేస్తారు; మామూలుగా, తెలుపులో నేసి, రంగులో అంచులు. కమ్ములు పెడతారు; కొన్నిచోట్ల, రంగుల్లోను, డిజైన్లలోను గళ్ళలోను, గీరల్లోను నేస్తారు (కో. 3).

**అడ్డకట్టె** **1.** పర్యా. చూ. అడ్డాకు(లు). పట్టుదారం చుట్టే డోలక కట్టుబడిలో ఇరుసుకు బిగించిన పొడుగాటి కొయ్యపట్టె(లు); వీటిమీద పోగు తిరుగుతుంది. చూ. చిత్రం 293 క. 3 (తె. 5); **2.** పర్యా. చూ. బెజ్జంకట్టె. రాటీనూలం దూర్చిన కట్టె; పైనగాని, కిందగాని ఉంటుంది. చూ. చిత్రం. 31 ప. 3 (తె. 7, 22, 23); **3.** రాట్నం నిలువులు బిగించిన పీట. చూ. చిత్రం 15 క. 1 (తె. 8); **4.** పర్యా. అడ్డపట్టె (4), దూపిరి (2), పట్టెపీట, పీట (7), మొద్దు (4). అడ్డ గుమ్మి కిందిపీట: దీనికి నిలువులు బిగిస్తారు. చూ. చిత్రం 34.1 (తె. 21, 25-27); **5.** పట్టుదారం వడకటానికి. పెద్దరాట్నానికి దగ్గరగా గాజులకట్టెను, కదుర్లపీటను అమర్చటానికి ఆధారంగా గుంజలకు వేసిన కొయ్యపట్టె. చూ. చిత్రం 293 చ. 15 (తె. 5); **6.** అసుకొయ్య (=అసుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె(లు); ఇటువంటివి. మామూలుగా మూడు; కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (తె. 1); **7.** పర్యా. చూ. ఊడైదండె. ఊడై పైవైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (తె. 7. 18, 19, 22; రా. 15); **8.** పర్యా. చూ. సరిమట్టుబడితె. సరిగుంజల పైవైపున అడ్డంగా కట్టిన కట్టె. చూ. చిత్రం 65 క. 1 (రా. 17; 24); **9.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకుపైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర మేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం. 118.3 (తె. 26); **10.** పర్యా. అడ్డకర్ర (4), అడ్డకొయ్య (3), అడ్డగుంజ, అడ్డపట్టె(21), ఇరువులకట్టె, చెముకట్టు(1), బెండు(2), మగ్గంబడితె (1), లాటుపట్టె. నేతబయలులో మరమగ్గం నిలబెట్టటానికి, నిలువురాటలకు అడ్డంగా, మామూలుగా బిగించిన కర్ర; కొన్నిచోట్ల, దీనికి అచ్చుతాళ్లు తగిలిస్తారు. చూ. చిత్రం 116.1 (తె. 18, 23; రా. 17); **11.** పర్యా. చూ. సూత్రాలకట్టె(2). మగ్గంతాళ్లు (= చేతిపలకతాళ్ళు, కోతిపుల్లలతాళ్ళు, గిరకలతాళ్ళు, పుల్లిరుసుతాళ్లు మొ. వి) కట్టటానికి ఆధారంగా, మగ్గానికి పైన అమర్చిన కర్ర; కొన్నిచోట్ల వెదురుది. చూ. చిత్రం 121 క. 14 (తె. 12, 20); **12.** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీ చట్రం అమర్చిన సన్నకర్ర; పావుచెక్కను తొక్కినప్పుడు, గొలుసుపిక్కలుగాని, దిండు దిమ్మలుగాని. కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (రా. 13); **13.** పర్యా. చూ. అడ్డపట్టె(14). మరమగ్గం చట్రంలో, మేరువుపలకకు కిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (తె. 8.); **14.** మరాసు ఇరుసుకు బిగించిన ఆకులను రెండు కొనలా బిగించే పట్టె(లు); మరాను తిప్పినప్పుడు, పడుగు వీటిమీద చుట్టుకొంటుంది. చూ. చిత్రం 50.7 (తె. 13); **15.** దసలి(పట్టు) పడుగు సరిచెయ్యటానికి ఊడైకు రెండోవైపు నేలలో పాతిన కొయ్యరాట (చూ. సర్వటిగుంజ)లకు రెంటికీ అడ్డంగా బిగించిన కర్ర. చూ. చిత్రం 297.7 (తె. 7).

**అడ్డకమ్మ** చూ. అడ్డకమ్మి (8). (తె. 6).

**అడ్డకమ్మి** **1** పర్యా. చూ. తొక్కుడుపట్టె (2). రాట్నం అడ్డపట్టె: దీన్ని కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15 క. 3 (కో. 15, 20); **2.** ఉ. అడ్డకమ్మె; పర్యా. చూ. పీట (2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15 క. 1 (కో. 13. 15-17, 19); **3.** పర్యా. చూ. పీట (8). డబ్బారాట్నం నిలువులు బిగించిన కిందిపీట. చూ. చిత్రం 41 క. 1 (కో. 18); **4.** పర్యా: చూ. అడ్డపట్టె (5): డబ్బారాట్నం తొక్కుడుపీటకు ఎడమవైపు బిగించిన చిన్నపట్టె. చూ. చిత్రం 41 క. 4 (కో. 26); **5.** పర్యా. చూ. అసుపీట. అసుకొయ్య (=అసుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టే; ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (కో. 18, 19); **6.** పర్యా. చూ. జంత్రదండె. అచ్చుకట్టె జంత్రానికి, నిలువుపుల్లలు బిగించిన కిందిపీట; కొన్నిచోట్ల, ఇటువంటివి రెండుంటాయి.చూ.చిత్రం 19క.1 (కో. 14); **7.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డ

పట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు. నేతనేసేటప్పుడు ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118. 3 (కో. 17; తె. 16); **8.** రూ. అడ్డకమ్మ; పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118. 9 (కో. 17); **9.** పర్యా. చూ. అడ్డపట్టె (14). మరమగ్గంచట్రంలో, మేరువుపలకకు కిందగా నిలువుపట్టెలు బిగించిన మధ్య కర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం. 118. 2 (కో. 22); **10.** పర్యా. చూ. కమ్మి (9). మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసినఅడ్డ పుల్ల; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; పావుచెక్కలకు చేసిన చిల్లుల్లో దూర్చి పక్కగూటాలకు వేస్తారు. చూ. చిత్రం. 121 చ. 1(రా. 1),

**అడ్డకర్ర** **1.** పర్యా. చూ అడ్డపట్టె (14). మరమగ్గం చట్రంలో, మేరువుపలకకు కిందగా, నిలువు పట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం. 118. 2 (కో. 25); **2.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో: నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గం పందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118. 3. (కో. 26); **3.** ఉ. అడ్డగర్ర. పర్యా. చూ. ఊడ్డెదండె. ఊడ్డె పైవైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (కో. 27-29, 31); **4.** పర్యా. చూ. అడ్డకట్టె (10). నేతబయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి, నిలువురాటలకు అడ్డంగా, మామూలుగా బిగించినకర్ర; దీనికి అచ్చుతాళ్ళు తగిలిస్తారు. చూ. చిత్రం 116. 1 (కో. 25).

**అడ్డకొంగుపట్టె** కొంగునేతకు వాడే దారాలుచుట్టే కొయ్యపట్టె; దీనికి రెండు నిలువుగుంజలు బిగించి ఉంటాయి. చూ. చిత్రం. 286. చ (తె. 17).

**అడ్డకొండి** పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడె గాడిలో అడ్డంగా బిగించిన పుల్ల; పేకపోగు, చిక్కుపడకుండా సాపుగా రావటానికి, దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం. 131 ఛ. 2 (తె. 18).

**అడ్డకొయ్య** **1.** పర్యా. చూ. ఊడ్డెదండె. ఊడ్డె పైవైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (కో. 7); **2.** పర్యా. చూ. పీట (2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15 క. 1 (రా. 4 6); **3.** పర్యా. చూ. అడ్డకట్టె (10). నేతబయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి, నిలువు రాటలకు అడ్డంగా, మామూలుగా బిగించిన కర్ర; కొన్నిచోట్ల; దీనికి అచ్చుతాళ్ళు తగిలిస్తారు. చూ. చిత్రం 116. 1 (రా. 1, 5).

**అడ్డగుంజ** పర్యా. చూ. అడ్డకట్టె (10). నేతబయలులో, మరమగ్గం చట్రం నిలబెట్టటానికి, నిలువురాటలకుఅడ్డంగా మామూలుగా బిగించినకర్ర; కొన్నిచోట్ల దీనికి అచ్చుతాళ్ళు తగిలిస్తారు. చూ. చిత్రం 116. 1 (తె. 26).

**అడ్డగుండ్లజాడి** అడ్డంగా, తెలుపు, నలుపు వన్నెల చారలు పడేట్టునేసిన గొంగడి. (తె. 6).

**అడ్డగుమ్మి** ఉ. అడ్డగుమ్మె; పర్యా. అడ్డతిక్కడ, అడ్డరాటం, గిరక (4), చక్రం (3), చిట్టెలరాటం (2), చెంటి, తిరిగిణి (1), పచ్చసంకె, పడత (2), బరాటి(2) బొంగరం (2), బొందుపంకె, లాటుపంకె. అడ్డంగా అమర్చిన రాటె; చూ. రాటె. చూ. చిత్రం 34(తె.18).

**అడ్డగుల్ల** పర్యా. చూ. నిలువుబద్ద (1). రాటె ఆకులను కలిపే నిలువుపుల్ల(లు); కొన్నిచోట్ల తాళ్ళుకడతారు. చూ. చిత్రం 31 క. 4 (తె. 3).

**అడ్డగొలుసు** ఉ. అడ్డగొల్సు; పర్యా. చూ. వంకెన. పడుగు బిగింపుకోసం, పడుగేరు కర్రకు తగిలించేఇనప కొక్కేల గొలుసు. చూ. చిత్రాలు. 70 ట, త. (తె. 15, 16).

**అడ్డచట్టం** పర్యా. చూ. అడ్డపట్టె (14). మరమగ్గం చట్రంలో, మేరువు పలకకుకిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు కడతారు. చూ. చిత్రం. 118. 2 (రా. 3).

**అడ్డజంగ** **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె (2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నంతిప్పుతారు. చూ. చిత్రం 15 క. 3 (తె.10); **2.** పర్యా. చూ. జంత్రందండె. అచ్చుకట్టె జంత్రానికి, నిలువుపుల్లలు బిగించిన కిందిపీట; కొన్నిచోట్ల, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం. 91 క. 1 (తె. 10).

**అడ్డతాడు** **1.** పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టేసేతాడు. ఒకవైపు ఆకునుంచి మరొక వైపు ఆకుకు పేటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం. 15 క. 5 (కో. 14; తె. 17); **2.** పర్యా. చూ. మడిమతాడు. పావుచెక్కను గూటానికి బిగించే వెనక తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం. 121 క. 3 (రా. 18, 24); **3.** పర్యా. అడ్డదారం (2). కుచ్చు

తాళ్ళలో అడ్డంగా కట్టిన దారం. చూ. చిత్రం 118చ. 4 (తె. 14); **4.** పర్యా. చూ. కుచ్చుతాడు. మరమగ్గంలో, నాడెను నడపడానికి ఆధారంగా కుచ్చు కట్టినదారం. చూ. చిత్రం 118. 22 (కో. 4); **5.** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్టమీద, చేడు కర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీని కొసలు చేడుబొందులు (కొన్నిచోట్ల, కర్రలు) రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (రా. 23).

**అడ్డతిక్కిడి** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి; చూ. రాటి. చూ. చిత్రం 34(తె.17).

**అడ్డదండె** **1.** పర్యా. చూ. నిలువుకమ్మి (7). అచ్చుకట్టే జంత్రం కిందిబీటకు బిగించిన పొడుగుపట్టె; దీనికి రెండోవైపున నిలువుపుల్లలు బిగించి ఉంటారు; కొన్నిచోట్ల, చిన్న అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 2 (కో. 37); **2.** పర్యా. చూ. అడ్డపట్టె(14). మరమగ్గం చట్రంలో, మేరువుపలకకిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118. 2 (కో. 37); **3.** పర్యా. చూ. సూత్రాలకట్టె (2). మగ్గంతాళ్ళు (= పలకతాళ్ళు. కోతిపుల్లల తాళ్ళు, గిరకలతాళ్ళు, పుల్లిరుసుతాళ్ళు మొ.వి) కట్టటానికి ఆధారంగా, మగ్గానికి పైన అమర్చిన కర్ర; కొన్నిచోట్ల, వెదురుది. చూ. చిత్రం 121 క. 14 (తె. 4, 23); **4.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివరరేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళుకడతారు; నేత నేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118. 3(తె. 9, 29); **5.** పర్యా. చూ. నాగవాసం (6). గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె; మామూలుగా, వంపుగా ఉంటుంది. చూ. చిత్రం 316. 3(తె. 9).

**అడ్డదబ్బ** **1.** పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్య (= ఆసుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె. ఇటువంటివి, మామూలుగా మూడు, కొన్నిచోట్ల, రెండు ఉంటాయి. చూ చిత్రం 45 క. 1-3 (తె. 3); **2.** పర్యా. చూ. బిర్రుచిట్టె(2). పంచె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిది. చూ. చిత్రం 19 క. 14 (రా. 14).

**అడ్డదరి(కట్టె)** ఉ. అడ్డదర(కట్టె), అడ్డుదరి. చూ. అడ్డదారి(కట్టె). (తె. 9, 11, 28).

**అడ్డదరిరాయి** ఉ. అడదరరాయి; చూ. అడ్డదారిరాయి. (తె. 7, 9).

**అడ్డదాపు** పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్య (= ఆసుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి, మామూలుగా మూడు, కొన్నిచోట్ల, రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3. (తె. 3.)

**అడ్డదారం** **1.** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (రా. 16); **2.** పర్యా. అడ్డతాడు (3). కుచ్చుతాళ్ళలో అడ్డంగా కట్టిన దారం. చూ. చిత్రం 118 చ. 4 (రా. 2).

**అడ్డదారికట్టె** రూ. అడ్డదరి (కట్టె), అడ్డదారుకట్టె; పర్యా. దండెకోల(1). మగ్గానికి తగిలించిన ఉన్నిపడుగు నేలకు ఆనకుండా ఊనికగా పెట్టిన కొయ్య; రోకలి మాదిరది. చూ. చిత్రం 315 క. 12 (తె. 10, 25).

**అడ్డదారిరాయి** ఉ. అడ్డదార్రాయి; అడ్డార్రాయి రూ. అడ్డదరరాయి; పర్యా. చూ. చెవి (6). మగ్గానికి తగిలించిన పడుగు నేలకు ఆనకుండా ఊనికగా పెట్టిన కొయ్య (= అడ్డదారి)ని మోసేరాయి; ఇటువంటివి, రెండుపక్కలా ఉంటాయి; కొన్నిచోట్ల, పంగలగుంజలు పెడతారు. చూ. చిత్రం 315 క. 13 (తె. 22, 25).

**అడ్డదారుకట్టె** ఉ. అడ్డారుకట్టె; చూ. అడ్డదారి (కట్టె). (తె. 22, 27).

**అడ్డపంచె** పర్యా. చూ. లుంగీ(1). మగవాళ్ళు నడుముకు చుట్టుకొనే బట్ట; 2-4 గజాల పొడుగు నేస్తారు; మామూలుగా, తెలుపులో నేసి, రంగులో అంచులు, కమ్ములు పెడతారు; కొన్నిచోట్ల, రంగుల్లోను, డిజైన్లలోను గళ్ళలోను, గీరల్లోను నేస్తారు. (తె. 6, 19; రా. 1-3, 5, 11, 16, 28).

**అడ్డపట్టె** ఉ. అడ్డపట్టి, అడ్డపట్టీ, అడ్డుపట్ట. **1.** పర్యా. చూ. అడ్డపీట (1). పత్తిరాట్నం కింది పీట. చూ. చిత్రం 1.2 (కో. 5, 9; తె. 15; రా. 11); **2.** పర్యా. చూ. పీట (2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15 క. 1 (కో. 2, 5, 7, 9, 11, 12; తె. 15; రా. 1, 5, 7, 8, 11-13; 16, 17, 20, 22-24); **3.** పర్యా. తొక్కుడుపట్టె (2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15 క. 3 (కో. 2, 9, 23; తె. 6; రా. 6, 22); **4.** పర్యా. చూ. అడ్డకట్టె (4). అడ్డగుమ్మి కిందిపీట; దీనికి నిలువులు బిగిస్తారు. చూ. చిత్రం 34.1 (కో. 4); **5.** పర్యా. అడ్డకమ్మి (4), అడ్డపీట(3), గుంజలపీట (2), తొక్కపట్టె(2) ముంగడిపీట (2). డబ్బారాట్నం తొక్కుడు పీటకు ఎడంవైపు బిగించిన చిన్నపట్టె. చూ. చిత్రం 41 క.

4 (రా. 1, 7, 11, 23); **6.** ఉ. అడ్డపట్టి; పర్యా. చూ. పీట (8); డబ్బారాట్నం నిలువులు బిగించిన కింది పీట. చూ. చిత్రం 41 క. 1 (కో. 4 9బి, 15); **7.** పర్యా. చూ. ఆసుజంగ. ఆసుపీటలు బిగించిన పొడుగు పట్టె(లు); ఇవి ఒకటినుంచి మూడువరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 12); **8.** పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్య (= ఆసుకు బిగించిన నిలువుపుల్ల) లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె(లు); ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క.1-3 (కో. 1, 2, 4, 7-9ఎ 11, 13-15, 37; తె. 2, 15-17, 31; రా. 1, 4, 10-12, 17, 20, 23); **9.** పట్టుదారంతోడే ఆసులో, కొయ్యపుల్లలు బిగించినపట్టె; ఇటువంటివి, మామూలుగా మూడుం టాయి (తె. 17); **10.** పర్యా. చూ. మూలబద్ద. మరాసు కట్టుబడిలో, అడ్డపట్టెలను ఆకులను బిగించిన కట్టె(లు); పేటవాలుగా బిగిస్తారు(కో. 13); **11.** పర్యా. చూ. ఊద్దె దండె. ఊద్దె పై వైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (కో. 5, 6, 22; తె. 12, 14, 16, 17; రా. 13, 16, 17); **12.** పర్యా. చూ. సరిమట్టుబడితె. సరిగుంజలపై వైపున అడ్డంగా కట్టిన కట్టె. చూ. చిత్రం 65 క.1 (కో. 5; రా. 16); **13.** పర్యా. చూ. జంత్రందండె. అచ్చుకట్టె జంత్రానికి, నిలువుపుల్లలు బిగించిన కిందిపీట; కొన్నిచోట్ల, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 91 క. 1 (కో. 26; తె. 15, 17); **14.** పర్యా. అడ్డ (11), అడ్డకట్టె (13), అడ్డకమ్మి (9), అడ్డకర్ర (1), అడ్డచట్టం, అడ్డదండె (2), అడ్డపలక, అడ్డపెండె (3), అడ్డబద్ద (2), అడ్డబల్ల (7), అడ్డబెండు (3), కుచ్చుదండె, నడిపెండె, నడిమిపట్టె, నడుమఅడ్డపట్టె, బిగు(వు) బద్ద (2), మధ్యకట్టె, మధ్యచెక్క, మధ్యపట్టె, సట్టరుఅడ్డపట్టె. మరమగ్గం చట్రంలో, మేరువుపలకకు కిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (కో. 2, 5, 6, 7, 9బి, 10; తె. 12, 14, 16, 18; రా. 2, 5-9, 11-13, 18); **15.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గంచట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్లు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గం పందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 7; తె. 1, 12, 28; రా. 11, 14, 16, 24); **16.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో, పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు, దీనిమీద సాఖె ఆడుతుంది; దీనికి రెండుచివరలా స్ప్రింగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (తె. 1, 16); **17.** పర్యా. చూ. రెక్క (1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పేటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (రా. 1, 2); **18.** పర్యా. చూ. డాబీకోల. పేటుదారులకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుచెక్కలను తొక్కినప్పుడు, గొలుసు పిక్కలుగాని, దిండుగాని వీటిని పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (రా. 7); **19.** పర్యా. పట్టె (5), పండ్లపట్టె. డాబీచట్రం (= తడక) అడ్డబద్ద; ఊచలు బిగించింది, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 132 చ. 5 (రా. 12); **20.** రూ. అడ్డంపట్టి; పర్యా. చూ. సూత్రాలకట్టె (2). మగ్గంతాళ్లు (= పలకతాళ్లు, కోతిపుల్లలతాళ్లు, గిరకలతాళ్లు, పుల్లిరుసుతాళ్లు మొ. వి) కట్టటానికి ఆధారంగా, మగ్గానికి పైన అమర్చిన కొయ్య; కొన్నిచోట్ల, వెదురుది. చూ. చిత్రం 121 క. 14 (రా. 9); **21.** పర్యా. చూ. అడ్డకట్టె (10). నేతబయలులో మరమగ్గంచట్రం నిలబెట్టటానికి నిలువురాటలకు అడ్డంగా, మామూలుగా బిగించిన కర్ర(లు); కొన్నిచోట్ల, దీనికి అచ్చుతాళ్లు తగిలిస్తారు. చూ. చిత్రం 116.1 (తె. 28, 29, 33; రా. 11, 14, 24).

**అడ్డపలక** పర్యా. చూ. అడ్డపట్టె (14). మరమగ్గం చట్రంలో, మేరువుపలకకు కిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118. 2 (రా. 4, 10).

**అడ్డపిక్కరు** పర్యా. చూ. దిమ్మ (5). డాబీ దిండుకు చేసిన బొడిపె(లు); దిండు తిరిగినప్పుడు, ఇవి కోలలను పైకిలేపుతాయి. చూ. చిత్రం 132 క. 2 (కో. 26).

**అడ్డపింజెర(ం)** ఉ. అడ్డపెంజెరం; పర్యా. చూ. బోట్లపింజెర. ఒకరకం డాబీ; దిండు (= అడ్డ)కు బొడిపెలు చేసింది; దిండు తిరిగినప్పుడు, బొడిపెలు కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. (తె. 19, 20, 22, 23, 25).

**అడ్డపీట** ఉ. అడ్డపీటె. **1.** పర్యా. అడ్డ (1). అడ్డపట్టె (1), దిమ్మె (1), పట్టి (1), పీట (1), మట్టుబల్ల (1). పత్తిరాట్నం కిందిపీట. చూ. చిత్రం 1. 2 (కో. 1, 6, 8, 10, 14; తె. 4-14, 16, 17); **2.** పర్యా. చూ. పీట (2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15 క. 1 (కో. 1, 4, 7, 10; తె. 7, 11, 12, 14, 17, 24; **3.** పర్యా. చూ. అడ్డపట్టె (5). ఢబ్బారాట్నం తొక్కుడుపీటకు ఎడమ

వైపు బిగించిన చిన్నపట్టె. చూ. చిత్రం. 41 క. 4 (కో. 7; 28): **4.** పర్యా. చూ. పీట (8). దబ్బా రాట్నం నిలువులు బిగించిన కిందిపీట. చూ. చిత్రం 41 క. 1 (కో. 2, 5, 7); **5.** పర్యా. చూ. **ఆసుజంగ.** ఆసుపీటలు బిగించిన పొడుగుపట్టె (లు); ఇవి ఒకటి నుంచి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (తె. 11); **6.** పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్య (=ఆసుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి మామూలుగా మూడు, కొన్ని చోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (కో. 28; తె. 6, 7, 10, 21, 27, 28); **7.** మొగ లాసుకు పడుగునూలు చుట్టటానికి కొయ్యపుల్లలు బిగించిన పట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 47. 2 (తె. 6); **8.** పర్యా. చూ. జంత్రందండె. అచ్చుకట్టె జంత్రానికి, నిలువుపుల్లలు బిగించిన కింది పీట; కొన్నిచోట్ల, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 91 క. 1 (తె. 13); **9.** నవారుమగ్గం నిలువు కొయ్యలు బిగించిన కింది పట్టె. చూ. చిత్రం 324 ట. 2 (తె. 12; రా. 10); **10.** చిటికెపీట కొయ్యలు బిగించిన పైపట్టె. చూ. చిత్రం 285.1 (తె. 11); **11.** ఉన్నిపడుగుతోడే ఆసులో, గూటాలు బిగించిన కొయ్య; ఇటువంటివి మూడుంటాయి; చూ. ఆసు. (తె. 26, 27).

**అడ్డపుల్ల** పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడెగాడిలో అడ్డంగా బిగించిన పుల్ల; పేకపోగు చిక్కుపడకుండా, సాపుగారావటానికి దీనికి వెనకనుంచి పోగుతీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (కో. 7, 10, 29, 30, 33; తె. 8, 10, 24).

**అడ్డపుసాంచా** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి, చేతిమగ్గం పడుగుమీద, వంతెన మాదిరిగా కట్టిన లావు దారాలు; చూ. అడ్డబేలు. చూ. చిత్రం 136 క. 1 (తె. 21).

**అడ్డపూటీ** ?డాబీదిండుకు చేసిన గాడి; దిండు తిరిగి నప్పుడు, డాబీకోలలు ఇటువంటి గాళ్ళలోకి వస్తాయి. చూ. చిత్రం. 132 ట. 2 (తె. 24).

**అడ్డపూలసాంచా** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి, చేతిమగ్గం పడుగుమీద, వంతెన మాదిరిగా కట్టిన లావు దారాలు; చూ. అడ్డబేలు. చూ. చిత్రం. 136 క. 1 (తె. 21).

**అడ్డపెండె 1.** పర్యా. చూ. ఆసుజంగ. ఆసుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటి నుంచి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం. 45 క. 7 (కో. 5); **2.** పర్యా. చూ. ఊడ్తైదండె. ఊడ్తై పై వైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (కో. 3, 4); **3.** ఉ. అడ్డపెండి; పర్యా. చూ. అడ్డపట్టె (14). మర మగ్గం చట్రంలో, మేరువుపలకకు కిందగా, నిలువు పట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు తాడు కడతారు. చూ. చిత్రం 118.2 (కో. 3).

**అడ్డబడె 1.** పర్యా. చూ. పరిమట్టుబడితె. పరిగుంజల పై వైపున అడ్డంగా కట్టిన కట్టె. చూ. చిత్రం 65 క. 1 (రా. 12); **2.** ఉ. అడ్డబడి; పర్యా. చూ. సూత్రాలకట్టె (2). మగ్గంతాళ్ళు (=పలకతాళ్ళు, కోతిపుల్లలతాళ్ళు, గిరకలతాళ్ళు, పుల్లిరుసుతాళ్ళు మొ. వి) కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య; కొన్నిచోట్ల, వెదురుది. చూ. చిత్రం 121 క. 14 (రా. 11, 16).

**అడ్డబద్ద 1.** పర్యా. చూ. కుంచెలాక. కుంచె కట్టుబడిలో, పురి బిగింపుకు, రెండు పక్కలా అడ్డంగా వేసిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల, అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (తె. 20); **2.** ఉ. -బద్దె; రూ. అడ్డుబద్ద; పర్యా. చూ. అడ్డపట్టె (14). మర మగ్గం చట్రంలో, మేరువుపలకకు కిందగా, నిలువు పట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు తాడు కడతారు. చూ. చిత్రం 118.2 (కో. 12, 13, 27, 32); **3.** పర్యా. చూ. మేరువు పలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర మేకులు వేస్తారు; కొన్ని చోట్ల, దీనికి, కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3(కో. 12, 27); **4.** పర్యా. చూ. మూలబద్ద. మరాసు కట్టుబడిలో, అడ్డపట్టెలను, ఆకులను బిగించిన కట్టె(లు); పటవాలుగా బిగిస్తారు. చూ. చిత్రం 50 (తె. 13).

**అడ్డబల్ల 1.** పర్యా. ఎత్తుబల్ల. పత్తిరాట్నం నిలువు కొయ్యల మధ్య అడ్డంగా నిలిపిన చెక్క; దీనికి ఒక వైపున దూదీ మరొకవైపున గింజలూ పడతాయి. చూ. చిత్రం 1.6 (కో. 37); **2.** పర్యా. చూ. పీట(2). రాట్నంనిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15 క. 1 (కో. 31); **3.** పర్యా. చూ. బిర్రుచిట్టె (2). పంజె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిది. చూ. చిత్రం 19 క. 4 (తె. 6); **4.** రూ. అడ్డుబల్ల; పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్య (=ఆసుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి, మామూలుగా మూడు; కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (కో. 30); **5.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో,

నిలువుపట్టెలకుపైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు బిగిస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరి మీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 30); **6.** రూ. అడ్డబల్ల (2); **పర్యా. చూ.** జంత్రందండె. అచ్చుకట్టె జంత్రానికి, నిలువుపుల్లలు బిగించిన కిందిపీట; కొన్నిచోట్ల ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 91 క. 1 (కో. 33); **7.** పర్యా. చూ. అడ్డపట్టె (14). మరమగ్గం చట్టంలో, మేరువుపలకకు కిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాకు కడతారు. చూ. చిత్రం 118.2 (కో. 33).

**అడ్డబెండు** **1.** పర్యా. చూ. ఊడైదండె. ఊడై పైవైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (తె. 10); **2.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్టంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికిచివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరి మీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (తె. 21, 27, 30, 33); **3.** పర్యా. చూ. అడ్డపట్టె (14). మరమగ్గం చట్టంలో, మేరువుపలకకు కిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాకు కడతారు. చూ. చిత్రం 118.2 (తె. 11); **4.** పర్యా. చూ. సూత్రాలకట్టె (2). మగ్గంతాళ్ళు (=పలకతాళ్ళు, కోతిపుల్లలతాళ్ళు, గిరకలతాళ్ళు, పుల్లిరుసుతాళ్ళు మొ. వి) కట్టటానికి ఆధారంగా, మగ్గంపైన అమర్చిన కర్ర; కొన్నిచోట్ల వెదురుది. చూ. చిత్రం 121 క. 14 (తె. 10).

**అడ్డబేలు** పర్యా. ఝూలు, పరుపు(3) సాంచా. చేతిమగ్గం మీద డిజైన్లు నెయ్యటానికి పడుగుకు పైన వంతెన మాదిరిగా అడ్డంగా కట్టిన లావుదారాలు; వీటినుంచి పడుగులోకి వచ్చిన నిలువుదారాలు, పడుగు పోగులలో కొన్నిటిని పైకి ఎత్తుతాయి. చూ. చిత్రం 136 క. 1 (తె. 5).

**అడ్డబొంగు(లు)** పర్యా. చూ. బద్దీ (1). మరాను మీద పడుగుతోడేటప్పుడు, దబ్బాలకు ఉన్న నూలు ఒగ్గులపట్టె వరకూ సాఫుగా పోవటానికి నిలువుగుంజల మీద అడ్డంగా బిగించిన కొయ్య (లు); వెదురువి. (కో. 36).

**అడ్డముల్లు** పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడెగాడిలో అడ్డంగా బిగించిన పుల్ల; పేకపోగు చిక్కుపడకుండా సాఫుగా రావటానికి దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం. 131 చ. 2 (తె. 19).

**అడ్డమొల** డాబీకుక్కను గుంజే ఇనపమేకు; చూ. డాబీ. (తె. 25).

**అడ్డంపట్టి** చూ. అడ్డపట్టె (20). (రా. 6).

**అడ్డంపట్టె(లు)** నవారుమగ్గం నిలువులమధ్య, పన్నె బిగింపుకోసం అమర్చిన కర్ర. చూ. చిత్రం (రా. 10).

**అడ్డరాట** **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె (2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం. 15 క. 3(కో. 25. 26); **2.** పర్యా. చూ. తొక్కుడుపీట (2). డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం. 41 క. 3 (కో. 25, 26).

**అడ్డరాటం** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చినరాటి; చూ. రాటి. చూ. చిత్రం 34(రా. 11).

**అడ్డసలాక** డాబీదిండు బిగింపుకు వేసిన ఇనపచువ్వ. (తె. 22. 23).

**అడ్డసూత్రాలు** మగ్గం డాబీనుంచి కిందికి వేలాడే లావుదారాలు నిలువుగా ఉండటానికి కట్టినతాళ్ళు.(తె. 18).

**అడ్డాకు(లు)** (< అడ్డ + ఆకులు) **1.** పర్యా. అడ్డకట్టె (1). గుమ్మిఆకు (2). పట్టుదారం చుట్టే డోలక కట్టుబడిలో, ఇరుసుకు బిగించిన పొడుగాటి కొయ్యపట్టె(లు); వీటిమీద పోగు తిరుగుతుంది. చూ. చిత్రం. 293 క. 3 (తె. 12); **2.** బీమ్అడ్డ (=ఒకరకం మరాను) చెక్రం కట్టుబడిలో, పడుగు చుట్టటానికి బిగించిన పొడుగుపట్టె(లు); చూ. చెక్రం. చూ. చిత్రం 50.7 (తె. 8).

**అడ్డికపేటుకమ్మి** అడ్డికలపేరు (=మెళ్ళో వేసుకొనే ఒక నగ) మాదిరి డిజైనునేసిన కమ్మి; గొల్లవాళ్ళ పంచెలకు నేస్తారు. (కో 8).

**అడ్డికిపేటంచు** మెళ్ళో వేసుకొనే ఒకరకం హారంలో బిళ్ళల మాదిరి డిజైను నేసిన (చీర) అంచు. చూ. చిత్రం. 155 (రా. 16).

**అడ్డికిపేటు** ఉ. - పేటి; చూ. అరకపేటు(రా. 16).

**అడ్డుబద్ద** చూ. అడ్డబద్ద (2). (కో. 28).

**అడ్డుబల్ల** **1.** చూ. అడ్డబల్ల (4). (కో. 31). **2.** చూ. అడ్డబల్ల (6). (కో. 27).

**అడ్డుముక్క** పర్యా. చూ. రెక్క (1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం. 118. 18 (కో. 27).

**అడ్డెట్లబడె** పర్యా. చూ. సరముట్టుబడికె. సరగుం జల పై వైపున అడ్డంగా కట్టినకట్టె. చూ. చిత్రం. 65 క. 1 (తె. 7).

**అణి** చూ. అని (1). (రా. 14).

**అణిగుంజ** చూ. అనిగుంజ (1). (రా. 14 15).

**అణిలాక** చూ. అనిలాక (3). (రా. 15).

**అణుసు 1.** పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడె మొగ అర్గిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్ని చోట్ల ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (రా. 23); **2.** నేతనేసేటప్పుడు మరమగ్గం నాడె అరగకుండా, కిందివైపు బిగించిన ఊచ; వెడల్పుది; ఇటువంటివి రెండుంటాయి.(రా.24).

**అంటిమొగ్గపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను; అరటిమొగ్గ పేటు; చూ. చిత్రం 178 (రా. 10).

**అంటు 1.** (-పెట్టు -వేయు). పర్యా. చూ. అచ్చన. అచ్చతికిన పడుగుమీద, కొలతనుబట్టి వేసిన గుర్తు; మామూలుగా మసిగుర్తు వేస్తారు; కొన్నిచోట్ల, చిక్కుడు, బీర మొ. వాటి ఆకుపసర్లతో గజానికి ఒకటి చొప్పునగాని, మూరకు ఒకటి చొప్పున గాని గుర్తులువేస్తారు. (కో. 2-10, 12, 16, 20-23; తె. 13, 14, 16; రా. 6, 13); **2.** (-దింపు, -వదిలించు) గంజితో అంటుకుపోయిన పడుగు (కో. 32); **3.** పర్యా. చూ. సందు(1). పడుగులో, రెండు అనులమధ్యభాగం; గంజితో అంటుకొన్నది; పైపోగులకు కిందిపోగులకు మధ్య లాకలుఎక్కించి వాటిని విడదీస్తారు. (రా.6,24).

**అంటుతొట్టి** గంజి పోసుకొనే పాత్ర; నేతనేసే టప్పుడు, బట్టముందుభాగం బిరుసెక్కటానికి పూసే గంజి దీంట్లో పోసుకొంటాడు. (తె. 18, 25).

**అంటుదింపు** (క్రి.) సరిచేసేటప్పుడు, గంజితో అంటుకుపోయిన పోగులు చేత్తో విడదియ్యటం(కో. 16, 20).

**అంటుపట్టు** క్రి. **1.** పడుగులో కిందిపోగులు, పై పోగులు అంటుకోకుండా సందులాకలు ఎత్తటం. (కో. 6); **2.** సరిచేసేటప్పుడు, అంటుకుపోయిన పడుగుపోగులు చేత్తో విడదీసి సాపుచెయ్యటం (కో.9ఎ, 25, 26, 35).

**అంటుపిడచ** నేతనేసేటప్పుడు, బట్టముందుభాగం (= వాయి) బిరుసెక్కటానికి గంజి పూసేగుడ్డ. చూ. చిత్రం 142- 1 (తె. 25).

**అంటువదిలించు** (క్రి.) సరిచేసేటప్పుడు, పడుగులో అంటుకుపోయిన పోగులు విడదియ్యటం; అనిలాకతో బాటు మరోలాకదూర్చి పైకిఎత్తుతారు.(కో. 30, 37).

**అంట్లతాడు** ఉ. అంటల్తాడు; పర్యా. కొల్తదారం, గుర్తుదారం. అచ్చతికిన పడుగుమీద గుర్తులు పెట్టటా నికి కొలిచేదారం; మామూలుగా గజం పొడుగుది. (కో. 2, 3, 6, 7).

**అంట్లబద్ద** పర్యా. చూ. లచ్చసలాక. అచ్చతికిన పడుగుమీద, గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనే బద్ద; మామూలుగా గజం (కొన్నిచోట్ల, మూరెడు) పొడుగుది; కొన్నిచోట్ల మలగట్టుకర్రతో కొలుస్తారు; చూ. లాక. (కో. 23).

**అంట్లుకర్ర** పర్యా. చూ. లచ్చసలాక. అచ్చతికిన పడుగుమీద, గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనే బద్ద; మామూలుగా గజం (కొన్నిచోట్ల, మూరెడు) పొడుగుది; కొన్నిచోట్ల, మలగట్టుకర్రతో కొలుస్తారు. (కో. 4).

**అంట్లెత్తు** (క్రి.) సరిచేసేటప్పుడు, పడుగులో అంటుకుపోయిన పోగులు విడదియ్యటం; అనిలాకతో బాటు మరో లాకదూర్చి పైకి ఎత్తుతారు. (కో. 20; రా. 24).

**అండా 1.** ఒకరకం గిన్నె; దీంట్లో రాగిపిండి ఉడకబెడతారు. (రా. 1); **2.** రంగునీళ్ళు కాచే పెద్ద ఇనపడబ్బా; మామూలుగా, నలుపలకలది; కొన్ని చోట్ల, గుండ్రటిది; దీంట్లో నూలులడీలువేసి ఉడకబెడ తారు. చూ. చిత్రం. 282 క. 3 (కో. 2, 5, 9, 11, 14; రా. 12, 15).

**అండ్లుజాపు** (క్రి.) రూ. అనులుజాపు; పర్యా. చూ. అల్లుచాపు (1). అచ్చతికిన పడుగును ఆరుబయట పొరదియ్యటం; ఒకవైపున ఊడ్తెకు, మరొకవైపున సరిగుంజ (కొన్నిచోట్ల గుంజం)కు కట్టి చాపుతారు. (తె. 13).

**అతకడ** నాలుగుచీరల నేతకు సరిపడేపడుగునూలు; అచ్చతికింది (రా. 13).

**అతుకుకచ్చి** అచ్చతకటానికి తెంపేపోగులు; సరి చేసేటప్పుడు, వీటిని చివరికి జరుపుతారు; దిగుపకోల్తల (కో. 9ఎ).

**అతుకు(డు)** రూ.అతుకులు, పర్యా.చూ.అల్లు(1). అచ్చతికిన పడుగు. (కో. 14; తె. 15-17, 21, 26, 27, 29, 30; రా. 12, 19, 20).

**అతుకు(డు)కలుపు** (క్రి.) పర్యా. చూ. అల్లు చేయు. అచ్చతికిన పడుగు ఆరుబయట చాపి, నేతకు అనుకూలంగా సాపుచెయ్యటం; పడుగుమీద గుర్తులు వేసి, చివరి పాయలకు ముడులువేసి, మగ్గానికి అమరుస్తారు. (తె. 15, 26, 30).

**అతుకుడుగోల** అచ్చతికిన పడుగు పోగుల్లో, అతుకుల దగ్గర దూర్చేనకర్ర (తె. 10).

**అతుకుడుచాపు** (క్రి.) **1.** పర్యా. చూ. అల్లుచాపు (1). అచ్చతికిన పడుగును ఆరుబయట పొరదియ్యటం (తె. 15); **2.** పర్యా. చూ. అల్లుచేయు. అచ్చతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా చెయ్యటం (కో. 14; తె. 17, 27; రా. 12, 19 20).

**అతుకుడుచేయు** (క్రి.) పర్యా. చూ. అల్లుచేయు. అచ్చతికిన పడుగు ఆరుబయట చాపి. నేతకు అనుకూలంగా సాపుచెయ్యటం; పడుగుమీద గుర్తులు వేసి, చివరి పాయలకు ముడులువేసి మగ్గానికి అమరుస్తారు. (తె. 16).

**అతుకులబద్దె** పడుగుకుఅతికినబద్దెపోగులు(రా 11).

**అతుకులు** చూ. అతుకు(డు). (తె. 24, 25 28, 31-33).

**అతుకులుకోయు**(క్రి.)అచ్చతికే బద్దెపోగుల కొసలు వరసగా కొయ్యటం. (కో. 37).

**అతుకు(లు)దాటించు** (క్రి.) పర్యా. అతుకులు దాటేయు. అచ్చతికిన పడుగులో, అచ్చుకు అవతలఉన్న అతుకులను పన్నె ఇవతలకు జరపటం. (తె. 27, 28).

**అతుకులుదాటేయు** (క్రి.) పర్యా. అతుకు (లు) దాటించు. అచ్చతికిన పడుగులో, అచ్చుకు అవతల ఉన్న అతుకులను పన్నె ఇవతలకు జరపటం (రా.24).

**అతురాయిచేయు** (క్రి.) ?అల్లుపట్టి లోపలకు తీసుకోటం (రా. 7).

**అత్తాకోడలంచు** చీరకు రెండు చివరలా రెండు రకాల రంగులు పెట్టి నేసిన అంచు; మామూలుగా, ఒకవైపు అంచుకు నీలి, మరొకవైపు అంచుకు తొగరు రంగులుపెట్టి నేస్తారు. (కో. 11, 33).

**అద్దకపట్టీ** వేణ్ణీళ్ళలో రంగు అద్దటానికి నూలు లడీలు తగిలించే ఇనప(రేకు)గొట్టం; కొన్నిచోట్ల, ఇనపకమ్మి వాడతారు: చూ. కమ్మి. (తె. 25).

**అద్దకం** నూలుకుగాని బట్టకుగాని రంగువెయ్యటం (తె. 4).

**అద్దకంతొట్టి** అద్దకంరంగు పోసిన తొట్టి. చూ. చిత్రం. 283 క. 2 (కో. 26).

**అద్దకంబొంగు** వేణ్ణీళ్ళలో రంగు అద్దటానికి.నూలు లడీలు తగిలించే వెదురుగొట్టం. చూ. చిత్రం. 282 త. 1 (తె. 25).

**అద్దముత్యాలచీర** ఉ. అద్దముత్యాలచీర. కమిలోమ్మ మద్దికాయబడిజైను పెట్టి. అంచుకుప్పడం పద్ధతిలో నేసినచీర; అదనంగా రెండు పావుచెక్కలు అమ్మకమ్మి నేస్తారు (తె. 14).

**అద్దు** (< హద్దు). ముప్పాతికగజం నేతగుడ్డ; ఒక రవికకు సరిపడేది. (కో. 34).

**అద్దుపిడచ** పర్యా. చూ. పిడచ(1). పడుగు తడప టానికి, గంజిలో ముంచిన గుడ్డ; కొన్నిచోట్ల, బద్దె పేలికలు కుప్పచేసి పిడచగా ఉపయోగిస్తారు; దీంతో, పడుగుకు గంజికాని, అంబలికాని పట్టిస్తారు. చూ. చిత్రం. 74. 2 (కో. 6 8, 9ఎ).

**అన** చూ. అని (1); హరిజనులవాడుక. (కో. 8; తె. 8, 20).

**అనగొట్టు** చూ. అనిగొట్టు (తె. 20).

**అనపడు** (క్రి.) ఆసుపోసేటప్పుడు, పడుగులో అని పడటం. (తె. 8).

**అనసూయ** ఉ. అనసూర్య. కాషాయం (= ఒక రకం ఎరుపు) రంగు. చూ. చిత్రం. 288 (కో.12, 13, 24, 26, 28).

**అనసూయచీర** కాషాయ (= అనసూయ) రంగు చీర. (కో. 26, 35).

**అనార్కలీబుటా** ఒరిగినట్లో, ఎర్రదానిమ్మమొగ్గ, ఆకు వరసగా నేసిన డిజైను (బుటా). (కో. 2).

**అని** (-కట్టు, —పడు, —పోయు; బ. అంట్లు, అనులు, అన్లు); ఉ. పని; రూ. అణి, అన, అనె; పర్యా. కచ్చు (1). పడుగులో కింది పోగులూ పై పోగులూ × ఆకారంలో కలిసేచోటు; ఆసుపోసేటప్పుడు, ఆసుపీటల నడిమి కొయ్యలకు అని పడుతుంది; పడుగేరేటప్పుడు, ఈ అనుల వెంబడి లాకలు దూరుస్తారు. (కో. 1-11, 13-15, 18, 27, 30, 31; తె. 2-7, 10-19 21, 22 25-28 30-32; రా. 1-13, 15-18, 20 23, 24); **2.** పర్యా. చూ. కొలికి (3). అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసినలంకె; నేతనేసేటప్పుడు, పడుగు పోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈలంకెల్లో నుంచి వెంతుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం. 100. 3 (తె. 17; రా. 4); **3.** పర్యా. చూ. వడి (7). సవారుమగ్గం కట్టుబడిలో, పైపట్టెకు కింద బిగించిన కర్రకు అల్లిన పురిదారం; ఇటువంటివి కర్రపొడుగునా ఉంటాయి. చూ. చిత్రం. 324. 2 (తె. 27); **4.** రూ. అనె. ఉన్నిపడుగులో కింది పోగులూ పై పోగులూ × ఆకారంలో కలిసే చోటు; ఆసుపోసేటప్పుడు, గూటాలకు అని పడుతుంది. పడుగునేసేటప్పుడు, ఈ అనుల వెంబడి లాకలు దూరుస్తారు. చూ. చిత్రం. 312. 3 (తె. 3, 6 7, 10, 22 25, 26, 28).

**అనివేరు** (క్రి.) ఉ. అనేరు. అచ్చుకట్టేటప్పుడు, వెంతు దారాల్లో పై పోగులకు, కిందిపోగులకు మధ్య × ఆకారంలో అంకెవచ్చేటట్టు విడదియ్యటం. (కో. 1, 6-8; తె. 21; రా. 18).

**అనికట్టు 1.** (క్రి.) ఉ. వనికట్టు; పర్యా. కచ్చెకట్టు. పడుగులో అనిపోగులు కూర్చి దారంతో కట్టటం (తె. 10, 27); **2.** (-కట్టు) పర్యా. కచ్చికట్టు (2). సరిచేసిన తరవాత పడుగులో అనిపోగులు కూర్చి దారంతో వేసినకట్టు. (కో. 2-10, 15; తె. 5, 11, 14, 21, 26; రా. 2-13, 16, 18, 20-23.)

**అనికట్టె 1.** ఉ. వనికట్టె; పర్యా. చూ. అచ్చులాక. అచ్చు(బద్దె)పోగుల్లో, అని వెంబడి పోగులు చెదరకుండా ఉండటానికి దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 102 చ. 6 (తె. 31); **2.** పర్యా. చూ. అనిలాక (3). నేతపడుగులో, అనిపోగుల వెంబడి దూర్చిన వెదురుబద్ద (లాక); కొన్నిచోట్ల, అనిసూరెముందు దూరుస్తారు. (రా. 12).

**అనికఱ్ర 1.** పర్యా. చూ. అచ్చులాక. అచ్చుపోగుల్లో, అని వెంబడి పోగులు చెదరకుండా ఉండటానికి దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 102 చ. 6 (రా. 1); **2.** అచ్చు కట్టేటప్పుడు, అచ్చుపడిలో దూర్చిన కఱ్ర. (రా. 1).

**అనికుట్టు** (క్రి.) పర్యా. కచ్చెకుట్టు. పడుగులో, అని వెంబడి లాకలు దూర్చటం. (కో. 4).

**అనితెతాడు** పర్యా. చూ. ఆకులతాడు (1). రాట్నం ఆకులకు చుట్టినతాడు; ఒకవైపు ఆకునుంచి, రెండో వైపు ఆకుకు ఏటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15 క. 1 (తె. 2).

**అనికొయ్య(లు)** ఉ. అనిగొయ్య, వనికొయ్య; పర్యా. అనిగుంజ (1), అనిపుల్ల, కచ్చికొయ్య, కచ్చిపుల్ల, కొయ్య (9), చిడత(2), చిడతపుల్ల పిల్లకొయ్య. ఆసుపోసేటప్పుడు, పడుగులో అనులు (= మెలికలు) పడటానికి కచ్చిపీటకు బిగించిన పుల్లలు; చూ. అని. చూ. చిత్రం 45 క. 6 (కో. 27; తె. 17, 29, 31).

**అనిగుంజ 1.** రూ. అణిగుంజ; పర్యా. అనికొయ్య. ఆసుపోసేటప్పుడు, పడుగులో అనులు( = మెలికలు)పడటానికి కచ్చిపీటకు బిగించిన పుల్ల; చూ. అని. చూ. చిత్రం 45 క. 6 (తె. 6); **2.** మొగలాసుకు ఆసుపోసేటప్పుడు, పడుగులో అనులు (= మెలికలు) పడటానికి పట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి; రెండు పట్టెలకూ రెండు ఉంటాయి. చూ. చిత్రం 47.5 (తె. 6); **3.** ఉ. వనిగుంజ; పర్యా. చూ. అనిగూటం, ఉన్నిపడుగు తోడేటప్పుడు, అనిపడేగూటం; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, ఆసుగూటాల్లో మధ్యవరసలో ఉంటాయి. చూ. చిత్రం 312.2 (తె. 25).

**అనిగుంజలపట్టె** మొగలాసుకు అనిగుంజ బిగించిన కొయ్య; ఇటువంటివి, రెండుంటాయి. చూ. చిత్రం 47.4 (తె. 6).

**అనిగుంజ** (క్రి.) సరిచేసేటప్పుడు, పడుగుమధ్యలో ఉన్న అనిని ఒక చివరికి జరపటం; లాకలతో జరుపుతారు. (తె. 22).

**అనిగూటం** రూ. అనెగూటం, ఆనెగూటం; పర్యా. చూ. అనిగుంజ (3), అనిగొయ్య, కమ్మగుంజ. ఉన్ని పడుగుతోడేటప్పుడు, అనిపడేగూటం; ఇటువంటివి, రెండుంటాయి; కొన్నిచోట్ల, ఆసుగూటాల్లో మధ్య వరసలో ఉంటాయి. చూ. చిత్రం. 312.2(తె. 6, 7, 28).

**అనిగూర్చు** (క్రి.) ఉ. వనిగూర్చు. అనిపోగులు చెదిరిపోకుండా చక్కజెయ్యటం; సరిచేసేటప్పుడు, పడుగులో అనికి రెండు పక్కలా ఉన్నలాకలు దగ్గరగా జరుపుతారు. (తె. 22, 23).

**అనిగొట్టు** (క్రి.) రూ. అనగొట్టు, అనెగొట్టు. గొంగడినేసేటప్పుడు, పేకపోగు దగ్గరబడేట్టు బేముతో ఒత్తటం (తె. 26).

**అనిగొయ్య** పర్యా. అనిగూటం. ఉన్నిపడుగు తోడేటప్పుడు, అనిపడే ఆసుగూటం; ఇటువంటివి, రెండుంటాయి; కొన్నిచోట్ల, ఆసుగూటాల్లో మధ్యవరసలో ఉంటాయి. చూ. చిత్రం. 312.2 (తె. 26).

**అనిచిడత(లు)** మొగలాసుకు బిగించిన నిలువు కొయ్యకు, పైన అడ్డంగా బిగించినపుల్ల. చూ. చిత్రం 47.6 (తె. 6).

**అనిచివర 1.** పర్యా. చూ. అనిసూరె (2). దండె దగ్గర, నేతపడుగులో అనివెంబడి దూర్చిన సన్నబెత్తం; మామూలుగా, దండెకు రెండు వైపులా ఉంటాయి. చూ. చిత్రం 127.3 (రా. 13); **2.** పర్యా. చూ. అనిచువ్వ (1). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుపోగుల్లో, అని వెంబడి దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి రెండుంటాయి (రా. 13).

**అనిచివ్వ** చూ. అనిచువ్వ (1). (రా. 5).

**అనిచువ్వ 1.** రూ. అనిచివ్వ; పర్యా. అనిచివర (2), అనిసూరె(1). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుపోగుల్లో, అనివెంబడి దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి రెండుంటాయి. (కో. 8; తె. 13, 14); **2.** పర్యా. చూ. అనిసూరె (2). దండెదగ్గర, నేతపడుగులో అనివెంబడి దూర్చిన సన్నబెత్తం; మామూలుగా, దండెకు రెండు వైపులా ఉంటాయి. చూ. చిత్రం 127.3 (కో. 6).

**అనిచెక్క** నవారుమగ్గానికి వెనకవైపు బిగించిన చెక్క; బెత్తంకు తక్కువ వెడల్పు, జేనకు పైగా పొడుగు ఉండేది; దీని బెజ్జాలగుండా పోగులు బయటికి వస్తాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 324 చ. 3 (కో. 12).

**అనితెరుచు** (క్రి.) పడుగుపోగులు కొన్ని పైకీ కొన్ని

కిందికీ విడబడేటట్టు చెయ్యటం; పావుచెక్క తొక్కినప్పుడు విడబడతాయి. (కో. 5, 6; తె. 7).

**అనితొక్కు** (క్రి.) ఉ. -దొక్కు. పడుగుపోగులు కొన్ని పైకీ కొన్ని కిందికీ వచ్చి, అనిపోగులు విడబడటానికి పావుచెక్క తొక్కటం. (కో. 3-10, 27; తె. 4; రా. 8, 10-12, 16).

**అనిదారం** పర్యా. చూ. పూదారం. అచ్చుబద్దె పోగుల్లో, అని వెంబడి దూర్చిన దారం; అచ్చుతీకేటప్పుడు, పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్ని చోట్ల, సన్నబద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ. (రా. 13, 14, 16).

**అనిపట్టె** 1. ఉ. అనిపట్టి; పర్యా. చూ. మేకుల కమ్మి. మరాసుమీద మేకులు బిగించిన అడ్డకట్టె; ఒగ్గుల పట్టె పక్కకు జరిగినప్పుడు, పడుగులో అనులుపడతాయి; ఇటువంటివి, 8-20 ఉంటాయి. చూ. చిత్రం 50.8 (కో. 2; రా. 17); 2. పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాసు కట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే బెజ్జాలు గల రేకు ముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాసు తిరిగినప్పుడు, కీలు దీనిమీద ఆడుతూ, దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది; ఇలా జరగటంవల్ల పడుగులో అనులు పడతాయి. చూ. చిత్రం 50.11 (రా. 18).

**అనిపాటు** అని సరిగాపడి, నేత జాగా కలిసిరావటం (రా. 14).

**అనిపుల్ల** పర్యా. చూ. అనికొయ్య. ఆసుపోసేటప్పుడు, పడుగులో అనులు (=మెలికలు) పడటానికి కచ్చిపీటకు బిగించినపుల్ల. చూ. చిత్రం 45 క. 6 (కో. 9ఎ; రా. 18).

**అనిపోగు(లు)** అచ్చులో అనిపడ్డ పోగు; అచ్చుతీకే పడుగులో చివరి అనిదారం; కిందిపోగులూ పైపోగులూ × ఆకారంలో వస్తాయి. (కో. 9);

**అనిపోయు** (క్రి.) పడుగునూలులో పైపోగులూ కింది పోగులూ కలిసేటట్టు (=అనులు పడేటట్టు) ఆసుపొయ్యటం (కో. 2, 3, 8; తె. 11, 12).

**అనిబల్ల** పర్యా. చూ. తలపీట. ఆసుపీటల్లో మొదటిది; దీనికి ఒకటి రెండు చాళ్ళలో ఆసుకొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (కో. 27).

**అనిమూయు** (క్రి.) పావుచెక్క తొక్కినప్పుడు పైకి లేచిన అనిపోగులు మళ్ళీ పడుగులో కలిసిపోయేటట్టు చెయ్యటం; పావుచెక్క మీదినుంచి కాలుతీసేస్తే అని మూసుకొంటుంది. (కో. 4-10; రా. 13-15, 17).

**అనిలాక** ఉ. వండ్లాక, వండ్లేక. 1. పర్యా. చూ. లాక (2). పడుగులో, అని వెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా, ఇటువంటివి అనికి రెండువైపులా ఉంటాయి; పడుగులో అని చెదిరిపోకుండా ఉండటానికి లాకలు వేస్తారు; చూ. చిత్రం. 63 చ. 3 (తె. 18, 22; రా. 15); 2. పర్యా. చూ. అచ్చులాక. అచ్చుపోగుల్లో, అని వెంబడి పోగులు చెదరకుండా ఉండటానికి దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 102 చ. 6 (రా. 15); 3. రూ. అనిలాక, అనిలేక; పర్యా. అనికట్టె (2). నేతపడుగులో, అని పోగుల వెంబడి దూర్చిన వెదురుబద్ద (=లాక); కొన్నిచోట్ల, అనిసూరె ముందు దూరుస్తారు. (తె. 3, 12, 28; రా. 8, 11, 13, 15, 19ఎ, 23).

**అనిలేచు** (క్రి.) పడుగుపోగులు కొన్ని పైకీ కొన్ని కిందికీ వచ్చి, అనిపోగులు పడుగుమట్టానికి రావటం; పావుచెక్క తొక్కినప్పుడు అనిపోగులు పైకివస్తాయి; (కో. 3, 6, 10, 22; రా. 7, 14-19).

**అనిలేపు** (క్రి.) ఉ. వనిలేపు. 1. పడుగులో, అని పక్కన ఉన్నలాకతో మరో లాక చేర్చి పైకి ఎత్తటం (తె. 22); 2. పర్యా. అనులెత్తు. సరిచేసేటప్పుడు, పడుగులో అనిపోగులు లాకలతో ఎత్తటం; అంటుకుపోయిన పోగులు ఇలా విడదీస్తారు.

**అనిలేక** ఉ.వండ్లేక; చూ. అనిలాక(3). (తె.6,22).

**అనివడి** పర్యా. చూ. కొలికి (3). అచ్చుకట్టేటప్పుడు, రెండు అచ్చుకర్రల పడిదారాలకువేసిన లంకె; నేతనేసేటప్పుడు, పడుగుపోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ లంకెల్లో నుంచి బెంతుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం. 100. 3 (రా. 12).

**అనివిరుగు** (క్రి.)గొంగడి నేసేటప్పుడు, పడుగులో అనిపోగులు కలిసిపోవటం; జంత్రం వాలిస్తే, పోగులు కలిసిపోతాయి; జంత్రం లేపితే పోగులు విడబడతాయి (తె. 28).

**అనిసుబిరె** ఉ. వంచుబిరె. వనిసుబిరె; చూ. అనిసూరె (1). (తె. 22).

**అనిసూరె** 1. రూ. అనిసుబిరె; పర్యా. చూ. అనిచువ్వ (1). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుపోగుల్లో అని వెంబడి దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి రెండుంటాయి. (తె. 5); 2. పర్యా. అనిచివర (1), అనిచువ్వ (2), కచ్చిచివర. దండెదగ్గర నేతపడుగులో అని వెంబడి దూర్చిన సన్నబెత్తం; మామూలుగా, దండెకు రెండువైపులా ఉంటాయి. చూ. చిత్రం. 127. 3 (తె. 4).

**అనులుజాపు** (క్రి.) చూ. అండ్లుజాపు (కో. 18).

**అనులుదిద్దు** (క్రి.) అనిపోగులు సాపుచెయ్యటం. (కో. 27).

**అనులుపట్టు** (క్రి.) అనిపోగులు తీసుకోటం; పడుగులో పైపోగులు విడదీసేటప్పుడుగాని, ఒక పడుగులో కొన్ని రకాల రంగుపోగులు అతకవలసినప్పుడుగాని పోగులు తీసుకొంటారు. (కో. 18).

**అనులులేపు** (క్రి.) ఉ.పనుల్లేపు.ఉన్ని పడుగు సరిచేసేటప్పుడు, అనుల వెంబడి సరిబద్దలు దూర్చి పైపోగులు ఎత్తి, కిందిపోగులు విడగియ్యటం (తె. 25).

**అనువెత్తు** (క్రి.) పర్యా. అనిలేపు (2). సరిచేసేటప్పుడు, పడుగులో అనిపోగులు లాకలతో ఎత్తటం; అంటుకుపోయిన పోగులు ఇలా విడదీస్తారు. (కో. 7, 27; తె. 12; రా. 13).

**అనులేరు** (క్రి.) అనిపోగులు విడదీసి సాపుచెయ్యటం (కో. 30, 31).

**అనువంతుడుకొయ్య** (< హనుమంతుడు–)ఎదరుదోనెను మోసే, కుడివైపు కొయ్య గూటం. చూ. చిత్రం 110 (కో. 4).

**అనువుతాడు** పర్యా. చూ. బిర్రుతాడు (2). మరమగ్గం నిలువుపట్టెకు, మేరువుపలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టినదారం; మేరువుపలకను పైకిగాని, కిందికిగాని జరుపుకొని, దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం. 118. 6 (రా. 17, 24).

**అనువుపుల్ల** పర్యా. చూ. బిర్రుపుల్ల (2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి, తాడు వడిపెట్టే పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం. 118. 7 (రా. 17. 24).

**అనె** చూ. అని (1). (కో. 13; తె. 7, 9, 11, 23, 27, 29).

**అనెగూటం** చూ. అనిగూటం. (తె. 9).

**అనెగొట్టు** (క్రి.) చూ. అనిగొట్టు (తె. 7, 11).

**అనెతెరుచు** (క్రి.) గొంగడి నేసేటప్పుడు, జంత్రం లేపి అనిపోగులు విడదియ్యటం. (తె. 27).

**అనెలిచ్చు** (క్రి.) అనిపోగులు విడదియ్యటం; వెదురుబద్దలు దూర్చి విడదీస్తారు. (తె. 11).

**అప్పలమ్మచీర** ఇరవై నెంబరు నూలుపెట్టి నేసిన తెల్లచీర; రెండు వైపులా, రంగుల్లో అంచులు నేస్తారు. (కో. 16).

**అబ్బాసి** ఉ. అబ్బాస్. **1.** ఎరుపు నల్ల దొగరు కలిసినరంగు (కో. 7); **2.** కడవనీలిలో కొద్దిగా ఎరుపు కలిసినరతిగు (తె. 16); **3.** నల్లవంకాయ రంగు (తె. 17); **4.** నలుపురంగు (తె. 21).

**అబ్బాసిచీర** ఒకరకం నల్ల(=అబ్బాసి)రంగుచీర; ముదురుఎరుపు కలిసింది. (తె. 21).

**అమాస** కృష్ణపక్షంలో చివరిరోజు; అమావాస్య. (కో. 12).

**అమిసాకుపట్టె(లు)** సగం నీలి, సగం తెలుపు వన్నెల్లో అరంగుళం చొప్పున నేసిన పట్టె(లు).(కో. 4).

**అముడు** పర్యా. చూ. చిగురు. అంచులో చిట్టచివరిభాగం; కొన్నిచోట్ల చివరికొంత విడిచి అంచు నేస్తారు; కొన్నిచోట్ల, చివరిభాగంలో నేస్తారు;మామూలుగా, ఈ నేతకు జమిలిపోగులు (=మందపుదారాలు) వాడతారు. చూ. చిత్రం. 155. 1 (కో. 90 ఎ).

**అమురుదండె** పర్యా. చూ. సూత్రాలకట్టె (2). మగ్గంతాళ్ళు (=పలకతాళ్ళు, కోతిపుల్లలతాళ్ళు, గిరకలతాళ్ళు, పుల్లిరుసుతాళ్ళు మొ. వి) కట్టటానికి ఆధారంగా, మగ్గానికి పైన అమర్చిన కొయ్య; కొన్నిచోట్ల వెదురుది. చూ. చిత్రం 121 క. 14 (రా. 24).

**అమెరికన్‌బుటాచీర** చిన్నజరీపువ్వులు (దాదాపు 120 వరకూ) పెట్టి నేసిన ఒకరకం చీర; అమెరికాలో జరిగిన ఒక ప్రదర్శనం నిమిత్తం నేసి పంపిన నమూనా. (కో. 2).

**అమెరికాషర్టింగు** అమెరికాకు ఎగుమతి చెయ్యటానికి నేసిన ఒక రకం చొక్కాగుడ్డ. (రా. 4, 5).

**అంబటికుండ 1.** చూ. అంబలికుండ (1). (తె. 17); **2.** చూ. అంబలికుండ (2). (తె. 11. 26).

**అంబటిపిడచ** చూ. అంబలిపిడచ (తె. 11).

**అంబటిపేప్పు** పర్యా. చూ. అంబలికుండ (2). ఉన్నిపడుగుకుపెట్టే చింతఅంబలి కాచే పెద్దకుండ. (తె. 10).

**అంబం** రూ. అమ్మం. ఏకిన తరవాత, పొడుగ్గా చుట్టిన ఉన్ని. (తె. 22).

**అంబరసుబేలు** ఒకరకం నేతడిజైను. "చిన్నపిల్లలు వేసుకునే అంబరసులాగ పడుతుంది".(తె. 21).

**అంబర్‌చెర్ఖా** ఏకాంబరం అనేఆయన తయారు చేసిన మరరాట్నం; ఇది ఇటీవలే వాడుకలోకి వచ్చింది; దీని మీద వేగంగా దారం తియ్యవచ్చు. (తె. 28).

**అంబర్‌నూలు** అంబర్‌చెర్ఖా మీద వడికిన నూలు (కో. 34).

**అంబర్‌రోజా** ఉ. అంబర్రోజు. ఒకరకం, లేతరోజా రంగు. చూ. చిత్రం 288 (కో. 3, 10).

**అంబలి** పర్యా. అంబలిగంజి గంజికూడు. పలచగా ఉడకబెట్టిన పిండి; మామూలుగా, చోడిపిండి వాడతారు; దీన్ని పడుక్కు పెడతారు. (కో. 9. 28, 31, 37; తె. 7, 9. 17, 22, 28–33).

**అంబలిఅటిక** ఉన్నిపడుగుకుపెట్టే చింతఅంబలి పోసిన చిన్నకుండ. చూ. చిత్రం 314.13 (తె. 28).

**అంబలికుండ** 1. రూ. అంబటికుండ (1). నూలు పడుగుకుపెట్టే అంబలి కాచే కుండ. (కో. 9౨; తె. 32); 2. రూ. అంబటికుండ(2); పర్యా. అంబటిపేర్వ. ఉన్నిపడుగుకు పెట్టే చింతఅంబలి కాచే పెద్ద కుండ. (తె. 27, 28).

**అంబలిగంజి** ఉ. అంబలి-; పర్యా చూ. అంబలి. పలచగా ఉడకబెట్టిన పిండి; మామూలుగా చోడిపిండి వాడతారు; దీన్ని పడుగుకు పెడతారు. (కో. 25, 26, 30).

**అంబలితొట్టి** 1. అంబలి పోసుకొనే తొట్టి. (తె. 30); 2. పర్యా. తొట్టి (2), సరితొట్టి (2). చింత అంబలి పోసినతొట్టి (చిన్నకుండ). (తె. 7, 9, 22, 26).

**అంబలిపిడచ** 1. పడుగు తడపటానికి అంబలిలో ముంచిన గుడ్డ; చూ. పిడచ(1). (తె. 30-32); 2. రూ. అంబటిపిడచ; పర్యా. కోరుబొంత, గొంగడి(కోరు) బొంత, గొంగడిపిడచ, తొడగరిబొంత, పిడచ. గొంగడినేతలో పడుగు తడపటానికి అంబలిలో ముంచిన (గొంగడి)గుడ్డ. చూ. చిత్రం 315 క. 20(తె. 26, 28).

**అంబలిపెట్టు** (క్రి.) అంబలిపిడచతో, ఉన్నిపడుగుకు అంబలి పట్టించటం; పోగు బిరుసెక్కటానికి అంబలి (కొన్నిచోట్ల, గంజి) పెడతారు. (తె. 10, 26-28).

**అంబలిబండ** పర్యా. చూ. గంజిబండ. గంజి, అంబలి మొ. వాటిలో పడుగు తడపటానికి పరచిన రాయి. చూ. చిత్రం 74.1 (తె. 31).

**అంబలిసొరవ** గంజిపోసుకునే ఒక రకం మట్టి పాత్ర; నేతనేసేటప్పుడు, బట్ట ముందుభాగం బిరుసెక్కటానికి గంజి దీంట్లో పోసుకొంటారు. (తె. 33).

**అంబారి** బట్టలమీద నేసే కలంకారీ అద్దకం డిజైనుల్లో ఒకరకం (కో. 12).

**అంబారిదండె** ఉ. -దండి; పర్యా. చూ. సూత్రాల కట్టె (2). మగ్గంతాళ్ళు (=పలకతాళ్ళు, కోతిపుల్లల తాళ్ళు, గిరకలతాళ్ళు, పుల్లిరుసుతాళ్ళు మొ.వి) కట్టటానికి ఆధారంగా, మగ్గానికి పైన అమర్చిన కర్ర; కొన్నిచోట్ల వెదురుది. చూ. చిత్రం. 121 క. 44 (తె. 2, 7; రా. 17).

**అంబారిదండెతాడు** అచ్చుకు ఆధారంగా, అంబారి దండెకు వేసిన పొడుగుతాడు; అచ్చుసూత్రం (2). చూ. చిత్రం. 121 గ. 1 (రా. 17).

**అంబికాడిజైను** చీరకొంగులో నిలువుగీరలు పడేట్టు నేసిన డిజైను. (తె. 21).

**అంబుదబ్బ** పర్యా. చూ. ఉండేలు(బద్ద). తాడు కట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం.9 క.12.(రా. 22,24).

**అమ్మం** (-వేయు) చూ. అంటం. (తె. 20).

**అమ్మవారినాలికె** చౌడీక్వారి పంకుగనాను, అమ్మవారి గుడిలో పద్మాకారంలో అయిదు రంగులతో రాసే పట్టు (ముగ్గు). (తె. 24).

**అంసపేటంచు** పర్యా. హంసఅంచు. హంస ఆకారంలో డిజైన్లు పడేట్టు నేసిన అంచు; కొన్నిచోట్ల, హంస, తీగ, ఆకు, వేస్తారు. చూ. చిత్రం.157 (తె. 4).

**అంసజేలుకమ్మి** హంస ఆకారంలో డిజైను నేసిన కమ్మి. (రా. 15).

**అయికదురు** ఒకరకం ఉన్ని కదురు; పెద్దది; చిన్న కదుర్లతో వడికిన దారం దీనిమీదకి తోడుకొంటారు. (తె. 27, 28).

**అర** కదురు నిండా వడికిన సడెం (నార) దారం; నేతలో నిలువుకు వాడతారు. (తె. 25).

**అరకపూతపూయు** (క్రి.) గుడ్డపిడచతో, పడుగుకు గంజి పట్టించటం; పోగు బిరుసెక్కటానికి గంజి పట్టిస్తారు; కొన్నిచోట్ల, అంబలి పెడతారు. (తె. 31).

**అరకపేటు** అంచులో నేసే ఒక రకం డిజైను. (కో. 14).

**అరగ** నూలు లెక్క: లడీలో డెబ్భయ్యోవంతు నూలు; మొత్తం 880 గజాల పొడుగు. (కో. 17).

**అరటితడప** అరటిమొక్క చెర్మం ఒలిచి, ఎండబెట్టి తీసిననార; పవైనా కట్టటానికి వాడతారు. (కో.20).

**అరటిపచ్చ** ఆకుపచ్చరంగు. చూ. చిత్రం. 288 (కో. 14).

**అరటిపొత్తి** ఉ. -బొత్తి; పర్యా. దవ. సన్న దారం తీసేటప్పుడు, వేలికొనమట అంటకుండా ఏకుపెట్టుకొనే అరటిదొప్ప; కొన్నిచోట్ల తోలుతిత్తి వాడతారు. చూ. చిత్రం. 17 చ. (కో. 33).

**అరపేకుపచ్చ** ఉ. అరిటాకు-. 1. ఒకరకం ఆకు పచ్చరంగు; గ్రీన్‌జి. 800, కాస్టిక్ సోడా, హైడ్రో సల్ఫేట్ తయారుచేస్తారు. (కో. 2, 4, 13; తె. 2, 5, 18, 31; రా. 5, 7, 10); 2. (రామ)చిలకపచ్చ కంటె ముదురురంగు (కో. 12, 15); 3. లేత ఆకుపచ్చ (కో. 14); 4. ప్రభాత్ రంగు (కో. 16); 5. పీగ్రీన్ చూ. చిత్రం 288. (రా. 12).

**అరపిడి** పిడిలో సగం నూలు; లడీ; చూ. పిడి. (కో. 11, 12, 17).

**అరపోగు** నాడె వాటేసినప్పుడు, పడుగులో ఒక వైపునుంచి మరొక వైపుకు అడ్డంగా కలిసిన దారం; వేకకుపడ్డ ఒకదారపు పోగు (కో. 7).

**అరలడీ** ఉ. అర్లడి. పది చిలపలనూలు; చూ. లడీ. (కో. 3).

**అరవంకిపేటు** అంచులో వంకీల మాదిరిగా నేసిన ఒక రకం డిజైను. చూ. చిత్రం 158 (కో. 20).

**అరిటాకులకడ్డీ** అరటిచెట్టు, మూడు ఆకులు, అరటి గెల నమూనాలు నేసిన డిజైను. (తె. 21).

**అరితట్టు** (క్రి.) పడుగుపోగులు, పడుగేరుక్రమీద పరచుకొనేటట్టు అరిచేత్తో తట్టటం. (కో. 6).

**అరితాడు** ? సరిచెయ్యటానికి చాపిన ఉన్నిపడుగు బిగించిన తాడు. (తె. 6).

**అరుగు** పట్టుదారం వడికేటప్పుడు, రాట్నం దగ్గర కూర్చోటానికి కట్టిన వేదిక (కో. 14).

**అరుంజం** అరపుంజం; ముప్పయి కోలుకుల (= అరవై పోగుల) దారం (కో. 24).

**అరుణోదయం** ఎర్రకనకాంబరంలో ముదురురంగు చూ. చిత్రం 288 (కో. 3).

**అర్గ** ఒకరకం మట్టిపాత్ర; పెద్దమూకుడు మాదిరిది; తొంకె; మండ; దీంట్లో రంగునీళ్ళుపోసి నూలులడీలు తడుపుతారు. (కో. 7).

**అర్ధకుట్టు** ఉ. అర్ద–. ఒకరకం కుప్పడం(= కుట్టు) నేత. (రా. 23).

**అర్ధబుగడ** ఉ. అర్ద–; చూ. అర్ధబుగిడి. (రా. 11, 15. 16).

**అర్ధబుగిడి** ఉ. అర్ద–; రూ. అర్ధబుగడ. మొగ్గ (= బుగిడి) లో పై సగం నేసిన డిజైను. చూ. చిత్రం 159 (రా. 16).

**అర్ధబోటు** సగానికి నూలు చుట్టిన కండె; ఇది పేకకు (= నేతలో అడ్డానికి) వాడతారు (రా. 6).

**అర్థ(లు)** ఉ. అర్గ. పేకదారం సగం వరకూ ఉన్న కండె(లు). (తె. 8).

**అలవాటు** మగ్గానికి ఎడమవైపు. (కో. 34).

**అలిజరిన్** పూర్వం పీపాల్లో దిగుమతిఅవుతూ ఉండే ఎరుపురంగు; జర్మనీనుంచి వచ్చేది. (తె. 8).

**అలుకు 1.** (క్రి.) పర్యా. అలుకుడుజేయు, చిలకరించు, జిమ్ము. సరిచేసేటప్పుడు, పడుగు బాగా బిరుసెక్కటానికి గంజి చిలకటం; గంజిపిడచ ఒకచేత్తో పట్టుకొని, రెండోచేత్తో దానిమీద అలుక్కుంచెతో దువ్వితే పడుగుమీద అలుకు పడుతుంది; కొన్నిచోట్ల, వెంపలి మండలలో చిలుకుతారు. (తె. 25); **2.** (–చల్లు –వేయు). పర్యా. గంజిఅలుకు పూతఅలుకు, పైగంజి, పైసరి, రవ్వ. సరిచేసేటప్పుడు, పడుగు బిరుసెక్కటానికి పైన చిలికిన గంజి; గంజిపిడచ ఒక చేత్తో పట్టుకొని, రెండో చేత్తో దానిమీద అలుక్కుంచెతో దువ్వితే పడుగుమీద గంజి పడుతుంది; కొన్నిచోట్ల, వెంపలి మండలతో గంజి చిలుకుతారు. (కో. 1-7, 10, 22, 25, 27. 28, 30-32, 34, 37; తె. 7, 9, 13, 20, 22, 27, 28; రా. 1).

**అలుకుజల్లు** (క్రి.) కళ్ళాపుమాదిరిగా నీళ్ళుచల్లటం (తె. 17).

**అలుకుడుకలుపు** (క్రి.) ? అంబలితో తడిపిన ఉన్ని పడుగును కుంచెతో దువ్వుతూ అక్కడక్కడ గంజి చిలకటం. (తె. 20).

**అలుకుడుజేయు** (క్రి.) పర్యా. చూ. అలుకు (1). సరిచేసేటప్పుడు, పడుగు బిరుసెక్కటానికి గంజి చిలకటం; గంజిపిడచ ఒకచేత్తో పట్టుకొని, రెండో చేత్తో దానిమీద అలుక్కుంచెతో దువ్వితే, పడుగుమీద అలుకుపడుతుంది; కొన్నిచోట్ల, వెంపలి మండలతో గంజి చిలుకుతారు. (తె. 23).

**అలుకుడుదారం** పర్యా. చూ. అల్లికదారం. అచ్చులికిన పడుగులో, చివర పొట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం; దీన్ని మగ్గం దగ్గర చుట్టుగర్రకు కడతారు; కొన్నిచోట్ల, పడుగుమీద గుర్తులు పెట్టటానికి దీంతో కొలత చూసుకొంటారు. చూ. చిత్రం 128 త. 2 (కో. 4).

**అలుకుతాడు** నూలుబొందుకు చుక్కకట్టటానికి, గుర్తులు వేసుకొనేటప్పుడు, కొలత చూసుకొనేతాడు. (కో. 7).

**అలుకుపండుగ** చేలల్లో జనుము విత్తనాలు చల్లేటప్పుడు, మృగశిరకార్తెలో చేసుకొనే పండుగ. పాయసం వండి తీసుకువెళ్ళి, పంచపాండవుల బొమ్మలు నిలిపి, కొలిచి, నైవేద్యం పెడతారు. (తె. 25).

**అలుకుమండ** పర్యా. మండ. సరిచేసేటప్పుడు, పడుగుమీద గంజిచిలికే ఆకులరెమ్మ; వేప వెంపలి మొ. చెట్ల మండలు వాడతారు (రా. 7, 8).

**అలుకేయు** (క్రి.) సరిచేసేటప్పుడు, పడుగుమీద గంజి చిలకటం (తె. 17).

**అలుక్కుంచె** (< అలుకు + కుంచె; –లాగు, –వేయు). ఉ. అలుక్కుంచి; పర్యా. రవ్వకుంచె, సంకటికుంచె. ఒక రకం కుంచె (= పడుగు దువ్వేది); సుమారు రెండు జేనల పొడుగుంటుంది; సరిచేసేటప్పుడు పడుగు ఆరుబయలులో ఉన్నప్పుడు, దీంతో పైన గంజి చిలకరిస్తారు; పడుగేరేటప్పుడు, పోగులు సాపుచెయ్యటానికి దీంతో దువ్వుతారు. చూ. చిత్రం 79 (కో. 1. 3-5. 7. 10-13, 15. 18, 27. 32. 34. 37; తె. 13; రా. 1. 2. 5. 20. 21).

**అలుచు** (క్రి.) చూ. అలుము (కో. 3).

**అలుచునేత** పోగులు ఎడంఎడంగా వచ్చేట్టు నేసిన నేత (రా. 5).

**అలుము** (క్రి.) రూ. అలుచు. నూలు జాడించటం; ఉతకటం (కో. 2).

**అల్లిగాయరసం** కలంకారీ రంగుల అద్దకంలో వాడే ఒక ద్రవం; కరక్కాయపువ్వు కాచి తీసింది; ఇది పూస్తే ఆకుపచ్చరంగు వస్తుంది (కో. 12).

**అల్లుకుంచె** కలంకారీ అద్దకంకోసం, కరక్కాయ రసం (=అల్లిగాయరసం)లో ముంచేకుంచె; చూ. కలం (కుంచె). చూ. చిత్రం 283 గ. 3 (కో. 12).

**అల్లకంతాడు** పర్యా. చూ. ఆకులతాడు (1). రాట్నం ఆకులకు కట్టిన తాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు పేటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15 క. 5 (కో. 2).

**అల్లనేరడిరంగు** ఒక రకం నీలంరంగు; నలుపు, ఊదా కలిసింది; నల్లవంకాయకంటె ఒక వన్నె తక్కువ ఉన్న రంగు. చూ. చిత్రం 286 (తె. 9).

**అల్లికకర్ర** ఉ. అల్లిక్కర్ర; పర్యా. చూ. బొట్టె కోల. నేతపడుగు చివర, పాయల తాళ్ళు కట్టిన కర్ర; దీనికి కొన్నిచోట్ల, మలబద్ద జోడిస్తారు; కొన్నిచోట్ల, దీనికి బొట్టెలు మెలిపేస్తారు. చూ. చిత్రం 128 త. 1 (కో. 1, 3).

**అల్లికతాడు** పర్యా. చూ. అల్లికదారం. అచ్చుతికిన పడుగులో, చివర బొట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం; దీన్ని మగ్గం దగ్గర చుట్టుగర్రకు కడతారు; కొన్నిచోట్ల, పడుగుమీద గుర్తులు పెట్టటానికి దీంతో కొలత చూసుకొంటారు. చూ. చిత్రాలు 128 త. 2, 129 త. 1. (కో. 3).

**అల్లికదారం** ఉ. అలకదారం, అల్కదారం, అల్లికి దారం; పర్యా. అలుకుడుదారం అల్లికతాడు, అల్లు దాడు, అల్లుదారం, జాలెతాడు, మలతాడు. అచ్చుతికిన పడుగులో, చివర బొట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం; దీన్ని మగ్గం దగ్గర చుట్టుగర్రకు కడతారు; కొన్నిచోట్ల, పడుగుమీద గుర్తులు పెట్టటానికి దీంతో కొలత చూసుకొంటారు. చూ. చిత్రాలు 128 త. 2 129 త. 1 (కో. 1, 3; తె. 14, 16).

**అల్లు 1.** ఉ. వల్లు; పర్యా. అతుకు(డు); మడికెల (1) మల (3). అచ్చుతికిన పడుగు. (కో. 1-3, 7-9, 12, 17, 18, 22-24, 30, 32, 34-36; తె. 1-5, 7, 9-14, 19-23; రా. 1, 10, 15-18, 23, 24); **2.** పర్యా. జాలు. అచ్చుతికిన పడుగులో, చివరిపాయ పోగులు (కో. 6); **3** పర్యా. చూ. చుట్టు (4). మగ్గానికి అమర్చి, నేతబయలులో చాపిన పడుగునూలు; ఒక ఉరువు (బట్ట) నేతకు సరిపడేది. (రా. 15, 23).

**అల్లుకట్టు 1.** ఉ. వల్లుకట్టు. పర్యా. చూ. అల్లుచేయు. అచ్చుతికిన పడుగు ఆరుబయటచాపి, నేతకు అనుకూలంగా సాపుచెయ్యటం; పడుగుమీద గుర్తులు వేసి, చివర పాయకులకు ముడులువేసి మగ్గానికి అమరుస్తారు. (తె. 1, 7, 9; రా. 15-18, 24); **2** నేతపడుగు, మగ్గంలో అమర్చటం (రా. 1, 23); **3.** పడుగులో చుప్పమీది అనిపోగులు, చేతులతో సాపు చెయ్యటం; అనులుకట్టటం (తె. 22).

**అల్లుకట్టె** పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో, చివరి పాయలు తగిలించిన కర్ర; మామూలుగా, దీనికి (మలబద్ద జోడించి) పాయలు చుడతారు; కొన్నిచోట్ల, బొట్టెలుగాని, బొజెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (రా. 15).

**అల్లుకలుపు 1.** పర్యా. చూ. అల్లుచేయు. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి, నేతకు అనుకూలంగా సాపు చెయ్యటం; పడుగుమీద గుర్తులువేసి, చివరి పాయలకు ముడులువేసి మగ్గానికి అమరుస్తారు. (తె. 12); **2.** అచ్చుతికిన పడుగుకు, అంచుపోగులు అతకటం (కో. 9).

**అల్లుకుంచె** ఉ. అలుకుంచి, అల్లుకుంచి. ఒకరకం కుంచె (=పడుగు దువ్వేది); సుమారు రెండు జేనల పొడుగుంటుంది; సరిచేసేటప్పుడుగాని పడుగేరేటప్పుడు గాని, పోగులు సాపుచెయ్యటానికి దీంతో దువ్వుతారు; సరిచేసే పడుగు ఆరుబయటున్నప్పుడు, దీంతో పైన గంజి చిలకరిస్తారు. చూ. చిత్రం 79 (కో. 11, 16, 19-26, 28, 31, 33; రా. 10).

**అల్లుకోల(లు)** అల్లుచేసే పడుగులో, కర్రల దగ్గర దూర్చిన బద్ద(లు). (కో. 37).

**అల్లుచాపు** (క్రి.) **1.** ఉ. ?అన్లుజాపు, అల్లుచాచు, అల్లుచాయు, అల్లుజాపు, వల్లుసాపు; పర్యా. అండ్లుజాపు, అతుకుడుచాపు, అల్లుపారజాపు. అచ్చుతికిన పడుగును ఆరుబయట పారదియ్యటం; ఒకవైపున ఊడ్డెకు, మరొక వైపున సరిగుంజ (కొన్నిచోట్ల, గునపం)కు కట్టి చాపుతారు. (కో. 1-3 12, 22, 23, 30, 32, 34-36; తె. 4, 11, 21-23; రా. 16); **2** పర్యా. చూ. అల్లుచేయు. ఆరుబయట పడుగు పొందిని, నేతకు అనుకూలంగా సాపుచెయ్యటం (తె. 2, 3, 5).

**అల్లుచివ్వ** ఉ. అల్లుసివ **1.** పర్యా. చూ. ఎక్కింపు చివ్వ (2). అచ్చుతికిన పడుగులో మొదట(=అచ్చుదగ్గర) ఎక్కించిన కర్ర; కొన్నిచోట్ల, బద్దగాని, సన్నపెత్తం గాని, ఇనపకడ్డీగాని ఎక్కిస్తారు. 12రజ (కో. 35); **2.** పడుగు చుట్టటానికి, పై పోగులకూ కింది పోగులకూ మధ్య ఎక్కించిన కర్ర. (కో. 37); **3.** పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగం

(=బద్దె) లో దూర్చిన పొడవాటి బెత్తం; దీన్ని దోనె గాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల ఇనప చువ్వగాని, వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 29).

**అల్లుచేయు** (క్రి.) పర్యా. అతుకుడుకలుపు, అతుకుడుచాపు (2), అతుకుడుచేయు, అల్లుకట్టు (1), అల్లుకలుపు (1), అల్లుచాపు (2) అల్లుపట్టు (1), మడికెట్టు, మలగట్టు (2) మలజాపు (1), మలదోయు, మలపట్టు. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపుచెయ్యటం; పడుగుమీద గుర్తులువేసి చివరి పాయలకు ముడులువేసి మగ్గానికి అమరుస్తారు. (కో. 17, 22; తె. 10, 19, 20).

**అల్లుతట్టు** **1.** ఒకవైపు పలచగాను, మరొకవైపు చిక్కగాను వచ్చిన నేత. (కో. 32); **2.** ఒకవైపు తక్కువ, మరొకవైపు ఎక్కువ వచ్చిన నేత. (కో. 37); **3.** ? రెండేసి గజాల నేత చివరిభాగం (కో. 34).

**అల్లుదంత్రం** పర్యా. చూ. బెంతుపనె. అల్లుచేసేటప్పుడు, పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు; పన్నెలాంటిది; రెండు పొడుగు కర్రలకు మధ్య వరసగా మేకులు బిగించి ఉంటాయి, వాటమధ్య పడుగుపోగులు దూర్చి పొడుగ్గా చాపుతారు. చూ. చిత్రం 106 (కో.7).

**అల్లుదాడు** పర్యా. చూ. అల్లికదారం. అచ్చుతికిన పడుగులో చివర పొట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం; దీన్ని మగ్గం దగ్గర చుట్టుగర్రకు కడతారు; కొన్నిచోట్ల, పడుగుమీద గుర్తులు పెట్టటానికి దీంతో కొలత చూసుకొంటారు. చూ. చిత్రాలు 128 త. 2, 129 త. 1 (కో. 9బి).

**అల్లుదారం** పర్యా. చూ. అల్లికదారం. అచ్చుతికిన పడుగులో, చివర పొట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం; దీన్ని మగ్గం దగ్గర చుట్టుగర్రలకు కడతారు; కొన్నిచోట్ల, పడుగుమీద గుర్తులు పెట్టటానికి దీంతో కొలత చూసుకొంటారు. చూ. చిత్రాలు 128 త. 2, 129 త. 1 (కో. 6).

**అల్లుపట్టు** (క్రి.) **1.** పర్యా. చూ. అల్లుచేయు. అచ్చుతికిన పడుగు ఆరుబయటచాపి, నేతకు అనుకూలంగా సాపుచెయ్యటం; పడుగుమీద గుర్తులువేసి, చివరి పాయలకు ముడులు వేసి మగ్గానికి అమరుస్తారు. (కో. 1, 7, 16-18; రా.10). **2.** నేత బయలులో చాపగా మిగిలిన పడుగునూలు (=అల్లు) చుట్టటం. (కో. 23).

**అల్లుపడుగు** అల్లుచేసే నూలు పొగడ(లు).(కో.7).

**అల్లుపొరజాపు** (క్రి.) పర్యా. చూ. అల్లుచాపు (1). అచ్చుతికిన పడుగును ఆరుబయట పారదియ్యటం; ఒక వైపున ఊడ్తెకు, మరొకవైపున సడగుంజకు (కొన్నిచోట్ల, గునపం)కు కట్టి చాపుతారు. (తె. 13).

**అల్లుపోయు** (క్రి.) అచ్చుతికిన పడుగులో అంచుపోగులు కలపటం (కో. 9బి).

**అల్లుమోకు** అల్లుచేసేటప్పుడు ఊడ్తె నిలబెట్టి బిగించే లావుపాటితాడు; చూ. ఊడ్తెతాడు. (కో. 7).

**అల్లులాక** **1.** పర్యా చూ. బద్దెగుచ్చుకర్ర. అచ్చుతికిన తరవాత, బద్దెలోపోగులు చెదరకుండా దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 102 త (కో. 25); **2.** పర్యా. అల్లులాకబద్ద. అల్లుచెయ్యటానికి పడుగు చాపిన తరవాత, పైపోగులకూ కిందిపోగులకూ మధ్య అనివెంబడి ఎక్కించిన వెదురుబద్ద; చూ. లాక.(కో. 34; తె. 20).

**అల్లులాకబద్ద** పర్యా. అల్లులాక(2). అల్లుచెయ్యటానికి పడుగు చాపిన తరవాత, పైపోగులకూ కిందిపోగులకూ మధ్య అనివెంబడి ఎక్కించిన వెదురుబద్ద; చూ. లాక.(కో. 16).

**అల్లువిచ్చు** (క్రి.) అచ్చుతికిన పడుగు (= అల్లు) విడదియ్యటం. (తె. 2).

**అల్లుసలాక** ఉ. వల్లుసలాక. అచ్చుతికిన పడుగులో మొదట (= అచ్చు దగ్గర మెలికల్లో) ఎక్కించిన ఇనపకడ్డీ; చూ. ఎక్కింపుచువ్వ (2). (తె. 22).

**అల్లుసుక్కు** సరిచేసినపడుగులో, అచ్చుకు సరిపడగా మిగిలిననూలు; దీన్నితీసేసి, తక్కువపడ్డప్పుడు కలుపుకొంటారు. (కో. 8).

**అల్లుసువిరె** పర్యా. చూ. ఎక్కింపుచువ్వ (2). అచ్చుతికిన పడుగులో మొదట అచ్చుదగ్గర ఎక్కించిన కర్ర; కొన్నిచోట్ల బద్దగాని, సన్నబెత్తంగాని, ఇనపకడ్డీగాని ఎక్కిస్తారు. చూ. చిత్రం 128 జ (తె. 23).

**అల్లె** ఉ. అల్లి; పర్యా. చూ. లాహిరీ. ఒకవైపుకు మొనదేలిన గుర్తులు, దగ్గరదగ్గరగా, వరసగా వచ్చేట్టు నేసిన డిజైను. చూ. చిత్రాలు 149, 168(తె. 31,32).

**అల్లెంచు** బట్టచివర లాహిరీ (=అల్లె), మధ్య ఏటవాలుగీతలు (=నాగముడి) డిజైనుగా నేసిన అంచు; కొన్నిచోట్ల, వంకులు వంకులుగా డిజైను పడేట్టు నేస్తారు. చూ. చిత్రం. 168 (తె. 31, 32).

**అల్లేరు** (< అల్లు + ఏరు; క్రి.) అచ్చుతికిన పడుగు (=అల్లు)లో పోగులు వరసగా తీసుకోటం (తె. 2).

**అవుజు** నీరు నిలవచేసుకొనే తొట్టి (తె. 18).

**అవుదు** నూలు ఆడిలు పిండేకర్ర. చూ. చిత్రం. 282 క. 5 (తె. 24).

**అసరబ్బీ** పర్యా. అసరిఫ్ పేటు. నిజాం రాజుల పాలనలో చెలామణిలో ఉన్న బంగారపు నాణెం (అష్రఫీ)

మాదిరిగా నేసిన అంచు డిజైను; కొన్నిచోట్ల, రామ కొంకినీలంటారు. చూ. చిత్రం 160 (తె. 4).

**అసరీఫ్‌పేటు** ఉ. -పేటి: పర్యా. అసరబ్బీ. నిజాం రాజుల పాలనలో చెలామణిలో ఉన్న బంగారపునాణెం (అష్రఫీ) మాదిరిగా నేసిన అంచు డిజైను కొన్నిచోట్ల రామకొంకినీలంటారు. చూ. చిత్రం 160 (తె. 2).

**అస్తట్లాక** చూ. అస్తాల్లాక. (కో. 5).

**అస్తపుతాడు** (<హస్త-.) పర్యా. చూ. చెంప తాడు (4). కుచ్చుతాళ్ళలో, డైమనుతాడుకు, ఒక వైపు కట్టిన దారం; దీన్ని పైన మగ్గం నిలువుపట్టెకూ కింద ఉడత(తాడు)కూ కడతారు; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 118. 23 (తె. 9).

**అస్తాలబద్ద** ఉ. అస్తాళ-. పర్యా. చూ. అస్తాలలాక (బద్ద). నేతపడుగులో, అచ్చు తరవాత దూర్చిన సన్నటి వెదురుబద్ద; నేతనేసేటప్పుడు, దీన్ని చేత్తో జరుపుకొంటూ ఉంటారు. చూ. చిత్రం 127.2 (కో. 10).

**అస్తాలలాక(బద్ద)** (<హస్తాల-) ఉ. అత్తాళ్ళాక. అస్తాల్లాక; రూ. అస్తట్లాక; పర్యా. అస్తాలబద్ద, పోర సల్లిలాక. నేతపడుగులో, అచ్చు తరవాత దూర్చిన సన్నటి వెదురుబద్ద; నేత నేసేటప్పుడు, దీన్ని చేత్తో జరుపుకొంటూ ఉంటారు. చూ. చిత్రం 127. 2 (కో. 2, 5 6, 7, 11).

**అళిది** (<హిం. హల్దీ) ఒకరకం పసుపురంగు,పచ్చ కనకాంబరం రంగు. చూ. చిత్రం 288 (రా. 15).

## ఆ

**ఆకు 1.** పర్యా. ఎక్కు(1), చెక్రబద్ద, పూటు(1), రేకు (5), లాక (1). రాట్నం ఇరుసుమీద తిరగటా నికి చక్రంమాదిరిగా అమర్చిన సాపుచెక్క(లు); ఇలా టివి మామూలుగా, ఒక్కొకవైపు నాలుగేసి చెక్కలు (ఎనిమిది ఆకులు) ఉంటాయి. చూ. చిత్రం. 15. 4 (కో. 1-24; తె. 1, 2, 4-33; రా. 1-24); **2.** పర్యా. ఎక్కు (2), దబ్బ (3) బద్ద(1), రేకు (6). పంకెకామ చుట్టూ వంచికట్టిన వెదురుబద్ద(లు); పంకె కుట్టుబడిలో, ఇటువంటివి మామూలుగా నాలుగు, కొన్నిచోట్ల ఆరు, ఉంటాయి. చూ. చిత్రం 19 క. 2 (కో. 1-6, 8-10 23, 24; తె. 2-5, 7-33; రా. 6, 14, 17, 18, 23, 24); **3.** పర్యా. చూ. చిట్టె (2). పంకె నిలువుబద్దల బిగింపుకువేసే అడ్డబద్ద(లు); చూ. చిత్రాలు 19 క. 3, 16 క. 4. (కో. 7; తె. 1); **4.** చెక్కపంకెకు దారం చుట్టుకోటానికి వీలుగా చెక్కా లకు బిగించిన కొయ్యబద్ద(లు); చూ. చిత్రం 29 క. 1 (తె. 11, 12, 14, 16, 15, 21); **5.** పర్యా. ఏత్తెబద్ద (1), గిరకఆకు గిరకబద్ద (1) గుమ్మిఆకు (1), గుమ్మి పుల్ల (2), గుమ్మిబద్ద, డొంకపట్టె తిరగపదబ్బ దబ్బ (2) పదలపుల్ల, పాదు, పుల్ల(2), బండిఆకు, బండిదబ్బ, బండపుల్ల (1), బండిలాక, బద్ద (3), బొంగరంపుల్ల, రాటిఆకు, రాటిపుల్ల, రాటిబద్ద, రాటిబల్ల, రెకు (7), లాకబద్ద (5) వెదటబద్ద (1) వెదురుబర్రె. రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 7, 9 11, 16, 30, 31); **6.** పర్యా. చూ. గిరకబద్ద (3). అడ్డగుమ్మికి రెండుపైపులా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 34.3 (తె. 5, 21, 26-28); **7.** పర్యా. గిల్లాకు, చెక్క (2), పట్టె (4). డబ్బారాట్నం చక్రానికి అమర్చిన సాపుచెక్క(లు).చూ. చిత్రం 41 చ. 1 (కో. 2, 7, 10, 18, 21; తె. 10, 21; రా. 10, 11); **8.** పర్యా. రేక (2). మరాను చక్రం కట్టుబడిలో, అడ్డపట్టె(ల)ను, ఇరుసును కలిపే కొయ్యపట్టె(లు); ఒక్కొకపక్క ఎనిమిదేసి ఉంటాయి. చూ. చిత్రం 50.2 (కో. 13, 14, 18, 21, 24; తె. 8; రా. 2); **9.** పెద్దరాట్నం కట్టుబడిలో, చక్రం బిగిం పుకు మధ్య బిగించిన కొయ్యపట్టె. చూ. చిత్రం 293 చ. 4 (కో. 14; తె. 5); **10.** గిరకపంకె (=ఛకరకం రాటి) కు పైన, కింద బిగించిన వెదురుబద్ద(లు). (తె. 17); **11.** పర్యా. చూ. పలక(7). మరమగ్గంలో, పన్నెబిగించిన పై చెక్క; నేతనేసేటప్పుడు, పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు. చూ.చిత్రం 118.10 (తె. 18); **12.** ఉన్నికత్తెరపదును. చూ.చిత్రం 306.1 (తె. 3.11).

**ఆకుచిట్టె** పర్యా. చూ. విరుచిట్టె. పంకెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిది. చూ. చిత్రం 19 క. 4 (తె. 2).

**ఆకుచెవులగొర్రె** ఉ.-సెవల-. వెడల్పు చెవులుగల గొర్రె. (తె. 25).

**ఆకుతాడు** చూ. ఆకులతాడు (తె. 12, 18; రా. 11, 17).

**ఆకుతీగ** పర్యా. ఆకులత. ఆకులూ తీగల్లూ పడే టట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 147 (కో. 10, 34; తె. 4, 5, 11, 12, 18, 22, 25, 28).

**ఆకుతీగ(చీర) 1.** అంచుల మధ్యలో(=చీరగర్భం) లో ఆకు తీగ మాదిరి డిజైన్లు పెట్టి నేసిన చీర; కొన్ని చోట్ల, డిజైన్లు చిన్నవి నేస్తారు. (తె. 12); **2.** ఉ. ఆకు

తీగెచీర. అంచులో ఆకులు, తీగలుపడేట్టు నేసిన ఒక రకం డిజైనుచీర. (కో. 34).

**ఆకుతీగంచు** ఉ. ఆకుతీగెంచు. ఆకు, తీగ నమూనాలు పడేట్టు నేసిన చీర; డాబీమగ్గం మీద నేస్తారు. చూ. చిత్రం 147 (కో. 10, 34; తె. 4, 5, 11, 12, 18, 22, 25, 28).

**ఆకుతీగెనులికాయ** అంచులో ఆకు, తీగ, నులికాయ నేత వరసగా పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 161 (తె. 25).

**ఆకుదారం** చూ. ఆకులదారం (1). (తె. 29).

**ఆకుపచ్చ** రూ. పచ్చాకు; పర్యా. పచ్చ. చెట్ల ఆకుల రంగు. చూ. చిత్రం 288 (కో. 24, 26, 30-32, 35; తె. 1, 6, 8, 24, 25, 27-29, 31; రా. 3, 5, 6).

**ఆకుపారిజాతం** అంచులో ఆకులు, తీగలు పువ్వులు పడేట్టు నేసిన ఒకరకం డిజైను. చూ. చిత్రం 162 (కో. 14).

**ఆకుపుల్ల** పర్యా. చూ. చిట్టె (2). పంజెఆకుల బిగింపుకువేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రాలు 19 క. 3, 19 క. 4 (కో. 2).

**ఆకుపేటంచు** ఆకుమాదిరి డిజైను పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 147 (కో. 7, 16; రా. 1, 7).

**ఆకుపేటు** ఉ. ఆకుపేటి; పర్యా. ఆకుబేలు. చీర అంచులోనేసే ఒకరకం డిజైను; సందు, అడక, ఒకదాని వెంబడి మరొకటి రెండు వరసల్లోనేసి, తరవాత సందు, ఆకు, చిగురు వరసగా వచ్చేటట్టు నేస్తారు. చూ. చిత్రం 147 (కో. 7, 16, 20; తె. 2, 13; రా. 1, 7).

**ఆకుబేలు** పర్యా. ఆకుపేటు. చీర అంచులో నేసే ఒకరకం డిజైను; సందు, అడక, ఒకదాని వెంబడి మరొకటి రెండు వరసల్లో నేసి, తరవాత సందు, ఆకు, చిగురు వరసగా వచ్చేటట్టు నేస్తారు. చూ. చిత్రం 147 (తె. 6).

**ఆకులచెక్రం** పర్యా. చూ. చెక్రం(4). డబ్బారాట్నం ఇరుసుకు బిగించిన (రేకు) చెక్రం; దీనిమీద వడిదారం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 9 (రా. 19).

**ఆకులత** పర్యా. ఆకుతీగ. ఆకులూ తీగలూ పడేటట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 147 (కో. 36).

**ఆకులతాడు 1.** ఉ. ఆకుల్తాడు; రూ. ఆకుతాడు; పర్యా. అడ్డతాడు (1), అనికెతాడు, అల్లకంతాడు, ఆకులదారం (1), ఆకులమలక, ఉల్లెడతాడు, కట్నంతాడు, తలకట్టు (1), తలతాడు (1), దంతిరితాడు, పన్నతాడు, పన్నదారం (1), పట్టీతాడు, బిగుతాడు (1), బిగుదారం, బిరుతాడు (1), మొలతాడు(దారం), రేకులతాడు, రేకులదారం, లంకెతాడు. రాట్నం ఆకులకు చుట్టినతాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు ఏటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15 క. 5 (కో. 1, 3, 9, 13, 24; తె. 9, 11, 12, 14-16, 20, 23; రా. 10, 11, 22, 23); **2.** పర్యా. చూ. గుమ్మిదారం. రాటిఆకులు పైవీ కిందివీ కలిపికట్టిన దారం చూ. చిత్రం 31 వ. 4 (తె. 7); **3.** అడ్డగుమ్మి ఆకులు కలిపి కట్టిన దారం (తె. 27).

**ఆకులదారం 1.** రూ. ఆకుదారం; పర్యా. చూ. ఆకులతాడు (1). రాట్నం ఆకులకు చుట్టినతాడు; ఒక వైపుఆకునుంచి రెండోవైపుఆకుకు ఏటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15 క. 5 (కో. 15, 19; తె. 27; రా. 9, 14-16); **2.** పర్యా. చూ. గుమ్మిదారం. రాటి ఆకులు పైవీ కిందివీ కలిపి కట్టినదారం. చూ. చిత్రం 31 వ. 4 (తె. 30).

**ఆకులమలక** పర్యా. చూ. ఆకులతాడు (1). రాట్నం ఆకులకు చుట్టినతాడు. ఒకవైపుఆకునుంచి రెండోవైపుఆకుకు ఏటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15 క. 5 (తె. 28).

**ఆకులరాటం 1.** ఉ. ఆకుర్రాటం; పర్యా. చూ. కండె(ల) రాట్నం. పేక (=నేతలో అడ్డం)కు పనికి వచ్చే దారపు కండెలు చుట్టేరాట్నం; మామూలు రాట్నం మీదనే కండెలు చుడతారు. చూ. చిత్రం 53 (కో. 2, 3); **2.** చూ. ఆకులరాట్నం. (కో. 3; రా. 16).

**ఆకులరాట్నం** రూ. ఆకులరాటం (2). ఇరుసుచుట్టూ రెండు వరసల్లో కొయ్యచెక్కలు (=ఆకులు) అమర్చి కట్టినరాట్నం; చూ. రాట్నం. చూ. చిత్రం 15 (తె. 1, 28, 30).

**ఆఖుర్** ఉ. హాఖుర్. తివాసీమగ్గం కట్టుబడిలో కింది దోనె; లావుగా, గుండ్రంగా ఉంటుంది. టేకుకొయ్యతో చేస్తారు; చూ. దోనుగ. చూ. చిత్రం 320. 1 (కో. 16).

**ఆట** ముందుకూ వెనక్కూ జరగటం; పడుగుతోడేటప్పుడు మరాను చెక్రాన్ని కొన్నిచుట్లు ముందుకు, కొన్నిచుట్లు వెనక్కు తిప్పుతారు. (కో. 8).

**ఆటకర్ర** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగేకర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్రలతాళ్ళూ, మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 12).

**ఆటచెక్రం** పర్యా. పళ్ళచెక్రం (1). మరాను తిరిగేటప్పుడు, బెండకాయచెక్రాన్ని తిప్పే మీదిచెక్రం; ఈ చెక్రంపళ్ళు బెండకాయచెక్రం గాడుల్లోకి వస్తాయి; దీనికి సుమారు 28 పళ్ళుంటాయి. చూ. చిత్రం 50.3 (కో. 12, 16).

**ఆటపావ(లు)** మడిమగూటానికి బిగించకుండా మామూలుగా కట్టిన పావుచెక్క(లు). చూ. చిత్రం 121 క. 2 (కో. 36).

**ఆటబల్ల** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాను కట్టుబడిలో, పడుగు పోగులు దూర్చే బెజ్జాలుగల రేకుముక్క(=ఒగ్గి)లు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాను తిరిగినప్పుడు, కీలు ఆడుతూ, దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది. చూ. చిత్రం 50. 11 (కో. 24, 26).

**ఆటబల్లరంపం** మరాను కట్టుబడిలో, కీలును, ఒగ్గులపట్టెను కలిపిన ముక్కోణపురేకు; కీలు ఆడినప్పుడు, ఇది ఒగ్గులపట్టెను ఆడిస్తుంది. చూ. చిత్రం 50. 13 (కో. 26).

**ఆడకట్టుచీర** పర్యా. ఆడకట్టుపంచె. వితంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకం బట్ట; తెల్లది; మామూలుగా, 60-100 నెంబరు నూలులో నేస్తారు; ఒక కొలికిదారంతో మామిడంచు పెట్టి నేస్తారు; కొన్ని చోట్ల, గోరంచుకాని, కడ్డీఅంచుకాని పెట్టి నేస్తారు. (కో. 19).

**ఆడకట్టుపంచె** ఉ. ఆడగట్టుపంచె; పర్యా. ఆడకట్టుచీర. వితంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకంబట్ట; తెల్లది; మామూలుగా, 60-100 నెంబరు నూలులో నేస్తారు; ఒకకొలికిదారంతో మామిడంచుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, గోరంచుకాని, కడ్డీఅంచుకాని పెట్టి నేస్తారు. (కో. 17, 18, 20, 21).

**ఆడకాయ** ఆడ దసలిపురుగు అల్లిన గూడు; చూ. దసలికాయ. (తె. 7).

**ఆడగోల** పర్యా. దండెకోల. ఉన్నిపడుగు మధ్యలో అనిపోగులు విడదియ్యటానికి (=అని తెరవటానికి) అచ్చుదగ్గర ఎక్కించిన కర్ర; నేతనేసేటప్పుడు, అని పోగుల మధ్యనుంచి పేకపోగు వేస్తారు. (తె. 27).

**ఆడదసలిపురుగు** దసలి (=ఒకరకంపట్టు) ఉత్పత్తి చేసే పురుగుల్లో ఆడది; దీనిపొట్ట లావుగానూ, రెక్కలు పెద్దవిగానూ ఉంటాయి; 150-200 వరకూ గుడ్లు పెడుతుంది; ఇది ఎక్కువదారం ఉత్పత్తి చేస్తుంది. (తె.7).

**ఆడపోగు** పర్యా. అచ్చుపోగు (2). ఆసుపోసేటప్పుడు కిందినుంచి పొయ్యే ఉన్నిపోగు (తె. 20).

**ఆడుగర్ర** ఉ. ఆడుకర్ర, వాడుగర్ర; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంద్; దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళూ, మధ్యలో పావుచెక్కలతాళ్ళూ కట్టిఉంటాయి; కొన్ని చోట్ల, దేవాంగులకు మాత్రం వాడుక; ఇటువంటివి, రెండు కర్రలుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 1-3, 7, 14; తె. 5, 10-17; రా. 4, 5).

**ఆడుగర్రతాడు 1.** ఉ. ఆడుకర్ర-; పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 12; రా. 4); **2.** పర్యా. చూ. అచ్చుగుది (2). మగ్గంలో పూనుగర్రకు కట్టేకదారం; అచ్చులో కింది కర్రకు ఉండేది; ఇటువంటివి, కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (కో. 1, 7).

**ఆడుగుది** పర్యా. చూ. అచ్చుగుది(2). మగ్గంలో పూనుగర్రకు కట్టిన దారం; అచ్చులో కింది కర్రకు ఉండేది; ఇటువంటివి, కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (తె. 24).

**ఆడుగోలగుది** ఉ.-గుతి, వాడుగోలగుతి; పర్యా. చూ. అచ్చుగుది(2). మగ్గంలో పూనుగర్రకు కట్టిన దారం; అచ్చులో కిందికర్రకు ఉండేది; ఇటువంటివి, కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121. 6 (తె. 8, 22, 23).

**ఆడుగోలతాడు** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (తె. 21, 28, 30).

**ఆడుగోలపలుపు** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (తె. 19).

**ఆడుగోలుకర్ర** ఉ. వాడుగలుకర్ర; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్కలు తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగేకర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్రలతాళ్ళూ, మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కట్టిఉంటాయి; ఇటువంటివి రెండు కర్రలుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 20, 21).

**ఆడుచెక్క** పర్యా. చూ. పావుచెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి, కొన్నిచోట్ల, అచ్చుకు రెండుచొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. (కో. 3).

**ఆడు(డు)గోల** ఉ. ఆడుకోల, వాడుకోల, వాడుగోల; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళూ, పావుచెక్కలతాళ్ళూ కట్టి ఉం

టాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (తె. 7-9, 18, 26, 28, 30-33).

**ఆత** చూ. హాటీ (కో. 26).

**ఆతచేయు** (క్రి.) ఉ. ఆత సేయు. పన్నెదండెలమధ్య బిగించినపుల్ల (=ఈనె)లు ఒకచోట దగ్గరగాను, ఒక చోట దూరంగాను లేకుండా సమంచెయ్యటం; హాటీతో ఒత్తుతారు. (కో. 26).

**ఆనందకలరు** ఉ. -కలరు; పర్యా. ఆనంద(రంగు). ఒకరకం ఆకుపచ్చరంగు. (రా. 16, 18).

**ఆనందచీర** ఒకరకం ఆకుపచ్చరంగు చీర. (తె.1).

**ఆనందబ్లూ** ఒకరకం నీలంరంగు (తె. 10).

**ఆనందంవేయు** (క్రి.) చౌడేశ్వరి పండుగనాడు, అమ్మవారి ఎదుట ఆడటం; నెత్తిమీద దీపాలు పెట్టుకొని చిందులుదొక్కుతారు; కొన్నిచోట్ల, అమ్మవారిని స్తుతిస్తూ 'ఖడ్గపద్యాలు' చదువుతారు; కత్తులతో దవడలు పొడుచుకొంటారు. (రా. 11, 16).

**ఆనంద(రంగు)** ఉ. ఆనందు-; పర్యా. ఆనందకలరు. ఒకరకం ఆకుపచ్చరంగు. చూ. చిత్రం 288 (కో. 33, 37; తె. 1, 2, 6, 9, 18, 26, 27; రా. 1, 10, 11, 14, 15, 19 బి. 22, 24).

**ఆనవాలుపెట్టు** (క్రి.) పర్యా. చూ. లచ్చన. అచ్చు తీకిన పడుగుమీద, కొలతనుబట్టి వేసినగుర్తు; మామూలుగా, మసిగుర్తు వేస్తారు; కొన్నిచోట్ల, చిక్కుడు, తీర మొ. వాటి ఆకుపసర్లతో గజానికి ఒకటి చొప్పునగాని, మూరకు ఒకటి చొప్పునగాని గుర్తులు వేస్తారు. (కో. 11).

**ఆనుకోలకర్ర** ఉ. అనుకోల-; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళూ, మధ్యలో పావుచెక్కతాళ్ళూ కట్టిఉంటాయి; ఇటువంటివి రెండుకర్రలుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 16, 28).

**ఆనె** చూ. అని (4). కురమవాళ్ళ వాడుక. (తె. 27).

**ఆనెగూటం** చూ. అనిగూటం. (తె. 27).

**ఆపు(బద్ద)** పర్యా. చూ. దవడ. పన్నె కట్టుబడిలో, ఈనె (పుల్ల)ల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో.6.)

**ఆఫ్రికారంగు(లు)** పట్టెమార్పుగుడ్డ (=రెండురకాల పట్టెలు ఒకటి విడిచి ఒకటి వచ్చేటట్టు నేసింది) మాదిరి రంగుగుడ్డ (లు); ఆఫ్రికాకు ఎగుమతి అయేవి. (కో.1).

**ఆముదంసబ్బు** ఆముదం (నూనె)తో తయారయిన సబ్బు; దీంతో నూలుతడిపి శుభ్రంచేస్తారు. (తె. 14).

**ఆరకజేయు** (క్రి). పర్యా. చూ. సరిచేయు (2). గంజిపెట్టిన పడుగును ఊడ్డెలకు చాపి, కుంచెతో దువ్వుతూ నేతకు అనుకూలం చెయ్యటం. (తె. 29).

**ఆరంజి(వన్నె)** ఉ. ఆరంజీ, ఆరెంజి. నారింజపండు రంగు; ఎరుపు, పసుపు వన్నెలు కలిసింది; ఎ. టి. ఎల్. బి. వేసి నెప్తాల్ ఆరంజి తయారుచేస్తారు; కొన్నిచోట్ల, ఎ. ఎస్. బి. ఎస్. వేసి తయారుచేస్తారు; చూ. నారింజ (పండు) రంగు. చూ. చిత్రం 288. (కో. 2, 6, 7, 26, 35, 36; తె. 10, 24, 25; రా. 6, 11, 16).

**ఆరికె 1.** ఉ. ఆర్క-. గంజిపెట్టటానికి చుట్టిన పడుగు; ఆరకెతుండ్లమీద వేసి పడుగు తడుపుతారు. (కో. 11); **2.** పడుగు; గంజిపెట్టింది. (తె. 26, 27, 30).

**ఆరికెఆర్చు** (క్రి.) ఉ. ఆరికార్చు. గంజిపెట్టిన పడుగు (=ఆరికె)ను ఆరబెట్టటం; ఆరుబయట చాపి, కుంచెతో దువ్వుతూ ఆరబెడతారు. (కో. 5).

**ఆరికెకొట్టు** (క్రి.) ఉ. ఆరికకొట్టు. గుడ్డపిడచతో, పడుగుకు గంజిపట్టించటం; పోగు బిరుసెక్కటానికి గంజి పట్టిస్తారు; కొన్నిచోట్ల అంబలిపెడతారు.(కో. 7, 10).

**ఆరికెజేయు** (క్రి.) ఉ. ఆరకజేయు. సరిచేసేటప్పుడు, కచ్చులులేపిన తరవాత, పడుగుకు మళ్ళీ గంజిపెట్టటం. (తె. 29).

**ఆరికెతడుపు** (క్రి.) ఉ. ఆర్క-. గుడ్డపిడచతో, పడుగుకు గంజి పట్టించటం; పోగు బిరుసెక్కటానికి గంజి పట్టిస్తారు; కొన్నిచోట్ల, అంబలి పెడతారు. (తె. 21, 30).

**ఆరికెతుండు** ఉ. ఆరిక-; పర్యా. తుండు (2), పీటకోడు, పూతకొయ్య. గంజిపెట్టటానికి, చుట్టిన పడుగు వేసుకొనే కొయ్య; ఇటువంటివి, రెండుంటాయి; మామూలుగా, సన్నపడుగులు పీటమీద తడుపుతారు. చూ. చిత్రం 75 (కో. 5, 7, 10, 11).

**ఆరుకాళ్ళపంజె** ఆరు ఆకులపంజె; పట్టుదారంచుట్టే పంజె మాదిరిగా ఉంటుంది. (తె. 10).

**ఆరుకుంచె** (-వేయు). సరిచేసేటప్పుడు, పడుగు ఆరుబదునులో ఉండగా, సందు (=రెండు కచ్చుల మధ్య భాగం) సందుకూ ఆపుతూ దువ్వేకుంచె; పడుగు బాగా ఆరేవరకూ సందు సందుకూ రెండు మూడుసార్లు నిదానంగా దువ్వుతారు; కొన్నిచోట్ల, సన్నపడుగులు దువ్వుతారు. (రా. 18).

**ఆరుగీరలంచు**. ఆరు గీతలు పడేటట్టు నేసిన అంచు. (కో. 35).

**ఆరుపు** (క్రి.) గంజిపెట్టిన పడుగును, ఎండబెట్టటం; ఆరబెట్టటం. (కో. 5, 7).

**ఆరువడును** పర్యా. ఎండుబడును. ఒక మోస్తరుగా ఆరినతడి; ఆరుబడును; పడుగు ఆరుబడునులో ఉన్నప్పుడు కుంచెతో బలంగా దువ్వుతూ కచ్చులు వేస్తారు. (తె. 5, 13, 14, 17).

**ఆరేళ్లగుంజ** పర్యా. సరిగుంజ (1). ఆరుబయట చూపిన పడుగు (=సరి) రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య; కొన్నిచోట్ల, రాతిస్తంభం; ఇటువంటివి రెండుంటాయి; ఒకవైపున ఊడైపన్ని రెండోవైపున గుంజ(లు) పాతుతారు. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (తె. 7).

**ఆర్టుసిల్కు** ఉ. ఆరటుచిల్కు, -చిల్కు. కృత్రిమపు పట్టు; అంచులు, కమ్ములు, డిజైన్లు మొ. వాటి నేతకు వాడతారు; దీన్ని మాయపట్టు, డైమాన్‌సిల్కు అనీ అంటారు. (కో. 12-14, 17).

**ఆలపురాయి** చూ. ఆలం(రాయి). (కో. 2; రా. 10).

**ఆలం(రాయి)** రూ. ఆలపురాయి, గడ్డలు గడ్డలుగా దొరికే ఒక లవణం; పటిక; అద్దకంరంగు తయారీకి, ముడిరంగులో కలుపుతారు; alum. (రా. 8, 12).

**ఆలివు 1.** ఉ. ఆలివ్వు. ఆకుపచ్చలో నలుపుచాయ; మానుగాయరంగు. చూ. చిత్రం 288 (కో. 6-9); **2.** పచ్చిమామిడికాయరంగు. (కో. 11).

**ఆలు 1.** ఒకసారి పేకిన దూది. (తె. 28); **2.** (< తమిళం. ఆళై; -విసురు). పర్యా. చూ. మరాసు. పెద్దపడుగులు ఒకేసారి పోసే ఒకరకం ఆసు; ఒక గోతిలో పెద్ద చెక్రం అమర్చి, దాన్ని తిప్పుతూ పడుగుపోస్తారు; 12-24 పడుగుల వరకూ ఒకేసారి దీనిమీదికి తోడవచ్చు. చూ. చిత్రం 50 (కో. 1).

**ఆలుగుంట** పర్యా. చూ. మరాసుగొయ్యి. మరాసు (=ఆలు) చెక్రం తిరగటానికి అనువుగా తవ్విన ప్రదేశం చూ. చిత్రం 50.6 (రా. 2).

**ఆలుమగలు(పోగులు)** పర్యా. గూడు (6). ఆసు పోసిన ఉన్నిపడుగులో ఒకటి పైకీ ఒకటి కిందికీ వచ్చిన రెండు పోగులు; అచ్చుపోగు, దండెపోగు కలిసి. (తె. 20, 23).

?**ఆవటం** మగ్గంనిలువులు పైకిగాని, కిందికిగాని జరపటం. (కో. 6).

**ఆవాలచుక్క** ఉ. ఆవాల్సుక్క. ఒకరకం అద్దకం డిజైను; అంచుల్లో వేస్తారు. (కో. 3).

**ఆవిటికత్తిరింపు** ఉగాది వెళ్ళిన తరవాత (=ఆవిటి) మృగశిరకార్తె ప్రారంభంలో ఉన్ని కత్తిరించటం. (తె. 27).

**ఆవిటిపున్నమి** ఆషాఢమాసంలో వచ్చేపౌర్ణమి; పితృదేవతలపేరుమీద బట్టలుపెట్టి పూజచేసి, కొబ్బరికాయ కొడతారు; ఈరోజునుంచి పదిరోజులపాటు నేతపని చెయ్యరు. (కో. 17).

**ఆవిరికుండ** పసిరిపురుగులను చంపటానికి, ఆవిరి పెట్టిన కుండ. చూ. చిత్రం 290 (తె. 7).

**ఆవుపూచీర** (< ? ఆవ-). రెండుకొలువుల రంగు దారం, ఒక కొలికనల్లదారం కలిపి నేసినచీర. (తె. 15).

**ఆష్టంచు** తెలుపుపట్టుకు తొగరంచుపెట్టి, చిట్టచివర నల్లపోగులు వచ్చేటట్టు నేసిన అంచు. (తె. 12).

**ఆసు** (కన్నడ.హాసు) **1.**(-తోడు,-పోయు-బోయు-వోయు, -విసురు) ఉ.వాసు; పర్యా. అసుబల్ల(3), ఆసుమాను, తానె (1), పడుగుబల్ల. సీమమాను. పడుగు (=నేతలో నిలువు) నూలుపోసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రాలు 45-47 (కో. 2-7, 9బి, 10-19, 21-31, 34-36; తె. 3-5, 7-14, 18-30; రా. 1, 5); **2.** (-తిప్పు, -తోడు,-విసురు). పర్యా. చూ. మరాసు. పెద్దపడుగులు ఒకేసారి పోసే కొయ్యపనిముట్టు; ఒక గోతిలో పెద్దచెక్రం అమర్చి, దాన్ని తిప్పుతూ పడుగు పోస్తారు; 12-24 పడుగులవరకూ ఒకేసారి దీనిమీదికి తోడవచ్చు. చూ. చిత్రం 50 (కో. 2; తె. 13); **3.** ఆసుపోసిన నూలు; రెండు సీళ్ళు(=లడీలు). (రా. 16).

**ఆసుకాయ** పర్యా. చూ. ఆసుగొట్టం (1). ఆసుపోసేగొట్టం; దీంట్లోకి పోగుతీసుకొని ఆసుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (కో. 2, 4; రా. 6, 7, 9).

**ఆసుకొయ్య(లు)** ఉ. ఆసుకొయ, ఆసుగొయ. ఆసుగొయ్య, ఆసుగొయ్యి, వాసుగొయ్య. **1.** పర్యా. ఆసుగొట్టం (1). ఆసుపోసే గొట్టం; దీంట్లోకిపోగు తీసుకొని ఆసుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (తె. 8, 10, 17-21; రా. 1, 4, 8, 10-14, 16, 18, 19, 22, 24); **2.** పర్యా. చూ. ఆసుగొట్టం (2). ఆసుపోసే గొట్టం; మామూలుగా, వెదురుది; కొన్నిచోట్ల, ఎముక; దీంట్లోంచి పోగుతీసి ఉన్నిపడుగు తోడతారు. చూ. చిత్రాలు 312. 5, 313 (తె. 7, 11, 25); **3.** పర్యా. ఆసుకోల, ఆసుగుంజ (1), ఆసుపుల్ల (3), ఆసుమేకు, ఆసుమొల. కొయ్య (8), కోల (3), కోలపుల్ల (2), గుంజ (10), చిల్ల (2), తానెకొయ్య (1), తానెపుల్ల, పట్టెపుల్ల, పుల్ల (4), మేకు (1), మొల (1), వరసపుల్ల, సీల (1). ఆసుపీటలకు దిగగొట్టిన నిలువు పుల్ల(లు); పీటిని చుట్టివచ్చేటట్టు (ఆసుకు) నూలు పోస్తారు; మామూలుగా, పీటకు ఒకచాలు చొప్పున కొయ్యలుంటాయి; కొన్నిచోట్ల, తలపీటకు రెండు చాళ్ళలోకూడా ఉంటాయి; మామూలుగా, తలపీట

కొయ్యలు వెనకపీట కొయ్యలకంటె ఒకటి ఎక్కువగాను, మధ్యపీట కొయ్యలు వెనకపీట కొయ్యలకు రెట్టింపూ ఉంటాయి. చూ. చిత్రం 45 క. 4-6. (కో. 22, 27-29, 31, 32; తె. 3-5, 9, 11-13, 22, 24, 28-30); **4.** పర్యా. చూ. కోతిపుల్ల (1). నేతనేసేటప్పుడు. అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గం మీద, దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండు వైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (రా. 19); **5.** పర్యా. చూ. ఆసుగూటం. ఉన్నిపడుగు నూలుతోడటానికి, నేలమీద పాతినపుల్ల; ఇటువంటివి, మూడువరసల్లో 3 : 2 : 3 చొప్పున ఉంటాయి. చూ. చిత్రం 312.1 (తె. 20).

**ఆసుకొలిమి** చూ. ఆసుకొలివి. (తె. 1.)

**ఆసుకొలివి** రూ. ఆసుకొలిమి, ఆసుకొళిమి, ఆసుకొళివి; పర్యా. చూ. ఆసుగొట్టం (1). ఆసుపోసేగొట్టం; దింట్లోకి పోగుతీసుకొని ఆసుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (రా. 16, 17, 23).

**ఆసుకొళిమి** చూ. ఆసుకొలివి. (తె. 2).

**ఆసుకొళివి** చూ. ఆసుకొలివి. (తె. 6; రా. 24).

**ఆసుకోల** పర్యా. చూ. ఆసుకొయ్య (3). ఆసుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టివచ్చేటట్టు (ఆసుకు) నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (తె. 18, 23).

**ఆసుకోలు** పర్యా. చూ. ఆసుగొట్టం (1). ఆసుపోసేగొట్టం; దింట్లోకి పోగుతీసుకొని ఆసుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (కో. 6).

**ఆసుగుంజ 1.** పర్యా. చూ. ఆసుకొయ్య (3). ఆసుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టివచ్చేటట్టు (ఆసుకు) నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (తె. 2, 6, 21); **2.** పర్యా. చూ. ఆసుగూటం. ఉన్నిపడుగునూలు తోడటానికి, నేలమీద పాతిన పుల్ల; ఇటువంటివి, మూడు వరసల్లో 3 : 2 : 3 చొప్పున ఉంటాయి. చూ. చిత్రం 312.1 (తె. 25).

**ఆసుగూటం** పర్యా. ఆసుకొయ్య (5). ఆసుగుంజ (2), గూటం (11). ఉన్నిపడుగునూలు తోడటానికి, నేలమీద పాతినపుల్ల; ఇటువంటివి, మూడువరసల్లో 3 : 2 : 3 చొప్పున ఉంటాయి. చూ. చిత్రం 312. 1 (తె. 6, 7, 9-11, 22, 28).

**ఆసుగొట్టం 1.** పర్యా. ఆసుకాయ, ఆసుకొయ్య (1), ఆసుకొళివి, ఆసుకోలు, ఆసుగోవి, ఆసుపుల్ల (1), ఆసుపూస (2), ఆసుపోతగొయ్య, ఆసుబుర్ర (1), ఆనుమానుపూస, గొట్టం (4), తోడుపుల్ల, పూసలకట్టె (1), బొంగరం, బొంగుకోలు, బొంగుగొట్టం, సీపుకొయ్య. ఆసుపోసేగొట్టం; మేక ముందుకాలి ఎముక కాని, కొయ్యదికాని ఇనపదికాని; దింట్లోకి పోగు తీసుకొని ఆసుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (కో. 5-10, 15; తె. 26, 27, 30-32; రా. 20); **2.** పర్యా. ఆసుకొయ్య (2), ఆసుబుర్ర(2). ఆసుపోసేగొట్టం; మామూలుగా, వెదురుది; కొన్నిచోట్ల ఎముకది; దింట్లోంచి పోగుతీసి ఉన్నిపడుగు తోడతారు. చూ. చిత్రాలు 312.5, 313 (తె. 6, 20, 22, 27, 28).

**ఆసుగోవి** ఉ. ఆసుగోయి, వాసుగోయి; పర్యా. చూ. ఆసుగొట్టం (1). ఆసుపోసేగొట్టం; దింట్లోకి పోగుతీసుకొని ఆసుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (తె. 22-25, 29, 33).

**ఆసుజంగ** పర్యా. అడ్డపట్టె (7), అడ్డపీట (5), అడ్డపెండె (1), ఆసుపెట్టె (2), ఆసుబల్ల (1), చాపుకట్టె, జంగతి (2) తానెకాలు, తోకపట్టె (4), నాగవాసం (3), నిడపకమ్మి (3), నిడిపట్టె (1), నిడిపీట (3), నిడిబల్ల (4), నిలుపీట, నిలువు (8), నిలువుకట్టె (2), నిలువుకమ్మి (6), నిలువుజంగ (1), నిలువుదబ్బ (1), నిలువుపట్టె (7), పట్టె (11), పడుగుదండె, పీటకట్టె (2), బారు (2) మానుకర్ర. ఆసుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినుంచి మూడువరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (తె. 20-25, 29).

**ఆసుతాడు 1.** పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీఅడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసినదారం; డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (తె. 5); **2.** పర్యా. చూ. కమానుతాడు. డిజైన్లు నేసే చేతిమగ్గానికి పైన కట్టి, అంచుల్లోకి వేలాడదీసిన పేటుదారం; ఇటువంటివి డిజైనకు అవసరమైనన్ని కడతారు. చూ. చిత్రం 134 క. 3 (తె. 5).

**ఆసుతోడు** (క్రి.) **1.** పర్యా. చూ. ఆసుపోయు. ఆసుగొట్టంలోకి పోగుతీసుకొని, ఆసుకొయ్యలకు చుట్టి వచ్చేటట్టు చెయ్యటం. (కో. 5-7); **2.** పర్యా. పడుగుతోడు. నేతలో నిలువుకువాడే పడుగునూలు మరానుకు చుట్టటం; చక్రం తిప్పినప్పుడు, డబ్బాలకు ఉన్న నూలు మరానుకు చుట్టుకొంటుంది. (కో. 10).

**ఆసుపట్టె 1.** పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్య (=ఆసుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి మామూలుగా, మూడు, కొన్ని చోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (కో. 3; తె. 18). **2.** పర్యా. చూ. ఆసుజంగ; ఆసు

పీటలు బిగించిన పొడుగుపట్టె; ఇవి, ఒకటినుంచి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 3).

**అనుపీట** ఉ. అనుపీఱ, అన్పీట, వానుపీట; పర్యా. అడ్డ (7), అడ్డకట్టె (6), అడ్డకమ్మి (5), అడ్డదబ్బ (1), అడ్డదాపు, అడ్డపట్టె (8), అడ్డపీట (6), అడ్డబల్ల (4), అనుపట్టె (1), అనుబల్ల (2), అనుమానుపట్టె అను, మొద్దు, కమ్మి (4), కోలబల్ల (2), తానెపట్టె, తానె పీట (1), దండెబల్ల (3), నిలువు (9), నిలువుపట్టె (6), పట్టె (12), పీట (12), బల్ల (3), మొద్దు (5). అనుకొయ్య (=అనుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి మామూలుగా, మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3. (తె. 5, 8, 11, 22-25, 29).

**అనుపుల్ల 1.** ఉ. అన్పుల్ల, అన్వుల్ల; పర్యా. చూ. అనుగొట్టం (1). అనుపోసేగొట్టం; దింట్లోకి పోగు తీసుకొని అనుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (కో. 9, 12-14; తె. 12-16; రా. 21); **2.** చిటికెపీటమీద నూలుతోడే గొట్టం; చూ. అనుపుల్ల (1). (తె. 11); **3.** పర్యా. చూ. అనుకొయ్య (3). అనుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటినిచుట్టి వచ్చేటట్టు అనుకు నూలు పోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (కో. 4, 6, 24).

**అనుపూస 1.** పర్యా. కోవిపూస, పూస (1). కొయ్య అనుగొట్టం చివర అమర్చిన గాజుపూస; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 48 చ. 1 (తె. 19); **2.** పర్యా. చూ. అనుగొట్టం (1). అనుపోసేగొట్టం; దింట్లోకి పోగుతీసుకొని అనుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (కో. 3).

**అనుపెండె** పర్యా. చూ. మేకు(ల)కమ్మి. మరాసు మీద పడుగు పోసేటప్పుడు, పడుగులో అనులు రావటానికి, మేకులు బిగించిన అడ్డకట్టె; ఒగ్గులపట్టె పక్కకు జరిగినప్పుడు, పడుగులో అనులు పడతాయి. చూ. చిత్రం 50.8 (కో. 5).

**అనుపోతగొయ్య** పర్యా. చూ. అనుగొట్టం (1). అనుపోసేగొట్టం; దింట్లోకి పోగుతీసుకొని అనుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (తె. 28).

**అనుపోయు** (క్రి.) ఉ. అనుబోయు, అనువోయు, వానుబోయు; పర్యా. చూ. అనుతోడు (1), అనువిసురు, తోడు (2), నూలుపోయు (2), నూలువిసురు పడుగు తోడు (1) పడుగుపోయు (1) పడుగువిసురు (2), పొగడపోయు (2), పోయు, విసురు, సీడుపోయు. అనుగొట్టంలోకి పోగుతీసుకొని అనుకొయ్యలకు చుట్టివచ్చేటట్టు చెయ్యటం. (కో. 1, 2, 4, 6, 8-10; తె. 1-14, 22, 25, 28-30; రా. 14, 16-18, 21-24).

**అనుబల్ల 1.** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినుంచి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7; **2.** పర్యా. చూ. అనుపీట. అనుకొయ్య (=అనుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (కో. 27, 29, 30, 32, 34, 35); **3.** పర్యా. చూ. అను (1). పడుగు (=నేతలో నిలువు) నూలుపోసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రాలు 45-47 (కో. 32, 33, 36).

**అనుబుర్ర 1.** పర్యా. చూ. అనుగొట్టం (1). అనుపోసేగొట్టం; దింట్లోకి పోగు తీసుకొని అనుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (కో. 2; తె. 5, 7, 9); **2.** పర్యా. చూ. అనుగొట్టం (2). అనుపోసే గొట్టం; మామూలుగా, వెదురుది; కొన్నిచోట్ల, ఎముక; దింట్లోంచి పోగుతీసి ఉన్నిపడుగు తోడతారు. చూ. చిత్రాలు 312.5, 313 (తె. 3, 10).

**అనుమాను** ఉ. అనుమాన, అస్మాన్, అస్మాను; పర్యా. చూ. అను (1). పడుగు (=నేతలో నిలువు) నూలుపోసే కొయ్య పనిముట్టు. చూ. చిత్రాలు 45-47 (కో. 1, 2, 6, 8, 9; తె. 1, 2, 6; రా. 2, 4, 6-14, 16-24).

**అనుమానుపట్టె** ఉ. అస్మానుపట్టె; పర్యా. చూ. అనుపీట. అనుకొయ్య (=అనుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (రా. 24).

**అనుమానుపూస** పర్యా. చూ. అనుగొట్టం (1). అనుపోసేగొట్టం; దింట్లోకి పోగుతీసుకొని అనుపోస్తారు. చూ. చిత్రాలు 48 క-ట (కో. 2).

**అనుమేకు** పర్యా. చూ. అనుకొయ్య (3). అనుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టివచ్చేటట్టు అనుకు నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (తె. 14).

**అనుమొద్దు** పర్యా. చూ. అనుపీట. అనుకొయ్య (=అనుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (తె. 18).

**అనుమొల** పర్యా. చూ. అనుకొయ్య (3). అనుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టివచ్చేటట్టు అనుకు నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (తె. 19).

**ఆసురాట్నం** పర్యా. చూ. డబ్బా(ల) రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం. చూ. చిత్రం 41 క. (కో. 37).

**ఆసువిసురు** (క్రి.) పర్యా. చూ. ఆసుపోయు. ఆసు గొట్టంలోకి పోగు తీసుకొని, ఆసుకొయ్యలకు చుట్టి వచ్చేటట్టు చెయ్యటం. (కో. 23).

**ఆస్తిన్** మరమగ్గం చట్రంలో నిలువుగా బిగించిన పట్టె; చూ. మగ్గంచట్టం (తె. 7).

**ఆస్మాన్** (హిందూస్తానీ) ఉ. ఆసమాన్, ఆస్మాను. **1.** నీలంరంగు; blue; నీలంరంగు, వయిలెట్ రంగు వేణ్ణీళ్ళలోకలిపి, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేసి తయారు చేస్తారు. చూ. చిత్రం 228 (తె. 4, 5, 8, 11, 17, 19, 20, 22, 23, 25, 27, 28); **2** ఆకాశంరంగు (తె. 10, 18, 30); **3.** నలుపులో తెలుపు కలిపిన రంగు (తె. 12).

**ఆస్మాన్‌చీర** నీలంరంగు చీర (తె. 28).

## ఇ

**ఇగంఎక్కు** (క్రి.) ?నునుపుతగ్గటం; నేతనేసేటప్పుడు, నునుపు తగ్గిన నాడెకు నూనె రాస్తారు. (రా. 22).

**ఇగ్గు** (క్రి.) గుంజటం; లాగటం (రా. 13, 24).

**ఇచ్చుపోగు** (< ? విచ్చుపోగు). మామిడిపిందె అంచులో, మధ్యగాపడ్డ పోగు (తె. 18).

**ఇచ్చె** ఉ. ఇచ్చి విచ్చె. నూలుకొలత; **1.** లడీలో పదోవంతు నూలు (కో. 6, 7 10 15; రా. 2, 10 20); **2.** లడీలో డెబ్భయ్యోవంతు నూలు (రా. 11).

**ఇచ్చెలబండి** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు. పంజె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలప (=ఇచ్చె) నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (కో. 10).

**ఇచ్చెలరాటం** ఉ. ఇచ్చిల్రాటం; పర్యా. చూ డబ్బా(ల)రాట్నం. చిలపల నూలు డబ్బాలకు తోడేరాట్నం. చూ. చిత్రం 41 (కో. 10).

**ఇజ్జోడు(పుల్లలు)** ఉ. ఎజ్జోడా; పర్యా. చూ. ఎత్తుపుల్ల (2). అచ్చుతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండు పుల్లలకు తాడుగట్టి, మడతమంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (కో. 33, 36).

**ఇంచు** (? < ఎంచు; క్రి.) కొలపటం; పన్నెదంజెల మధ్య బిగించే పుల్ల (ఈనె)లు టుకినీతో కొలతచూసి తెంపుతారు. (కో. 1).

**ఇటాలీనీలి** ఒకరకం నలుపురంగు; పాలచాయను మించిన నలుపు. (కో. 2).

**ఇటికెపెల్లలంచు** ఇటికముక్కలు పేర్చినట్టు నేసిన డిజైను అంచు; చూ. ఇటికెపేటు. చూ. చిత్రం 148 (తె. 11).

**ఇటికె(ల)పేటు** ఇటికెలు పేర్చినట్టుపడే ఒకరకం నేత డిజైను; ఇటికెపెల్లలంచు. చూ. చిత్రం 148 (రా 8, 13).

**ఇండంత్రీ(న్)** ఉ. ఇదెంత్రి ఇంతెంత్రి, ఇండంత్రి, ఇందాంత్రి, ఇండాంత్రీను, ఇండెంత్రి, ఇండాద్రి, ఇనెంతల, ఇందాంత్రి. పర్యా. ఉడుకురంగు. నీళ్ళలో ఉడకబెట్టి నూలుకు వేసేరంగు; వ్యాట్ కలరు; దీంట్లో రసాయనాలు వేస్తారు; రంగు చాలాకాలం నిలబడుతుంది. (కో. 6, 8, 11, 12, 14-21; తె. 5-8, 12, 17-22, 24, 25-33; రా. 11, 15, 23).

**ఇనపకడ్డీ** పర్యా. కిప్పుమానుగునపం. కానిగుంజకు తగిలించిన కడ్డీ; తడిపిన నూలులడీలు దీనికి తగిలించి కర్రతో పిండుతారు. (రా. 8).

**ఇనపకోవి** ఉ.-కోయి. ఇనప ఆసుగొట్టం; చూ. ఆసుగొట్టం (1). (తె. 33).

**ఇనపగొట్టం** కానిగుంజకు తగిలించిన ఇనపగొట్టం; తడిపిననూలు లడీలు దీనికి తగిలించి, కర్రతో పిండుతారు (కో. 26).

**ఇనపతూకం** పర్యా. చూ. తూకం. పేటువడికి, కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపపుల్ల(లు); కొన్నిచోట్ల సత్తువి; నేతనేసేటప్పుడు, అని మూసిన తరవాత, వడి, కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి రెండుపక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (తె. 9).

**ఇనపపురికడ్డీ** పర్యా. చూ. తూకం. పేటువడికి, కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపపుల్ల(లు); కొన్నిచోట్ల సత్తువి; నేతనేసేటప్పుడు, అని మూసిన తరవాత, వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి, రెండుపక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (రా. 14).

**ఇనపబొద్దె** పంజెముక్కకు బిగించిన ఇనప తొడుగు. చూ. చిత్రం 22 (తె. 6).

**ఇందిరాణిచీర** మధ్యలో, మూడేసి కొలుకుల చొప్పున నిలువుగీరలు పెట్టి నేసిన చీర (రా. 24).

**ఇందె** నరుకు; గాడి; పెడకోలకు చివర, మలగుది తగిలించటానికి గాడిచేస్తారు. చూ. చిత్రం 127. 12 (తె. 14).

**ఇమురుతాడు** పర్యా. చూ. మడిమతాడు. పావు చెక్కను గూటానికి బిగించే వెనకతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 3 (రా. 24).

**ఇరకలంచు** 1. ఉ. ఇరికలంచు. ?ఇరుకలంచు; రూ. ఎరకలంచు. నాలుగు లాహిరీలు రెండు బుగిడిలు పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 149 (తె. 1, 6, 18, 19, 22, 23, 28); 2. గీరలు గీరలుగా నేసిన ఒకరకం అంచు (తె. 4).

**ఇరక(లు)** 1. ఉ. ఇరిక, ఇరుక; రూ. ఎరక; పర్యా. చూ. లాహిరీ. ఒకవైపుకు మొనదేలిన గుర్తులు వరసగా, దగ్గర దగ్గరగా నేసిన డిజైను. చూ. చిత్రం 149 (తె. 1, 6, 18, 19, 22, 23, 28); 2. అంచునేతలో పడే ఒకరకం గీర(లు). (తె. 4.).

**ఇరకాలకర్ర** నూలు చుట్టేటప్పుడు పంటెకర్రను మోపి తిప్పటానికి, ముద్దగొయ్యకు బిగించిన పంగల కర్ర. చూ. చిత్రం 24 (కో. 2).

**ఇరవ** రూ. ఇరి; పర్యా చూ. కోతిపుల్ల (1). నేత నేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్య; దీనికి రెండువైపులా అచ్చుగుడులు మెలిపెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (కో. 25, 26, 34).

**ఇరవచెక్రం** చూ. ఇరువుచెక్రం. (కో. 22).

**ఇరవలకర్ర** పర్యా. చూ. ఇరవలదండి. కోతిపుల్లలుగాని, గిలకలు గాని వేలాడదియ్యటానికి, మగ్గానికి పైన, దారాలు కట్టినకర్ర. చూ. చిత్రం 121 క. 13 (కో. 25).

**ఇరవలదండి** పర్యా. ఇరవలకర్ర, గిరకలజడితె, చిలకడ్డకర్ర, చిలక(ల) కర్ర, చెక్రాలకర్ర, దొడ్డికర్ర, పట్టె (7). కోతిపుల్లలుగాని, గిలకలుగాని వేలాడదియ్యటానికి, మగ్గానిపైన, దారాలు కట్టినకర్ర. చూ. చిత్రం 121 క. 13 (కో. 26).

**ఇరవలెత్తు** (క్రి.) మగ్గం అమర్చేటప్పుడు, అచ్చుగుడులు కోతిపుల్లలకు తగిలించటం; చూ. ఇరవ. (కో. 32).

**ఇరి** చూ. ఇరవ. (కో. 33).

**ఇరుక్కంతె** (< ఇరుకు + కంతె). పర్యా. చూ. పాదరగూడు. నేతనేసేటప్పుడు, మగ్గంచట్రం ముందుకు, వెనక్కు ఆడటానికి అనువుగా, ఒకవైపు గోడలో చేసినగూడు (= కంత). (రా. 9).

**ఇరుపుఉప్పు** ఒకరకం లవణం; రంగుల అద్దకంలో ఉపయోగిస్తారు. (కో. 7, 8).

**ఇరువు** 1. ఆధారం (కో. 1); 2. మగ్గందోనెకు, దండెకు మధ్యభాగం (కో. 33).

**ఇరువుకొండి** పర్యా. చూ. కొండి (6). అచ్చుగుడులు తగిలించే వంకర ఇనపఊచ; దీన్ని మామూలుగా, మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల, అచ్చుగుడికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండి కూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (రా. 19).

**ఇరువుగోలుచెక్రం** పర్యా. చూ. గిరక (6). మగ్గంమీద, అచ్చుగుడులు తగిలించే కొయ్యకప్పీ; దీన్నిమగ్గం పైదండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 11 (కో. 1).

**ఇరువుచెక్రం** రూ. ఇరవచెక్రం. పర్యా. చూ. గిరక (6). మగ్గంమీద, అచ్చుగుడులు తగిలించే కొయ్యకప్పీ; దీన్ని మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 11 (తె. 25).

**ఇరువుతాడు** 1. పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (రా. 5); 2. కోతిపుల్లనుగాని, పూనకోలునుగాని మగ్గంపైనుంచి వేలాడదియ్యటానికి కట్టినతాడు; చూ. పూనకోలు సూత్రం. చూ. చిత్రం 121 ట. 4 (కో. 1, 3; రా. 5, 19బి); 3. డిజైన్లు నేసేమగ్గంలో, పేటుపడి వేలాడదియ్యటానికి పైనకట్టిన తాడు. (కో. 1).

**ఇరువులకట్టె** పర్యా. చూ. అడ్డకట్టె (10). నేత బయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి, నిలువు రాటలకు అడ్డంగా, మామూలుగా బిగించినకర్ర; కొన్నిచోట్ల, దీనికి అచ్చుతాళ్ళు తగిలిస్తారు. చూ. చిత్రం 116. 1 (రా. 19).

**ఇరుసు** ఉ. ఇర్సు, విరుసు. 1. పర్యా. చూ. సంగటికోల. పత్తిరాట్నం నిలువులమధ్య రూళ్ళకర్ర మాదిరిగా అమర్చినకట్టె; ఇటువంటివిరెండు, ఒకదాన్నొకటి అనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడిపత్తి పెట్టినప్పుడు, ఒకవైపు గింజలు మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1. 1 (రా. 10); 2. పర్యా. కమ్మి (1), గడారు (1). రాట్నం ఆకులు తిరగటానికి నిలువులకు బిగించిన ఇనపచువ్వ. చూ. చిత్రం 15 క. 7 (కో. 1, 3-37; తె. 1-33; రా. 1-15, 17-24); 3. పర్యా. కడ్డీ (2), గడారు (2). దబ్బాలరాట్నం చెక్రం తిరగటానికి నిలువులకు బిగించిన ఇనపచువ్వ. చూ. చిత్రం 41 క. 10 (కో. 1-7, 10, 21, 26, 35; రా. 7-11, 17-20, 22); 4 పర్యా. గుమ్మిఇరుసు. అడ్డగుమ్మి తిరగటానికి ఆధారంగా ఉండే కర్ర. చూ. చిత్రం 34. 6 (తె. 18, 25-28; రా. 11, 13); 5. అడ్డగుమ్మి ఆకుల బిగింపుకు వేసినదిండు. చూ. చిత్రం

34. 7 (తె. 21); **6.** పర్యా. డోరిఇరుసు. మరాసు చక్రంలో ఆకులు బిగించిన పొడుగాటి ఇనపకడ్డీ. చూ. చిత్రం 50. 10 (కో. 5, 6, 11-16, 18-24, 26, 36; తె. 5, 8, 13; రా. 17, 18, 24); **7.** పట్టుదారం వడికే పెద్దరాట్నం కట్టుబడిలో, చక్రం బిగించిన ఇనపకడ్డీ. చూ. చిత్రం 293 చ. 3 (కో. 14; తె. 5); **8.** పట్టుదారంతోడే డొలక కట్టుబడిలో మధ్యఉండే పొడుగాటికట్టె. చూ. చిత్రం 293 క. 1 (తె. 5, 21).

**ఇరుసుచెవి 1.** పర్యా. చూ. తొడప (1). రాట్నం నిలువులకు ఆకుల రాపిడి తగలకుండా మధ్యన వేసిన కొయ్యబిళ్ళ. (కో. 20); **2.** పట్టుదారం వడికే పెద్ద రాట్నం ఇరుసును మోసే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 293 చ. 1 (తె. 5).

**ఇర్రించు** (క్రి.) పన్నెగూళ్ళలో బద్దెపోగులు, ఎక్కించటం; ఇరికించటం. (కో. 35).

**ఇల్లింత** పులిచేరుచెట్టు మాదిరి ఒకరకం చెట్టు; దీని ఆకులుగసిలి(=ఒకరకంపట్టు)పురుగులకు ఆహారం(తె.7).

**ఇల్లు 1.** పర్యా. చూ. కొలికి (1). ఆనుపోసిన నూలులో ఒకటి పైకి, ఒకటి కిందికి వచ్చిన రెండు పోగులదారం. (రా. 16, 17, 24); **2.** పర్యా. చూ. గూడు (3). పన్నెదండెలకు బిగించినపుల్ల (=ఈనె)ల మధ్య వెలితి; అచ్చుకట్టేటప్పుడు, ఒక్కొక దాంట్లో రెండేసి బద్దెపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 88 క. 9 (తె. 6; రా. 16-18, 23 24).

**ఇస్టిన్‌కోరా** ఉ.-కోర. పసుప్పచ్చలో ఒకవన్నె తక్కువ ఉండే ముడిపట్టు (=కోరా). (తె. 12).

## ఈ

**ఈటుబద్ద** రాట్నంబొమ్మ గాడిలోనుంచి కదురు దిండు మీదికి అమర్చినపుల్ల; ఇది ఉంటే, పురి పక్కలకు జరగదు. (తె. 24).

**ఈడిగంచు** రూ. ఈరిఅంచు. ఒక కొలికి రంగుపోగులకు, ఒకపక్కన తెలుపు, మరొకపక్కన జమిలి పోగులు పెట్టి నేసిన అంచు. (కో. 3).

**ఈడుపు(ఒ)** ఉ. ఈక్పు. అడనూ డాబీనీ కలిపే దారం. చూ. చిత్రం 132 క. 6 (రా. 8).

**ఈతపట్ట** ఈతాకు చదర(ముక్క); నారపడుగుకు గంజిపెట్టటానికి వాడతారు. (తె. 25).

**ఈతపేటుచీర** అంచులో ఒకరకం ఈతాకు డిజైను నేసిన చీర. (కో. 33).

**ఈతబొద్దంచు** చీర చివరలో నేసిన ఒకరకం అంచు (కో. 30).

**ఈతాకుపేటు 1.** అంచులో ఈతాకు మాదిరిగా (లాహిరి) నేసిన డిజైను. చూ. చిత్రం 149 (కో. 33; తె. 13); **2.** పదిహేను కొలుకుల దారంతో ఒకరకం దువ్వెనపేటు మాదిరిగా నేసిన అంచు డిజైను; ఇది నెయ్యటానికి, మగ్గంగుంటలో అయిదు పావుచెక్కలు అమరుస్తారట. (తె. 14).

**ఈనగోవచీర** రెండు కొలుకుల దారం (=ఈనె) ఒకరంగు, రెండు కొలుకులు మరొకరంగు చొప్పున వరసగా అచ్చుతికి నేసిన చీర. (కో. 30).

**ఈనజాడ** చూ. ఈనజాడి. (కో. 36).

**ఈనజాడి** రూ. ఈనజాడ, ఈనిజాడ; పర్యా. కవజాడి, కవసందు. నేతలో రెండు పోగులు తెగినప్పుడు వచ్చిన వెలితి. (కో. 32, 35).

**ఈనిజాడ** చూ. ఈనజాడి. (కో. 37).

**ఈనె** (బహు. ఈండ్లు, ఈనెలు); ఉ. ఈన, ఈని, వీనె **1.** పర్యా. అచ్చీనె, ఈనెపుల్ల[1] (1), కలపపుల్ల, కాడీ, పన్నీనె, పేకు. పన్నెకట్టుబడిలో, దండెలమధ్య, దువ్వెనపళ్ళ మాదిరిగా, వరసగాకట్టిన కలప, జొన్న, గలుగు, వెదురు, కొండచీపురు మొ. వాటి పుల్ల(లు); కొన్నిచోట్ల, పట్టునేతకు ఇనుము, ఇత్తడి, ఉక్కు మొ. వాటి ఊచలు వాడతారు. చూ. చిత్రం 88 క. 8 (కో. 1-37; తె. 1, 2, 4, 5, 7, 11, 14-17, 21, 27, 28, 31; రా. 10 11, 13, 18, 23, 24); **2.** పర్యా. చూ. కొలికి (1). ఆనుపోసిన నూలులో ఒకటి పైకి ఒకటి కిందికి వచ్చిన రెండు పోగులదారం. (కో. 1-3; రా. 8, 18); **3.** పర్యా. చూ. గూడు (3). పన్నెదండెలకు బిగించిన పుల్లల మధ్యవెలితి; అచ్చుకట్టేటప్పుడు, ఒక్కొకదాంట్లో రెండేసి బద్దెపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 88 క. 9 (తె. 8).

**ఈనెగీతకత్తి** పర్యా. చూ. గీరుకత్తి. పన్నెదండల మధ్య బిగించే ఈనె(పుల్ల)లు చీల్చి, సాపుచేసే రేకుకత్తి; ఒకవైపున వంపుగా గాడి ఉంటుంది; మామూలుగా, ఒక వెదురుబొంగును సగానికి చీల్చి, మధ్యగా ఈ కత్తి ఇరికిస్తారు; కొన్నిచోట్ల,గుంజకు కోటాబద్ద కట్టి, రెంటికీ మధ్య కత్తి దూరుస్తారు. చూ. చిత్రం 89 క. 6 (కో. 33).

**ఈనెగోరంచు** ఉ. ఈనగోరంచు.ఒకరకం గోరంచు;

రెండు పోగులలో కన్నెలు పడేట్టు చేసింది; కొన్నిచోట్ల చివరవిడిచి కన్నెలుపెట్టి, తరవాత వెల్లనేత నేస్తారు. చూ. చిత్రం 150 (కో. 26, 28, 31).

**ఈనెనాడె** ఉ. ఈన్నాడె. కప్పునేతలో బొద్దు(=పట్టె)లు పడేట్టునెయ్యటానికి వాడే నాడె; ఈన్నాడె (కో. 30).

**ఈనెపుల్ల** 1. పర్యా. చూ. ఈనె(1). పన్నె కట్టు బడిలో, దండెలమధ్య, దుప్పోగుపన్నెమాదిరిగా పడేట్గా కట్టిన కలప, జొన్న, గలుసు, వెదురు, కొండచీపురు మొ.వాటిపుల్ల(లు); కొన్నిచోట్ల, పట్టునేతకు ఇనుము, ఇత్తడి, ఉక్కు మొ.వాటి ఊచలు వాడతారు. చూ. చిత్రం 88 క. 8 (తె. 4); 2. నేతనేసేటప్పుడు, పడుగులో తెగినపోగును దగ్గరకు లాగటానికి, పన్నెగూడు లోనుంచి పోగులు లాగటానికి వాడే ఇనపముల్లు; కంటాణిమాదిరది. చూ. చిత్రం 94 (కో. 26).

**ఈనెపొడుచు** (క్రి.) ఉ. ఈనుపొడుచు; పన్నె ఈనెలనందులో పోగులు దూర్చటం (కో. 35, 37).

**ఈనెబొత్తంచు** ఉ. ఈర–. చివర గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు. చూ. చిత్రం 151 (కో. 31).

**ఈనెలంచు** గీరలుగీరలుగా నేసిన ఒకరకం అంచు. (కో. 26).

**ఈనెసందు** ఉ. ఈని–; పర్యా. చూ. గూడు (3). పన్నెదండెలకు బిగించినపుల్ల (=ఈనె)లమధ్య వెలితి, అచ్చుకట్టేటప్పుడు, ఒక్కొక్కదాంట్లో రెండేసి జద్దె పోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 88 క. 9 (కో. 1, 24; రా. 11).

**ఈరకత్తెలచీర(లు)** పెళ్ళిళ్ళలో వియ్యపురాళ్ళు, ఒకరికొకరు పెట్టుకొనేచీర(లు) (కో. 33).

**ఈరగాసు** రూ. ఈరేకాంచు. ?మైలతుత్తం; నలుపు అద్దకపురంగు తయారుచెయ్యటానికి, ముసిరంగులో కలిపే ఒక రసాయనం (తె. 8).

**ఈరిఅంచు** చూ. ఈడిగంచు (కో. 3).

**ఈరేకాంచు** చూ. ఈరగాసు (రా. 24).

**ఈలపీట** కత్తిపీట; నూలుతోడేటప్పుడు, దీనికి పైనుండే చిల్లి(=చిద్రం)లోనుంచి రేషంపోగు తీసి రాట్నానికి తోడుకొంటారు (తె. 21).

**ఈలాయి** పర్యా. చూ. డబ్బా(1). పంటెకుబదులు, నూలుచుట్టుకొనే రేకుడబ్బా; కొన్నిచోట్ల, రేకుపట్టెలు బిగించింది; కొన్నిచోట్ల కొయ్యది. చూ. చిత్రం 30 (రా. 5).

## ఉ

**ఉకారకుండ** రంగు అద్దేటందుకు నూలుతడిపే ఒకరకం మిశ్రమం (=కారం నీళ్ళు) పోసేకుండ (తె. 14).

**ఉకారకొట్టు** (క్రి.) పర్యా. ఉకారతీయు(2). కానిగుంజ అడ్డకట్టెకు తగిలించిన తడి నూలుబడిలు సాపు అయ్యేట్టు జాడించటం (తె. 13).

**ఉకారగుంజ** పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలుబడిలు పిండటానికి నేలలో పాతిన పొడుగు రాడు; మామూలుగా కొయ్యది; కొన్నిచోట్ల, ఇనపది; మామూలుగా దీనికి, శిలువమాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిల్లిచేసి, దాంట్లో గుదపందూర్చి, బడిలు తగిలించి పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (తె. 13).

**ఉకారతీయు** (క్రి.) 1. రంగు అద్దేముందు, నూలు బడిలు కారంనీళ్ళలో వేసి పిసకటం (తె. 12); 2. పర్యా. ఉకారకొట్టు. కానిగుంజ అడ్డకట్టెకు తగిలించిన తడి నూలుబడీలు సాపుఅయేట్టు జాడించటం. (తె. 13).

**ఉకార(ం)** 1. ఉ. ఉకారు, ఉఖార; పర్యా. చూ. కారం(1). నూలు రంగును పీల్చుకోటానికి తయారు చేసిన మిశ్రమం; నువ్వుకంప (కొన్నిచోట్ల నాగజెముడు బొంత), బూడిద, గొర్రెపేడ, నూనె మొ.నవి వేసి తయారుచేస్తారు. దీంట్లో చన్నీళ్ళుపోసి ఊరబెట్టి నూలు బడిలువేసి బాగా పిసుకుతారు; తరవాత రంగు అద్దుతారు (తె. 5, 12); 2. పర్యా. చూ. కారం (2). చౌడు, సున్నం కలిపిననీళ్ళు; రంగుఅద్దేముందు దీంట్లో నూలుబడిలువేసి ఉడకబెడతారు (రా. 14).

**ఉకారంతీయు** (క్రి.) పట్టుదారాన్ని చలవచెయ్యటం (రా. 14).

**ఉకారు** (–తీయు). ముడిపట్టు(=కోరా)కు ఉండే మాలిన్యం (తె. 21).

**ఉక్కడం** 1. పర్యా. చూ. పంటె. చేత్తో నూలు చుట్టే పనిముట్టు. చూ. చిత్రం 19 (కో. 27, 31); 2. ముతకనూలు చుట్టే పెద్దపంటె. చూ. చిత్రం 19 క. (కో. 22).

**ఉక్కడంమూతి** పర్యా. చూ. పంటెముక్కు. పంటెకు కిందివైపున ఆకులచివర్లను కలిపికట్టిన కొన. చూ. చిత్రం 19 క. 6 (కో. 31).

**ఉక్రెడం** పర్యా. చూ. బిరుతాడు(1). మరమగ్గం నిలువుపట్టెను, మేరువుపలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టినదారం; మేరువుపలకను పైకిగాని,

కిందికిగాని జరుపుకొని, దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 6).

**ఉక్కెడంచుట్టు** (క్రి.) మెలిదిప్పటం; మగ్గం బిర్రు తాకుకు, పుల్ల పెట్టి మెలివిప్పుతాడు (కో. 6).

**ఉగాదిపండుగ** సంవత్సరాదినాడు, పద్మశాలీలు భావనారుషికి చేసే పండుగ; పులివాహనం మీద ఒక సర్పంబొమ్మపెట్టి ఊరేగిస్తారు; ఇంటింటికీ కొబ్బరి కాయలు కొడతారు (కో. 27).

**ఉగ్గం** (-కట్టు) ఒకచెంబుగాని, ముంతగాని పట్టుకో టానికి వీలుగా, మూతికి కట్టినతాడు. (తె. 7).

**ఉగ్గంతాడు** ఉన్నిపకులబుట్ట పట్టుకోటానికి వీలుగా, మూతికి కట్టినతాడు; కొన్నిచోట్ల, దీన్ని బుజానికి తగి లించుకొంటారు. చూ. చిత్రం 310.1 (తె. 7, 9, 28).

**ఉగ్గలపట్టీ** చూ. ఒగ్గులపట్టె (కో. 20).

**ఉగ్గీలబల్ల** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాసుకట్టు బడిలో, పడుగుపోగులుదూర్చే, బెజ్జాలుగల రేకుముక్క (=ఒగ్గి)లు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాసు తిరిగినప్పుడు, కీలుఆడుతూ, దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది. చూ. చిత్రం 50.11 (కో. 24).

**ఉగ్గులు** (బహు.) ముడతలుపడ్డ పడుగుపోగులు; వీటిని చేతులతో వరతారు (కో. 33, 34).

**ఉంగరం** ఉ. ఉంగురం, ఉంగ్రం. **1.** పకుపాత్తి (తోలుది)కి చివరవేసిన సన్నటి తోలుముక్క; పొత్తిలో నుంచి దూర్చిన పకు రెండోకొన, వేలాడకుండా దీంట్లో మడిచిపెడతారు. చూ. చిత్రం 17 క. 3 (తె. 2); **2.** పర్యా. కొండి(1). ప్రంకరుదుక్కకు బిగించిన ఇనప కొక్కెం; నూలుపోగు దీంట్లోకి దూర్చి ప్రంకరుకు చుడ తారు. చూ. చిత్రాలు 38 క. 4, 38 ట. 2 (తె. 2); **3.** పర్యా. పూస (2), రింగు (1). మరాసు ఒగ్గుల పట్టెకు బిగించిన చిన్న ఇనపచుట్టు; దీనిగుండా పడుగు పోగు మరాసుమీదికి పోతుంది. చూ. చిత్రం 50.15 (తె. 13; రా. 2); **4.** కండెలు చుట్టేటప్పుడు నూలు పోగు, సాపుగా రావటానికి దూర్చే రింగు; ఇది, నీళ్ళు పోసిన సానికెలో పెడతారు. చూ. చిత్రం 60 (రా. 1); **5.** పడుగేరుకర్రకు బిగించిన గుండ్రటి ఇనపకొండి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69.1 (రా. 2); **6.** పర్యా. వంకెనకడియం. వంకెన(=పడుగేరుకర్ర బిగింపుకోసం తగిలించే ఇనపకొక్కెల పనిముట్టు)కు వేసిన ఇనపచుట్టు. చూ. చిత్రం 70 త. 1 (తె. 26, 27); **7.** పర్యా. నాడెఉంగరం, రింగు(2). చేతినాడెగాడిలో, బుసిపుల్లకు వేసిన, చిన్నచుట్టు - ఇత్తడిదిగాని, ఇనపది గాని; పేకదారంపోగు చిక్కుపడకుండా రావటానికి, దీంట్లోంచి తీస్తారు. చూ. చిత్రం 131 చ. 3 (తె. 4, 5, 8, 11, 13, 15, 17, 18); **8.** పర్యా. చూ. చేడు బొందు. చేడుకర్రల బిగింపుకు, దారాలకు వేసే లోహపుచుట్టు; ఇనపదిగాని, ఇత్తడిదిగాని. చూ. చిత్రం 125 క. 1 (రా. 11); **9.** చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి, పలకసూత్రం చివర వేసిన ఇనప చుట్టు; కొన్నిచోట్ల, కొండ్లువేస్తారు; చూ. కొండి. (తె. 5); **10.** పర్యా. మెట్టె. అచ్చుగుదులు తగిలించే ఇనపచుట్టు; దీన్ని మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి (రా. 21); **11.** పర్యా. గాజు(1). పట్టుదారం వడికేటప్పుడు, కదురునుంచి వచ్చిన పోగు దూర్చటానికి కొయ్యపట్టెకు బిగించిన ఇనపచుట్టు; ఇటువంటివి, గాజులకట్టెమీద వరసగా ఉంటాయి. చూ. చిత్రం 293 చ. 14 (తె. 21); **12.** పర్యా. గాజు(2). ఉన్నికత్తెర అకుకు. కిందవేసిన ఇనపచుట్టు. చూ. చిత్రం 306.3 (తె. 11, 28); **13.** ?జంపఖానానేతకు వాడే పడుగునూలు ఆసుపోసే టప్పుడు, పోగుదూర్చే ఇనపచుట్టు (తె. 17).

**ఉంగరందండి** పసిలికాయ తొడిమె; ఉంగరం మాదిరిగా, చెట్టుకొమ్మకు చుట్టుకొని ఉంటుంది. చూ. చిత్రం 291.1 (తె. 17).

**ఉంగరాలకట్టె** పర్యా. చూ. గాజులకట్టె. పట్టు దారం వడికేటప్పుడు, పెద్దరాట్నం దగ్గర, కదుర్లపీటకు కిందగా (కొన్నిచోట్ల. పక్కన)పెట్టే కొయ్యపట్టె; దీనికి ఇనపచుట్లు (కొన్నిచోట్ల, కొండ్లు) బిగించి ఉంటాయి; దారం వడికేటప్పుడు, కదురుపోగులు, దీని గాజు(=ఉంగరం)లగుండా వచ్చి డొలకకు చుట్టుకొం టాయి. చూ. చిత్రం 293 చ. 13 (తె. 21).

**ఉచ్చు** పర్యా. చూ. వడి(7). నవారుమగ్గం కట్టు బడిలో, పైపట్టెకు కిందకర్రకు అల్లినపురిదారం; ఇటు వంటివి కర్ర పొడుగునా ఉంటాయి. చూ. చిత్రం 324.2 (కో. 12).

**ఉజారుషుర్మా(లు)** నిజాంనవాబు(=హుజూర్) పురమాయింపుమీద నేసిన ఒకరకం బట్ట(లు). (నె.16).

**ఉటుకోలకర్ర** చూ. ఊడుగోలకర్ర (కో. 25).

**ఉడత** ఉ. ఉడ్త, ఊడత్త; పర్యా. ఉడతకొయ్య, ఉడతచెక్క, ఉడతబిళ్ళ, చిడత(5), చెక్కేటు, టక్కి, పొట్టేలుచెక్క, లాటుడత నక్కట్టు. మరమగ్గంనాడెను ఒక సొరుగులోనుంచి, మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; ఇటువంటివి రెండు సొరుగులపైనా అమరుస్తారు. చూ. చిత్రం 119 (కో. 2-7, 9, 10, 12-18, 20-33, 35-37; తె.13-16; రా. 2, 5-9, 12, 16-20).

**ఉడతకొయ్య** పర్యా. చూ. ఉడత. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, కింద తోలుఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; ఇటువంటివి రెండు సొరుగులపైనా అమరుస్తారు. చూ. చిత్రం 119 (రా. 1).

**ఉడతగుది** ఉ. ఉడ్తగుది; పర్యా. చూ. ఉడతతాడు. మగ్గంఉడతకు, పైనకట్టినదారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (కో. 25, 27, 29, 32, 37).

**ఉడతచారలగుడ్డ** ఉ. ఉడ్తసారలగుడ్డ. నీలం, తెలుపు, ఎరుపు రంగుల పోగులు పడేనికొలుకులు నిలువుకు పెట్టి, అడ్డానికి తెలుపు పెట్టి నేసినబట్ట (తె. 15).

**ఉడతచార(ల)ంచు** ఉ. ఉడచ్చారంచు, ఉడతసార్లంచు; పర్యా. ఉడతంచు. ఉడతచారల మాదిరి గీరలుపడేట్టు నేసిన అంచు; చిగురు, మూడు జరీకడ్డీలు పెట్టి, మధ్యన వరసగా చారలు పడేట్టునేస్తారు. చూ. చిత్రం 152 (కో. 9బి, 10, 24).

**ఉడతచారికలగొంగడి** పట్టెలుపట్టెలుగా నేసిన ఒకరకం గొంగడి (తె. 11).

**ఉడతచిత్తి** ఉ. ఉడతసిత్తి. పర్యా. చూ. ఉడతతోలు. మరమగ్గంలో, ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు; దీనికొనలు, ఉడతచిల్లిలోనుంచి పైకిదూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (రా. 19బి).

**ఉడతచెక్క** ఉ. ఉడచ్చెక్క; పర్యా. చూ. ఉడత. మరమగ్గంనాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; ఇటువంటివి రెండు సొరుగులపైనా అమరుస్తారు. చూ. చిత్రం 119 (కో. 8, 11; రా. 16).

**ఉడతచెర్మం** పర్యా. చూ. ఉడతతోలు. మరమగ్గంలో, ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు; దీని కొనలు, ఉడతచిల్లిలోనుంచి పైకిదూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (కో. 2; రా. 2, 5, 7, 8).

**ఉడతజబ్బ** ఉ. ఉడజ్జబ్బ; పర్యా. చూ. దవడచెక్క. మరమగ్గం చట్రంలో, పానుపుపట్టెకు పక్కన బిగించిన సొరుగుచెక్క; ఇటువంటివి; రెండుపక్కలా ఉంటాయి. చూ. చిత్రం 118.15 (కో. 35).

**ఉడతంచు** పర్యా. ఉడతచార(ల)ంచు. ఉడతచారల మాదిరి గీరలుపడేట్టు నేసినఅంచు; అంచుచివర కొంచెం వదిలి, పైన మూడు జరిపట్టెలు, వాటిమధ్య చారలు పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 152 (కో. 1, 34).

**ఉడతతాడు** ఉ. ఉడత్తాడు; పర్యా. ఉడతగుది, ఉడతదారం, ఉడతబద్దె, చిడతతాడు, చెక్కటుతాడు, చెప్పుకట్టుతాడు(2), టక్కుతాడు, తాడు(8), దారం(7), పక్కుతాడు(2), బిడుతాడు(4), బుట్టితాడు, రెక్కతాడు, సైకుతాడు. మగ్గం ఉడతకు, పైనకట్టిన దారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి బొమ్మరెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (కో. 2, 4, 5, 7, 10, 14-16, 20, 22, 23, 26, 31, 33; తె. 14, 16; రా. 5, 6, 8, 18, 19ఎ).

**ఉడతతొడప** పర్యా. చూ. ఉడతతోలు. మరమగ్గంలో, ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు; దీని కొనలు. ఉడతచిల్లిలోనుంచి పైకిదూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (కో. 25, 27, 31).

**ఉడతతోలు** ఉ. ఉడత్తోలు; పర్యా. ఉడతచిత్తి, ఉడతచెర్మం, ఉడతతొడప, ఉడతవారు, చిడతతోలు, చిత్తి, చెర్మం, టక్కితోలు, టక్కువారు, తొడప (2), తోలు, తోలుంగరం, తోలుచిట్టి, తోలుతిత్తి, వారు(2). మరమగ్గంలో, ఉడతకుకింద వేలాడే తోలుచుట్టు; దీని కొనలు, ఉడతచిల్లిలోనుంచి పైకిదూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (కో. 4, 5, 7, 10-18, 20, 22-24, 26; తె. 13, 14; రా. 16-18, 19ఎ, 20).

**ఉడతదారం** పర్యా. చూ. ఉడతతాడు. మగ్గం ఉడతకు, పైనకట్టిన దారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ ఉంటాయి. చూ. చిత్రం 118.20 (రా. 2, 12, 13).

**ఉడతబద్దె** ఉ. ఉడ్త–; పర్యా. చూ. ఉడతతాడు. మగ్గం ఉడతకు, పైనకట్టిన దారం; ఇటువంటివిరెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (కో. 35).

**ఉడతబిళ్ళ** ఉ.–బిల్ల; పర్యా. చూ. ఉడత. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, కింద తోలుఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; ఇటువంటివి, రెండు సొరుగులపైనా అమరుస్తారు. చూ. చిత్రం 119 (రా. 19బి).

**ఉడతబొమ్మ** పర్యా. చూ. గుర్రం(4). మరమగ్గం సొరుగుకు, మొదట బిగించినచెక్క; దవడచెక్కలకు నాడెదెబ్బ తగలకుండా, ఇటువంటివి రెండు బిగిస్తారు. చూ. చిత్రం 118.19 (రా. 8).

**ఉడతరెక్క** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 118.18 (కో. 17).

**ఉడతవారు** ఉ. ఉడతవార; పర్యా. చూ. ఉడత తోలు. మరమగ్గంలో, ఉడతకు కింద వేలాడే తోలు చుట్టు; దీనికొసలు, ఉడతచిల్లిలోనుంచి పైకి దూరుస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (రా. 6, 12, 13).

**ఉడుకురంగు** పర్యా. ఇండంత్రీ(న్). నీళ్ళలో ఉడకబెట్టి నూలుకువేసే రంగు; వేట్ కలరు; దీంట్లో రసాయనాలు వేస్తారు; రంగు చాలాకాలం నిలబడుతుంది. (కో. 9).

**ఉడుపులకట్టె** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగేకర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రలతాళ్ళూ మధ్యలో పావుచెక్కతాళ్ళూ కట్టిఉంటారు; ఇటువంటికర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (రా. 12).

**ఉంట** అచ్చుతీసిన తరవాత, గుండ్రంగా చుట్టబెట్టిన పడుగునూలు; చూ. ఎంట (రా. 7).

**ఉండ 1.** పర్యా. చూ. చెక్రం(4). చట్రాలరాట్నం ఇరుసుకు బిగించిన రేకుచెక్రం; దీనిమీద వడిదారం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 9 (కో. 37); **2.** గుండ్రంగా చుట్టిన ఉన్నిదారం; గుడ; తివాసీనేతకు వాడతారు. చూ. చిత్రం 321.3(తె. 10); **3.** (-చుట్టు) పర్యా. నూలుండ, బొట్టె ముంత [illegible]. [illegible]చుట్టిన ఉన్నిదారం; కొన్నిచోట్ల, పడుగుకు [illegible] ఒక ఉండగా చుడతారు (తె. 6, 7, 9, 10, 22, 25, 26).

**ఉండేలు(బద్ద)** ఉ. ఉండేలు, ఉండెలు, ఉండేల (బద్ద); పర్యా. [illegible] బద్ద, [illegible]బద్ద(1), దబ్బ(1), ధనుస్సు [illegible], పైకబద్ద, [illegible] మోడిబద్ద, లాకబద్ద(1), విల్లు, విల్లంబు. తాడుకట్టిన వింటిబద్ద; దీనితో [illegible] కమాను [illegible] ఏకుతారు. చూ. చిత్రం 9 క. 12 (కో. 11 12 15, 19).

**ఉండ్రాళ్ళచవితి** ఉ. ఉండ్రాళ్ళ చవితి; పర్యా. చూ. వినాయకచవితి. వినాయక(=[illegible]) చవితి, భాద్రపద శుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి, బొట్లుపెట్టి, పూజచేసి, ఉండ్రాళ్ళు నైవేద్యం పెట్టి, పండుగ చేసుకొంటారు (తె. 16, 18, 20).

**ఉతుకుడుబండ** [illegible] అద్దిన నూలుఉండలు ఉతికే రాయి (తె. 1, 2, 6, 23).

**ఉత్తరీయం** ఉ. ఉత్తరయం. మగవాళ్ళు వేసుకొనే పైపంచె (కో. 11, 13, 16).

**ఉత్తరీయాలచాపు** ఉ. ఉత్తరయాలచాపు. రెండు పైపంచెలు ఒకే బద్దెతో కలిసిఉన్నవి (కో. 13).

**ఉన్ని** ఉ. ఉన్నె. గొర్రెబొచ్చు (=వెంట్రుకలు); దీంతో కంబళ్ళూ తివాసీలూ నేస్తారు(కో.13-15,17,19; తె. 3, 6 7, 9-11, 20 22, 25-28; రా. 22).

**ఉన్నికంకణ(ం)కురమ** ఉ.-కుర్మ, ఉన్నికంకనం-. గొంగళ్ళునేసే కురుమల్లో ఒక శాఖ; పెళ్ళిళ్ళలో, ఉన్నిదారం తోరాలు కట్టుకొనేవాళ్ళు; వీరికీ, పత్తికంకణం కురమలకూ 'కంచంపొత్తేగాని, వియ్యంపొత్తు' లేదు. (తె. 22, 25, 28).

**ఉన్నికత్తిరింపు** పర్యా. చూ. ఉన్నికోత. గొర్రెబొచ్చు కత్తిరించటం; ఆరునెల్లకొకసారి కత్తిరిస్తారు. (తె. 27, 28).

**ఉన్నికత్తెర** పర్యా. కటికెలకత్తెర, బొచ్చుకత్తెర. గొర్రెబొచ్చు(=ఉన్ని)కత్తిరించే కత్తెర. చూ. చిత్రం 306 (తె. 3, 7, 10 11, 20, 22 25-28).

**ఉన్నికొడిత** ఉన్ని దంచే కొయ్యగూటం; బండమీద వేసి కొడతారు; కొన్నిచోట్ల,ఉన్నిమీద వలకప్పి దీంతో కొడతారు. చూ. చిత్రం 307.2 (తె. 6).

**ఉన్నికోత** పర్యా. ఉన్నికత్తిరింపు. గొర్రెబొచ్చు కత్తిరించటం; ఆరునెల్లకొకసారి కత్తిరిస్తారు. (తె. 3, 6. 7, 9 25).

**ఉన్నిగంప** ఉన్ని వేసుకొనే గంప(బుట్ట). చూ.చిత్రం 308.1 (తె. 26).

**ఉన్నిగుల్ల** ఉన్ని వేసుకొనే గంప. చూ. చిత్రం 308.1 (తె. 23).

**ఉన్నిబండ** ఉన్ని శుభ్రంచెయ్యటానికి వాడేరాయి; ఉన్ని దీనిమీదపరిచి రోకలిబండతో దంచుతారు(తె.25).

**ఉన్నిబడుగు** ఉన్ని దుళ్ళగొట్టే పుల్ల(=బడుగు); ఉన్ని శుభ్రంచెయ్యటానికి [illegible]పెట్టి, దీంతో దులుపుతారు (తె. 7).

**ఉప్పు** పర్యా. చూ. కాస్టిక్ (సోడా). అద్దకం రంగు తయారుచెయ్యటానికి నీళ్ళలో కలిపే ఒకరకం లవణం; caustic soda (రా. 6).

**ఉప్పొడుంత** చూ. వెప్పురుండ (తె. 7).

**ఉమ్మడిచెట్టి** ఊళ్ళో నేతపనివాళ్ళకు, ఉమ్మడి పనులకు సాయపడేవాడు; శుభకార్యాలు జరిగేటప్పుడు, ఊళ్ళోళ్ళపిలుపులకు వెళ్తూంటాడు (కో. 7).

**ఉమ్ముతులక** నేతనేసేటప్పుడు, నేతపనివాడు ఉమ్మి వేసుకోటానికి మగ్గందగ్గర పెట్టుకొనే పాత్ర; దీంట్లో అడుగున బూడిద పోస్తారు (కో. 31).

**ఉయ్యాలకఱ్ఱ** పర్యా. చూ. రాయబారపుకఱ్ఱ. వేలాడదీసిన పడుగుచుట్టను దగ్గరికిగాని, దూరానికి గాని జరుపుకోటానికి వీలుగా, మగ్గానికి పైన పెట్టిన కఱ్ఱ. చూ. చిత్రాలు 129 క.4, 129 చ.2 (కో. 25).

**ఉయ్యాలతాడు** పర్యా. చూ. రాయబారంతాడు. పడుగుచుట్టకు రెండు వైపులా కట్టి, మగ్గానికిపైన (కొన్నిచోట్ల, రాయబారంకఱ్ఱకు) వేలాడదీసిన తాడు; కొన్నిచోట్ల, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 129 క. 1 (కో. 25).

**ఉయ్యాలపేటు** పర్యా. చూ. ఉయ్యాలబేలు. అంచులో ఉయ్యాలబొమ్మలు పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 153 (రా. 8).

**ఉయ్యాలబేలు** పర్యా. ఉయ్యాలపేటు. అంచులో ఉయ్యాల బొమ్మలు పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 153 (తె. 21).

**ఉరి 1.** పర్యా. చూ. కొలికి (3). అచ్చుకట్టే టప్పుడు, రెండు అచ్చుకఱ్ఱల వడదారాలకు వేసిన లంకె; నేతనేసేటప్పుడు, పడుగుపోగులను పైకిలేప టానికి, కిందికి దింపటానికి ఈ లంకెల్లోనుంచి బెంతు పోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100. 3 (కో. 32, 35); **2.** పర్యా. వడి (6). పేటుదారానికి చివరకట్టిన పురదారం; మామూలుగా, మైనంపూసింది; కొన్ని చోట్ల, ఇనపతీగ; దీనికి, కొక్కెంచేసిన చిన్న (ఇనప) బిళ్ళ ఉంటుంది; డాబీకోలలు పైకి లేచినప్పుడు, ఇవి అంచుపోగులను లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 12 (కో. 26).

**ఉరుబద్దెదారం** ఉ. ఉరుబద్దారం; రూ. ఉలిబద్దారం; పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అనివెంబడి దూర్చిన దారం; అచ్చుతీకేటప్పుడు పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్ని చోట్ల, సన్నబద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (తె. 26, 27, 33).

**ఉరువు** ఉ. ఉరవ; పర్యా. మూర్తి, శాల్తి. నేసిన ఒకబట్ట; single unit (కో. 7, 8, 23).

**ఉలవాయి** ఇరుసుమోపేచోట, డబ్బారాట్నం నిలువుకు బిగించిన ఇనపకట్టు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 44 (కో. 2).

**ఉలిబద్దారం** చూ. ఉరుబద్దెదారం (తె. 31).

**ఉల్టాసీదా** బట్టనేతలో, పైన ఒకరకంగానూ కింద ఒకరకంగానూ వచ్చేటట్టు నేసే తీరు (కో. 7).

**ఉల్లారు** (క్రి.) ఒక మోస్తరుగా ఎండటం (తె. 33).

**ఉల్లారేయు** (క్రి.) తడిపిన నూలు విప్పి, ఆరవెయ్యటం (తె. 32, 33).

**ఉల్లిగడ్డచీర** ఉ. ఉల్లిగెడ్డ–. ఎరుపు, తెలుపు, లేక పసుపు వన్నెల్లో నేసిన కలనేత చీర; కమ్మి, అంచు నలుపు వన్నెలో నేస్తారు (కో. 6).

**ఉల్లిగడ్డరంగు** ఒకరకం ఎరుపు (తెలుపు వన్నె కలిసింది); ఎఱ్ఱఉల్లిపాయలరంగు; లేతగులాబి. చూ. చిత్రం 288 (తె. 4, 9, 13, 20).

**ఉల్లిపూలచీర** తెల్లచీరలో, నాలుగు తెల్లకొలుకులు ఒక పచ్చకొలికి చొప్పున నిలువు, అడ్డంపెట్టి నేసిన చీర (తె. 15).

**ఉల్లిపొట్టుచీర** నేతలో, నిలువుకుతెలుపు, పేకకు, అంచుకు నలుపు (కొన్నిచోట్ల, ఎరుపు) పెట్టి నేసిన చీర. (రా. 13, 17).

**ఉల్లిమల్లిచీర** ఉ. ఉల్లిమల్లు–. తెలుపు, ఎరుపురంగు కొలుకుల మధ్య రెండు తెల్లకొలుకులు పడేగు, పేక పెట్టి నేసినచీర (తె. 11, 13).

**ఉల్లెడతాడు** పర్యా. చూ. అరుంతాడు(1). రాట్నం ఆకులకు చుట్టినతాడు. ఒకవైపుఆకునుంచి, రెండో వైపుఆకుకు పటవాలుగా అల్లుతారు; చూ. ఉల్లెడ తీయు. చూ. చిత్రం 15 క. 5 (కో. 8).

**ఉల్లెడతీయు** రాట్నం రెండువైపులా ఉన్న ఆకులను కలుపుతూ తాడు చుట్టటం (కో. 8).

**ఉసుము** (క్రి.) జాడించటం; గోగు (మొ.వాటి) కాడలు సలగగొట్టి నీళ్ళలో జాడిస్తే నారవస్తుంది (రా. 21).

## ఊక

**ఊకరగుంజ** పర్యా. చూ. సరిగుంజ(3). సరివేసే టప్పుడు, ఉన్నిపడుగులో ఉండే ఊకరవంటి కఱ్ఱ (=దారె)ను బిగించటానికి నేలలోపాతిన కొయ్యలు; ఇటువంటివి మామూలుగా, ఒకవైపున రెండు, మరొక వైపున ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 314.11 (తె. 7).

**ఊకరతాడు** పర్యా. చూ. సరితాడు(3). సరివేయటానికి చాపిన ఉన్నిపడుగును గూటాలకు బిగించేతాడు. చూ. చిత్రం 314.8 (తె. 7).

**ఊకరరాయి** పర్యా. చూ. దారెరాయి. సరివేసే టప్పుడు, ఉన్నిపడుగులో, ఉండే ఊకరకఱ్ఱ (=దారె) బిగింపుకోసం నేలలో పాతిన రాయి; ఇటువంటివి మామూలుగా, ఒకవైపున రెండు మరొక వైపున ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 314.2 (తె. 7).

**ఊకొ్కాడి** (< ఇంగ్లం. hooks). పర్యా. చూ.

మైనపువడి. మైనంపూసిన వడి; దీనికి మధ్య అంచు పోగులు దూరుస్తారు. చూ. వడి (కో. 24).

**ఊచ** ఉ. ఊశె, ఊస. **1.** పర్యా. చూ. ఏకుపుల్ల (1). ఏకు తయారుచెయ్యటానికి ఉపయోగించేపుల్ల. చూ. చిత్రం 113 (కో. 6; తె. 28); **2.** పర్యా. చూ. సూలం(1). రాటె తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు (మామూలుగా, ఇనపది; కొన్నచోట్ల కొయ్యది); కొన్నిచోట్ల, రాటెకట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 25, 26; తె. 30, 33); **3.** పర్యా. ఊచపుల్ల, కదురు (ఊచ)(1), జొన్నబెండు, పుల్ల(5), బెండు(1). కండెనూలుచుట్టే జొన్నదంటుముక్క; కొన్నిచోట్ల, కంకిపుల్ల, కాకిరెల్లు, చొప్పపుల్ల, కొయ్య, ఇనుము మొ.వాటితో చేసిన ఊచలు వాడతారు; మరమగ్గంనాడెలో, మామూలుగా కొయ్యఊచలుగాని; ఇనపఊచలుగాని, అమరుస్తారు. చూ. చిత్రం 51 (కో. 27, 29-37; తె. 1-33; రా. 1-18, 20, 24); **4.** పర్యా. చూ. కమ్మి(9). మగ్గంగుంటలో, పావు చెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా, ఇనపది; కొన్నిచోట్ల కొయ్య; పావుచెక్కలకు చేసిన చిల్లులో దూర్చి పక్కగూటాలకు వేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (కో. 26); **5.** పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో, పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (రా. 1, 8, 9); **6.** రంగునీళ్ళలో నూలు ఉడకబెట్టేటప్పుడు, లడీలు తిప్పే ఇనపకడ్డీ; దీంతో కూడా లడీలు పిండుతారు. చూ. చిత్రం 282 క. 4 (కో. 11, 19, 26); **7.** పర్యా. కదురు (ఊచ)(2). కదురుకామ, దామ. ఉన్నికదురుపుల్ల; వెదురుది. చూ. చిత్రం 311 చ. 1 (తె. 7, 9, 11, 20, 25, 27, 28); **8.** నవారునేతకు వాడే పేకదారం చుట్టిన పుల్ల; చూ. కండె (రా. 10); **9.** పర్యా. చూ. తూకం. పేటువడికి కిందవేలాడ గట్టిన బరువు; మామూలుగా, ఇనపపుల్లలు; కొన్నిచోట్ల సత్తువి; నేతనేసేటప్పుడు, అనిమూసిన తరవాత, వడికిందికి దిగటానికి ఇవి కడతారు; ఇవి రెండుపక్కలా గుంటల్లో వేలాడతాయి చూ. చిత్రం 132 చ. 15 (కో. 20, 23, 24, 26).

**ఊచకమ్మి** సన్నటి, బెత్తంమాదిరి కమ్మి; మామూలుగా, కండువాలకు నేస్తారు (తె. 13).

**ఊచపుల్ల** పర్యా. చూ. ఊచ(3). కండెనూలు చుట్టే జొన్నదంటుముక్క; కొన్నిచోట్ల, కంకిపుల్ల, కాకిరెల్లు, చొప్పపుల్ల, కొయ్య, ఇనుము మొ.వాటితో చేసిన ఊచలు వాడతారు; మరమగ్గంనాడెలో మామూలుగా కొయ్యఊచలుగాని, ఇనపఊచలుగాని అమరుస్తారు. చూ. చిత్రం 51 (కో. 28, 36).

**ఊచలచిప్ప** ఉ. ఊసెలచిప్ప. నూలులేని దంటు ఊచలు వేసుకొనే మట్టిపాత్ర (తె. 31).

**ఊచలబుట్ట** ఉ. ఊచలబుట్టి. నేతనేసేటప్పుడు, దారం అయిపోయినపుల్ల(=ఊచ)లు వేసుకొనే బుట్ట (కో. 25, 29, 37).

**ఊటగట్టు** (క్రి.) ఊరబెట్టటం (రా. 19).

**ఊటగుంజ** పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (రా. 19ఎ).

**ఊటగుండు** పర్యా. చూ. నవలతుగుండు. దండె దగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి, దండె అవతలకు వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, ఇనపచెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 6, 8; రా. 19ఎ).

**ఊటం** ఎక్కువ; అధికం; "కరి ఊటంగ ఉండేది నిలువుపట్టు." కరి = పురి (తె. 5).

**ఊటనరం** పర్యా. చూ. నరం(1). ఏకుబద్దకొస(ల)కు కట్టిన జంతువునరం; మామూలుగా, ఎద్దుది; కొన్నిచోట్ల, గొర్రెపేగు; ఇటువంటివి రెండుంటాయి; గూటంతో నరంకొడుతూ ఉన్ని ఏకుతారు; కొన్నిచోట్ల చేత్తోనే నరం గుంజుతూ ఏకుతారు. చూ. చిత్రం 309.1 (తె. 27).

**ఊటపేగు** పర్యా. చూ. నరం(1). ఏకుబద్దకొస(ల)కు కట్టిన జంతువునరం; మామూలుగా, ఎద్దుది; కొన్నిచోట్ల, గొర్రెపేగు; ఇటువంటివి రెండుంటాయి; గూటంతో నరంకొడుతూ ఉన్ని ఏకుతారు; కొన్నిచోట్ల, చేత్తోనే నరంగుంజుతూ ఏకుతారు. చూ. చిత్రం 309.1 (తె. 26).

**ఊడికట్టె** పర్యా. చూ. పెడకోల(2). నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల, అల్లుచేసేటప్పుడు కట్టిన వంకరకట్టె; మగ్గానికి పడుగుఅమర్చిన తరవాత, దీనికి రెండువైపులా మలగుడులు, మధ్యన నేతమోకు తగిలిస్తారు; కొన్నిచోట్ల, మోకుతో ముడివేస్తారు, కొన్నిచోట్ల, దీనికి మోపుగా కొయ్యచెక్రాలుగాని, చెక్కలుగాని పెడతారు. చూ. చిత్రం 127.12(రా.1).

**ఊడుకాలెకట్టె** చూ. ఊడుకోలకట్టె (రా. 6).

**ఊడుకోలకట్టె** రూ. ఊడుకాలెకట్టె; పర్యా. చూ. పెడకోల. నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల, అల్లుచేసేటప్పుడు కట్టిన వంకరకట్టె; మగ్గానికి

గేరుకఱ్ఱను కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి; మామూలుగా, ఊద్దె అడ్డపట్టెకు ఉంటాయి; కొన్ని చోట్ల పడుగేరుకఱ్ఱకు ఉంటాయి; వీటికి చివర, కొన్ని చోట్ల, చిన్నపుల్లలు కడతారు. చూ. చిత్రం 63 క. 8 (కో. 1, 12, 22, 23, 25, 26, 28, 29, 35; తె. 16, 29, 31-33).

**ఊద్దెగునపం** పర్యా. చూ. గడ్డపార (1). ఊద్దెను నిలబెట్టి మోకుతో బిగించటానికి నేలలో పాతిన గునపం. చూ. చిత్రం 63 త. 1 (కో. 36).

**ఊద్దెగొలుసు** ఉ. ఊద్దిగొలుసు; పర్యా. చూ. గొలుసు(3). ఊద్దె అడ్డపట్టెకుగాని, సరగుంజకుగాని, బిగించిన ఇనపపనిముట్టు; దీనికి పొడుగాటి ఇనపకొంకెలు రెండుంటాయి. చూ. చిత్రాలు 63 ర. 3, 70 (తె. 10, 25).

**ఊద్దెచెయ్యి** ఉ. ఊద్ది-. ఊద్దె(దండె)అంచు. చూ. చిత్రం 63 క. 4 (కో. 32).

**ఊద్దెజంగ** ఉ. ఊద్ది-; పర్యా. చూ. ఊద్దెకాలు. నేలమీదమోసే ఊద్దెకొయ్య; ఇటువంటివి, మడత మంచం కోళ్ళ మాదిరిగా, రెండుంటాయి; వీటిపైన అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 63 క. 1 (తె. 29).

**ఊద్దెతల** ఉ. ఊద్ది-; పర్యా. చూ. ఊద్దెదండె. ఊద్దెపై వైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (తె. 29).

**ఊద్దెతాడు** ఉ. ఊదత్తాడు, ఊదితెత్తాడు, ఊదిత్తాడు, ఊదెత్తాడు, ఊద్దితాడు. **1.** రూ. ఊద్దలితాడు, ఊద్దెలతాడు; పర్యా. ఊద్దెమోకు, కొంకికట్టెతాడు, తాడు (6), పడుగుతాడు, పడుగుమోకు, బంకంతాడు, బిగువుతాడు, మోకు(1), సంబారితాడు, సరాటతాడు, సరాటమోకు, సరితాడు(2), సరిమోకు, సరెద్దుమోకు. ఊద్దెను నిలబెట్టి, కిందిగూటానికి బిగించే తాడు; ఇటువంటివి మామూలుగా, రెండుంటాయి; ఊద్దె అడ్డపట్టెనుంచి కొంకివరకూ, లేదా బిళ్ళవరకూ ఒకటి, అక్కడినుంచి గూటంవరకూ మరొకటి. చూ. చిత్రం 63 క. 5 (కో. 13, 18, 25, 27, 31; తె. 1, 6, 21, 26-28; రా. 22, 24); **2.** దసలి(పట్టు) పడుగు సరిచెయ్యటానికి నిలబెట్టిన ఊద్దె అడ్డపట్టెను, కొణతంబిళ్ళను కలిపేతాడు. చూ. చిత్రం 297.5 (తె. 7).

**ఊద్దెదండె** ఉ. ఊద్దిదండి; పర్యా. అడ్డ (9), అడ్డకట్టె (7), అడ్డకఱ్ఱ (3), అడ్డకొయ్య (1), అడ్డపట్టె (11), అడ్డపెండె (2), అడ్డబెండు (1), ఊద్దెతల, ఊద్దెపీట, ఊద్దెబడితె, తలపట్టె (1), పీట (10), పైపట్టె (2), మయంకఱ్ఱ, సరాటపట్టె, సరకోల (1). ఊద్దెపై వైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (కో. 25, 26, 30, 33-37).

**ఊద్దెనిలువు** ఉ. ఊద్ద-; పర్యా. చూ. ఊద్దెకాలు. నేలమీద మోసే ఊద్దెకొయ్య; ఇటువంటివి మడత మంచం కోళ్ళమాదిరిగా రెండుంటాయి; వీటిపైన అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 63 క. 1 (తె. 19).

**ఊద్దెపీట** పర్యా. చూ. ఊద్దెదండె. ఊద్దెపై వైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (తె. 11).

**ఊద్దెబడితె** పర్యా. చూ. ఊద్దెదండె. ఊద్దెపై వైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (తె. 31).

**ఊద్దెబిళ్ళ** ఉ. -బిల్ల; పర్యా. చూ. బిళ్ళ (6). ఊద్దెతాడు బిగింపుకు వేసే కొయ్యగిలక; కొన్నిచోట్ల ఇనపది. చూ. చిత్రాలు 63 ప. 1, 66 (కో. 9ఎ).

**ఊద్దెమోకు** ఉ. ఊదితిమోకు, ఊదితెమోకు; రూ. ఊద్దెలమోకు, పర్యా. చూ. ఊద్దెతాడు(1). ఊద్దెను నిలబెట్టి, కింది గూటానికి బిగించేతాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (కో. 1, 23, 24).

**ఊద్దెల** ఉ. ఊదితెల, ఊద్దల; చూ. ఊద్దె (కో. 6, 10; తె. 8, 20; రా. 8).

**ఊద్దెలతాడు** చూ. ఊద్దెతాడు (1). (కో. 10).

**ఊద్దెలమోకు** చూ. ఊద్దెమోకు (రా. 13).

**ఊద్దెసీల** ఉ. ఊద్దిసీల; పర్యా. సీల (5). ఊద్దె కాళ్ళు బిగించే మేకు; కొన్నిచోట్ల, కొయ్యమేకు; ఊద్దె కాళ్ళు కలిసేచోట, అడ్డపట్టెకు బిగించేచోట వేస్తారు. చూ. చిత్రం 63 క. 2 (కో. 26, 32, 34).

**ఊతులగుండ్ర** నేతనేసేటప్పుడు, నేతపనివాడు ఉమ్మివేసుకోటానికి మగ్గందగ్గర పెట్టుకొనే మట్టిపాత్ర 'ఉగల్దాన్'; దీంట్లో అడుగున బూడిద పోస్తారు (కో. 27).

**ఊతులపెంకు** నేతనేసేటప్పుడు, నేతపనివాడు ఉమ్మివేసుకోటానికి మగ్గందగ్గర పెట్టుకొనే పెంకు (కో. 32).

**ఊతులమండిగ** ఉ. ఊతలమండిక, ఊతలమండికి, ఊతులమండికి; రూ. ఊమెలమండిగ. నేతనేసేటప్పుడు, నేతపనివాడు ఉమ్మివేసుకోటానికి మగ్గందగ్గర పెట్టుకొనే (మట్టి)పాత్ర; 'ఉగల్దాన్'; దీంట్లో అడుగున బూడిదపోస్తారు (కో. 25, 26, 28, 29, 35, 37).

**ఊదాచీర** రెండు రంగుల్లో పడుగూపేకాపెట్టి నేసిన చీర (రా. 17).

**ఊదా(రంగు)** **1.** ముదురు నీలంలో ఎరుపువన్నె

కలిసిన రంగు (కో. 23); **2.** నల్ల నేరేడుపండు రంగు (తె. 12); **3.** ఒకరకం నీలంరంగు (తె. 21, 31; **4.** చెంకుపువ్వు చాయలో చింతామణిచాయ కలిసిన రంగు. చూ. చిత్రం 288 (రా. 16).

**ఊదారంగుచీర** ఒకరకం నీలంరంగు చీర (కో. 23).

**ఊపురం** ఉ. ఊపరం, ఓపరం; రూ. రూపురం; పర్యా. గోపురం, పలకఊపురం, పలకగోంపం (2), పలకగోపురం, పలకబుజం, పలకబొడ్డు, పిడపలక బుజం, మూపురం. చేతిమగ్గంపలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు, పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు; చూ. పలకకొట్టు. చూ. చిత్రం 109 చ. 5 (కో. 6, 8, 9, 14; తె. 4, 5, 11, 13, 15-17, 28, 31-33).

**ఊబిది** బూడిద; అచ్చుతికేటప్పుడు, చేత్కుగరుకుగా ఉండటానికి బూడిద అద్దుకొంటారు (కో. 3).

**ఊమెలమండిగ** చూ. ఊతులమండిగ (కో. 30).

**ఊరగల్లుచెట్టు** పొదగాపెరిగే ఒకరకం చెట్టు; దీని ఆకులు నీలిరంగు తయారీలో ఉపయోగిస్తారు; కడవల్లో ఊరేస్తారు (రా. 24).

**ఊరబెట్టు** (క్రి.) నూలు, గంజిలో నానబెట్టటం (కో. 11, 20).

**ఊలు** (< ఆంగ్లం wool). గొర్రెబొచ్చుతో ఓసిన దారం; ఉన్నిదారం; తివాసీలు, గొంగళ్ళు నెయ్య టానికి వాడతారు (తె. 17).

**ఊసిపోవు** (క్రి.) ఊడిపోవటం; దారానికి పురి బాగా లేకపోతే, పోగు ఊడిపోతుంది (తె. 6).

**ఊసుముంగిచీర** ఒకవైపుపోగు ఒకరంగు, మరొక వైపుపోగు మరొకరంగు పెట్టి నేసిన చిన్నగడి (ముంగి) చీర (రా. 14).

# ఎ

**ఎక్కింపుచివ్వ** ఉ. ఎక్కింపుసివ, ఎక్కింసివ, ఎక్కొంపుసివ. **1.** సరిచేసేటప్పుడు, గంజి ఆరినతరవాత, పడుగులో ఎక్కించే చిన్నఊచ; చువ్వ (కో. 25); **2.** పర్యా. అల్లుచివ్వ (1), అల్లుసులిరె, ఎలుపుచివ్వ (3), కోలలాక (2), మలలాక (1). అచ్చుతికిన పడుగులో మొదట, అచ్చుదగ్గర ఎక్కించిన కర్ర; కొన్ని చోట్ల, బద్దగాని, సన్నబెత్తంగాని, ఇనపకడ్డీగాని ఎక్కిస్తారు. చూ. చిత్రం 128జ (కో. 26, 27); **3.** దండెదగ్గర పడుగుపోగులు నెరపటానికి, అచ్చు దగ్గర దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి, దండెకు రెండువైపులా ఉంటాయి; నేత అవుతున్నకొద్దీ, వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127.3 (కో. 25, 27).

**ఎక్కింపుబద్ద** **1.** అచ్చుకట్టేటప్పుడు, బద్దెపోగుల్లో గాని, పెంకుపడుగులోగాని పూదారం ఎక్కించటానికి దూర్చేబద్ద (కో. 27); **2.** అచ్చుతికిన పడుగులో, కోల్తల పోగుల్లో దూర్చినబద్ద; అల్లుచేసేటప్పుడు, పడు గెరుకర్రతీసి, బద్దఎక్కిస్తారు (కో. 27); **3.** ఉ. ఎక్కొం బద్ద; పర్యా. చూ. బద్దెగుచ్చు(పు)లాక. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద; కొన్నిచోట్ల, కర్ర. చూ. చిత్రం 124.1 (కో. 27).

**ఎక్కిరింతపుల్ల** పర్యా. చూ. కోతిపుల్ల(1). నేత నేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గంపైన దారంతో, అడ్డంగా వేలాడదీసిన కొయ్య పుల్ల; దీనికిరెండువైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు పైకీ కిందికీ ఆడు తుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (కో. 21).

**ఎక్కు** **1.** పర్యా. చూ. ఆకు(1). రాట్నం ఇరుసు పైన తిరగటానికి చక్రం మాదిరిగా అమర్చిన సాపుచెక్క; ఇలాంటివి మామూలుగా నాలుగుంటాయి. చూ. చిత్రం 15 క. 4 (కో. 33, 34); **2.** పర్యా. చూ. పంకరురేక. ప్రంకరుగొట్టానికి నాలుగువైపులా ఉండే పొడుగుబద్ద(లు). చూ. చిత్రం 38 క. 2 (కో. 34); **3.** పర్యా. చూ. ఆకు(2). పంచెకామచుట్టూ వంచి కట్టిన వెదురుబద్ద(లు); పంచెకట్టుబడిలో ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి. చూ. చిత్రం 19 క. 2 (కో. 34).

**ఎక్కుమ్మలాక** ఎక్కింపులాక; నేతపడుగులో, పంచె దగ్గర దూర్చిన వెదురుబద్ద (కో. 28).

**ఎగదాల** సరిచేసేటప్పుడు పడుగులో, కుంచె బయలు దేరేవైపు (రా. 20).

**ఎగుదలకోర్తల** ఉ. ఎగదల-; పర్యా. చూ. పైకో ల్తల. ఆసుపోసిన పడుగులో మొదటిఅని పడ్డభాగం (=కోల్తల) (కో. 8).

**ఎగుమల** పర్యా. చూ. పైకోల్తల. ఆసుపోసిన పడుగులో మొదటిఅని పడ్డభాగం (=కోల్తల) (కో. 8).

**ఎగుమలకచ్చి** ఉ. ఎగమల-. సరిచేసేపడుగులో, ఊడ్తెదగ్గర ఉన్న అనిపోగులు (కో. 9).

**ఎగువకోర్తల** ఉ. ఎగవ-, -కోర్తలు; చూ. ఎగువ కోల్తల (కో. 4; రా. 11, 15).

**ఎగువకోల్తల** ఉ. ఎగువకోల్తాలు; రూ. ఎగువ కోర్తల; పర్యా. చూ. పైకోల్తల. ఆసుపోసిన పడుగులో మొదటిఅని పడ్డ భాగం(=కోల్తల) (కో. 3; రా. 8).

**ఎగువమగ్గం** పర్యా. చూ. మరమగ్గం. ఒకరకం మగ్గం; నేత నేసేటప్పుడు, పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజేది; మగ్గంపలక, పన్నె ఒకకొయ్య చట్రంలో బిగించి, పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు; చూ. మగ్గంచట్టం. చూ. చిత్రం 108 (రా. 1).

**ఎచ్చుపోత** అనుకు ఎక్కువ నూలు పొయ్యటం; అను మొదటినుంచి ప్రారంభించి చివరికి పోస్తే ఎక్కువ నూలు పడుతుంది (తె. 18).

**ఎజెంటి** గోరంటపువ్వురంగు; మెజంటా (తె. 17).

**ఎడమఅని** (-లేచు). అచ్చులో ఎడమవైపు(=అవతలివైపు) లేచిన అనిపోగులు (రా. 13).

**ఎడమకొమ్మ** ఎడమకాలితో పావుచెక్క తొక్కి, ఎడమఅనిలోకి, ఎడమచేత్తో, కుడివైపుకు విసిరిన నాడె (కొమ్మ) (రా. 14).

**ఎడమవాదాడి** మగ్గంచట్రం కింద, ఎడమవైపు పల్లపుచోటు; దీంట్లో నేతకండెలు వేసుకొంటారు (రా. 22).

**ఎడంకోల** పర్యా. చూ. పైకోల్తల. అనుపోసిన పడుగులో మొదటఅని పడ్డభాగం (=కోల్తల) (కో.2).

**ఎడంవాయి** మగ్గానికి బిగించిన అచ్చుల్లో వెనకది (కో. 23).

**ఎంటి 1.** (-కట్టు, -చాపు) రూ. ఎంటు, ఎంటె, వెంటి; పర్యా. సరెంటి(1). వడిదిప్పి చుట్టిన నూలు; సరిచేసిన తరవాత, మామూలుగా ఒక కర్రకు చుడతారు; అల్లుచేసిన తరవాత చుట్లుగా చుడతారు. చూ. చిత్రం 83 (కో. 8, 10, 11, 13, 15; తె. 10, 11, 32; రా. 4, 5, 8, 10, 12, 13); **2.** పర్యా. సరెంటి (2). అచ్చుతికిన తరవాత చుట్టబెట్టిన పడుగునూలు. చూ. చిత్రం 102 క. 5 (కో. 1, 2, 7, 8); **3.** పర్యా. చూ. సరెంటి(3). చుట్టచుట్టిన పడుగునూలు, మగ్గం మీద కొంత చాపగా మిగిలింది ఒక కర్రకు చుడతారు; కొన్నిచోట్ల, పురిబెట్టి చుడతారు; కొన్నిచోట్ల, పెడ కోలకుకట్టి ఉంచుతారు. చూ. చిత్రాలు 128 ట. 1, 128 జ. 2 (కో. 4, తె. 32).

**ఎంటిగట్టు** (క్రి.) పర్యా. చూ. ఎంటేయు. సరిచేసిన పడుగును చుట్టి వెయ్యటం (తె. 10).

**ఎంటిచుట్టు** (క్రి.) ఉ.-సుట్టు; రూ. ఎంటెచుట్టు; పర్యా. చూ. ఎంటేయు. సరిచేసిన పడుగు చుట్టి వెయ్యటం (కో. 8; రా. 4, 5, 8, 10, 12).

**ఎంటు** చూ. ఎంటి(1) (కో. 1, 2, 6).

**ఎంటె** చూ. ఎంటి(1) (రా. 24).

**ఎంటెచుట్టు** (క్రి.) ఉ. -సుట్టు; చూ. ఎంటిచుట్టు (రా. 24).

**ఎంటేయు** (< ఎంటివేయు; క్రి.) పర్యా. ఎంటిగట్టు, ఎంటిచుట్టు, సరెంటేయు. సరిచేసిన పడుగు చుట్టి వెయ్యటం (కో. 1, 2, 10; రా. 1, 13, 19, 20).

**ఎండగుంజు** (క్రి.) పడుగు ఆరుతుండగా కుంచెతో దువ్వటం (తె. 23).

**ఎండుపుగాకు** ఉడకబెట్టకముందు, పనలో ఎండిన పొగాకు రంగు (కో. 9).

**ఎండుబదును** పర్యా. ఆరువదను. ఒక మోస్తరుగా ఆరినతడి; ఆరుబదును; పడుగు ఆరుబదునులో ఉన్నప్పుడు కుంచెతో బలంగా దువ్వుతూ కచ్చులు వేస్తారు (తె. 10).

**ఎత్తినకోల** రూ. ఎత్తుడుగోల. సరచేయటానికి చాపిన ఉన్నిపడుగులో చివర దూర్చిన తలకోలను మొయ్యటానికి ఆధారంగా, నేలలో పాతిన వంగల కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 314.7 (తె. 20, 22, 25).

**ఎత్తుడుగోల** చూ. ఎత్తినకోల (తె. 27).

**ఎత్తుడుతాడు** పర్యా. చూ. బిర్రుతాడు(1). మరమగ్గం నిలువుపట్టెను మేరువుపలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టినదారం; మేరువుపలకను పైకిగాని, కిందికిగాని జరుపుకొని, దీంతో వడిపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 10).

**ఎత్తుపుల్ల 1.** ?తాళ్ళరాటి దిగువబద్దకు బెజ్జంలో దూర్చేపుల్ల (కో. 25); **2.** పర్యా. అచ్చుతుకుపుల్ల, అచ్చుకట్టె(4), అచ్చుకర్ర(3), అచ్చుగూటకట్టె, అచ్చుపుల్ల (4), ఇజ్జోడు(పుల్ల), కోతిపుల్ల (2), దబ్బ (7), పుల్ల (7), పొందకంపుల్ల, బిగువబ్బ, బిట్టుపుల్ల, బిరుబద్ద, బిర్రుపుల్ల (1). అచ్చుతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టినపుల్ల(లు); రెండుపుల్లలకు తాడు గట్టి, మడతమంచం కోళ్ళుమాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (కో. 7, 25-29, 31, 32, 34, 35, 37; రా. 2, 5, 19, 24).

**ఎత్తుబల్ల** పర్యా. అడ్డబల్ల (1). పత్తిరాట్నం నిలువు కొయ్యలమధ్య అడ్డంగా నిలిపినచెక్క; దీనికి ఒకవైపున దూది, మరొకవైపున గింజలు పడతాయి. చూ. చిత్రం 1.6 (కో. 36).

**ఎత్తువంపులు** (బహు.) ఒకరంగు పోగులసంఖ్య వరసగా హెచ్చిస్తూ, ఒకరంగు పోగులసంఖ్య వరసగా తగ్గిస్తూనేసిన జంపఖానా నమూనా (తె. 17).

**ఎత్తుసరి** పర్యా. చూ. బిర్రుతాడు(1). మరమగ్గం నిలువుపట్టెను, మేరువుపలకకు బిగించి, సన్నపుల్లతో

వడిపెట్టినదారం; మేరువుపలకను పైకిగాని, కిందికి గాని జరుపుకొని దీంతో బిరుపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 9ఎ).

**ఎత్తుసీల** పత్తిరాట్నం అడ్డబల్లను నిలువుకు బిగించిన కట్టెపుల్ల. చూ. 1.9 (కో. 36).

**ఎదడుబద్ద** (-జంపిచ్చు). పర్యా. చూ. ఉండేలు (బద్ద). తాడుకట్టిన వింటిబద్ద; దీనికి, తాడుతో కమాను వేలాడగట్టి దూదిఏకుతారు. చూ. చిత్రం 9 క. 12 (తె. 12, 13).

**ఎదురుకొయ్య** పర్యా. చూ. మిడిగూటం (2). నేతబయలులో చివరపాతిన గూటం. దీనికి, నేత మోకుతో కొలికివేసి, పెడకోలకుచుట్టి, పడుగు బిరు పెట్టటానికి, వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేత మోకు పెడకోలకు కట్టి, దీనికి ఏనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 18, 29).

**ఎదురుకోళ్ళసెల్లా** ఉ. ఎదురుకోల్ల-. ఒకరకం కండువా(=సెల్లా); అంచులేకుండా బొట్టకమ్ములుపెట్టి నేసింది; పెళ్ళివారు ఎదురుకోలుకు వచ్చినప్పుడు, పెళ్ళి కొడుక్కు పెడతారు; గుండ్ల సెల్లా (కో. 8).

**ఎదురుగలప** ఉ. -గల్ప; చూ. ఎదురుపలక (కో. 30; తె. 29, 32).

**ఎదురుగుంజ** పర్యా. చూ. మిడిగూటం (2). నేత బయలులో చివరపాతినకొయ్య; దీనికి, నేతమోకుతో కొలికివేసి, పెడకోలకుచుట్టి, పడుగు బిరుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, దీనికి ఏనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 20).

**ఎదురుదోనె** పర్యా. గుండుదోనె (2), తిరుగుడు దోనె, పడుగుదోనె, పిల్లదోనె, బీమ్‌మొద్దు, రోలరు(4). మగ్గం చివర, పడుగునూలు చుట్టే కొయ్యదూలం; మామూలుగా, రోకలి మాదిరిది; కొన్నిచోట్ల పలకలది; మలగ్రకబదులు అమరుస్తారు. చూ, చిత్రాలు 110.1, 123 త (కో. 4, 6; 7, 12).

**ఎదురుదోనెగుబ్బ** ఉ. ఎదుర్దోనె-; పర్యా. చూ. గుబ్బకొయ్య (2). ఎదురుదోనెను మోసే గూటం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 110.3 (కో. 12).

**ఎదురుదోనెమగ్గం** ఉ. -దోని-; పర్యా. దోనెమగ్గం, రోలరుమగ్గం. మగ్గంమీద చాపిన పడుగులో చివరి భాగం చుట్టటానికి, ఎదురుగా రోకలివంటి కొయ్య (చూ. ఎదురుదోనె) అమర్చిన మగ్గం; దీన్ని కొంచెం చోటులోనే అమర్చుకోవచ్చు. చూ. చిత్రం 110 (కో. 4).

**ఎదురునాలిక(లు)** ఎదురెదురుగా, నాలికల మాదిరిగా నేసిన డిజైను (కో. 9).

**ఎదురుపలక** (-వచ్చు)ఉ. ఎదుర-; రూ. ఎదురుగలప. నేతబట్ట చుట్టే దోనెపలకల్లో, గాడిఉన్న పలక; ఇది కిందికి తిప్పిగాని, నేత అవగూడదట (కో. 7, 26, 28, 32-37; తె. 8; రా. 8).

**ఎదురుపలకవేయు** (క్రి.) గాడిఉన్న దోనెపలక నేత (పడుగు) వైపుకుతిప్పి బట్టచుట్టటం; "ఎదురుపలకేస్తే ఎదురెక్కొస్తది"అని వాడుక; అంటే కీడువస్తుందని అర్థం; ఎందుకంటే, నేత సడలి, పోగులు తెగి, శ్రమ వృథా అవుతుంది (కో. 7, తె. 8).

**ఎదురుబొమ్మ** పర్యా. చూ. బొమ్మ(9). మగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (తె. 25).

**ఎదురుమేకు** పర్యా. చూ. మిడిగూటం(2). నేత బయలులో చివర పాతినకొయ్య; దీనికి, నేతమోకుతో కొలికివేసి, పెడకోలకుచుట్టి, పడుగు బిరుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, దీనికి ఏనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా, గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (కో. 5, 7, 11).

**ఎనికె** ఉ. ఎనిక, ఎనికి, వెనికె. నూలుపోగులలెక్క: **1.** మూడు పోగుల దారం (తె. 5, 16); **2.** మూడు కొలుకుల (=ఆరుపోగుల) దారం (కో. 14; తె. 13; రా. 6, 11-19ఎ, 21-24); **3.** నాలుగుపోగులదారం (కో. 11, 12, 18; రా. 1, 5, 7, 8, 10); **4.** నాలుగు కొలుకుల(=ఎనిమిదిపోగుల)దారం (కో. 1, 2, 7, 10, 13, 15, 17, 20).

**ఎనికెగొట్టం** పర్యా. చూ. బొక్కానుగొట్టం. ఎముకగొట్టం; మేకకాలి ఎముక. చూ. చిత్రం 48 క (కో. 8).

**ఎనికెచేయు** (క్రి.) పుంజాల లెక్కన నూలుపోగులు ఎంచటం (కో. 30).

**ఎన్నెనేత** చేతిమగ్గంమీద, రెండు నాడెలతో నేసిన ఒకరకం నేత (రా. 10).

**ఎన్నెమ్మచీర** పడుగు, పేకల్లో మూడేసిగీరలు వచ్చేట్టు నేసిన పెద్దగడిచీర (కో. 33).

**ఎమ్మచేయు** (క్రి.) పడుగు, వెడల్పు చెయ్యటం; నెరపటం (కో. 2).

**ఎర** దసలి(పట్టు)పురుగు విడిచిన కూసం (తె. 7).

**ఎరక** పర్యా. చూ. లచ్చన. అచ్చుతీకిన పడుగు మీద, కొలతనుబట్టి వేసిన గుర్తు; మామూలుగా మసి గుర్తు వేస్తారు; కొన్నిచోట్ల, చిక్కుడు, బీర, మొ.వాటి

ఆకుపసర్లతో గజానికి ఒకటి చొప్పునగాని, మూరకు ఒకటి చొప్పునగాని గుర్తులువేస్తారు; నూలుకు రంగు అద్దేముందు, చిలపలు కొలిచి గుర్తులు పెట్టుకొంటారు (తె. 10).

**ఎరకలంచు** 1. ఉ. ఎరకలంచు, ఎర్కలంచు; చూ. ఇరకలంచు. మొదట బుగిడి, తరవాత దిండు(=కడ్డీ), లాహిరీ మగ్గాల ముత్యం, తరవాత చిగురు వరసగా వచ్చేట్టు నేసిన అంచు. చూ. చిత్రాలు 149, 163 (తె. 5, 11, 12); 2. బుగిడి, సందు, లాహిరీ సందు, ముచ్చెర కొలుకులు, సందు, లాహిరీ, సందు, బుగిడి, చిగురు వరసగా వచ్చేట్టు నేసిన అంచు (తె. 14).

**ఎరకలవాళ్ళగడి** ఉ. ఎరకలోల్లగడి. ఒకరకం నేత గడి (కో. 20).

**ఎరకలవాళ్ళ(గడి)చీర** ఉ. ఎరకలల్ల-, ఎరకల వల్ల-, ఎరకలొల్లగడి-, ఎరకలోల్లగడి-. పిల్లలులేని వాళ్ళు పిల్లలకోసం కట్టుకొనే ఒకరకం గళ్ళచీర (కో. 18-21).

**ఎరకలు** (బహు.) ఉ. ఎరకలు, ఎర్కలు; చూ. ఇరక(లు) (తె. 5, 11, 12, 14).

**ఎరకళ్ళు** ఎరకెలజాతివారు; కుంచెలు తయారు చేస్తారు (కో. 24).

**ఎరగలునేయు** (క్రి.) చీరనేతలో కమ్ముల తరవాత జేనెడు పొడుగు నెయ్యటం (కో. 35).

**ఎరతీయు** (క్రి.) దసలిపురుగు కూసం (=ఎర)విడవటం; తరవాత, దానిమూతి ఎర్రగా ఉంటుంది. (తె. 7).

**ఎరనామ్దారీచీర** రెండు ఎర్రకడ్డీ (=సన్నపట్టె)లు పడేట్టు నేసినచీర (రా. 16).

**ఎరికలగోచి** ఉ. -గోసి. ఎరికలవాళ్ళు పెట్టుకోటానికి నేసిన గోచిగుడ్డ (కో. 8).

**ఎరికలవాళ్ళు** ఉ. ఎరకలోల్లు ఎరకలోళ్ళు, ఎరికలోల్లు, ఎరికలోళ్ళు, ఎరికెలోల్లు, ఎలుకులోల్లు. నూలు సరిచేసే కుంచెలు తయారుచేసే ఒక తెగ (కో. 3, 6, 7, 10, 23; రా. 4-6, 10, 11, 13, 17, 19).

**ఎరుపు** పర్యా. ఎర్రరంగు, ఎర్రచాయ. పండుమిరప(కాయ)రంగు; ఎరుపు నెప్తాల్‌రంగు, ఆర్. సి, బి. ఎస్. వేసి తయారుచేస్తారు (కో. 8, 22-24; తె. 27, 28, 30, 31; రా. 3, 4, 6, 15, 18, 22-24).

**ఎరుపుకన్ను** (-తీర్పు) చీరకమ్ములో, అందానికి పెట్టిన ఎర్రరంగుదారం; సుమారు రెండంగుళాల పొడుగుంటుంది (కో. 2, 3).

**ఎరువుగొట్టు** (క్రి.) నేలకు ఎరువు వెయ్యటం; తుత్తూరుచెట్ల పెంపకానికి, ఎరువువేస్తారు (తె. 5).

**ఎర్రఉన్ని** ఉ. ఎర్రున్ని. ఎరుపురంగు ఉన్ని (తె. 11, 20).

**ఎర్రకనకాంబరం** ఒకరకం, లేత ఎరుపురంగు (కో. 24).

**ఎర్రకాక్రేడుచీర** ఉ. ఎర్రకాక్టేడిచీర. గర్భవతులు, దుష్టగ్రహాలుపోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి, కట్టుకొనే ఒకరకం చీర; ఎరుపు అంచులు, ఎరుపుకమ్ములు పెట్టి నేస్తారు; దీన్ని పసుపువాళ్ళు నెయ్యగూడదని నిషేధం (కో. 10).

**ఎర్రగడ్డచీర** పసుపు తెలుపు, పేక ఎరుపుపెట్టి, పేకరంగు అంచుకుపెట్టి, నిలువురంగు కమ్మికిపెట్టి నేసిన చీర (కో. 4).

**ఎర్రగొంగడి** ఉ. ఎర్రగొంగడి. మిరపపండువన్నె ఉన్నితో నేసిన గొంగడి (తె. 11, 22).

**ఎర్రగొర్రె** ఎరుపురంగు బొచ్చుగల గొర్రె (తె.11).

**ఎర్రచాయ** ఉ. ఎర్రసాయ; పర్యా. చూ. ఎరుపు. పండుమిరప(కాయ)రంగు; ఎరుపు నెప్తాల్‌రంగు, ఆర్. సి., బి. యస్. వేసి తయారుచేస్తారు (రా. 11).

**ఎర్రతొగరు** ఉ. -తొగురు, -దొగురు. ముదురు ఎరుపురంగు; బి. ఒ., బి. ఎన్., బి. ఎస్. డబ్ల్యు., రెడ్ బి., స్కార్లెట్ ఆర్. సి. వేసి తయారు చేస్తారు. చూ. చిత్రం 288 (కో. 1, 9; తె. 5, 12).

**ఎర్రదూది** పర్యా. ఎర్రపత్తి. గోధుమవన్నెలో ఉండే పత్తి; ఇది నాలుగయిదు నెలల పంట; దీనిదూది ముతగ్గా ఉంటుంది (కో. 14).

**ఎర్రపట్టు** పట్టుపురుగుల నుంచి వచ్చే ఎరుపువన్నె పట్టు; మంచిరకం (కో. 11).

**ఎర్రపత్తి** పర్యా. ఎర్రదూది. గోధుమవన్నెలో ఉండేపత్తి; ఇది నాలుగయిదు నెలల పంట; దీనిదూది ముతగ్గా ఉంటుంది (కో. 5, 11, 14, 23; తె. 13-16; రా. 6, 11, 19, 20).

**ఎర్రబందిరుమాలు** ఒకరకం తలపాగ; ఎర్రరంగు అంచులుపెట్టి గీరలుపడేట్టు నేసింది (తె. 25).

**ఎర్రబొత్తంచుచీర** ఎరుపురంగులో బొత్తంచుపెట్టి నేసిన చీర (కో. 24).

**ఎర్ర(రంగు)** పర్యా. చూ. ఎరుపు. పండుమిరప (కాయ) రంగు; ఎరుపు నెప్తాల్‌రంగు ఆర్. సి., బి. ఎస్. వేసి తయారు చేస్తారు (తె. 3, 8, 21, 24; రా. 17).

**ఎర్రరాస్త్రా(లు)** ఉ.-రాస్తలు. ఎర్రరంగుదారంతో, అంచులో నేసే గీర(లు). (తె. 19).

**ఎలకగొద్దెలరంగు** ఉ. ఎలగ్గొద్దెల-. లేతనస్యంరంగు (కో. 16).

**ఎలకపల్లెకోక** ఒకరకం నేతచీర (రా. 19ఎ).

**ఎలికలపేటు** అంచులో ఎలికల బొమ్మలు పడేట్టు నేసిన డిజైను (రా. 8).

**ఎలుకపుల్ల** పర్యా. చూ. కోతిపుల్ల (1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గం మీద, దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుడులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు పైకీకిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (కో. 2).

**ఎలుచు** (క్రి.) ఉ. ఎలుసు ఎల్చు ఏల్చు; చూ. వెలుచు(1) (కో.3-10, 13 15 19 34; రా. 7, 10, 13, 19-21).

**ఎలుపుచివ్వ** ఉ. -చివ, -సివ. **1.** అచ్చుకట్టేయంత్రం చివరి నిలువుకొయ్యకు అడ్డంగా బిగించిన బెత్తం; అచ్చుచివ్వగుడులు దీనికి తగిలిస్తారు. చూ. చిత్రం 91 చ. 2 (కో. 37); **2.** అచ్చుకట్టేటప్పుడు అచ్చుపోగులను సులువుగా పడటానికి పెట్టిన బద్ద(కో. 37); **3.** పర్యా. చూ. ఎక్కించుచివ్వ (2). అచ్చతికిన పడుగులో, మొదట ఎక్కించిన కర్ర; కొన్నిచోట్ల బద్దగాని, సన్న బెత్తంగాని ఇనపకడ్డీగాని ఎక్కిస్తారు. చూ. చిత్రం 128జ (కో. 36).

**ఎలుపుచివ్వగుడి** అచ్చుకట్టే యంత్రం నిలువుకొయ్యకు ఎలుపుచివ్వ బిగించినదారం; దీన్ని అచ్చుచివ్వకు తగిలిస్తారు. చూ. చిత్రం 91 చ 3 (కో. 37).

**ఎలుపుడురాటం** ఉ. ఎలుపుడ్రాటం; పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం; చూ. ఎలుచు. చూ. చిత్రం 41 (కో. 6).

**ఎలుంవిప్పు** (క్రి.) ఉ. -ఇప్పు. పడుగేరుకర్రల మీద పడుగుపోగులు పరవటం (తె. 21).

**ఎల్పు** బట్ట వెడల్పు (తె. 15).

**ఎల్పులుతట్టు** (క్రి.) పడుగేరుకర్రమీద పోగులు ఒత్తుగా రాకుండా అరచేత్తో తట్టటం (రా. 11).

**ఎళ్ళువచీర** అయిదు కొలుకుల గీరలుపెట్టి నేసిన చీర (రా. 24).

# ఏ

**ఏకటిదబ్బ** చూ. ఏకుబద్ద (తె. 6).

**ఏకటినార** పర్యా. చూ. నరం(1). ఏకుబద్ద కొనలకుకట్టిన జంతువునరం; మామూలుగా, ఎద్దుది; కొన్నిచోట్ల, గొర్రెపేగు; ఇటువంటివి రెండుంటాయి; గూటంలో నరంకొడుతూ ఉన్ని ఏకుతారు; కొన్నిచోట్ల, చేత్తోనే నరంగుంజుతూ ఏకుతారు. చూ. చిత్రం 309.1 (తె. 7).

**ఏకలబడి** పర్యా. చూ. ఏకువిల్లు. నారికట్టిన వింటిబద్ద; దీంతో దూది ఏకుతారు. చూ. చిత్రం 10 క. 1 (కో. 36).

**ఏకినార** చూ. ఏకునార(2). (కో. 34).

**ఏకిలికట్టె** పర్యా. చూ. ఏకుబద్ద. ఉన్నిఏకే(వెదురు) బద్ద; విల్లు మాదిరిది. చూ. చిత్రం 309 (తె. 7, 9).

**ఏకిలిగంప** చూ. ఏకులగంప (తె. 20).

**ఏకిలినార** చూ. ఏకునార(2). (కో. 37).

**ఏకిలిబద్ద** **1.** చూ. ఏకులబద్ద (కో. 37); **2.** చూ. ఏకుబద్ద (తె. 10).

**ఏకిలిబుట్ట** ఉ. ఏకెంబుట్ట. చూ. ఏకులబుట్ట (తె. 10 22).

**ఏకు** **1.** (క్రి.) ఉ. వేకు; పర్యా. ఏకుడుజేయు (1) పింజు, విప్పు. కమానుతో దూది పింజెపింజెలుగా విచ్చుకొనేటట్లు చెయ్యటం (కో. 1-19 22-24; 36, 37, తె. 2, 5, 13, 14, 16, 17, 26, 27, 30; రా. 8, 11, 12, 15-18, 20 23, 24); **2.** పర్యా. ఏకుడుజేయు(2), పింజెజేయు. ఉన్ని పింజెపింజెలుగా విచ్చుకొనేటట్లు వేరుచెయ్యటం; గూటంతోగాని చేత్తోగాని ఏకుబద్దనరం విదిలిస్తూ ఏకుతారు (తె. 3, 11, 25-28); **3.** (-చుట్టు -చేయు, -తాల్చు, -తిప్పు). వడకటానికి అనువుగా పొడుగ్గా చుట్టిన దూది. చూ. చిత్రం 14 (కో. 1-10 12, 14, 15 22 23 36 37; తె. 2, 5 11-14, 16 17, 20 26; రా. 12, 15-18, 20 22-24); **4.** ఉన్నితాల్చినవత్తి: దూదివత్తికంటె పెద్దది, వెడల్పుది (తె. 3, 7, 9-11, 20, 22, 25-28).

**ఏకుకడ్డీ** పర్యా. చూ. ఏకుపుల్ల(1). ఏకుతయారు చెయ్యటానికి ఉపయోగించేపుల్ల. చూ. చిత్రం 11.3 (తె. 2 .

**ఏకుడుకర్ర** పర్యా. చూ.గూటం(1). దూది వడికేటప్పుడు కమానునరం కొట్టే కొయ్యపిడి. చూ. చిత్రం 9 క. 13 (కో. 19).

**ఏకుడుగూటం** **1.** పర్యా. చూ. గూటం(1). దూది ఏకేటప్పుడు కమాను నరంకొట్టే కొయ్యపిడి. చూ. చిత్రం 9 క. 13 (తె. 5); **2.** ఉన్ని ఏకేటప్పుడు, నరంకొట్టే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 309 చ. 1 (తె. 6).

**ఏకుడుజేయు** **1.** (క్రి.) పర్యా. చూ. ఏకు(1). కమానుతో దూది పింజెపింజెలుగా విచ్చుకొనేటట్లు చెయ్యటం (తె. 20); **2.** (క్రి.) పర్యా. చూ. ఏకు

(2). ఉన్ని పింజెపింజెలుగా విచ్చుకొనేటట్లు వేరు చెయ్యటం; గూటంతోగాని, చేత్తోగాని ఏకుబద్దనరం విదిలిస్తూ ఏకుతారు (తె. 20).

**ఏకుడుదబ్బ** ఉ. ఏకుడ- చూ. ఏకుబద్ద (తె. 6).

**ఏకుతాల్చు** (క్రి.) ఏకుపుల్లకు దూది చుట్టి వత్తిగా చెయ్యటం. చూ. చిత్రాలు 10, 11 (కో. 8, 9; తె. 11, 13, 14, 16, 17).

**ఏకుదబ్బ** చూ. ఏకులబద్ద (తె. 2).

**ఏకునార** ఉ. ఏక-, ఏకి-, ఏక-. **1.** పర్యా. చూ. నరం(3). కమాను(=దూదిఏకే కొయ్యపనిముట్టు)కు చుట్టే (ఎద్దు) నరం; దీన్ని దూదిమీద ఆన్చి కొయ్య గుండుతో కొడుతూ దూది ఏకుతారు. చూ. చిత్రం 9 క. 1 (కో. 34, 36); **2.** రూ. ఏకిలినార; పర్యా. నరం(2). దూది ఏకటానికి, బద్ద(=ఏకువిల్లు)కు కట్టిన (ఎద్దు)నరం. చూ. చిత్రం 10 క. 2 (కో. 34, 36); **3.** ఏకుబద్దకు కట్టిన గట్టి పురిదారం; నారతాడు; దీనిమీద గూటంతో కొడుతూ ఉన్ని ఏకుతారు; చూ. నరం(2). చూ. చిత్రం 309 క (తె. 20, 22, 25).

**ఏకుపుల్ల** ఉ. ఏక-, ఏకి-. **1.** పర్యా. ఈచ(1), ఏకూచ, ఏకుకడ్డీ, కదురు(1), కానెపుల్ల, గంటం(6), చుట్టుపుల్ల, బరుగు(1). ఏకు తయారుచెయ్యటానికి ఉపయోగించేపుల్ల, కొన్నిచోట్ల, ఇనపది. చూ. చిత్రం 11.3 (కో. 9, 36, 37; రా. 8); **2.** ఉన్ని ఏకు తయారుచెయ్యటానికి ఉపయోగించే పుల్ల; ఏకినఉన్ని దీనికి చుట్టి తీస్తారు (తె. 25).

**ఏకుపొత్తి** ఉ. -బొత్తి. సన్నదారం తీసేటప్పుడు, చేతిచెమట అంటకుండా, ఏకుపెట్టుకొనే తోలుతిత్తి; కొన్నిచోట్ల అరటిదొప్ప వాడతారు; చూ. అరటిపొత్తి. చూ. చిత్రం 17 క. 1 (కో. 33, 34, 36; తె. 2).

**ఏకుబద్ద** ఉ. ఏక-, -వద్ద; రూ. ఏకటిదబ్బ, ఏకిలిబద్ద, ఏకుకుదబ్బ; పర్యా. ఏకిలికట్టె, ఏకుబెషె, బెషె. ఉన్నిఏకే(వెదురు)బద్ద; విల్లు మాదిరిది. చూ. చిత్రం 309 (తె. 3, 11, 20, 22, 25, 28).

**ఏకుబెషె** పర్యా. చూ. ఏకుబద్ద. ఉన్నిఏకే(వెదురు) బద్ద; విల్లుమాదిరిది. చూ. చిత్రం 309 (తె. 27).

**ఏకులగంప** ఉ. ఏకల-; రూ. ఏకిలిగంప. ఉన్ని ఏకులు పెట్టుకొనే గంప (తె. 25).

**ఏకులజల్ల** ఉన్నిఏకులు పెట్టుకొనే ఒకరకం గంప (తె. 7).

**ఏకులతిత్తి** ఉన్నిఏకులు పెట్టుకొనే ఒకరకం బుట్ట; దీన్ని మగవాళ్ళు బుజానికి తగిలించుకొని తీసుకువెళ్తారు; చూ. ఏకులబుట్ట. చూ. చిత్రం 310 (తె. 7).

**ఏకు(ల)పీట** **1.** ఉ. ఏకి-. ఏకులు తయారుచేసే పీటచెక్క; కిందిది. చూ. చిత్రం 11.1 (కో. 36, 37; తె. 28; రా. 8); **2.** ఉన్నివడికేటప్పుడు, ఆడవాళ్ళు, కూర్చోటానికి వేసుకొనే పీట. చూ. చిత్రం 308.2 (తె. 3, 22).

**ఏకులబద్ద** రూ. ఏకిలిబద్ద ఏకుదబ్బ; పర్యా. చూ. ఏకువిల్లు. నారికట్టిన వింటిబద్ద; దీంతో దూదిఏకుతారు. చూ. చిత్రం 10 క. 1 (తె. 15).

**ఏకులబుట్ట** **1.** ఏకులుంచుకొనే బుట్ట. చూ. చిత్రం13 (కో. 37); **2.** ఉ. ఏకలబుట్ట, ఏకలబుట్టి, ఏకులబుట్టె; రూ. ఏకిలిబుట్ట. ఉన్నిఏకులు పెట్టుకొనే బుట్ట. దీన్ని మగవాళ్ళు బుజానికి తగిలించుకొని తీసుకువెళ్తారు. చూ. చిత్రం 310 (తె. 9, 22, 25, 28).

**ఏకులరాటం** ఉ. ఏకర్రాటం, ఏకుర్రాటం. ఏకుల నుంచి నూలుతీసే రాట్నం. చూ. రాట్నం. చూ. చిత్రం 15 (కో. 5 10; రా. 11, 12).

**ఏకువిల్లు** ఉ. ఏకిల్లు; పర్యా. ఏకలబడి, ఏకులబద్ద. నారికట్టిన వింటిబద్ద; దీంతో దూది ఏకుతారు. చూ. చిత్రం 10 క. 1 (కో. 33, 34).

**ఏకూచ** ఉ. ఏకూస; పర్యా. చూ. ఏకుపుల్ల(1). ఏకు తయారు చెయ్యటానికి ఉపయోగించే పుల్ల. చూ. చిత్రం 11.3 (తె. 2).

**ఏక్‌గోలేకాహునర్** తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 17).

**ఏక్‌హూర్‌కాహునర్** తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 17).

**ఏగర్ర** రాట్నం పిలకచెవుల మధ్య వేసిన నిలువు కొయ్య; దీని మధ్యగాడిగుండా వడిదారం వస్తుంది. చూ. చిత్రం 15 చ. 2 (కో. 34).

**ఏనిగలబారు** అంచులో, ఏనుగులబొమ్మలు వరసగా పడేటట్టు నేసిన డిజైను (తె. 14).

**ఏనిగలబేలు** పర్యా. చూ. ఏనుగు(ల)పేటు. అంచులో ఏనుగల బొమ్మలు వరసగా నేసిన డిజైను (తె. 5).

**ఏనుగుపొప్పిళి** ఒకరకం (పెద్ద) గడిచీర; నాలుగు ఎనికెల పోగులు ఒకరంగు, నాలుగు ఎనికెల పోగుల మరొకరంగు చొప్పునపెట్టి నేస్తారు (రా. 16).

**ఏనుగుమెలత** ఉ.-మెల్త; రూ. ఏనుగుమెలిక; పర్యా. మేడిపలక. ఒకరకం మెలిక; అచ్చుకట్టేటప్పుడు, అచ్చుకర్రమీది కొండితాడుకు వడిదారంతో మెలిక వేస్తారు (కో. 17).

**ఏనుగుమెలిక** ఉ. -మెలికి; చూ. ఏనుగుమెలత; పెడకోలలకు కట్టిన నేతమోకు దీనికి మెలివేసి బిర్రుపెడతారు (కో. 5, 7).

**ఏనుగుల(అ)ంచుచీర** అంచులోను, కొంగులోను వరసగా ఏనుగుబొమ్మలు పడేట్టు నేసిన పట్టుచీర; నాలుగు అచ్చులు, డాబీ అమర్చిన మగ్గంమీద నేస్తారు (తె. 21).

**ఏనుగులపేటు** ఉ. ఏనుగు(ల)ప్లేటు; పర్యా. ఏనిగల పేలు, గజేంద్రంపేటు. అంచులో, ఏనుగుల బొమ్మలు వరసగా నేసిన డిజైను(కో. 12, 17; రా. 10,19ఎ).

**ఏనుగుల(బారు)అంచు** ఉ. ఏనగలంచు, ఏనిగ లంచు. ఏనుగు ఆకారం డిజైన్లు వరసగా పడేటట్లు నేసిన అంచు; కొన్నిచోట్ల, ఆకు, తీగ, పువ్వు ఏనుగు, చిగురు వరసగా వచ్చేటట్లు నేస్తారు (కో. 14; తె. 4, 5, 10, 13; రా. 1).

**ఏము** చూ. బేము (తె. 6).

**ఏముబారెడికట్టె** చూ. బేముబారుకట్టె (తె. 7).

**ఏరంకపున్నమ** ఏరువాక పున్నమి; జ్యేష్ఠపూర్ణిమ; ఈ కాలంలో ఒకసారి ఉన్ని కత్తిరిస్తారు.

**ఏరినపడుగు** ఆరుబయట ఊడ్తె(ల)కు కట్టి పోగులు సాపుచేసిన పడుగు (కో. 4).

**ఏరు** (క్రి.) పర్యా. ఏరుడుజేయు, సరిచేయు. ఆరు బయట చాపిన పడుగు(=నేతలో నిలువుకువాడే నూలు) పోగులు అంటుకుపోకుండా విడదీసి సెరపటం; తెగిన పోగులు సరిచూసుకొని అతుకుతారు (కో. 1-18, 21-26, 28-33, 35, 36; తె. 1-7, 9-17, 19-33; రా. 1-24).

**ఏరుకర్ర** పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోల్తల వెంబడి దూరు స్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (కో. 8).

**ఏరుడుకాయ** అడవుల్లో ఏరుకొని తెచ్చిన దసలి కాయ (తె. 7).

**ఏరుడుజేయు** (క్రి.) పర్యా. చూ. ఏరు. ఆరుబయట చాపిన పడుగు(=నేతలో నిలువుకువాడే నూలు)పోగులు అంటుకుపోకుండా విడదీసి సెరపటం; తెగినపోగులు సరి చూసుకొని అతుకుతారు (తె. 19).

**ఏల్చు** (క్రి.) నూలుపోగులు విడదియ్యటం (తె. 1, 2, 6).

**ఏత్తెబద్ద** ఉ. ఎత్తిబద్ద. **1.** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 21, 22); **2.** పర్యా. చూ. కుంచెలాక. కుంచెకట్టుబడిలో, పురిబిగింపుకు, రెండు పక్కలావేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల, అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (తె. 21); **3.** పర్యా. చూ. దండె(3). పన్నెకట్టుబడిలో, ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం; ఇటువంటివి పైనా కిందా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (తె. 21).

**ఏషియారుమాలు** ఒకరకం తలపాగ; నేతబొడ్డు (=రెండంచుల మధ్యభాగం) లో అబ్బాసి రంగుపెట్టి పడుగూ పేకా నేస్తారు; నల్ల దరం బట్టలో మధ్య, పద హారుగళ్ళు వాటిలో ఏనుగు గంధపుగిన్నె, స్వస్తిక, కళావరుచుక్క, సింహాలు మొ. సమూనాలూ నేస్తారు; తెల్లదారం చిలపలకు చుక్కకట్టి (చూ. చుక్కకట్టు) అబ్బాసి రంగులో ముంచి నేస్తారు; ఇవి ఎక్కువగా అరే బియాకు ఎగుమతి అవుతాయి; అక్కడ, దీనికి ఈ పేరు వాడతారు (కో. 7).

**ఏసు** గింజనుంచి విడదీసిన పత్తి నిడివి (పొడుగు); దీన్ని ఆంగ్లంలో staple అంటారు (తె. 28).

## ఐ

**ఐంపలపువ్వు** ఒకరకం నీలంరంగు; మెజంటా (తె. 14).

**ఐస్సంచు** 'S' ఆకారంలో డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 164 (కో. 23).

## ఏ

**ఏంకరు** పర్యా. పరిశె(2), పరేత, లపేటా. నూలు చిలపలుగా చుట్టే పనిముట్టు; hank అంటే చిలప. చూ. చిత్రాలు 38 క, చ, ట (కో. 33, 34, 36).

**ఏంకరుకోడు** పర్యా. చూ. ఏంకరురేక. ఏంకరు గొట్టానికి నాలుగు వైపులా ఉండే పొడుగుబద్ద(లు). చూ. చిత్రం 38 క. 2 (కో. 33).

**ఏంకరుగొట్టం** ఏంకరు మేకుకు తగిలించే గొట్టం. దీనికి నాలుగువైపులా బద్దలు అమరుస్తారు. చూ. చిత్రం 38 చ. 2 (కో. 34, 36).

**ఏంకరుదుక్క** ఉ. ఏంకర్దొక్క. ఏంకరుకింది మొద్దు. చూ. చిత్రం 38 క. 1 (కో. 33, 34, 36).

**ఏంకరుమేకు** ఏంకరు మొద్దుకు వేసిన ఇనప ఊచ. చూ. చిత్రం 38 చ. 1 (కో. 34).

**ఏంకరురేక** పర్యా. ఎక్కు, ఏంకరుకోడు. ఏంకరు గొట్టానికి నాలుగువైపులా ఉండే పొడుగుబద్ద(లు). చూ. చిత్రం 38 క. 2 (కో. 36).

**ఏతం** జాకార్డుడాబీ కట్టుబడిలో, అస్సను తిప్పుటానికి, దొడ్డిచట్రంమైన అమర్చిన కొయ్యబద్ద; దీని దారం రెండోకొన, మగ్గంగుంటలో పాపుచెక్కకు కట్టి ఉంటారు. చూ. చిత్రం 135.1 (కో. 33).

**ఏపారుకమ్మి** ఒకరకం చీరకమ్మి; ముందు రెట్ట కొలికి(=రెండు పోగులగీరలు), వెత్తెము వెడల్పునందు, అయిదు కొలుకుల దారంతో తలచిపెట్టి, బొటనవేలెడు వెడల్పునందు ఇరవై కొలుకుల దారంతో ఒకపట్టె వరసగా వచ్చేట్టు నేస్తారు (కో. 7).

**ఏపారుమైజారు** వెత్తెకు వెడల్పు పట్టెలు తొమ్మిది, పట్టెల్లో మధ్యగా రెండేసి కొలుకుల దారంతో తెల్ల గీరలు పడేట్టు కమ్మినేసిన పైటకొంగు; కొన్నిచోట్ల, పువ్వులడిజైన్లు నేస్తారు (కో. 8, 9).

## ఐ

**ఐస్క్రీంచీర** సీమపట్టు రంగు చీర (కో. 36).

## ఒ

**ఒకారు** ఒకరకం చిన్నతొట్టె; దీంట్లో లడీలు తడుపుతారు (తె. 18).

**ఒక్కపొద్దువిడుచు** (క్రి.) ఒకపూట ఉపవాసం చెయ్యటం (కో. 25).

**ఒగ్గి** ఉ. ఒగ్గె; పర్యా. కమాను (2) కొక్కి (1), తంతె(1), పిన్ను(1), రేకు(1), సీల(4). మరాసుమీద పడుగుతోడేటప్పుడు, అనులుపడేట్టు పోగును జరపటానికి ఒక కొయ్యపట్టెకు బిగించిన రేకుముక్క; సుమారు మూడంగుళాల పొడుగుది; దీని బెజ్జంలోనుంచి తీసినపోగు మరాసుకు చుట్టుకొంటుంది; మరాసు తిరిగినప్పుడు, కీలు ఆడుతూ కొయ్యపట్టె జరిగి దానికి బిగించిన ఈ రేకుముక్క పోగునుకూడా జరుపుతుంది; ఇలా జరగటంలో పడుగులో అనిపడుతుంది; ఇటువంటివి పట్టె పొడుగునా వరసగా (కొన్నిచోట్ల 40) ఉంటాయి. చూ. చిత్రం 50.14 (కో. 13, 20, 22; తె. 13).

**ఒగ్గిపట్టె** చూ. ఒగ్గులపట్టె (తె. 13).

**ఒగ్గిరిపట్టె** చూ. ఒగ్గులపట్టె (కో. 7).

**ఒగ్గిలిపట్టె** చూ. ఒగ్గులపట్టె (కో. 10).

**ఒగ్గిలిపెండె** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాసు కట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే బెజ్జాలుగల రేకుముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాసు తిరిగినప్పుడు, కీలు ఆడుతూ దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది. చూ. చిత్రం 50.11 (కో. 5).

**ఒగ్గివాళ్ళు** ఉ. ఒగ్గోళ్లు. కురమల దగ్గర డోలు కొడుతూ, బీరప్ప మల్లప్పల కథలు చెప్పేవాళ్ళు (తె. 11).

**ఒగ్గు** (క్రి.) ఏదైనా వస్తువు పనికి అనువుగా అమర్చటం (కో. 34).

**ఒగ్గుడుకర్రలు** పర్యా. చూ. ఒడ్డీ (1). మరాసు మీద పడుగుతోడేటప్పుడు దబ్బాలకు ఉన్న దారం ఒగ్గుల పట్టెవరకూ సాపుగా పోవటానికి నిలువుగుంజలమీద అడ్డంగా బిగించిన కొయ్యలు; కొన్నిచోట్ల, వెదురువి (కో. 12ఎ).

**ఒగ్గుడుబల్ల** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాసు కట్టుబడిలో పడుగుపోగులు దూర్చే బెజ్జాలుగల రేకుముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాసు తిరిగినప్పుడు కీలు ఆడుతూ, దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది. చూ. చిత్రం 50.11 (కో. 18).

**ఒగ్గులపట్టె** ఉ. ఒగ్గిలుపట్టె, -పట్టీ; రూ. ఉగ్గలపట్టీ, ఒగ్గిపట్టె, ఒగ్గిరపట్టె, ఒగ్గిలిపట్టె; పర్యా. అనిపట్టె (2), ఆటబల్ల, ఉగ్గిలబల్ల, ఒగ్గిలిపెండె, ఒగ్గుడుబల్ల, కచ్చెపట్టి, కమానుపట్టె, కమానుబద్ద, కమానుబల్ల, కొక్కిమాను కొలికిపట్టె, కోలపట్టీ, తంతె(ల)పట్టె, పిన్నుబద్ద, సిల్వరుపట్టె. మరాసుకట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే బెజ్జాలుగల రేకుముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాసు తిరిగినప్పుడు కీలు ఆడుతూ, దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది. చూ. చిత్రం 50.11 (కో. 13 23).

**ఒగ్గూడె** (< ఒగ్గు + ఊడె) ఉ. ఒగ్గూడ్డి. నూలు తోడేటప్పుడు పంజె తిరగటానికి అమర్చిన పంగల కొయ్య; కొన్నిచోట్ల, ఊడె (=మడతమంచంకోళ్ళ మారిదిగా బిగించిన కొయ్యపనిముట్టు) మాదిరి పనిముట్టు. చూ. చిత్రం 27 (కో. 36, 37).

**ఒగ్గె** రంగునీళ్ళ అండాలో ఉడకబెట్టటానికి నూలు లడీలు తగిలించిన ఇనపఊచ; దీన్ని పట్టుకోటానికి వీలుగా రెండు వైపులా వంపులుంటాయి; దీంతో లడీలు రంగునీళ్ళలోదించి, అండా అంచులమీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (కో. 8).

**ఒగ్గెర** ఉ. ఒగ్గిర; పర్యా. చూ. బెంతుపనె. అల్లు చేసేటప్పుడు, పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు; పన్నెలాంటిది; రెండు పొడుగు కర్రలకు మధ్య వరసగా మేకులు బిగించి ఉంటాయి; వాటిమధ్య పడుగు

పోగులు దూరుస్తారు; కొన్నిచోట్ల, పట్టుసాలీల వాడుక. చూ. చిత్రం 106 (కో. 6, 7).

**ఒగ్గోరంచు** సన్నగీర పడేట్టు నేసిన అంచు(కో. 30).

**ఒడిబాలుచీర** పెళ్ళికూతురికి ఒడిబ్రాలబియ్యం కట్టే చీర (రా. 24).

**ఒడ్డు 1.** (క్రి.) ఉడకబెట్టిన దసలికాయలు, ఒక పళ్ళెంలోకిగాని, చేటలోకిగాని చేర్చటం (తె. 17); **2.** ఉడకబెట్టిన తరవాత, ఒక పళ్ళెంలోకిగాని, చేట లోకిగాని చేర్చిన దసలికాయలు (తె. 17).

**ఒడ్డుబట్ట** ఉడకబెట్టిన దసలికాయలు ఒక పళ్ళెం లోకిగాని, చేటలోకిగాని చేర్చుకొనే బట్ట (తె. 17).

**ఒంటికటారి** ఒకే వరసలో, పటవాలు గీరలు నేసిన డిజైను; చూ. నులికాయ (తె. 5).

**ఒంటికడచ్చుకమ్మి** కమ్మికి చెరొకవైపునా చెరొక పోగు, వేరేరంగుది పెట్టి నేసిన కమ్మి (కో. 5).

**ఒంటికన్ను(అంచు)** ఒకరకం డిజైను పెట్టి నేసిన అంచు (తె. 12).

**ఒంటిగీతచీర** అంచులమధ్య పెట్టిన పడుగు రంగును బట్టి నింబోలిరంగులో ఒకగీర, నల్లరంగులో ఒకగీర వచ్చేట్టు నేసినచీర; లంబాడివాళ్ళు కడతారు (తె. 24).

**ఒంటిదుప్పటి** ఉ. ? ఒంటదుప్పటి. ఒకే పొరగల దుప్పటి; ఒంటిపొర దుప్పటి (తె. 24).

**ఒంటినాడెనేత** ఒకే నాడె (=పేకదారపు కండె గలది)తో నేసిన నేత (తె. 22).

**ఒంటిపంచె** ఒక పంచె; రెక్క (రా. 15).

**ఒంటిపడుగు 1.** పర్యా. చూ. పొరసరి. అచ్చుతికే టప్పుడు, కిందిపోగులు (ఒకపొర) మాత్రం అతికే పడుగు నూలు (కో. 6); **2.** రెండుబట్టల నేతకు సరిపడే పడుగునూలు (రా. 20).

**ఒంటిపురి** ? ఒకేపోగు పురిపెట్టిన దారం (రా. 15).

**ఒంటిపువ్వంచు** ఒక్కొక్కపువ్వు వరసగా పడేటట్టు నేసిన అంచు. చూ. చిత్రం 173 (తె. 4).

**ఒంటిబాణా** ఒకరకం కృత్రిమపుపట్టు (=బాణా); పురిలేకుండా, ఒకే పోగుగా ఉన్నది (తె. 23).

**ఒంటిబొగిడి** అంచునేతలో, ఒకమొగ్గకింద మరొకటి తలకిందుగా అనేటట్టు నేసిన డిజైను; చూ. బుగిడి (తె. 12).

**ఒంటివేతబార్డరు** ఉ. ఒంటేతబాడ్డర్. ఒకేసారి అద్దినఅంచు (కో. 7).

**ఒంటివోగు** చూ. ఒరపోగు (తె. 8).

**ఒంటెచ్చు** (< ఒంటి + అచ్చు) పర్యా. మడతచ్చు. ఒకరకం అచ్చు; నేతపడుగులో కిందిపొర పోగులు, పై పొరపోగులు అతికి నేసేది; దీనికి పైన, కింద రెండేసి కర్రలుంటాయి (కో. 4, 9ఎ).

**ఒంటెచ్చుమగ్గం** ఒకే అచ్చు అమర్చిన మగ్గం; మామూలు మగ్గం; చూ. అచ్చు (తె. 22).

**ఒంటెలంచు** ఒంటెబొమ్మల డిజైను పడేట్టు నేసిన అంచు (తె. 5).

**ఒండుతొట్టి** నీలితొట్లకు ఇవతల ఉండే తొట్టి. చూ. చిత్రం 234 క. 2 (కో. 12).

**ఒత్తి** పర్యా. మొంబత్తి. కొవ్వుతో చేసిన బిళ్ళ; సబ్బుబిళ్ళంత ఉంటుంది; నేతనేసేటప్పుడు, నాడె(కొన్ని చోట్ల, పన్నె)ను సాపుచెయ్యటానికి దీంతో రుద్దుతారు (రా. 8).

**ఒత్తు(డు)బద్ద** ఉ. వత్తుబద్ద; పర్యా. చినకరబద్ద. గొంగడినేత చివరికి వచ్చినప్పుడు, పడుగులో పేకపోగు దట్టించటానికి దూర్చే బద్ద; ఇది ఎక్కించి, బేము తీసే స్తారు (తె. 6, 7, 9, 10, 22, 26, 27).

**ఒది** (-అవు) ఏకినదూది (కో. 7).

**ఒరపోగు** (-అతుకు) రూ. ఒంటివోగు, ఒరవోగు. అచ్చుతికే పడుగులో ఒంటిపోచదారం; కిందిపోగు మాత్రం అతికి, పైరపొరపోగు వెనక్కు చాపుతారు (రా. 17).

**ఒరబద్దె** ఉ. ఒరబద్ది, వరబద్ది. **1.** పర్యా. చూ. బద్దె(1). అచ్చుతుక్కోటానికి, సుమారు బెత్తెడువెడల్పు నేసి, చివర జేనెడుపొడుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తిచేసిన తరవాత, అచ్చులో బద్దెకోసి మరొక పడుగుకు అతుకుతారు. చూ. చిత్రం 102.2 (కో. 3; రా. 10); **2.** (-నేయు, -వేయు) పర్యా. నుంగుబద్ది. నేతచీరకు ముందువైపు వదిలిన బద్దె; బట్ట కట్టుకొనే ముందు ఈ బద్దె కోసి పారేస్తారు (కో. 10; రా. 10).

**ఒరబద్దెదారం** ఉ. వరబద్దిదారం. బద్దెపోగుల్లో అడ్డంగా దూర్చిన పురిదారం; అని దొరకటానికి వీలుగా దూరుస్తారు (కో. 3).

**ఒరవోగు** చూ. ఒరపోగు (తె. 4).

**ఒరవోగుచీర** ఒంటిపోగుగళ్ళు పడేట్టు పడుగు, పేక నేసినచీర (తె. 4).

**ఒలి** దసలికాయలు ఉడకబెట్టిన తరవాత ఊడే పైపొర; ఉల్లిగడ్డపొర మాదిరిగా ఊడిపోతుంది (తె. 17).

**ఒలికొయ్య** ఉ. ఒలగొయ్యా; పర్యా. చూ. చేతి గూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకు కట్టేకొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో

పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 8; రా. 21).

**ఒలిమి** వడి; చేతిమగ్గం మీద డిజైన్లు నేసేటప్పుడు, పడుగుపోగుల్లో కొన్నిటిని విడదియ్యటానికి లంకెలుగా వేసిన చిక్కుదారాలు; చూ. బుటాజుట్టు. చూ. చిత్రం 136 క. 3 (తె. 5).

**ఒసిలించు** (క్రి). ఉ. వసిలించు. నేతమోకు ముడి విప్పి వదులుచెయ్యటం (కో. 35).

## ఓ

**ఓణీ** రూ. వాణి(1); పర్యా. చూ. పైటకండువా. ఆడపిల్లలు, పరికిణీమీద, నడుముకు చుట్టుకొని, పైన కప్పుకొనేబట్ట; రెండుమూడు మూరల పొడుగుది (కో. 11, 13, 14, 20).

**ఓవల్టిన్** ఉ. వాల్టిను. ముదురుగంధం రంగు (కో. 2, 24, 36; రా. 8).

**ఓవల్టిన్‌చీర** ముదురుగంధం రంగు చీర (కో. 36).

## క

**కంకపుల్ల** నవారునేతలో పేకదారం చుట్టిన పుల్ల (తె. 27).

**కంకబద్ద 1.** పర్యా. చూ. ఉండేలు(బద్ద). వింటి బద్ద; దీనికి కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం 9.12 (తె. 28); **2.** పర్యా. బద్ద (10). ఉన్ని ఏకటానికి, నరంకట్టిన వెదురుబద్ద; చూ. ఏకుబద్ద. చూ. చిత్రం 309 (తె. 26, 28).

**కంకబొంగు** పర్యా. చూ. ఊత్తైకాలు. నేలమీద మోసే ఊత్తైకొయ్య; ఇటువంటివి, మడతమంచంకోళ్ళ మాదిరిగా రెండుంటాయి; వీటిపైన అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 63 క. 1 (తె. 32).

**కంగోరా** పర్యా. టిక్కబల్ల. వజానేతకోసం అమర్చిన దొడ్డిలో, కన్నాలబల్లనుంచి కుచ్చుతాళ్ళు కిందికి గుంజి తగిలించటానికి, గాళ్ళుచేసిన చెక్క. చూ. చిత్రం 134 చ. 10 (కో. 37).

**కంగోరు** (-తీయు) చెరగునేతలో, డిజైను వెయ్యటానికి, పొడుగ్గా దూర్చిన రంగుదారం. చూ. చిత్రం 268 (తె. 32; రా. 14, 17).

**కచ్చకాయ(రంగు)** పర్యా. గచ్చకలరు. సిమెంటు రంగు (తె. 12, 17, 24).

**కచ్చారంగు 1.** పచ్చిరంగు; తొందరగా వెలిసిపోయే రంగు; నెప్తాల్ రంగులు తొందరగా వెలిసిపోతాయి (కో. 15, 19, 21); **2.** Direct colour; వేణ్ణీళ్ళలో మామూలుఉప్పు వేసి, ఈ రంగు కలిపి నూలుకు అద్దుతారు; **3.** ద్రావకం అట్టేవెయ్యకుండా తయారుచేసిన రంగు; ఇది తొందరగా వెలిసిపోతుంది (కో. 16).

**కచ్చి 1.** (-తడుపు, - వేయు) పర్యా. చూ. అని (1). పడుగులో కిందిపోగులూ పైపోగులూ X ఆకారంలో కలిసే చోటు; ఆసుపోసేటప్పుడు, ఆసుపీటల నడిమికొయ్యలకు అనిపడుతుంది; పడుగు ఏరేటప్పుడు ఈ అనులవెంబడి లాకలు దూరుస్తారు; కొన్నిచోట్ల, దసలి(పట్టు)పనివాళ్ళ వాడుక; కొన్నిచోట్ల, దేవాంగుల వాడుక (కో. 7, 12, 19-29, 32-37; తె. 7, 17, 23, 24, 29, 33; రా. 3); **2.** (-ఊడ్చు,-ఎగేయు, -ఏరు,-తడుపు,-నింపు,-నిలుపు,-పడగొట్టు,-పొడుచు). రూ. కచ్చు (1), కచ్చె. అనికి రెండువైపులా తొడిగిన లాకల నడుమ ఉండే పడుగుభాగం (కో. 3-12, 14, 16, 22-32, 34-37; తె. 2-7, 9, 11-25, 27-31, 33; రా. 1); **3.** పర్యా. చూ. సందు (1). పడుగులో రెండు అనుల మధ్యభాగం (తె. 18, 20); **4.** పర్యా. సిరికిచ్చి. నేతలో, రెండు పేకపోగులమధ్య వచ్చిన వెలితి; పలచగా నేసినప్పుడుగాని, పోగులు తెగినప్పుడుగాని వెలితి వస్తుంది (కో. 25-28, 30, 31, 34, 36; రా. 8); **5.** (-కొట్టు) ఉ. కసె. నేసిన రెండు బట్టల నడుమ, జెత్తెడుమేర, పేకదారం వెయ్యకుండా వదిలిన పడుగుపోగులు; నేత అయిపోయిన తరవాత చివరి'కచ్చి' కోసేస్తారు. చూ. చిత్రం 144.2 (కో. 10, 27, 28, 30, 34, 36, 37; తె. 8).

**కచ్చిత** పిడకలబూడిద; అచ్చుతికేటప్పుడు, వేళ్ళు పొడిగా ఉండటానికి బూడిద రాసుకొంటారు (కో. 17)

**కచ్చికట్టు** (క్రి.) **1.** ఆసుపోసిన పడుగులో, అనులకు దారంతో కట్లుకట్టటం (తె. 33); **2.** పర్యా. చూ. అనికట్టు (2). సరచేసిన తరవాత, పడుగులో అనిపోగులు కూర్చి దారంతో కట్టటం (కో. 29).

**కచ్చికొయ్య** పర్యా. చూ. అనికొయ్య(లు). ఆసుపోసేటప్పుడు, పడుగులో అనులుపడటానికి కచ్చిపీటకు బిగించిన పుల్ల(లు). చూ. చిత్రం 45 క. 6 (తె. 22, 24, 29, 31, 33).

**కచ్చికోయు** (క్రి.) పర్యా. చూ. బద్దెకోయు. అచ్చులో, బద్దెపోగులు వరసగా కొయ్యటం; అచ్చుతికిన పడుగులో, అతుకులు వరసగా రావటానికి అచ్చుపోగుల కొనలు కత్తితో కోస్తారు; నేత అయిన తరవాత బద్దెపోగులు కొయ్యటం (కో. 34).

**కచ్చిచివర** పర్యా. అనిసూరె (2). దండెదగ్గర, నేతపడుగులో అనివెంబడి దూర్చిన సన్నబెత్తం; మామూలుగా, దండెకు రెండువైపులా రెండుంటాయి. చూ. చిత్రం 127.3 (రా. 3).

**కచ్చితాడు** (-కట్టు) పడుగులో, అనిపోగులు కలిపి కట్టిన తాడు (కో. 24; తె. 7, 24).

**కచ్చిపట్టె** ఉ. కచ్చిపట్టి; పర్యా. చూ. కచ్చిపీట. అనుపీటల్లో మధ్యది; దీనికి బిగించిన కొయ్యలకు అనులు పడతాయి. చూ. చిత్రం 45 క. 2 (కో. 37).

**కచ్చిపడు** (క్రి.) నేత పల్చగా రావటం (కో. 28).

**కచ్చిపీట** పర్యా. కచ్చిపట్టె, కచ్చిబల్ల, కచ్చుల మొద్దు, కుంబెనపీట. అనుపీటల్లో మధ్యది; దీనికిబిగించిన కొయ్యలకు అనులు పడతాయి. చూ. చిత్రం 45 క.2 (తె. 24, 29).

**కచ్చిపుల్ల** పర్యా. చూ. అనికొయ్య. అనుపోసేటప్పుడు, పడుగులో అనులుపడటానికి కచ్చిపీటకు బిగించినపుల్ల(లు). చూ. చిత్రం 45 క. 6 (కో. 22 26, 28, 29, 35).

**కచ్చిపెట్టు** (క్రి.) నేతలో వేలెడు వెడల్పున పేక దారం వెయ్యకుండా పడుగుపోగులు వదిలెయ్యటం; వాటి తరవాత, బద్దె నేస్తారు; నేతపూర్తయిన తరవాత, దానినుంచి బట్ట కోసి, తియ్యటానికి కూడా కచ్చిపెడతారు (కో. 27, 28, 30, 34).

**కచ్చిపొర** ? పైపోగులూ, కిందిపోగులూ బిరుగా ఉన్న పడుగుభాగం (కో. 34).

**కచ్చిబద్ద** 1. ? అను కట్టుబడిలో అనికొయ్యల దగ్గర బిగించిన కిందివరస కొయ్య; ఇటువంటివి పదిహేనుంటాయి (కో. 27); 2. పర్యా. చూ. లాక (2) పడుగులో అనివెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా, ఇటువంటివి అనికి రెండువైపులా ఉంటాయి; పడుగులో అని చెదిరిపోకుండా ఉండటానికి లాకలువేస్తారు. చూ. చిత్రం 63 చ. 3 (కో. 22).

**కచ్చి(బద్దె)** పర్యా. చూ. బద్దె (1). అచ్చుతు క్కోటానికి, సుమారు జెత్తెడువెడల్పు నేసి, చివర జానెడుపొడుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తయిన తరవాత అచ్చులో బద్దెకోసి మరొక పడుగుకు అతుకుతారు. చూ. చిత్రం 102.2 (కో. 34).

**కచ్చిబల్ల** పర్యా. చూ. కచ్చిపీట. అనుపీటల్లో మధ్యది; దీనికి బిగించిన కొయ్యలకు అనులు పడతాయి. చూ. చిత్రం 45 క. 2 (కో. 32).

**కచ్చిలాక** పర్యా. చూ. లాక(2). పడుగులో అనివెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా, ఇటువంటివి అనికి రెండువైపులా ఉంటాయి; పడుగులో అని చెదిరిపోకుండా లాకలు వేస్తారు. చూ. చిత్రం 63 చ. 3 (కో. 22; తె. 23; రా. 3).

**కచ్చివరస** పడుగులో అచ్చుతికే అనిపోగుల వరస (కో. 24).

**కచ్చివిసురు** (క్రి.) పడుగులో అని వచ్చేటట్టు అను పొయ్యటం (కో. 28).

**కచ్చివేయు** (క్రి.) నేతలో నిలువుకువాడే పడుగు నూలులో పైపోగులకు, కిందిపోగులకు అనివచ్చేటట్టు మరానుచెక్రం తిప్పటం (కో. 23).

**కచ్చు** 1. (-కూర్చు) చూ. కచ్చి (2). (తె. 5, 12, 18, 22 25); 2. దసలిదారం వడికే పూసపుకొమ్ము కొస; సన్నగా ఉంటుంది; ఇటువంటివి రెండు కొసలు ఉంటాయి; వీటికి గుదులు కడతారు (తె. 17).

**కచ్చుగుంజ** పర్యా. చూ. అనిగూటం. ఉన్ని పడుగు తోడేటప్పుడు అనివడే గుంజ; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, అనుగూటాల్లో మధ్యవరసలో ఉంటాయి. చూ. చిత్రం 312.2 (తె. 25).

**కచ్చులమొద్దు** పర్యా. కచ్చిపీట. అనుపీటల్లో మధ్యది; దీనికి బిగించిన కొయ్యలకు అనులుపడతాయి. చూ. చిత్రం 45 క. 2 (తె. 20).

**కచ్చులుజోడుపుచ్చు** (క్రి.) సరిచేసేటప్పుడు పడుగు లాకలు అని దగ్గరకు చేర్చటం; "కచ్చులు జోడుపుత్తం" అని వాడుక (తె. 31).

**కచ్చె** (-పరు, -కుట్టు,- దిద్దు, -దింపు) ఉ. కచ్చె; చూ. కచ్చి (2). (కో. 1, 4-6, 10-13, 15 16, 18, 20).

**కచ్చెకట్టు** పర్యా. అనికట్టు (1). పడుగులో అని పోగులు చెదిరిపోకుండా దారంతో వేసినకట్టు; కొన్ని చోట్ల, దేవాంగుల వాడుక (కో. 1, 7).

**కచ్చెకుంచె** సరిచేసేటప్పుడు, పడుగు ఆరుబయనులో ఉండగా, కచ్చికీ కచ్చికీ అవుతూ, కచ్చుల మధ్యభాగం దువ్వేకుంచె; పడుగు బాగా ఆరేవరకూ రెండు మూడు సార్లు ఇలా నిదానంగా దువ్వుతారు; కొన్నిచోట్ల, సన్నపడుగులే ఇలా దువ్వుతారు (కో. 18).

**కచ్చెకుట్టు** (క్రి.) పర్యా. అనికుట్టు. పడుగులో, అనివెంబడి లాక దూర్చటం (కో. 1).

**కచ్చెపట్టె** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాను కట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే బెజ్జాలుగల రేకుముక్క (= ఒగ్గి)లు; ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాను తిరిగినప్పుడు, కీలు ఆడుతూ దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది; ఇలా జరగటంవల్ల పడుగులో అనులుపడతాయి. చూ. చిత్రం 50.11 (కో. 1).

**క్రచబూరుగొర్రె** పర్యా. కసిరెగొర్రె. ఒక రకం

గొర్రె; వెంట్రుకలు నెరిసింది; బొచ్చు కరుకుగా ఉంటుంది; ఈ గొర్రె మూడేళ్ళవయస్సులో నడి ఈడున ఉంటుంది (తె. 28).

**కంచంపొత్తు** సరిబంతిని భోజనాలుచేసే అనుకూల్యం; పత్తికంకణం కురమలకు, ఉన్ని కంకణం కురమలకు కంచంపొత్తే గాని వియ్యంపొత్తు లేదు (తె. 28).

**కంచికమ్మి** ఉ. కంచెకమ్మి. ఒకరకం చీరకమ్మి; ముందు గీరలు, తరవాత ఎర్రపట్టె, గీరలు, తెల్లపట్టె, గీరలు వరసగా పడేట్టు నేస్తారు (కో. 36; తె. 14).

**కంచుడు** పళ్లెం; దసలిదారం, రంగులు వేసేటప్పుడు దీంట్లో పెడతారు (తె. 17).

**కంచెంచ** చూ. కంచెంచు (కో. 34).

**కంచెంచకమ్మి** చూ. కంచెంచుకమ్మి (కో. 34).

**కంచెంచు** (<కంచి+అంచు) రూ. కంచెంచ. సాదాపోగులు, జరీపోగులు, అయిమూల వరసల్లో పడేటట్టు (= బనారస్) నేసి, పిందెమాదిరి డిజైను పెట్టి నేసిన అంచు; మూడునాలుగు వేళ్ళ వెడల్పున నేస్తారు. మధ్యన గీరలు వస్తాయి; ఇది వైష్ణవులకు ప్రియమైంది; కొన్నిచోట్ల, కమ్మిలో గీరలుపెట్టి, కమ్మి అంచులకు రెండువైపులా మందపుదారాలు పెడతారు; అంచు కొసలో కొంత విడిచి, రెండుమూడు గీరలు నేస్తారు. చూ. చిత్రం 167 (కో. 2, 7, 8).

**కంచెంచుకమ్మి** రూ. కంచెంచకమ్మి. చీరకొంగులో గీర(=జిట్ట)లు పెట్టి, అంచులకు రెండు వైపులా మందపుదారాలు పెట్టి నేసిన కమ్మి (కో. 33).

**కంచెంచుచీర** (<కంచి+అంచు-). అంచులో మూడు తెల్లగీరలు, మూడు ఎర్రగీరలు పడేటట్టు నేసిన చీర (కో. 33).

**కటారి 1.** ఉ. కటారు; పర్యా. చూ. లాహిరీ. ఒక వైపున మొనదేలిన గుర్తులు దగ్గరదగ్గరగా వరసగా వచ్చేటట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 149.2 (తె. 5, 13, 24); **2.** (-కొట్టు) ఒకరకం అద్దకం; నూలుచిలప మీద, కొయ్యఅచ్చుతో రంగు అద్దుతారు (కో. 2).

**కటారిఅంచు** ఉ. కటారంచు; పర్యా. చూ. లాహిరీ అంచు. ఒకవైపుకు మొనదేలిన గుర్తులు వరసగా వచ్చేటట్టు డిజైన్లు నేసిన అంచు (కొన్నిచోట్ల, చిన్నలాహిరీలు నేస్తారు). చూ. చిత్రం 149 (తె. 5, 13, 24).

**కటారికనుము** ఒకరకం డిజైను వచ్చేటట్టు నేసిన రవికెలగుడ్డ (తె. 24).

**కటారిషర్టింగు** పడుగునూలుకు, పేకనూలుకు డిజైన్లువచ్చేటట్టు రంగుఅద్ది నేసిన చొక్కాగుడ్డ(కో. 6).

**కటికలకత్తెర** పర్యా. చూ. ఉన్నికత్తెర. గొర్రె బొచ్చు(=ఉన్ని) కత్తిరించే కత్తెర. చూ. చిత్రం 306 (తె. 9).

**కటుకుపురినూలు** ఎక్కువ వడి గల నూలు; పోగు ముడుచుకు పోయేటంతగా వడిపెట్టిన నూలు (రా. 24).

**కట్ట** నూలు లెక్క: **1.** ఇరవై లడీలనూలు(కో. 19); **2.** 92 పోగుల నూలు; ఒక్కొక్కపోగు పొడుగు 42 అంగుళాలు (కో. 33).

**కట్టు 1.** నూలుపోగుల లెక్క: లడీలో డెబ్బయ్యోవంతునూలు (కో. 2-11, 13-15; తె. 11, 13-17); (క) లడీలో పదోవంతు నూలు (తె. 27; రా. 11); (చ) తొంభై రెండుపోగుల నూలు (కో. 36); కో. 11 లో కట్టుకు 64 పోగులు; కో. 14 లో ఖద్దరునూలు కట్టుకు 64 పోగులు, మిల్లునూలు కట్టుకు 80 పోగులు; దీనిచుట్టుకొలత $4\frac{1}{2}$ అం. లు; కో. 15 లో 120 గజాల పొడుగు నూలు; తె. 27 లో కట్టుకు 72-78 పోగులు; **2.** పట్టుదారంలెక్క; ఇటువంటివి ముప్ఫయి రెండు కట్లు కలిస్తే ఒక టోకు అవుతుంది (రా. 14); **3.** చేతిమగ్గం పలక, గుండు కలిపి బిగించినదారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 1 (కో. 14).

**కట్టుకమ్మి** పర్యా. చూ. కట్టుచెరగు. చీరకట్టుకొనేటప్పుడు నడుముకు చుట్టుకొనే లోపలిచెరగు; మామూలుగా, డిజైన్లు లేకుండా చిన్నది నేస్తారు (తె. 18).

**కట్టుకర్ర** అల్లుచేసేటప్పుడు, ఊడై అడ్డపట్టె పక్కన బిగించిన కర్ర; అడ్డపట్టె గుదులు తగిలించింది (కో. 7).

**కట్టుకొంగుకమ్మి** చీరకట్టుకొనేటప్పుడు, లోపలికి వచ్చే అడ్డకొసలో నేసినకమ్మి (రా. 16).

**కట్టుకోల(లు)** పట్టాలు నేసే నార అనుపోసే కొయ్యగూటాలు; పన్నెండు గజాల ఎడంలో రెండు కొయ్యలుకొట్టి, వాటికి పెట్టిన రెండు అడ్డకొయ్యలు (తె. 25).

**కట్టుగర్ర** పర్యా. కట్టె (3). ఎదురుదోనె గాడిలో, పడుగుదారాలు బిగించే సన్నబెత్తం (రా. 5).

**కట్టుచిలప** నూలులెక్క: లడీలో డెబ్బయ్యోవంతు నూలు (రా. 13).

**కట్టుచెరగు** ఉ. కట్టుచెరుగు; కట్టుజెరుగు; రూ. కట్టుజెంగు; పర్యా. కట్టుకమ్మి, చిట్టచెంగు, లోపలికొంగు. చీర కట్టుకొనేటప్పుడు, నడుముకు చుట్టుకొనే లోపలి చెరగు; మామూలుగా, డిజైన్లు లేకుండా చిన్నది నేస్తారు (కో. 2, 5, 9).

**కట్టుజెంగు** చూ. కట్టుచెరగు (కో. 7; తె. 15).

**కట్టుపంచె** పర్యా. చూ. పంచె (3). మగవాళ్ళు కట్టుకొనే బట్ట; మామూలుగా, ఏడెనిమిది మూరల

పొడుగుది; రెండంచులు, రెండు కమ్ములు పెట్టి నేస్తారు; మామూలుగా తెలుపుది; కొన్ని చోట్ల రంగుది; అంచుల్లో రంగులు, డిజైన్లు పెట్టి నేస్తారు (కో. 10).

**కట్టుపావ** మగ్గంగుంటలో, మడిమగూటానికి గుదులతో బిగించిన పావుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 1 (కో. 36).

**కట్టుపోగు** చిలపలో చివరపోగు; ఇది తీస్తే మొత్తం నూలంతా దీని వెంబడి వరసగా వస్తుంది (తె. 9).

**కట్టుబిళ్ళ** పర్యా. చూ. అచ్చుబిళ్ళ. అచ్చుకట్టేటప్పుడు, వడిదారం చుట్టే కొయ్య; దీనికి చుట్టిన వడిదారం అచ్చుకర్రకు దూరుస్తారు. చూ. చిత్రాలు 93 క, చ (కో. 23).

**కట్టువాక** రోజూ కట్టుకోటానికి నేసినచీర (తె. 8).

**కట్టె 1.** పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సన్నటికర్ర; దీన్ని కోల్ల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండువైపులా రెండుంటాయి. చూ. చిత్రం 69 (రా. 4, 6, 9, 11-17, 19); **2.** పర్యా. చూ. అచ్చుకర్ర (1). అచ్చులో వడిదారం కట్టిన కర్ర; అచ్చుకట్టేటప్పుడు, దీన్ని జంత్రంకొయ్యలకు బిగిస్తారు; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; బోనచ్చుకు ఎనిమిది ఉంటాయి. చూ. చిత్రాలు 91 క. 7, 100.1, 121 క. 8 (తె. 9; రా. 4, 6, 9, 11-15, 19 ఎ); **3.** పర్యా. కట్టుగర్ర. ఎదురుదోనెగాడిలో, పడుగు దారాలు బిగించికట్టే సన్న బెత్తం (రా. 4).

**కట్టెచిర్ర** పర్యా. చూ. కోతిపుల్ల (1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (తె. 26).

**కట్టెపసక(ఉన్ని)** ఒకరకం ఉన్ని (తె. 7).

**కట్టెలాడెకొమ్ము** ఉ. కట్టెలాడికొమ్ము; పర్యా. చూ. మరనాడె. ఒకరకం నాడె; మరమగ్గంది; పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి, కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే కొయ్యనాడె; కుచ్చు గుంజినప్పుడు, పడుగు పోగుల మధ్య, పానుపుపట్టెమీద ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి పరిగెడుతుంది; చేతినాడెకంటె ఉరువు పెద్దది; దీంతో నేత సులువుగా, తొందరగా అవుతుంది. చూ. చిత్రం 131 క (రా. 16).

**కట్నంతాడు** పర్యా. చూ. ఆకులతాడు (1). రాట్నం ఆకులకు చుట్టినతాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు ఏటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (తె. 32).

**కట్లకట్టె** నార శుభ్రంచెయ్యటానికి, బండమీద వేసి కొట్టే కొయ్యగూటం. చూ. చిత్రం 298 (తె. 25).

**కట్లపీట 1.** పర్యా. చూ. కండెలపీట. కండెలు చుట్టే మనిషి కూర్చోటానికి రాట్నందగ్గర వేసుకొనే పీట. చూ. చిత్రాలు 56 క, చ (కో. 33, 34); **2.** గంజి పట్టించటానికి పడుగు పరిచే పీట (కో. 34).

**కట్లపూవురంగు** లేతనీలంరంగు (తె. 27).

**కడ 1.** పర్యా. చూ. చెంప (1). పడుగుదువ్వెకుంచె పక్కభాగం; చేత్తోపట్టుకోటానికి వీలుగా, దీనికి గోనెపట్టా గాని, లేకిచేపతోలు గాని వేసి కుడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 76 క. 8 (తె. 15 16; రా. 24); **2.** పర్యా. చూ. చిగురు. అంచులో చిట్టచివరి భాగం; కొన్నిచోట్ల, చివర విడిచి అంచు నేస్తారు; కొన్నిచోట్ల చివరి భాగంలోనే నేస్తారు: మామూలుగా, ఈ నేతకు జమిలిపోగులు (కొన్నిచోట్ల, మందపు దారాలు) వాడతారు. చూ. చిత్రం 155.1 (కో. 5).

**కడకట్టు** పర్యా. చూ. చెంపకట్టు. కుంచెచెంపకు వేసిన దారపుకట్టు; ఇటువంటివి రెండు వేస్తారు. చూ. చిత్రం 76 క. 9 (కో. 30).

**కడగుంజ** ఉన్నిపడుగు తోడే ఆనుగూటాల్లో కిందిది. చూ. చిత్రం 312 (తె. 25).

**కడగుదిపాయ** పర్యా. చూ. అంచగుదిపాయ. అచ్చుగుదిపాయల్లో చివరది; ఇటువంటివి, కుడివైపునా ఎడమవైపునా రెండుంటాయి. చూ. చిత్రాలు 100.6, 100.8 (రా. 10).

**కడచిగురు** అంచు చివరి భాగం; పడుగు నాలుగేసి పోగులు కలిపినప్పుడు, అంచు చివరిభాగానికి వాడే నూలుకు జమిలిపోగులు అతుకుతారు; చూ. చిగురు. చూ. చిత్రం 155.1 (తె. 8, 12).

**కడజముళ్ళు** ఉ. కడజమండ్లు, కడజముళ్ళు; పర్యా. చిగురుజముళ్ళు, జముళ్ళు. అంచులో చిట్టచివరివైపు నేతకువాడే జమిలిపోగులు; అంచు గట్టిదనం కోసం, రెండుమూడు పోగులు కలిపి, పురిపెట్టి వాడతారు. (తె. 14; రా. 17, 18).

**కడంచు** పర్యా. చిగురంచు. బట్టకు చివర వదిలిన సన్నటిఅంచు; పంచెలకు రెండుమూడు కొలుకుల దారం పెట్టి నేస్తారు. చూ. చిత్రం 165 (కో. 3, 5).

**కడంచుబద్ద** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేత

నేసేటప్పుడు, ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 7).

**కడతట్టునేత** పర్యా. కడానేత, కొసనేత, దిగుడు దలనేత. బట్టచివరిభాగం నేత (రా. 16).

**కడతతాడు** ఉ. కడత్తాడు; పర్యా. చూ. చెంప తాడు (3). చేతిమగ్గం పలక, గుండు కలిపి బిగించిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 1 (తె. 33).

**కడదబ్బ** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 4).

**కడపశారుకావికోక** కొంతవరకు తొగరు, రెండు కొలుకులు తెలుపు, ఒక కొలికి తొగరు చొప్పున పెట్టి నేసిన చీర (రా. 19).

**కడలనైవేద్యం** ఉ. కడలనైవెద్దెం. కడవలతో అన్నం తీసుకువెళ్ళి అమ్మవారికి పెట్టే నైవేద్యం; బోనాలు (తె. 2).

**కడవ** **1.** ఉ. కడ్వ; పర్యా. కుండ (1), బాండువ. ఒకరకం మట్టిపాత్ర; మామూలుగా, పొయ్యిమీద ఎసరు పెట్టటానికీ గంజిపోసుకోటానికీ వాడేది (తె. 12). **2.** పర్యా. చూ. నీలికుండ. నీలిరంగు ఊరబెట్టే పెద్ద కుండ; సుమారు ఆరడుగుల పొడుగుది; దీన్ని భూమిలో పాతిపెట్టి, నీలిచెట్ల ఆకులు, తగిరిసె విత్తనాలు మొ.వి వేసి ఊరేస్తారు; దీన్ని 'మహాకాళి'గా తలచి పూజలు చేస్తారు; అశుచిగా ఉన్న స్త్రీపురుషులు దీనిదగ్గరికి వెళ్ళగూడదట (రా. 11, 13); **3.** రూ. గుడవ; పర్యా. కుండ (3). మట్టిపాత్ర; దీంట్లోకి నీళ్ళుతోడు కొంటారు (రా. 15); **4.** చింత అంబలి కాచే కుండ (తె. 20).

**కడవచాయ** ఉ.-సాయి; పర్యా. చూ. కడవనీలి (1). ఒక రకం నల్లరంగు; నీలిచెట్ల ఆకులు కడవల్లో ఊరబెట్టి తయారుచేసిన రంగు (రా. 11, 13, 15).

**కడవనల్ల** పర్యా. చూ. కడవనీలి (1). ఒకరకం నల్లరంగు; నీలిచెట్ల ఆకులు కడవల్లో ఊరబెట్టి తయారు చేస్తారు (రా. 24).

**కడవనీలి** **1.** పర్యా. కడవచాయ, కడవనల్ల. ఒక రకం నల్లరంగు; నీలిచెట్ల ఆకులు కడవల్లో ఊరబెట్టి తయారుచేస్తారు; indigo (కో. 14; తె. 5, 8, 16, 17; రా. 24); **2.** నీలిలో ఎరుపువన్నె; జిన్నపండు వన్నె (తె. 16).

**కడవవన్నె** ఉ. కడవొన్నె. ఒకరకం నల్లరంగు; చూ. కడవనీలి (రా. 17).

**కడానేత** పర్యా. కడతట్టునేత. బట్టచివరిభాగం నేత (రా. 18).

**కడి** పర్యా. చూ. పరిగుంజ (1). ఆరుబయట చాపినపడుగు, రెండోవైపు కట్టటానికి నేలలో పాతిన రాతిస్తంభం. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (తె. 10).

**కడికొండి** రాతిస్తంభానికి (= పరిగుంజకు) పడుగు తగిలించటానికి అమర్చిన కొక్కెం. చూ. చిత్రం 63 ర. 3 (తె. 10).

**కడియం** **1.** ఉ. కడెం; పర్యా. గాను (2), గొలుసు కడియం, చెక్రం (7). ఊడ్తెఅడ్డపట్టెకు బిగించిన ఇనప చుట్టు. చూ. చిత్రాలు 64 చ. 1, 70 క. 2 (కో. 5, 9; తె. 10, 11, 14, 15, 20, 21); **2.** మగ్గందగ్గర రాయబారంతాడుకు వేసిన ఇనపచుట్టు. చూ. చిత్రం 129 క. 1 (కో. 6).

**కడుపు** మరానుచెక్రం కట్టుబడిలో, రెండు ఆకుల వరసలకు మధ్యభాగం. చూ. చిత్రం 50 (కో. 24).

**కడ్డీ** ఉ. కడ్డి. **1.** పర్యా. చూ. సూలం (1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలో ఒకభాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31.2 (కో. 9; తె. 13, 16; రా. 6, 16, 18); **2.** పర్యా. చూ. ఇరుసు (3). దబ్బారాట్నం చెక్రం తిరగటానికి నిలువులకు బిగించిన ఇనపచువ్వ. చూ. చిత్రం 41 క. 10 (కో. 10); **3.** దబ్బారాట్నం చెక్రంలో ఆకులకు బదులు బిగించిన ఇనపఊచ. చూ. చిత్రం 41 త. 2 (రా. 6, 24); **4.** పర్యా. చూ. కదురు (6). అచ్చు కట్టేటప్పుడు అచ్చుబిళ్ళకు చేర్చి వడిదారం చుట్టే ఇనప పుల్ల; దీనిబెజ్జంలో దూర్చినదారం, అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు. చూ. చిత్రం 92 క. 1 (రా. 15, 19); **5.** పర్యా. చూ. సలాక (3). నేతబద్దెను, దోనెకు బిగించే పొడుగాటి ఇనపచువ్వ (రా. 11); **6.** పర్యా. చూ. కమ్మి (9). మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా, ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; పావుచెక్కలకు చేసిన చిల్లుల్లో దూర్చి పక్కగూటాలకు నేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (రా. 6, 7, 11); **7.** పర్యా. కమ్మి (13). రంగులఅద్దకంలో, నూలులడీలు తగిలించే ఇనపఊచ; దీన్ని పట్టుకోటానికి వీలుగా రెండువైపులా వంపులు ఉంటాయి. దీంతో లడీలు, రంగునీళ్ళ అండాల్లోకి దింపి, అంచులమీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (కో. 13; రా. 11, 13, 23, 24); **8.**

పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలు పిండటానికి నేలలోపాతిన పొడుగురాట;మామూలుగా, దీనికి శిలువ మాదిరిగా అడ్డకట్టె అమర్చిఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిల్లిచేసి, దాంట్లో గునపం దూర్చి లడీలు తగిలించి పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (కో. 9).

**కడ్డీఅంచు** ఉ. కడ్డంచు. **1.** వేలెడు వెడల్పున, కడ్డీలమాదిరిగా నేసిన అంచు; ముద్దంచు. చూ. చిత్రం 166 (కో. 2, 9బి, 31; తె. 15; రా. 7, 16); **2.** రెండువేళ్ళ వెడల్పున నేసిన అంచు (తె. 17); **3.** చివర కొంతవిడిచి, పైనా కిందా జమిలిపోగులు పెట్టి, మధ్యగా నేసిన అంచు (కో. 32, 35-37); **4.** చిట్ట చివర కొంత విడిచి, 2-6 వరకూ సన్నపట్టెలు పడేటట్టు నేసిన చీరఅంచు; కొన్నిచోట్ల, జరిపెట్టి నేస్తారు (కో. 24).

**కడ్డీఅంచులుంగీ** కడ్డీఅంచుపెట్టి నేసిన లుంగీ (కో. 36).

**కడ్డీకమ్మి** ఉ. కడ్డికమ్మి. బొటనవేలెడు వెడల్పు పట్టెమాదిరిగా నేసినకమ్మి; ఈ కమ్మిచీరకు, చిగురంచు కూడా అంతే వెడల్పున నేస్తారు. చూ. చిత్రం 269 (కో. 32-34, 36, 37; తె. 17).

**కడ్డీచీర** ఉ. కడ్డిచీర. నాలుగు కొలుకులు కలిసి ఒక కడ్డీలాగా వరసగా వచ్చేట్టు అంచునేసిన చీర (కో. 34; తె. 23; రా. 23).

**కడ్డీపేటు** ఉ. కడ్డిపేటు. వేలెడు వెడల్పు పట్టెలుగా నేసిన డిజైను; చూ. ఉడతచారలంచు. చూ. చిత్రం 152 (తె. 4; రా. 7).

**కడ్డీముంగి** ఒకరకం చిన్న నేతగడి (తె. 23).

**కడ్డీమైజారు** ఒకరకం చీరకొంగు; రెండు మూడు గీరలు పడేట్టునేస్తారు.

**కడ్డీశోభ** ఉ.-శోబ. అంచులోనేసే ఒకరకం డిజైను (తె. 25).

**కణత** పర్యా. చూ. పలకబుజం (1). చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్క భాగం; కొన్నిచోట్ల, దీనికి నగిషీలు చెక్కుతారు; ఇటు వంటి రెండుభాగాలకు చిల్లులుచేసి పలకసూత్రాలు కడతారు. చూ. చిత్రం 109 చ. 4 (తె. 16).

**కణతచువ్వ** ఉ.-సువ్వ. చేతిమగ్గం పలక పక్కదారం తగిలించే సన్నబెత్తం; ఇటువంటివి రెండుంటాయి (తె. 16).

**కణుము** చూ. కనుము (కో. 8).

**కంట(క)పుకోల** **1.** అల్లుకట్టేటప్పుడు పడుగులో చివరదూర్చిన చువ్వ (తె. 7, 9); **2.** అచ్చుకట్టేటప్పుడు, అచ్చుపోగుల్లో అనివెంబడి పోగులు చెదరకుండాపెట్టిన సన్నటి ఇనపచువ్వ; చూ. జద్దెచువ్వ (తె. 7, 24).

**కంట్లెపీట** ఇనప(జేలుపట్టా)రేకులు అల్లిన, చిన్న నాలుగుకోళ్ళపీట; మంచంమాదిరిగా అల్లింది; పట్టు దారం పంటెకు చుట్టేటప్పుడు, పట్టాలమధ్య సందులో పంటెకామ దూర్చి నిలుపుతారు: చూ. కట్లపీట (తె. 17).

**కండె** ఉ. కండి. **1**. పెట్టెలో ఇరవయ్యో వంతు నూలు (రా. 6, 7); **2.** (-చుట్టు, -చెక్కు, -తిప్పు, -పట్టు, -పెట్టు, -పోయు); పర్యా. నేతకండె, బోటు (1). రాట్నంమీద, జొన్నదంటు ముక్కకు చుట్టిన నూలు; పేకకువాడే నూలు కండెలుగా చుడ తారు; నేతనేసేటప్పుడు, దీన్ని నాడెగాడిలో అమ రుస్తారు. చూ. చిత్రం 51 (కో. 1-3, 5-7, 9-37; తె. 1-15, 17-33; రా. 1-8, 12-24); **3.** రాట్నం మీద పడికిననూలు (కో. 8); **4.** పర్యా. చూ. నూలు కండె, బోటు (6). నవారునేతలో వాడే పేకదారం చుట్ట; రాట్నంమీద జొన్నపుల్లకు చుడతారు. చూ. చిత్రం 324 క. 6 (కో. 12; తె. 6,27); **5.** (-చుట్టు). నారపట్టానేతలో అడ్డానికి వాడేనూలు; ఊచకు చుట్టిన ఉండ (తె. 25).

**కండెఆట** పర్యా. కొమ్ముఆట. నేతనేసేటప్పుడు (= కుచ్చు గుంజేటప్పుడు) కండె అమర్చిన నాడె కుడి ఎడమలకు వస్తూపోతూ ఉండటం; నాడె ఆడినప్పుడు, పైపోగులకు, కిందిపోగులకు, మధ్య పేకపోగు పడు తుంది (కో. 1).

**కండెగంప** కండెపుల్లలు వేసుకొనే గంప(రా.24).

**కండెచట్టి** ఉ.-సట్టి. పేకదారం కండెలు వేసుకొనే చిన్న మట్టిపాత్ర (రా. 24).

**కండెచెక్కు** (క్రి.) నాడెముల్లుకు, పేకదారంకండె గుచ్చటం (తె. 17).

**కండెనాటు** (క్రి.) పర్యా. బోటుచెక్కు. నాడె ముల్లుకు, పేకదారంకండె గుచ్చటం (కో. 22).

**కండెనూలు** ఉ. కండినుగులు; పర్యా. పేకనూలు. నేతలో అడ్డానికి వాడేనూలు; దీన్ని కండెలుగా చుడ తారు (కో. 7; రా. 19).

**కండెబొందు** ఉ. కండి-. పేకకు వాడేనూలు చిలప (కో. 7).

**కండెబోటు** **1.** (-చుట్టు) ఉ. కండి-. రాట్నం మీద, జొన్నదంటుముక్కకు చుట్టిన చిన్ననూలుకండె. చూ. చిత్రం 51 (కో. 6, 9; రా. 9, 12, 19-21); **2.** పర్యా. బోటు (2). నిండుకండెలో కొంతదారం

ఉపయోగించుకోగా మిగిలింది. చూ. చిత్రం 52 (కో. 18, 22).

**కండెముల్లు** పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో, పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (రా. 23).

**కండె(ల)కదురు** ఉ. కండి-. పేకదారంకండెలు చుట్టే రాట్నం కదురు; వడికే కదురుకంటె చిన్నది. చూ. చిత్రం 58 (తె. 31; రా. 11, 13, 23).

**కండెలకుండ** పేకదారంకండెలు వేసుకొనే మట్టిపాత్ర; దీంట్లో నీళ్ళుపోసి మగ్గందగ్గర పెట్టుకొంటారు (తె. 29).

**కండెలగంప** ఉ. కండ్లెగంప. పేకదారం చుట్టిన పుల్ల (=కండె)లు వేసుకొనే గంప; నేతపనివాడు కుడిపక్కన పెట్టుకొంటాడు (రా. 17).

**కండెలగుండ్ర** పర్యా. చూ. కండెలమండిగ. నూలు కండెలు వేసుకొనే ఒకరకం మట్టిపాత్ర. చూ. చిత్రం 54 (కో. 27).

**కండెలచిట్టి** ఉ. కండెల్చిట్టి. పేకదారంకండెలు వేసుకొనే చిన్నతొట్టి; దీంట్లో నీళ్ళుపోసి మగ్గందగ్గర పెట్టుకొంటారు (కో. 11; రా. 11).

**కండెలచిప్ప** ఉ. కండెల్సిప్ప. పేకదారంకండెలు వేసుకొనే మట్టిపాత్ర; దీంట్లో నీళ్ళుపోసి మగ్గందగ్గర పెట్టుకొంటారు (కో. 2, 5, 10, 13, 14; తె. 2, 31, 32; రా. 7, 8, 10, 12, 13, 18).

**కండెలచొప్ప** పేకదారం కండెలు వేసుకొనే మట్టి పిడత; దీంట్లో నీళ్ళుపోసి మగ్గందగ్గర పెట్టుకొంటారు (రా. 5).

**కండె(ల)తొట్టి** ఉ. కండ్లెతొట్టి. పేకదారంకండెలు వేసుకొనే తొట్టి; దీంట్లో నీళ్ళుపోసి మగ్గందగ్గర పెట్టుకొంటారు. చూ. చిత్రం 54 (తె. 1, 9, 18, 22, 25, 33; రా. 16).

**కండెలదిబ్బ** ఉ. కండిల్దిబ్బ; పర్యా. చూ. మొద్దు (2). నూలుడబ్బా తిరగటానికి వీలుగా, వంపుదిరిగిన ఇనపచువ్వ దిగగొట్టిన కొయ్యమొద్దు. చూ. చిత్రం 30.1 (కో. 7).

**కండెలనూలు** చేత్తో వడికి కండెపోసిన నూలు (రా. 11, 12.)

**కండెలపడిగం** పేకదారం కండెలు వేసుకొనే మట్టిచిప్ప; దీంట్లోనీళ్ళుపోసి మగ్గందగ్గర పెట్టుకొంటారు (కో. 12).

**కండెలపీట** ఉ. కండ్లెపీట; పర్యా. కట్లపీట (1), పీట (9). కండెలుచుట్టే మనిషి కూర్చోటానికి, రాట్నం దగ్గర వేసుకొనే పీట. చూ. చిత్రం 56 క, చ (కో. 25, 28, 31).

**కండెలబుట్ట** 1. కండెఊచలు వేసుకొనే ఆనపకాయ బుర్ర. చూ. చిత్రం 59 (తె. 32); **2.** రూ. కండెల బుట్టి. పేకదారం చుట్టిన పుల్లలు వేసుకొనే బుట్ట; నేత పనివాడు కుడిపక్కన పెట్టుకొంటాడు (తె. 10, 18).

**కండెలబుట్టి** చూ. కండెలబుట్ట (2).

**కండెలమండిగ** ఉ. కండ్లెమండిక, కండెలమండిగె; రూ. కండెలమండిన, కండెలమండ్రిగె; పర్యా. కండెల గుండ్ర, కండెలతొట్టి, కండెలమలక. నూలుకండెలు వేసుకొనే ఒకరకం మట్టిపాత్ర. చూ. చిత్రం 54 (కో. 25, 26, 28–31, 35–37).

**కండెలమండిన** చూ. కండెలమండిగ.

**కండెలమండ్రిగె** ఉ. మండ్రిగ; చూ. కండెలమండిగ (కో. 34).

**కండెలమలక** పర్యా. చూ. కండెలమండిగ. నూలు కండెలు వేసుకొనే ఒకరకం మట్టిపాత్ర, చూ. చిత్రం 54 (కో. 33).

**కండెలముల్లు** పేకదారంకండెలు గుచ్చిన బలుసు కొమ్మ; ఒక్కొక్క ముల్లుకు ఒక్కొక్క రంగు దారం కండె గుచ్చుతారు. చూ. చిత్రం 62 (తె. 32).

**కండెలమూకిడి** పేకదారంకండెలు వేసుకొనే మట్టి చిప్ప; మూకుడు; దీంట్లో నీళ్ళుపోసి మగ్గందగ్గర పెట్టుకొంటారు (రా. 1).

**కండెలరాటం** ఉ. కండ్రిలాటం, కండెలరోటం, కండెల్రాటం; చూ. కండె(ల)రాట్నం (కో. 5–7, 10–13, 27; రా. 1, 6, 9, 10, 12, 13, 19, 21, 23, 24).

కండెరాటి ఒకరకం రాటి; కండెలు చుట్టేటప్పుడు చిలప దీనికి తగిలిస్తారు (కో. 33).

**కండె(ల)రాట్నం** ఉ. కండెలరాట్రం, కండెల్రాట్నం; రూ. కండెలరాటం; పర్యా. ఆకులరాటం (1), చేతిరాట్నం, నూలురాటం, బోట్లరాటం. పేకకు పనికివచ్చే కండెలు చుట్టే రాట్నం; మామూలురాట్నం మీద చుడతారు. చూ. రాట్నం (1). చూ. చిత్రం 53 (కో. 1, 12, 17, 25, 26, 28–30, 33–37; తె. 1, 2, 6, 7–10, 13, 20–22, 24–33; రా. 2, 5, 24).

**కండెవాను** ? కండెకుకండె పూర్తిగా నేసిన జంపఖానా (తె. 17).

**కండెసీడు** పేకకువాడే నూలుచుట్ట (తె. 12).

**కండ్లకమ్మి** చీరకమ్మిలో అక్కడక్కడ ఎరుపు నలుపు పోగులు దూర్చి నేసిన కమ్మి (కో. 5).

**కండ్లగొంగడి** గళ్ళుగళ్ళుగా నేసిన గొంగడి (తె. 28).

**కండ్లచీర** పర్యా. చూ. గళ్ళచీర. అంచుల మధ్య భాగంలో రంగుపోగులుపెట్టి గదులుగదులుగా నేసిన చీర; మామూలుగా, నల్చదరపుగళ్ళు నేస్తారు; కన్ను అంటే గడి. చూ. చిత్రం 270 (తె. 4, 5).

**కతాళి** ఒకరకం కృత్రిమపు పట్టు; art silk; 'కల్లు బాణా, బాణాసిల్కు' అనికూడా అంటారు. పసుప్పచ్చ రంగులో ఉంటుంది; అంచుల నేతకు వాడతారు (రా. 17).

**కత్తి** ఉ. కత్తె. **1.** పర్యా. చేకు, ఛురి (1). చెక్కే ఇనప పనిముట్టు; పన్నెపుల్లలు చెక్కే ఒకరకం కత్తి. చూ. చిత్రాలు 89 క. 1, 89 చ. 1 (కో. 1); **2.** పర్యా. చూ. కుక్క (2). డాబీకోలలను లేపటానికి దిండు చెక్రాన్ని, కొన్నిచోట్ల దిండునుగాని, గుంజే ఇనపరేకు; దీనికి ఒకవైపున పేటుతాళ్ళు కడతారు; పావుచెక్క తొక్కినప్పుడు, పళ్ళచెక్రాన్నిగాని దిండు ఊచల చెక్రాన్నిగాని గుంజుతూ కిందికీ పైకీ ఆడుతుంది. చూ. చిత్రాలు 132 క. 3, 132 చ. 7, 132 ట. 3 (కో. 10, 23-25, 36; రా. 13; 14, 18); **3.** పర్యా. చెక్కకత్తి, నేత కట్టె, పలక(3). వారు నేసేటప్పుడు, పడుగులో పేక పోగు దట్టించే కొయ్యపనిముట్టు; కత్తి మాదిరిది. చూ. చిత్రం 324 చ. 4 (కో. 12; రా. 10); **4.** తివాసీ నేసేటప్పుడు పడుగులో ఉన్నిపోగులు ఎక్కించి కొనలు కోసే పనిముట్టు. చూ. చిత్రం 322 చ (తె. 17).

**కత్తిపట్టె** డాబీ కట్టుబడిలో కుక్క (= కత్తి) బిగించిన కొయ్యపట్టె. చూ. చిత్రం 132.7 (రా. 12).

**కత్తిబల్ల** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి, కుచ్చుచెంపతాళ్ళు కడతారు; నేత నేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 33).

**కత్తెర** **1.** పర్యా. చూ. కొలికి (3). అచ్చుకట్టే టప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె; నేత నేసేటప్పుడు, పడుగుపోగులను పైకి లేపటానికీ కిందికి దింపటానికీ ఈ లంకెల్లోనుంచి ఔంతుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (తె. 24; రా. 24); **2.** ఉ. కత్తిర; పర్యా. బొమ్మ (13). ఒకరకం డిజైను నేత నేసేటప్పుడు, అడ్డబేలు దారాలు పైకి ఎత్తటానికి వాడే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 137 (తె. 18); **3.** తివాసీనేతకు వాడే ఉన్నిపోగులు కత్తిరించే కత్తెర. చూ. చిత్రం 322 ట (తె. 10, 17).

**కత్తెరకాయచీర** మూరెడుపొడుగు కమ్మి పెట్టి నేసిన ఒకరకం చీర; తురంజీలకమ్మి చీర. చూ. చిత్రం 276 (తె. 13).

**కత్తెరకొయ్య** **1.** ఉ. కత్తిరి-. పర్యా. చూ. ఊడ్డె కాలు. నేలమీద మోసే ఊడ్డెకొయ్య; ఇటువంటివి, మడతమంచంకోళ్ళ మాదిరిగా రెండుంటాయి; వీటిపైన అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 63 క. 1 (కో. 7); **2.** పర్యా. చూ. కత్తెరగుంజ (2). మరమగ్గంచట్రం నిలబెట్టటానికి నేతబయలులో పాతిన ఒకరకం నిలువు గుంజ; పైన ఒకటి, పటవాలుగా మరొకటి కొయ్య పట్టెలు బిగించింది; కత్తెరమాదిరిగాను, రైలురెక్క మాదిరిగాను ఉంటుంది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 117 (కో. 5).

**కత్తెరగుంజ** **1.** మరాసుబడ్డీకి ఆధారంగా నేలలో పాతిన కొయ్య; ఇటువంటివి రెండుంటాయి (కో. 12ఎ); **2.** ఉ. కత్తిరి-; పర్యా. కత్తెరకొయ్య (2). కత్తెర మాను, రెక్కమాను, సిగ్నలు. మరమగ్గంచట్రం నిల బెట్టటానికి, నేతబయలులో పాతిన ఒకరకం నిలువు గుంజ; పైన ఒకటి, పటవాలుగా మరొకటి కొయ్య పట్టెలు బిగించింది; కత్తెరమాదిరిగాను, రైలురెక్క మాదిరిగాను ఉంటుంది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 117 (కో. 3, 4, 6, 7, 9, 10, 12; రా. 2).

**కత్తెరమాను** ఉ. కత్తిర-; పర్యా. చూ. కత్తెర గుంజ (2). మరమగ్గంచట్రం నిలబెట్టటానికి, నేతబయలులో పాతిన ఒకరకం నిలువుగుంజ; పైన ఒకటి, పటవాలుగా మరొకటి కొయ్యపట్టెలు బిగించింది; కత్తెర మాదిరిగాను, రైలురెక్కమాదిరిగాను ఉంటుంది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 117 (కో. 2).

**కత్రీపువన్నె** (తమిళం: కత్తిరిక్కాయ్ = వంకాయ). చూ. వంగపువ్వురంగు (రా. 15).

**కదురు** ఉ. కదరు. **1.** పర్యా. చూ. ఏకుపుల్ల (1). ఏకు తయారుచెయ్యటానికి ఉపయోగించే పుల్ల. చూ. చిత్రం 11.3 (తె. 16; రా. 23); **2.** (-నిండు) పర్యా. తుంటా. రాట్నంబొమ్మ చెవులకు దూర్చిన ఇనపపుల్ల; నూలువడకటానికీ కండెలుపట్టటానికీ ఉపయోగపడు తుంది. చూ. చిత్రం 15 క. 11. (కో; తె; రా.); **3.** చేత్తో నూలు వడికే ఇనపపుల్ల; రాట్నంకదురుకంటె చిన్నది. చూ. చిత్రం 17 ట (కో. 1-10, 12; తె. 14, 15, 17); **4.** పర్యా. చూ. సూలం (1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా, ఇనపది; కొన్ని చోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల రాటికట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (రా. 1); **5.** పర్యా. చూ. గంటం (1). డబ్బారాట్నం బొమ్మలకుగాని,

దొడ్డి నిలువులకుగాని బిగించే మందపుకడ్డీ; పెద్దకదురు. చూ. చిత్రం 41 క. 12 (కో. 1, 2; తె. 14; రా. 1-8, 10, 11, 16, 18-20, 23, 24); **6.** పర్యా. అచ్చుకదురు, అచ్చుపుల్ల (1), కడ్డీ (4), కదురుపుల్ల, కమ్మి (7), తకలా, పిసరపుల్ల, పుల్ల (7), బిళ్ళపుల్ల, బెంతిపుల్ల (1), బెంతిముల్లు. అచ్చుకట్టేటప్పుడు, అచ్చుబిళ్ళకు చేర్చ, వడిదారం చుట్టేపుల్ల; మామూలుగా కట్టెపుల్ల; కొన్నిచోట్ల, ఇనపది; దీని బెజ్జంలో దూర్చిన దారం అచ్చువడిలో తిప్పి, కర్రకు కడతారు. చూ. చిత్రం 92 క. 1 (కో. 4-6, 10, 16-18, 20, 24; తె. 6 13; రా. 7, 8, 10, 11, 13, 18, 22-24); **7.** పట్టుదారంవడికే పెద్దరాట్నం కదుర్లపీటకు బిగించిన ఇనపపుల్ల. చూ. చిత్రం 293 చ. 10 (కో. 14; రా. 14); **8.** పట్టుమగ్గం కట్టుబడిలో, అచ్చును పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఆధారంగా కట్టిన పైతాళ్ళు తగిలించే పెద్ద కొయ్యగిలక; చూ. పుల్లిరుసు (తె. 5); **9.** నారవడికే కొయ్యపుల్ల; దీనికి చివర ఒక బిళ్ళ బిగించి ఉంటుంది. చూ. చిత్రం 302 (తె. 25); **10.** తివాసీనేతకోసం ఉన్నిదారం వడికే పుల్ల; చివర, కొయ్యబిళ్ళ బిగించింది; తకిలీలాంటిది. చూ. చిత్రం 319 (తె. 17); **11.** చేత్తో ఉన్నివడికే పుల్ల; ప్రత్తి వడికేదానికంటె పెద్దది. చూ. చిత్రం 311 (తె. 3, 6, 7, 9-11, 20, 22, 25-28).

**కదురు(ఊచ)** **1.** ఉ. కదురూస; పర్యా. చూ. ఊచ (3). కండెనూలు చుట్టే జొన్నదంటు ముక్క; కొన్నిచోట్ల, కంకిపుల్ల, కాకిరెల్లు, చొప్పపుల్ల, కొయ్య, ఇనుము మొ. వాటితో చేసిన ఊచలు వాడతారు. మరమగ్గం నాడెలో, మామూలుగా, కొయ్యఊచలుగాని, ఇనపఊచలుగాని అమరుస్తారు. చూ. చిత్రం 51 క (కో. 33, 34); **2.** పర్యా. చూ. ఊచ (7). ఉన్ని కదురుపుల్ల; వెదురుది. చూ. చిత్రం 311 చ. 1 (తె. 9, 10).

**కదురుకామ** పర్యా. చూ. ఊచ (7). ఉన్నికదురుపుల్ల; వెదురుది. చూ. చిత్రం 311 చ. 1 (తె. 6).

**కదురుకుంపటి** పర్యా. కుంపటి. పెద్ద కుండపెంకు; ఉన్నిదారం వడికేటప్పుడు. కదురు దీనిమీదపెట్టి తిప్పుతారు; బోకిమాదిరిది. చూ. చిత్రం 308.3 (తె. 6).

**కదురుకొయ్య** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులువేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (తె.31).

**కదురుగొట్టం** కదుళ్ళువేసి ఉంచుకొనే వెదురుగొట్టం. చూ. చిత్రం 18 (కో. 34).

**కదురుదెప్ప** పర్యా. చూ. కదురుబిళ్ళ. రాట్నంమీద వడికిన నూలు కదురుకు చుట్టేటప్పుడు, హద్దుగా, కదురుకు బిగించిన బిళ్ళ; గుమ్మడిపెంకు, తోలు, లోహం మొ. వాటితో చేస్తారు. చూ. చిత్రం 15 చ.1 (కో. 36).

**కదురుదారం** పర్యా. చూ. పురి(1). రాట్నం ఆకులతాడును, కదురును కలిపే గట్టిదారం; దీనివల్ల కదురు తిరుగుతుంది. చూ. చిత్రం 15.6 (కో. 15).

**కదురుదిండు** **1.** పర్యా. చూ. కదురుబిళ్ళ. రాట్నంమీద వడికిన నూలు కదురుకు చుట్టేటప్పుడు, హద్దుగా, కదురుకు బిగించిన బిళ్ళ; గుమ్మడిపెంకు, తోలు, లోహం మొ. వాటితో చేస్తారు. చూ. చిత్రం 15 చ. 1 (కో. 34); **2.** పర్యా. చూ. దిండు (4). గంటానికి బిగించిన రీలుదారపు గిలక; డబ్బారాట్నం వడిదారం దీని గాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41క. 13 (తె. 21).

**కదురుపంటె** ఉ. కదురుపంటి. రాట్నంకదురుకు తగిలించి నూలు చుట్టే చిన్నపంటె; చెలకపంటెకంటె కొంచెం చిన్నది; చూ. చెలకపంటె. (తె. 31).

**కదురుపీట** **1.** పర్యా. చూ. బొమ్మ(3). రాట్నంపీటకు ఎడమవైపున కదురుబిగించే నిలువుకొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడి బొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చిత్రం 15.10 (కో. 13); **2.** పర్యా. చూ.దాకెపీట. ఉన్నివడికేటప్పుడు, ఆడవాళ్ళు కూర్చోటానికి వేసుకొనే పీట. చూ. చిత్రం 308.2 (తె. 6).

**కదురుపుల్ల** పర్యా. చూ. కదురు (6). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుబిళ్ళకు చేర్చ వడిదారం చుట్టే పుల్ల; మామూలుగా కొన్నిచోట్ల, ఇనపది; దీన్ని బెజ్జంలో దూర్చిన దారం అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు. చూ. చిత్రం 92 క. 1 (కో. 7).

**కదురుపూస** పర్యా. చూ. దిండు (4). గంటానికి బిగించిన రీలుదారపు గిలక; డబ్బారాట్నం వడిదారం దీనిగాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క. 13 (తె. 10).

**కదురుబద్ద** పట్టుమగ్గం అచ్చుతాళ్ళు తగిలించిన పెద్ద గిలక (=కదురు) కు ఆధారంగా పైన బిగించిన చెక్క; చూ. పుల్లిరుసు (తె. 5).

**కదురుబిళ్ళ** ఉ.-బిల్ల; పర్యా. కదురుదెప్ప, కదురుదిండు (1). రాట్నంమీద వడికిన నూలు కదురుకు చుట్టేటప్పుడు, హద్దుగా, కదురుకు బిగించిన బిళ్ళ;

గుమ్మడిపెంకు, తోలు, లోహం మొ. వాటితో చేస్తారు. చూ. చిత్రం 15 చ. 1 (కో. 5, 37).

**కదురుమొల** పర్యా. చూ. మొలిక(1). ఉన్ని కదురు ఊచకు కిందబిగించిన మేకు; మామూలుగా, ఆడ వాళ్ళువడికే కదుర్లకు, పెద్దకదురుకు బిగిస్తారు. చూ. చిత్రం 311 చ. 4 (తె. 7, 9).

**కదురురుద్దు** (క్రి.) పర్యా. కామమద్దు. ఉన్నివడికేటప్పుడు, కదురు తొడమీదపెట్టి తిప్పటం (తె. 27,28).

**కదురూచ** (కదురు+ఊచ) రాట్నంబొమ్మ చెవుల మధ్య ఉండే కదురుభాగం; దీన్ని, చిటికేశ్వరం, కంది, కలేకట్టె మొ. కట్టెలతోగాని, తోలుతోగాని, బంక పట్టించిన నూలుతోగాని ఏర్పాటు చేస్తారు. ఈ దిండు గాడికి, వడిదారం వేస్తారు (కో. 34).

**కదుర్లపట్టీ** పర్యా. కదుర్లపీట. పట్టుదారం వడకటానికి, పెద్దరాట్నం దగ్గర పెట్టే కొయ్యపట్టె; దీంట్లో మధ్యన కొయ్యగిలకలు వరసగా బిగించి ఉంటాయి. చూ. చిత్రం 293 చ. 9 (కో. 14).

**కదుర్లపీట** ఉ. కదుర్లపీట; పర్యా. కదుర్లపట్టీ. పట్టుదారం వడకటానికి పెద్దరాట్నందగ్గరపెట్టే కొయ్యపట్టె; దీంట్లో మధ్యన కొయ్యగిలకలు వరసగా బిగించి ఉంటాయి. చూ చిత్రం 293 చ. 9 (తె. 5, 21; రా. 14).

**కద్దరు(నూలు)** ఉ. కదరు-, కద్దర-. చేత్తోరాట్నం మీద వడికిననూలు; ?కనారునూలు (కో. 7, 12, 14, 17-24; రా. 17).

**కద్దరురాటం** ఏకునుంచి నూలుతీసేరాట్నం; ఖద్దరు రాట్నం; చూ. రాట్నం (రా. 17).

**కనకనాగులచీర** ఉ. కనకనాగల్చీర. తెలుపు, నీలి, ఎరుపువన్నెల్లో నేసినచీర; మధ్య తెల్లపోగులు దూర్చి, దండెంఅంచుపెట్టి నేస్తారు (రా. 11, 19బి).

**కనకపీతాంబరం** ఒకరకం పసుప్పచ్చ రంగు; బీర పువ్వు, గుమ్మడి పువ్వు రంగుల మాదిరిది (తె. 12)

**కనకపుల్ల** పర్యా. బుసిపుల్ల. చేతినాడె గాడిలో అడ్డంగా బిగించిన పుల్ల; పేకపోగు, చిక్కుపడకుండా సాపుగా రావటానికి దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ చిత్రం 131 చ. 2 (తె. 29).

**కనకాంబరం 1** ఒకరకం లేత ఎరుపురంగు. చూ. చిత్రం 288 (కో. 2-4, 6, 7, 9, 11, 15 20-24, 36, 35; తె. 2, 4, 8, 17; రా. 5, 7, 8, 11, 19, 22); **2.** పసుపులో ఎరుపువన్నె (కో. 14); **3.** ముదురు నారింజరంగు (కో. 16, 18); **4.** బంగారు రంగు; జెండపువ్వురంగు (తె. 11, 12; రా. 15); **5.** ఎరుపులో పసుపువన్నె (తె. 26).

**కనికెడు** (విశే.) ? కొద్దిపాటి పరిమాణం; పడుగుకు పెట్టేగంజి తయ్యాటానికి నూకలపిండి ఉడకబెట్టేటప్పుడు జిగురుపాకం రావటానికి "కనికెడుచింతాకు" అందులో వేస్తారు (తె. 16).

**కనుంగన్నిపత్తి** చూ. కరుంగనపత్తి (కో. 14).

**కనుము** ఉ. కన్మ; రూ. కణుము; పర్యా. జాకెట్ పీసు; జాకెటుముక్క. ఒక రవికెకు సరిపడే నేతగుడ్డ; పదిగిరల (10/16 గజం) పొడుగు ఉంటుంది (తె. 2, 4-6, 11-17, 21, 23-25; 31, 32).

**కంత 1.** పర్యా. చూ. గనిగుంత. మగ్గం దగ్గర గోడలో పెట్టిన కిటికీ; నేతనేసేటప్పుడు మగ్గందగ్గర వెలుతురుపడటానికి కిటికీ పెడతారు. చూ. చిత్రం 108.4 (రా. 1); **2.** మగ్గందగ్గర గోడలోపెట్టిన చిన్నగూడు; నేతకు అవసరమయే చిన్న వస్తువులు-నాడెలు, నూనెసీసా మొ. వి - దీంట్లో పెట్టుకొంటారు (కో. 15).

**కందు(వన్నె)** ఉ. కొందు. ఒకరకం నలుపువన్నె (రా. 18, 24).

**కన్నప్పసోమవారం** (ఉ. -సోమారం) చేనేతపని చేసే కైకాలవాళ్ళు కార్తీకమాసంలో తొలి సోమవారంనాడు చేసుకొనే పండుగ; ? ఈ కన్నప్ప, కులం కోసం ప్రాణత్యాగం చేసిన 'పేరంటాలు' (కో. 18).

**కన్నాలబల్ల** పర్యా. బొక్కలబల్ల. వజ్రనేతకోసం అమర్చిన దొడ్డిచట్రంలో కుచ్చుతాళ్ళు దూర్చినచెక్క; దీని చిల్లుల్లో ఒక్కొక్కతాడు దూరుస్తారు. చూ. చిత్రం 134 చ. 8 (కో. 37).

**కన్ను** (-కుట్టు, -తీయు, -తీర్చు) పర్యా. కుట్టు, టానా (2), బాణం. కమ్మినేతలో అందానికి, పడుగులో దూర్చిన రంగుదారం; సుమారు రెండంగుళాల పొడుగుది; మామూలుగా ఎర్రదారంపెడతారు; కొన్ని చోట్ల, నలుపు, తెలుపుదారాలు పెడతారు. చూ. చిత్రం 271 (కో. 2, 3, 6).

**కన్నుపేటు** నెమలికన్ను ఆకారంలో గాని, గువ్వ కన్ను ఆకారంలో గాని నేసిన డిజైను (తె. 25).

**కన్నుబుటా** కన్నుమాదిరిగా నేసిన పువ్వు (బుటా) డిజైను (కో. 2).

**కన్నె 1.** జనపనారతో అల్లిన వలలో, తాళ్ళమధ్య సందు; కన్ను, చూ. చిత్రం 305.1 (తె. 25); **2.** సరిచెయ్యటానికి చాపిన ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్ర (=తలగోల) ను, రాగోలకట్టెను కలిపే వంకర ఇనపఊచ; ఇటువంటివి రెండుంటాయి (తె. 28); **3.**

పర్యా. చిలకడ. సరిచెయ్యటానికి గాని, నేతనెయ్యటానికి గాని చాపిన ఉన్నిపసుగు బిగింపుకు, తలగోలకు తగిలించిన తాడు; దీన్ని ఊసుగోలకు వేస్తారు; సరిచేసేటప్పుడు పరిగూటానికి వేస్తారు; మామూలుగా ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 314.9 (తె. 22, 28).

**కన్నెతాడు** పర్యా. చూ. పురి (1). రాట్నం ఆకులతాడును కదురును కలిపే గట్టిదారం; దీనివల్ల కదురు తిరుగుతుంది. చూ. చిత్రం 15.6 (కో. 20).

**కపాలపట్టు** బంగారం రంగు (తె. 11).

**కపిల(వన్నె)** 1. నారింజపండు రంగు; జంపఖానా నేతలో వాడుక (తె.1); **2.** ఉ. కపిళబన్నె. ?పసుపుచ్చరంగు (కో. 21; తె. 2; రా.17); **3.** బీరపువ్వు, పసుపువన్నెలు కలిసిన పట్టురంగు (తె. 21); **4.** ఎరుపులో నలుపువన్నె (తె. 32).

**కపేలా** పట్టుదారానికి వేసే నారింజరంగు (రా. 14).

**కపేలాపిండి** పట్టుదారానికి నారింజరంగు వెయ్యటానికి వాడే పొడి (రా. 14).

**కపేలావిత్తనాలు** ఉ.-ఇత్తనాలు. పట్టుదారానికి వేసే నారింజరంగు తయారీలో వాడే గింజలు (రా. 14).

**కప్పరుతాళ్ళు** (కో. 36)మరమగ్గానికి డాబీఅమర్చి డిజైన్లు నేసేటప్పుడు, అంచులకు కట్టినతాళ్ళు (కో. 36).

**కప్పరుబండి** పర్యా. చూ. దారపుబండి (2). బరువు కట్టిన అంచుపేటు దారాలు తగిలించే కొయ్యగిలక; రీలు; దీన్ని మామూలుగా, మగ్గంమీద ఎత్తుగా అమరుస్తారు. చూ. చిత్రం 133 క. 2 (కో. 36, 37).

**కప్పిరు(లు)** వజానేతనేసేటప్పుడు, చివర బరువులు కట్టిన అంచుపోగులు. చూ. చిత్రం 133 క. 4 (కో. 37).

**కప్పిరు(ల)సంచి** ఉ. కప్పరుసంచి; పర్యా. చూ. పేటుమూట. పడులో అతికినపేటుపోగులు బిర్రుగా ఉండటానికి, మగ్గానికిపైన దండెంమీదినుంచి వేలాడదీసి చివరకట్టిన బరువు; మామూలుగా, ఇసకమూట; కొన్నిచోట్ల, రాళ్ళు; మగ్గంమీద ఎత్తుగా గిలకలు అమర్చి, వాటికి పేటుదారాలు తగిలించి, చివరబరువులు కడతారు. చూ. చిత్రం 133 క. 1 (కో. 36, 37).

**కప్పి** **1.** ఉ. కప్పి. పర్యా. చూ.బిళ్ళ (6). ఊడైతాడు బిగింపుకు వేసే కొయ్యగిలక; కొన్నిచోట్ల, ఇనపది. చూ. చిత్రాలు 63 ప.1,66 (కో.15); **2.** పర్యా. చూ. దారపుబండి (2). బరువుకట్టిన అంచుపేటు దారాలు తగిలించే కొయ్యగిలక; దీన్ని మామూలుగా, మగ్గంమీద ఎత్తుగా అమరుస్తారు. చూ. చిత్రం 133.2 (కో. 25).

**కప్పిచెక్రం** పర్యా. చూ. బిళ్ళ (6). ఊడైతాడు బిగింపుకువేసే కొయ్యగిలక; కొన్నిచోట్ల ఇనపది.చూ. చిత్రాలు 63 ప. 1, 66 (రా. 1).

**కప్పిబిళ్ళ** పర్యా చూ. బిళ్ళ (6). ఊడైతాడు బిగింపుకువేసే కొయ్యగిలక; కొన్నిచోట్ల, ఇనపది. చూ. చిత్రాలు 63 ప. 1, 66 (కో. 3).

**కప్పిలకర్ర** డాబీ అమర్చిన మగ్గానికి చివర, కొయ్యగిలకలు వేలాడదీసిన కర్ర. చూ. చిత్రం 133 క. 3 (కో. 25).

**కప్పు** **1.** చేతి అద్దకంలో; మొదట అద్దిన రేఖాచిత్రంమీద వేరేరంగుతో అద్దే అచ్చు. చూ. చిత్రం 283 క. 1 (కో. 7); **2.** రంగులో నిండుదనం; depth of the colour (తె. 5).

**కప్పుగిన్నె** రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాల రంగు పట్టేది. చూ. చిత్రం 282 ప. 1 (కో. 3).

**కప్పుచీర** పోకరంగు (పట్టు) చీర (తె. 21).

**కప్పుచెక్క** పర్యా. కప్పుపలక, బెండు (3), మూత (3). మగ్గంసొరుగుమీద బిగించిన చెక్క. చూ. చిత్రం 118.17 (తె. 25).

**కప్పు(దట్టు)** డిజైనుఅద్దకంలో, అచ్చుమీద కొట్టే కర్ర. చూ. చిత్రం 283 ప. 1 (రా. 24).

**కప్పునీలి** ముదురునీలి (=ఒకరకం నలుపు) రంగు (కో. 3).

**కప్పుపట్టె** చేత్తో డిజైనుఅద్దే ఒకరకం కొయ్య అచ్చు; ఇటువంటి అచ్చులతో రకారకాల డిజైన్లు - పువ్వులు, కాయలు, ఆకులు, బొమ్మలు - మొ. వి. అద్దుతారు. చూ. చిత్రం 183 క. 1 (కో. 26).

**కప్పుపలక** పర్యా. చూ. కప్పు చెక్క. మగ్గం సొరుగుమీద బిగించినచెక్క. చూ. చిత్రం 118.17 (తె. 24).

**కప్పురంగు** నలుపు, ఎరుపు కలిసిన ఒకరకం రంగు; పోకరంగు; నిండురంగు (తె. 1, 3, 6-8, 21, 30).

**కప్పువన్నె** ఉ. కప్పొన్నె. **1.** ఒకరంగుమీద వేసిన మరొక రంగు (తె. 18); **2.** ఎరుపులో ముబ్బువన్నె (తె. 20); 3. కొంచెం నలుపువన్నె (తె. 22).

**కప్పెరగిన్నె** పర్యా. చూ. చిప్ప(1).రాటిపైబద్దలనుబిగించి, వాటిమధ్య బోర్లించి కట్టినచిప్ప; మామూలుగా కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల, రేకు

మూతగాని క్రచిప్పగాని వాడతారు; ఇదిరాటిసూలం మీద అనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (కో. 9).

**కమలం** తామరపువ్వు నమూనాలోనేసిన డిజైను; తివాచీనేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 10).

**కమలమంచు** పర్యా. కమలంపేటంచు. తామర పువ్వు ఆకారంలో డిజైనునేసిన అంచు. చూ. చిత్రం 169 (తె. 10, 27).

**కమలంకడ్డీ** తామరపూలు, మొగ్గలువరసగా నేసిన డిజైను (తె. 21).

**కమలం(చీర)** నేతలో, తామరపువ్వుడిజైను పడేటట్టు నేసిన చీర (కో. 36).

**కమలంపేటంచు** పర్యా. కమలమంచు. తామర పువ్వు ఆకారంలో డిజైనునేసిన అంచు. చూ. చిత్రం 169 (రా. 13).

**కమలం(పేటు)** ఉ.-పేటి; పర్యా.-తామరపువ్వుపేటు, పద్మంపేటు. తామరపువ్వు ఆకారంలో, అంచులోనేసిన డిజైను. చూ. చిత్రం 169 (తె. 7; రా. 10, 13-15, 22).

**కమలంమొగ్గ** అంచులో, తామరపువ్వు, తామర మొగ్గలు నేసిన డిజైను (రా. 16).

**కమలాంబరం** ? ఒకరకం నేత ఎర్రరంగు (కో.21).

**కమనగడ్డ(లు)** చూ. కాచగడ్డలు (కో. 5).

**కమాను 1.** ఉ. కవాను ; పర్యా. దుంకి, దూదేకు పలక, ధనుష్‌పింజెన్, పంజకోడు, పలక (2), పింజెర (1). దూదిపకే కొయ్య పనిముట్టు. చూ. చిత్రం 9 (కో. 3-7, 9, 11-16, 19, 22; రా. 6, 11, 12, 15, 19-21, 23); **2.** పర్యా. చూ. ఒగ్గి. మరాను మీద పడుగుతోడేటప్పుడు, అనులు పడేట్టు పోగును జరపటానికి ఒక కొయ్యపట్టెకు బిగించిన రేకుముక్క; సుమారు, మూడంగుళాల పొడుగుది; దీని బెజ్జంలో నుంచి తీసినపోగు మరానుకు చుట్టుకొంటుంది; మరాను తిరిగినప్పుడు, కీలు ఆడుతూ కొయ్యపట్టె జరిగి, దానికి బిగించిన ఈ రేకుముక్క పోగునుగూడా జరుపుతుంది; ఇలా జరగటంలో అనిపడుతుంది; ఇటువంటివి పట్టె పొడుగునా (కొన్నిచోట్ల, 40) ఉంటాయి. చూ. చిత్రం 50.14 (కో. 5, 6); **3.** పర్యా. కొండి (8), నాడెకొండి, నాడెవిల్లు, బ్రేకు (2), రేకు (3), లాటు, కొమ్మురేకు, లివరు. మరనాడెగాడిలో ముల్లుకుగుచ్చిన (కొయ్య)కండెఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడి రేకు. చూ. చిత్రం 131 త. 2 (కో. 7, 12, 24); **4.** పర్యా. చూ. నాగపాసెం. నేతమోకు చుట్టే ఒకరకం చేతిగూటానికి బిగించిన ఇనపఊచ; కొన్నిచోట్ల, రేకు; మోకు చుట్టిన తరవాత, దీన్ని చెక్రంపళ్ళ సందులోకి జరుపుతారు. చూ. చిత్రం 122 ట. 2 (కో. 7); **5.** తివాసీమగ్గం దోనెదగ్గర నూలుపడుగు కట్టినకర్ర (తె. 10).

**కమాను (కట్టె) 1.** చూ. కమాను (1). (కో. 13); **2.** డిజైన్లునేసే పట్టుమగ్గానికి పైన, పేటుదారాలు దూర్చి చిన్నపన్నెం బిగింపుకు పెట్టిన కొయ్యచట్రం. చూ. చిత్రం 134 చ (తె. 5).

**(కమాను)కర్ర** చూ. కమాను (1). (కో. 12).

**కమాను(కర్ర)** తివాసీమగ్గంలో, నేతనేసే టప్పుడు, అచ్చువడిదారాలను కిందికి, పైకి జరపటానికి పట్టుకొనే కొయ్యపిడి; చేకుకొయ్యది. చూ. చిత్రం 320.5 (కో. 16; తె. 10, 17).

**కమానుతాడు** పర్యా. అనుతాడు (2). డిజైన్లు నేసే చేతిమగ్గానికి పైన కట్టి, అంచుల్లోకి వేలాడదీసిన పేటుదారం; ఇటువంటివి డిజైనుకు అవసరమైనన్ని కడతారు. చూ. చిత్రం 134 క. 3 (తె. 5).

**(కమాను)దబ్బ** చూ. కమాను (1). (కో. 9).

**కమానుదుడ్డు** పర్యా. చూ. గూటం (1). దూది పకేటప్పుడు కమానునరం కొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (కో. 9).

**కమానుపట్టె** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాను కట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే బెజ్జాలుగల రేకు ముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాను తిరిగినప్పుడు, కీలు ఆడుతూ దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది. చూ. చిత్రం 50.11 (కో. 6).

**(కమాను) పలక** చూ. కమాను (1). (కో. 3).

**కమానుబద్ద** ఉ. కమాన్-; పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాను కట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే బెజ్జాలు గల రేకుముక్కలు; ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాను తిరిగినప్పుడు, కీలు ఆడుతూ దీన్ని ముందుకూ, వెనక్కూ జరుపుతూ ఉంటుంది. చూ. చిత్రం 50.11 (కో. 15).

**(కమాను) బద్దె** చూ. కమాను (1). (కో. 9).

**కమానుబందన్లు** (బహు.) తివాసీమగ్గంలో, అచ్చు కర్రలను, పిడిని కలిపే దారాలు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 320.6 (తె. 17).

**కమానుబల్ల** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాను కట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే బెజ్జాలుగల రేకు ముక్కలు బిగించిన కొయ్యపట్టె; మరాను తిరిగినప్పుడు కీలు ఆడుతూ దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది. చూ. చిత్రం 50.11 (కో. 17, 18).

**కమానుబిళ్ళ** పర్యా. చూ. గూటం (1). దూది

ఏకేటప్పుడు కమానుసరం కొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (కో. 11).

**కంబడి** పర్యా. గొంగడి. ఉన్నిదారంతో నేసిన బట్ట (రా. 13).

**కంబడి (మెత్త)** పర్యా. కంబళి, గొంగలి. రంగు తొట్టిలో. పింజెరమీద ఒత్తుగాకప్పిన ఉన్నిగుడ్డ; దీని మీద రంగుపోసి, కొయ్యఅచ్చుతో రంగు అద్దుతారు. చూ. చిత్రం 283 క. 3 (కో. 3, 7).

**కంబం** ఉ. కంభం **1.** పర్యా. చూ. నిలువు (2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (తె. 1, 2, 6); **2.** పర్యా.చూ. సరిగుంజ (1). ఆరుబయట పడుగు చాపటానికి నేలలో పాతే రాతిస్తంభం. చూ.చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (రా. 13, 24); **3.** చూ. స్తంభం (3). (కో. 28; రా. 24); **4.** చూ. స్తంభం (4). (రా. 24).

**కంబళి** చూ. కంబడి (మెత్త). (రా. 24).

**కంబాయి(పట్టీ)** పర్యా. దొండపట్టీ. తురకలు కట్టుకోటానికి నేసిన గళ్ళలుంగీలో రంగులోగాని, తెలుపులోగాని, జేనెడు వెడల్పున అడ్డంగా నేసిన పట్టి; కొన్నిచోట్ల, మూడుజేనెల వెడల్పున నేస్తారు; కొన్నిచోట్ల, చివర తెలుపు, పదికొలుకుల జమిలి పోగులు, లాకీ తెలుపూ ఒక్కొక్క కొలికి, తరవాత ముప్పాతిక అంగుళం వెడల్పున లాకీరంగు పోగులు వరసగా నిలువులో వచ్చేట్టు నేస్తారు ; కొన్నిచోట్ల, మధ్యలో తెల్లచారలు పడేట్టు నేస్తారు. చూ. చిత్రం 273 (కో. 1, 2, 4, 7).

**కంబీ** చూ. కమ్మి (13). (కో. 17).

**కమ్మనూలు** కమ్మవారు వడికిన నూలు; ఇది సన్న దనానికి ప్రసిద్ధి (కో. 22).

**కమ్మి** **1.** పర్యా. చూ. ఇరుసు(2). రాట్నం ఆకులు తిరగటానికి నిలువులకు బిగించిన ఇనపచువ్వ. చూ. చిత్రం. 15.7 (కో. 2); **2.** పర్యా. చూ. సూలం (1). రాటె తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు; మామూలుగా, ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల, రాటెకట్టుబడిలోనే ఒకభాగంగా ఉంటుంది; కొన్ని చోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (రా. 4); **3.** పర్యా. చూ. బొమ్మ (5). డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (రా. 6); **4**, పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి, మామూలుగా మూడు, కొన్నిచోట్ల, రెండు ఉంటాయి. చూ. చిత్రం 45.క 1-3 (కో. 17-19); **5.** పర్యా. చూ. మేకు (ల) కమ్మి. మరానుమీద పడుగుపోసేటప్పుడు, పడుగులో అనులు రావటానికి, మేకులు బిగించిన చిన్నపట్టె; ఒగ్గులపట్టె పక్కకు జరిగినప్పుడు, పడుగులో అనులు పడతాయి. చూ. చిత్రం 50.8 (కో. 20); **6.** పర్యా. చువ్వ (2). కండెలు చుట్టేటప్పుడు, నూలుడబ్బా అమర్చే ఇనపచువ్వ; ఇది ఒక కొయ్యమొద్దుకు బిగించి ఉంటుంది. చూ. చిత్రం 30.2 (కో. 1; రా. 1); **7.** పర్యా. చూ. కదురు (6). అచ్చుకట్టేటప్పుడు, అచ్చు బిళ్ళకుచేర్చి వడిదారం చుట్టే ఇనపపుల్ల; దీని బెజ్జంలో దూర్చినదారం అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు. చూ. చిత్రం 92 క. 1 (కో. 3); **8.** పర్యా. చూ. బద్దెగుచ్చుకర్ర. అచ్చుతీకిన తరవాత, బద్దెలో పోగులు చెదరకుండా దూర్చిన ఇనపకడ్డీ. చూ. చిత్రం 102 త (రా. 2); **9.** పర్యా. అడ్డకమ్మి (10), ఊచ (4), కడ్డీ (6), కర్ర (3); కిక్కిసఅడ్డగర్ర, గజెం (2), గంటం (2), చువ్వ (8), పాకోళ్ళచువ్వ, పావచిప్పలగజెం, పావలకర్ర. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; పావుచెక్కలకు చేసిన చిల్లుల్లో దూర్చి పక్క గూటాలకు వేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (కో. 2, 3; రా. 2, 4, 5); **10.** పర్యా. చూ. సలాక (3). నేతబద్దెను దోనెకు బిగించే ఇనపచువ్వ; చూ. బద్దెచువ్వ (రా. 4); **11.** పర్యా. చూ. పానుపుపట్టె. మర మగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 35); **12.** (-నేయు, -పగలగొట్టు, -వేయు). బట్ట అడ్డకొనలో నేసిన భాగం; మామూలుగా, వెడల్పుగా నేసిన పట్టె; దీంట్లో కొన్నిచోట్ల డిజైన్లు నేస్తారు; చీరలు, పంచెలు, కండువాలు, తువాళ్ళు, అంగవస్త్రాలు మొ. వాటికి నేసేది; మామూలుగా, చీర పైటచెరగులో పెద్దకమ్మి, కట్టుచెరగులో చిన్నకమ్మి నేస్తారు. చూ. చిత్రం 272 (కో. 2-28, 30, 32-34, 36, 37; తె. 4, 8, 12-16, 18; రా. 1, 3, 7, 8, 11-15, 17, 19-21); **13.** రూ. కంబీ; పర్యా. కడ్డీ (7). గజెం (4). రంగుల అద్దకంలో, నూలులడీలు తగిలించే ఇనప ఊచ; దీన్ని పట్టుకోటానికి వీలుగా రెండువైపులా వంపులు ఉంటాయి; దీంతో లడీలు, రంగునీళ్ళ అండాలో దింపి, అంచులమీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (కో. 2, 3, 5, 6; రా. 8, 24).

**కమ్మికండె** కమ్మినేతకు వాడే దారపుకండె (కో. 35).

**కమ్మిగూటం** కండెలు చుట్టేటప్పుడు, నూలుడబ్బా అమర్చటానికి కమ్మి బిగించిన గూటం; చూ. కండెల దిబ్బ. చూ. చిత్రం 30.1 (రా. 1).

**కమ్మిచిట్టె** ఉ. కమ్మిసిట్టె. కమ్మికి పక్కన పెట్టి నేసిన పురిదారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 372.1 (కో. 30).

**కమ్మిచీర** చెరగులో పెద్దకమ్మినేసిన చీర; అంచు, పేరంటాలుచీర అంచుమాదిరిది పెడతారు; దీనికి పచ్చ రంగు పెట్టగూడదట; దీన్ని వితంతువులు కట్టుకొం టారు (కో. 4).

**కమ్మిచెరగు** ఉ. -చెరుగు; పర్యా. చూ. పైట చెరగు; చీరకట్టుకొన్నప్పుడు బుజంమీద వేలాడేట్టు వేసుకొనే చెరగు; చీరచివరి మూరెడు భాగం; మామూలుగా, ఇది మొట్టమొదట నేస్తారు; కొన్ని చోట్ల, పెద్దకమ్మినేసిన చీరచెరగు (కో. 23; రా. 11).

**కమ్మితల** కమ్మినేతలో ముందు (=ఇవతలి) భాగం (రా. 13, 15).

**కమ్మితలనేత** చీరలో కమ్మికి ఇవతలి భాగం నేత (రా. 13, 15).

**కమ్మినాడె** ఉ. కమ్మినాడి. చీరచెరగులో కమ్మి నేతకు వాడే నాడె; చూ. నాడె (కో. 25-30, 32, 33, 35; తె. 26).

**కమ్మినూలు** చీరనేతలో కమ్మికి ప్రత్యేకంగా వాడే నూలు (కో. 7).

**కమ్మినేత** చీరచెరగులో అడ్డంగా, పట్టెలమాదిరిగా, కమ్మి నెయ్యటం (రా. 14, 17).

**కమ్మిపగలగొట్టు** (క్రి.) వెడల్పుగానేసిన కమ్మిలో మధ్య సన్నటిగీర పడేట్టు వేరేరంగు పోగు పెట్టి నెయ్యటం; రాటపాకుల కమ్మి ఇలానేస్తారు (కో. 8).

**కమ్మిపట్టీలనేత** చీరకమ్మిలో ముందు, అడ్డపట్టెలు పడేట్టునేసిన నేత (రా. 17).

**కమ్మిపేటు** కమ్మిలో నేసిన (ఒక రకం) డిజైను (రా. 12).

**కమ్మిపేటువాయి** చీరకమ్మిలో డిజైన్లు నెయ్య టానికి ప్రత్యేకంగా అమర్చిన అచ్చు; మామూలు అచ్చు పక్కనదీన్ని కడతారు (కో. 26).

**కమ్ములదుప్పటి** ఒకరకం దుప్పటి; గొల్లవాళ్ళలో మగవాళ్ళు కప్పుకొంటారు (రా. 10).

**కమ్మెంచు** చిట్టచివరివరకూ పూర్తిగానేసిన సాదా అంచు; కమ్మిఅంచు (తె. 33).

**కంసాలివాళ్ళు** ఉ. కంసలివాళ్ళు, కంసాలివోండ్లు, కంసాలోళ్ళు. కొయ్యపని చేసేవాళ్ళు; వడ్రంగులు; మగ్గాలు తయారు చేస్తారు (రా. 1, 7, 21).

**కయలు** ఉ. కైలు. ఒకరంగు నల్చదరంగడిలో నేసిన వేరేరంగు గడి (రా. 11).

**కయలునేత** ఉ. ఖయలునేత. ఒకరకం, చిన్నగడి నేత (రా. 9, 19బి, 20).

**కర 1.** అచ్చుతుక్కోటానికి నేసిన బద్దెలో కొస పోగులు (రా. 19); **2.** (-తట్టు) పర్యా. చూ. బద్దె. అచ్చుతుక్కోటానికి, సుమారు బెత్తెడు వెడల్పు నేసి చివర జైనెకుపోకుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తిచేసిన తరవాత అచ్చులో బద్దెకోసి మరొక పడుగుకు అతుకుతారు. చూ. చిత్రాలు 102.2, 144 (రా. 19ఎ, 21).

**కరకంచు** నలుపురంగు పెట్టి నేసిన అంచు; కొన్ని చీరలకు ఒకవైపు అంచు నలుపులోను, మరొకవైపుది ఎరుపులోను పెట్టినేస్తారు (కో. 23).

**కరకతొగరు** ఎరుపు(తొగరు)లో నలుపువన్నె కలి సిన రంగు (తె. 16).

**కరక (నీలి)** పర్యా. కరకక్కాయరంగు. బొగ్గు మాదిరి నల్లరంగు; కరకక్కాయలు, ఈరగాసు, సోడా వేసి తయారుచేస్తారు (తె. 15, 23).

**కరకేరు** (< కరకు + ఏరు క్రి.) **1.** పడుగులో పడుగేరుకర్రమీది పోగులు వరసగా సర్దటం (తె.10); **2.** పర్యా. మలతేరు. పడుగును మొదటినించి చివరి వరకూ పాయలుగా విడదీసుకోటం (తె. 23).

**కరకోయు** (క్రి.) పర్యా. చూ. బద్దెకోయు. అచ్చులో బద్దెపోగులుగాని, బెంతుపోగులుగాని వరసగా కొయ్యటం; అచ్చతికిన పడుగులో అతుకులు వరసగా రావటానికి, అచ్చుపోగుల కొనలు కత్తితో కోస్తారు; నేత అయిపోయిన తరవాత బద్దెపోగులు కొయ్యటం (రా. 19).

**కరకాయపచ్చడం** ఒకరకం పచ్చడం (=రెండు పొరలదుప్పటి); జైనెకువెడల్పు, నాలుగుమూరల పొడుగు పెట్టి, (?) వల మాదిరిగా ఒకపొర నేసి, ఇరవై నాలుగుమూరల పొడుగు, నాలుగుమూరల వెడల్పు, వచ్చేట్టు ఇంకొక పొర నేస్తారు; తలవాలుపచ్చడం; అంచు, పెళ్ళికొడుకు కప్పుకొనేది (రా. 15).

**కరకాయబొచ్చె(లు)** కరకాయ బెరడు; ఒక రకం నీలిరంగు తయారుచెయ్యటానికి వాడతారు (తె. 11).

**కరకాయరంగు** పర్యా. కరకనీలి. బొగ్గుమాదిరి నల్లరంగు; కరకాయలతో చేస్తారు.

**కరబ్బీచీర** ఒకరకం నేతచీర (తె. 10).

**కరలాక** నేతపడుగులో, దండెకు అవతల దూర్చిన వెదురుబద్ద (రా. 21).

**కరవసుగొంగడి** రూ. కరబసగొంగడి. ముదురు గొర్రె బొచ్చుతో నేసిన గొంగడి; ఇది చాలా 'తేజ్' గా ఉంటుంది (తె. 7, 9).

**కరవసుగొర్రె** ఉ. కరువసుగొర్రె; **1.** రూ. కరిబసు గొర్రె. నలుపులో తెలుపువన్నె బొచ్చుగల గొర్రె; దీనిబొచ్చు కరుకుగా ఉంటుంది (తె. 7).

**కరవసున్ని** (< కరవసు + ఉన్ని) రూ. కరిబసున్ని. కరుకుగా ఉండే ఉన్ని; కరవసు గొర్రెది (తె. 6,7,9).

**కరాచీకమ్మి** ఒకరకం చీరకమ్మి (కో. 23).

**కరి** (-పడు, -పెట్టు) పర్యా. చూ. పురి (3). దారపుపోగు మెలితిరగగా వచ్చిన గట్టిదనం (తె. 5, 13).

**కరికంబ** పర్యా. చూ. నేతసులిగె. గొంగడినేత చివరకు వచ్చినప్పుడు, పడుగులోవేసే పేకదారం దూర్చిన గొట్టం; పేకగొట్టంకంటె చిన్నది; బెత్తెడు పొడుగుది; పేకగొట్టంకంటె చిన్నది; బెత్తెడు పొడు గుది; పేకగొట్టం తీసేసి, ఇది ఎక్కిస్తారు; దీనిపై బెజ్జంలో నుంచి పోగు బయటికి వస్తుంది (తె. 27, 28).

**కరికమలంబేలు** రెండు ఏనుగులు, ఒక తామర పువ్వు పడేట్టు నేసిన డిజైను (తె. 21).

**కరికాలబత్తులు** చూ. కైకాలబత్తులు (కో. 18).

**కరిణబత్తులు** ఉ. కరిణ-. నేతపని చేసేవాళ్ళలో ఒక తెగ; చూ. కర్ణసాలీలు (కో. 18).

**కరినూలు** ఉ. కర్నూలు; పర్యా. పురి(నూలు) (1). రెండు పోగులు కలిపిపురపెట్టిన నూలు; గట్టి నూలు (తె. 13).

**కరిపెట్టు** (క్రి.) ఉ. కరిబెట్టు, కరవెట్టు. పర్యా. చూ. పురితిప్పు. వడిపెట్టటం; మెలిపెట్టటం (తె. 11, 15, 20).

**కరిబసగొంగడి** చూ. కరవసు గొంగడి (తె. 20).

**కరిబసుగొర్రె** ఉ. కరబసుగొర్రె; చూ. కరవసు గొర్రె (1). (తె. 20).

**కరిబసున్ని** (< కరిబసు + ఉన్ని). చూ. కరవ సున్ని (తె. 20).

**కరిబాణా** ఒకరకం కృత్రిమపుపట్టు; రెండుమూడు పోగులు కలిపి పురిపెట్టింది; అంచులనేతకు వాడతారు (తె. 23).

**కరుంగనపత్తి** రూ. కనుంగన్నిపత్తి. ఒకరకం తెల్ల పత్తి (కో. 33, 34, 37).

**కరుబరిసిబరె** పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్నిదోనె గాడిలో, పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల, ఇనపచువ్వ గాని, వెదురుబద్ద గాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (తె. 20).

**కర్ణసాలీలు** నేతపనివాళ్ళలో ఒక తెగ; నాలు గయిదు తరాల క్రితం, తమిళనాడులో ఉన్న 'కంచి' ప్రాంతంనుంచి వచ్చి, సూళ్ళూరుపేట చుట్టు పక్కల గ్రామాల్లో స్థిరపడ్డారట; వీరు శైవమతాను యాయులు (కో. 1; రా. 8).

**కర్ణిబత్తులు** నేతపని చేసేవాళ్ళలో ఒక తెగ; చూ. కర్ణసాలీలు (కో. 23).

**కర్నాటకనేత** ఉ. కొర్నాటకనేత. **1.** చీరఅంచులో కొమ్ములమాదిరి డిజైన్లు పడేట్టునేసిన నేత; పేకకు మూడు నాడెలతోనేస్తారు (తె.24); **2.** రెండురంగుల్లో రెండేసి పోగులుపెట్టి నేసిన నేత (తె. 25).

**కర్నాటక(ం)చీర** ఉ. కొర్నాటకచీర. అంచులో, ఒకమాదిరి డిజైనులో రంగుపోగుదూర్చి (=కంగోరు పెట్టి) నేసిన చీర (తె. 11; రా. 24).

**కర్నాటిచీర** ఉ. కొర్నాటిచీర. సీమపట్టు; దమ యంతి, సీమపట్టు రంగులదారాలు వరసగా 20, 4, 10 కొలుకుల చొప్పున చివరి అంచుపెట్టి, తరవాత 15-20 కొలుకుల కెంపురంగుదారం పెట్టి, లోపలిఅంచుకు సీమపట్టు, దమయంతి, సీమపట్టు రంగులదారాలు 16, 4 10 కొలుకుల చొప్పున పెట్టి నేసిన చీర (కో. 7).

**కర్నాటిపీతాంబరం** జైనెడు బెత్తెడు పెడల్పు డిజైను అంచుపెట్టి నేసిన పట్టుపీతాంబరం; పధ్నాలుగు మూరల పొడుగు ఉంటుంది (తె. 12).

**కర్నాటుహారచీర** ఒకరకం నేతచీర (తె. 7).

**కర్ర** **1.** పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగుచాపి నప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరేచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోల్తలవెంబడి దూరు స్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (కో. 1-37; తె. 10-13, 15-17; రా. 1, 2, 7, 8, 10, 20, 21); **2.** పర్యా. చూ. అచ్చుకర్ర (1). అచ్చులో వడిదారం కట్టేకర్ర; అచ్చుకట్టేటప్పుడు దీన్ని జంత్రం కొయ్య(ల)కు బిగిస్తారు; ఇటువంటివి, మామూ లుగా నాలుగుంటాయి; బోనచ్చుకు ఎనిమిది ఉంటాయి. చూ. చిత్రాలు 91 క. 7, 100.1, 121 క. 8 (కో. 1-27, 29-37; తె. 5, 10-17; రా. 2-5, 7, 8, 10, 19, 21); **3.** పర్యా. చూ. కమ్మి (9). మగ్గం గుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా, ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; పావు చెక్కలకు చేసిన చిల్లుల్లో దూర్చి పక్కగూటాలకు వేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (కో. 28); **3.** పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలు

లడీలు పిండడానికి, నేలలో పాతిన పొడుగురాట; మామూలుగా, దీనికి సిలువమాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిల్లిచేసి, దాంట్లో గునపందూర్చి, లడీలు తగిలించి, పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క.1 (కో. 17, 26); **5.** కమ్మినేతలో, మూడుపేళ్ళ వెడల్పున నేసిన పట్టె(లు). చూ. చిత్రం 272.2 (కో. 8); **6.** రంగు అద్దిన నూలులడీలు, గుంజకుతగిలించి, పిండేకర్ర; గుండ్రటిది; దీన్ని లడీలలో దూర్చి మెలిపెడతారు; దీంతో పోగులు విడిలిస్తారు; కొన్నిచోట్ల, రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. చూ. చిత్రం 282 క.5 (కో. 11, 14, 17, 19-21, 26).

**కర్రవీరు** (క్రి.) ఉ. కర్రేరు. పడుగేరుకర్రమీద పోగులు నెరిపి సాపుచెయ్యటం (కో. 27; తె. 16).

**కర్రగట్టు** (<? కరగట్టు; క్రి.) చీరకొంగు చివర, బద్దెదారాలకు ముడులువేసి అల్లటం. చూ. చిత్రం 145 (రా. 14).

**కర్రచిట్టె** ఉ. కర్రసిట్టె. కమ్మినేతలో, చిన్నిపట్టెకు రెండువైపులా వేసిన మందపుదారాలు. చూ. చిత్రం 272.3 (కో. 30).

**కర్రచెక్కముల్లు** కొయ్యచెక్కకు బిగించిన చేప దవడ; పత్తినించి గింజలు విడదీసే పనిముట్టు. చూ. చిత్రం 6.2 (కో. 34).

**కర్రతొక్కు** (క్రి.) పడుగులో, కర్రదూర్చటం (కో. 34).

**కర్రదారం** పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అనివెంబడి దూర్చిన దారం; అచ్చుతీకేటప్పుడు, పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (కో. 8).

**కర్రదిండు** కర్రతో చేసిన కదురుదిండు; చిటికేశ్వరం, కంది, కలేకట్టె మొ.వి వాడతారు; చూ. దిండు (కో. 37).

**కర్రదిద్దు** (క్రి.) పర్యా. కోలదిద్దు. పడుగేరుకర్ర మీద పోగులు పరిచి చిక్కులుతీసి సాపుచెయ్యటం; కొన్నిచోట్ల, దువ్వెనతో దువ్వుతారు (కో. 11, 14).

**కర్రలకమ్మి** ఉ. కర్లకమ్మి. పట్టెలుపట్టెలుగా నేసిన ఒకరకం కమ్మి. చూ. చిత్రం 272 (కో. 5).

**కర్రసూత్రాలు** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి, డాబీకోలలకు కట్టిన దారాలు. చూ. చిత్రం 132 క.6 (తె. 10).

**కర్రిగొంగడి** పర్యా. నల్లగొంగడి. నలుపురంగు ఉన్నితో నేసిన గొంగడి (తె. 11).

**కర్రు** పర్యా. గజెం (1), గసికె, తోకమొలు. ఊడ్డెను నిలబెట్టి తాడుతో బిగించటానికి, నేలలో పాతిన ఇనపగూటం. చూ. చిత్రం 68.1 (రా. 8, 11, 19ఎ, 20, 22).

**కర్రువేయు** (క్రి.) అనివెంబడి కర్రతొడగటం (రా. 2).

**కర్రెగొర్రె** ఉ. కర్రిగొర్రె. నలుపుబొచ్చుగలగొర్రె (తె. 2, 11, 27, 28).

**కర్రెపూలంచు** ఒకరకం డిజైనులో నేసిన అంచు (తె. 32).

**కలకత్తాఅంచు** **1.** సాదాఅంచు నేసిన తరవాత, ఒకకొలికి దారం తెలుపుది, ఒకకొలికి దారం రంగు పెట్టి నేసిన అంచు (కో. 3); **2.** చిగురంచు వెడల్పుగానేసి, రెండేసి కొలుకుల తెలుపు, రంగు దారాలు రెండుసార్లు తిరిగేట్టు నేసిన అంచు; పంచెలకు నేస్తారు (తె. 15).

**కలకత్తాకమ్మి** మూడుగిరలుపెట్టి, పట్టెలుపట్టెలుగా నేసిన కమ్మి (కో. 34).

**కలనేత** ఉ. కల్నేత; **1.** పర్యా. చూ. దూప్చాయ (నేత). నిలువుకు ఒకరంగు, అడ్డానికి మరొక రంగుగల నూలుపెట్టి నేసిన గట్టినేత; మామూలుగా, తెలుపు, నలుపుతప్పమిగిలిన రంగులుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, నిలువుకు తెలుపు, అడ్డానికి రంగు గల నూలుపెట్టి నేస్తారు (కో. 11-16, 18-21, 26, 35; రా. 10, 12, 20); **2.** రంగుదారపు కండెలు బిగించిన నాడెలు మార్చుకొంటూ నేసిన నేత (రా. 19ఎ); **3.** నేతలో పోగులు కలిసిపోయేట్టు చిక్కగా నేసిననేత (కో. 5, 17; రా. 7, 8, 13); **4.** అనితొక్కి పలకకొట్టి నెయ్యటం (కో. 23).

**కలనేతచీర** ఉ. కల్నేచ్చీర, కల్నేతసీర. నిలువు పోగులు ఒక రంగువి, పేకపోగులు మరొకరంగువి పెట్టి నేసిన రెండు రంగుల చీర (కో. 9, 10, 22, 23; తె. 4, 14, 15).

**కలనేయు** (క్రి.) ఉ. కల్నేయు. రెండు రంగుల పోగులు కలిపి నెయ్యటం (రా. 14).

**కలంకారీ(అద్దకం)** (పర్షియన్: ఖలమ్ = కలం పుల్ల; కార్ = పని) ఉ. కలంకారి-. (మైనపు)కలంతో చేసేఅద్దకంపని; దీన్ని ఆధునిక చిత్రకారుల పరిభాషలో Batic painting అంటారు; చెట్లఆకులు, పువ్వులు, చెక్కలు, బెరళ్ళు, వేళ్లు మొ.వాటితో తయారయిన గట్టిరంగులు వాడతారు. చూ. చిత్రాలు 288 డ, ద (కో. 8, 12).

**కలం(కుంచె)** కలంకారీ అద్దకానికి వాడే వెదురు ముక్క; ఆరంగుళాల పొడుగుది; దీనికి ఒకవైపున

వెంట్రుకలతో కుంచెమాదిరిగా కడతారు; దీన్ని రంగులో ముంచినప్పుడు, కుంచె రంగును పీల్చుకొంటుంది; కొన్ని చోట్ల, ఇనపదిగాని, ఈతపుల్లకుంచెగాని వాడతారు. చూ. చిత్రం 283 గ 1-4 (కో. 12).

**కలప** ఉ. కల్ప. **1.** కొండలమీద పెరిగే ఒకరకం మొక్క; దీనిపుల్లలు చీల్చి, పన్నెకట్టుబడిలో దండెల మధ్య బిగించి కడతారు; ఈ మొక్కవేళ్లు(=పురి) నరి చేసే కుంచెకు అడుగున కడతారు (తె. 5, 12); **2.** (-నింపు, -వేయు) చూ. పలక (5). (కో. 22, 30; తె. 29, 30, 32, 33).

**కలపటంనేత** రెండురంగుల దారాలు, రెండు నాడెల్లో పెట్టి, నేసిన ఒకరకం నేత; కలనేత (తె. 32).

**కలపనింపు** (క్రి.) ఉ. కల్పనింపు; పర్యా. చూ. పలకవేయు (2). నేసినబట్ట చుట్టటానికి, దోనెపలక తిప్పటం; నేతపనివాడు, తనవైపుకు తిప్పుకొంటాడు (తె. 25).

**కలపనేత** నేసినబట్ట దగ్గరనుంచి పన్నెవరకూ మగ్గంమీద ఉన్న పడుగు (తె. 33).

**కలపపుల్ల** ఉ. కల్పపుల్ల; పర్యా. చూ. ఈనె (1). పన్నెకట్టుబడిలో దండెలమధ్య దువ్వెనపళ్ళ మాదిరిగా వరసగా కట్టిన, కలప, జొన్న, గలుగు, వెదురు, కొండచీపురు మొ.వాటి పుల్ల(లు); కొన్నిచోట్ల, పట్టు నేతకు ఇనుము, ఇత్తడి, ఉక్కు మొ.వాటి ఊచలు వాడతారు. చూ. చిత్రం 88 క. 8 (తె. 5).

**కలపవేయు** ఉ. కలపేయు, కల్పేయు; చూ. పలక వేయు (2). (తె. 21, 26-28, 30).

**కలబందనార** కలబందమొక్క కాడలు ఊరబెట్టి తీసిననార (రా. 21).

**కలవారంచు** చూ. కళావరంచు (కో. 13).

**కలవారుపేటు** పర్యా. కళావరు. అంచులో కళావరుచుక్క(=పేకముక్కల్లో ఒక సీక్వెన్సుకు ఉండేగుర్తు) మాదిరిగా నేసిన డిజైను. చూ. చిత్రం 172 (కో. 14).

**కలశంపూజ** చౌడేశ్వరిపండుగనాడు, కలశం అమర్చిచేసే పూజ (కో. 1).

**కలశంపేటు** ఉ. కలిశంపేటు; పర్యా. బుగడపేటు. మొగ్గ మాదిరిగా నేసిన డిజైను; అంచుల్లోను, కమ్ముల్లోను నేస్తారు. చూ. చిత్రం 170 (రా. 10).

**కలశంమల్లెమొగ్గపేటు** ఉ. కలషంమల్లెమొగ్గపేటి. పెద్దకలశం ఒకటి, మల్లెమొగ్గ ఒకటి చొప్పున వరసగా నేసిన డిజైను. చూ. చిత్రం 170 (తె. 2).

**కళాయి** పెద్దగిన్నె; కిందినించి మూతివరకూ వెడల్పుగా ఉన్న గిన్నె; కొన్నిచోట్ల పట్టుపురుగులను దీంట్లో ఉడకేస్తారు (తె. 5).

**కలి** పర్యా. కూరాటికలి, కూరాడు (2). పులవబెట్టిన గంజితేట, బియ్యపు కడుగునీళ్ళు; పడుగుకు పెట్టే గంజి కాచటానికి ఈ నీళ్ళతో ఎసరు పెడతారు (కో. 14; తె. 2, 5, 12-14, 20; రా. 24).

**కలికుండ** గంజి పులవబెట్టిన కుండ (తె. 7).

**కలిడులు** గొంగళ్ళు నేసే కురమవాళ్ళలో ఒక వంశం (తె. 28).

**కలుపుతొట్టె** రంగులు కలిపేతొట్టి (తె. 23).

**కలెఅతుకు** (క్రి.) అచ్చులికే పడుగులో కింది పోగులూ పై పోగులూ కలిపి, మొత్తం అతకటం (తె. 17).

**కలెంపూచీర** నడిమినేతలో ఒకరకం పువ్వు (? కలివి; *Carissa Carandas*, Linn.) డిజైన్లు పడేట్టు నేసిన చీర (తె. 18).

**కల్యాణతిలకంఅంచు** పెండ్లిబొట్టు మాదిరిగా, మూడేసి చుక్కలు రెండువరసల్లో పెట్టి, వాటికి మధ్య నిలువుగీరలు పడేట్టు డిజైను నేసిన అంచు; ఇటీవల దుప్పట్లకు నేస్తున్నారు; చూ. గూడాబార్డరు. చూ. చిత్రం 171 (తె. 5).

**కల్లురాయి** పర్యా. గుండ్రాయి (2). గుండ్రటి రాయి; దీంతో, వేయించిన చింతగింజలు చితగ్గొడతారు (తె. 10).

**కల్లెం** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడత దారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (రా. 6).

**కల్వపువ్వంచు** కలగపువ్వు ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు (తె. 12).

**కవ** **1.** చూ. కవ్వ (1). (కో. 25, 34); **2.** పర్యా. చూ. గూడు (3). పన్నెదండెలకు బిగించిన పుల్లలమధ్య వెలితి; అచ్చుకట్టేటప్పుడు, ఒక్కొక్కదాంట్లో రెండేసి బద్దెపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 88 క. 9 (కో. 29, 32, 36).

**కవజాడి** పర్యా. చూ. ఈనజాడి. నేతలో, రెండు పోగులు తెగినప్పుడు వచ్చిన వెలితి (కో. 29, 35).

**కవపడు** (క్రి.) నేతనేసేటప్పుడు, రెండు పోగులు తెగి వెలితి ఏర్పడటం (కో. 32).

**కవసందు** పర్యా. చూ. ఈనజాడి. నేతలో, రెండు పోగులు తెగినప్పుడు వచ్చిన వెలితి (కో. 34).

**కవిచేయు** (క్రి.) రచించటం; ''మార్కండేయ పురాణం కవిచేసిన పడిగెరాజు తిరుమలకొండడు'' (కో. 3).

**కవెల** (బహు. కవెళ్ళు) చూ. కైల (కో. 4).

**కవ్వ 1.** రూ. కవ (1); పర్యా. చూ. కొలికి (1). అనుపోసిన నూలులో ఒకటి పైకీ ఒకటి కిందికీ వచ్చిన రెండు పోగులదారం (కో. 1, 3, 7, 11, 12, 17, 18, 20-24; రా. 5); **2.** పర్యా. చూ. కొలికి (2). అచ్చుకట్టేటప్పుడు, రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె; నేతనేసేటప్పుడు, పడుగుపోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ లంకెల్లోనుంచి కొంతు పోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (కో. 7); **3.** నాడె వాళేసినప్పుడు, పడుగులో ఒకవైపునుంచి మరొకవైపుకు అడ్డంగా కలిసి మళ్ళీ తిరుగువరసలో కలిసినదారం (కో. 7).

**కవ్వకమ్మి** గోరంచుకమ్మి మాదిరిగా, రెండు పోగులుపెట్టి సన్నగా గీరపడేట్టు నేసినకమ్మి (కో. 11).

**కవ్వగడి** ఒకరకం నేతగడి (కో. 20).

**కవ్వంచు** సన్నటి గీరపడేట్టు నేసినఅంచు; గోరంచు; ఒకటి రెండు పోగులుపెట్టి నేస్తారు.

**కవ్వం** రంగురుద్దేకర్ర (తె. 20).

**కవ్వసందు** పర్యా. చూ. గూడు (3). పన్నెదంటెల మధ్య బిగించిన పుల్లల మధ్యవెలితి; అచ్చుకట్టేటప్పుడు, ఒక్కొక్కదాంట్లో రెండేసి బద్దెపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం88 క.9(కో.7).

**కశింతొట్టి** (<?కషాయం-). కలంకారీ అద్దకం కోసం, బెల్లం, ఇనుము కలిపిన మిశ్రం (=నల్లరంగు అద్దటానికి వాడేది) పోసిన పాత్ర. చూ. చిత్రం 283 ప. 2 (కో. 12).

**కస్‌కస్‌కడ్డీచీర** ఒకకొలికి ఒకరంగు, ఒకకొలికి మరొకరంగు చొప్పున అచ్చులికి నేసినచీర (రా. 16, 17).

**కసకసచీర** ఒకకొలికి ఒకరంగు, ఒకకొలికి పచ్చ రంగుపెట్టి నేసిన చీర (తె. 18).

**కసకసముంగి** ఒకరకం చిన్న నేతగడి (తె. 23).

**కసరగొంగడి** ఉ. కశ్ర-, కెచ్చ-. అన్నిరంగులూ కలిసిన ఉన్నితో నేసిన గొంగడి (తె. 22, 26, 28).

**కసరురంగు** ?లేతఆకుపచ్చరంగు; ఈరంగు ఉన్నితో గొంగళ్ళు నేస్తారు (తె. 3).

**కసికసినేత** రెండురంగులు రెండేసిపోగుల చొప్పున నిలువు, అడ్డంపెట్టి నేసిన నేత; రెండు నాడెలతో నేస్తారు (తె. 25).

**కసిదసింగర్** ఒకరకం డిజైను నేతనేసేటప్పుడు, అంచుల సూత్రాలుదింపటానికి పెట్టిన కొయ్య(తె.32).

**కసిరెగొర్రె** (? హిం. కచ్‌రా-). ఉ. కశ్ర-, కస్ర-; పర్యా. కచ్చబూరుగొర్రె. ఒకరకం గొర్రె; వెంట్రుకలు నెరిసింది; దీనిబొచ్చు కరుకుగా ఉంటుంది; ఈ గొర్రె మూడేళ్ళ వయస్సులో నడిఈడున ఉంటుంది (తె. 25-27).

**కసీదా** ఉ. కసీద. అంచుల్లో పువ్వులుపడేట్టు నేసిన ఒకరకం డిజైను; ఎనిమిదికర్రలఅచ్చులో అంచులకు కట్టిన పడులతో నేస్తారు (తె. 17, 31, 32).

**కసిదాపేటు** అంచుల్లో పువ్వులుపడేట్టు నేసిన ఒక రకం డిజైను (కో. 20).

**కసెం** (-తీయు) పర్యా. చూ. కారం (1). నూలు, రంగును పీల్చుకోటానికి తయారు చేసిన మిశ్రం; నువ్వు కంప (కొన్నిచోట్ల, నాగజెముడు బొంత), బూడిద, గొర్రెపేడ, నూనె మొ.ని వేసి తయారుచేస్తారు; దీంట్లో చన్నీళ్ళుపోసి ఊరబెట్టి నూలులడిలు వేసి బాగా పిసుకుతారు; తరవాత రంగు అద్దుతారు (కో. 8).

**కస్కె** అలిచిప్ప; కమానుకుకట్టే నరాన్ని, ముందు దీంతో గీకి, నునుపు చేస్తారు (తె. 28).

**కస్తూరిమళ్ళచీర** ఉ.-మల్లచీర. అయిదు కొలుకులు నలుపు, ఒక కొలికి తెలుపు చొప్పున నిలువు, అడ్డం పెట్టిన గళ్ళచీర (రా. 13).

**కళావతు** పర్యా. చూ. జరీ. బట్ట అంచులకుగాని, కమ్ములకుగాని, డిజైన్లకోసంగాని నేతలోవాడేసన్నటి మెరుపుదారం; బంగారం, రాగి, వెండి మొ. వాటితో తయారుచేస్తారు (తె. 12).

**కళావరంచు** ఉ. కలావరుఅంచు, కళావరిఅంచు; రూ. కలవారంచు, కిలావరంచు. కళావరుచుక్క ఆకారంలో డిజైన్లు నేసిన అంచు; కొన్నిచోట్ల, మొలికి, సందు, చుక్క, తీగ, మొలికి, పుష్పం వరసగా వచ్చేట్టు నేస్తారు. చూ. చిత్రం 172 (కో. 14, 19, 20; తె. 13).

**కళావరు** ఉ. కలావరు; పర్యా. కలవారుపేటు. అంచులో, కళావరుచుక్క (=పేకముక్కల్లో ఒక సీక్వెన్సుకు ఉండే గుర్తు) మాదిరిగా నేసిన డిజైను. చూ. చిత్రం 172 (కో. 13).

**కళ్ళె** రంగుపూత (కో. 8).

**కళ్ళెకువచ్చు** (క్రి.) అద్దకంరంగు, పూతకు అనుకూలం కావటం (కో. 8).

**కాకర** ?దూదిఏకే కమాను పలకకు బిగించిన తోలు పట్టె; చూ. కమాను. చూ. చిత్రం 9 (రా. 8).

**కాకరపువ్వంచు** కాకరపువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 267 (రా. 13).

**కాకరపువ్వు** ఒకరకం కమ్మి డిజైను (రా. 12).

**కాకరపువ్వుపేటు** కాకరపువ్వు మాదిరి డిజైను (రా. 12).

**కాకిచాయ** ఉ. -సాయ; పర్యా. చూ. ఖాకీరంగు. ఖాకీగుడ్డరంగు; 2జి. 800, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేసి తయారు చేస్తారు. (రా. 11).

**కాకిబ్రౌను** ఉ. -బ్రౌణ; పర్యా. చూ. ఖాకీరంగు. ఖాకీగుడ్డరంగు; 2 జి. 800, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేసి తయారుచేస్తారు (తె. 24, 25).

**కాకిరంగు** **1.** ఖాకీరంగు (కో. 36; తె. 5, 11, 20, 22, 27); **2.** పూర్తినలుపు (తె. 10).

**కాకివెదురు** ఉ. కాకెదురు. వెదురుకొయ్యలో ఒక రకం; దీని బద్దలతో అల్లిన చిన్నచాపలు మగ్గానికి రెండుపక్కలా ఉండే చిన్న గుంటల మీద నాడె, గుంటల్లో పడకుండా ఉండటానికి పెడతారు (కో. 2)

**కాగు** **1.** రంగునీళ్ళు ఉడకబెట్టే డ్రమ్ము. చూ. చిత్రం 282 క. 3 (కో. 7; తె. 3, 23); **2.** చింత అంబలి కాచేకుండ (తె. 22, 25).

**కాంగో** ఒకరకం ఎరుపురంగు; పొడిరంగు (కో. 7).

**కాంగ్రెసుబార్డరు** ఉ. -బాడ్డరు. ఒకవైపు పచ్చ, తెలుపు, ఎరుపు రంగుల్లో వేలెడేసి వెడల్పు పట్టెలు నేసిన అంచు; ఒక్కొక్కపట్టెకు ముప్ఫయ్యేసి కొలుకుల దారంపెట్టి నేస్తారు (కో. 3).

**కాచగడ్డ(లు)** ఉ. కాసగడ్డ; రూ. కమసగడ్డ(లు) పర్యా. గంజిగడ్డ(లు). పడుగుకుపెట్టే గంజి తయారు చెయ్యటానికి పనికివచ్చే ఒకరకం గుంప(లు). (కో. 7).

**కాచిపుల్ల** దోనెగాడిలో, బద్దెచువ్వ తగిలించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల, కొండి వాడతారు; చూ. పన్ను. చూ. చిత్రం 123 క. 4 (రా. 24).

**కాంచిరంగు** వక్కరంగులో ముదురువన్నె (రా. 3).

**కాంచు** (క్రి.) **1.** జొన్నలు, బియ్యం, రాగులు మొ.వాటి పిండి, గంజి తియ్యటానికి ఉడకబెట్టం; కాచటం (రా. 4, 5, 24); **2.** (దసలికాయలు) కాచటం; ఉడకబెట్టటం (రా. 14).

**కాంచెనమాలగడిచీర** నాలుగుపోగుల నల్చదరం రంగుగడిలో, మధ్య రెండేసి రంగుపోగులు నిలువు, అడ్డం స్ఫుటంగా పడేట్టు నేసిన చీర; ఒక సినిమాతార పేరుమీద ప్రచారంలోకి వచ్చింది (తె. 13).

**కాటి(క)కండ్లచీర** ఉ. కాటికండ్లసీర, కాటిక్కండ్ల సీర. అయిదు కొలుకులు నలుపు, ఒక కొలికి ఎరుపు, ఒక కొలికి తెలుపు, ఒక కొలికి ఎరుపు చొప్పున నడిమి నేతకు పెట్టి, ఎర్రంచు నేసిన చీర; కొన్నిచోట్ల, అంచు మధ్య పదికొలుకుల నల్లపోగులుపెట్టి గీరలుపడేట్టు నేస్తారు (రా. 13, 24).

**కాటికకన్నంచ** చిలకపచ్చరంగుచీరలో, ఒక కొలికి ఎరుపు(మడ్డిరంగు), చిలకపచ్చరంగుల దారాలుపెట్టి నేసిన ఒకరకం అంచు; చిటికెకట్టి మూకంచు నేస్తారు; చూ. మూకంచు (రా. 18).

**కాటిరంగు** బొగ్గుమాదిరి నల్లరంగు.

**కాటీ** (హిం. కాంటీ) పర్యా. చూ. బెంతికదురు. అచ్చుకట్టేటప్పుడు, పన్నెగూళ్ళలోకి పోగులుదూర్చే పుల్ల; మామూలుగా ఇనపది; కంటాణీలాంటిది; దీనికి పదును ఉన్నవైపు, పోగుదూర్చటానికి చిన్న కొక్కెం ఉంటుంది; కొన్నిచోట్ల రెండోవైపున పిడి ఉంటుంది; అచ్చుకట్టేవాళ్ళ వాడుక. చూ. చిత్రం 94 (కో. 5).

**కాటు** **1.** పర్యా. చూ. కోరా (నూలు). చలవ చెయ్యని ముడినూలు; unbleached yarn; ఇది గోధుమ రంగులో ఉంటుంది (తె. 18, 20, 22, 23); **2.** పసుప్పచ్చరంగు (తె. 8); **3.** ఉన్ని కదురుకుపైన చేసిన గాడి; కదురునుంచి పోగు ఊడకుండా నిలిపేది; గాటు చూ. చిత్రం 311 చ. 1 (తె. 25).

**కాటుగుంజ** పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగు రాట; మామూలుగా, కొయ్యది; కొన్నిచోట్ల, ఇనపది; మామూలుగా, దీనికి శిలువమాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిల్లిచేసి, దాంట్లో గునపందూర్చి, లడీలు తగిలించి కర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (తె. 20, 22).

**కాటుచీర** ఉ. కాటుశీరె. ఒకకొలికి ఎరుపు, రెండు కొలుకులు పోకరంగూ పెట్టి నేసిన చీర; ఒక మాదిరి నలుపుచీర (తె. 3, 18).

**కాటునీలి** ఉ. కాట్నీలి. మసిమాదిరి నలుపురంగు (రా. 9).

**కాటుపీట** పర్యా. కాటుమొద్దు, చిట్టెలమొద్దు, చెయిముద్ద, తిప్పుడుగొయ్య, తిప్పడుపీట, తిప్పుడు మొద్దు, పీట (5), మొద్దుగూటం (1), రుంజకట్టె, రుంజుడుమొద్దు. పంటెకు నూలుచుట్టేటప్పుడు పంటె కామకు ఊనికగాపెట్టేకొయ్య. చూ. చిత్రాలు 19.2, 28 (తె. 20).

**కాటుమొద్దు** పర్యా. చూ. కాటుపీట. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టే కొయ్య. చూ. చిత్రం 28 (తె. 22).

**కాటు(రంగు)** ఉ. కాట్. **1.** బొగ్గుమాదిరి నలుపు రంగు (కో. 7; తె. 2-4; రా. 9, 17, 19ఎ); **2.** ? నలుపు మాదిరిగా గోరగా ఉండేరంగు (తె. 18).

**కాడేరమ్మచీర** పర్యా. చూ. కాడ్రేడుచీర. కోడలు కాపరానికి వచ్చినప్పుడు అత్తగారు నేయించిపెట్టేచీర; కడుపుతోఉన్న స్త్రీకి అయిదోనెలలో పెట్టే ఒకరకం

చీర; అంచు, కమ్మి నీలివన్నెలో నేస్తారు; బొటనవేలెడు వెడల్పు ముద్దకమ్మి పెట్టి, చిగురంచుకు తెలుపువదిలి, పైన గోరంచు (కొన్నిచోట్ల, బొట్టెంచు)పెట్టి నేస్తారు; పద్దెనిమిది మూరల పొడుగుది; బయటఉన్న స్త్రీలు దీన్ని కట్టుకొంటే దుష్టగ్రహాలు సోకవని నమ్మకం; దీన్ని పడుచువాళ్ళు నెయ్యగూడదట (కో. 2).

**కాటేరుచీర** చూ. కాట్రేడుచీర (కో. 2-5).

**కాటిన్నిపిండి** పట్టుదారానికి నల్లరంగు వెయ్యటానికి వాడే పొడి (రా. 14).

**కాటిన్నిరంగు** పట్టుదారానికి వేసే నలుపురంగు (రా. 14).

**కాటిన్నిరేషం** ఒకరకంపట్టు(రేషం); పోగు ముతకగా ఉంటుంది (కో. 14).

**కాట్రేకుచీర** చూ. కాట్రేడు చీర (తె. 13).

**కాట్రేడంచు** ఉ. కాట్రేటంచు. నీలిరంగు దారాలు పెట్టి నేసిన అంచు; చూ. కాట్రేడుచీర (కో. 12).

**కాట్రేడుచీర** (< కాటి + రేడు) ఉ. కాటేడి-, కాట్టెడ-, కాట్టేడి-, కాట్రెకు-, కాట్రేడి; రూ. కాటేరు చీర, కాట్రేకుచీర, కాట్రేనుచీర, కాట్రేలుచీర, కాట్రేవుచీర; పర్యా. కాటేరమ్మకోక. **1.** కోడలు కాపరానికి వచ్చినప్పుడు, అత్తగారు నేయించి పెట్టేచీర; కడుపుతోఉన్న స్త్రీకి అయిదో నెలలోపెట్టే ఒకరకంచీర: అంచు, కమ్మి నీలివన్నెలో నేస్తారు; బొటనవేలెడు వెడల్పు ముద్దకమ్మిపెట్టి, చిగురంచుకు తెలుపు వదిలి, పైన గోరంచు (కొన్నిచోట్ల, బొట్టెంచు) పెట్టి నేస్తారు; పద్ధెనిమిది మూరల పొడుగుది; బయటఉన్న స్త్రీలు దీన్ని కట్టుకొంటే దుష్టగ్రహాలు సోకవని నమ్మకం; దీన్ని పడుచువాళ్లు నెయ్యగూడదట (కో. 3, 7-10, 12-14, 16; తె. 15); **2.** చిగురంచున ఇరవై జమిలిపోగుల తెలుపు వదిలి, ఇవతల ఆరుజమిలి పోగుల నీలిఅంచు, రెండువేళ్ళ వెడల్పున కమ్మి నేస్తారు (కో. 6); **3.** పర్యా. చూ. రక్తకాట్రేడుచీర. తెలుపులో ఎరుపు, నలుపుగళ్లు పడేట్టు నేసినచీర (కో. 11, 18); **4.** అయిదు రంగుల్లో పట్టెలుపట్టెలుగా నేసిన చీర (కో. 15).

**కాట్రేనుచీర** చూ. కాట్రేడుచీర. గొల్లవాళ్లు కడతారు; అమ్మవార్ల పేరుమీదా చనిపోయిన పెద్దలపేరు మీదా ఎవరికయినా పెడతారు (రా. 10, 19ఎ).

**కాట్రేలుచీర** చూ. కాట్రేడుచీర (తె. 16).

**కాట్రేవంచుచీర** ఒకరకం అంచుపెట్టి నేసిన చీర; చూ. కాట్రేడు చీర (రా. 20).

**కాట్రేవుచీర** చూ. కాట్రేడుచీర (రా. 19బి).

**కాట్లకట్టె** నవారుమగ్గం నిలువుకొయ్యల మధ్య బిగించిన కర్ర; దీనికి కిందివైపు గాళ్ళు ఉంటాయి (తె. 12).

**కాట్లపీట** **1.** డబ్బారాట్నానికి చిన్నకదురు బిగించే చిన్నపీట; దీనికి గాళ్లు ఉంటాయి; ఇది అమర్చిన రాట్నం మీద కండెలు గూడా పట్టుకోవచ్చు. చూ. చిత్రాలు 41 క. 14, 41 త (కో. 7); **2.** ఉ. -పీటె. పట్టుమగ్గానికి పైన అమర్చిన కొయ్యపట్టె; దీనికి ఒక వైపు వరసగా గాళ్లు ఉంటాయి; డిజైన్లు నేసేటప్పుడు చుంచుతాళ్ళను కిందికి గుంజి ఈ గాళ్ళలో దూరుస్తారు; చూ. టిక్రాబల్ల. చూ. చిత్రం 134 చ. 10 (తె. 5).

**కాడ** పర్యా. చూ. కొండి (4). పడుగేరుకర్రకు తగిలించే ఇనపగొలుసు కొక్కెం. చూ. చిత్రం 70.1 (తె. 15).

**కాడమల్లిపేటు** అంచులో ఒకరకం పూలు వరసగా పడేట్టు నేసిన డిజైను (కో. 20).

**కాడీ** పర్యా. చూ. ఈనె (1). పన్నెకట్టుబడిలో దండెలమధ్య దువ్వెనపళ్ళ మాదిరిగా వరసగా కట్టిన కలప, జొన్న, గలుగు, వెదురు, కొండచీపురు మొ. వాటిపుల్ల(లు); కొన్నిచోట్ల పట్టునేతకు ఇనుము, ఇత్తడి, ఉక్కు మొ.వాటి ఊచలు వాడతారు; పన్నెగట్ల వాళ్ళవాడుక. చూ. చిత్రం 88 క. 8 (కో. 5, 7).

**కానాలచీర** ఉ. -సీర. ఒకరకం గడిచీర (తె. 31).

**కానాసులు** నేతపనిచేసే దేవాంగులదగ్గర అడుక్కొనే ఒక తెగవారు; వీరముష్టులు (కో. 23).

**కానికట్టె** పర్యా. అడ్డ(12). కానిగుంజకు అమర్చిన అడ్డకట్టె; తడిపిన నూలులడీలు దీనికి తగిలించి పిండుతారు. చూ. చిత్రం 282 క. 2 (తె. 28).

**కాని(గుంజ)** రూ. కానె; పర్యా. ఉకారగుంజ, కడ్డీ (8), కర్ర (4), కాటుగుంజ, కిట్టుమాను, కిప్పుమాను, గుంజ (9), దట్టగుంజ, దుల్లగుంజ, బారు (మాను), బారుమొద్దు, బిసిమొద్దు, బిసిగుంజ, లాడ్ ఖానా, స్తంభం. రంగులో తడిపిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట; మామూలుగా కొయ్యది; కొన్నిచోట్ల, ఇనపది; మామూలుగా, దీనికి శిలువమాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్ని చోట్ల, గుంజకు చిల్లిచేసి, దాంట్లో గునపందూర్చి లడీలు తగిలించి పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (తె. 19, 23, 25).

**కానుముక్క** పర్యా. చూ. అంగీగుడ్డ. చొక్కాలకోసం నేసిన బట్ట; రకరకాల రంగుల్లోను, గళ్ళలోను, చారల్లోను, డిజైన్లలోను నేస్తారు (కో. 29, 32).

**కానులు** మరాను కట్టుబడిలో అడ్డపట్టెను, ఆకులను బిగించిన కట్టె(లు); ఏటవాలుగా బిగిస్తారు (కో. 36).

**కానె** చూ. కాని(గుంజ) (కో. 33).

**కాపు** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 6).

**కాపుచెక్క** 1. పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 24); **2.** పర్యా. చూ. రెక్క. మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (కో. 24).

**కాపుజట్టు** కమ్మి ఇవతల నేసిన రెండుపోగులు. చూ. చిత్రం 272 (కో. 24),

**కాపునూలు** కాపులువడికిన నూలు (కో. 7).

**కాపుబద్ద** ఉ. కాబ్బద్ద; పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 6, 23).

**కాపుబిళ్ళ** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 7).

**కాఫీకలరు** ఉ. కాపికర్లు, కాఫీకర్లు. వక్కరంగులో నలుపువన్నె (కో. 8, 9బి, 11, 13).

**కామ** **1.** రంగుఅద్దిన నూలులడీలు గుంజకు తగిలించి పిండేకర్ర; గుండ్రటిది; దీన్ని లడీల్లో దూర్చి మెలిపెడతారు; దీంతో పోగులు విదిలిస్తారు; కొన్నిచోట్ల, రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. చూ. చిత్రం 282 క. 5 (తె. 29); **2.** పట్టుదారంచుట్టేపంజె (=సిల్కుపంజె) కట్టుబడిలో మధ్య బిగించినకర్ర; చూ. పంజె (తె. 18, 21).

**కామధేను(వు)** ఉ. కామదేనువు; **1.** కెంపుకంజె ఒకవన్నె నలుపు ఎక్కువ ఉండేరంగు (కో. 7); **2.** ఒకరకం నలుపు. చూ. చిత్రం 288 (కో. 21; తె. 4; రా. 7, 11, 12, 18); **3.** నీలికంజె కొంచెం ఎర్రగా ఉండే రంగు. చూ. చిత్రం 288 (రా. 19బి).

**కామధేనువుఅంచు** ఒకరకం రంగునూలుతో నేసిన అంచు; చూ. కామధేనువు (తె. 4).

**కామమద్దు** (క్రి.) పర్యా. కదురురుద్దు. ఉన్ని వడికేటప్పుడు, కదురుఊచ తొడమీదపెట్టి తిప్పటం(తె. 6).

**కాయతీయు** (క్రి.) కత్తిరించిన గొర్రెబొచ్చులో చిక్కుకొన్న ముళ్ళకాయలు తీసెయ్యటం; కొయ్యగూటంతో కొడతారు (తె. 27).

**కాయపత్తి** ఉ. కాయిపత్తి. పత్తిలో ఒకరకం (కో. 19; రా. 9).

**కాయపోయు** (క్రి.) దసలిపురుగు దారంతో తన చుట్టూగూడు(=దసలికాయ) అల్లుకోటం (తె. 7).

**కాయంచు** కాయఆకారంలో డిజైను నేసిన ఒకరకం అంచు; సులికాయ, మామిడికాయ మొ.వి నేస్తారు (తె. 25).

**కాయసంపెంగ** ఒకరకం ఆకుపచ్చరంగు; కాయలు కాసే సంపెంగచెట్టు ఆకురంగు (కో. 7).

**కారకంనూలు** పర్యా. చూ. కోరా(నూలు). చలవ చెయ్యని ముడినూలు; unbleached yarn; ఇది గోధుమ రంగులో ఉంటుంది (కో. 2).

**కారపునూలు** అద్దకంపనిలో, 'కారం'లో వేసి పిసికిన నూలు; నూలుకు రంగు బాగా పట్టటానికి వెలిబూడిద, ఉప్పు మొ.వి కలిపిన మిశ్రం "కారం" (కో. 7).

**కారం** (-చేయు, -తీయు, -తీర్చు) **1.** ఉ. కారెం, ఖారం; పర్యా. ఉకార(ం)(1), కసెం. నూలు, రంగును పీల్చుకోటానికి తయారుచేసిన మిశ్రం; నువ్వుకంప (కొన్నిచోట్ల, నాగజెముడు బొంత) బూడిద, గొర్రెపేడ, నూనె మొ.వి వేసి తయారుచేస్తారు. దీంట్లో చన్నీళ్ళుపోసి ఊరబెట్టి, నూలులడీలువేసి బాగా పిసుకుతారు; తరవాత రంగు అద్దుతారు (కో. 2, 6-10; తె. 3, 11, 13, 16, 17, 26; తె. రా. 5, 6, 8, 10, 15, 23); **2.** పర్యా. ఉకార(ం)(2); కారునీళ్ళు, సారం. చౌడు, సున్నం కలిపిననీళ్ళు; రంగు అద్దేముందు దీంట్లో నూలులడీలువేసి ఉడకబెడతారు (రా. 15, 16, 23).

**కారంతొట్టి** కలంకారీ అద్దకంకోసం, పటికగుండ, తుమ్మజిగురు కలిపి తయారుచేసిన రసం(=ఎరుపురంగు అద్దటానికివాడేది) పోసే తొట్టి. చూ. చిత్రం 283 ప. 3 (కో. 12).

**కారాలుతీర్చు** (క్రి.) రంగుఅద్దేముందు, నూలులడీలు కారంలోవేసి పిసకటం (కో. 7).

**కారికం** పర్యా. చూ. కోరా(నూలు). చలవ చెయ్యని ముడినూలు; unbleached yarn; ఇది గోధుమ రంగులో ఉంటుంది (కో. 3, 7).

**కారికానీచీర** రెండు కొలుకులు ఒకరంగు (కందు), రెండు కొలుకులు మరొక రంగుపెట్టి నేసిన గళ్ళచీర (రా. 24).

**కారిగొర్రె** నలుపు, తెలుపు చారలుగల గొర్రె (తె. 28)

**కారునీళ్ళు** పర్యా. చూ. కారం(2). చౌడు, సున్నం కలిపిననీళ్ళు; రంగు అద్దేముందు దీంట్లో నూలులడీలు వేసి ఉడకబెడతారు (తె. 1).

**కారుమంచిచీర** ఒకరకం కృత్రిమపు పట్టుతో నేసిన చీర; ఇటీవల వాడుకలోకి వచ్చిన పేరు (రా. 18).

**కార్డంచు** ఉ. కారడంచు. పోస్టుకార్డంత వెడల్పున నేసిన మామూలు అంచు; కొన్నిచోట్ల, మధ్యలో గీరలు పెడతారు (కో. 5, 10; రా. 13, 14).

**కార్తీకపున్నమ** కార్తికపౌర్ణమి; ఆనాడు నేతపని వాళ్ళు ఇల్లు శుభ్రంచేసుకొని, శివుడికి పూజచేసి, పోలెలు నైవేద్యం పెడతారు (కో. 33).

**కార్తీకసోమవారం** కార్తికమాసంలో గౌరీదేవిని పూజించేరోజు; మట్టితో గౌరీదేవిబొమ్మచేసి, రోజంతా ఉపవాసముండి, సాయంత్రం పూజచేసి భోంచేస్తారు (కో. 31).

**కార్పాస** (< సం. కార్పాస-). చూ. పత్తి(తె. 4).

**కార్యంచీర** పర్యా. గర్భాధానంచీర, శోభనంచీర. గర్భాధానం(=కార్యం)నాడు పెండ్లికూతురికి పెట్టే (తెల్ల)చీర; జరీలోగాని, మామూలుగాగాని వెడల్పాటి అంచుపెట్టి నేస్తారు (కో. 17)

**కాలిగుంజ** చూ. కాలుగుంజ (రా. 9).

**కాలిపట్టె** పర్యా. చూ. తొక్కుడుపట్టె (2); రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 6).

**కాలిపీట 1.** పర్యా. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 12), **2.** పర్యా. చూ. తొక్కుడుపీట (2). డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (కో. 6).

**కాలిమొద్దు** ఉ. ?కాలుముద్ద; కాలు మొద్దు; పర్యా. చూ. ముద్దగొయ్య(1). పంకెకు నూలు చుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగాపెట్టే మొద్దు. చూ. చిత్రం 19.1, 24 (తె. 2, 6, 19, 26; రా. 13, 15).

**కాలీపన్నె** (< ఖాళీ-) మరమగ్గం చట్రంలో, మామూలుపన్నె అమర్చగా మిగిలిన ఖాళీని నింపటానికి పెట్టిన చిన్నపన్నె; ఇటువంటివి రెండుంటాయి; చూ. పన్నె (కో. 6).

**కాలు 1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 4, 8); **2.** పర్యా. మొద్దుకాలు. అడ్డగుమ్మి ఆమర్చిన తిరిగిణి చట్టం కింది పీటకు వేసిన పొడుగుపట్టె. చూ. చిత్రం 34.2 (కో. 4); **3.** పర్యా. చూ. ఊడ్తెకాలు. నేలమీదమోసే ఊడ్తె కొయ్య; ఇటువంటివి, మడతమంచం కోళ్ళమాదిరిగా, రెండుంటాయి; వీటిపైన అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 63 క. 1 (కో. 6, 8, 9ఎ, 10).

**కాలుకొయ్య** పర్యా. జైనకొయ్య. అనుమీద, పకుగు జైనెకు ఎక్కువ రావటానికి, పక్కపీటకు బిగించిన కొయ్య. చూ. చిత్రం 45 ట. 2 (కో. 37).

**కాలుగుంజ** రూ. కాలిగుంజ; పర్యా. చూ. సట్టరు గుంజ. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా, నేతబయలులో పాతినకొయ్యరాట; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల, రెండు. చూ. చిత్రం 116.2 (కో. 12).

**కాలేజిపార్డరు** నాలుగయిదు వరసల్లో, ఏటవాలుగా పోగులుపడేట్లు నేసిన అంచు; రెండున్నర అంగుళాల వెడల్పు నేస్తారు (రా. 14).

**కాలుజాపుపీట** ఉ. కాల్జాప్పీట, కాలుజాప్పీట. **1.** పర్యా. చూ. తొక్కుడుపీట (2). డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (కో. 3); **2.** పర్యా. చూ. తొక్కుడుపట్టె (2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 3).

**కాసిపేటంచు** ఒకరకం (?డిజైనులో నేసిన) అంచు (తె. 10, 12).

**కాసికోక** ఉ. కాచీకోక. పర్యా. చూ. దట్టీ(2). బిగింపుకుగాని, అందంకోసంగాని నడుముకు చుట్టుకొనే ఒకరకం బట్ట; సుమారు జైనెడు వెడల్పు, రెండున్నర గజాల పొడుగు ఉంటుంది; రకరకాల రంగుల్లో నేస్తారు (కో. 16).

**కాసీదట్టీ** పర్యా. చూ. దట్టీ(2). బిగింపుకుగాని, అందంకోసంగాని, నడుముకు చుట్టుకొనే ఒకరకంబట్ట; జైనెడు వెడల్పు, రెండున్నరగజాల పొడుగు ఉంటుంది; రకరకాల రంగుల్లో నేస్తారు (రా. 14).

**కాసెపుల్ల** ఉ. కాసిపుల్ల; పర్యా. చూ. ఏకుపుల్ల (1). ఏకు తయారు చెయ్యటానికి ఉపయోగించేపుల్ల. చూ. చిత్రం 11.3 (రా. 11, 12).

**కాస్టిక్(సోడా)** ఉ. కాస్టికు, కాస్టీకు, కాస్టికం; పర్యా. ఉప్పు, సోడా. అద్దకంరంగు తయారు చెయ్యటానికి వేణ్ణీళ్ళలో కలిపే ఒకరకం లవణం; Caustic soda (తె. 23; రా. 5, 8, 10-12, 15, 22).

**కిక్కిస** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గం గుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు (మడిమదగ్గర) ఉంటుంది;

పావుచెక్కల వెనక తాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 27).

**కిక్కిసఅడ్డగర్ర** పర్యా. చూ. కమ్మి(9). మగ్గం గుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; పావుచెక్కలకు వేసిన చిల్లుల్లో దూర్చి పక్కగూటాలకు వేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (కో. 27).

**కిక్కు** 1. చెవులులేని రాట్నం బొమ్మకు చేసిన గాడి; మామూలుగా, ఇటువంటివి రెండుంటాయి; వీటిలో కదురు బిగిస్తారు. చూ. చిత్రం 15.11 (కో. 7); **2.** డబ్బారాట్నం గంటం అమర్చటానికి రాట్నం బొమ్మకు చేసినగాడి. చూ. చిత్రం 41 క. 6 (కో. 7); **3.** చేడుబద్దకు బిగింపుకోసం పెట్టిన నరుకు; గాటు. చూ. చిత్రం 125 ట. 1 (కో. 23, 24).

**కిగ్గర్ర** ( < ?కిక్కుగర్ర). పర్యా. చూ. చేడుపలక(1). దోనెముందర నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా పైవైపు బిర్రుపెట్టే పొడుగు చెక్క(లు); మామూలుగా, రీపరుబద్ద మాదిరిది; బద్దకు చివర బిగించిన ముళ్ళుగుడ్డ అంచులో గుచ్చుతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 125 ట (తె. 13).

**కింగ్స్వే** (kingsway) మామూలు గీరలు పడేట్టు నేసిన అంచు (కో. 22).

**కిట్టు** (క్రి.) పిండటం; తడిపిన నూలు లడీలు, కాని గుంజ అడ్డకట్టెకు తగిలించి కర్రతో పిండుతారు (కో. 2, 3).

**కిట్టుమాను** పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలులడీలు పిండటానికి నేలలోపాతిన పొడుగు రాట; మామూలుగా, దీనికి శిలువమాదిరిగా అడ్డకట్టె అమర్చిఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిల్లిచేసి, దాంట్లో గునపందూర్చి, లడీలు తగిలించి, పిడుపు కర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (కో. 2, 3).

**కిత్త** నేతపనికి తెచ్చుకొన్న (నూలు) నరుకు (తె. 5).

**కిత్తనార** మంచంనులక నెయ్యటానికి వాడే ఒక రకం నార; సాగనార; రంపంపండ్ల మాదిరిగా, రెండు అంచులనార ముళ్ళుండే మట్టలను ఎండబెట్టి, కర్రలతో నలగ్గొట్టి నారతీస్తారు (కో. 17, 19, 21).

**కిత్తా** పర్యా. వాలు(2). దఫా; పర్యాయం (తె. 20)

**కినార** తివాసీఅంచు; నిలువుకొన. చూ. చిత్రం 320 (తె. 17).

**కిందికచ్చు** ఉ. ఆసులో మధ్యపీటకు బిగించిన చివరి కొయ్య. చూ. చిత్రం 45 క. 12 (తె. 33).

**కిందికుంచెవేయు** (క్రి.) సరిచేసేటప్పుడు, కుంచె తలకిందుగా పట్టుకొని, పడుగుకు కిందిభాగం దువ్వటం (కో. 26).

**కిందికొలికి** పర్యా. చూ. కిందికోల్తల. ఆసుపోసిన పడుగులో చివరిఅని పడ్డభాగం (కో. 10).

**కిందికోర్తల** చూ. కిందికోల్తల (కో. 7.)

**కిందికోల** ఆసుకొయ్యలలో చివరికొయ్య. చూ. చిత్రం. 45 క. 11 (తె. 23, 25).

**కిందికోల్తల** ఉ. కింది కోల్తాల; రూ. కిందికోర్తల; పర్యా. కిందికొలికి కుడికోల, దిగుదలకోర్తల, దిగుమల, దిగువకోల్తల, పురకోల. ఆసుపోసిన పడుగులో చివరి అని పడ్డ భాగం (కోల్తల) (కో. 5, 6; తె. 8, 15).

**కిందిగుండు** పర్యా. చూ. గుండు (4). చేతిమగ్గం పన్నె బిగించిన కిందికొయ్య; రోకలిమాదిరిగా, గుండ్రంగా ఉంటుంది; దీన్ని పలకసీలలతో పై పలకకు బిగిస్తారు. చూ. చిత్రం 109 చ. 7 (తె. 21, 33).

**కిందిగుది** ఉ. కిందిగుతి; పర్యా. చూ. అచ్చుగుది(2) మగ్గంలో పూనుగర్రకు కట్టినదారం; అచ్చులో కింది కర్రకు ఉండేది; ఇటువంటివి కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (కో. 34).

**కిందిపట్టె** ఉ. కిందిపట్టి. పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో, పన్నెబిగించిన కిందికొయ్య, నేతనేసేటప్పుడు. దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం. 118.9 (రా. 14, 18).

**కిందిపలక** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం. 118. 9 (తె. 18, 22 23).

**కిప్పుమాను** పర్యా. చూ. కాని (గుంజ). రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట; మామూలుగా, దీనికి శిలువ మాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిల్లిచేసి దాంట్లో గునపం దూర్చి, లడీలు తగిలించి, పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (కో. 17).

* **కిప్పుమానుగునపం** పర్యా. ఇనపకడ్డీ, కాని గుంజకు తగిలించిన ఇనపకడ్డీ; తడిపిన నూలు లడీలు దీనికి తగిలించి కర్రతో పిండుతారు (కో. 17).

**కిరమంజి** ఉ. కిరవంజి, కిరవంది; చూ. కిర్మంజి (2) (రా. 9, 16, 17).

**కిరమంజివిత్తనాలు** ఉ.- ఇత్తనాలు. పట్టునూలుకు రంగువెయ్యటానికి వాడే ఒకరకం విత్తనాలు(రా. 14).

**కిరిగె** రూ. కీలిగ; పర్యా. చూ. వల్లె (2). కన్నెపిల్లలు కట్టుకొనే చిన్నచీర; కొన్నిచోట్ల, పది పన్నెండు మూరల పొడుగున, రెండు మూరల వెడల్పున నేస్తారు (రా. 11, 13).

**కిర్ది** (విశ.) తక్కువ; చిన్న; ఉదా. కిర్దిచీర (రా. 17)

**కిర్దిచీర** పర్యా. చూ. వల్లె (2). కన్నెపిల్లలు కట్టుకొనే చిన్నచీర; కొన్నిచోట్ల, పదిపన్నెండు మూరల పొడుగున, రెండు మూడు మూరల వెడల్పున నేస్తారు; కొన్నిచోట్ల, కిందికులస్థులు కడతారు (రా. 17).

**కిర్మింజి 1.** ఉ. కిరమింజి. చెకితేటురంగు; గార్నెట్ బ్లూ బి. ఎస్, పటిక తేజాపు, నైట్రేట్ సల్ఫ్ వేసి తయారు చేస్తారు. చూ. చిత్రం 288 (తె. 5); **2.** రూ. కిరమంజి; పర్యా. తిరుమంజి రంగు. కవ్వ (=పేలిక) ఎరుపు (తె. 19, 26); **3.** వంకాయరంగు (తె. 27).

**కిలావరంచు** చూ. కళావరంచు (తె. 6, 17).

**కిష్టగుదురుచీర** నిలువుకు తెలుపు, అడ్డానికి నలుపు రంగులు పెట్టి నేసినచీర. (తె. 32).

**కిసాన్‌చెర్ఖా** పర్యా. కిసాన్‌రాట్నం. ఒకరకం రాట్నం; ఒక కొయ్యపట్టెకు రెండు చెక్రాలు అమర్చ తయారుచేసింది. చూ. చిత్రం 16 (తె. 2.)

**కిసాన్‌రాట్నం** పర్యా. కిసాన్‌చెర్ఖా. ఒకరకం రాట్నం; ఒక కొయ్యపట్టెకు రెండు చెక్రాలు అమర్చి తయారు చేసింది. చూ. చిత్రం 16 (తె. 28, 30).

**కీలిగ** చూ. కిరిగె (రా. 16).

**కీలు** మరాను తిరిగేటప్పుడు, బెండకాయ చెక్రంతో బాటు తిరిగే వంకర ఇనప ఊచ. చూ. చిత్రం 50.5 (రా. 2).

**కుకణం** చూ. కుప్పడం (తె. 5).

**కుక్క 1.** ఎదురుదోనె దగ్గర అమర్చిన పళ్ళచెక్రం బిగింపుకు వేసిన ఇనపకొక్కెం; చూ. నాగపాసెం. చూ. చిత్రం 122 ట. 2 (తె. 18); **2.** పర్యా. కత్తి (2) కుత్త, కేతిగాడు, కొక్కి (2), కోతి, గిలకకత్తి, మిషనుకత్తి. డాబీకోలలను లేపటానికి దిండుచెక్రాన్ని, కొన్నిచోట్ల దిండుగాడిని, గుంజే ఇనపరేకు; దీనికి ఒక వైపున పేటుతాళ్లు కడతారు; పావుచెక్క తొక్కినప్పుడు, పళ్ళచెక్రాన్ని గాని, దిండు ఊచల చెక్రాన్ని గాని గుంజుతూ కిందికీ పైకీ ఆడుతుంది. చూ. చిత్రం 132 క. 3, 132 చ. 7, 132 ట. 3 (కో. 6, 8; తె. 8, 10, 18-20; రా. 23).

**కుక్కకర్ర** డాబీకట్టుబడిలో కుక్క బిగించినకొయ్య. చూ. చిత్రం 132 క. 7 (తె. 31).

**కుక్కచెక్రం** కుక్కను గుంజే డాబీచెక్రం; చూ. కుక్క (2). (తె. 8).

**కుక్కతాడు** పర్యా. చూ. కుక్కసూత్రం. డాబీ చెక్రాన్ని గుంజేరేకు(=కుక్క)కు వేలాడదీసిన దారం; మగ్గంగుంటలో పావుచెక్కకుగాని, పైన అచ్చుకర్రకు గాని కట్టి ఉంటుంది; పావుచెక్క తొక్కినప్పుడు కుక్కను వెనక్కు గుంజుతుంది; మామూలుగా, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 132 క. 4 (తె. 10).

**కుక్కసూత్రం** ఉ. -సూత్ర్రం; పర్యా. కుక్కతాడు, కుత్తతాడు. డాబీచెక్రాన్ని గుంజేరేకు(=కుక్క)కు వేలాడదీసినదారం, మగ్గంగుంటలో పావుచెక్కకుగాని, పైన అచ్చుకర్రకుగాని కట్టి ఉంటుంది; పావుచెక్క తొక్కినప్పుడు కుక్కను వెనక్కు గుంజుతుంది; మామూలుగా ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 132 క. 4 (తె. 20, 22-25, 29).

**కుంకంనామ్నారిచీర** ఒక్కొక్క కొలికి ఎరుపు, నలుపు, ఎరుపు చొప్పున వరసగాపెట్టి నేసినచీర; దీనికి మూకంచు నేస్తారు (రా. 18).

**కుంకుమకడ్డీచీర** ఉ. -కడ్డిచీర. ఎరుపురంగు పట్టెలు పడేట్టు నేసిన చీర (రా. 16).

**కుచ్చిపరచు** (క్రి.) పట్టుదారం చిలపకొనలు చేతులతో పట్టుకొని జాడించటం (తె. 12).

**కుచ్చు** (-గుంజు, -లాగు) పర్యా. చుంచు, చెండు (1), పిడి (8), బంతి, ముష్టి, సూత్రాలకుచ్చు. మరమగ్గంలో ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో తాళ్ళను గుంజేపిడి; మామూలుగా, గుడ్డపేలిక (కొన్నిచోట్ల, బద్దెపేలిక)లు కలిపి కట్టింది; కొన్నిచోట్ల, దారపురీలు కడతారు. చూ. చిత్రం 118.21 (కో. 1-6, 8, 15, 17-19, 22-30, 32, 35-37; తె. 1, 8, 15, 16, 18, 30, 31; రా. 1-3, 15-19, 22-24).

**కుచ్చు(అడ)** వజానేతకోసం మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో, నడిమి ఒల్లినుంచి కిందికి వేలాడే లావుపాటి(అడ) దారాల మొత్తం చూ. చిత్రం 134 చ. 4 (కో. 34, 36, 37).

**కుచ్చుఇగ్గు** (క్రి.) పర్యా. చూ. కుచ్చులాగు. నాడె ఆడటానికి మరమగ్గం కుచ్చు గుంజటం; కుచ్చు ఏవైపుకు గుంజితే, నాడె ఆ వైపుకు వెళ్తుంది (రా. 11, 19).

**కుచ్చుగుంజు** పర్యా. చూ. కుచ్చులాగు. నాడె ఆడటానికి మరమగ్గం కుచ్చుగుంజటం; కుచ్చు ఏవైపుకు గుంజితే నాడె ఆ వైపుకు వెళ్తుంది (రా. 18, 20, 24).

**కుచ్చుతాడు** పర్యా. అడ్డతాడు (4), కుచ్చుదారం, కుచ్చుసూత్రం, గొండసూత్రం, చక్రటంతాడు, చుంచుతాడు, పిడిసూత్రం, బంతితాడు, బొండసూత్రం, మయంతాడు, ముట్టితాడు. మరమగ్గంలో నాడెను

నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టినదారం. చూ. చిత్రం 118.22 (కో. 1-3, 5, 6, 9బి, 10, 14, 15, 22, 23, 25, 26, 28-30, 33, 35-37; తె. 1, 6, 16, 30, 31; రా. 1, 2, 4-12, 15, 17-20, 22-24).

**కుచ్చుతాడుపుల్ల** పర్యా. చూ. చిల్ల (7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా, చట్రం నిలువు పట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి, చూ. చిత్రం 118.8 (కో. 1).

**కుచ్చుదండె** పర్యా. చూ. అడ్డపట్టె (14). మర మగ్గంచట్రంలో, మేరువుపలకకు కిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (కో. 26).

**కుచ్చుదారం** పర్యా. చూ. కుచ్చుతాడు. మర మగ్గంలో, నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టిన దారం. చూ. చిత్రం 118.22 (రా. 13, 14, 16).

**కుచ్చుదారంపుల్ల** పర్యా. చూ. చిల్ల (7). మగ్గం కుచ్చుతాడుకట్టటానికి ఆధారంగా, చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (రా. 13).

**కుచ్చుదొడ్డి** అంచుల్లో డిజైన్లుపడే వజానేతకోసం, మగ్గానికి పైన కుచ్చుతాళ్ళు వేలాడదియ్యటానికి అమర్చిన ఈనెలచట్రం; పన్నెమాదిరిది. చూ. చిత్రం 134 క. 2 (కో. 33).

**కుచ్చుమగ్గం** పర్యా. చూ. మరమగ్గం. ఒకరకం మగ్గం; నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజేది; మగ్గంపలక, పన్నె ఒక కొయ్యచట్రంలో బిగించి, పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు. చూ. చిత్రం 108 (కో. 13, 18; రా. 1, 8, 10, 14-16).

**కుచ్చులాగు** (క్రి.) పర్యా, కుచ్చుఇగ్గు, కుచ్చుగుంజు, నాడెలాగు. నాడె (పేకకండె ఉన్నది) ఆడటానికి మర మగ్గం కుచ్చుగుంజటం; కుచ్చు ఏవైపుకు గుంజితే, నాడె ఆ వైపుకు వెళ్ళుతుంది. (కో. 6, 9, 10, 22, 23; రా. 7, 8, 15, 16, 18, 19, 23).

**కుచ్చుసూత్రం** పర్యా. చూ. కుచ్చుతాడు. మర మగ్గంలో, నాడెను నడపటానికి ఆధారంగా, కుచ్చు కట్టినదారం. చూ. చిత్రం 118.22 (కో. 27).

**కుంచం** పర్యా. చూ. దిండు(1). రాట్నం రెండు చక్రాలనూ(=ఆకులు) వేరుచేసేకొయ్య; ఇరుసు దీని మధ్య ఉంటుంది. చూ. చిత్రం 15.8 (కో. 18).

**కుంచె** ఉ. కుంచి 1. పర్యా. సరికుంచె (1). గంజి పెట్టిన పడుగును ఆరుబయట చాపి దువ్వే పనిముట్టు; గంజి ఆరటానికి దీంతో దువ్వుతారు. చూ. చిత్రం 76 (కో. 1-37; తె. 1, 7-33; రా. 1-24); **2.** పర్యా. చూ. కురమకుంచె. అంబలిపెట్టిన ఉన్నిపడుగును దువ్వే కుంచె; గొంగళ్ళునేసే కురమవాళ్ళది; ఏదెగడ్డివేళ్ళు (పురి) కూర్చికట్టినది; దీనికి పిడిఉండదు. చూ. చిత్రం 314.12 (తె. 3, 9-11, 20, 22, 25-28).

**కుంచెఅచ్చు** ?మొగలినారతో కుంచె బిగించటానికి చేసిన కొయ్యచట్రం చూ. చిత్రం 87 (కో. 35).

**కుంచెఇగ్గు** (క్రి.) ఉ. కుంచిగ్గు. **1.** పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరో వైపునా కుంచె పట్టుకొని, ఒకవైపునుంచి మరొక వైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (రా. 24); **2.** పర్యా. కుంచెపట్టు(2). అంబలి పెట్టిన ఉన్నిపడుగు మీద కుంచె లాగటం (తె. 25).

**కుంచెఈడ్చు** (క్రి.) పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరోవైపునా కుంచె పట్టుకొని ఒకవైపునుంచి మరొకవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు. (కో. 27, 29; రా. 11-13, 15, 16, 18, 22-24).

**కుంచెకట్టు** **1.** ?మరాను ఇరుసుపై వేసిన కర్ర చెక్క (కో. 26); **2.** కుంచెకట్టుబడిలో, పురికి పైభాగంలో వేసినకట్టు; మామూలుగా, మొగలి, మోదుగు, మునగ, పొక మొ. వాటి నారతోగాని, పేముతోగాని వేస్తారు. చూ. చిత్రం 76 క. 7 (కో, 33, 37).

**కుంచెకట్టువాళ్ళు** ఉ, కుంచెకట్టోళ్ళు. నూలు సరిచేసే కుంచె తయారుచేసే ఒక తెగ; ఎరికలవాళ్ళు (రా. 17).

**కుంచెకట్లఎరికలవాళ్ళు** ఉ. -ఎరికలోల్లు. నూలు సరిచేసే కుంచెలు తయారుచేసే ఒక తెగ; ఎరికలవాళ్ళు (రా. 13).

**కుంచెకట్లవాడు** ఉ. కుంచెకట్లోడు. పడుగుదారం దువ్వేకుంచెలు తయారుచేసేవాడు; కుంచెరకలవాడు (తె. 12).

**కుంచెకర్ర** ఉ. కుంచికర్ర **1.** పర్యా. చూ. బిడికర్ర. ఊడైతాడు బిర్రుపెట్టే పొడుగుకర్ర; ఊడైకూ గూటానికీ మధ్య తాడు మెలిదిప్పి నేలమీద అనుస్తారు. చూ. చిత్రం 63 చ. 2 (కో. 26); **2.** పర్యా. దండె (2). పడుగుదువ్వే కుంచెకు పక్కభాగంలో కట్టిన పొడుగు కర్ర; ఇటువంటివి రెండుంటాయి; వీటిని ఇద్దరు మనుషులు పట్టుకొని పడుగుమీద కుంచెవేస్తారు. చూ. చిత్రం 76 క. 4 (కో. 4, 6, 10, 15).

**కుంచెకోపు** పర్యా. చూ. చెంప(1). పడుగుదువ్వే

కుంచె పక్కభాగం; చేత్తోపట్టుకోటానికి వీలుగా, దీనికి గోనెపట్టాగాని, తేకిచేపతోలుగానివేసి కుడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 76 క. 8 (కో. 9; రా. 11).

**కుంచెకోల** అనుపీటకూ కిందిపీటకూ బిగించిన కొయ్యల్లో చివరిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 45 త. 3 (కో. 34).

**కుంచెగుంజు** (క్రి.) పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరోవైపునా కుంచె పట్టుకొని ఒకవైపునుంచి మరొకవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (తె. 7, 15; రా. 7).

**కుంచెగేడి** పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచెపై భాగం; మొగలినారతోగాని, పేముతోగాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (కో. 4; రా. 11, 13).

**కుంచెగొడ్డేలు** (కుంచె)పురివేళ్ళు నరికే గొడ్డలి. చూ. చిత్రం 84 (కో. 35).

**కుంచెగోడ** పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచెపై భాగం; మొగలినారతోగాని, పేముతోగాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (కో. 3).

**కుంచెగోడు** పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచె పై భాగం; మొగలినారతోగాని, పేముతోగాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (కో. 8).

**కుంచెచట్టం** ఉ. -సట్టం; పర్యా. చూ. పరువు(1). కుంచె(=పడుగుచేసేది) పురి అడుగుభాగం: కుంచెవేసేటప్పుడు, పడుగుమీద సమంగా అనుతుంది. చూ. చిత్రం 76 క. 11 (రా. 18).

**కుంచెచివ్వ** ఉ. -సివ; పర్యా. చూ. కుంచెదండె. కుంచె(=పడుగుదువ్వే పనిముట్టు) వెన్ను బిగింపుకు లోపల అమర్చి కట్టిన కఱ్ఱ. చూ. చిత్రం 76 చ. 1 (కో. 33, 37).

**కుంచెచెంప** ఉ. కుంచిసెంప; పర్యా. చూ. చెంప(1). పడుగుదువ్వే కుంచె పక్కభాగం; కుంచెపట్టుకోటానికి వీలుగా, దీనికి గోనెపట్టాగాని, తేకిచేపతోలుగాని వేసి కుడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 76 క. 8 (కో. 22, 27, 31; రా. 16).

**కుంచెచేయు** (క్రి.) పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరోవైపునా కుంచె పట్టుకొని ఒకవైపునుంచి మరొకవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (కో. 7).

**కుంచెతట్టు** పర్యా. చూ. చెంప(1). పడుగుదువ్వే కుంచె పక్కభాగం; చేత్తోపట్టుకోటానికి వీలుగా, దీనికి గోనెపట్టాగాని, తేకిచేపతోలుగాని వేసి కుడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 76 క. 8 (తె. 19, 20, 25).

**కుంచెతీయు** (క్రి.) పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి, కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరోవైపునా కుంచె పట్టుకొని ఒకవైపునుంచి మరొకవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (కో. 2, 6, 7, 9, 28, 30, 37; రా. 6, 10, 20).

**కుంచెతోలు** ఉ. కుంచితోలు. కుంచెచెంపలకు కుట్టిన తోలు; మామూలుగా తేకిచేపతోలు వాడతారు (కో. 24).

**కుంచెదండె** ఉ. కుంచిదండి; పర్యా. కుంచెచివ్వ, దండెకఱ్ఱ(2). కుంచె(=పడుగుదువ్వే పనిముట్టు) వెన్ను బిగింపుకు, లోపల అమర్చి కట్టిన వెదురుబొంగు. చూ. చిత్రం 76 చ. 1 (కో. 26, 27, 29, 32, 34).

**కుంచెదరికట్టు** పర్యా. చూ. చెంపకట్టు. కుంచె చెంపకు వేసిన దారపుకట్టు; ఇటువంటివి రెండువేస్తారు. చూ. చిత్రం 76 క. 9 (కో. 29).

**కుంచెదువ్వు** పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి, కుంచెతో పోగులు దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరోవైపునా కుంచె పట్టుకొని ఒకవైపునుంచి మరొకవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (కో. 36; రా. 4, 8).

**కుంచెపట్టు** (క్రి.) **1.** పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరోవైపునా కుంచె పట్టుకొని ఒకవైపునుంచి మరొకవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (కో. 6, 31; తె. 18-20, 24, 25, 29, 31, 32); **2.** పర్యా. కుంచెఇగ్గు(2). అంబలిపెట్టిన ఉన్ని పడుగుమీద కుంచెలాగటం (తె. 11, 20).

**కుంచెపరుపు** ఉ. కుంచిపరువు; పర్యా. చూ. పరువు (1). కుంచె(=పడుగుచేసేది) పురి అడుగుభాగం; కుంచెవేసేటప్పుడు, పడుగుమీద సమంగా అనుతుంది. చూ. చిత్రం 76 క. 11 (రా. 11, 17).

**కుంచెపిడి** ఉ. కుంచిపిడి, కుంచెపిడె; పర్యా. కుంచెపిడికిలి, చేతిపిడి, పిడి(7), బొడ్డు(3), ముట్టికట్టె. పడుగుదువ్వే కుంచె పట్టుకోటానికి, పైన బిగించిన కొయ్య. చూ. చిత్రం 76 క. 1 (కో. 1, 4, 9బి, 23, 26-34, 36, 37; తె. 1, 3-5, 7, 10-18, 22, 25, 26, 29, 31-33).

**కుంచెపిడికిలి** పర్యా. చూ. కుంచెపిడి. పడుగుదువ్వే

కుంచె పట్టుకోటానికి బిగించిన కొయ్య. చూ. చిత్రం 76 క. 1 (తె. 23).

**కుంచెపురి** ఉ. కుంచిపురి; పర్యా. పురి(4). కుంచె కట్టుబడిలో, ఒకరకం గడ్డివేళ్ళతో పొడుగ్గా, బ్రష్షు మాదిరిగా కట్టిన కుచ్చు; అడవిగడ్డి, కాసెగడ్డి, కలప పుల్ల, చీపురుపుల్ల మొ. వాటి వేళ్ళతో పురి కడతారు; నరిచేసేటప్పుడు, పడుగుపోగులు చిక్కులు పడకుండా దీంతో దువ్వుతారు. చూ. చిత్రం 76 క. 10 (కో. 1, 8, 23, 24, 27, 30–34, 36, 37; తె. 4, 7, 8, 20, 21, 25, 27, 29, 31-33; రా. 16).

**కుంచెపురిఎరికలవాళ్ళు** ఉ. -ఎరికలోల్లు. నూలు నరిచేసే కుంచెలు తయారుచేసే ఒక తెగ; ఎరికలవాళ్ళు.

**కుంచెపుల్లలు** కుంచెకట్టటానికివాడే ఒకరకం గడ్డి వేళ్ళు; పురి (తె. 19).

**కుంచెపెట్టు** (క్రి.) ఉ. కుంచెవెట్టు; పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరో వైపునా కుంచెపట్టుకొని ఒకవైపునుంచి మరొకవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (కో. 6, 9; తె. 1-5, 8, 9, 11, 12, 14, 16, 17, 21, 26, 30).

**కుంచెపేము** ఉ. కుంచి-; పర్యా. పేము. కుంచె కట్టుబడిలో, వెన్నుకూ కుంచిపురిమీద పక్కభాగాలకూ అల్లిన (?)మొగలినార; కొన్నిచోట్ల కుట్లుకుడతారు. చూ. చిత్రం 76 క. 6 (కో. 26, 31, 32).

**కుంచెబద్ద** 1. ఉ. ?కుంచ-, కుంచి; పర్యా. చూ. కుంచెలాక. కుంచెకట్టుబడిలో, పురిబిగింపుకు, రెండు పక్కలా వేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల, అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (కో. 23, 27, 28, 29, 31, 34, 36); 2.ఉన్నిపడుగు నరిచేసే కుంచెకు రెండుపక్కలా బిగించిన వెదురుబద్ద(లు); చూ. కురమకుంచె. చూ. చిత్రం 314.12 (తె. 22).

**కుంచెబాడిసె** కుంచెపురి సమంగా నరికే ఇనపపని ముట్టు; బాడిత. చూ. చిత్రం 85 (కో. 35).

**కుంచెబుజం** 1. పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచె పై భాగం; మొగలినారతోగాని, పేముతో గాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (తె. 17); 2. ఉ. కుంచి-. పర్యా.చూ. చెంప(1). కుంచె(=పడుగు దువ్వేది) పక్కభాగం; చేత్తోపట్టుకోటానికి వీలుగా, దీనికి గోనెపట్టాగాని, మేకిచేపతోలుగాని వేసి కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 76 క. 8 (తె. 29, 33; రా. 13).

**కుంచెముల్లు** కుంచెపురికివాడే ఒకరకం గడ్డివేళ్ళు; చూ. పురి (రా. 24).

**కుంచెమూత** పర్యా. చూ. చెంప(1). పడుగుదువ్వే కుంచె పక్కభాగం; చేత్తోపట్టుకోటానికి వీలుగా, దీనికి గోనెపట్టాగాని, మేకిచేపతోలుగాని కుడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 76 క. 8 (కో. 7).

**కుంచెమూల** పర్యా. చూ. చెంప(1). పడుగుదువ్వే కుంచె పక్కభాగం; చేత్తోపట్టుకోటానికి వీలుగా, దీనికి గోనెపట్టాగాని, మేకిచేపతోలుగాని వేసికుడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 76 క. 8 (కో. 3, 4, 6, 10).

**కుంచెమేరువ** పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచె పై భాగం; మొగలినారతోగాని, పేముతో గాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (కో. 33).

**కుంచెరికలవాళ్లు** ఉ. కుంచెరకలోళ్ళు, కుంచెలు కులోల్లు, కుంచెలుకులోళ్ళు. నూలు నరిచేసే కుంచెలు తయారుచేసే ఒక తెగ; ఎరికలవాళ్ళు (కో. 3, 6, 7).

**కుంచెలకట్లవాళ్లు** ఉ. కుంచెలకట్లోళ్ళు. కుంచెలు తయారుచేసేవాళ్ళు; ఎరికలవాళ్ళు (రా. 18).

**కుంచెలకొరిచెవాళ్ళు** ఉ. కుంచిలకొరిసోల్లు. నూలు నరిచేసే కుంచెలు తయారుచేసే ఒక తెగ; ఎరికలవాళ్ళు (రా. 15).

**కుంచెలాక** ఉ. కుంచిలాక; పర్యా. అడ్డబద్ద(1), పత్తిబద్ద(2), కుంచెబద్ద(1), చెంపలాక, పురిబద్ద, బద్ద (5), బిగుబద్ద(1), లాక(3), లాకపచ్చె, లాకబద్ద(3), వెదడుదబ్బ, వెదురుబద్ద, వెదురులాక. కుంచెకట్టుబడిలో, పురిబిగింపుకు, రెండుపక్కలావేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల, అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (కో. 26, 30, 33, 37; తె. 18, 19, 22, 23, 25, 32, 33).

**కుంచెలాగు** (క్రి.) పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి, కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరోవైపునా కుంచె పట్టుకొని ఒకవైపునుంచి మరోవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (కో. 7, 8, 10, 22; రా. 13).

**కుంచెవిడుచు** (క్రి.) పర్యా. చూ. కుంచెవేయు. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరోవైపునా కుంచె పట్టుకొని ఒకవైపునుంచి మరొకవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (రా. 16, 17).

**కుంచెవీపు** ఉ. కుంచీపు, కుంచెఈపు; పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచెపై భాగం; మొగలి నారతోగాని, పేముతోగాని దీన్ని కడతారు. చూ. చిత్రం (కో. 28; తె. 19, 32; రా. 18, 24).

**కుంచెవెన్ను** ఉ. కుంచెఎన్ను, కుంచెన్ను; పర్యా.

చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచెపై భాగం; మొగలినారతోగాని పేముతోగాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (కో. 8; తె. 15 26).

**కుంచెవేయు** (క్రి.) పర్యా. కుంచెఇగ్గు (1), కుంచెఈడ్చు, కుంచెగుంజు, కుంచెతీయు, కుంచెదువ్వు, కుంచెపట్టు(1). కుంచెపెట్టు. కుంచెలాగు, కుంచెవిడుచు. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వటం; మామూలుగా, ఇద్దరు మనుషులు చెరోవైపునా కుంచె పట్టుకొని ఒకవైపునుంచి మరొకవైపుకు ఈడ్చుకొంటూ వెళ్తారు (కో. 4, 8 - 10, 23-26, 32, 34, 35; తె. 12, 13; రా. 1, 7, 19, 21).

**కుట్టు** (-తీయు) పర్యా. చూ. కన్ను. కమ్మినేతలో, అంచానికి పడుగులో దూర్చిన రంగుదారం; సుమారు రెండంగుళాల పొడుగుది; మామూలుగా ఎర్రదారం పెడతారు; కొన్నిచోట్ల, నలుపు తెలుపు దారాలు పెడతారు (రా. 11).

**కుట్టుడుదబ్బ** పర్యా. చూ. చేడుబద్ద(1). దోనె ముందర, నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా పైవైపు బిర్రుపెట్టే కొయ్యబద్ద(లు); ఇటువంటి రెండు బద్దలకు ముళ్ళు బిగించి ఉంటాయి; కొన్నిచోట్ల, దారాలుకట్టి వాటిలో ముళ్ళుదూర్చి మెలిపెడతారు; మామూలుగా, మరమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 124 వ (రా. 12).

**కుట్టుతీయు** (క్రి.) అంచులో వేరే రంగుదారం, వేరే నాడెతో మలిపి డిజైన్లుపడేట్టు నెయ్యటం; కుప్పడంపట్టి నెయ్యటం (కో. 3).

**కుట్టునేత** పర్యా. కుప్పడంనేత. అంచులో వేరే రంగు పేకదారాలుపెట్టి, డిజైన్లు(=పువ్వులు, మొగ్గలు ఆకులు మొ.నవి) పడేట్టునేసేనేత; అంచులకు వేరుగా రెండు నాడెలు, మధ్యభాగానికి మరొక నాడెపెట్టి చేతి మగ్గంమీద నేస్తారు; కొన్నిచోట్ల, జరీపోగులు కలుపుతారు; ఈ నేతకు ఎడమవైపున మరొకమనిషి కూర్చొని అంచుపోగులు మలపాలి; ఇవి రెండు రకాలు(=పూర్తి కుట్టు, అర్ధకుట్టు)గా నేస్తారు(రా. 10, 13-18, 23.24).

**కుట్టుపేటు** పర్యా. చూ. కుప్పడంనేత. అంచులో వేరేరంగు పేకదారాలుపెట్టి, డిజైన్లు(=పువ్వులు, మొగ్గలు, ఆకులు మొ.వి) పడేట్టు నేసేనేత; అంచులకు వేరుగా రెండు నాడెలు, మధ్యభాగానికి మరొక నాడె పెట్టి చేతిమగ్గంమీద నేస్తారు; కొన్నిచోట్ల, జరీపోగులు కలుపుతారు; ఈ నేతకు ఎడమవైపున మరొక మనిషి కూర్చొని అంచుపోగులు మలపాలి; ఇవి రెండు రకాలు (=పూర్తికుట్టు, అర్ధకుట్టు)గా నేస్తారు (కో. 3).

**కుట్టుముల్లు** పర్యా. చూ. చేడుముల్లు. నేతనేసేటప్పుడు గుడ్డను బిర్రుపెట్టటానికి, అంచు చివర గుచ్చే సన్నటి లోహపుముక్క; చివర వాడిగా ఉంటుంది; ఇత్తడి, ఇనుము, రాగి మొ.వాటితో చేస్తారు; కొన్ని చోట్ల ఒలుసుముల్లు; దీన్ని చేడుపలుపుకు మెలిపెడతారు; కొన్నిచోట్ల, చేడుబద్దకు చివర బిగించింది; ఇటు వంటివి రెండువైపులా ఉంటాయి. చూ. చిత్రం 125 క. 6 (తె. 24).

**కుడిఅని** (-లేచు) అచ్చులో, కుడి(ఇవతలి)వైపు పోగులు (రా. 13).

**కుడికొమ్ము** కుడికాలితో పావుదెక్కతొక్కి, కుడి అనిలోకి కుడిచేత్తో ఎడమవైపుకు విసిరిన నాడె(కొమ్ము) (రా. 14).

**కుడికోల** పర్యా. చూ. కిందికోత్తల. అనుపోసిన పడుగులో చివరిఅని పద్దభాగం; కోత్తల (కో. 2).

**కుడితలకొయ్య** ఉ. కుడతలకొయ్య; పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గంమీద, నేతబట్ట చుట్టే కొయ్య (=దోనె)కు ఆధారంగా, ఎడమపక్కన నేలలోపాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండువైపులా రెండుంటాయి; కొన్ని చోట్ల, పడుగుచుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (రా. 4, 6, 9, 19, 19.ఎ, 21).

**కుడితలమాను** పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గం మీద, నేతబట్ట చుట్టేకొయ్య(=దోనె)కు ఆధారంగా, ఎడమపక్కన నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండు వైపులా ఉంటాయి; కొన్నిచోట్ల, పడుగుచుట్టే ఎదురు దోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (రా. 1).

**కుడితి** రంగులు కలుపుకొనే గోలెం (రా. 17).

**కుడితిగూన** ఉ. కుడ్తిగూన. నూలుకండెలు వేసుకొనే ఒకరకం మట్టిపాత్ర (రా. 24).

**కుడితినికొయ్య** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (రా. 10).

**కుడిపలక** మగ్గంపలకకు, జైనెకు ఇవతలి వరకూ నేసిన నేత (కో. 5).

**కుడివాటు** మగ్గానికి కుడివైపు (కో. 34).

**కుడివాదాడి** మగ్గంచట్రంకింద, కుడివైపు పల్లపు చోటు; దీంట్లో కండెఊచలు వేసుకొంటారు (రా. 22).

**కుడివాయి** మగ్గానికి బిగించిన అచ్చుకర్రల్లో ముందుది (కో. 23).

**కుడుతుడుకొయ్య** ఉ. -గొయ్య; పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గంమీద, నేతబట్ట చుట్టేకొయ్య (= దోనె)కు ఆధారంగా, ఎడమపక్కన నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండువైపులా రెండుంటాయి; కొన్ని చోట్ల పడుగుచుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (కో. 4; రా. 20).

**కుంటికొయ్య** ఉ. కుంటుకొయ్య; రూ. కుంటెన కొయ్య; పర్యా. చూ. కొలతకొయ్య. ఆసు పోడుగు పీటకు బిగించిన కొయ్య; ఇవి నాలుగుంటాయి; పడుగు ఎక్కువ కావటానికి వీటికి చుట్టి ఆసుపోస్తారు. చూ. చిత్రం 45 ట 2-5 (కో. 28, 30).

**కుంటిన** (-అతుకు). చీర అంచుల్లో, నూలుపోగులకు అతికిన జరీపోగులు; చీరకట్టుకొన్నప్పుడు, పాదాల మీదికి వచ్చే అంచు(కట్టుఅంచు)కు జరీపోగులు కొద్దిగా అతుకుతారు; పైటఅంచుకు ఎక్కువగా అతుకుతారు (రా. 8).

**కుంటిపుల్ల** ఆసుపోసేటప్పుడు పోగు సాపుగా రావటానికి దుక్కగొట్టంలో నిలబెట్టినపుల్ల; దీనికి బిగించిన ఊచమీదినించి పోగువస్తుంది. చూ. చిత్రం 49.3 (కో. 34).

**కుంటిపుల్లదుక్క** కుంటిపుల్లకింది మొద్దు. చూ. చిత్రం 49 క. (కో. 34).

**కుంటువిసురు** (క్రి.)ఆసులో కొలతకొయ్యను పోగు చుట్టివచ్చేట్టు ఆసుగొట్టం తిప్పటం (కో. 28).

**కుంటెనకొయ్య** చూ. కుంటికొయ్య (తె. 33).

**కుంటెనపీట** పర్యా. చూ. కచ్చిపీట. ఆసుపీటల్లో మధ్యది; దీనికి బిగించిన కొయ్యలకు అనులుపడతాయి. చూ. చిత్రం 45 క. 2 (తె. 33).

**కుండ 1.** పర్యా. కడవ(1). ఒకరకం మట్టిపాత్ర; మామూలుగా, పొయ్యిమీద ఎసరుపెట్టటానికీ, గంజి పోసుకోటానికీ వాడేది (కో. 3, 7-9, 13, 14, 17; తె. 1, 11, 14, 15, 17, 20, 24, 26-29, 33; రా. 11-13, 15-18, 21); **2.** నూలులడీలు నానబెట్టే మట్టితొట్టె (తె. 16); **3.** పర్యా. కడవ(3). మట్టి పాత్ర; దీంట్లోకి నీళ్ళు తోడుకొంటారు (కో. 13); **4.** పర్యా. చూ. దిండు(7). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు; బోట్లపింజెర దిండుకు బొడిపెలు, తొల్లపింజెర దిండుకు గాళ్ళూ ఉంటాయి; గొలుసు పింజెర దిండుకు ఇవి ఉండవు; కొన్నిచోట్ల, దీనికి చివర ఇనపఊచల చెక్రంగాని, రేకువళ్ళ చెక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (కో. 7).

**కుండకొయ్య** పర్యా. చూ. బొడ్డుగొయ్య. పట్టు మగ్గం దోనెను ఎడమవైపున మోసే కొయ్యగూటం; నేలలో పాతినది. చూ. చిత్రం 123 క. 5 (తె. 12).

**కుండకోతి** మరమగ్గం దోనెను మోసే కొయ్య గూటం; ఇటువంటివి రెండుంటాయి; చూ. దండెచెవి. (తె. 7).

**కుండతలకాయ** పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గంమీద, నేతబట్ట చుట్టేకొయ్య(= దోనె)కు ఆధారంగా ఎడమపక్కన నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండువైపులా రెండుంటాయి; కొన్నిచోట్ల, పడుగు చుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతినగూటం. చూ. చిత్రం 123 క. 5 (కో. 6, 8).

**కుండీ** పెద్దతొట్టి; దీంట్లో నీళ్ళుపోస్తారు (కో. 26).

**కుత్త** (< హిం. కుత్తా) పర్యా. చూ. కుక్క(2). డాబీ కోలలను లేపటానికి, దిండుచెక్రాన్ని, కొన్ని చోట్ల దిండుగాడిని, గుంజే ఇనపరేకు; దీనికి ఒకవైపున పేటుతాళ్ళు కడతారు; పావుచెక్క తొక్కినప్పుడు, వళ్ళ చెక్రాన్నిగాని, దిండు ఊచలచెక్రాన్నిగాని గుంజుతూ పైకీ కిందికీ ఆడుతుంది. చూ. చిత్రాలు 132 క. 3, 132 చ. 7, 122 ట. 3 (తె. 13).

**కుత్తతాడు** పర్యా. చూ. కుక్కతాడు. డాబీ చెక్రాన్ని గుంజే రేకుకు వేలాడదీసిన దారం; మగ్గం గుంటలోపావుచెక్కకుగాని, పైన అచ్చుకర్రకుగాని కట్టి ఉంటుంది; పావుచెక్క తొక్కినప్పుడు, కుక్కను వెనక్కు గుంజుతుంది; మామూలుగా ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 132 క. 4 (తె. 13).

**కుత్తికాలు** పర్యా. చూ. సట్టరుగుంజ(1). మర మగ్గంచట్రం నిలబెట్టటానికి ఆధారంగా, నేతబయలులో పాతిన కొయ్యరాట; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల, రెండు. చూ. చిత్రం 116.2 (కో. 1).

**కుదప** పర్యా. చూ. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 36).

**కుదురు** ఉన్నిదారం (కూర్చొని) వడికేటప్పుడు, బోకికి ఆధారంగా పెట్టిన మట్టు; చుట్టకుదురు (తె. 26).

**కుంది 1.** పర్యా. చూ. దిండు(3). డబ్బారాట్నం చెక్రం ఆకుల బిగింపుకు అమర్చినకొయ్య. చూ. చిత్రం 41 ట. 1 (కో. 19); **2.** పట్టుదారం చుట్టేటప్పుడు, పంటెకొన మోపటానికి పెట్టే మట్టు. చూ. చిత్రం 26 (కో. 23).

**కుపణం** చూ. కుప్పడం (తె. 12).

**కుపనం** చూ. కుప్పడం (తె. 5).

**కుపినికోరా** ఉ. -కోర. గచ్చకాయపన్నెలో ఉండే ముడిపట్టు (తె. 12).

**కుప్పటపంచు** చూ. కుప్పడమంచు (కో. 8).

**కుప్పడం** రూ. కుకణం, కుపణం, కుపనం. అంచుకు పేకరంగు కలవకుండా, వేరేరంగు నూలుపెట్టి రెండు నాడెలతో పోగులు మలుపుతూ చేత్తోనేసిన బట్ట; రకరకాల డిజైన్లు నేస్తారు (తె. 15).

**కుప్పడమంచు** రూ. కుప్పటపంచు, కుప్పణమంచు. బట్టచివర వేరేరంగు దారంపెట్టి రెండు నాడెలతో పోగులు మలుపుతూ చేతిమగ్గంమీద నేసిన అంచు; మామూలుగా చీరలకు, పంచెలకు పెట్టి నేస్తారు (కో. 34, 36, 37; తె. 31, 32).

**కుప్పడంచీర 1.** ఉ. -సీర; రూ. కుప్పణంచీర; పర్యా. మలుపుకుచీర. అంచుకు పేకరంగుపోగు కలవకుండా వేరేరంగు నూలుపెట్టి, రెండునాడెలతో పోగులు మలుపుతూ నేసిన చీర; ఇలా రకరకాల డిజైన్లు నేస్తారు (కో. 8, 33, 36, 37; తె. 31, 32); **2.** ? అంచుకు ఏరంగు ఉంటే పేకకు అదే రంగుపెట్టి నేసిన చీర (కో. 34).

**కుప్పడంచెట్లకమ్మి** కమ్మినేతకు వేరే రంగుపోగులు పెట్టి, చెట్లఆకారాల్లో డిజైన్లు పడేటట్టు చేత్తో పోగులు మలుపుతూ నేసిన కమ్మి (తె. 13).

**కుప్పడం(నేత)** ఉ. కుప్పటం; రూ. కుప్పణంనేత; పర్యా. అంచగుప్పినేత, అంచుమలుపునేత, కుట్టునేత, కుట్టుపేటు, కుప్పడంపని, మూడునాడెలనేత. అంచుల్లో వేరేరంగు పేకదారాలుపెట్టి, డిజైన్లు (పువ్వులు, మొగ్గలు, ఆకులు మొ.వి) పడేట్టు నేసేనేత; అంచుకు వేరుగా రెండునాడెలు, మధ్యభాగానికి మరొకనాడె పెట్టి చేతిమగ్గంమీద నేస్తారు; కొన్నిచోట్ల జరిపోగులు కలుపుతారు; ఈ నేతకు, ఎడమవైపున మరొక మనిషి కూర్చొని అంచుపోగులు మలపాలి (కో. 6, 9, 13, 14, 16, 19, 33, 34; తె. 13, 15, 16, 32).

**కుప్పడంపని** పర్యా. చూ. కుప్పడంనేత. అంచులో వేరేరంగు పేకదారాలుపెట్టి, డిజైన్లు (పువ్వులు, మొగ్గలు, ఆకులు మొ.నవి) పడేట్టు నేసేనేత; అంచులకు వేరుగా రెండునాడెలు మధ్యభాగానికి మరొకనాడె పెట్టి చేతిమగ్గంమీద నేస్తారు; కొన్నిచోట్ల, జరిపోగులు కలుపుతారు; ఈ నేతకు, ఎడమవైపున మరొక మనిషి కూర్చొని అంచుపోగులు మలపాలి (కో. 12).

**కుప్పడంవజా** ఉ. -వజ; చూ. వజాకుప్పడం (కో. 34, 37).

**కుప్పణమంచు** ఉ. కుపనంఅంచు, కుపునమంచు, కుప్పనంఅంచు; చూ.కుప్పడమంచు (తె. 7,12,17,21).

**కుప్పణంచీర** ఉ. కుపునం–; చూ. కుప్పడంచీర (తె. 7, 12, 17, 21).

**కుప్పణంనాడె** ఉ. కుపణం–. అంచునేతలో, వేరే రంగుపోగులుపెట్టి, కుప్పడంనేత నెయ్యటానికి ప్రత్యేకంగావాడే కొమ్ముగ్గనాడె; చేతినాడెకంటె చిన్నది, సన్నటిది. చూ. చిత్రం 131 ట (తె. 11).

**కుప్పణంనేత** ఉ. కుపణంనేత, కుపనంనేత, కుప్పంనేత; చూ. కుప్పడం (తె. 5, 7, 12, 17, 21)

**కుప్పణంపట్టు** (క్రి.) ఉ. కుపనం–. అంచుల్లో వేరే రంగుదారం వేరే నాడెతో మలిపి డిజైన్లు పడేట్టు నెయ్యటం; కుప్పడంనేత నెయ్యటం (తె. 5).

**కుప్పి** పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడెమొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల, ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (రా. 13, 17).

**కుంపటి** పర్యా. కరురుకుంపటి. పెద్ద కుండపెంకు; ఉన్నిదారం (కూర్చొని) వడికేటప్పుడు, కుదురు దీనిమీద పెట్టి తిప్పుతారు; చూ. బోకి. చూ. చిత్రం 303.3 (తె. 6, 7).

**కుంభం** ఉ. కుంబం; పర్యా. చూ. బిందు(1). రాట్నం రెండుచెక్రాలనూ (ఆకులు) వేరుచేసేకొయ్య; ఇరుసు దీని మధ్యన ఉంటుంది. చూ. చిత్రం 15.8 (రా. 24).

**కుంభంపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను (కో. 20).

**కుయ్యనెత్తు** (క్రి.) అచ్చుకట్టేటప్పుడు, కింది వడిదారాలు, పై వడిదారాలతో అంకెపడేటట్టు పైకి తియ్యటం (తె. 16).

**కురమ(లు)** ఉ. ?కురుమ; రూ.కురవ(2). ఉన్నితో గొంగళ్ళు నేసే ఒకతెగ (తె. 3, 6, 7, 9–11, 20, 22, 25–28).

**కురమకుంచె** (–పెట్టు). ఉ. కుర్మకుంచె; పర్యా. కుంచె(2), పనికుంచె(2). అంబలిపెట్టిన ఉన్నిపడుగును దువ్వే కుంచె; గొంగళ్ళునేసే కురమవాళ్ళది; పడెగడ్డి వేళ్ళు (పుర) కూర్చి కట్టినది; దీనికి పిడి ఉండదు. చూ. చిత్రం 314.12 (తె. 26–28).

**కురమమగ్గం** ఉ. కురమ్మగ్గం. ఉన్నిగొంగళ్ళునేసే మగ్గం; కురమలు – గొర్రెలుకాసే ఒక తెగవాళ్ళు-నేస్తారు. చూ. చిత్రం 315 (తె. 10).

**కురవ** ఉ. కుర్వ. **1.** కొండప్రాంతం; మెట్టప్రదేశం; **2.** చూ. కురమ; కొండపాంతంలో గొర్రెలను పెంచుకొంటూ ఉన్న కురమలు, రానురాను పల్లపు ప్రాంతాలకు వచ్చారట (తె. 3, 4, 28).

**కురిబిళ్ళ** ఉ. కురిబిల్లు. చిన్న అచ్చుబిళ్ళ; దీంతో అచ్చుకడితే వడి కురచగా వస్తుంది; చూ. అచ్చుబిళ్ళ (రా. 20).

**కురివిని** నేతపనివాళ్ళలో ఒక తెగ (రా. 16).

**కురుబల్ల** పర్యా. చూ. చిట్టె(2). పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రం 19 క. 3, 19 క. 4 (కో. 32).

**కురుబిళ్ళ** పర్యా. చూ. చిట్టె(2). పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రాలు 19 క. 3, 19 క. 4 (కో. 36).

**కుర్చీపట్టా** పడక కుర్చీలకు వాడే దళసరిగుడ్డ; పది గిరల వెడల్పు, ఒకటిన్నర గజం పొడుగూ ఉంటుంది (తె. 1).

**కుర్ని సెట్టి** ఉ. కుర్నిచెట్టి. నేతపనిచేసే దేవాంగుల్లో పెట్టుబడిదారు (తె. 7).

**కులభట్రాజులు** ఉ. -బట్రాజులు. తొగటవారి దగ్గర అడుక్కొనేవాళ్ళు (రా. 11).

**కుసుము** (క్రి.) నూలుతడిపి (రంగు అద్దిన తరవాత, నీళ్ళలో) జాడించటం (రా. 19).

**కుసెంగా** (క్రి. విశ.) బాగా (రా. 10).

**కూకంగీతలచీర** రెండు పోగులు తెలుపు, మూడు పోగులు నలుపు చొప్పున వరసగా పెట్టి నేసిన చీర; పూర్వం నేస్తూ ఉండేవారట (తె. 29).

**కూకుడుగుండు** పర్యా. చూ. సవలతుగుండు. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ, కిందికి జారకుండా దారంకట్టి, దండె అవతలకు వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చిన్న చెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (తె. 16, 17).

**కూజాపేటు** ? అంచులో కూజాఆకారం పడేట్టు నేసిన డిజైను (కో. 16, 20).

**కూటిగంజి** పర్యా. సరికూటిగంజి. అన్నంవండి, వార్చిన గంజి; దీంతో పడుగు తడుపుతారు (కో. 7).

**కూటి** 1. ? డాబీ దిండుకు చేసినగాడి; దిండు తిరిగి నప్పుడు, ఇవి కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 ట. 2 (తె. 22); 2. ఉ. కూటి. చూ. పూటీ (తె. 8).

**కూటీకోల** ఉ. కూటి-; పర్యా. చూ. గొలుసుబద్ద. డాబీ గొలుసుకు అడ్డంగా బిగించి ఉన్న సన్నబద్ద(లు); వీటికి కొయ్యముక్కలు బిగిస్తారు; ఇవి దిండునుచుట్టి తిరుగుతూ ఉంటాయి. చూ. చిత్రం 132 త. 2(తె. 8).

**కూటీలడ్డ** తొల్లపింజెరమధ్య అమర్చిన కొయ్య గుండు; దీనికి అక్కడక్కడ గాళ్ళుచేసి ఉంటాయి. చూ. చిత్రం 132 ట. 1 (తె. 22).

**కూడబెట్టు** (క్రి.) కూర్చటం; పట్టుదారం పోగులు కొన్ని కలిపి, సిల్కుపంటెకు చుడతారు (కో. 23).

**కూడిపోయు** (క్రి.) చిన్నకదుర్లకు చుట్టిన ఉన్ని పోగులు కలిపి, పెద్దకదురు(=అయికదురు)కు చుట్టటం (తె. 27).

**కూనపులివాళ్లు** ఉ. కూనపులివాండ్లు, కూనపులోల్లు. పద్మసాలీల దగ్గర కథలుచెప్పి అడుక్కునేవాళ్ళు; పద్మసాలీలలో ఒకశాఖ; మార్కండేయ పురాణంకథ చెబుతారు; భావనారుషి, భద్రావతిని పెళ్ళిచేసుకోటానికి వెళ్ళినప్పుడు, తన వెంట వచ్చిన పులికూనలకు కావలిగా, రొమ్ముమీది మన్ను నలిపి సృష్టించిన కూనపులివాడి వంశం వాళ్ళమని చెబుతారు (తె. 4; రా. 23, 24).

**కూనలమ్మచీర** ఉ. కూనాలమ్మచీరె. ఒకరకం గళ్ళ చీర: **1.** వరసగా ఎనిమిది పోగులు ఎరుపు. ఒక పోగు పసుపు, ఎనిమిది పోగులు ఎరుపు, నాలుగు పోగులు పసుపూ రంగులుపెట్టి రిబ్బనంచుగాని, బలపాలంచుగాని పెట్టి నేసిన చీర (కో. 7); **2.** నల్చదరంగడి, చిటికెన వేలెడు ఎడంగా ఎర్రకొలికీ నీలికొలికీ పడేట్టు నేసిన చీర; గడికీ గడికీ మధ్య(=రెండు రంగుపోగుల మధ్య) తెల్లపోగు పడుతుంది (తె. 13); **3.** తెలుపులో బొటన వేలెడు వెడల్పునేసి, రెండు కొలుకులు నలుపుపెట్టి నేసిన చీర (తె. 15); **4.** ఎరుపు, నీలి కలిసిన చిన్నగడి చీర. చూ. చిత్రం 274 (కో. 14); **5.** గొల్లవాళ్ళు కట్టే ఒకరకం వన్నెచీర; అమ్మవార్ల మొక్కుబళ్ళకూ, చనిపోయిన పెద్దల పేర్లమీద పెట్టుబళ్ళకూ వాడతారు (రా. 10, 20).

**కూరాటికలి** పర్యా. చూ. కలి. పులవబెట్టినగంజి తేట, బియ్యపుకడుగునీళ్ళు; పడుగుపెట్టేగంజి కాచటానికి ఈ నీళ్ళతో ఎసరుపెడతారు (తె. 21).

**కూరాటికుండ** రూ. కూరాడుకుండ; పర్యా. కూరాడు. గంజి, బియ్యం కడుగునీళ్ళు పులవబెట్టేకుండ (తె. 13, 14, 17).

**కూరాడు** 1. పర్యా. కూరాటికుండ గంజి, బియ్యం కడుగు నీళ్ళు పులవబెట్టే కుండ (తె. 11, 12); 2. పర్యా. చూ. కలి. పులవబెట్టిన గంజితేట; బియ్యపు కడుగు నీళ్ళు పడుగుకుపెట్టే గంజికాచటానికి ఈనీళ్ళతో ఎసరుపెడతారు (తె. 5, 25, 27).

**కూరాడుకుండ** చూ. కూరాటికుండ (తె. 12).

**కూర్వు** (క్రి.) కూర్చు; రెండుమూడు పట్టుపోగులు కలిపి వడిపెట్టటం (తె. 5).

**కూలిపడుగు(లు)** కూలికి నేసిన పడుగు(బట్ట); పత్తి పండించే రైతులు నూలు వడికించుకొని, పడుగులు తెచ్చి, కూలికి బట్టలు నేయించుకొంటారు (తె. 16).

**కెంపు** ఉ. కెంపు. 1. ఒకరకం (ముదురు) ఎరుపు రంగు; కొంచెం నలుపువన్నె కలిసింది. చూ. చిత్రం 288 (కో. 1-3, 6-11, 14, 16, 18, 21, 24, 26, 33, 36, 37; తె. 11-17, 32; రా. 1, 6-8, 10-12, 19 20, 23); 2. తోపురంగు. చూ. చిత్రం 288 (కో. 12, 13, 15).

**కేతరి** ఉ. క్రేతి; పర్యా. బనారస్(2). ఒకరకం కృత్రిమపు పట్టు; అంచులు, కమ్ములు, డిజైన్లు నెయ్య టానికి వాడతారు; చూ. కేతి(రి). (తె. 4).

**కేతరికొలుకులు** పర్యా. ముత్యం(పేటు). జరీతో గాని, కృత్రిమపు పట్టుతోగాని వరసగా 2-6 పోగులతో నేసిన డిజైను; కొన్నిచోట్ల, జంటగీరలు, కొన్నిచోట్ల చదరంగాను నేస్తారు (తె. 4, 17).

**కేతిగాడు** పర్యా. చూ. కుక్క(2). డాబీకోలలను లేపటానికి దిండుచెక్రాన్ని, కొన్నిచోట్ల దిండుగాడిని, గుంజే ఇనపరేకు; దీనికిఒకవైపున పేటుతాళ్ళు కడతారు; పావుచెక్క తొక్కినప్పుడు పళ్ళచెక్రాన్నిగాని, దిండు ఊచల చెక్రాన్నిగాని గుంజుతూ కిందికీ పైకీ ఆడు తుంది. చూ. చిత్రాలు 132 క. 3, 132 చ. 7, 132 ట. 3 (రా. 16).

**కేతి(రి)** ఉ. క్రేతి, కేతిరి. ఒకరకం కృత్రిమపుపట్టు; నారనూలు; చెట్లపట్టలతో తయారు చేస్తారు; దీన్నే కొన్నిచోట్ల, బాణా(సిల్కు)అనీ, స్టైబల్ అనీ అంటారు; అంచుల నేతకు వాడతారు; చూ. కేతరి. (తె. 10, 13, 19, 25, 31, 32)

**కొత్తంచు** చిగురువదిలి, జరీపెట్టి నేసిన అంచు (కో. 24).

**కేదగిబెండు** పర్యా. చూ. మొగలినార. మొగలి చెట్టు (?)ఊడలనుంచి తీసిననార; కుంచె కట్టుబడిలో, వెన్నుభాగంలోనూ పురికి పైభాగంలోనూ దీంతో గట్టిగా కుట్లువేస్తారు (రా. 24).

**కేదగి(వన్నె)** 1. కేసరిరంగు మాదిరి, ఒకరకం పసుపురంగు (రా. 16); 2. మొగలిరంగు (రా. 17); 3. బీరపువ్వురంగు; నింబావళికంటె తక్కువ వన్నె (రా. 24).

**కేదారేశ్వరవ్రతం** కార్తికపౌర్ణమినాడుచేసేవ్రతం; తొడుగునోము(లు); కేదారేశ్వరుడి పూజచేసి కథ చెప్పు కొంటారు (కో. 25, 26, 33, 34).

**కేసరి(వన్నె)** 1. ఎరుపురంగు (రా. 16); 2. ఆరంజి రంగు (రా. 24); 3. పసుపులో ఎరుపువన్నె (తె. 29).

**కైకాలబత్తులు** చేనేతపని చేసేవాళ్ళలో ఒక తెగ; కరికాలబత్తులు; కరికాలవాళ్ళు (కో. 18).

**కైకాలవాళ్లు** చేనేతపనిచేసేవాళ్లలో ఒకతెగ(రా.8).

**కైపట్టు** చేత్తో పట్టుకొనే అనిపోగులు; కోత్తల (రా. 16).

**కైరు** చిన్నఉరువు జోడి (తె. 12).

**కైరుబేలు** చిన్నమొగ్గలు వరసగా పడేట్టు నేసిన డిజైను (తె. 12).

**కైల** (బహు. కైళ్ళు) ఉ. కయల; రూ. కవెల; పర్యా. కైజను. తురకలు కట్టుకోటానికి నేసిన ఒకరకం గళ్ళలుంగీ; పది, ఇరవై నెంబర్ల నూలుతో, రెండు మూడు ప్రాతిక గజం పొడుగు నేస్తారు (కో. 1, 2).

**కైలుమగ్గం** ఒకరకం చేతిమగ్గం; నేతలో, రెండు మూడు రంగులు రావటానికి వేరువేరు నాడెలుపెట్టి నేసేది (రా. 13).

**కైవారంకట్టు** పంటెతలచిట్టెలకు పైవైపున ఆకులను కలిపి తాడుతో వేసినకట్టు; చూ. తలకట్టుతాడు(కో.8).

**కొక్కి** 1. పర్యా. చూ. ఒగ్గి. మరాసుమీద పడుగు తోడేటప్పుడు, అనులుపడేట్టు పోగును జరపటానికి, ఒక కొయ్యపట్టెకు బిగించిన రేకుముక్క; సుమారు మూడం గుళాల పొడుగుది; దీని బెజ్జంలోనుంచి తీసిన పోగు మరాసుకు చుట్టుకొంటుంది; మరాసు తిరిగినప్పుడు, కీలు ఆడుతూ, కొయ్యపట్టె జరిగి దానికి బిగించిన రేకు ముక్క పోగునుగూడా జరుపుతుంది; ఇలా జరగటంలో అని పడుతుంది; ఇటువంటివి, పట్టెపొడునా వరసగా, కొన్నిచోట్ల 40 ఉంటాయి. చూ. చిత్రం 50.14 (రా. 2, 7); 2. పర్యా. చూ. కుక్క(2). డాబీకోలలను లేపటానికి, దిండుచెక్రాన్ని, కొన్నిచోట్ల దిండు గాడిని, గుంజే ఇనపరేకు; దీనికి ఒకవైపున పేటుతాళ్ళు కడతారు; పావుచెక్క తొక్కినప్పుడు, పళ్ళచెక్రాన్నిగాని. దిండుఊచలచెక్రాన్నిగాని గుంజుతూ కిందికీ, పైకీ ఆడుతుంది. చూ. చిత్రాలు 132 క. 3, 132 చ. 7, 132 ట. 3 (రా. 11, 15, 18).

**కొక్కిమాను** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాసు కట్టుబడిలో పడుగుదూర్చే బెజ్జాలుగల రేకుముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాసు తిరిగి నప్పుడు, కీలు ఆడుతూ దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతుంది. చూ. చిత్రం 50.11 (రా. 2).

**కొక్కు** 1. పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 15.2 (తె. 5); 2. పట్టుదారం వడకటానికి, పెద్దరాట్నానికి దగ్గరగా, గాజులపట్టెను, కదుర్లపీటను అమర్చే అడ్డపట్టెకు ఆధారంగా నేలలో పాతిన నిలువుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 293 చ. 16 (తె. 5).

**కొక్కుగుంజ** పర్యా. చూ. దండెచెవి(1). దండెను

మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల రాయి; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 4).

**కొక్కెం 1.** పర్యా. చూ. కొండి(4). పడుగేరు కర్రకు కలిగించే ఇనప(గొలుసు)కొక్కెం. చూ. చిత్రం 70.1 (కో. 7, 8); **2.** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ; దీన్ని మామూలుగా. మగ్గం పై దండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండికూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (కో. 23); **3.** పర్యా. చూ. కొండి(7). చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి, పలక సూత్రం చివర వేసిన వంకర ఊచ; ఇనపది; కొన్ని చోట్ల, దీన్ని మగ్గం పై తాడుకువేసి, పలకసూత్రం దూరుస్తారు. చూ. చిత్రం 109 త. 1 (కో. 9); **4.** వజానేతకోసం అమర్చిన దొడ్డిలో, నడిమిజల్లినించి కిందికి వేలాడే లావుదారానికి చివర, కన్నాలబల్లకింద తగిలించిన కొండి; నేతనేసేటప్పుడు, దీన్నిపట్టుకొని దారం కిందికిగుంజి, టిక్కబల్లగాడిలో దూరుస్తారు; ఇటు వంటివి దారానికి ఒకటి చొప్పున వరసగా ఉంటాయి. చూ. చిత్రం 134 చ. 9 (కో. 33, 34, 73).

**కొక్కెలతాళ్ళు** వజానేతకోసం అమర్చిన దొడ్డిలో, తెరచివ్వ దగ్గరనించి కిందికి వేలాడే లావుదారాలు; వీటికిచివర, కన్నాలబల్లకింద కొక్కెలు ఉంటాయి; నేత నేసేటప్పుడు, కొక్కెలు పట్టుకొని వీటిని కిందికి గుంజి, టిక్కబల్ల గాళ్ళలో దూర్చి ఉంచుతారు. చూ. చిత్రం 134 చ. 7 (కో. 34, 37).

**కొక్కెలదొడ్డి** అంచుల్లో డిజైన్లుపడే వజానేతకోసం మగ్గానికి పైన అమర్చిన చట్టం; దీంట్లోకి దూర్చిన కుచ్చుదారాలకు చివర కొక్కెలు ఉంటాయి. చూ. చిత్రం 134 క. 1 (కో. 33).

**కొక్కెలబల్ల** పర్యా. చూ. టిక్కబల్ల. వజానేత కోసం అమర్చిన దొడ్డిలో కిందికి గుంజిన కుచ్చుతాళ్ళు తగిలించటానికి గాళ్ళు చేసిన చెక్క. చూ. చిత్రం 134 చ. 10 (కో. 33).

**కొంకరికట్టె** చూ. కొంకిడికట్టె (తె. 6, 8).

**కొంకి 1.** ఉ. కొంక; పర్యా. కొంకికట్టె, కొంకి కర్ర, కొంకిడి(1), కొంకిడికట్టె, కొండి(కట్టె), కొమ్ము (1), గొడికట్టె, వంకెం. ఊడ్తైతాడు తగిలించి బిర్రు పెట్టే పంగలకొయ్య; కొన్నిచోట్ల దుప్పికొమ్ము వాడ తారు. చూ. చిత్రం 63 క. 6 (కో. 2, 4, 7, 8. 14, 18; తె. 12, 17, 21, 22, 24-31, 33); **2.** పర్యా. చూ. కొండి(4). పడుగేరుకర్రకు తగిలించే ఇనప (గొలుసు) కొక్కెం. చూ. చిత్రం 70.1 (కో. 2, 9బి); **3.** పర్యా. దోటి. నరిచేయటానికి ఉన్నిపడుగు చాపి నప్పుడు నరితాడు బిగింపుకు వేసిన వంకరకట్టె; తాడు దీనికి తగిలించి నరిగూటానికి చుట్టి గుంజుతారు (తె. 28); **4.** పర్యా. చూ. నాగపాసెం. నేతమోకుచుట్టే ఒకరకం చేతిగూటానికి బిగించిన ఇనపఊచ; కొన్ని చోట్ల రేకు; మోకుచుట్టిన తరవాత, దీన్ని చెర్కంవళ్ళ సందులోకి జరుపుతారు. చూ. చిత్రం 122 ట. 2 (రా. 1); **5.** పర్యా. చూ. నాగలి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు, పేటు అడపోగులు ఎత్తిపట్టుకొనే కొయ్యపనిముట్టు; నాగలిఆకారంలో ఉంటుంది; దీన్ని మగ్గానికి పైనుంచి వేలాడదీస్తారు. చూ. చిత్రాలు 111 చ. 2, 136 త (తె. 21); **6.** పర్యా. చూ. కొండి (6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనప ఊచ; దీన్ని మామూలుగా మగ్గంపై దండెకు వేలాడదీస్తారు; కొన్ని చోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుం టాయి; కొన్నిచోట్ల, గిరక, కొండికూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (కో. 10).

**కొంకికట్టు** ఊడ్తైనిలబెట్ట టానికి బిగించే తాడు; చూ. ఊడ్తైతాడు (రా. 16).

**కొంకికట్టె** ఉ. కొంక-, కొంకకట్టె, కొణ్కి-; పర్యా. చూ. కొంకి(1). ఊడ్తైతాడు తగిలించి బిర్రుపెట్టే పంగలకొయ్య; కొన్నిచోట్ల, దుప్పికొమ్ము వాడతారు. చూ. చిత్రం 63 క. 6 (తె. 1, 2, 4, 5, 11, 12; రా. 15, 22, 24).

**కొంకికట్టెతాడు** పర్యా. చూ. ఊడ్తైతాడు(1). ఊడ్తైను నిలబెట్టి, కిందిగూటానికి బిగించేతాడు; ఇటు వంటివి, మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (తె. 5).

**కొంకికర్ర** పర్యా. చూ. కొంకి(1). ఊడ్తైతాడు తగిలించి, బిర్రుపెట్టే పంగలకొయ్య; కొన్నిచోట్ల, దుప్పికొమ్ము వాడతారు. చూ. చిత్రం 63 క. 6 (కో. 13; తె. 10).

**కొంకిడి 1.** పర్యా. చూ. కొంకి(1). ఊడ్తైతాడు తగిలించి, బిర్రుపెట్టే పంగలకొయ్య; కొన్నిచోట్ల, దుప్పికొమ్ము వాడతారు. చూ. చిత్రం 63 క. 6 (తె. 9, 22); **2.** పర్యా. చూ. దోటి(కట్టె). ఉన్ని మగ్గంచివర వేసిన వంకరకర్ర; దీన్ని తాడుతో కలిపి గూటానికి బిగిస్తారు. చూ. చిత్రం 315 క. 17 (తె. 22).

**కొంకిడికట్టె** రూ. కొంకరికట్టె; పర్యా. చూ. కొంకి(1). ఊడ్తైతాడు తగిలించి, బిర్రుపెట్టే పంగల కొయ్య; కొన్నిచోట్ల, దుప్పికొమ్ము వాడతారు. చూ. చిత్రం 63 క. 6 (తె. 19, 20).

**కొంగతుకు** (క్రి.) చీరకొంగునేతలో రావలసిన రంగుపోగులు పడుగులో కలుపుకోటం (రా. 14).

**కొంగు** 1. పర్యా. చూ. పైటచెరగు. చీరకట్టుకొన్నప్పుడు, భుజంమీద వేలాడేట్టు వేసుకొనే చెరగు; చీరచివరి మూరెడు భాగం; మామూలుగా, ఇది మొట్టమొదట నేస్తారు (కో. 10); 2. పర్యా. చూ. చెరగు. చీర చివరిభాగం; మామూలుగా, జడ్డేనేసిన తరవాత, జేనెడు బెత్తెడు నుంచి మూరెడుపొడుగు వరకూ (కమ్మి, డిజైన్లు మొ.వి) నేస్తారు; ఇటువంటివి రెండు (పైటచెరగు, కట్టుచెరగు) ఉంటాయి (కో. 1, 5, 9, 10; తె. 2, 5, 6, 13, 17, 18, 23, 31; రా. 14, 16).

**కొంగుచీర** చెరగుకు వేరే రంగుపెట్టిన చీర (తె. 31).

**కొంగుతొడుపు** (క్రి.) చీరకొంగు నేసేటప్పుడు డిజైనుకోసం రంగుపోగులు మెలిపెట్టి పడుగులో అక్కడక్కడ దూర్చటం (రా. 14).

**కొంగునేత** పర్యా. చెరగునేత. చీరమొదటగాని, చివరగాని మూరెడుపొడుగున నేసిన నేత (రా. 16).

**కొంగుపూలపీతాంబరం** కొంగులో డిజైన్లు నేసిన పట్టుబట్ట; దీన్నే గులాల్‌పీతాంబరం అనీ అంటారు (తె. 5).

**కొంగుపూలు** చీరకొంగులో నేసిన డిజైను పువ్వులు (కో. 9).

**కొంగుసేడు** పర్యా. చూపు(నేత). బట్ట ముందరి భాగంలో మూరెడుపొడుగు నేసిన నేత; మొదటనేత; చిక్కగా నేస్తారు (తె. 11).

**కొట్టిడిచీర** ఒకరకం గళ్ళచీర (రా. 7).

**కొట్టిడినేత** ఉ. కొట్టడి-. ఒకరకం గడినేత (రా. 7).

**కొట్లెం** నారపడుగు నలగగొట్టే కొయ్యగూటం. చూ. చిత్రం 303 (తె. 25).

**కొడత** పర్యా. గట్టం. గూటం; చేత్తో డిజైన్లు అద్దేటప్పుడు, బట్టకు నునుపురావటానికి, ఒక కొయ్యదిమ్మమీద దీంతో కొడతారు; కొన్నిచోట్ల, చలవచేసిన ఖాదీతువ్వాళ్ళు చదును చెయ్యటానికి వాడతారు. చూ. చిత్రం 287 చ. 1 (తె. 2).

**కొడతం** ఉ. ?కొడుతం; రూ. కొడితె; పర్యా. ఉన్నికొడిత. ఉన్నిదంచే కొయ్యగూటం; బండమీదవేసి కొడతారు; కొన్నిచోట్ల, ఉన్నిమీద వలకప్పి దీంతో కొడతారు. చూ. చిత్రం 307.2 (తె. 26, 27).

**కొడతలి** ఉ. కొడతలు; చూ. కొణతలి(1) (కో. 20, 21).

**కొడితి** పర్యా. చూ. గూటం(1). దూది ఏకేటప్పుడు కమానుసరంకొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (రా. 17).

**కొడితె** చూ. కొడతం (తె. 6).

**కొడువు** రూ. గొనువు; పర్యా. గంటం(5), సలాఖ. పత్తినించి గింజలు వేరుచెయ్యటానికి వాడే ఇనపకడ్డీ; ఇది అప్పడాలకర్రలాగ ఉపయోగిస్తుంది. చూ. చిత్రాలు 2.2, 3.2 (తె. 2).

**కొణతం(బిళ్ళ)** చూ. కొణతలి(3). (కో. 6).

**కొణతలి** ఉ.కొంతలి.1.రూ.కొడతలి; పర్యా.చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంకె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (కో. 17, 18, 34); 2. ఒకరకం చిన్నరాటి; చూ. రాటి. చూ. చిత్రాలు 31 ద. 32, 33 (కో. 33, 37); 3. రూ. కొణతం; పర్యా. బిళ్ళ (7). ఊడ్తెతాడు బిగింపుకు వేసే కొయ్యచెక్క; దీనికి రెండువైపులా రెండు చిల్లులుంటాయి. చూ. చిత్రాలు 63 ప. 2, 68 క, చ (కో. 6).

**కొణతలిదిమ్మ** ఉ. కొంతలి-; పర్యా. చూ. దూపిరి (3). రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 18).

**కొణతలిదుక్క** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 34).

**కొణితం** దసలి(పట్టు) పడుగు సరిచేయటానికి నిలబెట్టిన ఊడ్తెతాడు బిగింపుకోసం వేసిన కొయ్యబిళ్ళ; చూ. బిళ్ళ(7). చూ. చిత్రం 297.3 (తె. 7).

**కొండగొర్రె** ఒకరకంగొర్రె; దీనిబొచ్చు ఎర్రగా ఉంటుంది (తె. 22).

**కొండపత్తి** కొద్దిపాటి ఎరుపువన్నెపత్తి; మేలురకం; దీంతో 60-120 నెం.దాకా దారం తియ్యవచ్చు; ఇది శ్రీకాకుళం జిల్లాలో పొందూరు, బొంతలకోడూరు ప్రాంతాల్లో పండే మేలిరకం పత్తి (కో. 19, 20, 33, 34, 36, 37; తె. 28).

**కొండి** ఉ. కొండె. 1. పర్యా. ఉంగరం(2). పంకరుదుక్కకు బిగించిన ఇనపకొక్కెం; నూలుపోగు దీంట్లోకి దూర్చి పంకరుకు చుడతారు. చూ. చిత్రాలు 38 క. 3, 31 ట. 2 (తె. 11); 2. పర్యా. తిరుగుడుకొండి(1). ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనపపనిముట్టు; చూ. గొలుసు (కో. 4; తె. 8; రా. 5, 6); 3. వంకెన(=పడుగేరుకర్ర బిగింపుకోసం తగిలించే ఇనపకొక్కెల పనిముట్టు) చివరి కొక్కెం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 70 ట. 3 (తె. 17,

26–28, 30); **4.** పర్యా. కాడ, కొక్కెం(1), కొంకి (2), గొలుసుకొండి, గొళ్ళెం(1), చువ్వ(3). పడుగేరు కర్రకు తగిలించే ఇనపగొలుసు కొక్కెం. చూ. చిత్రం 70.1 (తె. 4, 5, 11, 14, 21); **5.** అచ్చుకట్టే జంత్రం కొయ్యకు బిగించిన ఇనపకొక్కెం; అచ్చుకర్ర దీనికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 91 ట. 1 (తె. 15); **6.** పర్యా. ఇరుపుకొండి, కొక్కెం(2), కొంకి(6), కోతికొండి, గద్దగోరు, గిరక కొండి, గుండీ, గుదికమ్మి, గొణ్ణెం, చింతకాయ, నాగవాసం(5), లింకు, వంకీ, సీల(11), సూత్రపుకొండి. అచ్చుగుదులుతగిలించే వంకర ఇనపఊచ; దీన్ని మామూలుగా మగ్గం పై దండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండికూడా కడతారు. చూ. చిత్రం121 క. 9 (కో. 14; తె. 4, 10–12, 14, 15; రా. 4); **7.** రూ. గొండీ; పర్యా. కొక్కెం(8), పలకొక్కొండి. చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి, పలకసూత్రం చివర వేసిన వంకర ఊచ; ఇనపది; కొన్నిచోట్ల, దీన్ని మగ్గం పై తాడుకువేసి పలకసూత్రం దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 త. 1 (తె. 4, 18); **8.** పర్యా. చూ. కమాను(3). మరనాడెగాడిలో, ముల్లుకు గుచ్చిన కొయ్యకండెఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడి రేకు. చూ. చిత్రం 131 త. 2 (తె. 21, 26–28, 30).

**కొండి(కట్టె)** పర్యా. చూ. కొంకి(1). ఊడ్తె తాడు తగిలించి, బిర్రుపెట్టే పంగలకొయ్య; కొన్నిచోట్ల దుప్పికొమ్ము వాడతారు. చూ. చిత్రం 63 క. 6 (కో. 9; తె. 7; రా. 16, 18, 24).

**కొండితాడు** పర్యా. అచ్చుకట్టుదారం, అచ్చుతాడు, అచ్చుదారం(1), అచ్చుదిద్దకంతాడు, కొండిదారం, గుర్రపుతాడు, దండెతాడు(1), పిసర(తాడు), బిరుదారం(1), బిళ్ళతాడు(2), బెదనుదారం, బెంతితాడు, బెంతిదారం(1), రేవుతాడు, రేవు(దారం), వడితాడు (4). అచ్చుకట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 9, 10; తె. 4, 5, 11–17, 30).

**కొండిదారం** పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు, అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 6; తె. 5, 26, 27).

**కొండ్లకర్ర 1.** (–తొడుగు) ఉ. కొండ్లకర; పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగుచాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోల్తలవెంబడి దూరుస్తారు; మామూలుగా దీనికి రెండు ఇనపకొండ్లుంటాయి; ఇటువంటివి, రెండుకర్రలుంటాయి. చూ. చిత్రం 69 (తె. 10–13, 16; రా. 7, 8, 10); **2.** పర్యా. చూ. గాజులకట్టె. పట్టుదారం వడికేటప్పుడు, పెద్దరాట్నందగ్గర కదుర్లపీటకు కిందగా, కొన్నిచోట్ల పక్కన, పెట్టేకొయ్యపట్టె; దీనికి ఇనపచుట్లు(కొన్నిచోట్ల, కొండ్లు) బిగించి ఉంటాయి; దారం వడికేటప్పుడు, కదురుపోగులు దీని కొండ్లగుండా వచ్చి దొలకమీద చుట్టుకొంటాయి. చూ. చిత్రం 293 చ. 13 (తె. 12).

**కొండ్లకోల** పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోల్తలవెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండువైపులా రెండుంటాయి; మామూలుగా, దీనికి రెండు ఇనపకొండ్లుంటాయి. చూ. చిత్రం 69 (తె. 1, 2, 4, 5, 11, 12).

**కొండ్లగొలుసు** పర్యా. చూ. గొలుసు(3). ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనపపని ముట్టు; దీనికి పొడుగాటి ఇనపకొండ్లుంటాయి. చూ. చిత్రాలు 63 ర. 2, 70 (తె. 1).

**కొండ్లపీట** పర్యా. చూ. గాజులకట్టె. పట్టుదారం వడికేటప్పుడు, పెద్దరాట్నందగ్గర కదుర్లపీటకు కిందగా, కొన్నిచోట్ల పక్కన, పెట్టే కొయ్యపట్టె; దీనికి ఇనపచుట్లు (కొన్నిచోట్ల, కొండ్లు) బిగించి ఉంటాయి; కదురుపోగులు కొండ్లగుండా వచ్చి దొలకమీద చుట్టుకొంటాయి. చూ. చిత్రం 293 చ. 13 (తె. 5).

**కొదమ** ఈతపడని గొర్రె (తె. 11).

**కొనకొయ్య** పర్యా. చూ. వెనక(టి)కొయ్య. అనుపీటకు వెనక బిగించిన పుల్ల(లు); తలకొయ్యలకంటె వీటి సంఖ్య తక్కువ ఉంటుంది. చూ. చిత్రం 45 క. 4 (తె. 26).

**కొనపీట** పర్యా. చూ. వెనక(టి)పీట. అనుపీటల్లో చివరిది; దీనికి మామూలుగా ఒక చాలులో అనుకొయ్యలు బిగించి ఉంటాయి. చూ. చిత్రం 45 క. 3 (తె. 24).

**కొనముక్కు** పర్యా. చూ. పంటెముక్కు. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కలిపికట్టిన కొన. చూ. చిత్రం 19 క. 6 (తె. 33).

**కొప్పుతోలు** కమాను (=దూది ఏకే కొయ్యపని ముట్టు) కట్టె చివరివంపుకు చుట్టినతోలు. చూ. చిత్రం 9.6 (తె. 28).

**కొబ్బరినార** టెంకాయపీచు; దీంతో మూడుపేట

లుగా తాళ్ళు, అయిదారు పేటలుగా మోకులు పేనుతారు (కో. 12).

**కొబ్బరినారచీర** ఉ. కొబ్బెర-. నిలువుపోగులు తెలుపు, పేకపోగులు ఎరుపు రంగుల్లోపెట్టి నేసిన చీర; కొంగుకు రంగు అద్దుతారు; ఎక్కువగా వడ్డెరవాళ్ళూ గొల్లవాళ్ళూ కడతారు (తె. 11, 13).

**కొబ్బరిపీచు** టెంకాయపీచు; దీంతో మూడుపేటలుగా తాళ్ళు, అయిదారుపేటలుగా మోకులు పేనుతారు (కో. 17, 20).

**కొబ్బరిబరికె** పర్యా. చూ. చిప్ప(1). రాటిపై బద్దలను బిగించి వాటిమధ్య జోర్లించి కట్టిన చిప్ప; మామూలుగా, కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల కర్రచిప్పగాని, రేకుమూతగాని వాడతారు; ఇది రాటి సూలంమీద తిరుగుతుంది. చూ. చిత్రం 31 క. 5 (కో. 29).

**కొబ్బరీనెలగడిచీర** మూడేసి రంగుల పోగులు పడుగుంబేకలుపెట్టి నేసిన గళ్ళచీర (కో. 10).

**కొబ్బెరకుంచె** నేతనేసేటప్పుడు, అప్పుడప్పుడు, పడుక్కు గంజిపూసే కుంచె; కొబ్బరపీచుతో చేసింది. చూ. చిత్రం 41 (కో. 33).

**కొమ్ము 1.** పర్యా. చూ. కొంకి(1). ఊత్తైతాడు తగిలించి, బిర్రుపెట్టే వంగలకొయ్య; కొన్నిచోట్ల, దుప్పికొమ్ము వాడతారు. చూ. చిత్రం 63 క. 6 (కో. 12ఎ; తె. 32); **2.** పర్యా. చూ. దిద్దు(డు)బిళ్ళ, అచ్చుకర్రకు కట్టిన వడిదారం బిర్రుగా ఉండటానికి, పై మెలిక(పూస)ల మీద రుద్దే దుప్పికొమ్ము. చూ. చిత్రం 96 (కో. 3, 4, 14, 16, 18, 21, 24, 26, 33, 37); **3.** పర్యా. చూ. చమురుకొమ్ము. నూనె పోసుకొనే దుప్పికొమ్ము; మగ్గానికి వేలాడదీస్తారు; నేతనేసేటప్పుడు, అప్పుడప్పుడు, నాడెను సాపుచెయ్యటానికి గుడ్డతో నూనె పూస్తారు. చూ. చిత్రం 121 క. 16 (కో. 9; తె. 16, 32; రా. 21); **4.** పర్యా. చూ. చేతినాడె. పడుగుపైపోగులకు, కిందిపోగులకు మధ్య వేసే పేకదారంకండె అమర్చి చేత్తోవిసిరే నాడె; గేదెకొమ్ముతో చేసింది; చూ. నాడె. చూ. చిత్రం 131 చ (కో. 1-3, 6; తె. 1, 2; రా. 11, 13, 16, 17, 21-24); **5.** పర్యా. చూ. నాడె. నేతనేసేటప్పుడు పైపోగులకు, కిందిపోగులకు మధ్యవేసే, పేకదారం కండె అమర్చిన పనిముట్టు; గేదెకొమ్ము, కొయ్య, వెదురుగొట్టం మొ.వాటితో చేస్తారు. చూ. చిత్రం 131 (కో. 4, 8; తె. 1; రా. 8-10, 12, 14, 15, 18, 19బి, 20, 24).

**కొమ్ము-ఆట** పర్యా. కండెఆట. నేతనేసేటప్పుడు, కండె అమర్చిన నాడె, కుడి ఎడమలకు వస్తూపోతూ ఉండటం; కండె ఆడినప్పుడు, పై పోగులకు, కింది పోగులకు మధ్య పేకపోగు పడుతుంది (కో. 1).

**కొమ్ము-ఇగ్గు** (క్రి.) పడుగుపోగులకు మధ్యగుండా పేకదారపు కండె గల నాడె ఒకవైపునుంచి మరొక వైపుకు పారేట్టు చెయ్యటం; చేతిమగ్గం నేతలో విసురుతారు; మరమగ్గంనేతలో కుచ్చు గుంజుతారు (రా.18).

**కొమ్ముకడుపు** పర్యా. చూ. నాడెగాడి. నాడెలో పేకదారం కండె అమర్చే సందు. చూ. చిత్రం 131 చ. 1 (రా. 24).

**కొమ్ముగాడి** ఉ. -గాడీ; పర్యా. చూ. నాడెగాడి. నాడెలో, పేకదారంకండె అమర్చేసందు. చూ. చిత్రం 131 చ. 1 (తె. 2; రా. 13).

**కొమ్ముచిమ్ము** (క్రి.) పడుగుపోగులకు మధ్యగుండా పేకదారపు కండె గల నాడె ఒకవైపునుంచి మరొక వైపుకు పారేట్టు చెయ్యటం; చేతిమగ్గంనేతలో విసురుతారు; మరమగ్గంనేతలో కుచ్చు గుంజుతారు (రా.24).

**కొమ్మునాడె 1.** పర్యా. చూ. నాడె. నేతనేసేటప్పుడు, పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్య వేసే పేకదారంకండె అమర్చినపనిముట్టు; గేదెకొమ్ము, కొయ్య, వెదురుగొట్టం మొ. వాటితో చేస్తారు. చూ. చిత్రం 131 (కో. 8, 9); **2.** ఉ. -నాడి; రూ. కొమ్ములాడె; పర్యా. చూ. చేతినాడె. పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్యవేసే పేకదారంకండె అమర్చి, చేత్తోవిసిరే నాడె; గేదెకొమ్ముతో చేసింది. చూ. చిత్రం 131 చ (కో. 1, 3, 5, 14, 22; తె. 20, 29, 33).

**కొమ్ముపారు** (క్రి.) నేతనేసేటప్పుడు, పడుగులో నాడె ఒకవైపునుంచి మరొకవైపుకు అడ్డంగా వెళ్ళటం (రా. 15, 17, 24).

**కొమ్ముపూస** పర్యా. చూ. పూస(6). మరనాడెలో, కండెపోగు బయటికి రావటానికి బెజ్జంచేసి బిగించిన గాజుపూస; కొన్నిచోట్ల, పోగు దూరేసందు (=బెజ్జం); దీంట్లోనుంచి పోగు సాపుగా వస్తుంది; మామూలుగా ఒకటి, కొన్నిచోట్ల 2-4 ఉంటాయి. చూ. చిత్రం 131 త. 1 (రా. 12).

**కొమ్ముముల్లు** పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (తె. 2; రా. 15, 22).

**కొమ్ములాడె** చూ. కొమ్మునాడె(1). (తె. 3).

**కొమ్మువాటు** పర్యా. చూ. వాటు(1) నేతనేసేటప్పుడు, పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్య పేకదారం వచ్చేటట్లు నాడె వెయ్యటం (కో. 6).

**కొమ్మువాటుఇగ్గు** (క్రి.) పర్యా. వాటులాగు. నేత పడుగులో పేకదారం పడటానికి, మరమగ్గం కుచ్చు గుంజటం; కుచ్చు ఏవైపుకు గుంజితే, నాడె ఆ వైపుకు వెళ్తుంది (రా. 12).

**కొమ్మువాటేయు** (క్రి.) పర్యా. చూ. వాటేయు. పడుగుపోగులకు మధ్యగుండా పేకదారపుకండె ఒక వైపునుంచి మరొక వైపుకు పారేట్టు చెయ్యటం; చేతిమగ్గంనేతలో, విసురుతారు; మరమగ్గంనేతలో కుచ్చు గుంజుతారు (కో. 6).

**కొమ్మేయు**(< కొమ్ము వేయు; క్రి.) పడుగుపోగులకు మధ్యగుండా పేకదారపుకండె ఒకవైపునుంచి మరొక వైపుకు పారేట్టు చెయ్యటం; చేతిమగ్గం నేతలో విసురుతారు; మరమగ్గం నేతలో కుచ్చు గుంజుతారు(కో. 8).

**కొయ్య 1.** పర్యా. చూ. గూటం(1). దూది ఏకేటప్పుడు కమానుసరంకొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (కో. 9); **2.** పర్యా. చూ. సరిగుంజ(1). ఆరుబయట చాపిన పడుగు, రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ఠ. 1, 65 (తె. 3, 4; రా. 22); **3.** పర్యా. చూ. సరికొయ్య(1). ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్యగూటం. చూ. చిత్రం 63 క. 7 (కో. 28, 31; తె. 4, 31, 32); **4.** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకు కట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (రా. 11); **5.** పర్యా. కోల(5), జంత్రంకొయ్య, జంత్రపుగూటం, నిలువుకొయ్య(4). అచ్చుకట్టే జంత్రం కిందిపీటకుగాని, నిలువుకమ్మికిగాని బిగించినపుల్ల; సుమారు జానెడు పొడుగుది; మామూలుగా, పెద్దపట్టెకు రెండు, నిలువుకమ్మికి-కొన్నిచోట్ల, నిలువుపీటకు-ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 91 క. 3 (కో. 26, 27, 31, 35, 37; తె. 13); **6.** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతినకొయ్య; దీనికి, నేత మోకుతో కొలికివేసి, పెడకోలకుచుట్టి, పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేత మోకు పెడకోలకుకట్టి, దీనికి ఏనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (కో. 9); **7.** అడ్డకొంగు పట్టెకు బిగించిన చిన్నపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 284 చ (తె. 17); **8.** పర్యా. చూ. ఆసుకొయ్య(3). ఆసుపీటకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టివచ్చేట్టు, ఆసుకు నూలు పోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (కో. 21-23, 26, 37; తె. 7, 9, 11-13, 15, 22, 24, 25, 28-33); **9.** పర్యా. చూ. అనికొయ్య. ఆసుపోసేటప్పుడు, పడుగులో అనులు పడటానికి కచ్చిపీటకు బిగించిన పుల్ల(లు). చూ. చిత్రం 45 క. 6 (కో. 21, 24, 29, 31, 33, 34; తె. 29, 31); **10.** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు, పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 9, 16, 21, 22, 25; తె. 4, 11, 13); **11.** చిటికెకట్టటానికి నూలుపోగులు చుట్టిన పుల్లలు; అడ్డపీటకు బిగించి ఉంటాయి. చూ. చిత్రం 285.2 (తె. 11).

**కొయ్యకండె** పర్యా. లాటూచ. పేకదారం చుట్టే కొయ్యపుల్ల; దీంతో చుట్టినకండె, మరమగ్గం నాడెలో అమరుస్తారు. చూ. చిత్రం 51 చ (కో. 7).

**కొయ్యగుది** ఉ. -గుతి; పర్యా. చూ. పంటిగుది. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి, పుల్లకు కట్టిన తాడు; ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.2 (తె. 29).

**కొయ్యగూటం** పర్యా. చూ. గుబ్బకొయ్య(2). ఎదురుదోనెను మోసే కొయ్యగూటం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 110.3 (రా. 5).

**కొయ్యపట్టె** ఉ. కొయపట్టె; పర్యా. చూ. మేరువు పలక. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద ఇటూ అటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (రా. 17).

**కొయ్యలాసు** ఒకరకం ఆసు; చేతిఆసు. చూ. చిత్రాలు 45-47 (కో. 23).

**కొరిచెవాళ్లు** ఉ.కొర్చోళ్ళు. నూలు సరిచేసే కుంచెలు తయారుచేసే ఒక తెగ; ఎరికలవాళ్ళు (రా. 16).

**కొరిపం** ?ఒకరకం అంచు (తె. 6).

**కొలకటు** చూ. కొలికి(5). (తె. 14).

**కొలకొయ్య** చూ. కొలతకొయ్య (కో. 28, 37).

**కొలతకొయ్య** ఉ. కొల్త-; రూ. కొలకొయ్య; పర్యా. కుంటికొయ్య, తాపనకొయ్య, మీదికొయ్య, మూరకొయ్య. ఆసుమీద పడుగు ఎక్కువ రావటానికి పక్కపట్టెకు బిగించినకొయ్య; మామూలుగా, ఇటువంటివి నాలుగుంటాయి; కావలసిన పడుగునుబట్టి 1-4 వరకూ ఈ కొయ్యలకు గూడా నూలు పోస్తారు. చూ. చిత్రం 45 ట. 2-5 (కో. 25, 26, 30-32, 35).

**కోలతకోల** పడుగు మూరకొలిచే కర్ర; రెండు మూరల పొడుగుది (తె. 2).

**కోలతగురిగె** ఉ. -గురిగి; పర్యా. చూ. పావు(2). రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది. చూ. చిత్రం 282 ప. 1 (తె. 4).

**కోలతతెడ్డు** ఉ. కోల త్తెడ్డు; పర్యా. చూ. పావు(2). రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది; దీన్ని పొడుగాటి కాడకు కడతారు. చూ. చిత్రం 282 క. 6 (కో. 33).

**కోలతబల్ల** పర్యా. చూ. టుకినీ. పన్నెండండెల మధ్య బిగించే పుల్లలు ఒకే పొడుగులో తెంపటానికి కొలిచేబిళ్ళ. చూ. చిత్రం 89 క. 7 (కో. 33).

**కోలికచేరుకోక** ఒకరకం నేత చీర (రా. 19ఎ).

**కోలికంచు** రెండుపోగుల దారం నిలువుగా పడేట్టు నేసిన అంచు (కో. 4).

**కోలికపట్టె** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాసు కట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే, బెజ్జాలుగల రేకు ముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె; మరాసు తిరిగినప్పుడు కీలుఆడుతూ, దీన్ని ముందుకూ వెనక్కూ జరుపుతూ ఉంటుంది. చూ. చిత్రం 50-11 (కో. 3).

**కోలికి** ఉ. కోలుకు, కోలికె, కోల్కి. **1.** పర్యా. ఇల్లు(1), ఈనె(2), కవ్వ(1), గుడి, గూడు(2). ఆసు పోసిన నూలులో ఒకటి పైకీ, ఒకటి కిందికీ వచ్చిన రెండు పోగులదారం (కో. 2, 4, 5, 7-15, 19, 22; తె. 1, 3-5, 11-13, 15, 16, 26; రా. 1, 3, 7-16, 19); **2.** ఒకరకం ముడి; ఊడ్తె పన్నేటప్పుడు, తాడుతో కిందిగూటానికి వేస్తారు. చూ. చిత్రం 73 (తె. 13); **3.** రూ. గొలికెం; పర్యా. అచ్చుకొలికి, అచ్చుగూడు, అచ్చురి, అని(2), అనివడి, ఉరి(1), కత్తెర(1), కవ్వ(2), గొలుసు(4), పోటువడి, మెలికె, వడికత్తెర, వడికొలికి, వడిగూడు, వడిమెలికె. అచ్చు కట్టేటప్పుడు, రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె; నేతనేసేటప్పుడు, పడుగుపోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ లంకెల్లోనుంచి బెంతుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (తె. 29; రా. 6, 11, 13-15); **4.** రెండుపోగుల పట్టుదారం (తె. 5, 12); **5.** (-పెట్టు) రూ. కొలకట. ఆసుపోసేటప్పుడు, మొదటి ఆసుకొయ్యకు వేసిన దారపు మెలిక (తె. 11, 13, 16); **6.** (-పెట్టు, -వేయు) రూ. కొల్కడ; పర్యా. చిలకడ(2). తాడుచుట్టు; మిడిగూటానికి నేత మోకువేసి పెడకోలకు తగిలించి బిగిస్తారు. చూ. చిత్రం 129 క. 3 (కో. 9; తె. 12, 13, 15-17; రా. 8).

**కోలికిఅతుకు** (క్రి.) బద్దెపోగులకు రెండేసి పడుగు పోగులు కలిపి అచ్చతకటం (రా. 10).

**కోలికినేత** పర్యా. చూ. చల్నేత. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్లు నేసిననేత; మైటీ నేతమాదిరిది; అనిమూసి నేస్తారు (రా. 3).

**కోలికిపోగులకర్ర** ?పైకొత్తల (కో. 3).

**కోలికిమళ్ళచీర** వేలెడువెడల్పుగడి పడేట్టు నేసిన ఒకరకం గళ్ళచీర (తె. 15).

**కోలికిముంగిచీర** ఉ. కొలికిమొంగిచీర. ఒకరకం చిన్నగడిచీర; రెండుపోగులు ఒకరంగు, రెండుపోగులు మరొకరంగు పెట్టి నేస్తారు (తె. 4, 12).

**కోలికిశారుకావికోక** రెండునాడెలతో, రెండు రంగుల నూలుపెట్టి నేసిన చీర (రా. 19).

**కోలుకులకర్ర** పడుగులో పైకొత్తలకు దూర్చే కర్ర; దేవాంగులవాడుక (కో. 7).

**కోలుకులకోల** పర్యా. చూ. మేకులకమ్మి. మరాసు మీద పడుగు పోసేటప్పుడు, పడుగులో అనులు రావటానికి, మేకులు బిగించిన అడ్డకట్టె; ఒగ్గులపట్టె పక్కకు జరిగినప్పుడు, పడుగులో అనులుపడతాయి. చూ. చిత్రం 50.8 (తె. 13).

**కోలుకులపట్టె** పర్యా. చూ. మేకులకమ్మి. మరాసు మీద పడుగుపోసేటప్పుడు, పడుగులో అనులురావటానికి, మేకులు బిగించిన అడ్డకట్టె; ఒగ్గులపట్టె పక్కకు జరిగినప్పుడు, పడుగులో అనులుపడతాయి. చూ. చిత్రం 50.8 (కో. 4).

**కోలుకులమళ్ళచీర** ఉ.-మల్లచీర. నిలువుకు తెలుపు, అడ్డానికి రంగునూలుపెట్టి రెండేసి పోగులు పడేట్టు నేసిన గళ్ళచీర. (తె. 13).

**కోలుకులుతీయు** (క్రి.) సరిచేసేటప్పుడు, పడుగులో చిక్కులు తియ్యటం (తె. 3).

**కోలుక్కొయ్య** (<కోలుకు+కొయ్య) పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివరపాతిన కొయ్య; దీనికి, నేతమోకు కొలికివేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కుగుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకు కట్టి, దీనికి పనుగు మెలిక వేస్తారు; కొన్నిచోట్ల; ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె.17).

**కోల్కడ** ఉ. కోల్కట; చూ. కోలికి(6). (తె. 11, 14).

**కోల్తగిన్నె** పర్యా. చూ. పావు(2). రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది. చూ. చిత్రం 282 ప. 1 (రా. 11).

**కోల్తదబ్బ** (<కోలతబద్ద) పర్యా. చూ. లచ్చన

లాక. అచ్చుతికిన పడుగుమీద, గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనేబద్ద; మామూలుగా, గజెం-కొన్ని చోట్ల, మూరెడు-పొడుగుది; కొన్నిచోట్ల, మలగట్టు కర్రతో కొలుస్తారు (రా. 18).

**కొల్తదారం** (<కొలతదారం) పర్యా. చూ. అంట్లతాడు. అచ్చుతికిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి కొలిచేదారం; మామూలుగా గజెం పొడుగుది (రా. 18).

**కొల్తబిళ్ళ** పర్యా. చూ. టుకినీ. పన్నెదండెలమధ్య బిగించే పుల్లలు ఒకే పొడుగులో తెంపటానికి కొలిచే కొయ్యబిళ్ళ. చూ. చిత్రం 89 క. 7 (కో. 24).

**కొల్లజేయు** (క్రి.) పడుగుపోగులు విడదీయటం; విప్పటం (రా. 22).

**కొల్లాయిగుడ్డ** పర్యా. చూ. అంగవస్త్రం. మగవాళ్ళు మోకాళ్ళవరకూ కట్టుకొనే ఒకరకం చిన్న బట్ట; సన్నటి అంచుపెట్టి, 2-5 మూరల పొడుగున పలచగా నేస్తారు; కొన్నిచోట్ల, ముతకది; కొన్నిచోట్ల, తువ్వాలుమాదిరిగా దీంతో ఒళ్ళు తుడుచుకొంటారు; కొందరు మడిగట్టుకోటానికి వాడతారు (కో. 13, 15).

**కొల్లె** ఒకరకం కత్తి; దీంతో కుంచెపురి కొనలు సమంగా కోస్తారు. చూ. చిత్రం 86 (కో. 35).

**కొనకట్టు** పర్యా. చూ. చెంపకట్టు. కుంచె చెంపలకు వేసిన దారపుకట్టు; ఇటువంటివి రెండు వేస్తారు. చూ. చిత్రం 76 క. 9 (కో. 26).

**కొనచిట్టె** పర్యా. చూ. బిర్రుచిట్టె(2). పంటెఆకుల మధ్య బిగింపుకువేసే అడ్డబద్దల్లో కిందిది. చూ. చిత్రం 19 క. 4 (తె. 16).

**కొసనేత** పర్యా. కడతట్టునేత. బట్టచివరిభాగంలో నేసిన నేత (కో. 10).

**కొసమలకర్ర** అల్లుచేసేటప్పుడు, ఒకబట్ట నేతకు సరిపడే పడుగు బిగింపుకోసం చివరపెట్టిన కట్టె; మామూలుగా ఒకటి, కొన్నిచోట్ల రెండు ఉంటాయి; పొట్టేలతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, దీనికి ఒకబద్ద జోడించి, పడుగు చివరి పాయలు చుడతారు. చూ. చిత్రాలు 127.10, 128 త. 3 (కో. 33, 34).

**కొసమలబద్ద** పడుగులో చివర దూర్చిన వెదురుబద్ద; పడుగుమడతలో దూర్చింది (కో. 33, 34).

**కొసమలవిరుపు** ఉ. -ఇరుపు. మలలుగా పర్వరచిన పడుగుకట్టలో చివరి లాక (కో. 34).

**కొళిపిగూటం** నేతమోకు రాపిడికి అరక్కుండా, గొట్టం తొడిగిన మిడిగూటం; చూ. మిడిగూటం; చూ. చిత్రం 128 బ (రా. 15).

**కోక** పర్యా. చీర(1). ఆడవాళ్ళు కట్టుకొనే బట్ట, దీనికి మామూలుగా, రెండు అంచులు, రెండు కమ్ములు నేస్తారు; రకరకాల రంగుల్లోను, రకరకాల డిజైన్లలోను వాడుక; ఎక్కువగా, సమస్తపదంలో వాడుక (కో. 1, 3, 4, 8-10, 17-19, 22-24, 31; తె. 33; రా. 11, 19, 19ఎ).

**కోకంచు** చివర, తెల్లజమిలిపోగులుపెట్టి లోపల మూడువేళ్ళ వెడల్పున రంగుదారం పెట్టి నేసిన చీర అంచు (కో. 4).

**కోకలబాకు** రెండు చీరలు; బద్దెతో కలిసి ఉన్నవి (కో. 4).

**కోక-వాక** గుడ్డ, గుడుసు అన్నదానికి సమానార్థక ప్రయోగం (కో. 7).

**కోకో** కోకోపొడి రంగు (కో. 24, 35).

**కోకోచీర** చేకిలేటురంగుచీర (కో. 35).

**కోట** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 10).

**కోటకురమలు** గొంగళ్ళునేసే కురమవాళ్ళలో ఒక తెగ (తె. 28).

**కోటకొమ్మ(అంచు)** కోటగోడమీది చిన్నకట్టడం (=కోటకొమ్మ)ఆకారంలో వరసగా డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 174 (తె. 2).

**కోటబొమ్మంచు** కోటఆకారంలో, రంగులో బొమ్మలు అద్దిన అంచు; మామూలు బట్టకు చివర, బొమ్మ చెక్కిన కొయ్యఅచ్చుతో రంగు అద్దుతారు; బొమ్మలు వరసగా పడతాయి; మామూలుగా చీరలకు అద్దుతారు (తె. 15; రా. 20).

**కోటాబద్ద** పన్నెపుల్లలు చీల్చి, సాపుచేసే గీరుకత్తి బిగించటానికి, గుంజకు కట్టిన వెదురుబద్ద; రెంటికీ మధ్య కత్తి ఇరికిస్తారు. చూ. చిత్రం 89 క. 5 (కో. 33).

**కోటింగు** (పొడుగు)లాగులు, కోట్లు మొ. వాటి కోసం నేసిన బట్ట (కో. 15, 19).

**కోటిలనేత** పెద్దగళ్ళు పడేట్టు నేసిన నేత; ?పొప్పిళి నేత (తె. 32).

**కోడికండ్లు(చీర)** మూడుకొలుకులు నీలి, ఒకకొలికి బీరపువ్వు రంగుల్లో రెండు వరసలుపెట్టి, తరవాత, తొగరు, బీరపువ్వు, నీలి 3 : 1 : 3 పోగుల చొప్పున నిలువు, అడ్డంపెట్టి నేసిన చీర (తె. 13).

**కోడు 1.** పర్యా. చూ. సంగటికోల. పత్తిరాట్నం నిలువులమధ్య రూళ్ళకర్ర మాదిరిగా ఉండేకట్టె; ఇటువంటివి రెండు, ఒకదాన్నొకటి అనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడిపత్తి పెట్టినప్పుడు ఒకవైపు గింజలు, మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1.1 (రా. 16); **2.** పత్తిలో గింజలు రాలగొట్టే

పొడుగుకట్టె. చూ. చిత్రం 5.2 (కో. 7); 3. పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీ చట్రంలో అమర్చిన సన్నజద్ద; పావుచెక్కలు తొక్కినప్పుడు, గొలుసు పిక్కలుగాని, దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 ఛ. 6 (రా. 16, 17); 4. దాకెపేటకు ఆధారంగా బిగించిన కొయ్య; ఇటువంటివి, మూడుగాని, నాలుగుగాని ఉంటాయి; చూ. దాకెపేట. చూ. చిత్రం 208.2 (తె, 22).

**కోతకచ్చి** బట్టచివర, పేకదారం వెయ్యకుండా వదిలిన పడుగుపోగులు; నేత అయినతరవాత, మగ్గం మీదినుంచి బట్టకోసి తియ్యటానికి కోతకచ్చి పెడతారు; చూ. కచ్చి. (కో. 34, 36, 37).

**కోతకత్తి** నేత పూర్తి అయిన తరవాత, దోనెనుంచి బట్ట తీసెయ్యటానికి జద్దెదగ్గర కోసే కత్తి. చూ. చిత్రం 138 (తె. 33).

**కోతకర** పర్యా. చూ. జద్దె(1). అచ్చుతుక్కోటానికి, సుమారు జెత్తెడు వెడల్పు నేసి, చివర జైనెడుపొడుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తిచేసిన తర వాత, అచ్చులో జద్దెకోసి మరొక పడుక్కు అతుకుతారు. చూ. చిత్రాలు 102.2, 144 (రా. 21).

**కోతనేత** నేతలో పనికిరాని భాగం; మామూలుగా, నేత అయిపోయిన తరవాత దీన్ని కోసి తీసేస్తారు (రా. 24).

**కోతజద్దె** పర్యా. చూ. జద్దె(1). అచ్చుతుక్కోటానికి, సుమారు జెత్తెడు వెడల్పు నేసి, చివర జైనెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తి చేసిన తరవాత, అచ్చులో జద్దెకోసి మరొక పడుక్కు అతుకుతారు. చూ. చిత్రాలు 102.2, 144 (తె. 1, 14).

**కోతి** పర్యా. చూ. కుక్క(2). డాబీకోలలను లేపటానికి, దిండుచెక్రాన్ని – కొన్నిచోట్ల, దిండుగాడిని– గుంజే ఇనపరేకు; దీనికి ఒకవైపున పేటుతాళ్ళు కడతారు; పావుచెక్క తొక్కినప్పుడు, పళ్ళచెక్రాన్నిగాని, దిండు ఊచల చెక్రాన్నిగాని గుంజుతూ కిందికీ పైకీ ఆడుతుంది. చూ. చిత్రాలు 132 క. 3, 132 చ. 7, 132 ట. 3 (కో. 7; రా. 24).

**కోతికట్టె** పర్యా. చూ. కోతిపుల్ల(1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (తె. 2, 7; రా. 23, 24).

**కోతికట్టెతాడు** పర్యా. చూ. అచ్చుసూత్రం(2). అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు; కొన్నిచోట్ల దీనికిచివర కోతిపుల్లకడతారు;ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121 గ. 1, 121 త(తె. 7).

**కోతికర్ర** పర్యా. చూ. కోతిపుల్ల(1). నేతనేసేటప్పుడు అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (తె. 19).

**కోతికొండి** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ; దీన్ని మామూలుగా మగ్గం పైనుండే వేలాడదీస్తారు; కొన్నిచోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండి కూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (తె. 22).

**కోతికొయ్య** 1. డాబీదిండు తిప్పటానికి అమర్చిన కొయ్య. చూ. చిత్రం 132 చ (తె. 19); 2. డాబీకట్టు ఒడిలో, కుక్కకర్రను లేపే కొయ్య(తె. 31); 3. డాబీ కుక్కను కోతికొయ్య కట్టెను కలిపేజద్ద; కొన్నిచోట్ల, ఇనపరేకు (తె. 8); 4. పర్యా. చూ. దిమ్మె(5). డాబీ దిండుకు చేసిన బొడిపె(లు); దిండు తిరిగినప్పుడు, ఇవి, కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 క. 2 (తె. 18); 5. ఉ. కోతికొయ్యి; పర్యా. చూ. కోతిపుల్ల(1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (తె. 4, 5, 9–11, 13, 14, 17, 20–23, 25, 28).

**కోతికొయ్యకట్టె** కుక్క రెండోకొన బిగించిన పొడుగుజద్ద; కొన్నిచోట్ల, ఇనపరేకు (తె. 8).

**కోతిచిరత** ఉ. కోచ్చిర్త; పర్యా. చూ. కోతిపుల్ల (1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (కో. 9ఎ).

**కోతితాడు** పర్యా. చూ. అచ్చుసూత్రం(2). అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు; కొన్నిచోట్ల, దీనికి చివర కోతిపుల్ల కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121 గ. 1, 121 త(రా. 23).

**కోతిదారం** పర్యా. చూ. అచ్చుసూత్రం(2). అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు; కొన్ని చోట్ల, దీనికి చివర కోతిపుల్ల కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121 క. 1, 121 త (రా. 3).

**కోతిపుల్ల 1.** పర్యా. అనుకొయ్య(4), ఇరవ, కట్టె చిర్ర, కోతికట్టె, కోతికర్ర, కోతికొయ్య(5), ఎక్కిరింతపుల్ల, ఎలుకపుల్ల, కోతిచిరత, చిట్టెకొయ్య, చిడత(4), చిలక(2), చిలకకర్ర, చిలకపుల్ల(1), జట్టికట్టె, ఝెంకిపుల్ల, సూత్రకొయ్య, సూత్రంపుల్ల, సూత్రపబండి. నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి, నేతనేసేటప్పుడు పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (కో. 6, 7, 9బి, 10, 14, 18, 22; తె. 16, 31; రా. 1, 3, 7-10, 12-15, 17, 18, 21, 22); **2.** పర్యా. చూ. ఎత్తుపుల్ల(2). అచ్చతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండు పుల్లలకు తాడు గట్టి, మడతమంచంకోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (రా. 15); **3.** పర్యా. చూ. చిల్ల(7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా, చట్టం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (కో. 3, 5); **4.** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతతాడు కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (కో. 3, 4, 6).

**కోతిసూత్రం** పర్యా. చూ. అచ్చుసూత్రం(2). అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు. కొన్ని చోట్ల, దీనికిచివర కోతిపుల్ల కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121 క, 121 త (తె. 22, 23).

**కోనంచు** పంచెల చాపులకు నేసే ఒకరకం అంచు (కో. 36).

**కోప్టి** బిస్కట్టురంగు (కో. 7).

**కోరకురమలు** గొంగళ్ళునేసే కురమవాళ్ళలో ఒక వంశం (తె. 28).

**కోరంద** పెసరగింజల రంగు (తె. 17).

**కోరరైక** ఉ. కోరైక. ఆడపిల్లలకు సారెపెట్టే రవికెగుడ్డ; కోరానూలుది (తె. 32).

**కోరా** ఉ. కోర. పట్టుపురుగులనుంచి వచ్చే ముడి దారం; ఎర్రగోధుమ వన్నెలో ఉంటుంది; దీంట్లో, సన్నపోగురకం, పట్కారివాళ్ళు సెల్లాలూ రవికకనములూ నెయ్యటానికి, పద్మసాలీలు పీతాంబరాలూ ధోవతులూ నెయ్యటానికి, ముతకరకం, చీరలూ ధోవతులూ నెయ్యటానికి వాడతారు (కో. 21; తె. 5, 12; రా. 14).

**కోరా(నూలు)** పర్యా. కాటు(1), కారకంనూలు, కారికం, తెల్లకాటు, పచ్చినూలు, మసరు, ముడినూలు. చలవచెయ్యని ముడినూలు; unblached yarn; ఇది గోధుమరంగులో ఉంటుంది (కో. 12-14, 16, 19, 20; రా. 12, 22, 24).

**కోరారాట్నం** ఉ. కోరరాట్నం; పర్యా. చూ. పెద్దరాట్నం. పట్టుదారం వడికే ఒకరకం రాట్నం; పెద్దది. చూ. చిత్రం 293 చ (తె. 21).

**కోరాసిల్కు** పట్టుపురుగులనుంచి వచ్చే ముడిదారం; నేతనేసేముందు, కాస్టిక్ సోడా, సబ్బు కలిపిన నీళ్ళలో ఉడకబెడతారు (కో. 17).

**కోరిఅంచు** ఉ. కోరి-. గీరలుగీరలుగా నేసిన అంచు. చూ. చిత్రం 184 (తె. 24).

**కోరిచీర** అంచులో, గీరలుపడేట్టు నేసిన చీర (తె. 24).

**కోరుబొంత** పర్యా. చూ. అంబలిపిడచ(2). గొంగడినేతలో పడుగుతడపటానికి, అంబలిలో ముంచిన గొంగడి గుడ్డ. చూ. చిత్రం 315 క. 20 (తె. 7).

**కోరుమగ్గం** ఉ. -మొగ్గం. ప్రత్యేకంగా అంచులునేసే ఒకరకం మగ్గం; ఉరువు చిన్నది; ఇటీవల వాడుకలోకి వచ్చింది (తె. 13).

**కోర్తండ్లుఏరు** (క్రి.) ఉ. కోర్తన్లు-; పర్యా. కోలతాళ్ళుఏరు. పడుగులో, కోత్తలపోగులు విడదియ్యటం; చూ. కోత్తల (రా. 11).

**కోర్తల** ఉ. కోర్తలు, కోర్తాల, కోర్తాలు; చూ. కోత్తల (కో. 4, 7, 8, 14; రా. 11, 13-15, 18, 23).

**కోల 1.** పర్యా. చూ. సంగటికోల. వత్తిరాట్నం నిలువులమధ్య రూళ్ళకర్రమాదిరిగా అమర్చిన కట్టె; ఇటువంటివి రెండు, ఒకదానొకటి ఆనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడిపత్తి పెట్టినప్పుడు ఒకవైపుగింజలు, మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1.1 (తె. 14, 16); **2.** (-నులుము) పర్యా. చూ. కోత్తల. పడుగులో మొదటగాని, చివరగాని, అనిపక్కన కర్రలు దూర్చే భాగం; ఇటువంటివి రెండుంటాయి; అచ్చతికేటప్పుడు పైకోల పోగులు తెంపి అతుకుతారు (కో. 1, 2, 22-24; తె. 11, 23, 25); **3.** పర్యా. చూ. ఆనుకొయ్య(3). అనుంటలకు దిగగొట్టిన నిలువు

పుల్ల(లు); వీటిని చుట్టివచ్చేట్టు అసుకు నూలుపోస్తారు. **చూ.** చిత్రం 45 క. 4-6 (కో. 25, 26); **4.** పర్యా. **చూ.** పడుగేరుకర్ర. పడుగుచాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోర్తలవెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండు వైపులా రెండుంటాయి. **చూ.** చిత్రం 69 (తె. 1-7, 9, 14, 18-33; రా. 18, 22-24); **5.** పర్యా. చూ. **కొయ్య(వ).** అచ్చుకట్టే జంత్రం కిందిపీటకుగాని, నిలువు బొమ్మకుగాని బిగించిన నిలువుపుల్ల; సుమారు జానెడు పొడుగుది; మామూలుగా, పెద్దపీటకు రెండు, నిలువు కమ్మికి-కొన్నిచోట్ల, చిన్నపీటకు-ఒకటి ఉంటాయి. **చూ.** చిత్రం 91 క. 3 (తె. 5); **6.** పర్యా. **చూ.** డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో బిగించిన సన్నబద్ద(లు). పావుచెక్కలు తొక్కినప్పుడు, గొలుసుపిక్కలుగాని దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. **చూ.** చిత్రం 132 చ. 6 (కో. 33, 36; తె. 13, 19, 20, 22, 23, 25, 29; రా. 23); **7.** వడిపెట్టి చుట్టిన పట్టుపడుగుకొస; ఇటువంటివి రెండుంటాయి (తె. 12); **8.** రంగుఅద్దిన నూలులడీలు గుంజకు తగిలించి పిండేకర్ర; గుండ్రటిది; దీన్నిలడీల్లో దూర్చి మెలిపెడతారు; దీంతో పోగులు విదిలిస్తారు; కొన్నిచోట్ల, రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. **చూ.** చిత్రం 282 క. 5 (తె. 25).

**కోలఅనె** ? అసులో కొనకొయ్యకుపడే అని(తె. 9).

**కోలకచ్చి 1.** పైకోర్తలలో పడ్డ అని (కో. 1); **2.** పడుగులో మొదటి అని; దీంట్లో పడుగేరుకర్ర దూరుస్తారు (కో. 34).

**కోలకట్టు** మొదటిఅనికిగాని, చివరిఅనికిగాని చెదిరిపోకుండా కట్టే కట్టు (కో. 1).

**కోలకట్టె** పర్యా. **చూ.** పిడుపుకర్ర. రంగుఅద్దిన నూలులడీలు గుంజకు తగిలించి పిండేకర్ర; గుండ్రటిది; దీన్ని లడీలో దూర్చి మెలిపెడతారు; దీంతో పోగులు విడదీస్తారు; కొన్నిచోట్ల, రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. **చూ.** చిత్రం 282 క. 5 (తె. 23).

**కోలకమ్మి** మరాసుమీదికి పడుగు తోడేటప్పుడు, అచ్చుతికే కోర్తల పోగులు చుట్టుకొన్న మేకులపట్టె (కో. 24).

**కోలకర్ర 1.** (-తొడుగు). పర్యా. **చూ.** పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోర్తల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. **చూ.** చిత్రం 69 (కో. 16, 17, 20, 21, 23-26, 28, 29, 32-37); **2.** పర్యా. **చూ.** అచ్చుకర్ర(1). అచ్చులో వడిదారం కట్టినకర్ర; అచ్చుకట్టేటప్పుడు దీన్ని జంత్రం కొయ్యలకు బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; బోనచ్చుకు ఎనిమిది ఉంటాయి. **చూ.** చిత్రాలు 91 క. 7, 100.1, 121 క. 8 (రా. 1); **3.** పట్టుదారం, పంకెకు చుట్టటానికి, చిలపతగిలించే కర్ర; ఇటువంటివి రెండుంటాయి. **చూ.** చిత్రం 295 (కో. 23).

**కోలకర్రఏరు** (క్రి.) పర్యా. చూ. కోల(లు)ఏరు. పడుగేరుకర్రమీద పోగులు నెరిపి, సాపుచెయ్యటం (కో. 28).

**కోలకళ్ళి** ఒకరకం చెట్టు (*Euphorbia tirucalli*, Linn.); నీలిరంగు తయారీలో దీని ఆకులు వాడతారు (రా. 16).

**కోలకొయ్య** మొదటి అసుపీటకు బిగించిన కొయ్య(లు). చూ. చిత్రం 45 క. 10 (కో. 32, 35, 36).

**కోలగుంజ** ఉన్నిపడుగుతోడే అసుగూటాల్లో పైది. **చూ.** చిత్రం 312 (తె. 25).

**కోలచేయు** (క్రి.) ఉ. కోలసేయు; పర్యా. చూ. కోల(లు)ఏరు. పడుగేరుకర్రమీద పోగులు నెరిపి సాపు చెయ్యటం (కో. 30).

**కోలతడుపు** (క్రి.) పడుగేరుకర్రదగ్గర పోగులు తడపటం (కో. 25).

**కోలతాళ్ళుఏరు** (క్రి.) పర్యా. చూ. కోర్తండ్లుఏరు. ? పడుగులో కోర్తలపోగులు విడదియ్యటం; **చూ.** కోర్తల (రా. 20).

**కోలదిద్దు** (క్రి.) పర్యా. కర్రదిద్దు. పడుగేరుకర్ర మీద పోగులు పరచి, చిక్కులుతీసి సాపుచెయ్యటం; కొన్నిచోట్ల దువ్వెనతో దిద్దుతారు (తె. 5, 11, 12, 14; రా. 1, 19, 23).

**కోలదిప్పు** (క్రి.) పడుగేరుకర్రమీద ఉన్న పడుగు పోగులు పక్కకు జరపటం; సరిచేసేటప్పుడు కోలలు తిప్పి, అల్లుకుంచెతో పోగులు దువ్వుతారు (కో. 21, 22).

**కోలదువ్వు** (క్రి.) **1.** పడుగేరుకర్రలమీది **పోగులు,** చిక్కులుపోయేట్టు దువ్వటం; మామూలుగా, దువ్వెనతో దువ్వుతారు; కొన్నిచోట్ల, పీచుమట్టతో దువ్వుతారు (కో. 24); **2.** పర్యా. కోలవిప్పు. పడుగేరుకర్రమీది పోగులు చేత్తోవిడదీయటం; కొన్నిచోట్ల, దువ్వెనతో దువ్వుతారు (కో. 25, 36).

**కోలనులుము** (క్రి.) సరిచేసిచుట్టిన పడుగు, అంటుకుపోకుండా కోర్తలపోగులు మెలిపెట్టటం (తె. 20).

**కోలపట్టి** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాసుకట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే బెజ్జాలుగల రేకు

ముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె. చూ. చిత్రం 50.11 (కో. 2).

**కోలపట్టు** (క్రి.) కోలకర్రలమీద పోగులు సర్దటం (కో.24).

**కోలపుల్ల** **1.** చట్రంఆను నిలువుపట్టెకు బిగించిన పుల్ల; ఆనుపోసేటప్పుడు కోల్తల దీనికి చుట్టుకొంటుంది (కో. 22); **2.** పర్యా. చూ. ఆనుకొయ్య(3). ఆను పీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటని చుట్టి వచ్చేట్టు ఆనుకు నూలుపోస్తారు; మామూలుగా, పీటకు ఒక చాలు చొప్పున కొయ్యలుంటాయి; కొన్నిచోట్ల, తలపీటకు రెండు చాళ్ళలోకూడా ఉంటాయి; మామూలుగా, తలపీటకొయ్యలు వెనకకొయ్యలకంటె ఒకటి ఎక్కువగాను, మధ్యపీటకొయ్యలు వెనకపీటలకొయ్యకు రెట్టింపూ ఉంటాయి. చూ. చిత్రం 45 క. 46 (కో. 23).

**కోలపొడుచు** (క్రి.) పడుగుపోగులు సవరించటం (కో. 33, 35).

**కోలపొర** పైపోగులూ కిందిపోగులూ వదులుగా ఉన్న పడుగుభాగం (కో. 34).

**కోలపోగులు** పట్టుపడుగులో అచ్చులుకొక్కే కొస పోగులు; కోల్తలపోగు (తె. 17).

**కోలబద్ద** **1.** చట్రం ఆనునిలువుపట్టెకు బిగించినబద్ద; ఆనుపోసేటప్పుడు కోల్తల దీనికి చుట్టుకొంటుంది. చూ. చిత్రం 46.1 (కో. 22); **2.** మరాసు మేకు పట్టెల్లో, అనులుపడే బద్ద; ఇటువంటివి రెండుంటాయి (కో. 26).

**కోలబల్ల** **1.** పర్యా. చూ. తలపీట. ఆనుపీటల్లో మొదటిది; దీనికి ఒకటి రెండుచాళ్ళలో ఆనుకొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (కో. 25, 26, 32, 35); **2.** పర్యా. చూ. ఆనుపీట. ఆనుకొయ్య (=ఆనుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి, మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45. 1-3 (కో. 25).

**కోలలగుర్రం** ? డాబీకోలలనులేపే కర్ర; చూ. డాబీ. చూ. చిత్రం 122 క (తె. 22, 23).

**కోలలాక** ఉ. కోల్లాక. **1.** పడుగులో, పడుగేరు కర్రదగ్గర దూర్చినలాక (కో. 33, 36); **2.** పర్యా. చూ. ఎక్కింపుచివ్వ (2). అచ్చులికిన పడుగులో, మొదట (=అచ్చుదగ్గర) ఎక్కించిన బద్ద; కొన్నిచోట్ల, కర్రగాని, సన్న వెత్తెంగాని, ఇనపకడ్డీగాని ఎక్కిస్తారు. చూ. చిత్రం 128 జ (కో. 33).

**కోల(లు)ఏరు** (క్రి.) పర్యా. కర్రఏరు, కోలకర్ర ఏరు, కోల్చేయు. పడుగేరుకర్రమీద పోగులునెరిపి, సాపుచెయ్యటం; కోల్తలపోగులు సరిచెయ్యటం (కో. 15, 19-21, 23, 25, 26, 31-34, 36, 37; తె. 5, 12, 14, 22, 24, 25, 33; రా. 1, 10, 19, 22).

**కోల(లు)తొక్కు** (క్రి.) పడుగులో రెండు చివరలా పడుగేరుకర్రలు దూర్చటం (కో. 32, 33).

**కోల(లు)దువ్వు**(క్రి.)పడుగేరు కర్రలమీది పోగులు దువ్వెనతో దువ్వటం (కో. 22).

**కోలవిప్పు** (క్రి.) ఉ. కోలిప్పు; పర్యా. కోలదువ్వు. పడుగేరుకర్రమీది పోగులు చేత్తో విడదీయటం; కొన్నిచోట్ల దువ్వెనతో దువ్వుతారు (కో. 25, 35).

**కోలసూత్రం** ఉ. కోలసూత్త్రం; పర్యా. చూ. రేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసిన దారం; డిజైనుకు అవసరమయినన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (తె. 22, 23, 25).

**కోలాఖానీ** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (కో. 16).

**కోలాను** కొయ్యలు తక్కువఉండే ఆను; మూగాను (తె. 12).

**కోల్తణి** (బహు. కోల్తండ్లు) చూ. కోల్తని (రా. 24).

**కోల్తని** (బహు. కోల్తండ్లు) రూ. కోల్తణి; పర్యా. చూ. కోల్తల. పడుగు మొదటగాని, చివరగాని అని పక్కన కర్ర(లు) దూర్చేభాగం; ఇటువంటివి రెండుంటాయి; అచ్చులికేటప్పుడు, పైకోల్తని పోగులు తెంపి అతుకుతారు (రా. 16, 17).

**కోల్తల** ఉ. కోంతల, కోల్తాలు; రూ. కోర్తల పర్యా. కోల(2), కోల్తని, తలకొలికి(1), తలకోల(1). పడుగులో మొదటగాని, చివరగాని, అనిపక్కన కర్ర(లు)దూర్చే భాగం; ఇటువంటివి రెండుంటాయి; అచ్చులికేటప్పుడు. పైకోల్తలపోగులుతెంపి అతుకుతారు (కో. 3, 5, 6; తె. 8, 14-16, 21, 26, 30; రా. 8).

**కోవిపూస** ఉ. కోయిపూస. కొయ్యఆనుగొట్టం చివర అమర్చిన గాజుపూస; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 48 చ. 1 (తె. 23).

**కౌరుదుప్పటి** ఒకరకం ఎరుపు (=కౌరురంగు) నూలుతో నేసిన దుప్పటి; ఎర్రమట్టితో నూలు తడిపి నేస్తారు; లంబాడివాళ్ళు కప్పుకొంటారు (తె. 16).

**కౌరుపంచె** ముదురుఎరుపురంగు నూలుపెట్టి నేసిన పంచె; నూలును, ఎర్రమట్టితో తడిపి నేస్తారు; లంబాడివాళ్ళు కట్టుకొనేది (తె. 16).

**కౌరుపొప్పిళిచీర** వరసగా, ఒకకొలికి ఎరుపు, రెండు

కొలుకులు వక్కరంగు, రెండుకొలుకులునలుపు, రెండు కొలుకులు వక్కరంగు, ఒకకొలికి ఎరుపు చొప్పున పడుగుపేకల్లో వచ్చేట్టు నేసిన పెద్దగడిచీర (రా. 15).

**కౌపవన్నె** నలుపు కలిసిన నీలంరంగు మాదిరివన్నె (రా. 16).

**క్రాసుబద్ద** పర్యా. చూ. మూలబద్ద. మరాసు కట్టు బడిలో అడ్డపట్టెలను ఆకులను బిగించినకట్టె; ఇటు వంటివి, పటవాలుగా బిగిస్తారు (కో. 26).

**క్రిష్టన్** ఉ. కిష్టన్, క్రిష్టన్. **1.** ఒకరకం ముదురు గులాబిరంగు; Crimson (కో. 2, 4; రా. 7, 8, 12); **2.** చెంద్రకాంతరంగు (కో. 6).

**క్రిష్ణకమలం** ఒకరకం నేతచీర (తె. 26).

**క్రిష్ణనీల** నలుపులో తెలుపువన్నె కలిసినరంగు; చూ. ఆస్మాన్ (తె. 12).

**క్రిష్ణబులుగు** నల్లమబ్బురంగు (కో. 14).

**క్రిష్ణ(రంగు)** ఉ. కిట్ట, కిష్ట. బొగ్గుమాదిరి నల్ల రంగు (తె. 20, 27, 32).

**క్రిష్ణలీలలు** ఒకరకం నేతచీర (తె. 10).

**క్రుత్రిమపట్టు** నారలతో తయారుచేసిన పట్టు; మాయపట్టు; మన్నిక తక్కువ (కో. 26).

**క్రేంక్** ? మరాసు కట్టుబడిలో ఫ్రీగర్ రాడును ఆడించేది ; చూ. మూలమట్టం (కో. 36).

**క్రోటను** **1.** ముదురు ఆకుపచ్చ; సస్యంరంగు (కో. 11); **2.** లేతపయిలెట్ రంగు (కో. 3; రా. 12).

**క్రోమ్** కాఫిపొడిరంగు మాదిరి వన్నె (కో. 7).

## ఖ

**ఖడ్గపద్యాలు** (-చెప్పు) ఉ.-పజ్జెలు. చౌడేశ్వరి అమ్మ వారి ఎదుట చదివే స్తోత్రపద్యాలు; కత్తితో దవడలు పొడుచుకొంటారు (రా. 16).

**ఖత్రి** పట్టుబట్టలు నేసేవాళ్ళలో ఒకతెగ (తె. 24).

**ఖలమ్‌దానీ** తివాచీనేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 17).

**ఖాకీరంగు** రూ. కాకిరంగు; పర్యా. కాకిచాయ, కాకిబ్రౌను. ఖాకీగుడ్డరంగు; 2జె. 800, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేసి తయారుచేస్తారు (కో. 24).

**ఖాదీ** చేత్తో వడికిన నూలు (తె. 2).

**ఖానీ** తివాసీనేతలో వచ్చే ఒకరకం నమూనా. చూ. చిత్రం 320 (కో. 16).

**ఖావా** (< హిం.) పర్యా. చూ. గిరుకత్తి. పన్నెదండెల మధ్య బిగించే ఈనెపుల్లలు చీల్చి, సాపుచేసే కత్తి; ఒక వైపున పంపుగా గాడి ఉంటుంది; మామూలుగా, ఒక వెదురుబొంగును సగానికి చీల్చి, మధ్యగా కత్తి ఇరికి స్తారు; కొన్నిచోట్ల, గుంజకు కోటాబద్దకట్టి, రెంటికీ మధ్య కత్తిదూరుస్తారు. చూ. చిత్రం 89 క. 6 (కో. 7).

**ఖూటా** చూ. గూటం (5). (కో. 5).

**ఖూటీ** తివాసీమగ్గం పైదోనె బెజ్జంలో దూర్చే టంగుకు బిగించిన మేకు; దానికి తాడుకట్టి, కింది దోనెకు బిగిస్తారు. చూ. చిత్రాలు 320.11, 321.1 (కో. 16).

**ఖైంచీ** (< హిం.) తివాసీనేతకువాడే ఉన్నిపోగులను కత్తిరించే కత్తెర. చూ. చిత్రం 322 ట (కో. 16).

## గ

**గంగసరంకమ్మి** ఒకరకం పెద్దకమ్మి; దీనికిముందు, రెండుపోగుల గీరలు(=జిట్ట)లు నేసి, మధ్య తెలుపులో వేరే రంగు గీరలుపెట్టి, కమ్మి తరవాత ½"—1" వరకు రంగు గీరలు, పువ్వులు పడేట్టు నేస్తారు (కో. 14, 15).

**గంగసరంచీర** ఉ. గంగాసరంచీర. అంచుల్లో ఎరుపు (=లాకీ), మధ్య నీలి (=ఒకరకం నలుపు) పెట్టి నేసిన ఒకరకం చీర; కొన్నిచోట్ల, అంచుల మధ్యభాగంలో తెలుపు పెడతారు; పైటచెరగులోనూ, అయిదువేళ్ళ వెడల్పు అంచులోనూ అంచపట్టి(=అంచుపోగులు చేత్తో మలిపి) డిజైన్లు నేస్తారు; దీన్ని, గొల్లవాళ్ళు కట్టు కుంటారు (కో. 9; తె. 11, 14-16; రా. 11,18,28).

**గంగాధరంచు** నాలుగు రంగులు పెట్టి నేసిన ఒక రకం అంచు; చిరుగు వదిలి, తెలుపు, ఎరుపు, నలుపు రంగులుపెట్టి, జరీపోగులు కలిపి నేస్తారు (కో. 24).

**గంగానమ్మ** నీలితొట్ల దగ్గర, గోడమీద పెట్టిన బొట్టు; అమ్మవారి గుర్తు. చూ. చిత్రం 284 క. 3 (కో. 12).

**గంగానమ్మచీర** ఒకకమ్మి తొగరు, మరొకటి నీలి రంగుల్లో పెట్టి నేసిన చీర; మామూలుగా 60, 80 నెంబర్ల నూలుతో నేస్తారు (కో. 16).

**గచ్చకలరు** ఉ. గచ్చకల్రు; పర్యా. కచ్చకాయ (రంగు). సిమ్మెంటురంగు మాదిరివన్నె; గచ్చకాయ రంగు. చూ. చిత్రం 288 (కో. 4).

**గజెం** **1.** పర్యా. చూ. కర్రు. ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన ఇనపగూటం. చూ. చిత్రం 66.1 (కో. 12 ఎ); **2.** పర్యా. చూ.

కమ్మి(9). మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; పావుచెక్కలకు చేసిన చిల్లుల్లోదూర్చి, పక్క గూటాలకు వేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (కో. 25, 36, 37); **3.** ఎదురుదోనె బెజ్జంలో దూర్చే ఇనప గూటం; పల్లికట్టెకు బదులువాడేది; ఎదురుదోనెకు పడుగు చుట్టటానికి దీంతోతిప్పుతారు. చూ. చిత్రం 110.2 (కో. 24); **4.** పర్యా. చూ. కమ్మి(13). రంగుల అద్దకంలో నూలులడీలు తగిలించే ఇనపఊచ; దీన్ని పట్టుకోటానికి వీలుగా రెండువైపులా వంపులు ఉంటాయి. దీంతో లడీలు రంగునీళ్ళ అండాలోకి దింపి అంచులమీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (కో. 33).

**గజెంకొయ్య** అనుపోసిననూలు (=పడుగు) గజం పొడుగు ఎక్కువ రావటానికి బిగించిన కొయ్య. చూ. చిత్రం 45 ట. 5 (కో. 37).

**గజెంగుర్తు** పర్యా. చూ. లచ్చన. అచ్చుతికిన పడుగు మీద, కొలతనుబట్టి వేసిన గుర్తు; మామూలుగా మసి గుర్తు వేస్తారు; కొన్నిచోట్ల, చిక్కుడు, బీర మొ.వాటి ఆకుపసర్లతో గజానికి ఒకటి చొప్పునగాని, మూరకు ఒకటి చొప్పునగాని గుర్తులు వేస్తారు. (రా. 3, 14).

**గజెందబ్బ** పర్యా. చూ. లచ్చనలాక. అచ్చుతికిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి కొలతచూసుకొనేబద్ద; మామూలుగా గజెం, కొన్నిచోట్ల మూరెడుపొడుగుది; కొన్నిచోట్ల మలగట్టుకర్రతో కొలుస్తారు (రా. 14).

**గజేంద్రంపేటు** పర్యా. చూ. ఏనుగు(ల)పేటు. అంచులో ఏనుగుల బొమ్మలు వరసగా నేసిన డిజైను (రా. 8).

**గజ్జిరాయిగుండు** పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర పడుగులో దూర్చినచువ్వ కిందికి జారకుండా దారంకట్టి, దండెఅవతలకు వేలాడదీసినగుండ్రటిరాయి; కొన్నిచోట్ల ఇనపగుండుగాని, చిన్నచెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (తె. 5).

**గజ్జె** ఉ. గజ్జి; మువ్వ ఆకారంలో నేసిన డిజైను. చూ. చిత్రం 176 (కో. 7, 10).

**గజ్జెగోపురం** ఉ. గజ్జిగోప్రం. గజ్జెపలక (=ఒకరకం చేతిమగ్గం పలక)కు మధ్యలో ఎత్తుగాఉన్న భాగం; నేత నేసేటప్పుడు పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు; చూ. ఊపురం (కో. 1).

**గజ్జెపలక** ఉ. గజ్జిపలక. ఒకరకం చేతిమగ్గం పలక; పలకసీలల్లో మువ్వలు బిగించింది; దీనికి నగిషీలు చెక్కుతారు; పోగువేసి పలక ఇవతలికి లాగినప్పుడు మువ్వలు గలగల్లాడతాయి; చూ. పలక (కో. 1).

**గజ్జెపూతంచు** గజ్జెలు, పువ్వులు ఆకారాల్లో డిజైను నేసిన అంచు (కో. 8).

**గజ్జె(ల)పేటు** ఉ. గజ్జిపేటు, గజ్జెలపేటి. అంచులో నేసే గజ్జెలవరస డిజైను. చూ. చిత్రం 176(కో. 15; తె. 2).

**గంజి** ఉ. గెంజి. **1.** (-అద్దు, -అలుకు, -తట్టు, -తడుపు, -తోము, -నించు, -పూయు, -పెట్టు, -రుద్దు, -వార్చు) అన్నంవండి వార్చిన నీళ్ళు; దీంతో పడుగు తడుపుతారు (కో. 1-37; తె. 1-7, 9-29, 32, 33; రా. 1-24); **2.** చింతగింజలపిండి ఉడకబెట్టి వార్చిన నీళ్ళు (తె. 25).

**గంజిఅటికె** పర్యా. సరిఅటికె. పడుగుకు పెట్టటానికి గంజిపోసుకొనే ఒకరకం మట్టిపాత్ర (తె. 2, 4, 6, 7; రా. 15).

**గంజిఅలుకు** (-చల్లు) పర్యా. చూ. అలుకు(2). సరిచేసేటప్పుడు, పడుగు బాగా బిరుసెక్కటానికి పైన చిలికిన గంజి; గంజిపిడచ ఒకచేత్తో పట్టుకొని రెండో చేత్తో దానిమీద అలుక్కుంచెతో దువ్వితే, పడుగుమీద గంజి పడుతుంది; కొన్నిచోట్ల వెంపలిమండలతో చిలుకుతారు (తె. 9).

**గంజికుండ** **1.** గంజి తియ్యటానికి అన్నంవండే కుండ; ఈ గంజి పడుగుకు పెడతారు. చూ. చిత్రం 74.3 (కో. 3, 7-9; తె. 1, 15, 20, 26, 23, 29; రా. 11-13, 15-18); **2.** గంజిపోసుకొనే మట్టిపాత్ర; నేతనేసేటప్పుడు బద్దె ముందుభాగం బిరుసెక్కటానికి పూసే గంజి దీంట్లో పోసుకొంటారు(తె. 24, 31)

**గంజికూడు** పర్యా. చూ. అంబలి. పలచగా ఉడకబెట్టిన పిండి; మామూలుగా చోడిపిండి వాడతారు; దీన్ని పడుగుకు పెడతారు (కో. 7ఎ).

**గంజికొట్టు** (క్రి.) పట్టాలునేసే నారపడుగుకు చింతగంజి పట్టించటం (తె. 25).

**గంజిగడ్డ(లు)** పర్యా. కాచగడ్డ(లు). పడుగుకు పెట్టేగంజి తయారుచెయ్యటానికి పనికివచ్చే ఒకరకం దుంపలు (కో. 7).

**గంజిగుడ్డ** **1.** పర్యా. చూ. పిడచ. పడుగు తడపటానికి, గంజిలో ముంచిన గుడ్డ; కొన్నిచోట్ల బద్దెపేలికలు కుప్పచేసి, పిడచగా ఉపయోగిస్తారు. దీంతో పడుగుకు గంజికాని, అంబలికాని పట్టిస్తారు. చూ. చిత్రం 74.2 (కో. 24); **2.** గంజిపోసి తోమేగుడ్డ; గంజి వడగట్టేగుడ్డ (కో. 3, 5, 8, 10; తె. 21; రా. 18).

**గంజిగుండ్రె** గంజిపోసుకునే మట్టిపాత్ర; నేతనేసేటప్పుడు బట్టముందుభాగం బిరుసెక్కటానికి పూసేగంజి దీంటో పోసుకొంటారు (కో. 27).

**గంజిగురిగి** ఉ.-గుర్గి. గంజిపోసుకొనే చిన్న మట్టి పిడత; నేతనేసేటప్పుడు బట్టముందుభాగం బిరుసెక్కటానికి పూసేగంజి, కొన్నిచోట్ల అంబలి, దీంట్లోపోసి నేతపనివాడు కుడిచేతివైపు పెట్టుకొంటాడు. చూ. చిత్రం 142.2 (తె. 1, 10).

**గంజిగూన** పర్యా. గూన(1). గంజిపోసుకొనే తొట్టి; కొన్నిచోట్ల దీంతోనే అన్నంవండి, చిన్న గూనలో గంజి పోసుకొంటారు (రా. 23, 24).

**గంజిగోలెం** పర్యా. గోలెం(1). గంజిపోసుకొనే మట్టితొట్టి; దీంట్లో గంజి నిలవ ఉంచుకొంటారు (కో. 33, 37; రా. 6).

**గంజిచట్టి** ఒకరకం మట్టిపాత్ర; పడుగుకు పెట్టే గంజి దీంట్లోకి తీసుకొంటారు (రా. 2).

**గంజిచిప్ప** గంజి పోసుకొనే చిప్ప; నేతనేసేటప్పుడు బట్ట ముందుభాగం బిరుసెక్కటానికి పూసేగంజి దీంట్లో పోసి, నేతపనివాడు కుడిపక్కన పెట్టుకొంటాడు చూ. చిత్రం 140.2 (తె. 2).

**గంజితట్టు** (క్రి.) అంబలి పిడచతో, ఉన్నిపడుగుకు (చింతగింజల) గంజి పట్టించటం; పోగు బిరుసెక్కటానికి గంజిపెడతారు (తె. 25).

**గంజితీడు** (క్రి.) రూ. గంజితీడ్వు; గంజిపెట్టిన పడుగును పాయలుపాయలుగాతీసి చేత్తో రుద్దటం (కో. 8, 9; తె. 11, 17, 21, 28).

**గంజితీడ్వు** (క్రి.) చూ. గంజితీడు (తె. 14).

**గంజితొట్టి** **1.** పర్యా. తొట్టి(1), సరితొట్టి(1). ఒకరకం మట్టిపాత్ర; దీంట్లో గంజి పోసుకొంటారు; కొన్నిచోట్ల, దీంట్లో గంజి వడగడతారు (కో. 2, 7ఎ, 10, 12; తె. 9, 10, 21; రా. 1, 8, 9, 13, 18, 22, 23); **2.** గంజిపోసుకొనే పాత్ర; నేతనేసేటప్పుడు బట్టముందుభాగం బిరుసెక్కటానికి పూసే గంజి దీంట్లో పోసుకొంటారు (తె. 9, 18, 21).

**గంజిదుంగ** గంజి పెట్టటానికి, చుట్టిన పడుగు వేసుకొనే కొయ్య; ఇటువంటివి రెండుంటాయి (కో. 15).

**గంజిపలక** పర్యా. చెక్క(3). పడుగు పెట్టుకొనే కొయ్యచెక్క; గంజి పట్టించటానికి పడుగు దీనిమీద పరుస్తారు (కో. 37).

**గంజిపిడచ** **1.** పర్యా. చూ. పిడచ(1). పడుగు తడపటానికి, గంజిలో ముంచినగుడ్డ; కొన్నిచోట్ల, బద్దెపేలికలు కుప్పచేసి పిడచగా ఉపయోగిస్తారు; దీంతో, పడుగుకు గంజికాని, అంబలికాని పట్టిస్తారు. చూ. చిత్రం 74.2 (కో. 27, 30, 31, 34; తె. 1, 2, 6, 7, 9, 10, 18, 20, 21, 26-29, 33; రా. 2, 13, 18); **2.** పర్యా. పిడచ(3). నేతనేసేటప్పుడు, బట్ట ముందుభాగం(=వాయి) బిరుసెక్కటానికి గంజి (కొన్నిచోట్ల, అంబలి) పూసేగుడ్డ. చూ. చిత్రం 142.1 (తె. 1, 2, 9, 21); **3.** (?<-పిడత) గంజి పిడచ పెట్టుకొనే చిన్న మట్టిపాత్ర (రా. 4).

**గంజిపీచు** నేతనేసేటప్పుడు, బట్ట ముందుభాగం (=వాయి) బిరుసెక్కటానికి గంజి పూసేకుంచె, కొబ్బరిపీచు. చూ. చిత్రం 141 (కో. 37).

**గంజిపూత** పడుగుకు గంజి పట్టించటం; పడుగుకు పూసిన గంజి (కో. 9; తె. 5; రా. 5).

**గంజిపెట్టు** (క్రి.) ఉ. గంజిబెట్టు. గంజి పిడచతో, పడుగుకు గంజి పట్టించటం; పోగు బిరుసెక్కటానికి గంజి పెడతారు (కో. 17, 20, 31; తె. 8).

**గంజిబద్దె** పర్యా. చూ. పిడచ(1). పడుగు తడపటానికి, గంజిలో ముంచినగుడ్డ; కొన్నిచోట్ల బద్దెపేలికలు కుప్పచేసి పిడచగా ఉపయోగిస్తారు. చూ. చిత్రం 74.2 (కో. 34).

**గంజిబండ** పర్యా. అంబలిబండ, పడుగుబండ, బండ, సరిబండ. గంజి, అంబలి మొ.వాటితో పడుగు తడపటానికి పరిచిన రాయి. చూ. చిత్రం 74. 1 (కో. 27-29, 32; తె. 1, 2, 6, 10, 18, 20, 29, 33; రా. 3, 4, 6, 12, 13, 19, 20).

**గంజిబాన** పర్యా. బాన(1), సరిబాన. పడుగు పెట్టే గంజిపోసుకొనే మట్టిపాత్ర (కో. 1; రా. 7).

**గంజిబొప్పి** ఒకరకం మట్టిపాత్ర; పడుగుకుపెట్టే గంజి దీంట్లోకి తీసుకొంటారు (రా. 4).

**గంజిమట్టు** నేతనేసేటప్పుడు, బట్ట ముందుభాగం (=వాయి) బిరుసెక్కటానికి గంజి పూసే తాటిమట్ట; కుంచెమాదిరిది. చూ. చిత్రం 140 (కో. 36).

**గంజిమండిగె** ఉ. -మండిక, -మండికి, -మండిగ; రూ. గంజిమండ్రిగ; పర్యా. మండిగె(1). వెడల్పు మూతిగల గుండ్రటి మట్టిపాత్ర; మామూలుగా, పడుగుకుపెట్టే గంజి దీంట్లోకి తీసుకొంటారు. చూ. చిత్రం 139.3 (కో. 25-30, 33, 35-37).

**గంజిమండ్రిగ** చూ. గంజిమండిగె (కో. 34).

**గంజిమొద్దు** గంజి పెట్టటానికి, చుట్టినపడుగు వేసుకొనేకొయ్య; ఇటువంటివి రెండుంటాయి (కో. 13).

**గంజిసాదు** (క్రి.) సరిచేసేటప్పుడు గంజిపెట్టిన పడుగును చేత్తో దూసి విడవటం (తె. 5).

**గంజు** నూలుకండెలు వేసుకొనే ఇత్తడిపళ్ళెం. చూ. చిత్రం 57 (తె. 31).

**గట్టం** పర్యా. కొడత. గూటం; చేత్తో డిజైన్లు అద్దేటప్పుడు, బట్టకు నునుపురావటానికి, ఒక కొయ్య దిమ్మమీద దీంతో కొడతారు; కొన్నిచోట్ల, చల్లవచేసిన

ఖాదీతువ్వాళ్లు చదునుచెయ్యటానికి వాడతారు. చూ. చిత్రం 267 చ. 1 (రా. 24).

**గట్టినేత** పర్యా. తరుచునేత, నసుగునేత. పడుగులో, పేకదారంపోగులు కలిసిపోయేటట్లు చిక్కగా నేసిన నేత (కో. 19; రా 12).

**గట్టుపడు** (క్రి.) **1.** పర్యా. చూ. పూసకట్టు. నేతలో పోగులు ముద్దగా పడటం; పలక గట్టిగా కొట్టినప్పుడు, ఒక్కొక్కప్పుడు ఇలా జరుగుతుంది (కో. 28). **2.** పర్యా. తట్టుపడు(1). బట్టలో కొంత చిక్కగా నేసినప్పుడు, మిగిలిన నేతలో తేడారావటం (కో. 28).

**గట్టెంచు** (గట్టి + అంచు) ముద్దగా (అతికి) నేసిన అంచు (కో. 1).

**గడకర్ర** నూలుచిలపలు ఆరవేసే వెదురుబొంగు (కో. 13, 14).

**గడజేయు** (క్రి.) ఉ. గడసేయు. నేసిన గొంగడి మడతబెట్టటం (తె. 20, 25).

**గడపపచ్చ** ఉ. గడప్పచ్చ. ఒకరకం పసుపురంగు (కో. 6).

**గడారు** ఉ. గడార. **1.** పర్యా. చూ. ఇరుసు(2). రాట్నంఆకులు తిరగటానికి నిలువులకు బిగించిన ఇనప చువ్వ. చూ. చిత్రం 15.7 (రా. 16); **2.** పర్యా. చూ. ఇరుసు(3). డబ్బారాట్నం చక్రం తిరగటానికి నిలువులకు బిగించిన ఇనపచువ్వ. చూ. చిత్రం 41 క. 10 (రా. 16); **3.** చూ. గడ్డపార(2) (రా. 18).

**గడి** పర్యా. గది(2), మడి. ఒకరంగు పడుగులో వేరేరంగు పోగులతో నేసిన చతురం. చూ. చిత్రం 270.1 (కో. 7, 12, 13, 15, 17, 20, 21, 34).

**గడిచీర** చూ. గళ్ళచీర (కో. 17, 21, 34).

**గడినేత** బట్టలో, గళ్లుపడేట్టు, రంగుల పోగులు పెట్టి నేసిన నేత (కో. 18-21).

**గడిపేటుచీర** అంచులో గడిడిజైను పడేట్టు నేసిన చీర (కో. 12, 13).

**గడిబల్ల** పర్యా. చూ. దవడచెక్క. మరమగ్గం చట్రంలో, పానుపుపట్టెకు పక్కన బిగించిన సొరుగు చెక్క; ఇటువంటివి రెండుపక్కలా ఉంటాయి. చూ. చిత్రం 118.15 (కో. 27).

**గడ్డ** **1.** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటినూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు (చూ. రాటి). చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 7ఎ); **2.** అంచు నేతలో, వేలెడు వెడల్పుపట్టె; మామూలుగా, రెండురకాల (డిజైన్ల) నేతకు మధ్య వచ్చింది. చూ. చిత్రం 163 (తె. 13; రా. 13).

**గడ్డకమ్మి** పర్యా. పట్టె(ల)కమ్మి. వేలెడు వెడల్పు కడ్డీల మాదిరిగా నేసిన కమ్మి; ఇటువంటివి, మామూలుగా మూడు నేస్తారు. చూ. చిత్రం 272 (తె. 14).

**గడ్డంకురమలు** ఉ. గడ్డంకుర్మ. గొంగళ్ళునేసే కురమవాళ్ళలో ఒక తెగ (తె. 28).

**గడ్డచీర** సాదారంగుపెట్టి నేసిన చీర (తె. 31).

**గడ్డనీలి** ఉ. గెడ్డనీలి. **1.** నీలివన్నెలో నలుపుచాయ (కో. 1); **2.** నీలివన్నెలో తెలుపుచాయ (కో. 2); **3.** ఒకరకం (కడవ)నీలి రంగు; గడ్డలుగడ్డలుగా వచ్చేది (కో. 3, 7).

**గడ్డనీలిమందు** ఉ. గెడ్డనీలిమందు. బజారులో దొరికే నీలిరంగు; ముక్క(=గడ్డ)లు ముక్కలుగా ఉంటుంది (కో. 1).

**గడ్డపలుగు** ఉ. గడ్డపల్గు, గెడ్డపలుగు. **1.** పర్యా. చూ. గడ్డపార(1). ఊడ్రైను నిలబెట్టి మోకుతో బిగించటానికి, నేలలోపాతిన గునపం. చూ. చిత్రం 63 త. 1 (కో. 7, 13; తె. 13); **2.** నవారు నేసేచోట, మగ్గానికి ఒకపక్క, నేలలో పాతిన గునపం; కొన్ని చోట్ల కొయ్యగూటం వాడతారు; ఇటువంటివి రెండుంటాయి (కో. 12).

**గడ్డపార** ఉ. గెడ్డపార. **1.** పర్యా. ఊడ్రైగునపం, గడ్డపలుగు(1), గునపం, పలుగు, సరిగునపం. ఊడ్రైను నిలబెట్టి మోకుతో బిగించటానికి నేలలో పాతిన గునపం. చూ. చిత్రం 63 త. 1 (కో. 2-6; తె. 5, 12, 14, 21, 26, 27; రా. 1, 2, 5, 6, 14, 18); **2.** దూ. గడారు(3). ఇనపగునపం; రంగు అద్దిన నూలులడీలు దీనికి తగిలించి, ఒక కట్టెతో మెలిదిప్పి పిండుతారు (కో. 14); **3.** తివాసీమగ్గం దోనె బిగింపుకు, పక్కన బెజ్జంలో దూర్చిన గడ్డపార. చూ. చిత్రం 320.10 (తె. 17).

**గడ్డపింజెర(ం)** పర్యా. తొల్లపింజెర. ఒకరకం డాబీ(=నేతలో డిజైనురావటానికి అమర్చేయంత్రం); దిండుకు గాళ్ళు ఉండేది; దీనికి గొలుసు ఉండదు. చూ. చిత్రం 132 ట (తె. 10, 18, 29).

**గడ్డికండువా** ఉ. -కండ్వ. ఒకరకం కండువా; గడ్డి మోసుకు వెళ్ళటానికి నేసింది; అయిదుమూరల పొడుగు, అయిదుజానల వెడల్పు పెట్టి, గోరంచుపడేట్టు నేస్తారు (తె. 15).

**గడ్డిపోగులకోక** పర్యా. చూ. గరికపోచలచీర. ఒకకొలికి ఎరుపు, రెండుకొలుకులు తెలుపు చొప్పున నిలువుపోగులు పెట్టి నేసిన చీర; కొన్నిచోట్ల, నల్లపోగులు ఎనిమిది, తెల్లపోగులు రెండు చొప్పున నిలువుకుపెట్టి నేస్తారు (తె. 33).

**గడ్డిపోగులచీర** పర్యా. చూ. గరికపోచలచీర.

ఒక కొలికి ఎరుపు, రెండు కొలుకులు తెలుపు చొప్పున నిలువుకుపెట్టి నేసినచీర; కొన్నిచోట్ల, నల్లపోగులు ఎనిమిది, తెల్లపోగులు రెండు చొప్పున పెట్టి నేస్తారు (రా. 19బి).

**గణపతిచవితి** ఉ. -సౌతి; రూ. గనెచౌతి; పర్యా. చూ. వినాయకచవితి. వినాయక(=వెనకయ్య)చవితి; భాద్రపద శుద్ధ చవితి; నేతపనివాళ్ళు, మగ్గంసామాను అన్నీ కడిగి, బొట్లుపెట్టి పూజచేసి పండుగ చేసుకొంటారు (తె. 25).

**గణపతిపండుగ** పర్యా. చూ. వినాయకచవితి. వినాయక(వెనకయ్య)చవితి; భాద్రపదశుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గంసామానులన్నీ కడిగి, బొట్లుపెట్టి, పూజచేసి పండుగ చేసుకొంటారు (రా. 16).

**గంటం** ఉ. గంటాం. **1.** రూ. గంట్లం; పర్యా. కదురు(5), డబ్బాకదురు, దోరకదురు, పెద్దకదురు(1), బుడ్లకదురు, సూలం(2). డబ్బారాట్నం బొమ్మలకుగాని, దొడ్డినిలువులకుగాని బిగించే మందపుకడ్డీ; పెద్దకదురు. చూ. చిత్రం 41 క. 12 (కో. 3, 5-19; 21-26, 28, 35, 36); **2.** పర్యా. చూ. కమ్మి(9). మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా, ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; పావుచెక్కలకు చేసిన చిల్లుల్లో దూర్చి, పక్కగూటాలకు వేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (కో. 16, 24); **3.** పర్యా. చూ. తూకం. పేటువడికి కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా, ఇనపపుల్ల; కొన్నిచోట్ల, సత్తుది; నేతనేసేటప్పుడు, వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి, రెండు పక్కగుంటల్లో వేలాడగడతారు. చూ. చిత్రం 132 చ. 15 (కో. 33, 36); **4.** జాకార్డుడాబీ అమర్చిన మగ్గంలో, వడికి చివరకట్టిన ఇనపఊచ; నేతనేసేటప్పుడు, పైకిలేచిన వళ్ళు కిందికి దిగటానికి ఇటువంటివి కడతారు; చూ. తూకం (కో. 34, 37); **5.** పర్యా. చూ. కొడుపు. పత్తినుంచి గింజలు వేరుచెయ్యటానికివాడే ఇనపకడ్డీ; ఇది అప్పడాలకర్రలాగ ఉపయోగిస్తుంది. చూ. చిత్రం 2.2 (కో. 24); **6.** పర్యా. చూ. ఏకుపుల్ల(1). ఏకు తయారు చెయ్యటానికి ఉపయోగించేపుల్ల; ఇనపది. చూ. చిత్రం 11.3 (కో. 11).

**గంటంగుజ్జు** పర్యా. చూ. బొమ్మ (5). డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (కో. 28).

**గంటందిండు** ఉ. -దిండి; పర్యా. చూ. దిండు(4). గంటానికి బిగించిన రీలుదారపుగిలక; డబ్బారాట్నం వడిదారం దీని గాడిలో తిరుగుతూ, గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క. 13 (కో. 25, 26, 28).

**గంటువేయు** (క్రి.) తెగిన ఉన్నిపోగులను ముడివెయ్యటం (తె. 6).

**గంటె** చూ. గరిటె (కో. 16).

**గంటెదీసోడా** మగ్గందగ్గర దీపం పెట్టుకొనే చిప్ప: గరిటె మాదిరిది; పొద్దుగుంకిన తరవాత, మగ్గందగ్గర దీపం పెట్టుకొని నేస్తారు. చూ. చిత్రం 143 చ (తె. 15).

**గంట్లం** చూ. గంటం (కో. 6, 9బి).

**గతిచెక్రం** పెట్టెరాట్నానికిగాని, కిసాన్‌రాట్నానికిగాని ఎడమవైపున కింద ఉండే చిన్న కొయ్యచెక్రం; పెద్దచెక్రాన్ని దీంతో కలుపుతూ ఒక పురితాడు ఉంటుంది; దీనికి అడుగున ఉండే గాడిలోనుంచి కదురుదిండుమీదికి ఇంకొక సన్నటి పురితాడు తిరుగుతూ ఉంటుంది. చూ. చిత్రం 16.2 (తె. 28).

**గత్తబద్ద** మగ్గానికి బిగించిన పడుగులో అచ్చుదగ్గర దూర్చినబద్ద (కో. 18).

**గది** **1.** పర్యా. చూ. గూడు(3). పన్నెదండెలకు బిగించిన పుల్లలమధ్య వెలితి; అచ్చుకట్టేటప్పుడు, ఒక్కొక్కదాంట్లో రెండేసి బద్దెపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో అడతాయి. చూ. చిత్రం 88 క. 9 (కో. 12, 18, 22, 27, 28, 30, 31); **2.** పర్యా. చూ. గడి. ఒకరంగు జట్టులో, వేరేరంగు పోగులతో నేసిన చతురం. చూ. చిత్రం 270.1 (కో. 8).

**గదిపోవు** (క్రి.) నేతనేసేటప్పుడు రెండుపోగులు తెగి వెలితి ఏర్పడటం (కో. 30).

**గదుకుమూకంచు** చివర ఎరుపురంగు జమిలిపోగులు పెట్టి, ముప్పాతిక అంగుళం వెడల్పున సాదాపట్టె పడేట్టు నేసిన అంచు (రా. 24).

**గద్దగోడు** పర్యా. ఊడైకొండె, గొడి, తిరుగుడుకొండి(2), తిరుగుడుసీకు, సరికొండి. ఊడైఅడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని వేసిన ఇనపకొక్కెం; దీనికి, బిగింపుకోసం వేసిన వంకెన కడియంగాని, తిరుగుడుగాని తగిలిస్తారు. చూ. చిత్రాలు 63 గ. 1, 68 ర. 3 (కో. 4).

**గద్దగోరు** ఉ. గెద్దగోరు; పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ; దీన్ని, మామూలుగా మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండి కూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (కో. 23).

**గద్దె** పర్యా. చూ. బొమ్మ (9). మరమగ్గంసారు

గుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (తె. 32).

**గద్దెగులాబి** గులాబిరంగులో ఒకరకం (కో. 35).

**గద్వాలంచు 1.** అయిదు కొలుకుల రంగుదారంతో కడ్డీమాదిరిగానేసి, తరవాత మూడుకొలుకులదారంతో ఒకగీర, ఒకకొలికిదారంతో మరొకగీర, దానిపక్కన బుగిడి వరసగా నేసిన అంచు; కొన్నిచోట్ల గళ్ళుగా నేస్తారు; 2. లాహిరీ, బుగిడి వరసగా నేసిన జెత్తెడు వెడల్పు అంచు. చూ. చిత్రం 175 (రా. 24).

**గనిగుంత** ఉ. గనిగింత; పర్యా. కంత(1), గేవాని. మగ్గందగ్గర గోడలో పెట్టిన కిటికీ; నేతనేసేటప్పుడు మగ్గంమీదికి వెలుతురు రావటానికి కిటికీ పెడతారు. చూ. చిత్రం 108.4 (రా. 8, 9).

**గనెచౌతి** ఉ. గనెసౌతి; చూ. గణపతిచవితి (తె. 22, 29, 32).

**గనెనాతుడు** మగ్గం పై పలక; గణనాథుడు(=వినాయకుడు); భాద్రపద శుద్ధ చవితినాడు, దీనికి పూజ చేస్తారు; చూ. పలక (తె. 22).

**గంధం** బిస్కట్టురంగు (కో. 14, 18).

**గన్నేరుపువ్వుపేటు** అంచులో, గన్నేరుపువ్వు ఆకారంలో నేసిన డిజైను (కో. 2).

**గయి** చెట్లమీది దసలికాయలు విదిలించే గడకర్ర (తె. 17).

**గరికపోచలచీర** పర్యా. గడ్డిపోగులకోక, గడ్డిపోగులచీర. ఒకకొలికి ఎరుపు, రెండుకొలుకులు తెలుపు చొప్పున నిలువుకుపెట్టి నేసిన చీర; కొన్నిచోట్ల, నల్లపోగులు ఎనిమిది, తెల్లపోగులు రెండు చొప్పున నిలువుకుపెట్టి నేస్తారు (తె. 14).

**గరిటె** ఉ. గిరిటి; రూ. గంటె. రంగునీళ్ళలో నూలు ఉడకబెట్టేటప్పుడు, తడిలుతిరగవేసే ఇనపగరిటె; కొన్నిచోట్ల; దీంతో రంగులు కలుపుతారు. చూ. చిత్రం 282 క. 2 (కో. 20, 21; రా. 8).

**గరుసు** ?గట్టిదనం; చిక్కదనం; ఇలాఉన్నగంజి, రెండోసారి వడగడతారు (తె. 16).

**గర్బం** ఉ. గర్బం; పర్యా. చూ. వాయిదారి(1). మగ్గందోనెకూ దండెకూ మధ్య నేతభాగం (తె. 26).

**గర్బసందు** ఉ. గర్బ-; పర్యా. చూ. వాయిదారి (1). మగ్గందోనెకూ దండెకూమధ్య నేతభాగం(తె 24).

**గర్భాధానంచీర** ఉ. గర్బాదానం-; పర్యా. చూ. కార్యంచీర. గర్భాధానం (=కార్యం)నాడు పెండ్లికూతురికిపెట్టే (తెల్ల)చీర; జరీలోగాని, మామూలుగా గాని వెడల్పాటి అంచులుపెట్టి నేస్తారు (రా. 16).

**గలుగుదంటు** పర్యా. గలుబుకట్టె. సముద్రప్రాంతంలో పెరిగే ఒకరకం మొక్కనుంచి తీసినపుల్ల; దీన్ని చీల్చి, పన్నెకట్టుబడిలో, దండెలమధ్య బిగించి కడతారు (రా. 22).

**గలుబుకట్టె** పర్యా. గలుగుదంటు. సముద్రప్రాంతంలో పెరిగే ఒకరకం మొక్కనుంచి తీసినపుల్ల; దీన్ని చీల్చి, పన్నెకట్టుబడిలో, దండెలమధ్య బిగించి కడతారు (తె. 6).

**గవాక్షి** కిటికీ; మగ్గందగ్గర వెలుతురుకోసం ఇంటిమిద్దెకు చేసిన కంత (రా. 16).

**గవ్వంచు** చిగురు వదిలి, తెల్లకొలికి(=కవ్వ)గాని, జరికొలికిగాని పెట్టి వరసగా నేసిన అంచు; ఏలూరు వైపున దీన్ని 'మువ్వంచు' అంటారట (కో. 24).

**గష్కి** అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 7).

**గసగసాగడిచీర** రెండుకొలుకులు ఒకరంగు, రెండుకొలుకులు మరొకరంగు పెట్టి నేసిన గళ్ళచీర (కో. 7).

**గసగసాలచుక్క** ఉ. గసగసాల్సుక్క. ఒకరకం అద్దకండిజైను; అంచుల్లో వేస్తారు (కో. 3).

**గసాలచీర** ఒకరకం (?గడి) నేతచీర (రా. 19బి).

**గసితె** పర్యా. చూ. కర్రు. ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం. చూ. చిత్రం 66.1 (కో. 12).

**గసితెపుల్ల** మగ్గంగుంటలో పావుచెక్కల గూటం ముందుకు జరగకుండా ఆపే కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 చ. 2 (కో. 12).

**గసిగి 1.** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు, మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 7); **2.** ఉ. గసికి; పర్యా. చూ. చేతిగూటం. మగ్గంమీద నేతబిర్రు పెట్టటానికి, మోకుకట్టేకొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతిఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 7, 19).

**గళ్ళచీర** ఉ. గళసీర, గళ్ళచీరి; రూ. గడిచీర; పర్యా. కండ్లచీర, దళ్ళచీర, మళ్ళచీర. అంచులమధ్య భాగంలో, రంగుపోగులుపెట్టి, గదులుగదులుగా నేసిన చీర; మామూలుగా, నల్చదరపుగళ్ళునేస్తారు (కో. 5, 11, 15, 16, 18, 21, 30, 32; తె. 1, 2).

**గాజు 1.** పర్యా. ఉంగరం(11). పట్టుదారం వడికేటప్పుడు, కదురునుంచి వచ్చిన పోగును దూర్చటానికి,

కొయ్యపట్టెకు బిగించిన ఇనపచుట్టు; కొన్నిచోట్ల చేతికి తొడుక్కొనే గాజులు బిగిస్తారు; ఇటువంటివి, గాజుల కట్టెమీద వరసగా ఉంటాయి. చూ. చిత్రం 293 చ. 14 (తె. 21); **2.** పర్యా. ఉంగరం(12). ఉన్నికత్తెర ఆకులకు కిందవేసిన ఇనపచుట్టు. చూ. చిత్రం 306.3 (తె. 3).

**గాజుబులుగు** ఒకరకం నీలంరంగు; చేతిగాజులరంగు మాదిరిది (కో. 9బి).

**గాజులకట్టె** పర్యా. ఉంగరాలకట్టె, కొండ్లకర్ర(2), కొండ్లపీట, గాజులపట్టీ. పట్టుదారం వడికేటప్పుడు, పెద్దరాట్నందగ్గర కదుర్లపీటకు కిందగా–కొన్నిచోట్ల, పక్కగా–పెట్టే కొయ్యపట్టె; దీనికి ఇనపచుట్లు (కొన్నిచోట్ల కొండ్లు)గాని, చేతులకు తొడుక్కొనే గాజులు గాని బిగించి ఉంటాయి; దారం వడికేటప్పుడు, కదురుపోగులు దీని గాజులగుండా వచ్చి డొలకమీద చుట్టుకొంటాయి. చూ. చిత్రం 293 చ. 13 (తె. 21; రా 14).

**గాజులపట్టీ** పర్యా. చూ. గాజులకట్టె. పట్టుదారం వడికేటప్పుడు, పెద్దరాట్నందగ్గర కదుర్లపీటకు కిందగా–కొన్నిచోట్ల, పక్కగా–పెట్టే కొయ్యపట్టె; దీనికి ఇనప చుట్లు(కొన్నిచోట్ల కొండ్లు)గాని, చేతులకు తొడుక్కొనే గాజులుగాని బిగించిఉంటాయి; దారంవడికేటప్పుడు, కదురుపోగులు దీని గాజులగుండా వచ్చి డొలకమీద చుట్టుకొంటాయి. చూ. చిత్రం 293 చ. 13 (తె. 21; రా. 14).

**గాజువన్నె** పచ్చ, నీలం కలిసిన (గాజు) రంగు (కో. 11).

**గాజువన్నెచీర** ఉ. ?గాజవన్నెచీర. మూడుపోగులు ఎరుపు, మూడుపోగులు నలుపు చొప్పున పడుగు అతికి నేసిన చీర (తె. 18).

**గాటు** గాడి; అచ్చుగుది బిగింపుకు పూనుగర్రకు రెండువైపులా గాట్లుపెడతారు. చూ. చిత్రం 121 ట. 2 (కో. 7).

**గాడ** ముడిపత్తి (కో. 33, 34).

**గాడి** ఉ. గాడీ. **1.** రూ. గాడెం(1); పర్యా. చూ. పలకగాడి(2). చేతిమగ్గం పలకకు పన్నె పైవైపు బిగించటానికి చేసినసందు. చూ. చిత్రం 109 చ. 2 (కో. 14, 34, 36, 37; తె. 4, 18, 19, 21, 22, 25); **2.** రూ. గాడెం(3), గేడి(1); పర్యా. చూ. దోనెగాడి. నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. చూ. చిత్రం 123 క. 3 (కో. 3, 6, 9, 14, 24, 30, 31, 36, 37; తె. 1, 2, 4, 7, 10, 18, 21-23, 33; రా. 6, 9, 11, 12, 14-19, 24); **3.** రూ. గాడెం(2), గేడి(2), పర్యా. చూ. పలకగాడి(1). మరమగ్గం పలకకు పన్నె బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 118.12 (తె. 22; రా. 17, 19ఎ); **4.** రూ. గాడెం(4), గేడి(3); పర్యా. చూ. నాడెగాడి. నాడెలో పేకదారంకండె అమర్చేసందు. చూ. చిత్రం 131 చ. 1 (కో. 12, 13, 16, 18-21, 31, 34, 36, 37; తె. 2, 4, 9, 15, 18, 19, 21, 25, 33; రా. 3, 8, 10, 11, 13-18).

**గాడికుంచె** పురికిమధ్య గాడి ఉన్న కుంచె; చూ. పురి. చూ. చిత్రం 77 (కో. 4, 5).

**గాడిచిల్ల** ఉ. -సిల్ల; పర్యా. చూ. పన్ను(1). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (రా. 15).

**గాడిపట్టె** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు, దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118.9 (రా. 9).

**గాడిపన్ను** పర్యా. చూ. పన్ను(1). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (తె. 18).

**గాడిబద్ద** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు. కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118 (కో. 27).

**గాడెం** **1.** చూ. గాడి(1) (తె. 5, 11, 12); **2.** చూ. గాడి(3) (తె. 5, 12, 14, 15, 17, 26, 27, 30); **3.** చూ. గాడి(2) (తె. 5, 18); **4.** చూ. గాడి(4) (తె. 12, 25, 27).

**గానందబ్బ** అచ్చుదారానికి కట్టినపుల్ల (రా. 12).

**గాని** (బహు. గాండ్లు). పర్యా. చూ. పెడకోల చెక్రం. పెడకోలను మోసే కొయ్యచెక్రం; ఇటువంటివి రెండుంటాయి; నేతమోకు వదులు చేసినప్పుడు, పడుగు నేలకు తగలకుండా పెడకోల చెక్రాలమీద తిరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129 ప. 1 (రా. 10).

**గాను** **1.** పర్యా. చూ. చెక్రం(4). డబ్బారాట్నం ఇరుసుకు బిగించిన (రేకు) చెక్రం; దీనిమీద వడిదారం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 9 (కో. 4; రా. 11);

2. పర్యా. చూ. కడియం(1). ఊద్దె అడ్డపట్టెకు బిగించిన ఇనపచుట్టు. చూ. చిత్రం 64 చ. 1 (కో. 4).

**గాంధీకమ్మి** ఒకరకం కమ్మి; మొదట మూడంగుళాల వెడల్పున నేసి తరవాత ఒకకొలికి రంగుగీర, రెండు కొలుకుల తెల్లగీర(లు), రెండు కొలుకుల రంగు గీర(లు) పడేట్టు నేస్తారు (కో. 8).

**గాబు** రంగునీళ్లు ఉడకబెట్టే తొట్టి. చూ. చిత్రం 282 క. 3 (కో. 14; తె. 12–14).

**గాల** పర్యా. చూ. దోనుగగాడి(2). ఉన్నిమగ్గం దోనుగకు, సులిగె బిగించటానికి తొలిచిన సందు; చూ. దోనుగ. చూ. చిత్రం 315 క. 1 (తె. 10, 26).

**గావంచా** పర్యా. చూ. అంగవస్త్రం. మగవాళ్లు మోకాళ్లవరకూ కట్టుకొనే ఒకరకం చిన్నబట్ట; సన్నటి అంచుపెట్టి, 2-5 మూరలపొడుగున పలచగా నేస్తారు; కొన్నిచోట్ల ముతకది; కొన్నిచోట్ల, తువ్వాలుమాదిరిగా దీంతో ఒళ్ళుతుడుచుకొంటారు; కొందరు మడిగట్టుకోటానికి వాడతారు (కో. 16, 21, 25-28, 31, 33, 35, 37).

**గింటం** ఉ. గింటిం, గింటుం; పర్యా. జమిలి. రెండు పోగులు పురిపెట్టినదారం; జమిలిదారం (తె. 1; రా. 4, 8, 16, 17, 24).

**గింటంఅతుకు** (క్రి.) పర్యా. జములతుకు. సరిచేసిన పడుగులో రెండేసిపోగులు ఒక బద్దెపోగుకు కలిపి అచ్చు తకటం; కొన్నిచోట్ల, మగ్గంమీద అతుకుతారు (రా. 14, 15).

**గింటందుప్పటి** పర్యా. చూ. సుదినీ. నేతలో నిలువుకు, అడ్డానికి రెండేసి పోగుల చొప్పునపెట్టి నేసిన దుప్పటి; కొన్ని చోట్ల, గళ్ళుగళ్ళుగా నేస్తారు (రా.14).

**గింటంనూలు** పర్యా. చూ. జమిలి(నూలు). రెండు పోగులు కలిపి పురిపెట్టిన నూలు (తె. 2).

**గిన్నిపత్తి** (< ?గినీపత్తి) చూ. జెడపత్తి(తె. 5).

**గిన్నె** రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది; చూ. పావు; చూ. చిత్రం 282.1 (కో. 3; రా. 11, 13).

గిర చూ. గీర (2) (తె. 12).

గిరక (-ఒత్తు, -పట్టు)ఉ.గిరకె, గిరికె, గిర్క-. **1.** రూ. గిలక(1); పర్యా. చూ. పత్తిరాట్నం(1). పత్తినించి గింజలు విడదీసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 1 (కో. 9, 14; తె. 4, 5, 11–17, 28; రా. 16, 17, 22, 24); **2.** పర్యా. చూ. సంగటికోల. పత్తిరాట్నం నిలువులమధ్య రూళ్ళకర్ర మాదిరిగా ఉండే కట్టె; ఇటువంటివి రెండు ఒకదానొకటి అనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడిపత్తి పెట్టినప్పుడు ఒక వైపు గింజలు, మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1.1 (కో. 9; తె. 5, 11, 15, 17); **3.** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంచె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (తె. 23, 24, 33); **4.** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చినరాటి; చూ. రాటి. చూ. చిత్రం 34 (తె. 21, 25, 27, 29); **5.** పంకరు రేకలు తిరగటానికి, కింద బిగించిన గుండ్రటి కొయ్య బిళ్ళ. చూ. చిత్రం 38 ట. 1 (తె. 11); **6.** రూ. గిలక(5); పర్యా. అచ్చుగిరక, ఇరుపుగోలు చెక్రం, ఇరుపుచెక్రం, చెక్రం(10), చెక్రంగిరక, తొక్కుడు బిళ్ళ, బిళ్ళ(12), వాయిచెక్రం, సూత్రంచెక్రం. మగ్గం మీద అచ్చుగుదులు తగిలించే కొయ్యకప్పీ; దీన్ని మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 11 (తె. 4, 10, 13, 14, 16, 18); **7.** రూ. గిలక(6); పర్యా. చూ. పికాసి. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, అమర్చిన కొయ్యగిలక; మామూలుగా, మిషను దారం చుట్టే కొయ్యకీలు; ఇటువంటివి, ఉడతలకు బదులు, రెండు సొరుగుల్లోనూ అమరుస్తారు. చూ. చిత్రం 120 (తె. 8, 18, 22); **8.** పర్యా. చూ. పుల్లిరుసు. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలి వంటి గుండ్రటి పొడుగుకర్ర; కొన్నిచోట్ల, ఇటువంటివి చిన్నవి రెండుంటాయి; నేతనేసేటప్పుడు, అచ్చుతాళ్ళు దీనిమీద ఆడతాయి. చూ. చిత్రాలు 121 చ. 3, 121 ప. 1 (తె. 31); **9.** పెద్ద కొయ్య ఊచకు దారం చుట్టిన కండె; bobbin (తె. 8).

**గిరకఆకు** ఉ. గిర్క-; పర్యా. చూ. ఆకు(5). అడ్డగుమ్మికి రెండువైపులా కట్టిన వెదురుబద్ద(లు); చూ. చిత్రం 31 క. 3 (తె. 21).

**గిరకఊచ** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల, రాటికట్టుబడిలోనే ఒకభాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 33).

**గిరకకదురు** ఉ. గిర్క-; పర్యా. చూ. సంగటి కోల. పత్తిరాట్నం నిలువులమధ్య రూళ్ళకర్రమాదిరిగా ఉండే కట్టె; ఇటువంటివి రెండు ఒకదానొకటి అనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడిపత్తి పెట్టినప్పుడు ఒకవైపు గింజలు, మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1.1 (తె. 4).

**గిరకకొండి** ఉ. గిర్క-; పర్యా. చూ. కొండి(6).

అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ; దీన్ని మామూలుగా మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; కొన్ని చోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండికూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (తె. 31).

**గిరకకోల** ఉ. గిర్కకోల, గిరికైకోల; పర్యా. చూ. సంగటికోల. పత్తిరాట్నం నిలువులమధ్య రూళ్ళకర్ర మాదిరిగా ఉండేకట్టె; ఇటువంటివి రెండు, ఒకదానొ్కటి అనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడి పత్తి పెట్టినప్పుడు ఒకవైపు గింజలు, మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1.1 (తె. 13; రా. 24).

**గిరకగుంజ** పర్యా. చూ. గుమ్మినిలువు. అడ్డగుమ్మి తిరగటానికి ఆధారంగా అడ్డకట్టెకు పాతిన నిలువు కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 34.5 (తె. 25).

**గిరకజంగ** పర్యా. చూ. తొక్కుడుపట్టె(1). పత్తి పట్టేటప్పుడు, రాట్నం కదలకుండా తొక్కిపట్టటానికి అమర్చిన పట్టె. చూ. చిత్రం 1.4 (కో. 6, 37).

**గిరకతాడు** **1.** పర్యా. చూ. గుమ్మిదారం. రాటి ఆకులు (పైవీ, కిందివీ) కలిపి కట్టినదారం. చూ. చిత్రం 31 ప. 4 (తె. 23, 24); **2.** పర్యా. చూ. బిరుతాడు(3). అడ్డగుమ్మి ఆకులు కలిపి కట్టినదారం చూ. చిత్రం 34.4 (తె. 21, 25, 29); **3.** రూ. గిలకతాడు(1); పర్యా. చూ. పికాసితాడు. మగ్గంపికాసికీ బొమ్మకూ కట్టినదారం; చూ. ఉడతతాడు (తె. 22); **4.** ఉ. గిర్క–; పర్యా. చూ. పుల్లిరుసుతాడు. పుల్లిరుసుకు వేసిన అచ్చుసూత్రం; వాయితాడు. చూ. చిత్రం 121 చ. 5 (తె. 4, 12).

**గిరకదామ** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల, రాటికట్టుబడిలో ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల. దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 23).

**గిరకదారం** గిలకకువేసిన అచ్చుసూత్రం. చూ. చిత్రం 121 గ. 1 (తె. 31).

**గిరకనిలువు** పర్యా. చూ. నిలువు(4), రాటికి ఆధారంగా పాతిన నిలువుకొయ్య; ఒకటిగాని రెండుగాని ఇలాటివి ఉంటాయి. చూ. చిత్రం 31 ప. 1 (తె. 23).

**గిరకనిలువుగుంజ** ఉ. గిర్క–; పర్యా. చూ. గుమ్మినిలువు. అడ్డగుమ్మి తిరగటానికి ఆధారంగా అడ్డకట్టెకు పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 34.5 (తె. 21; రా. 17).

**గిరకపంటె** ఉ. గిర్క–. నూలుచిలపలుతోడే ఒక రకం రాటి; చూ. రాటి (తె. 17).

**గిరకపంటెతాడు** గిరకపంటె(=ఒకరకంరాటి) కింది ఆకులను, పై ఆకులను కలిపి కట్టినతాడు (తె. 17).

**గిరకపీట** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (తె. 23).

**గిరకబద్ద** **1.** పర్యా. చూ. ఆకు(5). రాటికి కిందా పైనా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 24, 33); **2.** పర్యా. చూ. ఆకు(6). అడ్డగుమ్మికి రెండువైపులా కట్టిన వెదురుబద్ద(లు) చూ. చిత్రం 34.3 (తె. 29).

**గిరకమొద్దు** **1.** ఉ. గిర్క–; పర్యా. చూ. ముద్దగొయ్య(1). పంటెకు నూలు చుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగాపెట్టే మొద్దు; దీనికి అమర్చినకొయ్య చిల్లిలో పంటెమొల పెట్టి తిప్పుతారు. చూ. చిత్రం 24 (తె. 27); **2.** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాట్నసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (తె. 24, 33).

**గిరకరాటుం** ఉ. గిరికెరాటుం; పర్యా. చూ. పత్తిరాట్నం. పత్తినించి గింజలు వేరుచేసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 1 (రా. 16, 17).

**గిరకలబడితె** పర్యా. చూ. ఇరవలదండి. కోతిపుల్లలుగాని, గిలకలుగాని వేలాడదియ్యటానికి మగ్గానికి పైనదారాలు కట్టినకర్ర. చూ. చిత్రం 121 క. 13 (తె. 32).

**గిరిడి** రూ. గిరిణి; పర్యా. నిడివిబిళ్ళ. పన్నెకట్టేటప్పుడు, దండెలమధ్య బిగించిన పుల్లలు ఒకేమట్టంలో ఉండేట్టు కొలత చూసుకోటానికి, దండెలమధ్య ఎక్కించిన కొయ్యముక్క; పన్నెకట్టుబడి ప్రారంభించిన వైపునుంచి, రెండోవైపుకు దీన్ని జరుపుకొంటూ వెళ్తారు. చూ. చిత్రం 89 క. 8 (కో. 5, 26, 33).

**గిరిణి** చూ. గిరిడి (కో. 5, 7).

**గిరేయు** (క్రి.) పంటెతిప్పటం; చూ.పంటె (తె.22).

**గిర్నినూలు** పర్యా. చూ. మిల్లునూలు. మిల్లులో యంత్రాలమీద తయారయిన నూలు (తె 5, 11).

**గిర్ర** **1.** రూ. గిల్ల(3), పర్యా. బిళ్ళ(3). చెలకపంటె ఆకులమధ్య ఉండే కొయ్యచక్రం; ఇటువంటివి రెండుంటాయి; మధ్యన కదురు దూర్చటానికి బెజ్జం ఉంటుంది. చూ. చిత్రం 29 క. 2 (తె. 15, 16); **2.** మగ్గంగిరకలో బిగించిన కొయ్యచక్రం; చూ. గిరక. చూ. చిత్రం 121 క. 12 (తె. 16).

**గిలక 1.** చూ. గిరక(1) (కో. 11, 13, 19); **2.** పర్యా. చూ. దిండు(4). గంటానికి బిగించిన రీలు దారపుబండి; డబ్బారాట్నం వడిదారం దీనిగాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క.13 (కో. 6); **3.** పర్యా. చూ. బిళ్ళ(6). ఊడ్తెతాడు బిగింపుకువేసే కొయ్యగిలక; కొన్నిచోట్ల, ఇనపది. చూ.చిత్రాలు 63 ప. 1, 66(కో. 5, 7, 10, 11, 12ఎ); **4.** పర్యా. చూ. డాబీ. నేతలో డిజైన్లు రావటానికి, మరమగ్గంపైన అమర్చే యంత్రం. చూ. చిత్రం 132 (రా. 12, 13); **5.** చూ. గిరక(6) (కో. 7, 8, 10, 13; రా. 18); **6.** చూ. గిరక(7) (రా. 11).

**గిలకకత్తి** పర్యా. చూ. కుక్క(2). డాబీకోలలను తేపటానికి, దిండుచెక్రాన్ని-కొన్నిచోట్ల, దిండుగాడిని-గుంజే ఇనపరేకు; దీనికి ఒకవైపున పేటుతాళ్లు కడతారు; పావుచెక్క తొక్కినప్పుడు, పళ్ళచెక్రాన్నిగాని, దిండుఊచల చెక్రాన్నిగాని గుంజుతూ కిందికీ పైకీ ఆడుతుంది. చూ. చిత్రాలు 132 క. 3, 132 చ. 7, 132 ట. 3 (రా. 13).

**గిలకతాడు 1.** చూ. గిరకతాడు(3). (రా. 11); **2.** గిలకకువేసివ అచ్చుసూత్రం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 గ. 1 (కో. 10).

**గిలకదిండు** పర్యా. చూ. దిండు(7). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు; బోట్లపింజెర దిండుకు బొడిపెలు, తొల్లపింజెర దిండుకు గాళ్ళూ ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు; దీనికి గొలుసు తగిలిస్తారు; కొన్నిచోట్ల, దీనికి చివర ఇనప ఊచల చెక్రంగాని, రేకుపళ్ళచెక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (రా. 13).

**గిలకపట్టె** మగ్గంగిలకలు వేలాడటానికి, పైన అమర్చిన కర్ర(లు). చూ. చిత్రం 133 క (రా. 12).

**గిలకమగ్గం** పర్యా. పేటుమగ్గం. ఒకరకం మగ్గం; డిజైన్లు నెయ్యటానికి; పైన డాబీ అమర్చింది; చూ. డాబీ (రా. 13).

**గిలకమోకు** పర్యా. బిళ్ళతాడు(1). ఊడ్తెబిళ్ళ బిగించేతాడు. చూ. చిత్రం 63 ప. 3 (కో. 12ఎ).

**గిలకవారు** పర్యా. పిక్కరవార. మరమగ్గం బొమ్మకూ, పికాసికీ కట్టిన తోలుపట్టీ. చూ. ఉడత తాడు (రా. 11).

**గిలకసూత్రం** ఉ. -సూత్త్రం; పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లుపడటానికి, డాబీఅడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసినదారం; డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు. చూ. 132 చ. 10 (రా. 12).

**గిలక్కాయ** (< గిలక + కాయ) మరమగ్గంలో ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో తాళ్ళను గుంజేపిడి; దారపురీలు కడతారు; చూ. కుచ్చు. చూ. 118.21 (కో. 16).

**గిల్ల 1.** పర్యా. బిళ్ళ(1). చేతికదురుకు దారం చుట్టుకొనేవైపు ఉండే గుండ్రటి బిళ్ళ; దీన్ని కట్టె, ఇనుము, ఇత్తడి, రాగి మొ. వాటితో తయారుచేస్తారు. చూ. చిత్రం 17 ట. 2 (తె. 12, 15); **2.** పర్యా. చూ. చెక్రం(4). డబ్బారాట్నం ఇరుసుకు బిగించిన రేకుచెక్రం; దీనిమీద వడిదారం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 9 (తె. 10); **3.** చూ. గిర్ర(1). (తె. 11, 14).

**గిల్లాకు** (< గిల్ల + ఆకు) పర్యా. ఆకు(7). డబ్బారాట్నం చెక్రానికి అమర్చిన సాపుచెక్క(లు). చూ. చిత్రం 41 చ. 1 (తె. 10).

**గీతగుండంచు** జమిలిపోగులతో నేసిన ఒకరకం అంచు (రా. 1).

**గీతన్ శోభ** అంచులో నేసిన ఒకరకం డిజైను(తె.25).

**గీతబద్ద** డిజైను అద్దకానికి, మెత్తమీద పోసిన రంగు సమంగా నెరిపేబద్ద; అంగుళన్నర పొడుగుది (కో. 26).

**గీర 1.** పర్యా. చూ. చెక్రం(4). డబ్బారాట్నం ఇరుసుకు బిగించిన రేకుచెక్రం; దీనిమీద వడిదారం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 9 (తె. 19); **2.** రూ. గిర, గీరు, జీర (2). గీత; నేతలో సన్నగా గీతపెట్టినట్టు వేరే రంగుదారం పెట్టి నేస్తారు (కో. 5); **3.** పర్యా. జిమ్ము(లు). కమ్మినేతలో, జైనెకు పొడుగుచెరగు నేసిన తరవాత పెట్టిన జంటగీర(లు). (కో. 6).

**గీరంచుధోవతి** ఉ.-దావతి; పర్యా. గీరంచుపంచె. గీరంచుపెట్టి నేసిన పంచె (రా. 17).

**గీరంచుపంచె** ఉ.-పంచి; పర్యా. గీరంచుధోవతి. గీరంచుపెట్టి నేసినపంచె (రా. 17).

**గీరలంచు** ఉ. గీర్లంచు; రూ. జీరలంచు. వరసగా గీతలుపడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 184 (కో. 14, 15).

**గీరలువిడుచు** (క్రి.) ఉ.గీర్లిడుసు. అంచులో, గీరలు పడేట్టు నెయ్యటం (రా. 17).

గీరు చూ. గీర(2) (రా. 14).

గీరుకత్తి పర్యా. ఈనెగీతకత్తి, ఖావా, ఛురీ, బట్. పన్నెదండెలమధ్య బిగించేజొన్న-కొన్నిచోట్ల, కలపపుల్లలుచీల్చి, సాపుచేసే రేకుకత్తి; ఒకవైపు వంపుగా గాడి ఉంటుంది; మామూలుగా, ఒక వెదురుబొంగును సగానికి చీల్చి, మధ్యగా కత్తి ఇరికిస్తారు; కొన్నిచోట్ల,

ఒక గుంజకు కోటాబద్దకట్టి రెంటికీమధ్య కత్తి దూరుస్తారు. చూ. చిత్రం 89 క. 6 (కో. 26).

**గిరుపుల్ల** ఉ. గిరపుల్ల. నేతనేసేటప్పుడు చెదిరిన పోగులను సాపుచేసేపుల్ల; పోగులు ఒకదానిమీద ఒకటి పడ్డప్పుడుగాని, పోగులుచిక్కుపడి వెలితివచ్చినప్పుడుగాని దీంతో గిరుతారు (కో. 25,26,32,35; తె. 8,18,33).

**గుచ్ఛం** నాలుగుపోగుల ఉన్నిదారం (తె. 3).

**గుచ్ఛుగర్ర** పర్యా. బద్దెగుచ్చుకర్ర. అచ్చుతీసిన తరవాత బద్దెలో పోగులు చెదరకుండా దూర్చిన సన్న బెత్తం; కొన్నిచోట్ల, వెదురుబద్దగాని, ఇనపకడ్డీగాని దూరుస్తారు; ఇటువంటివి, బద్దెలో ఇవతల ఒకటి, అవతల ఒకటి ఉంటాయి; అల్లుచేసేటప్పుడు, దీన్ని ఊడ్తె గుదులకు తగిలిస్తారు; కొన్నిచోట్ల, గూటాలకు కడతారు. చూ. చిత్రం 102 త (కో. 12, 17).

**గుజ్జు 1.** రూ. గుర్జు(1); పర్యా. చూ. నిలువు(1). పత్తిరాట్నం అడ్డపీటకు దిగ్గొట్టినకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 1.3 (కో. 14, 36, 37; తె. 11, 13. 14, 17); **2.** ఉ. గుజు(లు); పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (కో. 27-31, 33, 34, 36, 37; తె. 11-15, 17, 26, 29-31); **3.** పర్యా. చూ. నిలువు(6). డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 2 (కో. 28, 36, 37; తె. 31); **4.** పర్యా. చూ. చిప్పె(2). పంచెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు); తె. 13 లో హరిజనుల వాడుక. చూ. చిత్రాలు 19 క. 3, 19 క. 4 (కో. 6, 8; తె. 13); **5.** పర్యా. చూ. గుమ్మినిలువు. అడ్డగుమ్మి తిరగటానికి ఆధారంగా అడ్డకట్టెకు పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 34.5 (తె. 26); **6.** పర్యా. చూ. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్నిచోట్లరాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 37); **7.** గిరకపంచె(=ఒకరకం రాటి) అడుగు పీటకు, పక్కగా బిగించిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి (తె. 17); **8.** పర్యా. నిలువు(16). పట్టుదారంచుట్టే డొలకకట్టుబడిలో, ఇరుసును మోసే కొయ్య; ఇటువంటివి, రెండుపక్కలా ఉంటాయి. చూ. చిత్రం 293 క. 2 (తె. 12).

**గుజ్జెడ** (< గుది + జెడ) పర్యా. చూ. పంటిగుది. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి, పుల్లకుకట్టిన తాడు; ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.2 (కో. 8).

**గుంజ 1.** పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (కో. 3, 23; తె. 18, 24, 28, 33); **2.** పర్యా. చూ. బొమ్మ(5). డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (కో. 3); **3.** పర్యా. చూ. నిలువు(6). డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 2 (కో. 3); **4.** పర్యా. చూ. గూటం(3). ఊడ్తెను నిలబెట్టి తాడుతో బిగించటానికి, నేలలో పాతినగూటం; కొయ్యదిగాని, ఇనపదిగాని, రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7 (తె. 7, 9, 19, 20, 22; రా. 9, 10, 12, 13); **5.** పర్యా. గూటం(5). నేలలో పాతిన నిలువుకొయ్య; పన్నెపుల్లలు చీల్చి, సాపుచేసే గిరుకత్తి బిగించటానికి కోటాబద్ద కట్టిన నిలువుకొయ్యకు, కోటాబద్దకు మధ్య కత్తి ఇరికిస్తారు. చూ. చిత్రం 89 క. 4 (కో. 33); **6.** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద, నేతబిర్రుపెట్టటానికి మోకు కట్టేకొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (రా. 9, 19ఎ); **7.** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు, మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు, పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (రా. 11, 12); **8.** పర్యా. చూ. నట్టరుగుంజ(1). మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా, నేతబయలులో పాతిన కొయ్యరాట; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల, రెండు. చూ. చిత్రం 116.2 (తె. 18; రా. 10); **9.** పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట; మామూలుగా, కొయ్యది; కొన్నిచోట్ల, ఇనపది; మామూలుగా, దీనికి శిలువ మాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల. గుంజకు చిల్లిచేసి, దాంట్లో గునపందూర్చి లడీలు తగిలించి, పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (కో. 10; తె. 12, 13); **10.** పర్యా. చూ. ఆసుకొయ్య(3). ఆసుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టివచ్చేట్టు ఆసుకు నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (తె. 1, 2, 21; రా. 1-17, 20, 23, 24); **11.** మొగలాసుకు పడుగునూలు చుట్టటానికి బిగించిన కొయ్యపుల్ల(లు). చూ. చిత్రం 47.3 (తె. 6);

12. పర్యా. చూ. నిలువు(10), మరాసు ఇరుసును మోసే పొడుగుకొయ్య(లు); గోతిపక్కల పాతినవి. చూ. చిత్రం 50.9(కో. 14, 16; రా. 2); **13.** మరాసు బడ్డీకి ఆధారంగా, నేలలోప తిన కొయ్య(లు) (రా.18); **14.** పర్యా. చూ. సరిగుంజ(1). ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతినకొయ్య; కొన్ని చోట్ల, రాతిస్తంభం; ఇటువంటివి, ఒకటి రెండుంటాయి. చూ. చిత్రాలు 63 ట. 1, **65** ర. 1, 65(కో. 7. 13, 14, 20; తె. 1, 2, 5, 6, 8-18, 20, 21, 25-27; రా. 2. 4, 6, 9, 11-14, 17, 19, 23); **15.** పర్యా. చూ. చిల్ల(7). మగ్గంకుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా, చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (రా. 14).

**గుంజకేయు** (క్రి.) తడిపిన నూలులడీలు, కానిగుంజ అడ్డకట్టెకు తగిలించి పిండటం (తె. 12).

**గుంజగొలుసు** పడుగుచాపేటప్పుడు, సరిగుంజకు వేసి, పడుగేరుకర్రకు తగిలించే ఇనపపనిముట్టు; చూ. గొలుసు (తె. 25).

**గుంజలపీట** **1.** పర్యా. చూ. పీట(2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట చూ. చిత్రం 15.1 (కో. 3); **2.** పర్యా. చూ. అడ్డపట్టె(5). డబ్బా రాట్నం తొక్కుడుపీటకు ఎడమవైపు బిగించిన చిన్న పట్టె. చూ. చిత్రం 41 క. 4 (కో. 3); **3.** పర్యా. చూ. పీట(8). డబ్బారాట్నం నిలువులు బిగించిన కింది పీట. చూ. చిత్రం 41 క. 1 (కో. 3).

**గుంజుడుగొయ్య** పర్యా. చూ. తట్టు(డు)కొయ్య. మిడిగూటానికి వేసిన నేతమోకు, పడుక్కు అడ్డు రాకుండా తగిలించటానికి పాతినగూటం; మామూలుగా, నేతబయలులో ఒకమూల ఉంటుంది; కొన్ని చోట్ల, మిడిగూటానికిగాని, దంటెకుగాని కొంచెం ఎడంలో వేస్తారు. చూ. చిత్రం 127.14 (తె. 32).

**గుటికె** పర్యా. చూ. పికాసి. మరమగ్గంనాడెను, ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్యగిలక; మామూలుగా, మిషనుదారంచుట్టే కొయ్యరీలు; ఇటువంటివి, ఉడతలకుబదులు రెండుసొరుగుల్లోనూ అమరుస్తారు. చూ. చిత్రం 120 (తె. 32).

**గుటికెతాడు** పర్యా. చూ. పికాసితాడు. మగ్గం పికాసికీ బొమ్మకూ కట్టినదారం; చూ. ఉడతతాడు (తె. 32).

**గుట్టిల్ల** చూ. గూటిల్ల (కో. 14).

**గుడ** ఉన్నిదారం ఉండ; రంగు అద్దిన ఉన్నిదారం కట్ట; తివాచీనేతకు వాడతారు. చూ. చిత్రం 321.3 (కో. 16; తె. 17).

**గుడప** చూ. కడవ(3) (రా. 18).

**గుడి** పర్యా. చూ. కొలికి(1). అనుపోసిన నూలులో ఒకటి పైకీ, ఒకటి కిందికీ వచ్చిన రెండుపోగులదారం (తె. 33).

**గుడుగుపత్తి** తెల్లపత్తిలో ఒకరకం (రా. 19).

**గుడ్డదోనె** పర్యా. చూ. దోనె(3). మగ్గంమీద, నేసినబట్ట చుట్టే కొయ్యదూలం; మామూలుగా సలుపలకలది; కొన్నిచోట్ల, గుండ్రటిది; దీనికి ఒకవైపున పొడుగ్గా గాడిగాని, నాలుగయిదు చిల్లులుగాని ఉంటాయి; జెనెకుబట్ట నేసిన తరవాత దీనికి చుడతారు; దీన్ని నాలికకొయ్యకూ, బొడ్డుగొయ్యకూ మధ్య అమరుస్తారు. చూ. చిత్రం 123 క. 2 (కో. 1; రా. 5).

**గుడ్డపిడచ** పర్యా. చూ. పిడచ(1). పడుగు తడపటానికి, గంజిలో ముంచినగుడ్డ; కొన్నిచోట్ల, బద్దెపేలికలు కుప్పచేసి పిడచగా ఉపయోగిస్తారు; దీంతో పడుగుకు గంజిగాని, అంబలిగాని పట్టిస్తారు. చూ. చిత్రం 74.2 (తె. 14, 15, 17).

**గుంట** **1.** పర్యా. చూ. మరాసుగొయ్యి. మరాసు చక్రం తిరగటానికి అనువుగా తవ్విన పల్లపుప్రదేశం. చూ. చిత్రం 50.6 (కో. 14; రా. 2); **2.** రూ. గుంత; పర్యా. చూ. మగ్గంగుంట. నేతబయలులో, పావుకోళ్ళు అమర్చటానికి తవ్వినచోటు; మోకాలులోతు ఉంటుంది. చూ. చిత్రం 118.2 (కో. 14).

**గుంటకొయ్య** రూ. గుంత(ల)కొయ్య; పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు, పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 18).

**గుంటగూటం** రూ. గుంతలగూటం; పర్యా. చూ. పావుచెక్కలగూటం, మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకుపాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు, మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్లు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 33).

**గుంటమగ్గం** రూ. గుంతమగ్గం; పర్యా. గోతిమగ్గం. నేతబయలులో, గుంటదగ్గర అమర్చిన మగ్గం; చేతిమగ్గంగాని, మరమగ్గంగాని; చూ. మగ్గంగుంట. చూ. చిత్రాలు 108, 109(కో. 12-16, 21).

**గుంటాముచాపు** కమ్మిలో నాలుగేసిగీరలు పడేట్టు నేసిన రెండుపంచెలు (కో. 34).

**గుంటికఱ్ఱ** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 10, 13).

**గుంటూరుకమ్మి** ఒకరకం ధోవతుల కమ్మి (కో. 36).

**గుండంచు** **1.** చివరకొంత పసుగువదలి, పైన వేలెడు వెడల్పున రంగులో నేసిన అంచు; దీనికి రెండు వైపులా రెండేసి పోగులు వేరేరంగుగీరలు నేస్తారు; కొన్నిచోట్ల, పెద్దసాదాఅంచు; కొన్నిచోట్ల, బోడంచు అంటారట. చూ. చిత్రం 166 (కో. 7, 8, 12, 18, 21, 25, 26, 28, 32; తె. 15, 31, 32; రా. 11, 13); **2.** ఎనిమిది కొలుకులదారంతో నేసిన ఒకరకం అంచు; దీనికి, చిగురు వదలరు (కో. 22).

**గుండంచుచీర** మామూలుగా నేసిన (ఒకరకం) చీర (రా. 13).

**గుండీ** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ; దీన్ని, మామూలుగా మగ్గం పై దండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండికూడా కడతారు. చూ. చిత్రం 121క. 9 (కో. 23).

**గుండు** **1.** పర్యా. చూ. గూటం(1). దూది ఏకేటప్పుడు కమానునరంకొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (కో. 10); **2.** నూలులెక్క: లడీలో డెబ్బయ్యో వంతు నూలు; తెలంగాణాలో పూర్వం అనేవారట (తె. 11, 13; రా. 17); **3.** కండెలు చుట్టేటప్పుడు, గోలెంలో నీళ్ళుపోసి, దాంట్లో పోగు తడవటానికి ఎత్తు పెట్టేరాయి. చూ. చిత్రం 61.1 (కో. 6); **4.** పర్యా. అడుగుగుండు(2), కిందిగుండు, గుండుపలక(1), పలకగుండు(1), మగ్గంగుండు(1). చేతిమగ్గంపన్నె బిగించిన కిందికొయ్య; రోకలిమాదిరిగా, గుండ్రంగా ఉంటుంది; రోకలిమాదిరిగా, గుండ్రంగా ఉంటుంది; దీని పలకసీలలతో పై పలకకు బిగిస్తారు. చూ. చిత్రం 109 చ. 7 (కో. 2, 3, 8, 14; తె. 2, 4, 7, 11-13, 17, 21-25, 28-33; రా. 1, 7, 8, 11-13, 15, 16, 21, 23, 24); **5.** పర్యా. చూ. పలక(7). మరమగ్గంలో, పన్నెబిగించిన పైచెక్క; నేతనేసేటప్పుడు, పసుగులో పేకపోగువేసి దింతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (రా. 15); **6.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో, పన్నెబిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు, దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరగులుంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 29, 30; రా. 3, 16, 21); **7.** పర్యా. చూ. దిండు(7). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు; బోట్లపింజెరదిండుకు బొడిపెలు, తొల్లపింజెరదిండుకు గాట్లు ఉంటాయి; గొలుసుపింజెరదిండుకు ఇవి ఉండవు; దీనికి గొలుసు తగిలిస్తారు; కొన్నిచోట్ల, దీనికి చివర ఇనపఊచల చెక్కంగాని, రేకుపళ్ళ చెక్కంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (రా. 7, 14, 17, 24); **8.** పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర, పసుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చిన్నచెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 1, 3, 5-9, 14, 25-27, 30, 34, 35; తె. 1, 2, 4, 5, 7, 9-17; రా. 1, 3, 8, 10, 14-16, 18, 19, 19ఎ, 23, 24); **9.** అంచులో, అడ్డంగా పట్టెమాదిరిగా నేసిన నేత; ఇటువంటివి వరసగా వచ్చేట్టునేస్తారు. చూ. చిత్రం 166 (రా. 13); **10.** పొడుగువైపు, అంచులో నేసినపట్టె; గడ్డ. చూ. చిత్రం 163.1 (రా. 14); **11.** పర్యా. చూ. గుండ్రాయి(2). గుండ్రటిరాయి; దింతో, వేయించిన చింతగింజలు చితకగొడతారు (తె. 28).

**గుండుకటారి** ఒకగీర, లాహిరీ పట్టెట్టు నేసిన అంచు డిజైను. చూ. చిత్రం 149 (తె. 24).

**గుండుకమ్మి** పర్యా. బిళ్ళకమ్మి. కొంగులో ఒకే రంగుది; బెత్తెడు వెడల్పు పట్టెమాదిరిగా నేసిన కమ్మి (కో. 4, 18; రా. 7).

**గుండుగల్లకోక** ఒకరకం నేతచీర (రా. 19 ఎ).

**గుండుగాడి** రూ. గుండుగాడెం; పర్యా. గుండుగాల, గుండుదోనె(1). చేతిమగ్గం గుండుకు, పన్నె కిందివైపు బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 109 చ. 8 (కో. 34, 36, 37; తె. 4, 18, 19, 22, 25).

**గుండుగాడెం** చూ. గుండుగాడి (తె. 13).

**గుండుగాల** పర్యా. చూ. గుండుగాడి. చేతిమగ్గం గుండుకు, పన్నె కిందివైపు బిగించటానికి చేసినసందు. చూ. చిత్రం 109 చ. 8 (తె. 24).

**గుండుచువ్వ** ఉ. -సువ్వ. మగ్గందండెదగ్గర, నేత పసుగులో దూర్చిన చువ్వ; సవలతుగుండు తాడును మోపేది (కో. 2).

**గుండుతాడు** సవలతుగుండు వేలాడదీసిన దారం. చూ. చిత్రం 126.1 (తె. 25).

**గుండుదోనుగ** మగ్గంమీద, నేతగుడ్డచుట్టే ఒకరకం దోనె; గుండ్రటిది; చూ. దోనె. చూ. చిత్రం 123 త (కో. 36).

**గుండుదోనె** ఉ. -దోని. 1. పర్యా. చూ. గుండుగాడి. చేతిమగ్గం గుండుకు, పన్నె కిందివైపు బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 109 చ. 8 (తె. 7, 31, 32); 2. పర్యా. చూ. ఎదురుదోనె. మగ్గంచివర పడుగునూలుచుట్టే కొయ్యదూలం; రోకలిమాదిరిది; కొన్నిచోట్ల, నలుపలకలది; మలగర్రకు మారుగా అమరుస్తారు. చూ. చిత్రాలు 110.1, 123 త (రా. 2)

**గుండునూలు** పర్యా. చూ. జమిలి (నూలు), రెండుపోగులు కలిపి పురిపెట్టిన మిల్లునూలు (తె. 10).

**గుండుపరకపేటు** అంచులోనేసే ఒకరకం డిజైను (తె. 25).

**గుండుపరుపుకుంచె** ఉ. గుండుపరుపుకుంచి. పురి అడుగుభాగం గుండ్రంగా ఉన్న కుంచె. చూ. చిత్రం 78 (రా. 11).

**గుండుపలక** 1. పర్యా. చూ. గుండు(4). చేతిమగ్గం పన్నెబిగించిన కిందికొయ్య; రోకలిమాదిరిగా, గుండ్రంగా ఉంటుంది; దీన్ని, పలకసీలలతో, పై పలకకు బిగిస్తారు. చూ. చిత్రం 109 చ. 7 (రా. 4); 2. పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో, పన్నెబిగించిన కింది కొయ్య; నేతనేసేటప్పుడు, దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118.9 (రా. 4).

**గుండుబద్ద** పర్యా. చూ. గూటం(1). దూదివడకేటప్పుడు; కమానునరంకొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (కో. 15).

**గుండుబల్ల** 1. పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో, పన్నెబిగించినకొయ్య; నేతనేసేటప్పుడు, దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండుచివరలా సొరుగులుంటాయి.చూ.చిత్రం118.9(కో.12); 2.పర్యా.చూ. పలక(7). మరమగ్గంలో, పన్నె బిగించిన పైచెక్క; నేతనేసేటప్పుడు, పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (కో. 27).

**గుండుబిళ్ళ** రకరకాల రంగులపట్టె వరసగా వచ్చేట్టు నేసిన జంపఖానా. (తె. 17).

**గుండురుమాలు** తలకు గుండ్రంగా చుట్టుకోటానికి నేసిన తెల్లపాగ (తె. 8).

**గుండ్రకొయ్య** పర్యా. చూ. సంగటికోల. పత్తి రాట్నం నిలువులమధ్య రూళ్ళకర్రమాదిరిగా ఉండే కట్టె; ఇటువంటివి రెండు. ఒకదాన్నొకటి అనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడిపత్తి పెట్టినప్పుడు ఒకవైపు గింజలు, మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1.1 (కో. 14).

**గుండ్రగుబ్బ** పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గం మీద నేతబట్టచుట్టే కొయ్యకు ఆధారంగా, ఎడమ పక్కన నేలలో పాతిన గూటం; దీని బెజ్జంలో దోనె కొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండువైపులా రెండుంటాయి; కొన్నిచోట్ల, పడుగుచుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (రా. 2).

**గుండ్రాయి** 1. పర్యా. చూ. సవలతగుండు. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి, దండెఅవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చిన్నచెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 22); 2. పర్యా. కల్లురాయి, గుండు(11). గుండ్రటిరాయి; దీంతో, వేయించిన చింతగింజలు చితకగొడతారు (తె. 10, 11, 22).

**గుండ్రిగొర్రె** చెవులు అంటుకుపోయిన గొర్రె; కనీకనపడని చెవులు గలది (తె. 22).

**గుండ్లచీర** ఒకరకం నేతచీర (తె. 2).

**గుండ్లంచు** పట్టెలుపట్టెలుగా నేసిన అంచు (తె 1; రా. 11).

**గుండ్లజాడిగొంగడి** చారలచారల డిజైనులో నేసిన ఒకరకం గొంగడి (తె, 6, 7).

**గుండ్లటిక్కెలజాడి** చారలుచారలుగా నేసిన ఒకరకం గొంగడి డిజైను (తె. 6).

**గుండ్లసెల్లా** ఉ. -చెల్లా; పర్యా. ఎదురుకోళ్ళసెల్లా ఒకరకం కండువా;అంచులేకుండా, బొట్టెకమ్ములుపెట్టి నేసింది; పెళ్ళివారు ఎదురుకోలుకు వచ్చినప్పుడు పెళ్ళికొడుక్కి పెడతారు (కో. 8).

**గుతి** చేడుకట్టెలను రెంటినీ బిర్రుపెట్టటానికి కట్టిన చిన్నతాడు (తె. 8).

**గుతిమొల** పర్యా. బిర్రుకట్టెమొల. బిర్రుకట్టె (తిరుగుడు) చెక్కకు తాడుకట్టిన చివరిభాగం (తె. 9).

**గుతుప** చూ. గుదిపె (తె. 12).

**గుత్తకర్ర** మగ్గానికి బిగించిన పడుగులో, అచ్చు దగ్గర దూర్చిన కర్ర (కో. 16).

**గుత్తికట్టు** పర్యా. చూ. ముక్కుకట్టు. పంచెకు కిందివైపున ఆకుల చివర్లను కామకు కలిపి వేసినకట్టు; చూ. ముక్కుతాడు. చూ. చిత్రం 19 క. 7 (కో. 8).

**గుత్తులకోల** చూ. గుదులకోల (తె. 18, 20, 23).

**గుది** (బహు.గుజులు, గుతులు, గుదులు, గుదుళ్ళు), ఉ. గుజి, గుతి, గుత్తి, గుదె. 1. నూలులెక్క; రెండు లడీలు (రా. 16); 2. పర్యా. చూ. ఊత్తెగుది(2). పడుగుచాపేటప్పుడు, ఊత్తె అడ్డపట్టెనూ పడుగేరు కర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (కో. 1, 3, 5, 7, 9ఎ, 10, 12, 16, 17, 21-37; తె. 2, 3, 6, 7, 9, 16, 17,

19, 20, 22-24, 26-33; రా. 6, 13, 15, 16, 18, 24); **3.** పర్యా. చూ. అచ్చుగుది(1). అచ్చుకర్రకు పైన కట్టిన దారం; సువారు జైనెడు పొడుగుది; ఇటువంటివి, కర్రకు రెండేసి కడతారు; అచ్చును మగ్గానికి అమర్చటానికి వీటితో వేలాడదీస్తారు; కిందిగుదులు అడుగర్రల తాళ్ళకు కడతారు. చూ. చిత్రాలు 91 క. 8, 100.9, 100.11, 121 క. 10 (కో. 1-18, 22, 37; తె, 10, 20, 23-25, 29, 31-33; రా. 1, 14, 16, 19, 21, 23); **4.** పర్యా. చూ. జంత్రపుగుది. అచ్చుకట్టే జంత్రంకొయ్యకు కట్టినదారం; దీంతో అచ్చు చువ్వ బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 5 (కో. 26, 27, 33, 35, 37); **5.** పర్యా. చూ. పాయ(8). పడుగు పోగుల్లో కొంతభాగం; అచ్చతికేటప్పుడు, పడుగును పాయలుగా విడదీసి, ఒక్కొక్కపోగే అచ్చుపోగుకు అతుకుతారు. చూ. చిత్రం 102 క. 4 (కో. 34); **6.** పర్యా. చూ. పంటిగుది. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి, పుల్లకు కట్టినతాడు; ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.2 (కో. 1, 2, 4, 6, 7; తె. 1, 11, 13, 16, 17, 21, 26-28, 30; రా. 2, 7, 9, 10, 12, 19బి, 20); **7.** పర్యా. చూ. బిగుతాడు(3) చేడుకర్రలకు మధ్యన, రెంటినీ బిగించే పైతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 125 క. 4 (కో. 37; తె. 13); **8.** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 22; తె. 11, 26; రా. 8, 14. 17); **9.** పర్యా. చూ. అచ్చుగుది(2). మగ్గంలో, పూనుగర్రకు కట్టిన అచ్చుదారం; అచ్చులో కిందికర్రకు ఉండేది; ఇటువంటివి, కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (కో. 2, 10, 23, 36); **10.** పర్యా. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగర్ర (కొన్నిచోట్ల, మలబద్ద)దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (కో. 1, 2, 5-7, 10, 17, 22-30, 32-36; తె. 4, 5, 7, 11, 13, 17, 19-23, 25, 28-30, 32; రా. 7, 9); **11.** పడుగులో చివర, లాకకు కట్టిన దారం; మలగుది; ఇటువంటివి రెండుంటాయి; వీటిని పెడకోలకు తగిలిస్తారు. చూ. చిత్రం 127.11 (కో. 4; రా. 6); **12.** అచ్చుకర్రకు కట్టిన దారం; జైనెడు పొడుగుది; చూ. అచ్చుగుది. (తె. 12; రా. 8); **13.** పర్యా. చూ. చేడుపలుపు. చేడుకర్రకు (కొన్నిచోట్ల, చేడుబద్దకు) చివర కట్టినదారం; ఇటువంటివి, మూడు, నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లు గుచ్చి దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125 క. 3 (తె. 21; రా. 10, 17, 18); **14.** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరిపాయకు కట్టిన దారం; పొట్టెకొక దారంచొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రం 127.8 (తె. 5, 12, 17, 24, 32); **15.** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్టమీద చేడు కర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీని కొసలు, చేడుబొందులు(కొన్నిచోట్ల, కర్రలు) రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (రా. 1); **16.** దనబిదారం వడికే పూన్పు కొమ్ముకు కట్టిన తాడు; ఇటువంటివి, రెండు కొమ్ములకు రెండుంటాయి. చూ. చిత్రం 292.3 (తె. 17); **17.** సర్వటిగుంజల అడ్డకట్టెకు, జమళ్ళబొంగుకు తగిలించినదారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 297.8 (తె. 7); **18.** అచ్చుకర్రలకు, లంకెపడేట్లు అల్లివడిదారం; చూ. అచ్చువడి (తె. 17); **19.** రంగు అద్దటానికి, రెండు లడీలు కలిపికట్టిన నూలు (తె. 1).

**గుదికమ్మి** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనప ఊచ; దీన్ని, మామూలుగా మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండికూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (రా. 1).

**గుదిగర్ర** ?అల్లుచేసేటప్పుడు, పడుగుకు చివర గుదులు కట్టినకర్ర (కో. 35).

**గుదిగాడి** ఉ. గుదుగాడి; పర్యా. చూ. తొలి(1). నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసినచిల్లి; దీంట్లో బిగించిన పుల్లకు దారంకట్టి బద్దెచువ్వ బిగిస్తారు; ఇటువంటివి, మామూలుగా అయిదారుంటాయి. చూ. చిత్రం 122 చ. 4 (రా. 12).

**గుదితాడు** **1.** పర్యా. చూ. ఊడైగుది(2). పడుగు చాపేటప్పుడు, ఊడై అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (రా. 24); **2.** ఉ. గుత్తెడు; పర్యా. చూ. తిరుగుడుగుది. తిరుగుడుకు రెండువైపులా కట్టినతాళ్ళు; ఊడైఅడ్డపట్టెను, పడుగేరుకర్రను కలిపేవి. చూ. చిత్రం 71.2 (రా. 11); **3.** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరిపాయకు కట్టినదారం; పొట్టెకొక దారం చొప్పున, మలగర్రకు కడతారు. చూ. చిత్రం 127.8 (రా. 6); **4.** అచ్చుకర్రకు కట్టినదారం; జైనెడు పొడుగుది. చూ. చిత్రం 121 క. 10 (రా. 11); **5.** పర్యా. చూ. బిగుతాడు. చేడుకర్రలకు మధ్యన, రెంటినీ బిగించే పైతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 125 క. 4 (రా. 24).

**గుదిదారం** ఉ. గుద్దారం 1. పర్యా. చూ. ఊడై గుది(2). పడుగు చాపేటప్పుడు, ఊడై అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (రా. 16); 2. పర్యా. చూ. పంటిగుది. దోనెగాడిలో, బద్దెమువ్వ బిగించటానికి, పుల్లకు కట్టినతాడు; ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.2 (రా. 16).

**గుదిపాయ** (-దిద్దు) ఉ. గుదిపాయి; పర్యా. అచ్చుపాయ, పాయ(3). అచ్చువళ్ళలో, అచ్చుకర్రకు గుది కట్టినచోట పాయగా చీలినభాగం, దాంతోపాటు అచ్చతికిన పడుగులో పాయగా చీలినభాగం; ఇటువంటివి, మామూలుగా నాలుగు పాయలుంటాయి; అచ్చు కట్టిన తరవాత; గుదిపాయలు బిర్రుగా ఉండటానికి అచ్చుకర్రమీద కొమ్ముమ్మతో రుద్దుతారు. చూ. చిత్రం 100.6-8(కో. 1-3, 5, 7, 10, 22-26, 28, 33-36; తె. 32; రా. 2-8, 10-21, 23, 24).

**గుదిపాయతాడు** అచ్చువళ్ళలో, చివరిగుదిపాయ దగ్గర అచ్చుకర్రకు కట్టినదారం; ఇటువంటివి, కర్రకు రెండేసి ఉంటాయి; చూ. అచ్చుగుది. చూ. చిత్రం 100.9, 100.11 (కో. 31).

**గుదిపుల్ల** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో, బద్దెచువ్వబిగించటానికి అమర్చినకొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క.4(రా.12,20).

**గుదిపె** ఉ. గుదిబి, గుదిబె; రూ. గుతువ, గుదుప, గుమితె; పర్యా. చూ. గూటం. దూదిఏకేటప్పుడు కమానుసరం కొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (రా. 6, 10, 11, 15, 18, 19, 21, 22).

**గుదుకోళ్ళకట్టె** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగేకర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులాఅచ్చుకర్రతాళ్ళూ మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (రా. 19బి).

**గుదుప** చూ. గుదిపె (తె. 2).

**గుదులకోల** రూ. గుత్తులకోల; పర్యా. చూ. పొట్టెకోల. నేతపడుగు చివర, పాయలతాళ్ళు కట్టిన కర్ర; కొన్నిచోట్ల, దీనికి పొట్టెలు మెలివేస్తారు. చూ. చిత్రం 128 త. 1 (తె. 31).

**గుదులగూటం** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు, మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (రా. 17).

**గుదులబద్ద** ఉ. గుదుళ్ళబద్ద; పర్యా. చూ. మలబద్ద. నేతపడుగు చివర పొట్టెలుచుట్టే వెదురుబద్ద; దీన్ని పొట్టెకోలకుగాని, మలగర్రకుగాని జోడిస్తారు; కొన్నిచోట్ల, దీనికి పొట్టెతాళ్ళు కడతారు; దీని చివరిగుదులు, పెడకోలకు తగిలిస్తారు. చూ. చిత్రం 129 త. 2 (కో. 7, 19, 31).

**గుదులలాక** ఉ.గుదుల్లాక,గుదుళ్ళలాక.పర్యా.చూ. మలబద్ద, నేతపడుగు చివర పొట్టెలు చుట్టే వెదురుబద్ద; దీన్ని పెట్టెకోలకుగాని, మలగర్రకుగాని జోడిస్తారు; కొన్నిచోట్ల, దీనికి పొట్టెతాళ్ళు కడతారు; దీని చివరి గుదులు,పెడకోలకుతగిలిస్తారు(కో.4-7, 10, 21; రా.6).

**గుదుళ్ళకర్ర** అచ్చుకట్టే జంత్రం కొయ్యలకు అడ్డంగాబిగించి, అచ్చుగుదులు తగిలించినకర్ర (రా. 1).

**గుదె** ఉ. గుజె; పర్యా. చూ. దానె(1). నరిచేసేటప్పుడు, ఉన్నిపడుగు ముందువైపు దూర్చిన లావాటి కర్ర; పడుగేరుకర్ర మాదిరిది; కొన్నిచోట్ల, పడుగులో చివర ఎక్కించి సరిగుంజకు బిగిస్తారు. చూ. చిత్రం 314.1 (తె, 26, 27).

**గునకాలకట్టె** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి, రెండువైపులా అచ్చుకర్రతాళ్ళూ మధ్యలో పావుచెక్కలతాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటికర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (రా. 6).

**గునపం** పర్యా. చూ. గడ్డపార(1). ఊడైను నిలబెట్టి మోకుతో బిగించటానికి, నేలలో పాతిన గునపం. చూ. చిత్రం 63 త. 1 (కో. 17, 19, 21-24, 26, 30, 32-36).

**గునుకురాటం** నూలుతీసే రాట్నం; హరిజనుల వాడుక. చూ. చిత్రం 15 (కో. 16).

**గునుకోలుకర్ర** పర్యా. చూ. పూనుగర్ర. పావు చెక్కతొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగేకర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రలతాళ్ళూ మధ్యలో పావు చెక్కలతాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 4).

**గుంత** చూ. గుంట (2) (కో. 8; తె. 19, 20, 22, 24; రా. 19).

**గుంతమగ్గం** ఉ. -మొగ్గం; చూ. గుంటమగ్గం (తె. 19; రా. 3).

**గుంత(ల)కొయ్య** చూ. గుంటకొయ్య (కో. 9బి; తె. 9, 12, 23 30).

**గుంతలగూటం** చూ. గుంటగూటం (తె. 2, 6, 7).

**గుబ్బ** ఉ. గుబ్బా, గుబ్బి. **1.** రూ. బుగ్గ; పర్యా. చూ. దోనుగబొడ్డు. బొడ్డుగొయ్య బెజ్జంలో దూర్చే, దోనె చివరిభాగం; మామూలుగా, గుండ్రంగా ఉంటుంది: కొన్నిచోట్ల, కోణాకారంలో ఉంటుంది. చూ. చిత్రం 123 క. 8 (రా. 1, 2, 5, 6, 8, 9, 19); **2.** రూ. గుబ్బె; పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడెమొన అరిగి పోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల, ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (కో. 1-3, 10-13, 15, 24; రా. 1, 4, 5, 7, 9, 11, 12, 19, 24); **3.** పర్యా. చూ. గుబ్బకొయ్య(2). ఎదురుదోనెను మోసే కొయ్యగూటం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 110.3 (కో. 1, 12); **4.** పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గంమీద, నేతబట్టచుట్టే కొయ్యకు ఆధారంగా, ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, పడుగుచుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (కో. 5, 7, 10-12).

**గుబ్బకొయ్య** **1.** రూ. గుబ్బెకొయ్య, బుగ్గకొయ్య; పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గంమీద, నేతబట్ట చుట్టేకొయ్యకు ఆధారంగా, ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం; దీనిబెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండువైపులా రెండు ఉంటాయి; కొన్ని చోట్ల, పడుగుచుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన కొయ్య. చూ. చిత్రం 123 క. 5 (కో. 1-3, 6, 8, 9ఎ,బి, 13, 15; రా. 4, 6, 7, 8, 12, 20); **2.** పర్యా. ఎదురుదోనెగుబ్బ, కొయ్యగూటం, గుబ్బ(3). ఎదురు దోనెను మోసే కొయ్యగూటం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 110.3 (కో. 4; రా. 4, 5, 6).

**గుబ్బగురుడు** పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గం మీద, నేతబట్టచుట్టే కొయ్యకు ఆధారంగా, ఎడమ పక్కన నేలలో పాతిన కొయ్యగూటం; దీనిబెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండువైపులా రెండుంటాయి; కొన్నిచోట్ల, పడుగుచుట్టే ఎదురు దోనెకు ఆధారంగా పాతినగూటం. చూ. చిత్రం 123 క. 5 (రా. 18).

**గుబ్బపొన్ను** బొడ్డుగొయ్యకు అమర్చే, దోనె చివరిభాగం (=గుబ్బ) అరిగిపోకుండా వేసిన ఇనపకట్టు. చూ. చిత్రం 123 క. 9 (రా. 9).

**గుబ్బమాను** పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గం మీద, నేతబట్టచుట్టే కొయ్యకు ఆధారంగా, ఎడమ పక్కన నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండువైపులా రెండుంటాయి. చూ. చిత్రం 123 క. 5 (కో. 1).

**గుబ్బిచెక్రం** ఉ. -చెక్రం. ఒకరకం మరానులో బెండకాయచెక్రం పక్కన బిగించిన ఇనపచెక్రం (తె. 13).

**గుబ్బె** ఉ. గుబ్బి; చూ. గుబ్బ(2) (కో. 6, 14, 16).

**గుబ్బెకొయ్య** చూ. గుబ్బకొయ్య (1) (హరిజనుల వాడుక) (తె. 13).

**గుమితె** చూ. గుదిపె (రా. 20).

**గుంపు** **1.** (-తీయు) పత్తిలో ఉండగట్టిననలుసులు, తుక్కు; దీన్ని చేత్తో ఏరేస్తారు (కో. 34, 36); **2.** పన్నె కట్టుబడిలో దంతెల మధ్య బిగించటానికి వాడే కొండ చీపురుపుల్లల కణుపు(లు); పన్నెకట్టేటప్పుడు, కణుపులు తీసేసి కత్తితో ఈనెలు సాపుచేస్తారు (కో. 33).

**గుంపుతీయు** (క్రి.) పడుగులో కలిసిపోయిన పోగులు విడదీయటం (కో. 35).

**గుమ్మటం** పర్యా. చూ. రాటి. పంజె మొ. వాటికి దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (రా. 9).

**గుమ్మడన్నకనుము** ఉ. -కన్మ. తెల్లపోగులు, నల్లపోగులు కలిపి నేసిన రవికెలగుడ్డ (తె. 32).

**గుమ్మడికమ్మి** గుమ్మడిపండు నమూనా నేసినకమ్మి (రా. 11).

**గుమ్మడిపూవు(వన్నె)** ఉ. గుమ్మడిపువ్వన్నె, గుమ్మడిపూవన్నె. **1.** నిమ్మపండురంగు; ఆరంజి, పటిక, తేజాపు, నైట్రేటువేసి నెప్తాలురంగు, గోల్డు ఆరంజి, 3జి. 800, కాస్టిక్‌సోడా, హైడ్రోసల్ఫ్‌వేసి ఇండెంత్రీనురంగు తయారు చేస్తారు (తె. 4, 5); **2.** తెలుపులో పసుప్పచ్చవన్నె (తె. 10, 11, 17); **3.** బీరపువ్వులో ముదురురంగు (తె. 15); **4.** పసుపు ఎరుపు కలిసిన (పట్టు) రంగు (తె. 21); **5.** ఒకరకం పసుపురంగు (తె. 25).

**గుమ్మి** **1.** ఉ. గుమ్మె; పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంజె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (తె. 3, 5, 8, 10, 11, 18-22); **2.** పర్యా. చూ. డొలక(2). పట్టుదారంచుట్టే కొయ్యపనిముట్టు; అడ్డరాటి మాదిరిది. చూ. చిత్రం 293 క (తె. 5, 21).

**గుమ్మిఆకు** **1.** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 11); **2.** పర్యా. చూ. అడ్డాకు(1). పట్టు దారంచుట్టే డొలక కట్టుబడిలో, ఇరుసుచుట్టూ బిగించిన పొడుగాటి కొయ్యపట్టె(లు); వీటిమీద పోగులు చుడతారు. చూ. చిత్రం 293 క. 3 (తె. 21).

**గుమ్మిఇరుసు** ఉ. గుమ్మిరుసు; పర్యా. ఇరుసు(4). అడ్డగుమ్మి తిరగటానికి ఆధారంగా ఉండేకర్ర. చూ. చిత్రం 34.6 (తె. 18).

**గుమ్మికర్ర** ఉ. గుమ్మికర; పర్యా. చూ. బెజ్జం కట్టె. రాటిసూలం దూర్చినకట్టె; పైనగాని, కిందగాని ఉంటుంది. చూ. చిత్రం 31 ప. 3 (తె. 10).

**గుమ్మికామ** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒకభాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 22).

**గుమ్మికొయ్య 1.** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 5); **2.** పర్యా. చూ. నిలువు(4). రాటికి ఆధారంగా పాతిన నిలువుకొయ్య; ఒకటిగాని, రెండుగాని ఇలాంటివి ఉంటాయి. చూ. చిత్రం 31 ప. 1 (తె. 11)

**గుమ్మిచిప్ప** ఉ. -సిప్ప; పర్యా. చూ. చిప్ప(1). రాటి పై బద్దలను బిగించి వాటిమధ్య బోర్లించి కట్టిన చిప్ప; మామూలుగా కొబ్బరిచిప్ప కడతారు; కొన్నిచోట్ల, కర్రచిప్పగాని, రేకుమూతగాని వాడతారు; ఇది రాటిసూలంమీద అనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (తె. 20).

**గుమ్మితాడు** పర్యా. చూ. గుమ్మిదారం. రాటి ఆకులు పైవీ కిందివీ కలిపికట్టిన దారం. చూ. చిత్రం 31 ప. 4 (తె. 21).

**గుమ్మిదారం** ఉ. గుమ్మెదారం; పర్యా. ఆకులతాడు(2), ఆకులదారం(2), గిరకతాడు(1), గుమ్మితాడు, చుట్టబిరుతాడు, తాడు(3), దారం(2), పడతతాడు, పన్నదారం(2), బిగిదారం(1), బిరుతాడు(2), రాటితాడు, రాటిదారం, రేకులదారం(2). రాటి ఆకులు పైవీ కిందివీ కలిపికట్టిన దారం; చూ. రాటి. చూ. చిత్రం 31 ప. 4 (తె. 10, 18-20),

**గుమ్మిదిండు** పర్యా. చూ. గొట్టం(2). రాటి ఆకులు బిగించిన వెదురుగొట్టం; దీన్ని సూలానికి దూర్చి రాటి తిప్పుతారు. చూ. చిత్రం 31 క.1(తె. 11).

**గుమ్మినిలువు** పర్యా. గిరకగుంజ, గిరకనిలువు గుంజ, గుజ్జ(5), నిలువు(5), నిలువుగుంజ(2). అడ్డ గుమ్మి తిరగటానికి ఆధారంగా అడ్డకట్టెకు పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 34.5 (తె. 18).

**గుమ్మిపీట** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (తె. 19, 20).

**గుమ్మిపుల్ల 1.** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది, కొన్నిచోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒకభాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 21); **2.** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టినవెదురుబద్ద(లు).చూ.చిత్రం31క.3(తె.5).

**గుమ్మిబండ** రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న రాయి; దీన్ని దూపిరికి మారుగా పెడతారు; చూ. దూపిరి (తె. 10).

**గుమ్మిబద్ద** పర్యా. చూ. ఆకు(5). రాటికిపైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 18-20).

**గుమ్మిబోరెం** ధాన్యంపోసుకోటానికి నేసిన నారసంచి; చూ. బోరెం, వ్యవసాయ వృత్తిపదకోశం (పుటలు 197, 294) (తె. 25).

**గుమ్మిమొద్దు** ఉ. గుమ్మెమొద్దు, గుమ్మొద్దు; పర్యా. చూ. దూపిరి(3). రాటితిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (తె. 11, 18).

**గుమ్మిసలాకి** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 11).

**గుమ్మిసీకు** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా, ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల; దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 19, 20).

**గుయిగుంజ** పర్యా. చూ. మిడిగూటం(2). నేత బయలులో చివరపాతినకొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి, పెడకోలకుచుట్టి, పనుగు బిరుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకు కట్టి, దీనికి పనుగు మెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (రా. 19ఎ).

**గురిగె** (బహు. గురిగెలు, గురుగులు) ఉ. గురిగి. రంగు **కొ**లుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు **తు**లాలు పట్టేది. **చూ.** చిత్రం 282 ప. 2 (కో. 16; తె. 3-5, 11, 12, 25).

**గురుమాసి** ఎరుపు, ఊదా కలిసిన రంగు; మెజెంటా. **చూ.** చిత్రం 288 (తె. 19, 22).

**గుర్జు 1.** చూ. గుజ్జు (2) (తె. 4, 12); **2.** పర్యా. నిలువు (15). నవారుమగ్గం కట్టుబడిలో అడ్డపీటకు బిగించిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుపక్కలా ఉంటాయి. చూ. చిత్రం 324 క. 1 (తె. 12).

**గుర్తు** (-పెట్టు, -వేయు) పర్యా. చూ. అచ్చన. అచ్చతికిన పడుగుమీద, కొలతనుబట్టి వేసిన గుర్తు; మామూలుగా మసిగుర్తు వేస్తారు; కొన్నిచోట్ల, చిక్కుడు, బీర మొ.వాటి ఆకుపసర్లతో గజానికి ఒకటి చొప్పున గాని, మూరకు ఒకటి చొప్పునగాని, గుర్తులు వేస్తారు. (తె. 15; రా. 11, 15, 17).

**గుర్తుదారం** పర్యా. చూ. అంట్లతాడు. అచ్చతికిన పడుగుమీద గుర్తులుపెట్టటానికి కొలిచేదారం; మామూలుగా గజెం పొడుగుది (రా. 11).

**గుర్తులలాక** పర్యా. చూ. అచ్చనలాక. అచ్చతికిన పడుగుమీద, గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనే బద్ద; మామూలుగా, గజెం పొడుగుది; కొన్నిచోట్ల, మలగట్టుకర్రతో కొలుస్తారు; చూ. లాక (రా. 15).

**గుర్రపుచెక్క** పర్యా. చూ. బొమ్మ(9). మగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో. 14).

**గుర్రపుతాడు** పర్యా. చూ. కొండితాడు. అచ్చు కట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు అచ్చుకర్ర మీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 10, 13).

**గుర్రపుసవారి** ఒకరకం అద్దకం డిజైను; కొయ్య అచ్చుతో రుద్దుతారు. చూ. చిత్రం 283 ద.2 (రా.24).

**గుర్రబ్బండి** (<గుర్రపుబండి) పర్యా. చూ. పెడ కోలచెక్రం. పెడకోలనుమోసే కొయ్యచెక్రం; ఇటు వంటివి రెండుంటాయి; నేతమోకు వదులుచేసినప్పుడు, పడుగు నేలకు తగలకుండా పెడకోలచెక్రాలమీద జరుగు తుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129.1 (కో. 23).

**గుర్రం 1.** దండెచెవి (2). దండెనుమోసే పంగల కొయ్య పైభాగం; ఇటువంటివి, ఒక్కొక్కదానికి రెండుంటాయి; దండెచెవి (రా. 3); **2.** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు,నిలువుపట్టె పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (రా. 19); **3.** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (రా. 10); **4.** పర్యా. ఉడతబొమ్మ, గుర్రం బొమ్మ, గేడుకొయ్య,బొమ్మ(11), మిడత. మరమగ్గం సొరుగుకు, మొదట బిగించినచెక్క; దవడచెక్కలకు నాడెదెబ్బ తగలకుండా; ఇటువంటివి రెండు బిగిస్తారు. చూ. చిత్రం 118.19 (రా. 6, 9, 13, 24); **5.** ?డాబి కోల(ల)ను లేపేకర్ర(లు); చూ. డాబి. చూ. చిత్రం 132 క (తె. 22-24, 29, 32); **6.** నారపట్టా నేసే టప్పుడు, అచ్చును నడిపించటానికి వాడే కొయ్యపని ముట్టు; పట్టెమంచం కోళ్ళవంటి రెండుకొయ్యలకు మధ్య బెదనుతాడు (అచ్చుదారం) కట్టేది; దీనికి పైన గొట్టం అమరుస్తారు; నేతనేసేటప్పుడు, దీన్ని పడుగుకు కింద పెడతారు. చూ. చిత్రం 304.2 (తె. 25).

**గుర్రంబొమ్మ** పర్యా. చూ. గుర్రం(4). మరమగ్గం సొరుగుకు, మొదట బిగించిన చెక్క; దవడచెక్కలకు నాడెదెబ్బ తగలకుండా, ఇటువంటివి రెండు బిగిస్తారు. చూ. చిత్రం 118.19 (రా. 12).

**గులాబి(రంగు)** ఉ. గులాబీ. ఒకరకం లేతఎరుపు రంగు; గులాబిరేకులరంగు. చూ. చిత్రం 288 (కో. 12, 13, 15, 18-21, 23, 24, 30, 32, 33, 35; తె. 4, 10, 17, 21, 24-26, 31; రా. 22, 24).

**గులాబిరోత** బచ్చలిపండ్ల రంగు; బచ్చలిపండ్ల రంగులో లేతరంగు (తె. 15).

**గులాల్** బచ్చలిపండురంగు; బుక్కా (గులాల్) రంగు; ఎఫ్. ఎఫ్. 400, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేసి తయారుచేస్తారు (తె. 5).

**గులాల్ పీతాంబరం** కొంగులో పువ్వులడిజైన్లు నేసిన పట్టుబట్ట; దీన్నే కొంగుపూల పీతాంబరం అనీ అంటారు (తె. 5).

**గులిగి** పర్యా.చూ. ముతకనూలు. పోగు మందంగా ఉండేనూలు; 10 నుంచి 60 నెంబర్లదాకా "పూర్వ వోట్లంతా గులిగి అనేది" (రా. 17).

**గులుకోలకట్టె** పర్యా. చూ. పూనుగర్ర. పావు చెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రలతాళ్ళూ, మధ్యలో పావు చెక్కలతాళ్ళూ కట్టిఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (రా. 9).

**గుల్ల** తివాసీ నేసేటప్పుడు, వడిదారాల్లో దూర్చిన

కర్ర; అచ్చుకర్ర: ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 320.14 (కో. 16; తె. 17).

**గుల్లనేత** పర్యా. చూ. చల్నేత. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేట్టు నేసిననేత; మేటీనేత మాదిరిది; అనిమూసి నేస్తారు (కో. 19).

**గుల్లె** ఉ. గులి, గుల్ల, గుల్లి. నూలులెక్క: **1.** 7360 పోగులనూలు; ?లడీ(కో. 32, 33, 37); **2.** లడీలో డెబ్బయ్యోవంతు నూలు (కో. 20, 22, 23; తె. 1; రా. 18, 23); **3.** ఎనభై పోగులనూలు; ఇటువంటివి పది గుల్లెలయితే ఒక పడుక్కు సరిపోతుంది (కో. 36); **4.** అరవై దనలికాయల లెక్క (తె. 17).

**గువ్వకండ్లంచు** చూ. గువ్వకన్నంచు (తె. 4, 12, 13, 16).

**గువ్వకన్నంచు** రూ. గూకన్నంచు, గువ్వకండ్లంచు; పర్యా. గువ్వకన్నుపేటు. గువ్వకన్ను ఆకారంలో డిజైనుపడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 177 (కో. 19, 23; తె. 4, 14, 15, 25).

**గువ్వకన్నుపేటు** ఉ. -పేటి; రూ. గూకన్నుపేటు; పర్యా. చూ. గువ్వకన్నంచు. అంచులో, గువ్వకన్ను ఆకారంలో నేసిన డిజైను. చూ. చిత్రం 178 (కో. 19, 23; తె. 4, 7, 12-16, 25).

**గుళ్ళబేరింగు** పర్యా. చూ. బాల్బేరింగు. మరాను ఇరుసు సులువుగా తిరగటానికి, ఉక్కుగుండ్లు అమర్చిన పనిముట్టు (కో. 12).

**గుళ్ళసునేరిపేటు** అంచులోనేసే ఒకరకం గళ్ళ డిజైను (కో. 20).

**గుళ్ళెతాడు** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో, చివరిపాయకు కట్టినదారం; పొట్టెకొకదారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రం 127.8 (తె. 6).

**గూకన్నంచు** చూ. గువ్వకన్నంచు (తె. 10).

**గూకన్నుడోరియా** అంగీగుడ్డల్లో ఒకరకం నేత (తె.24).

**గూకన్నుపేటు** చూ. గువ్వకన్నుపేటు (తె. 10).

**గూటకొయ్య** **1.** ఉ. గూటకొయ; పర్యా. చూ. పరికొయ్య(1). ఊడైనునిలబెట్టి తాడుతో బిగించటానికి, నేలలో పాతిన కొయ్యగూటం. చూ. చిత్రం 63 క. 7 (తె.31); **2.** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గం గుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు, మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 31, 32).

**గూటం** ఉ. గూటాం. **1.** పర్యా. పకుడుకర్ర, పకుడుగూటం(1), కమానుదుడ్డు, కమానుబిళ్ళ, కొడితి, కొయ్య(1), గుండు(1), గుండుబద్ద, గుదిపె, గూటిల్ల, చెయిపిడి, తుండు(1), దిస్తా(గుండు), దుడ్డు(1), పిడికర్ర(1). దూదిపకేటప్పుడు కమానునరంకొట్టే కొయ్య జడితె. చూ. చిత్రం 9.13 (కో. 1; తె. 5, 13, 14; రా. 7, 16, 23, 24); **2.** పర్యా. దూపిరికర్ర, నిలువు(3), ముద్దగూటం(2), మొద్దుగూటం(3). రాటి తిరగటానికి ఆధారంగా, దూపిరికి దిగగొట్టిన కొయ్యగూటం. చూ. చిత్రం 31 చ. 1 (కో. 8); **3.** పర్యా. గుంజ(4), తోకగుంజ(1), తోకగూటం(1), తోకరాయి, నేలగుంజ, పడుగుగుంజ(1), బంకంగుంజ, సరట్టగుంజ, సరికోల(2), సరిగుంజ(2), సరిగూటం(1), సరిసక్కు. ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం; కొయ్యదిగాని, ఇనపదిగాని, రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7 (కో. 1; తె. 1-3, 15-17; రా. 3, 4, 7, 15-17, 19, 23, 24); **4.** పర్యా. పడుగ్గూటం, సరిగూటం(2). ఊడైగూటాన్ని నేలలోకి దిగగొట్టే ఇనపమొద్దు (కో. 11, 12, 14, 25, 27, 37); **5.** రూ. ఖూటా; పర్యా. గుంజ(5). నేలలోపాతిన నిలువుకొయ్య; పన్నెపుల్లలు చీల్చి, సాపుచెయ్యటానికి, గీరుకత్తి బిగించిన వెదురుబొంగు; దీని పై భాగం చీల్చి, మధ్యలో కత్తి ఇరికిస్తారు. చూ. చిత్రం 69 క. 4(కో.1); **6.** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు, మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల తాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో.2,3; రా. 1, 2, 4, 5, 8); **7.** పర్యా. చూ. దండెచెవి (1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (రా. 3, 6); **8.** పర్యా. చూ. చేతిగూటం (1), మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకు కట్టేకొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 3). **9.** పర్యా. చూ. చిల్ల(7). మగ్గంకుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా, చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి, రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (రా. 16, 19); **10.** పర్యా. పిడికిలిగూటం. ఉన్నిపకేటప్పుడు, నరంకొట్టే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 309 చ. 1 (తె. 3, 6). **11.** పర్యా. చూ. ఆసుగూటం. ఉన్నిపడుగుతోడటానికి నేలమీద పాతినపుల్ల; ఇటువంటివి, మూడువరసల్లో 3 : 2 : 3 చొప్పున ఉంటాయి.

చూ. చిత్రం 312.1 (తె. 3, 6, 7, 9-11, 22, 28); **12.** పర్యా. చూ. వెన్నుగూటం. ఉన్నిమగ్గం దోనుగను మోసే ఎడమవైపు కొయ్యగూటం. చూ. చిత్రం 315 క. 2 (తె. 6, 7, 9-11, 22, 25-28).

**గూటంతాడు** పర్యా. చూ. మడిమతాడు. పావు చెక్కను గూటానికి బిగించే వెనకతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 3 (తె. 33).

**గూటాలతొట్టి** పర్యా. పరుపు(2). మగ్గంగుంటలో పావుచెక్కలగూటాలు బిగించిన చట్రం. చూ. చిత్రం 121 జ (రా. 1).

**గూటిచెక్క** ఉ. గూచ్చెక్క; పర్యా. చూ. బొమ్మ (9). మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో.6).

**గూటిల్లు** రూ. గుట్టిల్లు. దూంది ఏకేటప్పుడు కమాను నరంకొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (కో. 14).

**గూడకట్టుపంచె** పర్యా. చూ. లుంగి(1). మగవాళ్ళు నడుముకుచుట్టుకొనే బట్ట; 2-4 గజాలపొడుగు నేస్తారు; మామూలుగా, తెలుపులో నేసి, రంగులో అంచులు కమ్ములు పెడతారు; కొన్నిచోట్ల, రంగుల్లోను, డిజైన్లలోను, గళ్ళలోను గీరల్లోను నేస్తారు (కో. 16).

**గూడాబాడరు** పెండ్లిబొట్టు (=కల్యాణతిలకం) మాదిరిగా, మూడేసి చుక్కలు రెండువరసల్లో పెట్టి, వాటికి మధ్య నిలువుగీర పడేట్టు నేసిన అంచు; ఇటీవల దుప్పట్లకు నేస్తున్నారు; ఇది, మొదట నేయించుకొన్న వ్యక్తి ఇంటిపేరు గూడావారట. చూ. చిత్రం 171 (తె. 5).

**గూడు** ఉ. గూడి. **1.** పర్యా. చూ. చిప్ప(1). రాటిపై బద్దలను బిగించి, వాటిమధ్య బొర్లించి కట్టిన చిప్ప; మామూలుగా, కొబ్బరిచిప్ప వాడతారు; కొన్ని చోట్ల కర్రచిప్పగాని, రేకుమూతగాని వాడతారు; ఇది రాటినూలంమీద ఆనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (కో. 7); **2.** పర్యా. చూ. కొలికి(1). ఆసుపోసిన నూలులో ఒకటిపైకీ, ఒకటికిందికీ వచ్చిన రెండు పోగుల దారం (కో. 8; తె. 23; రా. 18, 22, 23); **3.** పర్యా. ఇల్లు(2), ఈనె(3), ఈనెసందు, కవ(2), కవ్వసందు, గది(1), జాడ, పన్నెఇల్లు, పన్నెగది, పన్నెగూడు, సందు(2), సాంజ్. పన్నెదండెలకు బిగించిన పుల్లలమధ్య వెలితి; అచ్చుకట్టేటప్పుడు, ఒక్కొక్కదాంట్లో, రెండేసి బద్దెపోగులు దూరుస్తారు. పడుగులో, కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 88 క. 9 (కో. 4-7, 10, 13; తె. 1, 7, 8, 11, 14-17, 21, 24, 25, 28-33; రా. 10, 13-18, 23); **4.** మగ్గందగ్గర, సామానుపెట్టుకోటానికి గోడలో వదిలిన జాగా (కో. 12-14); **5.** (-కట్టు) పట్టుపురుగు, దారంతో తనచుట్టూ అల్లుకొన్నది. చూ. చిత్రం 291 (రా, 14, 24); **6.** పర్యా. అలుమగలు (పోగులు). ఆసుపోసిన ఉన్నిపడుగులో, ఒకటిపైకీ, ఒకటి కిందికీ వచ్చిన రెండుపోగుల దారం; అచ్చుపోగు, దండెపోగు కలిసి (తె. 25).

**గూడుపేటు** అంచులోనేసే ఒకరకం డిజైను(రా.7)

**గూన** **1.** పర్యా. గంజిగూన. గంజిపోసుకొనే తొట్టి; కొన్నిచోట్ల, దీంతోనే అన్నంవండి, చిన్న గూనలో గంజిపోసుకొంటారు (కో. 6, 20; రా. 23, 24); **2.** పట్టుదారంతోడే కొయ్యపనిముట్టు (=ఆసు)ను పటువాలుగా ఉంచేటట్టు అడుగునపెట్టే కొయ్యదిమ్మ (తె. 17); **3.** రంగునీళ్ళుపోసే తొట్టి; దీంట్లో లడీలు తడుపుతారు (రా. 18, 24).

**గూనతొట్టి** ఉ. గోన్తొట్టి. గంజిపోసుకొనే తొట్టి (కో. 8).

**గూళ్ళతడికె** పట్టుపురుగులను పెంచటానికి వాడే బుట్ట; దీన్ని చెంద్రవంకలు అనీ అంటారు. చూ. చిత్రం 289 చ (రా. 1).

**గెడ్డంపుల్ల** పర్యా. బెంతికదురు. అచ్చుకట్టేటప్పుడు, పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చేపుల్ల; మామూలుగా, ఇనపది; కంటాణీలాంటిది; దీనికి పదును ఉన్నవైపు చిన్నకొక్కెం ఉంటుంది; కొన్నిచోట్ల, రెండోవైపున పిడి ఉంటుంది. చూ. చిత్రం 94 (కో. 27).

**గెర్రె** గీర; అంచుపక్కన నేసింది (రా. 24).

**గెర్రంచు** గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు; పంచెలకు నేస్తారు (తె. 1).

**గేడి** **1.** చూ. గాడి(2) (కో. 2); **2.** చూ. గాడి (3) (రా. 1); **3.** ఉ. గేడీ; చూ. గాడి(4) (తె.1; రా. 16).

**గేడుకొయ్య** పర్యా. చూ. గుర్రం(4) మరమగ్గం సొరుగుకు, మొదట బిగించినచెక్క; దవడచెక్కలకు నాడెదెబ్బ తగలకుండా (ఇటువంటివి రెండు) బిగిస్తారు. చూ. చిత్రం 118.19 (రా. 1).

**గేవాసి** పర్యా. చూ. గనిగుంత. మగ్గందగ్గర, గోడలో పెట్టిన కిటికీ; నేతనేసేటప్పుడు, మగ్గంమీదికి వెలుతురు రావటానికి కిటికీ పెడతారు. చూ. చిత్రం 118.4 (రా. 12).

**గ్రేనాంకర్ర** పర్యా. చూ. రాయబారపుకర్ర. వేలాడదీసిన పడుగుచుట్టును దగ్గరకిగాని, దూరానికిగాని జరుపుకోటానికి వీలుగా, మగ్గానికి పైన కట్టినకర్ర. చూ. చిత్రాలు 129 క. 4, 129 చ. 2 (కో. 35).

**గ్రేనాంతాడు** పర్యా. చూ. రాయబారపుతాడు.

పకుగుచుట్టుకు రెండువైపులాకట్టి, మగ్గానికి పైన- కొన్నిచోట్ల, రాయబారపు కర్రకు వేలాడదీసినతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 129 క. 1 (కో. 35).

**గేస్‌లైట్** ఉ. గేస్‌లైట్. ఒకరకం లేత ఎర్రరంగు చూ. చిత్రం 288 (కో. 36; రా. 8).

**గేస్‌లైట్‌చీర** ఒకరకం లేత ఎర్రరంగుచీర (కో. 36).

**గొగ్గుపదును** నరిచేసేటప్పుడు, పడుగులో అక్కడక్కడ ఆరని తడి; పడుగు గొగ్గుపదునులో ఉన్నప్పుడు పోగులు అంటుకుపోకుండా ఉంటాయి (తె. 12).

**గొగ్గులువచ్చు** (క్రి.) పోగులు ఒత్తుగా రావటం; ఆరీఆరని పడుగులో అక్కడక్కడ ఒత్తుగా వస్తాయి (తె. 12).

**గొంగడి** పర్యా. కంబడి. ఉన్నిదారంతో నేసినబట్ట (తె. 3, 6, 7, 9, 11, 20, 22, 25-28).

**గొంగడికోరు** గొంగడి నేసేటప్పుడు ముందు భాగం తడిపే పిడచ; ఉన్నిబట్ట. చూ. చిత్రం 315 క. 20 (తె. 6, 7, 9).

**గొంగడి(కోరు)బొంత** పర్యా. చూ. అంజలిపిడచ (2). గొంగడినేతలో పడుగు తడపటానికి అంబలిలో ముంచిన గొంగడిగుడ్డ. చూ. చిత్రం 315 క. 20 (తె. 2, 25).

**గొంగడిపిడచ** ఉ. గొంగడిపిడస; పర్యా. చూ. అంబలిపిడచ(2). గొంగడినేతలో పడుగు తడపటానికి అంబలిలో ముంచిన గొంగడిగుడ్డ. చూ. చిత్రం 315 క. 20 (తె. 27).

**గొంగలి** పర్యా. కంబడి(మెత్త). రంగుతొట్టిలో, పింజెరమీద ఒత్తుగా కప్పిన ఉన్నిగుడ్డ; దీనిమీద రంగు పోసి, కొయ్యఅచ్చుతో రంగు అద్దుతారు. చూ. చిత్రం 283 క. 3 (కో. 26).

**గొట్టం 1.** పర్యా. చూ. డబ్బా(1). పంకెకు బదులు నూలు చుట్టుకొనే రేకుడబ్బా; కొన్నిచోట్ల రేకుపట్టెలు బిగించింది; కొన్నిచోట్ల, కొయ్యది. చూ. చిత్రాలు 30, 50.12 (కో. 13); **2.** పర్యా. అడ్డ(6), గుమ్మిదిండు, దిండు(5), దిమ్మెనగొట్టం, రాటిగొట్టం, సలకం. రాటిఆకులు బిగించిన వెదురుగొట్టం; దీన్ని సూలానికి దూర్చి రాటి తిప్పుతారు. చూ. చిత్రం 31 త. 1 (కో. 28, 30, 31, 37; తె. 27, 30, 31); **3.** దూపిరికి బిగించిన గొట్టం; దీంట్లో రాటిసూలం దిగవేస్తారు. చూ. చిత్రం 31 క. 6 (కో. 32, 35, 36); **4.** పర్యా. చూ. అసుగొట్టం(1). అసుపోసేగొట్టం; దీంట్లోకి పోగు తీసుకొని అసుపోస్తారు. చూ. చిత్రం 48 (కో. 5-10, 15, 33, 34; తె. 26, 27, 30-32; రా. 20); **5.** నారపట్టానేతలో, పడుగు అనిపోగులను లేపటానికి వాడే పనిముట్టు; దీనికి ఒకవైపు బెదను తాడు(=అచ్చుదారం) కడతారు. చూ. చిత్రం 304.1 (తె. 25); **6.** పర్యా. చూ. నేతసులిగె. గొంగడినేత చివరికి వచ్చినప్పుడు, మూరెడు మిగిలిన పడుగులో వేసే దారందూర్చిన చిన్నగొట్టం; పేకగొట్టంకంటె చిన్నది; బెత్తెడు పొడుగుది; పేకగొట్టం తీసేసి ఇది ఎక్కిస్తారు; దీని పై బెజ్జంలోనుంచి పోగు బయటికి వస్తుంది (తె. 10, 20, 25); **7.** (-వేయు) పర్యా. చూ. పేకగొట్టం. గొంగడి నేసేటప్పుడు, మగ్గానికి బిగించిన ఉన్నిపడుగులో పేకదారం వెయ్యటానికి దూర్చే వెదురుగొట్టం; లావుది: దీంట్లో పేకదారం చుట్టిన కర్ర దూరుస్తారు; ఈ గొట్టం బెజ్జంలోనుంచి పోగు బయటికి వస్తుంది. చూ. చిత్రం 318 (తె. 6, 7, 9-11, 20, 25, 28).

**గొడి** పర్యా. చూ. గద్దగోడు. ఊడ్లె అడ్డపట్టెకు గాని, సరిగుంజకుగాని వేసిన ఇనపకొక్కెం; దీనికి నరిబిగింపుకోసం వేసిన వంకెనకడియం తగిలిస్తారు. చూ. చిత్రం 63 గ. 1 (కో. 3).

**గొడికట్టె** ఉ. గొడిగట్టె; పర్యా. చూ. కొంకి (1). ఊడ్లెతాడు తగిలించి, బిర్రుపెట్టే వంగలకొయ్య; కొన్ని చోట్ల దుప్పికొమ్ము వాడతారు. చూ. చిత్రం 63 క. 6 (రా. 1, 17).

**గొండ** రూ. గొండం. మరమగ్గంలో, ఒక సొరుగులో నుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి, చేత్తో తాళ్ళనుగుంజే పిడి; మామూలుగా గుడ్డపేలికలు కలిపి కట్టింది; కొన్నిచోట్ల, దారపురీలు కడతారు; చూ. కుచ్చు. చూ. చిత్రం 118.21 (తె. 24).

**గొండం** చూ. గొండ (తె. 29).

**గొండసూత్రం** ఉ. -సూత్రం; పర్యా. చూ. కుచ్చు తాడు. మరమగ్గంలో, నాడెను నడపటానికి ఆధారంగా; కుచ్చుకట్టినదారం. చూ. చిత్రం 118.22 (తె. 24, 29).

**గొండి** పర్యా. చూ. గొలుసు(3). ఊడ్లె అడ్డపట్టెకు గాని; సరిగుంజకుగాని బిగించిన ఇనపపనిముట్టు; దీనికి పొడుగాటి ఇనపకొండ్లు రెండుంటాయి. చూ. చిత్రాలు 63 ర. 2, 70 (రా. 1).

**గొండికర్ర** పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోల్తల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (రా. 1).

**గొండీ** చూ. కొండి(7) (రా. 14).

**గొండ్లకోల** డిజైన్లునేసే మగ్గంలో, అడ్డబేలును

పైకి ఎత్తటానికి వేలాడదీసిన కర్ర. చూ. చిత్రం 111 చ. 1 (తె. 2).

**గొణ్ణెం** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ; దీన్ని, మామూలుగా మగ్గం పై దండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండి కూడా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 9 (కో. 7).

**గొణ్ణెలకమ్మి** రాకెటుమగ్గం నిలువులకుపైన, అడ్డంగా బిగించిన పట్టె; ఒకరకం మేరువుపలక. చూ. చిత్రం 115.1 (కో. 12).

**గొనుపు** చూ. కొడుపు (కో. 33, 34).

**గొయ్యి** ఉ. గొయ్య. **1.** పర్యా. చూ. మరాసు గొయ్యి. మరాసుచెక్రం తిరగటానికి అనువుగా తవ్విన పల్లపు ప్రదేశం. చూ. చిత్రం 50.6 (కో. 12, 13, 16, 18, 19, 23, 26); **2.** పర్యా. చూ. మగ్గంగుంట. నేతబయలులో పావుకోళ్ళు అమర్చటానికి తవ్వినచోటు; మోకాలులోతు ఉంటుంది. చూ. చిత్రం 118.2 (కో. 11, 13, 15-18, 21).

**గొయ్యిమగ్గం** చూ. గోతిమగ్గం (కో. 11, 34).

**గొర్రెనుచ్చు** గొర్రెపేడ; దీంతో కారంతయారుచేసి, ఎర్రరంగు అద్దేముందు, నూలును దీంట్లోవేసి పిసుకుతారు (తె. 3).

**గొలికాలుకోల** (<గొలికేలకోల) అనుపై పీటకు బిగించిన మొదటి కొయ్య. చూ. చిత్రం 45 త. 4 (కో. 34).

**గొలికెం** చూ. కొలికి(3) (కో. 34).

**గొలుసంచు** పర్యా. చెయిసంచు. గొలుసు మాదిరిగా డిజైనుపడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 180 (తె. 25, 31).

**గొలుసు** ఉ. గొల్సు; గొల్స. **1.** ?మరాసు ఇరుసు సులువుగా తిరగటానికి బాల్ బేరింగుల్లో ఉండేది; చూ. మరాసు (కో. 11); **2.** ?మరాసు పళ్ళచెక్రాలు తిప్పేది (కో. 36); **3.** పర్యా. ఊడ్తెగొలుసు, కొండ్ల గొలుసు, గొండి, గొళ్ళెం(1), తంతె(3), సరిగొలుసు. ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనప పనిముట్టు; దీనికి పొడుగాటి ఇనపకొండ్లు రెండుంటాయి. చూ. చిత్రాలు 63 ర. 2, 70 (కో. 2, 5, 7, 8, 9బి, తె. 2, 3, 5, 10-17, 21, 25; రా. 2, 7, 22); **4.** రూ. గొల్లి; పర్యా. చూ. కొలికి(3). అచ్చుకట్టేటప్పుడు, రెండు అచ్చుకర్రల వడిదారలకు వేసిన లంకె; నేతనేసేటప్పుడు, పడుగుపోగులను పైకి లేపటానికి కిందికి దింపటానికి బెంతుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (రా. 1); **5.** పర్యా. చెక్రం(12), చెయిను, జాలి, డాబీగొలుసు, డాబీచెక్రం(1), డాబీ దండ, తడక(1). లాక్సులగొలుసు. డాబీకోలలు లేపటానికి, గొలుసు మాదిరిగా, సన్నబద్దలు కూర్చిన సాధనం; ఈ బద్దలకు చిన్న పిక్కలు బిగిస్తారు; దీన్ని దిండుకు తగిలిస్తారు. చూ. చిత్రం 132 త. 1 (కో. 25; తె. 5, 13); **6.** గొంగడిమగ్గంలో, జంత్రంపైకట్టెకు, కిందికట్టెకు బిగించిన ఇనపకొండి; ఇటువంటివి, రెండు వైపులా ఉంటాయి. చూ. చిత్రం 316.4 (తె. 6, 11).

**గొలుసుకడియం** ఉ. గొలుసుకడెం; పర్యా. చూ. కడియం(1). ఊడ్తె అడ్డపట్టెకు బిగించిన ఇనపచుట్టు. చూ. చిత్రాలు 64 చ. 1, 70 క. 2 (తె. 20, 21).

**గొలుసుకొండి** ఉ. గొల్సు-; పర్యా. చూ. కొండి (4). పడుగేరుకర్రకు తగిలించే ఇనపగొలుసు కొక్కెం. చూ. చిత్రం 70.1 (తె. 11, 14).

**గొలుసుపింజెర(ం)** ఉ. గొల్సు-; పర్యా. చెయిను డాబీ, జాలిపింజెర, తడకపింజెర, పూటీలపింజెరం, బద్దలడాబీ, లేటిమ్‌డాబీ, సైజుపింజెర. ఒకరకం డాబీ; సన్నబద్దల గొలుసు దిండుకు తగిలించింది. చూ. చిత్రం 132 త (తె. 5, 18, 20, 24, 29).

**గొలుసుపేటు** ఉ. -పేటి; చూ. పేటుగొలుసు (రా. 15).

**గొలుసుబద్ద** పర్యా. కూటీకోల, చెయినుబద్ద, చెయినులాక, జాలిబద్ద, దండబద్ద, పూటీలబద్ద(2), బద్ద(7), లాటీ. డాబీగొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద(లు); వీటికి కొయ్యపిక్కలు బిగిస్తారు; ఇవి, దిండును చుట్టి తిరుగుతూ ఉంటాయి. చూ. చిత్రం 132 త. 2 (కో. 26; తె. 20).

**గొలుసుబుగిడి** గొలుసుకట్టు మాదిరిగా, మొగ్గలు పడేట్టునేసిన డిజైను. చూ. చిత్రం 181 (తె. 18, 22, 23, 25).

**గొలుసుబుగిడిఅంచు** గొలుసుకట్టు మాదిరిగానేసి, వరసగా మొగ్గలుపడేట్టు డిజైనులో నేసిన అంచు. చూ. చిత్రం 181 (తె. 22, 23, 25).

**గొలుసుములుకు** పన్నెకట్టుబడిలో, దండె(పొడుగు బద్ద)ల మధ్య ఈనెలు బిగించి దారంతో వేసిన ఒకరకం (గొలుసు)కట్టు (కో. 1).

**గొల్లకండువా** ఉ. -కండ్వ, -కండ్వా. ఒకరకం కండువా; గొల్లవాళ్ళు కప్పుకొనేది; నెమలికన్నుపేటు మాదిరి డిజైనుపెట్టి నేస్తారు (తె. 13, 14).

**గొల్లకంబడి** గొల్లవాళ్ళు కప్పుకొనే గొంగడి (రా. 13).

**గొల్లకుప్పడం** గొల్లవాళ్ళు కట్టుకొనే ఒకరకంనేత

పంచె; అంచులకు వేరేరంగు పోగులు మలిపి పువ్వులు, డిజైన్లు నేస్తారు; మామూలు పంచెకు రెట్టింపు పొడు గుంటుంది; దీన్ని మడిచి కట్టుకొంటారు (తె. 15, 16).

**గొల్లచీర** గొల్లవాళ్ళు కట్టుకొనేచీర (రా. 23).

**గొల్లచీర్లవాళ్ళు** ఉ. గొల్ల బీర్లోల్లు. బీరప్ప లింగాన్ని ఊరూరా తిప్పుతూ కురమల దగ్గర అడుక్కునేవాళ్ళు; కురమల గురుపులు (తె. 20).

**గొల్లభామకొంగు** నెత్తిన పాలకడవ మోస్తున్న గొల్లపడుచు బొమ్మలు నేసిన చీరకొంగు (తె. 21).

**గొల్లభామపమిటకమ్మి** పైటకొంగులో, గొల్ల భామబొమ్మ పడేట్టు నేసిన కమ్మి (కో. 12).

**గొల్లభామపేటు** చీరలో పువ్వులు పడేట్టునేసిన ఒక రకం డిజైను (కో. 12, 13).

**గొల్లి** చూ. గొలుసు(4) (రా. 19బి).

**గొవ్వ** ముడిపత్తి (కో. 33, 34).

**గొళ్ళెం** **1.** ఉ. గొణ్ణెం; పర్యా. చూ. కొండి(4). పడుగేరుకర్రకు తగిలించే ఇనపగొలుసుకొక్కెం. చూ. చిత్రం 70.1 (కో. 5); **2.** పర్యా. చూ. గొలుసు(3). ఊడై అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనప పనిముట్టు; దీనికి పొడుగాటి ఇనపకొండ్లు రెండుం టాయి. చూ. చిత్రాలు 63 ర. 2, 70 (కో. 10).

**గొళ్ళెంవేయు** (క్రి.) ఉ. గొల్లెం-. నేతమోకు మిడి గూటానికి చుట్టి కొలికి వెయ్యటం (తె. 7).

**గోకులుపెట్టు** సరిగోక(=గంజిపిడచ) తో పడుగు తట్టటం (కో. 36).

**గోగునార** గోగుమొక్కల ముదురుకాడలను ఊర బెట్టి ఒలిచిన చెర్మంలోపలి దారాలు; సేద్యంపనుల్లో వాడేతాళ్ళు, నులకమొ.వి పేనటానికి, బట్టలనేతలోను వాడతారు (కో. 11-21; రా. 21).

**గోగులమ్మ** చేనేతపనిచేసే కైకాలబత్తుల కులదేవత; ప్రతిపున్నమికీ పూజచేస్తారు (కో. 18).

**గోజుఅర్ర** రంగులో కలిపిన జిగురు, పోసుకొనే ఒక రకం మట్టిపాత్ర; తెంకె (కో. 7).

**గోజుకుంచె** జిగురుకుంచె; వెంట్రుకలకుచ్చు; బొడ్డ ట్యాసిరుమాలు(=రెండు అంచులకూ మధ్య ఒకరకం ఎరుపురంగు నూలు వచ్చేట్టునేసేది) నేసేటప్పుడు, నేత బిర్రుగా ఉండటానికి దీంతో జిగురు పూస్తారు (కో. 7).

**గోటిమొద్దు** రంగుఅద్ది నూలులడీలు పిండటానికి తగిలించే కొయ్య; జంపఖానా నేతపనివాళ్ళ వాడుక; చూ. కాని(గుంజ). (తె. 17).

**గోటు** పర్యా. చూ. సందు(3). అంచులో రెండు రకాల డిజైన్లలో నేసిన భాగాలకు మధ్య, మామూ లుగా నేసిన భాగం. చూ. చిత్రం 172.1 (తె. 14).

**గోడపోత** గోడకు గుంజలు బిగించి ఆసుపోసే పద్ధతి (రా. 22).

**గోడిగుంజ** పర్యా. చూ. సట్టరుగుంజ(1), మరమగ్గం చట్రం నిలబెట్టటానికి, నేతబయలులో పాతిన కొయ్య రాటు; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల రెండు. చూ. చిత్రం 116.2 (తె. 9).

**గోడు** పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచె పై భాగం; మొగలినారతోగాని, పేముతోగాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (కో. 7, 8).

**గోతాంపట్టా** ఉ. -పట్ట; పర్యా. గోనె; ఒకరకం నారతో నేసిన పట్టాగుడ్డ; దీంతో కుంచె చెంపలు కుడ తారు (కో. 2).

**గోతిమగ్గం** రూ. గొయ్యిమగ్గం; పర్యా. గుంట మగ్గం. నేతబయలులో గుంటదగ్గర అమర్చిన మగ్గం; చేతిమగ్గంగాని మరమగ్గంగాని. చూ. చిత్రాలు 108, 109 (కో. 15, 17).

**గోధుమగంజి** గోధుమపిండి ఉడకబెట్టి చేసిన జావ; దీన్ని పడుగుకు పెడతారు (రా. 9).

**గోధుమ(రంగు)** పర్యా. గోధుంకలరు. ఒకరకం బ్రౌనురంగు; చామనచాయ (తె. 21, 26).

**గోధుంకలరు** పర్యా. గోధుమరంగు. ఒకరకం బ్రౌనురంగు; చామనచాయ (రా. 9).

**గోనుతట్టు** పర్యా. పట్టా(3). రంగుతొట్టెలో పింజెర మీద కప్పిన గోనెగుడ్డ; కొన్నిచోట్ల, కంబడిమెత్తవాడ తారు; దీనిమీద రంగుపోసి, కొయ్యఅచ్చుతో రంగు అద్దుతారు. చూ. చిత్రం 283 క. 3 (రా. 24).

**గోనె** పర్యా. గోతాంపట్టా. ఒకరకం నారతో నేసిన పట్టాగుడ్డ; దీంతో కుంచెచెంపలు కుడతారు (కో. 2).

**గోనెబ్రెలవాళ్ళు** ఉ. గోనెబ్రెలోల్లు. సరితాడు, నేతమోకు తయారుచేసే ఒక తెగవారు (తె. 24).

**గోందుపుల్ల** అంచుల్లో జరీపెట్టి నేసేటప్పుడు, పోగులు అతుక్కోటానికి జిగురు (గోందు) రాసే పుల్ల. చూ. చిత్రం 139 (రా. 18).

**గోపాల్‌ఖానీ** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (కో. 16).

**గోపురం** ఉ. గోపరం, గోప్రం; పర్యా. చూ. ఊపురం. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు, పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు; చూ. పలకకొట్టు. చూ. చిత్రం 109 చ. 5 (కో. 1-3, 5, 7, 10, 18, 19, 26; రా. 11, 13, 14).

**గోభారపచ్చ** చూ. గోహారు(పచ్చ) (1) (కో. 19).

**గోమతి** **1.** ఇటికెపొడిరంగు (కో. 11); **2.** లేత నస్యంరంగు (కో. 13).

**గోమి** ఉ. గోమీ, గోము; పర్యా. చూ. బనారస్ (1). అంచు డిజైనులో పటవాలు వరసల్లో నేత కన బడేట్టు(మూలనేత)నేసిన భాగం; కొన్నిచోట్ల, కృత్రి మపుపట్టుతో నేస్తారు. చూ. చిత్రం 179 (తె. 23, 25; రా. 12, 13).

**గోమిఅంచు** ఉ. గోమీ-; పర్యా. చూ. బనారసు అంచు. పటవాలు వరసల్లో డిజైను కనబడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 179 (తె. 23).

**గోమిపేటంచు** ఉ. గోంపేటంచు. పర్యా. చూ. బనారసుఅంచు. పటవాలు వరసల్లో డిజైను కనబడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 179 (రా. 13).

**గోమిపేటు** ఉ. గోంపేటు; పర్యా. చూ. బనారసు (1). అంచు డిజైనులో పటవాలు వరసల్లో నేతకన బడేట్టు (మూలనేత) నేసిన భాగం; కొన్నిచోట్ల కృత్రి మపు పట్టుతోనేస్తారు. చూ. చిత్రం 179 (రా.12,13).

**గోము** **1.** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి వాడే పనిముట్టు; అంచుపోగులను లేపే చిన్న అచ్చు (తె. 23); **2.** అంచుల్లో పువ్వుపడేట్టు నేసిన ఒకరకం డిజైను (తె. 33).

**గోముకోల** ఒకరకండిజైనునేతకు, అంచుల్లో వడులు కట్టిన కర్ర; ఇటువంటివి పైనా కిందా రెండేసి ఉంటాయి (తె. 23).

**గోముగిరక** ఒకరకం డిజైనునేతకు, పైనుంచి అచ్చుదారాలు వేలాడదియ్యటానికి అమర్చిన గిలక; కర్రలు లేచినప్పుడు, ఇటువంటి గిలకలు తిరుగుతాయి (తె. 23).

**గోమునేత** **1.** అంచుల్లో పువ్వులు, మొగ్గలు మొ. డిజైన్లనేత; ఇది పూర్వపు పద్ధతి (తె. 23, 33); **2.** అంచులకు ఒకరంగు, నడిమిభాగానికి మరొకరంగు పెట్టి నేసిననేత (తె. 25).

**గోమువడి** అంచునేతలో గోముడిజైను పడటానికి అమర్చిన పేటువడి; చూ. వడి. (తె, 23).

**గోముసూత్రం** ఒకరకం డిజైనునేతకు, గోము కోలను లేపేదారం; ఇటువంటి దారాలను పైన, గిలక లకు వేస్తారు (తె. 23).

**గోరంచు** సన్నటిగీర పడేట్టునేసిన అంచు; మామూ లుగా, అంచుచివర కొంతభాగం విడిచి ఒకటి రెండు కొలుకుల(రంగు)దారాలుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, అయిదారు కొలకుల వరకూ పెడతారు; కొన్నిచోట్ల, చీర అంచుకు రెండు వైపులా బొద్దుపోగులు పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, మధుపర్కాలకు నేస్తారు. చూ. చిత్రం 165 (కో. 1, 3-12, 15, 18, 22-34, 36, 37; తె. 1, 11-13, 15, 31; రా.11, 13-17, 21,23,24).

**గోరంచుకమ్మి** నాలుగు కొలుకుల(రంగు)దారంతో పంచెలకు నేసే కమ్మి; కొన్నిచోట్ల, ఒక్కపోగు పెట్టి నేస్తారు (కో. 12, 13, 33).

**గోరం(చు)చాపు** ఒకరకం సన్నటి అంచుపెట్టి నేసిన రెండు పంచెలు; చాపు (కో. 5, 26, 30, 31, 34, 36, 37).

**గోరంచులుంగీ** గోరంచుపెట్టి నేసినలుంగీ (కో.36).

**గోరుబుగిడి** అంచునేతలో, చిన్న గోరంతమేర కొలు కులు పడేట్టు నేసినడిజైను చూ. చిత్రం 182 (తె. 12).

**గోలెం** (బహు. గోలాలు, గోలేలు, గోళ్ళేలు). ఉ. గోలం, గోళెం. **1.** పర్యా. గంజిగోలెం. మట్టితొట్టి; దీంట్లో గంజి నిలవఉంచుకొంటారు (కో. 3, 4, 33, 34, 37; రా. 11, 16); **2.** రంగునీళ్ళుపోసే ఒకరకం మట్టిపాత్ర; నూలులడీలు దీంట్లో నానబెడతారు; కొన్ని చోట్ల, దీంట్లో నీళ్ళు పోసుకొంటారు. చూ. చిత్రం 282 క.8 (కో.2,4,26,33; తె.5,15; రా. 11, 12).

**గోల్కొండచౌకిడీ** ఉ.-చెవుకిడీ. అయిదు కొలుకులు వక్క రంగు, ఒక కొలికి లాకీపెట్టి నేసినగడి (రా. 13).

**గోల్డెన్‌బ్రౌను** ఒకరకం గోధుమరంగు (రా. 8).

**గోల్బునాయినేత** నాలుగుపావుచెక్కలు అమర్చిన మగ్గంమీద కుట్టు, కోత లేకుండా బట్ట నెయ్యటం; నెహ్రూలాల్చీ, పొడుగులాగు, త్రివర్ణపతాకం, రవిక, జేబురుమాలు మొ.వి కుట్టు అక్కరలేకుండా మగ్గం మీదే నేస్తారు (తె. 28).

**గోవ** పర్యా. చూ. చిగురు. అంచులో చిట్టచివరి భాగం; కొన్నిచోట్ల, చివర కొంత విడిచి అంచునేస్తారు; కొన్నిచోట్ల; చివరభాగంలోనే అంచునేస్తారు; మామూ లుగా, ఈనేతకు జమిలిపోగులు వాడతారు. చూ. చిత్రం 183 (కో. 24).

**గోహారు(పచ్చ)** **1.** రూ. గోఖారపచ్చ. ఒకరకం లేతపచ్చరంగు; సరస్వతివన్నెకంటె ముదురుది; ఇండెం త్రీన్ గ్రీన్ బి. పొడరు ఒరిజనల్ వేసి తయారుచేస్తారు; దీనికి జి. జి. హైలీకాంక్ కలిపితే దమయంతిపచ్చ వస్తుందట. చూ. చిత్రం 288 (కో. 6, 7, 12, 15, 20, 21); **2.** పాలపిట్టరంగు. చూ. చిత్రం 288 (కో. 16); **3.** దమయంతిపచ్చకంటె లేతరంగు (కో. 18).

**గౌరమ్మపండుగ** ఉ. -పండగ, -పండుగు. గౌరీ దేవిని కొలిచే పండుగ; కార్తిక పౌర్ణమినాడుగాని, భాద్రపదమాసంలోగాని చేస్తారు (రా. 15, 16).

**గౌరీపున్నమ** గౌరీదేవిని కొలిచే పండుగ; ఆశ్వయుజ మాసంలో పౌర్ణమినాడు చేస్తారు (కో. 36, 37).

**గ్రాఫ్‌గడి** గ్రాఫుకాయితం గళ్ళమాదిరి చిన్న నేత గడి (కో. 34).

**గ్రీన్ ఆలివ్** ఒకరకం పచ్చరంగు (కో. 21).

**గ్రేకలరు** ఉ. గ్రేకల్రు. ఒకరకం బూడిదరంగు; సిమెంటురంగు (కో. 7, 24; రా. 8).

# చ

**చక్కబుగిడి** ఒకరకం బుగిడి; చూ. బుగిడి (తె. 24)

**చక్కరకానివన్నె** ఉ. -వన్నె. పచ్చిపసుపువన్నె (రా. 24).

**చక్కి** బొడ్డజ్యాసిరుమాలు నేతలో, నల్చదరంగా వచ్చిన డిజైను (కో. 7).

**చక్కి** పర్యా. తొడుపు. ఇరుసు మోపేచోట, రాట్నం నిలువుకు బిగించిన ఇనపకట్టు (కో. 30).

**చంకకొయ్య** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గంచట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 27).

**చంకతాడు 1.** పర్యా. పెద్దపురితాడు. పట్టుదారం వడికే పెద్దరాట్నం ఇరుసును, డొలకను కలిపే గట్టి దారం; రాట్నం తిరిగినప్పుడు, డొలకకూడా తిరుగుతుంది. చూ. చిత్రం 293 చ. 8 (తె. 21); **2.** పర్యా. చూ. చెంపతాడు(4). కుచ్చుతాళ్ళలో, డైమను తాడుకు ఒకవైపు కట్టిన దారం; దీన్ని పైన మగ్గం నిలువుపట్టెకూ, కింద ఉడతతాడుకూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి, చూ. చిత్రం 118.23 (తె. 21, 26, 27; రా. 19బి).

**చంకపంజె** చంకన పెట్టుకొని నిలబడి, నూలుచుట్టే పంజె; దీని కామ పొడుగ్గా ఉంటుంది. చూ. చిత్రం 19చ (తె. 32).

**చచ్చునూలు** పర్యా. చూ. మెతువునూలు. మెత్తటి నూలు (రా. 7, 11).

**చట్టం 1.** పర్యా. చూ. తిరిగిణిచట్టం. అడ్డగుమ్మి అమర్చే కొయ్యచట్రం; చూ. దొడ్డి. చూ. చిత్రం (రా. 11, 13, 17); **2.** పర్యా. చూ. మగ్గంచట్టం (1). మరమగ్గంలో, పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగుపట్టెల చట్రం; ఫ్రేము; మామూలుగా దీన్ని నిలువు పట్టెలకు కుచ్చుతాళ్ళకట్టేకొయ్యలు బిగిస్తారు; కిందిపట్టెమీద నాడె ఆడుతుంది. చూ. చిత్రం 118 (కో. 33; తె. 3; రా. 18-20); **3.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు, దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118.9 (రా. 10).

**చట్టంగాడి** పర్యా. చూ. పలకగాడి(1). మరమగ్గం పలకకు, పన్నె బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 118.12 (రా. 10).

**చట్టంమేకు** పర్యా. చూ. చిల్ల(7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా, చట్టం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి, రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (రా, 3).

**చట్రంతాడు** పర్యా. చూ. కుచ్చుతాడు. మరమగ్గంలో నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టిన దారం. చూ. చిత్రం 118.22 (కో. 17).

**చతుకు** ఉ. సతుకు. సరిచేసేటప్పుడు, పడుగుమీద అంజలిపోసి, చేత్తో చరచటం; పిసకటం (తె. 33).

**చదర** రూ. చదిరె. పర్యా. మగ్గంచదర. నేతనేసేటప్పుడు, నేతపనివాడు కూర్చొనే చిన్నచాప; కొన్నిచోట్ల తడికె; కొన్నిచోట్ల, నాడె మగ్గంగుంటలోకి పడకుండా, గుంటమీద పెడతారు (కో. 12, 15, 17).

**చదిరె** చూ. చదర (తె. 31).

**చప్టాబల్ల** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 7).

**చమిఈద్దు** పర్యా. చూ. ఊడ్తె. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు; రెండుపొడుగు పట్టెలు, మడతమంచం కోళ్ళమాదిరిగా అమర్చి, పైన అడ్డపట్టెచేర్చి బిగించి ఉంటారు; తొగటవారి వాడుక. చూ. చిత్రం 63 క (రా. 9, 12).

**చమురుకొమ్ము** పర్యా. కొమ్ము(3), నూనెకొమ్ము. నూనెపోసుకొనే దుప్పికొమ్ము; మగ్గానికి వేలాడదీస్తారు; నేతనేసేటప్పుడు, అప్పుడప్పుడు నాడెను సాపుచెయ్యటానికి గుడ్డతో నూనె పూస్తారు. చూ. చిత్రం 121 క. 16 (కో. 9).

**చమురుగురిగి** నూనెపోసిన చిన్నపాత్ర (పిడత); నేతనేసేటప్పుడు, నాడెను సాపుచెయ్యటానికి వాడే నూనె (ఆముదం, కిరసనాయిలు, కొబ్బరినూనె, నువ్వులనూనె మొ.వి) దీంట్లో పోస్తారు (తె. 33).

**చమురుచిప్ప** నూనెపోసిన చిప్ప; నేతనేసేటప్పుడు, నాడె సాపుచెయ్యటానికి వాడేనూనె (ఆముదం, కిరసనాయిలు, కొబ్బరినూనె, నువ్వులనూనె మొ.వి) దీంట్లో పోస్తారు (కో. 12).

**చమురుచెంబు** పర్యా. నూనెచెంబు, నూనెపోసిన చిన్నపాత్ర; నేతనేసేటప్పుడు నాడె సాపుచెయ్యటానికి

వాడే నూనె (ఆముదం, కిరసనాయిలు, కొబ్బరినూనె, నువ్వుల నూనె మొ.వి) దీంట్లో పోస్తారు (తె. 18).

**చరుము** (క్రి.) సరుము; పర్యా. చూ. తోము. గంజి రుద్దటం; పామటం; గంజి పడగట్టటానికి గుడ్డలో పోసి రుద్దుతారు (కో. 1).

**చలవచేయు** (క్రి). చౌడు, సున్నం కలిపిన నీళ్ళలో నూలు ఉడికించి తెలుపుచెయ్యటం; to bleach (కో. 23).

**చలవ(నూలు)** చౌడు, సున్నం కలిపిన నీళ్ళలో ఉడికించి తెలుపుచేసిన నూలు; bleached yarn (కో. 16, 23; రా. 11, 12, 24).

**చలవ(రంగు)** పర్యా. చలవెల్ల. అచ్చమైన తెలుపు; నూలు "బ్లీచ్" (చలవ) చేసినప్పుడు వచ్చింది (కో. 7, 8, 21).

**చలవెల్ల** (< చలవవెల్ల) పర్యా. చలవ(రంగు). అచ్చమైన తెలుపు; నూలు "బ్లీచ్" (చలవ) చేసినప్పుడు వచ్చింది (కో. 7).

**చలిగంజి** పులవబెట్టినగంజి; దీంతో ఎసరుపెట్టి గంజి తీస్తారు (తె. 16).

**చల్నేత** పర్యా. కొలికినేత, గుల్ల నేత, చెరికచ్చినేత, వెత్తినేత, సాలికట్టునేత. పేకపోగులు కలవకుండా విడి విడిగా కనిపించేటట్టు నేసిన నేత; మేటినేత మాదిరిది; అనిమూసి నేస్తారు (కో. 12, 15, 21).

**చల్లడంగుడ్డ** పొట్టిలాగు మాదిరిగా, మోకాళ్ళ వరకూ తొడుక్కొనే చల్లడంకోసం నేసినబట్ట (రా. 16).

**చవితిపండుగ** ఉ. సైతిపండగ, సౌతిపండగ, సౌతి పండుగు; పర్యా. చూ. వినాయకచవితి. వినాయక (=వెనకయ్య) చవితి; భాద్రపద శుద్ధ చవితి; నేతపని వాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి, బొట్లుపెట్టి, పూజ చేసి, పండుగ చేసుకొంటారు (కో. 5; తె. 8, 10, 18, 19, 31, 33).

**చాకలిరుమాలు** ఒకరకంతలపాగ; ఎర్రటిరంగుగుడ్డకు చౌకిడీ (నల్చదరపుగడి)లు పడేట్టు నేస్తారు; మామూలుగా. చాకలివాళ్ళు తలకు చుట్టుకొంటారు (తె. 24).

**చాంచు** (క్రి.) చూ. చాపు(2). (రా. 6).

**చాపనేత** ఒకరకంనేత (తె. 1).

**చాపు 1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె (2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 3, 7, 8, 18, 21); **2.** (క్రి.) రూ. చాంచు, చాయించు, చాయు; పర్యా. చూ. పారదీయు, సరిపట్టు(1). ఆరుబయట పడుగు పరవటం; రెండు ఊడ్డెలకు మధ్యగాని, ఒక ఊడ్డెకూ సరిగుంజకూ మధ్యగాని చాపుతారు (కో. 8, 9బి, 14, 15, 19, 32, 35; రా. 8, 16); **3.** సరిబయలులో గాని, నేతబయలులోగాని పారదీసిన పడుగునూలు (తె. 26); **4**, పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గం చట్రంలో పన్నెబిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడెఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118 క. 9 (తె. 7). **5.** పర్యా. జత, జోడా(3), ధోతులచాపు, ధోవతుల జోడా, పంచెలచాపు, పంచెలజత, మొగకట్టుచాపు. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట; బద్దెతో కలిసి ఉన్నది (కో. 2, 5, 7, 9ఎ, 11, 15, 16, 18-24, 26-31, 33-37; తె. 13, 16); **6.** రెండు చీరలు (కో. 8, 9బి).

**చాపుకట్టె** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె; ఇవి 1-3 ఉంటాయి. చూ. చిత్రం 45 క. 7 (తె. 7).

**చాపుకలియు** (క్రి.) రెండు ఉరువులనేత (పంచెల జత)పూర్తికావటం; తరవాత, బద్దెకోసి మగ్గంమీదినించి తీసివేస్తారు (కో. 34, 36).

**చాపుడుమగ్గం** పడుగు పూర్తిగా చాపినేసే మగ్గం (తె. 8).

**చాపులపడుగు** పంచెలచాపుల నేతకువాడే పడుగు నూలు; సుమారు ఇరవైనాలుగు పుంజాలు ఉంటుంది (కో. 30).

**చాముండీశ్వరి** పర్యా. చూ. చౌడీశ్వరి. చేనేతపని చేసే దేవాంగులు, తొగటబలిజెలు మొ.వారు కొలిచే దేవత; మామూలుగా ఆషాఢమాసంలో అమావాస్య నాడు చౌడీశ్వరిని కొలుస్తారు (రా. 3).

**చాయ** ఉ. సాయి; పర్యా. చూ. రంగు. కాంతికిర ణాలవల్ల కంటిలోపలి తెర (రెటీనా) ఆధారంగా కలిగే వర్ణజ్ఞానం. చూ. చిత్రం 238 (కో. 1-4, 7, 8, 10; రా. 10, 11, 13, 15).

**చాయఅద్దు**(క్రి.) నేసినబట్టకు రంగు వెయ్యటం (కో 1).

**చాయతొగరు** ఉ. సాయితొగరు; నిండు ఎరుపురంగు (కో. 8).

**చాయవేయు** (క్రి.) పర్యా. చూ. రంగువేయు. నూలుకురంగు పట్టించటం; రంగునీళ్ళలో ముంచుతారు (కో. 1, 7; రా. 11, 12).

**చాయించు** (క్రి.) చూ. చాపు(2) (రా. 4).

**చాయు** (క్రి.) చూ. చాపు(2) (కో. 7).

**చారగొర్రె** రంగుచారలుగల గొర్రె; ?జిమ్‌జిమ్‌గా ఉండేది (తె. 22, 25).

**చారపోగు** సరిచేసిన పడుగులో, తడిపొడిగా ఉన్న పోగు; కొంతభాగం ఎండి, కొంత భాగం ఎండనిపడుగు (తె. 29).

**చారలకమ్మి** జొన్నఉలచ మందంలో, తెల్లగీరలు పడేట్టు రంగునూలుతో నేసినకమ్మి; దీనికిముందు, రెండు రంగుపోగులుపెట్టి (=జట్టకట్టి) నేస్తారు (కో. 14).

**చారలచీర** రంగులో గీరలు గీరలుగా నేసిన చీర (కో. 34).

**చారలంచు** కడ్డీలమాదిరిగా వరసగా నేసిన అంచు. చూ. చిత్రం 184 (కో. 14).

**చారుగోమి(చీర)** ఉ. -గోమి. ఒకరకం నేతచీర; జిలిబిలిచీర (తె. 22).

**చార్ కోరి** అంచులో నేసిన నాలుగు గీరలు. చూ. చిత్రం 185.4 (తె. 24).

**చార్ జమా** నాలుగువైపుల నాలుగు రంగుపట్టెలు, నాలుగుపూలు, మధ్య మరొకపువ్వు పడేట్టు నేసిన జంపఖానా (తె. 1).

**చార్ మినార్** నేతలో, చార్మినార్ ఆకారంలో నేసిన డిజైను (తె. 10).

**చాలిచ్చు** (క్రి.) జాడించటం (తె. 17).

**చాలుకుండ** పర్యా. చాలుతొట్టి. నేతనేసేటప్పుడు, గొంగడి అడ్డంలో ముందుభాగం తడపటానికి నీళ్ళు పోసిన కుండ (తె. 6).

**చాలుతడుపు** (క్రి.) గొంగడి నేసేటప్పుడు, నేసిన ముందుభాగం నీళ్ళతోగాని, అంబలితోగాని తడపటం; రెండు మూడు పేకపోగులు వేసిన తరవాత ఒకసారి బట్ట తడుపుతారు (తె. 7, 26).

**చాలుతొట్టి** పర్యా. చాలుకుండ. నేతనేసేటప్పుడు, గొంగడి అడ్డంలో ముందుభాగం తడపటానికి నీళ్ళు పోసినకుండ (తె. 7, 26).

**చిక్కు** **1.** నేతలో డిజైన్లు పడటానికి కట్టిన వడి దారాల కూర్పు (తె. 5, 12); **2.** జరీ; మామూలుగా; అంచులు, కమ్ములు డిజైన్లు దీంతో నేస్తారు (తె. 5).

**చిక్కుకొండి** ఉ. -కొండు. నేతలో డిజైన్లు పడటానికి కట్టిన వడిదారలను కదిపేకుచ్చు (తె. 12).

**చిక్కెం** ఉ. సిక్కెం. తాడుతో అల్లిన చిక్కం; కత్తిరించిన ఉన్ని దీంట్లోవేసి తీసుకువెళ్తారు (తె. 25).

**చిక్కెంతాడు** ఉ. సిక్కెంతాడు. ఉన్ని చిక్కం బిగించెతాడు (తె. 25).

**చిగిలించు** (క్రి.) పర్యా. దుల్లు(1). పకేముందు దూదిని, చీపురుపుల్లలతో విదిలించి దుమ్ముదులపటం. చూ. చిత్రం 7.1 (కో. 34).

**చిగురంచు** పర్యా. కడంచు. బట్టచివర వదిలిన సన్నటి అంచు; రెండు, మూడు కొలుకులదారం పెట్టి నేస్తారు. చూ. చిత్రం 165 (కో. 6, 9బి, 11, 14, 18; తె. 1, 4, 12, 13, 15, 24).

**చిగురంచుధోతి** ఉ. -దోతి. చివర సన్నటి అంచు పెట్టి నేసిన అంచు (తె. 24).

**చిగురు** పర్యా. అముకు, కడ(2), గోవ, ముసెంచు. అంచులో చిట్టచివరిభాగం; కొన్నిచోట్ల, చివరకొంత విడిచి అంచు నేస్తారు; కొన్నిచోట్ల, చివరి భాగంలోనే అంచునేస్తారు; మామూలుగా, ఈ నేతకు జమిలిపోగులు వాడతారు. చూ. చిత్రం 183 (కో. 6; తె. 13).

**చిగురుజముక్లు** ఉ. చిగురుజముండ్లు; పర్యా. చూ. కడజముక్కు. అంచులో చిట్టచివరివైపు నేతకువాడే జమిలిపోగులు; అంచు గట్టిదనంకోసం రెండు మూడు పోగులు కలిపి, పురిపెట్టి వాడతారు (తె. 12).

**చిగురుపచ్చ** **1.** పచ్చలో లేతరంగు (తె. 17); **2.** లేతచిగురురంగు (తె. 21).

**చిగురుబొత్తంచు** **1.** చిన్నమొగ్గల వరసలో, డిజైను పడేట్టు నేసిన ఒకరకం అంచు. చూ. చిత్రం 257 (కో. 33, 36); **2.** చిన్నఅంచు (కో. 28, 30, 32).

**చిగురుబొత్తంచుచాపు** ఒకరకం అంచుపెట్టి నేసిన రెండు పంచెలు; చూ. చిగురుబొత్తంచు (కో. 26).

**చిగురుబొద్దంచు** చివర కొంత వదిలి, పైన పట్టె మాదిరిగా నేసిన అంచు (కో. 22).

**చిగురు(రంగు)** **1.** రూ. చివురురంగు. నలుపులో ఎరుపువన్నె కలిసింది (కో. 14, 15; తె. 9); **2.** లేత చిగురురంగు (తె. 17).

**చిటికెఅద్దకం** ఉ. చిట్కుఅద్దకం. ఒకరకం అద్దకం; చిన్న నూలుచిలప (=బొందు)కు, లెక్కప్రకారం, కొన్నిచోట్ల రంగు అంటకుండా దారాలుచుట్టికట్టి, రంగునీళ్ళలో ముంచుతారు; దారాలు కట్టినచోట్ల తెల్లగా ఉంటుంది (రా. 14).

**చిటికెకట్టు** (క్రి.) ఉ. చిట్కికట్టు; పర్యా. చుక్కకట్టు. చిన్ననూలు చిలప(బొందు)కు రంగు అద్దేటప్పుడు, లెక్కప్రకారం, కొన్నిచోట్ల రంగు అంటకుండా దారాలు-కొన్నిచోట్ల, రబ్బరుముక్కలుగాని, పురికోసగాని-చుట్టటం; చిలప, రంగులో ముంచిన తరవాత ఆరేసి కట్లు విప్పుతారు; కట్టువిప్పినచోట్ల తెల్లతెల్లగా ఉంటాయి (తె. 5).

**చిటికెచీర** ఉ. చిటికిచీర, సిటికెసీర, సిక్కుసీర. చిటికెకట్టి(=నేతనూలుకు అక్కడక్కడ రంగు అంటకుండా కట్లుకట్టి) రంగుఅద్దిన నూలుతో నేసిన చీర; మామూలుగా నేసేటప్పుడే, అంచుల్లోను, కమ్ముల్లోను చేపలు, గళ్ళు, లింగాల మండపం మొ. డిజైన్లు పడతాయి (తె. 13, 14).

**చిటికెపని** పర్యా. చిటుకునేత. నూలుచిలపకు కొన్నిచోట్ల రంగు అంటకుండా ఉండేటట్టు, డిజైను

లెక్కప్రకారం, కట్లుకట్టి రంగులో ముంచిన నూలుతో నేసిననేత (తె. 13).

**చిటికెపీట** ఉ. సిక్కెపీట; పర్యా. తానెపీట(2), చిటికె అద్దకానికివాడే నూలుతోడే కొయ్యపనిముట్టు; అనుమాదిరిది. చూ. చిత్రం 285 (తె. 11).

**చిటికెపేక** ఉ. సిక్కెపేక. చిటికెనేతలో అడ్డానికి వాడే నూలుచిలప (తె. 11).

**చిటికెమూకంచు** చిటికెనేతలో నేసిన ఒకరకం అంచు; చూ. మూకంచు. (రా. 18).

**చిటుకునేత** పర్యా. చిటికెపని. నూలుచిలపకు కొన్నిచోట్ల రంగు అంటకుండా ఉండేటట్టు, డిజైను లెక్కప్రకారం, కట్లుకట్టి రంగులో ముంచిన నూలుతో నేసిననేత (తె. 17).

**చిట్కా** నూలులెక్క; లడీలో డెబ్బయ్యోవంతు నూలు (రా. 16).

**చిట్టచెంగు** ఉ. సిట్టసెంగు; పర్యా. కట్టుచెరగు. చీర కట్టుకొనేటప్పుడు; లోపల నడుముకు చుట్టుకొనేచెరగు; మామూలుగా, డిజైన్లు లేకుండా చిన్నది నేస్తారు (కో. 35).

**చిట్టి 1.** పర్యా. చూ. సందు(3). అంచులో రెండు రకాల డిజైన్లలో నేసిన భాగాలకు మధ్య మామూలుగా నేసిన భాగం. చూ. చిత్రం 172 చ. 1 (రా. 15); **2.** రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది; చూ. పావు. చూ. చిత్రం 282 ప. 1 (కో. 5).

**చిట్టె** ఉ. చిట్టి, సిట్ట, సిట్టె, సెట్టె. **1.** నూలులెక్క: (క) లడీలో పదోవంతు నూలు; ఇది 800-820 గజాల పొడుగు ఉంటుంది (తె. 1-3, 5-9, 11-15, 17-21, 23, 25, 28, 29, 31, 32; రా. 8, 13, 15, 17, 18, 23, 24); (చ) 20 నెంబరు నూలులో సుమారు రెండు తులాల బరువుండేనూలు (తె. 4); (ట) లడీలో డెబ్బయ్యోవంతు నూలు (రా. 16); (త) పదోనెంబరు లడీలో అయిదోవంతునూలు (తె. 30); (ప) 120 పోగులనూలు (తె.22,33); **2.** పర్యా. ఆకు (3), ఆకుపుల్ల, కురుబల్ల, కురువిళ్ళ, గుజ్జ(4), చిడత(1), చిల్ల(1) చిల్లపుల్ల, దబ్బ(4), దాపు(1), పల్ల, బద్ద(2) బల్ల(2), బిగిచెక్క, బిడిబద్ద(1), బిర్రుచిట్టె(1). బిర్రుబద్ద, బిళ్ళ(2), మిట్ట(1). పంజె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రాలు 19 క. 3, 19 క. 4 (కో. 9; తె. 2, 5, 8, 10-18, 20, 32); **3.** పర్యా.చూ. పలకసీల. చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య; కొన్నిచోట్ల, దీనికి పై భాగంలో నగిషీలు చెక్కుతారు; కొన్నిచోట్ల, దీన్ని తొలిచి, గజ్జెలు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 3 (తె. 28); **4.** కమ్మితలకు, కమ్మికి మధ్య నేసిన రెండు సన్నగీర(లు); ఇటువంటివి, చీర రెండుకమ్ములకూ రెండుంటాయి. చూ. చిత్రం 272 (రా. 13); **5.** కమ్మిపక్కన (ఇవతల) జమిలిపోగులు పెట్టి నేసిన గీరలు (కో. 6); **6.** పట్టుదారంచుట్టేపంజె (సిల్కుపంజె) ఆకుల బిగింపుకోసం, కామకుచుట్టూ అమర్చిన చిన్న కొయ్యబద్ద(లు) (తె. 18, 21).

**చిట్టెకట్టు** ఉ.సిట్టెకట్టు. కమ్మిలో పట్టెలు నెయ్యటం (రా. 15).

**చిట్టెకొయ్య** పర్యా. చూ. కోతిపుల్ల(1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేపటానికి, మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండు వైపులా అచ్చుగుడులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు నేతనేసేటప్పుడు పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (తె. 29).

**చిట్టె(ల)కమ్మి** ఉ. సిట్టెకమ్మి, సిట్టెలకమ్మి. **1.** అయిదేసి కొలుకులదారం ఎరుపు, తెలుపు వన్నెల్లో పెట్టి నేసినకమ్మి (రా. 11); **2.** అయిదుగాని, ఏడుగాని ఒకేరకం పట్టెలు వరసగా మూడువేళ్ళ వెడల్పులో నేసినకమ్మి (రా. 13, 15).

**చిట్టెలబరాటి** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంజె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలప నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (రా. 23).

**చిట్టెలమొద్దు** ఉ సిట్టెలుమొద్దు; పర్యా. చూ. కాటుపీట. పంజెకు నూలు చుట్టేటప్పుడు పంజెకామకు ఊనికగా పెట్టే కొయ్య. చూ. చిత్రం 28 (తె. 20).

**చిట్టెలరాటం 1.** ఉ. సిట్టెల్రాటం; చూ. చిట్టెల రాట్నం. (రా. 24); **2.** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి; చూ. రాటి. చూ. చిత్రం 34 (రా. 13); **3.** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు. పంజె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలప నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (రా. 18).

**చిట్టెలరాట్నం** ఉ. సెట్టెలరాట్నం; రూ. చిట్టెల రాటం; పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలు చిలపలు తోడే రాట్నం. చూ. చిత్రం 41 (తె. 21, 31).

**చిట్టెసూత్రం** పర్యా. చూ. అచ్చుసూత్రం(2). అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు; దీనికి కొన్నిచోట్ల, కోతిపుల్ల కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ.చిత్రాలు121 గ.1, 121 త. 3(తె. 29).

**చిట్లింపొడి** ఇనపరజను; కమ్మరివాళ్ళ దగ్గరినించి తెస్తారు; రంగుల తయారీలో వాడేది (రా. 14).

**చిడత** ఉ. చిడ్త. **1.** రూ. చిరత(1); పర్యా. చూ. చిట్టె(2). పంజు ఆకుల బిగింపుకువేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రాలు 19 క. 3, 19 క. 4 (తె. 4, 6, 9, 19; రా. 23); **2.** పర్యా. చూ. అనికొయ్య. అసుపోసేటప్పుడు; పడుగులో అనులు పడటానికి కచ్చిపీటకు బిగించిన పుల్ల(లు). చూ. చిత్రం 45 క. 6 (తె. 9); **3.** చూ. చిరజ(2) (కో. 37); **4.** పర్యా. చూ. కోతిపుల్ల(1). నేతనేసేటప్పుడు. అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుదులు మెలి పెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1(రా.19); **5.** రూ. చిరత(4); పర్యా. చూ. ఉడత. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; ఇటువంటివి, రెండు సొరుగులపైనా అమరుస్తారు. చూ. చిత్రం 119 (తె. 1; రా. 23).

**చిడతతాడు** ఉ. చిడ్తతాడు; రూ. చిరతతాడు(3); పర్యా. చూ. ఉడతతాడు. మగ్గంఉడతకు పైన కట్టిన దారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (తె. 1; రా. 23).

**చిడతతోలు** రూ. చిరతతోలు; పర్యా. చూ. ఉడతతోలు. మరమగ్గంలో ఉడతకు కిందవేలాడే తోలుచుట్టు; దీని కొసలు, ఉడతచిల్లిలోనుంచి పైకిదూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (తె. 1; రా. 23).

**చిడతపుల్ల** పర్యా. చూ. అనికొయ్య. అసుపోసేటప్పుడు, పడుగులో అనులు పడటానికి కచ్చిపీటకు బిగించిన పుల్ల(లు) చూ. చిత్రం 45 క. 6 (తె. 7).

**చిత్తి** ఉ. సిత్తి; పర్యా. ఉడతతోలు. మరమగ్గంలో, ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు; దీనికొసలు, ఉడత చిల్లిలోనుంచి పైకి దూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది.చూ.చిత్రం119.2(రా.10,19బి).

**చిత్రబుగిడి** పర్యా. సిద్దిపేటు. రెండు బుగిడుల వరసలో బొమ్మ(లు) పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 186 (తె. 19, 22).

**చినకరబద్ద** పర్యా. ఒత్తుబద్ద. గొంగడినేత చివరికి వచ్చినప్పుడు, పడుగులో పేకపోగు దట్టించటానికి దూర్చేబద్ద; ఇది ఎక్కించి బేము తీసేస్తారు (తె. 20).

**చినతాడుకొయ్య** ఉ. చింతాడుకొయ్య, సింతాడు కొయ్య; పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతినకొయ్య; దీనికి, నేతమొకులో కొలికివేసి, పెడకోలకుచుట్టి, పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకుకట్టి, దీనికి పనుగు మెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగి పోకుండా గొట్టం తొడుగుతారు. చూ.చిత్రం 127.13 (కో. 14; తె. 10, 11, 14-16).

**చింతకాయ** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ; దీన్ని మామూలుగా, మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల, అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరక, కొండికూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (కో. 11, 11).

**చింత (గింజల) అంబలి** చింతగింజలు ఉడకబెట్టి తీసిన పాకం; మామూలుగా, గింజలువేయించి, నానబోసి, రుబ్బి, ఉడకబెడతారు (తె. 3, 11).

**చింతగింజలచీర** పర్యా. చింతపిచ్చలచీర. ఒకరకం గళ్ళచీర; రెండురంగుల పోగులు పన్నెండేసి కొలుకుల చొప్పున (ఎరుపు – నీలిగాని, ఎరుపు – ఆకుపచ్చగాని) పడుగూపేకాపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, అయిదేసి కొలుకులుపెట్టి నేస్తారు (తె. 28).

**చింతచిగురు** **1.** pea green (తె. 4); **2.** ఒకరకం ఆకుపచ్చరంగు (తె. 11-13, 15).

**చింతపిక్కరంగు** ఒకరకం ఎర్రరంగు (కో. 22).

**చింతపిక్కలగంజి** పర్యా. చింతసరి, పిక్కలగంజి. చింతగింజలు పిండిగొట్టి, ఉడకబెట్టి తీసిన గంజి; మామూలుగా, ముదుగు పడుగులకు వాడతారు; కొన్నిచోట్ల బియ్యపుగంజికి తోడుగలుపుతారు (కో. 36).

**చింతపిక్కలగడి** తెల్లరంగులో నల్లపోగులు పెట్టి నేసిన గడి (కో. 32).

**చింతపిచ్చలచీర** రూ. చింతబిచ్చికలచీర; పర్యా. చింతగింజలచీర. ఒకరకం గళ్ళచీర; రెండు రంగుల పోగులు, పన్నెండేసి కొలుకుల చొప్పున (ఎరుపు-నీలిగాని, ఎరుపు-ఆకుపచ్చగాని)పడుగూపేకాపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, అయిదేసి కొలుకుల చొప్పున పెట్టినేస్తారు (కో. 4; తె. 1; రా. 11, 13, 18).

**చింతపూవు** ఆకుపచ్చలో కొంచెం తెలుపువన్నె కలిసింది (తె. 10).

**చింతబిచ్చికలచీర** చూ. చింతపిచ్చలచీర (రా. 17).

**చింతసరి** పర్యా. చూ. చింతపిక్కలగంజి. చింత గింజలు పిండిగొట్టి, ఉడకబెట్టి తీసిన గంజి; మామూ

లుగా, ముదుగు పడుగులకు వాడతారు; కొన్నిచోట్ల, బియ్యపుగంజికి తోడుగలుపుతారు (కో. 37).

**చింతామణి** ఒకరకం లేతనీలంరంగు. చూ. చిత్రం 288 (కో. 21, 35).

**చింతామణిచీర** ఒకరకం లేతనీలంరంగు చీర (కో. 21, 35).

**చిన్నఅడ్డపీట** పర్యా. చూ. వెనక(టి)పీట. అను పీటల్లో చివరిది; దీనికి మామూలుగా ఒకచాలులో అను కొయ్యలు బిగించి ఉంటాయి. చూ. చిత్రం 45 క. 3 (తె. 28).

**చిన్నకడ్డీచీర** నలుపు ఇటాలి రంగుల్లో 2 : 1 : 3 : 1 కొలుకుల చొప్పున పెట్టి అంచుల మధ్యభాగం నేసిన చీర (రా. 24).

**చిన్నకమ్మి** కమ్మినేతలో చిన్నపట్టె; చూ. కమ్మి (కో. 3).

**చిన్నకుంచె** (-వేయు). ఒకరకంకుంచె; పడుగు దువ్వేది; సుమారు రెండు జేనల పొడుగు ఉంటుంది; సరిచేసేటప్పుడుగాని, పడుగేరేటప్పుడుగాని, పోగులు సాపుచేయ్యటానికి దీంతో దువ్వుతారు; సరిచేసే పడుగు ఆరుబయలులో ఉన్నప్పుడు, దీంతో గంజి చిలకరిస్తారు; చూ. అలుక్కుంచె. చూ. చిత్రం 79 (కో. 8, 9ఎ; తె. 12, 14; రా. 19).

**చిన్నఖయలుపేటు** ఒకరకం అంచుడిజైను. చూ. చిత్రం 65 (రా. 12).

**చిన్నగది** తడికిబిళ్ళలో, ఇనపపుల్లల మధ్యగల చిన్నసందు. చూ. చిత్రం 97 క. 2 (కో. 7).

**చిన్నగుదిపాయ** పర్యా. చూ. అంచగుదిపాయ. అచ్చుగుదిపాయల్లో చివరిది; ఇటువంటివి, కుడివైపున, ఎడమవైపున రెండుంటాయి. చూ. చిత్రాలు 100.6, 100.8 (రా. 7).

**చిన్నగోరంచు** సన్నగానేసిన గోరంచు (కో. 25).

**చిన్నచిట్టె** ఉ. సిన్నసిట్ట, సిన్నసిట్టి. **1.** పర్యా. చూ. బిర్రుచిట్టె(2). పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డ బద్దల్లో కిందిది. చూ. చిత్రం 19 క. 4 (తె. 10, 14, 17); **2.** పర్యా. చిన్నకమ్మి. కమ్మినేతలో చిన్నపట్టె; చూ. కమ్మి (కో. 5).

**చిన్నదండెం** మగ్గంచిడతలు అమర్చినకొయ్య. చూ. చిత్రం 121 క. 13 (రా. 19).

**చిన్నపీట** పర్యా. చూ. వెనక(టి)పీట. అనుపీటల్లో చివరిది; దీనికి మామూలుగా ఒక చాలులో అను కొయ్యలు బిగించి ఉంటాయి. చూ. చిత్రం 45 క. 3 (తె. 25, 30).

**చిన్నపురితాడు** పట్టుదారంవడికే పెద్దరాట్నం కదుర్లపట్టీకి, చక్రానికి వేసే గట్టిదారం; చూ. పురి. చూ. చిత్రం 293 చ. 5 (కో. 14).

**చిన్నరాగవాళీ(కడ్డీ)చీర** తొమ్మిది కొలుకులు నలుపు, మూడుకొలుకులు ఇటాలి, పదికొలుకులు నలుపు, మూడుకొలుకులు ఇటాలిరంగుల్లో మధ్యనేసిన చీర (రా. 24).

**చిన్నీ** ఆకుపచ్చవన్నె; తివాసీనేత పనివాళ్ళవాడుక (కో. 16).

**చిప్ప 1.** పర్యా. కప్పెరగిన్నె, కొబ్బరిబరికె, గుమ్మిచిప్ప, గూడు(1), టెంకాయబొచ్చె తిరగిణిచిప్ప, దిప్ప, పావు(1), బండిచిప్ప, బన్నెకప్పు, మూత(1)., రాటిబుర్రక. రాటిపై బద్దలను బిగించి వాటిమధ్య బోర్లించి కట్టినచిప్ప; మామూలుగా కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల, కర్రచిప్పగాని, రేకుమూతగాని వాడతారు; ఇది రాటి సూలం మీద ఆనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (కో. 3, 7, 9బి, 10, 27; తె. 1, 2, 20, 25; రా. 17, 24); **2.** నెప్తాల్ రంగులు నూరే చిన్నబొచ్చె; వెడల్పుది (తె. 25).

**చిరంజీవి** ఉ. సిరంజీవి. ఒకరకం చెట్టు; అద్దకపు రంగుల తయారీలో దీనిచెక్క వాడతారు (కో. 4).

**చిరత** ఉ. చిర్త. **1.** చూ. చిడత(1) (కో. 33, 34); **2.** రూ. చిడత(3); పర్యా. చూ. వడిబిళ్ళ(2). అచ్చుకట్టేటప్పుడు, వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; ఒకవైపు వెడల్పుగాను, ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత, దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకు చెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (కో. 26, 33, 35); **3.** దసలిదారంవడికే పూన్పుకొమ్ముల మధ్యపుల్ల; దారంవడకటానికి, దీన్ని పట్టుకొని, పూన్పును కుడి ఎడమలకు తిప్పుతూ ఉంటారు. చూ. చిత్రం 292.2 (తె. 17); **4.** చూ. చిడత (5) (రా. 22).

**చిరతకొయ్య** కొన్నిచోట్ల అను మొదటి కొయ్యల దగ్గరే అనిపడేందుకు బిగించిన చిన్నకొయ్య(లు). చూ. చిత్రం 45 త. 2 (కో. 31).

**చిరతతాడు 1.** కమాను(=దూదిపడే కొయ్యపని ముట్టు) నరంబిగింపుకు పలకకు ఒకవైపున కట్టేనతాడు. చూ. చిత్రం 9.10 (కో. 7); **2.** పర్యా. చూ. ఊడ్తె గుది(2). పడుగుచాపేటప్పుడు, ఊడ్తె అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి; వీటికి చివర, కొన్నిచోట్ల, చిన్నపుల్లలు కడతారు. చూ. చిత్రం 63 క. 8 (కో. 11); **3.** చూ. చిడత తాడు (రా. 21).

**చిరతతోలు** చూ. చిడతతోలు (రా. 22).

**చిరతపుల్ల** 1. ఉ. సిర్తపుల్ల; పర్యా. చూ. బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి, తాడు వడిపెట్టే చిన్నపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (కో. 5, 7, 10); 2. పర్యా. చిలుప. కమాను(=దూదిఏకే కొయ్యపనిముట్టు) చిరత తాడు బిగింపుకు మెలిపెట్టే చిన్నపుల్ల. చూ. చిత్రం 9.8 (కో. 7).

**చిరతలి** పర్యా. బిగుసీల, బిరుబుల్ల, బేడెం, మేకు (2), సీల(2). అసుపీటల బిగింపుకు వేసే కొయ్యపేడు; నేతపొడుగునుబట్టి అసుపీటలను దగ్గరికిగాని, దూరానికిగాని జరుపుకొని పేడు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 8 (తె. 18).

**చిరతాడు** (< చిరతతాడు) పర్యా. చూ. బిర్రుతాడు(1). మరమగ్గం నిలువుపట్టెను మేరువుపలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టినదారం; మేరువుపలకను పైకిగాని, కిందికిగాని జరుపుకొని దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 5, 7).

**చిరమనిఅంటు** చిరమనిచెట్టు జిగురు; పట్టుకుపెట్టే గంజిలో కలుపుతారు (తె. 7).

**చిరుగజ్జెలరుద్రాక్షపేటు** ఉ. -పేటి. అంచులో రుద్రాక్షపువ్వుల నమూనాలు నేసిన ఒకరకం డిజైను. చూ. చిత్రం 187 (తె. 2).

**చిలక** 1. చేడుబద్దలు రెంటినీ కలిపి బిగించే కొయ్య చిడత. చూ. చిత్రం 125 ట. 2 (కో. 23); 2. పర్యా. చూ. కోతిపుల్ల(1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుడులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (కో. 29, 32, 35, 36).

**చిలక(ఆకు)పచ్చ** 1. ఒకరకం పచ్చరంగు; రామచిలక రెక్కలరంగు. చూ. చిత్రం 288 (కో. 1, 2, 4, 6, 8. 9బి, 14, 15, 18, 22-24, 26, 30, 32, 35, 36; తె. 2, 10, 12-16, 21, 27, 31; రా. 3-5, 7, 15, 19బి); 2. నూర్జెహానుపచ్చ (కో. 12); 3. ఒకరకం పసుపువన్నె కలిసిన పచ్చరంగు (కో. 13).

**చిలకకర్ర** ఉ. సిలక్కర్ర; పర్యా. చూ. కోతిపుల్ల (1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండు వైపులా అచ్చుగుడులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1(కో. 37).

**చిలకకొయ్య** పర్యా. చిల్ల(3). పడుగును ఊడ్తెకు కలిపే తాడుచివర కట్టిన పుల్ల; పడుగేరుకర్రకు చుట్టి చిల్ల మెలిపెడతారు. చూ. చిత్రం 63 క. 9 (తె. 6).

**చిలకగుడి** ఉ. సిలగ్గుడి. మగ్గం అడ్డకర్రలకు పైన కట్టిన తాడు (కో. 37).

**చిలకడ** ఉ. చినకడ, చినికడ, సిల్కడ. 1. పర్యా. ఊడుగోలచిలుక, కన్నె, చిలకన్నె, సరచిలకడ. సరిచేయటానికిగాని, నేతనేయటానికిగాని చాపిన ఉన్నిపడుగు బిగింపుకు తలకోలకు తగిలించినతాడు; దీన్ని ఊడుగోలకు వేస్తారు; సరిచేసేటప్పుడు, కొన్నిచోట్ల సరట్టకు వేస్తారు; మామూలుగా, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 314.9 (తె. 6, 7, 9, 11, 20, 25-27); 2. పర్యా. కొలికి(6). తాడుచుట్టు; మిడిగూటానికి, నేతమోకు వేసి పెడకోలకు తగిలించి బిగిస్తారు. చూ. చిత్రం 129 క. 3 (తె. 4, 5).

**చిలకడ్డకర్ర** పర్యా. చూ. ఇరవలదండి. కోతిపుల్లలుగాని, గిలకలుగాని వేలాడదియ్యటానికి, మగ్గానికి పైన దారాలు కట్టిన కర్ర. చూ. చిత్రం 121 క. 13 (కో. 37).

**చిలకతాడు** 1. పర్యా. చూ. ఊడ్తెగుది(2). పడుగు చాపేటప్పుడు, ఊడ్తె అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి; వీటికి చివర కొన్నిచోట్ల, చిన్నపుల్లలు కడతారు. చూ. చిత్రం 63 క. 8 (తె. 6); 2. పర్యా. చూ. బిర్రుతాడు(2). మరమగ్గం నిలువుపట్టెను, మేరువు పలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టిన దారం; మేరువుపలకను పైకిగాని, కిందికిగాని జరుపుకొని దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 29, 32, 36).

**చిలకన్నె** పర్యా. చిలకడ(1). సరిచేయటానికిగాని, నేతనెయ్యటానికిగాని చాపిన ఉన్నిపడుగు బిగింపుకు, తలకోలకు తగిలించినతాడు; దీన్ని ఊడుగోలకు వేస్తారు; సరిచేసేటప్పుడు, కొన్నిచోట్ల, సరట్టకు వేస్తారు; మామూలుగా, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 314.9 (తె. 22).

**చిలకపచ్చకడ్డీచీర** చివర మూకంచుపెట్టి, చిలకపచ్చ, నలుపు వన్నెల్లో సన్నగడి పడేట్టు నేసిన చీర (రా. 18).

**చిలకపుల్ల** 1. పర్యా. చూ. కోతిపుల్ల (1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి మగ్గంమీద దారంతో, అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుడులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (కో. 21, 23, 24,

28); **2.** పర్యా. సప్పా(1). ఒకరకం పావుచెక్క; పొడుగాటిది; ఇటువంటివి రెండుంటాయి; నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి పావుచెక్క తొక్కుతారు; పూర్వం అనేవారట (కో. 24).

**చిలకరించు** (క్రి.) పర్యా. చూ. అలుకు(1). నరచేసేటప్పుడు, పడుగు బాగా బిరుసెక్కటానికి గంజి చిలకటం; గంజిపిడచ ఒకచేత్తో పట్టుకొని రెండోచేత్తో దానిమీద అలుక్కుంచెతో దువ్వితే పడుగుమీద అలుకు పడుతుంది; కొన్నిచోట్ల, వెంపలిమండలతో గంజిచిలుకుతారు (తె. 19).

**చిలక(ల)కర్ర** ఉ. సిలక్కర్ర, సిలకలకర్ర; పర్యా. చూ. ఇరవలదండి. కోతిపుల్లలుగాని, గిలకలుగాని వేలాడదియ్యటానికి, మగ్గానికి పైన దారాలు కట్టిన కర్ర. చూ. చిత్రం 121 క. 13 (కో. 32, 25).

**చిలక(ల)ంచు** చిలకమాదిరి డిజైన్లుపడేట్టు నేసిన అంచు (కో. 23; తె. 5, 10; రా. 1).

**చిలక(ల)పేటు** ఉ. చిలకప్లేటు, చిల్కపేటు, సిలకపేటు; పర్యా. చిలకలబారు. అంచులో చిలక(ల)ఆకారంలో వరసగా బొమ్మలుపడ్డ ఒకరకం డిజైను (కో. 12, 13, 16, 17, 19, 21; తె. 4; రా. 7, 10, 19, 19ఎ).

**చిలకలబారు** పర్యా. చిలక(ల)పేటు. అంచులో చిలక(ల)ఆకారంలో వరసగా బొమ్మలుపడ్డ ఒకరకం డిజైను (తె. 14).

**చిలకొయ్య** (< చిలక + కొయ్య) **1.** చేతిమగ్గం పలకగుది తగిలించే కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 2 (కో. 33); **2.** పర్యా. చూ. చిల్ల(7). మగ్గంకుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా, చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (తె. 31).

**చిలగడతాడు** పర్యా. చూ. ఊడ్తైగుది(2). పడుగు చాపేటప్పుడు, ఊడ్తై అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (కో. 8).

**చిలప** నూలులెక్క : (క) లడీలో పదోవంతునూలు (కో. 2-5, 11-13, 17-19, 22, 31; రా. 1-10); (చ) 840 పోగులనూలు (కో. 1); (ట) ఖద్దరులో 640 పోగులనూలు; దీని చుట్టుకొలత 4 అడుగులు (కో. 14); (త) 736 పోగులనూలు (కో. 32-34, 36); (ప) సుమారు 532 పోగులనూలు (కో. 20); (గ) లడీలో డెబ్బయ్యోవంతు నూలు (కో. 13); (జ) ఏడుపుంజాల నూలు (రా. 1); (డ) ఇరవైపోగులదారం (రా. 5).

**చిలపలఖండి** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు. పంజె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (రా. 7).

**చిలపలరాట్నం** ఉ. -రాట్రం; పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు చిలపల నూలుతోడే రాట్నం. చూ. చిత్రం 41 (రా. 5).

**చిలుకొయ్య** ఉ. సిలుకొయ్య; పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు, మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనక తాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 17, 25).

**చిలుప** పర్యా. చిరతపుల్ల(2). కమాను(=దూదిఏకే కొయ్యపనిముట్టు) చిరతతాడు బిగింపుకు మెలిపెట్టే చిన్నపుల్ల. చూ. చిత్రం 6.8 (తె. 28).

**చిల్కాపరిడిజైను** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 17).

**చిల్ల** ఉ. జిల్ల, సిల్ల. **1.** పర్యా. చూ. చిట్టె(2). పంజెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రాలు 19 క. 3, 19 క. 4 (కో. 1; రా. 15-18); **2.** పర్యా. చూ. అనుకొయ్య(3); అనుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టివచ్చేట్టు, అనుకు నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (రా. 4, 5); **3.** పర్యా. చిలకొయ్య. పడుగును ఊడ్తైకు కలిపే తాడుచివర కట్టిన పుల్ల; పడుగేరుకర్రకుచుట్టి చిల్ల మెలిపెడతారు. చూ. చిత్రం 63 క. 9 (కో. 8, 9బి); **4.** పర్యా. చూ. వడిబిళ్ళ(3). అచ్చుకట్టేటప్పుడు, వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి, అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; ఒకవైపు వెడల్పుగాను, ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకుచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (రా. 10); **5.** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పు బద్ద; నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (తె. 17); **6.** పర్యా. చూ. బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి, తాడు వడి బిర్రుపెట్టే పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (రా. 11, 19బి); **7.** పర్యా. కుచ్చుతాడుపుల్ల, కుచ్చుదారంపుల్ల, కోతిపుల్ల(3), గుంజ(15),

గూటం(9), చట్టంమేకు, చిలక్కొయ్య(2), పట్టు(1), నిలువుపట్టెపుల్ల, పుల్ల(9), మగ్గంజిల్ల, మగ్గంమేకు, మెట్ట, మేకు(5), సీల(7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా, చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (కో. 6, 8, 9; రా. 4); **8.** పర్యా. చూ. పిడి(9). నేతమోకును చుట్టే పళ్ళచెక్రం తిప్పటానికి చేతిగూటానికి బిగించినపుల్ల; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 122 ట. 4 (కో. 4).

**చిల్లపుల్ల** పర్యా. చూ. చిట్టె(2). పంకెలఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రాలు 19 క. 3. 19 క. 4 (కో. 1).

**చిల్ల(ల)తాడు** పర్యా. చూ. ఊత్తెగురి(2). పడుగు చాపేటప్పుడు, ఊత్తెఅడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి; వీటికి చివర, కొన్నిచోట్ల, చిన్నపుల్లలు కడతారు. చూ. చిత్రం 63 క. 3 (కో. 8, 9).

**చిల్లు** (క్రి.) సరిచేసేటప్పుడు, పడుగుమీద గంజి చిలకరించటం; చల్లటం (కో. 13).

**చివకట్టు** ఉ. సివకట్టు; చూ. చెవుకట్టు(3) (కో. 2, 6).

**చివర** ఉ. సివర, సివుర. **1.** పర్యా. చూ. చువ్వ(6). అచ్చుకట్టేటప్పుడు, అనివెంబడి, పోగులు చెదరకుండా పెట్టిన సన్నబెత్తం; ఇటువంటివి, రెండు జంత్రం అడ్డపట్టెకొయ్యకు, నిలువుపట్టెకొయ్యకు బిగిస్తారు (రా. 3, 13-16, 23); **2.** పర్యా. చూ. చువ్వ(7). దండెదగ్గర పడుగుపోగులు నెరపటానికి, అచ్చుదగ్గర నేత పడుగులో దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి, దండెకు రెండువైపులా ఉంటాయి; నేత అవుతున్నకొద్దీ, వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127.3 (తె. 1, 2, 6, 7; రా. 15-17, 23, 24); **3.** (-తొడుగు) దోనుగకు బిగించే బద్దెలో దూర్చిన సన్నబెత్తం; చువ్వ. చూ. చిత్రం 123 ప. 1 (తె. 1); **4.** పట్టుమగ్గం బిగింపుకోసం, మిడిగూటానికి పగ్గంతో వేసినకొలికి; చూ. మిడిగూటం (తె. 12).

**చివరతాడు** సవలతుగుండు వేలాడదీసిన దారం; దీని కొస దండెకుకట్టి ఉంటారు; మగ్గంమీద, దీన్ని ఒక చువ్వమీద మోపుతారు. చూ. చిత్రం 126.2 (తె. 2).

**చివరరాయి** పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చిన్నచెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (రా. 12).

**చివరలాక** ఉ. సివరలాక, సివర్లాక. నేతపడుగులో, చువ్వవెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా, అచ్చుదగ్గర, దండెదగ్గర దూరుస్తారు (రా. 10, 11, 19బి, 22).

**చివరిబద్దె** పర్యా. సనుగుబద్దె. బట్టలో చివరవైపు నేసి వదిలిన బద్దె (తె. 2).

**చివర్లకమ్మి** ఒకరకం చీరకమ్మి (రా. 7).

**చివర్లుకట్టు** (క్రి.) చీరకమ్మికి రెండువైపులా రెండేసి పోగులు (గీరలు) వచ్చేట్టు నెయ్యటం; చూ. కమ్మి (కో. 4).

**చివురురంగు** చూ. చిగురురంగు(1) (కో. 12).

**చివ్వ** ఉ. సివ, సివ్వ. **1.** నూలులెక్క : ఇరవై రెండు పోగులదారం; ఇది సుమారు 36 గజాల పొడుగుంటుంది (కో. 20); **2.** పడుగులో చివర మలగ్రతతోబాటు ఎక్కించిన సన్నపుల్ల (కో. 22); **3.** (-కుట్టు) చూ. చువ్వ(6) (కో. 1, 17, 35-37; రా. 5); **4.** చూ. చువ్వ(7) (కో. 1, 17-19, 21-24, 25, 27, 32-34, 37); **5.** (-కుట్టు). చూ. చువ్వ(9) (కో. 7, 18, 21, 23; రా. 5).

**చివ్వగుండు** పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చిన్నచెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 35).

**చివ్వతొక్కు** (క్రి.) ఉ. చివతొక్కు, సివ్వదొక్కు; **1.** పర్యా. చివ్వదగిలించు. దోనెగాడిలో బద్దెచువ్వ దూర్చటం; పండ్లగుదులకు బిగిస్తారు (కో. 32); **2.** పడుగులో అచ్చుదగ్గర కర్ర దూర్చటం; నేత మొదలుపెట్టే ముందు కర్ర దూరుస్తారు (కో. 34); **3.** సరిచేసేటప్పుడు పడుగులో కర్ర(లు)దూర్చటం (కో. 23-25, 34-37).

**చివ్వదగిలించు** (క్రి). ఉ. సివదగలించు; పర్యా. చివ్వతొక్కు(1). దోనెగాడిలో బద్దెచువ్వ దూర్చటం; పండ్లగుదులకు బిగిస్తారు (కో. 31).

**చివ్వతేరు** (క్రి.) ఉ. సివతేరు. అనిపక్కన దూర్చిన పడుగుచువ్వల మీద పోగులు నెరపటం (కో. 26).

**చీకరపుల్లవేళ్ళు** ఉ. సీకరపుల్లేళ్ళు. కుంచెపురికివాడే చీపురుమొక్క వేళ్ళు; చూ. పురి (కో. 1).

**చీకునూలు** ఉ. సీకునూలు; పర్యా. మెతుపునూలు. మెత్తగాఉండి తెగే నూలు; పందలపాకనూలును అనేవారు (రా. 20).

**చీడు** (క్రి.) పడుగును పాయలుగా విడదియ్యటం; పాపటం; సరిచేసేముందు పడుగును, నాలుగు పాయలుగా విడదీసి గంజి రుద్దుతారు (తె. 28).

**చీపిరికట్టుకమ్మి** ఒకరకం చీరకమ్మి; రంగుదారాలతో గీరలు పెట్టి నేసింది; చిన్నగీరలు, పెద్దగీరలు నేస్తారు (కో. 16).

**చీపిరిబొత్తంచు** చీరకు చివర నేసిన ఒకరకం చిన్న అంచు; చూ. గోరంచు (కో. 28).

**చీపురుపురి** చీపురుమొక్కవేళ్ళతో కట్టిన కుంచెపురి (కో. 17).

**చీమతొట్టి** ఉ. సీమతొట్టి. దసలికాయలకు చీమలు పట్టకుండా భద్రపరిచేకుండ (తె. 17).

**చీర** 1. ఉ. చీరి, చీరె, సీర, సీరె; పర్యా. కోక. ఆడవాళ్ళు కట్టుకొనేబట్ట; దీనికి మామూలుగా, రెండు అంచులూ రెండు కమ్ములూ నేస్తారు; రకరకాల రంగుల్లోను డిజైన్లలోను వస్తాయి (కో. 2-28, 30, 32-37; తె. 1-18; 21-25, 28, 29, 31; రా. 1-24); 2. పర్యా. పంచె(4). వితంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకం బట్ట, తెల్లది; మామూలుగా, 60-100 నెంబరు నూలుతో నేస్తారు; మామూలుగా, ఒక కొలికి మామిడంచుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, గోరంచుగాని, కడ్డీ అంచుగాని పెట్టి నేస్తారు (కో. 16, 19; తె. 15).

**చీరకమ్మి** చీర అడ్డకొంగ(=చెరగు)లో నేసిన పట్టె; చూ. కమ్మి (తె. 8).

**చీరపులాక** చూ. చీరులాక(2). (తె. 30).

**చీరలపడుగు** చీరల నేతకువాడే పడుగునూలు; సుమారు ఇరవై పుంజాలు ఉంటుంది (కో. 30).

**చీరు** (క్రి.) ఒలవటం; జనుము, గోగు మొ. మొక్కల ముదురు కాడలను నీళ్ళలో ఊరేసిన తరవాత నార ఒలిచేస్తారు; బండమీదపరిచి కర్రతో కొడతారు(తె.25).

**చీరులాక** 1. అల్లుచేసేటప్పుడు, అచ్చుకు అవతల, పడుగులో ఎక్కించిన లాక(లు); వీటికి తాడుకట్టి సవలకుండు వేలాడదీస్తారు (తె. 28); 2. ఉ. సీరులాక; రూ. చీరపులాక; పర్యా. పొరలాక, సీల్లాక, నేతపడుగులో దండెకూ అచ్చుకూ మధ్య కూర్చిన వెదురుబద్ద (తె. 26, 27).

**చీరె** ఉ. సీరె; పర్యా. నోరు, పీటగాల, బొమ్మకాల, మొగంగాడి. రాట్నం"బొమ్మ"లో వడిదారం తిరగటానికి చెక్కినగాడి. చూ. చిత్రం 15 చ. 4 (కో. 37).

**చీరెబొమ్మ** ఉ. సీరెబొమ్మ; పర్యా. చూ. బొమ్మ (3). రాట్నంపీటకు ఎడమవైపున కదురుబిగించే నిలువు కొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడిబొమ్మ ఆకారంలో చెక్కుతారు; చీరెఅంటే "చీలిక". చూ. చిత్రం 15.10 (కో. 37).

**చీలికగుబ్బ** దోనెకు ఆధారంగా, కుడివైపున నేలలో పాతిన పంగలకొయ్య; నాలికకొయ్యకు మారుగా వాడతారు. చూ. చిత్రం 123 ట (రా. 2).

**చుక్క** 1. నూలుచిలపకు, అక్కడక్కడ దారపు కట్లుకట్టి, రంగు అద్దినప్పుడు, రంగు అంటకుండా తెల్లగా ఉన్న భాగం; లెక్కప్రకారం, కావలసినచోట్ల, ఇలా కట్లు కడతారు (కో. 7); 2. పడుగుపోగులు చెదరకుండా ఒక్కొక్కపాయకు పెట్టిన గుర్తు(లు) (తె. 10).

**చుక్కకట్టు** (క్రి.) పర్యా. చిటికెకట్టు. చిన్నె నూలు చిలప(=బొందు)కు రంగు అద్దేటప్పుడు, లెక్కప్రకారం కొన్నిచోట్ల రంగు అంటకుండా దారాలు(కొన్నిచోట్ల, రబ్బరు ముక్కలుగాని, పురికోసగాని) చుట్టటం; చిలప, రంగులో ముంచిన తరవాత ఆరేసికట్లు విప్పుతారు; కట్టువిప్పినచోట్ల తెల్లతెల్లగా ఉంటుంది (కో. 7).

**చుక్కచీర** నేతనిలువులో, ఒక కొలికి నలుపు. ఒక కొలికి ఇటాలిరంగు పోగులు పెట్టి, రెండు కొలుకులు నలుపు, ఒకకొలికి ఇటాలి చొప్పున అడ్డానికిపెట్టి నేసిన చీర; మల్లీశ్వరిచీర అని కూడా అంటారట (రా. 24.)

**చుక్కపేటంచు** చుక్కలచుక్కల డిజైను పడేట్టు నేసిన అంచు (రా. 13).

**చుక్కలచీర** ఉ. సుక్కలచీరె, సుక్కల్చీరె. అంతటా చుక్కలుపడేట్టు నేసినచీర (కో. 11, 16, 19).

**చుక్కుడునూలు** ఉ. సుక్కుణ్ణూలు. రెండుపోగులు కలిపి, పురిపెట్టిన నూలు; గట్టినూలు (చుక్కుడు=పురి) (కో. 12).

**చుక్కుతీయు** (క్రి.) జంపఖానా నేసేటప్పుడు, అడ్డానికి వేసిన పేకపోగును వేలితో ముందుకు జరపటం; ఇలా జరిపితే, పేకపోగు విడిగా కనిపించకుండా బట్టలో కలిసిపోతుంది (తె. 17).

**చుంచు** పర్యా. చూ. కుచ్చు. మరమగ్గంలో, ఒక సొరుగులోనుంచి మరో సొరుగులోకి నాడెను నెట్టటానికి, చేత్తో తాళ్ళను గుంజే పిడి; మామూలుగా, గుడ్డపేలికలు కలిపి కట్టింది; కొన్నిచోట్ల దారపురిలు కడతారు. చూ. చిత్రం 118.21 (తె. 3, 11-14).

**చుంచుతాడు** పర్యా. చూ. కుచ్చుతాడు. మరమగ్గంలో, నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టిన దారం. చూ. చిత్రం 118.22 (తె. 12).

**చుంచులపీట** పట్టుమగ్గానికి పైన, చుంచుతాళ్ళు వేలాడదీసిన పైపట్టె; కాట్లపీటకుపైన ఉంటుంది; చూ. కన్నాలబల్ల. చూ. చిత్రం 134 చ. 8 (తె. 5).

**చుట్టకంజేయు** (క్రి.) ఉ. సుటకంజేయు. సరిచేసిన పడుగు చుట్టివెయ్యటం (తె. 19).

**చుట్టకట్టు** (క్రి.) సరిచేసినపడుగు చుట్టగా కట్టటం (తె. 23).

**చుట్టచుట్టు** (క్రి.) సరిచేసిన పడుగు చుట్టి వెయ్యటం (కో. 25, 31; తె. 5).

**చుట్టజేయు** (క్రి.) సరిచేసిన పడుగు చుట్టి వెయ్యటం (తె. 24).

**చుట్టనేత** పర్యా. చూ. నేతసాగు(1). మగ్గానికి అమర్చి నేతజయలులో చాపిన పడుగునూలు. చూ. చిత్రం 127.17 (రా. 17).

**చుట్టబిరుతాడు** పర్యా. చూ. గుమ్మిదారం. రాటి అకులు, పైవీ కిందివీ కలిపి కట్టినదారం. చూ. చిత్రం 31 ప. 4 (తె. 32).

**చుట్టు 1.** (క్రి.) పర్యా. చూ. తోడు(1.) పంకెకు గాని డబ్బాకుగాని నూలుచుట్టటం (కో. 20, 25, 26, 28, 32, 36; తె. 1; రా. 11); **2.** సరిచేసిన పడుగు చుట్టి వెయ్యటం (కో. 14, 20, 21, 29, 36; తె. 21, 22, 28-33; రా. 6); **3.** ?అల్లుచేసి చుట్టినపడుగు (కో. 8; రా. 6, 7, 10-12); **4.** పర్యా. అల్లు(3), మగ్గంపాగడ, మడుపు, మల(5). మగ్గానికి అమర్చి, నేతజయలులో చాపిన పడుగునూలు; ఒక ఉరువు(బట్ట) నేతకు సరిపడేది; 8-10 మూరల పొడుగుంటుంది. (కో. 6, 8, 9బి, 10; రా. 11, 13, 14, 16, 24); **5.** పర్యా. చూ. సరెంటి(3). చుట్టచుట్టిన పడుగు నూలు; మగ్గంమీద కొంత చావగా మిగిలింది;ఒక కర్రకు చుడతారు; కొన్నిచోట్ల పురబెట్టి చుడతారు; కొన్ని చోట్ల, పెడకోలకు కట్టి ఉంచుతారు. చూ. చిత్రాలు 128 ట. 1, 128 జ. 2 (కో. 7).

**చుట్టుకట్టె 1.** మగ్గందగ్గర, పడుగుచుట్ట(=సరెంటి) చుట్టిన కర్ర. చూ. చిత్రం 128 క. 1 (రా. 7, 13); **2.** పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయ (పొట్టె)లు బిగించినకర్ర; మామూలుగా, దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల, పొట్టెలు గాని, పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (రా. 6, 12, 15, 19, 20); **3.** పర్యా. బిర్రుకట్టె(5). నవారు నేసేటప్పుడు, మగ్గానికి తగిలించిన పడుగు బిగింపుకు కట్టిన కర్ర. చూ. చిత్రం 324 క. 2 (రా. 10).

**చుట్టుకండువా** ఉ. సుట్టుకండవా; పర్యా. చూ. పాగ. తలకు చుట్టుకోటానికి నేసినబట్ట; మామూలుగా, అయిదు (కొన్నిచోట్ల, 2½-3) గజాలపొడుగు నేస్తారు; అడ్డం ముప్పాతిక గజంనుంచి, గజంపైవరకూ పెడతారు; కొన్నిచోట్ల, అంచులేకుండా నేస్తారు; మామూలుగా తెల్లది; కొన్నిచోట్ల, రంగులు, గీరలు, గళ్ళు మొ.వి పెట్టి నేస్తారు (కో. 24).

**చుట్టుకర్ర** ఉ. సుట్టుకర్ర, సుట్టుగర్ర; పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరపాయ(పొట్టె)లు బిగించినకర్ర; మామూలుగా, దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల. పొట్టెలుగాని, పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (కో. 2-4, 6-11; తె. 13; రా. 1, 7, 8).

**చుట్టుకుదురు** (బహు. చుట్టకుదుళ్ళు) గోడుగా ఉండే పాత్రలు (కుండలు, మండిగలు మొ.వి) కుదురుగా నిలబడటానికి ఊనికగా పెట్టేమట్టు; గుండ్రటిది (కో. 16, 20, 21).

**చుట్టుకోల** ఉ. -గోల; పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయ (పొట్టె)లు బిగించిన కర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల, పొట్టెలుగాని, పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (తె. 6, 8).

**చుట్టుగట్టు** (క్రి.) ఉ. సుట్టుకట్టు; పర్యా. మలచుట్టు అల్లుచేసిన పడుగును, మల(=ఒకబట్ట నేతకు సరిపడే పడుగు)లుగా విడదీసి చుట్టటం; ఒక్కొక్క మల ఒక్కొక్క చుట్టుగా వస్తుంది (రా. 11, 14).

**చుట్టుగుది** మగ్గం అచ్చుకు, పలకకు రాపిడిలేకుండా రెంటికీ మధ్య పెట్టిన మెత్త (కో. 32).

**చుట్టుచుట్టు** (క్రి.) ఉ. సుట్టుసుట్టు; పర్యా. చూ. మలచుట్టు. అల్లుచేసిన పడుగును, మల(=ఒకబట్ట నేతకు సరిపడే పడుగు)లుగా విడదీసి చుట్టటం; ఒక్కొక్కమల ఒక్కొక్క చుట్టుగా వస్తుంది (రా. 6, 7, 10, 13).

**చుట్టుచెంగావి** ఉ. సుట్టుసెంగాయి. అంచుల్లో చుట్టూ ఎరుపురంగు అద్దిన తెల్లగుడ్డ (కో. 2; తె. 15).

**చుట్టుచెంగావిచీర** ఉ.సుట్టుసెంగాయిసీర. అంచులూ కమ్ములూ చుట్టూ ఎర్రరంగులో నేసిన తెల్లచీర (కో. 23).

**చుట్టుపట్టు** (క్రి.) **1.** సరిచేసినపడుగు చుట్టివెయ్యటం (కో. 8); **2.** ఉ. సుట్టుపట్టు, సుట్లుబట్టు; పర్యా. చూ. మలచుట్టు. అల్లుచేసిన పడుగును, మల(=ఒకబట్ట నేతకు సరిపడే పడుగులుగా విడదీసి చుట్టటం; ఒక్కొక్క మల ఒక్కొక్క చుట్టుగా వస్తుంది (కో. 2, 6-8, 23).

**చుట్టువేయు** (క్రి.) పర్యా. చూ. మలచుట్టు. అల్లుచేసిన పడుగును, మల(=ఒకబట్ట నేతకు సరిపడే పడుగు)లుగా విడదీసి చుట్టటం; ఒక్కొక్కమల, ఒక్కొక్క చుట్టుగా వస్తుంది (తె. 18).

**చురకత్తి** ఒకరకం కత్తి; నేతనేసేటప్పుడు, పోగులు తెగితే, వాటిని అతికిన తరవాత, దీంతో కొసలు కోస్తారు; కోతకత్తి. చూ. చిత్రం 138 (కో. 36).

**చువ్వ** ఉ. సువ్వ **1.** పర్యా. చూ. నూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూ

లుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 5, 6, 12-15; తె. 15); **2.** పర్యా. కమ్మి(6). కండెలు చుట్టేటప్పుడు, నూలుడబ్బా అమర్చే ఇనపచువ్వ; ఇది ఒక కొయ్యమొద్దుకు బిగించి ఉంటుంది. చూ. చిత్రం 30.2 (కో. 14); **3.** పర్యా. చూ. కొండి(4). పడుగేరుకర్రకు తగిలించే ఇనప గొలుసుకొక్కెం. చూ. చిత్రం 70.1 (కో. 4); **4.** పర్యా. పడుగుచివ్వ(2). పడుగు చాపినప్పుడు అని వెంబడి దూర్చిన సన్నబెత్తం. చూ. చిత్రం 69 (రా. 9); **5.** పర్యా. చూ. దండె(3). పన్నెకట్టుబడిలో, ఈనెల బిగింపు కోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం; ఇటువంటివి, పైనా కిందా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (కో. 8); **6.** (-కుట్టు, -గుచ్చు) రూ. చివ్వ (3); పర్యా. చివర(1). నూరె(2). అచ్చుకట్టేటప్పుడు, అని వెంబడి పోగులు చెదరకుండా పెట్టిన సన్నబెత్తం; ఇటువంటివి రెండు, జంత్రం అడ్డపట్టెకొయ్యకు, నిలువు పట్టెకొయ్యకు బిగిస్తారు. చూ. చిత్రం 102 ట. 2 (కో. 1, 3, 5, 7-9బి, 11, 18; తె. 13-15; రా. 20); **7.** రూ. చివ్వ(4); పర్యా. చివర(2), చూక, దండెనూరె, నూరె(4). దండెదగ్గర పడుగుపోగులు నెరపటానికి, అచ్చుదగ్గర దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి, దండెకు రెండువైపులా ఉంటాయి; నేత అవుతున్నకొద్దీ వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127.3 (కో. 3-7, 9, 11-15; తె. 13, 14; రా. 4); **8.** పర్యా. చూ. కమ్మి(9). మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా, ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; పావుచెక్కలకు చేసిన చిల్లుల్లో దూర్చి పక్కగూటాలకు వేస్తారు; దేవాంగులవాడుక. చూ. చిత్రం 121 చ. 1 (కో. 7); **9.** (-కుట్టు, -తొడుగు); రూ. చివ్వ(5); పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల, ఇనపచువ్వగాని, వెదురుబద్ద గాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 2-7, 10; తె. 13; రా. 2, 9, 20); **10.** పర్యా. చూ. తూకం. పేటువడికి, కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా, ఇనపపుల్ల; కొన్నిచోట్ల సత్తుది; నేతనేసేటప్పుడు, అని మూసిన తరవాత, వడి కిందికిదిగటానికి కడతారు; ఇటువంటివి గుంటల్లో రెండు పక్కలా వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (కో. 10); **11.** నూలులడీలు, రంగునీళ్ళలో ఉడకబెట్టేటప్పుడు లడీలుతిప్పే ఇనపకడ్డీ దీంతోకూడా లడీలు పిండుతారు (కో. 3, 13, 14).

**చువ్వకమ్మి** ఉ. సువ్వకమ్మి. ఒకరకం సన్నటికమ్మి (కో. 11).

**చువ్వకుట్టు** (క్రి.) పర్యా. చువ్వతొడుగు. పడుగులోగాని, బద్దెలోగాని సన్నబెత్తం దూర్చటం (కో. 2, 3).

**చువ్వకొయ్య** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల తాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 28).

**చువ్వతొడుగు** (క్రి.) పర్యా. చూ. చువ్వకుట్టు. పడుగులోగాని, బద్దెలోగాని సన్నబెత్తం దూర్చటం (కో. 3).

**చూక** ఉ. సూక; పర్యా. చూ. చువ్వ(7). దండె దగ్గర పోగులు నెరపటానికి అచ్చుదగ్గర, నేతపడుగులో దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి దండెకు రెండు వైపులా ఉంటాయి. నేత అవుతున్నకొద్దీ, వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127.3 (రా. 6, 12).

**చూకరాయి** పర్యా. చూ. సవలతుగుండు. దండె దగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (రా. 12).

**చూడామణిగడిచీర** తెలుపు, నీలివన్నెల్లో, చిటికెన వేలెడు వెడల్పు చారలుపడేట్టు నేసిన గళ్ళచీర (కో. 7).

**చూపుచెంగు** నేతలో మొదట నేసిన చెరగు (కో. 22, 23).

**చూపు(నేత)** పర్యా. కొంగుసేడు. బట్టముందరి భాగంలో మూరెడు పొడుగు నేసిన నేత; మొదటినేత; చిక్కగా నేస్తారు (కో. 16, 22, 23; తె. 11).

**చూరుకత్తి** అచ్చుతికే పడుగులో చెమికెలుకోసే కత్తి (తె. 2).

**చెక్క** **1.** నూలులెక్క: 28 పోగులదారం; లడీలో పదోవంతునూలు; పడుపుంజాల నూలుచిలప (కో. 12); **2.** పర్యా. చూ. ఆకు(7). డబ్బారాట్నం చక్రానికి అమర్చిన సాపుచెక్క. చూ. చిత్రం 41 చ. 1 (రా. 17); **3.** పర్యా. గంజిపలక. పడుగుపెట్టుకొనే కొయ్యచెక్క; గంజిపట్టించటానికి పడుగు దీనిమీద పరుస్తారు (తె. 16).

**చెక్కకత్తి** పర్యా. చూ. కత్తి(3). నవారు నేసేటప్పుడు, పడుగుల్లో వేసిన పేకపోగు దట్టించే కొయ్య

పనిముట్టు; కత్తిమాదిరిది. చూ. చిత్రం 324 చ. 4 (కో. 12).

**చెక్కకోవి** ఉ.-కోయి. కొయ్య అనుగొట్టం; దీనికి రెండువైపులా పూసలుంటాయి. చూ. చిత్రం 48 చ (తె. 33).

**చెక్కడకుంచె** (-వేయు) నరిచేసేటప్పుడు, పడుగు అరుబరునులో ఉండగా, నందు(=రెండులాకల మధ్య భాగం) నందుకూ అవుతూ దువ్వేకుంచె; పడుగు బాగా ఆరేవరకూ ఇలా రెండు, మూడుసార్లు నిదానంగా దువ్వుతారు; కొన్నిచోట్ల, సన్నపడుగులు దువ్వుతారు (రా. 24).

**చెక్కతొగరు(రంగు) 1.**మడ్డిచెక్కతో చేసినఎరుపు (తొగరు)రంగు(తె.11); **2.** ఒకరకం తడిరంగు(తె.6).

**చెక్కపంకె** చూ. చెలకపంకె (తె. 10).

**చెక్కబుడ్డి** పర్యా. చూ. చెలకపంకె. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం కొయ్యపంకె. చూ. చిత్రం 29 (రా. 11, 13).

**చెక్కుదారం** మిషను పురిదారం; దీంతో తడికి (అచ్చుమాదిరిది)కడతారు. చూ. చిత్రం 98.1 (కో.7).

**చెక్కేటు** (<?చెక్కవేటు) పర్యా. చూ. ఉడత; మరమగ్గంనాడెను, ఒకసొరుగులోనుంచి మరొకసొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, కింద తోలుఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; ఇటువంటివి రెండు సొరుగులవైనా అమరుస్తారు. చూ. చిత్రం 119 (రా. 3).

**చెక్కేటుతాడు** పర్యా. చూ. ఉడతతాడు. మగ్గం ఉడతకు, పైన కట్టినదారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (రా. 3).

**చెక్రపాల** రెండు పట్టెలమధ్య వేరేరంగు సందు వచ్చేట్టు నేసిన జంపఖానా (తె. 17).

**చెక్రబద్ద** పర్యా. చూ. ఆకు(1). రాట్నం ఇరుసు మీద తిరగటానికి చక్రం మాదిరిగా అమర్చిన సాపు చెక్క(లు); ఇలాటివి మామూలుగా నాలుగుంటాయి. చూ. చిత్రం 15.4 (కో. 19).

**చెక్రబద్దె** ఉ. చెక్రబద్ది. చీర పైటచెంగుకు చివర, అరంగుళం వెడల్పున పడుగుపోగులు విడిచి తరవాత అరంగుళం వెడల్పున పేకపోగులుపెట్టి నేసిన భాగం; చూ. బద్దె (కో. 5, 9).

**చెక్రం** ఉ. చెక్కరం, స్రెకం. **1.** పర్యా. చూ. తొడప(1). రాట్నంఆకుల రావిడి నిలువులకు తగలకుండా మధ్యన వేసిన కొయ్యబిళ్ళ(కో.34); **2.** పంకె ఆకులబిగింపుకు వెదురుబద్దలతో అమర్చిన గుండ్రటిచిట్టె. చూ.చిట్టె. చూ.చిత్రం 23 (కో.10); **3.** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి; చూ. రాటి. చూ. చిత్రం 34 (కో. 1; రా. 1); **4.** పర్యా. ఆకుల చెక్రం, ఉండ(1), గాను, గిల్ల(1), గిర(1), పయ్య, రాట్నంపయ్య. డబ్బారాట్నం ఇరుసుకు బిగించిన రేకు చెక్రం; దీనిమీద వడిదారం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 9 (కో. 1-3, 5-7, 9-15, 18-20, 29, 35; తె. 3, 7, 13, 21, 31; రా. 1-3, 5, 9, 12, 14, 16, 19, 20, 22-24); **5.** పర్యా. డోరచెక్రం. మరాను పెద్దచెక్రం; దీన్ని తిప్పుతూ ఆనుపోస్తారు. చూ. చిత్రం 50.1 (కో. 6, 10-12, 15, 16, 18, 20, 21; తె. 5; రా. 24); **6.** మరాను ఆకులను ఇరుసుకు బిగించటానికి పెట్టిన చిన్నచెక్రం; ఇటువంటివి, రెండువైపులా రెండుంటాయి. చూ. చిత్రం 50 (కో. 36); **7.** పర్యా. చూ. కడియం(1). ఊదై అడ్డపట్టెకు బిగించిన ఇనపచుట్టు. చూ.చిత్రాలు 64 చ. 1,70 క.2 (కో. 7); **8.** పర్యా. పళ్ళచెక్రం(2). నేతమోకు బిగించటానికి, ఒకరకం చేతిగూటానికి కిందివైపు అమర్చిన ఇనపచెక్రం. చూ. చిత్రం 122 ట. 1 (కో. 1, 2, 4, 7, 24; రా. 1, 5, 6, 14, 15); **9.** పర్యా. చూ. పెడకోలచెక్రం. పెడకోలను మోసే కొయ్యచెక్రం, ఇటువంటివి రెండుంటాయి; నేతమోకు వదులుచేసినప్పుడు, పడుగు నేలకు తగలకుండా పెడకోల చెక్రాల మీద జరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129 ప. 1 (కో. 3, 7, 10, 12-15, 17, 19, 25); **10.** పర్యా. చూ. గిరక(6). మగ్గంమీద అచ్చుగుదులు తగిలించే కొయ్యకప్పీ; దీన్ని మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 11 (కో. 27); **11.** పర్యా. చూ. డాబీ చెక్రం(2). డాబీదిండుకు పక్కగా అమర్చిన చెక్రం; మామూలుగా రెండు గుండ్రటిబిళ్ళలకు మధ్య ఇనప ఊచలు బిగించింది; కొన్నిచోట్ల, రేకు పండ్లచెక్రం; దీని పన్నును కుక్క గుంజినప్పుడు, దిండు తిరుగుతుంది. చూ. చిత్రం 132 చ. 11 (కో. 7, 10, 23, 24, 26; తె. 5); **12.** పర్యా. చూ. గొలుసు(5). డాబీకోలలు లేపటానికి; గొలుసుమాదిరిగా, సన్నబద్దలు కూర్చిన సాధనం; ఈ బద్దలకు చిన్న పిక్కలు బిగిస్తారు; దీన్ని దిండుకు తగిలిస్తారు. చూ. చిత్రం 132 త. 1 (కో. 6, 7); **13.** పర్యా. రాట్నంగిల్ల, రాట్నంపట్టు. పట్టువడికే పెద్దరాట్నం కట్టుబడిలో ఇరుసుకు బిగించిన ఇనప చెక్రం. చూ. చిత్రం 293 చ. 2 (కో. 14).

**చెక్రంఅంచు** చెక్రం ఆకారంలో డిజైన్లు నేసిన చీర అంచు (కో. 36).

**చెక్రంకుక్క** గుండ్రటి ఎదురుదోనె (బీమ్) బిగింపు కోసం, పళ్ళచెక్రం గాడిలో పడేట్టు, బీమ్‌కొయ్యకు బిగించిన ఇనపకొండి; కమాను (తె. 8).

**చెక్రంగిరక** ఉ. చెక్రంగిర్క; పర్యా. చూ. గిరక (6). మగ్గంమీద, అచ్చులు తగిలించే కొయ్యకప్పీ; దీన్ని మగ్గంపై దండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 11 (తె. 12).

**చెక్ర(ం)పేటు** చీర అంచులో, చెక్రం ఆకారంలో వరసగా నేసిన డిజైను; కొన్నిచోట్ల, చెక్రాలవరసకు పైనా కిందా గీరలు పెడతారు (కో. 14, 16, 26, 27; రా. 13, 22).

**చెక్రంపేటుచాపు** అంచులో, చెక్రంపేటు నమూనా పెట్టి నేసిన రెండు పంచెలు (చాపు). (కో. 37).

**చెక్రంపేటుచీర** ఉ. చెక్రంపేటిచీర. అంచులో, చెక్రం మాదిరి డిజైన్లు నేసిన చీర (తె. 7).

**చెక్రంబేలు** చెక్రంమాదిరి, గుండ్రటిపువ్వు డిజైను (తె. 21).

**చెక్రంరాటం** పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం; దీనికి సైకిలుచెక్రం అమరుస్తారు. చూ. చిత్రం 41 (రా. 16).

**చెక్రంలాహిరీ** ఉ. చెక్రంలాయిరీ. అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 10).

**చెక్రాలకర్ర** పర్యా. చూ. ఇరవలదండి. కోతిపుల్లలు గాని, గిలకలుగాని వేలాడదియ్యటానికి, మగ్గానికిపైన దారాలుకట్టినకర్రలు. చూ. చిత్రం 121క. 13 (కో. 27).

**చెంగావిపుచ్చురంగు** ఉ. సెంగాయ-. మసకమసకగా ఉండే ఒకరకం ఎరుపురంగు (కో. 8).

**చెంగావిరంగు** ఉ. చెంగాయి-. ఒకరకం ఎరుపురంగు (కో. 6).

**చెంగు** చూ. చెరగు (కో. 7, 22-24, 35).

**చెంచుకాశేరుచీర** ఉ. సెంచుకాశేరి-. నలుపు, ఎరుపురంగుల్లో అయిదేసి సన్నపట్టెలు పడేట్టు పడుగు, పేక నేసిన తెల్లచీర; కమ్మిలో, మూడువేళ్ళ వెడల్పు ఎర్రపట్టె, దానికంటె చిన్నపట్టె ఒకటీ పెట్టి, మధ్య నాలుగుకొలుకుల తెల్లగీరలు, పగలగొట్టి నేసిన చీర, కొన్నిచోట్ల, నిలువు, అడ్డం వేలెడేసి వెడల్పు పట్టెలు పడేట్టు నేసిన చీర (కో. 3, 5).

**చెంచోరిచీర** ఎరుపు, తెలుపు రంగుల్లో బెత్తెడేసి వెడల్పు పట్టెలుపడేట్టు నేసిన తెల్లచీర; దీని అంచుకు ఎర్రనూలు పెడతారు; పైటచెరగులో ఎర్రపోగులు (=బాణాలు) దూర్చి నేస్తారు (కో. 2).

**చెట్టిగాడు** కూలికి మగ్గాలు నేయించేవాడు; master-weaver; పూర్వం అనేవారు (కో. 7).

**చెట్టిరంగు** లేత ఎరుపు రంగు; నీర్కావిరంగు (కో. 19).

**చెట్లకమ్మి** మూడు రంగులుపెట్టి చెట్లు, ఆకులు, కాయలు మొ. నమూనాలు నేసినకమ్మి; కొన్నిచోట్ల, నెమలికండ్లు కూడా పెడతారు (తె. 13-15).

**చెంటి** పర్యా. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చినరాటి; చూ. రాటి. చూ. చిత్రం 34 (తె. 26).

**చెంటితాడు** పర్యా. చూ. బిరుతాడు(3). అడ్డగుమ్మి ఆకులను కలిపికట్టినతాడు. చూ. చిత్రం 34.4 (తె. 26).

**చెండు 1.** పర్యా. చూ. కుచ్చు. మరమగ్గంలో ఒకసొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో తాళ్ళనుగుంజే పిడి; మామూలుగా, గుడ్డపేలికలు కలిపికట్టింది; కొన్నిచోట్ల, దారపురీలు కడతారు. చూ. చిత్రం 118.21 (రా. 4); **2.** (-చుట్టు) ఉన్నిదారం ఉండ (తె. 25).

**చెండుజిల్ల** పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడె గాడిలో అడ్డంగా బిగించినపుల్ల; పేకపోగు, చిక్కుపడకుండా, సాపుగా రావటానికి దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (తె. 32).

**చెండుతాడు** పర్యా. చూ. చెంపతాడు(4). కుచ్చుతాళ్ళలో, డైమనుతాడుకు ఒకవైపు కట్టినదారం; దీన్ని పైన మగ్గం నిలువుపట్టెకూ కింద ఉడతతాడుకూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.23 (రా. 6).

**చెండుపుల్ల** పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడె గాడిలో అడ్డంగా బిగించినపుల్ల; పేకపోగు, చిక్కుపడకుండా, సాపుగా రావటానికి దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (కో, 3, 34; తె. 31, 33).

**చెండుపువ్వుకుంచె** ఉ. చెండుపూకుంచి. బంతిపువ్వు మాదిరిగా గుండ్రటిపరుపు(=పురి అడుగుభాగం)గల కుంచె. చూ. చిత్రం 78 (రా. 17, 23, 24).

**చెండుపువ్వుపరుపు** కుంచెపురి కట్టుబడిలో, బంతిపువ్వు మాదిరిగా కట్టిన గుండ్రటిపరుపు(=పురి అడుగు భాగం). చూ. చిత్రం 78.1 (రా. 24).

**చెండుముల్లు** పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడె గాడిలో అడ్డంగా బిగించిన పుల్ల; పేకపోగు చిక్కుపడకుండా సాపుగా రావటానికి దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరంవేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (కో. 36).

**చెందనం** ఉ. చందనం, సెందనం. **1.** లెమనులో

ముదురురంగు (కో. 3); **2.** ముళ్ళగోరింట పువ్వులో తేలికరంగు (కో. 11); **3.** పసుపులో తెలుపువన్నె (కో. 12); **4.** గంధంరంగు. చూ. చిత్రం 288 (కో. 13, 35; రా. 7).

**చెంద్రకమలంఅంచు** ముడుచుకొన్న తామరపువ్వు ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు (తె. 1, 6).

**చెంద్రకాంతచీర** చెంద్రకాంతపుష్పం రంగు చీర; బచ్చలపండు (కొద్దిగా ఎరుపువన్నె కలిసింది) వన్నెచీర (తె. 2).

**చెంద్రకాంత(రంగు) 1.** చెంద్రకాంతపుష్పంరంగు. చూ. చిత్రం 288 (కో. 7, 9, 11, 20, 21, 24; తె. 2, 16; రా. 7); **2.** ఒకమాదిరి ఎరుపు (కో. 14).

**చెంద్రకాలచీర** సాదాఅంచు పెట్టి నేసిన ఒకరకం నేతచీర (తె. 23).

**చెంద్రవంక** ఉ. సెంద్రవొంక. ఒకరకం నేతచీర (తె. 10, 11).

**చెంద్రవంకెలు** (బహు.) ఉ. చెంద్రంకెలు. పట్టు పురుగులను పెంచటానికివాడేబుట్ట; గుండ్రంగా గదులు గదులుగా ఉంటుంది; దీన్ని గూళ్ళతడికెలని కూడా అంటారట. చూ. చిత్రం (రా. 1).

**చెంద్రహారం** ఒకరకం అంచు డిజైను. చూ. చిత్రం 188 (తె. 4, 5).

**చెంద్రహారంకమ్మి** పర్యా. చెంద్రాలకమ్మి(2). మెళ్ళోవేసుకొనే చెంద్రహారం మాదిరి డిజైను పడేట్టు నేసిన కమ్మి (కో. 10).

**చెంద్రాలకమ్మి 1.** రెండువేళ్ళ వెడల్పు గళ్ళు పడేట్టు నేసినకమ్మి; బెత్తెడు వెడల్పు అంచులో నెమలి కండ్ల నమూనాలు పెడతారు (తె. 15); **2.** పర్యా. చెంద్రహారంకమ్మి; మెళ్ళో వేసుకొనే చెంద్రహారం గొలుసు మాదిరి డిజైను కమ్మి (తె. 16).

**చెన్నంగి** ఒకరకం చెట్టు; దీని ఆకులు దసలి పట్టు పురుగులకు ఆహారం; కొన్నిచోట్ల, దసలి పురుగులను ఈ రకం చెట్లమీదికి ఎక్కిస్తారు; 6-8 అడుగుల ఎత్తు పెరుగుతుంది; ఆకులు తంగెడఆకుల మాదిరిగా ఉంటాయి; రంగునలుపు; దీని కాయలు 4-6 అంగుళాల పొడుగుంటాయి; గింజలు తుమ్మగింజల మాదిరిగా చిన్నవి; దీని ఆకులపచ్చడి విరేచనకారి (తె. 7).

**చెప్రాన్** తివాసీనేతలోవచ్చేఒకరకండిజైను(తె.17).

**చెమటఉన్ని** ఒకరం ఉన్ని; చలికాలం(=మాగి)లో కత్తిరించింది; బరువుగా ఉంటుంది; మాగిఉన్ని (తె. 3).

**చెమడాముల్లు** పర్యా. చూ. వారుపుల్ల. మరమగ్గం ఉడతకుపైన ఉడతతోలు కొనలు బిగించిన ఇనపపుల్ల. చూ. చిత్రం 119.3 (కో. 37).

**చెమికె** ఉ. చెమక, చెమిక, చెముక, చెమ్కి, చెమ్కె, సెంక, సెమిక, సెవిక; రూ. చేకి; పర్యా. అచ్చుచెమికె, అచ్చుపొట్టె. పన్నె సందుల్లోనుంచి అవతలకు దూర్చిన (బెంతుదారాలుగాని, బద్దెదారాలుగాని) పోగుల్లో, అచ్చుతకటానికి కోసిన కొసలు, తేక పాయ; నేతనేసే టప్పుడు పోగులు అతకటానికి వీటిని వాడతారు; మగ్గం దగ్గర వేలాడగడతారు. చూ. చిత్రం 102 చ. 6 (కో. 3, 5, 8, 9, 13, 25-29, 31, 32, 34, 36; తె. 8, 10, 12-15. 21, 23, 26-28, 30-32; రా. 1, 8, 13, 15-18, 20, 23).

**చెమికెముడి** ఉ. సెమక-, సెమికి-, సెమ్కి-; రూ. చేకిముడి(1); పర్యా. చెమికెలగుది. అచ్చులో, పన్నె గూళ్ళలోనుంచి దూర్చిన (బెంతుదారాలుగాని, బద్దెదారాలుగాని) పోగులు వెనక్కి జారకుండా పాయ(లు)గా విడదీసి వేసిన చివరి ముడి; ఇది, అచ్చుతికే టప్పుడు కోసేస్తారు. చూ. చిత్రం 102 చ. 5 (కో. 3, 8; రా. 24).

**చెమికెలగుత్తి** అచ్చుతికేటప్పుడు, కోసితీసేసిన బద్దెదారాలు; నేతనేసేటప్పుడు తెగినపోగులు అతకటానికి వీటిని వాడతారు; మగ్గందగ్గర వేలాడగడతారు (కో. 32).

**చెమికెలగుది** ఉ. సెమికలగుది; పర్యా. చెమికెముడి. అచ్చులో, పన్నెగూళ్ళలోనుంచి దూర్చిన(బెంతుదారాలుగాని, బద్దెదారాలుగాని) పోగులు వెనక్కి జారకుండా పాయ(లు)గా విడదీసి వేసిన చివరిముడి; ఇది, అచ్చుతికేటప్పుడు కోసేస్తారు. చూ. చిత్రం 102 చ. 5 (కో. 29).

**చెమిటితాడు** చూ. చేడుతాడు(2) (కో. 33).

**చెమిటిపలక** పర్యా. చూ. చేడుకర్ర. దోనె ముందర నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర(లు); దీనికి దారాలు, ఇత్తడిముళ్ళు (కొన్నిచోట్ల, ఇనపవి) ఉంటాయి. మామూలుగా, చేతిమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 124 క (కో. 33).

**చెమిటిపలుపు** చూ. చేడుపలుపు(1) (కో. 33).

**చెమిటిబల్ల** చూ. చేడుబల్ల (కో. 33).

**చెమిటిబొంగు** చూ. చేడుబొంగు (కో. 33).

**చెమిటిముల్లు** చూ. చేడుముల్లు(1) (కో. 33).

**చెమిటిముళ్ళగొట్టం** చూ. చెముడుములుగొట్టం (కో. 33).

**చెముకట్టు 1.** పర్యా. చూ. అడ్డకట్టె(10). నేత బయలులో మరమగ్గం నిలబెట్టటానికి, నిలువురాటలకు అడ్డంగా, మామూలుగా బిగించినకర్ర; కొన్నిచోట్ల,

దీనికి అచ్చుతాళ్ళు తగిలిస్తారు. చూ. చిత్రం 116.1 (రా. 9); **2.** చూ. చెవుకట్టు (3) (రా. 9, 10).

**చెముడుకన్నం** బట్ట అంచులో చేడుముల్లు గుచ్చి నప్పుడు పడ్డ బెజ్జం (కో.36).

**చెముడుకర్ర** ఉ. -గర్ర; చూ. చేడుకర్ర (కో. 32, 35, 36).

**చెముడుగుది** **1.** చూ. చేడుగుది(1) (కో. 35); **2.** పర్యా. చూ. బిగుతాడు. చేడుకర్రల మధ్యన, రెంటినీ బిగించే పైతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 125 క. 4 (కో. 37).

**చెముడుతాడు** చూ. చేడుతాడు(2) (కో. 35).

**చెముడుతీపుతాడు** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్ట మీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీనికొనలు, చేడుబొందు - కొన్ని చోట్ల, కర్రలు- రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (కో. 37).

**చెముడుదబ్బ** చూ. చేడుబద్ద(1). (రా. 12).

**చెముడుదారం** పర్యా. బొడ్డుతాడు. నేతబట్ట మీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీని కొనలు, చేడుబొందులు (కొన్నిచోట్ల, కర్రలు) రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (కో. 32).

**చెముడుపలక** చూ. చేడుపలక (కో. 37).

**చెముడుపలుపు** చూ. చేడుపలుపు (కో. 32, 36, 37).

**చెముడుబల్ల** చూ. చేడుబల్ల (కో. 36).

**చెముడుబొందు** చూ. చేడుబొందు (కో. 32, 36, 37).

**చెముడుములుగొట్టం** రూ. చెమిటిముళ్ళగొట్టం; పర్యా. ములుగొట్టం. చేడుముళ్ళు వేసుకొనే వెదురు గొట్టం (కో. 36).

**చెముడుముల్లు** చూ. చేడుముల్లు(1) (కో. 32, 35-37).

**చెంప1.** పర్యా. కడ(1), కుంచెకోపు, కుంచెచెంప, కుంచె తట్టు, కుంచెబుజం(2), కుంచెమూత, కుంచెమూల, తట్టు (2). పడుగుదువ్వేకుంచె పక్కభాగం; చేత్తో పట్టుకోటానికి వీలుగా, దీనికి గోనెపట్టాగాని, ఈకిచేపతోలుగాని వేసి కుడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 76 క. 8 (కో. 9, 22, 27, 28, 31; తె. 11, 17; రా. 16, 18); **2.** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 18, 19); **3.** పర్యా. చూ. పలకబుజం(1). చేతి మగ్గంపలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం; కొన్నిచోట్ల, దీనికి నగిషీలు చెక్కుతారు; ఇటువంటివి రెండుభాగాలకుచిల్లులుచేసి పలకసూత్రాలు కడతారు. చూ. చిత్రం 109.4 (తె. 17); **4.** పర్యా. చూ. దవడచెక్క. మరమగ్గం చట్రంలో, పానుపు పట్టెకు పక్కన బిగించిన పొరుగుచెక్క; ఇటువంటివి, రెండు పక్కలా ఉంటాయి. చూ. చిత్రం 118.15 (రా. 24).

**చెంపకట్టు** పర్యా. కడకట్టు, కుంచెదరికట్టు, కొన కట్టు. కుంచెచెంపకు వేసిన దారపుకట్టు; ఇటువంటివి రెండు వేస్తారు. చూ. చిత్రం 76 క. 9 (తె. 11).

**చెంపగుది** పర్యా. చూ. ఊడ్తెగుది(2). పడుగు చాపేటప్పుడు, ఊడ్తె అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (తె. 2, 6).

**చెంపతాడు** **1.** పర్యా. చూ. ఊడ్తెగుది(2). పడుగు చాపేటప్పుడు, ఊడ్తె అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (తె. 1, 21); **2.** అచ్చుకు, పడుగులాకలను చేర్చి కట్టిన తాడు; ఇటువంటివి రెండుంటాయి(తె. 9); **3.** పర్యా. కట్టు, కడతతాడు, చెమ్మకట్టు, పక్క తాడు(1), పలకగుది(2), పలకతాడు(2), పలకగట్టు తాడు, మోరకట్టు. చేతిమగ్గం పలకను, గుండును కలిపి బిగించిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 1 (కో. 37; తె. 2, 18, 20, 21, 29); **4.** పర్యా. అస్తపుతాడు, చంకతాడు(2), చెండుతాడు, చెంపదారం, నిలువుతాడు(1), నిలువుదారం(3), పక్క తాడు(4), పక్కదారం, మగ్గంతాడు(1), సట్టరు సూత్రం. కుచ్చుతాళ్ళలో, డైమనుతాడుకు ఒకవైపు కట్టిన దారం; దీన్ని పైన మగ్గం నిలువుపట్టెకూ కింద ఉడతతాడుకూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.23(తె.1; రా. 12, 17, 18, 23, 24).

**చెంపదబ్బ** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసే టప్పుడు, ఈనెలు చెదరకుండా ఆపేది; దవడ; ఇటువం టివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (రా.11).

**చెంపదారం** పర్యా. చూ. చెంపతాడు(4). కుచ్చు తాళ్ళలో, డైమనుతాడుకు ఒకవైపు కట్టినదారం; దీన్ని పైన మగ్గం నిలువుపట్టెకూ కింద ఉడతతాడుకూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.23 (రా. 13, 16).

**చెంపనిలువు** పర్యా. చూ. నిలువుపట్టె(10). మర మగ్గంచట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 29).

**చెంపపలక** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర, నాడెబయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. చూ. చిత్రం 118.16 (రా. 16).

**చెంపలాక** పర్యా. చూ. కుంచెలాక. కుంచె కట్టుబడిలో, పురిబిగింపుకు, రెండుపక్కలావేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల, అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (రా. 23).

**చెంపసీల** పర్యా. చూ. పలకసీల. చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించినకొయ్య; కొన్నిచోట్ల, దీనికి పై భాగంలో నగిషీలు చెక్కుతారు; కొన్నిచోట్ల, దీన్ని తొలిచి, లోపల గజ్జెలు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 3 (తె. 33).

**చెంబం** ఉ. సెంబం. రంగుకొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు, అయిదు తులాలు పట్టేది. చూ. చిత్రం 282 ప. 2 (తె. 17, 24, 29).

**చెంబుబుగిడి** ?గుండ్రటి మొగ్గమాదిరిగా నేసిన డిజైను; నిండుబుగిడి (తె. 25, 31).

**చెంబేలిపూవు** (? < చమేలీ-) అంచులో, చెంబేలి (జాజిపువ్వు మాదిరిది)పువ్వునమూనాలో నేసింది( తె.19).

**చెమ్మకట్టు** పర్యా. చూ. చెంపతాడు(3). చేతిమగ్గం పలకను, గుండును కలిపి బిగించినదారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 1 (కో. 34).

**చెయికుంచె** చూ. చేతికుంచె (రా. 15-17, 23).

**చెయికొయ్య** ఉ. సెయ్‌కొయ్య; చూ. చేతికొయ్య (తె. 22).

**చెయిగుంజ** ఉ. సెయ్‌గుంజ; చూ. చేగుంజ(తె.22).

**చెయిగూటం** చూ. చేతిగూటం(1) (తె. 8; రా. 16, 17).

**చెయినంచు** పర్యా. గొలుసంచు. గొలుసుమాదిరిగా డిజైను పడేట్టునేసిన అంచు. చూ. చిత్రం 180 (తె. 14; రా. 18).

**చెయిను** ఉ. షెయిన్, సెయిన్; పర్యా. చూ. గొలుసు(5). డాబీకోలలు లేపటానికి, గొలుసు మాదిరిగా, సన్నబద్దలు కూర్చిన సాధనం; ఈ బద్దలకు చిన్నపిక్కలు బిగిస్తారు; దీన్ని దిండుకు తగిలిస్తారు. చూ. చిత్రం 132 త. 1 (కో. 23, 24; తె. 13; రా. 4).

**చెయినుడాబీ** ఉ. చెండాబీ, చెయిండాబీ, చేన్‌డాబీ, సైన్‌డాబీ; పర్యా. చూ. గొలుసుపింజెర(ం). ఒకరకం డాబీ; సన్నబద్దల గొలుసు దిండుకు తగిలించింది. చూ. చిత్రం 132 త (కో. 12, 13, 15, 23).

**చెయినుబద్ద** పర్యా. చూ. గొలుసుబద్ద. డాబీ గొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద(లు); వీటికి కొయ్యపిక్కలు బిగిస్తారు; ఇవి దిండును చుట్టి తిరుగుతూ ఉంటాయి. చూ. చిత్రం 132 త.2 (కో.23,24).

**చెయినులాక** ఉ. సెయిన్లాక; పర్యా. చూ. గొలుసుబద్ద. డాబీగొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద(లు); వీటికి కొయ్యపిక్కలు బిగిస్తారు; ఇవి దిండును చుట్టి తిరుగుతూ ఉంటాయి. చూ. చిత్రం 132 త. 2 (రా. 14).

**చెయిపలక** **1.** చూ. చేతిపలక(1) (రా. 18); **2.** చూ. చేపలక(1) (రా. 18).

**చెయిపిడి** పర్యా. చూ. గూటం(1). దూది ఏకేటప్పుడు కమానుసరం కొట్టే కొయ్యబడితె. చూ.చిత్రం 9.13 (తె. 17).

**చెయిమల** పర్యా. చూ. చెయ్యి(2). రాట్నం ఇరుసు తిప్పే(కొయ్య)పిడి. చూ.చిత్రం 15.9(కో.19).

**చెయిముద్ద** రూ. చేమొద్దు; పర్యా. చూ. కాటుపీట. పంటెకు నూలుచుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టేకొయ్య. చూ. చిత్రం 19.1, 28 (తె. 19).

**చెయిమేకు** చూ. చేమేకు (కో. 7).

**చెయ్యి** ఉ. సెయ్, సెయి, సెయ్య, సెయ్యి. **1.** పర్యా, తిప్పుచెయ్యి(3), పిడి(1), బొమ్మ(1), చెయ్యికర్ర(1). పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువు కొయ్యకు బిగించిన పిడి. చూ. చిత్రం 1.7 (కో. 37; తె. 5, 11, 14-17); **2.** పర్యా. చెయిమల, చెవుల బొమ్మ(2), చేతిబొమ్మ, తిప్పుకర్ర, తిప్పుచెయ్యి(1), తిప్పుజెవు, తిప్పుడుచెక్క, తిప్పుడుబొమ్మ, తిప్పుపుల్ల, తిరుగుడుకట్టె(1), పిడి(2), బొమ్మ(2), బొమ్మకొయ్య(2). రాట్నంఇరుసు తిప్పే(కొయ్య)పిడి. చూ. చిత్రం 15.9 (కో. 9, 22, 29, 35, 37; తె. 4, 5, 8, 11-17, 20-22, 30; రా. 12, 15); **3.** పర్యా. తిప్పుచెయ్యి(2), తిప్పుడుకడ్డీ, పిడి(6), బొమ్మ(6). డబ్బారాట్నం ఇరుసు తిప్పే పిడి; ఇది కుడివైపున ఉంటుంది. చూ. చిత్రం 41 క. 11 (కో. 7, 26, 28, 35); **4.** పర్యా. రాటంచెయ్యి, వేలుచెక్క. పట్టుదారం వడికే పెద్దరాట్నం కట్టుబడిలో ఇరుసు తిప్పటానికి బిగించిన కొయ్యపిడి; కొన్నిచోట్ల దీనికి చేసిన చిల్లిలో వేలుపెట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 293 చ. 6 (కో. 14; తె. 5, 10, 12, 21, 28).

**చెయ్యికర్ర** **1.** పర్యా. చూ. చెయ్యి (1). పత్తిరాట్నం తిప్పటానికి, కుడివైపు నిలువుకొయ్యకు బిగించిన పిడి. చూ. చిత్రం 1.7 (కో. 37); **2.** పర్యా. చెయ్యిపుల్ల. పత్తిరాట్నంతిప్పే పిడి(చెయ్యి)కి బిగించిన పుల్ల. చూ. చిత్రం 1.8 (కో. 37).

**చెయ్యిపుల్ల** ఉ. చెయిపుల్ల; పర్యా. చెయ్యికర్ర

(2). పత్తిరాట్నం తిప్పేపిడి(=చెయ్యి)కి బిగించిన పుల్ల. చూ. చిత్రం 1.6 (కో. 36).

**చెరకపంటె** ఉ. చెర్క-; చూ. చెలకపంటె(తె. 12).

**చెరకా** పర్యా. చూ. రాట్నం(1). నూలువడికే కొయ్యయంత్రం; పంటెకుగాని, డబ్బాలకుగాని నూలు తోడుకోటానికీ కండెలు చుట్టటానికీ వాడతారు. చూ. చిత్రం 15 (కో. 14).

**చెరగతుకు** (క్రి.) ఉ. చెరుగతుకు. అచ్చుతికేటప్పుడు, కొంగుబద్దె పోగులకు పడుగుపోగులు అతకటం (తె. 2).

**చెరగు** ఉ. చెరుగు, సెరగ, సెరుగు; రూ. చెంగు, చెరుంగు(1), చెరువు; పర్యా. కొంగు(2). చీర చివరి భాగం; మామూలుగా, బద్దెనేసిన తరవాత జైనెడు జెత్తడునుంచి మూరెడుపొడును వరకూ (కమ్మి, డిజైన్లు మొ.వి) నేస్తారు; ఇటువంటివి రెండు (పైట చెరగు, కట్టుచెరగు) ఉంటాయి (కో. 2, 4-6, 8, 9, 23; తె. 2, 4, 6, 8, 18; రా. 8, 13, 16, 18).

**చెరగుచీర** ఉ. సెరుగుసీర. మూరెడు పొడుగు పట్టు కొంగునేసి, పట్టంచుల్లో జరీ చేమంతిపువ్వులూ, జరీకడ్డీ పడేట్టు నేస్తారు (తె. 4).

**చెరగుచేయు** (క్రి.) ఉ. చెరుగు-. ముందునేత నెయ్యటం (కో. 6).

**చెరగుఝూలు** ఉ. -ఝూల్. చీరచెరగులో డిజైన్లు నెయ్యటానికి చేతిమగ్గం పడుగుమీద, వంతెన మాదిరిగా కట్టిన లావుదారాలు; చూ. అడ్డబేలు. చూ. చిత్రం 136 క. 1 (తె. 2).

**చెరగునేత** ఉ. సెరుగునేత. పర్యా. కొంగునేత. చీర మొదటగాని, చివరగాని మూరెడు పొడుగు నేసిన నేత (కో. 23; రా. 8, 13, 16).

**చెరగుమొద్దు** పర్యా. అడ్డకొంగుపట్టె. చెరగునేతకు వాడే దారాలుచుట్టే కొయ్యపట్టె; దీనికి రెండు నిలువు గుంజలు బిగించి ఉంటాయి, చూ. చిత్రం 286 (తె.2).

**చెరవుకండె** చీరచెరగు నెయ్యటానికి వాడే దారపు కండె (కో. 35).

**చెరికచ్చినేత** పర్యా. చూ. చత్నేత. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్టు నేసిన నేత; మేటీ నేత మాదిరిది; అనిమూసి నేస్తారు (రా. 12).

**చెరికొంగునేత** ?బద్దెతట్టిన తరవాత నేసిన నేత (రా. 12).

**చెరుకాకంచు** చిగురు వదలకుండా, అంతా జరీపెట్టి నేసిన అంచు (కో. 24).

**చెరగుకడ్డీ** పర్యా. చూ. సులిగె. నేసిన గొంగడి బిగింపుకోసం, ఉన్నిమగ్గం దోనుగగాడిలో పెట్టిన కర్ర; దీన్ని గొంగడికొసలో దూర్చి దోనుగగాడిలో పండ్లకు బిగిస్తారు (తె. 6).

**చెరుంగు** **1.** చూ. చెరగు (కో. 1); **2.** పట్టె మార్పు నేతలో, మొదట నేసిన మూరెడుగుడ్డ(కో.1).

**చెరువు** ఉ. చెరవు; చూ. చెరగు (కో. 16, 35).

**చెర్మం** పర్యా. చూ. ఉడతతోలు. మరమగ్గంలో, ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు; దీని కొసలు, ఉడత చిల్లిలోనుంచి పైకి దూర్చి బిగిస్తారు; నాడె మొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (కో. 3).

**చెలకపంటె** ఉ. చెల్కపంటె, సెల్కపంటె; రూ. చెక్కపంటె, చెరకపంటె; పర్యా. చెక్కబుడ్డి, డబ్బా (2), డోరిపంటె, దబ్బపంటె, దబ్బలబుడ్డి, నూలుపంటె (2), బుర్ర(1). డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం, కొయ్యబద్దల పంటె; కొన్నిచోట్ల, వెదురుబద్దలుగాని, రేకుపట్టెలుగాని బిగించింది; మామూలుగా పట్టుదారం చుట్టేది. చూ. చిత్రం 29 (తె. 11, 12).

**చెలకపత్తి** ఉ. చెల్కపత్తి, సెల్కపత్తి. ఒకరకం ఎర్రపత్తి; పువ్వు, గింజ పచ్చగా ఉంటాయి (చెలక= మెట్టపొలం) (తె. 5, 7, 11, 12, 17).

**చెల్లానేత** రెండు పావుచెక్కలనూ ఒకే మట్టంలో ఉంచి నేసిన నేత; పలకకొట్టి, అనితొక్కుతూ నేసిన నేత; పలచగా నేస్తారు (కో. 17, 23).

**చెవి** ఉ. సెవి, సెవు. **1.** కదురు తిరగటానికి వీలుగా, రాట్నంబొమ్మకు బిగించిన తోలుముక్క; ఇటువంటివి, బొమ్మగాడికి రెండువైపులా రెండు ఉంటాయి; కొన్నిచోట్ల ఈతపీచు, తాటినార, కొయ్యముక్కలు పెడతారు. చూ. చిత్రం 15 చ. 5 (కో. 1-37; తె. 1-33; రా. 1-24); **2.** పర్యా. చూ. బొమ్మ(5). డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (తె. 10); **3.** డబ్బారాట్నం గంటం అమర్చటానికి బొమ్మకు చేసిన చిల్లి. చూ. చిత్రం 41 క.7(తె. 8; రా. 18); **4.** పర్యా. చూ. పలకబుజం(1). చేతిమగ్గంపలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం; కొన్నిచోట్ల, దీనికి నగిషీలు చెక్కుతారు; ఇటువంటి రెండు భాగాలకు చిల్లులుచేసి పలకసూత్రాలు కడతారు. చూ. చిత్రం 109.4 (కో. 9; తె. 11); **5.** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా అపటానికి బిగించిన కొయ్యచెక్క. చూ. చిత్రం 118.16 (తె. 16); **6.** పర్యా. అడ్డదారిరాయి. మగ్గానికి తగిలించిన ఉన్నిపడుగు నేలకు అనకుండా ఊనికగా పెట్టినకొయ్య(=అడ్డదారి)ని మోసేరాయి; ఇటువంటివి, రెండు పక్కలా ఉంటాయి; కొన్నిచోట్ల,

పంగలగుంజలు పెడతారు. చూ. చిత్రం 315 క. 13 (తె. 28).

**చెవిగాడి** రాట్నంచెవికి ముందువైపు పెట్టిన చిల్లి (తె. 22).

**చెవిటిముల్లు** చూ. చేడుముల్లు(1) (కో. 34).

**చెవితొలి** (బహు. చెవితొల్లు) బొమ్మచెవి (తోలు ముక్క)కి కదురుతగిలించటానికి పెట్టినచిల్లి; ఇటువంటివి బొమ్మకు రెండువైపులా రెండు ఉంటాయి (తె. 22).

**చెవిదిడ్డి** రాట్నంచెవికి వెనకవైపున పెట్టిన చిల్లి. చూ. చిత్రం 15 చ. 6 (తె. 22).

**చెవిపట్టె** పర్యా. చూ. బొమ్మ(5). డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (రా. 2).

**చెవు** మరమగ్గంబొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (కో. 6, 13).

**చెవుకట్టు 1.** పర్యా. రెక్క(1). మరమగ్గంబొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడత దారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (కో. 8); **2.** పర్యా. తిరుగుడుకర్ర గుబ్బ, తిరుగుడుకర్రచెవు, తిరుగుడుచెక్క, తిరుగుడు బిళ్ళ, పుల్లిరుసుచెవి, బొమ్మ(12), రూలరుబద్ద, రూలు గుండుబొమ్మ, రోలరుచెక్క. పుల్లిరుసు నిలవటానికి, పైపట్టికి ఆధారంగా బిగించినచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121 చ. 4, 121 వ. 2 (రా. 5); **3.** రూ. చివకట్టు, చెముకట్టు(2); పర్యా. చూ. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 3, 11; రా. 7, 8).

**చెవుకట్టుతాడు 1.** చేతిమగ్గంపలక బుజానికి కట్టిన చిన్నదారం; ఇటువంటివి రెండుంటాయి; దీనికి పొడుగు దారంకట్టి, పలకను పైనుంచి వేలాడదీస్తారు; చూ. పలకసూత్రం (కో. 7); **2.** పర్యా. చూ. ఉడతతాడు. మగ్గంఉడతకు పైన కట్టిన దారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (కో. 8).

**చెవుగూటం** పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య,కొన్నిచోట్ల,రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (తె. 1, 2; రా. 17, 18, 22-24).

**చెవుడుకట్టె** చూ. చేడుకట్టె(1) (కో. 1; రా. 11, 13, 18, 23, 24).

**చెవుడుకట్టెముల్లు** చూ. చేడుకట్టెముల్లు(రా. 12).

**చెవుడుకర్ర** చూ. చేడుకర్ర (కో. 8).

**చెవుడుదారం** పర్యా. చూ. చేడుపలుపు. చేడుకర్రకు(కొన్నిచోట్ల, చేడుబద్దకు) చివర కట్టిన దారం; ఇటువంటివి, మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125 క. 3 (రా. 12, 13).

**చెవుడుపలుపు** చూ. చేడుపలుపు(1) (కో. 1).

**చెవులకమ్మి** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (కో. 21).

**చెవులకొయ్య 1.** పర్యా. చూ. బొమ్మ(3). రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువు కొయ్య; చాలాచోట్ల, దీన్ని వినాయకుడిబొమ్మ ఆకారంలో చెక్కుతారు; చూ. చెవి. చూ. చిత్రాలు 15 క. 10, 15 ట (రా. 1); **2.** ఉ. సెవలకొయ్య; పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్లరాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 6; రా. 12).

**చెవులతాడు** ఉ. సెవల్తాడు; పర్యా. చూ. తలకట్టు తాడు. పంజు తలచిట్టెలకు పైవైపున ఆకుల్ని కలిపి కట్టినతాడు. చూ. చిత్రం 19 క. 5 (తె. 22).

**చెవులపట్టె** ఉ. -పట్టి; పర్యా. చూ. బొమ్మ(3). రాట్నంపీటకు ఎడమవైపున కదురుబిగించే నిలువు కొయ్య; చాలాచోట్ల, దీన్ని వినాయకుడిబొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చెవి. చూ. చిత్రం 15.10 (కో. 2).

**చెవులపీట** ఉ. చెవలపీట, సెవలపీట; సెవ్లపీట, పర్యా. చూ. బొమ్మ(3). రాట్నంపీటకు ఎడమవైపున కదురుబిగించే నిలువుకొయ్య; చాలాచోట్ల, దీన్ని వినాయకుడి బొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చెవి. చూ. చిత్రం 15.10 (కో. 3, 7, 10-12, 15, 17-21, 23-26; తె. 11-14, 16, 32).

**చెవులబొమ్మ 1.** ఉ. చెవలబొమ్మ, సెవలబొమ్మ; పర్యా. చూ. బొమ్మ(3). రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడిబొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చెవి. చూ. చిత్రం 15.10 (కో. 4, 5, 9, 37; రా. 5, 27-10, 0); **2.** పర్యా. చూ. చెయ్యి(2). రాట్నం ఇరుసుతిప్పే (కొయ్య)పిడి. చూ. చిత్రం 15.9(కో.6).

**చెవులరాయి** పర్యా. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్నిచోట్లరాయి; ఇటువంటివి రెండుం

టాయి. చూ. చిత్రం 126.1 (కో. 8, 9ఎ; రా. 19ఎ, 20).

**చెవులు** పంకెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పై వాటి కొసలు. చూ. చిత్రం 19 క. 3 (రా. 24).

**చేఆసు** ఉ. చేయాసు, సెయ్యాసు; చూ. చేతిఆసు (కో. 3-7, 10, 13, 14).

**చేకి** చూ. చెమికె (కో. 3, 7, 10).

**చేకిపట్టె** అచ్చుపోగుల్లో, చెమికెముడి కొయ్యగా మిగిలిన పోగులు; వీటికి పడుగుపోగులు అతుకుతారు (కో. 10).

**చేకిముడి** **1.** చూ. చెమికెముడి (కో. 3, 10); **2.** చీరచివరి పోగుల ముడి; బద్దెచివరి పోగుల ముడి; చూ. చిత్రాలు 144.4, 272.4.

**చేకోనితువ్వాలు** ఉ. -తువాలు. ఒకరకం తువ్వాలు (తె. 11).

**చేగంజి** నేత నేసేటప్పుడు పడుగుమీద చేత్తో పూసిన గంజి; దీంతో నేత బిర్రుగా వస్తుంది (కో. 18).

**చేగుంజ** రూ. చెయిగుంజ. మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోటుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 6, 9బి; రా. 20).

**చేగుడ్డ** నేత నేసేటప్పుడు, గంజిగాని నూనెగాని చేతికి అంటుకొన్నప్పుడు తుడుచుకొనే గుడ్డ (కో. 10).

**చేగూటం** చూ. చేతిగూటం(1). (కో. 6).

**చేగొయ్య** చూ. చేతికొయ్య (తె. 31, 32).

**చేడు** ఉ. షేడు, సేడు. **1.** పర్యా. చూ. చేడుకర్ర. దోనె ముందర, నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర; దీనికి దారాలు, ఇత్తడిముళ్ళు(కొన్నిచోట్ల, ఇనపవి) ఉంటాయి; మామూలుగా, చేతిమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 124 క (తె. 18, 19, 22, 23, 25, 31); **2.** పర్యా. చేడుకట్టె(2), చేడుబద్ద(2). గొంగడి నేసేటప్పుడు, ముడుచుకు పోకుండా, అడ్డకొసలకు గుచ్చిన కట్టె; మామూలుగా కర్ర; కొన్నిచోట్ల, బద్ద; దీనికి చివర బిగించిన ముండ్లను కొసల్లో గుచ్చుతారు (తె. 10, 11, 20, 22, 25, 28).

**చేడుకట్టె** ఉ. చేడికట్టె, చేడెకట్టె, షేడుకట్టె, సేడికట్టె, సేడుకట్టి. **1.** రూ. చెవుడుకట్టె, చేరుకట్టె; పర్యా. చూ. చేడుకర్ర. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకుపోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర; దీనికి, దారాలు, ఇత్తడిముళ్ళు (కొన్నిచోట్ల ఇనపవి) ఉంటాయి; మామూలుగా, చేతిమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 124 క (కో. 3, 5, 6, 8, 9; తె. 4, 5, 8, 9, 32; రా. 1, 3, 5-8, 10, 14-17, 19ఎ, 19బి, 20, 22); **2.** పర్యా. చూ. చేడు(2). గొంగడి, నేసేటప్పుడు ముడుచుకు పోకుండా అడ్డకొసలకు గుచ్చిన కట్టె; మామూలుగా, కర్ర; కొన్నిచోట్ల బద్ద; దీనికి చివర బిగించిన ముండ్లను కొసలో గుచ్చుతారు (తె. 6, 7).

**చేడుకట్టెతాడు** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్టమీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీనికొసలు. చేడుబొందులు—కొన్నిచోట్ల, కర్రలు—రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (తె. 3).

**చేడుకట్టెదారం** ఉ. చేడికట్టెదారం; పర్యా. చూ. చేడుపలుపు(1). చేడుకర్రకు(కొన్నిచోట్ల చేడుబద్దకు) చివర కట్టిన దారం; ఇటువంటివి, మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి, దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125 క. 3 (రా. 18).

**చేడుకట్టెముల్లు** రూ. చెవుడుకట్టెముల్లు; పర్యా. చూ. చేడుముల్లు(1). నేత నేసేటప్పుడు గుడ్డను బిర్రుపెట్టటానికి, చివర గుచ్చే సన్నటి లోహపుముక్క; చివర వాడిగా ఉంటుంది; కొన్నిచోట్ల, జలుసుముల్లు; దీన్ని చేడుపలుపులకు మెలిపెడతారు; కొన్నిచోట్ల, చేడుబద్దకు చివర బిగించింది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 125 క. 6 (రా. 16).

**చేడుకర్ర** ఉ. సేడికర్ర, సేడుకర్ర; రూ. చెముడుకర్ర, చెవుడుకర్ర; పర్యా. చెమిటిపలక, చేడు(1), చేడుకట్టె(1), చేడుపలుకు(2), ములుగుట్టుకర్ర, ములుగుట్టు బర్ర. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా, కిందివైపు బిర్రుపెట్టే కర్ర(లు); దీనికి దారాలు, ఇత్తడిముళ్ళు(కొన్నిచోట్ల, ఇనపవి) మామూలుగా, చేతిమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 125 క (కో. 2, 4, 6, 7, 10-12, 17, 22, 28, 29; తె. 12-16; రా. 2, 4, 21).

**చేడుకొక్కు** నేత నేసేటప్పుడు, నేతబట్టలో అడ్డాన్ని బిర్రుపెట్టటానికి, చేడుముల్లుకు బదులుగా పెట్టే పుల్ల(లు); చూ. చేడుముల్లు (రా. 7).

**చేడుగుది** ఉ. సేడిగుది, సేడుగుతి, సేడుగుది. **1.** రూ. చెముడుగుది(1); పర్యా. చూ. చేడుపలుపు(1). చేడుకర్రకు(కొన్నిచోట్ల!, చేడుబద్ద)కుచివర కట్టిన దారం; ఇటువంటివి, మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125 క. 3 (కో. 28, 29; తె. 25, 31); **2.** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్టమీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీనికొసలు, చేడుబొందులు—కొన్నిచోట్ల, కర్రలు—రెంటికీ కడతారు; ఇదిలాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5(తె.20,22).

**చేడుడబ్బా** చేడుబద్దలు రెండూ కలిపి బిగించిన రేకు (తె. 19).

**చేడుదుబద్ద** చూ. చేడుబద్ద(1). (తె. 33).

**చేడుతాడు** ఉ. సేడితాడు, సేడుతాడు. **1.** పర్యా. చూ. చేడుపలుపు (1). చేడుకర్రకు-కొన్ని చోట్ల, చేడుబద్దకు – చివరకట్టినదారం; ఇటువంటివి, మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి, దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125క. 3 (కో. 3, 4); **2.** రూ. చెమిటితాడు, చెముడుతాడు; పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్టమీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీనికొసలు, చేడుబొందులు-కొన్నిచోట్ల-కర్రలు, రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (కో. 14, 17, 23, 28); **3.** గొంగడి, నేసేటప్పుడు ముడుచుకు పోకుండా అడ్డకొసలోదూర్చి బిర్రుపెట్టేతాడు; ఇటువంటివి, రెండుపక్కలా ఉంటాయి (తె. 20, 22).

**చేడుపలక** రూ. చెముడుపలక; పర్యా. కిగ్గర్ర, చేడుబల్ల. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా పైవైపు బిర్రుపెట్టే పొడుగు చెక్క(లు); మామూలుగా రీపరుబద్ద మాదిరిది; బద్దకు చివర బిగించిన ముళ్ళు గుడ్డఅంచుల్లో గుచ్చుతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 125 ట (తె. 10, 32).

**చేడుపలుకు 1.** పర్యా. చూ. చేడుపలుపు(1). చేడుకర్రకు-కొన్నిచోట్ల, చేడుబద్దకు-చివరకట్టిన దారం; ఇటువంటివి, మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి, దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125 క. 3 (తె. 11); **2.** ఉ. షేడుపలుకు; పర్యా. చూ. చేడుకర్ర. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా, కిందివైపు బిర్రుపెట్టేకర్ర; దీనికి దారాలు, ఇత్తడిముళ్ళు – కొన్నిచోట్ల, ఇనపవి – ఉంటాయి; మామూలుగా, చేతిమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 124 క (తె. 10, 17, 21).

**చేడుపలుకు 1.** పర్యా. చూ. చేడుపలుపు(1). చేడుకర్రకు (కొన్నిచోట్ల, చేడుబద్దకు) చివరకట్టిన దారం; ఇటువంటివి, మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి, దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125క. 3(తె. 11); **2.** ఉ. షేడుపలుకు; పర్యా. చూ. చేడుకర్ర. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా, కిందివైపు బిర్రుపెట్టే కర్ర; దీనికి దారాలు, ఇత్తడిముళ్ళు(కొన్నిచోట్ల ఇనపవి)ఉంటాయి; మామూలుగా చేతిమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 124 క (తె. 10. 17, 21).

**చేడుపలుపు** ఉ. సేడి-, సేడు-, సేడుపల్పు. **1.** రూ. చెమిటిపలుపు, చెముడుపలుపు, చెవుడు పలుపు; పర్యా. గుది (13), చెవుడుదారం, చేడుకట్టె దారం, చేడుగుది (1), చేడుతాడు (1), చేడుపలుకు (1), చేడుమలుపు, చేడుసిలమలకతాడు, ములుగట్టు గుది, ముల్లుకుట్టుతాడు. చేడుకర్రకు—కొన్నిచోట్ల, చేడుబద్దకు—చివర కట్టిన దారం; ఇటువంటివి, మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి, దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125 క. 3 (కో. 2, 3, 5, 7, 10, 11, 14, 17; తె. 3-5, 10, 12, 13, 18, 20, 22; 23, 30, 32; రా. 1, 2, 4-7); **2.** పర్యా. చూ. బిగుతాడు (3). చేడుకర్రలకు మధ్యన రెంటినీ బిగించే పైతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 125 క. 4 (తె. 19).

**చేడుబద్ద** ఉ. చేడి-, సేడి-, సేడు-, స్రేడు-. **1.** రూ. చెముడుదబ్బ, చేడుదుబద్ద; పర్యా. కుట్టుడు దబ్బ, మతి, ములుగుట్టుబద్ద. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకుపోకుండా అడ్డంగా, పైవైపు బిర్రుపెట్టే కొయ్యబద్ద; ఇటువంటి రెండు బద్దలకు ముళ్ళు బిగించిఉంటాయి; కొన్నిచోట్ల, దారాలు కట్టి, వాటిలో ముళ్ళుదూర్చి మెలిపెడతారు; మామూలుగా, మరమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 125 ప (కో. 8, 13-15, 19, 20, 23, 24, 26; తె. 18, 20, 22, 29); **2.** పర్యా. చూ. చేడు (2). గొంగడి, నేసేటప్పుడు ముడుచుకుపోకుండా, అడ్డకొసలకు గుచ్చినకట్టె; మామూలుగా, కర్ర; కొన్నిచోట్ల బద్ద; దీనికి చివర బిగించిన ముండ్లను కొనల్లో గుచ్చుతారు (తె. 3. 27).

**చేడుబల్ల** రూ. చెమిటిబల్ల, చెముడుబల్ల; పర్యా. చూ. చేడుపలక. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా, పైవైపు బిర్రుపెట్టే పొడుగు చెక్క(లు); మామూలుగా, రీపరుబద్ద మాదిరిది; బద్దకు చివర బిగించిన ముళ్ళు గుడ్డఅంచు చివర గుచ్చుతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 125 ట (కో. 24, 25).

**చేడుబిర్రుతాడు** ఉ. సేడుబిరుతాడు; పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్టమీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీనికొసలు, చేడుబొందులు (కొన్నిచోట్ల, కర్రలు) రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (తె. 31, 32).

**చేడుబొందు** ఉ. సేడి-; రూ. చెమిటిబొందు, చెముడుబొందు; పర్యా. ఉంగరం (8), పూస (5),

బలువుంగరం, బొందు (5), ములుగట్టుబొందు, మెట్టు (1). చేడుకర్రల బిగింపుకు, దారాలకు వేసే లోహపు చుట్టు; రింగు; ఇనపదిగాని, ఇత్తడిదిగాని వేస్తారు. చూ. చిత్రం 125 క. 1 (కో. 29).

**చేడుమలుపు** పర్యా. చూ. చేడుపలుపు (1). చేడు కర్రకు(కొన్నిచోట్ల, చేడుబద్దకు)చివరకట్టిన దారం; ఇటువంటివి, మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి, దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125 క. 3 (తె. 29).

**చేడుములికి** ఉ. ముల్కి; **1.** చూ. చేడుముల్లు (1) (తె. 23, 25); **2.** చూ. చేడు-ముల్లు(2). (తె. 25).

**చేడుముల్లు** (-కుట్టు) ఉ. చేడి-, సేడి-, సేడు-. **1.** రూ. చెమిటిముల్లు, చెముడుముల్లు. చెవిటిముల్లు, చేడుములికి(1); పర్యా. కుట్టుముల్లు, చేడుకట్టెముల్లు, చేడుమొల, ముల్లు(3), సూది. నేతనేసేటప్పుడు గుడ్డను బిర్రుపెట్టటానికి, అంచుచివర గుచ్చే సన్నటి లోహపు ముక్క; చివర వాడిగా ఉంటుంది; ఇత్తడి, ఇనుము, రాగి మొ. వాటితో చేస్తారు; కొన్నిచోట్ల, బలుసు ముల్లు; దీన్ని చేడుపలుపులకు మెలిపెడతారు; కొన్ని చోట్ల, చేడుబద్దకు చివర బిగించింది; ఇటువంటివి రెండు వైపులా ఉంటాయి. చూ. చిత్రం 125 క. 6 (కో. 2-7, 10-15, 17, 23-26, 28, 29; తె. 4, 12, 18, 20, 22, 28, 31-33; రా. 1, 2 4-8, 10, 19); **2.** రూ. చేడుములికి(2); పర్యా. ములికి(6), ముల్లు(6). చేడు చివరి ఇనపమొన (చూ. చేడు); దీన్ని గొంగడి అడ్డకొసలో గుచ్చుతారు (తె. 22).

**చేడుమొల** పర్యా. చూ. చేడుముల్లు (1). నేతనేసేటప్పుడు, గుడ్డను బిర్రుపెట్టటానికి; అంచుచివర గుచ్చే సన్నటి లోహపుముక్క; చివర వాడిగా ఉంటుంది; ఇత్తడి, ఇనుము, రాగి మొ. వాటితో చేస్తారు; కొన్ని చోట్ల, బలుసుముల్లు; దీన్ని చేడుపలుపులకు మెలిపెడతారు; కొన్నిచోట్ల, చేడుబద్దకు చివర బిగించింది; ఇటువంటివి రెండువైపులా ఉంటాయి. చూ. చిత్రం 125 క. 6 (తె. 19).

**చేడుసిలమలకతాడు** పర్యా. చూ. చేడుపలుపు(1). చేడుకర్రకు(కొన్నిచోట్ల, చేడుబద్దకు) చివర కట్టిన దారం; ఇటువంటివి, మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి, దీనికి మెలిపెడతారు. చూ.చిత్రం 125 క. 3 (తె. 19).

**చేతిఅద్దకం** బట్టమీద, కొయ్యఅచ్చులతో చేసే అద్దకం. చూ. చిత్రాలు 283 క-ద (కో. 7).

**చేతిఆసు** ఉ. సేతేసు; రూ. చేఆసు; పర్యా. చేతి అసుమాను, చేతిజంత్రం. చేత్తో పడుగునూలు పోసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రాలు 45-47 (కో. 7, 11, 12, 15-17, 19, 21, 23, 24, 26, 36; తె. 11; రా. 5).

**చేతిఆసుమాను** పర్యా. చూ. చేతిఆసు. చేత్తో పడుగునూలు పోసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రాలు 45-47 (రా. 4).

**చేతికుంచె** (-పెట్టు) రూ. చెయికుంచె. ఒకరకం కుంచె (=పడుగు దువ్వేది); సుమారు రెండు జానల పొడుగుంటుంది; సరిచేసేటప్పుడుగాని, పడుగేరే టప్పుడుగాని, పోగులు సాపుచెయ్యటానికి దీంతో దువ్వుతారు; సరిచేసే పడుగు అరుబదునులో ఉన్నప్పుడు, దీంతో పైన గంజి చిలకరిస్తారు; చూ. అలుకుకుంచె. చూ. చిత్రం 79 (కో. 2; తె. 4, 11, 14; రా. 4, 18, 24).

**చేతికొమ్ము** పర్యా. చూ. చేతినాడె. పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్యవేసే పేకదారంకండె అమర్చి చేత్తో విసిరేనాడె; గేదెకొమ్ముతో చేసింది. చూ. చిత్రం 131 చ (రా. 13, 16, 17, 24).

**చేతికొయ్య** ఉ:- గొయ్య, సేతి-; రూ. చెయి కొయ్య, చేగొయ్య; పర్యా. చూ. చేతిగూటం (1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతి వైపున నేలలో పాతిఉంటుంది. చూ. చిత్రాలు 108. క, 122, 127.16 (తె. 9, 12, 13, 18, 23).

**చేతిగుడ్డ** పర్యా. చూ. జేబురుమాలు. జేబులో పెట్టుకోటానికి నేసిన చిన్నగుడ్డ (రా. 2).

**చేతిగుండు** పర్యా. చూ. పలక(4). చేతిమగ్గం పన్నె బిగించిన పైచెక్క; పలచగా, పొడుగ్గా ఉంటుంది; దీనికి కింద గుండు బిగిస్తారు; దీనికి పైన దారాలు కట్టి వేలాడదీస్తారు; నేతనేసేటప్పుడు, పోగు దగ్గరపడటానికి, దీంతో అదుముతారు. చూ. చిత్రం 109 చ. 1 (రా. 1).

**చేతిగూటం** **1.** రూ. చెయిగూటం, చేగూటం; పర్యా. ఒలికొయ్య, కుడితినికొయ్య, కొయ్య (4), గసిగి, గుంజ (6), గూటం (3), చేగుంజ, చేతికొయ్య, చేమేకు, చేమేకులకొయ్య, తాడుకొయ్య (1), తాడు గుంజ, తాడుబట్టుకొయ్య, తాడుబిక్కొయ్య, తాడేను గర్ర, తిప్పుకొయ్య, నెలగొయ్య, పెద్దతాడు కొయ్య, బిగుగర్ర, బిగుగుంజ, బిగుగొయ్య, మల కొయ్య (1), మోకుగూటం, మోకు(డు)గుంజ, మోకుతిప్పుడుగుంజ, మోకుదిప్పు(డు) కొయ్య, మోకు దిబ్బకర్ర, మోకుపుల్ల, మోకుబిడికొయ్య. మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకుకట్టేకొయ్య; నేతపని

వాడికి కుడిచేతివైపు నేలలోపాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (తె. 1, 6, 7; రా. 14, 22-24); **2.** పర్యా. తాడుగూటం (2). గొంగడినేసే మగ్గం తాడు బిగింపుకు, పనివాడి కుడిచేతి దగ్గర, నేలలో పాతిన కొయ్య. చూ. చిత్రం 315.4 (తె. 7, 9, 11, 22, 26).

**చేతిజంత్రం** పర్యా. చూ. చేతిఆసు. చేత్తో పడుగు నూలు పోసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రాలు 45-47 (కో. 20).

**చేతిజముదాని** ఉ:-జందాని. ఒకరకం జముదాని నేత. అంచులకు డిజైన్లు పెట్టకుండా, మధ్యభాగంలో, చేత్తో పోగులు మలుపుతూ పువ్వులువెయ్యటం(కో.34).

**చేతినాడె** ఉ. సేతినాడె, సేయినాడి; రూ. చేతిలాడె; పర్యా. కొమ్ము (4), కొమ్మునాడె (2), చేతికొమ్ము, నాడెకొమ్ము(1), నేతకొమ్ము(2), బొక్కనాడె, సొరులాడె. పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్యవేసే పేకదారంకండె అమర్చి, చేత్తో విసిరేనాడె; గేదెకొమ్ముతో చేసింది. చూ. చిత్రం 131 చ. (కో. 7, 23, 30, 33; తె. 10, 11, 19, 25, 31).

**చేతిపట్టె** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్టంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 31).

**చేతిపంటె** ఉ. సేతిపంటె, సేతి పంటె; పర్యా. చూ. పంటె. చేత్తో నూలుచుట్టే పనిముట్టు. చూ. చిత్రం 19 (కో. 2; తె. 10-12, 17, 30-32; రా. 13, 24).

**చేతిపలక 1.** ఉ. సేతి-, -పల్క; రూ. చెయిపలక (1), చేపలక (2); పర్యా. చూ. పలక (4). చేతిమగ్గం పన్నె బిగించిన పైచెక్క; పలచగా, పొడుగ్గా ఉంటుంది; దీనికి కింద గుండు బిగిస్తారు; దీనికి పైన దారాలుకట్టి వేలాడదీస్తారు; నేతనేసేటప్పుడు; పోగు దగ్గర పడటానికి దీంతో అదుముతారు. చూ. చిత్రం 109 చ. 1 (కో.2 7, 23; తె. 11, 15, 28, 30; రా. 2, 4-7, 9, 11-13, 17, 19బి, 22-24); **2**- ఉ.-పల్క. నవారు నేసేటప్పుడు, పడుగులో వేసిన పేకపోగు దట్టించే కొయ్యచెక్క; ఒకరకం కత్తి (తె. 12).

**చేతిపిడి** పర్యా. చూ. కుంచెపిడి. పడుగుదువ్వే కుంచె పట్టుకోటానికి బిగించిన కొయ్య. చూ. చిత్రం 76 క. 1 (కో. 12).

**చే(తి)పీట** ఏకులు తాల్చే పీట; దీన్ని పట్టుకోటానికి పిడి ఉంటుంది; దీంతో ఏకుపుల్ల తిప్పుతారు. చూ. చిత్రం 11.2 (తె. 2, 28).

**చేతిపూత** నేతలో డిజైన్లు రావటానికి, చేత్తో ఒత్తులు మలుపుతూ నేసిన డిజైను (కో. 2).

**చేతిబొమ్మ** పర్యా. చూ. చెయ్యి (2). రాట్నం ఇరుసు తిప్పే (కొయ్య)పిడి. చూ. చిత్రం 69 (తె. 2; రా. 22).

**చేతిమగ్గం 1.** ఉ. సేతిమొగ్గం; రూ. చేమగ్గం; పర్యా. నాటుమగ్గం, పలకమగ్గం. పడుగులో పేక దారపు కండె బిగించిననాడె చేత్తో వేస్తూ నేసే మగ్గం; చాలాకాలంనుంచి వాడుకలో ఉన్నది; అంచుల్లో వేరువేరు రంగుపోగులు చేత్తో తిప్పుతూ నేసే నేతకు, పట్టునేతకు, డిజైన్ల నేతకు, బాగా అనువైనది; దీంతో పని నిదానంగా జరుగుతుంది. చూ. చిత్రాలు 109, 127 (కో. 2, 7, 11, 16, 17, 19, 30, 33, 36, 37; తె. 3, 10, 11, 15, 18, 20, 23, 25, 29, 31, 33; రా. 11, 13-17, 23, 24); **2.** జంపఖానా నేసే మగ్గం; మరమగ్గం మాదిరిది; దీనికి సొరుగులు, కుచ్చు మాత్రం ఉండవు. చూ. చిత్రం 323 (తె. 17).

**చేతిమొద్దు** జంపఖానా నేతకు వాడే నూలు చుట్టేటప్పుడు, పంటెముక్కు మోపటానికి పంగలకొయ్య బిగించిన మొద్దు; పంగలమొద్దు (తె. 17).

**చేతిరాట్నం** పర్యా. చూ. కండె(ల)రాట్నం. పేకకు పనికివచ్చే దారంకండెలు చుట్టే రాట్నం; మామూలు రాట్నం మీదనే కండెలు చుడతారు. చూ. చిత్రం 53 (తె. 3).

**చేతిలాడె** చూ. చేతినాడె (తె. 3).

**చేదస్తి** చేతిరుమాలు (తె. 2).

**చేనేత** చేత్తో నేసే నేత (తె. 31).

**చేందుకొను** (క్రి.) చేతికి తీసుకోటం (కో. 2).

**చేపలక 1.** ఉ. సేపలక; రూ. చెయిపలక(2); పర్యా. చూ. పలక(7). మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క; నేతనేసేటప్పుడు. పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (కో. 6; తె. 1); **2.** చూ. చేతిపలక(1). (కో. 5, 6, 8, 10; తె. 1, 2).

**చేమగ్గం** ఉ. సేమొగ్గం; చూ. చేతిమగ్గం(1). (కో. 1, 3-6, 8-10, 13-15, 20, 24; తె. 2, 7, 21).

**చేమేకు** రూ. చెయిమేకు; పర్యా. చూ. చేతిగూటం (1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపు నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 5, 10, 11, 13).

**చేమేకులకొయ్య** పర్యా. చేతిగూటం(1). మగ్గం మీద నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపని వాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 12).

**చేమొద్దు** రూ. చెయిముద్ద (తె. 27).

**చేయిరాటం** పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం. చూ. చిత్రం 41 (రా. 3).

**చేరాటం** నూలుతీసే రాట్నం; చూ. రాట్నం. చూ. చిత్రం 15 (కో. 13).

**చేరుకట్టె** చూ. చేడుకట్టె(1) (తె. 1, 2).

**చేరుకట్టెతాడు** పర్యా. చూ. బొద్దుతాడు. నేత ఒట్టమీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగు దారం; దీని కొసలు, చేడుబొందులు(కొన్నిచోట్ల, కర్రలు) రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (తె. 18).

**చైకిలేటు 1.** చేకలెట్, చైకిలెట్, చైకిలెటు, చైక్లెట్, చైక్లెటు, చైక్లైటు, శాక్లెట్, శాకిలేటే, శాకిలేటు. ఒకరకం (ముదురు) నలుపురంగు. చూ. చిత్రం 288 (కో. 2, 4, 6, 11, 14, 16, 19 21, 36; తె. 19, 24, 26, 31; రా. 7, 8, 24); **2.** వక్కరంగు. చూ. చిత్రం 288 (కో. 7); **3.** ముదురు పోకరంగు (తె.27); **4.** నాచువన్నెమాదిరి రంగు (కో. 18); **5.** నలుపులో ఎరుపువన్నె (కో. 8; తె. 13).

**చైకు** పర్యా. చూ. కత్తి. చెక్కే పనిముట్టు; పన్నెపుల్లలు (ఈనెలు) చెక్కే ఒకరకం కత్తి. చూ. చిత్రాలు 89 క. 1, 89 చ. 1 (తె. 1).

**చైంచె** పర్యా. చూ. అచ్చుబిళ్ళ. అచ్చుకట్టేటప్పుడు, వడిదారం చుట్టేకొయ్య; దీనికి చుట్టిన వడిదారం అచ్చుకర్రకు దూరుస్తారు; అచ్చుగట్టే సాయేబులవాడుక. చూ. చిత్రం 92 క, చ (తె. 4).

**చైపఅడుగులు** అంచులోనేసే ఒకరకం డిజైను (తె. 10).

**చైపకన్నునేత** బట్ట అంచులోగాని, కమ్మిలోగాని చేపమాదిరి నమూనాలు పడేటట్టు నేసిననేత (తె. 1).

**చైపదవడ** ఉ. పర్యా. ముల్లు(1), వాలుగదవడ. పత్తినించి గింజ వేరుచేసే పనిముట్టు;కొన్నిచోట్ల, దీంతో పత్తినితోమి శుభ్రంచేస్తారు. చూ.చిత్రం 6.1(కో.33).

**చైపపొట్టు** ఉ. చైప్పొట్టు. అభ్రకంమాదిరి ఒకరకం రంగు (తె. 15).

**చైపరెక్క(లు)** దుప్పటిఅంచులో, తంగెడకాయ నమూనాలో, చిక్కగా నేసిన డిజైను (కో. 4).

**చైప(ల)ంచు** చిటుకునేతలో, చైపఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు (తె. 11).

**చైప్పి** (-ఇచ్చు, -చేయు) పట్టుదారాన్ని, పసుపు నీళ్ళలోనూ, పటికనీళ్ళలోనూ నానబెట్టటం; కొంచెం పసుపువన్నె వస్తుంది (రా. 14).

**చైమంతికోక** ఒకరకం పసుప్పచ్చ (చైమంతిపువ్వు) రంగుచీర (కో. 32).

**చైమంతిచీర** ఒకరకం పసుప్పచ్చ (చైమంతిపువ్వు) రంగుచీర (కో. 26, 31; రా. 20).

**చైమంతిపువ్వంచు** ఉ. చామంచి-, సేమంతి-, సేవంచి. చైమంతిపువ్వు నమూనాలు పడేట్టు నేసిన అంచు (కో. 14; తె. 1, 2, 5, 7, 14-16).

**చైమంతిపువ్వుజోగడా(లు)** అంచులో, రెండేసి చైమంతిపువ్వులు (జోడా) కలిసిపడేట్టు నేసిన డిజైను (తె. 16).

**చైమంతిపువ్వుపేటు** పర్యా. చైమంతిపువ్వుపేలు. అంచులో,చైమంతిపువ్వుఆకారంలో నేసినడిజైను(రా.7).

**చైమంతిపువ్వుపేలు** ఉ. సేమంతి-; పర్యా. చైమంతిపువ్వుపేటు. అంచులో చైమంతిపువ్వు ఆకారంలో నేసిన డిజైను (రా. 15).

**చైమంతిపువ్వు(రంగు)** ఉ. చైవంచి-, శామంతి-. పసుప్పచ్చరంగు. చూ. చిత్రం 288 (కో. 8, 9, 19, 21-24, 26, 31, 32, 35; రా. 20).

**చైమంతిపూతీగెబుగిడి** అంచులో చైమంతిపువ్వు, తీగ, బుగిడి వరసగా పడేట్టు నేసిన డిజైను (తె. 25).

**చైమంతిపొప్పళి** పడుగులోను, పేకలోను రెండురంగు పోగులమధ్య మూడోరంగు పోగు, సన్నగీరపెట్టి నేసిన చీర (రా. 14).

**చైమంతివంకిపేటు** అంచులోనేసే ఒకరకం డిజైను (తె. 2).

**చొక్కాసం** చూ. దొగ్గసం (కో. 33).

**చౌకంగడిచీర** రూ. సవకాలగడిచీర; పర్యా. చూ. చౌకిడీచీర. ఒకరకం గళ్ళచీర; నేతలో, పొడుగు వెడల్పులు, గళ్ళుసమానంగా వచ్చేట్టు నేస్తారు(కో.16).

**చౌకడిరిబ్బనంచు** చిన్న, నల్పుదరంగళ్ళు పడేట్టు నేసిన రిబ్బనుమాదిరి అంచు (తె. 2).

**చౌకాని(చీర)** పర్యా. చూ. చౌకిడీచీర. ఒకరకం గళ్ళచీర. నేతలో, పొడుగువెడల్పులు, గళ్ళు సమానంగా వచ్చేట్టు నేస్తారు (తె. 5).

**చౌకిడీ** ఉ. చౌకిటి, చౌకిడి; రూ. చౌకిళీ. పొడుగు, వెడల్పు సమానంగా నేసిన గడి (తె. 6, 8, 10, 21, 25, 28; రా. 11, 13, 14, 23).

**చౌకిడీచీర** ఉ. చౌకిటి-, చౌకిడి-; పర్యా. చౌకంగడిచీర, చౌకానిచీర. ఒకరకంగళ్ళచీర; నేతలో, పొడుగు వెడల్పులు, గళ్ళు సమానంగా వచ్చేట్టు నేస్తారు (తె. 6, 21; రా. 11, 13, 14, 23).

**చౌకిడీతీగె** నేతలో, గళ్ళు, తీగలు పడేట్టు నేసిన డిజైను (తె. 25).

**చౌకిడీతీగెబుగిడి** అంచులో చిన్నగడి, తీగ, బుగిడి వరసగా పడేట్టు నేసిన డిజైను (తె. 25).

**చౌకిడీరుమాలు** ఒకరకం తలపాగ; రంగుగుడ్డలో తెల్లచౌకిడీ (నల్చదరపుగడి)లు గాని, తెల్లగుడ్డలో రంగు చౌకిడీలుగాని పడేట్టు నేస్తారు (తె. 23).

**చౌకిళీ** చూ. చౌకిడీ (రా. 15).

**చౌడమ్మ** ఉ. సౌడమ్మ; పర్యా. చూ. చౌడీశ్వరి. చేనేతపని చేసే దేవాంగులు, తొగటబలిజెలు, మొ.వారు కొలిచే దేవత; మామూలుగా ఆషాఢమాసంలో అమావాస్యనాడు చౌడీశ్వరిని కొలుస్తారు (కో. 4, 9; రా. 12).

**చౌడీశ్వరి** పర్యా. చాముండీశ్వరి, చౌడమ్మ, జోతి బాణందేవర. చేనేతపని చేసే దేవాంగులు, తొగటబలిజెలు మొ.వారు కొలిచే దేవత; మామూలుగా ఆషాఢ మాసంలో అమావాస్యనాడు చౌడీశ్వరిని కొలుస్తారు (కో. 1, 4, 23, 25, 26; తె. 24; రా. 4-6, 11, 17, 19).

**చౌడీశ్వరిపండుగ** ఆషాఢమాసంలో, అమావాస్య నాడు (కొన్నిచోట్ల, ఉగాదినాడు) చౌడీశ్వరిని కొలిచే పండుగ; దేవాంగులు, తొగటబలిజెలు మొ.వారు చేసు కొంటారు (కో. 23, 25, 26; తె. 24; రా. 17).

**చౌడు** ఉ. సౌడు. నూలును చలవచెయ్యటానికి, సున్నంతోబాటు ఉడకబెట్టే ఒక పదార్థం (కో. 3, 8; రా. 6, 15).

**చౌప్పాపని** బట్టమీద, కొయ్యఅచ్చులతో చేసే అద్దకంపని (కో. 12).

**చౌప్పుతడుపు** (క్రి.) ఉ. సొప్పు-, -దడుపు. గుడ్డ పిడచతో, పడుగుకు గంజిపట్టించటం; పోగు బిరుసెక్కటానికి గంజి పట్టిస్తారు; కొన్నిచోట్ల, అంబలి పెడతారు (కో. 12, 34).

**చౌప్పుదుంగ** ఉ. సొప్పు-. గంజిపెట్టటానికి, చుట్టిన పడుగు వేసుకొనే కొయ్య; ఇటువంటివి రెండుంటాయి (కో. 12).

**చోడిఅంబలి** ఉ. సోడంబలి. చోడిపిండితో కాచిన గంజి; దీన్ని పడుగుకు పెడతారు (కో. 31, 37).

**చోళీగుడ్డ** పర్యా. చూ. రైకగుడ్డ. ఆడవాళ్ళ రవికెల కోసం నేసినబట్ట; కొన్నిచోట్ల, డిజైన్లుపెట్టి నేస్తారు (రా. 14).

## ఛ

**ఛమ్రేకాహునర్** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 17).

**ఛురీ 1.** పర్యా. చూ. కత్తి(1); చెక్కే పనిముట్టు; పన్నెపుల్ల(ఈనె)లు చెక్కే ఒకరకం చిన్నకత్తి. చూ. చిత్రాలు 89 క. 1, 89 చ. 1 (కో. 7; రా. 24); **2.** పర్యా. చూ. గీరుకత్తి. పన్నెదండెలమధ్య బిగించే ఈనెలు చీల్చి సాపుచేసే రేకుకత్తి; ఒకవైపున వంపుగా గాడి ఉంటుంది; మామూలుగా, ఒక వెదురుబొంగును సగానికిచీల్చి మధ్యగా కత్తి ఇరికిస్తారు; కొన్నిచోట్ల, ఒకగుంజకు కోటాబద్దకట్టి, రెంటికీ మధ్య కత్తి దూరుస్తారు. చూ. చిత్రం 89 క. 6 (కో. 5).

**ఛడి** ఉ. ఛడీ, సెడి. **1.** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల, రాటికట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 12); **2.** పర్యా. చూ. పంజెకామ. పంజె మధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువుకర్ర. చూ. చిత్రం 19 క. 1 (తె. 5); **3.** (-కుచ్చు) రంగునీళ్ళ అండాలో ఉడకబెట్టటానికి, నూలు లడీలు తగిలించిన ఇనపఊచ; దీన్ని పట్టుకోటానికి వీలుగా రెండువైపులా వంపులుగా ఉంటాయి; దీంతో లడీలు రంగునీళ్ళలోకి దించి అండా అంచులమీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (తె. 5, 12-14); **4.** తివాసీ నేసేటప్పుడు, పైదోనెకు ఇవతల పడుగు అనిలో దూర్చిన చువ్వ; అని పడటానికి పేకమధ్యగా ఉండే వెదురుబద్ద; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 320.13 (కో. 16; తె. 16, 17).

**ఛద్దర్** ఉ. చెద్దర్. పక్కమీద పరుచుకొనే ఒకరకం దుప్పటి; ఎమ్మిగనూరులోను, షోలాపూరులోను నేసే రకం (తె. 8, 26).

## జ

**జంగ 1.** పర్యా. చూ. నిలువు(1). పత్తిరాట్నం అడ్డపీటకు దిగ్గొట్టినకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 1.3 (కో. 10); **2.** ఉ. జెంగ; పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువు కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (తె. 10); **3.** రూ. జంగతి(1); పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 17, 20, 21-33); **4.** నార వడికేటప్పుడు, కదురుపైకొన (=పాత్రెం) మోపటానికి తొడుకు చుట్టు కొనే ఇనపరేకుడొక్కు; దీన్నితాళ్ళతో కట్టుకొంటారు.

చూ. చిత్రం 301(తె. 25); **5.** పర్యా. చూ. తొక్కుడుపీట(2). జబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (తె. 21); **6.** పర్యా. చూ. నిలువు(6). జబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువు కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 2 (తె. 10); **7.** పర్యా. చూ బెజ్జంకట్టె. రాటి సూలం గూర్చిన కట్టె; పైనగాని, కిందగాని ఉంటుంది. చూ. చిత్రం 31 వ. 3 (తె. 24, 33).

**జంగతి 1.** చూ. జంగ(3) (తె. 31); **2.** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె; ఇవి, ఒకటినుంచి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (తె. 31).

**జంగపీట** కిసాన్‌రాట్నం కిందిపట్టె. చూ. చిత్రం 16 (తె. 28).

**జంగమొద్దు** ఒకరకం అనుజంగకు చివర బిగించిన కొయ్యమొద్దు; పడుగు మలుపుతిరగటానికి దీనికి నిలువు పుల్లలు బిగించి ఉంటారు (తె. 22).

**జంగంసేర్లు 1.** డాబీమగ్గంలో, పక్కలనుంచి, అంచుపోగుల్లోకి వేలాడే లావుదారాలు; పేటుదారాలు; నేత నేసేటప్పుడు, వీటికి కట్టిన వళ్ళు, అంచుపోగులను పైకి లేపుతాయి చూ. చిత్రం 132 చ. 10 (కో. 36); **2.** పర్యా. దొడ్డితాళ్ళు. పజానేతకోసం అమర్చిన దొడ్డిలో, నడిమిజల్లినుంచి ఏటవాలుగా గాని, పక్కజల్లినుంచి నిటారుగాగాని వేలాడే లావుదారాలు. చూ. చిత్రాలు 134 క. 3, 134.11 (కో. 37).

**జంజెరం** మెళ్ళో వేసుకొనే జంధ్యం; చేనేతపనివాళ్ళలో, పద్మసాలీలు వేసుకొంటారు (తె. 29, 33).

**జంజెరాలపున్నమ** చూ. జంధ్యాలపౌర్ణమి (తె. 33).

**జంజేలపున్నమ** ఉ. జంజెల-, -పున్నం; చూ. జంధ్యాలపౌర్ణమి (కో. 23, 36; తె. 18, 24, 31, 32).

**జంటకడ్డీఅంచు** జల్లజరీ గీరలు జంటగాపడేట్టు నేసిన అంచు (కో. 2).

**జంటచేపలు** అంచులో, రెండేసిచేపలు వరసగా పడేట్టు నేసిన డిజైను (తె. 10).

**జంటచ్చుమగ్గం** (< జంట + అచ్చు-) రెండు అచ్చులు అమర్చిన మగ్గం; ఒక అచ్చు సాదా నేతకు, మరొక అచ్చు డిజైన్లు నెయ్యటానికి అమరుస్తారు (తె. 22).

**జంటనాడెనేత** రెండు నాడెలతో నేసిన నేత; నిలువు అడ్డం రెండేసి రంగులు పెట్టి నేసింది (తె. 22).

**జంటపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 22).

**జండ్లపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను (రా. 6).

**జత** పర్యా. చూ. చావు(5). మగవాళ్ళు కట్టుకొనే రెండుపంచెల నేతబట్ట; బద్దెలో కలిసిఉన్నది (కో. 8; రా. 18).

**జతిగె** పర్యా. చూ. పొట్టె(7). పడుగునూలులో చివర పాయగా విడదీసిన పోగులు; అల్లుచేనేటప్పుడు పడుగును పాయలుగా విడదీస్తారు; మగ్గంమీద వీటికి ముడులు వేస్తారు; కొన్నిచోట్ల, కర్రలకు చుడతారు. చూ. చిత్రం 127.7 (రా. 15).

**జతిగెదారం** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరిపాయకు కట్టిన దారం; పొట్టెకొక దారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రం 127.8 (రా. 15).

**జనకజనకగడి** ఒకరకం నేతగడి (కో. 20).

**జనక్‌జనక్‌పేటంచు** ఒకరకం డిజైనులో నేసిన అంచు; "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" సినిమాపేరు మీద ప్రచారంలోకి వచ్చింది (రా. 1).

**జనపతట్టు** జనపనారపట్టాతో కుట్టిన కుంచెచెంప (తె. 28).

**జనపనార** జనుముమొక్కల ముదురుకాడలను ఊరేసి ఒలిచిన చెర్మం లోపలిదారాలు; గోనెసంచులు, కుర్చీగుడ్డలు మొ.వి నెయ్యటానికి వాడతారు (కో. 11-15, 17, 19-21; రా. 21).

**జనపపట్టా** జనపనారతో నేసిన గుడ్డ(పట్టా); దీంతో కుంచెచెంపలు కడతారు (తె. 26).

**జనుముపండుగ** ఉ. జనుం-. జనపచేను పూతబట్టినప్పుడు, నారతీసేవాళ్ళు చేసుకొనే పండుగ; మూడు కుండలు చేనుకు తీసుకుపోయి, సీతారామలక్ష్మణుల పేర వాటికి సున్నం పూసి కండ్లు, ముక్కు, చెవులు పెట్టి, గుగ్గిలం ధూపంవేసి, టెంకాయకొట్టి మొక్కుకొంటారు (తె. 25).

**జంతనం** చూ. జంత్రం(పీట) (రా. 22).

**జంతర** చూ. జంత్రం(4) (తె. 10, 20).

**జంతరబొమ్మ** రూ. దంతెరబొమ్మ; పర్యా. చూ. బొమ్మ(17). గొంగడిమగ్గం జంత్రంలో కిందికట్టెను, పైకట్టెను కలిపే నగిషీచెక్క; ఇటువంటివి మూడుంటాయి. చూ. చిత్రం 316.2 (తె. 10).

**జంత్రపుగుది** పర్యా. గుది(4), జంత్రపుతాడు, బిగుతాడు(2), అచ్చుకట్టెజంత్రం కొయ్యకు కట్టిన దారం; దీంతో అచ్చుచువ్వ బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 5 (కో. 35, 37).

**జంత్రపుగూటం** పర్యా. చూ. కొయ్య(5). అచ్చుకట్టెజంత్రం కిందిపీటకుగాని నిలువుకమ్మికిగాని బిగించిన నిలువుపుల్ల; సుమారు జానెడు పొడుగుది; మామూలుగా

పెద్దపీటకు రెండు, నిలువుకమ్మికి (కొన్నిచోట్ల, చిన్న పీటకు)ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 91 క. 3 (తె.10).

**జంత్రపుతాడు** పర్యా. చూ. జంత్రపుగుది. అచ్చు కట్టేజంత్రం కొయ్యకు కట్టిన దారం. దీంతో అచ్చుచువ్వ బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 5 (తె. 10).

**జంత్రపువిళ్ళ** ఉ. జంత్రబిల్ల; పర్యా. చూ. అచ్చువిళ్ళు. అచ్చుకట్టేటప్పుడు వడిదారం చుట్టినకొయ్య; దీనికి చుట్టిన వడిదారం, అచ్చుకర్రకు దూరుస్తారు. చూ. చిత్రం 92 క, చ (తె. 16).

**జంత్రం 1.** పర్యా. చూ. మరాను. పెద్దపడుగులు ఒకేసారి పోసే ఒకరకం అను; ఒక గోతిలో పెద్దచక్రం అమర్చి, దాన్ని తిప్పుతూ పడుగు పోస్తారు; 12-24 పడుగుల వరకూ ఒకేసారి దీనిమీదికి తోడవచ్చు. చూ. చిత్రం 50 (కో. 15, 17, 20); **2.** పర్యా. డాంగ్ (2). పన్నె(=దువ్వెనపండ్ల మాదిరిగా వరసగా పుల్లలు బిగించింది) తయారుచేసే కొయ్యపనిముట్టు; పొడుగాటి వెదురుబొంగుకు, రెండు నిలువుకొయ్యలు బిగించింది. చూ. చిత్రం 88 (కో. 1, 7; రా. 24); **3.** చుక్క(=చిటికె) కట్టటానికి, నూలుబొందులు తగిలించే ఒక రకం కొయ్యపనిముట్టు; చూ. చిటికెపీట. చూ. చిత్రం 285, 286 ట (కో. 7); **4.** రూ. జంతర, దంతెర, దంత్రం(2). గొంగడి నేసేటప్పుడు అని తెరవటానికి (పడుగులో పై పోగులను, కిందిపోగులను విడదియ్యటానికి) అచ్చుగోలకు కట్టిన కొయ్యపనిముట్టు. చూ. చిత్రాల 315.9, 316 (తె. 6, 7, 22).

**జంత్రంకర్ర** పర్యా. బొంగు(1). పన్నె తయారుచేసే జంత్రంలో నిలువుకొయ్యలు బిగించిన వెదురు బొంగు. చూ. చిత్రం 88 క. 1 (కో. 1).

**జంత్రంకొయ్య** రూ. దంతనంకొయ్య; పర్యా. చూ. కొయ్య(5). అచ్చుకట్టే జంత్రం కిందిపీటకుగాని, నిలువుకమ్మికిగాని బిగించిన నిలువుపుల్ల; సుమారు జేనెడు పొడుగుది; మామూలుగా, పెద్దపీటకు రెండు, నిలువుకమ్మికి–కొన్నిచోట్ల చిన్నపీటకు–ఒకటిఉంటాయి. చూ. చిత్రం 91 క. 8 (కో. 35).

**జంత్రంతాడు** పర్యా. జోతా, డోరీ. పన్నెకట్టే జంత్రంబొమ్మ దండెలు బిగించికట్టిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 4 (కో.1).

**జంత్రందండె** పర్యా. అడ్డకమ్మి(6) అడ్డజంగ(2), అడ్డపట్టె(13), అడ్డపీట(8), అడ్డబల్ల(6), దంత్రంబల్ల, నిడిదండె. అచ్చుకట్టే జంత్రానికి, నిలువుపుల్లలు బిగించిన కిందిపీట; కొన్నిచోట్ల, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 91 క. 1 (కో. 35).

**జంత్రందిండు** రూ. దంతెర(దిండు), దంత్రందిండు; పర్యా. పలక(10), మెట్టు(2). గొంగడినేసే మగ్గం జంత్రానికి, కింద బిగించిన కొయ్యబెక్క. చూ. చిత్రం 316.1 (తె. 22).

**జంత్రం(పీట)** ఉ. జెంత్రం; రూ. జంతనం, జెంతర్, దంతనం(1), దంత్రం(3); పర్యా. అచ్చుకట్టె(2), బెంతుమాను(1). అచ్చువడి కట్టటానికి కర్రలు బిగించే కొయ్యపనిముట్టు; రెండు అడ్డపట్టెలను, మధ్య నిలువుపట్టెకు బిగించింది; అచ్చుకట్టేటప్పుడు అడ్డపట్టెకొయ్యలకు అచ్చుకర్రలు కడతారు. చూ. చిత్రం 91 (కో. 3, 6, 8, 14-17, 20, 22, 26, 33, 35, 37; తె. 5, 10, 12, 16; రా. 24).

**జంత్రంవారు** ఉ. -ఓరు; పర్యా. ములుగు(లు). గొంగడినేసే మగ్గం జంత్రాన్ని, అచ్చుకోలను కలిపే సరం; జంత్రం నాగవాసానికి మెలిపెట్టి కట్టింది. చూ. చిత్రం 315 క. 10 (తె. 6, 7).

**జందాలపండుగ** పర్యా. చూ. నూలుపున్నమ. శ్రావణపూర్ణిమ; నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ; కొత్త జంధ్యాలు వేసుకొంటారు; రాఖిలు కట్టుకొంటారు; చౌడేశ్వరికి జ్యోతిఉత్సవం చేస్తారు; అగ్నిగుండంలో నడవటం, గంగపూజ చెయ్యటం, ఆనందంవేయటం మొ.వి చేస్తారు (తె. 1).

**జందెం** పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీఅడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసినదారం; డిజైనుకు అవసరమయినన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (తె. 13).

**జందెంతాడు** మరమగ్గం కుచ్చునుంచి చెంపతాడు వరకూ కట్టినదారం. చూ. చిత్రం118 చ. 2.(రా.17). (రా. 10).

**జంద్రేలపౌర్ణమి** చూ. జంధ్యాలపౌర్ణమి (రా.10).

**జంధ్యాలపున్నమ** చూ. జంధ్యాలపౌర్ణమి(కో.34).

**జంధ్యాలపౌర్ణమి** రూ. జంజెరాలపున్నమ, జంద్రేల పున్నమ, జంద్రేలపౌర్ణమి, జంధ్యాల పున్నమ; పర్యా. చూ. నూలుపున్నమ. శ్రావణపూర్ణిమ; నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ; కొత్తజంధ్యాలు వేసుకొంటారు; రాఖిలు కట్టుకొంటారు; చౌడేశ్వరికి జ్యోతి ఉత్సవం చేస్తారు; అగ్నిగుండంలో నడవటం, గంగపూజ చెయ్యటం, ఆనందంవెయ్యటం మొ.వి చేస్తారు(రా. 8).

**జన్నామగ్గం** పర్యా. చూ. మరమగ్గం. ఒకరకం మగ్గం; నేత నేసేటప్పుడు, పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజేది; మగ్గం పలక, పన్నె ఒక కొయ్యచట్రంలో బిగించి పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు. చూ. చిత్రం108

**జపానుసిల్కు-** ఒకరకం కృత్రిమపు పట్టు(కో.23).

**జబ్బ** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118. 1 (కో.25, 35).

**జబ్బురినూలు** (< జబ్బు + పురి-) చూ. సన్నపురి నూలు (రా. 12).

**జమలు 1.** (బహు. జమళ్ళు) చూ. జమిలి (నూలు) (తె. 21, 26); **2.** చూ. జమిలి (తె. 26); **3.** నాలుగు నారపోగులు (తె. 25).

**జమళ్ళఊంచ** ఉ.- ఊసె. దనలిదారం వడికేటప్పుడు, పెద్దకండె చుట్టటానికి రాట్నం కదురుకు పెట్టే చొప్ప పుల్ల; రెండేసి పోగులు కలిపి పురిపెట్టి చుట్టేది(తె. 7).

**జమళ్ళఊడితె** దనలి(పట్టు)పడుగు సరిచెయ్యటానికి, ఆరుబయట నిలబెట్టిన కొయ్యపనిముట్టు; చూ. ఊడ్తె. చూ. చిత్రం 297. 1 (తె. 7)

**జమళ్ళకండె** రెండేసి పోగులు కలిపి (జమిలి)చుట్టిన పేకదారం; నేతలో అడ్డానికి వాడతారు (తె. 7).

**జమళ్ళతాడు** దనలి(పట్టు)పడుగు సరిచెయ్యటానికి నిలబెట్టే ఊడ్తెదగ్గర బొంగును, సర్వటి గుంజల అడ్డకట్టెను కలిపినతాడు; ఆరుగజాల పొడుగు ఉంటుంది. చూ. చిత్రం 297. 9 (తె. 7)

**జమళ్ళపొగడ** రెండేసి పోగులు కలిపి అచ్చతికే పట్టుపడుగు (తె. 7).

**జమళ్ళబొంగు** దనలి (పట్టు) పడుగు సరిచెయ్యటానికి, పడుగు కొనలో దూర్చే కర్ర; ఊడ్తె అడ్డపట్టె గుదులు దీనికి తగిలిస్తారు. చూ. చిత్రం 297. 2. (తె. 7).

**జమిడి** చూ. జమిలి (రా. 6, 11).

**జమిలి** ఉ. జములు; రూ. జమలు(2), జమిడి: పర్యా. గింటం. రెండుపోగులు పురిపెట్టిన దారం; జమిలిదారం (కో. 6; రా. 18).

**జమిలిదుప్పటి** ఉ.- దుప్పటి, జముల్దుప్పటి;పర్యా. చూ. సుదినీ. నేతలో, నిలువుకు, అడ్డానికి రెండేసిపోగుల చొప్పునపెట్టి నేసిన దుప్పటి; కొన్నిచోట్ల, గళ్ళు గళ్ళుగా నేస్తారు (కో. 8, 14, 23; తె. 24).

**జమిలిధోతి** ఉ. జమిల్దోతి. రెండేసిపోగులు (=జమిలి పోగులు)పెట్టి నేసినపంచె (తె. 24).

**జమిలి(నూలు)** రూ. జమలు (1); పర్యా. గింటం నూలు, గుండు నూలు, డబల్ సాటు, రెండుపోగులు కలిపి పురిపెట్టిన నూలు (తె. 2, 28, 29, 33).

**జమిలికటారి** రెండు అంచులున్న లాహిరీ. చూ. చిత్రం 189 (తె. 24).

**జముఖానా** లావుపాటి నూలు (6-10 నెంబరు)తో నేసిన ఒకరకం దుప్పటి; కింద పరచుకొనేది; జంపఖానా (తె. 1).

**జముదాని(నేత)**ఉ. జముదాన్-. ఒకరకం డిజైను నేత; రెండు అంచులకు మధ్యభాగంలో డిజైన్లు-బుటాలు-నేసింది; చూ. బుటానేత. చూ. చిత్రం 113 (కో. 33, 36).

**జముదానిపుల్ల** ఉ. జముదాన్-. జముదానినేతలో, డిజైన్లు (బుటాలు) వెయ్యటానికి వాడే రంగుదారాలు చుట్టిన చిన్నపుల్ల; కొన్నిచోట్ల, గుడ్డముక్కలకు చుడతారు. చూ. చిత్రం 113 ట. 1 (కో. 33).

**జమున** ఒకరకం గోధుమరంగు (రా. 8)

**జములతుకు** (క్రి.) పర్యా. గింటంఅతుకు. సరిచేసిన పడుగులో, రెండేసి పోగులు ఒక బద్దెపోగుకు కలిపి అచ్చుకకటం; కొన్నిచోట్ల, మగ్గంమీద అతుకుతారు (కో. 7, 8; తె. 8).

**జములుకుంచె** (-వేయు) ఉ.- కుంచి. సరిచేసేటప్పుడు, పడుగు ఆసుబద్దలలో ఉండగా సందు (=రెండు కచ్చుల మధ్యభాగం) సందుకూ అపుతూ దువ్వే కుంచె; పడుగు బాగా ఆరేవరకూ రెండేసిసార్లు ఇలా నిదానంగా దువ్వుతారు; కొన్నిచోట్ల సన్నపడుగులు ఇలా దువ్వుతారు (కో. 5, 7, 8, 10).

**జములునేత** ఉ. జముల్నేత. నిలువు, అడ్డం రెండేసి పోగుల చొప్పున పెట్టిన నేసిన నేత; మామూలుగా, ముతకదుప్పట్లు, చొక్కాగుడ్డలు ఇలా నేస్తారు (కో. 11, 12).

**జములుపోగు** రెండు పోగులు కలిపి ఒకటిగా పురిపెట్టిన పోగు (కో. 21).

**జముళ్ళపడుగు** రెండు పోగులు కలిపి పురిపెట్టిన పడుగుదారం; అంచులకు వాడతారు.

**జముళ్ళు 1.** రెండేసిపోగులు కలిపి పురిపెట్టిన నూలు (కో. 12, 20); **2.** (ఏ. వ. జమిలి, జముడు); పర్యా. చూ. కడజముళ్ళు. అంచులో చిట్టచివరిపైపు నేతకు వాడే జమిలి పోగులు; అంచు గట్టిదనంకోసం, రెండు మూడు పోగులు కలిపి పురిపెట్టి వాడతారు (కో. 2; రా. 13, 14, 24).

**జంపు 1.** (-ఇచ్చు) దూది ఏకేటప్పుడు కమాను నరం కిందికీ పైకీ ఊగిసలాడటం (కో. 11, 13). **2.** నేతలో నిలువు; పొడుగు.

**జంబువిళ్ళ** పెద్ద అచ్చువిళ్ళ; దీంతో అచ్చు కడితే. వడి పొడుగ్గా వస్తుంది; చూ. అచ్చువిళ్ళ (రా. 20).

**జరీ** పర్యా. కళావతు, జల్తారు, సరిగ. బట్ట అంచులకుగాని, డిజైన్లకోసంగాని నేతలో వాడే సన్నటి

మెరుపుదారం; బంగారం, రాగి, వెండి మొ. వాటితో తయారుచేస్తారు (కో. 2, 5, 12-15, 19, 23, 26, 33, 36; తె. 2, 8; రా. 14, 15).

**జరీకట్లచీర** ఒకరకం డిజైనులో జరీపెట్టి నేసిన చీర (తె. 2).

**జరీకమ్మి** జరీపోగులుపెట్టి పట్టెలుగాని, డిజైన్లుగాని పడేట్టు నేసినకమ్మి (కో. 12-15).

**జరీకోణతలి** ఒకరకం రాటి; దీనికి జరీవేసి తోడతారు; చూ. రాటి. చూ. చిత్రం 33 (కో. 37).

**జరీగట్టికమ్మి** జరీపెట్టి-, పోగులు చిక్కగా నేసిన కమ్మి (కో. 5).

**జరీచాపు** జరీపెట్టి నేసిన రెండు పంచెలు; చాపు (కో. 19).

**జరీపూలచీర** జరీపోగులతో, పువ్వుల డిజైన్లు పెట్టి నేసినచీర (తె. 2).

**జరీపేటంచు** ఉ. జరీపేటి-. జరీతో డిజైను నేసిన అంచు (రా. 16).

**జరీపేటు** అంచులో జరీపోగులతో నేసిన డిజైను (తె. 5).

**జరీరాజమూలపేటు** ఉ.-పేటి. జరీపెట్టి, అంచులో నేసిన ఒకరకం డిజైను (తె. 2).

**జరీలాక** **1.** రెండుకోలకుల జరీపోగులు; zari liver (కో. 2); **2.** ఎనిమిదిపోగుల జరీ; పొడుగు 24 గజాలు ఉంటుంది (కో. 2).

**జరీలాడె** ఉ. జరి-. చీరకొంగులో, జరీపెట్టి కమ్మి నెయ్యటానికి ఉపయోగించే నాడె; చూ. నాడె(తె. 2).

**జరుగు(డు)చెక్క** పర్యా. జారుపీట. పెడకోలను మోసే కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి; నేతమోకు వదులుచేసినప్పుడు, పడుగునేలకు తగలకుండా పెడకోలను జరుపుతుంది. చూ. చిత్రం 130 (కో. 3; రా. 7).

**జర్మన్‌ముద్దరంగు** ఒకరకం ఎరుపు (తొగరు)రంగు; అలిజర్; సుమారు ఏభై ఏళ్ళకుపూర్వం, జెర్మనీ నించి పిపాల్లో వస్తూండేదట (తె. 17).

**జల్తారు** పర్యా. చూ. జరీ. బట్ట అంచులకుగాని, కమ్మిలకుగాని డిజైన్లకోసంగాని పెట్టే సన్నటి మెరుపుదారం; బంగారం, రాగి, వెండి మొ. వాటితో తయారుచేస్తారు. (కో. 23, 24; తె. 8, 16; రా. 24).

**జల్తారుకడ్డీఅంచు** అంచు చివర తెలుపుపెట్టి, 15-20 కొలుకులు జరీపోగులుపెట్టి నేసిన ఒకరకం అంచు (కో. 3).

**జల్తారుకమ్మి** జరీపెట్టి నేసిన కమ్మి (కో. 24).

**జల్తారుచీర** జరీ ఎక్కువపెట్టి నేసిన చీర; గర్భాధానంనాడు పిల్లకు పెడతారు (తె. 16).

**జల్తారుపెట్టె** జరీదారం చుట్టే పనిముట్టు. చూ. చిత్రం 294 త (రా. 14).

**జల్తారుపేటు** జరీపెట్టి నేసిన డిజైను (రా. 10).

**జల్తారురుమాలు** ఉ. జల్తారువమాలు. అంచుల్లోను, కమ్ముల్లోను జరీపోగులుపెట్టి నేసిన తలపాగ (తె. 8; రా. 24).

**జల్తారులడీ** ఉ.- లడి. జరీచుట్ట; చూ. లడీ(రా.23).

**జల్లితడక** ఉ. జల్తడక. నేతనేసేటప్పుడు నాడె మగ్గంగుంటలో పడకుండా గుంటమీద పెట్టే వెదురు చాప (తె. 18, 20, 32).

**జల్లెడ** **1.** ఏకేటప్పుడు దూదికింద పెట్టే జల్లెడ. చూ. చిత్రం 10ట. 3 (తె. 2); **2.** ఉ. జల్లి, జల్లిడి; పర్యా. పక్కపన్నె. పేటుపన్నెలో రెండుపాయలుగా విడదీసిన దారాలను అంచుపడుగులోకి వేలాడదియ్యటానికి, పక్కగా అమర్చిన చిన్నపన్నె; కొన్నిచోట్ల, జాకార్డు డాబీ అమర్చిన మగ్గంది. చూ. చిత్రం 132 చ. 9 (కో. 23, 24, 33).

**జల్లెడకన్ను** (-పను). పలచగా నేసిన బట్టలో, పోగులమధ్య వచ్చిన, జల్లెడనందంత వెలితి (కో. 28.)

**జవ** పర్యా. చూ. రెక్క (1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడత దారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118. 18 (కో. 35, 37).

**జవరచేయు** క్రి. ఉ. జవురు-; చూ. సవరచేయు (కో. 6 ఎ; రా. 11).

**జవ్వ** ఏటవాలుగీరల డిజైను. చూ. చిత్రం 179 (తె. 12).

**జహనారా** గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు (కో. 12).

**జాకార్డు** మరమగ్గంమీద డిజైన్లు నెయ్యటానికి అమర్చిన ఒకరకం కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 135 (కో. 33).

**జాకార్డుదండ** జాకార్డు అడ్డకు తగిలించిన అట్టలు; దండగా కూర్చినవి; అడ్డ తిరిగినప్పుడు, ఈ అట్టలు దారాలను లేపుతాయి. చూ. చిత్రం 135.4(కో.33).

**జాకార్డునేత** మగ్గానికి జాకార్డు(డాబీ) అమర్చి, అంచుల్లో పువ్వులు పడేట్టు నేసే నేత; చూ. జాకార్డు (కో. 33).

**జాకెట్‌పీసు** పర్యా. చూ. కనుము. ఒక రవికెకు సరిపడే నేతగుడ్డ; పదిగీరల (10/16 గజం) పొడుగు ఉంటుంది (కో. 15).

**జాకెట్టుముక్క** పర్యా. చూ. కనుము, ఒకరవికెకు సరిపడే నేతగుడ్డ; మామూలుగా, పదిగిరల (10/16 గజం) పొడుగు ఉంటుంది (కో. 17).

**జాకెట్టుగుడ్డ** పర్యా. చూ. రైక(ల)గుడ్డ. ఆడ వాళ్ళు రవికెలకోసం నేసిన బట్ట; కొన్నిచోట్ల, డిజైన్లు పెట్టి నేస్తారు (కో. 11).

**జాజిఆకు** ఉ. జైజైకు. జాజిచెట్టు ఆకు; రంగుల అద్ద కంలో వాడతారు (కో. 8).

**జాజిపువ్వంచు** ఉ. జాజిపూఅంచు, జాజిపూవంచు, జైజిపువ్వంచు. జాజిపువ్వు మాదిరి డిజైనునేసిన అంచు; పంచెలకు నేస్తారు. చూ. చిత్రం 190 (తె. 5, 10, 11, 31, 32).

**జాజిపువ్వబొగిడి** ఉ. జైజి-. జాజిపువ్వు, మొగ్గ పడేట్టు నేసిన డిజైను (తె. 5).

**జాడ** (వడు); ఉ. జాడి పర్యా. చూ. గూడు (3). పన్నె దంతెలకు బిగించినపుల్ల (=ఈనె)లమధ్య వెలితి; అచ్చుకట్టేటప్పుడు, ఒక్కొక్కదాంట్లో, రెండేసి బద్దె పోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 88 క. 9 (కో. 25-27, 31, 36, 37).

**జానిమాజ్** మసీదుల్లో నమాజు చేసేటప్పుడు కింద పరుచుకోటానికి నేసిన జంపఖానా; ఒకటింబావు గజం నల్చదరంగా వస్తుంది (తె. 1).

**జాఫ్రాన్** ఎరుపులో తెలుపువన్నె (తె. 20).

**జామునీ** చూ. జామ్లా (తె. 29).

**జామ్లా** ఉ. జాములా, జైమ్లు; రూ. జామునీ; పర్యా. చూ. నేరేడువన్నె. ఒకరకం నీలంరంగు; నలుపు, ఊదా కలిసింది; నల్ల(=నీటి) వంకాయకంటె ఒకవన్నె తక్కువ ఉన్నరంగు (తె. 17, 18, 20-22, 24-26, 28, 31).

**జాయింటుబద్ద** పర్యా. చూ. మూలబద్ద. మరాసు కట్టుబడిలో, అడ్డపట్టెలను, ఆకులను బిగించిన కట్టె(లు); పటవాలుగా బిగిస్తారు (కో. 26).

**జాయీనె** గలుగు(=ఒకరకం మొక్క) కట్టెపుల్ల; ఇటువంటివి, పన్నెకట్టుబడిలో దంతెలమధ్య దువ్వెన పళ్ళ మాదిరిగా వరసగా బిగించి కడతారు (కో. 33).

**జారుపీట** పర్యా. జరుగు(డు)చెక్క. పెడకోలను మోసే కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి; నేత మోకు వదులుచేసినప్పుడు, పడుగు, నేలకు తగలకుండా పెడకోలను జరుపుతుంది. చూ. చిత్రం 130 (కో. 1).

**జాలగొర్రె** తెలుపు, నలుపు పొడల బొచ్చుగల గొర్రె (తె. 6, 20).

**జాలతాడు** చూ. జాలరి (తాడు) (తె. 20).

**జాలరి(తాడు)** ఉ. జాలతాడు, జైలారుతాడు; రూ. జాలతాడు. నేతలో డిజైనుపడటానికి, డాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి అంచుపడుగులోకి వేలాడదీసిన దారం; డిజైనుకు అవసరమయినన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (కో. 7, 23-25).

**జాలరు** ?వడి(దారం)లో అంచుపోగు దూర్చినసందు; దారపుమెలిక; చూ. వడి (తె. 29).

**జాలర్ వేలు** ఒక పువ్వు, రెండు ఆకులు వరసగా నేసిన డిజైను (తె. 21).

**జాలారిజల్లెడ** డాబీమగ్గం పేటుదారాలు దూర్చిన చిన్నపన్నె; ఇది మగ్గానికిపైన, మధ్యలో ఉంటుంది. చూ. చిత్రం 133 చ. 8 (కో. 25).

**జాలి** ఉ. జాలు, జైలి; పర్యా. చూ. గొలుసు (5), డాబీకోలలు తేపటానికి, గొలుసు మాదిరిగా, సన్న బద్దలు కూర్చిన సాధనం; ఈ బద్దలకు చిన్న పిక్కలు బిగిస్తారు; దీన్ని దిండుకు తగిలిస్తారు. చూ. చిత్రం 132 త.1 (తె. 5, 8, 19, 23, 29).

**జాలిపరకపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 25).

**జాలిపింజెర** ఉ. జాలిపింజర, జాలుపింజెర, జైలి పింజెర; పర్యా. చూ.గొలుసుపింజెర. ఒకరకం డాబీ; సన్నబద్దల గొలుసు, దిండుకు తగిలించింది. చూ.చిత్రం 132 త (తె. 8, 19, 23, 29).

**జాలిబద్ద** పర్యా. చూ. గొలుసుబద్ద. డాబీగొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద(లు); వీటికి కొయ్య పిక్కలు బిగిస్తారు; ఇవి దిండును చుట్టి తిరుగుతూ ఉంటాయి. చూ. చిత్రం 132 త. 2 (తె, 19. 23.)

**జాలిబొడ్డె** పర్యా. చూ. పిక్క. డాబీగొలుసు బద్దకు బిగించిన కొయ్యముక్క; డిజైనునుబట్టి అవసర మయినన్ని బిగిస్తారు; దిండును చుట్టి గొలుసు తిరిగినప్పుడు, ఇవి కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 2 (తె. 19, 23).

**జాలి(వడి)** (బహు. జాల్లు, జాళ్ళు) ఉ. జాలవడి, జాలు; పర్యా. చూ. వడి (6). పేటుదారానికి చివర కట్టిన పురిదారం; మామూలుగా, మైనం పూసింది; కొన్నిచోట్ల, ఇనపతీగ; దీనికి మధ్య బెజ్జంచేసిన చిన్న ఇనపబిళ్ళ ఉంటుంది; డాబీ కోలలు పైకి లేచినప్పుడు, ఇవి అంచుపోగులను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 12 (తె. 10, 18, 20, 22, 23, 25, 31).

**జాలు** ఉ.జైలు; పర్యా. అల్లు (2). అచ్చుతికిన పడుగులో చివరిపాయ =(పొట్టె) పోగులు; చూ. జాలెతాడు (కో. 6).

**జాలుపోయు** (క్రి.) ఉ. జైలుపోయు, పడుగులో

చివరిపాయ (=పొట్టె)లకు దారంతో మెలికలు వేసి కట్టటం (కో. 6).

**జాలెతాడు** ఉ. జాలితాడు, జాల్తాడు, జైలితాడు; జైల్తాడు; పర్యా. చూ. అల్లికదారం. అచ్చతికిన పడుగులో చివర, పొట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం; దీన్ని మగ్గందగ్గర చుట్టుకర్రకు కడతారు; కొన్ని చోట్ల, పడుగుమీద గుర్తులు పెట్టటానికి దీంతో కొలత చూసుకొంటారు. చూ. చిత్రాలు 128 త. 2, 129 త. 1 (కో. 3, 5, 6, 10, 17).

**జాలెపోయు** (క్రి.) నేతపడుగులో చివర పొట్టె ముడుల వెంబడి జాలెతాడు దూర్చి, లాకకూ కర్రకూ అల్లటం; కొన్నిచోట్ల, చుట్టుగర్రకు కడతారు(కో.5).

**జాలెబొట్టె** జాలెతాడు చుట్టిన పడుగుచివరి పాయ; చూ. పొట్టె (కో. 5).

**జాల్లగుంట** పర్యా. చూ. నీలలగుంత. వేటు తూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి మగ్గం గుంటకు పక్కగా తీసిన గొయ్యి; ఇటువంటివి రెండు పక్కలా ఉంటాయి. చూ. చిత్రం 132 చ.12(తె. 25).

**జావకుండ** పడుగుకుపెట్టే జావ కాచే కుండ(కో.24)

**జావగంజి** బియ్యం మెత్తగా ఉడకబెట్టి తీసినగంజి; సరిచేసేటప్పుడు, దీన్ని పడుగుమీద చిలకరిస్తారు (కో. 25, 26, 32, 35-37).

**జిగి** పర్యా. పంకి, పాకం; జిగురు; చింతఅంబలి పాకానికి వచ్చిన తరవాత పొయ్యిమీదినించి దింపుతారు (తె. 20, 25).

**జింకలంచు** ఉ. జిన్కలంచు. జింకఆకారంలో డిజైను పడేటట్టు నేసిన అంచు; జింకలంచు (తె. 5).

**జిట్ట 1.** (బహు. జిట్లు) నూలుపోగుల లెక్క: (క) 736 పోగులనూలు (కో. 35); (చ) లడీలో వదో వంతునూలు (కో. 37); **2.** పర్యా. పల్లెకట్టె: దోనెకు నేతబట్ట చుట్టటానికి, దోనె (పలక) తిప్పేకర్ర; కొన్నిచోట్ల, ఇనపకడ్డీ; కుడివైపు దోనెబెజ్జంలో దూర్చి నేలకు ఆనుస్తారు. చూ. చిత్రం 123 చ. 2 (తె. 24); **3.** అయిదుకొలుకుల దారంపెట్టి నేసింది; కోతకచ్చికి ముందు, వేరేరంగులో జెత్తెడు వెడల్పున నేస్తారు (కో. 16); **4.** చెయ్యి విస్తరించినప్పుడు, బొటనవేలి కొనకూ చూపుడువేలికొనకూ మధ్య ఎడం; ఒక కొలత (తె. 4).

**జిట్టకట్టు** (క్రి.)చీరలో, చివరికమ్మికి బొద్దు(=లావు దారం)లు పెట్టి నేయటం (కో. 28).

**జిట్టకట్టె** పర్యా. చూ. కోతిపుల్ల (1). నేతనేసేటప్పుడు. అచ్చుకర్రలు సులువుగా లేవటానికి మగ్గం మీద, దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు పైకి కిందికి ఆడుతుంటాయి. చూ. చిత్రం 101 త. 1 (తె. 24).

**జిట్టు(ల)కమ్మి** ఉ. జిట్టులకమ్మి. రెండువైపులా లావు (పురి) దారాలు పెట్టి నేసిన కమ్మి (కో. 26-28, 30, 34, 36, 37).

**జిట్టె** (-కట్టు) కమ్మికిముందు సన్నగా నేసినభాగం చూ. చిట్టె (తె. 15).

**జిన్నెపండు(రంగు)** ఒకరకం నల్లరంగు; చేకిలెట్టు రంగు; బి. ఒ., గార్నెట్, కొరంతా బి. డబ్ల్యు. వేసి తయారుచేస్తారు (తె. 4).

**జిమ్‌దానీకమ్మి** ఉ. జిన్దానీ-. ఒకరకం డిజైను (జముదాని)లో నేసినకమ్మి; చిలకలు, ఏనుగులు మొ. నమూనాల బుటాలు పడతాయి (కో. 36).

**జిమ్‌నేత** కమ్మికిముందు గీరలు (జిమ్ములు) పడేట్టు నేసిన నేత (రా. 24),

**జిమ్ము** (క్రి.) పర్యా. చూ. అలుకు (1). సరిచేసేటప్పుడు, పడుగుబాగా బిరుసెక్కటానికి గంజిచిలకటం; గంజి పిడచ ఒకచేత్తో పట్టుకొని, రెండోచేత్తో దాని మీద, అలుక్కుంచెతో దువ్వితే పడుగుమీద అలుకుపడుతుంది; కొన్నిచోట్ల వెంపలి మండలతో గంజి చిలుకుతారు(రా. 1).

**జిమ్మ(లు)** పర్యా. గీర (3). కమ్మినేతలో జైనెడు చెరగు నేసిన తరవాత పెట్టిన జంటగీరలు (కో. 5, 6).

**జిల** బతికిఉన్న గొర్రెబొచ్చుకు ఉండే నిగనిగ; చెమక్; తివాసీ నేతపనివాళ్ళ వాడుక (కో. 16).

**జిలుగుబార్డరు** అక్కడక్కడ చుక్కలు పడేట్టు చేత్తో రంగు అద్దిన అంచు (కో. 7).

**జిల్ల 1.** నేతలో నిలువుకు పనికి వచ్చేనూలు: "పడుక్కంటే తక్కువైతే పొగడి; పొగడికంటె తక్కువైతే జిల్ల" (కో. 13); **2.** పర్యా. చూ. పాయ (8). పడుగుపోగుల్లో కొంతభాగం; అచ్చతికేటప్పుడు, పడుగును పాయలుగా విడదీసి ఒక్కొక్క పోగే అచ్చుపోగుకు అతుకుతారు. చూ. చిత్రం 102 క. 4 (రా. 21); **3.** పట్టుదారం చుట్ట; చిన్నది (తె. 5, 12).

**జిల్లపోగులు** అచ్చుబద్దె చివరిపోగులు; వీటిని సమంగాకోసి పడుగుపోగులకు అతుకుతారు.

**జీడిపొప్పిళి** జోడునామ్దారి చీర (=రెండు ఎర్ర పోగులమధ్య ఒక నల్లపోగుపెట్టి నేసిన గళ్ళచీర) మాదిరిగా నేసిన ఒకరకంచీర; నేత అడ్డంలో నాలుగయిదు ఎనికెల చొప్పున పెట్టి నేస్తారు(రా. 16).

**జీనిగలవాళ్ళు** ఉ. జీనిగలోల్లు. అద్దకానికి పనికి వచ్చే, కొయ్యఅచ్చులు చేక్కేవాళ్ళు (రా. 12).

**జీపుకాటు(అంచు)** ఉ. ఛీప్‌కాటంచు, జీప్‌కాటి అంచు. రెండు వరసల్లో మొగ్గలుపెట్టి, మధ్యన కడ్డీ మాదిరిగా నేసిన అంచు; నల్లజీపుకాటు నల్లరంగు, ఇండెంత్రిన్ జీపుకాటు ఎర్రరంగు. చూ. చిత్రం 251 (తె. 6, 9, 19, 22).

**జీర** **1.** తొంభయిరెండు పోగులు (కో. 32, 35); **2.** చూ. గిర(2) (కో. 8).

**జీరలంచు** చూ. గిరలంచు (కో. 13, 21).

**జీవనజ్యోతిచీర** మూడేసి రంగులు పడుగుపేకల్లో పెట్టి నేసిన గడిచీర; మూడు నాడెలతో నేస్తారు; ఒక నాడెకు ఆరుపోగులూ ఒక నాడెకు నాలుగుపోగులూ చొప్పున పెట్టి, మధ్యగా అంగుళానికి కొంచెం తక్కువ సైజు గళ్ళు పడేట్టు నేస్తారు (కో. 10).

**జుంటారిచివ్వ** ఉ. జుంటారసివ. మగ్గందంటె దగ్గర, నేతపడుగులో దూర్చిన చువ్వ; నవలకుగుండు తాడును మోసేది (కో. 37).

**జుబేదా(రంగు)** **1.** ఉ. జుబ్బేడ. లేతనీలంరంగు (కో. 9, 11, 13); **2.** పాలరంగు (కో. 14).

**జుమ్మరనూలు** పురి ఎక్కువగాఉండే నూలు(కో. 1).

**జువ్వికాయగడిచీర** ఉ. జువ్వికాయి-. పావుఅంగుళం వెడల్పు చిన్నగడి చీర; ఆరుకొలుకుల గడికి, ఒకకొలికి తెల్లగీర చొప్పున పడుగూపేకా వచ్చేట్టు నేస్తారు (కో. 7, 9).

**జూక** పేముచువ్వ; దీంతో అల్లుకుంచె వెన్ను కడతారు (కో. 21).

**జూటు** (< jute) తివాసీనేతలో అడ్డానికివాడే నార దారం (కో. 16).

**జూలాబార్డరు** పటవాలుగీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు (కో. 7).

**జూలు** కొంగు చివరి పోగులు (కో. 24).

**జెగనోమోహిని** ఒకరకం అంచు; పూర్వం నేసేవారట. చూ. చిత్రం 191 (కో. 24).

**జెగనోమోహినిపొప్పిళిచీర** ఉ. -పొప్పిలిచీర. ఒకరకం గడిచీర; ఒకపట్టె పసరురంగు, ఒకపట్టె ఆరంజిరంగు, ఒకపట్టె నింబావళి రంగుల్లో, నాలుగేసివేళ్ళ వెడల్పున నేస్తారు; దీనికి కమలంఅంచు పెట్టి నేస్తారు (రా. 15).

**జెగనోమోహినీచీర** అంచులో అష్టదళపద్మం మాదిరి డిజైను నేసిన చీర (కో. 33, 34, 37).

**జెట** తొంభయి రెండు పోగుల నూలు; ఫింకరుకు చుట్టింది (కో. 34).

**జెడ** **1.** రెండు లడీలనూలు (తె. 3); **2.** (-అల్లు) నేతకు అవసరమైనంత, అచ్చతకగా మిగిలిన పట్టుపడుగు; జెడమాదిరిగా అల్లింది. చూ. చిత్రం 128 డ. 1 (తె. 12); **3.** (-కట్టు) జెడమాదిరిగా అల్లిననార పాయ; నార సలగగొట్టిన తరవాత, సేరున్నర బరువు తూగేనార, ఒకపాయ చొప్పున విడదీసి జెడఅల్లుతారు (తె. 25).

**జెడకమలం** ఉ. -కమళం. ఒకరకం అంచు డిజైను; జెడమాదిరిది. చూ. చిత్రం 192 (తె. 14).

**జెడపత్తి** ఉ. జడపత్తి. విత్తులు జెడలు జెడలుగా ఉండే పత్తి; దూది తెల్లగా ఉంటుంది; దీంతో పోగు పొడుగ్గారాదు; జంద్రేలకు, దీపాల వత్తులకు వాడతారు; కదురుమీద దారం తీస్తారు (కో. 1, 12-15, 20; తె. 5, 12; రా. 8, 9).

**జెండాగడి** ఒకరకం నేతగడి (కో. 20).

**జెతకట్టు** పర్యా. చూ. సరెంటి(కి). చుట్టచుట్టిన పడుగునూలు. మగ్గంమీద కొంత చాపగా మిగిలింది ఒక కర్రకు చుడతారు; కొన్నిచోట్ల, పురిపెట్టిచుడతారు, కొన్నిచోట్ల పెడకోలకు కట్టి ఉంచుతారు. చూ. చిత్రాలు 128 ట. 1, 128 జ. 2 (రా. 18).

**జెంతర్** (హిం.) చూ. జంత్రం(పీట). అచ్చుకట్టే వాళ్ళ వాడుక (కో. 5).

**జెరిలాపత్తి** ఈ పత్తి పసె (staple) ముప్పాతిక అంగుళం పొడుగు ఉంటుంది; ఆదిలాబాద్, మహారాష్ట్రంలో పర్భనీ, నాందేడ్, పండరిపూర్ మొ. ప్రాంతాల్లో పండుతుంది (తె. 28).

**జెవారిపత్తి** ఉ. జవ్వారిపత్తి. ఒకరకం ఎర్రపత్తి; పత్తి కొద్దిగానే వస్తుంది; చెట్టు గజన్నర పొడుగు పెరుగుతుంది; దూది బరువుగా ఉంటుంది (రా. 16-18, 24).

**జేపూర్‌ఖానీ** తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను (కో. 16).

**జేబురుమాలు** పర్యా. చేతిగుడ్డ, దస్తీ. జేబులో పెట్టుకోటానికి నేసిన చిన్నగుడ్డ (కో. 16-18, 25, 26).

**జైంద్రవాళ్ళు** ఉ. జైంద్రాల్లు, జైంద్రోళ్ళు. నేతపని చేసేవారిలో ఒక తెగ; దేవాంగులు (కో. 7; తె. 6; రా. 8, 10),

**జైన** చెయ్యి విస్తరించినప్పుడు, బొటనవేలికొనకూ చిటికెనవేలికొనకూ మధ్య ఎడం; ఒక కొలత (తె. 4).

**జైనకొయ్య** పర్యా. కాలుకొయ్య. ఆసుమీద పడుగు జైనెడు ఎక్కువ రావటానికి పక్కపీటకు బిగించిన కొయ్య(లు). చూ. చిత్రం 45 ట. 2 (కో. 36, 37).

**జైమారంచు** బాగా తెల్లటి నూలులో నేసిన ఒకరకం అంచు (కో. 36).

**జైలికర్ర** పర్యా. చూ. పొత్తికోల. నేతపడుగు చివర, పాయల తాళ్ళు కట్టినకర్ర; దీనికి కొన్నిచోట్ల మలబద్ద జోడిస్తారు; కొన్నిచోట్ల, దీనికి పొత్తెలు మెలివేస్తారు. చూ. చిత్రం 128 త. 1 (కో. 3).

**జైలిహంసబార్డరు** అర్ధవలయాకారంలో హంస పడేట్టు నేసిన అంచు; జైలి_arch (రా. 14).

**జొన్నఅంబలి** ఉ. జొన్నంబలి. జొన్నపిండితో కాచిన అంబలి; దీన్ని పడుక్కు పెడతారు (తె. 17, 22, 28-33).

**జొన్నగంజి** జొన్నపిండి ఉడకబెట్టి తీసిన గంజి; దీన్ని పడుక్కు పెడతారు. (కో. 14; రా. 12, 17, 19-22, 24).

**జొన్నబెండు** పర్యా. చూ. ఊచ (3). కండెనూలు చుట్టే జొన్నదంటుముక్క. చూ. చిత్రం 51క (రా.19).

**జొన్నలరాసిచీర** ఉ. జొన్నర్రాసిచీర. **1.** రెండు కొలుకులు తెలుపు, రెండు కొలుకులు రంగు (పచ్చ) చొప్పున నిలువు, అడ్డం వచ్చేట్టునేసిన చీర; దీన్ని గొల్లవాళ్ళు కట్టుకొంటారు (తె. 13, 15); **2.** అద్దముత్యాల చీర మాదిరిగాపెట్టి నల్లకొలుకులతో నేసినచీర(తె.14). **3.** ఒకరకం చుక్కలచీర (కో. 11).

**జొన్నసంకటి** గంజివార్చకుండా, ముద్దగా వండిన జొన్న అన్నం; దీన్ని గుడ్డతో తోమి పడుక్కు పెడతారు (తె. 1).

**జోడా** ఉ. జోడ. **1.** పడుగుమడతలో, చువ్వతో బాటు ఎక్కించిన కర్ర. (కో. 25, 37); **2.** పర్యా. జోడాబద్దలు, మలజోడు. నేతపడుగుకు చివరపెట్టిన రెండుకర్రలు; మలగర్ర, మలబద్ద. చూ. చిత్రం 129 చ. 1 (కో. 23, 24, 26, 37); **3.** రూ. జోడు; పర్యా. చూ. చాపు(5). మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట; బద్దెతో కలిసి ఉన్నది (తె. 31-33).

**జోడాకట్టు** (క్రి.) అచ్చుబద్దెలో ఎక్కించిన కర్ర దగ్గర మరొక కర్ర దూర్చి కట్టటం (కో. 26).

**జోడాకర్ర(లు)** **1.** పడుగులో రెండు చివర్లా ఎక్కించిన కర్రలు (కో. 16); **2.** అచ్చుతీసిన తరవాత, పడుగులో దూర్చిన కర్రలు (కో. 28).

**జోడాగుది** **1.** పడుగుమడతలో ఎక్కించిన కర్రకు కట్టినదారం (కో. 25); **2.** పర్యా. చూ. మలగుది (2). పెడకోలకు తగిలించే మలగర్ర దారం; కొన్నిచోట్ల, మలబద్దది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (కో. 23).

**జోడాచివ్వ** పడుగుమడతలో విరుపుచివ్వలతోబాటు ఎక్కించిన కర్ర(లు) (కో. 26).

**జోడాబద్దలు** పర్యా. చూ. జోడా (2). నేతపడుగుకు చివరపెట్టిన రెండుకర్రలు; మలగర్ర, మలబద్ద. చూ. చిత్రం 129 చ. 1 (కో. 16).

**జోడు** చూ. జోడా (3). (కో. 3; తె. 4).

**జోడుకట్టు** (క్రి.) రెండుపోగులు తెగినప్పుడు, వాటిని కలిపి అతకటం (కో. 28).

**జోడుగరిపేటు** అంచులో నేసిన ఒకరకం డిజైను (రా. 16).

**జోడునాప్తూరిచీర** రెండు ఎర్రపోగుల మధ్య ఒక నల్లపోగుపెట్టి నేసిన గళ్ళచీర (రా. 16).

**జోడుపురి** ? రెండుపోగులుకలిపి పురిపెట్టిన దారం (రా. 15).

**జోడులాహిరి(పేటు)** ఉ. జోడులాయిరిపేటు; పర్యా. డబుల్‌లాయిరీ. అంచులో రెండు లాహిరీలు వరసగా పడేట్లు నేసిన డిజైను. చూ. చిత్రం 189 (తె. 1; రా. 16).

**జోతా** (బహు. జోతే)పర్యా. చూ. జంత్రంతాడు. పన్నెకట్టే జంత్రం బొమ్మదండెలు బిగించి కట్టిన గట్టి దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 4 (కో. 5, 7, 33).

**జోతిబాణందేవర** పర్యా. చూ. చౌడీశ్వరి. చేనేత పనిచేసే దేవాంగులు, తొగటబలిజెలు మొ. వారు కొలిచే దేవత; మామూలుగా ఆషాఢమాసంలో అమావాశ్యనాడు చౌడీశ్వరిని కొలుస్తారు. (రా. 15).

**జోతిబాణందేవరజాతర** చౌడీశ్వరినికొలిచేఉత్సవం; ప్రతి ఉగాదికీ చేస్తారు(రా. 15).

**జోరతట్టు** ఒకరకం పట్టాగుడ్డతో కుట్టిన కుంచె చెంప (తె. 21).

**జోల్లబరగ** ? ఉన్నిగొంగడి నేసేటప్పుడు, పడుగులో దూర్చిన బద్ద (తె. 11).

**జౌరుకుంచె** (-వేయు) పడుగుమీద ఒకవైపునుంచి మరొకవైపుకు ఆపకుండా దువ్వేకుంచె; సరిచేసేటప్పుడు మొదట కొంత సేపు ఇలా దువ్వుతారు (రా. 24).

## ఝ

**ఝుప్** పన్నె దండెలమధ్య బిగించిన పుల్లలు సాపు చేసే గరుకురాయి; పన్నెగట్టుసాయేబుల వాడుక. చూ. చిత్రం 89ట. 2 (రా. 24).

**ఝూలు** ఉ. ఝూల్; పర్యా. చూ. అడ్డబేలు. చేతి మగ్గంమీద డిజైన్లు నెయ్యటానికి, నేతపడుగుకు పైన వంతెనమాదిరిగా అడ్డంగా కట్టిన లావుదారాలు. చూ. చిత్రం 136 క. 1 (తె. 2).

ఝురీ తివాసీమగ్గం కిందిదోనె బిగింపుకోసం, పక్కపక్క బెజ్జంలో దూర్చిన కర్ర; కొన్నిచోట్ల, గునపం వాడతారు. చూ. చిత్రం 320. 10 (కో. 16).

## ట

**టకారి** ఒకరకం మట్టిపాత్ర; మట్టిగోలెం మాదిరిది; దీంట్లో రంగులు కలిపి నూలుకు అద్దుతారు; చూ. గోలెం (తె. 24).

**టక్కి** ఉ. టిక్కి; పర్యా. చూ. ఉడత. మరమగ్గం నాడెను, ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి, నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి కింద తోలుఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; ఇలువంటివి రెండు సొరుగులపైనా అమరుస్తారు. చూ. చిత్రం 119 (కో. 1; రా. 4).

**టక్కితాడు** పర్యా. చూ. ఉడతతాడు. మగ్గం ఉడతకుపైన కట్టిన దారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ, మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (కో. 1; రా. 4).

**టక్కితోలు** పర్యా. ఉడతతోలు. మరమగ్గంలో, ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు; దీనికొనలు, ఉడత చిల్లిలోనుంచి పైకి దూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (కో. 1).

**టక్కివారు** పర్యా. చూ. ఉడతతోలు. మరమగ్గంలో, ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు; దీనికొనలు ఉడత చిల్లిలోనుంచి పైకి దూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (రా. 4).

**టంగు 1.** ఉ. టంగ్. తివాసీమగ్గం పైదోనె బిగింపుకోసం, పక్కబెజ్జంలో దూర్చిన కర్ర; అరంగుళాల పొడుగు ఉంటుంది. చూ. చిత్రం 321.1 (కో. 16; తె. 10); **2.** తివాసీమగ్గం పైదోనె; పదుగుచుట్టేది; సన్నగా ఉంటుంది. చూ. చిత్రం 320.8 (తె. 10).

**టంగురస్సి** ఉ. టంక్‌రస్సి. తివాసీమగ్గం పైదోనె బిగింపుకోసం నేసిన బిగుతాడు. చూ. చిత్రం 320.9 (తె. 17).

**టపేటా** ఒకరకం పట్టు; అరటినారతో తయారయింది (కో. 16).

**టపేటానేత** ఒకరకం డిజైను నేత; అచ్చుకు అవతల "తడిక" అనే పనిముట్టు అమర్చి నేస్తారు; దేవాంగుల వాడుక (కో. 7).

**టరికితువ్వాలు** ఉ.-తువాలు; రూ. టురికి తువ్వాలు (తె. 24).

**టాకా** (-వేయు) కుట్టు; మొగలి, పోక, మునగ, మోదుగు మొ. చెట్లనారతోగాని, పేముతోగాని కుంచె వెన్నుకు వేసే కుట్టు (తె. 5).

**టాకి** ఉ. టాకి. రంగునీళ్ళుకాచే పెద్ద ఇనపడబ్బా. చూ. చిత్రం 282 క. 3 (తె. 12, 24, 25, 29).

**టాణా 1.** ఉ. టానా. చీరకొంగుకు, కొంగుకు మధ్య నేసిన ఒక అంగుళం భాగం (రా. 15); **2.** పర్యా. చూ. కన్ను. కమ్మినేతలో, అందానికి, పడుగులో దూర్చిన రంగుదారం; సుమారు రెండంగుళాల పొడుగుంది; మామూలుగా, ఎర్రదారం పెడతారు; కొన్ని చోట్ల, నలుపు, తెలుపు దారాలు పెడతారు. చూ. చిత్రం 271 (రా. 16).

**టాణాకమ్మి** రెండేసి పోగులు ఒక్కొక్క రంగువి పెట్టి వరసగా నేసిన కమ్మి (రా. 16).

**టానికోడు** చూ. తానెకోడు (రా. 17).

**టాను** నేసిన నారపట్టా (తె. 25).

**టాపింగునీలి** నిండునలుపులో రాగివన్నె మాదిరి రంగు (కో. 2).

**టాపీ** పర్యా. చూ. బొమ్మ(3). మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. చూ. చిత్రం 118.16 (కో. 8).

**టాపేటు** ఉ. టాపీటు, **టాపెట్టు**; పర్యా. చూ. డాబీ. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గంపైన అమర్చే యంత్రం. చూ. చిత్రం 132 (రా. 3, 14, 15).

**టాపేటుచెయ్యి** ఉ. టాపీటుసెయ్యి; పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుచెక్కలను తొక్కినప్పుడు, గొలుసుపిక్కలుగాని, దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (రా. 15).

**టాపేటుతడక** పర్యా. చూ. తడక(2). డాబీకిపైన బిగించిన ఇనపఊచల చట్రం; డాబీకోలలు పక్కలకు జరక్కుండా నిలుపుతుంది; రెండుఊచల సందులోకి ఒక కోల వస్తుంది. చూ. చిత్రం 132 చ. 3 (రా. 15).

**టాపేటుదారం** ఉ. టాపీటు-; పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసిన దారం; డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (రా. 14, 15).

**టాపేటునేత** పర్యా. చూ. డాబీనేత. మగ్గానికి డాబీ అమర్చి, బట్ట అంచున డిజైను పడేట్టు నేసిన నేత; చూ. టాపేటు (రా. 15).

**టాపేటులాక** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీ చట్రంలో అమర్చిన సన్నబద్ద;

పావుచెక్కలను తొక్కినప్పుడు గొలుసుపిక్కలుగాని, దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (రా. 14).

**టారుజేలు** (< star-) అంచులో నక్షత్రం మాదిరిగా నేసిన డిజైను; స్టారుజేలు. చూ. చిత్రం 193 (రా. 16).

**టికెట్టంచు** ఉ. టికటంచు. రైలుటికెట్టంత వెడల్పున నేసిన అంచు (రా. 13, 14).

**టిక్కబల్ల** పర్యా. కంగోరా, కొక్కేలబల్ల. వజానేత కోసం అమర్చిన దొడ్డిలో, కన్నాలబల్లనుంచి కిందికి గుంజిన కుచ్చుతాళ్ళు తగిలించటానికి గాళ్ళుచేసిన చెక్క. చూ. చిత్రం 134 చ. 10 (కో. 34, 36).

**టిక్కిపేటు** ఉ. -పేటి. అంచులోనేసే ఒకరకం డిజైను (తె. 2).

**టుకినీ** ఉ. టుకిణి, టుక్నీ; రూ. తుకునీ; పర్యా. కొలతబల్ల, కొల్తబిళ్ళ, బిళ్ళ(9). పన్నెదండెలమధ్య బిగించే పుల్లలు ఒకే పొడుగులో లెంపటానికి కొలిచే కొయ్యబిళ్ళ. చూ. చిత్రం 89 క. 7 (కో. 5, 26; రా. 24).

**టువాలు** (< ఇం. towel) పర్యా. చూ. పాగ. తలకు చుట్టుకోటానికి నేసిన బట్ట; మామూలుగా, అయిదు (కొన్నిచోట్ల $2\frac{1}{2}$-3) గజాల పొడుగు నేస్తారు; అడ్డం ముప్పాతిక గజంనుంచి గజంపై వరకూ పెడతారు; కొన్నిచోట్ల, అంచులేకుండా నేస్తారు; మామూలుగా తెల్లది; కొన్నిచోట్ల, రంగులు, గీరలు, గళ్ళు మొ.వి పెట్టి నేస్తారు (రా. 16, 17).

**టువిల్‌పేటు** నేతలోవచ్చే ఒకరకం డిజైను(రా. 18).

**టూపు** పట్టుదారం చుట్టే డబ్బా; మిల్లులలో వాడతారు; కొయ్యబాబిన్లకు చుట్టిన నూలు వీటిమీదికి మారుస్తారు (రా. 14).

**టెక్నీ** పర్యా. చూ. దొగ్గసం. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు; ఊడ్తె మాదిరిగా, వెదురుకర్రలు బిగించింది; చాపిన పడుగునుబట్టి ఇటువంటివి 1-3 వాడతారు. చూ. చిత్రం 107 (కో, 36).

**టెంకాయబొచ్చె** పర్యా. చూ. చిప్ప(1). రాటిపై బద్దలను బిగించి వాటిమధ్య బోర్లించి కట్టిన చిప్ప: మామూలుగా కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల, కర్రచిప్పగాని, రేకుమూతగాని వాడతారు; ఇది, రాటి నూలం మీద ఆనుతుంది. చూ. చిత్రం 31 క. 5(తె. 4).

**టెంకిపుల్ల** పర్యా. చూ. కోతిపుల్ల(1). నేతనేసేటప్పుడు, అచ్చుకర్రలు సులువుగా లేవటానికి, మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల; దీనికి రెండువైపులా అచ్చుగుదులు మెలిపెడతారు; ఇటువంటివి రెండు, నేతనేసేటప్పుడు, పైకీ కిందికీ ఆడుతుంటాయి. చూ. చిత్రం 121 త. 1 (రా. 5).

**టెంకె** ఒకరకం మట్టిపాత్ర; మూకుడు మాదిరిది; పెద్దదాంట్లో, రంగునీళ్ళుపోసి, నూలు లడీలు తడుపుతారు; చిన్నదాంట్లో పడుగుతడిపే గంజి పోసుకొంటారు. చూ. చిత్రాలు 29, 282 ట. 1 (తె. 3, 5, 11, 12, 14, 16, 31).

**టెబిల్‌రుమాలు** ఒకరకం తలపాగ; జరీపెట్టి నేసింది (తె. 25).

**టెలిఫోనంచు** టెలిఫోను మాదిరి డిజైను నేసిన అంచు (తె. 9).

**టేకిచేపతోలు** దీంతో కుంచె రెంపలు కుడతారు (కో. 5, 12).

**టేకుముక్క** రంగు అద్దిన నూలులడీలు పిండటానికి తగిలించే కొయ్యచెక్క; జానెడు వెడల్పు, రెండు గజాల పొడుగు ఉంటుంది; చూ. పిడుపుకర్ర. చూ. చిత్రం 282 క. 5 (కో. 14).

**టేపు** రంగు జమిలిపోగులుపెట్టి నేసిన చిగురంచు (రా. 15).

**టేంకు** ఉ. టెంకి. నీళ్ళు పోసుకొనే తొట్టి; రేకుదిగాని, మట్టిదిగాని; రంగుఅద్దిన బట్టలు దీంట్లో నానబెడతారు (కో. 8, 26).

**టొర్రి** నేతలో, ఒకపోగు తెగినప్పుడు వచ్చిన వెలితి (కో. 29, 34-36).

**టోకు** **1.** పర్యా. చూ. లడీ(1). పెట్టెలో ఉండే నూలుకట్ట; ఏ నెంబరు నూలో అన్నిలడీలు ఒక్కొక్క పెట్టెలో ఉంటాయి. టోకుబరువు = $\frac{\text{పదిపొన్లు}}{\text{నూలునెంబరు}}$ (రా. 15); **2.** పట్టుదారం లెక్క: ముప్ఫయిరెండు కట్లరేషం (రా. 14).

**టోపుకమ్మి** చీర మధ్యలోపెట్టిన రంగు అడ్డకొనలో గూడా నేసిన కమ్మి; దీంట్లో కంగోర్లు, గీరలు, పట్టెలు మొ.వి నేస్తారు (రా. 16).

**టోపుకొంగు** నేతపడుగు పేకదారం పరంగులో ఉంచే ఆ రంగులో నేసిన చీరకొంగు (తె. 23).

**ట్రిల్లు** ఖాకీట్రిల్లు మాదిరిగా, ఏటవాలువరసలో పోగులు కనబడేట్టు నేసిన నేత (తె. 5).

## ఠ

**ఠంగోరా(లు)** (-ఠీయు) పై అంగవస్త్రంలో, చిన్న కమ్మికి రెండు వైపులా పెట్టిన పోగు(లు) (కో. 3).

**తాను** తాను; నాలుగు రుమాళ్ళు కలిసి ఉన్న పని గజాలబట్ట (తె 23).

## డ

**డక్కిపైర** సన్నబట్టల అద్దకానికి రంగుతొట్టెలో, సింజెర (=తడికె) మీద వేసిన మెత్త; ఉన్ని (శాలువా) గుడ్డ; చూ. కంబడిమెత్త. చూ. చిత్రం 283 క. 3 (కో. 7).

**డబల్‌కమ్మి** రెండుపట్టెలుగానేసిన కమ్మి; కొన్ని చోట్ల, పట్టెల మధ్య గీరలుపడేట్టు, కమ్మి పగలగొట్టి నేస్తారు (కో. 3, 10).

**డబల్‌కలశంచౌకానీఅంచు** ఒకరకం అంచు; రెండు మొగ్గలు, గళ్ళు పడేట్టు నేసింది (తె. 2).

**డబల్‌సోటు** పర్యా. చూ. జమిలి (నూలు)· రెండు పోగులు కలిపి పురిపెట్టిన నూలు (తె. 32).

**డబల్‌లాహిరి** ఉ.- లాయిరీ; పర్యా. జోడులాహిరి (పేటు). అంచులో రెండు లాహిరీలు వరసగా పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 189 (తె. 10).

**డబ్బా** ఉ. డబ్బ. **1**· (-తొడుగు) పర్యా. ఈలాయి, గొట్టం (1), డబ్బాపంజె, డబ్బాబుడ్డి, నూలుబుడ్డి. బుడ్డపంజె, బుడ్డి (1), లోటా (1). పంజెకు బదులు. నూలుచుట్టుకొనే రేకు డబ్బా; కొన్నిచోట్ల, రేకుపట్టెలు బిగించింది; కొన్నిచోట్ల, కొయ్యది. చూ. చిత్రాలు 30, 50.12 (కో. 1, 2, 7-12, 14-26, 28, 35-37; తె. 13, 31; రా. 4, 5, 7-9); **2.** పర్యా. చూ. చెలకపంజె. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం, కొయ్య బద్దలపంజె; కొన్నిచోట్ల, వెదురుబద్దలుగాని, రేకు పట్టెలుగాని బిగించింది. చూ. చిత్రం 29 (తె· 21; రా. 2); **3.** పర్యా. చూ. సొరుగు (2). మరమగ్గం చట్రంలో, పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు; నేతనేసేటప్పుడు, నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి, చూ. చిత్రం 118. 13 (తె. 8, 9): **4.** రంగునీళ్ళు కాచే ఇనపగోలెం. (తె. 20); **5.** రంగుకొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది; చూ. పావు. చూ. చిత్రం 282 ప. 1 (కో. 4, 11).

**డబ్బాకదురు** పర్యా. చూ. గంట (1). డబ్బా రాట్నం బొమ్మలకుగాని, దొడ్డినిలువులకుగాని బిగించే మందపుకడ్డీ; పెద్దకదురు. చూ.చిత్రం41క. 2 (రా.8)·

**డబ్బాపంజె** ఉ· డబ్బ-; పర్యా. చూ. డబ్బా (1). పంజెకు బదులు నూలు చుట్టుకొనే రేకుడబ్బా; కొన్ని చోట్ల, రేకుపట్టెలు బిగించింది; కొన్నిచోట్ల, కొయ్యది. చూ. చిత్రం 30 (తె. 10; రా. 16).

**డబ్బాబుడ్డి** పర్యా. చూ. డబ్బా (1). పంజెకు బదులు నూలుచుట్టుకొనే రేకుడబ్బా; కొన్నిచోట్ల, రేకుపట్టెలు బిగించింది; కొన్నిచోట్ల, కొయ్యది. చూ. చిత్రం 30 (రా. 13).

**డబ్బారాట్నం** ఉ. డబ్బ-. పెట్టెలా అమర్చిన రాట్నం; కిసాన్‌రాట్నం (చూ.) మాదిరిది (తె. 28, 30).

**డబ్బాలదారం** పర్యా. చూ. వడిదారం. డబ్బా రాట్నం చక్రాన్నీ గంటాన్నీ కలిపే గట్టిదారం; దీని వల్ల గంటం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 8 (కో. 23).

**డబ్బా(ల)రాట్నం** ఉ. డబ్బల-; రూ. డబ్బారాటం; పర్యా. అసురాట్నం, ఇచ్చెలరాట్నం, ఎలుపుకురాటం, చిట్టెలరాట్నం, చిలపలరాట్నం, చక్రంరాటం, చేయి రాటం, దోరిరాట్నం, దొడ్డిరాట్నం, బిసరాటం, బుడ్డిరాటం, బుర్రిరాటం, మరరాటం (1), రాట్నం (2), సీళ్ళరాటం, సైకిలురాటం. డబ్బాలకు నూలు తోడే రాట్నం. చూ. చిత్రం 41 (కో. 1, 2, 28, 35, 36; తె. 10, 21; రా. 1).

**డల్లిమోహిని** ఒకరకం అంచు; పూర్వం నేసే వారట (కో. 23).

**డాకి** నారపడికేటప్పుడు, కదురు కిందికొన మోప టానికి పెట్టిన కుండపెంకు; దాక· చూ. చిత్రం 302.4 (తె. 25).

**డాకుంచెలాగు** (క్రి.) సరిచేసేటప్పుడు, కుంచె తల కిందుగా పట్టుకొని, పడుగుకు కిందిభాగంలో దువ్వటం (కో. 17).

**డాగు** చూ. డాంగ్ (2) (కో. 26).

**డాగుగుజ్జు** పర్యా. చూ. బొమ్మ. పన్నె దండెల బిగింపుకు, దారాలు కట్టిన జంత్రం నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 2 (కో. 33).

**డాంగ్** **1.** పర్యా. చూ. బొమ్మ (7). పన్నెదండెల బిగింపుకు దారాలు కట్టిన జంత్రం నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 2 (రా. 24); **2.** రూ. డాగు; పర్యా. జంత్రం(2). పన్నె తయారుచేసే కొయ్యపనిముట్టు; పొడుగాటి వెదురు బొంగుకు, రెండు నిలువుకొయ్యలు బిగించింది; పన్నె గట్టుసాయేబుల వాడుక. చూ. చిత్రం 88 (కో. 5).

**డాబీ** ఉ. డాబ్, డాబి, డాబు, డాభీ, డోబీ; పర్యా. గిలక (4), టూపేటు, దొడ్డి (4), నవిషీపేటు,

పింజెర (3), పేటుగలక, పేటుపెట్టె, మిషను. నేతలో డిజైన్లు రావటానికి, మరమగ్గంపైన అమర్చేయంత్రం. చూ. చిత్రం 132 (కో. 3, 6, 7, 10, 12-15, 20, 23-25, 33, 36; తె. 13; రా. 7, 8, 16, 17, 24),

**డాబీఅడ్డ** పర్యా. చూ. దిండు (7). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యదిండు; బోట్లపింజెర దిండుకు బొడిపెలు, తొల్లపింజెర దిండుకు గాట్లు ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు; దీనికి గొలుసు తగిలిస్తారు; కొన్నిచోట్ల, దీనికి చివర ఇనపఊచల చెక్రం గాని రేకుపళ్ళ చెక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (కో. 25).

**డాబీకోల** పర్యా. అడ్డకట్టె (12), అడ్డపట్టె (18), కోడు (3), కోల (6), టాపేటుచెయ్యి, టాపేటులాక, డాబీకోల, డాబీబద్ద, పింజెరకర్ర, పింజెరకోల, పింజెర బద్ద, పేటకోల, పేటుకర్ర (2), పేటులాక, బద్ద (9), రీపరుబద్ద, లాక (6). పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుచెక్కలను తొక్కినప్పుడు, గొలుసుపిక్కలుగానీ, దిండుదిమ్మలు గాని కోలలను పైకిలేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (కో. 36).

**డాబీగొలుసు** పర్యా. చూ. గొలుసు (5). డాబీ కోలలు లేపటానికి, గొలుసు మాదిరిగా, సన్నబద్దలు కూర్చినసాధనం; ఈ బద్దలకుచిన్నపిక్కలు బిగిస్తారు; దీన్ని దిండుకు తగిలిస్తారు. చూ. చిత్రం 132 త. 1 (కో. 25).

**డాబీచెక్రం 1.** పర్యా. చూ. గొలుసు (5). డాబీ కోలలు లేపటానికి గొలుసు మాదిరిగా సన్నబద్దలు కూర్చిన సాధనం — ఈ బద్దలకు చిన్నపిక్కలు బిగిస్తారు; దీన్ని దిండుకు బిగిస్తారు. చూ. చిత్రం 132 త. 1 (కో. 7); **2.** పర్యా. చెక్రం (11), పళ్ళచెక్రం, రూలు చెక్రం. డాబీదిండుకు పక్కగా అమర్చిన చెక్రం; మామూలుగా, రెండు గుండ్రటి బిళ్ళలకు మధ్య ఇనప ఊచలు బిగించింది; కొన్నిచోట్ల, రేకుపండ్ల చెక్రం; దీనిపండ్లను కుక్క గుంజినప్పుడు దిండు తిరుగుతుంది. చూ. చిత్రం 132 చ. 11 (కో. 7, 10).

**డాబీదండ** పర్యా. చూ. గొలుసు (5). డాబీకోలలు లేపటానికి, గొలుసు మాదిరిగా సన్నబద్దలు కూర్చిన సాధనం - ఈ బద్దలకు చిన్నపిక్కలు బిగిస్తారు; దీన్ని దిండుకు తగిలిస్తారు. చూ. చిత్రం 132 త. 1 (కో. 36)

**డాబీదారం** ఉ. డాబి-; పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీఅడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేడలాడదీసిన దారం; డిజైనుకు అవసరమయినన్ని దారాలు కడ తారు. చూ. చిత్రం 132 చ. 10 (రా. 24).

**డాబీనిలువు** పర్యా. నిలువుపట్టె (11). డాబీచట్రం (=తడక) పొడుగుబద్ద; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 132 చ. 4 (రా. 7).

**డాబీనేత** ఉ. డాబినేత; పర్యా. టాపేటునేత, డాబీపని, పింజెరనేత. మగ్గానికి డాబీ అమర్చి, బట్ట అంచున డిజైన్లు పడేట్టు నేసిననేత (కో. 24, 33; రా. 7, 16, 17, 24).

**డాబీపని** పర్యా. చూ. డాబీనేత. మగ్గానికి డాబీ అమర్చి, బట్ట అంచున డిజైన్లు పడేట్టు నేసిననేత; చూ. డాబీ (కో. 7).

**డాబీబద్ద** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావు చెక్కలను తొక్కినప్పుడు, గొలుసుపిక్కలుగాని, దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (కో. 7, 23, 25).

**డాబీబొమ్మ** డాబీకుక్కను గుంజే కొయ్యపుల్ల. చూ. చిత్రం 132 క. 7 (రా. 11).

**డామ్‌గడి** ఒకరకం నేతగడి (కో. 7).

**డార్క్‌చిలకపచ్చ** ముదురు చిలక(ఆకు)పచ్చ రంగు (కో. 2).

**డార్కుబాదామి** ఒకరకం బిస్కట్టురంగు; ముదురు గోధుమరంగు (కో. 2).

**డార్కుమోతీలాల్** ఒకరకం (ముదురు) నీలంరంగు (కో. 2).

**డాలు** చాయ; కత్తు; shade; ఉదా : ఎర్రడాలు, తెల్లడాలు మొ. వి (కో. 2).

**డిజైనంచు** చారలు చారలుగా నేసిన ఒకరకం అంచు (కో. 18).

**డిజైనద్దకం** ఒకరకం అద్దకం; బట్టమీద, డిజైన్లు పడేట్టు కొయ్యఅచ్చుతో రంగు అద్దుతారు (రా. 24).

**డిజైనుకమ్మి** ఏదో ఒక నమూనా పడేట్టు నేసిన కమ్మి (కో. 26).

**డిజైనునాడె** ఉ. డిజైన్నాడె. కమ్మిలో డిజైన్లు పడేట్టు నెయ్యటానికి వాడే నాడె (కో. 26).

**డిజైనునేత** ఉ. డిజన్నేత, డిజేన్నేత, డిజైన్నేత; పర్యా. పేటునేత, పేటుపని. బట్టమీద రకరకాల నమూనాలు పడేట్టు నేసిననేత (కో. 15, 16, 18, 21, 26; రా. 7, 14).

**డిల్లీదర్బారు** ఒకరకం పెద్దగడిచీర (రా. 13).

**డుంకి** పర్యా. చూ. కమాను (1). దూదిపకే కొయ్యపనిముట్టు చూ. చిత్రం 9 (రా. 8).

**డేకిస** నూలులడీలు రంగునీళ్ళలో ఉడకబెట్టే పాత్ర (తె. 11).

**డేచెక్క** చీర అంచులకు రంగు అద్దేటప్పుడు, అంచు మడతలను అదిమిపట్టటానికి వాడే కొయ్యపనిముట్టు; రెండు చెక్కలను ఇనపకడ్డీలతో కలిపి, బోల్టులతో బిగించింది; అంచు చెక్క(లు). చూ. చిత్రం 283 జ. 1 (రా. 10).

**డైమండు** దుప్పట్లకు అంచుల్లో అద్దే రంగుడిజైను; కొయ్యఅచ్చుతో అద్దుతారు. చూ. చిత్రం 283 ద. 3 (రా. 24).

**డైమనుచుక్క** ఉ. డైమాన్‌సుక్క; పర్యా. డైమాను (మార్కు) పేటు. అంచులో నేసే ఒకరకం డిజైను; పేకముక్కల్లో డైమనుచుక్క మాదిరిది. చూ. చిత్రం 194 (కో. 11, 13, 15).

**డైమనుబోర్డరు** డైమనుచుక్క మాదిరి డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 194 (రా. 24).

**డైమాండుపట్టు** కృత్రిమపుపట్టు; అంచులనేతకు వాడతారు (కో. 34).

**డైమానుతాడు** కుచ్చుకు పైన, డైమనుచుక్క ఆకారంలో కట్టినదారం. చూ. చిత్రం 118 చ. 1 (కో. 35).

**డైమాను(మార్కు)పేటు** ఉ. డైమాన్‌ప్లేటు; పర్యా. డైమనుచుక్క. అంచులో నేసే ఒకరకం డిజైను; పేకముక్కల్లో డైమనుచుక్క మాదిరిది. చూ. చిత్రం 194 (కో. 12, 19).

**డైమాన్‌సిల్కు** కృత్రిమపుపట్టు; మాయపట్టు (కో. 12).

**డొక్క** పర్యా. చూ. సొరుగు (2). మరమగ్గం చట్రంలో, పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు; నేతనేసేటప్పుడు, నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (కో. 36).

**డొక్కసం** ఉ. డొగసం, డొగ్గసం; చూ. దొగ్గసం. (కో. 16, 17, 19).

**డొలక** ఉ. డొల్క. **1.** రూ. దొలక; పర్యా. చూ. రాట. గుమ్మటంలాంటి పనిముట్టు; పంటె మొ.వాటికి, దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (కో. 9, 14; తె. 12). **2.** రూ. డోలి (1); పర్యా. గుమ్మి(2). పట్టుదారం చుట్టే కొయ్యపనిముట్టు; అడ్డరాటి మాదిరిది; పెద్దది. చూ. చిత్రం 293 క. 1 (కో. 14; తె. 12).

**డొలకపట్టె** ఉ. డొల్క-; పర్యా. చూ. ఆకు (5). రాటికి కిందా పైనా కట్టిన వెదురు బద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 12).

**డొలకమొద్దు** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటి నూళానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 14).

**డొలముల్లు** పర్యా. చూ. పన్ను (2). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (కో. 27).

**డొల్ల** (-చేయు) రూ. డొల (1); పర్యా. తెర (1), తెరకచ్చి, దొరువు, బొల్లు. పడుగు పైపోగులకు, కింది పోగులకు మధ్య వెలితి; అనిలేని భాగం; మామూలుగా, రెండు అనుల నడుమ పోగులకు డొల్ల ఉంటుంది; సరి చేసేటప్పుడు, అని లాకలు తీసేసి డొల్ల చేస్తారు (కో. 3, 4, 7, 8, 10, 13, 16; రా. 23).

**డొల్లకొయ్య** చూ. డొలగొయ్య (కో. 16).

**డొల్లపాగడ** చూ. డొళ్ళపడుగు (కో. 16).

**డొళ్ళపడుగు** (-అతుకు) రూ. డొల్లపాగడ; పర్యా. తెర (2). ఒకే పొరగా ఉన్న పడుగునూలు; ఒంటిపొర పడుగు (కో. 24).

**డోరి** **1.** (-తిప్పు) చూ. డోలి (2) (రా. 11, 16, 24); **2.** దారం; తివాసీనేతలో నిలువుకు వాడతారు (తె. 17).

**డోరిఇరుసు** పర్యా. ఇరుసు(6). మరానుచెక్రంలో ఆకులు బిగించిన పొడుగాటి ఇనపకడ్డీ. చూ. చిత్రం 50.10 (రా. 24).

**డోరికదురు** పర్యా. చూ. గంటం (1). డబ్బా రాట్నం బొమ్మలకుగాని, దొడ్డినిలువులకుగాని బిగించే మందపు కడ్డీ; పెద్దకదురు. చూ. చిత్రం 41 క. 12 (రా. 24).

**డోరిచెక్రం** పర్యా. చెక్రం (5). మరాను పెద్దచెక్రం; దీన్ని తిప్పుతూ అనుపోస్తారు. చూ. చిత్రం 50.1 (రా. 24).

**డోరిపంటె** పర్యా. చూ. చెలకపంటె. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం కొయ్యపంటె; కొన్ని చోట్ల, వెదురుబద్దలుగాని, రేకుపట్టెలు గాని బిగించింది. చూ. చిత్రం 29 (రా. 24).

**డోరియా** జంపఖానా మగ్గందోనెను మోసే కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 323.1 (తె. 17).

**డోరియా(గడి)చీర** నేతనిలువులోను, అడ్డంలోను రెండేసి - కొన్నిచోట్ల మూడు, నాలుగు - కొలుకుల తరవాత ఒక్కొక్కపోగు పడేట్టు నేసిన చీర; ఖాదీ బొద్దుగళ్ళ మాదిరిగా; చిన్నచిన్న గళ్ళుపడతాయి (కో. 10, 16, 32; తె. 10).

**డోరియాతాను** బొటనవేలెడు వెడల్పున మామూలు నేత, రెండు కొలుకుల పురిదారం (=బాల్దారం) వర సగా నేసిన పొడుగు బట్ట (తె. 15).

**డోరియాతుండు** నేతలో, డోరియాలు పడేట్టు నేసిన తువ్వాలు (కో. 1).

**డోరిరాట్నం** పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం. చూ. చిత్రం 41 (రా. 24).

**డోరీ** ఉ. డోరి. పన్నెకట్టే జంత్రం బొమ్మలు బిగించి కట్టిన గట్టిదారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 4 (కో. 7; రా. 24).

**డోలి 1.** చూ. డొలక(2) (రా.14); **2.** (-పోయు) రూ. డోరి (1). పర్యా. చూ. మరాసు. పెద్దపడుగులు ఒకేసారి పోసే ఒకరకం అను; ఒకగోతిలో పెద్ద చక్రం అమర్చి, దాన్ని తిప్పుతూ పడుగుపోస్తారు; 12-24 పడుగులవరకూ ఒకేసారి దీని మీదికి తోడవచ్చు. చూ. చిత్రం 50 (రా. 13, 15-18, 23).

**డోలికండె** మరాసుమీద పడుగుతోడటానికి, దారం చుట్టిన రేకుడబ్బా; చూ. డబ్బా. చూ. చిత్రం 50.12 (రా. 17).

**డోలిరాట్నం** పర్యా. చూ. పెద్దరాట్నం. పట్టుదారం వడికే ఒకరకం రాట్నం; పెద్దది. చూ. చిత్రం 293 చ. (రా. 14).

**డోలు** పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గం చట్రంలో, పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు; నేతనేసేటప్పుడు, నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.3 (కో. 31).

**డ్రమ్ము** ఉ. డమ్ము, రమ్ము. రంగునీళ్ళు కాచే పెద్ద ఇనపడబ్బా; మామూలుగా, పలకలది; కొన్ని చోట్ల, గుండ్రటిది; దీంట్లో నూలులడీలువేసి ఉడక బెడతారు. చూ. చిత్రం 282 క. 3 (కో. 8; రా. 8, 10, 11, 13, 17, 22-24).

## త

**తకలా** (హిం.) పర్యా. చూ. కదురు (6). అచ్చు కట్టేటప్పుడు, అచ్చుబిళ్ళకు చేర్చి, వడిదారం చుట్టే ఇనపపుల్ల; దీనిబెజ్జంలో దూర్చిన దారం, అచ్చు వడిలో తిప్పి కర్రకు కడతారు; అచ్చుగట్టే సాయెబుల వాడుక. చూ. చిత్రం 92 క. 1 (కో. 5, 14).

**తకిలీ** ఉ. తక్లీ, తగిలి. **1.** పర్యా. తిక్కడ్. చేతితో నూలు వడికే ఇనపపుల్ల; రాట్నం కదురుకంటె చిన్నదిగా ఉంటుంది. చూ. చిత్రం 17.3 (కో. 5; 11-15, 21); **2.** పట్టుదారం వడికే కదురు; చూ. కదురు (కో. 14).

**తక్కిడిబద్ద(లు)** పర్యా. సేరుబద్ద(లు). దూది తూచటానికి, త్రిభుజాకారంలో తాళ్ళతో బిగించి సేరు కోలకు వేలాడదీసిన బద్ద(లు). చూ. చిత్రం 12.4 (కో. 7).

**తక్కెడు** (విఐ.) సీసెడు బరువు; 120 తులాలు (తె. 3, 11).

**తగడం** ఒకరకం లేతవయిలెట్ రంగు (కో. 35).

**తగరం** చూ. తగిరిసె (కో. 1).

**తగిచ్చి** చూ. తగిరిసె (కో. 4).

**తగిటిస** చూ. తగిరిసె (రా. 6).

**తగిరిసె** రూ. తగరం, తగిచ్చి, తగిటిస; పర్యా. తంగెడంచు, తంటెం. పొదగా పెరిగే ఒకరకం చెట్టు *Cassia tora* or *alata*. Linn.); దీని విత్తనాలు నీలి రంగు తయారీలో ఉపయోగిస్తారు (కడవల్లో ఊరేస్తారు) (రా. 23).

**తగుడుజోగివాళ్లు** ఉ.- జోగోల్లు. గొంగళ్ళు నేసే కురమవాళ్ళలో ఒక తెగ; కురమల దగ్గర అడుక్కుంటారు (తె. 11).

**తంగరంచు** చూ. తంగెడంచు (తె. 1).

**తంగెడంచు** రూ. తంగరంచు; పర్యా. చూ. తగిరిసె. పొదగా పెరిగే ఒకరకంచెట్టు (*Cassia tora* or *alata*, Linn.); దీని విత్తనాలు నీలిరంగు తయారీలో ఉపయోగిస్తారు (కడవల్లో ఊరేస్తారు) (తె. 1).

**తంగేడాకు(లు)** ఒకరకం చెట్టు (*Cassia auriculata* Linn.) ఆకు(లు); తొగరు (=ఒకరకం ఎరుపు) రంగు తయారీలో ఉపయోగిస్తారు, (?రా. 19).

**తచ్చు** (క్రి.) పర్యా. చూ. నేతకుంగు. బట్టకు ఒక వైపునేత తక్కువకావటం; రెండోవైపు ఎక్కువవుతుంది (కో. 25).

**తచ్చుకట్టు** (క్రి.) పన్నెకట్టుబడిలో దండెల మధ్య ఈనెలు దగ్గరదగ్గరగా పెట్టి-పుల్లల మధ్య సందులు తక్కువగా ఉండేటట్లు -కట్టటం (కో. 33).

**తచ్చుడుజేయు** (క్రి.) పడుగేరుకర్రలమీద పోగులు సర్ది, నెరపటం (తె. 29).

**తచ్చుపోత** అనుకు తక్కువ నూలు పొయ్యటం; అను చివరినించి ప్రారంభించి మొదటికి పోస్తే తచ్చు పోత (తె. 18).

**తట్టు 1.** పర్యా. నులి. చిక్కుపడ్డ పోగులు (తె. 14 27); **2.** పర్యా. చెంప (1). కుంచె పక్క భాగం; చేత్తో

పట్టుకోటానికి వీలుగా దీనికి, గోనెపట్టావేసి కుడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 76 క. 8 (తె. 19-21, 25, 28, 31); **3.** నేతలో ముద్దగాపడ్డ పోగులు (రా. 8); **4.** నారతో నేసిన గోనెపట్టా (తె. 25).

**తట్టుగూటం** పర్యా. బలపట్టెగూటం. ఉన్నిమగం తాడు బిగింపుకు, అడ్డదారి పక్కన నేలలో పాతిన గూటం (తె. 28).

**తట్టు(డు)కొయ్య** పర్యా. గుంజుడుకొయ్య, తోకర్ర, తోకొయ్య, దాపుకొయ్య, పక్కకొయ్య, పెడకొయ్య, పెడగట్టె. మిడిగూటానికి వేసిన నేత మోకు, పక్కకు అడ్డురాకుండా తగిలించటానికి పాతినగూటం; మామూలుగా, నేతబయలులో ఒకమూల ఉంటుంది; కొన్నిచోట్ల, మిడిగూటానికిగాని, దండెకుగాని కొంచెం ఎడంలో వేస్తారు. చూ. చిత్రం 127.14 (తె. 30, 31).

**తట్టుపడు** (క్రి.) **1.** పర్యా. గట్టుపడు. బట్టలో కొంత చిక్కగా నేసినప్పుడు, మిగిలిన నేతలో తేడా రావటం (కో. 36); **2.** పర్యా. చూ. పూసకట్టు. నేతలో పోగులు ముద్దగా పడటం; పలక గట్టిగా కొట్టి నేసినప్పుడు, ఒక్కొక్కప్పుడు ఇలా జరుగుతుంది (కో. 36).

**తట్టువిరు** (క్రి.) చిక్కుపడ్డ పోగులు విడదియ్యటం; ఉన్నిపడుగు ఏరేటప్పుడు చిక్కుపడ్డ పోగులు విడదీస్తారు (తె. 27).

**తడక 1.** పర్యా. చూ. గొలుసు(5). డాబీకోలలు లేపటానికి, గొలుసు మాదిరిగా సన్నబద్దలు కూర్చిన సాధనం; ఈ బద్దలకు చిన్నపిక్కలు బిగిస్తారు; దీన్ని దిండుకు తగిలిస్తారు. చూ. చిత్రం 132 త. 1 (తె.10); **2.** ఉ. తడిక; పర్యా. టాపేటుతడక, పంజెరం(1), పుల్లలగూడు, పేటుదడి, పేటుపందిరం, బద్దలజల్లెడ. డాబీకిపైన బిగించిన ఇనప ఊచల చట్రం; డాబీకోలలు పక్కలకు జరక్కుండా నిలుపుతుంది; రెండు ఊచల సందులోకి ఒకకోల వస్తుంది. చూ. చిత్రం 132 చ. 3 (కో. 7; తె. 13, 31; రా. 14, 15).

**తడకపింజెర** పర్యా. చూ. గొలుసుపింజెర. ఒక రకం డాబీ; సన్నబద్దల గొలుసు దిండుకు తగిలించింది. చూ. చిత్రం 132 త (తె. 10, 31).

**తడి** (-తీర్చు) రంగులఅద్దకంలో వాడే మిశ్రమం; పటిక, నైట్రిక్ ఏసిడ్ రంగు కలిపింది (తె. 1).

**తడికి** (-కట్టు) నేతలో ఒకరకం డిజైన్లు (=బోను కమ్మిచివర, పట్టెమార్పు మాదిరి బిళ్ళలు) నేయటానికి, కర్రలకు వడిదారాలు కట్టి తయారుచేసిన పనిముట్టు; అచ్చుమాదిరిది; కొన్నిచోట్ల, ఇనపచువ్వలతో కడతారు; దీన్ని, మగ్గంలో అచ్చుకూ పలకకూ మధ్య అమరుస్తారు. చూ. చిత్రం 89 (కో. 7).

**తడికికట్టు** (క్రి.) నేతలో ఒకరకం డిజైను రావటానికి, అచ్చుమాదిరి పరికరం(=తడికి)తయారు చెయ్యటం (కో. 7).

**తడికిబిళ్ళ** ఉ. -బిల్ల. తడికె కట్టటానికి, వడిదారం చుట్టిన కొయ్యపనిముట్టు; రెండు కొయ్యబద్దలకు మూడు ఇనపఊచలు బిగించి ఉంటాయి. చూ. చిత్రం 97 (కో. 7).

**తడికె** మరానుమీద పడుగుతో డేటప్పుడు, పడ్డాలకు ఉన్న నూలు ఒగ్గులపట్టె వరకూ సాపుగా పోవటానికి నిలువుగుంజల మీద అడ్డంగా బిగించిన కొయ్యలు (కో. 12).

**తడిపడుగు** గంజిపడి ఆరని పడుగు (కో. 28).

**తడి(రంగు) 1.** పర్యా. నెప్తాల్. చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసే రంగు; కెంపు,లాకీ,మామిడిచిగురు, లెమను, చేమంతి, తొగరు మొ.వి; నూలులడీలు ఈ రంగునీళ్ళలో మామూలుగా రెండుమూడుసార్లు పిసుకుతారు; రంగు అట్టేకాలం నిలబడదు (రా. 24); **2.** నాటుద్రావకం, పటిక కలిపిన రంగు; కొన్నిచోట్ల, నైట్రిక్ ఏసిడ్, పటిక కలిపింది (కో. 4; తె. 1).

**తడుపాతచేయు** (క్రి.) గంజిపిడచతో పడుగు తట్టటం (రా. 19).

**తడుపుగుడ్డ** డిజైను అద్దకానికి రంగుతొట్టిలో మెత్తపైన వేసిన తడిగుడ్డ (కో. 26).

**తణుకు** పర్యా. చూ. ముత్యం(పేటు). జరీతోగాని, కృత్రిమపు పట్టుతోగాని వరసగా 2-6 పోగులతో నేసిన డిజైను; కొన్నిచోట్ల, జంటగీరలు, కొన్నిచోట్ల చదరంగాను నేస్తారు. చూ. చిత్రం 195 (రా. 14).

**తంబెం** పర్యా. చూ. తగిరిసె. పొదగా పెరిగే ఒకరకం చెట్టు; దీని విత్తనాలు నీలిరంగు తయారీలో ఉపయోగిస్తారు (కడవల్లో ఊరేస్తారు) (కో. 8, 9).

**తత్వశాలిఅంచు** మధ్య నల్లగీరలుపెట్టి నేసిన బొట్టంచు; చూ. బొట్టంచు (రా. 15).

**తన్నుడుకొయ్య** పర్యా. నైడుకొయ్య. పళ్ళచెక్రం గూటం పైపట్టెకు ఆధారంగా పక్కగా బిగించిన కొయ్య. చూ. చిత్రం 122 ట. 5 (కో. 7).

**తన్నుడుచెక్క** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (కో. 7).

**తన్ను(డు)బద్ద 1.** ఒకరకం మరాను(=మడతాను) కట్టుబడిలో, కొలుకులకోలకు, చెక్రంఅకుకు అయి

మూలగా బిగించిన కొయ్యబద్ద (తె. 13); **2.** పర్యా. బంటుబద్ద(2), బిగుబద్ద(2). దోనెముందర నేసినగుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా పైపైపున బిర్రుపెట్టే ఒకరకం చేడుబద్ద; వెదురుది; మామూలుగా, చిన్న నెరువు (=తక్కువ వెడల్పు) బట్టల నేతకు వాడతారు; కొన్నిచోట్ల, చేకుకర్రలకు మారుగాగాని, తోడుగా గాని వాడతారు. చూ. చిత్రం 125 గ(కో. 7, 10, 11).

**తంతిఊచ** సవారుమగ్గం అచ్చులో వరసగా బిగించిన ఇనపతీగ(లు). చూ. చిత్రం 324 ట. 5 (రా. 10).

**తంతికమ్మి** పర్యా. చూ. తంతె(6). ఇనపవడి; దీన్ని పేటుదారానికి చివర కడతారు; చూ. వడి; చూ. చిత్రం 132 చ. 13 (రా. 2).

**తంతె** ఉ. తంతి, త్రెంతి. **1.** పర్యా. చూ. ఒగ్గి. మరానుమీద పడుగు తోడేటప్పుడు, అనులుపడేట్టు పోగును జరపటానికి ఒక కొయ్యపట్టెకు బిగించిన రేకు ముక్క; సుమారు మూడంగుళాల పొడుగుది; దీని బెజ్జంలోనుంచి తీసినపోగు మరానుకు చుట్టుకొంటుంది; మరాను తిరిగినప్పుడు, కీలు ఆడుతూ, కొయ్యపట్టె జరిగి దానికి బిగించిన ఈ రేకుముక్క, పోగునుగూడా జరుపుతుంది; ఇలా జరగటంలో పడుగులో అని పడుతుంది; ఇటువంటివి, పట్టె పొడుగునా వరసగా (కొన్నిచోట్ల, 40) ఉంటాయి. చూ. చిత్రం 50.14 (రా. 17, 24); **2.** పర్యా. లీగె. మరాను కట్టుబడిలో ఆకుల బిగింపుకోసం చుట్టిన ఇనపతీగ(లు) (రా. 2); **3.** పర్యా. చూ. గొలుసు(8). ఊడై అడ్డపట్టెకుగాని, సరిగుంజకు గాని బిగించిన ఇనపపనిముట్టు; దీనికి పొడుగాటి ఇనప కొండ్లు ఉంటాయి. చూ. చిత్రం 63 ర. 2, 70 (రా. 9); **4.** పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడ దీసిన దారం; డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (రా. 18); **5.** పర్యా. చూ. తూకం. పేటువడికి, కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా, ఇనప పుల్ల; కొన్నిచోట్ల, సత్తుది; నేతనేసేటప్పుడు, అని మూసిన తరవాత, వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి, రెండు పక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (రా. 24); **6.** పర్యా. తారు, తంతికమ్మి, తంతెపూస, పూసలవడి, పేటుపూస, ఇనపవడి; దీన్ని పేటుదారానికి చివర కడతారు; చూ. వడి. చూ. చిత్రం 132 చ. 13 (రా. 16, 17).

**తంతెపూస** పర్యా. చూ. తంతె(6). ఇనపవడి; దీన్ని పేటు దారానికి చివర కడతారు; చూ. వడి. చూ. చిత్రం 132 చ. 13 (రా. 18).

**తంతె(ల)పట్టె** ఉ. తెంతిపట్టి; పర్యా. చూ. ఒగ్గుల పట్టె. మరాను కట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే, బెజ్జాలుగల రేకుముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె. చూ. చిత్రం 50.11 (రా. 17, 24).

**తపేలా** ఒకరకం ఇత్తడిగిన్నె; తప్పేలా; దీంట్లో గంజి పోసుకొంటారు (కో. 8).

**తప్పుడుపోగు** అనుపోసినప్పుడు, పడుగులో అని పడకుండా తప్పిన పోగు (కో. 8).

**తబలె** ఉ. తబల. ఒకరకం కుండ; వెడల్పుమూతిది; దీంట్లో కొన్నపిండి ఉడకబెట్టి గంజితీస్తారు (రా. 22).

**తమరకొయ్య** ఎదురు దోనెను మోసే ఎడమవైపు కొయ్యగూటం; గుబ్బకొయ్య. చూ. చిత్రం 110 (రా. 5).

**తంబజముక్కు** అచ్చుతికేటప్పుడు, పన్నెగూడులో దూర్చిన నాలుగు పడుగుపోగులు; పొరపాటున ఇలా అతికినప్పుడు నేత సరిగా రాదు (కో. 2).

**తమ్ముజములు** వరసతప్పి అతికినజమిలిపోగులు(తె.12).

**తమ్ము** (క్రి.) జాడించటం; దుళ్ళేయటం; కానిగుంజ అడ్డకట్టెకు తగిలించిన తడినూలులడీలు కర్రతో పిండి, పోగులు సాపుగా వచ్చేట్టు గుంజుతారు (కో. 5, 8).

**తర** నూలు చిలపకు రంగు చుక్క(=మిరియం) అద్దే అచ్చు (కో. 24).

**తరాజు** చూ. త్రాను (కో. 14).

**తరుచునేత** ఉ. తరుసు(నేత); పర్యా. చూ. గట్టి నేత. పడుగులో పేకదారంపోగులు కలిసిపోయేట్టు చిక్కగా నేసిన నేత (కో. 11).

**తరుచుపుంజంపన్నె** ఈనెలు దగ్గరదగ్గరగా కట్టిన పన్నె; contract reed (కో. 2).

**తర్కిలేటు(నూనె)** ఉ. తర్కిలేట్. ఒకరకం సబ్బు నూనె; ఆముదం, కాస్టిక్‌సోడా కలిపి తయారుచేసింది; రంగు అద్దేముందు, నూలును దీంతో తడిపి శుభ్రం చేస్తారు (తె. 12, 17, 20-25, 29, 30).

**తర్లుచీర** మగపెళ్ళివారింటికి, పెళ్ళికి తరలివెళ్ళేటప్పుడు, పెళ్ళికూతురు కట్టుకొనే చీర (కో. 4).

**తలకచ్చి** సరిచేసిన పడుగులో, అనికిదగ్గరగా లాకలు చేర్చిన (?మొదటి)కచ్చి; మలకచ్చి (తె. 16).

**తలకట్టు** **1**; పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టిన తాడు; ఒకవైపు ఆకునుంచి మరొకవైపు ఆకుకు ఏటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (కో. 12, 14); **2.** పర్యా. చూ. బాసిగం కట్టు. పడుగుదువ్వేకుంచె పిడికి బిగించి వేసినతాడు మెలిక; ఇది బాసిగంకట్టు మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 76 క. 2 (కో. 11).

**తలకట్టుచిట్టె** పర్యా. చూ. తలచిట్టె(1). పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (తె. 21, 26-23).

**తలకట్టువిద్రం** పంటె తలకట్టు కట్టేందుకు, పంటె ఆకుకు పైభాగంలో చేసిన చిల్లి. చూ. చిత్రం 20 (తె. 26).

**తలకట్టుతాడు** పర్యా. చెవులతాడు, తలతాడు(2), తలబిగుతాడు, తలబిరుతాడు, మొలతాడు(1). పంటె తలచిట్టెలకు పైపైపున ఆకుల్ని కలిపికట్టిన తాడు, చూ. చిత్రం 19 క. 5 (కో. 7; తె. 11, 12, 24, 26-28, 31).

**తలకమ్మి** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుచెంపతాళ్ళు కడతారు; నేత నేసేటప్పుడు, ఇది మగ్గంపందిరి మీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 23).

**తలకర్ర** పర్యా. తలగడకర్ర. పడుగుకోత్తలలో (తలవైపు) దూర్చే పడుగేరుకర్ర (కో. 25).

**తలకురుబిళ్ళ** పర్యా. చూ. తలచిట్టె(1). పంటె ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (కో. 36).

**తలకొయ్య** పర్యా. తల్లికొయ్య, దండెకొయ్య(1), ముంగటికొయ్య, ముందుకొయ్య, మేలుకొయ్య(1), మొదటికొయ్య, మొదటకోల. తలపీటకుఉండే(మొదటి చాలు)కొయ్య(లు); వెనకపీటకొయ్యలకంటెపీటిసంఖ్య ఎక్కువ. చిత్రం 45 క. 5 (కో. 28, 29, 31; తె. 24).

**తలకోలకి** 1. పర్యా. చూ. కోత్తల. పడుగులో మొదటగాని, చివరగాని అనిపక్కన కర్ర దూర్చే భాగం; ఇటువంటివి రెండుంటాయి; అచ్చుతికేటప్పుడు పైపోగులు తెంపి అతుకుతారు (తె. 17); 2. దొడ్డి (=ఒకరకం చేతి అసు) నిలువుపట్టెకు బిగించిన కొయ్య. చూ. చిత్రం 45 చ. 1 (కో. 21).

**తలకోల** 1. పర్యా. చూ. కోత్తల. పడుగులో మొదటగాని, చివరగాని అని పక్కన కర్రదూర్చే భాగం; ఇటువంటివి రెండుంటాయి; అచ్చుతికేటప్పుడు, పైపోగులు తెంపి అతుకుతారు (తె. 16); 2. పర్యా. చూ. పడుగేరుకర్ర, పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, సన్నటికర్ర; దీన్ని కోత్తల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (తె. 24); 3. ఉ. తలగోల, ఉన్నిపడుగులో, బిగింపుకోసం, చివర ఎక్కించిన కర్ర; దీన్ని, సరిచేసేటప్పుడు సరిగుంజకుగాని, రాయికిగాని కడతారు; నేత నేసేటప్పుడు, తలగూటం దగ్గర మగ్గం తాడు కట్టి, ఊడుగోలతాళ్ళు తగిలిస్తారు. చూ. చిత్రాలు 314.5, 315.14 (తె. 9-11, 20, 22, 25-27).

**తలగట్టుకొయ్య** పర్యా. చూ. మిడిగూటం(2). నేతజంటలులో చివరపాతినకొయ్య; దీనికి నేలమోకుతో కొలికివేసి, పెడకోలకుచుట్టి, పడుగు బిరుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకు కట్టి, దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 26, 27).

**తలగడకర్ర** పర్యా. తలకర్ర. పడుగుకోత్తలలో (తలవైపు) దూర్చే పడుగేరుకర్ర (కో. 27).

**తలగుడ్డ** పర్యా. చూ. పాగ. తలకు చుట్టుకోటానికి నేసిన బట్ట; మామూలుగా, అయిదు (కొన్నిచోట్ల, 2½-3) గజాల పొడుగు నేస్తారు; అర్ధం ముప్పాతిక గజంనుంచి, గజం పైవరకూ పెడతారు; కొన్నిచోట్ల, అంచులేకుండా నేస్తారు; మామూలుగా, తెల్లది; కొన్నిచోట్ల, రంగులు, గీరలు, గళ్ళు మొ.వి పెట్టి నేస్తారు (కో. 8, 9, 24).

**తలగూటం** 1. చూ. సరిగూటం(3). సరిచేసేటప్పుడు, ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్ర(=దానె) బిగింపు కోసం నేలలో పాతినకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి; మామూలుగా, ఒకవైపున రెండు, మరొకవైపున ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 314.11 (తె. 9) 2. పర్యా. తాడుగూటం(3), బాలగూటం, మగ్గంగూటం. ఉన్ని మగ్గానికి చేసిన పడుగు బిగింపుకోసం చివర, నేలలో పాతినకొయ్య; కొన్నిచోట్ల, రాయి; మగ్గంతాడు దీనికి తగిలించి బిగిస్తారు. చూ. చిత్రం 315.18, 27 (తె. 3, 7, 9, 25).

**తలచిట్టె** ఉ. తలచిట్టే, తలసిట్ట, తల్చిట్ట. 1. పర్యా. తలకట్టుచిట్టె, తలకురుబిళ్ళ, తలచిడత, తలచిల్లి, తలదబ్బ, తలదాపు, తలపల్లి, తలబల్లి(2), తలబిరుబద్ద, తలమిట్ట, తల్లిబిడిబద్ద, మట్టుబల్లి(3). పంటె ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (తె. 5, 10, 11, 14, 17, 18, 20, 22-25, 29-32); 2. (-కట్టు). కమ్మినేతలో పెద్దపట్టెకుముందు, 3-8 కొలుకుల దారంతో గీరలుగీరలుగా నేసిన భాగం. చూ. చిత్రం 272.1 (కో. 4, 5, 8); 3. (-కట్టు) కమ్మిపక్కన రెండేసి కొలుకుల దారంతో నేసిన రెండు గీరలు; కొన్నిచోట్ల, సన్నపట్టె (కో. 6, 7).

**తలచిడత** రూ. తలచిరత; పర్యా. చూ. తలచిట్టె(1). పంటె ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (తె. 19).

**తలచిరత** చూ. తలచిరత (తె. 33)

**తలచిల్ల** ఉ. తలసిల్ల; పర్యా. చూ. తలచిట్టె (1). పంటెఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (రా. 18).

**తలతాడు 1.** పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టినతాడు. ఒకవైపు ఆకునుంచి మరొకవైపు ఆకుకు పటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (కో. 5, 10, 21, 23; రా. 18); **2.** ఉ. తల్తాడు పర్యా. చూ. తలకట్టుతాడు. పంటె తలచిట్టెలకు పైవైపున ఆకుల్ని కలిపి కట్టినతాడు. చూ. చిత్రం 19 క. 5 (కో. 10).

**తలదబ్బ** పర్యా. చూ. తలచిట్టె(1). పంటెఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (రా. 11).

**తలదాపు** ఉ. తల్దాపు; పర్యా. చూ. తలచిట్టె(1). పంటె ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (కో. 35).

**తలనేత** బట్ట అడ్డకొనలో బద్దె అవతల నేసిన భాగం (రా. 15).

**తలపట్టె 1.** పర్యా. చూ. ఊత్తెదండె. ఊత్తెపై వైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (రా. 18); **2.** పర్యా. మేరువుపలక. మరమగ్గంచట్రంలో నిలువుపట్టెలకు బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి కుచ్చు చెంప తాళ్ళు కడతారు. నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరి మీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 116.3 (కో. 12).

**తలపలక** పర్యా. తలారు, పలక(3), పంకా. కమాను (=దూదిఏకే కొయ్యపనిముట్టు)కు ఒకవైపున ఉండే వెడల్పు కొయ్యపలక. చూ. చిత్రం 9.2 (కో. 6, 7).

**తలపల్ల** పర్యా. చూ. తలచిట్టె(1). పంటె ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (తె. 9).

**తలపాగ** ఉ. -పాగా; పర్యా. చూ. పాగ. తలకు చుట్టుకోటానికి నేసినబట్ట; మామూలుగా, అయిదు (కొన్నిచోట్ల, 2½-8) గజాల పొడుగు నేస్తారు; అడ్డం ముప్పావుక గజంనుంచి గజంపై వరకూ పెడతారు; కొన్నిచోట్ల, అంచులేకుండా నేస్తారు; మామూలుగా తెల్లది; కొన్నిచోట్ల, రంగులు, గీరలు, గళ్ళు మొ.వి పెట్టి నేస్తారు. (కో. 15, 16, 18, 19).

**తలపీట** పర్యా. అనిబల్ల, కోలబల్ల(1), తలబల్ల(1) పెద్దఅడ్డపీట, పెద్దపీట, పైపట్టె(1), ముంగటిపట్టె, ముంగటిపీట, ముందుబల్ల, మేలుపట్టె, మొదటిపీట. ఆసుపీటల్లో మొదటిది; దీనికి ఒకటి, రెండు చాళ్ళలో ఆసుకొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (కో. 28; తె. 24).

**తలపుల్ల** రాటి పైపుల్ల; చూ. ఆకు (రా. 18).

**తలబల్ల 1.** పర్యా. చూ. తలపీట. ఆసుపీటల్లో మొదటిది; దీనికి ఒకటి రెండు చాళ్ళలో ఆసుకొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (కో. 29, 31); **2.** పర్యా. చూ. తలచిట్టె (1). పంటె ఆకులబిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (కో. 28).

**తలబిగుతాడు** పర్యా. చూ. తలకట్టుతాడు. పంటె తల చిట్టెలకు పైవైపున ఆకుల్ని కలిపి కట్టినతాడు. చూ. చిత్రం 19 క. 5 (తె. 33).

**తలబిరుతాడు** పర్యా. చూ. తలకట్టుతాడు. పంటె తలచిట్టెలకు పైవైపున ఆకుల్ని కలిపి కట్టినతాడు. చూ. చిత్రం 19 క. 5 (కో. 27, 28).

**తలబిరుబద్ద** పర్యా. చూ. తలచిట్టె (1). పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (కో. 29).

**తలమిట్ట** పర్యా. చూ. తలచిట్టె (1). పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దలో పైది. చూ. చిత్రం 19 క. 3 (కో. 27).

**తలంబ్రాలకోక** పర్యా. తలంబ్రాలచీర. పెళ్ళిసమయంలో, పెళ్ళికూతురు కట్టుకొనేచీర; నారింజ వన్నె అంచుపెట్టిన తెల్లచీర; కొన్నిచోట్ల, దీన్ని పసుపు నీళ్ళలో ముంచి కట్టిస్తారు; కొన్నిచోట్ల, ప్రధానం చీరం మాదిరిగా నేస్తారు; కొన్నిచోట్ల, అంచులేకుండా, బొట్టెకమ్మి పెట్టి నేస్తారు; దీన్ని కట్టుకొనేటప్పుడు బద్దె చింప గూడదట; కొన్నిచోట్ల పచ్చరంగులోగాని, వయిలెట్‌లోగాని అంచు, కమ్మి పెట్టి నేస్తారు; ఎరుపు, నలుపువన్నెలు మాత్రం పెట్టగూడదట; కొన్నిచోట్ల; ముప్పేటకమ్మి, మూడువేళ్ళ వెడల్పున పచ్చంచుపెట్టి నేస్తారు (కో. 4).

**తలంబ్రాలగుడ్డ(లు)** పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు కట్టుకొనే బట్ట(లు); దీనిమీద తలంబ్రాలు పడతాయి (కో. 3).

**తలంబ్రాలచీర** రూ. తలవాలచీర; పర్యా. తలంబ్రాలకోక. పెళ్ళిసమయంలో, పెళ్ళికూతురు కట్టుకొనేచీర; నారింజవన్నె అంచుపెట్టిన తెల్లచీర; కొన్నిచోట్ల, దీన్ని పసుపునీళ్ళలో ముంచి కట్టిస్తారు; కొన్నిచోట్ల, ప్రధానంచీర మాదిరిగా నేస్తారు; కొన్నిచోట్ల, అంచులేకుండా. బొట్టెకమ్మి పెట్టి నేస్తారు; దీన్ని కట్టుకొనేటప్పుడు బద్దె చింపగూడదట: కొన్నిచోట్ల, పచ్చ

రంగులోగాని, వయిలెట్ లోగాని అంచు కమ్మి పెట్టి నేస్తారు; ఎరుపు, నలుపు వన్నెలు మాత్రం పెట్టగూడదట; కొన్నిచోట్ల, ముప్పేటకమ్మి; మూడువేళ్ళ వెడల్పున పచ్చంచు పెట్టి నేస్తారు (కో. 7, 8, 11; రా. 13, 24).

**తలంబ్రాలపంచె** రూ. తలవాలుపంచె. పెళ్ళికొడుకు కట్టుకొనే ధోవతి; దీనిమీద తలంబ్రాలు పడతాయి (కో. 4).

**తలరుమాలు** ఉ. తల్రుమాలు; పర్యా. చూ. పాగ. తలకు చుట్టుకోటానికి నేసిన బట్ట; మామూలుగా, అయిదు(కొన్నిచోట్ల, 2½-3)గజాలపొడుగు నేస్తారు; అడ్డం ముప్పాతికగజం నుంచి గజం పైవరకూ పెడతారు; కొన్నిచోట్ల, అంచులేకుండా నేస్తారు; మామూలుగా, తెల్లది; కొన్నిచోట్ల, రంగులు, గీరలు, గళ్ళు మొ.వి పెట్టి నేస్తారు (కో. 23).

**తలవాలచీర** ఉ. తలవాలుసీర; చూ. తలంబ్రాలచీర (రా. 15, 17, 18, 23).

**తలవాలసెల్లా** పెళ్ళికొడుకు, పైన కప్పుకోటానికి నేసిన కండువా; తలంబ్రాలసెల్లా (రా. 18).

**తలవాలుపచ్చడం** ఇరవై నాలుగు మూరల పొడుగు, నాలుగు మూరల వెడల్పు చొప్పున రెండు పొరలుగా నేసిన ఒకరకం పచ్చడం; తలంబ్రాల పచ్చడం (పెళ్ళికొడుకు కప్పుకొనేది) (రా. 15).

**తలవాలుపంచె** చూ. తలంబ్రాలపంచె (రా. 15,23).

**తలవాలురైక** పచ్చరంగులో నేసిన రవికెగుడ్డ (రా. 18).

**తలారు** పర్యా. చూ. తలపలక. కమాను(=దూది ఏకే కొయ్యపనిముట్టు)కు ఒకవైపున ఉండే వెడల్పు కొయ్యపలక. చూ. చిత్రం 9.2 (కో. 5).

**తల్లికొయ్య** పర్యా. చూ. తలకొయ్య. తలపీటకు ఉండే (మొదటి చాలు) కొయ్య(లు); వెనకపీట కొయ్యలకంటె వీటి సంఖ్య ఎక్కువ. చూ. చిత్రం 45 క. 5 (కో. 34).

**తల్లితాడు** పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో, పోగుల వరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల సన్నబద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (తె. 8).

**తల్లిపడుగు** పర్యా. బొడ్డు(7). రెండంచులకూ మధ్య భాగంలో ఉన్న నేతపడుగు (కో. 7).

**తల్లిప్రేమ** ఒకరకం అద్దకం డిజైను; కొయ్య అచ్చులతో, నాలుగయిదు రంగుల్లో అద్దుతారు; ఉదా : ఆకుపచ్చ, నలుపు, పసుప్పచ్చ, ఎరుపు, నలుపు. చూ. చిత్రం 283 ద. 1 (రా. 24).



**తల్లిబాదరు** ఉ. – బాదరు. నాలుగయిదు రంగులు వరసగాపెట్టి నేసిన ఒకరకం అంచు (కో. 7).

**తల్లిపిడిబద్ద** పర్యా. చూ. లలచిట్టె(1). పంజెజకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (కో. 31).

**తల్లివాయినంచీర** పెళ్ళికూతురి తల్లికి (వియ్యపురాలు) పెట్టే చీర (కో. 15, 17).

**తవిటి** చూ. తొగటు (కో. 9బి).

**తవుడు** వడ్లు దంపగా వచ్చేపొడి; దీన్ని పసలిపురుగులకు ఆహారంగా నేస్తారు (తె. 17).

**తళ్ళుతీర్చు** (క్రి.) (< తడులు-) నూలుకు, తడి (=నాటుద్రావకం, పటికవేసి తయారుచేసిన రంగు), అద్దటం; తడిరంగులో లడీలువేసి పిసుకుతారు (కో. 4).

**తాట** చెట్టు బెరడు (కో. 3).

**తాటుపొద్దు(లు)** ఒకరకం కమ్మి నేసిన చీర(లు) (రా. 19బి).

**తాటినార** ఉ. తాట్నార. తాటికమ్మలు చితకగొట్టి తీసిననార; తాళ్ళువేసటానికి, తడపకట్టుకు వాడతారు (కో. 11-13, 30).

**తాటిబద్ది** నాలుగు పోగులుకలిపి పురిపెట్టిన దారం; పేరంటాలచీర చెరగులో నేస్తారు (కో. 4).

**తాత్తేకుకమ్మి** ఉ. తాత్తేక్కమ్మి. బెత్తెడు వెడల్పున కడ్డీమాదిరిగా నేసిన ఏకాండికమ్మి (కో. 16).

**తాత్తేకంచు** బెత్తెడు వెడల్పున నేసిన అంచు (కో. 6; రా. 17).

**తాడు** **1**. పర్యా. సేరు(లు). సేరుకోల(=దూది తూచే ఒకరకం తక్కెడకట్టె)కు సేరుబద్దలు వేలాడదీసినతాడు. చూ. చిత్రం 12.3 (కో. 7); **2.** పర్యా. చూ. పురి(1). రాట్నం ఆకులతాడును, కదురును కలిపే గట్టిదారం; దీనివల్ల కదురు తిరుగుతుంది. చూ. చిత్రం 15.6 (కో. 7, 13, 16, 17, 20, 22, 23, 26, 32, 35-37; తె.2.10, 18;రా.1) **3.** పర్యా. చూ. గుమ్మిదారం. రాటిఆకులు పైవీ కిందివీ, కలిపి కట్టినదారం చూ. చిత్రం 31 ప. 4 (తె. 6, 7, 21-27, 29, 31, 32, 37); **4.** పర్యా. చూ. వడిదారం(2). డబ్బారాట్నం చక్రాన్ని గంటాన్ని కలిపే గట్టిదారం; దీనివల్ల గంటం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 8 (కో. 7, 35; రా. 1); **5.** అడ్డగుమ్మి ఆకులు కలిపి కట్టిన దారం (తె. 8); **6.** (-పన్ను) పర్యా. చూ. ఊడైతాడు(1). ఊడైను నిలబెట్టి, కింది గూటానికి బిగించే తాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (కో. 9, 10, 12-15, 18, 19, 25, 27, 28, 30, 31; తె. 1, 3-6, 9-17, 19,

22, 24, 33; రా. 4, 16, 17, 22, 24); **7.** పర్యా. చూ. వడి(దారం)(3). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుకర్రలకుకట్టే పురిదారం; కొన్నిచోట్ల, మిషను రీలు దారం వాడతారు; మొదట అచ్చుబిళ్ళకుచుట్టి, తరవాత కర్రకు దూరుస్తారు; చూ. వడి (రా. 19ఎ); **8.** పర్యా. చూ. ఉడతతాడు. మగ్గం ఉడతకు, పైన కట్టినదారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (కో. 3; రా. 1); **9.** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్టమీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగు దారం; దీనికొసలు, చేడుబొందులు - కొన్నిచోట్ల, కర్రలు-రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (రా. 20); **10.** పర్యా. చూ. పంటిగుది- దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి, పుల్ల(=పన్ను)కు కట్టినతాడు; ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.2 (కో. 7, 10; తె. 7, 14); **11.** పర్యా. చూ. పలకసూత్రం. చేతిమగ్గం పలకను పైనుంచి వేలాడదియ్యటానికి పలక బుజానికి కట్టినదారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 6 (కో. 14); **12.** పర్యా. చూ. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగర్ర- కొన్నిచోట్ల, మలబద్ద- దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (తె. 3, 14, 18, 24).

**తాడుకొయ్య** ఉ. -కొయ, -గొయ్య. **1.** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతిఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 19; తె. 4, 5, 17, 21, 24, 29, 33); **2.** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు మడిమ దగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనక తాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 22); **3.** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతిన కొయ్య; దీనికి, నేతమోకుతో కొలికివేసి, పెడకోలకు చుట్టి, పడుగుబిర్రుపెట్టటానికి వెనకకుగుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకుకట్టి దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 9, 21, 30-32).

**తాడుకొలకడ** ఉ. -కొల్కడ. గొంగడి నెయ్యటానికి చాపిన ఉన్నిపడుగు బిగింపుకు, మగ్గంతాడుతో. తల గూటానికి వేసిన కొలికి; చూ. తలగూటం (తె. 11).

**తాడుగుంజ** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద, నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతి వైపున నేలలో పాతిఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (తె. 19, 20).

**తాడుగూటం 1.** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతిన కొయ్య; దీనికినేతమోకుతో కొలికివేసి, పెడకోలకు చుట్టి, పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకుకట్టి, దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 3); **2.** పర్యా. చూ. చేతిగూటం(2). గొంగడినేసే మగ్గంతాడు బిగింపుకు పనివాడి కుడిచేతి దగ్గర, నేలలో పాతినకొయ్య. చూ. చిత్రం 316 క. 4 (తె. 3, 25); **3.** పర్యా. చూ. తలగూటం(2). ఉన్ని మగ్గానికివేసిన పడుగు బిగింపుకోసం చివర నేలలో పాతినకొయ్య; కొన్నిచోట్ల, రాయి; మగ్గంతాడు దీనికి బిగిస్తారు. చూ. చిత్రం 315 క. 18 (తె. 11, 28).

**తాడుపొగడ** ఉ. -పొగడి. అచ్చుకర్రమీద బిగించే కొండితాడు పేనటానికి పనికివచ్చేనూలు (కో. 20).

**తాడుపేనుబండి** పర్యా. చూ. బట్న(1). పన్నెకట్టుబడిలో ఈనెలు బిగించటానికివాడే దారం పురిపెట్టే కదురు; మామూలుగా దీనికి కొయ్యదిండు బిగిస్తారు. చూ. చిత్రం 89 క. 3 (కో. 26).

**తాడుబట్టుకొయ్య** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకు కట్టేకొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (తె. 30).

**తాడుబిక్కొయ్య** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108. 5, 122, 127.16.

**తాడుపేనుపుల్ల** పర్యా. చూ. బట్న(1). పన్నెకట్టుబడిలో ఈనెలు బిగించటానికివాడే దారం పురిపెట్టే కదురు; మామూలుగా, దీనికి కొయ్యదిండు బిగిస్తారు. చూ. చిత్రం 89 క. 3 (కో. 33).

**తాడుమగ్గం** పర్యా. చూ. మరమగ్గం. ఒకరకం మగ్గం; నేతనేసేటప్పుడు, పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజేది; మగ్గంపలక, పన్నె ఒక కొయ్యచట్రంలో బిగించి, పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు; చూ. మగ్గంచట్రం. చూ. చిత్రం 108 (కో. 20).

**తాడేనుగర్ర** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టేకొయ్య; నేతపని

వాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 22).

**తాన** ఉ.తాను. తివాసీనేతలో నిలువుకువాడే నూలు (కో. 16; తె. 17).

**తానపోయు** (క్రి.) తివాసీనేతలో నిలువుకు వాడే నూలులో కింది పోగులకు, పై పోగులకు మధ్య అనులు పడేట్టు అనుపొయ్యటం (తె. 17).

**తానిరేషం** ?నాసిరకం పట్టు (రా. 21).

**తాను** (బహు. తాండ్లు, తాన్లు) **1.** చొక్కాలగుడ్డ (కో. 18, 26-28, 31); **2.** ఇరవై నాలుగు గజాల పొడుగుగుడ్డ (కో. 3).

**తానుపుల్ల** పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడె గాడిలో, అడ్డంగా బిగించినపుల్ల; పేకపోగు చిక్కుపడకుండా సాఫుగా రావటానికి దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (రా. 14).

**తానె 1.** ఉ. తాని; పర్యా. చూ. అను(1). పడుగు నూలు పోసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రాలు 45-47 (తె. 15-17; 26, 27, 31-33; రా. 18); **2.** జంపఖానానేతకోసం పడుగునూలు పోసే కొయ్యపనిముట్టు; చూ. అను (తె. 17).

**తానెకాలు** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగు పట్టె(లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (తె. 27).

**తానెకొయ్య 1.** ఉ. -గొయ్య; పర్యా. చూ. అనుకొయ్య(3); అనుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టి వచ్చేట్టు అనుకు నూలు పోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (తె. 15, 27, 31-33); **2.** జంపఖానానేతలో నిలువుకువాడే నూలుచుట్టే కొయ్యపుల్ల(లు); తానెకు బిగించినవి (తె. 17).

**తానెకోడు** రూ. టానికోడు; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్రల తాళ్ళూ మధ్యలో పావుచెక్కల తాళ్ళూకట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (తె. 1).

**తానెకోడుతాడు** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి చూ. చిత్రం 121 క. 4 (తె. 1).

**తానెకోల(కట్టె)** ఉ. తానికోల, తానికోలు; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళూ మధ్యలో పావుచెక్కలతాళ్ళూ కట్టిఉంటాయి. ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (తె. 1, 2, 4, 6; రా. 14-16, 18, 22-24).

**తానెకోలకట్టెతాడు** ఉ. తాని-; పర్యా. చూ. అచ్చుగుది(2); మగ్గంలో, పూనుగర్రకు కట్టే సదారం; అచ్చు కిందికర్రకు ఉండేది; ఇటువంటివి, కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (రా. 15).

**తానెగుదితాడు** పర్యా. చూ. అచ్చుగుది(2). మగ్గంలో, పూనుగర్రకు కట్టే సదారం; అచ్చులో కింది కర్రకు ఉండేది; ఇటువంటివి కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (తె. 6).

**తానెదొడ్డి** అనుపీటల మధ్య సందు. చూ. చిత్రం 45 క. 9 (తె. 16).

**తానెపట్టె** ఉ. తాని-; పర్యా. చూ. అనుపీట. అనుకొయ్య(=అనుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి, మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క.1-3 (రా. 18).

**తానెపీట 1.** పర్యా. చూ. అనుపీట. అనుకొయ్య(=అనుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి, మామూలుగా మూడు, కొన్ని చోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (తె. 26, 32, 33); **2.** పర్యా. చిటికెపీట. చిటికె అద్దకంలో నూలుతోడే కొయ్యపనిముట్టు; అనుమాదిరిది. చూ. చిత్రం 285 (తె. 11).

**తానెపుల్ల** ఉ. తాని-; పర్యా. చూ. అనుకొయ్య(3). అనుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టి వచ్చేట్టు అనుకు నూలు పోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (కో. 18; తె. 16; రా. 18).

**తాపనకొయ్య** పర్యా. చూ. కొలతకొయ్య. అనుపొడుగుపీటమీద అమర్చిన కొయ్య(లు); పడుగు పెంచుకోటానికిగాని, తగ్గించుకోటానికిగాని ఇవి పనికివస్తాయి. చూ. చిత్రం 45 ట. 2-5 (కో. 33).

**తాపుచెక్క** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో. 14).

**తామరకమలం** అంచులో తామరఆకు, తామరపువ్వుల బొమ్మలు నేసిన డిజైను. చూ. చిత్రం 169(తె. 4).

**తామరపువ్వుపేటు** పర్యా. చూ. కమలం(పేటు). తామరపువ్వు ఆకారంలో అంచులో నేసిన డిజైను. చూ. చిత్రం 169 (రా. 8).

**తాంబుచీర** అంచులో పెద్దగీరలు–తెలుపు, తొగరు, నలుపురంగుల్లో–పడేట్లు నేసిన చీర (తె. 24).

**తాంబూలతట్టి** తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 10).

**తాంబూలపుచీర** ఉ. తాంబోలపుసీర, తాంబోళపు సీర; చూ. తాంబూలంచీర (తె. 15; రా. 16).

**తాంబూలపొల్లె** (< తాంబూలపువల్లె) ఉ.తాంబోల పొల్లె; పర్యా. చూ. ప్రధానంచీర. లగ్ననిశ్చయసమయంలో (తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు)మగపెళ్ళివారు, పెళ్ళికూతురికి పెట్టేచీర; కొన్నిచోట్ల పట్టుది; పచ్చరంగులోగాని, వయిలెట్ రంగులోగాని రెండు వేళ్ళవెడల్పు అంచులు, బెత్తెడు వెడల్పు కమ్ములు నేస్తారు; మామూలుగా, తెల్లచీర; ఇటీవల కొన్నిచోట్ల, ఆకుపచ్చ, పసుప్పచ్చ, గులాబి మొ. రంగుల్లో నేస్తున్నారు; మూరెడు పొడుగు కొంగు రంగులోను, జరీలోను నేస్తారు; కొన్నిచోట్ల, బీరపువ్వు, తెలుపు పోగులు వరసగాపెట్టి అంచులో డిజైన్లు నేస్తారు; ఎరుపు, నలుపు రంగులు మాత్రం వాడరట (తె. 14).

**తాంబూలంచీర** ఉ. తాంబళంచీర, తాంబోళం. తాంబోలంచిర, తాంబోళంసీర; రూ. తాంబూలపుచీర; పర్యా. చూ. ప్రధానంచీర. లగ్ననిశ్చయ సమయంలో (తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు) మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టేచీర; కొన్నిచోట్ల, పట్టుది; పచ్చ రంగులోగాని, వయిలెట్ రంగులోగాని రెండువేళ్ళ వెడల్పు అంచులు, బెత్తెడు వెడల్పు కమ్ములు నేస్తారు; మామూలుగా, తెల్లచీర; ఇటీవల కొన్నిచోట్ల, ఆకు పచ్చ, పసుప్పచ్చ గులాబి మొ. రంగుల్లో నేస్తున్నారు; మూరెడుపొడుగు కొంగు రంగులోను,జరీలోను నేస్తారు; కొన్నిచోట్ల, బీరపువ్వు, తెలుపు పోగులు వరసగాపెట్టి అంచులో డిజైన్లు నేస్తారు; ఎరుపు, నలుపు రంగులు మాత్రం వాడరట (తె. 13; రా. 17, 23, 24).

**తాంబోళం** రూ. స్థాంబాలం. పెద్ద ఇత్తడి పళ్ళెం; దీంట్లో దసలికాయలు పోస్తారు (తె. 17).

**తార(వన్నె)** **1.** ఒకరకం నీలంరంగు; అంజలి. చూ. చిత్రం 288 (కో. 2, 3, 10, 12, 26, 35, 36); **2.** నీలంరంగులో నలుపుచాయ (కో. 11).

**తారవన్నెచీర** లేతనీలంరంగు చీర (కో. 26).

**తారామండలం** **1.** ఒకమాదిరి ఎర్రంచుపెట్టి నేసిన మేలిరకంచీర (తె. 16); **2.** కపిల, తెలుపు, కిర్మంజి రంగుల్లో పట్టు, నూలుకలిపి నేసినచీర (తె. 5).

**తారు** **1.** పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్ని చోట్ల, ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (తె. 31); **2.** పర్యా. చూ. తంతె (6). ఇనపవడి; దీన్ని పేటుదారానికి చివర కడతారు; చూ. వడి. చూ. చిత్రం 132 చ. 13 (తె. 32).

**తారుపిన్ని** (< -pin)నేతనేసేటప్పుడు, పడుగులో తెగిపోయిన పోగును దగ్గరికి లాగటానికి, పన్నెగూడులో నుంచి పోగులను తియ్యటానికి వాడే ఇనపముల్లు; కంటాణీ మాదిరిది. చూ. చిత్రం 139 (తె. 18).

**తార్పిన్** (హిం. తార్-) పర్యా. చూ. బెంతికదురు. అచ్చుకట్టేటప్పుడు, పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల; మామూలుగా, ఇనపది; కంటాణీలాంటిది; దీనికి పదును ఉన్నవైపు, పోగు దూర్చటానికి చిన్నకొక్కెం ఉంటుంది; కొన్నిచోట్ల, రెండోవైపు పిడిఉంటుంది; అచ్చుకట్టేవాళ్ళవాడుక. చూ. చిత్రం 94 (తె. 21).

**తాళ్ళరాటి** ఉ. తాల్ల-. ఒకరకంరాటి; చూ. రాటి. చూ. చిత్రం 31 చ (కో. 25).

**తాళం** ఉ. తాలం. ?మరాసులో బెండకాయచెక్రం పక్కన బిగించిన ఇనపరేకు (కో. 4).

**తిక్కడ్** ఉ. టికడ్, తికడీ; పర్యా. తకిలీ(1). చేతిలో నూలు వడికే ఇనపపుల్ల; రాట్నం కదురుకంటె చిన్నదిగా ఉంటుంది. చూ. చిత్రం 17.3 (తె. 12, 13)

**తిక్కనార** (< ?కిత్తనార) అనానసమొక్క మాదిరి ఒకరకం మొక్కనుంచి తీసిన నార (కో. 20).

**తిక్కిడి** **1.** రూ. తిక్కుడు. నారనుంచి దారంతీసే కదురు(పుల్ల); చివర సన్నపుల్లలు బిగించింది. చూ. చిత్రం 300 (కో. 13, 14; రా. 21); **2.** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంటె మొ. వాటికి దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (తె. 17).

**తిక్కిడిపుల్ల(లు)** తిక్కిడికట్టుబడిలో, చివరబిగించిన పుల్ల(లు). చూ. చిత్రం 300 (రా. 21).

**తిక్కిడిమొద్దు** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటినూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు. చూ. చిత్రాలు 31 క. 1, 36 (తె. 17).

**తిక్కు** (క్రి.) పర్యా. చూ. తోము. గంజి వడగట్టటానికి గుడ్డలో పోసి రుద్దటం; పామటం (రా. 18).

**తిక్కుడు** చూ. తిక్కిడి(1) (కో. 15).

**తిడి** పర్యా. చూ. లడి(1). పెట్టెలో ఉండే నూలు కట్ట; ఏ నెంబరునూలో, అన్ని లడీలు ఒక్కొక్క పెట్టెలోఉంటాయి; లడీబరువు = $\frac{\text{పదిపౌన్లు}}{\text{నూలు నెంబరు}}$ (రా11).

**తిప్పు** (క్రి.) రూ. తింపు; పర్యా. చూ. తోడు. పంటెకుగాని, డబ్బాకుగాని నూలు చుట్టటం (కో. 2; తె. 4, 5; 12, 14-16, 19, 29; రా. 11, 14).

**తిప్పుకర్ర** పర్యా. చూ. చెయ్యి(2). రాట్నం ఇరుసు తిప్పే కొయ్యపిడి. చూ. చిత్రం 15.9 (కో. 30).

**తిప్పుకొయ్య** ఉ. తిప్పకొయ్య; రూ. తీపుకొయ్య; పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రు పెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతి వైపున నేలలో పాతిఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 28, 37).

**తిప్పుచెయ్యి** ఉ. -చెయ్య, -జెయ్యి, -సెయ్య, సెయ్యి. **1.** రూ. తిప్పుడుచెయ్యి (2); పర్యా. చూ. చెయ్యి (2). రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. చూ. చిత్రం 15.9 (కో. 22-28, 31-33, 36); **2.** పర్యా. చూ. చెయ్యి(3). దబ్బాలరాట్నం ఇరుసు తిప్పే పిడి; ఇది కుడిచేతివైపున ఉంటుంది. చూ. చిత్రం 41 క. 11 (కో. 26, 28); **3.** రూ. తిప్పుడుచెయ్యి(1); పర్యా. చూ. చెయ్యి (1). పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువుకొయ్యకు బిగించిన పిడి. చూ. చిత్రం 1.7 (కో. 36).

**తిప్పుజెవు** పర్యా. చూ. చెయ్యి(1). రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. చూ. చిత్రం 15.9 (కో. 34).

**తిప్పుడుకడ్డీ** పర్యా. చూ. చెయ్యి (3). దబ్బా రాట్నం ఇరుసు తిప్పే పిడి; ఇది కుడివైపున ఉంటుంది. చూ. చిత్రం 41 క. 11 (రా. 20).

**తిప్పుడుగొయ్య** పర్యా. చూ. కాటుపీట. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టే కొయ్య. చూ. చిత్రం 28 (తె. 29).

**తిప్పుడుచెక్క** పర్యా. చూ. చెయ్యి(1) రాట్నం ఇరుసు తిప్పే కొయ్యపిడి. చూ. చిత్రం 15.9 (తె. 7).

**తిప్పుడుచెయ్యి** **1.** చూ. తిప్పుచెయ్యి(3) (తె. 12, 13); **2.** చూ. తిప్పుచెయ్యి(1) (కో. 9, 15).

**తిప్పుడుపీట** పర్యా. చూ. కాటుపీట. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టే కొయ్య. చూ. చిత్రం 28 (తె. 20).

**తిప్పుడుబొమ్మ** పర్యా. చూ. చెయ్యి (2). రాట్నం ఇరుసు తిప్పే కొయ్యపిడి. చూ. చిత్రం 15.9 (కో. 4, 5, 14; రా. 8, 10, 20).

**తిప్పుడుమొద్దు** పర్యా. చూ. కాటుపీట. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టే మొద్దు. చూ. చిత్రం 28 (తె. 23).

**తిప్పుపుల్ల** ఉ. తిప్పుల్ల; పర్యా. చూ. చెయ్యి (2). రాట్నం ఇరుసు తిప్పే కొయ్యపిడి. చూ. చిత్రం 15.9 (కో. 36).

**తింపు** (క్రి.) చూ. తిప్పు (తె. 29, 30).

**తిరగడ** **1.** చూ. తిరిగిణీ (2) (రా. 10); **2.** ఉ. తిరగడి, తిరగుడు; చూ. తిరుగుడు (1) (రా. 5, 6, 11-13, 15, 18, 19, 19 బి)

**తిరగడతాడు** పర్యా. చూ. తిరుగుడుగుది. తిరుగుడుకు రెండువైపులా కట్టిన తాళ్ళు; ఊడ్తె అడ్డపట్టెను పడుగేరుకర్రలను కలిపేవి. చూ. చిత్రం. 71.2 (రా. 12, 15, 18).

**తిరగడదబ్బ** పర్యా. చూ. ఆకు (5). రాటికి కిందా పైనా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (రా. 10).

**తిరగలి** చూ. తిరుగుడు (1) (కో. 6).

**తిరగలిచీల** తిరుగుడును ఊడ్తె అడ్డపట్టెకు కలిపే తాడు బిగింపుకోసం తిరుగుడు పిడికి బిగించిన ఇనపపుల్ల చూ. చిత్రం 71.3 (కో. 6).

**తిరగలిపిడి** తిరుగుడు బిళ్ళలో దూర్చిన కొయ్య. చూ. చిత్రం 71.1 (కో. 6).

**తిరంజన్ఖానీ** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 17).

**తిరమనిఅంటు** ఉ. తిర్మనంటు. పట్టుకుపెట్టే వరి గంజిలో కలిపే ఒకరకం జిగురు; చూ. తిరవనిబంక (తె. 21).

**తిరమలకొండడు** మార్కండేయపురాణం తెలుగులో రాసిన పడిగె రాజు. (కో. 3).

**తిరవనిచిప్ప** తిరవనిరంగులో కమ్మిలోనేసిన గీరలు (కో. 4).

**తిరవనిబంక** (< ? తిరుమణి-) తిరవనిచెట్టు జిగురు; పట్టుకుపెట్టే గంజిలో కలుపుతారు (తె. 5).

**తిరి** **1.** అంచుల్లో జరిపెట్టి నేసేటప్పుడు, పోగులు అతుక్కోటానికి జిగురుపూసే పుల్లకు చివరచుట్టిన గుడ్డ. చూ. చిత్రం 139.2 (రా. 8); **2.** ఒత్తిమాదిరిగా చుట్టినదారం; కృత్రిమపు పట్టుగాని, జరిపోగులుగాని ఒత్తిగా చుట్టి చేత్తో డిజైన్లు తీస్తారు (కో. 2).

**తిరిగిణి** ఉ. తిరిగిని; **1.** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి; చూ. రాటి. చూ. చిత్రం 34 (రా. 17); **2.** రూ. తిరగడ (1). పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంటె మొ. వాటికి దీనికి తగిలించిన చిలపనుంచి నూలుతోడుకొంటారు. చూ. చిత్రం 31 (రా. 16, 17).

**తిరిగిణికడ్డీ** పర్యా. చూ. సూలం (1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా, ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒకభాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (రా. 16).

**తిరిగిణిచట్టం** ఉ. తిరిగినిచట్టం; పర్యా. చట్టం (1),

దంత్రం (1). అడ్డగుమ్మి అమర్చే కొయ్యచట్రం; చూ. దొడ్డి. చూ. చిత్రం 42 (రా. 17).

**తిరిగిణిచిప్ప** పర్యా. చూ. చిప్ప (1). రాటిపై బద్దలను బిగించి, వాటి మధ్య బోర్లించి కట్టిన చిప్ప; మామూలుగా, కొబ్బరిచిప్ప వాడతారు; ఇది రాటి సూలం మీద తిరుగుతుంది. చూ. చిత్రం 31 క. 5 (రా. 17).

**తిరిగిణిమొద్దు** పర్యా. చూ. దూపిరి (3). రాటి తిరగటానికి, రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (రా. 16).

**తిరుగుడు 1.** రూ. తిరగడ (2). తిరగలి; పర్యా. సరితిరుగుడు. చాపిన పడుగును తిరగవెయ్యటానికి ఉపయోగించే కొయ్య పనిముట్టు; దీన్ని ఊడ్తెకుగాని, సరిగుంజకుగాని తాళ్ళతో కడతారు; కొన్నిచోట్ల ఇనపది; కొన్నిచోట్ల, తాడు. చూ. చిత్రం 71 (కో. 6; తె. 18, 19, 22, 23, 29, 33; రా. 21); **2.** పర్యా. చూ. వంకెన. పడుగు బిగింపుకోసం, పడుగేరుకర్రకు తగిలించే ఇనప కొక్కెల గొలుసు; కొన్నిచోట్ల, వారిజనుప వాడుక. చూ. చిత్రాలు 70 ట, త (తె. 13, 27, 28); **3.** పర్యా. చూ. పుల్లిరుసు. మగ్గంమీద అచ్చుతాడు తగిలించిన రోకలివంటి గుండ్రటి పొడుగు కర్ర; గిలకలకు మారుగా అమర్చింది; కొన్నిచోట్ల, ఇటువంటివి, చిన్నవి రెండుంటాయి; నేతనేసేటప్పుడు అచ్చుతాళ్ళు దీనిమీద ఆడతాయి. చూ. చిత్రాలు 121 చ. 3, 121 ప. 1 (కో. 3, 7).

**తిరుగుడుఅడ్డ** పర్యా. చూ. దిండు (7). డాబీలో అడ్డంగాబిగించిన కొయ్యగుండు; బోట్లపింజెర దిండుకు బొడిపెలు, తొల్లపింజెర దిండుకు గాళ్ళూ ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు; దీనికి చివర ఇనప ఊచలచట్రంగాని, రేకు పళ్ళచక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (కో. 36).

**తిరుగుడుకట్టె 1.** పర్యా. చూ. చెయ్యి (2). రాట్నం ఇరుసు తిప్పే కొయ్యపిడి. చూ. చిత్రం 15.9 (కో. 9); **2.** పర్యా. చూ. పైపట్టె (3). పుల్లిరుసు చెవుకట్లకు ఆధారంగా, పైన బిగించిన పొడుగుచెక్క. చూ. చిత్రం 121 ప. 5 (కో. 3); **3.** పర్యా. చూ. పుల్లిరుసు. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన, రోకలివంటి గుండ్రటి పొడుగుకర్ర; గిలకలకు మారుగా అమర్చింది; కొన్నిచోట్ల, ఇటువంటివి చిన్నవి రెండుంటాయి; నేతనేసేటప్పుడు, అచ్చుతాళ్ళు దీనిమీద ఆడతాయి. చూ. చిత్రాలు 121 చ. 3, 121 ప. 1 (కో. 5).

**తిరుగుడుకట్టెదారం** పర్యా. చూ. పుల్లిరుసుతాడు. పుల్లిరుసుకువేసిన అచ్చుసూత్రం; వాయితాడు. చూ. చిత్రం 121 చ. 5 (కో. 5).

**తిరుగుడుకర్ర** పర్యా. చూ. పుల్లిరుసు. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన, రోకలివంటి గుండ్రటి, పొడుగు కర్ర; గిలకలకు మారుగా అమర్చింది; కొన్నిచోట్ల, ఇటువంటివి రెండుంటాయి; నేతనేసేటప్పుడు, అచ్చుతాళ్ళు దీనిమీద ఆడతాయి. చూ. చిత్రాలు 121 చ.3, 121 ప. 1 (కో. 6, 7, 10–12, 14, 16, 18; తె. 13, 15; రా. 2, 20).

**తిరుగుడుకర్రగుబ్బ** పర్యా. చూ. చెవుకట్టు (2). పుల్లిరుసు నిలవటానికి, పైపట్టెకి బిగించిన చెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121 చ. 4 121 ప. 2 (కో. 12).

**తిరుగుడుకర్రచెవు** పర్యా. చూ. చెవుకట్టు (2). పుల్లిరుసు నిలవటానికి, పైపట్టెకి బిగించిన చెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121,చ.4. 121 ప. 2 (కో. 7).

**తిరుగుడుకర్రతాడు** పర్యా. చూ. పుల్లిరుసుతాడు; పుల్లిరుసుకు వేసిన అచ్చుసూత్రం; వాయితాడు. చూ. చిత్రం 121 చ. 5 (కో. 16).

**తిరుగుడుకొండి 1.** ఉ.-కుండీ; పర్యా. కొండి (2). ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనప పనిముట్టు; చూ. గొలుసు (రా. 1); **2.** పర్యా. చూ. గద్దగోడు. ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజల అడ్డపట్టెకు గాని బిగించిన ఇడిపకొండి; దీనికి, సరిబిగింపుకోసం వేసిన వంకెన కడియంగాని, తిరుగుడుగాని తగిలిస్తారు. చూ. చిత్రం 63 గ.1 (తె. 18).

**తిరుగుడుకోల** పడుగును తిరగవెయ్యటానికి కట్టిన కర్ర; ఇది ఒకవైపు పడుగును, రెండోవైపు అడ్డకట్టెను కలుపుతుంది (తె. 20).

**తిరుగుడుగుది** ఉ.-గుతి; పర్యా. గుదితాడు (2), తిరగడతాడు, సరిగుది. తిరుగుడుకు రెండువైపులా కట్టిన తాళ్ళు; ఊడ్తె అడ్డపట్టెను, పడుగేరుకర్రలను కలిపేవి. చూ. చిత్రం 71.2 (తె. 18, 20, 22, 23, 33).

**తిరుగుడుగుండు** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (తె. 11).

**తిరుగుడుచెక్క** పర్యా. చూ. చెవుకట్టు (2).

పుల్లిరును నిలవటానికి, పై పట్టీకి బిగించిన చెక్క; ఇటువంటివి రెండుంటాయి; దేవాంగులవాడుక. చూ. చిత్రాలు 121 చ. 4, 121 ప. 2 (కో. 7).

**తిరుగుడుదోనె** పర్యా. చూ. ఎదురుదోనె. మగ్గం చివర, పడుగునూలు చుట్టే కొయ్యదూలం; రోకలి మాదిరిది; కొన్నిచోట్ల, నలుపలకలది; మలగర్రకు వారుగా అమరుస్తారు. చూ. చిత్రం 110.1 (రా.4,5)

**తిరుగుడుపంజె** ఉ.-బంటి, -బంజె; పర్యా. చూ. రాటీ. గుమ్మటంలాంటి పనిముట్టు; పంజె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (తె. 30-32).

**తిరుగుడుబిళ్ళ** పర్యా. చూ. చెవ్వకట్టు (2). పుల్లిరుసు నిలవటానికి, పై పట్టీకి బిగించిన చెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121 చ. 4, 121 ప. 2 (కో. 3).

**తిరుగుడుసలాక** ఉ.- సలాకి. ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజల అడ్డపట్టెకుగాని బిగించిన ఇనపఊచ; దీనికి పడుగును బిగించే తిరుగుడు తగిలిస్తారు (తె. 19, 22).

**తిరుగుడుసీకు** పర్యా. చూ. గద్దగోడు. ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజల అడ్డపట్టెకుగాని బిగించిన ఇనపకొండి; దీనికి సరిబిగింపుకోసం వేసిన వంకెన కడియంగాని, తిరుగుడుగాని తగిలిస్తారు. చూ. చిత్రం 63 గ. 1 (తె. 20).

**తిరుచున్నంపట్టు** పచ్చిపసుపు రంగు; తిరుచూర్ణం రంగు (కో. 9).

**తిరుచూర్ణంపచ్చ** పచ్చిపసుపు (=గడపపచ్చ) రంగు; తెమను (కో. 7).

**తిరుమంజిరంగు** పర్యా. కిర్మంజి. కప్పు (=కేలిక) ఎరుపు (రా. 22).

**తిరుమళ్ళంచు** మూడు రంగుకడ్డీలు నేసిన అంచు (కో. 3).

**తిరుమళ్ళంచుకమ్మి** మూడు పట్టెలు పడేట్లు నేసిన ఒకరకం కమ్మి (కో. 3).

**తిలక్‌రంగు** ఓవల్టీనురంగు (కో. 12).

**తివాటు** నాలుగుచీర (=ఉరువు)ల నేతకు సరిపడే మొత్తం పడుగు (రా. 13).

**తివాకెత్తు** (క్రి.)? సరిచేసినపడుగులో కింది పోగులూ పై పోగులూ పాయలు పాయలుగా విడదీసి చాపటం; నాలుగు చీరల నేతకు సరిపడే పడుగు; ఇలా విడదీస్తే ఆరు చీరలనేతకు పనికి వస్తుంది (తె. 2, 6).

**తివాటువేయు** (క్రి.) ఉ. తివాశేయు **1.** సరిచేసిన పడుగు మొత్తం, నేయవలసిన ఉరువులకు సరిపడేటంత పాదలు వెయ్యటం; పడుగులో అనిపోగులు నాలుగు వేళ్ళకు తగిలించుకొని. పడుగును నాలుగు భాగాలుగా విడదీసి, ఒక్కొక్క కొలికి చొప్పున అచ్చుతుకుతారు; కొన్నిచోట్ల, అనిపోగుల వెంబడి కర్రలు ఎక్కించి తివాటు వేస్తారు; మామూలుగా, పడుగును 4–8 భాగాలుచేసి అచ్చుతుకుతారు. చూ. చిత్రం 105 (తె. 3; రా. 13); **2.** సరిచేసిన పడుగులో కింది పోగులూ పై పోగులూ పాయలు పాయలుగా విడదీసి చాపటం (రా. 18, 22).

**తివాసీ** ఉ. తివాచి, తివాచీ. ఉన్నిదారంతో ఒత్తుగా నేసింది; కింద పరుచుకొనేది. చూ. చిత్రం 320 (కో.16; తె. 10, 17).

**తివాసీకత్తి** తివాసీ నేసేటప్పుడు, పడుగులో ఉన్ని పోగులను ఎక్కించి, కొసలు కోసే కత్తి. చూ. చిత్రం 322 చ (తె. 10).

**తివాసీమగ్గం** పర్యా. మాకు (1). తివాసీలు నేసే మగ్గం. చూ. చిత్రం 320 (తె. 10, 17).

**తివ్వ** చూ. తీగె (రా. 26).

**తీగంచు** పర్యా. తీగబోర్డరు, లతబోర్డరు. తీగ మాదిరి డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 147 (కో. 15, 19; తె. 25).

**తీగపారిజాతమంచు** తీగ, పారిజాతంపువ్వు కలిసిన డిజైను అంచు. చూ. చిత్రం 162 (తె. 14).

**తీగపేటు** తీగమాదిరిగా (అంచులో) నేసిన డిజైను. చూ. చిత్రం 147 (కో. 16).

**తీగబుగిడి** ఉ. తీగబొగిడి, తీగెబుగిడి. **1.** నేతలో తీగ, బుగిడి పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 170 (తె. 8, 25); 2. అంచునేతలో బుగిడికింద దాపుగా, రెండు వరసల్లో పటవాలుగాపడేట్టు నేసిన డిజైను (తె. 12).

**తీగబేలు** నాలుగుఆకులు, తీగ వరసగా నేసిన డిజైను (తె. 21).

**తీగబోర్డరు** పర్యా. తీగంచు. తీగమాదిరి డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 14 (రా. 24).

**తీగమద్దికాయచీర** నేతమధ్యలో తీగ, మద్దికాయ నమూనాల్లో డిజైన్లు నేసిన చీర (తె. 11).

**తీగమల్లికడ్డీ** తీగ, ఆకులు, మొగ్గలు వరసగా కొంగులో పడేట్టు నేసిన డిజైను (తె. 21).

**తీగముదాకలు** అంచులో నేసే ఒకరకం తీగడిజైను (తె. 7).

**తీగవరసబేలు** అంచులో, తీగలవరస మాదిరిగా నేసిన ఒకరకం డిజైను. చూ. చిత్రం 147 (తె. 16).

**తీగె** ఉ. తీగ; రూ. తివ్వ; పర్యా. తంతె (2).

మగ్గాను కట్టుబడిలో, ఆకుల బిగింపుకోసం చుట్టిన ఇనపతీగ(లు) (కో. 11,12,14-16, 18,20,21,36).

**తీగెదండావాలిపేటు** అంచులో నేసే ఒకరకం తీగ డిజైను (కో. 20).

**తీగెపత్తిపువ్వుచీర** ఉ. -సీరె. ఒకరకం డిజైనులో నేసిన చీర (తె. 11).

**తీగెపెట్టు** (క్రి.) ఏకేముందు, దూదిని పొడుగ్గాలాగి, మెత్తగా చెయ్యటం (కో. 33, 34).

**తీగెశోభ** ఉ. -శోబ. అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 25).

**తీతకమ్మి** మూడుమొగ్గలు పడేట్టు నేసిన కమ్మి (కో. 33, 34, 36, 37).

**తీతకొత్తంచు** ఒకరకం చిన్నఅంచు; చీరలకు నేస్తారు. చూ. చిత్రం 256 (కో. 25-28,31,33,36).

**తీన్ కోరి** అంచులో నేసిన మూడుగీరలు. చూ. చిత్రం 185. 3 (తె. 24).

**తీన్ తార్** మూడుపోగుల దారం; ముప్పోగు; తివాసీనేత పనివాళ్ళ వాడుక (తె. 17).

**తీనెగుంత** ఉ. తీని-; పర్యా. చూ. వాదాడి (1). మగ్గంచట్టం కిందిభాగం (=తొట్టి ఉన్నవైపు) నేతనేసేటప్పుడు ముందుకు, వెనక్కు జరగటానికి అనువుగా చేసిన పల్లపుచోటు; ఇటువంటివి, మగ్గం గుంటకు రెండువైపులా ఉంటాయి; కొన్నిచోట్ల, వీటిలో కండెఊచలు వేసుకొంటారు. (రా. 4, 6, 15).

**తీపుకొయ్య** చూ. తిప్పుకొయ్య (కో. 34).

**తీపుతాడు 1.** అచ్చుకట్టే జంత్రంనిలువుకొయ్యలకు అచ్చుకర్రను బిగించేదారం; ఇటువంటివి, మామూలుగా మూడుంటాయి. చూ. చిత్రం 91 చ. 1 (కో. 33 35, 37); **2.** పర్యా. చూ. నేతమోకు. మగ్గంమీద నేతపడుగును బిర్రుపెట్టే లావుపాటి తాడు;ఒకవైపు, పెడకోలకు మధ్యగాకట్టి, మిడిగుంటానికి మెలివేసి, రెండోవైపు చేతిగూటానికి కడతారు; నేత, దగ్గరికి రావటానికి మోకు వదులుతారు; వెనక్కు జరగటానికి బిగలాగుతారు. చూ. చిత్రాలు 122క. 1, 127. 15(కో. 31, 34).

**తీర్పగు** (< తీర్పు + అగు) అనుపొయ్యటం, పూర్తి కావటం (తె. 12).

**తీర్పుచివ్వ** ఉ.-చివ,-సివ. **1.** అచ్చుకట్టే జంత్రం అడ్డపట్టె కొయ్యకుగాని, నిలువుపట్టె కొయ్యగాని బిగించిన కర్ర (కో. 26); **2.** అచ్చుకట్టేటప్పుడు, వడిదారాల లంకెల్లో, పోగులు చెదరకుండా, దూర్చిన కర్ర; కొన్నిచోట్ల, సన్నబెత్తం; ఇటువంటివి రెండు, జంత్రం అడ్డపట్టె కొయ్యకు, నిలువుపట్టె కొయ్యకు బిగిస్తారు (కో. 26, 33).

**తీర్పుచేయు** (క్రి.) **1.** పన్నె ఈనెల కొనలు మొనదేలేటట్టు కత్తితో గీరటం (కో. 33); **2.** అచ్చుకట్టేటప్పుడు, కర్రలకు కట్టిన దారపు వడులను సరిచెయ్యటం; ఒకకర్రలోగాని, బద్దతోగాని చేస్తారు (కో. 27, 31, 33, 35).

**తీర్పుబద్ద** ఉ. తీరుబ్బద్ద. అచ్చుకట్టేటప్పుడు, కర్రలకు కట్టిన వడిదారాలు సరిచూసుకోటానికి, వాటి మెలికల్లో దూర్చిన బద్ద (కో. 27).

**తీర్పుబిళ్ళ** ఉ.-బిల్ల; పర్యా. చూ. వడిబిళ్ళ(3.) అచ్చుకట్టేటప్పుడు, వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి, అచ్చువడులలో దూర్చే కొయ్యచెక్క; ఒకవైపు వెడల్పుగాను, ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి, ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా, టేకుచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (కో.27).

**తీలురేషం** నాసిరకం పట్టు; పోగు అక్కడక్కడ గంట్లుగా ఉంటుంది (రా. 14).

**తుకునీ** చూ. టుకినీ (కో. 7).

**తుట్టి** తక్కువ; నష్టం (తె. 5).

**తుంటకొయ్య** నేతమోకుచుట్టే పళ్ళచక్రంకొయ్యకు పైన అమర్చిన చెక్క; కొన్నిచోట్ల, గోడలో బిగిస్తారు. చూ. చిత్రం 122 ట. 6 (కో. 7; రా. 1).

**తుంటా** పర్యా. కదురు(2). రాట్నంబొమ్మ చెవులకు దూర్చిన ఇనప పుల్ల; నూలువడకటానికీ కండెలు పట్టటానికీ ఇది ఉపయోగపడుతుంది. చూ. చిత్రం 15.15 (రా. 9).

**తుండు 1.**పర్యా.చూ.గూటం(1).దూదిఏకేటప్పుడు కమానుసరం కొట్టే కొయ్యబడితె. చూ.చిత్రం. 9. 13 (కో. 2, 4); **2.** పర్యా. చూ. అరికెతుండు. గంజి పెట్టటానికి, చుట్టినపడుగు వేసుకొనే కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 75(కో.2;రా.7).

**తుండు(గుడ్డ)** పర్యా. చూ. తువ్వాలు. ఒళ్ళు తుడుచుకోటానికి గాని, కండువా మాదిరిగా భుజంమీద వేసుకోటానికి గాని నేసినబట్ట; సుమారు ఒకటిన్నర గజం పొడుగుది; రకరకాల రంగుల్లో, రకరకాల డిజైన్లలో నేస్తారు; towel (కో. 1, 2, 11, 15, 16, 21-23, 25, 26, 30, 31, 34).

**తుత్తూరుచెట్టు** ఒకరకంచెట్టు; దీని ఆకులు పట్టుపురుగులకు ఆహారం (తె. 5).

**తునకాల** ఉ. తున్కాల; పర్యా. సేరుకోల. దూది తూచే ఒకరకం తక్కెడకట్టె; దీనికి, సన్నగా ఉన్నవైపున గాట్లుచేసి సేర్లగుర్తులు, కొన్నిచోట్ల, వీసెల గుర్తులు పెడతారు. చూ. చిత్రం 12.1 (కో. 6, 7).

**తుంపు** తానులోనుంచి చించిన గుడ్డ ; ఒక రవికెకు గాని, లాగుకుగాని, చొక్కాకుగాని సరిపడేది ; cut-piece (కో. 7, 10).

**తుమ్మకాయరంగు** నలుపులో తెలుపు కలిసిన వన్నె (తె. 20.)

**తుమ్మగోది** తుమ్మచెట్టు జిగురు ; అద్దకం రంగుల్లో కలుపుతారు (కో. 7, 8).

**తుమ్మచెక్క** తుమ్మచెట్టు(*Acacia arabica*, Willd.) చెక్క; తొగరురంగు తయారీలో ఉపయోగిస్తారు(రా. 19)

**తురకనీడు** ఉ. తుర్క-. దూదేకు సాయెబులు వడికి, అనుపోసి తెచ్చిన పడుగునూలు ; ఈ నీడు పోగు ముతక (తె. 11).

**తురాయి** బట్టలమీద వేసే కలంకారీ అద్దకం డిజైన్లలో ఒకరకం. చూ. చిత్రం 283 వ. 1 (కో. 12).

**తురాయికమ్మి** తురాయి డిజైను నేసిన చీరకమ్మి (కో. 23).

**తురికితువ్వాలు** ఉ.-తువాలు; రూ. టరికీ తువ్వాలు. దారపు కొలుకులు ఒత్తుగా పైకి తేలేట్టు, గొర్రెబొచ్చు మాదిరిగా నేసిన తువ్వాలు (తె. 1).

**తురు(వు)జేయు** (క్రి.) మొదలుపెట్టటం ; పనిలోకి ప్రవేశించటం (తె. 25, 31).

**తురంజీలకమ్మి** వంకాయ (=కత్తిరికాయ) నమూనాలో డిజైన్లు నేసిన కమ్మి ; మూరెడు పొడుగు నేస్తారు. చూ. చిత్ర 276 (తె. 13).

**తులసిఅంబర్‌రోజు** ఒకరకం ముదురు రోజా రంగు. (కో. 3).

**తులసికోట(చీర)** నేతలో తులసికోటబుటా పడేట్టు నేసిన చీర. చూ. చిత్రం 277 (కో. 26).

**తులసికోటసిరారంగు** ఉ. తులిసి-. ఒకరకం నీలం రంగు; తులసికోట వ్యాపారచిహ్నం (trade mark) తో ప్రచారంలోకి వచ్చింది (తె. 15).

**తులసిగద్దె** తులసికోట నమూనా నేసిన అంచు. చూ. చిత్రం 96 (తె. 24).

**తువ్వాలు** ఉ. టొవాలు, తువాల, తువాలు, తువ్వాల ; పర్యా. తుండు(గుడ్డ), దుశాలు. ఒళ్ళు తుడుచుకోటానికిగాని, కండువా మాదిరిగా బుజంమీద వేసుకోటానికిగాని నేసినబట్ట ; సుమారు ఒకటిన్నరగజం పొడుగుది ; రకరకాల రంగుల్లో, రకరకాలడిజైన్లలో నేస్తారు ; towel (కో. 5, 9, 16, 17, 19–21, 26–28, 34 ; తె. 1, 6, 8, 11, 15, 17, 21 23-25, 29 ; రా. 1, 4, 5).

**తుస్సేపేటు** ఒకరకం నేతడిజైను ; మూడు వరసల్లో వంకెవంకెలుగా వచ్చింది (కో. 12).

**తూకపురాయి** చూ. తూకు(డు) రాయి (కో.20).

**తూకం** పర్యా. ఊచ(2), చువ్వ(10), ఇనప తూకం, ఇనపపుల్లకడ్డీ, గంట (3), తంతె (5), దబ్బలం (3), పేటుకడ్డీ, పేటుకమ్మి(1), పేటుపుల్ల, పేటు నీల, మేకునీల, వజను, సడుగు, నీల(13). పేటువడికి కింద వేలాడగట్టిన బరువు ; మామూలుగా, ఇనపపుల్ల, కొన్నిచోట్ల సత్తుది ; నేతనేసేటప్పుడు, అని మూసిన తరవాత, వడికిందికి దిగటానికి కడతారు ; ఇటువంటివి, రెండుపక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (తె. 6, 9 ; రా. 23).

**తూకంగుండు** ఉ. తూకగ్గుండు ; రూ. తూ (కు) గుండు ; పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి ; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చిన్నచెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126. 3 (కో. 3, 25 ; రా. 1, 19 ఎ).

**తూకంతాడు** పర్యా. సేరుతాడు. సేరు కోల (=దూది తూచే ఒకరకం తక్కెడ కట్టె)కు పైన వేసిన తాడు ; సేరుకోలకు పెట్టిన గుర్తు దగ్గరికి తాడు జరుపుకొని తూస్తారు. చూ. చిత్రం 12. 2 (తె. 17).

**తూకంరాయి** ఉ. తూగం. **1.** చూ. తూకు (డు) రాయి (రా. 6, 13, 20) ; **2.** రూ. తూగురాయి. పడుగులో అతికిన పేటుపోగులు బిర్రుగా ఉండటానికి, మగ్గానికి పైన దండెంమీదినించి వేలాడదీసి చివర కట్టిన బరువు (రాయి) ; మగ్గంమీద, ఎత్తుగా గిలకలు అమర్చి, పేటుదారాలు వాటికి తగిలించి చివర బరువులు కడతారు. చూ. చిత్రం 133.1 (తె. 10).

**తూకం(సంచి)** పర్యా. చూ. పేటుమూట. పడుగులో అతికినపేటు పోగులు బిర్రుగా ఉండటానికి, మగ్గానికి పైన దండెం మీదినించి వేలాడదీసి చివరకట్టిన బరువు ; మామూలుగా ఇసకమూట ; కొన్నిచోట్ల, రాళ్ళు ; మగ్గంమీద ఎత్తుగా గిలకలు అమర్చి, పేటుదారాలు వాటికి తగిలించి చివర బరువులు కడతారు. చూ. చిత్రం 133.1 (కో. 24 ; రా. 24).

**తూకాలగుంత** పర్యా. చూ. నీలలగుంత. పేటు తూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి తీసిన చిన్న గొయ్యి ; ఇటువంటివి రెండుపక్కలా రెండుంటాయి. చూ. చిత్రం 132 చ. 16 (తె. 9 ; రా. 13).

**తూకుగుండు** ఉ. తూగ్గుండు ; చూ. తూకంగుండు (కో. 3, 7, 27 ; రా. 14, 15).

**తూకు(డు)రాయి** ఉ. తూకుడ్రాయి, తూగు (డు) రాయి ; రూ. తూకపురాయి, తూకంరాయి (1),

తూగుటురాయి ; పర్యా. చూ. సవలతుగుండు. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ, కిందికి జారకుండా దారంకట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి ; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చెక్కంగాని కడతారు. చూ. చిత్రం. 126.3 (కో. 2, 3, 21, 23, 24 ; రా. 2, 4, 5).

**తూగుటురాయి** ఉ. తూగుట్రాయి ; చూ. తూకు(డు)రాయి (కో. 17, 28).

**తూగుడుగుండు** పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి, దండెఅవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి ; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని చెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 26).

**తూగుండుబద్ద** నేతపడుగులో, అచ్చుకూ దండె ఇవతలి చువ్వకూ మధ్యదూర్చిన వెదురుబద్ద ; సవలతుగుండుతాడు దీనికి కడతారు ; దేవాంగుల వాడుక. చూ. చిత్రం 127.4 (కో. 7).

**తూగురాయి** చూ. తూకంరాయి (2) (రా. 8).

**తూంగుండురాయి** పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారకంకట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి ; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 31).

**తూట్రాయిదండె** పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి ; కొన్నిచోట్ల ఇనపగుండుగాని, చెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 36).

**తూనికగుండు** ఉ. తూనిగ్గుండు, తూనెగ్గుండు ; పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి ; కొన్నిచోట్ల ఇనపగుండుగాని, చెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 5-7 ; రా. 8, 10).

**తూనికరాయి** పర్యా. చూ. సవలతుగుండు. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని చెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 10 ; రా. 20).

**తూపుల్లగొంగడి** లావుపాటి దారంతో నేసిన ఒక రకం గొంగడి ; చూ. పుల్లగొంగడి (తె. 11).

**తూర్పుగుంటుచువ్వ** మగ్గం అచ్చుదగ్గర అనిలో దూర్చిన సన్నబెత్తం (కో. 12).

**తెడ్డు 1.** ఒకరకంమరాసు (=మడతాసు) కట్టుబడిలో బెండకాయచెక్రం పక్కన ఉండే గుబ్బిచెక్రాన్నీ, మూలమట్టాన్నీ కలిపే కొయ్యబద్ద ; కీలుకు బదులు అమర్చేది (చూ. కీలు) ; మరాసు తిరిగినప్పుడు, ఇది ముందుకూ వెనక్కూ ఆడుతూ ఉంటుంది (తె. 13) ; **2.** కొయ్యగరిటె; అన్నంఉడికేటప్పుడు దీంతో కలియబెడతారు ; కొన్నిచోట్ల, దీంతో రంగులు కలుపుతారు. చూ. చిత్రం 282 క. 7 (కో. 16, 20, 21, 33 ; తె. 2, 25).

**తెప్పవేయు** (క్రి.) తివాసీ నేతకువాడే ఉన్ని పోగులు కలిపి వడిపెట్టటం ; జమిలిచెయ్యటం (తె. 17).

**తెర 1.** పర్యా. చూ. డొల్ల. పడుగు పై పోగులకు, కింది పోగులకు మధ్య వెలితి ; అనిలేని భాగం ; మామూలుగా రెండు అనులనడుమ పోగులకు డొల్ల ఉంటుంది; సరిచేసేటప్పుడు, అనిలాకులు తీసేసి డొల్లచేస్తారు (కో. 24); **2.** పర్యా. చూ. డొళ్ళపడుగు. ఒకే పొరగా ఉన్న పడుగునూలు (కో. 24).

**తెరకచ్చి** ఉ. తెరకచ్చె: పర్యా. చూ. డొల్ల. పడుగుపై పోగులకు,కిందిపోగులకు నడిమి వెలితి(కో.1).

**తెరచివ్వ** ఉ. -నివ. వజానేతకోసం అమర్చిన దొడ్డిలో, నడిమిజల్లికి కిందగా వేలాడే దారాలను సమంగా ఉంచటానికి పెట్టినకర్ర. చూ. చిత్రం 134 చ. 6 (కో. 34, 36, 37).

**తెరలాగు** (క్రి.) ఒంటిపొర పడుగు (= డొళ్ళపడుగు)ను అచ్చుపోగులకు అతకటం (కో. 24).

**తెలుగువాళ్ళు** ఉ. తెలుగోళ్ళు. దసలి (పట్టు) పురుగులను పెంచేవాళ్ళలో ఒక తెగ ; తెలగాలు (తె. 7).

**తెలుపురేషం** చూ. తెల్లరేషం (కో. 23).

**తెల్లఉన్ని** ఉ. తెల్లున్ని. తెలుపురంగు గొర్రెబొచ్చు (తె. 3, 6, 7, 9, 11, 20, 22, 25-28 ; రా. 22).

**తెల్లకాటు** పర్యా. చూ. కోరా(నూలు). చలవ చెయ్యని ముడినూలు ; unbleached yarn; ఇది గోధుమరంగులో ఉంటుంది (తె. 22).

**తెల్లకుట్టు** (-తీయు) కమ్మినేతలో, అందానికి కుట్టిన తెల్లపోగు ; సుమారు రెండంగుళాల పొడుగుది (రా. 11).

**తెల్లగడ్డ** వెల్లుల్లిగడ్డ ; ? పట్టుపోగులు అతకటానికి వాడుతారు (రా. 5).

**తెల్లగుళ్ళంచు** రంగులోనేసిన భాగాలకు మధ్య, తెలుపులో సందు (=గుండు) వదిలి నేసిన అంచు (రా. 13).

**తెల్లగొంగడి** తెలుపు ఉన్నితో నేసిన గొంగడి (తె. 6, 7, 9, 20, 22, 25-27).

**తెల్లగొర్రె** తెలుపురంగు బొచ్చుగల గొర్రె (తె. 3, 6, 7, 9, 11, 20, 22, 25-28).

**తెల్ల(చాయ)** ఉ.-సాయ ; పర్యా. వెల్ల. తెలుపు రంగు (కో. 1 ; రా. 19).

**తెల్లచీర** తెలుపురంగు నూలుతో నేసిన చీర (తె. 1, 31, 32).

**తెల్లనరిశగొంగడి** ఉ. తెల్లనర్క-. తెల్లరంగు ముదుగు ఉన్నితో నేసిన గొంగడి (తె. 6).

**తెల్లపట్టెలగొంగడి** నలుపులో, తెల్లచారలు పడేట్టు నేసిన గొంగడి (తె. 6).

**తెల్లపత్తి** తెల్లరంగు పత్తి; గింజ పచ్చగా ఉంటుంది; ఉకవు చిన్నది; బట్టలకు ఈ నూలు అట్టే వాడరు (కో. 5, 23, 36 ; తె. 13-16 ; రా. 19).

**తెల్లమాయిపట్టెచీర** నల్లపడుగులో, చిన్న తెల్ల పోగులు దూర్చి (=టాకాచేసి) నేసేచీర (రా. 16).

**తెల్లరేషం** రూ. తెలుపు రేషం. తెలుపువన్నె పట్టు (=రేషం); పోగుసాపుగా, మెత్తగా ఉంటుంది ; బెంగు ళూరు ప్రాంతంనుంచి వస్తుంది (కో. 14).

**తెల్లసెల్లా** ఉ.-సెల్ల. తెల్లరంగునూలు పెట్టి నేసిన కండువా (తె. 31).

**తేజాపు** ఉ. తేజాప్, తేజేప్. అద్దకంరంగు తయారు చెయ్యటానికి, ముడిరంగులో కలిపే ఒకరకం రసా యనం ; ఉదజహరితామ్లం ; Hydrochloric acid; కొన్నిచోట్ల, నెప్తాలురంగుల అద్దకానికి, ఈ ద్రావకం రెండోసారి చన్నీళ్ళలో వేస్తారు (తె. 4, 5, 8, 12, 14, 22-25, 29, 30).

**తేజాపునీలి** ఒకరకం నల్లరంగు ; పటికె, చేపపొట్టు, పచ్చపటిక, తేజాపు (=ఒకరకం ద్రావకం) వేసి తయారు చేస్తారు (తె. 15).

**తేజ్‌ఖానీ** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (కో. 16).

**తేమపడుగు** గంజితో తడిపిన పడుగు (రా. 13).

**తేలికపచ్చ** పర్యా. లేతపచ్చ. అరిటాకు మాదిరి, లేత ఆకుపచ్చ రంగు (తె. 25).

**తేలింవన్నె** ఒకరకం ఎరుపురంగు; తైలంవన్నె (రా. 24).

**తేలియా(రంగు)** ఒకరకం(నిండు)ఎరుపు రంగు; కొంచెం నలుపువన్నె కలిసింది; ఆర్. సి, బి. ఎ, బి.ఎస్, గార్నెట్ వేసి తయారుచేస్తారట (తె. 20, 22, 23).

**తేలియాచీర** కొంగునేతకు పట్టు, మిగిలిన భాగానికి ఏదన్నా రంగునూలు పెట్టినేసిన డిజైను చీర (తె. 3).

**తైదఅంబలి** ఉ. తైదంబలి. రాగులతో కాచిన అంబలి; దీన్ని పడుగుకు పెడతారు (తె. 3, 7, 9).

**తైదం** (-చేయు) మెత్త గారుబ్బిన (చింతగింజల) పిండి; దీన్ని ఉడకబెట్టి ఉన్నిపడుగుకు పట్టిస్తారు (తె. 10).

**తైద(ల)గంజి** పర్యా. రాగిగంజి. రాగుల(తైదలు) పిండగొట్టి కాచిన గంజి; దీన్ని పడుగుకు పెడతారు. (కో. 1; తె. 4, 19, 20).

**తైబను** (బహు. తైబండ్లు) పర్యా. తైల. తురకలు కట్టుకోటానికి నేసిన ఒకరకం గళ్ళలుంగీ; పది, ఇరవై నెంబర్లనూలుతో రెండుమువ్వాతిక గజం పొడుగు నేస్తారు (రా. 23).

**తొక్కు** (క్రి.) దంపటం; ఉన్నిపడుగు తడిపే అంబలి కాచటానికి చింతపిక్కలు దంపి ఉడకబెడతారు (తె. 11).

**తొక్కుడుకర్ర** 1. పర్యా. చూ. తొక్కుడుపట్టె (2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 8); 2. పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడు గునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్రతాళ్ళు, మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 6; రా. 21); 3. నేతపడు గులో, అచ్చు ముందర దూర్చిన వెదురుబద్ద(లు). చూ. అచ్చుచువ్వ (కో. 26).

**తొక్కుడుచివ్వ** ఉ.-సివ. 1. నరిచేసేటప్పుడు పడు గులో దూర్చిన కర్ర; కొంచెం లావుపాటిది (కో. 25); 2. దడదెదగ్గర నేతపడుగులో దూర్చిన చువ్వ (కో. 34).

**తొక్కుడుచెక్క** పర్యా. చూ. పావుచెక్క. నేత నేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు, కాలితోతొక్కే కొయ్యచెక్క; ఇటు వంటివి, మామూలుగా రెండుంటాయి; కొన్నిచోట్ల, అచ్చుకు రెండు చొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (కో. 6, 8, 9 ఎ; రా. 12, 19, 21).

**తొక్కుడుచెక్కతాడు** పర్యా. చూ. పావుతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (రా. 19 ఎ).

**తొక్కుడుచెక్కదారం** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (రా. 12).

**తొక్కుడుచెక్కలకట్టె** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా, అడ్డంగా ఉంటుంది;

దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళు మధ్యలో పావుచెక్కలతాళ్ళు కట్టి ఉంటాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (రా. 19 ఎ).

**తొక్కుడుచెక్కలతాడు** పర్యా. చూ. మడిమ తాడు. పావుచెక్కను గూటానికి బిగించే వెనకతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 3 (రా. 19).

**తొక్కుడుతాడు** పర్యా. చూ. పావతాడు. పూను గర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (రా. 21).

**తొక్కుడుపట్టె** ఉ. తొక్కడపట్టి, తొక్కుడుపట్టి, **1.** పర్యా. గిరకజంగ, నిడిబల్ల (1), పట్టె (2), బారు (1), రాటంకాలు. పత్తి పట్టేటప్పుడు, రాట్నం కదలకుండా తొక్కిపట్టటానికి అమర్చినపట్టె. చూ. చిత్రం 1.4 (కో. 6, 37); **2.** పర్యా. అడ్డకమ్మి (1), అడ్డజంగ(1), అడ్డపట్టె (3). అడ్డరాట(1), కాలిపట్టె, కాలిపీట(1), కాలు(1), కాలుజాపుపీట(2), చాపు(1), జంగ (3), తొక్కుడుకర్ర (1), తొక్కుడుపీట (1), తొక్కుడుబల్ల, తోకపట్టె (1), నాగవాసం (1), నిడప కమ్మి (2), నిడిపీట(1), నిడుపట్టె, నిడు(పు)బల్ల (1), నిలువుకమ్మి (2), నిలువుకొయ్య(2), నిలువుపట్టె (2), నిలువుపీట (1), నిలువుబారు, పీటకట్టె (1), పొడుగు కొయ్య, పొడుగుపట్టె (1), పొడుగుపీట, బారపడ్డ, బారుపట్టె (1), బొమ్మకట్టె (1), బొమ్మపట్టె (1), వెనకయ్యపీట(2), సాగు(1), సొరుగుబల్ల (1). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒకకాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పు తారు. చూ. చిత్రం 15.3 (కో. 5, 6; రా. 15).

**తొక్కుడుపీట 1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె (2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒకకాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 7, 22, 24); **2.** పర్యా. అడ్డరాట (2). కాలిపీట (2), కాలుజాపుపీట(1), జంగ(5), తోకపట్టె(2), నిడిపీట(2), నిడుప్పట్టె, నిలువుచాపు, నిలువుపట్టె (4), పట్టె (2), పొడుక్కమ్మి, పొడుగుపట్టె (2). దళ్ళారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒకకాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ.చిత్రం 41 క.3 (కో. 5, 7).

**తొక్కుడుబల్ల** పర్యా. చూ. తొక్కుపట్టె (2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 27).

**తొక్కుడుబిళ్ళ** ఉ.-బిల్ల; పర్యా. చూ. గిరక(6). మగ్గంమీద, అచ్చుగుదులు తగిలించే కొయ్యకప్పీ; దీన్ని మగ్గం పై దండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 121 క. 11 (రా. 19 ఎ).

**తొక్కుడులాత 1.** ఉ. తొక్కుళ్ళాక. నేతనేసే టప్పుడు, పావుచెక్క తొక్కిన తరవాత అనిలోదూర్చిన లాక (తె. 17); **2.** దండె అవతల, పడుగు ముడుచుకు పోకుండా దూర్చే వెదురుబద్ద(లు) (కో. 21).

**తొగటపుష్పాండజముని** నేతపనిచేసే తొగటవారి వంశానికి మూలపురుషుడు (రా. 16).

**తొగట(బలిజెలు)** (బహు. తొగటీలు, తొగట్లు) ఉ. తొగటి, తొగుట; రూ. తవిటి; పర్యా. తొగట వాళ్ళు, తొగటవీరులు. నేతపనిచేసేవాళ్ళలో ఒకతెగ; చౌడీశ్వరివరంవల్ల పుట్టినవాళ్ళమని, క్షత్రియులమని చెబుతారు; జంధ్రేలు వేసుకొంటారు(కో. 4, 9; తె. 6).

**తొగటవాళ్ళు** ఉ. తొగటొల్లు; పర్యా. చూ. తొగట(బలిజె)లు. నేతపని చేసేవాళ్ళలో ఒక తెగ; చౌడీశ్వరివరంవల్ల పుట్టినవాళ్ళమని, క్షత్రియులమని చెబుతారు; జంధ్రేలు వేసుకొంటారు (రా. 8, 10).

**తొగటవీరులు** పర్యా. చూ. తొగట (బలిజె)లు. నేతపనిచేసే వాళ్ళలో ఒక తెగ; చౌడీశ్వరివరంవల్ల పుట్టినవాళ్ళమని, క్షత్రియులమని చెబుతారు; జంధ్రేలు వేసుకొంటారు (కో. 4).

**తొగరితాంబుచీర** అంచులో, తొగరువన్నెలో పెద్ద గీరలు పడేట్టు నేసినచీర (తె. 24).

**తొగరుకమ్మి** తొగరు (=ఒకరకం ఎరుపు) రంగు పెట్టి నేసిన కమ్మి (కో. 12, 15).

**తొగరుచీర** పోకవన్నెలో ఒకఅంచు, నలుపువన్నెలో ఒక అంచు పెట్టి నేసిన తెల్లచీర (తె. 32).

**తొగరుచెట్టు** ఒకరకంచెట్టు; దీని చెక్కతో ఒకరకం ఎరుపురంగు తయారుచేస్తారు (తె. 17).

**తొగరు(రంగు)** ఉ. తొగర, తొగర్రంగు, తొగురు **1.** ముదురు ఎరుపురంగు; ఎర్రతొగరు; లాకీ. చూ. చిత్రం 288 (కో. 1, 2, 9, 12-16, 20, 24, 26, 30, 31, 33, 36; తె. 1, 5-7, 12, 15, 21; రా. 5, 19); **2.** పోకరంగు (తె. 32).

**తొట్టి** ఉ. తొట్టె **1.** పర్యా. చూ. గంజితొట్టి(1). ఒకరకం మట్టిపాత్ర; దీంట్లో గంజిపోసుకొంటారు; కొన్నిచోట్ల, దీంట్లో గంజి వడగడతారు (కో. 2, 5, 7, 10, 12, 15, 18; తె. 8-11, 14, 15, 21, 22, 25; రా. 1, 3, 8, 9, 13, 20, 22, 23); **2.** పర్యా. చూ. అంబలితొట్టి(2). చింతఅంబలి పోసిన తొట్టి; చిన్నకుండ (తె. 7, 9, 20, 22, 25, 26); **3.** పర్యా. చూ. సొరుగు (2). మరమగ్గం చట్రంలో, పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు; నేతనేసేటప్పుడు, నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం

118.13 (కో. 2, 7, 8, 9బి, 15; తె. 1, 11-17, 19; రా. 1, 3, 6-10, 14, 16, 13, 19, 22, 24).

**తొట్టికట్టె** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు, పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 118.8 (తె. 14).

**తొట్టిగాడి** మరమగ్గం సొరుగులో నాడె నిలిచేసందు. చూ. చిత్రం 118.14 (రా. 12).

**తొట్టిచెక్క(లు) 1.** పర్యా. చూ. బొమ్మ (9). మరమగ్గం సొరుగుకు చివర, నాడెబయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 118.16 (తె. 14); **2.** పర్యా. చూ. దవడచెక్క. మరమగ్గం చట్రంలో, పానుపు పట్టెకు పక్కన బిగించిన సొరుగుచెక్క; ఇటువంటివి రెండు పక్కలా ఉంటాయి. చూ. చిత్రం 118.15 (కో. 9 బి); **3.** పర్యా. చూ. సొరుగు(2). మర మగ్గం చట్రంలో, పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు; నేతనేసేటప్పుడు, నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (కో. 3-6, 17; రా. 17).

**తొట్టిపలకలు** పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గం చట్రంలో, పానుపుపట్టెకు ఒక వైపు బిగించిన చెక్కల గూడు; నేతనేసేటప్పుడు. నాడెబయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (తె. 10; రా. 2, 4, 5).

**తొట్టిబొమ్మ** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర, నాడెబయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (రా. 2, 4).

**తొట్టిమూత** పర్యా. చూ. బొమ్మ(9). మర మగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి, బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 118.16 (కో. 9 బి).

**తొట్టె** వెడల్పు మూతి ఉన్న పాత్ర; మామూలుగా రేకుది; కొన్నిచోట్ల, సత్తుది; కొన్నిచోట్ల, మట్టిది; మామూలుగా, దీంట్లో లడీలు తడుపుకొంటారు; కొన్ని చోట్ల రేకుతొట్టెలో లడీలు ఉడకబెడతారు; కొన్ని చోట్ల, నూరిన రంగులు కలుపుకొంటారు; కొన్నిచోట్ల లడీలు దీంట్లోవేసి పిండుతారు. చూ. చిత్రం 282 క.8 (కో. 3, 5, 7, 11, 13, 14, 20, 21, 23; తె. 14, 18, 23, 25; రా. 10, 13, 22, 24).

**తొడ** ఉన్నికత్తెరలో వంపుదిరిగిన భాగం; చేత్తో పట్టుకొనేది. చూ. చిత్రం 306.2 (తె. 3).

**తొడగదురు** పర్యా. వైగదురు. ఒకరకం ఉన్ని కదురు; ఆడవాళ్ళు వడికేది; తొడమీదపెట్టి తిప్పుతూ వడుకుతారు. చూ. చిత్రం 311 చ (తె. 10, 20, 22).

**తొడగరిబొంత** పర్యా. చూ. అంబలిపిడచ(2). గొంగడినేతలో పడుగు తడపటానికి, అంబలిలో ముంచిన గొంగడిగుడ్డ. చూ. చిత్రం 315 క. 20 (తె. 20, 22).

**తొడప 1.** పర్యా. ఇరుసుచెవి(1), చెక్కం(1). రాట్నం నిలువులకు ఆకులరావిడి తగలకుండా మధ్యన వేసిన కొయ్యబిళ్ళ (కో. 37); **2.** పర్యా. చూ. ఉడత తోలు. మరమగ్గంలో, ఉడతకు కింద వేలాడే తోలు చుట్టు; దీని కొసలు, ఉడత చిల్లిలో నుంచి పైకిదూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119. 2 (కో. 28).

**తొడపబల్ల** ఉడతతోలు బిగించిన పై చెక్క; చూ. ఉడత. చూ. చిత్రం 119.1 (కో. 25).

**తొడి** పట్టుదారం చిలప; దీన్ని కోలకర్రలకు తొడిగి, పంటెకు చుడతారు. చూ. చిత్రం 295 క. 1(కో. 23).

**తొడుగునోము(లు)** కార్తికపౌర్ణమినాడు చేసే (కేదారేశ్వర) వ్రతం; ఇరవైఒక్క ఆకు, పోకలు, గారెలు, బూరెలు, దేవుడిముందుపెట్టి, పూజచేసి కేదా రేశ్వరుడి కథ చెప్పుకొంటారు (కో. 25, 26).

**తొడుచు** (క్రి.) చూ. తోడు (కో. 31).

**తొడువు** పర్యా.చక్కి.ఇరుసు మోపేచోట,రాట్నం నిలువుకు బిగించిన ఇనపకట్టు (కో. 34).

**తొడె** ఉ. తొడ. **1.** చిన్న కొణతలికి చుట్టిన నూలు; (పూర్వం అనేవారట)(కో. 34); **2.** పాటినూలు చిలప (కో. 37).

**తొడెకొణతలి** ఒకరకం రాటి; చిన్న నూలుచిలపలు (తొడెలు) దీనికి తగిలించి పంటె మొ. వాటికి తోడు కొంటారు. చూ. చిత్రం 32 (కో. 37).

**తొర్రి** పర్యా. చూ. నాలికతొలి(1). దోనెపలక తిప్పటానికి, పల్లెకట్టె దూర్చే దోనెగాడి; కుడివైపు ఉంటుంది; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 123 క. 10 (రా. 19).

**తొలగుంజ** రూ. దొలగుంజ; పర్యా. చూ. బొడ్డు గొయ్య. మగ్గంమీద, నేతబట్టచుట్టే కొయ్య(దోనె)కు ఆధారంగా, ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండువైపులా రెండుంటాయి; కొన్నిచోట్ల, పడుగు చుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (కో. 18, 20).

**తొలముకర్ర** పుంజెలు వేలాడదీసే పొడుగాటికర్ర (కో. 33).

**తొలి** (బహు. తొల్లు, తొళ్ళు) **1.** పర్యా. గుదిగాడి, తొపురం, దొంక, దోనెతట్టు, దోనెతొలి, దోనెబెజ్జం, బొక్క, బొంద. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి; దీంట్లో బిగించినపుల్ల(పన్ను)కు దారంకట్టి బద్దెచువ్వ బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా అయిదారుంటాయి. చూ. చిత్రం 123 చ. 4 (తె. 2, 9, 11, 13, 19); **2.** పర్యా. నాలికతొలి(2). దోనెకు కుడివైపున చివర చేసినబెజ్జం; దీంట్లో నాలికకొయ్య దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 10 (తె. 4).

**తొలిముట్టు** దారం వడకటానికి, మొదటి ఏకుకు అంటించే కదురుపోగు; ఒకసారి వడికిన తరవాత చిన్నపోగు విడిచిపెడతారు; తరవాత వడుక్కోటానికి ఇది తీసి ఏకుకు అతుకుతారు (రా. 8).

**తొల్లపింజెర** పర్యా. గడ్డపింజెర. ఒకరకం డాబీ (=నేతలో డిజైన్లు రావటానికి అమర్చే యంత్రం); దిండుకు గాళ్ళు చేసింది; గడ్డపింజెర: దీనికి గొలుసు ఉండదు. చూ. చిత్రం 132 ట (తె. 23; రా. 12).

**తొవర** రంగునూలు చిట్టె; దీన్ని తొవరరాటికి తగిలించి కండెలు చుడతారు (కో. 30).

**తొవరరాటి** ఉ. తొవ్రరాటి; పర్యా. పాటిరాటి. ఒకరకం చిన్నరాటి; చిన్నరంగునూలు చుట్ట(=తొవర)లు తగిలించేది; చూ. రాటి. చూ. చిత్రం 31 (కో. 30).

**తొళ** పర్యా. బురక, బొడ్డు(5). బొడ్డుగొయ్యకు చేసిన బెజ్జం; దీంట్లో, దోనె చివరిభాగం(=గుబ్బ)దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 7 (రా. 1).

**తోక** పర్యా. నిలువుపీట(4). సవారుమగ్గం అడ్డపీటకు కింద బిగించిన పొడుగుపట్టె; నేతనేసేటప్పుడు దీని మీద కాలు మోపుతారు. చూ. చిత్రం 324 ట. 3 (రా. 10).

**తోకగుంజ** **1.** పర్యా. చూ. గూటం(3). ఊడ్లైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం; కొయ్యదిగాని, ఇనపదిగాని, రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7 (రా. 12); **2.** పర్యా. చూ. నాలికకొయ్య. మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా కుడిపక్కన, నేలలో పాతినకొయ్య; పైకి మొనదేలి ఉంటుంది; దీన్ని దోనె చివరి బెజ్జంలో దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 1 (కో. 20).

**తోకగూటం** ఉ. తాగ్గూటం, తోగ్గూటం. **1.** పర్యా. చూ. గూటం(3). ఊడ్లైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలోపాతిన ఇనపగూటం; కొయ్యదిగాని, ఇనపదిగాని, రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7(తె. 2), **2.** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతిన కొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి, పెడకోలకు చుట్టి, పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు. చూ. చిత్రం 127.13 (తె. 1, 2, 8; రా. 13, 23, 24); **3.** ఉ. పర్యా. చూ. నాలికకొయ్య. మగ్గంమీదనేతగుడ్డ చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతినకొయ్య; పైకి మొనదేలి ఉంటుంది; దీన్ని దోనెచివరి బెజ్జంలో దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 1 (తె. 1); **4.** పర్యా. చూ. వెన్నుగూటం. ఉన్నిమగ్గం దోనుగను మోసే ఎడమవైపు కొయ్యగూటం. చూ. చిత్రం 315 క. 2 (తె. 22).

**తోకపట్టె** ఉ. -పట్టి. **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె (2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒకకాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 25; రా. 1, 5, 7-10, 12, 13, 18-20); **2.** పర్యా. చూ. తొక్కుడుపీట (2); డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (రా. 20); **3.** పర్యా. చూ. అడ్డపట్టె (5). డబ్బారాట్నం తొక్కుడుపీటకు ఎడమవైపు బిగించిన చిన్నపట్టె. చూ. చిత్రం 41 క. 4 (రా. 20); **4.** పర్యా. చూ. అనుజంగ. ఆమపీటలు బిగించిన పొడుగుపట్టె (లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (రా. 10).

**తోకబొమ్మ** పర్యా. చూ. బొమ్మ (3). రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య; చాలాచోట్ల దీన్నివినాయకుడి ఆకారంలో చెక్కుతారు; చూ. తోక. చూ. చిత్రం 15.10 (రా. 19).

**తోకమొల** పర్యా. చూ. కర్రు. ఊడ్లైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం. చూ. చిత్రం 66.1 (రా. 18).

**తోకరాయి** పర్యా. చూ. గూటం (3). ఊడ్లైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం; కొయ్యదిగాని, ఇనపదిగాని, రాతిదిగాని; చూ. చిత్రం 63 క. 7 (రా. 24).

**తోకర్ర** పర్యా. చూ. తట్టు(డు)కొయ్య. మిడిగూటానికి వేసిన నేతమోకు, పడుక్కు అడ్డురాకుండా, తగిలించటానికి పాతిన గూటం; మామూలుగా, నేత బయలులో ఒక మూల ఉంటుంది; కొన్నిచోట్ల, మిడి గూటానికిగాని, దండెకుగాని కొంచెం ఎడంలో వేస్తారు. చూ. చిత్రం 127.14 (కో. 15).

**తోకొయ్య** పర్యా. చూ. తట్టు (డు) కొయ్య. మిడి గూటానికి వేసిన నేతమోకు, పడుక్కు అడ్డురాకుండా తగిలించటానికి పాతినగూటం; మామూలుగా, నేత జయలులో ఒక మూల ఉంటుంది; కొన్నిచోట్ల, మిడి గూటానికిగాని, దండెకుగాని కొంచెం ఎడంలో వేస్తారు. చూ. చిత్రం 127.14 (కో. 37).

**తోటకాయ** తోటల్లో పెంచిన పసలి పురుగుల గూళ్ళు; పసలికాయలు; మద్ది, రేని, ఇల్లింత, ధర్మ, చెన్నంగి మొ. చెట్లమీద పురుగులను పెంచుతారు (తె. 7).

**తోట్నం** (-పోయు) పర్యా. చూ. పడుగు (2). అనుపోసిన నూలు; నేతలో నిలువుకు వాడే నూలు; కొన్నిచోట్ల పట్టు; పూర్వం వాడుకలో ఉండేపేరు (తె. 12, 13).

**తోడు**(క్రి.) **1.** రూ. తొడుచు; పర్యా. చుట్టు (1), తిప్పు, నూలుపట్టు, నూలుపోయు వెలుచు(1). పంఱెకు గాని, డబ్బాకుగాని నూలు చుట్టటం (కో. 1, 3, 12, 16–18, 20–24, 28–30, 35, 37; తె. 2, 3, 6, 7, 9–13; రా. 11, 14–18, 22–24); **2.** పర్యా. చూ. అనుపోయు. అనుగొట్టంలోకి పోగులీసుకొని, అనుకొయ్యలకు చుట్టివచ్చేట్టు చెయ్యటం (కో. 5–7, 12, 14, 15, 18, 19, 22, 23, 31, 34; తె. 17, 32; రా. 10, 20); **3.** రాగిగంజిలోగాని, మైదా గంజిలోగాని కలిపిన అన్నంగంజి (రా. 1, 12).

**తోడుకూలి** అనుపోసేందుకు ఇచ్చేకూలి (కో. 5).

**తోడుగోల** పట్టుదారం, పంఱెకు చుట్టటానికి చిలప తగిలించేకర్ర; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 295 (తె. 17).

**తోడుడుకట్టె** పర్యా. రోటడుకట్టె. పంఱెకు నూలు చుట్టటానికి, చేత్తో తిప్పేకాముకు ఊనికగా, తొడమీద పెట్టుకొనేకర్ర; గుండ్రటిది (తె. 9).

**తోడుపుల్ల** ఉ. తోడుబుల్ల; పర్యా. చూ. అనుగొట్టం (1). అనుపోసే గొట్టం; దీంట్లోకి పోగులీసుకొని అను పోస్తారు. చూ. చిత్రం 48 (కో. 22, 27, 30, 31).

**తోడువాయ** అనుపోసిన తరవాత, సరిచెయ్యటానికి ఊడ్తెలకు తగిలించిన పట్టుపడుగు (తె. 12).

**తోపురం** పర్యా. చూ. తొలి (1). నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి; దీంట్లో బిగించినపుల్లకు దారంకట్టి బద్దెచువ్వ బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా, అయిదారుంటాయి. చూ. చిత్రం 123 చ. 4 (రా. 8).

**తోపురంగు** నలుపువన్నె కలిసిన ఎరుపురంగు (కో. 23).

**తోము** (క్రి.) పర్యా. చరుము, తిక్కు, రాము(1), రాయు, సోదించు. గంజి పడగట్టటానికి గుడ్డలో పోసి రుద్దటం; పామటం (రా. 1. 2, 6–8, 12, 13, 16, 19 20).

**తోలు** పర్యా; చూ. ఉడతతోలు. మరమగ్గంలో, ఉడతకింద వేలాడే తోలుచుట్టు; దీని కొసలు, ఉడత చిల్లిలో నుంచి పైకి దూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (రా. 1).

**తోలుంగరం** (< తోలు + ఉంగరం) పర్యా. చూ. ఉడతతోలు. మరమగ్గంలో, ఉడతకుకింద వేలాడే తోలు చుట్టు; దీనికొసలు, ఉడత చిల్లిలో నుంచి పైకి దూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (తె. 9, 16).

**తోలుచిట్టి** పర్యా. చూ. ఉడతతోలు. మరమగ్గంలో ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు; దీనికొసలు ఉడత చిల్లిలోనుంచి పైకి దూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (కో. 8).

**తోలుతిత్తి** ఉ. తోల్తిత్తి; పర్యా. చూ. ఉడతతోలు. మరమగ్గం ఉడతకు కిందవేలాడే తోలుచుట్టు; దీని కొసలు, ఉడత చిల్లిలోనుంచి పైకి దూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (కో. 6, 9).

**తోలుదిండు** తోలుతో చేసిన కదురుదిండు; చూ. దిండు (కో. 37).

**త్రాసు** రూ. తరాజు. తక్కెడ; రంగులు పాళ్ళు వేసుకోటానికి దీంతో తూచుకొంటారు (కో. 17, 26).

**త్రిపురనేత** ఉ. తిరుపుర–. ఒకరకం డిజైనునేత; ఇద్దరు కలిసి కుప్పడంపట్టి నేస్తారు; చూ. కుప్పడం నేత (కో. 36).

## ద

**దగ్గులపుటం** తెలుపు నాలుగు కొలుకులు, ఎరుపు ఒక కొలికి చొప్పున నిలువు, అడ్డంపెట్టి నేసిన గళ్ళచీర; గొల్లవాళ్ళు కడతారు (తె. 13, 15).

**దంచుడున్ని** బండమీద దంచే ఉన్ని; ఇది కార్తిక మాసంలో కత్తిరిస్తారు (తె. 7).

**దట్టిగుంజ** పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట; మామూలుగా, దీనికి శిలువమాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిల్లి చేసి, దాంట్లో గుండం దూర్చి, లడీలు తగిలించి, పిడుపు కర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1(తె. 18).

**దట్టీకోక** పర్యా. చూ. దట్టీ(2). బిగింపుకుగాని, అందంకోసంగాని నడుముకు చుట్టుకొనే ఒకరకం బట్ట; జానెడు వెడల్పు, రెండున్నరగజాల పొడుగు ఉంటుంది; రకరకాల రంగుల్లో నేస్తారు (రా. 13).

**దట్టీ** (బహు. దట్టీలు, దట్లు) ఉ. దట్టి. **1.** పర్యా. చూ. వల్లె. కన్నెపిల్లలు కట్టుకొనే చిన్నచీర; కొన్నిచోట్ల, పది పన్నెండు మూరల పొడుగున, రెండు మూడు మూరల వెడల్పున నేస్తారు (రా. 16, 17, 23); **2.** పర్యా. కాసీకోక, కాసీపట్టి, దట్టీకోక. బిగింపుకుగాని, అందంకోసంగాని నడుముకు చుట్టుకొనే ఒకరకం బట్ట; జానెడు వెడల్పు, రెండున్నర గజాలు పొడుగు ఉంటుంది; రకరకాల రంగుల్లో నేస్తారు (రా. 11).

**దడ 1.** (బహు. దళ్ళు) నూలుపిండుల కట్ట; నలభయ్యో నెంబరు నూలు నాలుగు లడీలు కలిపిన కట్ట; అద్దకానికి ఇలా కడతారు (కో. 26); **2.** లడీ(1) (కో. 31); **3.** కొన్ని పట్టు చిలప(తొడి)ల కట్ట (కో. 23).

**దడి** పర్యా. అడ(1). నేతలో డిజైన్లు పడటంకోసం డాబీకోలలకు కట్టిన దారాలు. చూ. చిత్రం 132 క. 5 (రా. 2).

**దడిపలక** డిజైన్లు నేసేటప్పుడు, పేటుదారాలు ఎత్తే కొయ్యపలక; దీని పరిమాణం 4" × 1' (కో. 2).

**దడిపూత** పర్యా. దడిబుటా. మగ్గానికి దడి అమర్చి, నేతలో పోగులు దూర్చి మలుపుతూ నేసిన డిజైను; ముత్తుపేటు మాదిరిగా నేస్తారు. (కో. 2).

**దడిబుటా** పర్యా. దడిపూత. మగ్గానికి దడి అమర్చి, నేతలో పోగులు దూర్చి మలుపుతూ నేసిన డిజైను; ముత్తుపేటు మాదిరిగా నేస్తారు (కో. 2).

**దడ్డేలు** పట్టుపురుగులను పెంచే తట్టలు అమర్చిన మంచె; అరలు అరలుగా ఉంటుంది; దీన్ని మేజు అని కూడా అంటారు చూ. చిత్రం 289 ట (రా. 1).

**దండబద్ద** పర్యా. చూ. గొలుసుబద్ద. డాబీగొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద(లు); వీటికి కొయ్య పిక్కలు బిగిస్తారు; ఇవి దిండును చుట్టి తిరుగుతూ ఉంటాయి. చూ. చిత్రం 132 త. 2 (కో. 36).

**దండంచెవి** చూ. దండెచెవి(1) (రా. 9).

**దండాగుండీ** ఒకరకం అంచు (రా. 21).

**దండి 1.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా పొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 37); **2.** అంచుకు కింది భాగం; అద్దకం పనివాళ్ళవాడుక; చూ. చిగురంచు (కో. 7).

**దండికొయ్య** పర్యా. చూ. సూత్రాలకట్టె(2). మగ్గంతాళ్ళ(=చేతిపలకతాళ్ళు, కోతిపుల్లలతాళ్ళు, నిరకలతాళ్ళు, పుల్లెరుసుతాళ్ళు మొ.వి) కట్టటానికి ఆధారంగా, మగ్గానికి పైన అమర్చినకర్ర; కొన్నిచోట్ల, వెదురుది. చూ. చిత్రం 121 క. 14 (రా. 1).

**దండిగపోగు** చూ. దండెపోగు(1) (తె. 25).

**దండిగె** పర్యా. దండెకోల(2). ఉన్నిపడుగు మధ్యలో, అనిపోగులు విడదియ్యటానికి(=అని తెరవటానికి) అచ్చుదగ్గర ఎక్కించినకర్ర; అనిపోగుల మధ్య నుంచి పేకపోగు వేస్తారు (తె. 28).

**దండె** ఉ. దండి. **1.** కమాను(=దూదిఏకే కొయ్య పనిముట్టు) నరం బిగించిన పొడుగుకట్టె. చూ. చిత్రం 9.4 (తె. 2); **2.** పర్యా. కుంచెకర్ర(2). పడుగుదువ్వే కుంచెకు పక్కభాగంలో కట్టిన పొడుగుకర్ర; ఇటువంటివి రెండుంటాయి; వీటిని ఇద్దరు మనుష్యులు పట్టుకొని పడుగుమీద కుంచెవేస్తారు. చూ. చిత్రం 76 క. 4 (తె. 26); **3.** రూ. దండెం(1); పర్యా. అచ్చుదండె, పత్తెబద్ద(3), చువ్వ(5), దండెపుల్ల, దబ్బ(6), పన్నెదండె, పన్నెదబ్బ(2), పన్నెపుల్ల(3), పన్నెసిబర, బద్ద(6), సాటా, సూరె(1). పన్నెకట్టుబడిలో ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం; ఇటువంటివి పైనా కిందా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (కో. 3, 6, 9, 10, 22-24, 26, 27, 29, 32, 34, 36, 37; తె. 5, 10, 15, 16, 19, 22, 23, 27, 28); **4.** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగేకర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్రలతాళ్ళూ మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (రా. 3); **5.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులువేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 25, 32, 35; తె. 22); **6.** రూ. దండెం(2); పర్యా. దండెకట్టె(2), దండెకర్ర(3), దండెగాలు, దండెగుంజ(2), దండెగోలు, దండెదురు, దండెదురుగుండు, దండెదురుపట్టె, దండెపుకర్ర, దండెబడె, దండెబారు(1), దండెబొంగు, దండెమడ. మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగు కొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (కో. 2, 5, 6, 7, 9, 10, 12-14, 17-21, 23, 25, 33, 35-37; తె. 4, 5, 7,

6, 10–14, 18–20, 22; రా. 2–5, 10, 20, 23); **7.** పర్యా. చూ. పలక(4). చేతిమగ్గం పన్నె బిగించిన పై చెక్క; పలచగా, పొడుగ్గా ఉంటుంది; దీనికి గుండు బిగిస్తారు; దీనికి పైన దారాలు కట్టి వేలాడదీస్తారు; నేత నేసేటప్పుడు, పోగు దగ్గరపడటానికి, దీంతో అదుము తారు. చూ. చిత్రం 109 చ. 1 (రా. 3).

**దండెకట్టు** **1.** ఉ. దండి–; పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచె పై భాగం; మొగలినారతో గాని, వేముతోగాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (కో. 30); **2.** అచ్చుకట్టేటప్పుడు, అచ్చుకర్ర మీద కొండితాడు బిగింపుకు వేసిన మెలిక (కో. 33, 34); **3.** పర్యా. చూ. పన్నెకట్టు(1). పన్నెకట్టుబడిలో, ఈనెల బిగింపుకోసం అడ్డంగా రెండు వెదురుబెత్తాలు పెట్టి వేసిన దారపుకట్టు. చూ. చిత్రం 88 క. 7 (కో. 22); **4.** (క్రి.) పన్నెకట్టే జంత్రంబొమ్మలకు బిగించిన వెదురుబద్దల మధ్య జొన్నపుల్లలు వరసగా పెట్టి దారంతో బిగించి కట్టటం (కో. 26).

**దండెకట్టె** **1.** పర్యా. వాటు(1). కమాను పై వైపున పట్టుకోటానికి అనువుగా కట్టిన కర్రముక్క. చూ. చిత్రం 9 చ. 1 (తె. 2); **2.** పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగ జారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలిమాదిరిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (తె. 9; రా. 7, 18, 19ఎ); **3.** పర్యా. చూ. నాగవాసం(6). గొంగడిమగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె; మామూలుగా, వంపుగా ఉంటుంది. చూ. చిత్రం 316.3 (తె. 11).

**దండెకప్పి** పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 26).

**దండెకర్ర(లు)** ఉ. దండికర్ర, దండిగర. **1.** పర్యా. చూ. బడ్డీ(1). మరానుమీద పడుగుతోడేటప్పుడు డబ్బాలకు ఉన్నదారం ఒగ్గులపట్టెవరకూ సాపుగా పోవటానికి నిలువుగుంజల మీద అడ్డంగా బిగించిన కొయ్య(లు); కొన్నిచోట్ల, వెదురువి (కో. 26); **2.** పర్యా. చూ. కుంచెదండె. కుంచె(=పడుగురుద్దే పనిముట్టు) వెన్ను బిగింపుకు, లోపల అమర్చి కట్టిన వెదురుబొంగు. చూ. చిత్రం 76 చ. 1 (కో. 15, 21); **3.** పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగ జారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటికొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (కో. 6, 8, 11, 15; రా. 1).

**దండెకొయ్య** ఉ. దండెకొయ. **1.** పర్యా. చూ. రలకొయ్య. తలపీటకుండే మొదటిచాలు కొయ్య(లు); వెనకపీట కొయ్యలకంటె పీటి సంఖ్య ఎక్కువ. చూ. చిత్రం 45 క. 5 (కో. 33); **2.** పర్యా. చూ. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 27, 28, 30, 34, 37; రా. 5).

**దండెకొయ్యలగూటం** ఉ. దండి–; పర్యా. చూ. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్ని చోట్ల ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (రా. 1).

**దండెకోల** ఉ. దండికోల, దండెకోల. **1.** పర్యా. అడ్డదారి(కట్టె). మగ్గానికి తగిలించిన ఉన్నిపడుగు నేలకు ఆనకుండా ఊనికగా పెట్టినకొయ్య; రోకలి మాదిరిది. చూ. చిత్రం 315 క. 12 (తె. 10); **2.** పర్యా. అడ గోల, దండిగె, వర్దండిగ. ఉన్నిపడుగు మధ్యలో అని పోగులు విడదియ్యటానికి (=అని తెరవటానికి) అచ్చు దగ్గర ఎక్కించిన కర్ర; అనిపోగుల మధ్యనుంచి పేక పోగు వేస్తారు (తె. 11, 20, 22).

**దండెకోలు** పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయలు బిగించినకర్ర; మామూలుగా, దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల, పొట్టెలుగాని, పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (రా. 3).

**దండెగదురు** ఉ. దండకదురు, దండెకదురు, దండె గదరు. పర్యా. చూ. బిళ్ళకదురు, మొగకదురు. ఒక రకం ఉన్నికదురు; మగవాళ్ళు వడికేది; మంద తోలు కెళ్ళేటప్పుడు కూడా నడుస్తూ, దీంతో వడుకుతారు. చూ. చిత్రం 311 క (తె. 9, 10, 20, 25).

**దండెగర్ర** ఉ. దండి–; పర్యా. చూ. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 24).

**దండెగాలు** ఉ. దండి–; పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాది రిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (కో. 3).

**దండెగుజ్జు** పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల రాయి; ఇటువం టివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 28, 31).

**దండెగుంజ** ఉ. దండి–. **1.** పర్యా. చూ. దండె చెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం

126.1 (కో. 17; తె. 29, 32, 33; రా. 2, 4, 24); **2.** పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగు నూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవుల మీద మోపుతారు. **చూ.** చిత్రం 126 (రా. 24).

**దండెగుండు** పర్యా. చూ. సవలతుగుండు. దండె దగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి దిగజారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసిన రాయి; కొన్ని చోట్ల, ఇనపగుండుగాని, చెక్కంగాని కడతారు. **చూ.** చిత్రం 126.3 (కో. 34).

**దండెగుబ్బ** ఉ. దండి-. పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 12, 22).

**దండెగోలు** పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటికొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవుల మీద మోపుతారు. **చూ.** చిత్రం 126 (కో. 1).

**దండెగోలుగూటం** పర్యా. చూ. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126. 1 (కో. 1).

**దండెచివర** ఉ. దండిసివురు,-సివర, -సివుర; పర్యా. దండెదురుచూక, దండెబొంగుచివర. మగ్గందండె దగ్గర నేతపడుగులో దూర్చిన చువ్వ (తె. 1, 2, 7; రా. 16, 18, 23, 24).

**దండెచెవి 1.** ఉ. –సెవు; రూ. దండంచెవి; పర్యా. ఊటగుంజ, కుడప, కొక్కుగుంజ, గుజ్జ(6), గూటం(7), చెవుకట్టు(3), చెవుగూటం, చెవులకొయ్య(2), చెవుల రాయి, దండెకప్పి, దండెకొయ్య, దండెకొయ్యల గూటం, దండెగర్ర, దండెగుజ్జ, దండెగుంజ(1), దండె గుబ్బ, దండెగోలుగూటం, దండెచెవుకట్టు, దండెదిబ్బ, దండెదురుకొయ్య, దండెదురుగుంజ, దండెపలవ, దండె పీను, దండెరెబ్బ, నాలికరొబ్బ, పంగలకర్ర, పంగల కొయ్య. దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల రాయి; ఇటువంటివి, రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 7, 9, 10, 14; తె. 3-5, 7, 8, 10-28, 30, 31; రా. 16, 24); **2.** పర్యా. గుర్రం. దండెను మోసే పంగలకొయ్య పైభాగం; ఇటువంటివి, ఒక్కొక్కదానికి రెండుంటాయి. చూ. చిత్రం 126 (రా. 3).

**దండెచెవుకట్టు** ఉ. –సెవకట్టు; పర్యా. చూ. దండె చెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. **చూ.** చిత్రం 126.1 (కో. 5).

**దండెతాడు** ఉ. దండితాడు. **1.** పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టేటప్పుడు, పడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన లావుదారం; దీన్ని అచ్చుకడురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 31, 33); **2.** పర్యా. రాయిజారుతాడు. దండెకు ఒకవైపు చువ్వకు మధ్యగాకట్టి, రెండోవైపున సవలతు గుండు వేలాడదీసినతాడు. చూ. చిత్రం 126.2 (కో. 36; రా. 17).

**దండెదిబ్బ** ఉ. దండి-. పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి, రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 33).

**దండెదిమ్మ** ఉ. దండిదిమ్మె; పర్యా. చూ. దండె చెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 25, 35).

**దండెదురు** పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (కో. 4, 8, 9ఎ, 9బి, 16, 22, 24, 26-32, 34; తె. 15-17, 21, 23-33; రా. 6, 11, 13-16, 19బి, 21).

**దండెదురుకొయ్య** ఉ. -కొయ; పర్యా. చూ. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్ని చోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 9బి, 16; రా. 11, 13-15).

**దండెదురుగుంజ** పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. **చూ.** చిత్రం 126.1 (రా. 19బి).

**దండెదురుగుండు** పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (రా. 9).

**దండెదురుచూక** పర్యా. చూ. దండెచివర. మగ్గం దండెదగ్గర నేతపడుగులో దూర్చిన చువ్వ (రా. 12).

**దండెదురుపట్టె** పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండె చెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (రా. 12).

**దండెదుమురాయి** పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చిన్న చెక్కగాని కడతారు. చూ. చిత్రం 126.3 (రా. 12).

**దండెదుములాక** పర్యా. దండెలాక. నేతపడుగులో, దండెదగ్గర దూర్చిన వెదురుబద్ద; ఇటువంటివి, రెండు వైపులా ఉంటాయి (తె. 29).

**దండెపన్ను** (క్రి.) పన్నెకట్టే జంత్రంబొమ్మలకు, అడ్డంగా వెదురుబద్దలు బిగించటం; పైన, కింద రెండేసి బిగిస్తారు (కో. 26).

**దండెపలవ** ఉ. దండి–; పర్యా. చూ. దండెచెవి(1). దండెనుమోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 23).

**దండెపీను** పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 32).

**దండెపుకర్ర** పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (కో. 8).

**దండెపుల్ల** పర్యా. చూ. దండె(3). పన్నెకట్టు బడిలో, ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురు బెత్తం; ఇటువంటివి, కిందా పైనా రెండేసి ఉంటాయి; దేవాంగుల వాడుక. చూ. చిత్రం 88 క. 5 (కో. 7).

**దండెపోగు** **1.** రూ. దండిగపోగు; పర్యా. మగపోగు. ఆసుపోసినప్పుడు పడుగులో పైకి వచ్చిన ఉన్నిపోగు (తె. 22); **2.** పర్యా. చూ. పడిదారం(5). ఉన్ని పడుగుమీద అచ్చుకోలకు అనులువేస్తూ అల్లిన లావుపాటి పోగులు; మామూలు పోగులు ఏడేసి కలిపి పురిపెడతారు (తె. 20).

**దండెబడె** ఉ. దండి–; పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (రా. 24).

**దండెబల్ల** **1.** పర్యా. చూ. పీట(1). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (కో. 35, 36); **2.** పర్యా. చూ. పీట(2). డబ్బారాట్నం నిలువులు బిగించిన కిందిపీట. చూ. చిత్రం 41 క. 1 (కో. 35); **3.** పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్య(=ఆసుకు బిగించిన నిలువుపుల్లలు)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల, రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (కో. 33).

**దండెబారు** **1.** పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (తె. 3); **2.** పర్యా. చూ. వాయిదారి. మగ్గందోనెకూ దండెకూ మధ్య నేతభాగం (తె. 32).

**దండెబొంగు** ఉ. దండి–; పర్యా. చూ. దండె(6). మగ్గానికి బిగించిన పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవులమీద మోపుతారు. చూ. చిత్రం 126 (తె. 1. 2. 6; రా. 18, 24).

**దండెబొంగుచివర** ఉ. –సివర; పర్యా. చూ. దండెచివర. మగ్గందండె దగ్గర నేతపడుగులో దూర్చిన చువ్వ (తె. 6).

**దండెబొంగుతాడు** ఉ. దండి–; పర్యా. చూ. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగర్ర; (కొన్నిచోట్ల, మలబద్ద) దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (తె. 3).

**దండెం** **1.** చూ. దండె(3) (కో. 1; రా. 6, 11, 14); **2.** చూ. దండె(6) (రా. 19); **3.** పర్యా. చూ. రాయబారపుకర్ర. వేలాడదీసిన పడుగుచుట్టను దగ్గరికిగాని, దూరానికిగాని జరుపుకోటానికి వీలుగా మగ్గానికి పైన పెట్టిన కర్ర. చూ. చిత్రాలు 129 క. 4, 129 చ. 2 (కో. 24); **4.** పర్యా. చూ. నాగవాసం(6). గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె; మామూలుగా, వంపుగా ఉంటుంది. చూ. చిత్రం 316.3 (తె. 3).

**దండెమంచు** రెండు కొలుకుల తెల్లపోగులమధ్య నాలుగు కొలుకుల ఎర్రపోగులు పెట్టి నేసిన అంచు (రా. 11).

**దండెమడ** ? పర్యా. చూ. దండె(6). మగ్గానికి పడుగునూలు కిందికి దిగజారకుండా ఎత్తుపెట్టిన గుండ్రటి పొడుగుకొయ్య; రోకలి మాదిరిది; దీన్ని దండెచెవుల మీద మోపుతారు. చూ. చిత్రం 126 (రా. 22).

**దండెముందరిరాయి** ఉ. –ముందలి–; పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చిన్నచెక్కగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 4).

**దండెరెబ్బ** ఉ. దండిరెప్ప; రూ. దండెరొబ్బ; పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగల

కొయ్య; కొన్నిచోట్ల రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 7, 22).

**దండెరొబ్బ** ఉ.దండిరొబ్బ; దండెరుబ్బ; చూ.దండెరెబ్బ (కో. 15, 20–22).

**దండెలాక** పర్యా. దండెదురులాక. నేతపడుగులో, దండెదగ్గర దూర్చిన వెదురుబద్ద; ఇటువంటివి రెండు వైపులా ఉంటాయి(కో.37; తె.2,20,24,29; రా.24).

**దండెవెనకచువ్వ** దండెదగ్గర(=వెనక) నేతపడుగులో దూర్చిన వెదురుబెత్తం; చూ. సూరె (కో. 3).

**దండెసూరె** ఉ. దండెసురె; పర్యా. చూ. చువ్వ(7). దండెదగ్గర పడుగుపోగులు నెరపటానికి, అచ్చుదగ్గర నేతపడుగులో దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి, దండెకు రెండువైపులా ఉంటాయి; నేత అవుతున్నకొద్దీ వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127.3 (తె. 8, 9, 20).

**దణ్ణంకర్ర** ? పట్టుదారంచుట్టే డొలకను పైనుంచి వేలాడదియ్యటానికి ఇంటిపైకప్పుకు వేసేకర్ర(కో. 14).

**దనాసరిగోంగూర** గోంగూరలలో ఒకరకం; పులుపు తక్కువగా ఉంటుంది; దీని ఆకులు పచ్చడి చేసుకొంటారు; ముదురుకాడలు ఊరేసి నార తీస్తారు; దీన్ని సేద్యంపనులలో వాడేతాళ్ళు, నులక మొ.వి పేనటానికి, బట్టల నేతలోను వాడతారు (కో. 19).

**దంతనం** **1.** చూ. జంత్రం(పీట) (కో. 11, 13, 19, 27, 31); **2.** పర్యా. చూ. బెంతుపన్నె. అల్లు చేసేటప్పుడు, పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పని ముట్టు; పన్నెలాంటిది; రెండు పొడుగుకర్రలకు మధ్య వరసగా మేకులు బిగించి ఉంటాయి; వాటిమధ్య పడుగు పోగులు దూరుస్తారు. చూ. చిత్రం 106 (కో. 11).

**దంతనంకొయ్య** చూ. జంత్రంకొయ్య (కో. 31).

**దంతిరితాడు** పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టేసతాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు పేటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (కో. 6).

**దంతెర** (-తేబట్టు) ఉ. దంతర; చూ. జంత్రం(4). (తె. 11, 25–28).

**దంతెరగుండు** పర్యా. చూ. నాగవాసం(6). గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె; మామూలుగా వంపుగా ఉంటుంది. చూ. చిత్రం 316.3 (తె.15).

**దంతెరదిండు** చూ. జంత్రందిండు (తె.25,27,28).

**దంతెరబొమ్మ** చూ. జంతరబొమ్మ (తె. 25).

**దంత్రం** ఉ.దంతరం. **1.** పర్యా. చూ. తిరిగిణిచట్టం. అడ్డగుమ్మి అమర్చే కొయ్యచట్రం; చూ. దొడ్డి. చూ. చిత్రం 42 (కో. 4); **2.** చూ. జంత్రం(4) (కో. 1, 4, 5, 7, 9, 10, 12, 18, 21, 24; తె. 11, 13, 15, 17, 21, 28; రా. 7, 8, 10, 12, 19, 20); **3.** చూ. జంత్రం(పీట) (తె. 3, 9).

**దంత్రందిండు** చూ. జంత్రందిండు (తె. 6).

**దంత్రంపుల్ల** పర్యా. చూ. అచ్చుబిళ్ళ. అచ్చుకట్టేటప్పుడు, పడిదారంచుట్టే కొయ్య; దీనికి చుట్టిన పడిదారం; అచ్చుకర్రకు దూరుస్తారు. చూ. చిత్రం 92 క, చ (తె. 17).

**దంత్రంబల్ల** రూ. దంతనంబల్ల; పర్యా. చూ. జంత్రందండె. అచ్చుకట్టే జంత్రానికి నిలువుపుల్లలు బిగించిన కిందిపీట; కొన్నిచోట్ల, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 91 క. 1 (కో. 31).

**దప్పం** పర్యా. చూ. ముతకనూలు. పోగు మందంగా ఉండే నూలు; 10 నుంచి 60 నెంబర్లదాకా (రా. 3).

**దబలచీర** పట్టెలు పట్టెలుగా నేసిన ఒకరకం చీర; మాలపిల్లచీర (తె. 32).

**దబ్బ** **1.** పర్యా. చూ. ఉండేలు(బద్ద). తాడుకట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం 9.12 (కో. 9; రా. 20); **2.** పర్యా. చూ. ఆకు(5). రాటికిపైనా కిందా కట్టిన వెదురు బద్ద(లు). చూ. చిత్రం 31 క. ? (తె. 1; రా. 4, 10, 13, 15, 16, 23); **3.** పర్యా. చూ. ఆకు(2).పంజెకామచుట్టూ వంచి కట్టినవెదురుబద్ద(లు); పంజెకట్టుబడిలో ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి. చూ. చిత్రం 19 క. 2 (కో. 8; తె. 1; రా. 11, 13, 15); **4.** పర్యా. చూ. చిట్టె(2). పంజె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రం 19 క. 3, 4 (రా. 6, 11); **5.** చూ. బద్ద(5) (కో. 9; తె. 4; రా. 17, 18); **6.** పర్యా. చూ. దండె(3). పన్నెకట్టుబడిలో, ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం; ఇటువంటివి, కిందా పైనా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (కో. 8; రా. 16, 18); **7.** పర్యా. చూ. ఎత్తుపుల్ల(2). అచ్చుతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండు పుల్లలకు తాడుగట్టి, మడతమంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (రా. 4); **8.** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గంబొమ్మకు, నిలువుపట్టెకు పేటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (రా. 11); **9.** చూ. బద్ద(8) (రా. 10).

**దబ్బదోనుగ** ఉ. -దోనుగు. మగ్గంమీద, నేతగుడ్డ చుట్టే ఒకరకందోనె; చూ. దోనె (తె. 23).

**దబ్బపంపె** పర్యా. చూ. చెలకపంపె. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం కొయ్యపంపె; నూలు చుట్టు కోటానికి వీలుగా, దీనికి **కొయ్యబద్ద** లుంటాయి. చూ. చిత్రం 29 (తె. 11).

**దబ్బలం** ఉ. దబ్బనం. **1.** కుంచె కట్టుబడిలో, గడి పేళ్ళ(=పురి)కుట్టటానికివాడే మందపుకడ్డీ; దబ్బనం; దీనికి సన్నటి కొసవైపు బెజ్జం ఉంటుంది. చూ. చిత్రం 87 (కో. 35); **2.** పర్యా. చూ. బెంతికదురు. అచ్చు కట్టేటప్పుడు, పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చేపుల్ల; మామూలుగా, ఇనపది; కంటాణీలాంటిది; దీనికి పదునుగా ఉన్నవైపు, పోగు దూర్చటానికి చిన్నకొక్కెం ఉంటుంది; కొన్నిచోట్ల, రెండోవైపు పిడి ఉంటుంది. చూ. చిత్రం 94 (కో. 33); **3.** పర్యా. చూ. తూకం. పేటువడికి, కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా, ఇనపపుల్ల; కొన్నిచోట్ల సత్తుది; నేతనేసేటప్పుడు, అని మూసిన తరవాత, వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి, రెండు పక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (రా. 15).

**దబ్బలబుడ్డి** పర్యా. చూ. చెలకపంపె. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం కొయ్యపంపె; నూలుచుట్టు కోటానికి వీలుగా దీనికి కొయ్యబద్దలుంటాయి. చూ. చిత్రం 29 (రా. 11).

**దమయంతిచీర** ఒకరకం ఆకుపచ్చరంగుచీర (కో. 3, 6, 10, 11, 26, 35; రా. 11).

**దమయంతి(పచ్చ)** **1.** ముదురు ఆకుపచ్చరంగు; బీరపువ్వు, పచ్చ కలిస్తే వచ్చింది. చూ. చిత్రం 288 (కో. 2-4, 6, 7, 9–13, 15, 16, 18–24, 26, 36; తె. 15, 16; రా. 1, 6–8, 11, 12, 19); **2.** ఆకుపచ్చలో నలుపువన్నె (తె. 14).

**దమయంతిపొప్పిళిచీర** మూడు కడ్డీల పోగులు, వాటిమధ్య గీరలూ పడేటట్టు నేసిన గడిచీర (రా. 7).

**దర్బారంచు** ఒకరకం అంచు; పూర్వం నేసేవారట (కో. 24; రా. 14).

**దర్బారువయిలేటు** వంగపువ్వువన్నె (కో. 8).

**దవ** పర్యా. అరటిపొత్తి. సన్నదారం తీసేటప్పుడు, చేతిచెమట అంటకుండా పట్టుకొనే అరటిదొప్ప; కొన్నిచోట్ల తోలుతిత్తి వాడతారు; చూ. అరటిపొత్తి. చూ. చిత్రం (కో. 34).

**దవడ** ఉ. ? దౌడ; పర్యా. అపు(బద్ద), ఊడుపు బిళ్ళ, కడంచుబద్ద, కడదబ్బ, కాపు, కాపుచెక్క, కాపుబద్ద, కాపుబిళ్ళ, చిల్ల(5), చెంపదబ్బ, చాలవపన్ను, దిగుబద్ద, పక్కచిల్ల, పన్నెపుల్ల(1), పన్నెబద్ద(1), పన్నెబల్ల, పన్నెబిళ్ళ, పోకబద్ద, బంటుబద్ద(1), బిరుదబ్బ(2), బిళ్ళ(8), బిమ్కడ్డి, మేదరదబ్బ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పు బద్ద; నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 11, 13, 14; తె. 14).

**దవడచెక్క** పర్యా. ఉడతజబ్బ, గడిబల్ల, చెంప(4), డోలుచెక్క, తొట్టిచెక్క(2), సొరుగుకర్ర, సొరుగుచెక్క, సొరుగుదాపు, సొరుగుపలక, సొరుగుపేడు. మరమగ్గం చట్రంలో, పానుపట్టెకు పక్కన బిగించిన సొరుగు చెక్క; ఇటువంటివి, రెండుపక్కలా రెండుంటాయి. చూ. చిత్రం 118.15 (రా. 11. 15, 18).

**దవనం** చూ. దొగ్గనం (కో. 12, 20).

**దశావతారం** పట్టెలుపట్టెలుగా నేసిన గళ్ళచీర: **1.** నాలుగయిదు రంగులపట్టెలు నిలువు, అడ్డం వచ్చేట్టు నేసిన గళ్ళచీర (కో. 36); **2.** ఒక బొందుకు ఒకపట్టె విడిచిపెట్టి, పట్టెకు ఒక్కొక్క రంగుపెట్టి నేసిన చీర (కో. 24).

**దసలి** ఒకరకం పట్టు; దసలిపురుగులనుంచి వచ్చేది; ముదురు గోధుమరంగులో ఉంటుంది; tussore silk (తె. 7, 17).

**దసలికాయ** (–పోయు) రూ. దసిరికాయ. దసలి పురుగు, ముక్కురంధ్రాల నుంచి వచ్చే దారంతో, తన చుట్టూ అల్లుకొన్న గూడు; సాలగ్రామం మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 289 (తె. 7).

**దసలికోల** దసలిదారం పేరటానికి ఎక్కించినకర్ర (తె. 7).

**దసలిగుడ్లు** (బహు.) దసలి(=ఒకరకంపట్టు) ఉత్పత్తి చేసే పురుగులు పెట్టిన గుడ్లు. చూ. చిత్రం 289.1 (తె. 17).

**దసలిగువ్వ** దసలి(పట్టు)దారం ఉత్పత్తిచేసే పురుగు (తె. 7).

**దసలిగుళ్ళె** నూరు దసలికాయలు వడికి తీసిన దారం (తె. 7).

**దసలిపట్టు** ఒకరకం పట్టు; దసలిపురుగుల నుంచి వచ్చేది; ముదురు గోధుమవన్నెలో ఉంటుంది; tussore silk (కో. 14).

**దసలిపని** దసలి (పట్టు) దారం తియ్యటం; దాంతో బట్టలు నెయ్యటం (తె. 17).

**దసలిపిల్ల(లు)** దసలి(=ఒకరకంపట్టు) తయారుచేసే పురుగులుపెట్టిన గుడ్లలోనుంచి వచ్చిన చిన్నపురుగు(లు). చూ. చిత్రం 289.2 (తె. 17).

**దసలిపురుగు** ఒకరకం పట్టు(=దసలి)దారం ఉత్పత్తి చేసే పురుగు; చూ. పట్టుపురుగు (తె. 7, 17).

**దసి** పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన(బద్దె)పోగుల్లో, అని వెంబడి దూర్చిన దారం; అచ్చుతికేటప్పుడు, పోగుల వరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్ద(ల)తో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (కో. 30).

**దసికర్ర** అచ్చుదగ్గర పడుగులో దూర్చిన కర్ర; జోడాకర్ర మాదిరిది (కో. 28).

**దసిదారం** (-ఎక్కించు) పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన (బద్దె) పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం; అచ్చుతికేటప్పుడు, పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్ద(ల)తో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ(కో.28).

**దసిపెట్టు** (క్రి.)బట్టచివర బద్దె వదలటం; 'దసిపెడితే గాని దెసపట్టదు' అని సామెత; చూ. దసిబద్దె(కో.22).

**దసిపోము** పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన(బద్దె)పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం; అచ్చుతికేటప్పుడు, పోగుల వరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్ద(ల)తో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (కో. 31).

**దసిబద్ద** పర్యా. చూ. బద్దెగుచ్చుకర్ర. అచ్చుతికిన తరవాత, బద్దెపోగులు చెదరకుండా దూర్చిన బద్ద; కొన్నిచోట్ల, సన్నబెత్తంగాని. ఈనెపకడ్డీగాని దూరుస్తారు; ఇటువంటివి బద్దెలో ఇవతల ఒకటి, అవతల ఒకటి ఉంటాయి; అల్లుచేసేటప్పుడు, దీన్ని ఊడైగుదులగు తగిలిస్తారు; కొన్నిచోట్ల, గూటాలకు కడతారు. చూ. చిత్రం 102 త (కో. 26).

**దసిబద్దె** ఉ. -బద్ది. బట్టచివర బెత్తెడు నేసిన సళ్ళుపోగులు (కో. 22-24).

**దసిరికాయ** చూ. దసలికాయ (తె. 17).

**దసేరు** (< దసి + ఏరు) (క్రి.) అచ్చుబద్దెలో పూదారం వెంబడి పోగులు ఏరుకోటం; కొన్నిచోట్ల, తెగిన పోగులు అతుకుతారు (కో. 25, 26).

**దస్తాగిన్నె** ఒకరకం ఇతడిగిన్నె; దీంట్లో గంజి పోసుకొంటారు (కో. 21).

**దస్తీ** పర్యా. చూ. జేబురుమాలు. జేబులో పెట్టుకోటానికి నేసిన చిన్నగుడ్డ (తె. 19).

**దస్తురుమాలు** (బహు. -రుమాంళ్లు, -రుమాళ్ళు) **1.** ఎర్రవన్నెలో చిన్న చదరపుగళ్ళు పెట్టి నేసిన ఒకరకంబట్ట (తె. 19); **2.** నాలుగయిదు మూరలు నేసిన ఒకరకంబట్ట; తురకసాయెబులు లుంగీలకు, తలగుడ్డలకు వాడేది (తె. 13).

**దళచరంపంతె** పర్యా. చూ. రాటి. గుమ్మటం లాంటి పనిముట్టు; పంతె మొ.వాటికి దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (రా. 19).

**దళ్ళచీర** పర్యా. చూ. గళ్ళచీర. అంచుల మధ్య భాగంలో, రంగుపోగులు పెట్టి, గదులు గదులుగా నేసిన చీర; మామూలుగా, నలుచదరపుగళ్ళు నేస్తారు; దడి అంటే గడి (తె. 4).

**దాక** రూ. దాకె. ఒకరకం మట్టిపాత్ర; పడుగుకు పెట్టే గంజి దీంట్లో పోసుకొంటారు (కో. 21).

**దాకె** చూ. దాక (తె. 11).

**దాకె(పీట)** ఉ. డాకి(పీట), డాకె, దాకి(పీట). **1.** పర్యా. చూ. పిరకి. ఉన్ని వడికేటప్పుడు, కదురు తిప్పే బోకికి ఆధారంగా పెట్టిన మట్టు; కుండమూతితో ఉన్న భాగం; దీన్ని బోర్లించి, పైన బోకి పెడతారు. చూ. చిత్రం 308.4 (తె. 9, 20, 22, 25-27); **2.** పర్యా. ఏకులపీట, కదురుపీట, పీట(4), వడికెపీట, వడుకుడుపీట. ఉన్ని వడికేటప్పుడు అడవాళ్ళు కూర్చోటానికి వేసిన పీట. చూ. చిత్రం 303.2 (తె. 26-28).

**దాగినబద్ద** మరమగ్గం కట్టుబడిలో ఎడమవైపుబద్ద. చూ. చిత్రం 118 క (కో. 27).

**దాగు** పెద్దకండెలబేలు (తె. 11).

**దాగుంచె** (-వేయు) ఉ. దాగుంచి. సరిచేసేటప్పుడు, పడుగు ఆరుబదునులో ఉండగా సందు(=రెండుకచ్చుల మధ్య భాగం)సందుకూ ఆపుతూ దువ్వేకుంచె; పడుగు బాగా ఆరేవరకూ రెండుమూడు సార్లు ఇలా నిదానంగా దువ్వుతారు; సన్నపడుగులు దువ్వుతారు (కో. 24).

**దానిమ్మరెక్క** చూ. దానిమ్మరేకు (తె. 11).

**దానిమ్మరేకు** రూ. దానిమ్మరెక్క. ఒకరకం ఎరుపు రంగు; దానిమ్మపువ్వురేక మాదిరిది; బి. ఒ. స్కార్లెట్ జి. వేసి తయారుచేస్తారు (తె. 4).

**దానె** **1.** పర్యా. గుదె, దానెకట్టె, సరదండిగె. సరిచేసేటప్పుడు, ఉన్నిపడుగు ముందువైపు దూర్చిన లావాటికర్ర; కొన్నిచోట్ల, పడుగులో చివర ఎక్కించి సరగుంజకు బిగిస్తారు. చూ. చిత్రం 314.1 (తె. 9, 10, 20, 22, 25); **2.** ఉన్నిపడుగు సరిచేసేటప్పుడు, అనిపోగుల్లో దూర్చిన మర్రిఊడ (తె. 7).

**దానెకట్టె** పర్యా. చూ. దానె(1). సరిచేసేటప్పుడు, ఉన్నిపడుగు ముందువైపు దూర్చిన లావాటికర్ర; పడుగెరుకర్ర మాదిరిది; కొన్నిచోట్ల, చివర ఎక్కించి సరిగుంజకు బిగిస్తారు. చూ. చిత్రం 314.1 (తె. 6).

**దానెరాయి** పర్యా. ఊకరరాయి, రౌతు(2), సరిరాయి. సరిచేసేటప్పుడు, ఉన్నిపడుగులో చివర ఎక్కించినకర్ర(=దానె)బిగింపుకోసం, నేలలో పాతినరాయి;

ఇటువంటివి, మామూలుగా ఒకవైపున రెంపు, మరొకవైపున ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 314.2 (తె. 6).

**దాప** పర్యా. చూ. ఊదై. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు; రెండు పొడుగు పట్టెలు. మంచం కోళ్ళ మాదిరిగా అమర్చి, పైన అడ్డకట్టెచేర్చి బిగించి ఉంటారు; దేవాంగులవాడుక. చూ. చిత్రం 63 క (రా. 3).

**దాపకర్ర** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు. నిలువుపట్టెకు పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉరతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (కో. 25).

**దాపటిపాయ** అచ్చుగుదిపాయల్లో ఎడమవైపుది; చూ. అంచగుదిపాయ. చూ. చిత్రం 100.6 (కో. 26).

**దాపు** **1.** పర్యా. చూ. చిట్టె(2). పంకెఆకుల బిగింపుకువేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రం 19 క. 3, 4 (కో. 35); **2.** పర్యా. చూ. **లో**అంచు. అంచు**లో** మొగటిభాగం; పడుగువైపుది. చూ. చిత్రం 148.1 (తె. 5); **3.** కమ్మికి రెండువైపులా ఒకటి, రెండు కొలుకులు వరసగా పెట్టి నేసిన నేత (కో. 24).

**దాపుకమ్మి** పర్యా. చూ. నిలువు(2). ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (కో. 17).

**దాపుకొయ్య** పర్యా. చూ. తట్టు(డు)కొయ్య. మిడిగూటానికివేసిన నేతమోకు పడుక్కు అడ్డురాకుండా తగిలించటానికి పాతినగూటం; మామూలుగా, నేతబయులులో ఒకమూల ఉంటుంది; కొన్నిచోట్ల, మిడిగూటానికిగాని దండెకుగాని కొంచెం ఎడంలో వేస్తారు. చూ. చిత్రం 127.14 (కో. 23).

**దాపుచెక్క** పర్యా. చూ. బొమ్మ(1). మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో. 17).

**దాపుడుచీర** పెళ్ళికూతురు, దాచుకొని అప్పుడప్పుడు కట్టుకొనే చీర; ఖరీదైంది (తె. 16).

**దాపుడుబట్ట** దాచుకొని, అప్పుడప్పుడు కట్టుకొనే బట్ట; చీరలు, పంచెలు మొ.వి (తె. 8).

**దామ** పర్యా. చూ. ఊచ(7). ఉన్నికదురుపుల్ల; ఆడవాళ్ళు వడికే కదురుది; వెదురుది. చూ. చిత్రం 311 చ. 1 (తె. 25).

**దామమొలికి** ఉ. దామ్మొలికి; పర్యా. చూ. మొలికి (1). ఉన్నికదురు ఊచకు కింద బిగించిన మేకు; మామూలుగా ఆడవాళ్ళు వడికే కదుర్లకు, పెద్ద కదురుకు బిగిస్తారు. చూ. చిత్రం 311 చ. 4 (తె. 25).

**దాయికట్టె** పర్యా. చూ. దొగ్గసం. ఆరుబయట ఊదైలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు; ఊదైమాదిరిగా వెదురుకర్రలు బిగించింది; చాపిన పడుగునుబట్టి, ఇటువంటివి 1-3 వాడతారు. చూ. చిత్రం 107 (కో. 1, 2).

**దాయికర్ర** ఉ. దాయకర్ర, దాయగర్ర. పర్యా. చూ. దొగ్గసం. ఆరుబయట ఊదైలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు; ఊదై మాదిరిగా వెదురుకర్రలు బిగించింది: చాపిన పడుగును బట్టి, ఇటువంటివి 1-3 వాడతారు. చూ. చిత్రం 107 (కో. 1, 3, 12ఎ).

**దారకాను** ఒకరకం అంచుడిజైను. చూ. చిత్రం 261 (తె. 24).

**దారపుబండి** ఉ. దారబ్బండి. **1.** పర్యా. చూ. దిండు(4). గంటానికి బిగించిన రీలుదారపుబండి; డబ్బారాట్నం దీని గాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క. 12 (కో. 15, 19); **2.** పర్యా. కప్పరుబండి, కప్పిర, కప్పి(2), పేటుబండి, బండి(చెక్రం)(1), బిళ్ళ(4), రీలు. ఒదుపుకట్టిన అంచుపేటుదారాలు తగిలించే గొయ్యగిలక; రీలు; దీన్ని, మామూలుగా మగ్గం మీద ఎత్తుగా అమరుస్తారు. చూ. చిత్రం 133 క. 2 (కో. 24); **3.** పర్యా. రీలుబిళ్ళ, వడిగిరక. మిషను వడిదారం(=అచ్చువడి కట్టేది) చుట్టిన కొయ్యగిలక. చూ. చిత్రం 95.1 (రా. 20).

**దారబందం** పర్యా. చూ. జాసిగంకట్టు. పడుగుదువ్వే కుంచెపిడికి వేసిన తాడుమెలిక; ఇది జాసిగంకట్టు మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 76 క. 2 (తె. 14).

**దారబందంమెలిక** పర్యా. చూ. మలుకు. పన్నెకట్టుబడి**లో**. దండెలమధ్య బిగించిన ఈనెకు దారం**తో** వేసినముడి (తె. 14).

**దారం** **1.** పర్యా. చూ. పురి(1). రాట్నం ఆకుల తాడును, కదురును కలిపే గట్టిదారం; దీనివల్ల కదురు తిరుగుతుంది. చూ. చిత్రం 15.6 (కో. 1-6, 9-11, 14, 15, 24, 26-31, 33, 34; తె. 1, 2, 23, 25, 27-33; రా. 3, 4-18, 20-22, 24); **2.** పర్యా. చూ. గుమ్మిదారం. రాటిఆకులు పైవీ కిందివీ కలిపి కట్టినదారం. చూ. చిత్రం 31 ప. 4 (కో. 29, 33, 34; తె. 10, 18-20, 29, 30; రా. 23); **3.** అడ్డగుమ్మి ఆకులు కలిపి కట్టినదారం. చూ. చిత్రం 34.4 (కో. 2); **4.** పర్యా. చూ. వడిదారం(2). డబ్బారాట్నం చెక్రాన్నీ గంటాన్నీ కలిపే గట్టిదారం; దీనివల్ల గంటం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 8 (కో. 26); **5.** పర్యా. చూ. ఊదైతాడు. ఊదైను

నిలబెట్టి, కిందిగూటానికి బిగించే తాడు; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (రా. 3); **6.** పర్యా. చూ. పంటిగుది. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి, పుల్ల(=పన్ను)కు కట్టినతాడు; ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.2 (కో. 9బి; తె. 12; రా. 18); **7.** పర్యా. ఉడతతాడు. మగ్గం ఉడతకు పైన కట్టినదారం; ఇటువంటివి రెండు, ఒకటి అచ్చుకర్రకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (రా. 10).

**దాలవపన్ను** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 9ఎ).

**దావుడుముక్క** పర్యా. చూ. బొమ్మ(9). మర మగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో. 27).

**దాసరిమల** ఉ. –మొల. నేతపడుగులో చివర విడదీసిన పాయ మలగర్రకు చుట్టి, వేసిన మెలిక (తె. 12, 16).

**దాళిగుత్తెంచు**(< దాళగుత్తి + అంచు) దాళపళ్ళగుత్తి డిజైను నేసిన అంచు (కో. 24).

**దిగదాల** సరిచేసేటప్పుడు పడుగులో, కుంచె చేరే చివరివైపు (రా. 20).

**దిగనాలకచ్చి** పర్యా. దిగుమలకచ్చి. సరిచేసిన పడుగులో చివరి అనిపోగులు; వీటిని తెంపి అచ్చుతుకుతారు (కో. 7).

**దిగమలకచ్చి** పర్యా. దిగనాలకచ్చి. సరిచేసిన పడుగులో చివరి అనిపోగులు; వీటిని తెంపి అచ్చుతుకుతారు (కో. 9ఎ).

**దిగుడుదలకమ్మి** మరాను మీదికి పడుగుతోడేటప్పుడు, కిందికోల్తల పోగులు చుట్టుకొన్న మేకులపట్టె (కో. 24).

**దిగు(డు)దలకొయ్య** పర్యా. చూ. మిడిగూటం (2). నేతబయలులో చివర పాతినకొయ్య; దీనికి నేత మోకుతో కొలికివేసి, పెడకోలకు చుట్టి; పడుగు బిర్రు పెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేత మోకు పెడకోలకు కట్టి, దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (కో. 20; తె. 5, 12, 13).

**దిగుడుదలకోల** మరానుమీదికి పడుగుతోడేటప్పుడు, కిందివైపు మేకులకమ్మికి చుట్టుకొన్న పోగులు; కింది కోల్తల (కో. 23).

**దిగుడుదలజోడా** పడుగు చుట్టేటప్పుడు, చివరి కోల్తలలో ఎక్కించిన రెండుకర్రలు; ఒకలాక, ఒకకర్ర; చూ. జోడా (కో. 23).

**దిగుడుదలనేత** పర్యా. కడతట్టునేత. బట్ట చివరి భాగంలో నేసిననేత (కో. 1).

**దిగుదలకర్ర** పడుగులో, రెండో చివర దూర్చిన పడుగేరుకర్ర; ఇక్కడి పోగులు తెంపి అచ్చుతుకుతారు (కో. 9బి).

**దిగుదలకోర్తల** ఉ. దిగదలకోర్తాల; పర్యా. చూ. కిందికోల్తల. అనుపోసిన పడుగులో చివరి అని పడ్డ భాగం; చూ. కోల్తల (కో. 8).

**దిగుదలమేకు** పర్యా. చూ. మిడిగూటం(2). నేత బయలులో చివరపాతిన కొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి, పెడకోలకుచుట్టి, పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకు కట్టి, దీనికి పనుగు మెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (కో. 10, 13; తె. 4).

**దిగునేత** పర్యా. దీనేత. రాత్రివేళ దీపం పెట్టుకొని నేసే నేత (కో. 10).

**దిగుబడి** ఉ. దిగబడి. ఉత్పత్తి; output (తె. 25).

**దిగుబద్ద** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (తె. 15).

**దిగుమల** పర్యా. చూ. కిందికోల్తల. అనుపోసిన పడుగులో చివరి అనిపడ్డభాగం; చూ. కోల్తల (కో. 6ఎ).

**దిగువకోర్తల** ఉ. దిగువ–, –కోర్తలు; చూ. దిగువ కోల్తల (కో. 4; రా. 11, 13, 15).

**దిగువకోల్తల** ఉ. –కోల్తాలు; రూ. దిగవకోర్తల; పర్యా. చూ. కిందికోల్తల. అనుపోసిన పడుగులో చివరి అని పడ్డభాగం; చూ. కోల్తల (కో. 3; రా. 8).

**దిగువచెరగు** ఉ. దిగవసెరుగు. చీరకట్టుకొనేటప్పుడు, లోపలకువచ్చే అడ్డకొన; కట్టుకొంగు(రా.11).

**దిగ్గమ్మినేత** చీరలో కట్టుకొరుగు నేత; దిగు(వ)కమ్మి నేత (రా. 13).

**దిగ్గొయ్య** (< దిగు + గొయ్య) **1.** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతిన కొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి, పెడకోలకు చుట్టి, పడుగు బిర్రు పెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకు కట్టి, దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (కో. 30);

**2.** మగ్గంమీద, నేతబట్ట చుట్టే కొయ్య (=దోనె)కు ఆధారంగా, ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, రెండువైపులా రెండుంటాయి; కొన్నిచోట్ల, పడుగు చుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (కో. 22).

**దిండి** చూ. దిండు(2) (కో. 30, 31).

**దిండు 1.** పర్యా. అడ్డ(3), కుంచం, కుంభం, దిబ్బె, బుడ్డి(1), బొజ్జ, బొడ్డు(1), బొండు(1) ముంత. రాట్నం రెండు(ఆకుల) చక్రాలనూ వేరుచేసే కొయ్య; ఇరుసు దీనిమధ్య ఉంటుంది. చూ. చిత్రం 15 క. 8 (కో. 1-3, 10; తె. 6-8, 24, 29; రా. 6-9, 11, 12, 14-18); **2.** రూ. దిండి, దుండు. రాట్నంబొమ్మ చెవులమధ్య ఉండే కదురు భాగం; దీన్ని కట్టెతోగాని (చిటకేశ్వరం, కంది, కతేకట్టె మొ.వి), తోలుతోగాని, బంక పట్టించిన నూలుతోగాని ఏర్పాటు చేస్తారు. ఈ దిండు గాడికి వడిదారం వేస్తారు. చూ. చిత్రాలు 15 క. 12, 41 క. 3 (కో. 1-14, 16-28, 32, 33, 36, 37; తె. 1-33; రా. 1-24); **3.** పర్యా. అడ్డ(5) కుంది(1), బొండు(2), లక్కాకు(1). డబ్బారాట్నం చక్రం మధ్య ఆకుల బిగింపుకు అమర్చిన కొయ్య. చూ. చిత్రం 41 ట. 1 (కో. 2); **4.** పర్యా. కదురుదిండు (2), కదురుపూస, గంటంఉండ, గంటందిండు, గిలక (2), దారపుబండి(1), బండి(2), బిళ్ళ(4), రీలుదారం గిరక, వడిబండి, వడిబిళ్ళ(1). గంటానికి బిగించిన రీలు దారపుబండి; డబ్బారాట్నం వడిదారం దీని గాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క. 13 (కో. 2, 6, 7, 10, 22-28; తె. 21; రా. 2, 6, 18, 20); **5.** పర్యా. చూ. గొట్టం(6). రాటిఆకులు బిగించిన వెదురుగొట్టం; దీన్ని సూలానికి దూర్చి రాటి తిప్పుతారు. చూ. చిత్రం 31 త. 1 (రా. 11, 13); **6.** పట్టుదారం వడికే పెద్దరాట్నం కదురు బిగించిన కొయ్యగిలక. చూ. చిత్రం 293 చ. 11 (కో. 14; రా. 14); **7.** పర్యా. అడ్డ(10), కుండ(4), గిలకదిండు గుండు(7), డాబీఅడ్డ, తిరుగుడుఅడ్డ, పింజెరఅడ్డ, పింజెరగడ్డ, పేటుదిండు, బుడ్డి(3), రోలరు(3), సిలిండరు. డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు; బోట్లపింజెర దిండుకు బోడిపెలు, తొల్లపింజెరదిండుకు గాళ్ళూ ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు; కొన్నిచోట్ల, దీనికి చివర ఇనపఊచల చక్రం గాని రేకు పళ్ళచక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (రా. 11-13, 15, 18, 23); **8.** చిలపలో పడో వంతు నూలు (తె. 17); **9.** అంచులో నేసిన రెండు డిజైన్ల మధ్యభాగం. చూ. చిత్రం 163.1 (తె. 5); **10.** ఒకరంగు అంచులో, వేరేరంగువి అయిదారు పోగులుపెట్టి నేసిన డిజైను (తె. 12).

**దిండుపింజెర** పర్యా. చూ. బోట్లపింజెర. ఒకరకం డాబీ; దిండుకు బోడిపెలు చేసింది; దిండు తిరిగినప్పుడు, బోడిపెలు, కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ (తె. 5).

**దిద్దకంపెట్టు** (క్రి.) పర్యా. నునుపుచేయు, మెరుపుపెట్టు. అచ్చుకట్టిన తరవాత, అచ్చుకర్రమీది వడిదారం మెలిక(=పూస)లు కొమ్ముబిళ్ళతో రుద్దుతూ చదును చెయ్యటం (రా. 11).

**దిద్దకంబిళ్ళ** ఉ. -బిల్ల; చూ. దిద్దు(డు)బిళ్ళ (రా. 13, 22).

**దిద్దు** (క్రి.) పడుగు పరిచినప్పుడు, పోగులు చిక్కులేకుండా సర్దటం (కో. 21; తె. 5, 10, 11, 14).

**దిద్దుకత్తి** పన్నెదండెలమధ్య బిగించిన పుల్లలపరస చదునుచేసేకత్తి. చూ. చిత్రాలు 89 క. 2, 89 చ. 2 (కో. 24).

**దిద్దుకంబడి** మంచంమీద, పక్క వేసుకొనే గొంగడి (రా. 13).

**దిద్దుకర్ర** అచ్చుకట్టేటప్పుడు, కర్రలకు కట్టిన వడిదారలు సరిచూసుకోటానికి, వాటి మెలికల్లో దూర్చిన కర్ర (కో. 26).

**దిద్దుచివ్వ** అచ్చుకట్టిన తరవాత, పడులు సరిచేసే సన్నటిపుల్ల; పడుల మధ్య అంకెలో దూరుస్తారు (కో. 23).

**దిద్దు(డు)బిళ్ళ** రూ. దిద్దకంబిళ్ళ; పర్యా. కొమ్ము (2), సీంగ్. అచ్చుకర్రకు కట్టిన వడిదారం బిర్రుగా ఉండటానికి, పై మెలిక(=పూస)ల మీద రుద్దే దుప్పికొమ్ము. చూ. చిత్రం 96 (కో. 16, 20 22,; రా. 20).

**దిప్ప** పర్యా. చూ. చిప్ప(1). రాటి పైబద్దలను బిగించి, మధ్య బోర్లించి కట్టిన చిప్ప; మామూలుగా కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల, కర్రచిప్పగాని, రేకుమూతగాని వాడతారు; ఇది రాటిసూలంమీద అనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (కో. 24).

**దిబ్బ** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటా-నికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; దేవాంగులవాడుక; చూ. రాటి చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 7).

**దిబ్బె** పర్యా. చూ. దిండు(1). రాట్నం రెండు చక్రాలనూ(=ఆకులు) వేరుచేసేకొయ్య; ఇరుసు దీని మధ్య ఉంటుంది. చూ. చిత్రం 15.8 (తె. 12).

**దిమ్మ** ఉ. దిమ్మి, దిమ్మె. **1.** పర్యా. చూ. అడ్డపీట.

పత్తిరాట్నం కిందిపీట. చూ. చిత్రం 1.2 (రా. 8); **2.** పర్యా. చూ. పీట(2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (కో. 18, 30; రా. 2); **3.** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటి సూలానికి ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 11, 12, 15, 16); **4.** పర్యా. చూ. నిలువు(10). మరాసు ఇరుసును మోసే పొడుగుకొయ్య(లు). గోతిపక్కలపాతినవి; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 50.9 (కో. 13, 15, 18); **5.** పర్యా అడ్డపిక్కరు, కోతికొయ్య, పిట్టు, మేకు(9). డాబీదిండుకు చేసిన బొడిపె(లు); దిండు తిరిగినప్పుడు, ఇవి కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 క. 2 (కో. 7).

**దిమ్మెన** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగాఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 27).

**దిమ్మెనగొట్టం** పర్యా. చూ. గొట్టం(2). రాటి ఆకులు బిగించిన వెదురుగొట్టం; దీన్ని సూలానికి దూర్చి రాటి తిప్పుతారు. చూ. చిత్రం 31 త. 1 (కో. 27).

**దియ్యనేత** చూ. దీనేత (రా. 8).

**దియ్యసొడ్డు** చూ. దీసోడా (కో. 29).

**దియ్యస్తంబం** ఉ. -స్థంబం; చూ. దీస్తంబం (రా. 19, 21).

**దిల్లీఖానీ** తివాసీనేతలోవచ్చేఒకరకండిజైను(తె.17).

**దివసొడ** చూ. దీసోడా (కో. 27, 31).

**దివసోడా** చూ. దీసోడా (కో. 23).

**దివ్వసొడా** చూ. దీసోడా (కో. 26).

**దివ్వసోడా** చూ. దీసోడా (కో. 28).

**దిస్తా(గుండు)** పర్యా. చూ. గూటం(1). దూది ఏకేటప్పుడు కమానునరం కొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (కో. 5-7).

**దీక్షగడిచీర** ఒకరం గళ్ళచీర; ఒక సినిమాపేరు మీద ప్రచారంలోకివచ్చింది : **1.** నలుపు, కెంపురంగుల మధ్య, రేలపువ్వురంగు గీర పడేట్టు అడ్డం, నిలువు నేసిన చీర (తె. 15); **2.** ఆరుకోలుకులకు ఒకకోలికి రంగు పోగులు వచ్చేట్టు నేసిన గళ్ళచీర (కో. 7).

**దీనేత** రూ. దియ్యనేత; పర్యా. దిగునేత. రాత్రి వేళ దీపం పెట్టుకొని నేసేనేత (కో. 10).

**దీపపుకర్ర** మగ్గందగ్గర, దీపం వేలాడదీసే కర్ర (కో. 34).

**దీసెమ్మ** మగ్గందగ్గర పెట్టుకొనే దీపం; పొద్దుగూకిన తరవాత, మగ్గందగ్గర దీపంపెట్టుకొని నేస్తారు. చూ. చిత్రం 143 చ (రా. 1).

**దీసేడు** చూ. దీసోడా (కో. 5).

**దీసోడా** ఉ. దీసోడ; రూ. దియ్యసొడ్డు, దివసొడ, దివసోడా, దివ్వసొడా, దివ్వసోడా, దీసేడు; పర్యా. దీస్తంబం. దీపంబుడ్డి పెట్టుకొనే కొయ్యస్తాంభం; కొన్నిచోట్ల, ఇసపచిప్ప (దీన్ని మగ్గం పందిరికి వేలాడదీస్తారు); పొద్దుగూకిన తరవాత మగ్గం దగ్గర దీపం పెట్టుకొని నేస్తారు. చూ. చిత్రం 143 (కో. 24, 30, 32, 37; తె. 15, 29).

**దీస్తంబం** రూ. దియ్యస్తంబం; పర్యా. దీసోడా. దీపంబుడ్డి పెట్టుకొనే కొయ్యస్తాంభం; పొద్దుగూకిన తరవాత మగ్గందగ్గర దీపం పెట్టుకొని నేస్తారు. చూ. చిత్రం 143 క (కో. 6, 8).

**దుక్క** ఉ. దొక్క. **1.** కొయ్యమొద్దు, దీనిమీద పత్తి పరిచి, ఇనప కొడుపుతో గింజలు వేరుచేస్తారు; చూ. కొడుపు. చూ. చిత్రం 3.1 (కో. 33, 34, 36); **2** పర్యా. సమ్మెట. ఊడైగూటాన్ని నేలలో దిగగొట్టే, పెద్దసుత్తి (కో. 36).

**దుక్కకాము** ఉ. దొక్కాము. దుక్క(=ఊడై గూటాన్ని నేలలోకి దిగగొట్టే పెద్దసుత్తి)పిడి(కో.36).

**దుగసం** చూ. దొగ్గసం (కో. 31).

**దుగ్గోరంచు** రెండుగీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు. చూ. చిత్రం 185.2 (కో. 30).

**దుడ్డు** **1.** పర్యా. చూ. గూటం(1). దూది ఏకేటప్పుడు కమానునరంకొట్టే కొయ్యబడితె. చూ. చిత్రం 9.13 (కో. 6, 8, 9, 22; తె. 16, 28); **2.** తొట్టెలో రంగులు కలిపే కర్ర (తె. 24).

**దుండ** అంచులో నేసిన కడ్డీ; చూ. దుండ్లంచు (తె. 8).

**దుండు** చూ. దిండు(2) (కో. 29, 35).

**దుండ్లంచు** గీరలు గీరలుగా నేసిన అంచు. చూ. చిత్రం 184 (రా. 17).

**దుత్త** ఒకరకం చిన్నకుండ; దీంట్లో, పడుగుకు పెట్టే గంజి పోసుకొంటారు (కో. 1).

**దుప్పటి** ఉ. దుప్పటీ. **1.** పర్యా. పచ్చడం(2); పర్యా. సెల్లా(2). ఒంటిమీద కప్పుకోటానికి నేసిన ఒకరకం(ముతక)బట్ట; పక్కమీద కూడా పరుచుకొంటారు (కో. 3-11, 13-21, 23, 29, 34, 37; తె. 4, 5, 8, 11, 16, 18, 23, 24, 31, 33; రా. 2-5, 10, 14); **2.** ఒంటిమీద కప్పుకోటానికి నేసిన అయిదు మూరలబట్ట; ఒంటిరెక్క; ఒంటిపొర (తె. 12; రా. 13-15, 23); **3.** ఒంటిమీద, రెండు పొరలుగా కప్పుకోటానికి నేసిన బట్ట (కో. 25, 26); **4.** ఒంటిమీద కప్పుకోటానికి నేసిన ఇరవైమూరలబట్ట (తె. 15).

**దుంపచెక్కముల్లు** దుంపచెక్కకు బిగించిన చేపడాప (=పత్తినించి గింజలు వేరుచేసే పనిముట్టు). చూ. చిత్రం 6.3 (కో. 34).

**దుయ్యానసారంచు** పర్యా. దువ్వెనంచు. తెల్లదారం, రంగుదారం ఒక్కొక్కకొలికి చొప్పున వరసగా పెట్టి, నిలువుగా గీరలుపడేట్టు నేసిన అంచు (కో.93).

**దురంగిచీర** నిలువుపోగులు ఒక రంగువి, పేకపోగులు మరొక రంగువి నేసిన రెండు రంగుల కలనేత చీర (తె. 17).

**దురంగి(నేత)** పర్యా. చూ. దువ్వాయి(నేత). పడుగుకు ఒక రంగు. పేకకు మరొక రంగు నూలు పెట్టి నేసిన(గట్టి)నేత;కలనేత;మామూలుగా, తెలుపు,నలుపు, ఎప్పు మిగిలిన రంగులు పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, నిలువుకు తెలుపు, అడ్డానికి రంగునూలు పెట్టి నేస్తారు (తె. 17, 24, 32, 33).

**దురంగిరుమాలు** ఒకరకం తలపాగ: రెండురంగులు సమానంగా పెట్టి నేసింది (తె. 24).

**దుర్తిరంగు** దుర్తిచెట్టు చెక్కతో తయారుచేసిన ఎరుపురంగు; పూర్వం వాడుకలో ఉండేది (రా. 13).

**దులుపు** (క్రి.) నూలుపెట్టి పిడులన్నీ విదిలించటం (కో. 30).

**దుల్లకోల** పర్యా. చూ. పిడుపుకర్ర. రంగు అద్దిన నూలులడీలు గుంజకు తగిలించి పిండే కర్ర; గుండ్రటిది; దీన్ని లడీల్లో దూర్చి పెడతారు; దీంతో పోగులు విదిలిస్తారు; కొన్నిచోట్ల, రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. చూ. చిత్రం 282 క. 5 (తె. 24).

**దుల్లగుంజ** పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట; మామూలుగా, దీనికి శిలువమాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిల్లి చేసి దాంట్లో గునపం దూర్చి లడీలు తగిలించి, పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (తె. 24, 29).

**దుల్లగొట్టు** (క్రి.) నూలు విదిలించటం (కో. 26).

**దుల్లు** (క్రి.) **1.** పర్యా. చిగిలించు. ఏకేముందు దూదిని, చీపురు పుల్లలతో విదిలించి దుమ్ము దులపటం. చూ. చిత్రం 7.1 (కో. 36); **2.** నూలుపెట్టె విప్పి పిడులన్నీ విదిలించటం (కో. 29).

**దుల్లుకర్ర** పత్తిలో తుక్కు దూగరా రాలగొట్టే కట్టె చూ. చిత్రం 5.1 (కో. 37).

**దువ్వుకుంచె** ఉ. దువ్వ-. సరిచేసేటప్పుడు, పడుగు ఆరుబదునులో ఉండగా, సందు(=రెండు కచ్చుల మధ్య భాగం)సందుకూ ఆపుతూ దువ్వే కుంచె. పడుగు బాగా ఒకే పదాన్ని పదే పదే రెండు మూడుసార్లు ఇలా నిదానంగా దువ్వుతారు; కొన్నిచోట్ల, సన్నపడుగులు దువ్వుతారు (రా. 1. 2. 4).

**దువ్వెనంచు** పర్యా. దుయ్యానసారంచు. తెల్లదారం. రంగుదారం ఒక్కొక్కకొలికి చొప్పున వరసగా పెట్టి, నిలువుగా గీరలు పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 197 (కో. 5; తె. 4 12).

**దువ్వెర** చూ. దూపిరి(3) (రా.5).

**దుశాలు** పర్యా. చూ. తువ్వాలు. ఒళ్ళుతుడుచుకోటానికిగాని, కండువామాదిరిగా భుజంమీద వేసుకోటానికిగాని నేసిన బట్ట; సుమారు ఒకటిన్నర గజం పొడుగువి; రకరకాల రంగుల్లో, రకరకాల డిజైన్లలో నేస్తారు; towel (తె. 31).

**దుస్సదీకు** (క్రి.) పడుగులో దూర్చిన లాకలు ఊడదియ్యటం (రా. 11).

**దుస్సు** (క్రి.) తీసివెయ్యటం; దుయ్యటం (తె. 5).

**దుస్సుముడి** (-వేయు) జారుముడి (తె. 17).

**దుళ్ళగొట్టు** (క్రి.) ఉ. దుల్లగొట్టు. సరిచేసేటప్పుడు పడుగును చేత్తో కొట్టటం (కో. 25, 26).

**దుళ్ళవేయు** (క్రి.) ఉ. దుళ్ళేయు, దొళ్ళేయు. దులపటం; విదిలియ్యటం; విరుగుప్పటం; రంగు అద్దిన నూలులడీలు, పిడుపుకర్రతో దులుపుతారు (కో. 2).

**దూడనరం** పర్యా. చూ. నరం(1). ఏకుబద్ద కొనలకు కట్టిన జంతునరం: మామూలుగా, ఎద్దుది; కొన్నిచోట్ల, గొర్రెపేగు; ఇటువంటివి రెండుంటాయి; గూటంతో నరం కొడుతూ ఉన్ని ఏకుతారు; కొన్నిచోట్ల, చేత్తోనే నరం గుంజుతూ ఏకుతారు. చూ.చిత్రం 309.1 (తె. 9).

**దూది** పర్యా. పత్తి. నేతనూలుకు పనికివచ్చే ఒకముడిసరుకు; కొన్నిచోట్ల గింజ తియ్యనిదాన్ని పత్తి అనీ, తీసినదాన్ని దూది అనీ అంటారు; మరికొన్నిచోట్ల, సామాన్యంగా, సమాసాల్లో పత్తి; వ్యస్తంగా దూది, పత్తి పర్యాయపదాలు (కో. 9, 11-19, 22-24; తె. 28).

**దూదిగంప** ఉన్నివేసుకొనే గంప; బుట్ట. చూ. చిత్రం 308.1 (తె. 28).

**దూదిగుల్ల** గింజనుంచి వేరుచేసిన దూది వేసుకొనే బుట్ట. చూ. చిత్రం 4.3, 8 (తె. 2).

**దూదేకుపలక** పర్యా. చూ.కమాను(1). దూది ఏకే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 9 (కో. 1).

**దూదేకులవాళ్ళు** ఉ. దూదేకులోళ్ళు. పర్యా. పింజెరవాళ్ళు. దూదిఏకే సాయెబులు (కో. 1-37; తె. 1-7, 9-33; రా. 12, 21, 23).

**దూపిరి** ఉ. దూబిరి, దూబురి. **1.** పర్యా. చూ. పీట(1). రాట్నంనిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (కో. 20, 29); **2.** పర్యా. చూ. అడ్డకట్టె(4). అడ్డగుమ్మి కిందిపీట; దీనికి నిలువులు బిగిస్తారు. చూ. చిత్రం 34.1 (కో. 1); **3.** రూ. దువ్వెర; పర్యా. కొణతలిదిమ్మ, కొణతలిదుక్క, గడ్డ(1), గిరకపీట, గిరకమొద్దు, గుమ్మిపీట, గుమ్మిమొద్దు, డోలకమొద్దు, తిక్కిడిమొద్దు, తిరిగిణిమొద్దు, దిబ్బ దిమ్మ(3), దిమ్మెస, దూపిరిదుక్క, దూపిరిదుంగ, పడతమొద్దు, పీట(6). బండిముద్ద, బండిమొద్దు, బొంగరంమొద్దు, ముద్ద, ముద్దగూటం(1), ముద్దగొయ్య(2), మొద్దు(3), మొద్దు గూటం(4), మొద్దుగొయ్య, మొద్దుపీట రాటిదిమ్మ, రాటిదుక్క, రాటిమొద్దు(1). రాటి తిరగటానికి, రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 3, 16, 17, 20, 21, 24-26, 29, 32, 35-37).

**దూపిరిఊస** ఉ. దూబిరిఊస; పర్యా. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్ని చోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 25, 26).

**దూపిరిచక్ర** పర్యా. చూ. గూటం(2). తాళ్ళరాటి తిరగటానికి ఆధారంగా, దూపిరికి దిగగొట్టిన కొయ్య గూటం. చూ. చిత్రం 31 చ. 1 (కో. 23).

**దూపిరిదుక్క** ఉ. దూబిరి–; పర్యా. చూ. దూపిరి (3). రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 23, 28).

**దూపిరిదుంగ** ఉ. దూబిరి–; పర్యా. చూ. దూపిరి (3). రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 23).

**దుప్చాయిచీర** ఉ. దూప్చాయ్–; చూ. ధూప్ చావ్‌చీర (కో. 23, 36).

**దూప్చాయనేత** (<హిం. ధూప్‌ఛాయ్) ఉ. దూప్చాన్, దూపచ్సయ, దూప్సాయి, దూబ్బా(నేత); రూ. దూప్సం(నేత); పర్యా. కలనేత(1), దురంగి(నేత). పడుగుకు ఒకరంగు, పేకకు మరొకరంగు నూలుపెట్టి నేసిన(గట్టి)నేత; మామూలుగా, తెలుపు, నలుపు తప్ప మిగిలిన రంగులుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, నిలువుకు తెలుపు, అడ్డానికి రంగునూలుపెట్టి నేస్తారు (కో. 18, 26, 27, 31, 32, 34; రా. 1).

**దూప్సంనేత** ఉ. దుప్సం–; చూ. దుప్చాయ(నేత). (కో. 28; తె. 22-25).

**దూబరదుక్క** మగ్గంమోకు నేలకు తగలకుండా పెడకోలకూ మిడిగూటానికీ మధ్య ఎత్తుపెట్టే కొయ్య; చూ. జరుగుడుచెక్క (కో. 33).

**దూబిరితుండు** పర్యా. చూ. సూలం(1). రాటి సూలానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 3).

**దూబు** (క్రి.) దువ్వటం; నరిచేనేటప్పుడు, చిక్కుపడ్డ పోగులను దువ్వెనతో దువ్వుతారు (రా. 17).

**దూబురి** చూ. దూపిరి(1) (కో. 20).

**దూనం** చూ. దొగ్గనం (కో. 18).

**దేముడిచీర** దేవతల పేరుచెప్పి పెట్టేచీర; పొడుగు, వెడల్పు కొంచెం తక్కువపెట్టి నేస్తారు (కో. 15).

**దేవకిచీర** ఒకరకం (లేతరోజా) రంగుచీర (కో. 26, 35; రా. 7).

**దేవగన్నేరు(అంచు)** ఒకరకం(చీర)అంచు; మొగ్గ, పువ్వు, ఆకు, తీగ ఏటవాలు వరసపోగులు(=త్రిల్లు), చిగురు వరసగా నేస్తారు; కొన్నిచోట్ల, జరీపోగులు గూడా పెడతారు; దింట్లో పువ్వులు పడటానికి, మగ్గం గుంటలో ప్రత్యేకంగా రెండు పావుచెక్కలు అమర్చి నేస్తారు (తె. 5).

**దేవలమహర్షి** నేతపనిచేసే దేవాంగుల వంశానికి మూలపురుషుడు; దోసమయ్య అనీ అంటారు (కో. 36).

**దేవాంగపురాణం** దేవాంగుల వంశం తెలిపే కథ (రా. 19బి).

**దేవాంగులు** నేతపనిచేసేవాళ్ళలో ఒకతెగ; లింగ ధారులు; చౌడీశ్వరిని కొలుస్తారు (కో. 1. 7, 22-24; రా. 10).

**దేవు** (క్రి.) తొట్టెలో రంగునీళ్ళుపోసి, నూలులడీలకు రంగుపట్టేట్టు కలియదిప్పటం (తె. 23).

**దేవుతొట్టె** రంగునీళ్ళలో, నూలులడీలువేసి కలిపే పాత్ర; చూ. గోళెం. చూ. చిత్రం 282 క. 8(తె. 23).

**దేవునిఅర్ర** ఉ. దేవున్నర్ర. దేవుడిపటం, విగ్రహాలు పెట్టుకొనే గది; దసలిపురుగు పిల్లలను దింట్లో దాస్తారు (తె. 17).

**దేశవాళీపత్తి** పర్యా. నాటుపత్తి. మామూలుగా, ఎర్రపత్తి; కొన్నిచోట్ల, తెల్లపత్తి; చిన్నకాయ; గింజ నలుపు; అంతప్రశస్తమైందికాదు (కో. 8, 9, 22, 23).

**దేసితల్లిపండుగ** దసరా రోజుల్లో దేవాంగులు చేసు

క్రొనే పండుగ; ఆ రోజున ప్రభలుకట్టి కులపెద్ద(=సేనాపతి) ఇంటిదగ్గరినించి వాటిని ఒయల్దేరదీసి, ఘటం నెత్తిన పెట్టుకొని అమ్మవారిగుడికి వెళ్తారు (కో. 35).

**దైవపువాళ్ళు** ఉ. దైపోల్లు. ? పండుగరోజున దేవతను ఆరాధించటానికి గుడికి వెళ్లేవాళ్ళు (కె. 18).

**దొక్కిసెం** ఉ. దొక్సెం; చూ. దొగ్గసం (కో. 18).

**దొగిచింకర్ర** రూ. దోచింకర్ర (కో. 15).

**దొగ్గసం** ఉ. దొగసం, దొగ్గిసం; రూ. చొక్కసం, డొక్కసం, దవసం, దుగసం, దూసం, దొక్కిసెం; పర్యా. ఉక్కీ, దాయికట్టె, దాయికర్ర, దొగిచింకర్ర, సరిగుర్రం. ఆరుబయట, ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తు పెట్టే కొయ్యపనిముట్టు; ఊడ్తెమాదిరిగా, వెదురుకర్రలు బిగించింది; చాపిన పడుగునుబట్టి, ఇటువంటివి 1-3 వాడతారు. చూ. చిత్రం 107 (కో. 10, 11, 12 ఎ, 16, 17, 19, 21-26, 28, 30).

**దొంక** పర్యా. చూ. తొలి (1). నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి; దీంట్లోబిగించిన పుల్లకు దారంకట్టి బద్దెచువ్వ బిగిస్తారు; ఇటువంటివి, మామూలుగా అయిదారుంటాయి. చూ. చిత్రం 123 చ. 4 (రా. 4).

**దొంగకొయ్య** పర్యా. చూ. పాపుచెక్కలగూటం. మగ్గంగుంటలో, పాపుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; మామూలుగా, వెనకవైపు, మడిమదగ్గర ఉంటుంది; పాపుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పాపుచెక్కలకు పక్కగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 21).

**దొడ్డి** **1.** కొన్నిచోట్ల, రాట్నానికి గంటం అమర్చే కొయ్యచట్రం; frame; తిరగిణిచట్టం. చూ. చిత్రం 42 (కో. 12-16, 18-26, 36); **2.** ఒకరకం చట్రం అసు. చూ. చిత్రం 45 చ (కో. 21); **3.** జాకార్డుడాబీ కట్టుబడిలో అడ్డపలక బిగించిన కొయ్యచట్రం. చూ. చిత్రం 135.2 (కో. 25, 33); **4.** పర్యా. చూ. డాబీ. నేతలో డిజైన్లు రావటానికి, మరమగ్గంపైన అమర్చే యంత్రం. చూ. చిత్రం 132 (కో. 33); **5.** ఒకరకం రంగుల అద్దకం(=చుక్కకట్టటానికి) నూలుచిలప తగిలించే చట్రం (కో. 24).

**దొడ్డిఅడ్డ** జాకార్డు డాబీ కట్టుబడిలో దారాలు తిప్పేపలక; చట్రంలో బిగించింది. చూ. చిత్రం 135.3 (కో. 33).

**దొడ్డికర్ర** పర్యా. చూ. ఇరవలదండి. కోతిపుల్లలు గాని, గిలకలుగాని వేలాడదియ్యటానికి మగ్గానికి పైన దారాలు కట్టిన కర్ర. చూ. చిత్రం 121 క. 13 (కో. 36).

**దొడ్డి(చట్రం)** **1.** పర్యా. దొడ్డి(బల్ల)(2). అంచులో డిజైను పడేట్టు వజానేత నెయ్యటానికి మగ్గానికి పైన అమర్చిన కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 134 (కో. 33, 34); **2.** డాబీదింపుకు బిగించిన కొయ్యచట్రం. చూ. చిత్రం 132 క. 8 (కో. 25).

**దొడ్డిజల్లి** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో లావుదారాలు దూర్చిన ఈ నెల చట్రం; పన్నెలాంటిది; ఇటువంటివి మూడు (నడిమి జల్లి, రెండు పక్కజల్లిలు) ఉంటాయి. చూ. చిత్రం 134 చ. 1, 2 (కో. 37).

**దొడ్డితాళ్ళు** (బహు.) ఉ. -తాల్లు; పర్యా. జంగం నేస్లు (2). వజానేతకోసం అమర్చిన దొడ్డిలో, నడిమి జల్లినుంచి పేటవాలుగా గాని, పక్కజల్లినించి నిటారుగా గాని వేలాడే లావుదారాలు. చూ. చిత్రాలు 134 క. 3, 134 చ. 11 (కో. 33, 34, 37).

**దొడ్డినిలువు** పర్యా. నిలువుకమ్మి(4). దొడ్డిబల్లకు వేసిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి; చూ. దొడ్డి. చూ. చిత్రం 42 (కో. 26, 35).

**దొడ్డినేత** ఒకరకం డిజైను నేత; వజానేత; మగ్గానికి పైన దొడ్డి అమర్చినేస్తారు. చూ. చిత్రం 134 (కో. 33, 37).

**దొడ్డి(బల్ల)** **1.** దొడ్డి కిందిపీట. చూ. చిత్రం 42 (కో. 35); **2.** పర్యా. దొడ్డిచట్రం(1). అంచుల్లో డిజైన్లు పడేట్టు వజానేత నెయ్యటానికి మగ్గానికిపైన అమర్చిన కొయ్యపనిముట్టు(=చట్రం). చూ. చిత్రం 134 (కో. 33, 37).

**దొడ్డిరాట్నం** పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం; దీనికి ఎడమవైపున దొడ్డి ఉంటుంది. చూ. చిత్రం 41 (కో. 25, 26).

**దొడ్డునూలు** పర్యా. చూ. ముతకనూలు. పోగు మందంగా ఉండే నూలు; 10 నుంచి 60 నెంబర్లదాకా (తె. 16).

**దొండపట్టి** పర్యా. కంబాయిపట్టి. తురకలు కట్టుకోటానికి నేసిన గళ్ళలుంగీ(=కైల)లో రంగులోగాని, తెలుపులోగాని జేనెడు వెడల్పు అడ్డంగా నేసిన పట్టీ; కొన్నిచోట్ల మూడుజేనల వెడల్పున నేస్తారు; కొన్నిచోట్ల, చివర తెలుపు, పదికొలుకులు జమిలిపోగులు, ఒక కొలికి లాకీ, ఒక కొలికి తెలుపు, తరవాత, ముప్పాతిక అంగుళం వెడల్పున లాకీరంగు పోగులు వరసగా నిలువులో వచ్చేట్టుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, మధ్యలో తెల్లచారలు పడేట్టునేస్తారు. చూ. చిత్రం 273 (కో. 7).

**దొంతరమల్లెపేటు** అంచులో వరసగా పువ్వులు పడేట్టు నేసిన ఒక రకం డిజైను (కో. 20).

**దొప్ప** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (రా. 22).

**దొబ్బు** (క్రి.) తొయ్యటం; జరపటం; "అచ్చులికి ఎంట్లన్నీ పారదీస్తాము...బొక్కైలేసి అన్ని(=అనిని) దొబ్బకపోతాము." (రా. 13).

**దొబ్బుడుకట్టె** నేతనేసేటప్పుడు, పడుగుచుట్టిన గుండ్రటి ఎదురుదోనె(=బీమ్)చెక్రాన్ని తోసేకర్ర; మార్కట్టె (తె. 8).

**దొరువు** పర్యా. చూ. డొల్ల. పడుగులో, పై పోగులకూ కింది పోగులకూ మధ్య వెలితి; అనిలేని భాగం; మామూలుగా, రెండు అనులకుమధ్య డొల్ల ఉంటుంది; సరిచేసేటప్పుడు అని లాకలు తీసేసి డొల్ల చేస్తారు (కో. 8ఎ).

**దొల** 1. (–చేయు) ఉ. దోల; చూ. డొల్ల (కో. 2; రా. 11, 13, 16); 2. పర్యా. చూ. దోనెగాడి. నేత గుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసినగాడి. చూ. చిత్రం 123 క. 3 (కో. 25, 26, 28, 29, 32, 34).

**దొలక** ఉ. దొల్క; చూ. డొలక(1) (తె. 13).

**దొలకకడ్డీ** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది, కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె.13).

**దొలగుంజ** చూ. తొలగుంజ (కో. 17).

**దొలగొయ్య** రూ. డొల్లకొయ్య; పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గంపైన నేతబట్ట చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా ఎడమపక్కన నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దొనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, పడుగుచుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతినగూటం. చూ. చిత్రం 123 క.5(కో.21 23–36)

**దొలమిట్ట** తొవరరాటి పొడుగుబద్దలను పై వైపు బిగించిన అడ్డబద్ద; దీని బెజ్జంలో రాటిసూలం దూరుస్తారు; చూ. రాటి (కో. 30).

**దోకోరి** అంచులో నేసిన రెండు గీరలు. చూ.చిత్రం 185.2 (తె. 24).

**దోచింకర్ర** చూ. దొగిచింకర్ర (కో. 7).

**దోటి** ఉ. దోకు; పర్యా. కొంకి(3). సరిచేయటానికి ఉన్నిపడుగు చాపినప్పుడు, సరతాడు బిగింపుకు వేసిన వంకరకట్టె; తాడు దీనికి తలిగించి సరిగూటానికి చుట్టి గుంజుతారు. చూ. చిత్రం 63 జ. 1 (తె. 20;రా. 4, 6).

**దోటి(కట్టె)** రూ. ధోటి; పర్యా.కొంకిడి(2). ఉన్ని మగ్గం చివర వేసిన వంకరకర్ర; దీన్ని తాడుతో కలిపి గూటానికి బిగిస్తారు. చూ. చిత్రం 315.17 (తె. 6, 7).

**దోనిగ** చూ. దోనుగ(2) (తె. 6, 9, 10).

**దోనిగగాడి** ఉ. –గాడీ; చూ. దోనుగగాడి(2). (తె. 6).

**దోనిగగాల** పర్యా. చూ. దోనుగగాడి(2). ఉన్ని మగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు; చూ. దోనుగ. చూ. చిత్రం 315 క. 1 (తె. 10).

**దోనిగపన్ను** చూ. దోనుగపన్ను (తె. 6 9).

**దోనిగబద్దె** రూ. దోనుగబద్దె; పర్యా. చూ. బద్దె(1). అచ్చుతుక్కోటానికి, సుమారు బెత్తెడు వెడల్పునేసి, చివర జేనెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తిచేసిన తరవాత అచ్చులో బద్దెకోసి మరొక పడుగుకు అతుకుతారు. చూ. చిత్రాలు 102.2, 144 (తె. 1, 30).

**దోనిగములికి** పర్యా. చూ. దోనుగపన్ను. ఉన్ని మగ్గందోనుగ గాడిలో చువ్వ బిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల(లు) (తె. 10).

**దోనిగె** ఉ. దోనిగ, దోనెగ; చూ. దోనె(3) (కో. 14, 18; తె. 1, 2, 6, 9, 10; రా. 18, 22–24).

**దోనిగెగాడి** ఉ. దోనిగగాడీ, దోనిగెగాడీ, దోనెగ్గాడి; చూ. దోనెగాడి (కో. 14; తె. 2, 7, 10 రా. 18).

**దోనిగెగుది** ఉ. దోనిగగుది; చూ. దోనెగుది (తె. 2, 6, 10).

**దోనిగెతొలి** చూ. దోనెతొలి (తె. 9).

**దోనిగెపంకె** పర్యా. చూ. బద్దెగుచ్చు(డు)లాక. దోనెగాడిలో బిగించిన కర్ర; దీనికి బద్దెచువ్వ కడతారు. చూ. చిత్రం 124.1 (తె. 10).

**దోనిగెపన్ను** చూ. దోనెపన్ను (తె. 2, 6, 9; రా. 18).

**దోనిగెపుల్ల** చూ. దోనెపుల్ల (రా. 24).

**దోనిగెసివర** చూ. దోనెసివర (తె. 2, 6).

**దోనిపుటక** పర్యా. చూ. దోనుగపన్ను. ఉన్ని మగ్గందోనుగ గాడిలో చువ్వ బిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల(లు) (తె. 22).

**దోనుగ** ఉ. దోనగ, దోనుగు, దోన్గ, దోన్గు. **1.** చూ. దోనె(3) (కో. 29, 32–37; తె. 3–5, 7, 8, 11–33); **2.** రూ. దోనిగ. ఉన్నిమగ్గం కట్టుబడిలో నేసిన గొంగడి చుట్టే పలకలదూలం. చూ.చిత్రం 315.1 (తె. 3, 7, 11, 20, 22, 25–28); **3.** నేతనేసేటప్పుడు పడుగుగాని, తివాసీగాని చుట్టే కొయ్యదూలం; ఇటు

పంటివి రెండుంటాయి; పైదానికి పడుగు, కిందిదానికి తివాసీ చుడతారు. చూ. చిత్రం 320.1, 8 (తె. 10).

**దోనుగఅడ్డు** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్ని చోట్ల. ఇనపపుల్ల; కొండి, చూ. చిత్రం 121 క. 4 (కో. 35).

**దోనుగకలప** చూ. దోనెపలక (తె. 25).

**దోనుగకట్టె** పర్యా. చూ. పల్లెకట్టె. దోనెకు నేత బట్ట చుట్టటానికి, దోనె(పలక)తిప్పేకర్ర; కొన్నిచోట్ల ఇనపకడ్డీ; కుడివైపు దోనెబెజ్జంలో దూర్చి నేలకు అనుస్తారు. చూ. చిత్రం 123 చ. 2 (తె. 1).

**దోనుగకాన** (బహు. –కాన్లు) ఉ. దోనక్కాన; పర్యా. చూ. పన్ను(2). ? దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల: కొన్నిచోట్ల, ఇనప పుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (తె. 22).

**దోనుగకూనం** ఉ. దోనుక్కూనం; పర్యా. చూ. దోనుగబొడ్డు. బొడ్డుగొయ్య బెజ్జంలో దూర్చే దోనె చివరి భాగం; మామూలుగా, గుండ్రంగా ఉంటుంది; కొన్నిచోట్ల, కోణాకారంలో ఉంటుంది. చూ. చిత్రం 123 క. 8 (తె. 20).

**దోనుగకొయ్య** **1.** ఉ. దోనక్కొయ్య; చూ. దోనెకొయ్య(1) (కో. 37); **2.** పర్యా. బిర్రుకట్టె(4). ఉన్నిమగ్గం దోనుగ(పలక)తిప్పటానికి చిల్లిలో దూర్చిన కట్టె; పల్లికట్టె. చూ. చిత్రం 315 క. 3 (తె. 26).

**దోనుగకోల** ఉ. దోనుక్కోల. పర్యా. చూ. బద్దెగుచ్చు(డు)లాక. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద. చూ. చిత్రం 124.1 (తె. 29).

**దోనుగగాడి** ఉ. దోనగ్గాడి, దోనుగుగాడి, దోనుగ్గాడి, దోనుగ్గాడీ, దోనుగ్గాడె. **1.** చూ. దోనెగాడి. (కో. 36, 37; తె. 4, 18, 21-23, 33); **2.** రూ. దోనిగగాడి, దోనుగగాడెం; పర్యా. గాల, దోనిగగాల, దోనుగతొలికి, దోనుగదోనె. ఉన్నిమగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు; చూ. దోనుగ. చూ. చిత్రం 315 క. 1 (తె. 20, 25).

**దోనుగగాడెం** **1.** చూ. దోనెగాడి (తె. 26); **2.** చూ. దోనుగగాడి(2) (తె. 27).

**దోనుగగాల** పర్యా. చూ. దోనెగాడి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. చూ. చిత్రం 123 క. 3 (తె. 24).

**దోనుగగుంజ** ఉ. దోనుగ్గుంజ. చూ. దోనెగుంజ(1) (కో. 17).

**దోనుగగుది** ఉ. దోనుగుగుతి, దోనుగ్గుది, దోనగ్గుతి; చూ. దోనెగుది. (కో. 17; తె. 8, 9, 24, 33).

**దోనుగగూటం** పర్యా. చూ. వెన్నుగూటం. ఉన్ని మగ్గం దోనుగను మోసే ఎడమవైపు(కొయ్య)గూటం. చూ. చిత్రం 315 క. 2 (తె. 26).

**దోనుగచివ్వ** ఉ. దోనగసివ, దోనుగుసివ, దోనుగు సివ్వ; చూ. దోనెచివ్వ (కో. 32, 35, 37).

**దోనుగతొలి** ఉ. దోనగదొల్లు; దోన్గతొల్లు. చూ. దోనెతొలి (తె. 5, 13 19).

**దోనుగతొలికి** ఉ. దోన–: పర్యా. చూ. దోనుగగాడి(2). ఉన్నిమగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు; చూ. దోనుగ. చూ. చిత్రం 315 క. 1 (తె. 11).

**దోనుగతోక** మగ్గంమీద, నేతబట్టచుట్టే దోనెకు కుడివైపు కొన; చూ. దోనె (కో. 34).

**దోనుగదొల** ఉ. దోనగదొల, దోనుగుదొల; చూ. దోనెదొల (కో. 29 32, 34).

**దోనుగదొల్ల** చూ. దోనెదొల (కో. 35).

**దోనుగదోనె** ఉ. దోనుగుదోని, దోనుగుదోనె. **1.** పర్యా. చూ. దోనెగాడి. నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసినగాడి. చూ. చిత్రం 123 క. 3 (తె. 20, 31, 32); **2.** పర్యా. చూ. దోనుగగాడి(2). ఉన్నిమగ్గం దోనుగకు చువ్వ బిగించటానికి తొలిచినసందు; చూ. దోనుగ. చూ. చిత్రం 315 క. 1 (తె. 22).

**దోనుగనాలిక** ఉ. దోనగ–; పర్యా. చూ. పల్లెకట్టె. దోనెకు నేతబట్ట చుట్టటానికి, దోనె(పలక)తిప్పే కర్ర; కొన్నిచోట్ల, ఇనపకడ్డీ; కుడివైపు దోనెబెజ్జంలో దూర్చి నేలకు అనుస్తారు. చూ. చిత్రం 123 చ. 2 (తె. 18).

**దోనుగపంటితాడు** పర్యా. చూ. పంటిగుడి. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి పుల్లకు కట్టినతాడు; ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.2 (తె. 7).

**దోనుగపన్ను** ఉ. ? దోనుగుపల్లు; రూ. దోనిగపన్ను; పర్యా. దోనిగములికి, దోనిపుటక, పన్ను(2), బొడ్డె(3), మొల(5). ఉన్నిమగ్గం దోనుగగాడిలో చువ్వ బిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల(లు); చూ. దోనుగ (తె. 7, 20, 25, 26).

**దోనుగపలక** ఉ.దోనగ–,దోనుగు–,–పలిక. **1.** చూ. దోనెపలక (కో. 32-27); **2.** పర్యా. పలక(11). నేతనేసేటప్పుడు, ఉన్నిమగ్గానికి గొంగడిచుట్టే దోనుగకు ఒకవైపు; పతుం; చూ. దోనుగ. చూ. చిత్రం 315 క. 1 (తె. 25).

**దోనుగపుల్ల** పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి

అమర్చే పసుగు మొదటిభాగంలో(=బద్దెలో) దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనె(గాడి)లో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల, ఇనపచువ్వగాని, వెదురు బద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 34).

**దోనుగపొట్ట** చూ. దోనెపొట్ట (కో. 33).

**దోనుగబద్దె** ఉ. -బద్ద; చూ. దోనిగబద్దె (తె. 1).

**దోనుగబుర్ర** ఉ. దోనుగు-; పర్యా. చూ. గుబ్బ (1). బొడ్డుగొయ్య బెజ్జంలో దూర్చే దోనె చివరి భాగం; మామూలుగా గుండ్రంగా ఉంటుంది; కొన్ని చోట్ల, కోణాకారంలో ఉంటుంది. చూ. చిత్రం 123 క. 8 (కో. 34).

**దోనుగబొడ్డు** ఉ. దోనగ-, దోనుగు-, దోన్గ-; పర్యా. గుబ్బ(1) దోనుగకూనం, దోనుగబుర్ర. బొడ్డు గొయ్య బెజ్జంలోదూర్చే, దోనె చివరిభాగం; మామూలుగా గుండ్రంగా ఉంటుంది; కొన్నిచోట్ల, కోణాకారంలో ఉంటుంది. చూ. చిత్రం 123 క. 8 (తె. 18, 19, 22, 23, 25, 32).

**దోనుగముల్లు** ఉ. దోనగ-; చూ. దోనెముల్లు (కో. 32, 36).

**దోనుగమొలికి** పర్యా. చూ. పన్ను(2). దోనె గాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (తె. 23).

**దోనుగలొండ** పర్యా. చూ. దోనెగాడి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. చూ. చిత్రం 123 క. 3 (తె. 29).

**దోనుగసివర** చూ. దోనెసివర (తె. 7).

**దోనుగసీల** ఉ. దోనగ-, దోనుగు-, దోన్గ. **1.** పర్యా. చూ. పల్లెకట్టె. దోనెకు నేతబట్ట చుట్టటానికి, దోనె(పలక) తిప్పే కర్ర; కొన్నిచోట్ల ఇనపకడ్డీ; కుడివైపు దోనెబెజ్జంలో దూర్చి నేలకు ఆనుస్తారు. చూ. చిత్రం 123 చ. 2 (తె. 5, 19); **2.** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (తె. 24).

**దోనుగసుబిరె** ఉ. దోనగ-; చూ. దోనుగసూరె (తె. 18).

**దోనుగసూరె** ఉ. దోనగ-; రూ. దోనుగసుబిరె; పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పసుగు మొదటిభాగం(=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనె(గాడి)లో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్ని చోట్ల, ఇనపచువ్వగాని, వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (తె. 8, 19).

**దోనె** ఉ. దోని. **1.** పర్యా. చూ. పలకగాడి(2). చేతిమగ్గం పలకకు పన్నె పైవైపు బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 109 చ. 2 (తె. 7, 28, 31, 32); **2.** పర్యా. చూ. పలకగాడి(1). మరమగ్గం పలకకు, పన్నె బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 118.12 (తె. 31); **3.** ఉ. డోని, దోని; రూ. దోనిగె, దోనుగ (1); పర్యా. గుడ్డదోనె, దోనెమొద్దు, నగదోనె, పసుగు దోనిగె. మగ్గంమీద, నేసినబట్ట చుట్టే కొయ్యదూలం; మామూలుగా, నలుపలకలది; కొన్నిచోట్ల, గుండ్రటిది, దీనికి ఒకవైపున పొడుగ్గా గాడిగాని, నాలుగయిదు చిల్లులుగాని ఉంటాయి; శైనెడుబట్ట నేసిన తరవాత దీనికి చుడతారు; దీన్ని నాలికకొయ్యకూ బొడ్డు గొయ్యకూ మధ్య అమరుస్తారు. చూ. చిత్రం 123 క. 2 (కో. 1-13, 15-17, 19-28, 30, 31; రా. 1-17, 19-21); **4.** పర్యా. చూ. దోనెగాడి. నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసినగాడి. చూ. చిత్రం 123 క. 3 (తె. 28).

**దోనెకడ్డీ** ఉ. దోనికడ్డి; పర్యా. చూ. పల్లెకట్టె. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనె(పలక)తిప్పే కర్ర; కొన్నిచోట్ల, ఇనపకడ్డీ; కుడివైపు దోనె బెజ్జంలో దూర్చి నేలకు ఆనుస్తారు; దేవాంగుల వాడుక. చూ. చిత్రం 123 చ. 2 (కో. 7).

**దోనెకొయ్య** ఉ. దోని-, -కొయ. **1.** రూ. దోనుగ కొయ్య; పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గంమీదనేతబట్ట చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం; కొన్నిచోట్ల, రెండు వైపులా రెండుంటాయి; కొన్నిచోట్ల, పడుగుచుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (రా. 3, 11, 13-15); **2.** పర్యా. చూ. నాలికకొయ్య. మగ్గంమీద నేతగుడ్డచుట్టే కొయ్య (దోనె)కు ఆధారంగా కుడివక్కన నేలలో పాతినకొయ్య; పైకి మొనదేలి ఉంటుంది; దీన్ని దోనె చివరి బెజ్జంలో దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 1 (రా. 3).

**దోనెగాడి** ఉ. డోనిగాడి; రూ. దోనిగెగాడి, దోనుగ గాడి(1). దోనుగగాడెం(1); పర్యా. గాడి(2), దొల (2), దోనుగగాల, దోనుగదోనె(1). దోనుగలొండ, దోనె(4), దోనెదొల, దోనెపొట్ట. నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. చూ. చిత్రం 123 క. 3 (కో. 9, 24, 30, 31; రా. 6, 11, 14-17, 19, 24).

**దోనెగుంజ** **1.** ఉ. దోని-; రూ. దోనుగగుంజ. దోనె(=నేతగుడ్డచుట్టే కొయ్యదూలం)కు ఆధారంగా నేలలో పాతిన కొయ్యగూటం; ఇటువంటివి రెండు

వైపులా రెండుంటాయి. చూ. చిత్రం 123 చ. 1 (కో. 20); **2.** పర్యా. చూ. బొడ్డుగొయ్య. దోనెకు ఆధారంగా పాతిన కొయ్యలో, ఎడమవైపుది. చూ. చిత్రం 123 క. 5 (కో. 19).

**దోనెగుడి** ఉ. దోనిగుడి; రూ. దోనిగెగుడి దోనుగగుడి; పర్యా. పంటిగుడి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి, పుల్లకు కట్టిన తాడు; ఇటువంటివి పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.2 (రా. 4, 6, 19).

**దోనెచిల్లి** ఉ. దోని-, -సిల్లి, దోన్చిల్లి; పర్యా. చూ. పల్లెకట్టె. దోనెకు నేతబట్ట చుట్టటానికి, దోనె (పలక)తిప్పేకర్ర; కొన్నిచోట్ల, ఇనపకడ్డీ: కుడివైపు దోనెబెజ్జంలో దూర్చి నేలకు ఆనుస్తారు. చూ. చిత్రం 123 చ. 2 (రా. 11, 13-16).

**దోనెచివ్వ** ఉ. -చివ, దోనిసివ; రూ. దోనుగచివ్వ; పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం(=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్ని చోట్ల, ఇనపచువ్వగాని, వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 22, 25, 26, 28).

**దోనెడొల** చూ. దోనెదొల (కో. 27).

**దోనెతట్టు** పర్యా. చూ. తొలి(1). నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి; దీంట్లో బిగించిన పుల్లకు దారం కట్టి బద్దెచువ్వ బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా అయిదారుంటాయి. చూ. చిత్రం 123 చ. 4 (రా. 3).

**దోనెతిప్పు** (క్రి.) పర్యా. చూ. పలకవేయు(2). నేసినబట్ట చుట్టటానికి, దోనె(పలక)తిప్పటం; నేతపని వాడు తనవైపుకు తిప్పుకొంటాడు (కో. 4; రా. 4).

**దోనెతిప్పుడునేత** దోనె తిప్పుకోటానికి(=పలక వెయ్యటానికి) సరిపడేటంత నేసిననేత (రా. 18).

**దోనెతొలి** ఉ. -తొల్లు; రూ. దోనిగెతొలి, దోనుగతొలి; పర్యా. చూ. తొలి(1). నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి; దీంట్లో బిగించిన పుల్లకు దారం కట్టి బద్దెచువ్వ బిగిస్తారు; ఇటువంటివి, మామూలుగా అయిదారుంటాయి. చూ. చిత్రం 123 చ. 4 (కో.2).

**దోనెదొల** ఉ. దోని-; రూ. దోనుగదొల, దోనుగదొల్ల, దోనెడొల; పర్యా. చూ. దోనెగాడి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున, బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. చూ. చిత్రం 123 క. 3 (కో. 26, 28).

**దోనెపన్ను** రూ. దోనిగెపన్ను, దోనుగపన్ను. పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్ని చోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (కో. 4, 14, 23, 25, 26, 32, 37; ప. 2[illegible]; రా. 14).

**దోనెపలక** ఉ. దోని-; రూ. దోనుగపలక, దోనుగపలక; పర్యా. చూ. పలక(3). మగ్గంమీద నేతగుడ్డ చుట్టే పలుపలక దోనెలో ఒకవైపు. చూ. చిత్రం 123 క. 3 (కో. 27, 25; రా. 12).

**దోనెపలుపు** ఉ. దోని-; పర్యా. చూ. పంటిగుడి. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి పుల్లకు కట్టిన తాడు: ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.1 (కో. 3).

**దోనెపుల్ల** ఉ. దోని-; రూ. దోనిగెపుల్ల; పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (రా. 13, 16).

**దోనెపూస** ఉ. దోని-; పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (రా. 3).

**దోనెపొట్టు** ఉ. దోని-; రూ. దోనుగపొట్టు; పర్యా. చూ. దోనెగాడి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. చూ. చిత్రం 123 క. 3 (కో. 23, 24).

**దోనెబెజ్జం** పర్యా. చూ. తొలి(1). నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసినచిల్లి; దీంట్లో బిగించిన పుల్లకు దారంకట్టి బద్దెచువ్వ బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా, అయిదారుంటాయి. చూ. చిత్రం 123 చ. 4 (రా. 2).

**దోనెమగ్గం** ఉ. దోనిమొగ్గం; పర్యా. చూ. ఎదురు దోనెమగ్గం. మగ్గంమీద చాపిన పడుగులో చివరిభాగం చుట్టటానికి, ఎదురుగా రోకలివంటి కొయ్య (చూ. ఎదురుదోనె) అమర్చిన మగ్గం; దీన్ని కొంచెం చోటులోనే అమర్చుకోవచ్చు. చూ. చిత్రం 110 (కో. 1).

**దోనెముల్లు** ఉ. దోని-; రూ. దోనుగముల్లు; పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (కో. 28, 30, 31).

**దోనెమేకు** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్ని చోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (కో. 12; రా. 6).

**దోనెమొద్దు** పర్యా. చూ. దోనె(3). మగ్గంమీద నేసిన బట్టచుట్టే కొయ్యదూలం; మామూలుగా నలుపలకలది; కొన్నిచోట్ల, గుండ్రటిది; దీనికి ఒకవైపున పొడుగ్గా

గాడిగాని, నాలుగయిదు చిల్లులుగాని ఉంటాయి; జైనెమబట్ట నేసిన తరవాత దీనికి చుడతారు; దీన్ని నాలికకొయ్యకూ, బొడ్డుగొయ్యకూ మధ్య అమరుస్తారు. చూ. చిత్రం 123 క. 2 (రా. 21).

**దోనెసివర** రూ. దోనిగెసివర దోనుగసివర; పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చేపడుగు మొదటిభాగం (=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల, ఇనపచువ్వగాని, వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (రా. 13, 15, 24).

**దోనెసూక** పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చేపడుగు మొదటిభాగం (=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల, ఇనపచువ్వగాని వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (రా. 12).

**దోపలుహాష్యా** రెండుకొసల్లోను, జైనెమ వరకు ఒకరంగు, మధ్య ఒకరంగు వచ్చేట్టు నేసిన జంపఖానా; మధ్య ఒకటి, నాలుగు మూలల నాలుగు పూలు పడేట్టు నేస్తారు (తె. 1).

**దోరచీర** ఒకరకం గోధుమవన్నెచీర (తె. 32).

**దోరరంగు** ఒకరకం గోధుమరంగు (తె. 32).

**దోసమయ్య** నేతపనిచేసే దేవాంగుల వంశానికి మూలపురుషుడు; దేవలమహర్షి (కో. 36).

**ద్రాక్షతీగె** ద్రాక్షతీగ ఆకారంలో, అంచులో నేసిన డిజైను (రా. 7).

**ద్రావకం** అద్దకంరంగు తయారు చెయ్యటానికి ముడిరంగులో కలిపే ఒకరకం రసాయనం; ?Hydrochloric Acid (రా. 5, 10, 11).

**ద్రావకంరంగు** ఒకరకం ఎరుపురంగు; కెంపులో ముదురురంగు (కో. 4).

**ద్రౌపది** ఉ. ద్రౌపతి. ఒకరకం ముదురు పచ్చరంగు. చూ. చిత్రం 288 (కో. 35; రా. 11).

**ద్రౌపదిచీర** ఒకరకం ముదురుపచ్చరంగుచీర(కో. 35).

## ధ

**ధని** (<కన్న. ధణి) కూలికి మగ్గాలు నేయించేవాడు; master-weaver (రా. 17).

**ధనుష్** పర్యా. చూ. ఉండేలు(బద్ద), తాడుకట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం 9.12 (తె. 28).

**ధనుష్‌పింజెన్** పర్యా. చూ. కమాను(1). దూది ఏకే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 9 (తె. 27, 30).

**ధరు** తివాసీపడుగులో, కిందిపోగులకు, పైపోగులకు క్రాస్ ( × ) మాదిరిగా వచ్చింది; అని (తె. 17).

**ధర్మిచెట్టు** ఒకరకం చెట్టు; దీని ఆకులు దసలి(పట్టు) పురుగులకు ఆహారం; కొన్నిచోట్ల, దసలిపురుగులను ఈరకం చెట్ల మీదికి ఎక్కిస్తారు (తె. 7).

**ధాగా** (హిం.) పర్యా. చూ. వడి(దారం)(3). అచ్చు కట్టేటప్పుడు, అచ్చుకర్రలకుకట్టే పురిదారం; కొన్నిచోట్ల, మిషనురీలు(=దారపుబండి)దారం వాడతారు; మొదట అచ్చుబిళ్ళకుచుట్టి, తరవాత కర్రకు దూరుస్తారు; అచ్చుకట్టేవాళ్ళవాడుక; చూ. వడి (కో. 5).

**ధుమర్** లేతనీలంవన్నె; తివాసీనేత పనివాళ్ళవాడుక (కో. 16).

**ధూప్‌ఛాంవ్‌(చీర)** ఉ. దూప్చంచీర, దూప్చాన్‌చీర, దూప్చాచ్‌్సీర, దూప్సంచీర, దూప్సాన్‌చీర; రూ. దూప్చాయిచీర. నిలువుపోగులు ఒకరంగువి, పేకపోగులు మరొకరంగువి పెట్టి నేసిన రెండు రంగుల కలనేత చీర (కో. 30; తె. 4, 9, 11, 22; రా. 23).

**ధోటి** చూ. దోటి (తె. 9).

**ధోతి** ఉ. దోతి; చూ. ధోవతి (కో. 11-15, 20; తె. 1, 17, 18, 19, 21-25, 29).

**ధోతులచాపు** ఉ. దోతుల్చాపు; పర్యా. చూ. చాపు(5). మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేత బట్ట; బద్దెతో కలిసి ఉన్నది (కో. 13).

**ధోవతి** ఉ. దావతి, దోవతి; రూ. ధోతి; పర్యా. చూ. పంచె(1). మగవాళ్ళు కట్టుకొనేబట్ట; మామూలుగా, ఏడెనిమిది మూరల పొడుగుది; రెండంచులూ, రెండుకమ్ములూ పెట్టి నేస్తారు; మామూలుగా, తెలుపుది; కొనిచోట్ల రంగుది; అంచుల్లో రంగులు, డిజైన్లు పెట్టి నేస్తారు (కో. 2, 16, 34; తె. 6, 11, 12, 17, 24; రా. 8, 17, 18, 24).

**ధోవతిజోడా** ఉ. దోవతిజోడ; చూ. ధోవతులజోడా (తె. 11).

**ధోవతులజోడా** ఉ. దోవతులజోడా; రూ. ధోవతిజోడా; పర్యా. చూ. చాపు(5). మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట; బద్దెతో కలిసి ఉన్నది(తె. 17).

## న

**నక్కిఅంచు** చీరచివర నేసే ఒకరకం అంచు(తె. 31).

**నక్షీ** లేతఎరుపు; తెల్లఉన్నికి వేసేరంగు; తివాసీనేత పనివాళ్ళవాడుక (కో. 16).

**నగ** (-చుట్టు) మగ్గంమీద నేతనేసి దోనెకు చుట్టిన బట్ట (కో. 5, 7).

**నగతాడు** పర్యా. చూ. పంటిగుది. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి, పుల్లకు కట్టినతాడు; ఇటు వంటివి. పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.1 (కో. 7).

**నగదోనె** ఉ. నగదోని; పర్యా. చూ. దోనె(3). మగ్గంమీద, నేసినబట్ట చుట్టే కొయ్యదూలం; మామూలుగా నలుపలకలది; కొన్నిచోట్ల గుండ్రటిది; దీనికి ఒక వైపున పొడుగ్గా గాడిగాని, నాలుగయిదు చిల్లులుగాని ఉంటాయి; జైనెడుబట్ట నేసిన తరవాత దీనికి చుడతారు; దీన్ని నాలికకొయ్యకూ, బొడ్డుగొయ్యకూ మధ్య అమరుస్తారు. చూ. చిత్రం 123 క. 2 (కో. 7).

**నగిషీ** ఉ. నగిసీ. అంచులో, డైమనుగళ్ళ మాదిరిగా రెండు మూడు వరసల్లో నేసిన డిజైను. చూ. చిత్రం 198 (కో. 34, 36).

**నట్టు 1.** పర్యా. చూ. చిల్ల(7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా, చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (తె. 20, 27, 28, 30); **2.** ఇనపసీల; కానిగుంజ అడ్డపట్టెకు బిగించింది (తె. 13).

**నడికట్టు(తాడు)** పర్యా. నడికెడి తాడు, నడిమిబిగు. ఊడై అడ్డపట్టెకు మధ్య వేసినతాడు; పడుగు చాపినప్పుడు దీని కొసలు పడుగేరుకర్రకు చుడతారు. చూ. చిత్రం 63 చ. 1 (కో. 16, 17, 23-26, 28, 29, 32, 33, 35-37).

**నడికురువిళ్ళు** ఉ. -బిల్లు; పర్యా. చూ. బిర్రుచిట్టె (1). పంకె ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో కిందిది. చూ. చిత్రం 19 క. 4 (కో. 36).

**నడికెడితాడు** ఉ. నడికిడితాడు, నడికెడుతాడు, నడిగిడితాడు; రూ. నడికెనతాడు, నరికెనతాడు, నలికిడితాడు; పర్యా. చూ. నడికట్టు(తాడు). ఊడై అడ్డపట్టెకు మధ్య వేసిన తాడు; పడుగు చాపినప్పుడు, దీని కొసలు పడుగేరుకర్రకు కడతారు. చూ. చిత్రం 63 చ. 1 (కో. 21, 27, 30, 31, 34; రా. 16, 17).

**నడికెనతాడు** ఉ. నడికింతాడు; చూ. నడికెడితాడు (కో. 18; తె. 2; రా. 24).

**నడిపట్టె** చూ. నడిమిపట్టె (కో. 6).

**నడిపెండె** పర్యా. చూ. అడ్డపట్టె(14). మరమగ్గం చట్రంలో, మేరువుపలకకు కిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (కో. 4).

**నడిమంటు** నేతపడుగులో సగంభాగం; ? దండె దగ్గరనించి చివరివరకూ ఉన్నది; దేవాంగుల వాడుక (కో. 7).

**నడిమంటుకచ్చి** నరిచేసేపడుగులో, ఊడై దగ్గర ఉన్న అనిపోగులు (కో. 7).

**నడిమికొయ్య(లు)** మధ్య ఆసుపీటకొయ్య(లు); చూ. అనికొయ్య. చూ. చిత్రం 45 క. 6 (తె. 32).

**నడిమిజల్లి** పర్యా. నడిమిదొడ్డి. అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో, అడదారాలు దూర్చిన ఈనెల చట్రం; పన్నెమాదిరిది; దీన్ని మధ్యగా అమరుస్తారు. చూ. చిత్రం 134 చ. 1(కో. 37).

**నడిమిదొడ్డి** పర్యా. నడిమిజల్లి. అంచులో డిజైన్లు నెయ్యటానికి, మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో, అడదారాలు దూర్చిన ఈనెలచట్రం; పన్నెమాదిరిది; దీన్ని మధ్యగా అమరుస్తారు. చూ. చిత్రం 134 చ. 1(కో. 34).

**నడిమినేత** రూ. నడుమునేత; పర్యా. బొడ్డు(నేత), మధ్యనేత. నేతలో రెండు అంచులకూ మధ్యభాగం (రా. 11, 13-15, 17, 18, 23).

**నడిమిపట్టె** ఉ. నడిమిపట్టి; రూ. నడిపట్టె, నడుమపట్టె; పర్యా. చూ. అడ్డపట్టె(14). మరమగ్గం చట్రంలో, మేరువుపలకకు కిందగా నిలువుపట్టెలు బిగించిన మధ్య కర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (రా. 1, 14, 22).

**నడిమివాయి** మగ్గంమీద చాపిన పడుగులో, నడిమిపాయకు ఎడమభాగం (కో. 34).

**నడిమిసూల** పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో నేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (తె. 21).

**నడిమెంటికర్ర** పడుగులో కిందికోల్లలకు దూర్చే కర్ర; దేవాంగులవాడుక (కో. 7).

**నడిమిగుండు** ఉ. నడింగుండు; పర్యా. చూ. నవలతు గుండు. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండెఅవతలకు వేలాడదీసిన (గుండ్రటి)రాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని చిన్న చెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 1).

**నడిమిగుదిపాయ** ఉ. నడింగుదిపాయ, నడుంగుదిపాయ; పర్యా. చూ. నడిమిపాయ. అచ్చువడుల్లో, అచ్చుకర్ర చివరిగుదులు రెంటికీ మధ్యభాగం; నగానికి చీలి ఉన్నది; దాంతోబాటు పడుగులో చీలిన పక్కపాయలు రెంటికీ మధ్యభాగం. చూ. చిత్రం 100.7 (కో. 2, 3, 5; రా. 2, 4, 8, 10, 17, 18, 20, 24).

**నడిమిపాయ** ఉ. నడింపాయ, నడుంపాయ; పర్యా. నడిమిగుదిపాయ, మయంపాయ, సగంపాయ. అచ్చు

వసుల్లో, అచ్చుకర్ర చివరిగుదులు రెంటికీ మధ్యభాగం; నగానికి చీలి ఉన్నది; దాంతోబాటు పడుగులో చీలిన కక్కుపాయలు రెంటికీ మధ్యభాగం చూ. చిత్రం 100.7 (కో. 22, 25, 26, 31, 34, 36; తె. 32; రా. 3-5, 12, 13, 19 21).

**నడిమిపాయకర్ర** ఉ. నడింపాయకర్ర. మరమగ్గములో, పూనుగర్రలను ఎడంగా ఉండటానికి పెట్టిన కర్ర. చూ. చిత్రం 121 ట. 1 (తె. 32).

**నడిమిపాయతాడు** ఉ. నడింపాయతాడు. అచ్చు వసుల్లో, నడిమిపాయదగ్గర అచ్చుకర్రకు కట్టిన దారం. చూ. చిత్రం 100.10 (కో. 31).

**నడిమిబిగు** ఉ. నడింబిగు; పర్యా. చూ. నడికట్టు తాడు. ఊడ్డె అడ్డపట్టెకు మధ్య వేసినతాడు; పడుగు చాపినప్పుడు; దీని కొసలు పడుగేరుకర్రకు కడతారు. చూ. చిత్రం 63 చ. 1 (తె. 6).

**నడుముఅడ్డపట్టె** ఉ. నడమఅడ్డపట్టె; పర్యా. చూ. అడ్డపట్టె(14). మరమగ్గం చట్రంలో, మేరువు పలకకు కిందగా నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (రా. 19బి).

**నడుముపట్టె** ఉ. నడుంపట్టె; చూ. నడిమిపట్టె (రా. 17, 19).

**నడుమునేత** చూ. నడిమినేత (కో. 3).

**నడ్డకోల** పర్యా. చూ. సంగటికోల. పత్తిరాట్నం నిలువులమధ్య రూళ్ళకర్ర మాదిరిగా ఉండే కట్టె; ఇటు వంటివి రెండు ఒకదానొ్నకటి ఆనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడిపత్తి పెట్టినప్పుడు ఒక వైపు గింజలు, మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1.1 (కో. 37).

**నడ్డ(లు)** పత్తిరాట్నం కోలకు పెట్టిన గట్లు. చూ. చిత్రం 1.5 (కో. 37).

**నయనం** చూ. నయం(నూలు) (రా. 2).

**నయం(నూలు)** రూ. నయనం; పర్యా. సన్న నూలు. పోగు సన్నగా, నున్నితంగా ఉండే నూలు; నాణ్యమైన నూలు (రా. 4-8, 10, 11, 19, 20).

**నయాపైసగడి** ఒకరకం నేతగడి (కో. 20).

**నయాపైసలపేటు** నయాపైసల వరస మాదిరి డిజైను. చూ. చిత్రం 160 (రా. 19బి).

**నరం** **1.** పర్యా. ఊటినరం. ఊటుపోగు, ఏకడి నార, దూడనరం. ఏకుబద్దల కొన(ల)కు కట్టిన జంతు నరం; మామూలుగా, ఎద్దుది; కొన్నిచోట్ల, గొర్రె పేగు; ఇటువంటివి రెండుంటాయి; గూటంతో నరం కొడుతూ ఉన్ని ఏకుతారు; కొన్నిచోట్ల, చేత్తో నరం గుంజుతూ ఏకుతారు. చూ. చిత్రం 309.1 (తె. 3, 10, 11, 28); **2.** రూ. నార(2); పర్యా. ఏకునార (2). దూది ఏకటానికి బద్ద(=ఏకువిల్లు)కు కట్టిన (ఎద్దు) నరం. చూ. చిత్రాలు 10 క. 2, 10 ట. 2 (తె. 2, 15); **3.** (–గుంజు, –కొట్టు). పర్యా. ఏలినార, ఏకునార (1). కమాను(=దూదిఏకే కొయ్యపనిముట్టు)కు చుట్టే (ఎద్దు)నరం; దీన్ని దూదిమీద ఆన్చి, కొయ్యగుంజుతో కొడుతూ దూది ఏకుతారు. చూ. చిత్రం 9.1 (కో. 1, 3, 4, 6, 8-11, 13, 14; తె. 5, 11-17, 26; రా. 6-8, 10, 12, 15-19, 21-24).

**నరంకొట్టు** (క్రి.) పర్యా. పంబకొట్టు. దూది ఏకే టప్పుడు కమానుసరం కొట్టటం (తె. 17).

**నరికగొంగడి** ఉ. నరిగ్గొంగడి. (ఒకరకం) ముతక రకం ఉన్నితో నేసిన గొంగడి (తె. 22).

**నరికెన** (–కట్టు) ఊడ్డె అడ్డపట్టెకు బిగించిన ఇనప కొండి; చూ. గద్దగోడు. చూ. చిత్రం 63 క. 1 (తె. 12).

**నరికెనతాడు** ఉ. నరికింతాడు, నరికిందాడు, నరికెం తాడు. చూ. నడికెనతాడు (కో. 3, 5, 7, 12).

**నలికిడితాడు** చూ. నడికెనతాడు (రా. 4).

**నలుపు** ఉ. నల్పు; పర్యా. నల్లరంగు. బొగ్గురంగు. చూ. చిత్రం 283 (కో. 1, 2, 4, 6, 7, 9బి, 10-12, 14, 15, 18, 19, 21, 26, 35; తె. 9, 23, 28; రా. 3-10, 16, 17, 22-24).

**నలుపుచీర** బొగ్గురంగు చీర (తె. 9).

**నలుపుతొగరు** చూ. నల్లతొగరు(1) (కో. 4).

**నలుపుబండ** ఉ. నలుబ్బండ. నారబెట్టిన నారపడు గును కొయ్యతో కొట్టి శుభ్రం చెయ్యటానికి వేసిన రాయి (తె. 25).

**నలుపు(లు)** గొంగడి అంచున, నల్లవన్నె ఉన్నితో నేసిన భాగం (తె. 3).

**నల్లఉన్ని** నలుపురంగు ఉన్ని (తె. 6, 7, 9, 20, 22, 25, 26; రా. 22).

**నల్లకన్ను(-తీప్పు)** చీరకమ్మిలో అందానికి పెట్టిన నల్లపోగు; సుమారు రెండంగుళాల పొడుగుంటుంది (కో. 3).

**నల్లకేసరికడ్డీచీర** ఒకరకం డిజైనునేతచీర (తె. 6).

**నల్లకోక** బొగ్గురంగుచీర (కో. 31).

**నల్లగొంగడి** పర్యా. కర్రిగొంగడి, నలుపురంగు ఉన్నితో నేసిన గొంగడి (తె. 6, 7, 9, 20, 22, 25, 26, 28).

**నల్లగొర్రె** నలుపురంగు బొచ్చుగలగొర్రె (తె. 6, 7, 9, 20, 22, 25, 26; రా. 22).

**నల్లచెంద్రకాళిచీర** ఉ. నల్లచెంద్రకాలు–, నల్ల చెంద్రకాలి–, నల్లచెంద్రకాళం–. ఒక కొలికి తెలుపు, ఒక కొలికి నలుపు పోగులు చొప్పున పడుగుపేక నేసిన చీర (తె. 2, 7, 29, 33).

**నల్లచెంద్రకాళిరాస్తా(లు)** ఒక కొలికి తెలుపు, ఒక కొలికి నలుపు చొప్పున పడుగు, పేక నేసిన చీరలో గీర(లు) (తె. 7).

**నల్లతాంబుచీర** అంచుల్లో నల్లటి పెద్దగీరలు పడేట్టు నేసిన చీర (తె. 24).

**నల్లతొగరు** 1. ఉ. నల్ల దొగరు; రూ. నలుపుతొగరు. ఎరుపు(తొగరు)లో నలుపువన్నె కలిసిన రంగు; బి. ఒ., కాస్టిక్ సోడాలతో నూలుకు ఉకారువేసి, గార్నెట్, నీలం, బి. ఎస్, పటిక, తేజాపు, నైట్రేట్ సల్ఫ్ వేసి తయారు చేస్తారట. చూ. చిత్రం 288 (తె. 5); 2. ముదురునలుపు(=మసిగుబ్బ)రంగు (కో. 9ఎ).

**నల్లబందిరుమాలు** ఒకరకం తలపాగ; నల్లరంగులో అంచుపెట్టి, గీరలుపడేట్టు నేసింది (తె. 25).

**నల్లమద్ది** ఒకరకం చెట్టు; దీని ఆకులు దసలి(పట్టు) పురుగుకు ఆహారం (తె. 17).

**నల్లరంగు** పర్యా. నలుపు. బొగ్గురంగు. చూ. చిత్రం 288 (కో. 14; తె. 8, 19).

**నల్లులువిరుచు** (క్రి.) ఉ. నల్లలిరుచు. పడుగుమీద పెట్టిన, నల్లటి మసిగుర్తులనుబట్టి పడుగుమడవటం; గుర్తులున్నచోట జోడాకర్ర పెట్టి మడుస్తారు (కో. 25, 26).

**నవరస్‌తొగరు** ఆరుద్రపురుగురంగు (తె. 15).

**నవారు** ఉ. నవార్; రూ. నవ్వారు; పర్యా. నవారుపట్టి. మంచాలకు నేసే పట్టెడ. చూ. చిత్రం 324 క. 5 (తె. 6, 12, 27; రా. 10).

**నవారుకొయ్య** పర్యా. నిలువుగూటం. నవారునేసే చోట, మగ్గానికి ఒకపక్క నేలలో పాతినగూటం; కొన్ని చోట్ల, గునపం వాడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 324 క. 3 (తె. 12).

**నవారుపట్టి** పర్యా. నవారు. మంచాలకు నేసే పట్టెడ. చూ. చిత్రం 324 క. 5 (తె. 6).

**నవారుమగ్గం** ఉ. -మొగ్గం. మంచంపట్టెడ(=నవారు) నేసేమగ్గం. చూ. చిత్రం 324(తె. 6, 12, 27; రా. 10).

**నవిషీఅంచు** పర్యా. పేటంచు. చిలకలు, పువ్వులు, ఆకులు మొ. డిజైన్లు పడేట్టు నేసిన(చీర)అంచు; చేతి మగ్గంమీద, మరమగ్గంమీద నేస్తారు; కొన్నిచోట్ల, పేక పోగు అంచులోకి కూడా వచ్చేట్టు నేస్తారు (కో. 23).

**నవిషీపేటు** ఉ. నవిసీ–; పర్యా. చూ. డాబీ. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గం పైన అమర్చే యంత్రం. చూ. చిత్రం 132 (కో. 24).

**నవ్‌రంగ్** నిలువు అడ్డం తొమ్మిదేసిరంగులు పెట్టి నేసిన ఒకరకం చీర; ఒక సినిమాపేరుతో కలుస్తుంది (కో. 35).

**నవ్వారు** చూ. నవారు (కో. 12).

**నస్యంచీర** ముక్కుపొడుం రంగుచీర (కో. 26; తె. 18; రా. 19).

**నస్యం(రంగు)** ఉ. నశం, నస్సెం(రంగు), నస్సెం (రంగు). 1. పర్యా. పొడిరంగు(1), ముక్కుపొడి చాయ. ముక్కుపొడుం(=పొగాకుపొడి)రంగు; snuff colour; స్కార్లెట్ ఆర్.ని తేజాపు పటిక, నైట్రేట్ సల్ఫ్ వేసి నెప్తాల్‌రంగు, బ్రౌన్ ఆర్. 800, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేసి ఇండంత్రిన్‌రంగు తయారు చేస్తారు (కో. 9 26. 33 36; తె. 1, 5, 10, 18, 19 24, 26, 27, 31; రా. 18, 19, 19ఎ); 2. ఎండు పొగాకురంగులో ముదురువన్నె (తె. 15); 3. వక్క రంగు మాదిరివన్నె (రా. 11).

**నక్షత్రపేటు** చూ. నక్షత్రం(పేటు) (కో. 33).

**నక్షత్రపుపేటు** ఉ. నక్షత్రప్పేటు; చూ. నక్షత్రం (పేటు) (కో. 26).

**నక్షత్రం(పేటు)** రూ. నక్షత్రపేటు, నక్షత్రపుపేటు. అంచులో, నక్షత్రపు చుక్క మాదిరిగా నేసిన డిజైను. చూ. చిత్రం 193 (కో. 24; రా. 19బి).

**నక్షత్రాలవంకీ** అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 2.)

**నాగదారిపేటు** వంకీ(=పాముమెలిక) మాదిరిగా నేసి, వంపుల్లో చుక్కలు పడేట్టు నేసిన అంచు డిజైను. చూ. చిత్రం 199 (రా. 14).

**నాగపాసెం** పర్యా. కమాను(3), కొంకి(4). నేత మోకుచుట్టే ఒకరకం (పళ్ళచెక్రంకొయ్య) చేతిగూటానికి బిగించిన ఇనపఊచ; కొన్నిచోట్ల, రేకు; మోకు చుట్టిన తరవాత, దీన్ని చెక్రం పళ్ళసందులోకి జరుపుతారు. చూ. చిత్రం 122 ట. 2 (కో. 1).

**నాగపూరుచావు** లంబాడి(మగ)వాళ్ళు కట్టుకొనే ఒకరకం పంచెలజత; కుప్పడంపట్టి నేసింది (తె. 17).

**నాగబద్ద** పర్యా. చూ. లాక(2). పడుగులో అని వెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా, ఇటువంటివి అనికి రెండువైపులా ఉంటాయి; పడుగులో అని చెదరిపోకుండా ఉండటానికి లాకలు వేస్తారు. చూ. చిత్రం 63 చ. 3 (కో. 27).

**నాగబంధం** 1. ఉ. నాగబందం; పర్యా. చూ. బాసిగంకట్టు. పడుగుడువ్వే కుంచెపిడికి బిగించి వేసిన తాడు మెలిక; ఇది బాసిగంకట్టు మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 76 క. 2 (కో. 7); 2. మెలివేసుకొన్న

పాముల నమూనాలో వేసిన అంచు డిజైను. చూ. చిత్రం 200 (కో. 34, 36, 37).

**నాగబంధంచీర** అంచులో ఒకరకం డిజైను(=నాగబంధం)పడేట్టు నేసిన చీర (కో. 34, 37).

**నాగమణిపేటు** అంచులో వంకీలు, వంకీలుగా నేసిన ఒకరకం డిజైను; చూ. వంకరపేటు. చూ. చిత్రం 201 (రా. 16).

**నాగముడి** పర్యా. చూ. బనారస్(1). అంచు డిజైనులో ఏటవాలు వరసల్లో నేతకనబడేట్టు(=మూలనేత)నేసిన భాగం; కొన్నిచోట్ల, కృత్రిమపుపట్టుతో నేస్తారు. చూ. చిత్రం 179 (తె. 32).

**నాగలి** పర్యా. కొంకి(5), జేలుచెక్క, జేలుమడక, మడక. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు, పేటు అడపోగులు ఎత్తిపట్టుకొనే కొయ్యపనిముట్టు; నాగలి ఆకారంలో ఉంటుంది: దీన్ని మగ్గానికి పైనుంచి వేలాడదీస్తారు. చూ.చిత్రాలు111 చ.2, 136 త(తె.2,5,18).

**నాగలికోక** పర్యా. నాగలిచీర. ఒకరకం నాగులచీర; కమ్మిలో పన్నెండు కొలుకుల ఎర్రపట్టె, ఒక కొలికి తెలుపు, పదికొలుకుల ఎర్రపట్టె పెట్టి, తరవాత 4-5-1-5-1-5 కొలుకుల చొప్పున తెలుపు ఎరుపు రంగు పోగులు ఒకటి విడిచి ఒకటి వచ్చేట్టుపెట్టి, అంచులకు ఎర్రదారం పెట్టి నేసిన చీర (కో. 3).

**నాగలిచీర** పర్యా. నాగలికోక. ఒకరకం నాగులచీర; కమ్మిలో పన్నెండు కొలుకుల ఎర్రపట్టె, ఒక కొలికి తెలుపు, పదికొలుకుల ఎర్రపట్టె పెట్టి, తరవాత 4-5-1-5-1-5 కొలుకుల చొప్పున తెలుపు, ఎరుపురంగు పోగులు ఒకటి విడిచి వచ్చేట్టుపెట్టి, అంచులకు ఎర్రదారం పెట్టి నేసిన చీర (రా. 10).

**నాగవల్లిచీర** పెండ్లిలో నాగవల్లికి పెండ్లికూతురు కట్టుకొనే చీర: కమ్మిలో తీగల మాదిరిగా నేసిన చీర (కో. 37).

**నాగవాసం** ఉ. నాగాసం, నాగోసం. **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 26, 27); **2.** గిరకపంజె(=ఒకరకం రాటి)పుల్లలకు ఆధారంగా మధ్యలో బిగించిన కర్ర; దీన్ని అడుగుపీటకు వేస్తారు (తె. 17); **3.** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (తె. 26, 28, 30, 33); **4.** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళూ, మధ్యలో పావుచెక్కలతాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (తె. 29); **5.** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర(ఇనప)ఊచ; దీన్ని, మామూలుగా, మగ్గం పై దండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల; అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల, గిరకకొండి కూడా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 9 (కో. 12); **6.** పర్యా. అడ్డదండె(5), దండెకట్టె(3), దండె(8), నాగసరం, దంతెరగుండు, బొమ్మలకట్టె, లింగంకాయ. గొంగడిమగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె; మామూలుగా, వంపుగా ఉంటుంది. చూ. చిత్రం 316.3 (తె. 28).

**నాగసరం** పర్యా. చూ. నాగవాసం(6). గొంగడిమగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె: మామూలుగా వంపుగా ఉంటుంది. చూ. చిత్రం 316.3 (తె. 27).

**నాగినీఅంచు** ఒకరకం అంచు (తె. 6).

**నాగులగళ్ళచీర** పర్యా. చూ. నాగులచీర. నాగులచవితికిగాని, సుబ్బారాయుడు షష్ఠికిగాని (పుట్టపొంగలికి; మొక్కుబళ్ళకు)పుట్టమీదకప్పి కట్టుకొనే గళ్ళచీర; కొన్నిచోట్ల, పిల్లలు దక్కనివాళ్ళు కట్టుకొంటారు; తెలుపు, ఎరుపు రంగుల్లో—మామూలుగా, రెండేసి కొలుకులు, కొన్నిచోట్ల, నాలుగేసి కొలుకులు-పడుగు, పేక వరసగా వచ్చేట్టు నేస్తారు; అంగుళంలో ఎనిమిదోవంతు వెడల్పున సన్నగడి పడుతుంది: కొన్నిచోట్ల, నాలుగురంగుల్లో తడినేస్తారు; తెల్లచెరగులో ప్రపారు కమ్మిగాని, (ఎరుపురంగు) సాదాకమ్మిగాని పెట్టి, ఎరుపుఅంచుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, ఈ చీర కొన్న సంతలోనే కట్టిస్తారు (కో. 34).

**నాగులచీర** ఉ. నాగుల్చీరె, నాగుల్సీరె; పర్యా. నాగులగళ్ళచీర, నాగులుకోక. నాగుల చవితికిగాని, సుబ్బారాయుడుషష్ఠికిగాని (పుట్టపొంగలికి; మొక్కుబళ్ళకు)పుట్టమీదకప్పి కట్టుకొనే గళ్ళచీర; కొన్నిచోట్ల పిల్లలు దక్కనివాళ్ళు కట్టుకొంటారు; తెలుపు, ఎరుపు రంగుల్లో—మామూలుగా రెండేసి కొలుకులు, కొన్నిచోట్ల నాలుగేసి కొలుకులు పడుగు, పేక వరసగా వచ్చేట్టు నేస్తారు; అంగుళంలో ఎనిమిదోవంతు వెడల్పున సన్నగడి పడుతుంది; కొన్నిచోట్ల, నాలుగురంగుల్లో గడినేస్తారు; తెల్లచెరగులో ప్రపారుకమ్మిగాని, (ఎరుపురంగు) సాదాకమ్మిగాని పెట్టి, ఎరుపు అంచుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, ఈచీరకొన్న సంతలోనే కట్టిస్తారు (కో. 4-7, 9, 11-15, 18, 19, 23; రా. 11, 19బి).

**నాగులపొద్దులు** ఒకరకం కమ్మిపెట్టి నేసిన చీరలు (రా. 19బి).

**నాగులకోక** పర్యా. చూ. నాగులచీర. నాగులచవితికిగాని సుబ్బారాయుడుషష్ఠికిగాని (పుట్టపొంగలికి; మొక్కుబడికి) పుట్టమీద కప్పి కట్టుకొనే గళ్ళచీర; కొన్నిచోట్ల, పిల్లలు దక్కనివాళ్ళు కట్టుకొంటారు; తెలుపు, ఎరుపు రంగుల్లో—మామూలుగా రెండేసి కొలుకులు, కొన్నిచోట్ల నాలుగేసి కొలుకులు-పడుగు, పేక వరసగా వచ్చేట్టు నేస్తారు; అంగుళంలో ఎనిమిదోవంతు వెడల్పున సన్నగడి పడుతుంది; కొన్నిచోట్ల, నాలుగు రంగుల్లో గడినేస్తారు; తెల్లచెంగులో పపారుకమ్మిగాని (ఎరుపురంగు) సాదాకమ్మిగాని పెట్టి ఎరుపుఅంచు పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల, ఈ చీర కొన్న సంతలోనే కట్టిస్తారు (కో. 10).

**నాగురెతు** (క్రి.)పర్యా. లాకలెత్తు. సరిచేసేటప్పుడు, పడుగులో లాకలు లేపటం; పోగులు విరబడటానికి రెండు లాకలు పట్టుకొని, ఒకటిపైకీ మరొకటి కిందికీ గుంజుతారు (కో. 27).

**నాగులేరు** (నాగులు + ఏరు; క్రి.) పర్యా. చూ. లాకలేరు. పడుగు చేసేటప్పుడు, లాకలమీది పోగులు సర్దటం (కో. 27).

**నాగులఅంగోస్త్రం** ఎరుపులో తెల్లగళ్ళు పడేట్టు నేసిన అంగవస్త్రం; మర్వాడీ అంగవస్త్రం మాదిరిది (కో. 24).

**నాచుచీర** నాచురంగు చీర (కో. 26).

**నాచు(రంగు)** ఉ. నాసి—, నాసు. పెసరరంగులో ముదురువన్నె; పాకుడురంగు. చూ. చిత్రం 288 (కో. 24, 26, 30, 35; తె. 12, 14).

**నాటిరేషం** నాసిరకంగా ఉండే (ఒకరకం) పట్టు (రా. 14).

**నాటుపత్తి** పర్యా. దేశవాళీపత్తి. మామూలుగా ఎర్రపత్తి; కొన్నిచోట్ల, తెల్లపత్తి; చిన్నకాయ; గింజ నలుపు (కో. 3-6, 10; రా. 8, 10).

**నాటుమగ్గం** పర్యా. చూ. చేతిమగ్గం(1). పడుగులో పేకదారపుకండె చేత్తో వేస్తూ నేసేమగ్గం; చాలాకాలం నుంచి వాడుకలో ఉన్నది; అంచులో వేరువేరు పోగులు చేత్తో తిప్పుతూ నేసేనేతకు, పట్టునేతకు, డిజైన్ల నేతకు బాగా అనువైనది; దీంతో, పని నిదానంగా జరుగుతుంది. చూ. చిత్రాలు 109, 127 (కో. 1).

**నాడిపుల్ల** తడికి (=అచ్చులాంటిది) కట్టటానికి వడిదారం చుట్టే కొయ్యపుల్ల. చూ. చిత్రం 98 (కో. 7).

**నాడె** (—ఆడు, —చిమ్ము, —నడచు, —విసురు, —వేయు) ఉ. నాడి, నాడెం; రూ. లాడె; పర్యా. కొమ్ము(5), కొమ్మునాడె(1), నాడెకొమ్ము(2), నేతకొమ్ము(1), నేతనాడె, పడుగులాడె, లాడెకొమ్ము(1). నేతనేసేటప్పుడు, పడుగు పై పోగులకు కింది పోగులకు మధ్య వేసే పేకదారంకండె అమర్చిన పనిముట్టు; గేదె కొమ్ము, కొయ్య, వెదురుగొట్టం మొ. వాటితో చేస్తారు. చూ. చిత్రం 131 (కో. 1-3, 5-7, 9-37; తె. 4, 5, 8, 10-33; రా. 1-7, 15, 19, 21-23).

**నాడెఉంగరం** ఉ. —ఉంగ్రం; పర్యా. చూ. ఉంగరం (7). చేతినాడెగాడిలో, ఇనిపుల్లకు వేసిన చిన్నచుట్టు; ఇత్తడిదిగాని, ఇనపదిగాని; పేకదారంపోగు చిక్కుపడకుండా రావటానికి దీంట్లోనుంచి తీస్తారు. చూ. చిత్రం 131 చ. 3 (తె. 18).

**నాడెకొండి** పర్యా. చూ. కమాను(3). మరనాడెగాడిలో, ముల్లుకు గుచ్చిన కొయ్యకండె ఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడిరేకు. చూ. చిత్రం 131 చ. 2 (తె. 21).

**నాడెకొమ్ము** 1. ఉ. నాడి—; రూ. లాడెకొమ్ము(2). పర్యా. చూ. చేతినాడె. పడుగు పై పోగులకు మధ్య వేసే పేకదారంకండె అమర్చి చేత్తో విసిరే నాడె; గేదె కొమ్ముతో చేసింది; చూ. నాడె. చూ. చిత్రం 131 చ (కో. 1, 2, 3; రా. 23); 2. పర్యా. చూ. నాడె(1). నేతనేసేటప్పుడు, పడుగు పై పోగులకు కింది పోగులకు మధ్య వేసే పేకదారంకండె అమర్చిన పనిముట్టు; గేదె కొమ్ము, వెదురుగొట్టం మొ. వాటితో చేస్తారు. చూ. చిత్రం 131 (రా. 3, 4).

**నాడెకొమ్ముపుల్ల** ఉ. నాడి—; పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (కో. 2).

**నాడెకొస** ఉ. నాడి—; పర్యా. చూ. నాడెముక్కు. నాడె చివర కొనదేలిన భాగం; మరనాడె మొనకు ఇనపపొన్ను(గుబ్బ)బిగిస్తారు; కొన్నిచోట్ల, లక్కమొన పెడతారు. చూ. చిత్రం 131 చ. 4 (కో. 27, 30).

**నాడెగాడి** ఉ. —గాడీ; రూ. నాడిగాడెం, లాడెగాడి; పర్యా. కొమ్ముకడుపు, కొమ్ముగాడి, గాడి, నాడెగాలె, నాడెదొల, నాడెదోని, పొట్ట, సొరుగు(3). నాడెలో పేకదారంకండె అమర్చేసందు. చూ. చిత్రం 131 చ. 1 (కో. 31, 34, 36, 37; తె. 8, 19, 21, 25, 33).

**నాడెగాడెం** చూ. నాడెగాడి (తె. 18).

**నాడెగాలె** పర్యా. చూ. నాడెగాడి. నాడెలో పేకదారంకండె అమర్చేసందు. చూ. చిత్రం 131 చ. 1 (తె. 29).

**నాడెగుబ్బ** ఉ. నాడి—; పర్యా. అణుసు(1), కుప్పి, గుబ్బ(2), తారు(1), నాడెపొన్ను, నాడెబొడ్డె(1),

పుప్పె, పూత(3), పొచ్చె, పొన్ను(3), బొడ్డె(4), లాలం, సీల(12). మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల, ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (కో. 1-3).

**నాడెదొల** ఉ. నాడి-; పర్యా. చూ. నాడెగాడి. నాడెలో పేకదారంకండె అమర్చేసందు. చూ. చిత్రం 131 చ. 1 (కో. 27, 32).

**నాడెదొని** పర్యా. చూ. నాడెగాడి. నాడెలో పేకదారంకండె అమర్చేసందు. చూ. చిత్రం 131 చ. 1 (తె. 31, 32).

**నాడెపుల్ల** ఉ. నాడి-, పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడెగాడిలో, అడ్డంగా బిగించిన పుల్ల; పేకపోగు చిక్కుపడకుండా సాఫుగా రావటానికి దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల. దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (కో. 3).

**నాడెపూస** ఉ. నాడి-; పర్యా. చూ. పూస(6). మరనాడెలో కండెపోగు బయటికి రావటానికి బెజ్జంచేసి బిగించిన గాజుపూస; కొన్నిచోట్ల. పోగు దూరేసందు; బెజ్జం; దీంట్లోనుంచి పోగు సాఫుగా వస్తుంది; మామూలుగా ఒకటి ఉంటుంది; కొన్నిచోట్ల, 2-4 ఉంటాయి. చూ. చిత్రం 131 త. 1 (కో. 5, 10, 17, 25, 26, 30; రా. 7).

**నాడెపొన్ను** పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల, ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (తె. 32).

**నాడెపోగు** నేతలో అడ్డంగావచ్చే పోగు; నాడెలోనుంచి తీసిన కండెదారం (తె. 4).

**నాడెపోవు** (క్రి.) నేతనేసేటప్పుడు పడుగులో నాడె ఒకవైపునుంచి మరొక వైపుకు అడ్డంగా వెళ్ళటం (రా. 7).

**నాడెబెజ్జం** ఉ. నాడి-. మరమగ్గంనాడెకు, కండె పోగు దూర్చటానికి చేసిన చిల్లి; దీంట్లో గాజుపూస బిగిస్తారు. చూ. చిత్రం 131 క. 2 (కో. 31).

**నాడెబొడ్డె** 1. పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడె మొన అరగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల. ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (తె. 18, 33); 2. పర్యా. చూ. నాడెముల్లు, ?నాడెలో పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (తె. 20).

**నాడెముక్కు** ఉ. నాడి-; రూ. లాడెముక్కు; పర్యా. నాడెకొన, నాడెమొన, ముక్కు, మొన. నాడె చివర కొనదేలిన భాగం; మరనాడెమొనకు ఇనపపొన్ను బిగిస్తారు; కొన్నిచోట్ల లక్కమొన పెడతారు. చూ. చిత్రం 131 చ. 4 (కో. 10).

**నాడెముల్లు** ఉ. నాడి-; పర్యా. ఊచ(5), కండెముల్లు కొమ్ముముల్లు, నడిమిసూల, నాడెకొమ్ముపుల్ల, నాడెబొడ్డె(2) నాడెమొల, నాడెసీల, నాడెసూది, నాడెసూల ముల్లు(4), మేకు(10), మొల(3), సూల(2). నాడెలో పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (కో. 1, 5-7, 10, 23, 25-37; తె. 2, 10, 13, 19, 25, 29; రా. 2, 5, 15, 22, 23).

**నాడెమొన** ఉ. నాడి-; పర్యా. చూ. నాడెముక్కు. నాడె చివర కొనదేలిన భాగం; మరనాడె మొనకు ఇనపపొన్ను బిగిస్తారు; కొన్నిచోట్ల లక్కమొన పెడతారు. చూ. చిత్రం 131 చ. 4 (కో. 17, 23, 25, 29, 34).

**నాడెమొల** పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (కో. 9).

**నాడెలబుర్ర** నాడెలు వేసుకొనే గొట్టం; మగ్గం దగ్గర పెట్టుకొంటారు (తె. 20, 29, 32, 33).

**నాడెలసంచి** నాడెలు వేసుకొనే సంచి; మగ్గం దగ్గర పెట్టుకొంటారు (తె. 29).

**నాడెలాగు** (క్రి.) ఉ. నాడి-; పర్యా. చూ. కుచ్చు లాగు. నాడె ఆడటానికి మరమగ్గంకుచ్చు గుంజటం; కుచ్చు ఏవైపు గుంజితే నాడె ఆ వైపుకు వెళ్తుంది (కో. 24).

**నాడెవిల్లు** ఉ. నాడి-; పర్యా. చూ. కమాను(3). మరనాడెగాడిలో, ముల్లుకు గుచ్చిన కొయ్యకండెఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడిరేకు. చూ. చిత్రం 131 త. 2 (కో. 1).

**నాడెవేయు** (క్రి.) ఉ. నాడేయు. పడుగు పోగులకు మధ్యగుండా పేకదారపు కండెలనాడె ఒకవైపునుంచి మరొక వైపుకు పారేట్టు చెయ్యటం; చేతిమగ్గం నేతలో విసురుతారు; మరమగ్గం నేతలో కుచ్చు గుంజుతారు (కో. 5).

**నాడెసులోటు** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె అడుతుంది; దీనికి రెండుచివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 113.9 (కో. 14).

**నాడెసూది** పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో

ఒకవైపు బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (తె. 24).

**నాడెసూల** పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (కో. 6; తె. 12, 15. 17, 26-28, 31-33).

**నాడెసీల** నాడి–; పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడె గాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (కో. 3).

**నాతనల్** ఒకరకం తువ్వాలు; మామూలుగా నేసింది (తె. 22).

**నాదాన్‌పత్తి** ఒకరకం తెల్లపత్తి (కో. 33, 34).

**నాదుకొయ్య** పర్యా. నాలుకొయ్య. పట్టుమగ్గం దోనెను కుడివైపున మోసే కొయ్య; నేలలో పాతింది; చూ. నాలికకొయ్య. చూ. చిత్రం 123 క. 1 (తె.5).

**నాభితాడు** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్ట మీద, చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగు దారం; దీనికొనలు, చేడుబొందులు కొన్నిచోట్ల, కర్రలు-రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (కో. 11).

**నామ్దారీచీర** మూడురంగు(నలుపు, ఎరుపు, నీలి)ల్లో పది కొలుకుల దారంపెట్టి నేసిన చీర (రా. 24).

**నాంపండు** విభూదిపండు; నాముసుద్ద ఉండ; ఆచ్చు తికేటప్పుడు, వేళ్ళుగరుకుగా ఉండటానికి అద్దుకొంటారు (కో. 30).

**నాయకపువాళ్ళు** ఉ. నాయకపోల్లు. దసలి(పట్టు) పురుగులను పెంచే ఒకతెగ; "తెనుగోల్ల సంబంధం", దసలికాయలు అమ్ముతారు (తె. 17).

**నార 1.** చూ. నరం(2) (కో. 5-7, 12, 15, 16); **2.** పర్యా. చూ. నరం(1). పకుబద్దకొన(ల)కు కట్టిన జంతునరం; మామూలుగా ఎద్దుది; కొన్నిచోట్ల, గొర్రె పేగు; ఇటువంటివి రెండుంటాయి; గూటంతో నరం కొడుతూ ఉన్ని పకుతారు; కొన్నిచోట్ల, చేత్తోనే నరం గుంజుతూ పకుతారు. చూ. చిత్రం 309.1 (తె. 6); **3.** కృత్రిమపుపట్టు; art silk; అంచులనేతకు వాడతారు (రా. 12, 22).

**నారకమ్మి** చీర చెరగులో ఒకరకం కృతిమపు పట్టుతో నేసిన కమ్మి (రా. 12).

**నారంగి** చూ. నారంజ (తె. 19, 22).

**నారంచు** ?కృత్రిమపు పట్టుపెట్టి నేసిన అంచు (రా. 12).

**నారనూలు** మొక్కల నారతో తీసినదారం(కో.19).

**నారపట్టు** నారతో తయారు చేసిన ఒకరకం కృత్రిమపుపట్టు (కో. 19).

**నారబంద** నారను కట్టెతో బిగగొట్టి శుభ్రం చెయ్యటానికి వేసుకొన్న రాయి (తె. 25).

**నారముంగి** ఒకరకం కృత్రిమపు పట్టు(=నార), నూలు కలిపి నేసిన చిన్నగడ (తె. 22).

**నారింజ(పండు)** ఉ. నారింజ. నారింజి, నారింజి; రూ. నారింజి; పర్యా. ఆరెంజి(వన్నె). ఒకరకం ఎరుపు రంగు; బి. ఒ. గార్నెట్ వేసి తయారు చేస్తారు; కొన్నిచోట్ల బి. ఎస్. ఆర్, కొన్నిచోట్ల ఆరంజెన్ ఎ. ఎస్. వేసి (నెఫ్తాల్ రంగు) తయారు చేస్తారు; చూ. ఆరెంజి (వన్నె). చూ. చిత్రం 288 (కో. 9, 12-16, 18-20, 24; తె. 2, 4. 5, 10, 13-15, 17, 18, 24, 25, 31; రా. 19బి).

**నాలి** రూ. నాలె; పర్యా. చూ. నాలికకొయ్య. మగ్గంమీద నేలగుడ్డ చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా, కుడిపక్కన నేలలో పాతినకొయ్య; పైకి మొన దేలి ఉంటుంది; దీన్ని దోనె చివర బెజ్జంలో దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 1 (కో. 7, 11).

**నాలిక 1.** పర్యా. చూ. వడిబిళ్ళ(లి) అచ్చుకట్టే టప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి, అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యబెండు; ఒకవైపు వెడల్పుగాను, ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చు కట్టిన తరవాత, దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటు వంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకుచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (తె. 4); **2.** పర్యా. చూ. పల్లెకట్టె, దోనెకు నేతబట్ట చుట్ట టానికి, దోనె(వలక)తిప్పేకర్ర; కొన్నిచోట్ల, ఇనపకడ్డీ; కుడివైపు దోనెబెజ్జంలో దూర్చి నేతకు అనుస్తారు. చూ. చిత్రం 122 చ. 2 (తె. 22; రా. 2); **3.** నాలిక కొయ్య(=దోనెకు ఆధారంగా, కుడివైపున నేలలో పాతినకొయ్య) పైభాగం; నాలిక మాదిరిగా, సన్నగా పొడుగ్గా ఉన్నది; చూ. నాలికకొయ్య (తె. 18); **4.** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (కో. 3); **5.** పట్టుమగ్గం దోనెను మోసే నాలుకొయ్యపైకొన; చూ. నాలికకొయ్య. చూ. చిత్రం 123 క. 1 (తె.5).

**నాలికకొయ్య** ఉ. నాలక–, నాలిక్కొయ, నాలి గ్గొయ, నాలెక్కొయ్య, నాల్కకొయ్య. నేలకొయ్య; రూ. నాలికొయ్య(1); పర్యా. తోకగుంజ(2), తోక గూటం(3), దోనెకొయ్య, నాలికగుంజ, నాలికగూటం. నాలికెపట్ల, నాలికమాను, నాలి. మగ్గంమీద, నేతగుడ్డ

చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా కుడిపక్కన, నేలలో పాతినకొయ్య; పైకి మొనదేలి ఉంటుంది; దీన్ని దోనె చివరి బెజ్జంలో దూడస్తారు. చూ. చిత్రం 123 క. 1 (కో. 2, 4, 6, 9, 9బి, 13-16, 19, 21-26, 28, 30, 31, 34; తె. 10, 11, 14, 15, 18, 20, 22-25, 30; రా. 4, 8, 10, 19, 19బి, 21, 21).

**నాలికగుంజ** పర్యా. చూ. నాలికకొయ్య. మగ్గం మీద నేతగుడ్డే చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతినకొయ్య; పైకి మొనదేలి ఉంటుంది; దీన్ని దోనె చివరి బెజ్జంలో దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 1 (కో. 17, 18).

**నాలికగూటం** ఉ. నాలిగ్గూటం, నాల్కగూటం, నైలిగ్గూటం. **1.** పర్యా. చూ. నాలికకొయ్య. మగ్గం మీద, నేతగుడ్డ చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతినకొయ్య; పైకి మొనదేలి ఉంటుంది; దీన్ని దోనె చివరి బెజ్జంలో దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 1 (తె. 2; రా. 16, 17, 22, 24); **2.** ఉ. నాలిగ్గోటం, నైలిగ్గూటం; రూ. నాల్కగూటం; పర్యా. నాలికొయ్య. ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. చూ. చిత్రం 315 చ. 1 (తె. 22, 25).

**నాలికతొలి 1.** ఉ. నాలికెతొలి; పర్యా. తొర్రి, రంధ్రం, సీలతొలి. దోనె(పలక)తిప్పటానికి, పల్లెకట్టె దూర్చే దోనెగాడి; కుడివైపున ఉంటుంది; ఇటువంటివి, నాలుగుంటాయి. చూ. చిత్రం 123 చ. 3 (తె. 18, 22); **2.** పర్యా. తొలి. దోనెకు కుడివైపున చివర చేసిన బెజ్జం; దీంట్లో నాలికకొయ్య దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 10 (తె. 32).

**నాలికమాను** పర్యా. చూ. నాలికకొయ్య. మగ్గం మీద, నేతగుడ్డ చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా, కుడిపక్కన నేలలో పాతినకొయ్య; పైకి మొనదేలి ఉంటుంది; దీన్ని, దోనె చివరి బెజ్జంలో దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 1 (కో. 1; రా. 1).

**నాలికరొబ్బ** ఉ. నాలికి-; పర్యా. చూ. దండెచెవి (1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల, రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 19).

**నాలికెపల్లు** పర్యా. చూ. నాలికకొయ్య. మగ్గం మీద, నేతగుడ్డ చుట్టే కొయ్య(=దోనె)కు ఆధారంగా కుడిపక్కన, నేలలో పాతినకొయ్య; పైకి మొనదేలి ఉంటుంది; దీన్ని దోనె చివరి బెజ్జంలో దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 1 (తె. 31, 32).

**నాలికొయ్య** ఉ. నాలకొయ్య, నాలికొయ, నాలికొయ్య, నాలుకొయ, నాలుకొయ్య, నాలెకొయ్య, నాల్కొయ్య. నైలకొయ్య. **1.** చూ. నాలికకొయ్య (కో. 3, 8, 10, 29, 32, 33, 35-37; తె. 3-5, 12, 13, 16, 17, 21, 26, 27, 29, 33; రా. 11, 23); **2.** రూ. నాల్కగొయ్య; పర్యా. నాలికగూటం. ఉన్ని మగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. చూ. చిత్రం 315 చ. 1 (తె. 3, 10, 11).

**నాలిబద్ద** పర్యా. చూ. పల్లెకట్టె. దోనెకు నేతబట్ట చుట్టటానికి, దోనె(పలక)తిప్పేకర్ర; కొన్నిచోట్ల ఇనప కడ్డీ; కుడివైపు దోనె బెజ్జంలో దూర్చి నేలకు ఆనుస్తారు. చూ. చిత్రం 123 చ. 2 (కో. 7).

**నాలుకొయ్య** పర్యా. నాదుకొయ్య. పట్టుమగ్గం దోనెను కుడివైపున మోసేకొయ్య; నేలలో పాతింది. చూ. చిత్రం 123 క. 1 (తె. 17)

**నాలుగుకోళ్ళఅచ్చు** ఉ. నాలుక్కోళ్ళఅచ్చు. నాలుగు పావుకోడు చెక్కలుగల మగ్గానికి అమర్చే నేసే అచ్చు; కొన్ని రకాల డిజైను నేతలకు ప్రత్యేకంగా వాడతారు; దీనికి పైన, కింద, నాలుగేసి అచ్చుకర్రలు ఉంటాయి. చూ. చిత్రం 101 క (రా. 14).

**నాలుగండ్లఅచ్చు** ఉ. నాలుగల్లఅచ్చు. ఒకరకం అచ్చు; పడుగులో నాలుగు అనులను లేపేది; దీనికి పైన, కింద నాలుగేసి అచ్చుకర్రలు ఉంటాయి; డిజైను నేతకు వాడతారు. చూ. చిత్రం 101 క (రా. 15).

**నాలుగుగీరలంచు** ఉ. నాలుగ్గీరలంచు. నాలుగు గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు. చూ. చిత్రం 185.4 (కో. 35).

**నాలుగుగోలలపువ్వంచు** ఉ. నాలుగ్గోలలపువ్వంచు. ఒకరకం పువ్వులు పడేట్టు నేసిన అంచు (తె. 8).

**నాలె** చూ. నాలి (కో. 5).

**నాల్కగూటం** చూ. నాలికగూటం (తె. 27).

**నాల్కగొయ్య** చూ. నాలికొయ్య(2). (తె. 26, 28).

**నిట్ట** ఉ. నెట్ట. రాటె కట్టుబడిలో ఉన్న ఆకులకు బిగించే వెదురుగొట్టం; అడుగువైపున దీన్ని నాలుగు చీలికలుచేసి ఆకులకు బిగిస్తారు. చూ. చిత్రం 31 ద. 1 (కో. 32, 33, 37).

**నిట్టరాటె** ఒకరకం రాటె; దీనికి పైభాగంలో ఒక బద్ద(=నిట్ట)అడ్డంగా అమర్చి ఉంటుంది. చూ. చిత్రం 31 ద (కో. 33).

**నిడపకమ్మి 1.** పర్యా. చూ. నిలువు(2). ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 16.2 (కో. 19); **2.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు.

చూ. చిత్రం 15.3(కో.17); **3.** పర్యా. **చూ.** అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడువరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 19); **4.** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె: ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 17).

**నిడపచెక్క** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 31).

**నిడిగూటం** పర్యా. చూ. మిడిగూటం(2). నేత బయలులో చివర పాతినగొయ్య; దీనికి నేతమోకుతో కాలికివేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకు కట్టి, దీనికి పనుగ మెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (రా. 10).

**నిడిదండె** పర్యా. చూ. జంత్రందండె. అచ్చుకట్టె జంత్రానికి నిలువుపుల్లలు బిగించిన కిందిపీట; కొన్నిచోట్ల, ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 91 క. 1 (కో. 37).

**నిడిదండెకొయ్య** అచ్చుకట్టె జంత్రం నిలువుకమ్మికి బిగించినపుల్ల; సుమారు జేనెడు పొడుగుది; చూ. కొయ్య. చూ. చిత్రం 91 క. 4 (కో. 37).

**నిడిపట్టె** **1.** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగు పట్టె(లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (రా. 20); **2.** పర్యా. చూ. నిలువుకమ్మి(7). అచ్చుకట్టె జంత్రం కిందపీటకు బిగించిన పొడుగుపట్టె; దీనికి రెండో వైపున నిలువుపుల్ల బిగించి ఉంటారు; కొన్నిచోట్ల, చిన్న అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 2 (కో. 26).

**నిడిపీట** **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 28); **2.** పర్యా. **చూ.** తొక్కుడుపీట(2). డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒకకాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (కో. 28); **3.** పర్యా. **చూ.** అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 28).

**నిడిబద్ద** పర్యా. చూ. నిలువుబద్ద(1). రాటి ఆకులను కలిపే నిలువుపుల్ల(లు); కొన్నిచోట్ల, తాళ్ళు వాడతారు. చూ. చిత్రం 31 క. 4 (కో. 27).

**నిడిబల్ల** **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(1). వత్తిపట్టేటప్పుడు రాట్నం కదలకుండా తొక్కిపట్టటానికి అమర్చినపట్టె. **చూ.** చిత్రం 1.4 (కో. 36); **2.** పర్యా. చూ. నిలువుకమ్మి(7). అచ్చుకట్టె జంత్రం కిందపీటకు బిగించిన పొడుగుపట్టె; దీనికి రెండోవైపున నిలువుపుల్ల బిగించి ఉంటారు; కొన్నిచోట్ల, చిన్నఅడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 2 (కో. 33); **3.** చూ. నిడుపుబల్ల(2) (కో. 30); **4.** రూ. నిడుబల్ల, నిడుపుబల్ల; పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగు పట్టె(లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 25–27, 30, 33); **5.** చూ. నిడు(పు) బల్ల(1) (కో. 36).

**నిడివివిళ్ళు** పర్యా. గిరిడి. పన్నెకట్టేటప్పుడు, దండెలమధ్య బిగించిన పుల్లలు ఒకే మట్టంలో ఉండేట్టు కొలత చూసుకోటానికి, దండెలమధ్య ఎక్కించిన కొయ్యముక్క; పన్నెకట్టుబడి ప్రారంభించిన వైపునుంచి, రెండోవైపుకు దీన్ని జరుపుకొంటూ వెళ్తారు. చూ. చిత్రం 89 క. 8 (కో. 1).

**నిడుచు** (క్రి.) ఉ. నిడుసు. గింజలుతీసి పత్తిని వేరు చెయ్యటం (కో. 33, 34, 36, 37).

**నిడుపట్టె** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 37).

**నిడు(పు)బల్ల** ఉ. నిడుబ్బల్ల. **1.** రూ. నిడిబల్ల(5); పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 29, 32, 33, 34); **2.** రూ. నిడిబల్ల(3); పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 33).

**నిడుపుపట్టె** ఉ. నిడుప్పట్టె; పర్యా. చూ. తొక్కుడుపీట(2). డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (కో. 37).

**నిడుబల్ల** చూ. నిడిబల్ల(4) (కో. 32).

**నిడుపుబద్ద** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 24).

**నిడుపుబల్ల** చూ. నిడిబల్ల(4) (కో. 29, 35).

**నిండుకట్టు** (–వేయు) రాట్నానికి చుట్టిన ఒక చిలప పట్టుదారం; రెండు తులాల బరువు తూగేది (తె. 21).

**నిండుజమలు** నేతనేసేటప్పుడు, పన్నెగూటిలోకి వచ్చిన పట్టుపడుగులో పై రెండుపోగులు, కింది రెండు పోగులు (తె. 12).

**నిండుపలక** (-వేయు) ఠోనెనుంచి పన్నెవరకూ నేసిన నేత (కో. 2, 4, 5, 10).

**నిండుబుగిడి** పర్యా. పూర్ణబుగిడి. పూర్తిగా మొగ్గ(=బుగిడి)మాదిరిగా నేసిన డిజైను; చూ. బుగిడి (రా. 16).

**నిప్పాణి(అంచు)** ఒకరకం పువ్వు పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 202 (తె. 7).

**నిమాయిన్** మగ్గంచట్టం అడ్డపట్టె, నిలువుపట్టె కలిసేచోట బిగింపుకు వేసిన కొయ్యచెక్క. చూ. చిత్రం 118.4 (తె. 31).

**నింబావళి** ఉ. నింబావలి, నిమ్మా(వ)ళి; చూ. నింబోలి (కో. 2, 16, 19; రా. 1, 4, 5, 11, 12, 14-16, 18, 19).

**నింబోలి** ఉ. నింబోలీ, నింబోళి, నింబోళీ, లింబోలి; రూ. నింబావళి. ఒకరకం పసుపురంగు; తెలుపువన్నె కలిసింది; నిమ్మపండురంగు; రెడ్ ఆర్. సి., పటిక, తేజావు, నైట్రేట్ సల్ఫ్ వేసి నెఫ్తాల్(నింబోలి)రంగు, 6జి. 600, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేసి ఇండెంత్రీన్ (నింబోలి) రంగు తయారుచేస్తారు. చూ. చిత్రం 288 (తె. 2-5, 7, 8, 12, 18-20, 22-25, 27, 28, 31, 32; రా. 22).

**నిమ్మరంగు** ఒకరకం పసుపురంగు; చూ. నింబోలి (కో. 37).

**నిమ్మరంగుచీర** ఒకరకం పసుపురంగుచీర(కో.37).

**నిలపటకొయ్య** పర్యా. చూ. నిలువు(2). ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (రా. 4).

**నిలుగుంజ** పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (తె. 27).

**నిలుగొయ్య** ఉ. నిలగొయ్య. పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతినకొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి, పెడకోలకుచుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకుకట్టి, దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల, ఇది అనిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (కో. 6, 8, 9ఎ; రా. 21).

**నిలుపీట** పర్యా. చూ. ఆసుజంగ. ఆసుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడువరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (తె. 6).

**నిలుపుకుంచె** సరచేనేటప్పుడు, పడుగు ఆరుబయలులో ఉండగా, సందు(=రెండుకచ్చుల మధ్యభాగం)సందుకూ ఆపుతూ దువ్వేకుంచె; పడుగు బాగా ఆరేవరకూ సందు సందుకూ రెండు, మూడుసార్లు నిదానంగా దువ్వుతారు; కొన్నిచోట్ల, సన్నపడుగులు ఇలా దువ్వుతారు(కో.6).

**నిలుబద్ద** పర్యా. చూ. నిలువుపట్టె(10). మగ్గం చట్టంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 13).

**నిలువడ్డ** (<నిలువు+అడ్డ) పర్యా. చూ. నిలువు (2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ.చిత్రం15.2(రా.21).

**నిలువాకు(లు)** **1.** (<నిలువు+ఆకులు) పట్టు దారంచుట్టే డొలక కట్టుబడిలో, అడ్డఆకులకు ఆధారంగా ఇరుసుకు బిగించిన పట్టె(లు). చూ. చిత్రం 293 క. 4 (తె. 12); **2.** బీమ్(అడ్డ)(=ఒకరకం మరాసు)చెక్రం కట్టుబడిలో, అడ్డాకును, ఇరుసును కలిపే కొయ్య పట్టె(లు); చూ. ఆకు. చూ. చిత్రం 50.2 (తె. 8).

**నిలువు** **1.** పర్యా. గుజ్జు(1), జంగ(1), నిలువు గుజ్జు(1). పత్తిరాట్నం కిందిపీటకు దిగ్గొట్టిన నిలువు కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 1.3 (కో. 1, 5, 6, 8, 9; తె. 5, 15, 16, 17); **2.** పర్యా. కంబం(1), కొక్కు(1), గుజ్జు(2), గుంజ(1), జంగ(2), దాపుకమ్మి, నిడపకమ్మి(1), నిలపటకొయ్య, నిలుగుంజ, నిలువుకమ్మి(1), నిలువడ్డ, నిలువుకొయ్య(1), నిలువు గుంజ(1), నిలువుపట్టె(1), నిలువు స్తంభం(1), బాదు, రాట, రాట్నంచెవి, స్తంభం(1). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి చూ. చిత్రం 15.2 (కో. 1, 2, 4-15, 18, 25, 26; తె. 3, 7, 9, 16, 20-23, 29; రా. 1-3, 5-24); **3.** పర్యా. చూ. గూటం(3). రాటి తిరగటానికి ఆధారంగా, దూపిరికి దిగగొట్టిన కొయ్యగూటం. చూ. చిత్రం 31 చ. 1 (కో. 2); **4.** పర్యా. గిరకనిలువు, గుమ్మికొయ్య(2), నిలువుకట్టె(1), పీటనిలువు, మొగరం, మొద్దునిలువు. రాటికి ఆధారంగా పాతిన నిలువుకొయ్య; ఒకటిగాని, రెండుగాని ఉంటాయి. చూ. చిత్రం 31 ప. 1 (తె. 33); **5.** పర్యా. చూ. గుమ్మినిలువు. అడ్డగుమ్మి తిరగటానికి ఆధారంగా అడ్డ కట్టెకు పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 34.5 (కో. 2, 4; తె. 18); **6.** పర్యా. గుజ్జు(3), గుంజ(3), జంగ(3), నిలువు కమ్మి(3), నిలువుపట్టె(3), నిలువురాట, స్తంభంబల్ల, హంసపాదు. డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువు కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 2 (కో. 4-7; రా. 1, 3, 6-11, 20); **7.** పర్యా. చూ. బొమ్మ(5). డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం

41 క. 5 (కో. 6, 7, 16; తె. 14; రా. 2, 6, 10, 11, 20); **8.** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటి నుంచి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 6, 9; తె. 5, 13; రా. 5); **9.** పర్యా. చూ. అనుపీట. అనుకొయ్య(=అనుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె(లు); ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (కో. 5); **10.** పర్యా. గుంజ(2), దిమ్మ(4), నిలువుకొయ్య(3), నిలువుగుంజ(3), స్తంభం(2). మరాను ఇరుసు మోసే పొడుగుకొయ్య(లు); గోతిపక్కల పాతినవి. చూ. చిత్రం 50.6 (కో. 6; తె. 13); **11.** పర్యా. నిలువుపట్టె(12). పట్టుదారంతోడే ఆను అడ్డపీటలు బిగించిన పొడుగుపట్టె(లు). (తె. 5, 12); **12.** పర్యా. చూ. ఊడైకాలు. నేలమీద మోసే ఊడైకొయ్య; ఇటువంటివి, మడతమంచంకోళ్ళ మాదిరిగా, రెండుంటాయి; వీటిపైన అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 63 క. 1 (కో. 5; తె. 19); **13.** పర్యా. చూ. సట్టరుగుంజ(1). మరమగ్గంచట్రం నిలబెట్టటానికి ఆధారంగా, నేతబయలులో పాతిన కొయ్యరాట; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల రెండు. చూ. చిత్రం 116.2 (రా. 5); **14.** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గంచట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 1-6, 25, 26; తె. 10, 11, 13, 17, 22, 24; రా. 5, 7, 8, 10, 18), **15.** పర్యా. గుర్జు(2). నవారుమగ్గం కట్టుబడిలో అడ్డపీటకు బిగించిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుపక్కలా ఉంటాయి. చూ. చిత్రం 324 క. 1 (రా. 10); **16.** పర్యా. గుజ్జు(8). పట్టుదారంచుట్టే డోలకకట్టుబడిలో ఇరుసును మోసే కొయ్య; ఇటువంటివి రెండుపక్కలా ఉంటాయి. చూ. చిత్రం 293 క. 2 (తె. 5).

**నిలువుఅస్తం** (<—హస్తం) పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 9).

**నిలువుకట్టె** **1.** పర్యా. చూ. నిలువు(3). రాటికి ఆధారంగా పాతిన నిలువుకొయ్య; ఒకటిగాని, రెండుగాని ఇలాటివి ఉంటాయి. చూ. చిత్రం 31 ప. 1 (తె. 7); **2.** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినుంచి మూడువరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7(తె. 1, 9); **3.** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 13).

**నిలువుకంబం** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 23).

**నిలువుకమ్మ** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 6).

**నిలువుకమ్మి** **1.** పర్యా. చూ. నిలువు(1). ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (కో. 13, 15 16); **2.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 16, 20); **3.** పర్యా. చూ. నిలువు(3). దబ్బరాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 2 (కో. 18); **4.** పర్యా. బొద్దినిలువు. బొద్దిబల్లకు వేసిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 42 (కో. 25); **5.** పర్యా. చూ. బొమ్మ(5). దబ్బరాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (కో. 26); **6.** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినుంచి మూడువరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 18); **7.** పర్యా. అడ్డదండె(1), నిడిపట్టె(2), నిడిబల్ల(2), నిలువుజంగ(2), నిలువుపట్టె(9), నిలువుపీట(3), నిలువుబల్ల. అచ్చుకట్టె జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగుపట్టె; దీనికి రెండోవైపున నిలువుపుల్ల బిగించి ఉంటారు; కొన్నిచోట్ల, చిన్న అడ్డపట్టె. చూ. చిత్రం 91 క. 2 (కో. 14; తె. 15); **8.** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 18, 20, 21).

**నిలువుకర్ర(లు)** డాబీతడక బిగించిన పొడుగు కొయ్య(లు). చూ. చిత్రం 132 చ. 3 (తె. 13).

**నిలువుకామ** పర్యా. చూ. నూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది, కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 24).

**నిలువుకాలు** పర్యా. చూ. ఊడైకాలు. నేలమీద

మోసే ఊడెకొయ్య; ఇటువంటివి, మడతమంచంకోళ్ళ మాదిరిగా, రెండుంటాయి; వీటిపైన అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 63 క. 1 (కో. 4).

**నిలువుకొయ్య** ఉ. నిల్వు-. **1.** పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2(రా. 3); **2.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు చూ. చిత్రం 15.3 (రా. 3); **3.** పర్యా. చూ. నిలువు(10). మరాను ఇరుసును మోసే పొడుగుకొయ్య(లు); గోతిపక్కల పాతినవి. చూ. చిత్రం 50.9 (కో. 11); **4.** పర్యా. చూ. కొయ్య(5). అచ్చుకట్టే జంత్రం కింది పీటకుగాని, నిలువుకమ్మికిగాని, బిగించినపుల్ల; సుమారు జేనెడు పొడుగుది; మామూలుగా, పెద్దపీటకు రెండు, నిలువుకమ్మికి-కొన్నిచోట్ల, చిన్న పీటకు-ఒకటిఉంటాయి. చూ. చిత్రం 91 క. 3 (కో. 14; తె. 15); **5.** పర్యా. చూ. సట్టరుగుంజ(1). మరమగ్గంచట్రం నిలబెట్టటానికి ఆధారంగా, నేతబయలులో పాతిన కొయ్యరాట(లు); ఇటువంటివి,మామూలుగా నాలుగుంటాయి;కొన్నిచోట్ల రెండు. చూ. చిత్రం 116.2 (రా. 1); **6.** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (రా. 4); **7.** పర్యా. చూ. ఇరుసుచెవి. పట్టుదారం వడికే పెద్దరాట్నం ఇరుసును మోసే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 293 చ. 1 (కో. 14).

**నిలువుగుజ్జు** **1.** పర్యా. చూ. నిలువు(1). పత్తి రాట్నం అడ్డపీటకు దిగ్గొట్టినకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 1.3 (కో. 14); **2.** పర్యా. చూ. బొమ్మ(5). డబ్బా రాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (తె. 14); **3.** పర్యా. చూ. ఇరుసుచెవి. పట్టుదారం వడికే పెద్దరాట్నం ఇరుసును మోసే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 293 చ. 1 (తె. 12).

**నిలువుగుంజ** **1.** పర్యా. చూ. నిలువు(2). ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (తె. 21; రా. 11, 15); **2.** పర్యా. చూ. గుమ్మినిలువు. ఆడ్డగుమ్మి తిరగటానికి ఆధారంగా అడ్డకట్టెకు పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం34.5(రా.17); **3.** పర్యా. చూ. నిలువు(10). మరాను ఇరుసును మోసే పొడుగుకొయ్య(లు); గోతిపక్కల పాతినవి. చూ. చిత్రం 50.9 (కో. 12ఎ); **4.** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె;ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (రా. 15); **5.** పర్యా. చూ. సట్టరుగుంజ(1). మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట; ఇటువంటివి, మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల, రెండు. చూ. చిత్రం 116.2 (కో. 13; తె. 29, 33).

**నిలువుగుది** ఉ. -గుతి; పర్యా. చూ. పావతాడు. పూనుగ్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (తె. 5).

**నిలువుగూటం** పర్యా. సవారుకొయ్య. సవారునేసే చోట, మగ్గానికి ఒకపక్క నేలలో పాతినగూటం; కొన్ని చోట్ల, గుసపం వాడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 524 క. 3 (తె. 6).

**నిలువుచాపు** పర్యా. చూ. తొక్కుడుపీట(2). డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (కో. 7).

**నిలువుచెక్క** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1(కో.7,24).

**నిలువుజంగ** **1.** పర్యా. చూ. ఆసుజంగ. ఆసుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 46 క. 7 (తె. 10); **2.** పర్యా. చూ. నిలువుకమ్మి(7). అచ్చుకట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగుపట్టె; దీనికి రెండోవైపున నిలువుపుల్ల బిగించి ఉంటారు; కొన్నిచోట్ల, చిన్న అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 2 (తె. 10).

**నిలువుతాడు** ఉ. నిల్వు-. **1.** పర్యా. చూ. చెంపతాడు(4). కుచ్చుతాళ్ళలో డైమనుతాడుకు ఒకవైపు కట్టిన దారం; దీన్ని, పైన మగ్గం నిలువుపట్టెకూ, కింద ఉడత(తాడు)కూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.23 (కో. 4, 7, 8; తె. 14, 17; రా. 4); **2.** పర్యా. చూ. పావతాడు. పూనుగ్రనూ పావుచెక్కనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 10; తె. 12-15; రా. 1, 18-20, 23, 24); **3.** పర్యా. చూ.బిర్రుతాడు(2). మరమగ్గం నిలువుపట్టెను, మేరువుపలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టిన దారం; మేరువు పలకను పైకిగాని కిందికిగాని జరుపుకొని, దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 14).

**నిలువుదబ్బ** **1.** పర్యా. చూ. ఆసుజంగ. ఆసుపీటలు

బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (తె. 8); **2.** చూ. నిలువుబద్ద(1) (రా. 16, 18); **3.** చూ. నిలువుబద్ద(2). (తె. 21).

**నిలువుదారం** **1.** పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి డాబీఅడనుంచి రెండుపాయలుగా విడదీసి, అచుపడుగులోకి వేలాడదీసిన దారం; డిజైనుకు అవసరమయినన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (రా. 23); **2.** పర్యా. చూ. అచ్చుగుడి(2). మగ్గంలో పూనుగర్రకు కట్టినదారం; అచ్చులో కిందికర్రకు ఉండేది; ఇటువంటివి, కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (రా 16); **3.** పర్యా. చూ. చెంపతాడు(4). కుచ్చుతాళ్ళలో, డైమనుతాడుకు ఒకవైపున కట్టినదారం; దీన్ని పైన మగ్గం నిలువుపట్టెకూ కింద ఉడత(తాడు)కూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.23 (రా. 2).

**నిలువుదొడ్డి** డబ్బారాట్నం చెక్రం బిగించే కొయ్య చట్రం; కింది అడ్డపీట, నిలువులు కలిసి మొత్తానికి వాడుక. చూ. చిత్రం 43 (కో. 21).

**నిలువుపట్టు** నేతలో నిలువుకు వాడే పట్టుదారం (తె. 5).

**నిలువుపట్టె** ఉ.నిల్వు- -పట్ట -పట్టి -పట్టీ.**1.**పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువు కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (కో. 2, 5, 7, 11, 12; తె. 16; రా. 1, 2, 8, 17, 18, 23, 24); **2.** పర్యా. చూ. తొక్కుడు పట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 1, 9, 14, 23, 24; రా. 1, 2, 16, 23, 24); **3.** పర్యా. చూ. నిలువు(6). డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువు కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 2 (కో. 10, 15; రా. 2, 5, 23); **4.** పర్యా. చూ. తొక్కుడుపీట(2). డబ్బారాట్నంపీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కి పట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (కో. 9); **5.** పర్యా. చూ. బొమ్మ(5). డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (రా. 2); **6.** పర్యా. చూ. ఆనుపీట. ఆను కొయ్య(=ఆనుకు బిగించినపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె(లు); ఇటువంటివి, మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (కో. 12); **7.** పర్యా. చూ. అనుజంగ. ఆను పీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడువరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 1, 2, 4, 7, 8, 9బి, 13-15; తె. 15-17; రా. 1, 4, 6, 11, 12, 23); **8.** పర్యా. చూ. ఊత్తె కాలు. నేలకుపడమోసే ఊత్తెకొయ్య; ఇటువంటివి, మడతమంచంకోళ్ళ మాదిరిగా రెండుంటాయి; వీటి పైన అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 68 క. 1 (రా. 17, 18); **9.** పర్యా. చూ. నిలువుకమ్మి(7). అచ్చు కట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగుపట్టె; దీనికి రెండోవైపున నిలువుపుల్ల బిగించి ఉంటారు; కొన్నిచోట్ల చిన్న అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 2(తె.17); **10.** పర్యా. చంకకొయ్య, చెంప(2), చెంపనిలువు, చేతి పట్టె, జబ్బ, నిడవకమ్మి(4) నిడవచెక్క, నిడువుబల్ల(2), నిడువుబద్ద, నిలుబద్ద, నిలువు(14), నిలువుఅస్తం, నిలువు కట్టె(3), నిలువుకంబం; నిలువుకమ్మ; నిలువుకమ్మి(5), నిలువుకొయ్య(6), నిలువుగుంజ(4), నిలువుచెక్క, నిలువుబద్ద(2), నిలువుస్తంభం(3), మగ్గంనిడవకమ్మి, మగ్గంనిలువు, మగ్గంస్తంభం, రెక్కబద్ద, సట్టరుగుజ్జు, సట్టరుచంక, సట్టరుచెంప, సట్టరుచెయ్యి సట్టరుజబ్బ, సట్టరునిలువు, స్తంభం(4). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 118.1 (కో. 6, 7, 9బి, 10; తె. 1, 12, 14, 28; రా. 1, 2, 9, 11, 13, 14, 16, 17, 19, 23); **11.** పర్యా. డాబీనిలువు. డాబీ చట్రం (=తడక) పొడుగుబద్ద; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 132 చ. 4 (రా. 12, 24); **12.** పర్యా. నిలువు(11). పట్టుదారంతోడే ఆను అడ్డ పీటలు బిగించిన పొడుగుపట్టె(లు) (తె. 17).

**నిలువుపట్టెపుల్ల** పర్యా. చూ. చిల్ల(7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువు పట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుం టాయి; దేవాంగులవాడుక. చూ. చిత్రం 118.8 (కో. 7).

**నిలువుపీట** ఉ. -పీటె. **1.** పర్యా. చూ. తొక్కుడు పట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కి పట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె.15); **2.** మొగలాను అడ్డపీటలు బిగించిన పొడుగుకొయ్య. చూ. చిత్రం 47.1 (తె. 6); **3.** పర్యా. చూ. నిలువు కమ్మి(7). అచ్చుకట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగుపట్టె; దీనికి రెండోవైపున నిలువుపుల్ల బిగించి ఉంటారు; కొన్నిచోట్ల, చిన్న అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 2 (తె. 13); **4.** పర్యా. తోక. నవారు మగ్గం అడ్డపీటకు కింద బిగించిన పొడుగుపట్టె; నేతనేసే

టప్పుడు, దీనిమీద కాలు మోపుతారు. చూ. చిత్రం 324 ట. 3 (తె. 12).

**నిలువుపుల్ల** పర్యా. చూ. నిలువుబద్ద(1). రాటి ఆకుల్ని కలిపే నిలువుపుల్ల(లు); కొన్నిచోట్ల, తాళ్ళు వాడతారు. చూ. చిత్రం 31 క. 4 (కో. 7).

**నిలువుబద్ద** **1.** పర్యా. అడ్డగుల్ల, నిడిబద్ద, నిలువు దబ్బ(2), నిలువుపుల్ల, పక్కబద్ద, బండిపుల్ల(2), సూత్రపుబద్ద(3). రాటి ఆకులను కలిపేనిలువుపుల్ల(లు); కొన్నిచోట్ల, తాళ్ళువాడతారు. చూ. చిత్రం 31 క. 4 (తె. 25, 30); **2.** రూ. నిలువుదబ్బ(3); పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 11, 12, 14, 15, 27; రా. 22).

**నిలువుబల్ల** పర్యా. చూ. నిలువుకమ్మి(7). అచ్చు కట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగుపట్టె; దీనికి రెండోవైపున నిలువుపుల్ల బిగించి ఉంటారు; కొన్ని చోట్ల, చిన్న అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 2 (కో. 27).

**నిలువుబారు** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 14).

**నిలువుబొమ్మ** పర్యా. చూ. బొమ్మ(5). డబ్బా రాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (రా. 11).

**నిలువుమగ్గం** తివాసీలు నేసే మగ్గం. చూ. చిత్రం 320 (తె. 17).

**నిలువుంబేక(లు)** పర్యా. పడుగుంబేక(లు), సరిం బేక(లు). నేతలో పొడుగు, అడ్డం (కో. 4, 8).

**నిలువురాట** పర్యా. చూ. నిలువు(8). డబ్బా రాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 2 (కో. 26).

**నిలువురాయి** పర్యా. చూ. సరిగుంజ(1). ఆరు బయట పడుగు చాపటానికి నేలలోపాతిన రాతి స్తంభం. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (రా. 3, 16).

**నిలువుసొంచె** చేతిమగ్గంమీద డిజైన్లు నేసే టప్పుడు, పడుగుపోగుల్లో కొన్నిటికి పైకి ఎత్తే నిలువు దారాలు; ఇవి అడ్డబేలునుంచి పడుగులోకి వేలాడ తాయి; చూ. బుట్టాజుట్టు. చూ. చిత్రం 136 క. 3 (తె. 5).

**నిలువుస్తంభం** ఉ.- స్తంబం, -స్థంబం. **1.** పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసుబిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (రా. 6, 19, 20, 22); **2.** పర్యా. చూ. సట్టరుగుంజ(1). మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయ లులో పాతిన కొయ్యరాట(లు); ఇటువంటివి. మామూ లుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల, రెండు. చూ. చిత్రం 116.2 (రా. 19); **3.** ఉ. పర్యా. చూ. నిలువు పట్టె(10). మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (రా. 12).

**నిషాని** పర్యా. సాన(రాయి). పన్నెకట్టటానికి వాడే కత్తులకు పదునుపెట్టే రాయి. చూ. చిత్రం 89 త. 1 (కో. 7).

**నీమ** తివాసీ అంచులు రెంటికీ మధ్యభాగం. చూ. చిత్రం 320 (తె. 17).

**నీర్కావి** గులాబిరంగు (కో. 23).

**నీర్కావిపంచె** గులాబిరంగుపంచె (కో. 23).

**నీల** నల్లజీడిరంగు (తె. 14).

**నీలఉన్ని** నలుపురంగు ఉన్ని (తె. 7, 9, 20, 22).

**నీలకంఠం** ఒకరకం నలుపు రంగు (రా. 22).

**నీలగొర్రె** రూ. నీలిగొర్రె. నల్లరంగు బొచ్చుగల గొర్రె (తె. 7, 9, 20, 22).

**నీల(పురి)గొంగడి** ఉ. నీలి-; పర్యా. లంకపూ గొంగడి. నీలంరంగు ఉన్నితో నేసిన గొంగడి (తె. 7, 9, 20, 28).

**నీలం** పర్యా. బశె(2), బ్లూ. వయిలెట్, సిరా రంగులు కలిసిన ఒకరకం రంగు; కొన్నిచోట్ల, సక్కు బాయికంటె లేతరంగు; blue; గార్నెట్(ఎ.)బి. ఒ.తో తయారుచేస్తారు. చూ. చిత్రం 288 (కో. 16, 19-23, 26, 30, 35; తె. 15, 16, 24; రా. 8, 10, 16, 18, 22).

**నీలంచీర** నీలంరంగు చీర (కో. 30).

**నీలాంబరం** ఒకరకం నీలంరంగు (రా. 8).

**నీలిఎర** బుట్ట విడిచిన తరవాత పదిరోజులకు దసలి పురుగు విడిచే కూసం; మొదటి కూసం (తె. 7).

**నీలికమ్మి** నీలిరంగు దారంపెట్టి నేసిన కమ్మి; ఈ కమ్మిచీరకు కవ్వంచుపెట్టి నేస్తారు (కో. 11-13, 15).

**నీలికమ్మిచీర** ఉ. -చీరె. రెండు పోగుల నీలివన్నె అంచు; కమ్మిపెట్టి నేసిన చీర; కడుపుతో ఉన్నవాళ్ళు ఒంట్లో బాగా లేనప్పుడుగాని, నీరసంవల్ల కాళ్ళుగుంజు తున్నప్పుడుగాని కట్టుకొంటారు (కో. 11-13, 15).

**నీలికాశేడుచీర** ఉ. -కాశైడిచీర; పర్యా. చూ. పంటకాశేడుచీర. గర్భవతులు, దుష్టగ్రహాలవల్ల గర్భ విచ్ఛిత్తి కాకుండా ఉండటానికి, అయిదోనెలలో కట్టు కొనేచీర; అంచు, కమ్మి నీలివన్నెలో నేసిన తెల్లచీర; కొన్నిచోట్ల, కమ్మిలోగాని, అంచులోగాని గీరలు పెడ

తారు; కొన్నిచోట్ల. అంచులో మామిడిగారం తొగరు (రంగు)వేస్తారు; దీన్ని పసుపువాళ్ళు వెయ్యగూడదట (కో. 10).

**నీలికుండ** పర్యా. కడవ(2). నీలితొట్టి, నీలిబాన. నీలిరంగు ఊరబెట్టే పెద్దకుండ; సుమారు ఆరడుగుల పొడుగుది; దీన్ని భూమిలో పాతిపెట్టి, నీలిచెట్ల ఆకులు తగిరిసె విత్తనాలు మొ.వి వేసి ఊరేస్తారు; దీన్ని 'మహాకాళి'గా తలచి పూజలు చేస్తారు; అశుచిగా ఉన్న స్త్రీ పురుషులు దీని దగ్గరికి వెళ్ళగూడదట. చూ. చిత్రం 284 చ (కో. 1, 4; తె. 1).

**నీలికేపు(లు)** నీలిరంగు గడ్డ(లు); దీన్ని కడవల్లో తయారుచేసి, ఇటికెల మాదిరిగా గడ్డలు గడ్డలుగా కోస్తారు (తె. 1).

**నీలికోళంబు** నీలిరంగునూలు ఎక్కువగా పెట్టి నేసిన తురకల గళ్ళలుంగీ; బుడ్డకైల (కో. 4).

**నీలిగొర్రె** చూ. నీలగొర్రె (తె 28).

**నీలిచాయ** ఉ. -సాయ. ఒకరకం నల్లరంగు; కడవ నీలిరంగు (రా. 11, 13).

**నీలిచీర** ఒకరకం నల్లరంగు చీర (కో. 32, 33).

**నీలిచెట్టు** నీలిరంగు తయారీకి పనికివచ్చే చెట్టు; దీని ఆకులు, విత్తనాలు నీలికడవల్లో ఊరేస్తారు; *Indigofera tinctoria*, Linn. (తె. 1; రా. 16, 23).

**నీలిడమాస్‌చీర** నీలిరంగు పడుగులో, మూడేసి వేళ్ళ వెడల్పు పట్టెలు, మూడేసివేళ్ళ ఎడంలో పడేట్టు నేసిన చీర; పేకనేతకు నీలిరంగుపెట్టి, పట్టె తరవాత ఎనిమిది కొలుకుల జమిలిపోగులు నీలం అతికి, నలుపు కమ్మి, ఏదైనా ఒకరంగు అంచూపెట్టి నేస్తారు(కో.7).

**నీలితొట్టి** పర్యా. చూ. నీలికుండ. నీలిరంగు ఊరబెట్టే పెద్దకుండ; సుమారు ఆరడగుల పొడుగుది; దీన్ని భూమిలోపాతిపెట్టి, నీలిచెట్లఆకులు, తగిరిసె విత్తనాలు మొ.వి వేసి ఊరేస్తారు; దీన్ని "మహాకాళి"గా తలచి పూజలు చేస్తారు; అశుచిగా ఉన్న స్త్రీ పురుషులు దీని దగ్గరికి వెళ్ళగూడదట. చూ. చిత్రం 284 చ. 1 (కో. 8; రా. 23).

**నీలిపావరుకంచుకోక** ఒకరకం రంగుపెట్టి నేసిన చీర (రా. 19ఎ).

**నీలిబాన** పర్యా. చూ. నీలికుండ. నీలిరంగు ఊరబెట్టే పెద్దకుండ; సుమారు ఆరడుగుల పొడుగుది; దీన్ని భూమిలో పాతిపెట్టి, నీలిచెట్ల ఆకులు, తగిరిసె విత్తనాలు మొ.వి వేసి ఊరేస్తారు; దీన్ని "మహాకాళి"గా తలచి పూజలు చేస్తారు; అశుచిగా ఉన్న స్త్రీ పురుషులు దీని దగ్గరికి వెళ్ళగూడదట. చూ. చిత్రం 284 చ. 1 (కో. 8; రా. 6, 16, 19).

**నీలిమందు** 1. బజారులో దొరికే విశేషపు నీలిరంగు (కో. 4 8; రా. 6); 2. నీలిఆకులు కడవల్లో ఊరబెట్టి తయారుచేసిన దేశవాళీరంగు (కో. 14, 16).

**నీలి(రంగు)** 1. బొగ్గుమాదిరి ముదురు నల్లరంగు; sodium colour; నీలిచెట్ల ఆకులు ఊరబెట్టి గడ్డలు చేస్తారు (కో. 1, 3, 4, 7–10, 32, 33; తె. 1, 4, 6, 7, 11–13, 15–17, 27, 28; రా. 2, 5–7; 19బి, 23); 2. నీలంరంగుకుమల 'పీన్కి' కలిపితే వచ్చేరంగు (కో. 2); 3. నీలం; blue (రా. 12).

**నీలివన్నె** ఉ. నీలాన్నె. ముదురు నల్లరంగు (రా. 17).

**నీలివన్నెచీర** ఉ. నీలాన్నెచీర. ఒకరకం నల్లవన్నె చీర (రా. 17).

**నీలివిత్తనాలు** నీలిమొక్క గింజలు; నీలిరంగు తయారీలో ఉపయోగిస్తారు (రా. 16).

**నుడుచుకొను** (క్రి.) ఉ. నుడుసు-. ముడుచుకోటం; పడుగ్గేసేటప్పుడు గంజి తడి ఆరిన తరవాత, ముడుచుకొని ఉన్న పోగులు విడబడటానికి లాకతో చరచతారు(కో.36).

**నునుపుచేయు** పర్యా. చూ. దిద్దకంపెట్టు. అచ్చు కట్టిన తరవాత, అచ్చుకర్రమీది వడిదారం మెలిక (=పూస)లు కొమ్ముత్రిళ్ళతో రుద్దుతూ చదును చెయ్యటం (రా. 12).

**నులి** (-తీయు) పర్యా.తట్టు(1). చిక్కుపడ్డ పోగులు (తె. 5).

**నులికాయ** అంచులో, ఏటవాలుగీరలు ఎడంఎడంగా పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 203 (తె. 23–25, 31).

**నులికాయంచు** ఏటవాలు గీరలు ఎడంఎడంగా పడేట్టు నేసిన ఒకరకం చీర అంచు. చూ. చిత్రం 203 (తె. 23–25, 31).

**నులికాయతీగె** అంచులో నేసిన ఒకరకం డిజైను చూ. చిత్రం 161 (తె. 25).

**నులికాయతీగెబుగిడి** అంచులో నులికాయ, తీగ, బుగిడి వరసగా పడేట్టు నేసిన డిజైను; చూ. ఆకుతీగ నులికాయ. చూ. చిత్రం 161 (తె. 25).

**నులిపిచేయు** (క్రి.) పన్నెదండెల మధ్య బిగించిన ఈనెలు కత్తితో నునుపు చెయ్యటం (కో. 26).

**నులిపెట్టు** పర్యా. చూ. పురితిప్పు. వడిపెట్టటం; మెలిపెట్టటం;అచ్చుతికేటప్పుడు బద్దెపోగుకు, పడుగుపోగు కలిపి వడిపెడతారు (తె. 7).

**నులుచు** (క్రి.) ఉ. నులుసు. పడుగుపోగులు చేత్తో చదును చెయ్యటం (కో. 28).

**నుల్త** పడుగులో చిక్కుపడ్డ దారాలు (కో. 23).

**నూక(ల)గంజి** బియ్యపు నూకలతో కాచినగంజి; దీంతో గంజి తడుపుతారు (కో. 6, 11, 13, 14, 16-19).

**నూకు** (క్రి.) తొయ్యటం (రా. 14).

**నూకుడుకట్టె** ఉ. నూకుడ-. గుండ్రటి ఎదురు దోనెను తిప్పేకర్ర; పల్లెకట్టె; కొన్నిచోట్ల, ఇసపది (=గజెం)వాడతారు. చూ. చిత్రం 110.2 (తె. 13).

**నూగాయకారం** నువ్వుకట్టె కాల్చిన బూడిద; రంగు అద్దేముందు, ఈ బూడిదనీళ్ళతో నూలు బాగా తడుపుతారు (తె. 17).

**నూగ్గట్టె** (< నూగు + కట్టె) నువ్వుకంప; దీన్ని బూడిదచేసి కారం తయారుచేస్తారు (తె. 3, 26).

**నూజాల్లకమ్మి** ఒకరకం చీరకమ్మి; జైనెడు బెత్తెడు వెడల్పున రంగులో నేస్తారు; నూజాల్లచీర కమ్మి )తె. 15).

**నూజాల్లచీర** నూజాల్లకమ్మిపెట్టి నేసినచీర (తె.15).

**నూనెకొమ్ము** పర్యా. చూ. చమురుకొమ్ము. నూనె పోసుకొనే దుప్పికొమ్ము; మగ్గానికి వేలాడదీస్తారు; నేత నేసేటప్పుడు, అప్పుడప్పుడు నాడెను సాపుచెయ్యటానికి గుడ్డతోనూనెపూస్తారు. చూ. చిత్రం121 క.16(తె. 32).

**నూనెగిద్ద** ఉ. నూని-. నూనె పోసిన చిన్నపాత్ర; నేతనేసేటప్పుడు, నాడె సాపుచెయ్యటానికి వాడే నూనె (ఆముదం, కిరసనాయిలు, కొబ్బరినూనె, నువ్వులనూనె మొ.వి) దీంట్లో పోస్తారు (తె. 24; రా. 16).

**నూనెగిన్నె** నూనె పోసిన చిన్నపాత్ర; నేతనేసేటప్పుడు నాడె సాపుచెయ్యటానికి వాడే నూనె(ఆముదం, కిరసనాయిలు, కొబ్బరినూనె, నువ్వులనూనె మొ.వి) దీంట్లో పోస్తారు (కో. 26-28).

**నూనెగురిగి** ఉ. -గుర్గి. నూనె పోసే చిన్నముంత; గంజిలో కలపటానికి దీంట్లో పోస్తారు; కొన్నిచోట్ల, నేతనేసేటప్పుడు, నాడె సాపుచెయ్యటానికి కిరసనాయిలు, కొబ్బరినూనె, నువ్వులనూనె మొ.వి దీంట్లో పోస్తారు (తె. 21, 25).

**నూనెగొట్టం** నేతనేసేటప్పుడు నాడెను సాపుచెయ్యటానికి నూనె పోసుకొనే వెదురుగొట్టం; దీన్ని మగ్గానికి పైన వేలాడదీస్తారు (తె. 31, 32).

**నూనెచెంబు** పర్యా. చమురుచెంబు. నూనె పోసిన చిన్నపాత్ర; నేతనేసేటప్పుడు నాడె సాపుచెయ్యటానికి వాడే నూనె (ఆముదం, కిరసనాయిలు, కొబ్బరనూనె, నువ్వులనూనె మొ.వి) దీంట్లో పోస్తారు (తె. 18).

**నూనెపదును** (-పెట్టు). నూనెతడి; కుంచెవేసే ముందు పురికి నూనె రాస్తారు; కొన్నిచోట్ల, గంజిలో నూనె కలుపుతారు (కో. 20).

**నూనెపాత** నూనెతో తడిపిన గుడ్డ; నేతనేసేటప్పుడు, అప్పుడప్పుడు నాడెను సాపుచెయ్యటానికి దీంతో తుడుస్తారు (కో. 27, 28, 31).

**నూనెపావు** నూనెపోసిన చిన్నపాత్ర; నేతనేసేటప్పుడు నాడె సాపుచెయ్యటానికి వాడేనూనె(ఆముదం, కిరసనాయిలు, కొబ్బరినూనె, నువ్వులనూనె మొ.వి) దీంట్లో పోస్తారు (రా. 23).

**నూనెబరిగె** నూనె పోసిన చిన్నపాత్ర; నేతనేసేటప్పుడు నాడె సాపుచెయ్యటానికి వాడేనూనె(ఆముదం, కిరసనాయిలు, కొబ్బరినూనె, నువ్వులనూనె మొ.వి) దీంట్లో పోస్తారు (కో. 30).

**నూర్జహాఁఖానీ** తివాసీనేతలోవచ్చే ఒకరకం డిజైను (కో. 16).

**నూర్జహాను(పచ్చ)** ఉ. నూర్జహాన్. 1. అరిశ్రేకు పచ్చలో లేతరంగు (కో. 3, 6); 2. రామచిలకపచ్చలో లేతరంగు (11, 36).

**నూలుకండె** పర్యా. చూ. కండె(4). సవారు నేతలో వాడే పేకదారం చుట్ట; రాట్నంమీద చిన్నపుల్లకు చుడతారు. చూ. చిత్రం 324 క. 6 (తె. 6, 27).

**నూలుకర్ర** 1. ఉ. నూలుగర్ర; పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు వాపినప్పుడు, కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కొత్తల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి; మామూలుగా, హరిజనుల వాడుక. చూ. చిత్రం 69 (కో. 6, 8, 9; రా. 21); 2. గంజిలో తడిపిన నూలు చిట్టెలు ఆరవేసిన కర్ర (కో. 36).

**నూలుకుంచె** ఉ. -కుంచి. కుంచెకు రెండు వైపులా నూలుదారంతో అడ్డబద్దలు బిగించికట్టినకుంచె(రా.17).

**నూలుకోల** పర్యా. చూ. పేకకట్టె. గొంగడి నేతలో అడ్డానికివాడే ఉన్నిదారం చుట్టిన కర్ర; దీన్ని పేకగొట్టంలోకి దూరుస్తారు. చూ. చిత్రం 319 (తె. 3, 6).

**నూలుగదురు** నేతకు కావలసినంత ఉన్నినూలు చుట్టిన కట్టె; నాలుగు మూరల పొడుగుది (తె. 20).

**నూలుగొట్టం** (-బిమ్ము, -చొరగొట్టు) ఉ. నూలుగొట్టెం; పర్యా. చూ. పేకగొట్టం. గొంగడి నేసేటప్పుడు, మగ్గానికి బిగించిన ఉన్నిపడుగులో పేకదారం వెయ్యటానికి దూర్చే వెదురుగొట్టం; లావుది; దీంట్లో, పేకదారం చుట్టిన కర్ర దూరుస్తారు; ఈ గొట్టం (బెజ్జం)లో నుంచి పోగు బయటికి వస్తుంది. చూ. చిత్రం 318 (తె. 6, 7, 9, 26).

**నూలుంట** (< నూలు + ఉంట). పర్యా. చూ. సరెంటి(లె). చుట్టచుట్టిన పడుగునూలు; మగ్గంమీద

కొంత చాపగా మిగిలింది ఒక కర్రకు చుడతారు; కొన్నిచోట్ల పురిపెట్టి చుడతారు; కొన్నిచోట్ల పెద్ద కోలకు కట్టి ఉంచుతారు. చూ. చిత్రాలు 128 ట. 1. 128 జ. 2 (రా. 16, 17).

**నూలుండ** పర్యా. చూ. ఉండ(3). వడికి, చుట్టిన దారం; గుండ్రటిది; కొన్నిచోట్ల, పడుగుకు సరిపడేటంత దారం ఒక ఉండగా చుడతారు. (తె. 6, 7, 9, 26).

**నూలుదిండు** కదురుకడ్డీకి బంకతో నూలుచుట్టి చేసిన దిండు; చూ. దిండు (కో. 37).

**నూలుపట్టు** (క్రి.) పర్యా. చూ. తోడు(1). పంటెకుగాని డబ్బాకుగాని నూలు చుట్టటం (కో. 33; తె. 17, 21-28, 30-32).

**నూలుపంటె** **1.** పర్యా. చూ. పంటె. చేత్తోనూలు చుట్టే పనిముట్టు. చూ. చిత్రం 19(తె. 21); **2.** పర్యా. చూ. చెలకపంటె. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం కొయ్యపంటె; కొన్నిచోట్ల వెదురుబద్దలుగాని, రేకు పట్టెలుగాని బిగించింది. చూ. చిత్రం 29 (రా. 12).

**నూలుపండుగ** **1.** పర్యా. చూ. నూలుపున్నమ. శ్రావణ పౌర్ణమి; నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ; కొత్త జంధ్యాలు వేసుకొంటారు; రాఖీలు కట్టుకొంటారు; చౌడేశ్వరికి జ్యోతి ఉత్సవం చేస్తారు; అగ్నిగుండంలో నడవటం, గంగపూజ చెయ్యటం; ఆనందం వేయటం మొ.వి చేస్తారు (తె. 20); **2.** జనుము కోతకు వచ్చిన తరవాత, నారవడకటం మొదలుపెట్టే రోజున చేసుకొనే పండుగ; కొత్తధాన్యం దంచి, అన్నంవండి, పచ్చకూర(=ఆకుకూర)లు వండి, పచ్చళ్ళుచేసి ఇంట్లో దేవుడికి నైవేద్యంచేసి, టెంకాయకొట్టి మొక్కుకొంటారు (తె. 25).

**నూలుపున్నమ** పర్యా. జంధ్యాలపండుగ, జంధ్యాల పౌర్ణమి, నూలుపండుగ(1), రాకీ(ల)పున్నమ, శ్రావణ పౌర్ణమి; నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ; కొత్త జంధ్యాలు వేసుకొంటారు; రాఖీలు కట్టుకొంటారు; చౌడేశ్వరికి జ్యోతి ఉత్సవం చేస్తారు; అగ్నిగుండంలో నడవటం, గంగపూజ చెయ్యటం, ఆనందం వేయటం మొ.వి చేస్తారు. (తె. 6, 8-10, 18, 21, 23 25, 26, 28, 29; రా. 16, 17).

**నూలుపెట్టె** ఉ. -పెట్టి; పర్యా. పద్దు, మిల్లునూలు కట్ట; ఏ నెంబరు నూలో అన్ని లడీలు(=పిళ్ళు)పెట్టెలో ఉంటాయి; సామాన్యంగా పదిపౌన్లు ఉంటుంది (కో. 1-10, 22-31; తె. 1-25, 29, 31, 32; రా. 6, 13, 15-18, 23, 24).

**నూలుపోయు** (క్రి.) **1.** పర్యా. చూ. తోడు(1). పంటెకుగాని, డబ్బాకుగాని నూలుచుట్టటం (కో. 27; తె. 18, 19, 22, 23); **2.** పర్యా. ఆసుపోయు. ఆసుగొట్టంలోకి పోసు తీసుకొని ఆసుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చెయ్యటం (రా. 1-5, 8).

**నూలుబరిగ** పర్యా. చూ. పేకకట్టె. గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టినకర్ర; దీన్ని పేకగొట్టంలో దూరుస్తారు. చూ. చిత్రం 319(తె. 6, 9).

**నూలుబుడ్డి** పర్యా. చూ. డబ్బా(1). పంటెకు బదులు నూలుచుట్టుకొనే రేకుడబ్బా; కొన్నిచోట్ల రేకు పట్టెలు బిగించింది; కొన్నిచోట్ల కొయ్యది. చూ. చిత్రం 30 (కో. 6; రా. 11).

**నూలురాటం** ఉ. నూల్రాటం; పర్యా. చూ. కండెల రాట్నం. పేకకు పనికివచ్చే దారపుకండెలుచుట్టే రాట్నం; మామూలుగా రాట్నం మీదనే కండెలు చుడతారు. చూ. చిత్రం 53 (రా. 17).

**నూలులంగ్గా** పట్టుదారం చిలప (కో. 14).

**నూలువిసురు** (క్రి.) పర్యా. చూ. ఆసుపోయు. ఆసుగొట్టంలోకి పోగుతీసుకొని ఆసుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చెయ్యటం (కో. 36).

**నెత్తిచెరగు** తలమీద కప్పుకొనే చీరకొంగు(రా. 24).

**నెప్తాల్** ఉ. నత్తాల్, నప్తాలు, నాప్టల్, నాప్తల్, నాప్తాల్, నెత్తాల్, నెత్తాలు, నెప్టల్, నెప్తాలు, నెప్తోల్, నైప్తోల్, మెత్తాల్, మెత్తోల్; పర్యా. తడి రంగు(1). చన్నీళ్ళలో కలిపి, నూలుకు వేసే రంగు; కెంపు, లాకీ, మామిడిచిగురు, తెమను, చేమంతి, తొగరు మొ.వి; నూలులడీలు ఈ రంగునీళ్ళలో, మామూలుగా రెండుమూడుసార్లు పిసుకుతారు; రంగు అట్టేకాలం నిలబడదు (కో. 2, 5-8, 11-21; తె. 1, 5-9, 12, 17, 18, 21, 22, 24-33; రా. 11, 12, 15, 23).

**నెమలంచుపేటు** పర్యా. నెమలిపేటు. నెమలి ఆకారంలో బొమ్మలు పడేట్టు నేసిన డిజైను (తె. 21).

**నెమలి(అంచు)** ఉ. నమిలిఅంచు, నెమిలి(అంచు); పర్యా. నెమలిబోర్డరు. నెమలి ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు; కొన్నిచోట్ల, ఒక కొలికి రంగు దారంపెట్టి, తరవాత బనారస్(=పటవాలునేత)నందు, కటారి, ముచ్చెర, నందు, కటారి, చిగురు వరసగా వచ్చేట్టు నేస్తారు. చూ. చిత్రం 259 (తె. 13, 14, 17).

**నెమలికంఠంచీర** నిలువుకు కెంపు, అడ్డానికి పచ్చ రంగుపెట్టి నేసిన కలనేతచీర; నెమలికంఠంచీర (కో. 9; తె. 2).

**నెమలికండ్లచాపు** ఉ. నమలికండ్లసాపు. అంచుల మధ్య, నెమలికండ్ల ఆకారంలో డిజైను నేసిన రెండు పంచెలు; చాపు (తె. 16).

**నెమలికండ్లధోవతి** ఉ. నవిలికండ్ల దోవతి. అంచుల మధ్యభాగంలో, నెమలికండ్ల మాదిరి డిజైన్లు నేసినపంచె (తె. 12).

**నెమలికన్నంచు** ఉ. నమిలికన్నంచు, నెమలి కన్నంచ; రూ. నెమిలికండ్లంచు. నెమలికన్ను ఆకారంలో డిజైను నేసిన అంచు; మామూలుగా డైమను గళ్ళు ఒకదాంట్లో ఒకటి పెట్టినట్లు నేస్తారు. చూ. చిత్రం 204 (కో. 11,20,23; తె. 5,13,15 25; రా. 1, 18).

**నెమలికన్నుచీర** నీలం, పచ్చవన్నెల్లో నేసిన కలనేత చీర (కో. 4).

**నెమలికన్నునేత** బట్ట అంచులోగాని, కమ్మిలో గాని నెమలికన్ను మాదిరి నమూనాలు పడేట్టు నేసిన నేత (తె. 1).

**నెమలికన్నుపేటు** ఉ. నెమ్మికన్నుప్లేటు. నెమలి కన్ను ఆకారంలో(అంచులో) నేసిన ఒకరకం డిజైను; మామూలుగా, డైమనుగళ్ళు ఒకదాంట్లో ఒకటి పెట్టి నట్లు నేస్తారు. చూ. చిత్రం 204(తె. 25; రా. 7, 19ఎ).

**నెమలిచెట్టుపేటు** చెట్టుదగ్గర నెమలి ఉన్నట్టు, అంచులో నేసిన డిజైను. చూ. చిత్రం 259 (రా. 8).

**నెమలిఫింఛంచీర** నిలువుకు నీలం, అడ్డానికి పచ్చ రంగులుపెట్టి నేసిన చీర (కో. 9).

**నెమలిపేటు** పర్యా. నెమలంచుపేటు. నెమలి ఆకా రంలో బొమ్మలుపడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 259 (కో. 16, 20; రా. 8).

**నెమలిబోర్డరు** పర్యా. నెమలి(అంచు). నెమలి ఆకా రంలో డిజైనుపడేట్టు నేసిన అంచు; కొన్నిచోట్ల, ఒక కొలికి రంగుదారం పెట్టి, తరవాత జనారన్(=పటవాలు నేత), సందు, కటారి, ముచ్చెర, సందు, కటారి, చిగురు వరసగా వచ్చేట్టు నేస్తారు. చూ. చిత్రం 259 (రా.24).

**నెమలిబ్లూ** నెమిలిబులుగు. ఒకరకం నీలం రంగు; నేవీబ్లూ. చూ. చిత్రం 288 (కో. 2, 6, 7; రా. 7).

**నెమిలంచుబేలు** అంచులో నేసే నెమలి డిజైను (తె. 21).

**నెమిలికండ్లంచు** ఉ. నమిలికండ్లంచు; చూ. నెమలి కన్నంచు (తె. 14, 17).

**నెంబరునూలు** ఉ. నెంబర్నూలు; పర్యా. చూ. మిల్లునూలు. మిల్లులో తయారయిన నూలు; నెంబరు పెరిగేకొద్దీ నూలు నాణ్యం పెరుగుతుంది; పదోనెంబరు నూలు ముతగ్గా ఉంటుంది; రెండు వందల పథయ్యో నెంబరు నూలు నాణ్యాం (సన్నదనం, పురి మొ.వి) (కో. 6; రా. 20).

**నెరుపు** (క్రి.) చాపిన పడుగుపోగులు పడుగేరు కర్రలమీద పరవటం (కో. 19).

**నెరిగిపోవు** (క్రి.) హెచ్చుతగ్గులుగా ఉన్న పడుగు చదునుకావటం; అల్లుచేసేటప్పుడు, పడుగును చువ్వతో కొట్టి చదును చేస్తారు (కో. 37).

**నెరుపుపెట్టు** (క్రి.) పర్యా. చూ. దిద్దకంపెట్టు. అచ్చుకట్టిన తరవాత, అచ్చుక్రమీది వడిదారం మెలిక (=పూస)లు కొమ్ముబిళ్ళతో రుద్దుతూ చదునుచెయ్యటం (రా. 5).

**నెరువు** నేతలో అడ్డం; వెడల్పు (తె. 3, 13, 15).

**నెలగొయ్య** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గం మీద నేతబిర్రుపెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపని వాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 9ఎ).

**నేజ్రేఅంచు** బొటనవేలెడు వెడల్పునేతలో రెండు రంగులు వచ్చేట్టు నేసిన అంచు (కో. 7).

**నేత 1.** మగ్గానికి అమర్చిన పడుగులో పైపోగులకు, కింది పోగులకు మధ్య పేకదారం వేసి బట్ట తయారు చెయ్యటం; నేసేపని (కో.; తె.; రా.); **2.** (-చాపు). పర్యా. చూ. నేతసాగు(2). మగ్గానికి అమర్చి, నేత బయలులో చాసిన పడుగునూలు. చూ. చిత్రం 127.17 (తె. 12, 13); **3.** నేయవలసిన పడుగు; నేసిన బట్ట (రా. 1).

**నేతఎచ్చు** (క్రి.) పర్యా. చూ. నేతపెరుగు. బట్టకు ఒకవైపు నేత ఎక్కువ కావటం; రెండోవైపు తగ్గుతుంది (కో. 25, 26).

**నేతకత్తి** పర్యా. చూ. కత్తి(3). నవారు నేసే టప్పుడు, పడుగులో వేసిన పేకపోగు దట్టించే కొయ్య పనిముట్టు; కత్తిమాదిరిది. చూ. చిత్రం 324 చ. 4 (తె. 6).

**నేతకండె** పర్యా. చూ. కండె(2). రాట్నంమీద జొన్నదంటు ముక్కకు చుట్టిన నూలు; పేకకు వాడే నూలు కండెలుగా చుడతారు; నేతనేసేటప్పుడు, దీన్ని నాడెగాడిలో అమరుస్తారు. చూ. చిత్రం 51 (కో. 9; తె. 12; రా. 21).

**నేతకుంగు** (క్రి.) పర్యా. తచ్చు, నేతవిరుగు. బట్టకు ఒకవైపు నేత తక్కువ కావటం; రెండోవైపు ఎక్కు వవుతుంది (కో. 27, 28, 35).

**నేతకొమ్ము 1.** పర్యా. చూ. నాడె(1). నేతనేసే టప్పుడు, పడుగు పైపోగులకు కిందిపోగులకు మధ్యవేసే పేకదారంకండె అమర్చిన పనిముట్టు; గేదెకొమ్ము, కొయ్య, వెదురుగొట్టం మొ. వాటితో చేస్తారు. చూ. చిత్రం 131 (రా. 11, 13); **2.** పర్యా. చూ. చేతి నాడె. పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్య వేసే పేకదారంకండె అమర్చి, చేత్తో విసిరే నాడె; గేదె

కొమ్ముతో చేసింది; చూ. నాడె. చూ. చిత్రం 131 వ (రా. 11).

**నేతకోయు** (క్రి.) నేసినబట్ట(=నేత) మగ్గం మీది నించి తీసేముందు "బద్దె" వదలి కొయ్యటం (రా. 1).

**నేతగాడు** నేతపని చేసేవాడు; weaver (కో. 7; రా. 17).

**నేతగాను** పర్యా. చూ. పెడకోల చెక్రం. పెడ కోలను మోసే కొయ్యచెక్రం; ఇటువంటివి రెండుం టాయి; నేతమోకులు వదులు చేసినప్పుడు, పడుగు నేలకు తగలకుండా పెడకోల చెక్రాలమీద జరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129 వ. 1 (కో. 7).

**నేతగొట్టం** పర్యా. చూ. పేకగొట్టం. గొంగడి నేసే టప్పుడు మగ్గానికి బిగించిన ఉన్నిపడుగులో పేకదారం వెయ్యటానికి దూర్చే వెదురుగొట్టం; లావుది; దీంట్లో పేకదారం చుట్టినకర్ర దూరుస్తారు; ఈ గొట్టం(బెజ్జం) లోనుంచి పోగు బయటికి వస్తుంది. చూ. చిత్రం 318 (తె. 10, 20, 25).

**నేతచివ్వ** ఉ. నేచ్చివ, నేత్సివ. దండెదగ్గర పడుగు పోగులు నెరపటానికి, అచ్చుదగ్గర నేతపడుగులో దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి, దండెకు రెండువైపులా ఉంటాయి; నేత అవుతున్నకొద్దీ వాటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127.3 (కో. 27-32).

**నేతచెక్రం** పర్యా. చూ. పెడకోలచెక్రం. పెడ కోలను మోసే కొయ్యచెక్రం; ఇటువంటివి రెండుం టాయి; నేతమోకు వదులు చేసినప్పుడు, పడుగు నేలకు తగలకుండా పెడకోల చెక్రాలమీద జరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129 వ. 1(కో.7).

**నేతతగిలించు** (క్రి.) నేతపడుగు మగ్గానికి తగిలిం చటం (కో. 32).

**నే(త)తాడు** ఉ. నేత్తాడు. **1.** పర్యా. చూ. నేత మోకు. మగ్గంమీద, నేతపడుగును బిర్రుపెట్టే లావుపాటి తాడు; ఒకవైపు పెడకోలకు మధ్యగా కట్టి, మిడిగూటా నికి మెలివేసి, రెండోవైపు చేతిగూటానికి కడతారు; నేత దగ్గరికి రావటానికి వదులుతారు; వెనక్కు జరగ టానికి బిగలాగుతారు. చూ. చిత్రాలు 122 క. 1, 127.15 (కో. 9, 14, 16, 18, 22, 27, 28, 31; తె. 7, 9-12, 14-27, 29-33; రా. 24); **2.** పర్యా. నేతపగ్గపుతాడు, మగ్గం(పు)తాడు. గొంగడినేసే మగ్గం బిగించేతాడు; దీన్ని చివర, ఊడుగోలకు కట్టి, తల గూటానికి చుట్టి చేతిదగ్గర గూటానికి బిగిస్తారు; కొన్ని చోట్ల, తట్టుగూటం దగ్గరినించి గుంజుతారు. చూ. చిత్రం 315 క. 16 (తె. 20, 22, 25).

**నేతదిగిపోవు** (క్రి.) నేతపూర్తికావటం (కో. 26).

**నేతదిగ్గోయు** (< –దిగ+కోయు) నేతబట్ట చివర కచ్చికోసి మగ్గం మీదినించి తీసివెయ్యటం; అచ్చులో బద్దె మిగిల్చి తక్కింది కోసివేస్తారు (కో. 36).

**నేతనాడె** ఉ. –నాడి; పర్యా. చూ. నాడె(1). నేతనేసేటప్పుడు, పడుగు పైపోగులకు కింది పోగులకు మధ్యవేసే పేకదారంకండె అమర్చిన పనిముట్టు; గేదె కొమ్ము, కొయ్య, వెదురుగొట్టం మొ.వాటిలో చేస్తారు. చూ. చిత్రం 131 (కో. 36).

**నేతపగ్గపుతాడు** పర్యా. నేతతాడు(2). గొంగడి నేసే మగ్గం బిగించే తాడు; దీన్ని చివర, ఊడుగోలకు కట్టి తలగూటానికిచుట్టి; చేతిదగ్గర గూటానికి బిగి స్తారు; కొన్నిచోట్ల, తట్టుగూటం దగ్గరనించి గుంజు తారు. చూ. చిత్రం 315 క. 16 (తె. 27).

**నేతపలక** **1.** చేతిమగ్గంపన్నె బిగించిన పై చెక్క; చూ. పలక (కో. 29, 30, 33, 34, 36, 37; తె. 18-23, 29, 31-33); **2.** మరమగ్గంలో పన్నె బిగించిన కొయ్యచట్రం; దీనికి పైన పలక, కింద పానుపుపట్టె ఉంటాయి; చూ.మగ్గంచట్టం. చూ. చిత్రం118(తె.18).

**నేతపెరుగు** (క్రి.) పర్యా. అంచపెరుగు, నేతఎచ్చు. బట్టకు ఒకవైపు నేత ఎక్కువకావటం; రెండోవైపు తగ్గుతుంది (కో. 32, 34, 35).

**నేతబయలు** ఉ. నేతబయిలు; పర్యా. మగ్గంబయలు ఇంట్లో, నేతపనికి కేటాయించిన చోటు; ఇక్కడ, మగ్గం అమరుస్తారు. చూ. చిత్రం 106 (రా. 11, 14-16, 23).

**నేతముల్లు** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్ని చోట్ల, ఇనపపుల్ల: కొండి. చూ. చిత్రం 121 క. 4 (కో. 29).

**నేతమోకు** పర్యా. నేతతాడు(1), తీపుతాడు(2), పల్లుచెక్రంతాడు, బటువుతాడు, మగ్గంతాడు(2), మగ్గంమోకు, మోకు(2). మగ్గంమీద నేతపడుగును బిర్రుపెట్టే లావుపాటి తాడు; ఒకవైపు పెడకోలకు మధ్యగా కట్టి, మిడిగూటానికి మెలివేసి, రెండోవైపు చేతిగూటానికి కడతారు; నేత దగ్గరకు రావటానికి మోకు వదులుతారు; వెనక్కు జరగటానికి బిగలాగు తారు. చూ. చిత్రాలు 121 క. 1, 127.15 (కో. 3, 5-8, 9ఎ, 9బి, 10, 12, 21, 25, 26, 29, 30, 32, 33, 35–37; తె. 2-5, 13; రా. 1, 7-19బి, 22-24).

**నేతలాక** పర్యా. పెద్దలాక(1), మగ్గంలాక, లాక (5), సూక(2). నేతపడుగులో పైపోగులకు, కింది పోగులకు మధ్య దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 127.6 (కో. 5, 22, 30; తె. 19, 33; రా. 15, 16, 18).

**నేతవాడిచేయు** (క్రి.) ?మగ్గందగ్గర శుభ్రంచేసి, నేత మొదలుపెట్టటానికి మగ్గం సిద్ధం చేసుకోటం (కో. 36).

**నేతవిరుగు** (క్రి.) పర్యా. చూ. నేతకుంగు. బట్టకు ఒకవైపు నేత తక్కువ కావటం; రెండోవైపు ఎక్కువవుతుంది (కో. 32, 34).

**నేతసందు** పర్యా. వాయి(3). నేసిన బట్టదగ్గరి నుంచి, పన్నెవరకూ మగ్గంమీద ఉన్న పడుగు (రా. 11).

**నేతసాగు 1.** ఉ. నేచ్చాగు; రూ. నేసాగు; పర్యా. చుట్టనేత, నేత(2), జారు(4), మలసాగు(1), సాగు(3). మగ్గానికి అమర్చి, నేతబయలులో చాపిన పడుగునూలు. చూ. చిత్రం 127.17 (తె. 25). **2.** దండెదగ్గరినించి చివరివరకూ చాపిన పడుగునూలు (తె. 31).

**నేతసులిగె** ఉ. నైచ్చులిగె; పర్యా. కరికంబ, గొట్టం (6). గొంగడినేత చివరికి వచ్చినప్పుడు-మూరెడు మిగిలిన-పడుగులో వేసే దారం దూర్చిన చిన్నగొట్టం; పేకగొట్టంకంటె చిన్నది; బెత్తెడు పొడుగుది; పేకగొట్టం తీసేసి ఇది ఎక్కిస్తారు; దీని పై బెజ్జంలోనుంచి పోగు బయటికి వస్తుంది (తె. 22).

**నేదంచుచీర** రెండేసి కొలుకుల చొప్పున పసుపు, ఎరుపు పోగులు ఎడంఎడంగా వచ్చేట్టు నేసినచీర (కో. 33).

**నేయు** (క్రి.) మగ్గానికి అమర్చిన పడుగులో పేకదారం(=నాడెపోగు)వేసి బట్ట తయారు చెయ్యటం (కో., తె., రా.).

**నేరేడి(పండు)** పర్యా. చూ. నేరేడువన్నె. ఒకరకం నీలంరంగు; నలుపు, ఊదా కలిసినరంగు; నల్ల(నీటి) వంకాయకంటె ఒకవన్నె తక్కువ రంగు (కో. 20, 24).

**నేరేడుపండుచీర** నల్ల నేరేడుపండు రంగు చీర (కో. 20).

**నేరేడువన్నె** పర్యా. జామ్లా, నేరేడి(పండు). ఒకరకం నీలంరంగు; నలుపు, ఊదా కలిసినరంగు; నల్ల(నీటి) వంకాయరంగుకంటె ఒకవన్నె తక్కువ రంగు (కో. 31).

**నేరేడువన్నెకోక** నల్ల నేరేడు పండు రంగు చీర (కో. 31).

**నేర్పు** (క్రి.) సమంగా పరవటం; నెరపటం(తె. 17).

**నేలగుంజ** పర్యా. చూ. గూటం(3). ఊడ్డెను నిలబెట్టి తాడుతో బిగించటానికి, నేలలో పాతిన గూటం; ఇనపదిగాని, కొయ్యదిగాని, రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7 (తె. 20).

**నేసకం** బట్ట నెయ్యటం; నేత (తె. 4).

**నేసాగు** చూ. నేతసాగు(1). (తె. 32).

**నైమతువన్నె** ఉ. నైమతొన్నె. చైకిలెట్టువన్నె మాదిరి రంగు (రా. 24).

**నైవీబ్లూ** ఉ. నెయిబులుగు, నెవిబ్లూ. ఒకరకం నీలంరంగు; తెలుపు చాయ కలిసింది; నెమలిబులుగు. చూ. చిత్రం 288 (కో. 7, 8; తె. 4).

**నైట్రాస్** అద్దకంరంగు తయారు చెయ్యటానికి, ముడిరంగులో కలిపే ఒకరకం రసాయనం; నూలుకు, రంగు బాగా పట్టటానికి వేస్తారు; Nitric acid (తె. 23, 29, 30).

**నొక్కుడునేత** ఉ. నొక్కుణ్ణేత. ఒకరకం నేత; నేత నేసేటప్పుడు, పావుచెక్క తొక్కి అనిలో పేకపోగు బాగ గట్టిగా నొక్కి ఎడంఎడంగా వేస్తారు; మామూలుగా, సిల్కు నేతలో పోగులు ఎడంగా వేస్తారు; బట్ట వెలితిగా వస్తుంది (కో. 17).

**నోరు** పర్యా. చూ. చీరె. రాట్నం'బొమ్మ'లో వడిదారం తిరగటానికి చెక్కిన గాడి. చూ. చిత్రం 15.11 (తె. 23.)

**నౌసారిపత్తి** పసెలు ఒక అంగుళం పొడుగు ఉండే పత్తి; 20-40 నెం. ఖద్దరు నూలుకు పనికివచ్చేది; ఈ పత్తి సౌరాష్ట్ర ప్రాంతంనుంచి తెచ్చిందట (తె. 28).

## ప

**పక్కకొయ్య** పర్యా. చూ. తట్టు(డు)కొయ్య. మిడిగూటానికి వేసిన నేతమోకు, పడుక్కు అడ్డు రాకుండా తగిలించటానికి పాతిన గూటం; మామూలుగా మిడిగూటానికిగాని, దండెకుగాని కొంచెం ఎడంలో వేస్తారు. చూ. చిత్రం 127.14 (కో. 24-26, 28).

**పక్కగుది** పర్యా. చూ. ఊడ్డెగుది(2). పడుగు చాపేటప్పుడు, ఊడ్డె అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63.8 (కో. 33, 36).

**పక్కచిల్ల** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్పు బద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 9బి).

**పక్కజల్లి** పర్యా. పక్కదొడ్డి. అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి, మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో పక్కతాళ్ళు దూర్చిన ఈనెల చట్రం; పన్నెమాదిరిది; నేత పడుగు అంచుకు, సరిగా పైన ఉంటుంది; ఇటువంటివి రెండుపక్కలా ఉంటాయి. చూ. చిత్రం 134 చ. 2 (కో. 37).

**పక్కతాడు 1.** పర్యా. చూ. చెంపతాడు(3). చేతిమగ్గం పలకను, గుండును కలిపి బిగించిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 1

(కో. 29; తె. 23); **2.** పర్యా. చూ. ఉపతతాడు. మగ్గంఉడతకు, పైన కట్టిన దారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (కో. 17, 23); **3.** పర్యా. చూ. పలకసూత్రం. చేతిమగ్గం పలకను పైనుంచి వేలాడదియ్యటానికి పలకబుజానికి కట్టిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 6 (కో. 34); **4.** పర్యా. చూ. చెంపతాడు(4). కుచ్చుతాళ్ళతో డైమనుతాడుకు ఒకవైపు కట్టిన దారం; దీన్నిపైన మగ్గం నిలువుపట్టెకూ, కింద ఉడత(తాడు)కూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.23 (కో. 22; తె. 28; రా. 20).

**పక్కదారం** పర్యా. చూ. చెంపతాడు(4). కుచ్చుతాళ్ళలో డైమను తాడుకు ఒకవైపు కట్టిన దారం; దీన్నిపైన మగ్గం నిలువుపట్టెకూ, కింద ఉడత(తాడు)కూ కడతారు. ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.23 (రా. 14).

**పక్కదొడ్డి** పర్యా. పక్కజల్లి. అంచులో డిజైన్లు పడటానికి, మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో పక్కతాళ్ళు దూర్చిన ఈనెలచట్రం; పన్నెమాదిరిది; నేత పడుగు అంచుకు, సరిగా పైన ఉంటుంది; ఇటువంటివి రెండుపక్కలా ఉంటాయి. చూ. చిత్రం 134 చ. 2 (కో. 33).

**పక్కపన్నె** పర్యా. జల్లెడ(2). వేటుపన్నెలో, రెండు పాయలుగా విడదీసిన వేటుదారాలను అంచు పడుగులోకి వేలాడదియ్యటానికి, పక్కగా అమర్చిన చిన్నపన్నె; ఈనెలచట్రం. చూ. చిత్రం 132 చ. 9 (కో. 7).

**పక్కపోటు** (-వేయు) నేతలో ఒకవైపు ఎక్కువ, మరొకవైపు తక్కువ వచ్చినప్పుడు పోగులు మళ్ళించి. రెండోసారి నాడెవేసి నెయ్యటం (కో. 31).

**పక్కబద్ద** పర్యా. చూ. నిలువుబద్ద(1). రాటి ఆకులను కలిపే నిలువుపుల్ల(లు); కొన్నిచోట్ల, తాళ్ళు వాడతారు. చూ. చిత్రం 31 క. 4 (కో. 26).

**పక్కబొమ్మ** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం పొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (తె. 33).

**పక్కారంగు** **1.** వెలిసిపోని రంగు; గట్టిరంగు; మామూలుగా, వేణ్ణీళ్ళలో ఉడకబెట్టింది; ఇండెంత్రీన్, నెప్తాలు రంగుల్ని అంటారు (కో. 15, 19, 21; తె. 3, 8); **2.** ద్రావకం ఎక్కువవేసి తయారు చేసిన రంగు; చూట్టానికి, "కొట్టొచ్చినట్టు" ఉంటుంది; ఎక్కువ కాలం నిలబడుతుంది (కో. 16).

**పక్షర్** పన్నెకట్టే జంత్రం బొమ్మ బెజ్జంలో, బొంగును బిగించటానికి దూర్చే చిన్నబద్ద; పన్నెగట్టు సాయెబుల వాడక. చూ. చిత్రం 89 క. 3 (కో. 7).

**పగడసారవల్లె** ఉ. పగడసారవల్లె. ఒకరకం చిన్న చీర(=వల్లె); నిలువు తెలుపు, పేక ఎరుపు వేలెడేసి వెడల్పున నేసిన చిన్నచీర; పసుచు పిల్లలు కట్టేది(తె. 13).

**పగలగొట్టు** (క్రి.) (పసలి దారం పోగులను) విడదియ్యటం; పేరటం; పడుగులో కర్ర(=పసలికోల) ఎక్కించి పోగులు పేరతారు (తె. 7).

**పగిడిపత్తి** చూ. పమిడిపత్తి(తె. 5, 12; రా. 20, 21).

**పగ్గాలకొరిచెవాళ్ళు** ఉ. పగ్గాలకొరిసోల్లు. చేనేత పనివారికి, పగ్గాలు పేని ఇచ్చే ఒకకెగ; ఎరకలు(రా. 17).

**పంకా** పర్యా. చూ. తలపలక. కమాను(=దూది ఏకే కొయ్యపనిముట్టు)కు ఒకవైపున ఉండే వెడల్పు కొయ్యపలక. విసినెకర్ర ఆకారంలో ఉంటుంది. చూ. చిత్రం 9.2 (కో. 14).

**పంకి** పర్యా. జిగి. పాకం; జిగురు; చింతఅంబలి పాకానికి వచ్చిన తరవాత పొయ్యి మీదినించి దింపుతారు (తె. 9).

**పంగలకర్ర** పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (కో. 8).

**పంగలకొయ్య** పర్యా. చూ. దండెచెవి(1). దండెను మోసే పంగలకొయ్య; కొన్నిచోట్ల రాయి; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 126.1 (రా. 19).

**పంగలముద్దు** నూలు చుట్టేటప్పుడు పంటెము కుక్క మోపటానికి పంగలకొయ్య బిగించిన మొద్దు; చేతిమొద్దు (తె. 17).

**పంగలిపుల్ల** కండెలు చుట్టేటప్పుడు, నూలుడబ్బా తగిలించే ఒకరకం పుల్ల (కో. 15).

**పంగి** (-వచ్చు) పర్యా. సరిపంగి. పడుగులో పైపోగులూ కింది పోగులూ కలవకుండా ఉండటం; కచ్చులు వేస్తే(సరి)పంగి వస్తుంది (తె. 5).

**పచ్చ** **1.** (-తిప్పు) చూ. పచ్చం(4) (తె. 30); **2.** పర్యా. చూ. పసుపు(రంగు). పచ్చి పసుపురంగు; పసుపుకొమ్ముల పొడిరంగు (రా. 3).

**పచ్చకాటు** బంతిపువ్వుపన్నె (తె. 23).

**పచ్చడం** **1.** రూ. పసడం, పసరం; పర్యా. మడతసెల్లా. ఒంటి మీద కప్పుకోటానికి నేసిన ఒకరకం(ముతక) బట్ట; రెండు పొరలు(=మడత)గా నేసిన దుప్పటి; కొన్నిచోట్ల, ఆరో నెంబరు నూలుపెట్టి, రెండువేళ్ళ వెడల్పు బొద్దంచులూ కమ్ములూ నేస్తారు(తె. 13, 16, 24; రా. 15); **2.** చూ. దుప్పటి (తె. 12; రా. 17).

**పచ్చపంచె** ఉ. -పంటి; పర్యా. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి; చూ. రాటి; దేవాంగుల వాడుక. చూ. చిత్రం 34 (కో. 7).

**పచ్చపువ్వాకు** చూ. పచ్చపొగాకు(1) (తె. 5).

**పచ్చం** (< సం. పక్ష-) ఉ. పచ్చాం. **1.** అరవై మూరలనేత; శాల్తీ; a unit of thirty yards(కో.6); **2.** నాలుగు చీరలుగాని ఎనిమిది పంచెలుగాని; ఒకే నేతలో దిగినవి (కో. 7); **3.** మూడు చీరలు; ఒకే నేతలో దిగినవి (కో. 10); **4.** (-వేయు) రూ. పచ్చ(1). పర్యా. చూ. పలక(5). మగ్గంమీద, నేతగుడ్డ చుట్టే నలుపలకల దోనెలో ఒకవైపు. చూ. చిత్రం 123క. 6 (తె. 21, 24).

**పచ్చరం 1.** చూ. పచ్చడం(1) (తె. 4; రా. 13, 14, 23); **2.** చూ. దుప్పటి (రా. (18).

**పచ్చ(రంగు)** పర్యా. ఆకుపచ్చ. చెట్ల ఆకులరంగు; రెడ్. ఆర్. సి., పటిక, తేజాపు, నైట్రేట్ సోడాలు వేసి (ఇక్కడికి నింబోలి రంగు వస్తుంది), తరవాత పచ్చ రంగు, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేసి తయారు చేస్తారు (కో. 2, 7, 8, 22, 23, 30, 36, 37; తె. 4, 5, 12-15, 17-20; రా. 11, 14-16, 19, 22).

**పచ్చాకు** చూ. ఆకుపచ్చ (కో. 9).

**పచ్చినూలు** పర్యా. కోరా(నూలు). చలవ చెయ్యని ముడినూలు; unbleached yarn; ఇది గోధుమ రంగులో ఉంటుంది (కో. 2, 30, 35).

**పచ్చిపడుగు 1.** గంజిపెట్టిన పడుగు (కో. 9ఎ; తె. 16; రా. 11); **2.** గంజిపెట్టని పడుగు (కో. 10).

**పచ్చిపొగాకు 1.** రూ. పచ్చపువ్వాకు; ఒకరకం ఆకుపచ్చరంగు; రెడ్. ఆర్. సి., పటిక, తేజాపు, నైట్రేట్‌సల్ఫ్ వేసి నింబోలిరంగు తయారుచేసి, దాని మీద ఆలివ్‌గ్రీన్, బి. 800, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేస్తే వచ్చేది. చూ. చిత్రం 288 (తె. 4, 11); **2.** ఆకుపచ్చలో నలుపువన్నె (తె. 12, 15).

**పచ్చిమామిడికాయ** ఉ. పచ్చిమామిడికాయి. **1.** ఒకరకం ఆకుపచ్చ రంగు. (కో. 4, 6, 10, 15); **2.** ఆకుపచ్చలో నీలంవన్నె కలిసిన రంగు (కో. 7, 9బి, 12); **3.** పచ్చిపొగాకు రంగు (కో. 9); **4.** పంచలోహాల మాదిరి రంగు (కో. 13). **5.** ఆలివురంగు (కో. 14).

**పచ్చిరంగు(లు) 1.** నీళ్ళలో కలిపి ఉడకబెట్టే రంగు(లు) (కో. 13); **2.** చన్నీళ్ళలో వేసి నూలు పిసికే రంగులు (కో. 14).

**పచ్చీసుకణాలు** చూ. పచ్చీసుకానాలు (తె. 14).

**పచ్చీసుకండ్లచీర** నేతలో నిలువు, అడ్డం నలభయ్యేసి రంగు కొలుకులుపెట్టి నేసిన మామూలు గడి చీర (తె. 21).

**పచ్చీసుకండ్లరుమాలు** ఒకరకం తలపాగ; పచ్చీసు గళ్ళ మాదిరిగా నేసింది (తె. 24).

**పచ్చీసుకండ్లు** పర్యా. పచ్చీసుగళ్ళు. నేతలో, అయిదు వన్నెలు నిలువుకు, అయిదు వన్నెలు అడ్డానికి వచ్చేట్టు రంగుదారాలతో నేసిన గళ్ళు. చూ. చిత్రం 205 (తె. 19).

**పచ్చీసుకానాలు** (< హిం. -ఖానా). రూ. పచ్చీసు కణాలు; పర్యా. చూ. పచ్చీసుగళ్ళచీర. ఒకరకం గళ్ళచీర; పచ్చీసుల ఆట ఆడుకొనే గళ్ళ నమూనా; జువ్వికాయగడి కంటె కొంచెం పెద్దగడి పడేది; కొన్ని చోట్ల, ఒక కొలికి తెలుపు, ఒక కొలికి రంగు చొప్పున పడుగు పోగులుపెట్టి, అంచుల మధ్యభాగంలో చదరపు అంగుళంమేర గడి పడేట్టు నేస్తారు; కొన్నిచోట్ల, అంచులు కుప్పడం పట్టి నేస్తారు; కొన్నిచోట్ల, బొటనవేలెడు వెడల్పు తెలుపు రంగు పట్టెల్లో, గళ్ళుపడేట్టు నేస్తారు. కొన్ని చోట్ల తెలుపు, ఎరుపుల మధ్య వేరే తెల్ల కొలికి పడేట్టు గళ్ళుగళ్ళుగా నేస్తారు; ఖానా అంటే గడి.(తె. 11).

**పచ్చీసుగడి** అయిదు రంగులు పెట్టి నేసిన ఒకరకం గడి (కో. 32).

**పచ్చీసుగళ్ళకోక** పర్యా. చూ. పచ్చీసుగళ్ళచీర. ఒకరకం గళ్ళచీర; పచ్చీసుల ఆట ఆడుకొనే గళ్ళ మాదిరి నమూనా; జువ్వికాయగడి కంటె కొంచెం పెద్ద గడి పడేది; కొన్నిచోట్ల, ఒక కొలికి తెలుపు, ఒక కొలికి రంగు చొప్పున పడుగుపోగులు పెట్టి, అంచుల మధ్య భాగంలో చదరపు అంగుళం మేర గడి పడేట్టు నేస్తారు. కొన్నిచోట్ల, అంచులు కుప్పడం పట్టి నేస్తారు. కొన్ని చోట్ల బొటనవేలెడు వెడల్పు తెలుపు, రంగు పట్టెల్లో గళ్ళుపడేట్టు నేస్తారు; కొన్నిచోట్ల తెలుపు ఎరుపుల మధ్య వేరే తెల్లకొలికి పడేట్టు గళ్ళుగళ్ళుగా నేస్తారు; దీన్నే "మాలపల్లిచీర" అని కూడా అంటారు (కో. 8).

**పచ్చీసుగళ్ళచీర** పర్యా. పచ్చీసు కానాలు, పచ్చీసు గళ్ళకోక, పచ్చీసుమళ్ళు(చీర). ఒకరకం గళ్ళచీర; పచ్చీసుల ఆట ఆడుకొనే గళ్ళ నమూనా; జువ్వికాయ గడికంటె కొంచెం పెద్దగడి పడేది; కొన్నిచోట్ల, ఒక కొలికి తెలుపు, ఒక కొలికి రంగు చొప్పున పడుగు పోగులుపెట్టి అంచులమధ్యభాగంలో చదరపు అంగుళం మేర గడి పడేట్టు నేస్తారు; కొన్నిచోట్ల, అంచులు కుప్పడం పట్టి నేస్తారు; కొన్నిచోట్ల బొటనవేలెడు వెడల్పు తెలుపు, రంగు పట్టెల్లో గళ్ళు పడేట్టు నేస్తారు; కొన్ని చోట్ల తెలుపు ఎరుపుల మధ్య వేరే తెల్లకొలికి పడేట్టు గళ్ళుగళ్ళుగా నేస్తారు (కో. 7, 9).

**పచ్చీసుగళ్ళు** పర్యా. పచ్చీసుకంస్లు. నేతలో, అయిదు పన్నెలు నిలువుకు, అయిదు పన్నెలు అడ్డానికి వచ్చేట్లు రంగుదారాలతో నేసిన గళ్ళు. చూ. చిత్రం 205 (కో. 11).

**పచ్చీసుమళ్ళు(చీర)** పర్యా. చూ. పచ్చీసుగళ్ళ చీర. ఒకరకం గళ్ళచీర; పచ్చీసుల ఆట ఆడుకొనే గళ్ళ నమూనా; జువ్వికాయగడి కంటె కొంచెం పెద్దగడి పడేది; కొన్నిచోట్ల ఒక కొలికి తెలుపు ఒక కొలికి రంగు చొప్పున పడుగుపోగులు పెట్టి అంచుల మధ్య భాగంలో చదరపు అంగుళంమేర గడిపడేట్టు నేస్తారు; కొన్నిచోట్ల, అంచులు కుప్పడంపట్టి నేస్తారు; కొన్నిచోట్ల పోటన వేలెడు వెడల్పు తెలుపు రంగు పట్టెల్లో గళ్ళు పడేట్టు నేస్తారు; కొన్నిచోట్ల, తెలుపు ఎరుపుల మధ్య వేరే తెల్ల కొలికి పడేట్టు గళ్ళుగళ్ళుగా నేస్తారు; మడి అంటే గడి (తె. 13, 15).

**పంచశిలాపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను. చూ. చిత్రం 263 (రా. 12).

**పంచె** **1.** ఉ. పంచి; పర్యా. కట్టుపంచె, ధోవతి. మగవాళ్ళు కట్టుకొనే బట్ట; మామూలుగా పదెనిమిది మూరల పొడుగుది; రెండంచులూ రెండుకమ్ములూ పెట్టి నేస్తారు; మామూలుగా తెలుపుది (కొన్నిచోట్ల రంగుది); అంచుల్లో రంగులు, డిజైన్లు పెట్టి నేస్తారు (కో. 1, 4, 8-11, 15-17, 20 24, 29; తె. 8. 15, 16; రా. 1-7, 10-15, 17, 18, 28, 23, 24); **2.** పర్యా. చూ. పుట్టుపంచె(1). చిన్నవాళ్ళు(మగ వాళ్ళు)కట్టుకొనే పంచె (కో. 2; తె. 25, 32, 33); **3.** పెళ్ళిచీర (కో. 36); **4.** పర్యా. చీర(2). వితంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకం బట్ట; తెల్లటిది; మామూలుగా, 60—100 నెంబరు నూలుతో నేస్తారు; మామూలుగా, ఒక కొలికి మామిడంచు పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల గోరంచు కాని, కడ్డీఅంచు కాని పెట్టి నేస్తారు (కో. 9, 11, 12, 15, 17, 18, 20-22, 29, 32, 34, 35; తె. 32; రా. 16).

**పంచెకమ్మిచీర** చిన్నకమ్మి పెట్టిన చీర (కో. 27, 28).

**పంచెలచాపు** ఉ. పంచెలసాపు, పంచెల్సాపు; పర్యా. చూ. చాపు(5). మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేత బట్ట; బద్దెతో కలిసి ఉన్నది (కో. 4, 5).

**పంచెలజత** ఉ. పంచిలజెత. పర్యా. చూ. చాపు(5). మగవాళ్ళు కట్టుకొనే, రెండుపంచెల నేతబట్ట; బద్దెతో కలిసి ఉన్నది (రా. 15).

**పంజా (-కొట్టు)** ఉ. పంజ. తివాసీ నేసేటప్పుడు, పడుగులో దూర్చిన ఉన్నిదారాల్ని దట్టించటానికి వాడే కొయ్య పనిముట్టు; పులి పంజా మాదిరిది. చూ. చిత్రం 322 క (కో. 16; తె. 10, 17).

**పంజెరం** **1.** పర్యా. చూ. పడక(2). దానికి పైన బిగించిన అనపఊచల చట్రం; దానికోలలు పక్కపక్కకు ఒదులుగా నిలుపుతుంది; రెండు ఊచల సందులోకి ఒక కోల వస్తుంది. చూ. చిత్రం 132 చ. 3 (రా.13); **2.** ఉ. పంజరం; పర్యా. చూ. మగ్గంచట్రం(1). మగ్గంలో. పన్నె, పలక మొ.వి బిగించిన, నాలుగు పట్టెల చట్రం(=ఫ్రేము); మామూలుగా, దీని నిలువు పట్టెలకు కుచ్చుతాళ్ళుకట్టే కొయ్యలు బిగిస్తారు; కింది పట్టెమీద (కండె) నాడె ఆడుతుంది. చూ. చిత్రం 118 (కో. 37).

**పటకర** పన్నె ఈనెలు తీసే పనిముట్టు పట్టకారు; (తె. 2).

**పటవ** చింతఅంబలి పెట్టుకొనే మట్టిముంత(తె.27).

**పటాపటీచీర** ఉ. పటాపటీచీర.**1.** పేకకు ఒకరంగు, పడుగుకు మరొక రంగుపెట్టి నేసిన ఒకరకం గళ్ళచీర; పడుపుగుడ్డ మాదిరిది; ప రంగు పేకపోగు ఆ రంగు పడుగులో కలుస్తుంది (రా. 13); **2.** సాలాకి మాదిరి నేతలో, రెండు గీరల మధ్య ఎడం ఎక్కువగా పెట్టి నేసిన చీర (రా. 14).

**పటాపటీ(లు)** కపిల, కిర్మంజి రంగులు వచ్చేట్టు, పట్టు, నూలు కలిపి నేసిన పెద్ద గళ్ళ చీర(లు) (తె. 5).

**పటిక** ఉ. పటికి; పర్యా. అలంరాయి, అలవురాయి. గడ్డలు గడ్డలుగా దొరికే ఒక లవణం: అద్దకం రంగు తయారీకి మడిరంగులో కలుపుతారు: alum. (రా. 5 11, 22).

**పట్కా** పొడుగు ఎక్కువ, వెడల్పు తక్కువ పెట్టి నేస్తారు; తలకు చుట్టుకొనే బట్ట; చూ. తలపాగ. (తె. 23, 25).

**పట్కారి** పట్టుబట్టలు నేసేవాళ్ళు; ఒకతెగ (తె. 24).

**పట్కారిపంచె** పట్కారివాళ్ళు ఉపయోగించే పంచె; పట్టునూలు చుట్టుకొనేది. చూ. పంచె (తె. 21).

**పట్కారివాండ్లు** పట్టుబట్టలు నేసే సాలీలలో ఒక తెగ (తె. 21).

**పట్కా** ఒకరకం తలపాగా (రా. 23).

**పట్టంచుచాపు** పట్టంచు పెట్టి నేసిన పంచెల జత; వీటిలో ఒకటి పెళ్ళికొడుకు కట్టుకొని, రెండోది బుజం మీద వేసుకొంటాడు (కో. 33).

**పట్టంచాపు** పట్టంచు(=ఒకరకం అంచు)పెట్టి నేసిన రెండు పంచెల(=చాపు); కుప్పడంపట్టి అంచులకు వేరే రంగు దారాలు మలిపి నేస్తారు; ఇటువంటిది, పెళ్ళి కొడుక్కి మామగారు పెడతారు (తె. 13).

**పట్టంచుచీర** పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర; పట్టు అంచుపెట్టి నేస్తారు; తలంబ్రాల చీర (కో. 35; రా. 13).

**పట్టంచుపంచె** రెండువేళ్ళ వెడల్పున, ఒక అంచుకు ఎరుపు, మరొక అంచుకు నీలం రంగులుపెట్టి, చేమంతి పువ్వుపేటు పడేటట్లు నేసిన పంచె; లగ్న సమయానికి పెళ్ళికొడుకు కట్టుకొంటాడు (తె. 15).

**పట్టా** 1. ఉ. పట్ట. నారతో నేసిన గుడ్డ; దీంతో కుంచెదెంపలు కుడతారు (కో. 14; తె. 26, 30, 31); 2. నేతనేసేటప్పుడు, దోనెమీద పరచే క్రేప్వాసుగుడ్డ; చేతి చెమట బట్టకూ బట్టకు పూసిన గంజి నేతపనివాడికీ అంటకుండా పరుస్తారు (తె. 15); 3. పర్యా. గోను తట్టు. రంగుతొట్టెలో పంజెరమీద కప్పిన గోనెగుడ్డ; కొన్నిచోట్ల కంబడిమెత్త కప్పుతారు. దీనిమీద రంగు పోసి, కొయ్యఅచ్చుతో రంగు అద్దుతారు. చూ. చిత్రం 283 క. 3 (కో. 3).

**పట్టాకొంగు** రైలుపట్టాల మాదిరిగా, గీరలు పడేట్లు నేసిన చీరకొంగు (తె. 17).

**పట్టాలశతరంజి** అడ్డంలో, పట్టెలు పట్టెలుగా నేసిన జంపఖానా (తె. 17).

**పట్టి** 1. పర్యా. చూ. అడ్డపీట(1). పత్తిరాట్నం కిందిపీట. చూ. చిత్రం 1.2 (కో. 37); 2. పర్యా. తొక్కుడుపట్టె(1). పత్తి పట్టేటప్పుడు రాట్నం కదలకుండా తొక్కి పట్టటానికి అమర్చిన పట్టె. చూ. చిత్రం 1, 4 (కో. 10); 3. పర్యా. చూ. పిడుపుకర్ర. రంగు అద్దిన నూలు లడీలు (గుంజకు తగిలించి) పిండే కర్ర; గుండ్రటిది; దీన్ని లడీల్లో దూర్చి మెలిపెడతారు; దీంతో పోగులు విదిలిస్తారు; కొన్నిచోట్ల, రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. చూ. చిత్రం 282 క. 5 (తె. 24); 4. ఉ. పట్టీ; పర్యా. చూ. ఆకు(7). డబ్బా రాట్నం చక్రానికిచుట్టూ అమర్చిన సాపుచెక్క(లు). చూ. చిత్రం 41 క. 1 (తె. 22).

**పట్టిమునేత** చీర కమ్మిలో ముందు, అడ్డపట్టెలు పడేటట్లు నేసిన నేత (రా. 17).

**పట్టీఅంచు** రెండుమూడు రంగుల్లో గీరలు పడిన అంచు (కో. 34).

**పట్టీతాడు** పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టే తాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు పటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (తె. 22).

**పట్టు** పర్యా. రేషం(1), రేషన్(1), సిల్కు(1). పట్టుపురుగుల నుంచి వచ్చే దారం. (కో. 7, 11, 12, 16, 19, 23, 26; తె. 23).

**పట్టుకమ్మి** ఉ. పట్టుకమ్మె. పట్టుదారంతో నేసిన కమ్మి (కో. 19, 20, 21).

**పట్టుకర్ర(లు)** పట్టుదారం. పంజెకు చుట్టటానికి చిలప తగిలించే కర్ర(లు); రెండుంటాయి. చూ. చిత్రం 295 (తె. 5).

**పట్టుకలరు** ఉ. పట్టుకర్రలు. గోధుమరంగు (కో. 11).

**పట్టుకోరా** ముడిపట్టు; ముదురు గోధుమ వన్నెలో ఉంటుంది (కో. 23).

**పట్టుదారం** పట్టుపురుగులనుంచి వచ్చేదారం(కో.14).

**పట్టునూలు** పట్టుపురుగుల నుంచి వచ్చే దారం (కో. 11, 13-15, 17, 33, 34; తె. 10, 19).

**పట్టుపోగడ** అనుకొయ్యలకు, అనులు పడేటట్లు చుట్టిన పట్టుదారం; పడుగు; నేతలో నిలువుకు వాడతారు (తె. 5).

**పట్టుపురుగు** పర్యా. రేషంపురుగు. పట్టుదారం ఉత్పత్తిచేసే పురుగు; సాలిపురుగు మాదిరిది; "మల్బరీ" చెట్ల ఆకులు తింటుంది; గుడ్లుపెట్టే కాలంలో పసుపు వన్నెలో ఉంటుంది. ఇటువంటి పురుగుల్ని పట్టి తెచ్చి తొట్టెల్లో పెట్టి పెంచుతారు; మల్బరీచెట్ల ఆకులు, రెండుమూడు సన్నగా కత్తిరించి దీనికి ఆహారంగా వేస్తారు; దీనినోట్లోనుంచి వచ్చే జిగురుపదార్థం దారంలా వస్తుంది; ఈ పురుగు దారాన్ని చుట్టూ అల్లుకొని లోపల ఇరుక్కుపోతుంది; దాన్ని పట్టుకాయ అంటారు; ఈ కాయలు వేణ్ణీళ్ళలో వేస్తే లోపలిపురుగు చచ్చిపోతుంది; అప్పుడు దారం తీస్తారు. చూ. చిత్రం 289 (కో. 11, 12, 17, 19; తె. 5).

**పట్టుబడి** ఒకసారి నేతకు తీసుకొనే మొత్తంనూలు (కో. 1).

**పట్టుబడిచీర** చిక్కగా (గట్టిగా) నేసిన చీర (కో. 13, 15).

**పట్టుమజదారునేత** ఒకరకం తలంబ్రాల చీర నేత (రా. 20).

**పట్టుముంగి** కిర్మింజి, కపిల రంగులు వచ్చేట్టు పట్టు, నూలు కలిపి నేసిన చిన్నగళ్ళ చీర (తె. 5).

**పట్టుమూటం(అంచు)** తొగరు, తెలుపు, సీమపట్టు, తెలుపు, తొగరు రంగుల పోగులు ఒక్కొక్క కొలికి చొప్పున వరసగా పెట్టి, తరవాత మూడు కొలుకులు తెలుపు, నాలుగు కొలుకులు పచ్చ, రెండు కొలుకులు తొగరు, ఒక కొలికి తెలుపు, ఇరవై కొలుకులు సీమపట్టు, నాలుగు కొలుకులు తొగరు, ఒక కొలికి తెలుపు పెట్టి, చిగురంచున పచ్చపోగులు పెట్టి నేసిన అంచు; గమళ్ళవాళ్ళ ధోవతులకు నేస్తారు (తె. 13).

**పట్టుమేడె(అంచు)** ఉన్నటివి, నాలుగయిదు కొలుకులు పట్టుదారం పెట్టి, బోడుంచులో గీరలు పడే ట్లు నేసిన ఒకరకం అంచు; కొండ్లపట్టులు నేస్తారు (కో. 8).

**పట్టురంగు** ఉ. పొట్టురంగు; పర్యా. పట్టుకలరు. గోధుమరంగు. చూ. చిత్రం 288 (కో. 3).

**పట్టురైక** ఉ. పట్రైక. పట్టునూలుతో నేసిన రవికె (గుడ్డ); పెళ్ళికూతురికి పెట్టేది; చూ. తలంబ్రాలరవికె (తె. 32).

**పట్టుశాలీలు** ఉ. పట్టుసాలీలు. నేతపనిచేసే వాళ్లలో ఒక తెగ (కో. 24; రా. 8).

**పట్టుసిల్కు** మంచిపట్టు (కో. 19).

**పట్టె** ఉ. పట్టి, పట్టీ. **1.** పర్యా. చూ. పీట(2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (కో. 2, 5, 9, 11, 12 37; తె. 15, 31; రా. 1, 5, 7, 8, 11–14, 16, 17, 20, 22–24); **2.** పర్యా. చూ. తొక్కుడుపీట(2). డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒకకాలితో తొక్కి పట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (కో. 36); **3.** పర్యా. చూ. పీట(8). డబ్బారాట్నం నిలువులు బిగించిన కింది పీట. చూ. చిత్రం 41 క. 1 (కో. 37); **4.** చూ. పొట్టె(7) (కో. 3; రా. 18, 24); **5.** పర్యా. చూ. అడ్డపట్టె(19). డాబీచట్రం(=డడక) అడ్డబద్ద; ఊచలు బిగించింది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 132 చ. 5 (రా. 12, 13, 24); **6.** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (తె. 12, 16); **7.** పర్యా. చూ. ఇరవలదండి. కోతి పుల్లలుగాని, గిలకలుగాని వేలాడదియ్యటానికి, మగ్గానికి పైన దారాలు కట్టిన కర్ర. చూ. చిత్రం 121 క. 13 (కో. 9బి); **8.** అంచులో నేసిన కడ్డీ; చూ. కడ్డీ (తె. 12); **9.** నేతలో వచ్చే గడి; కొన్నిచోట్ల, పెద్దగడి (కో. 9ఎ; రా. 23); **10.** (-కోయు) చూ. పొట్టె(6). (రా. 16); **11.** పర్యా. చూ. ఆనుజంగ. ఆనుపీటలు బిగించిన పొడుగు పట్టె(లు); ఇవి ఒకటి నుంచి మూడు వరకూ ఉండవచ్చు; చూ. ఆనుజంగ. చూ. చిత్రం 45 క. 7 (కో. 7ఎ, 10, 16; రా. 13, 15, 16, 18); **12.** పర్యా. చూ. ఆనుపీట. ఆనుకొయ్య(=ఆనుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టెలు; ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండూ ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1–3 (కో. 3, 7, 10, 11, 16; తె. 18, 31; రా. 13, 15, 16, 18, 24);

**పట్టెగూటం** పర్యా. చూ. ఓడ(3). నేతమోకును చుట్టే పన్నెత్తరం తిప్పటానికి, చేతిగూటానికి బిగించిన పుల్ల; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 122 ఒ. 4 (రా. 8).

**పట్టెంచుకోక** ఒకరకం నేతచీర; కాపుకన్నెలు కడతారట (రా. 11).

**పట్టెత** కమాను(=దూడపకే కవిముట్లు) దండెకు పైపైపు పట్టుకోటానికి కట్టిన తాడు. చూ. చిత్రం 9.3 (కో. 7).

**పట్టెతాడు 1.** పర్యా. చూ. పొట్టె(6). అచ్చులో, పన్నెగూళ్ళలోనుంచి దూర్చిన పోగుల (కొంతుదారాలు గాని, బద్దెదారాలుగాని) పాయ; అచ్చు అతికేటప్పుడు, ఇటువంటి పాయల కొనలు కోసేస్తారు; కోసినవి చెమికెలు. చూ. చిత్రం 102 చ. 4 (రా. 16); **2.** చూ. పొట్టెతాడు (రా. 3, 19, 24).

**పట్టెపీట** పర్యా. చూ. అడ్డకట్టె(4). అడ్డగుమ్మికిందపీట; దీనికి నిలువులు బిగిస్తారు. చూ. చిత్రం 34.1 (తె. 29).

**పట్టెపుల్ల** పర్యా. చూ. ఆనుకొయ్య(3). ఆనుపీటలకు దిగగొట్టిన నిలువు పుల్ల(లు); వీటిని చుట్టే వచ్చేటట్టు ఆనుకు నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4–6 (కో. 13).

**పట్టెపొర** ఉ. పట్టిపొర. పడుగులో, ఒకపాయ (పట్టె)పైకీ ఒకపాయ కిందికీ వచ్చిన పొర (కో. 3).

**పట్టెపొరలాక(లు)** ఉ. పట్టెపర్లాకు. అచ్చుతికిన పడుగులో, కిందిపోగులకూ పైపోగులకూ మధ్య దూర్చిన బద్ద(లు) (కో. 6).

**పట్టెపొరవేయు** (క్రి.)ఉ.పట్టెపొరేయు.పడుగుపొర (కింది పోగులు గాని, పై పోగులు గాని)లో ఒక పాయ పైకి, ఒక పాయ కిందికి వచ్చేటట్లు విడదియ్యటం; పట్టెపొరేసి లాకలు ఎక్కిస్తారు (కో. 3).

**పట్టెమార్పు** ఉ. పట్టిమార్పు. రెండు రకాల రంగుల పట్టెలు, వరసగా వచ్చేట్టు నేసిననేత (కో. 1, 4, 7).

**పట్టెమార్పుతాను** ఉ. పట్టిమార్పుతాను. రెండు రకాల(రంగు)పట్టెలు, ఒకటి విడిచి, మరొకటి వచ్చేట్టు నేసిన తాను; ఎనిమిది గజాల పొడుగుది (కో. 1).

**పట్టె(ల)కమ్మి** పర్యా. గడ్డకమ్మి. వేలెడు వెడల్పు కడ్డీల మాదిరిగా నేసిన కమ్మి; ఇటువంటివి మామూలుగా మూడు నేస్తారు. చూ. చిత్రం 272 (కో. 13, 18; తె. 13; రా. 31).

**పట్టెలకోక** పర్యా. పట్టెలచీర. ఒకరకం పెద్ద గడి చీర; పడుగులోను పేకలోను పట్టెలు పట్టెలుగా నేసింది (రా. 11).

**పట్టెలగొంగడి** ఉడతచారికల మాదిరి, పట్టెలు పట్టెలుగా నేసిన గొంగడి (తె. 7, 9, 11, 20, 26, 28).

**పట్టెలచీర** పర్యా. పట్టెలకోక. ఒకరకం పెద్దగడి చీర; పడుగులోను, పేకలోను పట్టెలుపట్టెలుగా నేసింది (రా. 23).

**పట్టెలజముఖానా** రంగుల పట్టెలు పడేట్టు నేసిన జంపఖానా (తె. 1).

**పల్లెకట్టె** పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరి పాయ(=పొల్లె)లు బిగించిన కర్ర; మామూలుగా దీనికి (మలబద్ద జోడించి) పాయలు చుడతారు; కొన్ని చోట్ల పొల్లెలు గాని, పొల్లెతాళ్ళు గాని కడతారు. చూ. చిత్రం 127.10 (రా. 18).

**పల్లెకోల** పర్యా. చూ. మలగర్ర. నేత పడుగులో చివరిపాయ(=పొల్లె)లు బిగించిన కర్ర; మామూలుగా దీనికి (మలబద్ద జోడించి) పాయలు చుడతారు; కొన్ని చోట్ల పొల్లెలుగాని, పొల్లెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (రా. 24).

**పల్లెదారం** పర్యా. చూ. పొల్లెతాడు. నేతపడుగులో చివరిపాయకు కట్టిన దారం; పొల్లె కొక దారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రం 127.8 (రా. 24).

**పడగట్టె** చూ. పడుగుకట్టె. తొగటవారి వాడుక. (రా. 9).

**పడగలకట్టె** చూ. పడుగుకట్టె (రా. 12).

**పడత** ఉ. పడ్త. **1.** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి; చూ. రాటి. చూ. చిత్రం 34 (తె. 28); **2.** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంకె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలప (ఇచ్చె)నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (తె. 6, 27).

**పడతతాడు** ఉ. పడత్తాడు; పర్యా. చూ. గుమ్మిదారం. రాటి ఆకులు(పైవీ కిందివీ)కలిపి కట్టిన దారం. చూ. చిత్రం 31 ప. 4 (తె. 6, 27).

**పడతబల్ల** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురు బద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 6).

**పడతబొంగు** పర్యా. చూ. బెజ్జంకట్టె. రాటి నూలం దూర్చిన కట్టె; పైనగాని కిందగాని ఉంటుంది. చూ. చిత్రం 31 ప. 3 (తె. 6).

**పడతమేకు** పర్యా. చూ. నూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది, కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2(తె. 6).

**పడతమొద్దు** ఉ. పడ్తమొద్దు; పర్యా. చూ. దూపిరి (3). రాటి తిరగటానికి, రాటనూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (తె. 6, 27).

**పడసాలీలు** నేతపనివారిలో ఒక తెగ (రా. 16).

**పడికట్టె** పర్యా. చూ. పల్లెకట్టె. దోనెకు నేతబట్ట చుట్టటానికి, దోనె(పలక)తిప్పేకర్ర; కొన్నిచోట్ల, ఇనప కడ్డీ; కుడివైపు దోనెబెజ్జంలో దూర్చి నేలకు అనుస్తారు. చూ. చిత్రం 123 చ. 2 (తె. 20).

**పడికాలకట్టె** చూ. పెడకోలకట్టె (రా. 8).

**పడిగె** వంకెన కడియానికి బిగించిన ఇనపకొండి; దీన్ని (ఊద్రె) అడ్డపట్టెకు వేస్తారు. చూ. చిత్రం 70 ట. 1 (తె. 26, 27, 30).

**పడిగెచెవులగొర్రె** ఉ. పడిగెచెవలగొర్రె. పాము పడగలాంటి చెవులు గల గొర్రె (తె. 25).

**పడిగెనగర్ర** ఉ. పడిగంకర్ర, పడిగెంగర్ర, పడెంగర్ర. చూ. పడుగేరుకర్ర (కో. 1, 3, 5, 6).

**పడిగెనగోల** ఉ. పడిగెనకోల, పడియనగోల చూ. పడుగేరుకోల (తె. 2, 3).

**పడిగెరాజులు** ఉ. పడిగరాజులు, పడెగెరాజులు. పద్మసాలీల దగ్గర కథలు చెప్పి పటేటూ అడుక్కోటానికి వచ్చేవాళ్ళు (కో. 3, 5, 6; రా. 1, 10, 13, 15, 16, 20).

**పడిగెరికోల** ఉ. పడిగెడికోల, పడుగెరికోల; చూ. పడుగేరుకోల (తె. 7, 19, 23, 31).

**పడుగతుకు** (క్రి.) (< పడుగు + అతుకు) పర్యా. చూ. అచ్చతుకు. బద్దెపోగులకు పడుగు పోగులు కలిపి వడిపెట్టటం (రా. 20).

**పడుగు** **1.** నేతలో నిలువుకు వాడటానికి, మరాను మీద అనులు పడేట్టుతోడిన నూలు (కో. 12ఎ, 22, 23, 24); **2.** రూ. పొడుగు; పర్యా. తోట్నం, సీడు(9). ఆసుపోసిన నూలు; నేతలో నిలువుకు వాడే నూలు. (కో. 1-6, 8, 9, 11-24, 27-28, 30, 33, 36, 37; తె. 2, 3, 5-7, 33; రా. 1-8, 10-13, 17-19, 21-24); **3.** పర్యా. సరి(7), సరిపడుగు(2). నేతలో నిలువుకు వాడే పట్టు (తె. 21); **4.** పర్యా. చూ. సరి(8). ఉన్ని నేతలో; ఆసుపోసి నిలువుకు వాడే నూలు, పోగులు బిరుసెక్కటం కోసం, దీన్ని చింతఅంబలితో తడిపి ఆరబెడతారు. చూ. చిత్రం 314.3 (తె. 20). **5.** మగ్గానికి అమర్చి, నేతబయలులో చాపిన పడుగు నూలు. చూ. చిత్రం 127.17 (తె. 3, 13); **6.** నవారు

నేతలో నిలువుకు వాడే నూలు (కో. 12; రా. 10); 7. తివాసీనేతలో నిలువుకు వాడే నూలు; ఆనుపోసింది (తె. 10).

**పడుగుకట్ట** ఉ. పడుక్కట్ట; పర్యా. చూ. సరెంటి (3). చుట్టచుట్టిన పడుగునూలు; మగ్గం మీద కొంత చావగా మిగిలింది ఒక కర్రకు చుడతారు; కొన్నిచోట్ల పురిబెట్టి చుడతారు; కొన్నిచోట్ల, పెడకోలకు కట్టి ఉంచుతారు. చూ. చిత్రాలు. 128 ట. 1, 128 జ. 2 (కో. 25, 34).

**పడుగుకట్టు** (క్రి.) పర్యా. చూ. ఆనుపోయు. (ఆనుగొట్టంలోకి పోగుతీసుకొని) ఆనుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చెయ్యటం (కో. 20).

**పడుగుకట్టె** ఉ. పడుక్కట్టె; రూ. పడుగట్టె, పడగల కట్టె. పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి నున్నటి కర్ర; దీన్ని కోల్లల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (రా. 14).

**పడుగుకర్ర** ఉ. పడుక్కర్ర; పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటి కర్ర; దీన్ని కోల్లల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (కో. 9, 13; రా. 1).

**పడుగుకొట్టు** (క్రి.) గుడ్డపిడచతో, పడుగుకు గంజి పట్టించటం; పోగు బిరుసెక్కటానికి, గంజిపిడచతో పడుగు కొడతారు (కో. 10).

**పడుగుకొయ్య** ఉ. పడుక్కొయ్య; పర్యా. చూ. సరికొయ్య. ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్యగూటం. చూ. చిత్రం 63 క. 7 (తె. 32).

**పడుగుకోల** ఉ. పడుక్కోల. 1. పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే, గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోల్లల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండువైపులా రెండుంటాయి. చూ. చిత్రం 69(తె. 18, 25; రా. 23); 2. పర్యా. చూ. లాక(2). పడుగులో, అని వెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా, ఇటువంటివి అనికి రెండువైపులా ఉంటాయి; పడుగులో అని చెదిరిపోకుండా ఉండటానికి లాకలువేస్తారు. చూ. చిత్రం 63 చ. 3 (కో. 36).

**పట్టుగిలక** అంచుల్లో డిజైన్లు నేసే మగ్గానికి చివర, పట్టుదారాలు తగిలించే కొయ్యగిలక; దీన్ని మామూలుగా మగ్గం మీద ఎత్తుగా అమరుస్తారు. చూ. చిత్రం 133 క (కో. 7).

**పడుగుగుంజ** ఉ. పడుగ్గుంజ. 1. పర్యా. చూ. గూటం(3). ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి, నేలలో పాతిన గూటం; కొయ్యదిగాని, ఇనపదిగాని, రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7 (రా. 9); 2. పర్యా. చూ. సరిగుంజ(1). ఆరుబయట చాపిన పడుగు రెండో వైపు కట్టటానికి పాతిన కొయ్య; కొన్నిచోట్ల, రాతి స్తంభం; ఇటువంటివి ఒకటి రెండుంటాయి. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (రా. 12).

**పడుగుగుది** ఉ. పడుగ్గుతి, పడుగ్గుది; పర్యా. చూ. ఊడైగుది (2). పడుగు చాపేటప్పుడు, ఊడై అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (కో. 27, 30, 32, 37; తె. 19, 20, 22, 24; రా. 15).

**పడుగుగూటం** పర్యా. చూ. గూటం(4). ఊడై గూటాన్ని నేలలోకి దిగగొట్టే(ఇనప)మొద్దు (కో. 37).

**పడుగుచివ్వ** ఉ. పడుగుచివ, పడుగుసివ. 1. పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగం(=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనె(గాడిలో)పండ్ల గుదులతో బిగిస్తారు. కొన్నిచోట్ల, ఇనపచువ్వగాని, వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 36); 2. పర్యా. చువ్వ(4). పడుగు చాపినప్పుడు అని వెంబడి దూర్చిన సన్న బెత్తం. చూ. చిత్రం 69 (కో. 25, 26).

**పడుగుచుట్ట** పర్యా. చూ. సరెంటి(3). చుట్టచుట్టిన పడుగు నూలు; మగ్గం మీద కొంత చావగా మిగిలింది ఒక కర్రకు చుడతారు; కొన్నిచోట్ల, పురిబెట్టి చుడతారు; కొన్నిచోట్ల, పెడకోలకు కట్టి ఉంచుతారు. చూ. చిత్రాలు 128 ట. 1, 128 జ. 2 (కో. 23, 24).

**పడుగుచుట్టకర్ర** మగ్గం దగ్గర, పడుగు చుట్టిన కర్ర. చూ. చిత్రం 128 గ (కో. 16, 17).

**పడుగుచేయు** (క్రి.) పర్యా. చూ. సరిచేయు(2). గంజిపెట్టిన పడుగును ఊడైలకు దాపి, కుంచెతో దువ్వుతూ నేతకు అనుకూలం చెయ్యటం (కో. 1-5, 7, 11, 13, 18; రా. 19, 20).

**పడుగుతడుపు** (క్రి.) 1. రూ. పొడుగుతడుపు. పర్యా. పూతతడుపు, మెతకగొట్టు. గుడ్డపిడచతో, పడుగుకు గంజి పట్టించటం; పోగు బిరుసెక్కటానికి గంజి పట్టిస్తారు; కొన్నిచోట్ల అంబలి పెడతారు. (కో. 5, 6, 7, 9; తె. 1, 3, 5, 12-14, 16, 20-26, 29; రా. 6, 10, 11, 15, 18, 20, 21, 23, 24); 2. అంబలి పిడచతో, ఉన్ని పడుగుకు అంబలి-కొన్నిచోట్ల గంజి-పట్టించటం; పోగు బిరుసెక్కటానికి పడుగు తడుపుతారు (తె. 3, 11).

**పడుగుతాడు** పర్యా. చూ. ఊడైతాడు(2). ఊడైను నిలబెట్టి, కింది గూటానికి బిగించేతాడు; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (తె. 32).

**పడుగుతీడు** (క్రి.) గంజి పెట్టిన పడుగును చేత్తో రుద్దటం (తె. 25).

**పడుగుతోడు** (క్రి.) **1.** పర్యా. అనుతోడు. నేతలో నిలువుకు వాడే(పడుగు)నూలు మరానుకు చుట్టటం; చెక్రం తిప్పినప్పుడు దబ్బాలకు ఉన్న నూలు మరానుకు చుట్టుకొంటుంది (కో. 4, 22); **2.** పర్యా. చూ. అనుపోయు. అనుగొట్టంలోకి పోగు తీసుకొని అనుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చెయ్యటం (కో. 5, 6, 12 14, 15, 18, 22, 23, 31, 34; తె. 17; రా. 10); **3.** అనుగొట్టంలోంచి పోగు తీసుకొని అనుగూటాలకు చుట్టివచ్చేట్టు చెయ్యటం; కురమలవాడుక, చూ. చిత్రం 312 (తె. 3, 11).

**పడుగుతోలు** (క్రి.)నవారునేతలో నిలువుకు వాడే నూలు (పడుగు) అనుమీద చుట్టటం; పడుగుతోడడం (రా. 10).

**పడుగుదండె** పర్యా. చూ. అనుజంగ. అనుపీటలు బిగించిన పొడుగు పట్టె(లు); ఇవి ఒకటి నుంచి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 37).

**పడుగుదిద్దు** (క్రి.) కచ్చిపోగులు సాపుచెయ్యటం (కో. 20).

**పడుగుదీయు** (క్రి.) పడుగుకు సరిపోయేటంత నూలు అనుగూటాలకు తోడటం (తె. 20).

**పడుగుదోనిగె** ఉ. పడుగుదోనిగ; పర్యా. చూ. దోనె(3). మగ్గంమీద, నేసిన బట్టచుట్టే కొయ్యదూలం; మామూలుగా నలుపలకలది; కొన్నిచోట్ల గుండ్రటిది; దీనికి ఒక వైపున పొడుగ్గా గాడిగాని, నాలుగయిదు చిల్లులుగాని ఉంటాయి; జేనెడు బట్ట నేసిన తరవాత దీనికి చుడతారు; దీన్ని, నాలిక కొయ్యకూ బొడ్డు గొయ్యకూ మధ్య అమరుస్తారు. చూ. చిత్రం 123 క. 2 (తె. 2).

**పడుగుదోనె** ఉ. పడుగుదోని; పర్యా. చూ. ఎదురు దోనె. మగ్గం చివర పడుగునూలు చుట్టే కొయ్య దూలం; రోకలి మాదిరిది; కొన్నిచోట్ల నలుపలకలది; మలగర్రకు బదులు అమరుస్తారు. చూ. చిత్రం 110.1 (కో. 1, 6; రా. 5).

**పడుగునూలు** పర్యా. సరినూలు. నేతలో పడుక్కు-వాడే నూలు (కో. 2, 13, 20; రా. 8).

**పడుగునెట్టు** మొత్తం పడుగునూలు (తె. 9).

**పడుగునేర్పు** (క్రి.) పడుగు నెరపటం (రా. 16).

**పడుగుపాయ** పర్యా. చూ. పాయ(8). పడుగు పోగుల్లో కొంత భాగం; అచ్చుతికేటప్పుడు పడుగును పాయలుగా విడదీసి, ఒక్కొక్క పోగే అచ్చుపోగుకు అతుకుతారు. చూ. చిత్రం 102 క. 4 (కో. 26).

**పడుగుపిండు** (క్రి.) గంజి పెట్టిన పడుగును చేత్తో పిడవటం (కో. 5).

**పడుగుపొట్టె** పర్యా. చూ. పాయ(8). పడుగు పోగుల్లో కొంతభాగం; అచ్చుతికేటప్పుడు, పడుగును పాయలుగా విడదీసి, ఒక్కొక్క పోగే అచ్చుపోగుకు అతుకుతారు. చూ. చిత్రం 102 క. 4 (తె. 2).

**పడుగుపోయు** (క్రి.) ఉ. పడుగుబోయు. **1.** రూ. పొడుగుపోయు; పర్యా. చూ. అనుపోయు. అనుగొట్టంలోకి పోగు తీసుకొని అనుకొయ్యలకు చుట్టివచ్చేట్టు చెయ్యటం (కో. 6, 8ఎ, 11, 13 26-28; తె. 10, 15, 16, 18, 19, 21, 23-25; రా. 11-13, 16); **2.** పర్యా. అనుపోయు. నేతలో నిలువుకు వాడే పట్టు దారం అనుపుల్లలకు చుట్టటం. చూ. చిత్రం 296 (తె. 17).

**పడుగుబండ** పర్యా. చూ. గంజిబండ. గంజి, అంబలి మొ.వాటితో పడుగు తడపటానికి పరిచినరాయి (తె. 7; రా. 11). చూ. చిత్రం 74.1.

**పడుగుబల్ల** పర్యా. చూ. అను(1). పడుగు(= నేతలో నిలువు) నూలుపోసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రాలు 45-47 (కో. 37).

**పడుగుబయలు** ఉ. పడుగుబైలు; పర్యా. బయలు. పడుగు చాపుకొనే బహిరంగ ప్రదేశం(రా. 11-13, 15).

**పడుగుబెంతు** పర్యా. చూ. బెంతు(దారం). కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి, పన్నెగూళ్ళలో గూర్చిన పోగులు (సుమారు జేనెడు పొడుగువి); అని వచ్చేటట్లు, వీటిని కర్రలకు అల్లుతారు. చూ. చిత్రం 91 క. 9 (కో. 5).

**పడుగుంబేక(లు)** పర్యా. చూ. నిలువుంబేక(లు). నేతలో పొడుగు, అడ్డం (తె. 13).

**పడుగుమోకు** రూ. పొడుగుమోకు; పర్యా. చూ. ఊడైతాడు(1). ఊడైను నిలబెట్టి, కింది గూటానికి బిగించేతాడు; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (కో. 11, 22, 29, 33, 36, 37).

**పడుగురుద్దు** (క్రి.) పడుగుకు, అంబలి బాగా పట్టేటట్లు గొంగడి పిడచతో తట్టటం (తె. 11).

**పడుగులాక** పర్యా. చూ. లాక(2). పడుగులో, అని వెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా, ఇటువంటివి అనికి రెండువైపులా ఉంటాయి పడుగులో; అని

చెదరిపోకుండా ఉండటానికి లాకలు వేస్తారు). చూ. చిత్రం 63 చ. 3 (కో. 28-32, 35, 37).

**పడుగులాడె** ఉ. పడుగుత్రెడె; పర్యా. చూ. నాడె (1). నేతనేసేటప్పుడు, పడుగు పై పోగులకు కింది పోగులకు మధ్యవేసే, పేకదారం కంటె అమర్చిన పనిముట్టు; గేదెకొమ్ము, కొయ్య, వెదురుగొట్టం మొ. వాటితో చేస్తారు. చూ. చిత్రం 131 (తె. 2).

**పడుగువిప్పు** (క్రి.) ఉ. పడుగిప్పు. పడుగు ఏరేటప్పుడు పోగులు విడదీసుకోటం; నెరపటం. (కో. 21; తె. 13).

**పడుగువిసురు** (క్రి.) **1.** నేతలో నిలువుకు వాడే పడుగునూలు మరానుకు చుట్టటానికి చెక్రం తిప్పటం; చెక్రం తిప్పినప్పుడు, డబ్బాలకు ఉన్ననూలు మరానుకు చుట్టుకొంటుంది (కో. 17, 18); **2.** పర్యా. అను పోయు. అనుగొట్టంలోకి పోగుతీసుకొని అనుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చెయ్యటం (కో. 16-18, 21, 28-30, 32, 33, 35, 37);

**పడుగుసాగు** సరిచెయ్యటానికి నిలబెట్టిన ఊడెల మధ్య దూరం (రా. 8).

**పడుగుసీడు** పడుక్కు వాడే నూలుచుట్ట; దీని పోగు సన్నగా ఉంటుంది (కో. 1).

**పడుగెత్తుగుది** పర్యా. చూ. రాయబారపుతాడు. పడుగుచుట్టకు రెండువైపులా కట్టి మగానికిపైన - కొన్నిచోట్ల, రాయబారపుకర్రకు-వేలాడదీసినతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 129 క. 1 (కో. 30).

**పడుగెరిలాక** ఉ. పడగెరలాక, పడిగెరలాక; రూ. పరిగెడిలాక; పర్యా. చూ. లాక(2). పడుగులో, అని వెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా ఇటువంటివి అనికి రెండువైపులా ఉంటాయి; పడుగులో, అని చెదరిపోకుండా ఉండటానికి లాకలు వేస్తారు; పడుగేరేటప్పుడు అంటారు. చూ. చిత్రం 63 చ. 3 (తె. 19, 20, 22, 24, 31).

**పడుగేనుకర్ర** చూ. పడుగేరుకర్ర (కో. 12, 18).

**పడుగేరు** (క్రి.) పడుగుపోగులు చేత్తో విడదియ్యటం (తె. 8).

**పడుగేరుకట్టె** ఉ. పడిగేరకట్టె, పడిగేరుకట్టె; రూ. పొడుగేరుకట్టె; పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే కట్టె; దీన్ని కోత్తల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (రా. 11, 13, 15).

**పడుగేరుకర్ర** రూ. పండిగర్ర, పడిగెనగర్ర, పడేనిగర్ర, పడుగేనుకర్ర, పనియసగర్ర, పొడుగేరుకర్ర; పర్యా. పరుకర్ర, కట్టె(1), కర్ర(1), కొండ్లకర్ర(1), కొండ్లకోల కోల(4), కోలకర్ర(1), గొండికర్ర, నల కోల, నూలుకర్ర(1), పడుగుకట్టె, పడుగుకర్ర, పడుగు కోల, పడుగేరుకట్టె, పడుగేరుకోల, పరగళ్ళకట్టె, పరిడికట్టె, పరెడకర్ర, మలకోల(1), సరికోల(3). పడుగు(=నేతలో నిలువుకు వాడే నూలు)చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటి కర్ర; దీన్ని కోత్తల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి, రెండు వైపులా రెండుంటాయి. చూ. చిత్రం 69 (కో. 8, 9బి, 14; తె. 13, 15-17).

**పడుగేరుకోల** రూ. పడిగెనగోల, పడిగెరికోల, పరిగెడికోల. పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోత్తల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (తె. 21, 26-28, 30; రా. 18).

**పడుగేరుబద్ద** ఉ. పడిగెరబద్ద, పడుగెరబద్ద; పర్యా. చూ. సరిబద్ద. ఉన్నిపడుగులో, అనిపోగుల్లో దూర్చిన వెదురుబద్ద; పడుగుపోగులు సాపుగా ఉండటానికి ఇటువంటివి దూరుస్తారు. చూ. చిత్రం 314.4 (తె. 20, 22).

**పడేనిగర్ర** చూ. పడుగేరుకర్ర (కో. 22).

**పణం** పర్యా. సవెను. నూలుపోగుల లెక్క: నాలుగు పోగుల దారం (కో. 33).

**పంటుకాశేరుచీర** ఉ. పంటుకాశేరి-; చూ. పంటకాశ్రేడుచీర (కో. 3, 4, 5).

**పంటుకాశ్రేకుచీర** చూ. పంటకాశ్రేడుచీర. కూన అమ్మ చీర మాదిరిగా నేసి, నీలికొలికి బదులు ఎర్రకొలికి పెట్టి చీరంతా నేస్తారు; గర్భంనిలబడని స్త్రీలు సంతానం కోసం కట్టుకొంటారు, దీన్ని పడుచువాళ్ళు నెయ్య గూడదట (తె. 13).

**పంటుకాశ్రేడుచీర** ఉ. పంటకాశెడు-; రూ. పంట కాశేరుచీర, పంటకాశ్రేకుచీర, పంటకాశ్రేలు(చీర); పర్యా. నీలికాశ్రేడుచీర, పంటచీర, పంటొల్లె(కోక). గర్భవతులు దుష్టగ్రహాలవల్ల గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి అయిదో నెలలో కట్టుకొనే చీర; అంచు, కమ్మినీలివన్నెలో నేసిన తెల్లచీర; కొన్నిచోట్ల కమ్మిలో గాని, మధ్యలోగాని గీరలు పెడతారు; కొన్నిచోట్ల, అంచులో మారుగారంం తొగరురంగు పెడతారు, కొన్ని చోట్ల, అంచుకు చిట్టచివర తెల్లపోగులు విడుస్తారు; దీన్ని పడుచువాళ్ళు నెయ్యగూడదని నిషేధం (కో. 7, 8, 12, 13; తె. 15).

**పంటుకాశ్రేలు(చీర)** చూ. పంటకాశ్రేడుచీర (తె. 16).

**పంటచీర** పర్యా. చూ. పంటకాౖశేడుచీర. గర్భవతులు దుష్టౖగహాలవల్ల గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి అయిదో నెలలో కట్టుకొనే చీర; అంచుకమ్మి నీలి వన్నెలో నేసిన తెల్లచీర; కొన్నిచోట్ల రెండు రంగుల్లో కమ్మిలోగాని, అంచులోగాని గీరలు పెడతారు; కొన్నిచోట్ల, అంచులో మారుగారం తొగరు రంగు పెడతారు; దీన్ని పడుచువాళ్ళు నెయ్యగూడదట (కో. 15).

**పంటి** మగ్గానికి తగిలించిన పడుగు చివరకొస చుట్టే కొయ్య; రోకలి మాదిరిది (కో. 11).

**పంటిగుది** ఉ. పంటిగుతి; పర్యా. కొయ్యగుది, గుజ్జెడ, గుది(6), గుదిదారం(2), తాడు(10), దారం(6), దోనుగపంటితాడు, దోనెగుది, దోనెపలుపు, సగతాడు, పంటితాడు, సన్నగుది. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి, పుల్ల(పన్ను)కు కట్టినతాడు; ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిౖతం 124 క. 2 (తె. 5, 15, 20, 22, 25, 31, 32).

**పంటితాడు** పర్యా. చూ. పంటిగుది. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి పుల్ల(పన్ను)కు కట్టిన తాడు; ఇటువంటివి, పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిౖతం 124. 1 (కో. 10).

**పంటె** (–రుంజు) ఉ. పంటి; రూ. పరిటె(1), పైట; పర్యా. ఉక్కడం(1), చేతిపంటె, నూలుపంటె(1), పంటెకౖర(2), సీళ్ళపంటె. చేత్తోనూలుచుట్టే పనిముట్టు. చూ. చిౖతం 19 (కో. 1-10, 22-26, 28-30, 32, 35-37; తె. 1-33; రా. 3, 9, 10, 12-14, 16-24).

**పంటెకౖర** ఉ. పంటికౖర. **1.** రూ. పైటకౖర; పర్యా. చూ. పంటెకామ. పంటెమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువుకౖర. చూ. చిౖతం 19 క. 1 (కో. 2-10, 22, 26, 27, 31; తె. 13, 14; రా. 6); **2.** పర్యా. చూ. పంటె. చేత్తో నూలుచుట్టే పనిముట్టు. చూ. చిౖతం 19 (కో. 7, 8, 10, 22).

**పంటెకాడ** పర్యా. చూ. పంటెకామ. పంటెమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువుకౖర. చూ. చిౖతం 19 క. 1 (కో. 1; రా. 13, 16, 18).

**పంటెకామ** రూ. పంటెకాము; పర్యా. చెడి(2), పంటెకౖర(1), పంటెకాడ, పంటెకోల, పంటెదామ, పంటెసూలం, పరిటెకట్టె, పరిటెకమ్మి. పంటెమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువుకౖర. చూ. చిౖతం 19 క. 1 (కో. 6, 23, 24, 29, 33; తె. 1, 2, 4-12, 15-19, 21, 22, 24, 25, 27, 31-33; రా. 23).

**పంటెకాము** ఉ. పంటికాము. చూ. పంటెకామ (కో. 28, 32, 35-37; రా. 17, 24).

**పంటెకొమ్ము** పర్యా. పంటెచెవి(1). పంటె ఆకుల్లో నుంచి దూర్చిన చిట్టెకొన(లు); ఇటువంటివి ఒకటిగాని నాలుగుగాని ఉంటాయి. చూ. చిౖతం 19 క. 8 (తె. 9, 28, 30).

**పంటెకోల** పర్యా. చూ. పంటెకామ. పంటెమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువుకౖర. చూ. చిౖతం 19 క. 1 (తె. 2, 6, 29).

**పంటెచెవి** **1.** పర్యా. పంటెకొమ్ము. పంటెఆకుల్లో నుంచి దూర్చిన చిట్టెకొన(లు); ఇటువంటివి ఒకటిగాని (?నాలుగుగాని)ఉంటాయి. చూ. చిౖతం 19.8(తె.22); **2.** చిట్టెకొన దూర్చటానికి ఆకుకు చేసిన చిల్లి (తె. 1, 2, 6, 7, 27).

**పంటెదామ** పర్యా. చూ. కామ. పంటెమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువు కౖర. చూ. చిౖతం 19 క. 1 (తె. 20, 23).

**పంటెముక్కు** ఉ. పంటెముక్కు, పంటెముక్కు; రూ. పరిటెముక్కు; పర్యా. ఉక్కడంమూతి, కొనముక్కు, పంటెమూతి, మునిముక్కు. పంటెకు కింది వైపున ఆకుల చివర్లను కలిపి కట్టిన కొన. చూ. చిౖతం 19 క. 6 (కో. 1, 2, 4-8, 10, 22-24, 26-29, 32-37; తె. 1, 2, 4-14, 18-20, 22, 23, 25; రా. 6, 13, 14. 17, 18, 23).

**పంటెమూతి** ఉ. పంటిమూతి; పర్యా. చూ. పంటెముక్కు. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కలిపి కట్టిన కొన. చూ. చిౖతం 19 క. 6 (కో. 30; రా. 16, 24).

**పంటెమొట్టె** ఆసుపోసేటప్పుడు పంటె అమర్చుకొనే సాధనం; స్టాండులాంటిది (తె. 31).

**పంటెమొద్దు** పర్యా. చూ. ముద్దగొయ్య(1). పంటెకు నూలుచుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టే మొద్దు. చూ. చిౖతం 24 (రా. 13).

**పంటెమొల** పంటె కింది భాగంలో ముక్కుకు బిగించిన ఇనపమేకు. పంటె తిప్పేటప్పుడు, దీన్ని గిరక మొద్దు గాడిలో దూర్చి తిప్పుతారు. చూ. చిౖతం 21 (తె. 8, 25, 27).

**పంటెసూలం** పర్యా. చూ. పంటెకామ. పంటె ఆకులకు ఆధారంగా ఉండే నిలువుకౖర. చూ. చిౖతం 19 క. 1 (కో. 30).

**పంటొల్లె(కోక)** పర్యా. చూ. పంటెకాౖశేడుచీర. గర్భవతులు, దుష్టౖగహాలవల్ల గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి అయిదోనెలలో కట్టుకొనే చీర; అంచు, కమ్మి నీలివన్నెలో నేసిన తెల్లచీర; కొన్నిచోట్ల, కమ్మిలోగాని, అంచులోగాని గీరలు పెడతారు; కొన్ని

చోట్ల, అంచులో మూరుగారంతో గరు రంగు పెడతారు; ఎన్నో నెల గర్భమయితే చీర అన్ని మూరల పొడుగు నేస్తారు; దీన్ని పసుపువాళ్ళు నెయ్యగూడదట (కో. 31).

**పంట్లాం** ఉ. పంట్లం; పర్యా. చూ. రాటి. గుమ్మటం లాంటి పనిముట్టు; పంజెు మొ. వాటికి దీనికి తగిలించిన చిలప (ఇచ్చె) నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (కో. 12).

**పండికె** రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది; చూ. పావు. చూ. చిత్రం 282 వ. 1 (కో. 7).

**పండిగర్ర** ఉ. పండగర్ర; చూ. పడుగేరుకర్ర (కో. 27, 30, 31).

**పండ్లకట్టె** పర్యా. పండ్లబద్ద. గొంగడి నేసేటప్పుడు, పడుగుపోగులు చిక్కుపడకుండా ఉండటానికి, కింది పోగులకు, పైపోగులకు మధ్య దూర్చిన కొయ్య; దీని గాడుల్లోకి ఒక్కొక్క పోగు వస్తుంది. చూ. చిత్రాలు 315 క. 11, 317 (తె. 3, 7).

**పండ్లపట్టె** పర్యా. చూ. అడ్డపట్టె(19). ?డాబీ చట్రం (తడక) అడుగుబద్ద; ఊచలు బిగించింది; ఇటువంటివి రెండుంటాయి. చూ.చిత్రం132 చ.5(రా.24).

**పండ్లబద్ద** ఉ. పల్లబద్ద; పర్యా. పండ్లకట్టె. గొంగడి నేసేటప్పుడు, పడుగుపోగులు చిక్కుపడకుండా ఉండటానికి కిందిపోగులకు, పైపోగులకు మధ్య దూర్చిన కొయ్య; దీని గాడుల్లోకి ఒక్కొక్క పోగు వస్తుంది. చూ. చిత్రాలు 315.11, 317 (తె. 9, 10, 11, 20, 22, 25-28).

**పతలాకమ్మి** జెత్తెడు వెడల్పు నేసిన కమ్మి; పూనా కమ్మి (రా. 13).

**పతాయ్‌గుడ్డ** చంకబనీన్లకోసం నేసిన ఒకరకం గుడ్డ- (రా. 16).

**పత్తలకమ్మి** పూనాకమ్మి; అయిదుపట్టెలు ఒక రంగువి; రెండుపట్టెలు మరొక రంగువి నేసింది(రా.24).

**పత్తలంచీర** పెళ్ళికూతురు కట్టుకొనే తెల్లచీర; కొన్నిచోట్ల ఎర్రంచుపెట్టి, కమ్మిలో జెత్తెడు వెడల్పున పసుపురంగులో నేస్తారు; దీన్ని పసుపునీళ్ళలో ముంచి కట్టిస్తారు (రా. 16, 18).

**పత్తి** పర్యా. దూది. నేతనూలుకు పనికివచ్చే ఒక ముడిసరుకు; రేగడ నేలల్లో ఎక్కువగా సాగుచేసి పెంచే రొక్కపుపైరు (cotton); *Gossypium Sp.*, Linn; ఆరెనిమిది నెలల్లో కాయలు పండుతాయి; ఆ కాయల నుంచి పత్తి విడిపిస్తారు; కొన్నిచోట్ల గింజ తియ్యని దాన్ని పత్తి అనీ, తీసిన దాన్ని దూది అనీ అంటారు. మరికొన్నిచోట్ల. సమాసాల్లో పత్తి, వ్యస్తంగా దూది, పత్తి పర్యాయ పదాలు (కో. 1-24, 33, 34, 36, 37; తె. 5, 11-17, 28; రా. 2, 6-11, 13, 15-24).

**పత్తికంకణ(ం)కురమ** ఉ. -కుర్మ. పత్తికంకనం కురుమ. గొంగళ్ళు నేసే కురమల్లో ఒకశాఖ; పెళ్ళిళ్ళలో పత్తిదారం తోరాలు కట్టుకొనేవాళ్ళు; వీరికీ, ఉన్ని కంకణంకురమలకూ 'కంచంపొత్తే'గాని 'వియ్యం పొత్తు' లేదు (తె. 22, 25, 28).

**పత్తిగిరక** (-ఒత్తు, -పట్టు) ఉ. పత్తిగిర్క; పర్యా. చూ. పత్తిరాట్నం(1). పత్తినించి గింజలు విడదీసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 1 (కో. 9; తె. 5, 28; రా. 22, 23).

**పత్తినూలు** పత్తినించి తీసిన దారం (కో. 9, 11-15, 17, 26, 27, 29-32; తె. 1, 2, 7, 18-20 24-26, 29-33; రా. 22).

**పత్తిపువ్వురంగు** 1. కిర్మింజి. చూ. చిత్రం 288 (తె. 4); 2. చేకిలేటు రంగు; గార్నెట్, బ్లూ బి. ఎస్, పటిక, తేజాపు, నైట్రేట్ సల్ఫ్ కలిపి తయారు చేస్తారట (తె. 5).

**పత్తిపూలాహిరి** (అంచులో) పత్తిపువ్వు నమూనాలో లాహిరి పడేటట్లు నేసిన డిజైను (తె. 10).

**పత్తిరాటం** చూ. పత్తిరాట్నం(1) (కో. 3-8, 10, 12, 15; రా. 8, 10, 13).

**పత్తిరాట్టం** చూ. పత్తిరాట్నం(1) (కో. 24).

**పత్తిరాట్నం** 1. (-తిప్పు, -పట్టు) ఉ. ?పత్తిరానం; రూ. పత్తిరాటం పత్తిరాట్టం, పత్తిరాట్లం; పర్యా. గిరక(1), గిరకరాటం, గిలక, పత్తిగిరక. పత్తినించి గింజలు విడదీసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 1 (కో. 1, 16, 22, 23, 36, 37); 2. దారంతీసే రాట్నం; చూ. రాట్నం, చూ. చిత్రం 15 (కో. 33).

**పత్తిరాట్లం** చూ. పత్తిరాట్నం(1) (రా. 15).

**పత్తిరాయి** పత్తిపరుచుకొనే నున్నటిరాయి; దీని మీద పత్తి పరిచి, కొడుపుతో గింజలు విడదీస్తారు. చూ. చిత్రం 2.1 (తె. 2).

**పదర(ం)** పర్యా. పొర(4). మడతలో ఒకవైపు భాగం; పొర; పచ్చడం రెండుపొరలుగా నేస్తారు (రా. 15, 23).

**పదికొలుకులకడ్డీచీర** నేతలో నిలువు, పేక పదేసి కొలుకుల చొప్పున రంగుదారాలుపెట్టి నేసిన చీర (తె. 21).

**పదునారు** (< పదును + ఆరు; క్రి.) సరిచేసేటప్పుడు గంజిపెట్టిన పడుగు తడి ఆరిపోవటం (కో. 31, 32).

**పదును** 1. (-పెట్టు) (పడుగు నూలుకు పట్టిన

గంజితడి (కో. 34. 36); **2.** కుంచెపురికి నూనెతడి పెట్టిన తరవాత వాడకానికి అనుకూలంగా ఉన్న స్థితి (రా. 1).

**పదునువిరిగిపోవు** (క్రి.) సరిచేసేటప్పుడు, గంజి పెట్టిన పడుగు తడి ఆరిపోవటం (కో. 36).

**పద్మం(చీర)** తామరపువ్వు బుటాతో నేసిన చీర (కో. 36).

**పద్మంపేటు** పర్యా. చూ. కమలం(పేటు). తామర పువ్వు ఆకారంలో అంచులో నేసిన డిజైను. చూ. చిత్రం 169 (కో. 14).

**పద్మశాలి** ఉ. -సాలి, -సాలె. చేనేతపని చేసే వాళ్ళలో ఒక తెగ (కో; తె; రా).

**పద్మినీరోజా** ఉ. పద్మినిరోజా. ఒకరకం లేత ఎరుపు రంగు (కో. 2, 11).

**పద్దు** పర్యా. నూలుపెట్టె. సుమారు 10 పౌన్ల మిల్లునూలు కట్ట. ఏ నెంబరు నూలో అన్ని లడీలు (=పెళ్ళు) దీంట్లో ఉంటాయి (రా. 12).

**పనస(కాయ)కమ్మి** ఒకరకం డిజైను (6-1 కోలు కులవరకూ పోగులసంఖ్య తగ్గిస్తూ పెట్టి, మళ్ళీ హెచ్చిస్తూ నడుగు, పేకనేసిన)కమ్మి; పనసకాయమాదిరి నమూనా నేతలో వస్తుంది (కో. 7; రా. 11).

**పనసకాయంచు** పర్యా. పనసపేటంచు. పనసకాయ డిజైన్లు పడేట్టు నేసిన చీర అంచు. చూ. చిత్రం 206 (తె. 17).

**పనస(పండు)పేటు** ఉ. పనసపేటి-. అంచులో, పనసపండు ఆకారంలో నేసిన డిజైను. చూ. చిత్రం 206 (తె. 1; రా. 16).

**పనసపేటంచు** పర్యా. పనసకాయంచు. పనస కాయ డిజైన్లు పడేటట్లు నేసిన (చీర) అంచు. చూ. చిత్రం 206 (తె. 1).

**పని** (బహు. పనిలు) చూ. పన్నె(1)(కో. 16, 19, 22-24; తె. 22, 23, 29, 32).

**పనికట్టు** **1.** చూ. పన్నెకట్టు(1)(తె. 29, 32); **2.** (క్రి.) చూ. పన్నెకట్టు(2) (కో. 16, 19, 22-24; తె. 22, 23, 29, 32).

**పనికత్తి** పర్యా. చూ. సాపుకత్తి. పన్నె(=పని) దండెల మధ్య బిగించిన పుల్లలు సాపుచేసే కత్తి. చూ. చిత్రాలు 89 క. 1, 89 చ. 1 (కో. 26).

**పనిగూడు** చూ. పన్నెగూడు (తె. 29).

**పనితనంకమ్మి** డిజైను (=పనితనం: పేటు)లు నేసిన కమ్మి (కో. 7).

**పనిదండె** ఉ. పనిదండ, పనిదండి; చూ. పన్నెదండె (కో. 3, 22, 23, 26; తె. 22, 23).

**పనిమోపు** పనిముట్టు; కొరముట్టు (కో. 23, 24).

**పనియనగర్ర** చూ. పడుగేరుకర్ర (కో. 7, 10).

**పనివరస** (-వేయు) ఉ. పనొరస; పర్యా. చూ. పేటు. ఏదైనా ఒక నమూనాలో నేసిన నేత; పువ్వు, ఆకు, చెట్టు, పక్షి, తీగ, గీరలు మొ. వాటి డిజైను (తె. 5, 12, 13).

**పనీనె** చూ. పన్నీనె (తె. 31).

**పనె** **1.** చూ. పన్నె(1)(కో. 8, 9ఎ; తె. 15, 16, 24-28, 30, 31, 33); **2.** చూ. పన్నె(2) (తె. 27).

**పనెఈనె** నవారుమగ్గం పన్నెలో వరసగా బిగించిన సన్నపుల్ల(లు) చూ. చిత్రం 324 ట. 4 (తె. 27).

**పనెఓడ** చూ. పన్నెగోడ (తె. 17).

**పనెకట్టు** **1.** చూ. పన్నెకట్టు(1) (తె. 24, 25, 33); **2.** (క్రి.) చూ. పన్నెకట్టు(2) (కో. 8, 9ఎ; తె. 15, 16, 24-28, 30, 31, 33).

**పనెగూడు** చూ. పన్నెగూడు (తె. 24, 25, 31, 33).

**పనెచట్టం** నవారుమగ్గం పన్నెలో ఈనెలు బిగించిన చట్టం. చూ. చిత్రం 324 ట. 4 (తె. 27).

**పనెదండె(ం)** చూ. పన్నెదండెం (తె. 15; రా. 16).

**పన్కానిక్కా** ఆకు, తీగ డిజైన్లు పక్కాపక్కాలనే పడేట్టు నేసిన ఒకరకం చీర (తె. 5).

**పంతులమ్మ** ఒకరకం ఎరుపురంగు (కో. 3).

**పందరపాకనూలు** తూర్పుగోదావరిజిల్లా, పందర పాక గ్రామం మిల్లులో తయారయిన నూలు; గోధుమ రంగుది; పోగు మెతక (కో. 22).

**పందిరి** ఉ. పందిర, పందిరె; రూ. పందిలి: పర్యా. చూ. మగ్గంపందిరి. నేతబయలులో మరమగ్గం చట్టం నిలబెట్టటానికి నిలువురాటలకు, అడ్డంగా మంచెమాదిరిగా బిగించిన కర్రలు; మగ్గం గుంటకు పైన ఎత్తుగా వేస్తారు. చూ. చిత్రం 116 (కో. 11, 13, 15-20).

**పందిరికర్ర** ఉ. పందిరకర్ర; పర్యా. చూ. పందిరి రాట. మరమగ్గం చట్టం నిలిపే మగ్గంపందిరికి ఆధారంగా నేతబయలులో పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 116.2 (కో. 15).

**పందిరిగుది** పడుగుచుట్టిన కర్రను వేలాడదియ్యటానికి, పందిరికి కట్టిన తాడు (కో. 17).

**పందిరిరాట** పర్యా. పందిరికర్ర, పందిలిగుంజ, బడ్డీ గుజ్జు, బడ్డీరాట. మరమగ్గం చట్టం నిలిపే, మగ్గంపందిరికి ఆధారంగా నేతబయలులో పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 116.2(కో. 20).

**పందిలి** చూ. పందిరి (కో. 12, 14).

**పందిలిగుంజ** పర్యా. చూ. పందిరిరాట. మరమగ్గం

చట్రం నిలిపే మగ్గంపందిరికి ఆధారంగా, నేతబయలులో పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 116.2 (కో. 14).

**పందిలిబద్ద** మగ్గంపందిరి మీద అడ్డంగా బిగించిన బద్ద. చూ. చిత్రం 116.1 (కో. 12).

పన్న నేతలో అడ్డం (తె. 1).

**పన్నతాడు** పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టే తాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు ఏటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (తె. 30).

**పన్నదారం** **1.** పర్యా. చూ. ఆకులతాడు (1). రాట్నం ఆకులకు చుట్టేతాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు ఏటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (తె. 33); **2.** పర్యా. చూ. గుమ్మిదారం. రాటి ఆకులు పైవీ కిందివీ కలిపి కట్టిన దారం. చూ. చిత్రం 31 ప. 4 (తె. 33).

**పన్నీనె** (పన్ని + ఈనె) రూ. పనీనె, పైనీనె; పర్యా. చూ. ఈనె(1). పన్నెకట్టుబడిలో దండెలమధ్య, దువ్వెన పళ్ళమాదిరిగా వరసగా కట్టిన కలప, జొన్న. గలుగు, వెదురు, కొండచీపురు మొ. వాటి పుల్ల(లు); కొన్నిచోట్ల, పట్టునేతకు ఇనుము, ఇత్తడి, ఉక్కు మొ. వాటి ఊచలు వాడతారు. చూ. చిత్రం 88 క. 8 (కో. 28).

**పన్ను** **1.** (క్రి.) ఊడ్తె, పడుగు, మోకు, అచ్చు మొ.వి పనికి సిద్ధంచేసుకోటం (కో. 26, 30-33, 37; తె. 11-13, 16, 17, 35); **2.** (బహు. పండ్లు, పల్లు, పళ్ళు) ఉ. పండు, పల్లు; పర్యా. గాడిచిల్ల, గాడిపన్ను, గుదిపుల్ల, డొలముల్లు, దోనుగఅడ్డు, దోనుగకాన, దోనుగమొలికి, దోనుగసీల(2), దోనెపన్ను, దోనెపుల్ల, దోనెపూస, దోనెముల్లు, దోనెమేకు, నాలిక(4), నేతముల్లు, పుల్ల(10), బటువుపుల్ల, ములికి(1), మేకు(8), లొండకొయ్య, సీల(10). దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల, కొండి. చూ. చిత్రం 123 క. 4 (కో. 4-7, 9, 10, 14, 22-26, 33, 37; తె. 2, 4-9, 18, 20, 21, 22, 25-33; రా. 14, 17, 18); **3.** పర్యా. చూ. బిర్రుచిట్టె(2). పంజెం ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిది; చూ. చిత్రం 19 క. 4 (రా. 24); **4.** పర్యా. చూ. దోనుగపన్ను. ఉన్నిమగ్గం దోనుగ గాడిలో చువ్వబిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల(లు) (తె. 27).

**పన్నె** ఉ. పన్ని. **1.** రూ. పని, పనె(1), పైన, ఫనీ; పర్యా. అచ్చు(5). జొన్న, వెదురు మొ. వాటి ఈనెలుగాని, ఇత్తడి, ఇనుము ఉక్కు మొ.వాటి ఊచలు గాని, దువ్వెనపండ్ల మాదిరిగా బిగించిన ఒకరకం పనిముట్టు; అచ్చుకట్టేటప్పుడు, ఈనెల మధ్య సందుల్లోనుంచి బద్దెపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగు పోగులు వీటిల్లోనుంచి వస్తాయి. చూ. చిత్రం 90 (కో. 1-15, 17, 18, 20, 21, 25, 26, 28, 33; తె. 1-14, 17-21; రా. 1-24); **2.** రూ. పనె(2). నవారు మగ్గంనిలువుల మధ్య, పై అడ్డపట్టెకు అమర్చిన ఇనప పనిముట్టు. చూ. చిత్రం 324 ట. 4 (రా. 10); **3.** పర్యా. చూ. పేటుపన్నె. పేటుదారాలు దూర్చి (రెండు పాయలుగా విడదీసి)న చిన్నపన్నె; ఈనెల చట్రం; డాబీఅడకు కొంచెం కిందగా అమరుస్తారు. చూ. చిత్రం 132 చ. 8 (కో. 6, 7; తె. 13; రా. 8).

**పన్నెఇల్లు** ఉ. పన్ని ఇల్లు; పర్యా. చూ. గూడు(3). పన్నెదండెలకు బిగించిన పుల్లల మధ్య వెలితి; అచ్చు కట్టేటప్పుడు ఒక్కొక్క దాంట్లో రెండేసి బద్దెపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 88 క. 9 (రా. 16-18).

**పన్నెఓడ** ఉ. పన్నిఓడ. చూ. పన్నెగోడ(తె.20).

**పన్నెకట్టకం** రూ. పన్నెకట్టడం; పర్యా. చూ. పన్నెగోడ. తయారయిన పన్నెలో, అడ్డంగా వెదురు దండెలు బిగించి కట్టిన పైభాగం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 6 (రా. 13).

**పన్నెకట్టడం** చూ. పన్నెకట్టకం (రా. 15).

**పన్నెకట్టు** ఉ. పన్నెగట్టు. **1.** రూ. పనికట్టు, పనెకట్టు; పర్యా. దండెకట్టు(3). పన్నెకట్టుబడిలో, ఈనె (పుల్ల)ల బిగింపుకోసం, అడ్డంగా రెండు వెదురుబెత్తాలు పెట్టి, వేసిన దారంపుకట్టు. చూ. చిత్రం 88 క. 7 (కో. 2); **2.** (క్రి.) రూ. పనికట్టు(2), పనెకట్టు, పైనకట్టు. పన్నెకట్టే జంత్రం బొమ్మలకు బిగించిన దండెల మధ్య జొన్న-కొన్నిచోట్ల, కలప, గలుగు-పుల్లలు, దువ్వెన పండ్లమాదిరిగా వరసగా బిగించిపన్నె తయారు చెయ్యటం (కో. 1-15, 17, 18, 20, 21, 25, 26, 28, 33; తె. 1-7, 9-14, 17-21; రా. 1-24).

**పన్నెకోరు** పర్యా. చూ. పన్నెగోడ. తయారయిన పన్నెలో, అడ్డంగా వెదురుదండెలు బిగించి కట్టిన పైభాగం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 6 (తె. 19).

**పన్నెగట్టువాళ్ళు** ఉ. పన్నెగట్టేల్లు, పన్నెగట్లోల్లు; రూ. పన్నెగట్లవాళ్ళు. పన్నెలు తయారుచేసేవాళ్ళు, తురక(సాయెబు)లు (తె. 4; రా. 9, 12, 19, 20).

**పన్నెగట్టుసాయేబులు** ఉ. పన్నెగట్టు సాయబ్బులు

పన్నెలు తయారుచేసేవాళ్ళు; తురక(సాయెబు)లు. (కో. 6; రా. 10).

**పన్నెగట్లవాళ్ళు** ఉ. పన్నెగట్లోల్లు. చూ. పన్ను గట్టువాళ్ళు. (తె. 1, 21, 28, 30).

**పన్నెగడ్డ** పర్యా. చూ. పన్నెగోడ. తయారయిన పన్నెలో, అడ్డంగా వెదురుదండెలు బిగించి కట్టిన పై భాగం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 6 (రా. 23, 24).

**పన్నెగది** రూ. పైనగది; పర్యా. చూ. గూడు(3). పన్నెదండెలకు బిగించిన పుల్ల(ఈనె)ల మధ్య వెలితి; అచ్చుకట్టేటప్పుడు, రెండేసి బద్దెపోగులు ఒక్కొక్క దాంట్లో దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కింది పోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 88 క. 9 (కో. 28).

**పన్నెగాడి** పర్యా. చూ. పలకగాడి(1). మరమగ్గం పలకకు, పన్నె బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 118.12 (రా. 24).

**పన్నెగూడు** రూ. పనిగూడు, పనెగూడు; పర్యా. చూ. గూడు(3). పన్నెదండలకు బిగించిన పుల్ల(ఈనె)ల మధ్య వెలితి; అచ్చుకట్టేటప్పుడు, ఒక్కొక్కదాంట్లో రెండేసి బద్దెపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు, పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 88 క. 9 (కో. 4, 6, 13; తె. 15; రా. 13, 14, 16-18).

**పన్నెగెడ్డం** పర్యా. చూ. పన్నెగోడ. తయారయిన పన్నెలో అడ్డంగా వెదురుదండెలు బిగించి కట్టిన పై భాగం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 6 (కో. 3).

**పన్నెగోడ** ఉ. పన్నెగోడు; రూ. పనెఓడ, పన్నెఓడ; పర్యా. పన్నెకట్టకం, పన్నెగెడ్డం, పన్నెదిండు, పన్నెకోరు, పన్నెగడ్డ, పన్నెచూరు. తయారయిన పన్నెలో, అడ్డంగా వెదురుదండెలు బిగించి కట్టిన పై భాగం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 6 (తె. 5, 8, 10, 11, 13, 14, 17, 19).

**పన్నెచూరు** ఉ. పన్నెసూరు; పర్యా. చూ. పన్నెగోడ. తయారయిన పన్నెలో, అడ్డంగా వెదురుదండెలు బిగించి కట్టిన పై భాగం; అటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 6 (కో. 4).

**పన్నెతుంట** ఉ. పన్ని-. మరమగ్గం చట్రంలో మామూలు పన్నె అమర్చగా మిగిలిన ఖాళీని నింపటానికి పెట్టినచిన్న పన్నె; ఇటువంటివి రెండుంటాయి; చూ. పన్నె (కో. 3, 4).

**పన్నెదండె** రూ. పనిదండె, పనెదండె(ం), పన్నెదండెం, పైనదండె; పర్యా. చూ. దండె(3). పన్నెకట్టుబడిలో, ఈనెల బిగింపుకోసం, అడ్డంగా కట్టిన వెదురుబెత్తం; ఇటువంటివి, పైనా కిందా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (కో. 6; తె. 10, 19).

**పన్నెదండెం** చూ. పన్నెదండె (రా. 11, 14).

**పన్నెదబ్బ** 1. చూ. పన్నెబద్ద (రా. 14, 16, 18); 2. పర్యా. చూ. దండె(3). పన్నెకట్టుబడిలో, ఈనెల బిగింపుకోసం, అడ్డంగాకట్టిన వెదురుబెత్తం; ఇటువంటివి, పైనా కిందా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (రా. 16, 18).

**పన్నెదవడ** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి, చూ. చిత్రం 88 క. 10 (కో. 10).

**పన్నెదిండు** పర్యా. పన్నెగోడ. తయారయిన పన్నెలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పు బద్ద; నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 6 (రా. 17).

**పన్నెపుల్ల** 1. పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసేటప్పుడు, ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (రా. 16, 23, 24); 2. పర్యా. చూ. ఈనె(1). పన్నెకట్టుబడిలో, దండెలమధ్య, దువ్వెనపళ్ళమాదిరిగా వరసగా కట్టిన కలప, జొన్న, గలుగు, వెదురు, కొండచీపురు మొ.వాటి పుల్ల(లు); కొన్నిచోట్ల, పట్టునేతకు ఇనుము, ఇత్తడి, ఉక్కు మొ.వాటి ఊచలు వాడతారు. చూ. చిత్రం 88 క. 8 (కో. 28); 3. పర్యా. చూ. దండె(3). పన్నెకట్టుబడిలో, ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురు బెత్తం; ఇటువంటివి, కిందా పైనా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (కో. 2).

**పన్నెబద్ద** రూ. పన్నెదబ్బ(1); పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసేటప్పుడు, ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 10).

**పన్నెబద్దె** పర్యా. చూ. బద్దె. అచ్చుతుక్కోటానికి, సుమారు బెత్తెడు వెడల్పు నేసి, చివర జానెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తిచేసిన తరవాత, అచ్చులో బద్దెకోసి మరొకపడుగుకు అతుకుతారు. చూ. చిత్రం 102.2 (తె. 7).

**పన్నెబల్ల** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో,

ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 33).

**పన్నెబిళ్ళ** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 2).

**పన్నెబెంతు** ఉ. పన్నెబెందు; చూ. బెంతుపనె. (కో. 7).

**పన్నెముక్కాలదొడ్డి** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి, మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో, (పక్క) తాళ్ళు దూర్చిన ఈనెలచట్రం; పన్నెమాదిరి; చూ. పక్కజల్లి. చూ. చిత్రం 134 చ. 1 (కో. 33).

**పన్నెముల్లు** పర్యా. చూ. బెంతికదురు. అచ్చుకట్టేటప్పుడు, పన్నెగూళ్ళలో పోగులుదూర్చే పుల్ల; మామూలుగా ఇనపది; కంటాణీ లాంటిది; దీనికి పదునుగా ఉన్న వైపు, పోగు దూర్చటానికి చిన్నకొక్కెం ఉంటుంది; కొన్నిచోట్ల, రెండోవైపున పిడి ఉంటుంది. చూ. చిత్రం 94 (రా. 1).

**పన్నెవాడు** పన్నెలు తయారుచేసేవాడు; తురక (సాయేబు) (రా. 3).

**పన్నెసిబిర** పర్యా. చూ. దండె(3). పన్నెకట్టుబడిలో, ఈనెల బిగింపుకోసం, అడ్డంగా అమర్చికట్టిన వెదురుబెత్తం; ఇటువంటివి, పైనా కిందా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (రా. 16).

**పప్పళి(చీర)** ఉ. పప్లీ; చూ. పొప్పిళిచీర (రా.24).

**పప్పుగుత్తి** పర్యా. తెడ్డు. ఒకరకం గరిటె; దీంతో రంగులు కలుపుతారు. చూ. చిత్రం 282 క. 7(కో.17).

**పప్పుగోంగూరచీర** **1.** సలువు, పసుపు (బీరపువ్వు) వన్నెల్లో పడుగు, పేక నేసిన కలనేతచీర; నిలువుకు బీర పువ్వురంగు, అడ్డానికి సలువుపెడతారు; ఎరుపులో కాని, పసుపులో కాని అంచులు, కమ్ములు నేస్తారు (కో. 6, 8, 9); **2.** సుమారు ఇరవై పోగుల చొప్పున రెండు రంగులుపెట్టి పడుగు, పేక నేసిన చీర (కో. 32).

**పప్పుతెడ్డు** కొయ్యగరిటె; దీంతో రంగులు కలుపుతారు. చూ. తెడ్డు. చూ. చిత్రం 282 క. 7 (కో. 20, 21).

**పబ్బు** సర్వీచెట్టుమాదిరి ఒకరకం చిన్నచెట్టు; సర్వీఆకు కంటె సన్నటి ఆకు ఉంటుంది; నూలు, రంగును పీల్చు కోటానికి ఈ ఆకులు వాడతారు; *Calamus rotang*; Linn. (కో. 8).

**పమిటఅద్దకం కమ్మి** పేకదారం ఏ రంగులో ఉంటే, అదే రంగు పైటకొంగుకు అద్దిన కమ్మి (కో. 12).

**పమిటచెరగు** ఉ. పమిటసెరగ; చూ. పైటచెరగు (తె. 18).

**పమిటిఅంచు** బట్ట అడ్డకొసలో నేసిన భాగం; కమ్మి; మామూలుగా, వెడల్పుగా నేసిన పట్టె; దీంట్లో కొన్నిచోట్ల, డిజైన్లు నేస్తారు; చీరలు, పంచెలు, కండువాలు, తువ్వాళ్ళు, అంగవస్త్రాలు మొ.వాటికి నేసేది; మామూలుగా, చీర పైచెరగులో పెద్దది, కట్టుచెరగులో చిన్నది నేస్తారు (కో. 7).

**పమిటికండువా** ఉ. -కండవా; చూ. పైటకండువా (కో. 18).

**పమిటికొంగు** పర్యా. చూ. పైటచెరగు. చీర కట్టుకొన్నప్పుడు, బుజంమీద (వేలాడేట్టు) వేసుకొనే చెరగు; చీర చివరి మూరెడు భాగం; మామూలుగా, ఇది మొట్టమొదట నేస్తారు. చూ. చిత్రం (కో. 5).

**పమిటిచెంగు** చూ. పైటచెరగు (కో. 7, 23).

**పమిటె** రూ. పయిటీ; పర్యా. చూ. పైటకండువా ఆడపిల్లలు (పరికిణీమీద) నడుముకు చుట్టుకొని, పైన కప్పుకొనే బట్ట; రెండు, మూడు మూరల పొడుగుది (కో. 15).

**పమిడిపత్తి** రూ. పగిడిపత్తి, పయిడిపత్తి, భమిడిపత్తి. తెల్లపత్తి; చిన్నకాయ, గింజనలుపు; దీన్ని ఎక్కువగా దీపపువత్తులకు వాడతారు (కో. 6, 7, 11, 14, 17, 18. 21).

**పంబ** పకినప్పుడు విచ్చుకొన్న దూదిపింజె (కో.11).

**పంబకొట్టు** (క్రి.) పర్యా. సరంకొట్టు. దూది ఏకేటప్పుడు కమానునరం కొట్టటం (కో. 5).

**పంబకోడు** పర్యా. చూ. కమాను(1). దూదిఏకే కొయ్యపనిముట్టు, నేతపనివాళ్ళ వాడుక; దూదేకుల వాళ్ళు 'కమాను' అంటారు. చూ. చిత్రం 9(కో.5,6).

**పయిటీ** చూ. పమిటె (రా. 16).

**పయిడిపత్తి** చూ. పమిడిపత్తి (కో. 12, 15, 19, 20).

**పయ్య** పర్యా. చూ. చెక్రం(4). డబ్బారాట్నం ఇరుసుకు బిగించిన (రేకు)చెక్రం; దీనిమీద వడిదారం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 9 (తె. 8, 10,22,23).

**పరకపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 23, 25).

**పరగళ్ళకట్టె** పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండటి, నున్నటికర్ర; దీన్ని కొత్తలల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (రా. 19).

**పరిగెడిలాక** చూ. పడుగెరిలాక (తె. 29, 32, 33).

**పరంగిపేటు** అంచులో, ముక్కోణాకారంగా నేసి, దానికి చుట్టూ మొగ్గలుపడేటట్లునేసిన డిజైను(కో.14).

**పరదా** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పని ముట్టు; పంటె మొ. వాటికి దీనికి తగిలించిన చిలప (ఇచ్చె) నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (రా. 1).

**పరదేసికొయ్య** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివరపాతినకొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి, పెడకోలకుచుట్టి, పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల, నేతమోకు పెడకోలకు కట్టి, దీనికి పనుగుమెలిక వేస్తారు. కొన్నిచోట్ల, ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 23, 24, 2౦).

**పరాకిపేటు** ఉ. పరాకుపేటి. అంచులో గువ్వ కండ్ల మాదిరిగా నేసిన డిజైను (తె. 1, 4).

**పరాసుపేటు** ఉ. పరాస్ పేటి. అంచులోనేసే ఒక రకం డిజైను చూ. చిత్రం 266 (తె. 28).

**పరికిణీగుడ్డ(లు)** ఉ. పరికినీగుడ్డ; పర్యా. లంగా గుడ్డ. ఆడవాళ్ళ పరికిణీలకోసం నేసినగుడ్డ; కొన్నిచోట్ల, లంబాడివాళ్ళు కట్టుకొనే పరికిణీగుడ్డ (కో. 17; తె. 16).

**పరికె** జనపనార వడికి పట్టాలు నేసి జీవించేవాళ్ళలో ఒక తెగ; వీరి ఉపవృత్తి వ్యవసాయం (తె. 25).

**పరిగెడికోల** ఉ. పరిగెరికోల; చూ. పడుగేరుకోల (తె. 22, 32, 33).

**పరిటె** ఉ. పరిటి. **1.** చూ. పంటె (కో. 33, 34; రా. 6, 11, 15); **2.** పర్యా. చూ. ప్రంకరు. నూలు చిలపలుగా చుట్టే పనిముట్టు. చూ. చిత్రం 38 (తె. 2).

**పరిటెకట్టె** ఉ. పరిటికట్టె; పర్యా. చూ. పంటె కామ. పంటెమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువు కర్ర. చూ. చిత్రం 19 క. 1 (రా. 15).

**పరిటెకమ్మి** పర్యా. చూ. పంటెకామ. పంటె మధ్య ఆకులకు అధారంగా ఉండే నిలువుకర్ర. చూ, చిత్రం 19 క. 1 (కో. 34).

**పరిటెముక్కు** ఉ. పరిటిముక్కు, పరిటెముక్కు; చూ. పంటెముక్కు (రా. 11, 15).

**పరిడికట్టె** రూ. పరుడుగట్టె; పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర; దీన్ని కోల్తల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (రా. 6).

**పరుడుగట్టె** చూ. పరిడికట్టె (రా. 19ఎ).

**పరుపు** **1.** పర్యా. కుంచెచట్టం, కుంచెపరుపు, వాయి(1), వాయిదం, వాయిదారి(1). కుంచె(=పడుగు సాపుచేసేది) పురి అడుగుభాగం; కుంచెవేసేటప్పుడు, పడుగుమీద (సమంగా) అనుతుంది. చూ. చిత్రం 76 క. 11 (రా. 11, 17, 24); **2.** పర్యా. గూటాల తొట్టి. మగ్గంగుంటలో (భీంమగ్గం) పావుచెక్కలు బిగించిన చట్రం. చూ. చిత్రం 121 జ (తె. 18); **3.** పర్యా. అడ్డబేలు. చేతిమగ్గం మీద డిజైన్లు నెయ్యటానికి, పడుగుకు పైన వంతెన మాదిరిగా అడ్డంగా కట్టిన దారాలు; వీటినుంచి పడుగులోకి వచ్చిన నిలువు దారాలు పడుగుపోగులలో కొన్నిటిని పైకి ఎత్తుతాయి. చూ. చిత్రం 136 క. 1 (తె. 5, 18); **4.** రంగు తొట్టెలో పింజెరమీద ఒత్తుగా పెట్టిన మడతగుడ్డ; అరంగుళం మందంది; దీనిమీద మెత్త పరిచి రంగు పోస్తారు (కో. 26).

**పరుపుగుడ్డ** పరుపులు కుట్టించుకోటానికి నేసినబట్ట (కో. 15).

**పరుపుతాను** పరుపుగుడ్డతాను (కో. 18).

**పరెడకర్ర** పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు, కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటి కర్ర; దీన్ని కోల్తల వెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (కో. 4).

**పరేత** పర్యా. చూ. ప్రంకరు. నూలు చిలపలుగా చుట్టే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 38క, ట(తె.28).

**పర్దాతట్టు** నేలమీద పరుచుకొనే నారపట్టా; ఇటువంటివి కొన్ని పట్టాలు కలిపి కుడతారు (తె. 25).

**పర్షన్** (< Persian) పూర్తిగా డిజైన్లు పడేట్టు నేసిన తివాసీ (తె. 17).

**పలక** ఉ. పల్క. **1.** కమాను (=దూదిఏకే కొయ్య పనిముట్టు)కు రెండోవైపున ఉండే చిన్న కొయ్యపలక. చూ. చిత్రం 9.3 (కో. 7); **2.** పర్యా. చూ. కమాను (1). దూది ఏకే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 9 (కో. 4, 8, 10; తె. 13, 14, 16; రా. 19); **3.** పర్యా. చూ. తలపలక. కమాను (=దూది ఏకే కొయ్యపని ముట్టు)కు ఒకవైపున ఉండే వెడల్పు కొయ్యపలక. చూ. చిత్రం 9.2 (కో. 4, 6-8, 13); **4.** పర్యా. చేతి గుండు, చేతిపలక(1), దండె(7), పైపలక(1), మగ్గం పలక(1), మీది గుండు. చేతిమగ్గం పన్నె బిగించిన పై చెక్క; పలచగాపొడుగ్గా ఉంటుంది; దీనికిపైన దారాలు కట్టి వేలాడదీస్తారు; నేత నేసేటప్పుడు పోగు దగ్గరపడటానికి దీంతో అదుముతారు. చూ. చిత్రం 109 చ. 1 (కో. 1, 3, 4, 9, 11-22, 24, 30; తె. 2, 4, 5, 7, 12, 14, 16-21, 24, 28, 30, 31; రా. 8, 10, 14-16, 19ఎ, 20, 21); **5.** రూ. కలప(2); పర్యా.

దోనెపలక, పచ్చుం. మగ్గంమీద, నేతగుడ్డచుట్టే పలుపలకల దోనెలో ఒకవైపు. చూ. చిత్రం 123 క. 6 (కో. 24, 26; తె. 8; రా. 16, 17, 19); **6.** పర్యా. చూ. పలకసీల. చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య; కొన్నిచోట్ల, దీనికి పైభాగంలో సగపీలు చెక్కుతారు; కొన్నిచోట్ల, దీన్ని తొలిచి, లోపల గజ్జెలు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 3 (కో. 4); **7.** పర్యా. ఆకు(11), గుండు(5). గుండుబల్ల(2), చేపలక(1), పలకగుండు(3), పైపలక (1), మగ్గంగుండి, మగ్గంపలక(3), సట్టరుపలక, సంటరుపలక, సలాక(2). మరమగ్గంలో పన్నె బిగించిన పై చెక్క; నేత నేసేప్పుడు, పడుగులో పేకపోగు వేసి దీంతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (కో. 3-5, 10, 22, 37; తె. 8, 9, 11-15, 17, 19, 21, 30; రా. 13, 19, 24); **8.** పర్యా. చూ. కత్తి(3). నవారు నేసేటప్పుడు, పడుగులో పేకపోగు దట్టించే కొయ్యపలిముట్టు; కత్తిమాదిరిది. చూ. చిత్రం 324 చ. 4 (తె. 12; రా. 10); **9.** నారపట్టా నేసేటప్పుడు, పడుగులో వేసిన పేకదారం దట్టించే కొయ్యచెక్క. చూ. చిత్రం 304.4 (తె. 25); **10.** పర్యా. చూ. జంత్రందిండు. గొంగడి నేసే మగ్గం జంత్రానికి, కింద బిగించిన కొయ్య చెక్క. చూ. చిత్రం 316.1 (తె. 3, 11); **11.** పర్యా. దోనుగపలక(1). నేత నేసేటప్పుడు, ఉన్నిమగ్గానికి, గొంగడిచుట్టే దోనుగకు ఒకవైపు; పక్షం; చూ. దోనుగ. చూ. చిత్రం 315క. 1 (తె. 9, 20, 25); **12.** పర్యా. పలకనేత. సుమారు జెత్తెడు పొడుగు నేసిన బట్ట; దోనెకు చుట్టటానికి, ఒక (పలక) పక్షానికి సరిపడేది (కో. 3; రా. 1, 5, 10).

**పలకఆట** నేతనేసేటప్పుడు, పలక ముందుకు వస్తూ వెనక్కుపోయేట్టు లాగటం (తె. 1).

**పలకఇరువు(తాడు)** పర్యా. చూ. బిర్రుతాడు(2). మరమగ్గం నిలువుపట్టెను, మేరుపుపలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టిన దారం; మేరుపుపలకను పైకిగాని, కిందికిగాని జరుపుకొని, దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118.6 (రా. 19బి).

**పలకఊపురం** ఉ. పలకూపరం, పల్కఊపురం; పర్యా. చూ. ఊపురం. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు, పడుగులో పేకపోగు వేసి దీంతో అదుముతారు. చూ. పలకకొట్టు. చూ. చిత్రం 109 చ. 5 (తె. 13, 31-33).

**పలకకుంచె** పర్యా. సాదాకుంచె(1), సాదా పరుపు కుంచె. కుంచెపరుపు, పురి అడుగుభాగం సమతలం (=చదును)గా ఉన్న కుంచె. చూ. చిత్రం 76క (రా. 23).

**పలకకొట్టు** ఉ. (క్రి.) పలగొట్టు, పలగ్గొట్టు, పల్కగొట్టు; పర్యా. పలకతట్టు(1), పలకదెబ్బకొట్టు, పలకవేయు(1), మగ్గంకొట్టు. నేతనేసేటప్పుడు, పడుగులో నాడె(=పేకదారం కండెకలది) వేసిన తరవాత, పోగు దగ్గరబడేటట్లు చేతిపలకతో అదమటం (కో. 4-7, 10, 22, 23; తె. 1, 5; రా. 1, 7, 10-19, 19ఏ, 19బి, 23, 24).

**పలకగట్టుతాడు** ఉ. పలగ్గట్టుతాడు. పర్యా. చూ. చెంపతాడు(3). చేతిమగ్గం పలకను, గుండును కలిపి బిగించిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 1 (రా. 21).

**పలకగాడి** **1.** రూ. పలకగేడి; పర్యా. గాడి(3), చట్టంగాడి, దోనె(2), పన్నెగాడి. మరమగ్గం పలకకు పన్నె బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 118.12 (రా. 17); **2.** ఉ. పలగ్గాడి, పల్కగాడి; రూ. పలకగాడెం; పర్యా. గాడి(1), దోనె(1), పలకగాల, పలకదోనె(1). చేతిమగ్గం పలకకు పన్నె పైవైపు బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 109 చ. 2 (కో. 34, 36, 37; తె. 4, 18, 19, 22, 25).

**పలకగాడెం** ఉ. పల్కగాడెం; చూ. పలకగాడి(2) (తె. 13).

**పలకగాల** ఉ. పలగ్గాల; పర్యా. చూ. పలకగాడి(2). చేతిమగ్గం పలకకు పన్నె పైవైపు బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 109 చ. 2 (తె. 24).

**పలకగుండు** ఉ. పలగ్గుండు, పల్కగుండు. **1.** పర్యా. చూ. గుండు(4). చేతిమగ్గం పన్నె బిగించిన కిందికొయ్య; రోకలి మాదిరిగా, గుండ్రంగా ఉంటుంది; దీన్ని పలకసీలలతో పై పలకకు బిగిస్తారు. చూ. చిత్రం 109 చ. 7 (కో. 1, 3-7, 9, 10, 24, 34, 36, 37; తె. 5, 15, 16, 19; రా. 14, 17); **2.** పర్యా. చూ. పానుపు పట్టె. మరమగ్గంలో, పన్నెబిగించిన కిందికొయ్య; నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 34, 36); **3.** పర్యా. చూ. పలక(7). మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క; నేతనేసేటప్పుడు, పడుగులో పేకపోగు వేసి దీంతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (కో. 1).

**పలకగుడి** ఉ. పలగ్గుతి, పలగ్గుది. **1.** పర్యా. చూ. పలకసూత్రం. చేతిమగ్గం పలకను పైనుంచి వేలాడదియ్యటానికి పలకబుజానికి కట్టిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 6 (కో. 22, 33, 36, 37); **2.** పర్యా. చూ. చెంపతాడు(3). చేతిమగ్గం పలకను, గుండును కలిపి బిగించిన దారం; ఇటు

వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 1 (తె. 25, 31).

**పలకగేడి** చూ. పలకగాడి(1) (రా. 16).

**పలకగొట్టం** మగ్గంఅచ్చుకు, పలకకు రాపిడి లేకుండా అడ్డుపెట్టిన వెదురుగొట్టం (కో. 34).

**పలకగొంపం** 1. పర్యా. చూ. పలకబుజం(1). చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం; కొన్నిచోట్ల, దీనికి నగిషీలు చెక్కుతారు; ఇటువంటి రెండు భాగాలకు చిల్లులుచేసి పలకసూత్రాలు కడతారు. చూ. చిత్రం 109.4 (కో. 37); 2. పర్యా. చూ. ఊపురం. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు, పడుగులో పేకపోగు వేసి దీంతో అదుముతారు; చూ. పలకకొట్టు. చూ. చిత్రం 109 చ. 5 (కో. 37).

**పలకగోపురం** ఉ. పలకగోపరం, పలకగోత్రం; పర్యా. చూ. ఊపురం. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు, పడుగులో పేకపోగు వేసి దీంతో అదుముతారు; చూ. పలకకొట్టు. చూ. చిత్రం 109 చ. 5 (కో. 3, 5, 7; రా. 13, 14).

**పలకచుట్టు** (క్రి.) పర్యా. చూ. పలకవేయు(2). నేసినబట్ట చుట్టటానికి, దోనె(పలక) తిప్పడం; నేతపనివాడు తనవైపుకు తిప్పుకొంటాడు (రా. 1, 7).

**పలకచెవి** 1. పర్యా. చూ. పలకసీల. చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య; కొన్నిచోట్ల, దీనికి పై భాగంలో నగిషీలు చెక్కుతారు; కొన్నిచోట్ల, దీన్ని తొలిచి, లోపల గజ్జెలు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 3 (తె. 20); 2. పర్యా. చూ. పలకబుజం(1). చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం; కొన్నిచోట్ల, దీనికి నగిషీలు చెక్కుతారు; ఇటువంటి రెండు భాగాలకు చిల్లులువేసి పలకసూత్రాలు కడతారు. చూ. చిత్రం 109.4 (కో. 7, 10).

**పలకడొక్క** పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గం చట్రంలో, పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు; నేతనేసేటప్పుడు, నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (కో. 37).

**పలకతట్టు** (క్రి.) 1. పర్యా. చూ. పలకకొట్టు. నేతనేసేటప్పుడు, పడుగులో నాడె (=పేకదారం కండె కలది) వేసిన తరవాత, పోగు దగ్గరబడేటట్లు చేతిపలకతో అదమటం (కో. 4, 6); 2. పర్యా. పలకపట్టు. నేతనేసేటప్పుడు పేకపోగులు సరిగా పడకపోతే పలకను గట్టిగా తట్టి సరిచెయ్యటం (కో. 32).

**పలకతాడు** ఉ. పల్కతాడు. 1. పర్యా. చూ. పలకసూత్రం. చేతిమగ్గం పలకను పైనుంచి వేలాడదియ్యటానికి పలకబుజానికి కట్టిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 6 (కో. 9, 24; తె. 4); 2. పర్యా. చూ. చెంపతాడు(3). చేతిమగ్గం పలకను, గుండును కలిపి బిగించిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 1 (తె. 4, 22); 3. చేతిమగ్గం పలకకు ఆధారంగా మగ్గం పైనుంచి వేలాడదీసినతాడు; దీనికి చివర చిలుకొయ్య కడతారు. (కో. 33).

**పలకతిప్పు** (క్రి.) పర్యా. చూ. పలకవేయు(2). నేసిన బట్ట చుట్టటానికి, దోనె(పలక)తిప్పటం; నేతపనివాడు, తనవైపుకు తిప్పుకొంటాడు (కో. 2, 7; రా. 12, 14, 16, 24).

**పలకదెబ్బకొట్టు** (క్రి.) పర్యా. చూ. పలకకొట్టు. నేతనేసేటప్పుడు, పడుగులో నాడె (పేకదారం కండె కలది) వేసిన తరవాత, పోగు దగ్గరబడేటట్లు, చేతిపలకతో అదమటం (కో. 6).

**పలకదోనుగ** ఉ. పలకదోనుగు; చూ. పలకదోనె (2) (కో. 36).

**పలకదోనె** 1. ఉ. పలకదోని; పర్యా. చూ. పలకగాడి(2). చేతిమగ్గం పలకకు పన్నెపైవైపు బిగించటానికి చేసిన సందు. చూ. చిత్రం 109 చ. 2 (తె.7,31,32); 2. చూ. పలకదోనుగ. మగ్గం మీద, నేతగుడ్డ చుట్టే ఒకరకం దోనె; నలుపలకలది; చూ. దోనె (కో. 15).

**పలకనాలిక** ఉ. పల్కనాల్క; పర్యా. చూ. పలకసీల. చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య; కొన్నిచోట్ల, దీనికి పైభాగంలో నగిషీలు చెక్కుతారు; కొన్నిచోట్ల, దీన్ని తొలిచి లోపలి గజ్జెలు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 3 (తె. 19).

**పలక(నేత)** పర్యా. పలక(12). సుమారు బెత్తెడు పొడుగు నేసిన బట్ట; దోనెకు చుట్టటానికి ఒక(పలక=) పక్షానికి సరిపడేది (కో. 24; రా. 4, 8, 13, 17, 24).

**పలకపట్టు** (క్రి.) పర్యా. పలకతట్టు(2). నేతనేసేటప్పుడు పేకపోగులు సరిగా పడకపోతే పలకను గట్టిగా తట్టి సరిచెయ్యటం (కో. 35).

**పలకపట్టులాక** నేతనేసేటప్పుడు, పలకను సరిచూసుకోటానికి కొలిచే లాక; దోనెకు, దండెకు మధ్య పెట్టి కొలుస్తారు (కో. 32).

**పలకపట్టె** ఉ. పలకపట్టి; పర్యా. చూ. మేరువు పలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు

వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇవి మగ్గంపందిరి మీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం118. 3 (రా.15).

**పలకపిడి** మరమగ్గం పలకను పట్టుకోటానికి వీలుగా పైన బిగించిన చెక్క. చూ. చిత్రం 118.11 (రా.14)

**పలకపీట** పర్యా. చూ. పీట(2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (తె. 6).

**పలకపోత** నేసిన గొంగడి మగ్గందోనుగ(పలక)కు చుట్టటం (తె. 9).

**పలకబుజం** 1. పర్యా. కణత, చెంప(3), చెవి (4), పలకగొంపం(1) పలకచెవి(2), పూజె, బుజం(1), మోపురం(1). చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం; కొన్నిచోట్ల, దీనికి నగిషీలు చెక్కుతారు; ఇటువంటి రెండు భాగాలకు చిల్లులుచేసి పలకసూత్రాలు కడతారు. చూ. చిత్రం 109 చ. 4 (కో. 22; 34; తె. 31); 2. పర్యా. చూ. ఊపురం. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు, పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు; చూ. పలకకొట్టు. చూ. చిత్రం. 109చ.5(కో. 33, 34, 36; తె. 2, 7; రా. 15,17).

**పలకబొడ్డు** పర్యా. చూ. ఊపురం. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు నడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు; చూ. పలకకొట్టు. చూ. చిత్రం 109 చ. 5 (కో. 6).

**పలకమగ్గం** ఉ. పలకమొగ్గం; పర్యా. చూ. చేతిమగ్గం(1). పడుగులో పేకదారపుకండె బిగించిన నాడె చేత్తో వేస్తూ నేసేమగ్గం; చాలాకాలంనుంచి వాడుకలో ఉన్నది; అందుల్లో వేరువేరు పోగులు చేత్తో తిప్పుతూ నేసేనేతకు పట్టునేతకు, డిజైన్ల నేతకు బాగా అనువైనది; దీంతో పని నిదానంగా జరుగుతుంది. చూ.చిత్రం 109, 127 (తె. 3).

**పలకమలుపు** (క్రి.) ఉ.- మల్పు. గొంగడిమగ్గం దోనుగపలక తిప్పటం; పలక తిప్పినప్పుడు, బట్ట దానికి చుట్టుకొంటుంది (తె. 20).

**పలకరేకు** పర్యా. చూ. రేకు(2). నేతనేసేటప్పుడు మరమగ్గం మేరువుపలక సులువుగా ఆడటానికి బిగించిన ఇనపరేకు; కొన్నిచోట్ల సట్టరుగుంజ అడ్డపట్టెకు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.5 (రా. 4 19).

**పలక(ల)పూజ** వినాయక చవితినాడు, నేతపనివాళ్ళు మగ్గం పలకలకు చేసేపూజ (తె. 1, 2; రా. 24)

**పలకవేయు** (క్రి.) 1. పర్యా. చూ. పలకకొట్టు. నేతనేసేటప్పుడు, పడుగులో నాడె (=పేకదారం కండె కలది) వేసిన తరవాత, పోగు దగ్గరబడేటట్లు చేతిపలకతో అదమటం (తె. 15); 2. ఉ. పలకేయు; రూ. కలపవేయు; పర్యా. కలవ నింపు, దోనెతిప్పు, పలకచుట్టు, పలకతిప్పు. నేసిన బట్టచుట్టటానికి, దోనె(పలక) తిప్పటం; నేతపనివాడు, తన వైపుకు తిప్పుకొంటాడు. (కో. 2. 5, 6, 10; రా. 13, 22).

**పలకసీల** ఉ. పల్కసీల; పర్యా. చిట్టె(3), చెవసీల, పలక(6), పలకచెవి(1), పలకనాలిక, బిర్రుచెక్క, బొమ్మ(8), సీల(6). చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య; కొన్నిచోట్ల దీనికి పైభాగంలో నగిషీలుచెక్కుతారు; కొన్నిచోట్ల దీన్ని తొలిచి గజ్జెలు లోపల బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 3 (కో. 1, 5-8, 10, 11, 14. 33, 34, 36, 37; తె. 2. 4. 5, 11. 13, 15, 18, 25, 29, 32; రా. 11, 13-17, 21, 23, 24).

**పలకసూత్రం** ఉ. పల్కసూత్రం; పర్యా. తాడు (11), పక్కతాడు, పలకగుది(1), పలకతాడు(1). చేతిమగ్గం పలకను పైనుంచి వేలాడదియ్యటానికి పలకబుజానికి కట్టిన దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 6 (తె. 2 3 5. 18, 20, 23-25, 29, 31, 32).

**పలకొక్కండి** (< పలక + కొండి) పర్యా. చూ. కొండి(7). చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి, పలకసూత్రం చివర వేసిన వంకర ఊచ(ఇనపది); కొన్నిచోట్ల దీన్ని మగ్గం పైతానుకు వేసి, పలకసూత్రం దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 త. 1 (తె. 18).

**పలగగొట్టు** (క్రి.) ఉ. పలగ్గొట్టు. పగలగొట్టటం (తె. 22).

**పలుగు** పర్యా. చూ. గడ్డపార(1). ఊడ్తెను నిలబెట్టి మోకుతో బిగించటానికి నేలలో పాతిన గునపం. చూ. చిత్రం 63 త. 1 (కో. 7, 11, 13, 15, 16; తె. 13).

**పల్లకొట్టు** (క్రి.) తివాసీ నేసేటప్పుడు, పడుగులో దూర్చిన ఉన్ని దారాల్లో మిగిలిన పోగులు కత్తితో కొయ్యటం (తె. 17).

**పల్ల** పర్యా. చూ. చిట్టె(2). పంజె ఆకుల బిగింపుకు వేసేఅడ్డ బద్ద(లు). చూ. చిత్రాలు 19 క. 3, 19 క. 4 (తె. 9).

**పల్లం** నరచేసే పడుగులో, కచ్చికీ కచ్చికీ మధ్య భాగం (కో. 32).

**పల్లు** (బహు. పండ్లు) నేతనేసేటప్పుడు, మరమగ్గం చట్రం సులువుగా ఆడటానికి నట్టరుగుంజకు బిగించిన సీల; మెట్ట; ఇటువంటిని రెండుంటాయి; వీటిమీద మేరువుపలక మోపుతారు (తె. 31).

**పల్లుచెక్రంతాడు** పర్యా. చూ. నేతమోకు. మగ్గం మీద నేత(పడుగు)ను బిర్రుపెట్టే లావుపాటి తాడు; ఒకవైపు పెడకోలకు మధ్యగా కట్టి, మిడిగూటానికి మెలివేసి, రెండోవైపు చేతిగూటానికి - కొన్ని చోట్ల, పళ్ళచెక్రానికి - కడతారు; నేత దగ్గరకు రావటానికి మోకు వదులుతారు; వెనక్కు జరగటానికి బిగలాగుతారు. చూ. చిత్రం 127.16 (రా. 4),

**పల్లెకట్టె** ఉ. పల్లికట్టె, పళ్ళికట్టె; పర్యా. జిట్ట(2), దోనెకడ్డీ, దోనెచిల్ల, దోనుగకట్టె, దోనుగనాలిక, దోనుగసీల(1), నాలిక(2), నాలిబద్ద, పడికట్టె పిరికిన కట్టె. దోనెకు నేతబట్ట చుట్టటానికి, దోనె(పలక) తిప్పేకర్ర; కొన్నిచోట్ల ఇనపకడ్డీ; కుడివైపు దోనె బెజ్జంలో దూర్చి నేలకు ఆనుస్తారు. చూ. చిత్రం 123 చ. 2 (తె. 2, 6, 7-9, 26; రా. 18, 24).

**పల్లెంచు** డైమను చుక్కలు వరసగాపెట్టి కింద రెండు గీరలు పడేటట్లు నేసిన అంచు. చూ. చిత్రం 230 (తె. 24).

**పల్లెంచుకనుము** ఒకరకం అంచు (పల్లెంచు) పెట్టి నేసిన రవికెల గుడ్డ (తె. 24).

**పల్లెంచుబుగిడి** డైమను చుక్కలు వరసగా పెట్టి కింద రెండు గీరలు, మొగ్గ (బుగిడి) పడేట్లు నేసిన అంచు. చూ. చిత్రం 230 (తె. 24).

**పల్లేరుకాయంచు** ఉ. పల్లెరగాయంచు. పల్లేరుకాయమాదిరి డిజైను వేసిన అంచు. చూ. చిత్రం 207 (కో. 23; తె; 7, 30).

**పల్లేరుకాయ(పేటు)** ఉ. పల్లెరగాయ(పేటి), పల్లేరుగాయ. అంచులో పల్లేరుకాయ ఆకారంలోనేసిన డిజైను; కొన్నిచోట్ల కమ్మిల్లో నేస్తారు. చూ. చిత్రం 207 (కో. 16, 23, 33; తె. 2, 7, 30; రా. 12).

**పల్లేరుగాయలచీర** అంచులో పల్లేరుకాయల రకం డిజైను నేసినచీర (కో. 33).

**పవరుపేటు** అంచులో పువ్వు, ఆకు, పడేట్లు నేసిన డిజైను (కో. 24).

**పసకఉన్ని** ఉ. పచ్చఉన్ని, పస్కఉన్ని. పచ్చలో ఎరుపువన్నె కలిసిన ఉన్ని (తె. 7, 9).

**పసకగొర్రె** ఉ. పస్క-పచ్చలో ఎరుపువన్నె కలిసిన బొచ్చుగల గొర్రె (తె. 8).

**పసకడుగు** బియ్యపు కడుగునీళ్ళు; ఇది పులవబెట్టి గంజితియ్యటానికి ఎసరు పెడతారు (తె. 17).

**పసడం** చూ. పచ్చడం (1) (తె, 33).

**పసరుచీర** ఆకుపచ్చ రంగు చీర (తె. 9, 21).

**పసరురంగు** ఉ. పసర్రంగు; పర్యా. పసరు(వన్నె). ఆకుపచ్చరంగు (రా. 16, 23).

**పసరు(వన్నె)** ఉ. పసురు(ఒన్నె), పొసరుఒన్నె; పర్యా. పసరురంగు. ఆకుపచ్చ రంగు (తె. 9, 21, రా. 15, 17, 24).

**పసరువేయు** (క్రి.) కోరాగుడ్డ (=గోధుమరంగులో ఉండేది)ను తెలుపు చెయ్యటానికి, పేడనీళ్ళలో నాన బెట్టటం; ఇలా నాలుగు రోజులు చేస్తారు (కో. 12).

**పసిమి** (పసుపు)పచ్చవన్నె (కో. 6, 8).

**పసిరికె** ?చిలక (ఆకు) పచ్చరంగు; రామచిలక రెక్కరంగు (తె. 32).

**పసుపు** పర్యా. పచ్చ, పసుప్పచ్చ. పచ్చిపసుపురంగు; పసుపు(ముట్టి)కొమ్ముల పొడిరంగు(కో. 1, 3, 6, 19; రా. 4-6, 8, 24).

**పసుపుకుంకంచీర** లగ్ననిశ్చయ సమయంలో పెళ్ళికూతురికి పెట్టేచీర; చూ. ప్రధానంచీర (కో. 17; తె. 16).

**పసుపుచాపు** పెళ్ళికొడుకు లగ్గానికి కట్టుకొనే పంచెలజత (కో. 31).

**పసుపుచీర** పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర; పట్టుకమ్మి పెట్టి నేస్తారు(రా. 7).

**పసుపుబట్ట(లు)** ఉ. పసుబ్బట్టలు. పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు కట్టుకొనే బట్ట(లు); తలంబ్రాలగుడ్డ(లు) (కో. 19).

**పసుపుముత్తుచీర** ఉ. పసుమ్ముత్తుచీర. పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకంచీర (కో. 18).

**పసుపోల్లె** పెళ్ళికూతురు కట్టకొనే ఒకరకం చిన్న చీర; మామూలుగా, పట్టుకమ్మి పెట్టి నేస్తారు తలంబ్రాలచీర (కో. 33).

**పసుప్పచ్చ** (పసుపు+పచ్చ) **1.** పర్యా. చూ. పసుపు(ముట్టి) కొమ్ముల పొడిరంగు; పచ్చిపసుపురంగు (తె. 1, 4); **2.** బీరపువ్వురంగు (కో. 9).

**పసుప్పచ్చచాపు** దేవుళ్ళకు మొక్కుకొన్నప్పుడు పెట్టే పంచెలజత; పసుప్పచ్చది (కో. 20).

**పసుప్పచ్చచీర** దేవతలపేర్లు చెప్పి పెట్టే చీర; పసుప్పచ్చ రంగులో నేసింది (కో. 20).

**పసుపొత్తుచాపు** (పసుపు+పొత్తు-) పెళ్ళికొడుకు కట్టుకొనే పంచెలజత (కో. 21).

**పసుపొత్తుచీర** పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర (కో. 21).

**పసుపొత్తులు** పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు కట్టుకొనే పసుపుబట్టలు (కో. 17).

**పళ్ళచెక్రం** ఉ. పండ్లచెక్రం, పల్లచెక్రం. పల్లుచెక్రం, పళ్ళసెక్రం. **1.** పర్యా. ఆటచెక్రం. మరాను తిరగేటప్పుడు, బెండకాయచెక్రాన్ని తిప్పే మీది చెక్రం, ఈ చెక్రం పళ్ళు బెండకాయచెక్రం గాడుల్లోకి వస్తాయి; దీనికి సుమారు 28 పళ్ళు ఉంటాయి. చూ. చిత్రం 50.3 (కో. 1, 2, 5, 10, 12-17, 20, 23 24, 26, 36; తె.13); **2.** పర్యా. చెక్రం (8), రోలరు చెక్రం. నేతమోకు బిగించటానికి, ఒకరకం (పళ్ళచెక్రంకొయ్య) చేతిగంటానికి కిందివైపు అమర్చిన ఇనప చెక్రం. చూ. చిత్రం 122 ట. 1 (కో. 1, 2, 4, 7; రా. 1, 5, 6, 15); **3.** పర్యా. చూ. డాబిచెక్రం. డాబి దిండుకు పక్కగా అమర్చిన చెక్రం; దీని పండ్లను, కుక్క గుంజినప్పుడు దిండు తిరుగుతుంది. చూ. చిత్రం 132 చ. 11(కో. 23, 24, 36);

**పళ్ళచెక్రంకొయ్య** ఒకరకం చేతిగూటం; కింద పళ్ళచెక్రం బిగించింది. చూ. చిత్రం 122 ట. 3 (కో. 7).

**పళ్ళబంతి** పర్యా. చూ. బెండకాయ (చెక్రం). మరాను ఒగ్గులపట్టెను ఆడించటానికి వీలుగా అమర్చిన పళ్ళచెక్రం; బెండకాయ ఆకారంలో, పొడుగ్గా ఉంటుంది; మరాను కట్టుబడిలో పెద్దపళ్ళచెక్రానికి కింద అమర్చి ఉండి, మరాను తిరగినప్పుడు, పెద్దపళ్ళచెక్రంతోబాటు తిరుగుతూ ఒగ్గులపట్టెను ముందుకు, వెనక్కు ఆడిస్తుంది. చూ. చిత్రం 50.4 (కో. 36).

**పాక** చూ. పేక (2) (తె. 27, 28).

**పాకగొట్టం** చూ. పేకగొట్టం (తె. 27, 28).

**పాకచెక్క** ఉ. పాకసెక్క, పోకసెక్క; రూ. పాగాచెక్క; పర్యా. చూ. పావుచెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి, నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్కలు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి, కొన్నిచోట్ల అచ్చుకు రెండు చొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (తె. 7-9, 16, 18, 19, 21-30, 32, 33; రా. 6, 7, 9, 19 బి).

**పాకచెక్కగుది** ఉ. పాకచెక్కగుతి, పాకసెక్కగుది పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (తె. 8, 23, 29, 32).

**పాకచెక్కతాడు** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం. 121 క. 4 (తె. 7, 9, 22, 24, 27).

**పాకచెక్కతొక్కు** (క్రి.) చూ. పావుచెక్కతొక్కు (రా. 7).

**పాకచెక్కలకొయ్య** ఉ. పాకచెక్కలగొయ్య; పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు (=మడిమదగ్గర) ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు); కొన్ని చోట్ల, ఇటువంటివి గూటాలు, పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 26-28).

**పాకచెక్కలకోల** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్రతాళ్ళ మధ్యలో పావుచెక్కలతాళ్ళు కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (తె. 27).

**పాకచెక్కలగుంజ** పర్యా. చూ. పావుచెక్కల గూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; మామూలుగా, వెనకవైపు (=మడిమ దగ్గర) ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 19).

**పాకచెక్కలతాడు** పర్యా. చూ. మడిమతాడు. పావుచెక్కను, గూటానికి బిగించే వెనకతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 3 (తె. 28, 30).

**పాకట్టె** చూ. పే(క)కట్టె. (తె. 27, 28).

**పాకోడు** (-తొక్కు) ఉ. పాగోడు; పర్యా. చూ. పావుచెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు, కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి; కొన్నిచోట్ల, అచ్చుకు రెండు చొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (కో. 13, 37; తె. 5, 11, 14, 15, 18, 31).

**పాకోడుకర్ర** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళ, మధ్యలో పావుచెక్కల తాళ్ళు కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 9, 27, 30, 37).

**పాకోడుగుది** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి

రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 37; తె. 13).

**పాకోడుచిప్ప** ఉ. పాకోడుసిప్ప; పర్యా. చూ. పావుచెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు, కాలితో తొక్కే కొయ్య చెక్క; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి; కొన్నిచోట్ల, అచ్చుకు రెండుచొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1.(కో. 10).

**పాకోడుచెక్క** ఉ. పాకోళ్ళచెక్క, పాగోడుసెక్క; చూ. పావుకోడుచెక్క. (కో. 9, 14; తె, 10, 12, 13, 17, 20).

**పాకోడుచెక్క(తాడు)** పర్యా. చూ. మడిమతాడు. పావుచెక్కను గూటానికి బిగించే వెనకతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 3 (తె. 11, 12, 14).

**పాకోడుతొక్కు** (క్రి.) చూ. పాంకోడుతొక్కు (రా. 14).

**పాకోడుపలువు** ఉ. పాగోడుపల్వు; పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం. 121 క. 4 (తె. 18).

**పాకోళ్ళకొయ్య** ఉ. పాగోల్లకొయ్య; పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; మామూలుగా వెనకవైపు (=మడిమదగ్గర) ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 14, 18).

**పాకోళ్ళచువ్వ** ఉ. పాగోళ్ళసువ్వ; పర్యా. చూ. కమ్మి (9). మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; పావు చెక్కలకు చేసిన చిల్లుల్లో దూర్చి పక్కగూటాలకు వేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (కో. 14).

**పాగ** ఉ. పాగా; పర్యా. చుట్టుకండువా, టువాలు, తలగుడ్డ, తలపాగ, తలరుమాలు, రుమాలు(1), వల్లె(1), షెమ్లా. తలకు చుట్టుకోటానికి నేసిన బట్ట; మామూలుగా అయిదు, కొన్నిచోట్ల 2½–3 గజాల పొడుగు నేస్తారు; అడ్డం ముప్పాతిక గజం నించి, గజం పైవరకూ పెడతారు; కొన్నిచోట్ల, అంచులేకుండా నేస్తారు; మామూలుగా తెల్లది; కొన్నిచోట్ల, రంగులు గీరలు, గళ్ళు మొ. వి. పెట్టి నేస్తారు. (కో. 15. 16, 18. 19. 22, 23; తె. 15; రా. 23).

**పాగచెక్కదారం** ఉ. పాగసెక్కదారం; పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ, పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (రా. 13).

**పాగచిప్ప** పర్యా. చూ. పావుచెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి; కొన్నిచోట్ల అచ్చుకు రెండుచొప్పున అదనంగా ఉంటాయి, చూ. చిత్రం 121 క. 1 (కో. 18).

**పాగచిప్పకర్ర** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్కతొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రలతాళ్ళు కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 18).

**పాగడ** ఉ. (-అతుకు, -చాపు, -చుట్టు, -తీయు, -పావు, -పెట్టు, -వేయు). ఉ. పాగడా, పాగడి, పాగడు. **1.** పడుగులో కొంతభాగం; సరిచేసిన పడుగులో నేతకు అవసరమైనంత అచ్చతకగా మిగిలింది; చిన్నపడుగు; దీన్ని తీసిపెట్టి, తక్కువవడ్డప్పుడు కలుపుకొంటారు; కొన్నిచోట్ల. అంచులు నెయ్యటానికి వాడతారు (కో. 13–15, 18, 20, 25–33; 35, 37; తె. 11, 27, 28, 31, 32; రా. 8, 14, 24); **2.** గంజితో తడిపిన పడుగునూలు (కో. 12, 17); **3.** సరిచేసిన (తరవాత చుట్టిన) పడుగు (కో. 3, 7, 11, 16, 17, 20; తె. 22); **4.** పర్యా. చూ. సరెంటి (3). చుట్టచుట్టిన పడుగునూలు; మగ్గంమీద కొంత చాపగా మిగిలింది ఒక కర్రకు చుడతారు; కొన్నిచోట్ల పురిబెట్టి చుడతారు; కొన్నిచోట్ల పెడకోలకుచుట్టి ఉంచుతారు. చూ. చిత్రాలు 128 ట. 1, 128 జ. 2 (రా. 11, 14); **5.** అనుకొయ్యలకు అనులుపడేట్టు చుట్టిన పట్టుదారం; పడుగు; నేతలో నిలువుకు వాడతారు (తె. 5).

**పాగడఅతుకు** (క్రి) ఉ. పాగడిఅతుకు; పర్యా. చూ. అచ్చతుకు. బద్దెపోగులకు పడుగుపోగులు కలిపి వడిపెట్టటం (కో. 20; రా. 14).

**పాగడగుంజ** జంపఖానా నేతకు వాడే పడుగునూలు చుట్టటానికి, గోడకు బిగించిన కొయ్య; ఇటువంటివి రెండుంటాయి (తె. 1).

**పాగడజిల్ల** సరిచేసిన చిన్నినూలు చుట్ట; ఈనూలు పోగులు పన్నెలో దూర్చి బెంతునెయ్యటానికి వాడతారు (కో. 7).

**పాగడపాపు** (క్రి.) నేతలో నిలువుకు వాడే పట్టు దారం పాయలు పాయలుగా విడదియ్యటం (తె. 12).

**పాగడపోయు** (క్రి.) పర్యా. చూ. అసుపోయు. అసుగొట్టంలోకి పోగు తీసుకొని, అసుకొయ్యలకు చుట్టివచ్చేట్టు చెయ్యటం (రా. 14).

**పాగడేయు** (< పాగడవేయు; క్రి.) **1.** సరిచేసిన పడుగు చుట్టివెయ్యటం (కో. 2, 3, 6 11); **2.** నేతకు కావలసిన పడుగు తక్కువయినప్పుడు, కొంత మిగులు నూలు తెచ్చి కలపటం (కో. 26).

**పాగసెల్లా** ఉ. పాగచెల్ల. పెళ్ళికొడుకు తలకు చుట్టుకొనే బట్ట; సెల్లా (తె. 13).

**పాగాచెక్క** చూ. పాకచెక్క (రా. 13).

**పాగాచెక్కలగూటం** పర్యా. చూ. పావుచెక్కల గూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; మామూలుగా వెనకవైపు, మడిమ దగ్గర, ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు పావు చెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (రా. 13).

**పాంకోడు(చెక్క)** చూ. పావుకోడు (చెక్క) (కో. 5, 7, 11).

**పాంకోడుతొక్కు** (క్రి.) రూ. పాకోడుతొక్కు; పర్యా. చూ. పావుచెక్కతొక్కు. పడుగుపోగులు కొన్ని పైకీ కొన్ని కిందికీ వచ్చి అనిపోగులు విడబడ టానికి పావుచెక్కను కాలితో తొక్కటం (కో. 5).

**పాంకోళ్ళమేకు** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; మామూలుగా, వెనకవైపు (=మడిమదగ్గర) ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్ని చోట్ల, ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 12).

**పాచికలరు** ఉ. పాచికల్రు; పర్యా. పాచి (రంగు) (1) పాకుడు (=నాచు) రంగు. చూ. చిత్రం 288 (కో. 2; రా. 16).

**పాచి(రంగు)** ఉ. పాసిరంగు. **1.** పాకుడు(=నాచు) రంగు; పచ్చిపెసరరంగు; సిల్కు ఆలివు. చూ. చిత్రం 288 (కో. 2); పచ్చిమామిడికాయలో నలుపువన్నె; ఆలివు. (కో. 9).

**పాటినూలు** ఉ. పాట్నాలు. చేత్తో వడికిన నూలు (కో. 33, 37).

**పాటిరాటి** పర్యా. తొవరరాటి. ఒకరకం చిన్న రాటి; చూ. రాటి (కో. 31).

**పాటుతిప్పు** (క్రి.) అచ్చువళ్ళలో, పడుగుపోగులు తగిలే భాగం (రేవు) పక్కకు జరపటం; అచ్చుకర్ర కొద్దిగా పక్కకు తిప్పి రేవులు జరుపుతారు; వడిపో గులు నలిగినప్పుడు రేవులు తిప్పుతారు (రా. 13).

**పాట్నాకమ్మి** ఉ. పాట్నకమ్మి; రూ. పాట్లాకమ్మి. ఒకటిరెండువేళ్ళ వెడల్పు పట్టెలు, నాలుగయిదు, ఎడం ఎడంగా నేసిన చీరకమ్మి; కొన్నిచోట్ల, ఒక పెద్దపట్టె, ఒక చిన్నపట్టె వరసగా నేస్తారు; పట్టెలోను పట్టెకు రెండువైపులా సన్నగీరలు నేస్తారు; ? కొన్నిచోట్ల, కమ్మికి పదివీసాలు వేరేరంగు పెట్టి అరగజం పొడుగు నేస్తారు; మధ్య నాలుగేసి పోగులతో గీరలు పడేట్టు నేస్తారు (కో. 5-8, 12, 14-16, 19, 23, 32; తె. 4; రా. 1).

**పాట్నామైజారు** ఒకరకం డిజైనులో నేసిన చీర చెరగు; దీనికి గజం పొడుగు వరకూ వేరే రంగునూలు పెట్టి నేస్తారు (కో. 35).

**పాట్నా(లు)** కమ్మిలో నేసిన పట్టె(లు) (కో. 7).

**పాట్లాకమ్మి** చూ. పాట్నాకమ్మి (కో. 13; రా. 8).

**పాట్లాఅంచు** అంచుపడుగులో కొంతవరకూ రంగు నూలు అతికి, పేకకు అదే రంగు పెట్టి నేసిన అంచు (కో. 2).

**పాడిపేటగుండంచు** జమిలిపోగులతో నేసిన ఒక రకం అంచు (రా. 1).

**పాండీ** ?చేనేతపని చేసే పద్మసాలీల వంశానికి మూల పురుషుడు (తె. 18).

**పాత** జముదాని నేతలో, డిజైన్లు, బుటాలు వెయ్య టానికివాడే రంగుదారాలు చుట్టిన చిన్నగుడ్డముక్క; కొన్నిచోట్ల, పుల్లలు వాడతారు. చూ. చిత్రం 113 చ. 1 (కో. 33).

**పాతకాటు** పసుపులో తెలుపువన్నె కలిసిన రంగు; తెలుప్పచ్చ (తె. 19, 20, 22).

**పాతికపుంజం** ఉ. పాతికిపుంజం. పుంజంలో నాలుగో వంతు; 15 కొలుకుల(=30 పోగుల)దారం (కో. 24).

**పాదు** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన కొదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క.3(కో. 34).

**పాదుచెక్క** పర్యా. చూ. పావుచెక్క. నేతనేసే టప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి, నేతపని వాడు కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి; కొన్నిచోట్ల, అచ్చుకు రెండుచొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క.1 (రా. 22).

**పానతాడు** మగ్గం చట్రం నిలువులను బిర్రుపెట్టిన లావు దారం; బిర్రుతాడు; ఇటువంటివి రెండుంటాయి (తె. 8).

**పాని** ఉ. పాన్నె; రూ. పాను; పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118.9 (తె. 17, 30, 31, 33).

**పాను** ఉ. పాన్; చూ. పాని (తె. 21, 25-29).

**పానుపుపట్టె** ఉ పానప్పట్టె; పర్యా. అడితి, అడుగుగుండు(1), అడుగుపట్టె, అడుగుపీట(3), అడ్డకమ్మి(8), అడ్డపట్టె(16), కమ్మి(11), కిందిపట్టె, కిందిపలక, గాడిపట్టె, గుంటికర్ర, గుండు(6), గుండుపలక(2), గుండుబల్ల(1), చట్టం(3), చప్టాబల్ల, దండి(1), నాడెసులోబు, పలకగుండు(2), పాని, పాన్కట్టె, పారుపాలం పాలం(2), బల్ల(5), బీముదండం, మగ్గంగుండు(2), మగ్గంచట్టం(2), మగ్గంబల్ల, మగ్గంలైను, మొద్దు(6), రందా, రాప్తా(కమ్మి), రోడ్డుకమ్మి, రోడ్డుకర్ర, రోడ్డుబల్ల, రోలరుకమ్మి(1), లైనుబల్ల, సట్టరు(2), సట్టరుపాని సలాకి(4), సులోబు, సొరుగు(1). మరమగ్గంలో, పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (రా. 12, 13, 193).

**పాన్కట్టె** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (తె. 9).

**పాపు** (క్రి.) **1.** లడీలో చిలపలు వేరుచెయ్యటం (తె. 7, 9, 27); **2.** పర్యా. చూ. పాయలుపాపు. పడుగుపోగులు పాయలు పాయలుగా విడదియ్యటం (తె. 10).

**పాపులుతీయు** (క్రి.) పర్యా. చూ. పాయలుపాపు. పడుగుపోగులు పాయలు పాయలుగా విడదియ్యటం (తె. 23).

**పామ** చూ. పావ(చిప్ప) (కో. 33).

**పామతాడు** చూ. పావతాడు (కో. 23).

**పాముచెక్క** చూ. పావుచెక్క (రా. 10, 20).

**పాము(లు)** సుబ్బారాయుడుచీర పైట చెరుగులో కుట్టిన ఎరుపు నలుపు పోగు(లు). చూ. చిత్రం 271 (కో. 2).

**పాయ** ఉ. పాయి. **1.** నూలులెక్క : లడీలో దెబ్బయ్యోవంతు నూలు (రా. 3, 15); **2.** వడిపెట్టి చుట్టిన పట్టు పడుగు (తె. 12); **3.** పర్యా. చూ. గుదిపాయ. అచ్చువళ్ళలో, అచ్చుకర్రకు గుది కట్టినచోట పాయగా చీలిన భాగం; దాంతోబాటు అచ్చుతికిన పడుగులో పాయగా చీలిన భాగం; ఇటువంటివి, మామూలుగా నాలుగు పాయలుంటాయి; అచ్చుకట్టిన తరవాత, గుదిపాయలు బిర్రుగా ఉండటానికి అచ్చుకర్రమీద కొమ్ముతో రుద్దుతారు (కో. 23-25, 28, 34, 36, 37; రా. 3, 5, 12, 13, 19, 21); **4.** (-చీడు, -పాపు) పర్యా. సీడు(10), పొట్టె(5). పడుగులో విడదీసిన కొంతభాగం; సరిచేసేటప్పుడు పడుగులో చివరి భాగం పాయలు పాయలుగా విడదీస్తారు (కో. 13; తె. 5, 28); **5.** (-చేయు, -పాపు) పర్యా. చూ. పొట్టె(7). పడుగునూలులో పాయగా విడదీసిన పోగులు; అల్లుచేసేటప్పుడు పడుగును పాయలుగా విడదీస్తారు. నేస్తారు. (కో. 10, 34; తె. 26; రా. 18); **6.** (-తిప్పు) డిజైను నేతకోసం, రంగు అద్దటానికి వాడే పడుగునూలు (తె. 10); **7.** రెండున్నర పిడుల (పడుగు)నూలు; ఇటువంటివి రెండుపాయలు ఆసుపోస్తే నిలువు ఇరవై మూరలు వస్తుంది (తె. 11, 12); **8.** (-పట్టు) పర్యా. గుది(5), జిల్ల(2), పడుగుపాయ, పడుగుపొట్టె. సరిపాయ, సరిముట్టా(2). పడుగుపోగుల్లో కొంతభాగం; అచ్చుతికేటప్పుడు పడుగును పాయలుగా విడదీసి, ఒక్కొక్క పోగే అచ్చుపోగుకు అతుకుతారు. చూ. చిత్రం 102 క. 4 (కో. 25-33, 35, 36); **9.** (-పోయు) చిటికెపీట కొయ్యలకు తోడినపోగులు (తె. 11).

**పాయకట్టు** (-గుంజు) నూలు పాయ(ల)కు కట్టిన కట్టు; చిటికె అద్దకంలో నూలు పాయలకు అక్కడక్కడ కట్లు కడతారు (తె. 11).

**పాయమల** ఉ. ?పాయెమల. ?అచ్చుతికే అనిపోగుల్లో లాకలు దూర్చకుండా చుట్టిన పడుగునూలు (తె. 28).

**పాయలుకట్టు** (క్రి.) అచ్చుతికిన పడుగులో, గుదిపాయలను బట్టి చీలిన పడుగుపాయలకు దారాలు కట్టటం (కో. 26, 33).

**పాయ(లుపాపు)** (క్రి.) ఉ.పాయపాపు. పాయ(లు) పాపు; పర్యా. పాపు(2), పాపులుతీయు, పొట్టెలుపాపు. పడుగుపోగులు పాయలు పాయలుగా విడదియ్యటం (కో. 1, 10; తె. 21, 26).

**పాయలువిప్పు** (క్రి.) సరిచేసేటప్పుడు పడుగుపాయల పోగులు నెరపటం (కో. 13).

**పారచిప్ప** చూ. పాలచిప్ప (కో. 20).

**పారచిప్పలకొయ్య** పర్యా. చూ. పావుచెక్కల గూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; మామూలుగా, వెనకవైపు(=మడిమదగ్గర) ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు;

కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు, పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 20).

**పారదీయు** (క్రి.) పర్యా. చాపు(2) ఆరుబయట, పడుగుపరవటం; రెండు ఊడ్తెలకు మధ్యగాని, ఒక ఊడ్తెకు, సగిగుంజ(ల)కు మధ్యగానిచాపుతారు(కో.9ఎ)

**పారిజాతమంచు** పారిజాతం పువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 162 (తె. 4, 14).

**పారిజాతం(పూవు)పేటు** ఉ. పారిజాతం పూవు పేటి, పారుజాతంపేటు. (అంచులో) పారిజాతం పువ్వులు, కొన్నిచోట్ల తీగలు, వరసగా నేసిన డిజైను. చూ. చిత్రం 162 (కో. 14; తె. 2).

**పారుచెక్క** పర్యా. చూ. పావుచెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి, నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి; కొన్నిచోట్ల, అచ్చుకు రెండుచొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (రా. 12).

**పారు(డు)కుంచె** (-ఊడ్చు, -చేయు) ఉ. పారు కుంచి, పారుగుంచె. పడుగుమీద ఒకవైపునుంచి మరొక వైపుకు ఆపకుండా దువ్వే కుంచె; సరిచేసేటప్పుడు, మొదట కొంతసేపు ఇలా దువ్వుతారు (రా. 11, 13. 15-17).

**పారుడులాక** నేతపడుగులో, చివరివరకూ జరుగుతూ ఉండే లాక (రా. 19).

**పారుపట్టె** ఉ. పారపట్టి; పర్యా. చూ. మేరువు పలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరి మీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (రా. 2, 5.6).

**పారుపాలం** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (రా. 6).

**పార్శపువ్వంచు** ఒకరకం పువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు (కో. 23).

**పార్శిఅంచు** జరీగిర, రెండు కొలుకుల రంగు దారం, మూడు కొలుకుల జరీ, రెండు కొలుకుల రంగు దారం, రెండు కొలుకుల జరీ, రెండు కొలుకుల రంగు దారం, వరసగా పెట్టి నేసిన అంచు (కో. 2).

**పార్శిబేలు** మూడు ఆకులు, తీగ వరసగా నేసిన డిజైను (తె. 21).

**పార్షపుకాయ** ఒకరకం, చిన్నముళ్ళకాయ;గొర్రెలు మేతకు తిరిగేటప్పుడు, అప్పుడప్పుడు, ఇవి బొచ్చులో ఇరుక్కొంటాయి (తె. 28).

**పాలకప్పు** ?ఒకరకం నీలంరంగు; తెలుపు కలిసిన నలుపు (కో. 4).

**పాలకవర** ఒకరకం నలుపు; కందువన్నె; ఆనంద కలరు; నెమిలికన్నంచు నేతలో ఈ వన్నెదారాలు పెట్టి నేస్తారు (రా. 18).

**పాలకనరుగొర్రె** తెలుపులో, కొంచెం లేతపచ్చ వన్నె కలసిన బొచ్చుగల గొర్రె (తె. 6).

**పాలకాటుచీర** తెలుపు ఒకవైపు, నలుపు మరొక వైపు పెట్టి నేసిన చీర (రా. 13).

**పాలగంజి** చిక్కటి గేదెపాలు కలిపిన గంజి; కలంకారీ అద్దకంలో పసుపు, ఆకుపచ్చ మొ. రంగులు, బట్టమీద అద్దేటప్పుడు కిందికి దిగకుండా ఉండటానికి, బట్టకు పాలగంజి పెడతారు (కో. 12).

**పాలచాయ** ఉ. పాలసాయ. ఒకరకం, లేత నలుపు రంగు (కో. 2).

**పాలచిప్ప** రూ. పారచిప్ప; పర్యా. చూ. పావు చెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అని పోగులు తెరవటానికి నేతపనివాడు, కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి; కొన్ని చోట్ల, అచ్చుకు రెండు చొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (కో. 19, 21).

**పాలచిప్పకర్ర** పర్యా. చూ. పూనుగర్ర. పావు చెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళూ, మధ్యలో పావు చెక్కలతాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 19).

**పాలచెక్క** ఉ. పాల్చెక్క; పర్యా. చూ. పావు చెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు, కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి; కొన్ని చోట్ల, అచ్చుకు రెండు చొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (రా. 1, 16, 17).

**పాలచెక్కతొక్కు** (క్రి.) పర్యా. చూ. పావు చెక్కతొక్కు. పడుగుపోగులు కొన్ని పైకీ కొన్ని కిందికీ వచ్చి అనిపోగులు విడబడటానికి పావుచెక్కను కాలితో తొక్కటం (రా. 1).

**పాలచెక్కలగూటం** పర్యా. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనకవైపు(=మడిమ దగ్గర) ఉంటుంది;

పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్ని చోట్ల, ఇటువంటి గూటాలు, పావుచెక్కలకు పక్కగా రెండు ఉంటాయి. చూ. చిత్రం 121 క. 2 (రా. 16).

**పాలచెంగావి** ఉ. పాలసెంగాయి. గులాబిరంగు మాదిరి ఒకరకం పొడిరంగు (కో. 7).

**పాలచేయు** (క్రి.) పత్తి ఇనపమంచం మీద వేసి, చెత్తాచెదారం దుళ్ళగొట్టి శుభ్రం చెయ్యటం (తె. 2).

**పాలనచూసు** (క్రి.) ఉ. పాలనచ్చూసు. పడుగుకు పెట్టే గంజి అనుకూలంగా ఉన్నదీ లేనిదీ చూడటం; ?పాళ్ళు చూడటం (కో. 7).

**పాలపిట్ట(రంగు)** ఉ. పాలపిట్టె. **1.** సులోచన (పచ్చ)రంగు. చూ. చిత్రం 288 (కో. 14); **2.** ఒక రకం నీలరంగు (కో. 15); **3.** పాలపిట్ట రెక్కల మాదిరి బూడిదరంగు (తె. 1. 2. 4-6, 9-14, 18-22 26, 27); **4.** లేతపచ్చరంగు (తె. 15, 17).

**పాలం** **1.** పర్యా. చూ. రేకు(2). నేతనేసేటప్పుడు, మరమగ్గం మేరువుపలక సులువుగా ఆడటానికి బిగించిన ఇనప రేకు; కొన్నిచోట్ల, నట్టురుగుంజ అడ్డపట్టెకు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.5 (రా.6); **2.** పర్యా. చూ. పానువుపట్టె. మరమగ్గంలో, పన్నెబిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 4).

**పాలమంచం** బెలుపట్టారేకులతో అల్లిన మంచం; దీనిమీద పత్తివేసి బొంగుబద్దెలతో కొట్టి శుభ్రం చేస్తారు; చూ. పాలచేయు. చూ. చిత్రం 4.1 (తె. 2).

**పాలరోజా** ఉ. పాలారోజా, ప్రాలోజా. ఒకరకం లేత ఎరుపు(రోజా)రంగు (రా. 9, 15, 18).

**పావకర్ర** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్రతాళ్ళూ, మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 17, 22, 32-34).

**పావకోటికర్ర** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్రతాళ్ళూ, మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 31).

**పావగుది** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 27, 30, 33).

**పావ(చిప్ప)** ఉ. పావా, పావసిప్ప; రూ. పావు. పర్యా. చూ. పావుచెక్క. నేతనేసేటప్పుడు. పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి; కొన్ని చోట్ల, అచ్చుకు రెండు చొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (కో. 16-17, 22, 25-36).

**పావచిప్పగుది** ఉ. పావసిప్పగుది; పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 35).

**పావచిప్పలకొయ్య** పర్యా. చూ. పావుచెక్కల గూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; మామూలుగా, వెనకవైపు(=మడిమదగ్గర) ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గుంటాలు, పావుచెక్కలకు పక్కగా రెండు ఉంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 17).

**పావచిప్పలగడె** ఉ. పావసిప్పలగడె; పర్యా. చూ. కమ్మి(9). మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; (పావుచెక్కలకు చేసిన చిల్లుల్లో దూర్చి పక్క గూటాలకు వేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (కో. 35).

**పావతాడు** రూ. పావుతాడు; పర్యా. అచ్చుగుది(3), అడ్డుదారం(1), అడుగర్రతాడు(1), అడుగోలతాడు, అడగోలపలుపు, ఇరువుతాడు(1), గుది(8), తానెకోడు తాడు, తొక్కుడు చెక్కతాడు, తొక్కుడు చెక్కదారం, తొక్కుడుతాడు, నిలువుగుది, నిలువుతాడు(2), పాక చెక్కగుది, పాకచెక్కతాడు, పాకోడుగుది, పాకోడు పలుపు, పాగచెక్కదారం, పావగుది, పావచిప్పగుది; పావుచెక్కతాడు, పావుచెక్కదారం, పూనుగర్రతాడు (1), పూనుగర్రదారం, వాయితాడు(1). పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 25, 29, 32, 34).

**పావమేకు** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా వెనకవైపు (మడిమ దగ్గర) ఉంటుంది పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్ని చోట్ల; ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 32).

**పావలకర్ర** పర్యా. చూ. కమ్మి(9). మగ్గం గుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల;

మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; పావుచెక్కలకు చేసిన చిల్లుల్లో దూర్చి, పక్కగూటాలకు వేస్తారు. చూ. చిత్రం 121 చ. 1 (కో. 31).

**పావ(ల)కొయ్య** ఉ. పావాలకొయ్య; పర్యా. చూ. పావుచెక్కల గూటం. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; మామూలుగా వెనక వైపు (మడిమ దగ్గర) ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల, ఇటువంటి గూటాలు, పావుచెక్కలకు పక్కగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 26, 30, 33, 36).

**పావు 1.** పర్యా. చూ. చిప్ప(1). రాటి పై బద్దలను బిగించి, వాటిమధ్య బోర్లించి కట్టిన చిప్ప; మామూలుగా కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల కర్రచిప్పగాని, రేకుమూతగాని వాడతారు; ఇది, రాటిసూలం మీద ఆనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (తె. 2); **2.** పర్యా. కొలతగురిగె, కొలతతెడ్డు, కొల్తగిన్నె, రంగుపావు, సో॰. రంగు కొలుచుకొనే చిన్నపాత్ర: సుమారు అయిదు తులాలు పట్టేది; కొన్ని చోట్ల, దీన్ని పట్టుకోటానికి పొడుగాటి కాడ ఉంటుంది. చూ. చిత్రాలు 282 క. 6, ప. 1 (తె. 20, 23; రా. 15, 17, 18, 22-24),

**పావుకోడు** పర్యా. చూ. **పూనుగర్ర**. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్ర తాళ్ళూ మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (రా. 3).

**పావుకోడు(చెక్క)** రూ. పాకోడు చెక్క, పాంకోడు(చెక్క); **పర్యా**, చూ. పావుచెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు, కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి; కొన్నిచోట్ల, **అచ్చు**కు రెండు చొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (కో. 2, 6, 15; తె. 4).

**పావుచట్టం** ఉ. పావుసట్టం; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళూ, మధ్యలో పావుచెక్కలతాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 25).

**పావుచెక్క** రూ. పాముచెక్క; పర్యా. ఆడుచెక్క, తొక్కుడుచెక్క, పాకచెక్క, పాకోడ, పాకోడు చిప్ప, పాగచిప్ప, పాదుచెక్క, పారుచెక్క. పాలచిప్ప, పాలచెక్క, పావ(చిప్ప), పావుకోడు(చెక్క), బల్లచెక్క. నేతనేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. కొన్నిచోట్ల, అచ్చుకు రెండు చొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (కో. 1, 3, 4, 7; తె. 1, 2, 6; రా. 2-5, 8, 11, 14, 15, 18, 23, 24).

**పావుచెక్కతాడు** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 1, 2; తె, 2; రా. 3, 11).

**పావుచెక్కతొక్కు** (క్రి.) రూ. పాకచెక్కతొక్కు; పర్యా. పాంకోడుతొక్కు, పాలచెక్కతొక్కు. పడుగుపోగులు కొన్ని పైకీ కొన్ని కిందికీ వచ్చి అనిపోగులు విడబడటానికి పావుచెక్కను కాలితో తొక్కటం (రా. 15).

**పావుచెక్కదారం** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (రా. 2).

**పావుచెక్కలగూటం** పర్యా. కిక్కస, కొయ్య (10), గసిగ, గుంజ(7), గూటకొయ్య(2), గుంటగూటం, గుదులగూటం, గూటకొయ్య, గూటం (6), చిలుకొయ్య, చువ్వకొయ్య, తాడుకొయ్య(2), దొంగకొయ్య, పాకచెక్కలకొయ్య, పాకచెక్కల గుంజ, పాకోళ్ళకొయ్య, పాగాచెక్కలగూటం, పాంకోళ్ళమేకు, పారచిప్పలకొయ్య, పాలచెక్కల గూటం, పావచిప్పలకొయ్య, పావమేకు, పావ(ల) కొయ్య, మడిమకొయ్య, మిడిగూటం(1), మునిగూటం, మేకు(7), లగ్గాంకొయ్య, వెనకొయ్య, సప్పాకొయ్య; మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా, వెనక వైపు (=మడిమదగ్గర) ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల ఇటువంటి గూటాలు, పావుచెక్కలకు పక్కగా రెండు ఉంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 1; తె. 1; రా. 18).

**పావుచెక్కలతాడు** పర్యా. చూ. మడిమతాడు. పావుచెక్కలను గూటానికి బిగించే వెనకతాడు; ఇటువంటివి, రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 3 (తె. 1, 6, 21).

**పావురాయిరంగు** ఒకరకం బూడిదరంగు(కో. 13).

**పావురాలంచు** పావురం ఆకారంలో డిజైన్లు పెట్టి నేసిన అంచు (రా. 1)

**పాష్టీ** పావుకోడుకర్ర; చూ. పావుచెక్క (తె. 5).

**పోస** పోచ; నారపేసె; వడుకుకట్టెకు కట్టిన నార ఒక్కొక్కపోచ తీసుకొని వడుకుతారు. చూ. చిత్రం 299 (తె. 25).

**పికాసి** ఉ. పికాస్, పికాస, పికాసా, పికాసు; పర్యా. గిరక(7), గుటికె, పిక్కర, పిట్ట, పూస(4), బింగిరీ, రీలుపూస, సట్టరుపికాసి. మరమగ్గం నాడెను, ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్య; కొన్నిచోట్ల, మిషనుదారం చుట్టే కొయ్యరీలు; ఇటువంటివి, ఉడతలకు బదులు, రెండు సొరుగుల్లోనూ అమరుస్తారు. చూ. చిత్రం 120 (తె. 5, 7, 9, 11, 17-21, 28, 29, 31; రా. 24).

**పికాసితాడు** పర్యా. గిరకతాడు(3), గుటికెతాడు, పికాసిదారం, పిక్కరదారం, బింగిరీతాడు, బింగిరీదారం. మగ్గంపికాసికీ బొమ్మకూ కట్టిన దారం. చూ. ఉడతతాడు(తె. 9, 20, 21, 28, 29, 31; రా. 24).

**పికాసిదారం** పర్యా. చూ. పికాసితాడు. మగ్గం పికాసికీ బొమ్మకూ కట్టినదారం. చూ. ఉడతతాడు (రా. 24).

**పికాసిసలాక** మరమగ్గం సొరుగులో, పికాసి దారపురీలుకు దూర్చిన ఇనపపుల్ల; దీంతో పికాసి సులువుగా ఆడుతుంది. చూ. చిత్రం 120 ట. 1 (తె. 29)

**పిక్క** పర్యా. జాలిబొడ్డె, పిక్కరు, పిక్కు, పూటీ, పెగ్గు, బొడ్డె (5), సెట్టె. డాబీగొలుసు బద్దకు బిగించిన కొయ్యముక్క; డిజైనునుబట్టి అవసరమైనన్ని బిగిస్తారు; దిండును చుట్టి గొలుసు తిరిగినప్పుడు, ఇవి కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 2 (కో. 10, 12).

**పిక్కర** (-అడు) పర్యా. చూ. పికాసి. మరమగ్గం నాడెను, ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్యగిలక; మామూలుగా మిషనుదారం చుట్టే కొయ్యరీలు. ఇటువంటివి ఉడతలకు బదులు రెండు సొరుగుల్లోనూ అమరుస్తారు. చూ. చిత్రం 120 (రా. 14, 15).

**పిక్కరదారం** పర్యా. చూ. పికాసితాడు. మగ్గం పికాసికీ బొమ్మకూ కట్టిన దారం; చూ. ఉడతతాడు (రా. 15).

**పిక్కరవార** పర్యా. గిలకవారు. మరమగ్గం బొమ్మకూ పికాసి పిక్కరకీ కట్టిన తోలుపట్టీ; చూ. ఉడతతాడు. (రా. 14).

**పిక్కరు** ఉ. పికరు, పిగరు; పర్యా. చూ. పిక్క. డాబీగొలుసు బద్దకు బిగించిన కొయ్యముక్క. చూ. చిత్రం 132 చ. 2. (కో. 23 24, 26, 36).

**పిక్కలగంజి** పర్యా. చూ. చింతపిక్కల గంజి; చింతగింజలు పిండిగొట్టి, ఉడకబెట్టి తీసిన గంజి (కో. 25-28, 31).

**పిక్కు** పర్యా. చూ. పిక్క. డాబీగొలుసు బద్దకు బిగించిన కొయ్యముక్క. దిండును చుట్టి గొలుసు తిరిగినప్పుడు, ఇవి కోలలను పైకిలేపుతాయి. చూ. చిత్రం 132 చ. 2 (కో. 33).

**పిగిలికుచ్చెల** ఎరుపు, పసుపు, తెలుపు రంగు పోగులు కలిసేటట్లు నేసిన అంచు (కో. 34).

**పిగిలికుచ్చెలచీర** అంచులో ఎరుపు, పసుపు, తెలుపు రంగులు వచ్చేట్టు నేసిన ఒకరకం చీర (కో. 34)

**పింకు** (< Pink) తురాయిపువ్వురంగు; ఉల్లిగడ్డ రంగు; ఒకరకం ఎరుపు. చూ. చిత్రం 288 (తె. 23, 24, 25, 31).

**పింగానిపూస** పర్యా. చూ. పూస (6). మర నాడెలో, కండెపోగు బయటకు రావటానికి బెజ్జం చేసి బిగించిన గాజుపూస; కొన్నిచోట్ల పోగు దూరే సందు (=బెజ్జం); దీంట్లోంచి పోగు సాపుగా వస్తుంది; మామూలుగా, ఒకటి ఉంటుంది; కొన్నిచోట్ల 2-4 ఉంటాయి. చూ. చిత్రం 131 త. 1 (కో. 8).

**పిచ్చె** నూలులెక్క : లడీలో పదోవంతు (రా. 11)

**పిఛాడీతాడు** పర్యా. చూ. మడిమతాడు. పావుచెక్కను, గూటానికి బిగించే వెనకతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 3 (తె. 2).

**పింజు** (క్రి.) **1.** దూది విదిలించటం (తె. 2). **2.** పర్యా. చూ. పెక్కు(1). కమానుతో దూది పింజెపింజెలుగా విచ్చుకొనేటట్లు చెయ్యటం (కో. 15); **3.** పర్యా. పింజుడుజేయు. చేత్తో ఉన్ని పిసికి విడదియ్యటం (తె. 7).

**పింజుడుజేయు** (క్రి.) పర్యా. చూ. పింజు (3). చేత్తో ఉన్ని పిసికి విడదియ్యటం (తె. 20).

**పింజుడున్ని** (పింజుడు + ఉన్ని) ఒకరకం ఉన్ని (? చేత్తో విడదీసేది); ఏరువాక పున్నమికి కత్తిరించేది; వేసంగి ఉన్ని (తె. 7).

**పింజె** (- పెట్టు, -తీయు) ఏకేటప్పుడు విచ్చుకొని అవతలపడ్డ దూది (కో. 14, 15, 33, 34, 36).

**పింజెన్** చూ. పింజెర (1) (తె. 27, 29, 30).

**పింజెనజేయు** పర్యా. చూ. ఏకు(2). ఉన్ని పింజె పింజెలుగా విచ్చుకొనేట్టు వేరుచెయ్యటం; గూటంతో గాని, చేత్తోగాని ఏకుబద్దసరం విదిలిస్తూ ఏకుతారు (తె. 22).

**పింజెర** ఉ. పింజర, పింజెరం, పింజెరి, పెంజెర. **1.** రూ. పింజెన్; పర్యా. చూ. కమాను(1). దూది ఏకే కొయ్య పనిముట్టు. చూ. చిత్రం 9 (తె. 2, 8; రా. 16–18, 24); **2.** చేతిఅద్దకానికి వాడే రంగు తొట్టిలో అమర్చిన బద్దల తడిక; దీని మీద చిన్నగోనె గుడ్డ (కొన్నిచోట్ల, గొంగడి) పరిచి రంగుపోస్తారు; ఎక్కువయిన రంగు పింజెరగుండా కిందికి దిగుతుంది (కో. 3, 7, 12, 26); **3.** పర్యా. చూ. డాబీ. నేతలో డిజైన్లు నెయ్యటానికి, మరమగ్గం పైన అమర్చే యంత్రం. చూ. చిత్రం 132 (తె. 5, 6, 9, 10, 18, 25, 29, 31, 32; రా. 18, 23, 24);

**పింజెరఅడ్డ** ఉ. పింజెరడ్డ; పర్యా. చూ. దిండు(7). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యదిండు; కొన్నిచోట్ల పింజెరదిండుకు బొడిపెలు, తొల్లపింజెర దిండుకు గాళ్ళూ ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు; కొన్ని చోట్ల, దీనికి చివర ఇనపఊచల చెక్రంగాని, రేకు పళ్ళచెక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (తె. 18, 22).

**పింజెరకర్ర** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుచెక్కలను తొక్కినప్పుడు, గొలుసు పిక్కలుగాని, దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (తె. 10).

**పింజెరకోల** పర్యా, చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుచెక్కలను తొక్కినప్పుడు, గొలుసుపిక్కలుగాని, దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (తె. 29).

**పింజెరగడ్డ** పర్యా. చూ. దిండు (7). డాబీలో అడ్డంగా బిగించినకొయ్యదిండు; బోట్లపింజెర దిండుకు బొడిపెలు, తొల్లపింజెర దిండుకు గాళ్ళూ ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు; కొన్నిచోట్ల, దీనికి చివర ఇనప ఊచల చెక్రంగాని, రేకు పళ్ళచెక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (తె. 8).

**పింజెరగుర్రాలు** ? డాబీకోలలను లేపే కర్రలు; చూ. డాబీ. చూ. చిత్రం 132 క (తె. 29).

**పింజెరజాలి** ఉ, పెంజెరజాలి; పర్యా. చూ. వడి (6). పేటుదారాలు చివర కట్టిన పురిదారం; మామూలుగా, మైనం పూసింది; కొన్నిచోట్ల, ఇనపతీగ; దీనికి మధ్య, బెజ్జంచేసిన చిన్న (ఇనప) బిళ్ళ ఉంటుంది; డాబీకోలలు పైకిలేచినప్పుడు ఇవి అంచుపోగులను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 12 (తె. 25).

**పింజెరడిజైనంచు** ఆకులు, పువ్వులు, బొమ్మలు మొ.వి డిజైనులో పడేట్లు నేసిన అంచు; మగ్గానికి డాబీ (పింజెర) అమర్చి నేస్తారు(తె. 25).

**పింజెరతాడు** **1.** పర్యా. బిసితాడు. కమాను (=దూది ఏకే కొయ్య పనిముట్టు) వేలాడదీసిన తాడు. చూ. చిత్రం 9. 11 (తె. 2): **2.** పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసిన దారం; డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10(తె.4).

**పింజెరనేత** పర్యా. చూ. డాబీనేత. మగ్గానికి డాబీ అమర్చి, బట్ట అంచున డిజైన్లు పడేటట్లు నేసిన నేత (రా. 18).

**పింజెరబద్ద** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్న బద్ద(లు); పావుచెక్కలను తొక్కినప్పుడు, గొలుసు పిక్కలుగాని, దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (తె. 18).

**పింజెరవాళ్ళు** ఉ. పింజెరోళ్ళు; పర్యా. దూదేకులవాళ్ళు. దూది ఏకే సాయెబులు (రా. 15, 18, 22, 23).

**పింజెరసింగర్** ? డాబీ (=పింజెర) మగ్గం పేటుదారాలను కింది అంచుల్లోకి వేలాడదియ్యటానికి అమర్చిన సాధనం; దీని ఉంగరాల్లోకి దారాలు దూర్చి ఉంటారు (తె. 32).

**పింజె(ర)సూత్రం** ఉ. పింజెరసూత్రుం; పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసిన దారం డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (తె. 18, 20, 25, 31).

**పిటికీబద్ద** పర్యా. చూ. ఉండేలు(బద్ద). తాడు కట్టిన వింటిబద్ద; దీనికి, తాడుతో కమాను వేలాడకట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం 9.12 (కో. 11):

**పిటుకోలచెక్రం** పర్యా. చూ. పెడకోలచెక్రం. పెడకోలను మోసే కొయ్యచెక్రం. ఇటువంటివి రెండుంటాయి; నేతమోకు వదులు చేసినప్పుడు, పడుగు నేలకు తగులకుండా పెడకోలచెక్రాలమీద జరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129 ప. 1 (కో. 25).

**పిట్ట** పర్యా. చూ. పికాసి. మరమగ్గం నాడెను, ఒక సొరుగులో నుంచి మరొక సొరుగులోకి నెట్టటానికీ సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికీ అమర్చిన కొయ్యగిలక; మామూలుగా, మిషనుదారం చుట్టే

కొయ్యరీలు; ఇటువంటివి ఉడతలకు బదులు రెండు సొరుగుల్లోనూ అమరుస్తారు. చూ. చిత్రం 120(తె.12)

**పిట్టకన్ను** (–పడు) నేతలో పోగు తెగినప్పుడు వచ్చిన చిన్న వెలితి. చూ. జాడిపడు (కో. 34).

**పట్టు** పర్యా. చూ. దిమ్మ(5). డాబీ దిండుకు చేసిన బొడిపె(లు); దిండు తిరిగినప్పుడు, ఇవి కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 క. 2 (కో. 8).

**పిట్టుకోలకర్ర** రూ. పెటకలకర్ర; పర్యా. పెడ కోల(1). అచ్చుకట్టే జంత్రం చివరి పుల్లలకు తాడుతో కొలికివేసి బిగించిన కర్ర; దీనికి రెండువైపులా గుదులు కట్టి, అచ్చుకర్రలకు తగిలిస్తారు (కో. 33).

**పిడక్కచ్చి (క)** (< పిడక + కచ్చిక) పిడకలు కాల్చగా వచ్చిన నుసి; అచ్చుతికేటప్పుడు వేళ్ళు గరుకుగా ఉండటానికి బూడిద అద్దుకొంటారు (కో. 31, 32)

**పిడచ** (–అద్దు, –కొట్టు, –తట్టు, –తడుపు) ఉ. పిడస, పిడిసి, పిడిసి, పిడెసె, పిడ్చె. **1.** పర్యా. అద్దు పిడచ, గంజిగుడ్డ(1), గంజిపిడచ(1), గంజిబద్దె, గుడ్డ పిడచ, పిడచగుడ్డ, పిడచబట్ట, బట్టపిడచ, నరిగోక, నరిపిడచ. పడుగు తడపటానికి, గంజిలో ముంచినగుడ్డ; కొన్నిచోట్ల, బద్దెపేలికలు కుప్పచేసి పిడచగా ఉపయోగిస్తారు; దీంతో పడుగుకు గంజికాని, అంబలికాని పట్టిస్తారు; నరిచేసేటప్పుడు ఆరుబదునులో ఉన్నపడుగు మీద, దీంతో గంజి చిలకరిస్తారు. చూ. చిత్రం. 74. 2 (కో. 1-11, 13-19, 21, 22, 27, 30, 31, 34, 36; తె. 1–7, 9–33; రా. 1–4, 6-8, 10, 12, 13, 18, 23, 24); **2.** పర్యా. చూ. అంబలిపిడచ(2). గొంగడినేతలో పడుగు తడపటానికి అంబలిలో ముంచిన (గొంగడి) గుడ్డ. చూ. చిత్రం 315 క. 20 (తె. 3, 11, 26-28); **3.** పర్యా. గంజిపిడచ(2). నేతనేసేటప్పుడు, బట్టముందుభాగం(=వాయి) బిరుసెక్కటానికి గంజి–కొన్నిచోట్ల అంబలి-పూసే గుడ్డ. చూ. చిత్రం 142.1 (కో. 14; తె. 1, 2, 9, 10, 21, 24, 29, 31–33).

**పిడచగుడ్డ** పర్యా. చూ. పిడచ(1). పడుగు తడపటానికి, గంజిలో ముంచిన గుడ్డ; కొన్నిచోట్ల బద్దెపేలికలు కుప్పచేసి పిడచగా ఉపయోగిస్తారు; దీంతో పడుగుకు గంజికాని, అంబలికాని పట్టిస్తారు. చూ. చిత్రం 74. 2 (రా. 7, 20).

**పిడచబట్ట** పర్యా. చూ. పిడచ(1). పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ; కొన్నిచోట్ల, బద్దెపేలికలు కుప్పచేసి పిడచగా ఉపయోగిస్తారు; దీంతో పడుగుకు గంజికాని, అంబలికాని పట్టిస్తారు. చూ. చిత్రం 74. 2 (రా. 11, 16).

**పిడి** ఉ. పిడె. **1.** పర్యా. చూ. చెయ్యి(1). ప్రత్తి రాట్నం తిప్పటానికి కుడివైపు నిలువుకొయ్యకు బిగించిన పిడి. చూ. చిత్రం 1. 7, కో. 1, 5, 8; తె. 4); **2.** పర్యా. చూ. చెయ్యి(2). రాట్నం ఇరుసు తిప్పే (కొయ్య) పిడి. చూ. చిత్రం 15. 9 (కో. 1, 2, 7, 8; రా. 3, 16); **3.** నూలులెక్క: (క) రెండు లడీల నూలు (కో. 5, 11, 12, 17; తె. 11; రా. 1, 24); (చ) లడీలో పదోవంతునూలు (తె. 2); (ట) లడీలో సగంనూలు (తె. 11); **4.** పర్యా. చూ. లడీ. పెట్టెలో ఉండే నూలుకట్ట; ఏ నెంబరు నూలో, అన్ని లడీలు ఒక్కొక్క పెట్టెలో ఉంటాయి; లడీబరువు = పదిపౌన్లు / నూలునెంబరు (కో. 11, 12, 16–23, 25, 26, 28–30; తె. 27; రా. 17); **5.** పట్టుదారం లెక్క: నాలుగు తులాల బరువు తూగేది; దీని బరువు 4–20 తులాల వరకూ ఉంటుంది (తె. 5); **6.** పర్యా. చూ. చెయ్యి(3). డబ్బారాట్నం ఇరుసు తిప్పే పిడి; ఇది కుడివైపున ఉంటుంది. చూ. చిత్రం 41 క. 11 (రా. 10); **7.** పర్యా. చూ. కుంచెపిడి. పడుగు దువ్వే కుంచె పట్టుకోటానికి బిగించిన కొయ్య. చూ. చిత్రం 76 క. 1 (కో. 1–13, 15, 16, 18–24, 26–37; తె. 1, 3–5, 7, 8, 10–18, 21, 22, 25, 26, 28–33; రా. 11, 13, 15–18, 23, 24); **8.** పర్యా. చూ. కుచ్చు. మరమగ్గంలో ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి, చేత్తో తాళ్ళను గుంజేది; మామూలుగా గుడ్డపేలికలు–కొన్నిచోట్ల, బద్దెపేలికలు-కలిపి కట్టింది; కొన్నిచోట్ల, దారపురీలు (=కొయ్యది) కడతారు. చూ. చిత్రం 118. 21 (కో. 7, 8, 21; తె. 17, 33); **9.** పర్యా. చిల్ల(8), పట్టెగూటం. నేతమోకును చుట్టే పళ్ళచెక్రం తిప్పటానికి చేతిగూటానికి బిగించిన పుల్ల; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 122 ట. 4 (కో. 1).

**పిడికర్ర 1.** పర్యా. చూ. గూటం(1). దూది ఏకేటప్పుడు కమాను నరం కొట్టే(కొయ్య)బడితె. చూ. చిత్రం 9. 13 (కో. 16); **2.** చూ. పిసుపుకర్ర. (కో. 33).

**పిడికిలి(గూటం)** ఉ. పిడికిలు గూటం; పర్యా. గూటం(10). ఉన్ని ఏకేటప్పుడు, నరంకొట్టే కొయ్య పనిముట్టు. చూ. చిత్రం 309 చ. 1 (తె. 6, 7, 9).

**పిడిగోలుకర్ర** చూ. పెడకోలకర్ర (కో. 15).

**పిడిపలక** పర్యా. చూ. ఊపురం. చేతిమగ్గం పలకకు మధ్య, ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు, పడు

గులో పేకపోగు వేసి దీంతో అదుముతారు; చూ. పలక కొట్టు. చూ. చిత్రం 109.5 (రా. 7).

**పిడిబొండ** కుంచెపిడికి చేసిన చిల్లి; దీంట్లో దారం దూర్చి కడతారు. చూ. చిత్రం 77 క (కో. 37).

**పిడిసూత్రం** ఉ. పిడిసూత్త్రం; పర్యా. చూ. కుచ్చుతాడు. మరమగ్గంలో, నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చు కట్టిన దారం. చూ. చిత్రం 118.22 (తె. 33).

**పిడుచుకర్ర** ఉ. పిడుసుకర్ర; చూ. పిడుపుకర్ర. (కో. 33).

**పిడుపుకర్ర** రూ. పిడికర్ర, పిడుచుకర్ర; పర్యా. కోలకట్టె, దుల్లకోల, పట్టి(3), బాసుకర్ర, రూలు (కర్ర), లాటీకర్ర. రంగు అద్దిన నూలులడీలు గుంజకు తగిలించి పిండే కర్ర; గుండ్రటిది; దీన్ని అడీల్లో దూర్చి మెలిపెడతారు; దీంతో పోగులు తిరగేస్తారు; కొన్ని చోట్ల, రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. చూ. చిత్రం 282 క. 5 (కో. 26).

**పిన్ను** **1.** పర్యా. చూ. ఒగ్గి. మరాసుమీద పడుగు తోడేటప్పుడు, అనులు పడేట్టు పోగును జరపటానికి, ఒక కొయ్యపట్టెకు బిగించిన రేకుముక్క; సుమారు మూడంగుళాల పొడుగుది; దీని బెజ్జంలోనుంచి తీసిన పోగు మరాసుకు చుట్టుకొంటుంది; మరాసు తిరిగినప్పుడు కీలు ఆడుతూ కొయ్యపట్టె జరిగి, దానికి బిగించిన ఈ రేకుముక్క పోగునుగూడా జరుపుతుంది, ఇలా జరగటంలో పడుగులో అని పడుతుంది; ఇటువంటివి, పట్టెపొడుగునా వరసగా–కొన్నిచోట్ల, 40– ఉంటాయి. చూ. చిత్రం 50.14 (కో. 36; రా. 2); **2.** పర్యా. చూ. పూస(7). పేటుదారానికి చివర కట్టిన పురిదారం (=వడి)లో, అంచుపోగు దూర్చేసందు; సన్న బెజ్జం; కొన్నిచోట్ల బెజ్జం చేసిన చిన్న ఇనపబిళ్ళ; దీన్ని వడిలో బిగిస్తారు. చూ. చిత్రం 132 చ. 14 (రా. 2).

**పిన్నుబద్ద** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాసు కట్టుబడిలో, పడుగుపోగులు దూర్చే, బెజ్జాలుగల రేకముక్క(పిన్ను)లు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె. చూ. చిత్రం 50.11 (కో. 36).

**పిన్నె** నూలుపోగులలెక్క: ?మూడు పోగులదారం (తె. 21).

**పిన్నెడు** (విణ.) నూలుపోగులలెక్క: మూడు కొలుకులదారం (తె. 25).

**పిందెలపేటు** పర్యా.మామిడిపిందెలపేటు. అంచులో మామిడి పిందెల వరసలో నేసిన డిజైను. చూ. చిత్రం 208 (రా. 8).

**పిరపీట** ఉ. ?పిరపేట; పర్యా. చూ. పిర్రపట్టు. మగ్గంముందు, నేతపనివాడు కూర్చొనే చోటు. చూ. చిత్రం 108.3 (రా. 24).

**పిరికం** పర్యా. చూ. వడిబిళ్ళ. అచ్చుకట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; ఒక వైపు వెడల్పుగానూ ఒకవైపు సన్నగానూ ఉండేది; అచ్చుకట్టిన తరవాత, దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకుచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (కో. 14).

**పిరికి** పర్యా. దాకె(పీట)(1), పెంక(2), ఉన్ని వడికేటప్పుడు, కదురు తిప్పే బోకికి ఆధారంగా పెట్టిన మట్టు; కుండమూతితో ఉన్న భాగం; దీన్ని బోర్లించి, పైన బోకి పెడతారు. చూ. చిత్రం 308.4 (తె. 22).

**పిరికినకట్టె** ఉ. పిరికినికట్టె, పిరికోనికట్టె, పిర్కనకట్టె; పర్యా. చూ. పల్లెకట్టె. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనె(పలక)తిప్పే కర్ర; కొన్నిచోట్ల ఇనపకడ్డీ; కుడివైపు దోనె బెజ్జంలో దూర్చి నేలకు ఆనుస్తారు. చూ. చిత్రం. 123 చ. 2 (తె. 21, 25, 27).

**పిర్రగుంట** రూ. పిర్రగుంత; పర్యా. చూ. పిర్రపట్టు. మగ్గంముందు, నేతపనివాడు కూర్చొనే చోటు; మామూలుగా పల్లంగా ఉంటుంది; కొన్నిచోట్ల మెరక; మామూలుగా, గోనెపట్టా పరుచుకొని కూర్చొంటారు. చూ. చిత్రం 108.3 (రా. 15).

**పిర్రగుంత** ఉ. పింగుంత; చూ. పిర్రగుంట (కో. 2; రా. 4, 11).

**పిర్రపట్ట** ఉ. పిరట్ట, పిరిపట్ట, పిర్రెపట్ట, **1.** చూ. పిర్రపట్టు (కో. 22; తె. 21; రా. 1, 3, 16–18); **2.** నేతపనివాడు కూర్చోటానికి, మగ్గం ముందు వేసుకొన్న గోనె (జనపనార) గుడ్డ; పట్టా (రా. 13, 23).

**పిర్రపట్టు** ఉ. పిర్రెపట్టు; రూ. పిర్రపట్ట(1), పిర్రపట్టె; పర్యా. పిరపీట, పిర్రగుంట, పీటకట్టు, మగ్గంగద్దె. మగ్గంముందు, నేతపనివాడు కూర్చొనేచోటు; మామూలుగా, పల్లంగా ఉంటుంది; కొన్నిచోట్ల మెరక; మామూలుగా గోనెపట్టా పరుచుకొని కూర్చొంటారు. చూ. చిత్రం 108.3 (కో. 15, 27, 28, 30, 31; రా. 1, 2, 6–10, 12, 20, 22).

**పిర్రపట్టె** ఉ. పరపట్టె, పిరపట్టె, పిర్రపట్టి; చూ. పిర్రపట్టు (తె. 1, 9; రా. 5, 14, 19బి, 24).

**పిర్రపట్టెగోనె** పర్యా. పిర్రపట్ట(2). నేతపనివాడు కూర్చోటానికి, మగ్గంముందు వేసుకొన్న గోనె(జనపనార)గుడ్డ; పట్టా. చూ. చిత్రం 108.3 (తె. 1).

**పిలకచెవి** ఒకరకం రాట్నంబొమ్మ (=మొగంబల్ల)కు బిగించిన కొయ్య; ఇటువంటివి రెండుంటాయి;

వీటి మధ్య పగ్గ్రం బిగిస్తారు. చూ. చిత్రం (కో. 34).

**పిలక(లు)** కొన్నిచోట్ల రాట్నం కట్టుబడిలో బొమ్మకు మారుగా బిగించిన రెండు కొయ్యముక్కలు. (కో. 34).

**పిల్ల** పర్యా. పిలిక(1). నూలుకొలత: లడీలో డెబ్భయ్యోవంతు నూలు; "పిల్ల అంటే జందెం లెక్క ఉంటుంది" (తె. 4, 5).

**పిల్లకొయ్య** పర్యా. చూ. అనికొయ్య. ఆసుపోసేటప్పుడు, పడుగులో అనులు (మెలికలు) పడటానికి కచ్చిపీటకు బిగించిన పుల్ల(లు). చూ. చిత్రం 45 క. 6 (కో. 33, 34).

**పిల్లచెరగు** (-నేయు) ఉ. పిల్లసెరుగు. కమ్మికి ముందు మొదట నేసిన చెరగు భాగం. చూ. చిత్రం 272.5 (కో. 4).

**పిల్లదోనె** పర్యా. చూ. ఎదురుదోనె. మగ్గం చివర పడుగునూలు చుట్టే కొయ్యదూలం; రోకలిమాదిరిది; కొన్నిచోట్ల నలుపలకలది; మలగర్రకు బదులు అమరుస్తారు. చూ. చిత్రం 110.1 (రా. 6).

**పిల్లబద్దె** బట్టలో మొదట నేసిన బద్దె; దీంట్లో చువ్వ దూర్చి దోనెగాడిలో బిగిస్తారు. చూ. చిత్రం 144.3 (రా. 13).

**పిల్లిఅడుగు(లు)** ఉ. పిల్లడుగులు. పిల్లిపాదం గుర్తుల మాదిరి నేతడిజైను (కో. 9ఎ).

**పిల్లికళ్ళచీర** ఒకరకం డిజైనులో నేసిన చీర (తె. 15).

**పిల్లొట్టు(లు)** కొన్నిచోట్ల, పూర్వపు రాట్నాలకు, తోలుముక్కలకు మారుగా అమర్చిన తాటినార ముక్కలు; రాట్నంబొమ్మకు చెవులుగా అమర్చేవారు. చూ. చెవి (తె. 11).

**పిసుకుడురంగు** నూలులడీలకు రంగు వెయ్యటానికి చన్నీళ్ళలోవేసి పిసికే రంగు; మామూలుగా రెండుమూడు సార్లు పిసుకుతారు; ఈ రంగు అట్టే కాలం నిలబడదు (కో. 9, 8).

**పిసర(తాడు)** పర్యా. చూ. కొండితాడు. అచ్చు కట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు, అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 11, 17. 21-24, 26, 27, 31).

**పిసరతిప్పు** (క్రి.) అచ్చుకర్రపైన బిగించిన పుల్ల (=పిసరపుల్ల)కు వడిదారంతో ముడివెయ్యటం. చూ. పిసరపుల్ల (కో. 27).

**పిసరపుల్ల** పర్యా. చూ. కదురు(6). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుబిళ్ళకు చేర్చి వడిదారం చుట్టే పుల్ల; మామూలుగా కట్టెపుల్ల; కొన్నిచోట్ల ఇనపది; దీని బెజ్జంలో దూర్చిన దారం, అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు. చూ. చిత్రం 92 క. 1 (కో. 26, 27).

**పిసి** పర్యా. చూ. వాండ్ల. పడుగులో, పడుగేరు కర్రకు ఉన్న పోగులు; సరిచేసేటప్పుడు, వీటిని కర్రతో తిప్పి, వాండ్లకుంచె (=అలుక్కుంచె)తో దువ్వుతారు. చూ. చిత్రం 80.1 (రా. 16).

**పిసిపాత** ఉ. పిసుపాత. చేతినాడె గాడిలో, పుల్ల కింద పెట్టిన బట్టముక్క; పోగు బిర్రుగా రావటానికి పెడతారు. చూ. చిత్రం 131 చ. 1, 5 (కో. 33, 34, 36, 37).

**పిసిరికాయ** దసలిపురుగు, దారంతో తనచుట్టూ అల్లుకొన్న గూడు; లింగం మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 289 (తె. 7).

**పిళ్ళారిచవితి** పర్యా. చూ. వినాయకచవితి. భాద్రపదశుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గంసామానులన్నీ కడిగి బొట్లుపెట్టి, పూజచేసి పండుగ చేసుకొంటారు. (రా. 1, 2, 8).

**పీకదాన** రూ. పీకదానం; పర్యా. పీకదొన్నె. నేతనేసేటప్పుడు, నేతపనివాడు కాల్చిన చుట్ట, బీడి వగైరా(పీక)లు వేసే మట్టిపాత్ర; ash tray; దీన్ని మగ్గందగ్గర పెట్టుకొంటారు (కో. 31).

**పీకదానం** చూ. పీకదాన (కో. 25, 27).

**పీకదొన్నె** పర్యా. పీకదాన. నేతనేసేటప్పుడు, నేతపనివాడు కాల్చిన చుట్ట, బీడి వగైరా (పీక)లు వేసే మట్టిపాత్ర; ash tray; దీన్ని మగ్గందగ్గర పెట్టుకొంటారు (కో. 28).

**పీకుడు(ఉ)న్ని** గొర్రె చెర్మానికి సున్నంపూసి పీకిన బొచ్చు; తివాసీనేతకు అంత మంచిది కాదు (కో. 16).

**పీగ్రీన్** ఒకరకం పచ్చరంగు; pea green. చూ. చిత్రం 288 (కో. 3; రా. 8).

**పీట** ఉ. పీటె. **1.** పర్యా. చూ. అడ్డపీట(1). వత్తి రాట్నం కిందిపీట. చూ. చిత్రం 1. 2 (కో. 10; తె.5, 12); **2.** రూ. పీటకం(1); పర్యా. అడుగుపీట(1), అడుగుబల్ల, అడ్డ(2); అడ్డకమ్మి(2), అడ్డకొయ్య(2), అడ్డపట్టె(2), అడ్డపీట(2), అడ్డబల్ల(2), గుంజలపీట(1) దంచెబల్ల(1), దిమ్మ(2), దూపిరి(1), పట్టె(1), పలకపీట, బల్ల(1), జారుపట్టె(2), మట్టుబల్ల(2), మొద్దు(1). రాట్నంనిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (కో. 1, 3-7, 10, 23, 25, 26; తె. 3-12, 14, 17-30, 32, 33; రా. 9, 10, 15, 19); **3.** నారవడికేటప్పుడు, కూర్చోటానికి వేసుకొన్న మొద్దు

(తె. 25); **4.** పర్యా. చూ. దాకెపీట(2). ఉన్నివడికేటప్పుడు (ఆడవాళ్ళు) కూర్చోటానికి వేసుకొనే పీట. చూ. చిత్రం 308.2 (తె. 3, 6, 7, 9, 20, 25-28); **5.** పర్యా. చూ. కాటుపీట. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టే కొయ్య. చూ. చిత్రం 28 (తె. 21); **6.** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1. 36 (తె. 19, 20, 22, 23, 32); **7.** పర్యా. చూ. అడ్డకట్టె(4). అడ్డగుమ్మి కిందిపీట; దీనికి నిలువులు బిగిస్తారు. చూ. చిత్రం 34.1 (కో. 2); **8.** రూ. పీటకం (2); పర్యా. అడ్డ(4), అడ్డకమ్మి(3), అడ్డపట్టె(6), అడ్డపీట(4), గుంజలపీట(3), దండెబల్ల, పట్టె(3). డబ్బారాట్నం నిలువులు బిగించిన కిందిపీట. చూ. చిత్రం 41 క. 1 (కో. 2, 3, 26, 26; తె. 10); **9.** పర్యా. చూ. కండెలపీట. కండెలు చుట్టే మనిషి కూర్చోటానికి, రాట్నం దగ్గర వేసుకొనే పీట. చూ. చిత్రం 56 క. చ (కో. 27, 32, 35, 35); **10.** పర్యా. చూ. ఊత్తె దండె. ఊత్తె పైవైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (తె. 4); **11.** చిటికెపీటకు ఆధారంగా ఉన్న కిందికొయ్య; చిన్నది. చూ. చిత్రం 285.3 (తె. 11); **12.** పర్యా. చూ. అసుపీట. అసుకొయ్య (=అసుకు బిగించిన నిలువుపుల్లల)కు ఆధారంగా ఉండే అడ్డపట్టె(లు); ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క.1-3 (తె. 5, 9, 11, 19, 22–26, 29, 30, 32, 33); **13.** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ.చిత్రం 118.16 (రా. 9).

**పీటకట్టు** పర్యా. చూ. ప్రసట్టు. మగ్గంముందు నేతపనివాడు కూర్చొనే చోటు. చూ. చిత్రం 108.3 (కో. 1).

**పీటకట్టె** **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 19); **2.** పర్యా. చూ. అసుజంగ. అసుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (తె. 19).

**పీటకం** **1.** చూ. పీట(2). (కో. 28); **2.** చూ. పీట(8) (కో. 28).

**పీటకోడు** పర్యా. చూ. అరికెతుండు. గంజిపెట్టటానికి చుట్టిపనగుగు వేసుకొనే కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 75 (కో. 3).

**పీటగాల** పర్యా. చూ. చీరె. రాట్నం'బొమ్మ'లో వడిదారం తిరగటానికి చెక్కిన గాడి. చూ. చిత్రం 15.11 (తె. 24).

**పీటనిలువు** పర్యా. చూ. నిలువు(3). రాటికి ఆధారంగా పాతిన నిలువుకొయ్య; ఒకటిగాని, రెండుగాని ఇలాటివి ఉంటాయి. చూ. చిత్రం 31 ప. 1 (తె. 22).

**పీటబొమ్మ** పర్యా. చూ. బొమ్మ(3). రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడిబొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చిత్రం 15.10 (కో. 9).

**పీటరేకు** డాబీదిండు ఇనపచువ్వను బిగించిన రేకు; చూ. డాబీ (తె. 22, 23).

**పీతాంబరం** **1.** జరీ ఎక్కువపెట్టి నేసిన ఒకరకం బట్ట (రా. 14); **2.** బంగారం రంగు (కో.2;తె.12,21).

**పీప** రంగునీళ్ళుకాచే గుండ్రటి ఇనపడబ్బా; పెద్దది. చూ. చిత్రం 282 క. 3 (తె. 5).

**పీపతొగరు** పర్యా. పీపారంగు. ఒకరకం ఎరుపు (తొగరు) రంగు; అలిజరిన్; సుమారు పభై ఏళ్ళకు పూర్వం జర్మనీనించి పీపాల్లో వస్తూండేదట(తె. 4, 15).

**పీపారంగు** ఉ. పీప–; పర్యా. పీపతొగరు. ఒకరకం ఎరుపు(తొగరు)రంగు; అలిజరిన్; సుమారు పభై ఏళ్ళకు పూర్వం, జర్మనీనించి పీపాల్లో వస్తూండేదట (తె. 3, 8, 11; రా. 16, 23).

**పీలిక** ఉ. పిలికె, పీలికె, బీలికి. నూలులెక్క : **1.** పర్యా. పిల్ల. లడీలో డెబ్భయ్యోవంతునూలు (కో. 16, 23, 24); **2.** 736 పోగులనూలు (కో. 33, 34); **3.** 7360 పోగుల నూలు (కో. 35).

**పీలీకాఝూ** పసుప్పచ్చవన్నె; తివాసీ నేతపనివాళ్ళ వాడుక (కో. 16).

**పుచ్చురంగు** మడ్డిచెక్కతో తయారుచేసిన ఎరుపు రంగు (కో. 8).

**పుచ్చు(లు)** విదేశంనుంచి దిగుమతి అయిన ఒకరకం ఎరుపు రంగు(లు); పూర్వం వాడుకలో ఉండేవి (కో.10).

**పుచ్చె** పేకదారంకండె అమర్చే నాడెకొన; దీనికి రేకుపొన్ను బిగిస్తారు (తె. 12).

**పుంజకట్టు** నూలులెక్క : లడీలో డెబ్భయ్యోవంతు నూలు (కో. 19).

**పుంజం** ఉ. పుంజొం. నూలులెక్క : **1.** లడీలో డెబ్భయ్యోవంతు నూలు (కో. 1, 7; తె. 7, 24, 32, 33); **2.** లడీలో నూరోవంతు నూలు (తె. 23); **3.** అరవై కొలుకుల (=నూటఇరవై పోగుల) దారం

(కో. 1-25, 27, 30, 33, 34; తె. 3-5, 10-17, 23, 25, 26, 33; రా. 1, 4-7, 9-17, 19-24; **4.** అరవై పోగుల సట్టుదారం (తె.12, 17); **5.** నలభై గూళ్ళు ఉన్నిదారం (తె. 3, 20, 22, 23); **6.** అరవై గూళ్ళు ఉన్నిదారం (తె. 25).

**పుంజాలకర్ర** ఆరుబయట చాపిన పడుగులో, సరి గుంజపైపు ఎక్కించిన పడుగేరుకర్ర (కో. 9బి).

**పుటగ్గోరంచు** ఉ. పుటగోరంచు. ?ఒకరకం చిన్న గోరంచు; చీరలకు నేస్తారు (కో. 27, 28).

**పుటాణిగడి** పాతిక అంగుళం వెడల్పున సమచతు రంగా నేసినగడి (కో. 7).

**పుటానీఅంచు** ఉ. పుటాని-. అంచునేతకు వేరే దారాలు మలిపి నేసిన ఒకరకం అంచు; కుప్పడం మాది రిది; వేలెడంత కొమ్ముల మాదిరి డిజైన్లు పడతాయి (తె. 31).

**పుటానీ(చీర)** ఉ. పుటాని-. అంచులమధ్య రంగు పోగులు నాలుగు కొలుకులు నల్లపోగులు నాలుగు కొలుకులు పెట్టి నేసిన చీర; కొన్నిచోట్ల, నలుపు, ఇటాలి రంగు పోగులు ముందు రెండేసి, తరవాత 3, 2 పోగులు చొప్పున పెట్టి నేస్తారు కొలికి=2 పోగులు. (రా. 17, 24).

**పుటానీవల్లె** ఉ. పుటంనొల్లె. పచ్చ, కపిల వన్నెలు కలిపి నేసిన చిన్నచీర (తె. 32).

**పుట్టలమ్మచీర** తెలుపులో బొటనవేలెడు వెడల్పు ఎడంలో రెండేసి కొలుకులు ఎర్రపోగులు పడేట్టు నేసిన చీర (తె. 15).

**పుట్టుగొంగడి** పాతగొంగడి; వీరప్పపండుగకు - వీరప్ప, కామరతి, అక్కమాంకాళి, బయన్నల-లింగాలు వీర్లవాళ్ళకు తెలవకుండా ఈ గొంగడిలో దాచి పట్లో ముంచి వస్తారు (తె. 20).

**పుట్టుధోతి** ఉ. -దోతి; పర్యా. పుట్టుపంచె(1). చిన్నవాళ్ళు (మగవాళ్ళు) కట్టుకొనేపంచె (తె. 23, 24)

**పుట్టుపంచె** **1.** పర్యా. పంచె(1), పుట్టుధోతి. చిన్న వాళ్ళు (మగవాళ్ళు) కట్టుకొనే పంచె (తె. 25); **2.** చిన్నవాళ్ళు, ఆడపిల్లలు కట్టుకొనే చీర (కో. 36).

**పుట్టొల్లె** కన్నెపిల్లలు మొదటిసారి కట్టుకొనే చీర (తె. 19, 22-25, 29, 32, 33).

**పుంటిజనుము** గోగునార; తాళ్ళుపేనటానికి వాడ తారు (తె. 25).

**పుత్రసత్తిగడి** ఒకరకం నేతగడి (కో. 17, 18, 20-22).

**పుత్రసత్తి(గడి)చీర** ఉ.పుత్తరసత్తి-, పుత్తరసిత్త. పిల్లలు లేనివాళ్ళు కట్టుకోటానికి నేసిన ఒకరకం నేత చీర; కొన్నిచోట్ల, అంచుకు ఎరుపుపెట్టి తెలుపు, నలుపు వన్నెల్లో గళ్ళుపడేట్టు నేస్తారు; ఇది కట్టుకొంటే, సంతానప్రాప్తి కలుగుతుందట(కో. 17, 18, 20-22).

**పునహాకమ్మి** ఉ. పున్నాకమ్మి; చూ. పూనాకమ్మి (కో. 2, 6, 7, 13, 14; తె. 13; రా. 1, 3).

**పునా** నూలుపోగులలెక్క: ఎనిమిది పోగులదారం (కో. 23).

**పునాసపత్తి** రెండోకాపులో పండించే తెల్లపత్తి (కో. 16).

**పుప్పె** పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడెమొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల, ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (రా. 22).

**పురి** (బహు. పుర్లు, పుర్రులు) ఉ. పుర్రి. **1.** పర్యా. కదురుదారం, కన్నెతాడు, తాడు(2), దారం (1), పురితాడు, పురిదారం(1), వడి(1), వడితాడు(1), వడి దారం(1), వడుకుడుదారం. రాట్నం ఆకులతాడును, కదురును కలిపే గట్టిదారం; దీనివల్ల కదురు తిరుగు తుంది. చూ. చిత్రం 15.6 (కో. 6, 9; తె. 2, 4, 5, 7-22, 25, 26, 29, 31-33; రా. 19, 21, 23); **2.**పట్టుదారం వడికే పెద్దరాట్నం చక్రంమీదినించి కదురు మీదికి తిరిగే గట్టిదారం; ఇటువంటివి కదురుకొకటి చొప్పున ఉంటాయి. చూ. చిత్రం 293 చ. 5 (తె. 5, 12); **3.** (-పెట్టు) పర్యా. కరి, వడి(3), మురి. దారపు పోగు మెలిదిరగగా వచ్చిన గట్టిదనం (రా. 15, 24); **4.** పర్యా. కుంచెపురి. కుంచెకట్టుబడిలో, ఒకరకం గడ్డి వేళ్ళతో, పొడుగ్గా బ్రష్షు మాదిరిగా కట్టిన కుచ్చు; అడవిగడ్డి, గానెగడ్డి, కలపపుల్ల, చీపురుపుల్ల మొ.వాటి వేళ్ళతో పురికుంటారు; సరిచేసేటప్పుడు, పడుగుపోగులు చిక్కులుపడకుండా దీంతో దువ్వుతారు. చూ. చిత్రం 76 క. 10 (కో. 1-20, 22-24, 27-34, 36, 37; తె. 4, 5, 7, 10-18, 20-23, 25, 31-33; రా. 11, 13, 15-18, 23).

**పురి(కొస)** జనపనారదారం; మందంగా ఉంటుంది; గోనెపట్టా, కుర్చీగుడ్డలు, మంచంగుడ్డలు మొ.వి నెయ్య టానికి, నంచులు కుట్టటానికి వాడతారు (కో. 13-15).

**పురికోల** పర్యా. చూ. కిందికొత్తల. ఆసుపోసిన పడుగులో చివరిఅని పడ్డ భాగం; కొత్తల (కో. 24).

**పురితాడు** పర్యా. చూ. పురి(1). రాట్నం ఆకుల తాడును, కదురును కలిపిగట్టే దారం; దీనివల్ల కదురు తిరుగుతుంది. చూ. చిత్రం 15.6 (తె. 2, 10, 18).

**పురితిప్పు** (క్రి.) పర్యా. కరిపెట్టు, మురిపెట్టు, వడి పెట్టటం; మెలిపెట్టటం; అచ్చుతికేటప్పుడు, బద్దెపోగుకు

పడుగుపోగు కలిపి వడిపెడతారు (రా. 3).

**పురి(దారం)** **1.** పర్యా. చూ. పురి(1). రాట్నం ఆకులతాడును, కదురును కలిపే గట్టిదారం. చూ. చిత్రం 15.6 (కో. 6; తె. 2 25, 29, 31-33; రా. 21, 23); **2.** పర్యా. చూ. వడిదారం(2). డబ్బా రాట్నంచెక్రాన్నీ గంటాన్నీ కలిపే గట్టిదారం; దీనివల్ల గంటం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 8 (రా. 19, 23); **3.** పర్యా. చూ. వడిదారం(3). అచ్చుకట్టే టప్పుడు, అచ్చుకర్రలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల, మిషనురీలు(=దారపుబండి)దారం కడతారు. మొదట, అచ్చుబిళ్ళకు చుట్టి, తరవాత కర్రకు దూరుస్తారు. (కో. 20); **4.** పర్యా. చూ. బిర్రుతాడు(2). మరమగ్గం నిలువుపట్టెను మేరువుపలకకు బిగించి, సన్న పుల్లతో వడిపెట్టిన దారం; మేరువుపలకను పైకిగాని, కిందికిగాని జరుపుకొని దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118.6 (రా. 13).

**పురి(నూలు)** **1.** పర్యా. కరినూలు, చుక్కుడు నూలు, నురనూలు. రెండు (రంగు) పోగులు కలిపి పురి పెట్టిన నూలు; గట్టినూలు (కో. 11-15; తె. 19, రా. 19); **2.** సవారు నేతకు వాడే గట్టినూలు; వడి పెట్టింది (కో. 12).

**పురిపట్టు** రెండు, మూడు పోగులు కలిపి వడిపెట్టిన పట్టు; Art-silk; అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి వాడ తారు (కో. 7, 26).

**పురిపుల్ల** పర్యా. చూ. బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక తాడు వడిపెట్టే పుల్ల; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (రా. 13).

**పురిబద్ద** పర్యా. చూ. కుంచెలాక. కుంచెకట్టుబడిలో, పురిబిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల, అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (తె. 28).

**పురిబల్ల** పర్యా. బిర్రుచిట్టె(2). పంజె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిది. చూ. చిత్రం 19 క. 4 (కో. 37).

**పురిబెట్టు** (క్రి.) ఉ. -పెట్టు. **1.** పర్యా. చూ. పురేయు. సరిచేసిన పడుగు మెలిదిప్పటం (కో. 2); **2.** నారపోగు వడిపెట్టటం; నేలలో రెండు గుంజలు పాతి, వాటిమధ్య బండిచెక్రం నిలబెడతారు; చెక్రానికి చుట్టూ చేసిన గాడిలో పురతాడువేసి, ఎదురుగా పాతిన మరిరెండు గుంజలకు ఇనపచువ్వ (=కదురు) తగిలించి, పురి రెండోవైపు దానికి తగిలించి, చెక్రం తిప్పుతూ నార పురిబెడతారు; లంబాడీవాళ్ళు ఈ పని చేస్తారు (కో. 14).

**పురిరాట్నం** **1.** జమిలిపోగులు పురిపెట్టే రాట్నం; వడుకుడురాట్నం మాదిరే ఉంటుంది; Doubling charka (తె. 28); **2.** సవారు నేతకు వాడే పేకదారం కండెలు చుట్టే రాట్నం (కో. 12).

**పురిరేషన్** రెండు, మూడు పోగులు కలిపి వడి పెట్టిన పట్టు (కో. 15).

**పురివేళ్ళు** కుంచెపురికివాడే ఒకరకం గడ్డివేళ్ళు; చూ. పురి (తె. 1).

**పురులుపోయు** (క్రి.) ఉ. పుర్లు-. ?సరిచేసి చుట్టిన ఉన్నిపడుగు(=వలెం) అచ్చుగోలకు వెయ్యటం(తె.27).

**పురేయు** (క్రి.) పర్యా. కరిపెట్టు, పురిబెట్టు(1). సరిచేసిన పడుగు మెలిదిప్పటం (కో. 3; రా. 24).

**పులి** ఊరబెట్టిన గంజినీళ్ళు; ఉన్నిపడుగుకు పెట్టే చింతఅంబలి కాచటానికి, ఈ నీళ్ళతో ఎసరుపెడతారు (తె. 33).

**పులిగంజి** పులవబెట్టిన గంజి; దీంట్లో నూలుపిల్ళు తడుపుతారు (కో. 16).

**పులిగోరు(లు)** గొల్లవాళ్ళు కట్టుకొనే ఒకరకం చీర(లు); అంచుల మధ్య తొగరురంగు, అంచుల్లో బిర పువ్వురంగు వచ్చేట్టు కుప్పడంపట్టి నేస్తారు; కొన్నిచోట్ల, అంచుల మధ్య తెలుపు, అంచుల్లో ఎరుపురంగూపెట్టి పులిపంజా మాదిరి డిజైను వచ్చేట్టు నేస్తారు (తె. 13).

**పులుకోలకట్టె** చూ. పూనుకోలకట్టె (రా. 11).

**పులుసురంగు** ? మొదట అద్దే రంగు; దీంట్లో రంగుకు తగినంత కాస్టిక్‌సోడా వేసి వేణ్ణీళ్ళలో వేస్తారు (తె. 20).

**పుల్ల** **1.** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగ టానికి ఆధారపడి ఉన్న ఇరుసు; మామూలుగా ఇనప్పది; కొన్నిచోట్ల, కొయ్యది; కొన్నిచోట్ల, రాటి కట్టుబడిలోనే ఒకభాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల, దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2. (తె. 21, 31; రా. 24); **2.** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (కో. 5-7, 9, 35, 36; తె. 4, 5, 13, 14; రా. 18); **3.** అడ్డగుమ్మికి రెండువైపులా కట్టిన పుల్ల(లు). చూ. చిత్రం 32.8 (కో. 2, 4); **4.** పర్యా. చూ. ఆసుకొయ్య(3). ఆసుపీటలకు దిగ గొట్టిన కొయ్యపుల్ల(లు); వీటిని చుట్టి వచ్చేట్టు ఆసుకు నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (కో. 1, 3-10, 13-15, 18, 19, 22, 24; తె. 16; రా. 6, 18, 20); **5.** పర్యా. చూ. ఊచ(3). కండెనూలుచుట్టే జొన్నదంటుముక్క; కొన్నిచోట్ల, కంకిపుల్ల, కాకిరెల్లు, కొయ్య, ఇనుము, మొ. వాటిలో

చేసిన ఊచలు వాడతారు. మరమగ్గం నాడెలో, మామూలుగా కొయ్యఊచలుగాని, ఇనప ఊచలు గాని అమరుస్తారు. చూ. చిత్రం 51.1 (రా. 13); **6.** పర్యా. చూ. కదురు (6). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుబిళ్ళకు చేర్చి, వడిదారం చుట్టే పుల్ల; మామూలుగా, కట్టెపుల్ల; కొన్నిచోట్ల, ఇనపది; దీని బెజ్జంలో దూర్చిన దారం అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు. చూ. చిత్రం. 92 క. 1 (తె. 4, 5); **7.** పర్యా. చూ. ఎత్తుపుల్ల (2). అచ్చుతీకేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండు పుల్లలకు తాడు గట్టి మడతమంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (కో. 20); **8.** పర్యా. చూ. బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేకువుపలక బిగించి, తాడు వడిపెట్టే పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118. 7 (కో. 3, 5-10, 23, 24; 35; రా. 1, 7, 8, 12-14, 16, 17, 23, 24); **9.** పర్యా. చూ. చిల్ల(7). మగ్గంకుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా, చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118. 8 (కో. 1, 3, 5, 7; రా. 2, 4, 8, 13); **10.** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల, ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (కో. 1-3, 6-9; (తె. 1, 11; రా. 5, 11-13, 16, 20, 24);

**పుల్లఉన్ని** ఉ. పుల్లున్ని కొంచెం ఎర్రగా ఉండే గొర్రెబొచ్చు; నలుపు, తెలుపు వన్నెలకు మధ్యరకంగా ఉండే ఉన్ని (తె. 7, 20; రా. 22).

**పుల్లగొంగడి** ఎరుపులో తెలుపుచాయ కలిసిన ఉన్నితో నేసిన గొంగడి; గోనెబస్తా రంగులో ఉండేది (తె. 11, 20, 28).

**పుల్లగొర్రె** కొంచెం ఎరుపురంగు (=ఎరుపు మీద తెలుపు) బొచ్చుగల గొర్రె. (తె. 7, 20, 26-28).

**పుల్లదారం** పర్యా. అచ్చుసూత్రం(2). అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుదారం; దీనికి కొన్నిచోట్ల, కోతిపుల్ల కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 1 (రా. 16).

**పుల్లంపేటబార్డరు** నలుపు, తెలుపు రంగుల దారాలు ఒక్కొక్క కొలికి చొప్పున ముందు రెండు వరసలు పెట్టి, తరవాత నాలుగేసి కొలుకులు పెట్టి నేసిన అంచు(రా. 23).

**పుల్లలగూడు** పర్యా. చూ. తడక(2). డాబీకిపైన బిగించిన ఇనపఊచల చట్రం; డాబీకోలలు పక్కలకు జరక్కుండా నిలుపుతుంది; రెండు ఊచల సందులోకి ఒకకోల వస్తుంది. చూ. చిత్రం 132 చ. 3 (రా.24).

**పుల్లలదారం** పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి అంచుపడుగులోకి వేలాడదీసినదారం; డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (రా. 24).

**పుల్లిరుసు** ఉ. పిల్లురుసు, పుల్లవిరుసు; పర్యా. గిరక (8), తిరుగుడు(2), తిరుగుడుకట్టె(3), తిరుగుడుకర్ర, రూలు(1) రూలుగుండు, రోలరు(1), వాయిరోలరు, సూత్రపుగుండు(1). మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలివంటి గుండ్రటి పొడుగుకర్ర; గిలకలకు మారుగా అమర్చింది; కొన్నిచోట్ల ఇటువంటివి చిన్నవి రెండుంటాయి; నేతనేసేటప్పుడు, అచ్చుతాళ్లు దీనిమీద ఆడతాయి. చూ. చిత్రం 121 చ. 3, 121 ప. 1 (కో. 1, 2, 4; రా. 1, 4, 5, 7).

**పుల్లిరుసుకొయ్య** పుల్లిరుసు వేలాడదియ్యటానికి ఆధారంగా ఇంటి కప్పుకుగాని, గోలమీదగాని అమర్చిన సన్నదూలం (రా. 4).

**పుల్లిరుసుచెవి** పర్యా. చూ. చెవుకట్టు. పుల్లిరుసు నిలవటానికి పై పట్టికి బిగించిన చెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ.చిత్రాలు 121 చ. 4, 121 ప. 2 (రా. 6).

**పుల్లిరుసుతాడు** పర్యా. గిరకతాడు(4), తిరుగుడుకట్టెతాడు, తిరుగుడుకట్టెదారం, తిరుగుడుకర్రతాడు, తిరుగుడుకర్రదారం, రూలరుతాడు. పుల్లిరుసుకు వేసిన అచ్చుసూత్రం; వాయితాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 చ. 5 (కో. 2; రా. 5).

**పుల్లు** కుంచెపురకి వాడే చీపురుమొక్కపేళ్ళు; చూ. పురి (కో. 35).

**పుల్లూచ** (పుల్ల + ఊచ) ఉ. పుల్లూస. అనుపోసేటప్పుడు పోగు సాపుగా రావటానికి కుంటిపుల్లకు బిగించిన చీపురుపుల్ల; ఇటువంటివి మూడుంటాయి. చూ. చిత్రం 49.4 (కో. 34).

**పువ్వంచు** ఉ. పూవంచు; పర్యా. పుష్పంపేటంచు. పువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు; చేమంతి, నిప్పాణి, దారకాను, సూర్యకమలం, మొ.వి నేస్తారు. చూ. చిత్రం 173 (కో. 20, 21; తె. 8, 25).

**పువ్వంచుకండువా** ఉ.- కండ్వా; పర్యా. పూలకండువా. అంచుల్లో పువ్వుల నమూనాలు పడేట్టు నేసిన కండువా; గొల్లవాళ్ళు పైన కప్పుకొంటారు. (తె. 13).

**పువ్వులచీర** చూ. పూలచీర (తె. 12).

**పుష్పంపేటంచు** పర్యా. పువ్వంచు. పువ్వు ఆకారంలో డిజైనుచేసిన అంచు; చేమంతి, మిరప, నిప్పాణి, దారకాసు, సూర్యకమలం మొ.వి నేస్తారు. చూ. చిత్రం 173 (కో. 23).

**పుష్పంపేటు** ఉ.- ప్లేటు; పర్యా. పూ(వు)పేటు. పువ్వుమాదిరి నేసిడిజైను. చూ. చిత్రం 173 (కో. 20, 21, 23).

**పుష్పంబేలు** ఒకపువ్వు, రెండు ఆకులు, రెండు కాయలు పడేట్టు నేసిన డిజైను (తె. 21).

**పుష్పలత(చీర)** నేతలో తీగెబుటా పడేట్టు నేసిన చీర(కో. 36).

**పుష్పలతబుటా** పువ్వుతీగ నేసిన డిజైను (కో. 34)

**పుస్తుకాయ** ఒకరకంచెట్టు(కాయ); రుచి వగరుగా ఉంటుంది; పట్టుదారానికి వేసే కిరమంజి (చూ.) రంగు తయారీకి పనికివచ్చేది; కాయ. రోట్లో రుబ్బి ఉడికిస్తారు (రా. 14).

**పూజారిమడి** ఉ. పూజేరి-. దుప్పటి మాదిరిగా నేసిన ఒకరకం పంచె; ఇరవై నెంబరు నూలుతో నేస్తారు; సన్నటి అంచు పెడతారు (కో. 1).

**పూజె** పర్యా. చూ. పలకబుజం(1). చేతిమగ్గం వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం; కొన్నిచోట్ల. దీనికి నగిషీలు చెక్కుతారు; ఇటువంటి రెండుభాగాలకు చిల్లులుచేసి పలకసూత్రాలు కడతారు. చూ. చిత్రం 109.4 (కో. 2).

**పూటీ** రూ. కూటీ; పర్యా. చూ. పిక్క-. డాబీ గొలుసుబద్దకు బిగించిన కొయ్యముక్క; డిజైనునుబట్టి అవసరమైనన్ని బిగిస్తారు; దిండును చుట్టి గొలుసు తిరిగినప్పుడు, ఇవి కోలలను పైకిలేపుతాయి. చూ. చిత్రం 132 చ. 2 (తె. 10, 32).

**పూటీలపింజెరం** పర్యా. చూ. గొలుసుపింజెర. ఒకరకం డాబీ; సన్నబద్దల గొలుసు, దిండుకు తగిలించింది. చూ. చిత్రం 132 త (తె. 25).

**పూటీలబద్ద** 1. డాబీకోలలను నడపటానికి అమర్చిన కొయ్యబద్ద; చూ. కుక్క-. చూ.చిత్రం 131 చ.7 (తె. 24); 2. పర్యా. చూ. గొలుసుబద్ద. డాబీ గొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద(లు); వీటికి కొయ్య పిక్కలు బిగిస్తారు; ఇవి దిండునుచుట్టి తిరుగుతూ ఉంటాయి. చూ. చిత్రం 132 తె. 2 (తె. 32)

**పూటు** 1. పర్యా. చూ. ఆకు(1). రాట్నం ఇరుసుమీద తిరగటానికి చక్రం మాదిరిగా అమర్చిన సాపు చెక్క; ఇలాటివి, మామూలుగా నాలు గుంటాయి. చూ. చిత్రం. 15.4 (తె. 32); 2. (< foot) పడుగు చివరిభాగం కొలత; డిజైనునేతకోసం, రంగు అద్దే పడుగుకు చివర గుర్తులు పెడతారు (తె. 10).

**పూటురంగు** బట్ట నిగారింపుకోసం వేసిన రంగు (తె. 12).

**పూత** 1. (-వేయు). పర్యా. చూ. అలుకు. సరిచేసేటప్పుడు, పడుగు బాగా బిరుసెక్కటానికి పైన చిలికిన గంజి; గంజిపిడచ ఒకచేత్తో పట్టుకొని రెండోచేత్తో, దాని మీద అలుక్కుంచెతో దువ్వితే పడుగుమీద గంజి పడుతుంది; కొన్నిచోట్ల, వెంపలి మండలతో చిలుకుతారు (రా. 19బి); 2. రెండోసారి గంజిపెట్టి (సరిచేసిన) పడుగు (రా. 7, 8); 3. పర్యా. చూ. నాడెగుబ్బ. మంనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల, ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (రా. 21); 4. పువ్వుమాదిరి డిజైను. చూ. చిత్రం 173 (కో. 2).

**పూతఅలుకు** (-వేయు) పర్యా. చూ. అలుకు(2). సరిచేసేటప్పుడు, పడుగు బాగా బిరుసెక్కటానికి పైన చిలికినగంజి; గంజిపిడచ ఒకచేత్తో పట్టుకొని రెండోచేత్తో, దానిమీద అలుక్కుంచెతో దువ్వితే పడుగుమీద గంజి పడుతుంది; కొన్నిచోట్ల, వెంపలి మండలతో చిలుకుతారు (రా. 2).

**పూతకమ్మి** పువ్వుల డిజైను నేసిన కమ్మి; బుటాల కమ్మి (కో. 2).

**పూతకొయ్య** పర్యా. చూ. ఆరికెతుండు. గంజిపెట్టటానికి, చుట్టిన పడుగు వేసుకొనే కొయ్య; ఇటువంటివి రెండుంటాయి; దేవాంగుల వాడుక. చూ. చిత్రం 75 (కో. 7).

**పూతతడుపు** (క్రి.) ఉ. పూద్దడుపు; పర్యా. చూ. పడుగుతడుపు(1). గుడ్డపిడచతో, పడుగుకు గంజి పట్టించటం; పోగు బిరుసెక్కటానికి గంజి పట్టిస్తారు; కొన్నిచోట్ల. అంబలి పెడతారు (కో. 7, 21).

**పూతతాడు** ?సరిచెయ్యటానికి చాపిన ఉన్నిపడుగును సరిగూటానికి బిగించిన తాడు; ఇటువంటివి రెండుంటాయి (అరితాడు, సురితాడు) (తె. 6).

**పూతపిండు** (క్రి.) సరిచేసేటప్పుడు, సరిచేసిన పడుగును చేత్తో పిడవటం; దేవాంగుల వాడుక (కో. 7).

**పూతపీట** పర్యా. సరిపీట. సరిచెయ్యటానికి చాపిన ఉన్నిపడుగును బిరుపెట్టటానికి తగిలించిన కొయ్య (బిళ్ళ). చూ. చిత్రం 314.10 (తె. 6)

**పూదాడు** ఉ. పూతాడు; పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో, అనివెంబడి దూర్చిన దారం; అచ్చుతికేటప్పుడు, పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్ద

లతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (తె. 7; రా. 24).

**పూదారం** పర్యా. అనిదారం, ఉరుబద్దెదారం, కర్రదారం, తల్లితాడు, దసి, దసిదారం, దసిపోము, పూదాడు, పెడదసి, బదిగుడుదారం, బద్దెదారం(2), బద్దెపోగు(2), బద్దెలతాడు, బదోరిదారం, బెంతిదారం (2), సులుపుతాడు, సులుపుదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అనివెంబడి దూర్చిన దారం; అచ్చుతిరేటప్పుడు, పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (కో. 3, 5, 7, 8, 10, 11, 15, 33, 34, 36; తె. 14, 20, 21, 23-25, 28).

**పూదారంచివ్వ** ఉ. -సివ; చూ. పూదారంచువ్వ (కో. 33, 34, 36).

**పూదారంచువ్వ** ఉ. -సువ్వ; రూ. పూదారంచివ్వ. అచ్చుపోగుల్లో అనివెంబడి పోగులుచెదరకుండా దూర్చిన సన్నబెత్తం. చూ. చిత్రం 102 చ (కో. 3).

**పూనకోలు** మగ్గంమీద, అచ్చుగుదులు తగిలించటానికి ఆధారంగా, పైనుంచి వేలాడదీసిన ఎముకగొట్టం; అచ్చుగుదులు దీంట్లోకి దూరుస్తారు; కోతిపుల్లలు వాడుకలోకి రాకపూర్వం ఉపయోగించేవారట. చూ. చిత్రం 121 ట. 3 (కో. 6ఎ).

**పూనకోలుతాడు** మగ్గంమీద, అచ్చుగుదులు తగిలించటానికి ఆధారంగా పైనుంచి ఎముకగొట్టం వేలాడదీసిన దారం. చూ. చిత్రం 121 ట. 4 (కో. 6ఎ).

**పూనాకమ్మి** ఉ. -కమ్మె; రూ. పునహాకమ్మి. పట్టెలుపట్టెలుగా నేసిన ఒకరకం కమ్మి; చీరకొంగులో అయిదారు రంగుపట్టెలు - మూడు పట్టెలు ఒకరంగు, రెండు పట్టెలు మరొక రంగువి, వాటిమధ్య జరీగీరలు- పెట్టి నేసింది; కొన్నిచోట్ల, చీరకు రెండు వైపులా పార్శ్వంచునేసి, కమ్మికి పదికోలుకులు అంచురంగు, గుండు, ఒకకోలికి జరీ, పదికోలుకులు అంచురంగులో మూడుగుండ్లు, తరవాత జరీ పదికోలుకులు, ఒకకోలికి అంచురంగు, తరవాత పై మాదిరిగా మూడుగుండ్లు ఒక్కొక్క భాగంగా నేస్తారు; నూలు మూడువంతులు, జరీ రెండువంతులు పెడతారు; కొన్నిచోట్ల, తలచిట్టె వేసి గడ్డలో జల్తారు గీరలుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల నాలుగు కోలుకులురంగు(పచ్చ) ఒకకోలికి సందు వదలి, 2-1-2-2-1-1-1-1 చొప్పున వరసగా రంగుపోగులు, తెల్లపోగులు పెట్టి, రుద్రాక్ష గుండువేసి, తరవాత వేలెడు వెడల్పు (పచ్చ) రంగుపోగులు పెడతారు; మొత్తం, మూడు పట్టెలు పడతాయి; కొన్నిచోట్ల మధ్యగా జరీగడ్డపెట్టి, రెండువైపులా చెట్లు, ఆకులు, తీగలు, పిందెలు పడేట్టు నేస్తారు. చూ. చిత్రం 279 (కో. 5, 10, 15, 16, 19-21, 34, 36, 37; తె. 4; రా. 8, 11, 14, 15).

**పూనాకొంగు** ఒకరకం డిజైనులో నేసిన చీరకొంగు; వేరేరంగునూలుపెట్టి కమ్మినేస్తారు; చూ. పూనాకమ్మి (తె. 18).

**పూనుకోలకట్టె** ఉ. పూనుకోలు-; రూ. పులుకోలకట్టె; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రలతాళ్ళూ మధ్యలో పావుచెక్కల తాళ్ళు కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (రా. 12, 13).

**పూనుగర్ర** ఉ. పూనికర్ర, పూనుకర్ర; పర్యా. అటుకోలకర్ర, అటకర్ర, ఆడుగర్ర, అడుగోలుకర్ర, అడు(డు)గోల, అనుకోలకర్ర, ఉపువులకట్టె గుదు, కోక్కకట్టె, గునకాలకట్టె, గునుకోలుకర్ర, గులుకోలకట్టె, తానెకోడు, తానెకోల(కట్టె). తొక్కుడు కర్ర(2), తొక్కుడుచెక్కలకట్టె, దండె(4), నాగవాసం, పాకచెక్కలకోల, పాకోడుకర్ర, పాగచిప్పకర్ర, పావకర్ర, పావకోటికర్ర, పావుకోడు, పావుచట్టం, పాలచిప్పకర్ర, పూనుకోలకట్టె, బొర్ర, మట్టాబుకర్ర, మట్టుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది. దీనికి రెండువైపులా అచ్చుకర్రతాళ్ళూ, మధ్యలో పావుచెక్కలతాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 2, 3, 5-8, 9 బి, 10-13, 15; రా. 1, 2, 7, 8, 10, 20).

**పూనుగర్రతాడు 1.** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 9); **2.** పర్యా. చూ. అచ్చుగుది(2). మగ్గంలో, పూనుగర్రకు కట్టినదారం; అచ్చులో కింది కర్రకు ఉండేది; ఇటువంటివి కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (కో. 5).

**పూనుగర్రదారం** పర్యా. చూ. పావతాడు. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (రా. 7).

**పూనుగురాయి** పర్యా. చూ. సవలకుగుండు. దండెదగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన

(గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల, ఇనపగుండుగాని, చిన్నచెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 12).

**పూన్పు** పర్యా. వడుకుడుకొమ్ము. దనలిదారం వడికే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 292 (తె. 17).

**పూన్పుకొమ్ము** పూన్పుచివరకు రెండు పక్కలా బిగించిన పుల్ల(లు); ఇటువంటివి రెండుంటాయి. చూ. పూన్పు. చూ. చిత్రం 292.1 (తె. 17).

**పూన్పుపుల్ల** ఉ. పూన్పుపుల్ల. పూన్పుకొమ్ముకు మధ్య దారంతో కట్టిన ఇనపపుల్ల; చూ. పూన్పు (తె. 17).

**పూమల** మలగ్రలకు మడిచి చుట్టిన నేతపడుగు; అచ్చతికే అనిపోగుల్లో లాకలు దూర్చి చుట్టిన పడుగునూలు; చూ. చుట్టు (తె. 28).

**పూర్ణబుగిడి** పర్యా. నిండుబుగిడి. పూర్తిగామొగ్గ మాదిరిగా నేసిన డిజైను; చూ. బుగిడి (తె. 28).

**పూర్తికుట్టు** ఒకరకం కుప్పడంనేత (రా. 23).

**పూలకండువా** ఉ.-కండ్వ; పర్యా. పువ్వంచు కండువా. అంచుల్లో పువ్వుల మాదిరి నమూనాలు పడేట్టు నేసిన కండువా; గొల్లవాళ్ళు పైన కప్పుకొంటారు (తె. 15).

**పూలచీర** ఉ. -చీరి, -చీరె; రూ. పువ్వులచీర. చీరమధ్యలో పువ్వుల డిజైను పడేట్టు నేసిన చీర (కో. 11, 16, 18, 19; తె. 21).

**పూలపచ్చడం** ఒకరకం దుప్పటి; లగ్నసమయంలో పెళ్ళికొడుకు కప్పుకొనేది (తె. 24).

**పూ(పు)పేటు** పర్యా. పుష్పంపేటు. పువ్వుమాదిరి నేత డిజైను. చూ. చిత్రం 173 (కో. 15, 16, 26; తె. 23).

**పూన 1.** పర్యా చూ. అసుపూన(1). కొయ్య అసుగొట్టం చివర అమర్చిన గాజుపూన; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 48 చ. 1 (కో. 7, 12, 16, 22; తె. 10, 18, 19, 21, 23, 28, 33; రా. 16, 18); **2.** పర్యా. చూ. ఉంగరం(3). మరాసు ఒగ్గులపట్టెకు బిగించిన చిన్నచుట్టు; దీనిగుండా పడుగు పోగు మరానుమీదికి పోతుంది. చూ. చిత్రం 50.15 (కో. 4); **3.** (-దిద్దు). అచ్చుకర్రమీద వడిదారంతో వేసిన మెలిక(లు); అచ్చుకట్టిన తరవాత; దుప్పికొమ్ము (బిళ్ళ)తో వీటిని రుద్దుతూ చదును చేస్తారు. చూ. చిత్రం 100.4 (కో. 4, 6, 22, 23; రా. 23); **4.** పర్యా. చూ. పికాసి. మరమగ్గం నాడెను, ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్యగిలక; మామూలుగా, మిషనుదారం చుట్టే కొయ్యరీలు; ఇటువంటివి ఉడతలకు బదులు రెండు సొరుగుల్లోనూ అమరుస్తారు. చూ. చిత్రం 120 (తె. 12); **5.** పర్యా. చూ. చేమబొందు. చేమకర్రల బిగింపుకు దారాలకువేసే లోహపుచుట్టు(రింగు); ఇనపది గాని, ఇత్తడిదిగాని. చూ. చిత్రం. 125 క. 1 (కో. 2); **6.** ఉ. పోస; పర్యా. కొమ్ముపూస, నాడెపూస, పింగాణిపూస, మణిపూస. మరనాడెలో కండెపోగు బయటికి రావటానికి, బెజ్జంచేసి బిగించిన గాజుపూస; కొన్నిచోట్ల, పోగుదూరే సందు (=బెజ్జం); దీంట్లో నుంచి పోగు సాఫుగా వస్తుంది; మామూలుగా ఒకటి ఉంటుంది; కొన్నిచోట్ల 2-4 ఉంటాయి. చూ. చిత్రం 131 త. 1 (కో. 1-7, 11-17, 20-26, 30, 32, 33, 35, 37; తె. 3, 6, 8-18, 21, 25-28, 30, 32; రా. 1-8, 10, 12-24); **7.** పర్యా. పిన్ను(2), వడి(8). పేటుదారానికి చివర కట్టిన పురిదారంలో అంచుపోగు దూర్చేసందు (సన్నబెజ్జం); కొన్నిచోట్ల, బెజ్జంచేసినచిన్న ఇనపబిళ్ళ; దీన్ని పురిదారంలో బిగిస్తారు. చూ. చిత్రాలు 132 చ. 14, 134 చ. 13 (కో. 10, 23; 26, 34, 36, 37; తె. 5; రా. 7, 13-15, 23, 24).

**పూసకట్టు** (క్రి.) పర్యా. గట్టుపడు, తట్టుపడు(2). నేతలో పోగులు ముద్దగాపడటం; పలక గట్టిగా కొట్టినప్పుడు, ఒక్కొక్కప్పుడు ఇలా జరుగుతుంది (కో. 25, 26).

**పూసగూర్చు** (క్రి.) అచ్చుకట్టేటప్పుడు, పై అచ్చుకర్ర వడిలోకి కింది అచ్చుకర్ర వడిదారం లంకెపడేట్టు దూర్చటం (కో. 35).

**పూసదిద్దు** (క్రి.) అచ్చుకట్టిన తరవాత, అచ్చుకర్ర మీద వడిదారంతో వేసిన మెలిక(=పూస)లను దుప్పికొమ్ముతో రుద్దటం (కో. 4, 6; రా. 23).

**పూసలకట్టె 1.** పర్యా. చూ. అసుగొట్టం(1). అసుపోసే గొట్టం; దీంట్లోకి పోగు తీసుకొని అసు పోస్తారు. చూ. చిత్రం 48 (కో. 20); **2.** పర్యా. అసుపుల్ల. పట్టుదారం పడుగు అసుమీదికి తోడటానికి పోగు ఎక్కించే కొయ్యగొట్టం; దీనికి రెండువైపులా రెండు గాజుపూసలు బిగిస్తారు (తె. 17).

**పూసలవడి** పర్యా. చూ. తంతె(6). ఇనపవడి; దీన్ని పేటుదారానికి చివర కడతారు; చూ. వడి. చూ. చిత్రం 132 చ. 13 (తె. 25).

**పూసుడుజేయు** (క్రి.) పరిచేనేటప్పుడు, బిరుసెక్కని పడుగుకు చేతులతో గంజిపుయ్యటం (తె. 19).

**పెగ్గు** (< peg) పర్యా. చూ. పిక్క. డాబీ

గొలుసు బద్దకు బిగించిన కొయ్యముక్క; డిజైనును బట్టి అవసరమైనన్ని బిగిస్తారు; దిండునుచుట్టి గొలుసు తిరిగినప్పుడు,ఇవి కోలలను పైకిలేపుతాయి. చూ.చిత్రం 132 చ. 2 (రా. 14).

**పెంక 1.** పర్యా. బోకి(1). కుండపెంకు; మధ్య పల్లంగా ఉన్నది; ఉన్ని నూలు, కూర్చొని వడికేటప్పుడు కదురు దీనిమీద పెట్టి తిప్పుతారు. చూ. చిత్రం 308.3 (తె. 26-28); **2.** పర్యా. చూ. పిరికి. ఉన్ని వడికేటప్పుడు, కదురుతిప్పే బోకికి ఆధారంగా పెట్టినమట్టు; కుండమూతితో ఉన్న భాగం; దీన్ని బోర్లించి పైన బోకి పెడతారు. చూ. చిత్రం 308.4 (తె. 30).

**పెంకురంగు** ( < pink–) ఒకరకం ఎరుపు (తెలుపు వన్నె కలిసిన)రంగు; ఎర్రఉల్లిగడ్డరంగు (తె. 12, 20, 22).

**పెటుకలకర్ర** చూ. పిట్టుకోలకర్ర (కో. 31).

**పెటుకుల్లకర్ర** ఉ. పిటుకుల్లకర్ర; చూ. పెట్టుగోల(కర్ర) (కో. 28, 29, 32).

**పెట్టెపలకలు** పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు; నేతనేసేటప్పుడు, నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (కో. 1).

**పెట్టుకోలగుది** పర్యా. చూ. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగర్ర-కొన్నిచోట్ల మలబద్ద-దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (కో. 33).

**పెట్టుగోల(కర్ర)** ఉ. పిటుకోలకర్ర, పిటోక్కలకర్ర, పిట్టుకోలకర్ర, పిట్టుకోలుకర్ర, పెటుకోలకర్ర, పెట్టుకోల; రూ. పెటుకుల్లకర్ర; పర్యా. చూ. పెడకోల(2). నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల, అల్లుచేసేటప్పుడు కట్టిన వంకరకట్టె; మగ్గానికి పడుగు అమర్చిన తరవాత, దీనికి రెండువైపులా మలగుదులు, మధ్యన నేతమోకు తగిలిస్తారు; కొన్నిచోట్ల, మోకుతో ముడివేస్తారు; కొన్నిచోట్ల, దీనికి మోపుగా కొయ్యచెక్కాలుగాని, చెక్కలుగాని పెడతారు. చూ. చిత్రం 127.12 (కో. 16, 17, 21, 23, 24, 26, 33, 35-37; తె. 19).

**పెట్టె** రూ. పేటీ(1); పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గంచట్రంలో, పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు; నేతనేసేటప్పుడు, నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (తె. 24, 28, 30).

**పెట్టెచెర్ఖా** పెట్టెమాదిరిగా అమర్చిన రాట్నం (తె. 2).

**పెట్టెనూలు** పర్యా. చూ. మిల్లునూలు. మిల్లులో యంత్రాలమీద తయారయిన నూలు (రా. 21)

**పెట్టెసంతానం** పట్టులో ఒకరకం; పసుప్పచ్చగా ఉంటుంది (కో. 14).

**పెడకట్టె** పర్యా చూ. పెడకోల(2). నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె; మగ్గానికి పడుగు అమర్చిన తరవాత దీనికి రెండువైపులా మలగుదులు, మధ్యన నేతమోకు తగిలిస్తారు; కొన్నిచోట్ల మోకుతో తగిలిస్తారు; కొన్నిచోట్ల, దీనికి మోపుగా కొయ్యచెక్కాలుగాని, చెక్కలుగాని పెడతారు. చూ. చిత్రం 127.12 (రా. 19).

**పెడకలకట్టె** చూ. పెడకోలకట్టె (రా. 7).

**పెడకలకర్ర** ఉ. పిడకలకర్ర; చూ. పెడకోలకర్ర (కో. 22, 27, 30, 31).

**పెడకాలుకట్టె** చూ. పెడకోలకట్టె (కో. 3, 9 బి).

**పెడకొయ్య** పర్యా. చూ. తట్టు(డు)కొయ్య. మిడిగూటానికి వేసిన నేతమోకు పడుక్కు అడ్డం రాకుండా తగిలించటానికి పాతిన గూటం; మామూలుగా, నేతబయలులో ఒకమూల ఉంటుంది; కొన్నిచోట్ల, మిడిగూటానికిగాని, దండెకుగాని కొంచెం ఎడంలో వేస్తారు. చూ. చిత్రం 127.14(కో. 27).

**పెడకోల** ఉ. పెడకాల, పెడకోడ, పెడకోలు. **1.** పర్యా. పిట్టుకోలకర్ర. అచ్చుకట్టె యంత్రం చివరి పుల్ల(ల)కు తాడుతో కొలికివేసి బిగించినకర్ర; దీనికి రెండు వైపులా గుదులుకట్టి అచ్చుకర్రలకు తగిలిస్తారు (తె. 15); **2.** పర్యా. ఊడికట్టె, ఊడుగోలకట్టె, ఊడుగర్ర, ఊడుగోలకర్ర, పెట్టుగోల(కర్ర), పెడకట్టె, పెడకోలకట్టె, పెడకోలకర్ర, బండికుండలకర్ర. నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల, అల్లుచేసేటప్పుడు కట్టిన వంకరకట్టె; దీనికి రెండువైపులా మలగుదులు, మధ్యన నేతమోకు తగిలిస్తారు; మగ్గానికి పడుగు అమర్చిన తరవాత, దీనికి రెండువైపులా మలగుదులు, మధ్యన నేతమోకు తగిలిస్తారు; కొన్నిచోట్ల, మోకుతో ముడి వేస్తారు; కొన్నిచోట్ల, దీనికింద కొయ్యచెక్కాలుగాని, చెక్కలుగాని ఎత్తుపెడతారు. చూ. చిత్రం 127.12 (కో. 1, 3, 7-10, 13; తె. 1-15, 17-24, 26-28, 30-33; రా. 20).

**పెడకోలకట్టె** రూ. పడికాలకట్టె, పెడకలకట్టె, పెడకాలుకట్టె; పర్యా. చూ. పెడకోల(2). నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల, అల్లుచేసేటప్పుడు

కట్టిన వంకరకట్టె; మగ్గానికి పడుగు అమర్చిన తరవాత, దీనికి రెండువైపులా మలగుదులు, మధ్యన నేత మోకు తగిలిస్తారు; కొన్నిచోట్ల, మోకుతో ముడి వేస్తారు; కొన్నిచోట్ల, దీనికింద కొయ్యచెక్రాలుగాని, చెక్కలుగాని ఎత్తుపెడతారు. చూ. చిత్రం 127.12 (కో. 5, 6; రా. 14).

**పెడకోలకర్ర** ఉ. పెడకాలకర్ర, పెడకోలగర్ర, పెడగోలకర్ర; రూ. పిడిగోలుకర్ర, పెడకలకర్ర; పర్యా. చూ. పెడకోల(2). నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల, అల్లుచేసేటప్పుడు కట్టిన వంకరకట్టె; మగ్గానికి పడుగు అమర్చిన తరవాత, దీనికి రెండువైపులా మలగుడులు, మధ్యన నేతమోకు తగిలిస్తారు; కొన్నిచోట్ల మోకుతో ముడివేస్తారు. కొన్నిచోట్ల, దీనికింద కొయ్యచెక్రాలుగాని, చెక్కలుగాని ఎత్తుపెడతారు. చూ. చిత్రం 127.12 (కో. 2, 6, 8, 14, 34; తె. 16).

**పెడకోలగిర్ర** పర్యా. చూ. పెడకోలచెక్రం. పెడకోలను మోసే కొయ్యచెక్రం; ఇటువంటివి రెండుంటాయి; నేతమోకు వదులుచేసినప్పుడు, పడుగు నేలకు తగలకుండా పెడకోల చెక్రాలమీద జరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చిత్రం 129 ప.1 (తె. 15).

**పెడకోలగుది** ఉ. పెడకలగుది, పెడకోలగుతి; పర్యా. చూ. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగర్ర-కొన్నిచోట్ల, మలబద్ద-దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (కో. 27, 30; తె. 19, 32).

**పెడకోలచెక్రం** ఉ. పెడకాలచెక్రం; పర్యా. గాని, గుర్రబ్బండి, చెక్రం(9), నేతగాను, నేతచెక్రం, పిట్టకోలచెక్రం, పెడకోలగిర్ర, బండికుండ, బండిగాను, బండిగోడు, బండిచెక్రం(2). పెడకోలనుమోసే కొయ్యచెక్రం; ఇటువంటివి రెండుంటాయి; నేతమోకు వదులు చేసినప్పుడు, పడుగు నేలకు తగలకుండా పెడకోల చెక్రాలమీద జరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చిందట. చూ. చిత్రం 129 ప. 1 (కో. 3, 10).

**పెడగట్టె** పర్యా. చూ. తట్టు(డు)కొయ్య. మిడిగూటానికి వేసిన నేతమోకు పడుక్కు అడ్డురాకుండా తగిలించటానికి పాతినగూటం; మామూలుగా, నేత బయలులో ఒకమూల ఉంటుంది; కొన్నిచోట్ల మిడిగూటానికిగాని, దండెకుగాని కొంచెం ఎడంలో వేస్తారు. చూ. చిత్రం 127.14 (రా. 1).

**పెడతాడు** పర్యా. చూ. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగర్ర-కొన్నిచోట్ల, మలబద్ద-దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127·11 (తె.24).

**పెడదసి** పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అనివెంబడి దూర్చినదారం; అచ్చుతికేటప్పుడు, పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (కో. 31).

**పెడబద్ద** ?అచ్చులో దూర్చినకర్ర (కో. 30).

**పెడలుమగ్గం** ఒకరకం మరమగ్గం; దీంట్లో, పావుకోళ్ళు(=pedals) తొక్కితే, నాడె దానంతట అది ఆడుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది (రా. 24).

**పెంటడిపాడ్యమి** ఉ. -పాడ్డెమి. దీపావళి అమావాస్య మరునటిరోజు(=పాడ్యమి)నచేసుకొనే పండుగ; పెంటడు అనే మాలవాడిపేరుమీద చేస్తారు (పూర్వం పెద్దాపురం ప్రాంతంలో దొంగలభయం ఎక్కువగా ఉండటంవల్ల, దేవాంగులు పెంటణ్ణి రక్షకభటుడిగా పెట్టుకొన్నారట; ఒకసారి దీపావళి అమావాస్యరోజున పెంటడు దొంగలతో పోట్లాడి ప్రాణాలు పోగొట్టుకున్నాడు; అతని భార్య కోరికను అనుసరించి, దీపావళి వెళ్ళిన మర్నాడు అతనిపేరు మీదగా ఈపండుగ చేసుకొంటారు) (కో. 23).

**పెండెకట్టు** కుంచెదండె బిగింపుకు వేసిన కట్టు; ఇటువంటివి రెండు వైపులా వేస్తారు. చూ. చిత్రం 76చ. 2 (తె. 26).

**పెండె(లు)** పడుగుదువ్వే కుంచె పక్కభాగం; side (తె. 11).

**పెత్తాళమాస** పర్యా. పెద్దర్ల అమావాస, పెద్దల పండుగ. మహాలయ అమావాస్య; చనిపోయిన పెద్దలను తలచుకొనే రోజు (రా. 24).

**పెదకల్పడోరియా** అంగీగుడ్డలో ఒకరకంనేత (తె. 24).

**పెద్దఅడ్డపీట** పర్యా. చూ. తలపీట. ఆసుపీటల్లో మొదటిది; దీనికి ఒకటిరెండు చాళ్ళలో ఆసుకొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (తె. 28).

**పెద్దఆసు** పట్టునూలు పడుగుపోసే పెద్దరకం ఆసు (తె. 21).

**పెద్దఎర** ముయ్యేర(=మూడోసారి విడిచినకూనం) విడిచిన తరవాత పదిరోజులకు దసలిపురుగు విడిచే కూనం (తె. 7).

**పెద్దకచ్చి** అచ్చుతుక్కోటానికి, పేకదారం వెయ్యకుండా వదలిన కచ్చి (పడుగుపోగులు); అచ్చువడుల్లోకి పోగులు జరపటానికీ చువ్వదూర్చటానికీ కచ్చి వదులుతారు (కో. 34, 36, 37).

**పెద్దకండె** -(చుట్టు) నేతలో నిలువుకు వాడటానికి చుట్టిన దసలిదారం (తె. 7).

**పెద్దకదురు** 1. పర్యా. చూ. గంటం(1). పత్తి రాట్నం బొమ్మలకుగాని, దొడ్డినిలువులకుగాని బిగించే మందపుకడ్డీ. చూ. చిత్రం 41క.12 (కో. 1; తె.14); 2. దసలిదారం వడికే రాట్నం చెవులకు బిగించిన ఇనప పుల్ల (తె.7); 3. పర్యా. అయికదురు. ఒకరకంకదురు చిన్నకదుర్లమీద వడికిన ఉన్నినూలు దీనికి తిరగదోడి చుడతారు (తె. 10).

**పెద్దకమ్మి** కమ్మినేతచీరలో, చివరవేసిన పెద్దపట్టె (కో. 3, 5).

**పెద్దకయలుచీర** ఒకరకం పెద్దగడిచీర(రా. 11).

**పెద్దకుంచె** ఉ. పెదకుంచి, పెద్దకుంచి, పెద్దకుంచె. కుంచెభేదం; గంజిపెట్టిన పడుగును, ఆరుబయటచాపి, దువ్వే పనిముట్టు; గంజి ఆరటానికి దీంతో దువ్వుతారు. చూ. చిత్రం 76 (కో. 3, 16, 18-21, 31-37; రా. 4-6).

**పెద్దకొయ్య** చిటికెపీట అడ్డపీట బిగించిన పొడుగు పట్టె. చూ. చిత్రం 285.4 (తె. 11).

**పెద్దకోరగుమ్మి** పట్టుదారం (=కోరా) చుట్టే పని ముట్టు; గుమ్మిలో పెద్దరకం; చూ. గుమ్మి. చూ. చిత్రం 293 క (తె. 21).

**పెద్దకోట్లుచీర** ఉ. పెద్దకోటు-. నిలువులో రెండు గీరలు ఒకచోట, నాలుగు గీరలు మరొకచోట వచ్చేట్టు నేసినచీర (రా. 17).

**పెద్దగది** తడికిబిళ్ళలో, ఇనపపుల్లల మధ్య పెద్ద సందు. చూ. చిత్రం 97 క. 1 (కో. 7).

**పెద్దగళ్ళగుడ్డ** ఒకరకం చొక్కాగుడ్డ; పెద్దగళ్ళు పెట్టి నేసింది (కో. 34).

**పెద్దగాజులపట్టీ** పట్టుదారంచుట్టే డొలకదగ్గర పెట్టిన రంగులపట్టె; చూ. గాజులపట్టె. చూ. చిత్రం 293 చ. 12 (కో. 14).

**పెద్దగుమ్మి** పట్టుదారంచుట్టే పనిముట్టు; గుమ్మిలో ఒకరకం; చూ. గుమ్మి. చూ. చిత్రం 293 క (తె. 5, 21).

**పెద్దగోరంచు** పదెనిమిదిపోగుల దారంతో గీర పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 210 (కో. 26, 27 28, 33).

**పెద్దచెట్టి** కూలికి మగ్గాలు నేయించే చెట్టిబృందా నికి పెద్ద; Head of master-weavers (కో. 7).

**పెద్దచేమంతిఅంచు** పెద్దచేమంతిపువ్వు నమూనాలు పడేట్టు నేసిన ఒకరకం అంచు (తె. 2).

**పెద్దజనుము** జనపనార; పట్టాలు, బోరేలు నెయ్య టానికి, రాత్రివేళ గొర్రెలమంద చెదరకుండా కప్పే వలలు అల్లటానికి వాడతారు (తె. 25).

**పెద్దడొలక** ఉ.-డొల్క. పట్టుదారం చుట్టేపనిముట్టు డొలకల్లో పెద్దరకం; చూ.డొలక. చూ. చిత్రం 293క (కో. 14; తె. 12).

**పెద్దడోరియా** అంగీగుడ్డలో ఒకరకంనేత (తె. 24).

**పెద్దతాడుకొయ్య** ఉ. పెత్తాడుకొయ్య, పెదతాడు కొయ్య; పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతిపైపున నేలలోపాతి ఉంటుంది. చూ. చిత్రాలు. 108 5, 122, 127.16 (కో. 14; తె. 10, 11, 14-16).

**పెద్దధోతి** ఉ. పెద్దోతి. పన్నెండు మూరలపొడుగు నేసినపంచె (తె. 23).

**పెద్దనేలు** (చేతి) బొటనవేలు (తె. 15).

**పెద్దపట్టెకోరు** ఒకేపట్టెగా నేసిన పెద్దఅంచు. చూ. చిత్రం 209 (తె. 6).

**పెద్దపట్టెజాడి** పెద్దపెద్ద పట్టెలు పడేట్టు నేసిన గొంగడి (తె. 6).

**పెద్దపంటె** నవారునేతకు వాడే పురినూలు చుట్టు కోటానికివాడే కొయ్య పనిముట్టు; పెద్దది; చూ. పంటె (రా. 10).

**పెద్దపండగ** పర్యా. చూ. వినాయకచవితి. భాద్ర పద శుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి, బొట్లుపెట్టి, పూజచేసి పండుగ చేసుకొంటారు (తె. 33).

**పెద్దపీట** పర్యా. చూ. తలపీట. అనుపీటల్లో మొద టిది; దీనికి ఒకటి రెండు చాళ్ళలో అనుకొయ్యలు బిగి స్తారు. చూ. చిత్రం 45 క. 1 (తె. 25. 30).

**పెద్దపురితాడు** పర్యా. చంకతాడు(1). పట్టుదారం వడికే పెద్దరాట్నం ఇరుసును, డొలకను కలిపే గట్టి దారం; రాట్నం తిరిగినప్పుడు, డొలకకూడా తిరుగు తుంది. చూ. చిత్రం 293 చ. 8 (కో. 14).

**పెద్దబుగిడి** పెద్దమొగ్గ ఆకారంలో నేసిన డిజైను; చూ. బుగిడి (తె. 1).

**పెద్దబొత్తంచు** బాగా వెడల్పుగా నేసిన అంచు (కో. 25-28, 31, 32).

**పెద్దబొత్తంచుచాపు** అంచులు వెడల్పుగా నేసిన రెండు పంచెలు (కో. 6).

**పెద్దమగ్గం** ఇరవైమూరల పొడుగు తలపాగలు (మహారాష్ట్రులు చుట్టుకొనే రకం) నేసే మగ్గం; పెద్దది (తె 11).

**పెద్దరాటం** చూ. పెద్దరాట్నం (కో. 14).

**పెద్దరాట్నం** చూ. పెద్దరాటం; పర్యా. కోరా రాట్నం, డోలీరాట్నం. పట్టుదారంవడికే ఒకరకంరాట్నం; పెద్దది. చూ. చిత్రం 293 చ (తె. 5, 12).

**పెద్దర్లఅమావాస** పర్యా. చూ. పెత్తాళమాస. మహాలయ అమావాస్య; చనిపోయిన పెద్దలను తలచుకొనే రోజు (రా. 19బి).

**పెద్దలపండగ** పర్యా. చూ. పెత్తాళమాస. మహాలయ అమావాస్య; చనిపోయిన పెద్దలను తలచుకొనే రోజు (రా. 19ఎ).

**పెద్దలాక 1.** పర్యా. చూ. నేతలాక. నేతపడుగులో పైపోగులకు, కిందిపోగులకుమధ్య దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 127.6 (కో. 6; రా. 10, 22); **2.** మగ్గానికి తగిలించిన పడుగులో, దండెదగ్గరనించి చివరివరకు దూర్చిన వెదురుబద్ద(లు); పొడుగుది (తె. 8).

**పెద్దవల్లె** ఉ. పెద్దొల్లె. కన్నెపిల్లలు కట్టుకొనే ఒకరకం చీర; మామూలు వల్లెకంటె కొంచెం పెద్దది (తె. 22).

**పెద్దసందు** (-వేయు) పంచేనేటప్పుడు, పడుగులో రెండు అనులమధ్య చేసిన పెద్దవెలితి; పడుగు పూర్తిగా ఆరిన తరవాత పెద్ద సందులు వేస్తారు (రా. 18).

**పెద్దాపురంపట్టు** పెద్దాపురం (తూ. గో. జిల్లా) లో బట్టలనేతకు వాడేపట్టు; మంచిరకం (కో. 16, 19).

**పెద్దాపురంసిలుకు** పెద్దాపురం (తూ.గో.జిల్లా)లో బట్టలనేతకు వాడే పట్టు; మంచిరకం; సూరత్‌నుంచి వస్తుంది (కో. 23).

**పెసరకాయరంగు** ఉ. పెసరు-. ఒకరకంపచ్చ(పచ్చి పెసర్ల)రంగు. చూ. చిత్రం 288 (తె. 11, 12).

**పెసరపొప్పిళిచీర** ఒకరకంగడి చీర (రా. 14).

**పెసరబద్దలచీర** పర్యా. పెసరబేడచీర, పెసరబేడలకోక. పడుగులో రెండుకొలుకుల దారం ఒకరంగు, రెండు కొలుకులదారం మరొకరంగు పెట్టి నేసిన చీర. (కో. 10; రా. 19ఎ, 19బి).

**పెసరబేడచీర** పర్యా. పెసరబద్దలచీర. పడుగులో, రెండు కొలుకుల దారం ఒకరంగు, రెండు కొలుకుల దారం మరొకరంగు పెట్టి నేసిన చీర (రా. 19బి).

**పెసరబేడలకోక** ఉ. పెసలబ్లెల్లు-; పర్యా. చూ. పెసరబద్దలచీర. పడుగులో రెండు కొలుకులదారం ఒకరంగు, రెండుకొలుకులదారం మరొరంగుపెట్టి నేపిన చీర (రా. 19ఎ).

**పెసరరంగు 1.** ఉ. పెసర్రంగు, పెసరురంగు. పెసరగింజల మాదిరి నలుపువన్నె (తె. 9, 10, 16, 17, 20, 22-26); **2.** ఆలివ్‌గ్రీన్ (తె. 27).

**పెసరురంగుచీర** పచ్చి(నల్ల)పెసరగింజలరంగు చీర (తె. 9).

**పెళ్ళిగోరంచు** ఉ. పెల్లి-. పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర; పసుపురంగులో గోరంచుపెట్టి నేస్తారు (కో. 31).

**పెళ్ళిచీర** ఉ. పెల్లిచీర. పెళ్ళికూతురు కట్టుకొనే చీర; కొన్నిచోట్ల గోరంచుపెట్టి నేస్తారు (కో. 34, 37).

**పెళ్ళిపర్దా** ఆరుగజాల పొడుగు, రెండున్నరగజం వెడల్పు వచ్చేట్టు నేసిన ఒకరకం జంపఖానా (తె. 1).

**పెళ్ళిబొత్తంచుకోక** పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరక చీర; పసుపురంగులో బొత్తంచుపెట్టి నేస్తారు (కో. 31).

**పేక 1.** నేతబట్టలో అడ్డం; అడ్డానికివాడే దారం (కో; తె; రా); **2.** రూ. పాక. గొంగడినేతలో అడ్డానికివాడే దారం (తె. 10, 11, 20, 22, 25); **3.** నవారు నేతలో అడ్డానికి వాడే నూలు (కో. 12).

**పేకఉండ** ఉ. పైకుండ. గొంగడినేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం ఉండ; దీన్ని ముందు బొటనవేలికీ, చిటికెన వేలికీ వేసి చుడతారు (తె. 25).

**పేకకట్టె** ఉ. పేక్కట్టె; రూ. పాకకట్టె, పేకట్టె; పర్యా. నూలుకోల, నూలుబరిగ, పేకట్టెబరుగు, పేకదోడి. గొంగడినేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టినకర్ర; దీన్ని పేకగొట్టంలో దూరుస్తారు. చూ. చిత్రం 319 (తె. 11 22, 25).

**పేకగొట్టం** ఉ. పైగ్గొట్టం; రూ. పాకగొట్టం; పర్యా. గొట్టం (7), నూలుగొట్టం, నేతగొట్టం. గొంగడినేసేటప్పుడు, మగ్గానికి బిగించిన ఉన్నిపడుగులో పేకదారం వెయ్యటానికి దూర్చే వెదురుగొట్టం; లావుది; దీంట్లో పేకదారం చుట్టిన కర్ర దూరుస్తారు; ఈ గొట్టం(బెజ్జం)లో నుంచి పోగు బయటికి వస్తుంది చూ. చిత్రం 318 (తె. 22).

**పేకచిట్టె** నేతలో అడ్డానికి వాడే నూలుచుట్ట (తె. 21).

**పేకట్టె** చూ. పేకకట్టె (తె. 10, 20).

**పేకట్టెబరుగు** పర్యా. చూ. పేకకట్టె. గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టిన కర్ర; దీన్ని పేకగొట్టంలో దూరుస్తారు. చూ. చిత్రం319 (తె. 7).

**పేకదోడి** పర్యా. చూ. పేకకట్టె. గొంగడినేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టినకర్ర; దీన్ని పేకగొట్టంలో దూరుస్తారు. చిత్రం 319 (తె. 20).

**పేక(నూలు)** ఉ.- నుగులు; పర్యా. కండెనూలు, నేతలో అడ్డానికి వాడే నూలు; పడుగునూలు కన్నా దీనికి పురి ఎక్కువ (కో. 1-4, 7, 9, 13, 21, 22; తె. 25; రా. 4, 15).

**పేకపట్టు** నేతలో అడ్డానికి వాడేపట్టు (తె. 5, 12)

**పేకపేటునేత** ఒకరకం డిజైనునేత; మగ్గానికి బోనచ్చు (చూ.) అమర్చి నేస్తారు; దేవాంగులవాడుక (కో. 7).

**పేకబెత్తం** పర్యా. పేము(చువ్వ). పడుగు దువ్వె కుంచెకు వెన్ను, పక్కభాగాలు అల్లటానికి వాడిన పేముపుల్ల (కో. 20, 21).

**పేకరేషం** నేతలో అడ్డానికి వాడే పట్టు(రా. 14).

**పేకలతొగరు** ఉ. పేకల్తొగరు. ఒకరకం(ముదురు) ఎరుపురంగు; నలుపువన్నె కలిసింది; కెంపు; పేకనూలుకు వేస్తారు (కో. 7, 10).

**పేకసిలుకు** పురి ఎక్కువలేని పట్టు, నేతలో అడ్డానికి వాడతారు (రా. 15).

**పేకసిడు** నేతలో అడ్డానికివాడే నూలుచుట్ట; దీని పోగు మందంగా ఉంటుంది (కో. 1-4, 9, 21).

**పేటంచు** ఉ. పేటెంచు, ప్లేటంచు; పర్యా. నవిషీ అంచు. చిలకలు, పువ్వులు, ఆకులు మొ. డిజైన్లుపడేట్టు నేసిన అంచు; చేతిమగ్గంమీద, మరమగ్గంమీద నేస్తారు; కొన్నిచోట్ల, పేకపోగు అంచులోకి రాకుండా నేస్తారు (కో. 2, 9, 22, 26; తె. 13, 17; రా. 17, 18, 19ఎ, 22).

**పేటంచుచాపు** అంచులో డిజైన్లు పడేట్టు నేసిన రెండు పంచెలు (కో. 26).

**పేటా** ఒకరకం తలపాగ; తొమ్మిదిగజాల పొడుగు, అరగజం వెడల్పు నేసింది (కో. 23; రా. 14).

**పేటీ** 1. చూ. పెట్టె (తె. 18, 21, 22, 26, 27); 2. పర్యా. చూ. డాబీ. నేతలో డిజైన్లు రావటానికి, మరమగ్గంపైన అమర్చే యంత్రం. చూ. చిత్రం 132 (రా. 17).

**పేటీకోల** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుచెక్కలను తొక్కినప్పుడు, గొలుసుపిక్కలు గాని దిండుదిమ్మలుగాని కోలలను పైకిలేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (తె. 8).

**పేటీచీర** డాబీమగ్గంమీద డిజైన్లు పడేట్టునేసినచీర (రా. 17).

**పేటీబొమ్మ** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం పొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (తె. 23).

**పేటు** 1. ఉ. పేటి, ప్లేటు; పర్యా. పనితనం, పనివరస, బేలు(2). ఏదైనా ఒకనమూనాలో నేసిన నేత; పువ్వు, ఆకు, చెట్టు, పక్షి, తీగ, గీరలు మొ. వాటి డిజైను (కో. 1-3, 6-9, 11, 13, 17, 19-26, 36; తె. 1, 13; రా. 10, 11, 13-16, 19ఎ); 2. ? పట్టు నేత డిజైనులో వచ్చిన పోగు; జరీపోగుగాని, పట్టుపోగు గాని.

**పేటుకట్టె(లు)** అంచులో డిజైన్లు నేసేటప్పుడు, పైనుంచి పేటుదారాలు వేలాడటానికి చిన్నపన్నె అమర్చిన చట్రం. చూ. చిత్రం 134 చ. 14 (రా. 8).

**పేటుకడ్డీ** పర్యా. చూ. తూకం. పేటువడికి కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపఊచ; కొన్నిచోట్ల, సత్తుది; నేతనేసేటప్పుడు, అని మూసిన తరవాత వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి రెండుపక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (కో. 7).

**పేటుకమ్మి** 1. పర్యా. చూ. తూకం. పేటువడికి వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపపుల్ల; కొన్నిచోట్ల, సత్తుది; నేతనేసేటప్పుడు, అని మూసిన తరవాత, వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి, రెండుపక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (రా. 2); 2. ఉ. ప్లేటుకమ్మి. డిజైన్లు నేసిన కమ్మి; మగ్గానికి ఎనిమిదికర్రల అచ్చు అమర్చి దళసరిగా నేస్తారు (కో. 12, 13, 17, 19-21, 23, 26, 36; రా, 11, 13, 16, 19ఎ).

**పేటుకర్ర** 1. పేటువడికి, కింద వేలాడగట్టిన కర్ర; కొన్నిచోట్ల, ఇనపపుల్లలు కడతారు; నేతనేసేటప్పుడు అని మూసిన తరవాత, వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి రెండుపక్కలా గుంటల్లో వేలాడతాయి: చూ. పేటుతూకం. చూ. చిత్రం 132 చ.15(తె.31); 2. పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుచెక్కలను తొక్కినప్పుడు గొలుసుపిక్కలుగాని, దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (కో. 1).

**పేటుకర్రసూత్రం** ఉ. -సూత్రుం. పేటుకర్ర కట్టిన దారం; చూ. పేటుకర్ర(1) (తె. 31).

**పేటుకొయ్య** ? అంచులో డిజైన్లు నెయ్యటానికి, పోగుల సందులో దూర్చిన కర్ర. చూ. చిత్రం 136 క. 2 (రా. 2).

**పేటుగిలక** పర్యా. చూ. డాబీ. నేతలో డిజైన్లు రావటానికి, మరమగ్గంపైన అమర్చే యంత్రం. చూ. చిత్రం 132 (రా. 13).

**పేటుగుంత** పర్యా. చూ. సీలలగుంత. పేటు తూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి తీసిన చిన్నగొయ్యి; ఇటువంటివి రెండుపక్కలా ఉంటాయి. చూ. చిత్రం 132 చ. 16 (కో. 2; రా. 7, 11, 12).

**పేటుగొలుసు** రూ. గొలుసుపేటు. చీరఅంచులో, గొలుసు ఆకారంలో నేసిన డిజైను. చూ. చిత్రం 180 (తె. 25).

**పేటుచీర** ఉ. ప్లేటు–. అంచులో(రకరకాల)డిజైన్లు పడేట్టునేసిన చీర (కో. 11. 16, 17, 19, 21).

**పేటుతాడు 1.** ఉ. పేటి–; పర్యా. చూ. పేటుదారం. నేతలో డిజైన్లు పడటానికి, డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసినదారం; డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (తె. 6; రా. 16); **2.** ? డాబీ అడనుంచి వేలాడే పేటుదారాలు బిరుగా ఉండటానికి కట్టినతాడు (రా. 8).

**పేటుతిత్తి** పర్యా. చూ. పేటుమూట. అంచుపడుగులో అతికిన పేటుపోగులు బిరుగా ఉండటానికి, మగ్గానికి పైన దండె-మీదినించి వేలాడదీసి చివరకట్టిన బరువు; మామూలుగా ఇసకమూట; కొన్నిచోట్ల రాళ్ళు; మగ్గంమీద ఎత్తుగా గిలకలు అమర్చి, పేటుదారాలు వాటికి తగిలించి చివర మూటలు కడతారు. చూ. చిత్రం 133.1 (రా. 14).

**పేటుతూకం** పర్యా. చూ. పేటుమూట. పడుగులో అతికిన పేటుపోగులు బిరుగా ఉండటానికి, మగ్గానికి పైన దండెంమీదినించి వేలాడదీసి చివరకట్టిన బరువు; మామూలుగా ఇసకమూట; కొన్నిచోట్ల రాళ్ళు; మగ్గంమీద ఎత్తుగా గిలకలు అమర్చి, పేటుదారాలు వాటికి తగిలించి చివర బరువులు కడతారు. చూ. చిత్రం 133.1 (కో. 1).

**పేటుదడి 1.** ? ఒకరకం డిజైన్లు నేసే మగ్గంలో అచ్చుదగ్గర అమర్చిన పనిముట్టు (కో. 1); **2.** పర్యా. చూ. తడక(2). డాబీకి పైన బిగించిన ఇనపఊచల చట్రం; డాబీకోలలు పక్కలకు జరగకుండా నిలుపుతుంది; రెండు ఊచల సందులోకి ఒకకోల వస్తుంది. చూ. చిత్రం 132 చ. 3 (కో. 1).

**పేటుదారం** ఉ. పేటి–; పర్యా. అడతాడు(1), ఆసుతాడు(1), కోలసూత్రం, గిలకసూత్రం, జంగతాడు, జందెం, జాలరి(తాడు), టాపేటుదారం, డాబీదారం, నిలుపుదారం(1), తంతె(4), పింజెరతాడు, పింజె(ర)సూత్రం, పుల్లలదారం, పేటుతాడు, పేటుసూత్రం(2). నేతలో డిజైన్లు పడటానికి, డాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి అంచుపడుగులోకి వేలాడదీసిన దారం; డిజైనుకు అవసరమయినన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (రా. 8, 11, 13, 18).

**పేటుదిండు** పర్యా. చూ. దిండు(7). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు; బోట్లపింజెర దిండుకు బొడిపెలు, తొల్లపింజెర దిండుకు గాళ్ళు ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు; కొన్నిచోట్ల దీనికి చివర ఇనప ఊచలచక్రంగాని, రేకు వళ్ళచక్రం గాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (రా. 18).

**పేటునేత** ఉ. పేటి–, ప్లేటు–; పర్యా. చూ. డిజైనునేత. బట్టమీద రకరకాల నమూనాలు పడేట్టు నేసిన నేత (కో. 15, 17, 19; రా. 9, 13, 16).

**పేటుపడుగు** అంచులో డిజైన్లు నెయ్యటానికి వాడే నిలుపుదారం (కో. 1).

**పేటుపని** పర్యా. చూ. డిజైనునేత. బట్టమీద రకరకాల నమూనాలు పడేట్టు నేసిననేత (రా. 18).

**పేటుపందిరం** పర్యా. చూ. తడక(2). డాబీకి పైన బిగించిన ఊచలచట్రం; డాబీకోలలు పక్కలకు జరగకుండా నిలుపుతుంది; రెండు ఊచల సందులోకి ఒక కోల వస్తుంది. చూ. చిత్రం 132 చ. 3(రా. 18).

**పేటుపన్నె** పర్యా. అడనిచ్చెన, అడపన్నె, పన్నె. పేటుదారాలు దూర్చి, రెండు పాయలుగా విడదీసిన చిన్నపన్నె(=ఈనెలచట్రం);డాబీఅడకు కొంచెం కిందగా అమరుస్తారు. చూ. చిత్రం 132 చ. 8 (రా. 8).

**పేటుపలక** పర్యా. చూ. అడబల్ల, నెలుపుపలక. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు అనిదొక్కగా లేచిన పడుగుపోగులను నిలిపి ఉంచటానికి, పడుగులోగాని, అడ్డజేలులోగాని దూర్చే కొయ్యచెక్క; అడ్డజేలులో చిన్నచెక్క దూరుస్తారు. చూ. చిత్రం 136 క. 2 (తె. 5 18; రా. 13).

**పేటుపుల్ల** ఉ. పేటి–; పర్యా. చూ. తూకం. పేటువడికి కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపపుల్ల; కొన్నిచోట్ల సత్తుది; నేతనేసేటప్పుడు, అనిమూసిన తరవాత వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి రెండు పక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (రా. 14, 16, 17).

**పేటుపూస** పర్యా. చూ. తంతె(6). ఇనపవడి; పేటుదారానికి చివర కడతారు; చూ. వడి. చూ. చిత్రం 132 చ. 13 (కో. 7).

**పేటుపెట్టె** పర్యా. చూ. డాబీ. నేతలో డిజైన్లు రావటానికి, మరమగ్గం పైన అమర్చే యంత్రం. చూ. చిత్రం 132 (రా. 11, 18).

**పేటుపోగు(లు)** అంచుల్లో, డిజైన్లు నెయ్యటానికి పెట్టిన నిలుపుదారాలు (రా. 24).

**పేటుబండి** పర్యా. చూ. దారపుబండి(2). బరువు కట్టిన అంచుపేటు దారాలు తగిలించే కొయ్యగిలక; దీన్ని, మామూలుగా మగ్గంమీద ఎత్తుగా అమరుస్తారు. చూ. చిత్రం 133.2 (కో. 1).

**పేటుబుటాచీర** ఉ. ప్లేటు–. రెండంచులకూ మధ్యభాగంలో బుటాలు పడేట్టు నేసిన చీర (కో. 17).

**పేటుమగ్గం** పర్యా. గిలకమగ్గం. ఒకరకం మగ్గం; డిజైన్లు నెయ్యటానికి డాబీ అమర్చింది: చూ. డాబీ (రా. 13).

**పేటుమూట** పర్యా. కప్పిర్లసంచి, తూకం(సంచి), పేటుతిత్తి, పేటుతూకం, బరువుసంచి, మూట. పడుగు**లో** అతికిన పేటుపోగులు బిర్రుగా ఉండటానికి, మగ్గానికి పైన దండెంమీదినించి వేలాడదీసి చివర కట్టిన బరువు; మామూలుగా, ఇనకమూట; కొన్నిచోట్ల రాళ్ళు; మగ్గంమీద, ఎత్తుగా గిలకలు అమర్చి, పేటు దారాలు వాటికి తగిలించి చివర బరువులు కడతారు. చూ. చిత్రం 133.1 (కో. 7; రా. 2).

**పేటుమోకు** ఉ. పేటి-. డిజైన్లు నేసే మగ్గం బిగింపుకు కట్టిన మోకు; మామూలుగా కట్టే మోకుతో పాటు దీన్నికూడా చేతిగూటానికి కడతారు (తె. 2).

**పేటులాక** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుచెక్కలను తొక్కినప్పుడు, గొలుసుపిక్కలుగాని దిండుదిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (రా. 18).

**పేటువడి** ఉ. పేటొడి; పర్యా. చూ. వడి(6). పేటుదారానికి చివర కట్టిన దారం; మామూలుగా మైనం పూసింది; కొన్నిచోట్ల, ఇనపతీగ; దీనికి మధ్య, బెజ్జం చేసిన చిన్న ఇనపబిళ్ళ ఉంటుంది; డాబీకోలలు పైకి లేచినప్పుడు ఇవి అంచుపోగులను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 12 (కో. 1; తె. 12, 19; రా. 13, 15).

**పేటుసిల** పర్యా. చూ. తూకం. పేటువడికి వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపపుల్ల; కొన్నిచోట్ల, నేత నేసేటప్పుడు, అని మూసిన తరవాత, వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి రెండు పక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (రా. 12, 13).

**పేటుసూత్రం** ఉ. -సూత్రుం. నేతలో డిజైన్లు పడటానికి డాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి, అంచుపడుగులోకి వేలాడదీసిన దారం; డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు. చూ. చిత్రం 132 చ. 10 (తె. 19, 23, 24, 32; రా. 13).

**పేటెత్తుకోల** అంచులో డిజైన్లు నెయ్యటానికి పోగుల సందులో దూర్చిన కర్ర. చూ. చిత్రం 136 క. 2 (తె. 2).

**పేటేరు** (< పేటు + ఏరు; క్రి.) నేసే డిజైనును బట్టి నేతలో పడుగుపోగులు విడదియ్యటం (తె. 15).

**పేటేరుకమ్మితొగరు** ఒకరకం ఎరుపురంగు; పేటేరు (గుంటూరుజిల్లా) గ్రామంలో తయారుచేసే రకం; పదిపదకొండు ఉడుకులు ఉడికిన(రంగు)నీళ్ళలో తెల్లనూలు వేసి మూడురోజులు నానబెడతారు; తరవాత పిండి, ఎండేసి కమ్మినేతకు ఉపయోగిస్తారు; ఈ రంగు చాలా కాలం నిలుస్తుందని ప్రసిద్ధి (కో. 10).

**పేట్నీచీర** ఉ. ప్లేట్నీ-. నిలువు పసుపురంగులోను, పేక ఎరుపురంగులోను-ఇరవై నెంబరు - జమిలినూలు పెట్టి నేసిన చీర (రా. 13).

**పేట్లతుకు** (< పేట్లు + అతుకు; క్రి.) పట్టులో డిజైన్లు నెయ్యటానికి అవసరమయే పోగులు అతకటం (తె. 12).

**పేడపులుసుకోక** ముదురాకుపచ్చలో నలుపు కలిసిన రంగుచీర (కో. 31).

**పేడపులుసురంగు** ముదురాకుపచ్చలో నలుపు కలిసిన రంగు (కో. 31).

**పేడు** పర్యా. చూ. ఈనె(1). పన్నె కట్టుబడిలో దండెలమధ్య దువ్వెన పళ్ళమాదిరిగా వరసగా కట్టిన కలప, జొన్న, గలుగు, వెదురు, కొండచీపురు మొ. వాటి పుల్ల(లు); కొన్నిచోట్ల, పట్టునేతకు, ఇనుము, ఇత్తడి, ఉక్కు మొ.వాటి ఊచలు వాడతారు. చూ. చిత్రం 88 క. 8 (కో. 26).

**పేనుబెత్తం** చూ. పేకబెత్తం (కో. 9, 16, 18).

**పేనుబెత్తంజెడ** పర్యా. పేముజెడ. కుంచెకట్టుబడిలో, పేముచువ్వలతో అల్లిన వెన్ను అల్లిక (కో.9).

**పేపబెత్తు** ఉ. ప్రైబెత్తు; చూ.పేకబెత్తం (కో.34,36).

**పేము** పర్యా. కుంచెపేము. ?కుంచెకట్టుబడిలో వెన్నుకూ కుంచె(పురమీద)పక్కభాగాలకూ అల్లిన మొగలినార; కొన్నిచోట్ల కుట్లుకుడతారు. చూ.చిత్రం 76 క. 6 (కో. 26, 28, 31, 32, 37).

**పేముకట్టు** కుచెకట్టుబడిలో పేముతో వేసినకట్టు. చూ. చిత్రం 76 క. 6 (కో. 19).

**పేము(చువ్వ)** పర్యా. పేకబెత్తం. పడుగుదువ్వే కుంచెకు వెన్ను, పక్కభాగాలు అల్లటానికి వేసిన పేము పుల్ల (కో. 3, 11, 14, 15, 17, 19).

**పేముజెడ** పర్యా. పేనుబెత్తంజెడ. కుంచెకట్టుబడిలో పేముచువ్వలతో అల్లిన వెన్ను అల్లిక (కో.3).

**పేరంటాలచీర** ఆడపిల్లలు కాపరానికి వెళ్ళేటప్పుడు కట్టుకొనే చీర; రెండు బెత్తల వెడల్పు చెరగు, నాలుగేసి పోగులు కలిపిన పురిదారాలు పెట్టి నేసి, అంచు వెంబడి పచ్చపోగులుపెట్టి, మధ్య తిరవనిచిప్ప(=రెండు గీరలు)పెట్టి నేసిన తెల్లచీర; కమ్మిలో ఇటూ అటూ నలుపు, మధ్యపసుపు పెట్టి అంచు వేలెడువెడల్పు పెట్టి లోఅంచుకు నలుపుపెట్టి నేస్తారు (కో. 4).

పేర్పు పెద్దకుండ; దీని మూతి, పొట్ట, వెడల్పుగా ఉంటాయి; దసలికాయలు దీంట్లోపోసి, పైన వరగడ్డి వేసి, నీళ్ళ అటికెమీద బోర్లించి పొయిమీద ఉడకబెడతారు. చూ. చిత్రం 290.1 (తె. 17).

**పైఅంగోస్త్రం** పైకండువా; బుజంమీద వేసుకొనే బట్ట (కో. 3).

**పైకమ్మి** పర్యా. చూ. **మేరువుపలక.** మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికిచివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుచెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది.

**పైకుచ్చుదారం** కుచ్చుతాళ్ళకు, పైవైపు కట్టిన దారం. చూ. చిత్రం 118 చ. 3 (రా. 12).

**పైకుంచెవేయు** (క్రి.) పడుగు పైభాగంలో కుంచెతో దువ్వటం (కో. 26).

**పైకొంగు** చీరచెరగునుంచి పావుగజం పొడుగు నేత (కో. 1).

**పైకొలికి** పర్యా. చూ. పైకోల్తల. అనుపోసిన పడుగులో మొదటి అని పడ్డ భాగం(=కోల్తల)(కో. 5, 6; తె. 15).

**పైకోర్తల** చూ. పైకోల్తల (కో. 7).

**పైకోల** **1.** మరాను మీదికి పడుగు తోడేటప్పుడు, అచ్చుతికే కొనపోగులు(=కోల్తల) (కో. 23); **2.** ఒక రకం మరాను (=మడతాను) రెండు వరసలు తిరిగి నప్పుడు, పదమూడోసారి పైకివచ్చే పట్టె (తె. 13).

**పైకోల్తల** ఉ. -కోల్తాల; రూ. పైకోర్తల; పర్యా. ఎగుదలకోర్తల, ఎగుమల, ఎగువకోల్తల, ఎడంకోల. అనుపోసిన పడుగులో మొదటి అనిపడ్డభాగం(=కోల్తల) (కో. 5, 6; తె. 15).

**పైగంజి** (-వేయు). పర్యా. చూ. అలుకు(2). సరిచేసేటప్పుడు, పడుగు బాగా బిరుసెక్కటానికి పైన చిలికిన గంజి; గంజిపిడచ ఒకచేత్తో పట్టుకొని, రెండో చేత్తో దానిమీద, అలుక్కుంచెతో దువ్వితే పడుగుమీద గంజి పడుతుంది; కొన్నిచోట్ల, వెంపలి మండలతో చిలుకుతారు (రా. 15).

**పైగుండంచుకమ్మి** ఒకరకం చీరకమ్మి (రా.19బి).

**పైగుండంచుకోక** పర్యా. పైగుండంచుచీర. గుండంచు పెట్టి నేసిన ఒకరకం చీర (రా. 19ఎ).

**పైగుండంచుచీర** పర్యా. పైగుండంచుకోక. గుండంచుపెట్టి నేసిన ఒకరకం చీర (రా. 19బి).

**పైగొర్రె** తెలుపులో ఎరుపు కలిసిన రంగుబొచ్చుగల గొర్రె (తె. 22).

**పైచెయ్యివేయు** (క్రి.) పడుగు ఆరుతుంటే, రెండో సారి కుంచెపెట్టి దువ్వటం (రా. 19).

**పైచెరగు** ఉ. -చెరుగు. నేతమొదటినించి మూరెడు పొడుగు నేసినబట్ట (కో. 6).

**పైట** చూ. పంటె; హరిజనుల వాడుక (కో. 9; తె. 13).

**పైటకండువా** ఉ. -కండవా, పైటి-; రూ. పమిటికండువా; పర్యా. ఓణీ, పమిటె, పైటగుడ్డ, పైటసెల్లా, సెల్లా(3). ఆడపిల్లలు, పరికిణీమీద నడుముకు చుట్టుకొని పైనకప్పుకొనే బట్ట; రెండుమూడు మూరల పొడుగుది (కో. 17, 20-22, 26).

**పైటకర్ర** చూ. పంటెకర్ర; హరిజనులవాడుక (కో. 9; తె. 13).

**పైటగుడ్డ** పర్యా. చూ. పైటకండువా. ఆడపిల్లలు, పరికిణీమీద నడుముకు చుట్టుకొని, పైన కప్పుకొనేబట్ట; రెండుమూడు మూరల పొడుగుది (కో. 8).

**పైటచెరగు** ఉ. -చెరుగు, -సెరగు; రూ. పమిటిచెరగు, పమిటిచెంగు; పర్యా. కమ్మిచెరగు, కొంగు(1), పమిటికొంగు, పమిటిచెంగు, పైటికమ్మి, మంజారు కొంగు, మైజారు. చీర కట్టుకొన్నప్పుడు, బుజంమీద వేలాడేట్టు వేసుకొనే చివరి మూరెడు భాగం; మామూలుగా ఇది మొట్టమొదట నేస్తారు (కో. 29; తె. 18).

**పైటచెరగుకమ్మి** పైటకొంగులో నేసినకమ్మి (కో. 4).

**పైటసెల్లా** ఉ. -చెల్లా; పర్యా. చూ. పైటకండువా. ఆడపిల్లలు పరికిణీమీద నడుముకు చుట్టుకొని పైన కప్పుకొనే బట్ట; రెండు, మూడు మూరల పొడుగుది (కో. 16).

**పైటికమ్మి** పర్యా. చూ. పైటచెరగు. చీరకట్టుకొన్నప్పుడు బుజంమీద వేలాడేట్టు వేసుకొనే చీర చివరి మూరెడు భాగం; మామూలుగా ఇది మొట్టమొదట నేస్తారు (కో. 3).

**పైడిబద్ద** పర్యా. చూ. ఉండేలు(బద్ద). నారి కట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను కట్టి దూదిఏకుతారు. చూ. చిత్రం 9.12 (కో. 7).

**పైదండె** **1.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి కుచ్చుచెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (తె. 23); **2.** పర్యా. చూ. సూత్రాలకట్టె(2). మగ్గంతాళ్ళు(=చేతిపలకతాళ్ళు, కోతిపుల్లలతాళ్ళు, గిరకలతాళ్ళు, పుల్లిరుసుతాళ్ళు మొ. వి)

కట్టటానికి ఆధారంగా మగ్గంపైన అమర్చిన కర్ర; కొన్నిచోట్ల వెదురుది. చూ. చిత్రం 121 క. 14 (తె. 22).

**పైన** ఉ. పయన, పైని, పైనె; చూ. పన్నె(1). (కో. 27, 29-32, 34, 36).

**పైనకట్టు** ఉ. పయన-, పైని-; చూ. పన్నెకట్టు (2). (కో. 27, 29-32, 34, 36).

**పైనగది** ఉ. పైనె-; చూ. పన్నెగది (కో. 27, 30).

**పైనగోడ** ఉ. పైని-. ?పన్నెకట్టుబడిలో దండెల మధ్య బిగించిన ఈనెల కొసలు; దండె ఇవతలకు వచ్చినవి; ఇటువంటివి రెండు వరసలుంటాయి; చూ. పన్నెగోడ (కో. 32).

**పైనజరుపు** (క్రి.) అచ్చుతికిన పడుగులో అతుకు పోగులు అచ్చులోనుంచి పన్నె ఇవతలకు జరపటం; అతుకులు దాటించటం (కో. 27).

**పైనదండె** ఉ. పైని-, పైనె-; చూ. పన్నెదండె (కో. 27, 29, 32, 34, 36).

**పైనీనె** (<పైన+ఈనె) ఉ. పైనీని; చూ. పన్నీనె (కో. 27, 30, 32).

**పైపట్టె** ఉ. పైపట్టి. **1.** పర్యా. చూ. తలపీట. ఆసు పీటల్లో మొదటిది; దీనికి, ఒకటి రెండు చాళ్ళలో ఆసు కొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (తె.20); **2.** పర్యా. చూ.ఊడెదండె. ఊడె పైవైపు బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (కో. 6ఎ); **3.** పర్యా. తిరుగుడుకట్టె(2), పైబద్ద(1), రూలరుకర్ర, రూలు పట్టె. పుల్లిరుసు చెవుకట్లకు ఆధారంగా, పైన బిగించిన పొడుగుచెక్క. చూ. చిత్రం 121 ప. 5 (రా. 14); **4.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు ఇది మగ్గం పందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 5-7, 9బి; రా. 12, 13, 19, 22, 23).

**పైపలక** **1.** పర్యా. చూ. పలక(7). మరమగ్గంలో పన్నె బిగించిన పై చెక్క; నేతనేసేటప్పుడు పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (కో. 2, 9, 25, 26, 29; తె. 7, 10, 18, 20, 22, 23); **2.** పర్యా. చూ. పలక(4). చేతిమగ్గం పన్నె బిగించిన పై చెక్క; పలచగా పొడుగ్గా ఉంటుంది; దీనికి కింద గుండు బిగిస్తారు; దీనికి పైన దారాలు కట్టి వేలాడదీస్తారు; నేతనేసేటప్పుడు పోగు దగ్గరపడటానికి దీంతో అదుముతారు. చూ. చిత్రం 109 చ. 1 (కో. 30, 33, 37; తె. 10, 22, 23, 25, 29, 32, 33).

**పైపోటు** పన్నెలో దూర్చిన దారాలు, ఒకదాని మీద ఒకటి ఒత్తుగా రావటం; ఇలా రాకుండా పోగులు చేత్తో విడదీస్తారు (తె. 16).

**పైపింగుచీర** ?అంచులో, కడ్డీల మాదిరిగా నేసిన చీర (రా. 12).

**పైపింగుపేటు** అంచులో వరసగా కడ్డీలమాదిరిగా నేసిన డిజైను. చూ. చిత్రం 152 (రా. 7, 8, 22).

**పైపింగుబార్డరు** వరసగా కడ్డీల మాదిరిగా డిజైన్లు నేసిన అంచు. చూ. చిత్రం 152 (రా. 13, 23, 24).

**పైపీట** ఆసులో కొలతకొయ్యలు బిగించిన మొదటి పీట. చూ. చిత్రం 45 ట. 1 (కో. 28).

**పైపూత** సరిచేసేటప్పుడు పడుగుమీద చిలికిన గంజి (పూత) (రా. 12).

**పైపెండె** ఉ. పైపెండి; పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేత నేసేటప్పుడు, ఇది మగ్గంపందిరి మాదిరిగా అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 3, 4).

**పైబద్ద** **1.** పర్యా. పైపట్టె(3). పుల్లిరుసు చెవుకట్లకు ఆధారంగా, పైన బిగించిన పొడుగుచెక్క. చూ. చిత్రం 121 ప. 5 (కో. 12); **2.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి, కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 11, 13).

**పైబల్ల** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువు పట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల; దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 28).

**పైబెండు** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల, దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల, దీనికి కుచ్చుచెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు, ఇది మగ్గంపందిరి మీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (తె. 118.3).

**పై(మీద)పంచె** (< పెయిమీద పంచె) పర్యా. చూ. కండువా. బుజాలమీద కప్పుకోటానికి నేసిన చిన్న బట్ట; గోరంచు, కడ్డీఅంచు, అత్తాకోడలంచు, పూవంచు

మొ.వి పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల జరీ వేస్తారు; దీన్ని కొన్నిచోట్ల మడిచి బుజంమీద వేసుకొంటారు; కొన్నిచోట్ల 16–20 మూరల పొడుగు నేస్తారు; కొన్నిచోట్ల గొల్లవాళ్ళ కోసం రెండున్నర, మూడున్నర గజాల పొడుగు నేస్తారు (కో. 8, 9ఎ, 15; రా. 11).

**పైరపత్తి** ఒకరకం ఎర్రపత్తి; నాటురకం (కో.16).

**పైవింటిదబ్బ** ఉ. పయ్యింటిదబ్బ; పర్యా. చూ. ఉండేలు(బద్ద). తాడుకట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం 9.12 (కో. 6).

**పైనరి** (-వేయు) పర్యా. చూ. అలుకు(2). సరి చేనేటప్పుడు, పడుగు బాగా బిరుసెక్కటానికి పైన చిలికిన గంజి; గంజిపిడచ ఒకచేత్తో పట్టుకొని రెండో చేత్తో దానిమీద అలుక్కుంచెకో దువ్వితే పడుగుమీద గంజి పడుతుంది; కొన్నిచోట్ల వెంపలి మండలతో చిలుకుతారు (రా. 19ఎ).

**పొగడపువ్వంచు** పొగడపువ్వు ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు (తె. 5).

**పొచ్చె** పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడెమొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (తె. 9).

**పొట్ట** పర్యా. చూ. నాడెగాడి. నాడెలో పేక దారం అమర్చే సందు. చూ. చిత్రం 131 చ (కో.22).

**పొట్టబట్ట** నేత నేసేటప్పుడు, నేతపనివాడు పొట్ట మీద కప్పుకొనే బట్ట; ఒంటిచెమట దోనెకు చుట్టిన బట్టకు అంటుకోకుండా కప్పుకొంటారు (తె. 9).

**పొట్టె 1.** నూలు లెక్క: లడీలో పదోవంతు నూలు (కో. 9, 14; తె. 16, 24); **2.** లడీలో డెబ్బయ్యోవంతు నూలు (తె. 8, 9, 14, 21, 25–30); **3.** కద్దరులో 640 పోగుల నూలు; దీని చుట్టుకొలత 4 అ.లు ఉంటుంది; మిల్లునూలు పొట్టెలో 560 పోగులు ఉంటాయి;చుట్టుకొలత 4½ అ.లు (కో. 14); **4.** పట్టు దారం చుట్ట; పెద్దది (తె. 12); **5.** (-పాపు) రూ. బొట్టె(1); పర్యా. చూ. పాయ(4). పడుగులో విడదీసిన భాగం; సరిచేసేటప్పుడు పడుగు పాయలుగా విడదీస్తారు (తె. 10, 24 25); **6.** (-కోయు) రూ. పట్టె(10), బొట్టె(2); పర్యా. పట్టెతాడు(1). అచ్చులో పన్నెగూళ్ళలోనుంచి దూర్చిన (బెంతుదారాలుగాని, బద్దెదారాలుగాని) పోగుల పాయ; అచ్చుతికేటప్పుడు, వీటి కొనలు కోసేస్తారు; కోసినవి చెమికెలు. చూ. చిత్రం 102 చ. 4 (కో. 6; తె. 11, 25; రా. 23); **7.** (-కూర్చు, -చేయు, -తీయు, -పాపు, -వేయు)రూ. పట్టె(4), బొట్టె(3); పర్యా. జతికె, పాయ(5), సుంగు(1). పడుగునూలులో, చివర పాయగా విడదీసిన పోగులు; అల్లుచేసేటప్పుడు పడుగును పాయలుగా విడదీస్తారు; మగ్గంమీద, వీటికి ముడులువేస్తారు; కొన్నిచోట్ల కర్రలకు చుడతారు. చూ. చిత్రం 127.7 (కో. 17; తె. 1–10, 12–17, 19, 21–23, 25, 27, 29, 32; రా. 23).

**పొట్టెకట్లువేయు** (క్రి.) పడుగుచివరి పాయలకు కట్లుకట్టటం (తె. 21).

**పొట్టెకోల** పర్యా. అల్లికకర్ర, గుదులకోల, జాతెకర్ర, బొట్టె(ల)కట్టె, బొట్టె(ల)కర్ర, సుంగుడుకోల, సుంగులకట్టె(1). నేతపడుగు చివర పాయలతాళ్ళు కట్టినకర్ర; దీనికి కొన్నిచోట్ల మలబద్ద జోడిస్తారు; కొన్నిచోట్ల దీనికి పొట్టెలు మెలివేస్తారు. చూ. చిత్రం 128 త. 1 (తె. 25, 29, 33).

**పొట్టెగుది** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరిపాయకు కట్టిన దారం; పొట్టెకొకదారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రాలు 127.8, 128 చ. 1 (తె. 21).

**పొట్టెతాడు** రూ. పట్టెతాడు(2), బొట్టెతాడు; పర్యా. గుది(4), గుదితాడు(2), గుళ్ళితాడు, జతికెదారం, పల్లెదారం, పొట్టెగుది, బద్దెదారం(3), బొట్టెదారం, మడికోలగుది, మలగట్టుగుది(1), మలగుది(1), మెలిగుది, సుంగితాడు, సుంగు(2), సుంగుదారం. నేతపడుగులో చివరి పాయకు కట్టిన దారం; పొట్టెకొక దారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రాలు 127.8, 128 చ. 1 (తె. 2, 4, 6–9, 19, 25, 27; రా. 22).

**పొట్టెలకర్ర** ఉ. పొట్టీలకర్ర; పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (కో. 12).

**పొట్టెలముల** ఉ. –ముల. నేతపడుగులో చివర విడదీసిన పాయకు వేసిన ముడి. చూ. చిత్రం 127.9 (తె. 12, 16, 17).

**పొట్టెలుపాపు** (క్రి.) పర్యా. చూ. పాయలుపాపు. పడుగుపోగులు పాయలు పాయలుగా విడదియ్యటం (తె. 19).

**పొట్టేలుచెక్క** ఉ. పొటేల్చెక్క; పర్యా. చూ. ఉడత. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, కింద తోలుఉంగరం బిగించిన కొయ్య

బిళ్ళు; ఇటువంటివి రెండు సొరుగులపైనా అమరుస్తారు. చూ. చిత్రం 119 (కో. 8, 9).

**పొడుపుబల్ల** ఉ. పొడాపు-; పర్యా. చూ. మేకు(ల)కమ్మి. మరానుమీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులు రావటానికి మేకులు బిగించిన అడ్డకట్టె; ఒగ్గుల పట్టె పక్కకు జరిగినప్పుడు పడుగులో అనులుపడతాయి; ఇటువంటివి 8-20 ఉంటాయి. చూ. చిత్రం 50.8 (కో. 36).

**పొడిపడుగు** మామూలుగా ఆరిన పడుగు(కో. 28).

**పొడిరంగు(లు)** 1. విదేశాలనుంచి వచ్చే కొన్ని రకాల రంగులు; వాటిలో చాలావరకూ డైరెక్టుకలర్లు (కో. 7); 2. చన్నీళ్ళలో కలిపి, నూలులడీలు వేసి పిసికే రంగులు; ఇవి అట్టేకాలం నిలవ్వు (కో. 9) 3. పర్యా. చూ. నస్యం(రంగు)(1), ముక్కుపొడుం రంగు; snuff colour; స్కార్లెట్ ఆర్. సి, తేజాపు, పటిక, నైట్రేట్ సల్ఫ్ వేసి నెప్తాల్ రంగు, బ్రౌన్ ఆర్. 800, కాస్టిక్ సోడా, హైడ్రోసల్ఫ్ వేసి ఇండెంత్రిన్ రంగు తయారుచేస్తారు (రా. 3).

**పొడిసౌతు** పసుపు, ఎరుపురంగుల్లో, అరంగుళం చొప్పున పట్టెలుపెట్టి తయారుచేసిన బద్దె నమూనా (=సౌతు) (కో. 4).

**పొడుక్కమ్మి** (< పొడుగుకమ్మి) పర్యా. చూ. తొక్కుడుపీట(2). డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (కో. 18).

**పొడుగు** చూ. పడుగు (కో. 1, 3, 7; తె. 4; రా. 17).

**పొడుగుకుంచె** ఉ. పొడుక్కుంచె. ఒకరకం కుంచె; గంజిపెట్టిన పడుగును ఆరుబయట చాపి దువ్వేకొయ్య పనిముట్టు; గంజి ఆరటానికి దీంతో దువ్వుతారు. చూ. చిత్రం 76 (రా. 1, 19).

**పొడుగుకొయ్య** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (రా. 4).

**పొడుగుచేయు** (క్రి.) చూ. పడుగుచేయు (కో. 3, 7).

**పొడుగుతడుపు** (క్రి.) చూ. పడుగుతడుపు(1) (కో. 7).

**పొడుగునెరుపు** (క్రి.) పర్యా. నరినెరుపు. నరిచేసేటప్పుడు పడుగుపోగులు విడదీసి సాపుగా పరవటం (కో. 7).

**పొడుగుపట్టె** 1. పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 14); 2. పర్యా. చూ. తొక్కుడుపీట(2). డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 41 క. 3 (కో. 10).

**పొడుగుపీట** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 10).

**పొడుగుపోయు** (క్రి.) ఉ. –వోయు; చూ. పడుగుపోయు(1) (కో. 2, 3).

**పొడుగుమోకు** చూ. పడుగుమోకు (కో. 7).

**పొడుగేరుకట్టె** చూ. పడుగేరుకట్టె (రా. 16, 17).

**పొడుగేరుకర్ర** చూ. పడుగేరుకర్ర (కో. 2).

**పొతంఅవు** (తమి. పదం -క్రి.) ఉన్ని పడుగుకు పెట్టే చింతఅంబలి కాచటానికి, నానబెట్టి రుబ్బిన గింజల పిండి మెత్తగా కావటం; సిద్ధం కావటం (తె. 25).

**పొత్తంచుచాపు** పట్టంచు పెట్టి నేసిన పంచెలజత; పెళ్ళికొడుకు కట్టుకొనేది (కో. 30).

**పొత్తిచీర** పర్యా. పొత్తొల్లె. పెళ్ళికూతురు కట్టుకొనే చిన్న పట్టుచీర; తెల్లది; మామూలుగా అంచు లేకుండా చిటికెన వేలెడు వెడల్పు ఎర్ర(కడ్డీ)కమ్మి పెడతారు; కొన్నిచోట్ల ఎరుపులోగాని బీరపువ్వు రంగులోగాని కడ్డీఅంచు, పట్టుకొంగు, పెట్టి నేస్తారు (తె. 16).

**పొత్తు** ఒకరకం పట్టుపురుగులనుంచి వచ్చే పట్టు; ఎరుపువన్నెది; దీంతో మడిబట్టలుగా వాడే వస్త్రాలు నేస్తారు.

**పొత్తెం** నారవడికే కదురుపై కొనకు వేసిన ఇనప పొన్ను. చూ. చిత్రం 302.1 (తె. 25).

**పొత్తెంచుచీర** (< పొత్తి + అంచు) పట్టంచుపెట్టి నేసిన చీర; పెళ్ళికూతురు కట్టుకొనేది (కో. 30).

**పొత్తొల్లె** (< పొత్తి + ఒల్లె) ఉ. పొత్తెల్లె; పర్యా. పొత్తిచీర. పెళ్ళికూతురు కట్టుకొనే చిన్న పట్టుచీర; తెల్లది; మామూలుగా, అంచులేకుండా, చిటికెన వేలెడు వెడల్పు ఎర్ర(కడ్డీ)కమ్మి పెడతారు; కొన్నిచోట్ల, ఎరుపులోగాని, బీరపువ్వు రంగులోగాని కడ్డీఅంచు, పట్టుకొంగు, పెట్టి నేస్తారు (తె.11, 13-15, 17, 31, 32).

**పొత్రం** ఉ. పోత్రం; పర్యా. చూ. రుబ్బురాయి. రోట్లో పిండి రుబ్బే రాయి; చింతగింజలు నానబోసి, రోట్లోరుబ్బి ఉడకబెడతారు (తె. 27, 28).

**పొద్దుపొడుపుచీర** పచ్చ, నారింజ రంగులుపెట్టి నేసిన కలనేత చీర (తె. 4).

**పొంతంజేయు** (క్రి.) ఉన్ని మెత్తగా చెయ్యటం (తె. 10).

**పొందకంపుల్ల(లు)** పర్యా. చూ. ఎత్తుపుల్ల(2). అచ్చుతికేటప్పుడు అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండుపుల్లలకు తాడుగట్టి మడతమంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుం టాయి. చూ. చిత్రం 102 క. 1 (తె. 29).

**పొన్ను** **1.** పర్యా. ఇనపబొడ్డె. పంజె ముక్కుకు బిగించిన(ఇనప)తొడుగు. చూ. చిత్రం 22 (తె. 27); **2.** చేడుకర్రకు చివర వేసిన ఇనపచుట్టు. చూ. చిత్రం 125 క. 2 (కో. 8); **3.** పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (కో. 8; తె. 1, 6 16, 28, 30–32; రా. 22).

**పొప్పిడి** ఒకరకం చెట్టు; ఎరుపురంగు (=మడ్డిరంగు) తయారీకి మడిచెక్కతోబాటు, దీనిచెక్క వాడతారు (రా. 16).

**పొప్పిడిముంగి** సీమకాటు, తెలుపు, ఎరుపు, నలుపు రంగులు పడేట్టు పట్టు, నూలు కలిపి నేసిన చీర(తె. 5).

**పొప్పిళి** పడుగు, పేక సమానంగా వచ్చేట్టు, వేరు వేరు రంగుల్లో నేసిన గడి; 4-1-4-1 కొలుకులు చొప్పున నలుపు, పసుపు రంగుల పోగులు పెట్టి నేస్తారు. (రా. 18).

**పొప్పిళిచీర** ఉ. పొప్పిలి–, పొప్పిలీ–; రూ. పప్పళి (చీర). నల్చదరపు గడిచీర; కొన్నిచోట్ల, చిన్నగళ్ళు నేస్తారు. చూ. చిత్రం 278 (రా. 13–17).

**పొర** ఉ. పర. **1.** (–అతుకు, –ఎత్తు, –కొట్టు, –తీయు) సరిచేసిన నూలులో కిందిపోగులు మాత్రం బద్దెపోగులకు కలిపి అచ్చతికే పడుగు; పొర అతికినప్పుడు పదహారు మూరల పడుగు ముప్ఫయిరెండు మూరలు అవుతుంది (కో. 2-8, 10, 11, 13-15, 18; తె. 8, 9, 11, 13, 21; రా. 11, 13–17, 20, 24); **2.** రెండు, మూడు బట్టలు నెయ్యటానికి అచ్చతికిన పట్టుపడుగు (తె. 12); **3.** నాలుగు పంచెలు; రెండు చాపులు (రా. 18); **4.** చూ. పదర(ం) (రా. 13).

**పొరకచ్చిపట్టు** (క్రి.) పడుగులో కిందిపోగులూ పై పోగులూ విడదీసి చాపటం. (కో. 34).

**పొరకపుల్లంచు** చీపురుపుల్లల మాదిరిగా, సన్నటి గీరలు పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 184 (తె. 4).

**పొరగుడ్డ** రంగుతొట్టెలో, రంగు పోసిన గుడ్డ; గొంగడిమీద పరుస్తారు. చూ. కంబడిమెత్త (కో. 26).

**పొరగొట్టు** (క్రి.) సరిచేసిన పడుగులో, పై పోగులూ కిందిపోగులూ పొరలుగా విడదియ్యటం; రెండు అనుల మధ్యభాగం(=సందు)కర్రతో కొట్టటం; మొత్తం పడుగులో ఒకేఒక అని మిగిల్చి మిగిలింది దొల చేస్తారు (రా. 24).

**పొరచువ్వ** పర్యా. చూ. చువ్వ(7). దండెదగ్గర పడుగుపోగులు నెరపటానికి, అచ్చుదగ్గర నేతపడుగులో దూర్చిన సన్నబెత్తం;దండెకు రెండువైపులా ఉంటాయి; నేత అవుతున్నకొద్దీ వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127.3 (తె. 16).

**పొరచ్చు** ఒకరకం అచ్చు; నేతపడుగులో కింది (పొర)పోగులు అతికి నేసేది (కో. 2–4).

**పొరజములు** నేత నేసేటప్పుడు, పన్నెగూటిలోకి వచ్చిన మూడు పోగులు (తె. 12).

**పొరతొక్కు** (క్రి.) పర్యా. పొరేయు(2); సరిచేసిన తరవాత, పడుగులో పై పోగులూ కిందిపోగులూ రెండు పొరలుగా విడదియ్యటం; అని అనికీ చువ్వలు దూర్చి విడదీస్తారు. పొరవేసిన పడుగు రెట్టింపు పొడుగు వస్తుంది (కో. 25, 28).

**పొరతొడుగు**(క్రి.)పడుగులో కిందిపోగులకూ పై పోగులకూ చువ్వలు దూర్చి అనులు వెయ్యటం (కో. 21).

**పొర(పడుగు)** నేతలో కింది దారాలు మాత్రం అచ్చుకు అతికి, పై దారాలు వెనక్కు చాపుకొనే పడుగు; అనుపోసేటప్పుడు, దీనికి తగినన్ని పుంజాల నూలు నిర్ణయించుకొంటారు; పొరపడుగు అచ్చతికిన తరవాత రెట్టింపు పొడుగు వస్తుంది (తె. 11, 14, 26).

**పొరపేటు** **1.** ఉ. –ప్లేటు. ఒక్కొక్కపోగు ఒక్కొక్క రంగులో పెట్టి (తెలుపు, ఎరుపు మాదిరిగా) నేసిననేత (కో. 11, 13, 15); **2.** పోగులు అయిమూలగా పడేట్టు మూలనేతలో నేసిన నేత (కో. 12, 14); **3.** ?ఒక బట్టలో రెండు రకలుగా నేసిన నేత (కో. 17).

**పొరపోగు** పడుగులో పై పోగులకు కిందిపోగులకు మధ్య అనిలోకి రాని దారం (కో. 8).

**పొరలాక** పర్యా. చూ. చీరులాక(2). నేతపడుగులో పై పోగులకు, కిందిపోగులకు మధ్య, దండెకూ అచ్చుకూ మధ్యగా దూర్చిన వెదురుబద్ద (తె. 17; రా. 21).

**పొరవిప్పు** (క్రి.) పడుగులో పై పోగులూ కింది పోగులూ విడదియ్యటం (కో. 25).

**పొరషర్టింగు** పడుగుకు ఒకరంగు, పేకకు మరొక రంగు పెట్టి నేసిన కలనేత గుడ్డ (కో. 6).

**పొరసరి** పర్యా. ఒంటిపడుగు(1), పొరెంటి. అచ్చతికేటప్పుడు కిందిపోగులు(పొర)మాత్రం అతికే పడుగు నూలు (కో. 14).

**పొరసరిచేయు** (క్రి.) పడుగుమడత వేసి సరిచెయ్యటం (కో. 34).

**పొరసల్లిలాక** పర్యా. అస్త్రాల్లాక. నేతపనులో. అచ్చు తరవాత దూర్చిన లాక. చూ. చిత్రం 127.2 (తె. 24).

**పొరసాలపుల్ల** దండెదగ్గర పడుగు పోగులు నెరపటానికి అచ్చుదగ్గర దూర్చిన సన్నబెత్తం; ఇటువంటివి దండెకు రెండువైపులా ఉంటాయి; నేత అవుతున్న కొద్దీ వీటిని ముందుకు జరుపుతూ ఉంటారు. చూ. చిత్రం 127.3 (తె. 25).

**పొరాటు** (< ?పొరవాటు) నేతనేసేటప్పుడు అచ్చుకు తగిలి చెడిపోయిన పోగు (రా. 8).

**పొరాసు** ఆసుల్లో ఒకరకం: పొరపడుగు పోసే ఆసు; దీని ఆసుకోటలకు వరసగా 6 : 10 : 5 చొప్పున కొయ్యలుంటాయి; దీనిమీద పోసే పడుగు పదహారు మూరల పొడుగు ఉంటుంది (తె. 11, 14).

**పొరెంటి** (< పొర + ఎంటి) పర్యా. చూ. పొరసరి. అచ్చులికేటప్పుడు కిందిపోగులు(పొర) మాత్రం అతికే పడుగునూలు (కో. 13).

**పొరేయు** (< పొరవేయు; క్రి.) **1.** సరిచేసేటప్పుడు పడుగులో కిందిపోగులూ, పైపోగులూ అంటుకుపోకుండా లాకలతో విడదియ్యటం (కో. 23); **2.** సరిచేసిన తరవాత పడుగులో పైపోగులూ కింది పోగులూ రెండు పొరలుగా విడదియ్యటం; అవి అనికీ చువ్వలు దూర్చి విడదీస్తారు; పొరవేసిన పడుగు రెట్టింపు పొడుగు వస్తుంది (కో. 21, 26, 29, 32, 35-37).

**పొలిచేయు** (క్రి.) బలిఇవ్వటం; చెట్టుమీదినించి దసలి కాయ విడిపించేటప్పుడు, నాయకపువాళ్ళు (=దసలి పురుగులను పెంచేవాళ్ళలో ఒక తెగ) ఇల్లు చేరేవరకూ ఏడుసార్లు బలి ఇస్తారు (తె. 17).

**పొల్లుపోవు** (క్రి.) పడుగులో పైపోగులకు, కింది పోగులకు మధ్య అని చెదిరిపోవటం (కో. 8).

**పోకపట్టనార** పోకచెట్టునుంచి తీసిన నార; కుంచె కట్టుబడిలో, వెన్నుభాగంలోనూ పురికి పైభాగంలోనూ దీంతో గట్టికట్లు వేస్తారు (రా. 16).

**పోకపూవు** అంచులో పోకపువ్వు ఆకారంలో నేసిన డిజైను (తె. 2, 6, 7).

**పోకబద్ద** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో. ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్లుబద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 6ఎ).

**పోకబంతి** ఒకరకం నీలంరంగు; మెజంటా బి.ఆర్. వేసి తయారుచేస్తారు (తె. 4).

**పోకముంగిరుమాలు** పోకరంగు గళ్ళు పడేట్లు నేసిన ఒకరకం తలపాగ (తె. 24).

**పోకరంగు** **1.** పర్యా. చూ. వక్కరంగు(1). నల్ల పోకచెక్క (=పీకివక్క) రంగు; రెడ్ బి., బి. ఒ. వేసి తయారుచేస్తారు (తె. 4, 6, 10, 14, 15, 17, 26); **2.** గంజివంకాయ రంగు (తె. 11).

**పోకరంగురుమాలు** పోకరంగుపెట్టి నేసిన తలపాగ (తె. 24).

**పోకున్నపుల్ల(లు)** జాకార్డుడాబీ దారాలను అడించే పుల్ల(లు); అడ్డకుపైన వేలాడగట్టినవి. చూ. చిత్రం 135.5 (కో. 33).

**పోగతుకు** (< పోగు + అతుకు) రూ. పోమతుకు. పడుగుపోగు, బద్దెపోగు కలిపి వడిపెట్టటం (తె. 18).

**పోగు** ఉ. ఓగు; రూ. పోము, పోవు. ఒంటిపోచ దారం (కో. 1-21, 34, 36; తె. 1, 2, 4, 5, 7, 10-33; రా. 1-24).

**పోగుతీయు** (క్రి.) ఉ. -దీయు. రాట్నంమీదగాని, చేతికదురుమీదగాని ఏకునుంచి దారం తియ్యటం (కో. 1, 3; రా. 11, 15, 24).

**పోగుదంగు** (క్రి.) గొంగడి నేసేటప్పుడు వేముతో కొట్టిన పేకపోగు నేతలో కలిసిపోవటం; అణిగిపోవటం (తె. 11).

**పోగుదిగబోయు** (క్రి.) పర్యా. ఈనెపోదుచు. పన్నెఈనెల మధ్య సందులో పోగు(లు) దూర్చటం (తె. 11, 15, 21).

**పోగుపగులు** (క్రి.) పేకదారం పోగులు దూర దూరంగా పడటం, "కలనేతలో పోగుపగిలి దగ్గరొస్తుంది." (రా. 13).

**పోగుపుల్ల** పర్యా. చూ. బుసిపుల్ల. వీతినాడె గాడిలో అడ్డంగా బిగించిన పుల్ల; పేకపోగు చిక్కువడకుండా సాపుగా రావటానికి, దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (తె. 7).

**పోగుపోయు** (క్రి.) రాట్నం కదురుకు గుచ్చిన కొన్నదంటుపుల్లకు దారపుపోగు చుట్టటం (రా. 15).

**పోగులగొంగడి** ఏదైనా ఒకరకం రంగు ఉన్నిలో మరొక రంగు ఉన్ని కలిసేట్టు గిరలు గిరలుగా నేసిన గొంగడి (తె. 20).

**పోగులునెరుపు** (క్రి.) సరిచేసేటప్పుడునూలుపోగులు చిక్కులు లేకుండా సాపుగా పరవటం (కో. 11, 15-17, 19).

**పోగువిప్పు** (క్రి.) ఉ. పోగిప్పు. పదునేరుకర్రల మీద పోగులు విడదీయటం (తె. 12).

**పోగూదు** (క్రి.) నాడెపూసలోనుంచి పేకదారం పోగు, నోటితో బయటికి పీల్చటం (రా. 8).

**పోగూపొట్రా** (-చూసు) ఉ. పోగూపట్టం. నూలు పోగూ వగైరా; "-పొట్రా" అనేది ఉపపదం (కో. 32; రా. 7).

**పోగేరు** (< పోగు + ఏరు) పడుగేరుకర్రలమీద పోగుపోగు విడదీసి సెరపటం (తె. 11, 15, 17).

**పోటుబల్ల** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం పొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో. 16).

**పోటువడి** పర్యా. చూ. కొలికి(3). అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె; నేతనేసేటప్పుడు పడుగు పోగులను పైకి లేపటానికి కిందికి దింపటానికి ఈ లంకెల్లోనుంచి రెంతుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3

**పోతురాజు** నీలితొట్టి దగ్గర పాతిన గూటం; దీనికి పసుపు రాసి వేపమండలు కడతారు; పోతురాజు గ్రామ దేవత (పోచెమ్మ, నూకాలమ్మ, గంగానమ్మ మొ.) తమ్ముడట. చూ. చిత్రం 284 క. 4 (కో. 12).

**పోమతుకు** (< పోము + అతుకు) (క్రి.) చూ. పోగతుకు (కో. 25, 37).

**పోము** చూ. పోగు (కో. 22-33, 35, 37).

**పోముపట్టు** (క్రి.) పడుగులో తెగిన పోగు(లు) తీసి అతకటం (కో. 27).

**పోముమళ్ళించు** (క్రి.) నేతలో ఒకవైపు ఎక్కువ, మరోకవైపు తక్కువ వచ్చినప్పుడు, నేత హెచ్చిన వైపు నాడె పోకుండా తగ్గినవైపే రెండోసారి నాడె వేస్తూ నెయ్యటం (కో. 31).

**పోములతుకు** (< పోములు + అతుకు) (క్రి.) పర్యా. పోములుకుట్టు. అల్లుచేసేటప్పుడు పడుగులో తెగిపోయిన పోగులు అతకటం (కో. 32).

**పోములుకుట్టు** పర్యా. పోములతుకు. అల్లుచేసేటప్పుడు పడుగులో తెగిపోయిన పోగులు అతకటం (కో. 25, 26).

**పోములుగట్టు** తెగినపోగులు అతకటం (కో. 37).

**పోముసందు** (-ఇచ్చు) నేతలో రెండు పోగుల మధ్య వచ్చిన వెలితి (కో. 32, 35).

**పోయు** (క్రి.) పర్యా. చూ. అనుపోయు. అనుగొట్టంలోకి పోగు తీసుకొని అనుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చెయ్యటం (కో. 1-4, 6, 8-11, 13, 26, 27; తె. 1-7, 9-16, 18-21, 23-27, 29-31, 33; రా. 1-5, 8, 11-19, 21-24).

**పోరు** పర్యా. చూ. సంగటికోల. పత్తిరాట్నం నిలువులమధ్య రూళ్ళకర్ర మాదిరిగా ఉండే కట్టె; ఇటువంటివి రెండు, ఒకదాన్నొకటి అనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడిపత్తి పెట్టినప్పుడు ఒక వైపు గింజలు, మరోకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1.1 (కో. 36).

**పోరుబందపుగడి** మూడు పోగులకొక పోగు నిలువుకు, పేకకు జమిలిగా పెట్టి నేసిన గడి (కో. 34).

**పోలు** రెండుసార్లు ఏకిన దూది (తె. 28).

**పోలేరమ్మకన్ను** (-తీర్చు) ఉ. పోల్రెమ్మ-. పోలేరమ్మ(గడి)చీర కమ్మిలో, మధ్యమధ్య, అందానికి పెట్టిన రంగు పోగు(లు); సుమారు రెండంగుళాల పొడుగుది; గోరంచు తెల్లచీరకు కమ్మిలో మూడు శ్రేణుల వరకూ రెండు రంగుపోగులు కలిపి పెట్టి, ఒక అనిలో అంగుళం వరకూ చిన్న దారంముక్కలు పెట్టి అతుకుతారు; చూ. కన్ను. (కో. 6).

**పోలేరమ్మగడిచీర** కమ్మిలో మధ్యమధ్య రంగు పోగులు దూర్చి(=పోలేరమ్మ కండ్లు), గోరంచుపెట్టి నేసిన తెల్లగడి చీర (కో. 6).

**పోలేరమ్మచీర** ఉ. పోల్రమ్మ-. ఒకఅంచు-30 కొలుకులు-నలుపు, ఒకఅంచు- 20 కొలుకులు-ఎరుపు రంగుల్లోపెట్టి, చిగురంచు తెలుపు వదిలి ముప్పయ్యేసి కొలుకుల కమ్ములకు చెరోకరంగూపెట్టి, ఎరుపుకండ్లు (=ఎర్రపోగులు) తీర్చి నేసిన తెల్లచీర; ఇరవై కొలుకుల ఎర్రపట్టె, ఆరుకొలుకుల తెల్లపోగులు, తరవాత ఇరవై కొలుకుల తెల్లపోగులు చొప్పున బెత్తెడునేసి కండ్లు తీరుస్తారు; కొన్నిచోట్ల, కమ్ముల్లో నల్లపోగులు పెడతారు (కో. 2, 3; రా. 10).

**పోవు** చూ. పోగు (రా. 18).

**ప్రధానపుచీర** ఉ పతానపుసీరె; చూ. ప్రధానంచీర (తె. 13, 16).

**ప్రధానంచీర** ఉ. ప్రెతాణంచీరె; రూ. ప్రధానపు చీర; పర్యా. తాంబూలం(చీర), తాంబూలపొల్లె, విడెమొల్లె. తాంబూలు పుచ్చుకొనేటప్పుడు మగపెళ్ళివారు, పెళ్ళికూతురికి పెట్టే చీర (కొన్నిచోట్ల, పట్టుది); పచ్చ రంగులోగాని, వయిలెట్ రంగులోగాని, రెండువేళ్ళ వెడల్పు అంచులు, బెత్తెడు వెడల్పు కమ్ములు నేస్తారు; మామూలుగా, తెల్లచీర; ఇటీవల కొన్నిచోట్ల, ఆకుపచ్చ, పసుప్పచ్చ, గులాబి మొ. రంగుల్లో నేస్తున్నారు; మూరెడు పొడుగు కొంగు రంగులోనూ, జరీలోనూ నేస్తారు; కొన్నిచోట్ల, బీరపువ్వు, తెలుపు రంగుల పోగులు వరసగా పెట్టి అంచుల్లో డిజైన్లు నేస్తారు; ఎరుపు, నలుపు రంగులు మాత్రం వాడరట (కో. 3, 7, 13, 15, 17).

**ప్రభఆకు** అంచులో నేసే ఒకరకం డిజైను; చూ. నెమలిఅంచు. చూ. చిత్రం 289 (రా. 8).

**ప్రభావతిఅంచు** శాకుమొన మాదిరి లాహిరీలు పడేట్టు నేసిన అంచు; చూ. లాహిరిఅంచు. చూ. చిత్రం 149 (కో. 24).

**ప్రభావతిపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను. చూ. చిత్రం 262 (రా. 12, 13).

**ప్రమీలంచు** అష్టభుజి మాదిరి గడి పెట్టి, మధ్య చుక్క పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 211(రా. 1).

**ప్రేమ్** (< frame) నూలు చుట్టిన పెద్దకండె(=గిరక)లు అమర్చిన చట్రం; వీటినించి తీసిన పోగులు బీమ్(అడ్డ)కు చుట్టుకొంటాయి (తె. 8).

**ప్లాట్‌జరీ** మూడు పోగులు కలిపి పురిపెట్టి నేసే జరీ; కొయ్యగిలకలకు చుట్టి అమ్ముతారు; పోగు మందం (రా. 14).

**ప్లేచర్‌రేషం** నాణ్యమైన ఒకరకం పట్టు(రా. 14).

## ఫ

ఫనీ చూ. పన్నె(1). పన్నెలు తయారుచేసే సాయెబులవాడుక (కో. 4, 5).

**ఫాటీ** చూ. పాటీ (కో. 5).

**ఫార్సీఖానీ** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను; పెర్షియన్ డిజైను (కో. 16).

**ఫ్రిగర్‌రాడ్** ?మరాను కట్టుబడిలో క్రేంకును ఆడించే ఇనపఊచ; కీలు (కో. 26).

**ఫ్రేంగుంజ** ఉ. ప్రేంగుంజ; పర్యా. చూ. సట్టరుగుంజ(1). మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట(లు); ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల రెండు. చూ. చిత్రం 116.2 (రా. 15).

**ఫ్రేంమగ్గం** పెద్ద మరమగ్గం; దీంట్లో పన్నె అమర్చే చట్రం పెద్దది; నేతలో డిజైన్లు ఎక్కువ రావటానికి వాడతారు (తె. 5; రా. 24).

## బ

**బకేటు** (< bucket) ఉ. బకీటు, బకోటా; పర్యా. బాల్చీ. ఒకరకం రేకుపాత్ర; నీళ్ళు తోడుకొనేది; కొన్నిచోట్ల దీంట్లో గంజి పోసుకొంటారు; కొన్నిచోట్ల రంగులు కలుపుతారు (కో. 11-13, 19; రా. 22).

**బక్రీద్** తురకసాయెబుల పండుగ; తివాసీ నేతపనివాళ్ళు చేసుకొనే పండుగ (కో. 16).

**బగ్గడినూలు** పోగులో కొంత సన్నగాను, కొంత లావుగాను వచ్చిన నూలు (తె. 5).

**బంకం** పర్యా. చూ. ఊడె. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు; రెండు పొడుగు పట్టెలు, మడతమంచం కోళ్ళ మాదిరిగా అమర్చి పైన అడ్డపట్టె చేర్చి ఉంటారు. చూ. చిత్రం 63 క(తె.7, 9).

**బంకంగుంజ** పర్యా. చూ. గూటం(3). ఊడెను నిలబెట్టి తాడుతో బిగించటానికి, నేలలో పాతినగూటం; కొయ్యదిగాని, ఇనపదిగాని, రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7 (తె. 7, 9).

**బంకంగుదె** పర్యా. చూ. ఊడెగుదె. పడుగు చాపేటప్పుడు, ఊడె అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (తె. 9).

**బంకంతాడు** పర్యా. చూ. ఊడెతాడు(1). ఊడెను నిలబెట్టి కిందిగూటానికి బిగించేతాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (తె. 7).

**బంగారంజరీ** బంగారపు పూత వేసిన వెండిజరీ; పసుప్పచ్చవన్నెది (కో. 33).

**బంగారుపచ్చ** పర్యా. బంగారు(వన్నె). ఒకరకం పసుపురంగు; బంగారం రంగు (కో. 30).

**బంగారుపచ్చచీర** నూలుకు బంగారంరంగు(=ఒకరకం పసుపురంగు) అద్ది నేసిన చీర (కో. 30).

**బంగారుముంగి** కపిల, నలుపువన్నెల్లో పట్టు, నూలు కలిపి నేసిన చిన్నగడిచీర (తె. 5).

**బంగారు(వన్నె)** పర్యా. బంగారుపచ్చ. ఒకరకం పసుపురంగు; బంగారం రంగు (కో. 26, 35; తె. 19).

**బంగారు(వన్నె)చీర** నూలుకు బంగారంరంగు అద్ది నేసిన చీర (కో. 26, 35; తె. 19).

**బంగాళంచు** రెండువైపులా జెత్తడేసి వెడల్పున రంగుపోగులు పడేట్టు నేసిన అంచు (తె. 15).

**బంగాళాపురి** నారతో పేనిన తాడు; పురికొన; చిటికె అద్దకంలో నూలుబొందుకు కడతారు (కో.7).

**బంగ్లేకాహునర్** తివాసీనేతలో వచ్చిన భవనం నమూనా (తె. 17).

**బచ్చుకాయవన్నె** ఉ. బచ్చుకాయెన్నె. వయిలెట్ రంగు కంటె ఒక వన్నె తక్కువ ఉండే రంగు. చూ. బచ్చలిపండ్ల రంగు (కో. 29).

**బచ్చుపండురంగు** చూ. బచ్చుపండురంగు (1). (తె. 26).

**బచ్చలతీగకడ్డీ** బచ్చలతీగ, ఆకులు వరుసగా పడేట్టు నేసిన డిజైను (తె. 21).

**బచ్చలపండు(రంగు)** ఉ.బచ్చలిపండురంగు. **1.** చూ. బచ్చపండురంగు. వయిలెట్ రంగు కంటె ఒక వన్నె తక్కువ ఉండే రంగు; బుక్కా-(=గులాల్) రంగు. చూ. చిత్రం 288 (కో. 8, 16, 24; తె. 12, 14, 17); **2.** చెంద్రకాంత రంగు; మెజంటా (కో. 9); **3.** ఎరుపు నీటివంకాయ రంగు (తె. 13, 15).

**బచ్చలపండ్లచీర** నాలుగుపోగులు రంగు, నాలుగు పోగులు నలుపు చొప్పున పడుగు అలికి నేసిన చీర (తె. 18).

**బట్** పర్యా. చూ. గీరుకత్తి. పన్నెదండెల మధ్య బిగించే ఈనెపుల్లలు చీల్చి సాపుచేసే రేకుకత్తి; ఒక వైపున వంపుగా గాడి ఉంటుంది; కొన్నిచోట్ల రెండు వంపుల్లో గాళ్ళు ఉంటాయి. చూ. చిత్రం 89 క. 6 (రా. 24).

**బటువుతాడు 1.** పర్యా. చూ. నేతమోకు. మగ్గం మీద నేతపడుగును బిరుపెట్టే లావుపాటి తాడు; ఒక వైపు పెడకోలకు మధ్యగా కట్టి మిడిగూటానికి మెలి వేసి రెండోవైపు చేతిగూటానికి కడతారు; నేత దగ్గరికి రావటానికి మోకు వదులుతారు; వెనక్కు జరగటానికి బిగలాగుతారు. చూ. చిత్రాలు 121 క. 1, 127.15 (రా. 5); **2.** పర్యా. చూ. బిరుతాడు(2). మరమగ్గం నిలువుపట్టెను మేరువు పలకకుబిగించి సన్న పుల్లతో వడిపెట్టిన దారం; మేరువుపలకను పైకిగాని కిందికిగాని జరుపుకొని దీంతో బిరు పెడతారు. చూ. చిత్రం 118.6 (రా. 5).

**బటువుపుల్ల** పర్యా; చూ. పన్ను(2). దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (రా. 5).

**బట్టగొర్రె** కొంతభాగం ఒకరంగు, మరికొంత భాగం మరొకరంగు—నలుపూతెలుపూ గాని, నలుపూఎరుపూ గాని-ఉండే గొర్రె (తె. 6, 11, 26, 27).

**బట్టపిడచ** పర్యా. చూ. పిడచ(1). పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ; కొన్నిచోట్ల బద్దె పేలికలు కుప్పచేసి పిడచగా ఉపయోగిస్తారు; దీంతో పడుగుకు గంజిగాని అంబలిగాని పట్టిస్తారు; నేతనేసేటప్పుడు బట్ట ముందు భాగం (=వాయి) బిరుసెక్కటానికి దీంతో గంజి పూస్తారు. చూ. చిత్రాలు 74.2, 142.1 (తె. 10–12; రా. 17).

**బట్టీ** ఉ.బట్టి. **1.** రంగునీళ్ళు కాచే పెద్ద ఇనపడబ్బా. చూ. చిత్రం 282 క. 3 (తె. 19, 23; రా. 13); **2.** నిప్పురగిల్చి మంటపెట్టటానికి ఏర్పరచుకొన్నది; పొయ్యి: అండాలో రంగునీళ్ళు పోసి దీనిమీద ఉడకబెడతారు. చూ. చిత్రం 282 క. 9 (తె. 14).

**బట్టీకొట్టు** ఉ. బట్టి-. పొయ్యిమీద (నూలు) ఉడకబెట్టటం (తె. 17).

**బట్టీనీలి** ఉ. బట్టి-. బొగ్గుమాదిరి నల్లరంగు; బానల్లో ఊరబెట్టి తయారుచేసింది (రా. 11).

**బట్నె 1.** పర్యా. తాడుపేనుబండి, తాడు పేనుపుల్ల. పన్నెకట్టుబడిలో ఈనెలు బిగించటానికి వాడే దారం పురిపెట్టే కదురు; మామూలుగా దీనికి కొయ్యదిండు బిగిస్తారు; కొన్నిచోట్ల తకిలీలాంటిది. చూ. చిత్రం 89 క. 3 (కో. 5 7; రా. 24); **2.** కదురుపుల్ల బిగించిన చివరి కొయ్యదిండు చూ. చిత్రం 89 క. 3 (కో. 33).

**బడెకుంచె** (-తీయు, -వేయు) నరిచేసేటప్పుడు పడుగుమీద కుంచె ఎత్తిఎత్తి వెయ్యటం; పడుగు ఆరు బదులులో ఉండగా నందు(=రెండు కచ్చుల మధ్య భాగం) నందుకూ ఆపుతూ కుంచె ఎత్తి మళ్ళీ దువ్వుతారు (రా. 7, 8).

**బడెమి** ?మొదటిసారి సరిచేసే పడుగు (రా. 7).

**బడెమిచేయు** (క్రి.) గంజిపెట్టిన పడుగును మొదటి సారి కుంచెతో దువ్వటం (రా. 7).

**బడెము 1.** ?మొదటిసారి గంజితో తడిపినపడుగు (రా. 8); **2.** ?రెండోసారి కుంచెతో దువ్విన పడుగు (రా. 12).

**బడ్డీ** ఉ. బడ్డి. **1.** పర్యా. అడ్డబొంగు(లు), ఒగ్గుడు కర్రలు, దండెకర్ర(లు). మరానుమీద పడుగుతోడేటప్పుడు డబ్బాలకు ఉన్నదారం ఒగ్గులపట్టె వరకూ సాపుగా పోవటానికి నిలువుగుంజలమీద అడ్డంగా బిగించిన కొయ్య(లు); కొన్నిచోట్ల వెదురువి (కో. 24); **2.** పర్యా. చూ. మగ్గంపందిరి. నేతబయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువురాటలకు అడ్డంగా మంచె మాదిరిగా బిగించిన కర్రలు; మగ్గంగుంటకుపైన ఎత్తుగా వేస్తారు. చూ. చిత్రం 116 (కో. 21, 23-25, 27, 30); **3.** పర్యా. చూ. మగ్గంచట్టం(1). మరమగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగు పట్టెల చట్రం; మామూలుగా దీని నిలువుపట్టెలకు కుచ్చుతాళ్ళుకట్టే కొయ్యలు బిగిస్తారు; కిందిపట్టెమీద కండెనాడె ఆడుతుంది. చూ. చిత్రం 118 (కో. 25, 30).

**బడ్డీగుజ్జు** ఉ. బడ్డి-; పర్యా. చూ. పందిరిరాట. మరమగ్గంచట్రం నిలిపే మగ్గంపందిరికి ఆధారంగా నేత బయలులో పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 116.2 (కో. 30).

**బడ్డీదండె(లు)** నేతబయలులో మరమగ్గంచట్రం

నిలబెట్టటానికి నిలువురాటకు అడ్డంగా మామూలుగా బిగించిన కర్ర(లు); కొన్నిచోట్ల దీనికి అచ్చుతాళ్ళు తగిలిస్తారు. చూ. చిత్రం 116.1 (కో. 30).

**బడ్డీమగ్గం** పర్యా. చూ. మరమగ్గం. ఒకరకం మగ్గం; మగ్గంచట్రం అమర్చటానికి బడ్డీ వేసింది; నేత నేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజేది; మగ్గంపలక, పన్నె ఒక కొయ్య చట్రంలో బిగించి పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు. చూ. చిత్రం 108 (కో. 27).

**బడ్డీరాట** పర్యా. చూ. పందిరిరాట. మరమగ్గం చట్రం నిలిపే మగ్గంపందిరికి ఆధారంగా నేతబయలులో పాతిన నిలువుకొయ్య; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 116.2 (కో. 25, 27).

**బటుంబద్ద** **1.** పర్యా. చూ. దవడ. పన్నె కట్టుబడిలో, ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పు బద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 5, 12); **2.** పర్యా. చూ. తన్ను(డు)బద్ద(2). దోనెముందర నేసినగుడ్డ ముడుచుకు పోకుండా, అడ్డంగా, పైవైపున బిరుపెట్టే ఒకరకం చేమబద్ద; వెదురుది; మామూలుగా చిన్న నెరువు(=తక్కువ వెడల్పు) బట్టల నేతకు వాడతారు; కొన్నిచోట్ల చేమ కర్రలకు మారుగాగాని తోడుగాగాని వాడతారు. చూ. చిత్రం 125 గ (కో. 5).

**బండ** పర్యా. చూ. గంజిబండ. గంజి, అంబలి మొ. వాటితో పడుగు తడపటానికి పరిచిన రాయి. చూ. చిత్రం 74.1 (కో. 4, 6, 9, 14, 27-30, 32; తె. 1-3, 5-7, 9-15, 18-21, 28-31, 33; రా. 11, 15, 16, 18, 19, 22-24).

**బండపాకురు** ఉ. బండపాకర. పెసరరంగులో ముదురువన్నె (తె. 16, 17, 27).

**బండి** **1.** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంజె మొ.వాటికి, దీనికి తగిలించిన చిలప నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (కో. 5-8, 10, 11, 13, 15; తె. 4, 14-16, రా. 4, 6, 7, 20); **2.** పర్యా. చూ. దిండు(4). గంటానికి బిగించిన రీలుదారపుబండి; డబ్బారాట్నం వడిచారం దీని గాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క. 13 (కో. 1, 2, 15, 19, 21, 36; రా. 1, 5, 6); **3.** పర్యా. చూ. లక్కాకు(3). డబ్బారాట్నం చెక్రం బిగింపుకు ఇరుసుకువేసే కొయ్యబిళ్ళ; ఇటువంటివి రెండు చెక్రాలుంటాయి; చెక్రం పక్కలకు జరక్కుండా ఆపుతాయి. చూ. చిత్రం 41 త. 1 (రా. 1, 4).

**బండిఆకు** ఉ. బండాకు; పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురు బద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 16).

**బండికర్ర** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటికట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 8ఎ).

**బండికుచ్చు** పర్యా. చూ. కుచ్చు. మరమగ్గంలో ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో తాళ్ళను గుంజేపిడి; మామూలుగా గుడ్డపేలిక-కొన్నిచోట్ల, బద్దెపేలిక-లు కలిపి కట్టింది; కొన్నచోట్ల, దారపురీలు కడతారు. చూ. చిత్రం 118.21 (కో. 33).

**బండికుండ** పర్యా. చూ. పెడకోలచెక్రం. పెడకోలను మోసే కొయ్యచెక్రం; ఇటువంటివి రెండుంటాయి; నేతమోకు వదలు చేసినప్పుడు పడుగు నేలకు తగలకుండా పెడకోలచెక్రాలమీద జరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129 వ. 1 (కో. 18, 21).

**బండికుండలకర్ర** ఉ. బండికుండ్లుకర్ర; పర్యా. చూ. పెడకోల(2). నేతపడుగు బిరుపెట్టటానికి, మలగర్రకు అవతల, అల్లుచేసేటప్పుడు కట్టిన వంకరకట్టె; మగ్గానికి పడుగు అమర్చిన తరవాత, దీనికి రెండు వైపులా మలగుడులు, మధ్యన నేతమోకు తగిలిస్తారు; కొన్నిచోట్ల మోకుతో ముడివేస్తారు; కొన్నిచోట్ల దీనికి కొయ్యచెక్రాలుగాని చెక్కలుగాని ఎత్తు పెడతారు. చూ. చిత్రం 127.12 (కో. 18, 20).

**బండిగజెం** ఉ. -గెజెం; పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్ని చోట్ల దూపిరి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 10).

**బండిగాను** పర్యా. చూ. పెడకోలచెక్రం. పెడకోలను మోసే కొయ్యచెక్రం; ఇటువంటివి రెండుంటాయి; నేతమోకు వదులు చేసినప్పుడు పడుగు నేలకు తగలకుండా పెడకోల చెక్రాలమీద జరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129 వ. 1 (కో. 5).

**బండిగోడు** పర్యా. చూ. పెడకోలచెక్రం. పెడకోలను మోసే కొయ్యచెక్రం; ఇటువంటివి రెండుం

టాయి; నేతమోకు వడులు చేసినప్పుడు, పడుగు నేలకు తగలకుండా పెడకోల చెక్రాలమీద తిరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129 ప. 1 (కో. 5).

**బండిచిప్ప** పర్యా. చూ. చిప్ప(1). రాటి పై బద్దలను బిగించి వాటిమధ్య బోర్లించి కట్టినచిప్ప; మామూలుగా కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల కర్రచిప్ప గాని రేకుమూతగాని వాడతారు; ఇది రాటిసూలం మీద అనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (కో. 10).

**బండిచువ్వ** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటికట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 13; తె. 15).

**బండి(చెక్రం)** **1.** పర్యా. చూ. దారపుబండి(2). బరువుకట్టిన అంచుపేటుదారాలు తగిలించే కొయ్యగిలక; దీన్ని మామూలుగా మగ్గం మీద ఎత్తుగా అమరుస్తారు. చూ. చిత్రం 133.2 (కో. 1, 23, 24, 33; రా. 2, 7); **2.** పర్యా. చూ. పెడకోలచెక్రం, పెడకోలను మోసే కొయ్యచెక్రం; నేతమోకు వడులుచేసినప్పుడు పడుగు నేలకు తగలకుండా పెడకోల చెక్రాల మీద జరుగుతుంది; ఇటీవల వాడుకలోకి వచ్చింది. చూ. చిత్రం 129 ప. 1 (కో. 12).

**బండిదబ్బ** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురు బద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (రా. 4).

**బండిదారం** పర్యా. చూ. వడిదారం(3). అచ్చు కట్టేటప్పుడు, అచ్చుకర్రలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల మిషనురీలు దారం వాడతారు; మొదట అచ్చు బిళ్ళకు చుట్టి తరవాత కర్రకు దూరుస్తారు (కో. 12, 19, 21).

**బండిపంటె** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంటె మొ.వాటికి దీనికి తగిలించిన చిలప నుంచి నూలు తోడుకొంటారు; చూ. బండి. చూ. చిత్రం 31 (రా. 21).

**బండిపుల్ల** **1.** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (కో. 5; తె. 14); **2.** పర్యా. చూ. నిలువుబద్ద(1). రాటి ఆకులను కలిపే నిలువుపుల్ల(లు); కొన్నిచోట్ల తాళ్ళు వాడతారు. చూ. చిత్రం 31 క. 4 (తె. 16).

**బండిబోరెం** బండ్లమీద ధాన్యంతోలటానికిగాని ఎరువు తోలటానికిగాని వాడే జనపనార పట్టా; చూ. బోరెం: వ్యవసాయ వృత్తిపదకోశం (పుటలు 167, 294) (తె. 25).

**బండిముద్ద** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 5-7, 10; తె. 16).

**బండిమొద్దు** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 8, 13; తె. 15).

**బండిలాక** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 15).

**బండిసూల** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 7).

**బత్తి** (హిం.) ఉ. బత్తి. పన్నెపుల్లలు చీల్చేకత్తి (=సిరుకత్తి)ని పదునుపెట్టే సున్నపురాయి; ఒకరకం సాన (కో. 7; రా. 24).

**బత్తిస్‌పేటు** పర్యా. చూ. అడక(పేటు). మెళ్ళో వేసుకొనే ఒకరకం హారంలో బిళ్ళమాదిరి డిజైను; మామూలుగా చీరల అంచుల్లో నేస్తారు. చూ. చిత్రం 155 (తె. 12, 14).

**బదిగుడుదారం** పర్యా. చూ. పూదారం. అచ్చు వడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో, అని వెంబడి దూర్చిన దారం; అచ్చుతికేటప్పుడు, పోగుల వరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల బద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (కో. 4).

**బదులుకుంచె** సరిచేసేటప్పుడు, పడుగు అరుబదునులో ఉండగా, నందు(=రెండు కచ్చుల మధ్యభాగం) సందుకూ రెండేసిసార్లు నిదానంగా కుంచెతో దువ్వటం (కో. 9బి).

**బద్ద** **1.** పర్యా. చూ. ఆకు(2). పంటెకామచుట్టూ వంచి కట్టిన వెదురుబద్ద(లు); పంటె కట్టుబడిలో ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి. చూ. చిత్రం 19 క. 2 (కో. 5-9, 22, 26-29; తె. 13); **2.** పర్యా. చూ. చిట్టె(2). పంటె ఆకుల బిగింపుకువేసే నిలువు బద్ద(లు). చూ. చిత్రం 19 క. 3, 4 (కో. 5, 22, 29, 31); **3.** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3

(కో. 25-32, 35; తె. 18, 20 24, 27, 29, 32, 33); **4.** తొవరరాటి (=ఒకరకం రాటి) చుట్టూ బిగించిన పొడుగుబద్ద(లు); చూ. తొవర (కో. 30); **5.** రూ. దబ్బ(5); పర్యా. చూ. కుంచెలాక. కుంచెకట్టుబడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురు బద్ద(లు); కొన్నిచోట్ల అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (కో. 8, 15, 16, 23, 27-29, 31, 34, 36; తె. 10, 13, 15, 20, 21, 26, 28, 31); **6.** పర్యా. చూ. దండె(3) పన్నె కట్టుబడిలో ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం; ఇటువంటివి పైనా కిందా రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 88 క. 5 (కో. 7, 33; తె. 1); **7.** పర్యా. చూ. గొలుసుబద్ద. డాబీ గొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద(లు); వీటికి కొయ్యపిక్కలు బిగిస్తారు; ఇవి దిండను చుట్టి తిరుగుతూ ఉంటాయి. చూ. చిత్రం 132 త. 2 (కో. 23, 24, 26, 36; తె. 19, 20, 23, 31, 32); **8.** రూ. దబ్బ(9). దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద; కొన్నిచోట్ల కర్ర. చూ. చిత్రం 124.1 (కో. 7); **9.** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుడెక్కలను తొక్కినప్పుడు గొలుసు పిక్కలుగాని దిండు దిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (కో. 6, 7, 10, 23, 25; తె. 18); **10.** పర్యా. కంకబద్ద(2). ఉన్ని ఏకటానికి నరం కట్టిన వెదురుబద్ద; చూ. ఏకుబద్ద. చూ. చిత్రం 31.9 (తె. 3, 11, 26, 28); **11.** పర్యా. చూ. నరబద్ద. ఉన్నిపడుగులో అనిపోగుల్లో దూర్చిన వెదురుబద్ద; పడుగుపోగులు సాపుగా ఉండటానికి, ఇటువంటివి దూరుస్తారు. చూ. చిత్రం 214.4 (తె. 6, 9, 11, 20, 22, 25, 26, 28).

**బద్దదువ్వు** (క్రి.) పడుగేరుకర్ర దగ్గర లాకబద్దకు బిడివేసి పోగులు దువ్వటం (కో. 25).

**బద్దపేటు** పర్యా. చూ. అడక(పేటు). మెళ్ళోవేసుకొనే ఒకరకం హారంలో బిళ్ళమాదిరి డిజైను; మామూలుగా చీర అంచుల్లో నేస్తారు. చూ. చిత్రం 155 (తె. 16).

**బద్దలజల్లెడ** పర్యా. చూ. తడక(2). డాబీకి పైన బిగించిన ఇనపఊచల చట్రం; డాబీకోలలు పక్కలకు జరక్కుండా నిలుపుతుంది; రెండు ఊచల సందులోకి ఒక కోల వస్తుంది. చూ. చిత్రం 132 చ. 3 (కో. 26).

**బద్దలడాబీ** పర్యా. చూ. గొలుసుపిండెర. ఒకరకం డాబీ; సన్నబద్దల గొలుసు; దిండుకు తగిలించింది. చూ. చిత్రం 132 త (కో. 13).

**బద్దలేరు** (క్రి.) పర్యా. చూ. లాకలేరు. పడుగు చేసేటప్పుడు, లాకలమీది పోగులు సర్దటం (కో. 27).

**బద్దిసుంగు** చూ. సుంగుబద్ది (కో. 2).

**బద్దీకాహునర్** తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 17).

**బద్దె** ఉ. బద్ది. **1.** పర్యా. అచ్చుకర, అన్నుబద్దె, ఒరబద్దె(1), కచ్చి(బద్దె), కర, కోతకర, కోతబద్దె, పన్నెబద్దె, బద్దెచెరగు. అచ్చుతుక్కోటానికి, సుమారు జెత్తెడు వెడల్పు నేసి చివర జైనెకు పొడుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తిచేసిన తరవాత అచ్చులో బద్దెకోసి మరొక పడుగుకు అతుకుతారు. చూ. చిత్రాలు 102 క. 2, 144 (కో. 1-3, 5-10, 15, 19, 24, 37; తె. 1, 2, 5, 7, 8, 10-23, 25-33; రా. 1, 7, 9, 10 13 19, 21, 22, 24); **2.** పర్యా. చూ. బిర్రుతాడు. మరమగ్గం నిలువుపట్టెను, మేరువుపలకకు బిగించి సన్నపుల్లతో వడిపెట్టిన దారం; మేరువుపలకను పైకిగాని కిందికిగాని జరుపుకొని దీంతో బిర్రు పెడతారు. చూ. చిత్రం 118.6 (రా. 10); **3.** కమ్మి చివరిభాగం; పేకపోగులు వెయ్యకుండా కొంత వదిలి తరవాత పట్టెమాదిరిగా నేసింది. చూ. కమ్మి(12)(కో. 6); **4.** ఉ. బద్ద. రంగునీళ్ళ అండాలో ఉడకబెట్టటానికి, నూలుండీలు తగిలించిన ఇనపఊచ; దీంతో లడీలు రంగునీళ్ళలోకి దింపి అండా అంచులమీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (కో. 11, 12, 20, 21).

**బద్దెకోయు** (క్రి.) పర్యా. అచ్చుకోయు, అతుకులు కోయు, కచ్చికోయు, కంకోయు. అచ్చులో బద్దెపోగులుగాని జెంతుపోగులుగాని వరసగా కొయ్యటం; అచ్చుతికిన పడుగులో అతుకులు వరసగా రావటానికి అచ్చుపోగుల కొసలు కత్తితో కోస్తారు; మగ్గంమీద నేత అయిపోయిన తరవాత, బద్దెపోగులు కొయ్యటం (కో. 15, 19, 32, 33, 35; తె. 19, 22, 29; రా. 1, 7, 9, 19, 22, 24).

**బద్దెగట్టుచువ్వ** ఉ. -సువ్వ; పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం (=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల ఇనపచువ్వగాని వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 8, 14; రా. 1).

**బద్దెగుచ్చుకర్ర** పర్యా. అచ్చుచివ్వ(1), అల్లులాక(1), కమ్మి(8), గుచ్చుకర్ర, నసిబద్ద, బద్దెవాటుకర్ర. అచ్చుతికిన తరవాత బద్దెలో పోగులు చెదరకుండా దూర్చిన కర్ర; కొన్నిచోట్ల వెదురుబద్దగాని ఇనపకడ్డీగాని దూరుస్తారు; ఇటువంటివి బద్దెలో ఇవతల

ఒకటి, అవతల ఒకటి ఉంటాయి; అల్లుచేనేటప్పుడు, దీన్ని ఊడ్తెగుదులకు తగిలిస్తారు; కొన్నిచోట్ల, గూటాలకు కడతారు. చూ. చిత్రం 102 త (కో. 29).

**బద్దెగుచ్చు(డు)లాక** రూ. బద్దెగుచ్చులలాక; పర్యా. ఎక్కింపుబద్ద, దబ్బ, దోనిగవంకె, దోనుగకోల. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద; చూ. బద్దెచువ్వ. చూ. చిత్రం 124.1 (తె. 17, 31-33; రా. 21).

**బద్దెగుచ్చుపుల్ల** పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం(=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల, ఇనపచువ్వగాని, వెదురుబద్ద గాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (తె. 25).

**బద్దెగుచ్చులలాక** ఉ. బద్దెకుచ్చులలాక; చూ. బద్దెగుచ్చు(డు)లాక (తె. 26, 27).

**బద్దెగుచ్చువ్వ** (< బద్దెగుచ్చు + చువ్వ). పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగం(=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల, ఇనపచువ్వగాని, వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 3, 6, 8, 9; తె. 14–16).

**బద్దెచివ్వతొక్కు** (క్రి.) ఉ. బద్దెసివ-. అచ్చుబద్దెలో అని వెంబడి, కర్ర ఎక్కించటం (కో. 36).

**బద్దెచువ్వ** ఉ. బద్దిసువ్వ, బద్దెసువ్వ; పర్యా. అచ్చుచివ్వ(2), అల్లుచివ్వ, కరుబరసిబిరె, చువ్వ(9), దోనుగపుల్ల, దోనుగసూరె, దోనెసివర, దోనెచివ్వ, దోనెసూక, పడుగుచివ్వ(1), బద్దెగట్టుచువ్వ, బద్దెవాటుచివ్వ, ముల్లుగట్టుసివర, సిగురుపుల్ల, సివర, సివాబండ, సూక(1), సూరె(3). మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగం (=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల, ఇనపచువ్వగాని, వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 8, 14; రా. 1).

**బద్దెచెరగు** ఉ. సెరుగు; పర్యా. చూ. బద్దె(1). అచ్చుతుక్కోటానికి, సుమారు బెత్తెడు వెడల్పు నేసి, చివర జానెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ; ఒకసారి నేత పూర్తిచేసిన తరవాత అచ్చులో బద్దెకోసి మరొక పడుగుకు అతుకుతారు. చూ. చిత్రం 102.2 (కో. 9).

**బద్దెతట్టు** (క్రి.) 1. నేత మొదలుపెట్టేటప్పుడు, రెండుమూడు వేళ్ళ వెడల్పున బద్దెనెయ్యటం (తె.12); 2. బద్దెను చేత్తో తట్టటం (రా. 19బి).

**బద్దెదారం** 1. ఉ. బద్దారం. ?అచ్చుకట్టేటప్పుడు జంత్రం కొయ్యలకు అచ్చుకర్ర బిగించిన తాడు. చూ. చిత్రం 92 (రా. 19బి); 2. పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అని వెంబడి దూర్చిన దారం; అచ్చతికేటప్పుడు పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (రా. 12); 3. ఉ. బద్దిదారం; పర్యా. చూ. పొట్టెతాడు. నేత పడుగులో చివరి పాయకు కట్టిన దారం; పొట్టెకొక దారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రాలు 127.8, 128 చ. 1 (కో. 1).

**బద్దెనేత** ఒక బట్ట నేసిన తరవాత, రెండోబట్ట నెయ్యటానికి బెత్తెడు వెడల్పున మొదట నేసే నేత (రా. 24).

**బద్దెపోగు** 1. పడుగుపోగుకు అతికే అచ్చుపోగు (తె. 16, 17); 2. పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో, అని వెంబడి దూర్చిన దారం; అచ్చతికేటప్పుడు, పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (కో. 29; తె. 29).

**బద్దెలతాడు** పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దె పోగుల్లో, అని వెంబడి దూర్చిన దారం; అచ్చతికేటప్పుడు, పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్దలు కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (కో. 35, 37).

**బద్దెవాట** ఉ. బద్దోట; చూ. బద్దెవాటు (2). (రా. 17).

**బద్దెవాటు** 1. (-చేయు, -వేయు). ఉ. బద్దాటు, బద్దేటు. అచ్చతికిన పడుగుపోగులు ఊడకుండా, నాడెతో పేకపోగులు వేసి బద్దె నెయ్యటం; మామూలుగా, అల్లుచేనేటప్పుడు ఇలా వేస్తారు; కొన్నిచోట్ల, మగ్గంమీద, నేత ప్రారంభంలో వేస్తారు (కో. 1, 3; రా. 2, 4, 11); 2. (-వేయు) ఉ. బద్దేటు, బద్దోటు; రూ. బద్దెవాట. ముందు కొంతనేసి, తరవాత బెత్తెడు పడుగు(=కచ్చి) విడిచి మళ్ళీ నెయ్యటం (కో. 27, 28, 30-32, 34-36).

**బద్దెవాటుకర్ర** ఉ. బద్దోటుకర్ర; పర్యా. చూ. బద్దెగుచ్చుకర్ర. అచ్చతికిన తరవాత బద్దెలో పోగులు చెదరకుండా దూర్చిన సన్నబెత్తం; కొన్నిచోట్ల, వెదురుబద్దగాని, ఇనపకడ్డీగాని దూరుస్తారు; ఇటువంటివి, బద్దెలో ఇవతల ఒకటి, అవతల ఒకటి ఉంటాయి; అల్లుచేనేటప్పుడు, దీన్ని ఊడ్తెగుదులకు తగిలిస్తారు; కొన్నిచోట్ల, గూటాలకు తగిలిస్తారు. చూ. చిత్రం 102 త (కో. 31)

**బద్దెవాటుచివ్వ** ఉ. బద్దేటుసివ; పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగం (=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనె

గాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల, ఇనప చువ్వగాని, వెదురుబద్ద గాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 31).

**బద్దెవాడుచేయు** (క్రి.) నేత మొదలుపెట్టటం (కో. 16).

**బద్దోరిదారం** (-ఎక్కించు) ఉ. బద్దోలిదారం, బద్దోళి దారం; రూ. బరిద్దోడిదారం; పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో, అని వెంబడి దూర్చిన దారం; అచ్చతికేటప్పుడు, పోగుల వరస చెదర కుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్ద లతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (కో. 25, 26, 32).

**బనారస్** 1. ఉ. బెనారస్; పర్యా. గోమి, నాగ ముడి. అంచు డిజైనులో ఏటవాలు వరసల్లో నేత కన బడేట్టు (=మూలనేత) నేసిన భాగం; కొన్నిచోట్ల. కృత్రిమపు పట్టుతో నేస్తారు. చూ. చిత్రం 179(కో.2,7, 23; తె. 1; రా. 7, 10, 11, 14, 15, 24); 2. పర్యా, కేతరి. ఒకరకం కృత్రిమపుపట్టు; అంచులు, కమ్ములు, డిజైన్లు నెయ్యటానికి వాడతారు (తె. 13).

**బనారస్అంచు** పర్యా. గోమిఅంచు, గోమి పేటంచు, బనారస్ బోర్డరు. ఏటవాలు వరసల్లో డిజైను కనబడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 179 (రా. 7).

**బనారస్కమ్మి** ఒకరకం డిజైను కమ్మి; పేటుకమ్మి (కో. 24).

**బనారస్పేటు** ఉ. -పేటి, బనార్స్-; పర్యా. గోమిపేటు. అంచు డిజైనులో ఏటవాలు వరసల్లో నేత కనబడేట్టు (=మూలనేత) నేసిన భాగం; కొన్నిచోట్ల, కృత్రిమపు పట్టుతో నేస్తారు. చూ. చిత్రం 179 (తె. 1; రా. 10, 14, 15).

**బనారస్బోర్డరు** పర్యా. బనారస్అంచు. ఏటవాలు వరసల్లో డిజైను కనబడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 179 (రా. 24).

**బనారస్జేలుకమ్మి** ఒకరకం డిజైనులో నేసినకమ్మి; చూ. బనారస్పేటు (రా. 15).

**బంతి** పర్యా. చూ. కుచ్చు. మరమగ్గంలో, ఒక సొరుగులో నుంచి మరొక సొరుగులోకి చేత్తో తాళ్ళను గుంజే పిడి; మామూలుగా గుడ్డపేలిక-కొన్నిచోట్ల, బద్దెపేలిక-లు కలిపి కట్టింది; కొన్నిచోట్ల, దారపురీలు కడతారు. చూ. చిత్రం 118.21 (కో. 31).

**బంతి(చెక్రం)** పర్యా. చూ. బెండకాయచెక్రం. మరాను ఒగ్గులపట్టెను ఆడించటానికి వీలుగా అమర్చిన పళ్ళచెక్రం; బెండకాయ ఆకారంలో, పొడుగ్గా ఉంటుంది; మరాను కట్టుబడిలో పెద్ద పళ్ళచెక్రానికి కింద అమర్చి ఉండి, మరాను తిరిగినప్పుడు పెద్ద పళ్ళచెక్రంతో బాటు తిరుగుతూ, ఒగ్గులపట్టెను ముందుకు, వెనక్కు ఆడిస్తుంది. చూ. చిత్రం 50.4 (కో. 17, 24).

**బంతితట్టు** విందుల్లో భోజనానికి వచ్చినవాళ్ళు కూర్చోటానికి నేసిన నారపట్టా; పంక్తులు(=బంతులు) తీరి కూర్చోటం కోసం, తక్కువ వెడల్పుపెట్టి, పొడుగ్గా నేస్తారు (తె. 25).

**బంతితాడు** పర్యా. చూ. కుచ్చుతాడు. మర మగ్గంలో నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చు కట్టిన దారం. చూ. చిత్రం 118.22 (కో. 31).

**బంతిపువ్వంచు** బంతిపువ్వు ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు (తె. 15).

**బందరుచీర** నాలుగు కొలుకులు ఒక రంగు, రెండు కొలుకులు నింబోలిరంగు చొప్పున వరసగా నిలువుకు పోగులు అతికి నేసిన చీర; దీనికి పెద్ద అంచు పెడతారు. (తె. 18).

**బందా** (హిం.) ముడి; పన్నెకట్టే జంత్రం బొమ్మకు తాడుతో వేసిన ముడి. చూ. చిత్రం 88 క. 11 (కో. 7).

**బందీరుమాలు** అంచులుపెట్టి నేసిన తలపాగ (తె. 24).

**బందు** 1. పర్యా. చూ. లడీ(1). పెట్టెలో ఉండే నూలుకట్ట; ఏ నెంబరు నూలో అన్ని లడీలు ఒక్కొక్క పెట్టెలో ఉంటాయి; లడిబరువు= $\frac{\text{పదిపౌన్లు}}{\text{నూలునెంబరు}}$ (రా. 3); 2. వైపు; తట్టు; "తలకోల కింద ఆ బందు కొకటి, ఈ బందుకొకటి ఎత్తి ఉంచిన కోలలు..." (తె. 22).

**బందెచీర** ఉ. బంది-; పర్యా. బందెంచుచీర. అంచు రంగు పేకకు కలవకుండా నేసిన ఒకరకం చీర; "నాలు గేల్ల కొకతూరి మారే అంచు" చీర (తె. 24, 25).

**బందెంచు** ?బట్ట చివర, వేరే ఒక రంగుపెట్టి నేసిన అంచు (తె. 23).

**బందెంచుచీర** పర్యా. బందెచీర. అంచురంగు పేకకు కలవకుండా నేసిన ఒకరకం చీర; "నాలుగేల్ల కొక తూరి మారే అంచు"చీర (తె. 23).

**బందెనేత** అంచులు ఒకరంగు, మధ్యభాగం మరొక రంగుపెట్టి నేసిన ఒకరకం నేత; మూడు నాడెలతో నేస్తారు (తె. 24).

**బన్నంచు** 1. పగడాలహారం మాదిరి డిజైనులో నేసిన అంచు. చూ. చిత్రం 212 (కో. 7); 2. బొడ్డ బ్బాసి రుమాలు రంగు(=ఒకరకం ఎరుపు)అంచు (కో.7).

**బయలు** ఉ. బైలు; పర్యా. పడుగుబయలు. పడుగు చాపుకొనే బహిరంగ ప్రదేశం (రా. 11-13, 15, 17, 18, 23).

**బయలుకట్టె** ఉ. -కట్టి; పర్యా. చూ. సరిమట్టు బడితె. సరిగుంజల పై వైపున అడ్డంగా కట్టిన కట్టె. చూ. చిత్రం 65 క. 1 (రా. 15).

**బరక** నవారుమగ్గం అచ్చు(ఇనపది)లో తంతి ఊచ(ల)కు మధ్య చేసిన బెజ్జం; సన్నచుట్టు; ఇటువంటివి, ఊచకు ఒకటి చొప్పున ఉంటాయి. చూ. చిత్రం 324 ట. 6 (రా. 10).

**బరంపురంపట్టు** ఒకరకం పట్టు (కో. 23).

**బరరాటి** ఒకరకం రాటి; పై వైపు కొబ్బరిచిప్ప ఉంటుంది; చూ. రాటి. చూ. చిత్రం 31 (కో. 33).

**బరాటి 1.** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంఖె మొ. వాటికి, దీనికి తగిలించిన చిలప నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (తె. 1, 2; రా. 22-24); **2.** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి. చూ. చిత్రం 34 (రా. 24).

**బరిగగొంగడి** ఉ. బరిగ్గొంగడి. చారలు చారలుగా నేసిన గొంగడి (తె. 22).

**బరిగెగొర్రె** ఉ. బరిగె-, బరిగ్గొర్రె, బర్గి-. ఉడత చారలవంటి చారలు గల గొర్రె; నలుపులో తెల్ల చారలు గలది; నలుపు, ఎరుపు రంగు బొచ్చు గలది (తె. 6, 9, 11, 20, 22, 25).

**బరిద్దొడిదారం** చూ. బద్దోరిదారం (కో. 17).

**బరుగు 1.** పర్యా. చూ. ఏకుపుల్ల(1). ఏకు తయారు చెయ్యటానికి ఉపయోగించే పుల్ల. చూ. చిత్రం 11.3 (తె. 5); **2.** పర్యా. చూ. సులిగె. నేసిన గొంగడి బిగింపుకోసం, ఉన్నిమగ్గం దోనుగగాడిలో పెట్టిన కర్ర; దీన్ని గొంగడికొనలో దూర్చి దోనుగగాడిలో, పండ్లకు బిగిస్తారు (తె. 7).

**బరువుబద్ద** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (తె. 21).

**బరువుసంచి** ఉ. -సంచ; పర్యా. చూ. పేటుమూట. పడుగులో అతికిన పేకపోగులు బిరుగా ఉండటానికి, మగ్గానికి పైన దంటెం మీది నుంచి వేలాడదీసి చివర కట్టిన బరువు; మామూలుగా, ఇసకమూట; కొన్ని చోట్ల, రాళ్ళు; మగ్గంమీద, ఎత్తుగా గిలకలు అమర్చి, పేటుదారాలు వాటికి తగిలించి, చివర బరువులు కడతారు. చూ. చిత్రం 133.1 (కో. 25).

**బర్జైకెంపు** బాగా ఎర్రటి కెంపు రంగు (కో. 8).

**బర్ని** పర్యా. మర్తుమాన్. రంగులజాడీ; కొన్ని రంగులు, ద్రావకాలు జాడీల్లో పోసి అమ్ముతారు (తె. 23).

**బర్నెకప్పు** పర్యా. చూ. చిప్ప(1). రాటి పై బద్దలను బిగించి, వాటిమధ్య, బోర్లించి కట్టిన కొయ్య బరిణెమూత; మామూలుగా, కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల, కర్రచిప్పగాని, రేకుమూతగాని వాడతారు; ఇది రాటిసూలం మీద అనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (కో. 36).

**బర్సు** (విణ.) గరుకుగా ఉండేది; పత్తిరాట్నం కోలకు చుట్టూ గాట్లుపెట్టి వడ్రంగి గరుకుగా చేస్తాడు (తె. 14).

**బలపట్టెగూటం** పర్యా. తట్టుగూటం. ఉన్నిమగ్గం తాడు బిగింపుకు, అడ్డదారి పక్కన, నేలలో పాతిన గూటం (తె. 28).

**బలపాలంచు** వరసగా, కడ్డీల మాదిరిగా నేసిన అంచు; కొన్నిచోట్ల, నలుపులో మూడు, నాలుగు పోగుల కడ్డీలు పడేట్టు నేస్తారు. చూ. చిత్రం 213 (కో. 3, 7).

**బలపాలంచుకమ్మి** పర్యా. జాటరుకమ్మి. ఒకరకం చీరకమ్మి; 4-4-2-2-1-1-2 పోగుల చొప్పున నలుపు, పట్టు రంగుల కొలుకులు వరసగాపెట్టి, తరవాత నాలుగేసి కొలుకులు తెలుపు, నలుపు పోగులుపెట్టి నేస్తారు; మొత్తం, ఎనిమిది గీరలు వస్తాయి (కో. 3).

**బలిమేయు** (క్రి.) పట్టుపురుగులు, బలిసేట్టు మేత మెయ్యటం (తె. 7).

**బలువుంగరం** (< బలువు + ఉంగరం) పర్యా. చూ. చేకుబొందు. చేడుకర్రల బిగింపుకు, దారాలకు వేసే లోహపుచుట్టు; ఇనపదిగాని, ఇత్తడిదిగాని. చూ. చిత్రం 125 క. 3 (తె. 25).

**బలువుతాడు** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్ట మీద, చేడుకర్రలను అడ్డంగా బిరుపెట్టే పొడుగు దారం; దీని కొనలు, చేడుబొందులు-కొన్నిచోట్ల, కర్రలు-రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (తె. 25).

**బలువునూలు** బరువుగా ఉండే నూలు (తె. 11).

**బల్ల 1.** పర్యా. చూ. పీట(2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (కో. 27, 31, 32. 34-36); **2.** ఉ. బల; పర్యా. చూ. చిట్టె(2). పంఖెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రం 19 క. 3, 4 (కో. 3, 4, 6, 24, 26, 28, 37; రా. 12, 14); **3.** పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్య (=ఆసుకు బిగించిన నిలువుపుల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె(లు); ఇటువంటివి, మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (కో. 25-27, 29-35); **4.** పర్యా. చూ.

లక్కాకు(2). డబ్బారాట్నం చెక్రం బిగింపుకు, ఇరుసుకు వేసిన కొయ్యబిళ్ళు; ఇటువంటివి రెండుంటాయి; చెక్రం పక్కలకు జరగకుండా ఆపుతాయి. చూ. చిత్రం 41 త. 1 (కో. 6); **5.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేత నేసేటప్పుడు, దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118.9 (తె. 13, 14).

**బల్లచెక్క** పర్యా. చూ. పావుచెక్క. నేత నేసేటప్పుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు, కాలితో తొక్కే కొయ్యచెక్క; ఇటువంటివి, మామూలుగా రెండుంటాయి; కొన్నిచోట్ల, అచ్చుకు రెండు చొప్పున అదనంగా ఉంటాయి. చూ. చిత్రం 121 క. 1 (కో. 12).

**బల్లెమంచు** పైన నాలుగు గీరలు, నగానికి కింద రెండు గీరలు, తరవాత రెండు వరసల్లో జంటగీరలు పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 214 (తె. 31).

**బవానిగిన్నె** ఒకరకం ఇత్తడిపాత్ర; బగోణి; దీంట్లో గంజి పోసుకొంటారు (తె. 24).

**బహద్దూరుపొప్పిళిచీర** ఒకరకం గడి చీర; నాలుగు కొలుకుల రంగుపోగుల మధ్య ఒక కొలికి, ఏదైనా రంగుపోగుగాని, నలుపుగాని నిలువు, అడ్డం వచ్చేట్టు నేస్తారు (రా. 17).

**బళె** **1.** ఉ. బళి. నూలులెక్క: లడీలో పదోవంతు నూలు (రా. 16); **2.** లడీలో డెబ్బయ్యోవంతు నూలు (రా. 24); **3.** పర్యా. చూ. నీలం. వయిలెటు, సిరా రంగులు కలిసిన రంగు; నీలం; blue; గార్నెట్ (ఎ.) బి. ఒ. తో తయారుచేస్తారు. చూ. చిత్రం 288 (రా. 15).

**బళ్ళారికమ్మి** ఉ. బళ్లారి–. ధోవతులకు నేసే ఒక రకం కమ్మి (తె. 14).

**బాజు** తివాసీమగ్గం కట్టుబడికి నేలలో పాతిన పొడుగు కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 320.2 (తె. 17).

**బాజుబందంచు** బాజుబందు(=ఒకరకం దండకడియం) ఆకారంలో వంకీలుగా డిజైను పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 215 (తె. 14).

**బాజుమొల** డాబీకోలల బిగింపుకోసం అడ్డంగా వేసిన ఇనపఊచ(లు); ఇవి కోలలు గాడితప్పకుండా ఉంచుతాయి. చూ. చిత్రం 132 చ (తె. 22, 23).

**బాటంచు** బెత్తెడు వెడల్పున, రంగులో నేసిన అంచు (తె. 4).

**బాటరుకమ్మి** పర్యా. బలపాలంచుకమ్మి. ఒకరకం చీరకమ్మి; 4-4-2-2-1-1-2 పోగుల చొప్పున నలుపు, పట్టు రంగుల కొలుకులు వరసగా పెట్టి, తరవాత నాలుగేసి కొలుకులు తెలుపు, నలుపు పోగులు పెట్టి నేస్తారు; మొత్తం, ఎనిమిది గీరలు వస్తాయి (కో. 3).

**బాదరంచు** **1.** ఉ. బాటరంచు, బార్డంచు. నాలుగయిదు రంగు పోగులు-పచ్చ, తెల్ల మొ.వి. వరసగా గీరలు పడేట్టు నేసిన అంచు (కో. 7, 9బి, 10; తె. 25; రా. 18, 19ఎ); **2.** మూడు, నాలుగు వేళ్ళ వెడల్పున నేసిన మామూలంచు (కో. 9బి; తె. 4).

**బాణం** (-తీర్పు) పర్యా. చూ. కన్ను. కమ్మి నేతలో, అందానికి, పడుగులో దూర్చిన రంగుదారం; సుమారు రెండంగుళాల పొడుగుది; మామూలుగా, ఎర్రదారం పెడతారు; కొన్నిచోట్ల, నలుపు, తెలుపు దారాలు పెడతారు. చూ. చిత్రం 270 (రా. 19).

**బాణా** ఒకరకం కృత్రిమపుపట్టు; పోగు గరుసుగా నిగనిగా మెరుస్తూ ఉంటుంది; అంచులనేతకు వాడతారు (తె. 23).

**బాణాసిల్కు** ఒకరకం కృత్రిమపుపట్టు; పోగు గరుసుగా నిగనిగా మెరుస్తూ ఉంటుంది; అంచుల నేతకు వాడతారు (తె. 18, 20, 24).

**బాండువ** పర్యా. చూ. కుండ(1). ఒకరకం మట్టి పాత్ర; భాండం; మామూలుగా పొయ్యిమీద ఎసరు పెట్టటానికి గంజి పోసుకోటానికి వాడేది (తె. 5).

**బాతుచెట్టు** అంచులో, బాతూచెట్టూ పడేట్టు నేసిన డిజైను (రా. 8).

**బాతుపేటు** చీర అంచులో బాతు నమూనాలు నేసిన డిజైను; డాబీమగ్గంమీద నేస్తారు. చూ. చిత్రం 216 (తె. 21).

**బాతుబేలు** బాతుబొమ్మలు వరసగా పడేట్టు నేసిన డిజైను; పట్టునేతలో వాడుక (తె. 21).

**బాతుబోర్డరు** పర్యా. బాతులంచు. బాతు ఆకారంలో డిజైన్లు నేసిన చీర అంచు. చూ. చిత్రం 216 (రా. 24).

**బాతులంచు** పర్యా. బాతుబోర్డరు. బాతు ఆకారంలో డిజైన్లు నేసిన చీర అంచు. చూ. చిత్రం 216 (తె. 12, 14).

**బాతూకమలంపేటు** అంచులో బాతు, తామర పువ్వు నేసిన డిజైను (రా. 8).

**బాదం** ఒకరకం లేతనీలంరంగు. (కో. 24).

**బాదంకనుము** ఒకరకం అంచు (=బాదామంచు) పెట్టి నేసిన రవికెలగుడ్డ (తె. 24).

**బాదంకాయ** చిటికెనేతలో నేసే లింగాలమంటపం డిజైనులో మధ్య వచ్చిన పెద్దచదరం; చూ. లింగాల మండపం. చూ. చిత్రం 258 (తె. 10).

**బాదంకాయలచీర** ఒకరకం నేత చీర (తె. 10).

**బాదంకాయలు** నేతలో, బాదంకాయల నమూనాలో నేసిన డిజైను (తె. 10).

**బాదామంచు** ఒకరకం(=?బాదామిరంగు)లో నేసిన అంచు (తె. 11).

**బాదామి** **1.** తమలపాకుల ఆకారంలో డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 217 (తె. 24); **2.** ఒకరకం గోధుమరంగు; బిస్కట్టురంగు. చూ. చిత్రం 288 (కో. 2; రా. 7).

**బాదు** పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (తె. 4).

**బాన** **1.** పర్యా. చూ. గంజిబాన. ఒకరకం మట్టి పాత్ర; దీంట్లో గంజి పోసుకొంటారు (కో. 13; తె. 19; రా. 7); **2.** చింతఅంబలి కాచే కుండ (తె. 25); **3.** నూలులడీలు రంగునీళ్ళలో ఉడక బెట్టే పాత్ర; రాగిది; కొన్నిచోట్ల, రేకుది (కో. 12).

**బానెపోగు** పర్యా. సులప. గొంగడినేతలో, పొడుగ్గా ఒక పక్కన వచ్చిన తెల్లదారం (తె. 3).

**బాపదారం** (< హిం. బాఫ్తా-) లావుదారం; ఆరో నెంబరు నూలుపోగులు మూడేసి కలిపి పురిబెట్టి, తివాసీ నేతకు వాడే అచ్చుకర్రలకు అల్లుతారు (తె. 17).

**బాబాఅంచు** ఒకరకం పెద్ద అంచు (రా. 1).

**బాబిను** మిల్లులో రేషం చుట్టే పెద్ద కొయ్యరీలు; bobbin; దారపుబండి ఆకారంలో ఉంటుంది; పెద్దది (రా. 14).

**బాంగోలకనుము** (< బాంబుగోల-) ఒకరకం రవికెలగుడ్డ (తె. 24).

**బాంబరుచీర** ఏడు కొలుకులు నలుపు, ఒక కొలికి ఇటాలి చొప్పున రెండురంగుల నూలు పడుగుకు పెట్టి నేసిన చీర; అంచులు విడిచి లోపలి పోగులు తిప్పి నేస్తారు (రా. 24).

**బాంబుగడి** ఒకరకం నేతగడి (కో. 20).

**బాంబుగడిచీర** **1.** నల్లపడుగులో, రెండువేళ్ళ వెడల్పు పట్టెలు పడేట్టు నేసిన గళ్ళచీర (కో. 7); **2.** వేలెడు వెడల్పు నేసిన గడిచీర (కో. 10); **3.** ఒకరకం పొడుగుగళ్ళచీర; నలుపు, పచ్చ, తెలుపు రంగుల్లో రెండేసి వేళ్ళ వెడల్పున నేస్తారు (కో. 11, 16, 15, 21; తె. 15).

**బాంబుగోల** అంచులో నేసే ఒకరకం నేత. చూ. చిత్రం 219 (తె. 24).

**బాంబుగోలనేత** నిలువు, అడ్డం ఎనిమిదేసి రంగుల పోగులు పెట్టి నేసిన నేత (తె. 24).

**బాంబుచీర** 6-1-5-2-2-2-1 కొలుకులు వరసగా, ఒకటి విడిచి ఒకటి, ఏదో ఒక రంగు-తెలుపు చొప్పున వచ్చేట్టు నేసిన చీర; డిజైనులో గడికి, గడికి మధ్య 12 కొలుకుల ఎడం ఉంటుంది (తె. 13).

**బార** (-తీయు, -పీకు, -పోయు) నూలు వడికేటప్పుడు, కదురునుంచి, చేతి పొడుగునా ఒకసారి తీసిన దారం (కో. 4-7, 10, 22, 23, 33, 34, 36, 37. తె. 5, 11, 13, 14; రా. 11).

**బారకట్టుకాయలచీర** ఒకరకం నేతచీర (రా. 19ఎ).

**బారపడ్డ** (< బారపు+అడ్డ) పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (రా. 21).

**బారపీకుడు** ఉన్నిదారం వడికేటప్పుడు, ఏకుతో ఒకసారి (బారెడు) దారం తియ్యటం (తె. 22).

**బారరట్లు** (బహు) ?చెంగావిరంగు అద్దకంలో ఉపయోగించే ఒకరకం పనిముట్టు(లు) (తె. 5).

**బారాపలక** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు ఇది మగ్గంపందిరిమీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (రా. 10).

**బారు** **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(1). పత్తి పట్టేటప్పుడు రాట్నం కదలకుండా తొక్కిపట్టటానికి అమర్చిన పట్టె. చూ. చిత్రం 1.4 (తె. 4); **2.** పర్యా. చూ. ఆసుజంగ. ఆసుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడు వరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (తె. 12, 14); **3.** పర్యా. సాగు(2). పడుగేరేటప్పుడు, సరిచేసేప్పుడు, అల్లుచేసేటప్పుడు చాపిన పడుగు; ఆరుబయట రెండు ఊద్దెలకు మధ్యగాని ఒక ఊద్దెకు, సరిగుంజ(ల)కు మధ్యగాని చాపుతారు; నేతనేసేటప్పుడు దోనెకు, మలగట్టుకర్ర(ల)కు మధ్య చాపుతారు (కో. 5); **4.** పర్యా. చూ. నేతసాగు(1). మగ్గానికి అమర్చి నేతబయలులో చాపిన పడుగునూలు. చూ. చిత్రం 127.17 (కో. 4).

**బారుకడ్డీ** నూలులడీలు రంగునీళ్ళలో ఉడకబెట్టేటప్పుడు లడీలు తిప్పే ఇనపకడ్డీ; దీంతోకూడా లడీలు పిండుతారు (కో. 12).

**బారుకుంచె** (-లాగు) పడుగుమీద, ఒకవైపునుంచి మరొకవైపుకు కుంచె ఆపకుండా దువ్వటం; సరిచేసేటప్పుడు, మొదట కొంతసేపు ఇలా దువ్వుతారు (కో. 5, 13).

**బారుదుప్పటి** రెండు దుప్పట్లు; ఒకే బద్దెకు కలిపి నేసినవి (కో. 4).

**బారుదూలం** నేతబయలులో గోడలమీద అమర్చిన పొడుగుకొయ్య; కొన్నిచోట్ల అచ్చును వేలాడదీసే మగ్గం పైతాళ్ళు దీనికి కడతారు (రా. 1).

**బారుపట్టె** ఉ. బారపట్టె. 1. పర్యా. చూ. తొక్కుడుపీట(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 9, 11; తె. 13, 16); 2. పర్యా. చూ. పీట(2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం15.1(రా.7); 3. పర్యా.చూ.మేరువుపటక.మర మగ్గం చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డ పట్టె; కొన్నిచోట్ల దీనికి చివర రేకులు వేస్తారు; కొన్ని చోట్ల దీనికి కుచ్చుచెంపతాళ్ళు కడతారు; నేత నేసేటప్పుడు ఇది మగ్గంపందిరిమీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (రా. 7-9).

**బారుబద్ద** పడుగులో ఒకవైపునుంచి మరొక వైపుకు వరసగా ఎక్కించిన అడ్డబద్ద(లు); చూ. లాక (కో. 15).

**బారు(మాను)** పర్యా.చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలులడీలు పిండటానికి నేలలోపాతిన పొడుగు రాట; మామూలుగా కొయ్యది; కొన్నిచోట్ల ఇనపది; మామూలుగా దీనికి శిలువ మాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిల్లిచేసి, దాంట్లో గునపం దూర్చి, లడీలు తగిలించి పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (కో. 5, 7; రా. 8, 11, 13).

**బారుమొద్దు** పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట; మామూలుగా, దీనికి శిలువ మాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల, గుంజకు చిన్న చిల్లిచేసి, దాంట్లో గునపం దూర్చి, లడీలు తగిలించి, పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (రా. 24).

**బార్డరుకండువా** ఉ. -కాండువా. అంచులు పెట్టి నేసిన కండువా (కో. 34).

**బాలకట్టె** నూలుచిలపలు ఆరవేసే వెదురుబొంగు; పొడుగుది (తె. 11).

**బాలగూటం** రూ. బాలుగూటం; పర్యా. చూ. తలగూటం. ఉన్ని మగ్గానికి వేసిన పడుగు బిగింపుకోసం, చివర నేలలో పాతిన కొయ్య; కొన్నిచోట్ల రాయి; మగ్గంతాడు దీనికి తగిలించి బిగిస్తారు. చూ. చిత్రం 315 క. 18 (తె. 22).

**బాలనాగమ్మచీర** నీలి, ఊదా రంగుల్లో నేసిన చీర (తె. 25).

**బాలనాగమ్మరంగు** ఒకరకం నీలంరంగు; మెజంటా (తె. 27).

**బాలుగూటం** చూ. బాలగూటం (తె. 20).

**బాలె** ఒకరకం పాత్ర; దీంట్లో గంజి పోసుకొంటారు (రా. 22).

**బాలెపట్టెచీర** నిలువుకు ఆకుపచ్చ-ఎరుపుగాని, నీలం-ఎరుపుగాని అతికి, పేకకు ఏదో ఒక రంగు నూలు పెట్టి నేసిన చీర (రా. 18).

**బాల్చి** ఉ. బాల్చా; పర్యా. బకెటు. ఒకరకం రేకు పాత్ర; నీళ్ళు తోడుకొనేది; కొన్నిచోట్ల దీంట్లో గంజి పోసుకొంటారు; కొన్నిచోట్ల రంగులు కలుపుతారు (కో. 16, 21).

**బాల్దారం** రెండు పోగులు కలిపి పురిపెట్టిన దారం; పురిదారం; డోరియా తాన్లు నెయ్యటానికి వాడతారు (తె. 15).

**బాల్బేరింగు** (< ball-bearing) ఉ. బేల్ బారింగు; పర్యా. చూ. గుళ్ళబేరింగు, బేరింగు. మరాసు ఇరుసు సులువుగా తిరగటానికి ఉక్కుగుండ్లు అమర్చిన పనిముట్టు (కో. 12ఎ, 15).

**బాల్సుచెక్రం** మరాసు ఇరుసు సులువుగా తిరగటానికి చిన్న ఉక్కుగుండ్లు అమర్చి బిగించిన చెక్రం; కొన్నిచోట్ల, పెద్దపళ్ళచెక్రానికి బదులు అమరుస్తారు. (రా. 2).

**బాషకం** (-తీర్పు) బాసిగం (=పెళ్ళికూతురుకు, పెళ్ళికొడుక్కు నుదుటకట్టే బిళ్ళ) మాదిరి నేత డిజైను (కో. 4).

**బాసిగంకట్టు** ఉ. బాసికంకట్టు; రూ. బాసెపుకట్టు; పర్యా. తలకట్టు(2). దారబంధం, నాగబంధం. పడుగు దువ్వేకుంచె పిడికివేసిన తాడు మెలిక; ఇది బాసిగంకట్టు మాదిరిగా ఉంటుంది. చూ. చిత్రం 76 క. 2 (కో. 9; తె. 11, 16, 17).

**బాసిగప్పేటు** చూ. బాసింగంపేటు (తె. 15).

**బాసింగమంచు** ఉ. బాసికంఅంచు. బాసిగం(=పెళ్ళి సమయంలో వధూవరులకునుదుటకట్టే ఒకరకంబొమ్మ) ఆకారంలో డిజైన్లు నేసిన అంచు. చూ. చిత్రం 219 (తె. 14-16, 31, 32).

**బాసింగంపూవు** బాసిగం (=పెళ్ళి సమయంలో వధూవరులకు నుదుటకట్టే ఒకరకం బొమ్మ) ఆకారంలో డిజైన్లు నేసిన అంచు. చూ. చిత్రం 219 (తె. 28).

**బాసింగంపేటు** రూ. బాసింగప్పేటు, బాసింగాల పేటు. బాసిగం(=పెళ్ళి సమయంలో, వధూవరులకు

నుదుట కట్టే ఒకరకం బొమ్మ) ఆకారంలో అంచులో వరసగా నేసిన డిజైను. చూ. చిత్రం 219 (తె. 14).

**బాసింగాలచీర** అంచుల మధ్యభాగంలో, బాసింగాల ఆకారంలో డిజైన్లు పడేట్టు నేసిన చీర (తె. 11).

**బాసింగాలపేటు** చూ. బాసింగంపేటు (తె. 16).

**బాసుకర్ర** పర్యా. చూ. పిడుపుకర్ర. రంగు అద్దిన నూలులడీలు గుంజకు తగిలించి పిండే కర్ర; గుండ్రటిది; దీన్ని లడీలో దూర్చి మెలిపెడతారు; దీంతో పోగులు విదిలిస్తారు; కొన్ని చోట్ల, రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. చూ. చిత్రం 282 క. 5 (కో. 12).

**బాసెపుకట్టు** చూ. బాసిగంకట్టు (కో. 9బి).

**బాళేపట్టిచీర** రెండురంగుల నూలు నిలువుకు అతికి, ఒకరంగు నూలు పేకకు పెట్టి నేసిన చీర (రా. 14).

**బిక్కొయ్య** (<బిగి+కొయ్య). పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతిన కొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజతారు; కొన్నిచోట్ల నేతమోకు పెడకోలకు కట్టి, దీనికి పనుగు మెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (కో. 22).

**బిక్కొయ్యపడు** (క్రి.) పర్యా. చూ. వారవచ్చు. నేతనేసేటప్పుడు పేకపోగు సరిగా పడక, బట్టకు ఒక వైపున ఎక్కువ, మరొక వైపున తక్కువ రావటం (కో. 30).

**బిగి** పర్యా. చూ. బిర్రు(3). బిగువు; గట్టిదనం (రా. 16).

**బిగిచెక్క** పర్యా. చూ. చిట్టె(2). పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రం 19 క. 3, 4 (కో. 26).

**బిగిదారం 1.** పర్యా. చూ. గుమ్మిదారం. రాటి ఆకులు పైవీ కిందివీ కలిపి కట్టిన దారం. చూ. చిత్రం 31 వ. 4 (కో. 34); **2.** పర్యా. చూ. బిర్రుతాడు. మరమగ్గం నిలువుపట్టెను మేరువు పలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టిన దారం; మేరువుపలకను పైకిగాని కిందికిగాని జరుపుకొని దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118.6 (రా. 16).

**బిగిపుల్ల** పర్యా. చూ. బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువు పలక బిగించి, తాడు వడిపెట్టే పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (రా. 16).

**బిగింపుచిల్ల** ఉ. -సిల్ల; పర్యా. చూ. వడిబిళ్ళ(3). అచ్చుకట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి, అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; ఒక వైపు వెడల్పుగాను, ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత, దీంతో వడిదారాలు దిద్దుతారు. ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకుచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (కో. 6).

**బిగుకడీ** డాబీకోలల బిగింపుకు వేసిన ఇనప ఊచ. చూ. చిత్రం 132 చ (రా. 3).

**బిగుగర్ర** ఉ. బిగ్గర్ర; పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతి వైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 15, 22).

**బిగుగుంజ** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (రా. 18).

**బిగుగొయ్య** ఉ. బిగ్గొయ్య; పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 25, 27, 30, 31).

**బిగుచిట్టె** పర్యా. చూ. బిర్రుచిట్టె(2). పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 4 (తె. 5, 30).

**బిగుచుట్టు** కదురుకడ్డీకి దంటుఊచ బిర్రుగా పట్టటానికి చుట్టిన దారం (తె. 22).

**బిగుచెక్క** పర్యా. చూ. వడిబిళ్ళ(3). అచ్చుకట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; ఒకవైపు వెడల్పుగాను ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకుచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (తె. 15).

**బిగుతాడు 1.** పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నంఆకులకు చుట్టిన తాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు పేటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (కో. 30; తె. 5); **2.** ఉ. బిగుదాడు; పర్యా. చూ. జంత్రపుతాడు. అచ్చుకట్టే జంత్రం కొయ్యకు కట్టిన దారం; దీంతో అచ్చుచువ్వ బిగిస్తారు. చూ. చిత్రం 91 క. 5 (కో. 26, 27); **3.** పర్యా. గుది(7), గుదితాడు, చెముడుగుది, చేడుపలుపు(3), ములుగట్టుపూజు. చేడుకర్రలకు మధ్యన రెంటినీ బిగించే పైతాడు; ఇటువంటివి రెండుటాయి. చూ. చూ. చిత్రం 125క.4 (తె.5,18); **4.** తివాసీమగ్గం దోనెకు, టంగుకు వేసి బిగించిన తాడు. చూ. చిత్రం 320.9 (తె. 10).

**బిగుదబ్బ** పర్యా. చూ. ఎత్తుపుల్ల(2). అచ్చుతీసే టప్పుడు అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండుపుల్లలకు తాడుగట్టి మడతమంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (రా. 6).

**బిగుదారం** పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టిన తాడు; ఒకవైపు ఆకునుంచి రెండో వైపు ఆకుకు పేటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (తె. 25).

**బిగుబద్ద 1.** పర్యా. చూ. కుంచెలాక. కుంచె కట్టుబడిలో పురి బిగింపుకు, రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (తె. 15); **2.** పర్యా. చూ. తన్ను(డు)బద్ద(2). దోనెముందర, నేసిన గుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా పైవైపు బిర్రుపెట్టే ఒకరకం చేడుబద్ద(=వెదురుది); మామూలుగా చిన్న నెరువు(=తక్కువ వెడల్పు)బట్టల నేతకు వాడతారు; కొన్నిచోట్ల చేడుగర్రలకు మారుగాగాని తోడుగాగాని వాడతారు. చూ. చిత్రం 125 గ (తె. 15).

**బిగుబిళ్ళ** రూ. బిళ్ళబిగు; పర్యా. చూ. వడిబిళ్ళ (3). అచ్చుకట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; ఒకవైపు వెడల్పుగాను ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత, దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకిచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (కో. 18, 21).

**బిగు(లు)** పర్యా. చూ. వడిబిళ్ళ(3). అచ్చుకట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క(లు); ఒకవైపు వెడల్పుగాను ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకిచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (తె. 21))

**బిగులేయు** (<బిగులువేయు) (క్రి.) ?కుంచెకట్టుబడిలో అడ్డబద్దలు బిగించటం (తె. 5),

**బిగువుకట్టు** పర్యా. చూ. ముక్కుకట్టు. పంజెకు కిందివైపున ఆకుల చివర్లను కామకు కలిపివేసిన కట్టు; చూ. ముక్కుతాడు. చూ. చిత్రం 19 క. 7 (కో. 6).

**బిగువుకర్ర** పర్యా. చూ. అచ్చుకర్ర(1). అచ్చులో వడిదారం కట్టిన కర్ర; అచ్చుకట్టేటప్పుడు దీన్ని జంతంకొయ్యలకు బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; బోనచ్చుకు ఎనిమిది ఉంటాయి. చూ. చిత్రాలు 91 క. 7, 100.1, 121 క. 8 (కో. 13).

**బిగువుతాడు** పర్యా. చూ. ఊడైతాడు(1). ఊడైను నిలబెట్టి, కింది గూటానికి బిగించే తాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (రా. 16).

**బిగు(వు)బద్ద 1.** పర్యా. చూ. వడిబిళ్ళ(3). అచ్చుకట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; ఒకవైపు వెడల్పుగాను ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి, ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకిచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (కో.) 11, 15, 19, 20; తె. 15); **2.** పర్యా. చూ. అడ్డపట్టె(14). మరమగ్గం చట్రంలో మేగువుపలకకు కిందగా నిలువు పట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (కో. 14; తె. 13).

**బిగుసీల** పర్యా. చూ. చిరతలి. ఆసుపీటల బిగింపుకు వేసే కొయ్యపేడు; నేత పొడుగును బట్టి ఆసుపీటలను దగ్గరకిగాని దూరానికిగాని జరుపుకొని పేడు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 8 (తె. 19).

**బిగ్గుపేటు** రెండురంగుల్లో చిన్న బిళ్ళలు పడేట్టు నేసిన డిజైను; జరిపోగులు, పట్టుపోగులుపెట్టి నేస్తారు (కో. 24).

**బింగిరొర్రె** బుంగచెవులుగల(=చెవులు బింగిగాఉన్న) గొర్రె (తె. 20, 22, 25).

**బింగిరీ** ఉ. బింగిరి, బింగ్రి; పర్యా. చూ. పికాసి. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్యగిలక; మామూలుగా మిషనుదారం చుట్టే కొయ్యరీలు; ఇటువంటివి ఉడతతలకు బదులు రెండుసొరుగుల్లోనూ రెండు అమరుస్తారు. చూ. చిత్రం 120 (తె. 6, 23-27, 30, 33; రా. 24).

**బింగిరీతాడు** ఉ. బింగిరి-; పర్యా. చూ. పికాసితాడు. మగ్గం పికాసికీ బొమ్మకూ కట్టినదారం; చూ. ఉడతతాడు (తె. 23-27, 30, 33).

**బింగిరిదారం** పర్యా. చూ. పికాసితాడు. మగ్గం పికాసికీ బొమ్మకూ కట్టిన దారం; చూ. ఉడతతాడు (రా. 24).

**బింగిసిరాయి** పర్యా. చూ. నవలతుగుండు. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా

దారంకట్టి దండె అవతలికి వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల ఇనపగుండుగాని చిన్నచెక్రం గాని కడతారు. చూ. చిత్రం 126.3 (రా. 24).

**బిజిలి** ఒకరకం కృత్రిమపుపట్టు (తె. 19, 31).

**బిట్టుపుల్ల** పర్యా. చూ. ఎత్తుపుల్ల(2). అచ్చుతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల; రెండుపుల్లలకు తాడుగట్టి, మడతమంచంకోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (కో. 30).

**బిట్టేయు** (<బిట్టుపేయు క్రి.) అచ్చుతికేటప్పుడు, అచ్చును నిలబెట్టిన ఎత్తుపుల్లలు తాడుతో బిగించటం (కో. 7).

**బిడి** పర్యా. మెలుగు(డు). మెలి; వడి (కో. 22-24; తె. 13).

**బిడికర్ర** ఉ. బిడిగర్ర; పర్యా. కుంచెకర్ర(1) బిర్రుకట్టె(1). ఊడైతాడు బిర్రుపెట్టే పొడుగుకర్ర; ఊడైకూ గూటానికీ మధ్య తాడు మెలిదిప్పి నేలమీద అనుస్తారు. చూ. చిత్రం 63 చ. 2 (కో. 27-29, 32-36).

**బిడితాడు** పర్యా. చూ. బిర్రుతాడు(2). మరమగ్గం నిలువుపట్టెను మేరువుపలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టిన దారం; మేరువుపలకను పైకిగాని కిందికిగాని జరుపుకొని దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 17, 23, 24, 31).

**బిడిపుల్ల** పర్యా. చూ. బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి తాడు వడిపెట్టేపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (కో. 23, 24).

**బిడిబద్ద** **1.** పర్యా. చూ. చిట్టె(2). పంజె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రం 19.3, 4 (కో. 31); **2.** పర్యా. బిడిలాక. ఊడైతాడు బిర్రుపెట్టే పొడుగుబద్ద; బిడికర్రకు మారుగా వాడతారు. (కో. 24); **3.** పర్యా. చూ. బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి. తాడు వడిపెట్టే పుల్ల: ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (తె. 13).

**బిడిలాక** ఉ. బిల్లాక; పర్యా. బిడిబద్ద(2). ఊడైతాడు బిర్రుపెట్టే పొడుగుబద్ద; బిడికర్రకు మారుగా వాడతారు; చూ. బిడికర్ర (కో. 25).

**బిడివేయు** ఉ. బిడేయు. **1.** బిర్రుపెట్టటం; ఊడైతాడును పొడుగుబద్దతో బిర్రుపెడతారు (కో. 26, 32, 36); **2.** పర్యా. చూ. మల(క)వేయు. మగ్గం మోకు, షేతిగూటానికి ముడివేస్తారు (కో. 34, 35).

**బిడెత్తు** (క్రి.) ?అచ్చుగుదులు మార్చి హెచ్చుతగ్గులు సంచేసుకోటం (కో. 25).

**బింద** ఉ. బెండ; పర్యా. బిళ్ళ(17). ఉన్నికదురుకు దారంచుట్టుకొనే వైపు ఉండే గుండ్రటి కొయ్య బిళ్ళ; మామూలుగా పల్చటిది; కొన్నిచోట్ల ఆడవాళ్ళ వడకే కదురుది-మందపుది. చూ. చిత్రం 311 చ. 3 (తె. 25-28).

**బియ్యపుగంజి** రూ. బియ్యాంగంజి; పర్యా. వరిగంజి. బియ్యం ఉడకబెట్టి వార్చిన నీళ్ళు; దీన్ని పడుగుకు పెడతారు (కో. 4, 12-14, 18, 20, 21; రా. 3, 5, 10).

**బియ్యంగంజి** ఉ. బీము-; చూ. బియ్యపుగంజి (కో. 11, 16, 17, 19; తె. 12; రా. 2, 4, 8, 24).

**బిరచిరత** పర్యా. చూ. బిర్రుచిట్టె(2). పంజె ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో కిందిది. చూ. చిత్రం 19 క. 4 (తె. 33).

**బిరుచెక్క** పర్యా. చూ. వడిబిళ్ళ(3). అచ్చుకట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చువదులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; ఒకవైపు వెడల్పుగాను ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత, దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకి చెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (రా. 15).

**బిరుతాడు** **1.** పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నంఆకులకు చుట్టినతాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు పేటవాలుగా అల్లుతారు; చూ. చిత్రం 15.5 (తె. 31); **2.** పర్యా. చూ. గుమ్మి దారం. రాటి ఆకులు పైవీ కిందివీ కలిపికట్టిన దారం. చూ. చిత్రం 31 ప. 4 (తె. 31); **3.** పర్యా. గిరకతాడు(2), చెంటితాడు, మొలతాడు(2). అడ్డగుమ్మి ఆకులను కలిపి కట్టినతాడు. చూ. చిత్రం 34.4(రా.11); **4.** పర్యా. చూ. ఉడతతాడు. మగ్గంఉడతకు పైన కట్టినదారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (రా. 9); **5.** చూ. బిర్రుతాడు(1).

**బిరుతిరుగుడు** ఉ. బిరుతిరుగడ. ?నేతబట్టమీద చేడుబద్ద అమర్చి బిర్రుపెట్టే ఉంగరం; చూ. చేడు బొందు (కో. 25, 27).

**బిరుదబ్బ** **1.** పర్యా. చూ. బిర్రుచిట్టె(2). పంజె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిది. చూ. చిత్రం 19 క. 4 (రా. 11, 14); **2.** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా

ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (రా. 13); **3.** చూ. బిరుబద్ద (కో. 4).

**బిరుదాపు** పర్యా. చూ. బిరుచిట్టె(2). పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 4 (కో. 35).

**బిరుదారం** **1.** పర్యా. చూ. కొండితాడు. అచ్చు కట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు, అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (రా. 11); **2.** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్టమీద చేడుకర్రలను అడ్డంగా బిరుపెట్టే పొడుగుదారం; దీని కొసలు, చేడుబొందులు కొన్నిచోట్ల కర్రలు-రెంటికీ కడతారు; ఇదిలాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (రా. 18).

**బిరుబద్ద** రూ. బిరుదబ్బ; పర్యా. చూ. ఎత్తుపుల్ల(2). అచ్చుతికేటప్పుడు, అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల(లు); రెండు పుల్లలకు తాడుగట్టి, మడతమంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (రా. 11).

**బిరుబల్ల** పర్యా. చూ. బిరుచిట్టె(2). పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందది. చూ. చిత్రం 19 క. 4 (కో. 28).

**బిరుబుల్ల** (<-పుల్ల) పర్యా. చూ. చిరతలి. ఆసుపీటల బిగింపుకు వేసే కొయ్యపేడు; నేత పొడుగును బట్టి ఆసుపీటలను దగ్గరికిగాని దూరానికిగాని జరుపుకొని పేడు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 8 (రా. 11).

**బిరుమిట్ట** (బహు. బిరుమిట్లు). పర్యా. చూ. బిరుచిట్టె(2). పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందది. చూ. చిత్రం 19 క. 4 (కో. 27).

**బిరుసు** (< brush) పడుగు ఆరకుండా మెత్తగా ఉన్నప్పుడు, పోగులు దువ్వటానికి వాడే చిన్నకుంచె (రా. 8).

**బిర్రు** **1.** పడుగు బిగింపుకోసం బిర్రుకట్టెకు వేసిన తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 బ. 2 (తె. 7); **2.** ?దసలి(పట్టు)పడుగు సరిచెయ్యటానికి ఊద్తెను నిలబెట్టి కొణితాన్నీ కిందిగూటాన్నీ కలిపేతాడు. చూ. చిత్రం 297.4 (తె. 7); **3.** పర్యా. బిగి, బెట్టు. బిగువు; గట్టిదనం (రా. 1, 7 8, 11, 12, 18, 23).

**బిర్రుకట్టె** ఉ. బిరుకట్టె. **1.** పర్యా. చూ. బిడికర్ర. ఊద్తెతాడు బిర్రుపెట్టే పొడుగుకర్ర; ఊద్తెకూ గూటానికీ మధ్య తాడు మెలిదిప్పి నేలమీద అనుస్తారు. చూ. చిత్రం 63 చ. 2 (రా, 13, 24); **2.** పర్యా. బిర్రుగూటం. ఒకరం తిరుగుడు; చూ. తిరుగుడు. చూ. చిత్రం 63 బ (తె. 7); **3.** పర్యా. చూ, బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి, తాడు వడిపెట్టే పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (రా. 18); **4.** పర్యా. దోనుగకొయ్య(2). ఉన్నిమగ్గం దోనుగ(పలక)తిప్పటానికి చిల్లిలో దూర్చిన కట్టె. చూ. పల్లెకట్టె. చూ. చిత్రం 315.3 (తె. 10); **5.** పర్యా. చూ. చుట్టుకట్టె(3). నవారు నేసేటప్పుడు మగ్గానికి తగిలించిన పడుగు బిగింపుకు చుట్టిన కర్ర. చూ. చిత్రం 324 క. 2 (తె. 6).

**బిర్రుకట్టెమొల** పర్యా. గుతిమొల. బిర్రుకట్టె(=ఒకరకం తిరుగుడు) చెక్కకు తాడు కట్టిన చివరి భాగం (తె. 7).

**బిర్రుగుతి** బిర్రుకట్టె (=ఒకరకం తిరుగుడు)ను, ఊద్తె అడ్డపట్టెకు, పడుగేరు కర్రలకు కలిపి కట్టే తాడు; ఇలాటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 63బ (తె. 7,9).

**బిర్రుగూటం** పర్యా. బిర్రుకట్టె(2). ఒకరకం తిరుగుడు; చూ. తిరుగుడు. చూ. చిత్రం 63 బ (తె. 9).

**బిర్రుచిట్టె** **1.** పర్యా. చూ. చిట్టె(2). పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రం 19 క. 3, 4 (తె.2); **2.** ఉ. బిరుసిట్టె; పర్యా. అడ్డదబ్బ(2), అడ్డబల్ల (3). ఆకుచిట్టె, కొసచిట్టె, చిన్నచిట్టె(1). నడికురుబిళ్ళ, పన్ను(3), పురిబల్ల, బిగుచిట్టె, బిగుచిరత, బిరుదబ్బ(1), బిరుదాపు, బిరుబల్ల, బిరుమిట్ట. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందది. చూ. చిత్రం 19 క. 4 (తె. 20, 22-25, 29, 31, 32).

**బిర్రుచిల్ల** ఉ. -సిల్ల; పర్యా. చూ. బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి, తాడు వడిపెట్టే పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (రా. 11).

**బిర్రుచెక్క** పర్యా. చూ. పలకసీల. చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య; కొన్నిచోట్ల, దీనికి పై భాగంలో నగిషీలు చెక్కుతారు; కొన్నిచోట్ల, దీన్ని తొలిచి లోపల గజ్జెలు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 3 (తె. 22, 24).

**బిర్రుతాడు** **1.** పడుగును సరిగింజకు బిగించి కట్టిన తాడు (తె. 9); **2.** రూ. బిరుతాడు(5); పర్యా. అనువుతాడు, ఉక్కడం, ఎత్తుడుతాడు, ఎత్తుసరి, చిరతతాడు, చిలకతాడు(2), నిలువుతాడు(3), పలక ఇరువు (తాడు), బటువుతాడు(2), బద్దె(2). బిగిదారం(2), పురిదారం(4), బిడితాడు, బెట్టుతాడు, మగ్గంపురితాడు, మెలుగుతాడు, లగాంతాడు, సూత్రదారం. మరమగ్గం నిలువుపట్టెను మేరువుపలకకు బిగించి సన్నపుల్లతో

వడిపెట్టిన దారం; మేరువుపలకను పైకిగాని కిందికిగాని జరుపుకొని దీంతో వడిపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 25; రా. 1, 6, 7, 12, 18, 19, 23); **3.** పర్యా. చూ. బొద్దుతాడు. నేతబట్టమీద చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీని కొనలు చేడుపొందులు-కొన్నిచోట్ల కర్రలు-రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (తె. 31; రా. 11).

**బిర్రుపుల్ల** ఉ. బిరుపుల్ల. **1.** పర్యా. చూ. ఎత్తుపుల్ల(2). అచ్చుతికేటప్పుడు అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పుల్ల; రెండు పుల్లలకు తాడుగట్టి మడత మంచం కోళ్ళ మాదిరిగా నిలబెడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 102 క. 1 (రా. 12, 16-18, 23); **2.** పర్యా. అనువుపుల్ల, చిరతపుల్ల(1), చిల్ల(6), పురిపుల్ల, పుల్ల(8), బిగిపుల్ల, బిడిపుల్ల, బిడిబద్ద(3), బిర్రుకట్టె(3), బిర్రుచిల్ల, బెట్టుపుల్ల, మెలుగుడుపుల్ల, లగాంపుల్ల, సూత్రంకట్టె, సూత్రపుల్ల. మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి తాడు వడిపెట్టేపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (రా. 1, 7, 8, 12, 23).

**బిర్రుబద్ద** పర్యా. చూ. చిట్టె(2). పంచె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రం 19 క. 3, 4 (కో. 29).

**బిర్రుసీల** పత్తిరాట్నంకోలను నిలువుకు బిగించిన పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 1.10 (కో. 37).

**బిసనాసుమాను** చూ. మిషనాసుమాను (రా. 7).

**బిస(ను)మగ్గం** ఉ. బిసుమగ్గం; రూ. మిసునుమగ్గం; పర్యా. చూ. మరమగ్గం. ఒకరకం మగ్గం; నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజేది; మగ్గంపలక, పన్నె ఒక కొయ్య చట్టంలో బిగించి పైన కుచ్చుతాళ్ళు కడతారు(కలకత్తా నమూనా మగ్గం); దీంతో తొందరగా నెయ్యవచ్చు. చూ. చిత్రం 108 (కో. 2; రా. 4-6).

**బిసరాటం** రూ. బిసునురాటం; పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం. చూ. చిత్రం 41 (రా. 11).

**బిసరాటి** ఒకరకం రాటి; చూ. రాటి. చూ. చిత్రం 31 గ (తె. 7).

**బిసిగుంజ** పర్యా. చూ. కాని(గుంజ). రంగులో తడిపిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట; మామూలుగా, కొయ్యది; కొన్నిచోట్ల, ఇనపది; మామూలుగా, దీనికి శిలువ మాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది: కొన్నిచోట్ల గుంజకు చిల్లిచేసి దాంట్లో గుంజం దూర్చి, లడీలు తగిలించి పిడుపు కర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1(కో. 11).

**బిసితాడు** ఉ. బిస్తాడు; పర్యా. పింజెరతాడు(1). కమాను(=దూదిపికే కొయ్యపనిముట్టు) వేలాడదీసిన (బిగుసుతాడు. చూ. చిత్రం 9.11 (కో. 6).

**బిసునురాటం** ఉ. ?-రాటం; చూ. బిసరాటం (రా. 6).

**బిస్కెట్‌కలరు** పర్యా. బిస్కట్టురంగు(1). ఒకరకం గోధుమరంగు; కోష్టి. చూ. చిత్రం 288 (కో. 7).

**బిస్కట్టు(రంగు)** **1.** ఉ. బిస్కట్, బిస్కత్తు; బిస్కెట్, బిస్కేటు; పర్యా. బిస్కట్‌కలరు. ఒకరకం గోధుమరంగు; కోష్టి. చూ. చిత్రం 288 (కో. 2, 6, 20, 21, 24; రా. 12, 15); **2.** లేత బ్రౌనురంగు (కో. 12); **3.** గంధంరంగుకు, కాఫీరంగుకు మధ్య రకంగా ఉండే రంగు (కో. 18).

**బిళ్ళ** ఉ. బిల్ల **1.** పర్యా. గిల్ల(1). చేతికదురుకు దారం చుట్టుకొనేవైపు ఉండే గుండ్రటిబిళ్ళ; దీన్ని కట్టె, ఇనుము, రాగి, ఇత్తడి మొ. వాటితో తయారు చేస్తారు. చూ. చిత్రం 17 ట. 2 (కో. 11, 13-15; తె. 13, 14, 17); **2.** పర్యా. చూ. చిట్టె(2). పంచె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు). చూ. చిత్రం 19 క. 3, 4 (కో. 23; తె. 7); **3.** పర్యా. చూ. గిర్ర(1). చెలకపంచె ఆకుల మధ్య ఉండే కొయ్యచెక్రం; ఇటువంటివి రెండుంటాయి; మధ్యన కదురు దూర్చటానికి బెజ్జం ఉంటుంది. చూ. చిత్రం 29 క. 2 (తె. 12); **4.** పర్యా. చూ. దిండు(4). గంటానికి బిగించిన రీలు దారపుబండి; డబ్బారాట్నం వడిదారం దీనిగాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క. 3 (రా. 10, 11, 19 23); **5.** పర్యా. చూ. లక్కాకు(2). డబ్బారాట్నంచెక్రం బిగింపుకు ఇరుసుకు వేసే కొయ్యబిళ్ళ; ఇటువంటివి రెండుంటాయి; చెక్రం పక్కలకు జరగకుండా ఆపుతాయి. చూ. చిత్రం 41 త. 1 (తె. 8; రా. 2); **6.** పర్యా. ఊడైబిళ్ళ, కప్పీ(1), కప్పీచెక్రం, కప్పీబిళ్ళ, గిలక(3). ఊడైతాడు బిగింపుకు వేసే కొయ్యగిలక; కొన్నిచోట్ల ఇనపది. చూ. చిత్రాలు 63 ప. 1, 66 (కో. 4, 8, 9; రా. 7-11-13, 19ఎ, 23); **7.** పర్యా. కొణతలి(3). ఊడైతాడు బిగింపుకు వేసే కొయ్యచెక్క; దీనికి రెండు వైపులా చిల్లులుంటాయి. చిత్రం 63 ప. 2 (రా. 11-13, 19ఎ); **8.** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేతనేసేటప్పుడు, ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి.

చూ. చిత్రం 88 క. 10 (కో. 1, 2, 7-9; తె. 16); **9.** పర్యా. చూ. టుకినీ. పన్నెదండెల మధ్య బిగించే పుల్లలు ఒకే పొడుగులో తెంపటానికి కొలిచే కొయ్య బిళ్ళ. చూ. చిత్రం 89 క. 7 (కో. 1); **10.** పర్యా. చూ. అచ్చుబిళ్ళ. అచ్చుకట్టేటప్పుడు, వడిదారం చుట్టే కొయ్య; దీనికి చుట్టిన వడిదారం, అచ్చుకర్రకు దూరుస్తారు. చూ. చిత్రాలు 92 క, చ (కో. 9, 14, 24; తె. 10, 21; రా. 1, 8, 12, 19, 20, 22); **11.** పర్యా. చూ. వడిబిళ్ళ(3). అచ్చుకట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి, అచ్చువడులలో బిగుపెట్టే కొయ్యచెక్క; ఒకవైపు వెడల్పుగాను ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా టేకుచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (కో. 7, 9; రా. 6, 20, 24); **12.** పర్యా. చూ. గిరక(6). మగ్గంమీద అచ్చుగుదులు తగిలించే కొయ్య కప్పీ; దీన్ని మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 11 (రా. 23); **13.** పర్యా. చూ. దారపుబండి. బరువు కట్టిన అంచుపేటుదారాలు తగిలించే కొయ్యగిలక; దీన్ని మామూలుగా మగ్గంమీద ఎత్తుగా అమరుస్తారు. చూ. చిత్రం 133.2 (రా. 8); **14.** కమ్మిలో నేసిన పట్టె; గడ్డ. చూ. చిత్రం 272 (కో. 5); **15.** పట్టుదారం వడికే పెద్దరాట్నం ఇరుసుకు కుడివైపు బిగించిన కొయ్యచెక్రం; దీనికి వేసిన పురిదారం, డొలకకు తగిలిస్తారు; ఇది తిరిగినప్పుడు, కొండ్ల కొంకల్లోనుంచివచ్చిన పోగులు డొలకకు చుట్టుకొంటాయి. చూ. చిత్రం 293 చ. 7 (తె. 5, 12); **16.** నారవడికే కదురుపుల్లకు బిగించిన గుండ్రటి బిళ్ళ. చూ. చిత్రం 302.2 (తె. 25); **17.** పర్యా. బిండ. ఉన్నికదురుకు దారం చుట్టుకొనే వైపు ఉండే గుండ్రటి కొయ్యబిళ్ళ; మామూలుగా పల్చటిది, కొన్నిచోట్ల (ఆడవాళ్ళు వడికే కదురుది) మందపుది. చూ. చిత్రం 311 చ. 3 (తె. 9-11, 20).

**బిళ్ళకదురు** ఉ. బిల్ల–; పర్యా. చూ. దండెగదురు. ఒకరకం ఉన్నికదురు; మగవాళ్ళు వడికేది; మందతోలు కెళ్ళేటప్పుడు కూడా నడుస్తూ, దీంతో వడుకుతారు. చూ. చిత్రం 311 (తె. 28).

**బిళ్ళకమ్మి** ఉ. బిల్ల–; పర్యా. గుండుకమ్మి. బెత్తెడు వెడల్పుపట్టె మాదిరిగా నేసిన కమ్మి; గడ్డకమ్మి (కో. 6, 10, 17, 23).

**బిళ్ళంచు** ఉ. బిల్లంచు **1.** నాలుగయిదు కొలుకుల దారం తెలుపు, ఎరుపు వరసగా పెట్టి నేసిన అంచు (రా. 23); **2.** మామూలంచు; దీంట్లో మొగ్గ మాదిరి డిజైను నేస్తారు (తె. 18, 22).

**బిళ్ళతాడు** ఉ. బిల్లతాడు **1.** పర్యా. గిలకమోకు. ఊడైబిళ్ళ(=గిలక) బిగించే తాడు. చూ. చిత్రం 63 ప. 3 (రా. 23); **2.** పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకు, అచ్చుకర్ర మీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 24). **3.** గిలకకు తగిలించిన అచ్చుసూత్రం; చూ. చిత్రం 121 గ. 1 (రా. 23).

**బిళ్ళదారం** ఉ. బిల్ల–. అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల మిషనురీలు దారం వాడతారు; మొదటఅచ్చుబిళ్ళకు చుట్టి తరవాత కర్రకు దూరుస్తారు; చూ. వడి (రా. 1).

**బిళ్ళపుల్ల** ఉ. బిల్ల–; పర్యా. చూ. కదురు(6). అచ్చుకట్టేటప్పుడు, అచ్చుబిళ్ళకుచేర్చి వడిదారం చుట్టే పుల్ల; మామూలుగా కట్టెపుల్ల; కొన్నిచోట్ల ఇనపది; దీని బెజ్జంలో దూర్చిన దారం, అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు. చూ. చిత్రం 92 క. 1 (తె. 10).

**బిళ్ళబిగు(లు)** చూ. బిగుబిళ్ళ (తె. 5).

**బీడం** డిజైన్లు అద్దేటప్పుడు రంగుతొట్టి పెట్టుకొనే పీట (రా. 24).

**బీమ్** ఉ. బీము. మగ్గానికి తగిలించిన పడుగు చివరి భాగం చుట్టటానికి అమర్చిన గుండ్రటికొయ్య; రోకలి కంటె కొంచెం లావుపాటిది; చూ. ఎదురుదోనె (తె. 8).

**బీమ్(అడ్డ)** రూ. బీములఅడ్డ. పడుగునూలుపోసే ఒకరకం మరాసు; చూ. మరాసు. చూ. చిత్రం 50 (తె. 5, 18).

**బీముదండం** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో, పన్నె బిగించిన కిందికొయ్య; నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118.9 (రా. 2).

**బీములఅడ్డ** చూ. బీమ్(అడ్డ) (తె. 8).

**బీమ్‌కడ్డీ** పర్యా. చూ. దవడ. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పుబద్ద; నేత నేసేటప్పుడు, ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (రా. 15).

**బీమ్‌కొయ్య** గుండ్రటి ఎదురుదోనె(=బీమ్)ను మోసే పంగలకొయ్య; ఇటువంటివి రెండువైపులా ఉంటాయి (తె. 8).

**బీమ్‌చెక్రం** గుండ్రటి ఎదురుదోనె(=బీమ్)కు చివర బిగించిన పళ్ళచెక్రం (తె. 8).

**బీమ్‌ఫ్రేము** ఉ. బీంఫ్రేం. ?నూలు చుట్టిన రాటీలు

అమర్చే చట్రం; వీటినించి తీసినపోగులు బీమ్(=ఒక రకం మరాసు) చెక్రానికి చుట్టుకొంటాయి (తె. 18).

**బీమ్మగ్గం 1.** ఉ. బిమ్మొగ్గం. ఒకరకం మరమగ్గం; దీన్ని గుంటదగ్గర కాకుండా సమతలంగా ఉన్న నేల మీద అమరుస్తారు (తె. 5, 10, 18); **2.** గుండ్రటి ఎదురుదోనె (=బీమ్) అమర్చిన మరమగ్గం; దీన్ని తక్కువ స్థలంలో అమర్చుకోవచ్చు (తె. 8).

**బీమ్మొద్దు** పర్యా. చూ. ఎదురుదోనె. మగ్గంచివర పడుగునూలు చుట్టే కొయ్యదూలం; మామూలుగా రోకలి మాదిరిది; కొన్నిచోట్ల, నలుపలకలది; మలగ్రకు బదులు అమరుస్తారు. చూ. చిత్రాలు 110.1, 123 త (తె 18).

**బీమ్రాట్నం** ఒకరకం పెద్దరాట్నం; మరరాట్నం (తె. 18).

**బీరపువ్వంచు** బీరపువ్వు ఆకారంలో డిజైన్లుపడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 220 (తె. 17).

**బీరపూవు(రంగు)** ఉ. బీరపువ్వు-. **1.** పసుప్పచ్చలో కొంచెం తెలుపు వన్నె (తె. 9, 10, 27, 20); **2.** పసుప్పచ్చ వన్నె (తె. 11, 12, 17, 26); **3.** పసుప్పచ్చలో కొంచెం ఎరుపు(=పచ్చిపసుపు)వన్నె. (తె. 13, 14).

**బీరపూసెల్లా** ఉ. -సెల్ల. బీరపువ్వురంగు నూలుపెట్టి నేసిన కండువా (తె. 31).

**బీరప్పపండుగ** పర్యా. బీరయ్యపండుగ. ఉన్ని గొంగళ్ళు నేసే కురమలు ముఖ్యంగా చేసుకొనే పండుగ; శిలాకారం(=లింగరూపం)లోఉన్న బీరప్పనుకొలుస్తారు; ఒగ్గివాళ్ళు, కురమల దగ్గర, బీరప్పకథ చెబుతారు (తె. 3, 11, 20, 22, 25, 28).

**బీరయ్యపండుగ** పర్యా. బీరప్పపండుగ. ఉన్ని గొంగళ్ళునేసే కురమలు ముఖ్యంగా చేసుకొనే పండుగ; శిలాకారం(=లింగరూపం)లోఉన్న బీరప్పనుకొలుస్తారు; ఒగ్గివాళ్ళు, కురమల దగ్గర బీరప్పకథ చెబుతారు (తె. 27).

**బీర్లవాళ్ళు** ఉ. బీర్లోల్లు. గొంగళ్ళునేసే కురమలకు పండుగలు చేయించేవాళ్ళు; బీరప్పలింగాన్ని ఊరూరా తిప్పుతూ కురమల దగ్గర అడుక్కొంటారు (తె. 11,20).

**బీహారంచు** అయిదు కొలుకుల రంగుదారం అంచు పడుగులో అతికి నేసిన సాదాఅంచు (కో. 3).

**బుగడ** చూ. బుగిడి (కో. 2; తె. 33; రా. 11, 13-15).

**బుగడంచు** చూ. బుగిడంచు (తె. 33).

**బుగడపేటు** రూ. బొగడపేటు; పర్యా. కలశం పేటు. మొగ్గ(=బుగడ) మాదిరిగా నేసిన డిజైను; అంచుల్లోను, కమ్ముల్లోను నేస్తారు. చూ. చిత్రం 221 (రా. 10, 13).

**బుగిడంచు** రూ. బుగడంచు, బొగిడంచు. మొగ్గ మాదిరి డిజైను వరసగా పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 221 (తె. 29).

**బుగిడి** ఉ. బిగిడి, బుగిడీ; రూ. బుగడ, బొగడ, బొగిడి; పర్యా. మొగ్గ(1). మొగ్గ ఆకారంలో నేసిన డిజైను; కొన్నిచోట్ల, మొగ్గలో సగం(=అర్ధబుగిడి) నేస్తారు. చూ. చిత్రం 221 (తె. 1, 7-10, 18, 19, 22-26, 28, 29, 31; రా. 17).

**బుగిడికటారి** పైన మొగ్గ, కింద లాహిరీ పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 222 (తె. 32).

**బుగిడికడ్డీ** అంచుల్లో నేసిన ఒకరకం డిజైను; సన్న పట్టె, మొగ్గ పడేట్టు నేస్తారు. చూ. చిత్రం 178 (తె. 25).

**బుగిడిగొలుసు** చీర అంచులో గొలుసు ఆకారంలో నేసి, పక్కన మొగ్గ నేసిన ఒకరకం డిజైను. చూ. చిత్రం 223 (తె. 25).

**బుగిడిలాహిరీ** ఉ. -లాయిరి. మొగ్గ, లాహిరీ పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 222 (తె. 22).

**బుగిడిసాదా** శిఖరాకారంలో, వరసగా నేసిన పెద్ద మొగ్గ (=అర్ధబుగిడి)ల డిజైను. చూ. చిత్రం224(తె.31).

**బుగ్గ** చూ. గుబ్బ(1). (రా. 10).

**బుగ్గకొయ్య** చూ. గుబ్బకొయ్య(1). (రా. 10).

**బుగ్గిబరికి** బూడిద పోసిన చిప్ప; అచ్చులికేటప్పుడు; చేతివేళ్ళ చెమట పోవటానికి బూడిద అద్దుకొంటారు. చూ. చిత్రం 102 క. 3 (కో. 33).

**బుజం 1.** పర్యా. చూ. పలకబుజం(1). చేతిమగ్గం పలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం; కొన్నిచోట్ల దీనికి నగిషీలు చెక్కుతారు; ఇటువంటి రెండు భాగాలకు చిల్లులుచేసి పలకసూత్రాలు కడతారు. చూ. చిత్రం 109 చ. 4 (కో. 3, 15; తె. 15); **2.** పర్యా. చూ. ఊపురం. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు పడుగులో పేకపోగు వేసి దీంతో అదుముతారు; చూ. పలకకొట్టు. చూ. చిత్రం 109 చ. 5 (కో. 33, 34, 36; తె. 2, 7; రా. 15-17).

**బుటా** ఉ. బుట్టా; రూ. బూటం. నేతలో రెండంచుల మధ్యభాగంలో నేసిన డిజైను; కొన్నిచోట్ల చుక్క; కొన్నిచోట్ల పువ్వు. చూ. చిత్రం 280 (కో. 2, 11-19, 24, 36; రా. 11, 14, 24).

**బుటాఊచ** ఉ. బుట్టాఊస నేతలో పువ్వు మాదిరి డిజైను నెయ్యటానికి జరిచుట్టిన ఊచ (రా. 14).

**బుటాజుట్టు** ఉ. బుట్టా-. డిజైన్లు నేసే చేతిమగ్గంలో అడ్డజేలునుంచి పడుగులోకి వేలాడే దారాలు. చూ. చిత్రం 136 క. 3 (రా. 14).

**బుటాతీయు** (క్రి.) ఉ. బుట్టా-. నేతలో పువ్వులు, ఆకులు, చుక్కలు మొ.న డిజైన్లు వచ్చేట్టు బెండలతో పోగులు మలపటం (కో. 24; రా. 24).

**బుటానేత** నేతలో పువ్వులు, ఆకులు, చుక్కలు మొ.న డిజైన్లు వచ్చేట్టు బెండలతో పోగులు మలిపి నేసిన నేత. చూ. జముదాని(నేత). (కో. 24).

**బుటామగ్గం** ఒకరకం మరమగ్గం; నేతలో రెండు అంచులకూ మధ్య భాగంలో బుటాలు పడేట్టు నేసే మగ్గం; దీనికి బోనచ్చు అమరుస్తారు; చూ. బుటా. చూ. చిత్రం 113 (కో. 12).

**బుటా(ల)కమ్మి** రెండు అంచులకు మధ్యభాగంలో బుటాలు నేసిన కమ్మి; పూతకమ్మి. చూ. చిత్రం 280 (కో. 2, 12, 13, 17).

**బుటా(ల)చీర** ఉ. -చీరె, బూటా-. రెండు అంచులకు మధ్యభాగంలో రకరకాల బుటాలు పడేట్టు నేసిన చీర; కొన్నిచోట్ల జరిపెట్టి చెట్లు, పువ్వులు, కాయలు మొ.వి నేస్తారు (కో. 11, 12, 15-17, 19, 36; రా. 11).

**బుట్టతాడు** పర్యా. చూ. ఉడతతాడు. మగ్గంఉడతకు, పైన కట్టిన దారం; ఇటువంటివి రెండు, ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (కో. 21).

**బుట్టిఎర** ఉ. బుట్టెర. బుట్టవిడిచిన దసలిపురుగులు మొదటి పదిరోజులకు విడిచిన కూసం (తె. 7).

**బుట్టిఎలుచు** (క్రి.) బుట్టలో ఉన్న ఆడ దసలిపురుగులు గుడ్లుపెట్టిన తరవాతవాటిని ఏరివెయ్యటం(తె.7).

**బుట్టిపుచు** (క్రి.) ?బుట్టలో ఉన్న దసలిపురుగులను చెట్టుమీదికి పాకించటం (తె. 7).

**బుడతలుతీయు** (క్రి.) పడుగులో ముడతలు తీసి, సాపుచెయ్యటం (కో. 35).

**బుడిగిగుడ్డ** పైజామా(=వదులుగా ఉండే పొడుగు లాగు; ఇజారు)ల కోసం నేసిన బట్ట (రా. 16).

**బుడిగె** ఒకరకం పాత్ర; బుడ్డి (తె. 7)

**బుడ్డకపెల** ఒకరకం తురకల గళ్ళులుంగీ(=కైలి); నేతలో, మూడు జేనల వెడల్పు రంగుపట్టీ(=కంబాయి పట్టీ)వచ్చేట్టు నేస్తారు (కో. 4).

**బుడ్డకోడిపేటు** ఉ. -పేటి. చిన్నకోడి ఆకారంలో నేసిన అంచు డిజైను (తె. 2).

**బుడ్డతడిమి** ఒకరకం చెట్టు; దీని ఆకులు దసలి(పట్టు) పురుగులకు ఆహారం (తె. 17).

**బుడ్డపంకె** పర్యా. చూ. డబ్బా(1). పంకెకు బదులు నూలు చుట్టుకొనే రేకుడబ్బా; కొన్నిచోట్ల రేకుపట్టెలు బిగించింది; కొన్నిచోట్ల కొయ్యది. చూ. చిత్రం 30 (రా. 10).

**బుడ్డి** **1.** పర్యా. చూ. దిండు(1). రాట్నం రెండు చక్రాలనూ(=ఆకులు) వేరుచేసే కొయ్య; ఇరుసు దీని మధ్య ఉంటుంది. చూ. చిత్రం 15.8 (తె. 13, 14); **2.** పర్యా. చూ. డబ్బా(1). పంకెకు బదులు నూలు చుట్టుకొనే రేకుడబ్బా; కొన్నిచోట్ల రేకుపట్టెలు బిగించింది; కొన్నిచోట్ల కొయ్యది. చూ. చిత్రం 30(రా. 6, 7, 12, 13, 20, 23); **3.** పర్యా. చూ. దిండు(7). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు; బోట్లపింజెర దిండుకు బొడిపెలు, తొల్లపింజెరకు దిండుకు గాళ్ళు ఉంటాయి; గొలుసు పింజెర దిండుకు ఇవి ఉండవు; కొన్నిచోట్ల దీనికి చివర ఇనపఊచల చక్రంగాని, రేకుపళ్ళచక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (తె. 10, 13, 31, 32); **4.** రంగులు కలుపుకొనే మట్టికుండ (తె. 20).

**బుడ్డిదారం** మగ్గానికి దీపం వేలాడదీసే తాడు; పొద్దుగూకిన తరవాత దీపం పెట్టుకొని నేస్తారు (రా. 10).

**బుడ్డిపింజెర** పర్యా. చూ. బోట్లపింజెర. ఒకరకం డాబీ; దిండుకు బొడిపెలు చేసింది; దిండు తిరిగినప్పుడు, బొడిపెలు కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ (తె. 31, 32).

**బుడ్డిలకదురు** చూ. బుడ్లకదురు (రా. 18).

**బుడ్డిలరాటం** ఉ. బుడ్డిలాటం; చూ. బుడ్లరాటం (రా. 18).

**బుడ్లకదురు** రూ. బుడ్డిలకదురు; పర్యా. చూ. గంటం(1). డబ్బారాట్నం(=బుడ్లరాటం)బొమ్మలకుగాని, దొడ్డినిలువులకుగాని బిగించే మందపుకడ్డీ; పెద్ద కదురు. చూ. చిత్రం 41 క. 12 (రా. 11).

**బుడ్లరాటం** రూ. బుడ్డిలరాటం; పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం. చూ. చిత్రం 41 (రా. 10, 12, 23).

**బుందు** కొంచెం నలుపు వన్నెలో ఉన్న లాకీ(=ముదురు ఎరుపు)రంగు (రా. 5).

**బురక** పర్యా. చూ. తొళ. బొద్దుగొయ్యకు చేసిన బెజ్జం; దీంట్లో దోనె చివరి భాగం(=గుబ్బ)దూరుస్తారు. చూ. చిత్రం 123 క. 7 (రా. 7).

**బుర్ర** **1.** పర్యా. చూ. చెలకపంకె. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం కొయ్యపంకె. చూ. చిత్రం 29 (తె. 14, 16); **2.** జరిదారం చుట్టుకొనే కమ్మికి బిగించిన పిడి (రా. 8).

**బుర్రపంచె** నిలంతువులు కట్టుకోటానికి నేసిన ఒక రకం బట్ట; తెల్లది; మామూలుగా 60–100 నెంబర్ల నూలుతో నేస్తారు; మామూలుగా ఒక కొలికి మామి డంచు పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల గోరంచుకాని, కడ్డీ అంచుకాని పెట్టి నేస్తారు; కొంతమంది దీన్ని తలమీద కప్పుకొంటారు (తె. 32).

**బుర్రరాటం** ఉ. బుర్రాటం; పర్యా. చూ. డబ్బా(ల) రాట్నం. డబ్బా(=బుర్ర)లకు నూలుతోడే రాట్నం; హరిజనులవాడుక. చూ. చిత్రం 41 (కో. 6).

**బుర్రలకమ్మి** జరీదారం ఎలుచుకొనే పనిముట్టు (రా. 8).

**బులు(గు)** చూ. బ్లూ (కో. 4, 6-10, 13, 14; తె. 13-15; రా. 1, 5, 7, 9–11, 17, 19బి, 24).

**బువ్వకుండ** గంజి తియ్యటానికి అన్నంవండే కుండ: ఈ గంజి పడుక్కు- పెడతారు (తె. 11, 14).

**బువ్వపట్వ** గంజి తియ్యటానికి అన్నంవండే చిన్న కుండ (తె. 5).

**బుసరగొర్రె** బూడిదరంగు (=బుసరు) బొచ్చుగల గొర్రె (తె. 11).

**బుసరుగొంగడి** బూడిదరంగు ఉన్నితో నేసిన గొంగడి (తె. 11).

**బుసిపుల్ల** ఉ. బిసి-; పర్యా. అడ్డకొండి, అడ్డపుల్ల, అడ్డముల్లు, కనకపుల్ల, చెండుజిల్ల, చెండుపుల్ల, చెండు ముల్లు, తానుపుల్ల, నాడెపుల్ల, పోగుపుల్ల, బెండు నూల, మీటుపుల్ల. చేతినాడెగాడిలో అడ్డంగా బిగించిన పుల్ల; కానె, గలుగు, చీపురు, బోద మొ.వాటి పుల్లలు వాడతారు; పేకపోగు చిక్కుపడకుండా రావటానికి దీనికి వెనకనుంచి పోగుతీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (కో. 22-24; రా. 18, 23, 24).

**బూగంజి** అన్నపుగంజి; బువ్వగంజి (రా. 16).

**బూటం** చూ. బుటా (తె. 13).

**బూడిదెరంగు** వెలవెలబోతున్నట్లున్నరంగు(కో. 13)

**బూనకర్రకమ్మి** ?మరాసుమీద పడుగుతోడేటప్పుడు, డబ్బాలకు ఉన్న దారం ఒగ్గులపట్టె వరకూ సాపుగా పోవటానికి నిలువుగుంజలమీద అడ్డంగా బిగించిన కొయ్య (కో. 21).

**బూరా(ద్రావకం)** ఉ. బూర. అద్దకంరంగుతయారు చెయ్యటానికి, ముడిరంగులో కలిపే ఒకరకం రసాయనం; తెల్లటి ద్రావకం; Sodium nitrate (రా. 10-12).

**బెంగాలీగడిచీర** అంచులమధ్య (=చీరగర్భంలో మాత్రం) పాతికంగుళం వెడల్పున గడిపడేట్టు నేసిన చీర (కో. 2).

**బెంగుళూరుకోరా** ఉ. బెంగ్లూరుకోర. బెంగుళూరు ప్రాంతంనుంచి వచ్చే ఒకరకంముడినూలు; పసుపుచ్చలో కొంచెం తెలుపువన్నె ఉంటుంది; పోగు, కొంత సన్న గాను, కొంత లావుగాను ఉంటుంది (తె. 12).

**బెంగుళూరుసిల్కు** ఉ. బెంగ్లూర్-. బెంగుళూరు ప్రాంతంనుంచి వచ్చే పట్టు; ఒకరకం పురుగులనుంచి తీసేది (కో. 23).

**బెజను** చూ. బెసను (తె. 12).

**బెజ్జంకట్టె** పర్యా. అడ్డకట్టె(2). గుమ్మికర, జంగ, పడతబొంగు. రాటినూలం దూర్చినకట్టె; పైనగాని, కిందగాని ఉంటుంది. చూ. చిత్రం 31 ప. 3 (తె. 18).

**బెట్టు** పర్యా. చూ. బిర్రు(3). బిగువు; గట్టిదనం (కో. 8).

**బెట్టుతాడు** పర్యా. చూ. బిర్రుతాడు(2). మర మగ్గం నిలువుపట్టెను మేడుపుపలకకు బిగించి, సన్న పుల్లతో వడిపెట్టిన దారం; మేడుపుపలకను పైకిగాని, కిందికిగాని జరుపుకొని దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 8).

**బెట్టుపుల్ల** పర్యా. చూ. బిర్రుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేడుపుపలకబిగించి, తాడు వడిపెట్టె పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7(కో.8).

**బెట్లించు** (క్రి.)దంపటం;పొట్టుతియ్యటం;"జొన్నలు తీసక్కచ్చి వాట్ని బెట్లిత్తాం" (తె. 17).

**బెడ్‌షీటు** పక్కమీద పరచుకోటానికి నేసిన ఒక రకం; ముతకబట్టఒంటిమీద కూడా కప్పుకొంటారు (కో. 26).

**బెండ** నేతలో పువ్వులు (=బుటాలు) పడేట్టు మలిపే రంగుదారపుచుట్ట. చూ. చిత్రం 113 చ. 1 (కో. 24).

**బెండకాయ(చెక్రం)** ఉ.బెండకాయిసెక్రం; పర్యా. పళ్ళబంతి, బంతి(చెక్రం). మరాను ఒగ్గులపట్టెను ఆడించ టానికి వీలుగా అమర్చిన పళ్ళచెక్రం; బెండకాయ ఆకా రంలో పొడుగ్గా ఉంటుంది; మరాసు కట్టుబడిలో పెద్ద పళ్ళచెక్రానికి కింద అమర్చిఉండి, మరాసు తిరిగినప్పుడు, పెద్దపళ్ళచెక్రంతోబాటు తిరుగుతూ ఒగ్గులపట్టెను ముందుకు, వెనక్కు ఆడిస్తుంది. చూ. చిత్రం 50.4 (కో. 1-7. 10, 12 ఎ, 13; రా. 2).

**బెండపువ్వంచు** ఉ. బెండపూవంచు. బెండపువ్వు మాదిరి డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 225 (తె. 11-17, 22, 31, 33).

**బెండపూవుచీర** బెండపువ్వు ఆకారం బుటాలు నేసిన చీర (కో. 26).

**బెండు 1.** పర్యా. చూ. ఊచ(3). కండె నూలు చుట్టుకొనే జొన్నదంటుముక్క. చూ. చిత్రం 51 క

(రా. 19ఎ); **2.** పర్యా. చూ. అడ్డకట్టె(10). నేత బయలులో మరమగ్గంచట్రం నిలబెట్టటానికి నిలువు రాటలకు అడ్డంగా, మామూలుగా బిగించిన కర్ర; కొన్ని చోట్ల, దీనికిఅచ్చుతాళ్ళు తగిలిస్తారు. చూ.చిత్రం116.1 (తె. 30); **3.** పర్యా. చూ. కప్పుచెక్క. మగ్గంసొరుగు మీద బిగించిన చెక్క. చూ. చిత్రం 118.17 (తె. 31).

**బెండుబల్ల** మరమగ్గానికి అమర్చిన గుండ్రటి ఎదురు దొనె(=రోలరు) బిగింపుకోసం పళ్ళచక్రం అమర్చిన చెక్కం; చూ. పళ్ళచక్రం (కో. 33).

**బెండుసూల** పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడె గాడిలో, అడ్డంగా బిగించినపుల్ల; కానె, గలుగు, చీపురు, బోద మొ.వాటి పుల్లలు వాడతారు; పేకపోగు చిక్కుపడకుండా రావటానికి దీనికి వెనకనుంచి పోగుతీస్తారు; కొన్నిచోట్ల, దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (తె. 12).

**బెత్త** నాలుగువేళ్ళ నిడివి(=వెడల్పు). (తె. 4).

**బెదను** (-వేయు) ఉ. బెదును; రూ. బెజను; పర్యా. చూ. బెంతు(దారం). కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి పన్నెగూళ్ళలో దూర్చిన పోగులు; సుమారు జానెడు పొడుగువి; అనివచ్చేట్టు వీటిని కర్రలకు అల్లుతారు. చూ. చిత్రం 91 క. 9 (కో. 14; తె. 5 11, 15).

**బెదనుకర్ర** ఉ. బెదును-; చూ. బెండుకర్ర. (తె. 15).

**బెదనుతాడు** ఉ. బెదన్-. నారపట్టా నేసేటప్పుడు, పడుగుకింద పెట్టిన గుర్రంకొయ్యలు రెంటికీ బిగించిన దారం; అచ్చుదారం. చూ. చిత్రం 304.3 (తె. 25).

**బెదనుదారం** ఉ. బెదుందారం; పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు, అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 9ఎ).

**బెదనేరు** (< బెదను+ఏరు). (క్రి.)బెంతుదారాలు కర్రకు పైన ఒకటి, కింద ఒకటి చొప్పున అనివచ్చేట్టు తీసి వేరుచెయ్యటం (తె. 21).

**బెనకప్ప** ఉ. బెన్కప్ప; పర్యా. చూ. బొమ్మ(3). రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువు కొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడిబొమ్మ ఆకారంలో చెక్కుతారు; బెనకప్ప అంటే వినాయకుడు. చూ. చిత్రం 15.10 (రా. 24).

**బెనకయపండుగ** చూ. వినాకమయ్యపండుగ (రా. 14).

**బెనకల్ పండుగ** పర్యా. చూ. వినాయకచవితి. వినాయక(=వెనకయ్య) చవితి; భాద్రపద శుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి, బొట్లుపెట్టి, పూజచేసి పండుగ చేసుకొంటారు (రా. 16).

**బెనగల్ చవితి** రూ. బెన్కన్‌చవితి; పర్యా. చూ. వినాయకచవితి. వినాయక(=వెనకయ్య)చవితి; భాద్రపద శుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి, బొట్లుపెట్టి, పూజచేసి పండుగ చేసుకొంటారు (రా. 17, 18).

**బెన్కన్‌చవితి** చూ. బెనగల్‌చవితి (రా. 24).

**బెంతచ్చు** (<బెంతు + అచ్చు). అచ్చుకట్టిన మొదటి సారి పన్నె ఈనెల సందుల్లో ఎక్కించేదారాలు(=బెంతు) అచ్చుకర్రలకు కట్టిన వడిదారాల్లో దూర్చటానికి తయారుచేసిన అచ్చు; పన్నెదగ్గర రెండోవైపు మిగిలిన దారాల కొసలకు జెడమాదిరిగా అల్లుతారు (కో. 8).

**బెంతి** పర్యా. చూ. అచ్చుబిళ్ళ. అచ్చుకట్టేటప్పుడు వడిదారంచుట్టే కొయ్య; దీనికి చుట్టిన వడిదారం అచ్చుకర్రకు దూరుస్తారు. చూ. చిత్రం 92 (రా. 23).

**బెంతికదురు** ఉ. బెంతు-; పర్యా. కాటీ, గెడ్డంపుల్ల, తార్పిన్, దబ్బులం(2), పన్నెముల్లు, బెంతికర్ర, బెంతిపుల్ల(2), బెంతిబద్ద, ముల్లు(2). అచ్చుకట్టేటప్పుడు, పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చేపుల్ల; మామూలుగా, ఇనపది; కంటాణీలాంటిది; దీనికి పదునుగా ఉన్న వైపు పోగుదూర్చటానికి చిన్నకొక్కెం ఉంటుంది; కొన్నిచోట్ల, రెండోవైపున పిడి ఉంటుంది. చూ. చిత్రం 94 (కో. 16, 25).

**బెంతికర్ర** పర్యా. చూ. బెంతికదురు. అచ్చుకట్టేటప్పుడు, పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చేపుల్ల. చూ. చిత్రం 94 (కో. 27).

**బెంతితాడు** ఉ. బెంతు-; పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టేటప్పుడు, వడిదారాల బిగింపుకోసం అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 30. రా. 18, 23).

**బెంతిదారం** ఉ. బెంతు - **1.** పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టేటప్పుడు. వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 8; రా. 15, 23); **2.** పర్యా. చూ. పూదారం. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో, అని వెంబడి దూర్చిన దారం; అచ్చుతీకేటప్పుడు పోగులవరస చెదరకుండా దారం దూరుస్తారు; కొన్నిచోట్ల, సన్నబద్దలతో కలిపి దూరుస్తారు. చూ. చిత్రం 102 చ (రా. 18).

**బెంతిపుల్ల** 1. పర్యా. చూ. కదురు(6). అచ్చుకట్టే టప్పుడు అచ్చుబిళ్ళకుచేర్చి వడిదారం చుట్టేపుల్ల; మామూలుగా కట్టెపుల్ల; కొన్నిచోట్ల ఇనపది; దీని బెజ్జంలో దూర్చిన దారం అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు. చూ. చిత్రం 92క. 1 (కో. 17); 2. పర్యా. చూ. బెంతికదురు. అచ్చుకట్టేటప్పుడు పన్నెగూళ్ళ లోకి పోగులు దూర్చేపుల్ల. చూ. చిత్రం 94 (కో. 26).

**బెంతిబద్ద** పర్యా. చూ. బెంతికదురు. అచ్చుకట్టే టప్పుడు పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చేపుల్ల. చూ. చిత్రం 94 (కో. 31).

**బెంతిముల్లు** పర్యా. చూ. కదురు(6). అచ్చుకట్టే టప్పుడు అచ్చుబిళ్ళకుచేర్చి వడిదారం చుట్టేపుల్ల; మామూలుగా కట్టెపుల్ల; కొన్నిచోట్ల, ఇనపది; దీని బెజ్జంలో దూర్చినదారం, అచ్చువడిలో తిప్పి కర్రకు కడతారు. చూ. చిత్రం 92 క. 1 (రా. 1).

**బెంతు** (-వేయు) ఉ. బెందు; పర్యా. చూ. బెంతు పనె. అల్లుచేనేటప్పుడు పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు; పన్నెలాంటిది; రెండు పొడుగుకర్రలకు మధ్య వరసగా మేకులు బిగించి ఉంటాయి; వాటి మధ్య పడుగుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం 106 (కో. 3, 4, 6, 10; రా. 2).

**బెంతుకర్ర** ఉ. బెందు-; రూ. బెదనుకర్ర. బెంతు దారం అల్లేకర్ర(లు): వీటికి పైనుంచి ఒకపోగు, కింది నించి మరొక పోగు వచ్చేట్టు తీస్తారు (కో. 7).

**బెంతుకూర్చు** (క్రి.) పర్యా. చూ. బెంతేయు. అచ్చుకట్టిన తరవాత కర్రలకు అల్లిన బెంతుదారాలు పన్నెగూళ్ళలోకి దూర్చటం (కో. 27).

**బెంతుచువ్వ** ఉ. -సువ్వ. అల్లుచేనేటప్పుడు పడు గులో బెంతుపనెకు ముందు ఎక్కించిన సన్నబెత్తం; దీని వెంబడి బెంతుపన్నె జరుపుకొంటూ వెళ్తారు (కో. 4; రా. 2).

**బెంతుతీయు** (క్రి.) పర్యా, చూ. బెంతేయు. అచ్చుకట్టిన తరవాత, కర్రలకు అల్లిన బెంతుదారాలు పన్నెగూళ్ళలో దూర్చటం (కో. 7).

**బెంతు(దారం)** (-తీయు, -నేయు, -వేయు). ఉ. బెంతి, బెందు; పర్యా. పడుగుబెంతు, బెదను, బెంతు పడుగు, బెంతుపాగడ. కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి పన్నెగూళ్ళలోకి దూర్చినపోగులు; సుమారు జేనెడు పొడుగువి; అనివచ్చేట్టు వీటిని కర్రలకు అల్లు తారు. చూ. చిత్రం 91 క. 9 (కో. 5, 7, 8, 10, 11, 13, 17, 23, 24; తె. 13; రా. 6, 7, 13, 15, 18-20, 24).

**బెంతునేయు** (క్రి.) ఉ. బెందునేయు. పన్నె గూళ్ళలో దూర్చిన బెంతుదారాల కొనలు పన్నెకు ఇవతల జెడమాదిరిగా అల్లటం (కో. 7, 8).

**బెంతుపడుగు** ఉ. బెంతి-; పర్యా. చూ. బెంతు (దారం). కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి పన్నెగూళ్ళలో దూర్చిన పోగులు; సుమారు జేనెడు పొడుగువి; అనివచ్చేట్టు వీటిని కర్రలకు అల్లుతారు. చూ. చిత్రం 91 క. 9 (రా. 1).

**బెంతుపండ్లు** పర్యా. బెంతుసీల(లు). బెంతుపనెలో వరసగా బిగించిన మేకులు. చూ. చిత్రం 106.1 (కో. 4).

**బెంతుపనె** రూ. పన్నెబెంతు. పర్యా. అల్లుదంత్రం, ఒగ్గెర, దంతనం(2), బెంతు, బెంతుమాను(2). అల్లు చేనేటప్పుడు పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పని ముట్టు; పన్నెలాంటిది; రెండు పొడుగు కర్రలకు మధ్య, వరసగా మేకులు బిగించి ఉంటాయి; వాటిమధ్య పడుగు పోగులు దూరుస్తారు. చూ. చిత్రం 106 (రా. 7).

**బెంతుపాగడ** ఉ. బెంతిపాగడ, బెంతిపాగడి; పర్యా. చూ. బెంతుదారం. కొత్తగా కట్టిన అచ్చుకు, పడుగు అతకటానికి పన్నెగూళ్ళలో దూర్చిన పోగులు; సుమారు జేనెడు పొడుగువి; అనివచ్చేట్టు వీటిని కర్రలకు అల్లు తారు. చూ. చిత్రం 91క. 9 (కో. 20; రా. 11, 23).

**బెంతుబద్దె** అచ్చుకట్టేటప్పుడు బెందుకర్రలకు దారం అల్లి, కొత్తగా తయారుచేసిన బద్దె; దీనికి ఒకవైపు కొన, జెడమాదిరిగా అల్లుతారు. చూ. చిత్రం 103 (రా. 3).

**బెంతుమాను** ఉ. బెంతి. 1. పర్యా. జంత్రం(పీట). అచ్చువడి కట్టటానికి అచ్చుకర్రలు బిగించే కొయ్యపని ముట్టు; రెండు అడ్డపట్టెలను మధ్య నిలువుపట్టెకు బిగించింది; అచ్చుకట్టేటప్పుడు అడ్డపట్టె కొయ్యలకు అచ్చుకర్రలు కడతారు. చూ. చిత్రం 91 (రా. 1, 4, 5, 11, 13, 15); 2. చూ. బెంతుపనె. అల్లుచేసే టప్పుడు పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు; పన్నెలాంటిది; రెండు పొడుగు కర్రలకుమధ్య వరసగా మేకులు బిగించి ఉంటాయి; వాటిమధ్య పడుగుపోగులు దూరుస్తారు. చూ. చిత్రం 106 (కో. 1).

**బెంతుసీలలు** పర్యా. బెంతుపండ్లు. బెంతుపనెలో వరసగా బిగించిన మేకులు. చూ. చిత్రం 106.1 (కో. 1, 3).

**బెంతేయు** (క్రి.) ఉ. బెందేయు; పర్యా. బెంతు కూర్చు, బెంతుతీయు. అచ్చుకట్టిన తరవాత, కర్రలకు అల్లిన బెంతుదారాలు పన్నెగూళ్ళలో దూర్చటం (కో. 10, 26, 33).

**బెల్లపురంగు** చూ. బెల్లంరంగు(3) (తె.9,21,22).

**బెల్లంముంగి** బెల్లంవన్నె, తెలుపువన్నెల పోగులు పెట్టి నేసిన చిన్నగడి (తె. 22).

**బెల్లంరంగు** **1.** నస్యంరంగుకంటె ఒకవాసి తక్కువ ఉండే రంగు (తె. 12); **2.** కొత్తబెల్లంరంగు (తె. 17); **3.** రూ. బెల్లపురంగు. బెల్లపుగడ్డరంగు (తె. 18).

**బెషె** ఉ. బెష; పర్యా. చూ. పకుబద్ద; ఉన్ని ఏకే వెదురుబద్ద; విల్లు మాదిరిది. చూ. చిత్రం 309 (తె. 26, 27).

**బేగు** చూ. బేము (తె. 3).

**బేజురంగు** చన్నీళ్ళలో కలిపి నూలుకువేసే రంగు; నూలులడీలు ఈ రంగునీళ్ళలో రెండుమూడుసార్లు పిసుకుతారు; రంగు అట్టేకాలం నిలవదు; ?Base colour (తె. 17).

**బేపెత్తు** (క్రి.) పడుగు కుంగినవైపు పైకి ఎత్తటం; కుంగినవైపు తక్కువ, అనిపెచ్చినవైపు ఎక్కువ పలక తగులుతుంది; అలా నేస్తే పడుగు చదునవుతుంది(కో.26).

**బేడెం** పర్యా. చూ. చిరతలి. ఆసుపీటల బిగింపుకు వేసే కొయ్యపేడు; నేతపాడునుబట్టి ఆసుపీటలను దగ్గరికిగాని, దూరానికిగాని జరుపుకొని పేడు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 8 (తె. 11).

**బేము** (-గుద్దు, -చొరగొట్టు, -తోలు, -నడుపు, -పారు) ఉ. బెం, బేమ్; రూ. ఏము, బేగు, బేవు. గొంగడి నేసేటప్పుడు పేకపోగు దగ్గరపడటానికి, కొట్టే కొయ్యపట్టె; ఇది పడుగులో అనిదగ్గర దూర్చిఉంటుంది. చూ. చిత్రం 315.5 (తె. 10, 11, 22, 25-28).

**బేముబారుకట్టె(లు)** ఉ. బేముపారుకట్టె, బేమ్బరి కట్టె; రూ. ఏముబారెడికట్టె. గొంగడి నేసేటప్పుడు బేము(=పేకపోగు దట్టించేది) ఊతగా పెట్టుకొనే చిన్న మొద్దు(లు); ఇటువంటివి రెండుమూడు వాడతారు. చూ. చిత్రం 315.6 (తె. 11, 28).

**బేరింగు** ఉ. బైరింగ్; పర్యా. చూ. బాల్ బేరింగు. మరాసు ఇరుసు సులువుగా తిరగటానికి ఉక్కుగుండ్లు అమర్చిన పనిముట్టు (కో. 36).

**బేర్పు** అచ్చుపోగులకు రెండురంగుల పడుగుపోగులు (నలుపు, తెలుపు మాదిరిగా) అతకటం (రా. 22).

**బేలగాఉండు** (క్రి.) తక్కువ వన్నెలో ఉండటం; "నూలుసిట్టె...పసుప్పచ్చల బేలగుంటది" (తె. 12).

**బేలడి** (< బేలు + అడి) డిజైన్లునేసే చేతిమగ్గంలో అడ్డబేలునుంచి పడుగులోకి వేలాడే దారాలు. చూ. చిత్రం 136 క. 3 (రా. 15).

**బేలు** **1.** నూలులెక్క: నలభై కట్టల నూలు; ఇందులో 800 లడీలు ఉంటాయి (కో. 19); **2.** పర్యా. చూ. పేటు(1). ఏదైనా ఒక నమూనాలో నేసిన నేత; పువ్వు, ఆకు, చెట్టు, పక్షి, తీగ, గీరలు మొ. వాటి డిజైను (రా. 15).

**బేలుచెక్క** పర్యా. చూ. నాగలి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు, పేటు అడపోగులు ఎత్తిపట్టుకొనే కొయ్యపనిముట్టు; నాగలి ఆకారంలో ఉంటుంది; దీన్ని మగ్గానికిపైనుంచి వేలాడదీస్తారు. చూ. చిత్రాలు 111 చ. 2. 136 త (రా. 9).

**బేలుదారాలు** ఉ. బేల్దారాలు. అంచులో డిజైన్లు నెయ్యటానికి చేతిమగ్గం పడుగుపైన, వంతెన మాదిరిగా కట్టిన లావుదారాలు; చూ. అడ్డబేలు. చూ. చిత్రం 136 క. 1 (రా. 14, 15).

**బేలుబద్ద** నేసినబట్ట మడతపెట్టటానికి చేత్తో ఒత్తే ఇనపబద్ద (రా. 10).

**బేలుబుగిడి** ఉ. బేల్బుగిడి. మొగ్గ (=బుగిడి)లు పడేట్టు నేసిన ఒకరకం డిజైను. చూ. చిత్రం 221 (తె. 8, 19).

**బేలుమగ్గం** ఒకరకం చేతిమగ్గం; రకరకాల డిజైన్లలో పట్టుబట్టలు నెయ్యటానికి వాడతారు. చూ. చిత్రం 111 (తె. 21).

**బేలుమడత** పర్యా. చూ. నాగలి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు పేటు అడపోగులు ఎత్తిపట్టుకొనే కొయ్యపనిముట్టు; నాగలి ఆకారంలో ఉంటుంది. దీన్ని మగ్గానికి పైనుంచి వేలాడదీస్తారు. చూ. చిత్రాలు 111 చ. 2, 136 (రా. 15).

**బేలురేకు** **1.** మరాసుకట్టుబడిలో చక్రంఆకుల బిగింపుకోసం చుట్టిన ఇనపరేకు (రా. 2); **2.** పర్యా. చూ. రేకు(2). నేతనేసేటప్పుడు మరమగ్గం మేరువు పలక సులువుగా ఆడటానికి బిగించిన ఇనపరేకు; కొన్ని చోట్ల నట్టరుగుంజ అడ్డపట్టెకు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.5 (రా. 10).

**బేవు** చూ. బేము (తె. 6, 20).

**బేసిక్కలర్** చన్నీళ్ళలో కలిపి అద్దే రంగు; దీంట్లో రసాయనాలు కలపరు (రా. 15).

**బేసు** ఉ. బేస్. ముడినూలుమీద మొట్టమొదట వేసినరంగు; అసలురంగు అంటటానికి ముందు ఇది వేస్తారు; చన్నీళ్ళలో వేసి, దీంట్లో లడీలు పిసుకుతారు (కో. 8; రా. 6, 11, 12).

**బైచెరు** రంగునీళ్ళుకాచే పెద్ద ఇనపడబ్బా. చూ. చిత్రం 282 క. 3 (కో. 2, 3).

**బైత్రుంచుకమ్మి** ఒకరకం కమ్మి; చిటికెనవేలెడు వెడల్పున మామూలుగా నేసి మూడు కొలుకులదారం రంగుది, మూడు కొలుకుల దారం తెల్లదిగాని, పట్టు గాని పెట్టి తరవాత మూడు కొలుకులదారం నిలు

వుకు పెట్టినరంగు దారంతో జైనెడు వెడల్పున నేస్తారు (కో. 4).

**జైత్రిఅంచు** నేతపడుగులో కిందిపొరకు, పై పొరకు వేరువేరు రంగులుపెట్టి నేసిన అంచు (కో. 8).

**బైరన్** ఉ. బైలన్. రంగునీళ్ళుకాచే పెద్ద ఇనప డబ్బా. చూ. చిత్రం 282 క. 3 (తె. 18, 19).

**బైంగనునేత** ఎనిమిదిపోగులు ఒకరంగు, రెండు పోగులు మరొక రంగుపెట్టి పడుగు, పేక సమంగా నేసిన నేత; రెండు నాడెలతో నేస్తారు (తె. 24).

**బొక్క** పర్యా. చూ. తాలి(1). నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపు చేసిన చిల్లి; దీంట్లో బిగించిన పుల్లకు దారం కట్టి బద్దెచువ్వ బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా అయిదారుంటాయి. చూ. చిత్రం 128 చ. 4 (కో. 8).

**బొక్కనాడె** పర్యా. చూ. చేతినాడె. పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్య వేసే పేకదారం కండెఅమర్చి చేత్తో విసిరేనాడె; గేదెకొమ్ముతో చేసింది; చూ. నాడె. చూ. చిత్రం 131 చ (తె. 32).

**బొక్కలబల్ల** పర్యా. కన్నాలబల్ల. వజానేతకోసం అమర్చిన దొడ్డిచట్రంలో కుచ్చుతాళ్ళు దూర్చిన చెక్క; దీని చిల్లుల్లో ఒక్కొక్కతాడు దూర్చి ఉంటుంది. చూ. చిత్రం 134 చ. 8 (కో. 34, 36).

**బొక్కాసుగొట్టం** పర్యా. ఎనికెగొట్టం, బొక్కాసుగోవి. ఎముక ఆసుగొట్టం; మేకకాలి ఎముక. చూ. చిత్రం 48 క (తె. 31).

**బొక్కాసుగోవి** ఉ. -కోయి, -గోయి; పర్యా. బొక్కాసు గొట్టం. ఎముక ఆసుగొట్టం; మేకకాలి ఎముక. చూ. చిత్రం 48 క (తె. 25, 33).

**బొక్కుపిల్ల** గొర్రెపిల్ల (తె. 11).

**బొగడ** చూ. బుగిడి (రా. 7).

**బొగడపేటు** చూ. బుగడపేటు (రా. 7).

**బొగడసరంఅంచు** చూ. బోడసరంఅంచు(కో.23).

**బొగడసరంచీర** చూ. బోడసరంచీర (కో. 34).

**బొగిడంచు** చూ. బుగిడంచు (తె. 14, 17).

**బొగిడి** చూ. బుగిడి (తె. 4, 5, 14, 17).

**బొగోణి** ఉ. బొగోణ; చూ. భగోణి (తె. 2, 7).

**బొగ్గురంగు** బొగ్గుమాదిరి నల్లరంగు; బ్లేక్ 2 బి. 800 కాని, 400 కాని వేసి, కాస్టిక్ సోడా, హైడ్రో సల్ఫ్ వేసి తయారు చేస్తారు (తె. 5).

**బొంగరం** ఉ. బంగరం **1.** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంచె మొ. వాటికి దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (కో. 2, 3, 6, 8, 9బి); **2.** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి; చూ. చిత్రం 34 (కో. 4).

**బొంగరంకడ్డీ** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటి, కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 9బి).

**బొంగరంపుల్ల** ఉ. బంగరం-; పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (కో. 2. 9బి).

**బొంగరంమొద్దు** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 8, 9).

**బొంగు** **1.** పర్యా. జంత్రంకర్ర. పన్నెతయారు చేసే చట్రంలో నిలువుకొయ్య(=బొమ్మ)లు బిగించిన వెదురుకర్ర. చూ. చిత్రం 88 క. 1 (రా. 24); **2.** తివాసీమగ్గం అచ్చుకు, కమానుకు మధ్య ఎక్కించిన పొడుగాటి వెదురుకర్ర; దీనికి రెండు వైపులా తాళ్ళు కట్టి పైదోనెకు వేలాడదీస్తారు. చూ. చిత్రం 320.7 (తె. 17).

**బొంగుబర్రె** పత్తిలో తుక్కూ దూగరా రాలగొట్టే చువ్వ; బెత్తం. చూ. చిత్రం 4.2 (తె. 2).

**బొచ్చు** చెర్మంమీద మొలిచిన వెంట్రుకలు; గొర్రె బొచ్చుతో కంబళ్ళు, తివాసీలు నేస్తారు (తె. 6).

**బొచ్చుకత్తెర** పర్యా. చూ. ఉన్నికత్తెర. గొర్రె బొచ్చు కత్తిరించే కత్తెర. చూ. చిత్రం 306 (తె. 6).

**బొచ్చె** పర్యా. చూ. ఉండ(3). వడికి, చుట్టిన ఉన్ని దారం; గుండ్రటిది; కొన్నిచోట్ల పడుగుకు సరిపడేటంత దారం ఒక ఉండ చుడతారు (తె. 25).

**బొజ్జ** పర్యా. చూ. దిండు(1). రాట్నం రెండు చెక్రాలనూ(=ఆకులు)వేరుచేసే కొయ్య; ఇరుసు దీని మధ్య ఉంటుంది. చూ. చిత్రం 15.8 (కో. 4-6, 8-9, 14; రా. 10, 21).

**బొట్టంచు** ఉ. బొట్టిఅంచు, బొట్టెంచు. **1.** కొంచెం (పోగుల) తేడాలో గుండంచు మాదిరిగా నేసిన అంచు; చివర పన్నెండు కొలుకుల దారం పచ్చ, తెలుపు వన్నెల్లో ఒక్కొక్కకొలికి చొప్పున ఒకటి విడిచి ఒకటి మూడు వరసలుగా పడేట్టు నేస్తారు; చూ. గుండంచు (కో. 7); **2.** అంతా నీలిరంగు దారం అతికి నేసిన అంచు; మధ్యలో కృత్రిమపుపట్టుతో రెండు కడ్డీలుపెట్టి వాటికి మధ్య ఒక కొలికి నీలిదారం పడేట్టు నేస్తారు (రా. 11); **3.** చివర ఇరవై నాలుగు కొలుకులదారం

రంగుది అతికి నేసిన అంచు; వడ్డెరవాళ్ళు కట్టే చాపు (=ఇరవై మూరలది)లకు నేస్తారు(తె.13); **4.** మూకంచు కంటె సన్నటిఅంచు (రా. 14); **5.** అటూ ఇటూ ఎరుపు, మధ్య పసుపు రంగులుపెట్టి నేసిన అంచు (రా. 15); **6.** లాహిరిపెట్టి నేసిన అంచు (రా. 18); **7.** మూడువేళ్ళ వెడల్పున నేసిన అంచు (రా. 24); **8.** రంగుదారాలు అతికినేసిన ఒకరకం అంచు (కో. 9బి; తె. 1, 11, 12; రా. 22).

**బొట్టిగొర్రె** ఉ. బుట్టిగొర్రె. ఎలికచెవులవంటి చిన్న చెవులుగలగొర్రె (తె. 20, 22).

**బొట్టె** ఉ. బొట్టి, బొట్టు. **1.** చూ. పొట్టె(5) (కో. 6); **2.** (-పడు, -కట్టు, -వేయు). చూ. పొట్టె(6) (కో. 1; రా. 4, 8, 10, 12, 13, 20); **3.** చూ. పొట్టె(7). (కో. 2, 5; రా. 1, 7-10, 12-14, 19, 20); **4.** చూ. బొడ్డె(4). (కో. 14; తె. 13).

**బొట్టెకమ్మి** ఒకరకం చీరకమ్మి; బొటనవేలెడు వెడల్పు పట్టె మాదిరిగా నేస్తారు (కో. 8).

**బొట్టెతాడు** ఉ. బొట్టి-; చూ. పొట్టెతాడు (కో. 2; రా. 8-10, 20).

**బొట్టెదారం** ఉ. బొట్టి-; పర్యా. చూ. పొట్టె తాడు. నేతపడుగులో చివరిపాయకు కట్టిన దారం; పొట్టెకొక దారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రం 127.8, 128 చ. 1 (రా. 7, 12-14, 19).

**బొట్టెముడి** (-వేయు) పడుగులో చివరిపాయ పోగులకు వేసిన మెలిక (రా. 10).

**బొట్టె(ల)కట్టె** ఉ. బొట్టు-, బొట్లు-; పర్యా. చూ. పొట్టెకోల. నేతపడుగు చివర, పాయలతాళ్ళు కట్టినకర్ర; దీనికి కొన్నిచోట్ల మలబద్ద జోడిస్తారు; కొన్నిచోట్ల దీనికి పొట్టెలు మెలివేస్తారు. చూ. చిత్రం 128 త. 1 (రా. 8, 9, 12-14, 20).

**బొట్టె(ల)కర్ర** ఉ. బొట్టి-, బొట్లె-; పర్యా. చూ. పొట్టెకోల. నేతపడుగు చివర, పాయలతాళ్ళు కట్టినకర్ర; దీనికి కొన్నిచోట్ల మలమద్ద జోడిస్తారు; కొన్నిచోట్ల దీనికి పొట్టెలు మెలివేస్తారు. చూ. చిత్రం 128 త. 1 (కో. 2; రా. 7).

**బొడ్డబ్బాసి** (<బొడ్డు+అబ్బాసి) ఒకరకం తల పాగ; నేతబొడ్డు(=రెండు అంచులకు మధ్య భాగం)లో అబ్బాసి(=ఒకరకం ఎరుపు) రంగు పెట్టి పడుగు, పేక నేస్తారు; నల్చదరంగా నేసి, మధ్యలో పదహారుగళ్ళు పెడతారు; వాటిలో ఏనుగు, గంధపుగిన్నె, స్వస్తిక, కళావరుచుక్క, సింహాలు మొ. నమూనాలు నేస్తారు; తెల్లదారపు బొందులకు చుక్కకట్టి(=అక్కడక్కడ నూలుకు రంగు అంటకుండా దారపుకట్లుకట్టి) అబ్బాసి రంగులో ముంచి నేస్తారు; ఇవి ఎక్కువగా అరేబియాకు ఎగుమతి అవుతాయి; అరేబియాలో దీన్ని "ఏషియా రుమాలు" అంటారట (కో. 7).

**బొడ్డు** **1.** పర్యా. చూ. దిండు(1). రాట్నం రెండు(ఆకుల)చెక్రాలనూ వేరుచేసే కొయ్య; ఇరుసు దీనిమధ్య ఉంటుంది. చూ. చిత్రం 15.8 (కో. 8); **2.** చూ. బొడ్డె(1). (కో. 9); **3.** పర్యా. చూ. కుంచె పిడి. పడుగుదువ్వేకుంచె పట్టుకోటానికి బిగించినకొయ్య. చూ. చిత్రం 76 క. 1 (కో. 9); **4.** నేసినబట్ట చుట్టే దోనె(=నలుపలకల దూలం)కొన; గుండ్రంగా బొడిపె దేరి ఉంటుంది; ఇటువంటివి రెండువైపులా ఉంటాయి; వీటిని బొడ్డుగొయ్య బెజ్జాల్లో దూర్చి దోనెను మోపు తారు (తె.8); **5.** పర్యా. చూ. తొళ. బొడ్డుగొయ్యకు చేసిన బెజ్జం; దీంట్లో దోనె చివరిభాగం(=గుబ్బ)దూరు స్తారు. చూ. చిత్రం 123 క. 7 (తె. 5); **6.** చూ. బొడ్డె (తె. 21); **7.** పర్యా. తల్లిపడుగు. రెండంచులకు మధ్యభాగంలో ఉన్న నేతపడుగు (కో. 7).

**బొడ్డుకొయ్య** పర్యా. కుండకొయ్య. పట్టుమగ్గం దోనెను ఎడమవైపున మోసే కొయ్యగూటం; నేలలో పాతింది. చూ. చిత్రం 123 క. 5 (తె. 5).

**బొడ్డుగూటం** ఉ. బొడ్డి-; పర్యా. చూ. బొడ్డు గొయ్య. మగ్గంమీద నేతబట్ట చుట్టేకొయ్య(దోనె)కు ఆధారంగా ఎడమపక్కన నేలలో పాతిన కొయ్య గూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్ని చోట్ల రెండువైపులా రెండుంటాయి; కొన్నిచోట్ల పడుగుచుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (తె. 1, 2, 7; రా. 13, 17, 22, 24).

**బొడ్డుగొయ్య** ఉ. -కొయ్య; పర్యా. కుడితలకొయ్య, కుడితలమాను, కుడుతుడుకొయ్య, కుండతలకాయ, గుండ్రగుబ్బ, గుబ్బ(4), గుబ్బకొయ్య, గుబ్బగురుడు, గుబ్బమాను, దిగ్గొయ్య, తొలగుంజ, దొలగొయ్య, దోనెకొయ్య (1), దోనెగుంజ (2), బొడ్డుగూటం, బొండిగొయ. మగ్గంమీద, నేతబట్టచుట్టే కొయ్య (దోనె)కు ఆధారంగా ఎడమపక్కన, నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల రెండువైపులా రెండు ఉంటాయి; కొన్ని చోట్ల పడుగుచుట్టే ఎదురుదోనెకు ఆధారంగా పాతిన గూటం. చూ. చిత్రం 123 క. 5 (కో. 9, 14; తె. 4 5, 9-33; రా. 19బి, 23).

**బొడ్డుండ** (<బొడ్డు+ఉండ) పర్యా. బొడ్డుపుల్ల. దూది ఏకేటప్పుడు ఏకువిల్లు నరం గుంజే కొయ్య పనిముట్టు. చూ. చిత్రం 10 క. 3 (కో. 37).

**బొడ్డుతాడు** పర్యా. అడ్డతాడు(5), గుది(15), చెముడుతీపుతాడు, చెముడుదారం, చేదుకట్టెతాడు, చేదుగుది(2), చేదుతాడు(2), చేదుబిర్రుతాడు, చేరు కట్టెతాడు, తాడు(9), నాభితాడు, బలుపుతాడు, బిరు దారం(2), బిర్రుతాడు(3), ములుగుట్టుతాడు. నేతబట్ట మీద, చేదుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం; దీని కొసలు చేదుబొందులు-కొన్నిచోట్ల కర్రలు- రెంటికీ కడతారు; ఇది లాగితే కర్రలు బిగుస్తాయి. చూ. చిత్రం 125 క. 5 (కో. 2).

**బొడ్డు(నేత)** పర్యా. చూ. నడిమినేత. నేతలో రెండు అంచులకూ మధ్యభాగం (కో. 7).

**బొడ్డుపొగడ** ఉ. -పొగడి. అల్లుచేసే పడుగులో, అంచుల మధ్యభాగం(=బొడ్డు)లో కలిపే నూలు; సరి చేసింది (కో. 7).

**బొడ్డుపుల్ల** పర్యా. చూ. బొడ్డుండ. దూది ఏకే టప్పుడు, ఏకువిల్లునరం గుంజే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 10 క. 3 (కో. 37).

**బొడ్డుబర(గ)** పర్యా. చూ. సులిగె. నేసిన గొంగడి బిగింపుకోసం, ఉన్నిమగ్గందోనుగ గాడిలో పెట్టిన కర్ర; దీన్ని గొంగడి కొసలో దూర్చి దోనుగ గాడిలో పండ్లకు బిగిస్తారు (తె. 10, 11).

**బొడ్డుసులిగె** ఉ. -సుల్గె. 1. ?ఉన్నిపడుగు సరిచేసే టప్పుడు పై పోగులకు, కింది పోగులకు మధ్య దూర్చిన కర్ర; చూ. సరిబద్ద (తె. 26); 2. పర్యా. చూ. సులిగె. నేసిన గొంగడి బిగింపుకోసం, ఉన్నిమగ్గం దోనుగ గాడిలో పెట్టినకర్ర; దీన్ని గొంగడి కొసలో దూర్చి, దోనుగగాడిలో పండ్లకు బిగిస్తారు (తె. 8).

**బొడ్డె** 1. రూ. బొడ్డు(2). ఊడ్తెపట్టెకు బిగించిన కడియాన్నీ పడుగేరుకర్రకు తగిలించిన గొలుసునూ కలిపే ఊచ చివరిబొడిపె. చూ. చిత్రం 70 చ. 1 (తె. 11, 14, 15, 21); 2. వంకెన(=పడుగేరుకర్ర బిగింపుకోసం తగిలించే ఇనపకొక్కెల పనిముట్టు)లో ఒకభాగం; అడ్డచువ్వలో దూర్చిన ఊచ చివరి బొడిపె. చూ. చిత్రం 70 ట. 2 (తె. 26-28, 30); 3. పర్యా. చూ. దోనుగపన్ను. ఉన్నిమగ్గం దోనుగగాడిలో చువ్వ (=సులిగె) బిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల(లు). (తె. 28); 4. రూ. బొట్టె(4), బొడ్డు(2). పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడెమొన అరిగిపోకుండా బిగిం చిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (కో. 9; తె. 10, 11. 14, 17, 18, 26, 27, 33); 5. పర్యా. చూ. పిక్క. డాబీగొలుసు బద్దకు బిగించిన కొయ్యముక్క(లు); డిజైనుకు అవసరమైనన్ని బిగిస్తారు; దిండునుచుట్టి గొలుసు తిరిగినప్పుడు ఇవి కోలలను పైకిలేపుతాయి. చూ. చిత్రం 132 చ. 2 (తె. 32).

**బొడ్డెలపింజెర** పర్యా. చూ. బోట్లపింజెర. ఒక రకం డాబీ; దిండుకు బొడిపెలు చేసింది; దిండు తిరిగి నప్పుడు బొడిపెలు కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ (తె. 29).

**బొడ్డెల్లచక్కి** (<బొడ్డు-వెల్ల-చక్కి) బొడ్డశ్యాసి రుమాలు నేతలో, రెండు అంచులకూ మధ్య(=బొడ్డు) తెల్లదారాలతో నేసిన నల్చదరం (కో. 7).

**బొండ** 1. చూ. బొండు(1). (కో. 20); 2. మర మగ్గంలో ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తోతాళ్ళనుగుంజే పిడి; మామూ లుగా గుడ్డపేలిక-కొన్నిచోట్ల బద్దెపేలికలు కలిపి కట్టింది; కొన్నిచోట్ల దారపురీలు కడతారు; చూ. కుచ్చు. చూ. చిత్రం 118.21 (తె. 32).

**బొండసూత్రం** ఉ. -సూత్త్రం; పర్యా. చూ. కుచ్చుతాడు. మరమగ్గంలో, నాడెను నడపటానికి ఆధా రంగా కుచ్చుకట్టినదారం. చూ. చిత్రం118.22(తె.32).

**బొండిగొయ** పర్యా. చూ. బొడ్డుగొయ్య. మగ్గం మీద, నేతబట్టచుట్టే కొయ్యదోనెకు ఆధారంగా ఎడమ పక్కన నేలలో పాతిన కొయ్యగూటం; దీని బెజ్జంలో దోనెకొన దూరుస్తారు; కొన్నిచోట్ల, పడుగుచుట్టే ఎదురుదోనెకు అధారంగా పాతినగూటం. చూ. చిత్రం 123 క. 5 (తె. 18).

**బొండు** 1. రూ. బొండ; పర్యా. చూ. దిండు(1). రాట్నం రెండు చెక్రాలనూ(ఆకులు) వేరుచేసే కొయ్య; ఇరుసు దీనిమధ్య ఉంటుంది. చూ. చిత్రం 15.8 (కో. 7); 2. పర్యా. చూ. దిండు(3). డబ్బారాట్నం చెక్రం మధ్య ఆకుల బిగింపుకు అమర్చిన కొయ్యగుండు. చూ. చిత్రం 41 ట. 1 (కో. 7).

**బొత్తంచు** 1. చిగురులేకుండా(=చివర తెల్లపోగులు విడవకుండా) నేసిన అంచు. చూ. చిత్రం 209 (కో. 24); 2. బట్టకు చివర రెండు వేళ్ళ వెడల్పున, ఒకే రంగుపెట్టి నేసిన అంచు; అంచుకు రెండువైపులా లావు దారాలు(=బొద్దులు)పెడతారు (కో. 23-37; తె. 15, 16); 3. వేలెడేసి వెడల్పు తొగరురంగు పట్టెలకు రెంటికి మధ్య, మామూలు ఎర్రపట్టె వచ్చేట్టు కుప్పడం నేతలో నేసిన అంచు (తె. 13).

**బొత్తంచుచాపు** బొత్తంచు పెట్టి నేసిన రెండు పంచెలు; పద్మసాలీల్లో పెళ్ళికొడుకు కట్టుకొంటాడు (కో. 26, 30, 31, 34, 37; తె. 16).

**బొత్తంచుచీర** చిట్టచివర అంచుపెట్టి నేసిన చీర (కో. 25, 27, 28, 31-37).

**బొత్తంచులుంగి** బొత్తంచు పెట్టి నేసిన లుంగి (కో. 36).

**బొత్తల్** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 17).

**బొద్దంచు** **1.** బట్టచివర వెడల్పుగా నేసిన అంచు (కో. 12, 18-22, 26, 30; **2.** 2-4 వేళ్ళ వెడల్పున మామూలుగా నేసిన అంచు; కొన్నిచోట్ల కుప్పడం నేతలో నేస్తారు (తె. 4, 12-14, 17); **3.** మామిడంచు పక్కన రంగుగీరలు పడేట్టు నేసిన అంచు (కో. 7); **4.** లావుదారపుపోగు (=బొద్దు)లతో నేసిన అంచు (కో. 6; తె. 10).

**బొద్దు** **1.** అంచుపడుగులో చివర అతికిన లావు దారం (తె. 10); **2.** కమ్మినేతలో తలచిట్టెకు ముందు రెండు కొలుకుల జమిలిదారంతో నేసిన భాగం (కో. 8).

**బొద్దుకమ్మి** ఒకరకంకమ్మి : **1.** రెండుమూడువేళ్ళ వెడల్పు రంగుపట్టె; పక్కల తెల్లకొలుకుల గీరలు పడేట్టు నేసినకమ్మి (తె. 14); **2.** నాలుగు పోగుల పురిదారం(=బొద్దు)పెట్టి నేసినకమ్మి(కో.11,20,21).

**బొద్దుచువ్వ** ?నేత, చివరికి వచ్చేటప్పుడు పైపోగు లకు, కింది పోగులకు మధ్య ఎక్కించిన సన్నబెత్తం (కో. 6).

**బొద్దుపోగు** మందపుదారం (తె. 12).

**బొద్దుమళ్ళచీర** రెండేసి కొలుకుల ఎర్రపోగులు పడేట్టు నేసిన చిన్నగడి(=మడి)చీర (తె. 14).

**బొంద** పర్యా. చూ. తాలి(1). నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి; దీంట్లో బిగించిన పుల్లకు దారంకట్టి బద్దెచువ్వ బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా అయిదారుంటాయి. చూ. చిత్రం 123 చ. 4 (రా. 7).

**బొందు** ఉ. బందు **1.** పర్యా. బొందుకట్టునూలు. నూలుఅద్దకంలో చుక్కకట్టటానికి వాడే నూలు; (చుట్ట); కొన్నిచోట్ల, నేతలో అడ్డానికి వాడతారు (కో. 7; తె. 11); **2.** నూలులెక్క : లడీలో పదోవంతు నూలు (కో. 8, 9, 13); **3.** ?లడీలో ఇరవయ్యోవంతు నూలు (రా. 1); **4.** లడీ (రా. 3); **5.** పర్యా. చూ. చేదుబొందు. చేదుకర్రల బిగింపుకు దారాలతో నేసే లోహపుచుట్టు(=రింగు); ఇనపదిగాని, ఇత్తడిదిగాని. చూ. చిత్రం 125 క. 1 (కో. 29-33, 35-37).

**బొందుకట్టునూలు** పర్యా. బొందు(1). నూలు అద్దకంలో చుక్కకట్టటానికి వాడే నూలు(చుట్ట);కొన్ని చోట్ల నేతలో అడ్డానికి వాడతారు (కో. 7).

**బొందుకదురు** బొందురాట్నం బొమ్మలకు బిగించే మందపుకడ్డీ; పెద్దకదురు. చూ. గంటం (తె. 10).

**బొందుచాయ** ఉ. బొందుసాయ. ఒకరకం(?ఎరుపు) రంగు (కో. 1).

**బొందుజంగ** బొందురాట్నానికి గంటం అమర్చే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి (తె. 10).

**బొందుపడుగు** రంగుల అద్దకంలో చుక్కకట్టటానికి వాడే పడుగునూలు (కో. 7).

**బొద్దుపడుగు** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చినరాటి; చూ. రాటి. చూ. చిత్రం 34 (కో.2).

**బొందుపంటె** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి; చూ. రాటి. చూ. చిత్రం 34 (కో. 2).

**బొందుపీట** బొందురాట్నం కిందిపీట (తె. 10).

**బొందురాట్నం** రంగునూలుతోడే రాట్నం; చూ. బొందు (తె. 10).

**బొమ్మ** ఒకరకం లోహపుపాత్ర; ఇత్తడిదిగాని రాగిదిగాని; దీంట్లో నూలులడీలు నానబెడతారు (రా. 15).

**బొబ్బిలంచు** రెండు మూడు గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు (కో. 31).

**బొమ్మ** **1.** పర్యా. చూ. చెయ్యి(1). పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువుకొయ్యకు బిగించిన పిడి. చూ. చిత్రం 1.7 (రా. 8, 10); **2.** పర్యా. చూ. చెయ్యి(2). రాట్నం ఇరుసు తిప్పే(కొయ్య)పిడి. చూ. చిత్రం 15.9 (కో. 3, 6, 9, 10; రా. 7, 9, 12, 19, 23, 24); **3.** రూ. బొమ్ము; పర్యా. కదురు పీట(1), చీరెబొమ్మ, చెవులకొయ్య, చెవులపట్టె, చెవుల పీట, చెవులబొమ్మ(1), తోకబొమ్మ, పీటబొమ్మ, బెన కప్ప, బొమ్మకొయ్య(1), బొమ్మచెక్క(1), బొమ్మ పట్టె(2), బొమ్మప్ప, బొమ్మబల్ల, బొమ్మ(ల)పీట, మొగం(బల్ల), వెనకయ్య(పీట) (1). రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య; చాలా చోట్ల దీన్ని వినాయకుడి బొమ్మ ఆకారంలో చెక్కు తారు. చూ. చిత్రాలు 15.10, 15 ట. (కో. 1-6, 8, 9, 14, 16, 27-29, 35-37; తె. 1, 2, 8, 18-20, 24, 28, 29, 33; రా. 4, 5, 7-24); **4.** నూలు లెక్క : రెండు లడీల నూలు (కో. 2); **5.** పర్యా. కమ్మి(3), గంటంగుజ్జు, గుంజ(2), చెవి(2), చెవిపట్టె, నిలువు(7), నిలువుకమ్మి(5), నిలువుగుజ్జు(2), నిలువు పట్టె(5), నిలువుబొమ్మ, బొమ్మపట్టె(3), బొమ్మల కొయ్య. డబ్బారాట్నానికి గంటం బిగించేనిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (కో. 2, 37; రా. 7, 11); **6.** పర్యా. చూ. చెయ్యి (3). డబ్బారాట్నం ఇరుసు తిప్పేపిడి; ఇది కుడిచేతి వైపున ఉంటుంది. చూ. చిత్రం 41 క. 11 (రా. 9);

**7.** పర్యా. డాగుగుజ్జు, డాంగ్(1), హాకాడా. పన్నె దండెల బిగింపుకు దారాలు కట్టిన జంత్రం నిలువు కొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 2 (కో. 1); **8.** పర్యా. చూ. పలకసీల, చేతిమగ్గం పలకనూగుండునూ కలిపి బిగించినకొయ్య; కొన్నిచోట్ల దీనికి పై భాగంలో నగిషీలు చెక్కుతారు; కొన్నిచోట్ల దీన్ని తొలిచి లోపల గజ్జెలు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 3 (కో. 2); **9.** పర్యా. ఎదురుబొమ్మ, గద్దె గుర్రం(3), గుర్రపు చెక్క, గూటిచెక్క, చెంపపలక, చెవి(5), టూపీ; తన్నుడు చెక్క, తాపుచెక్క, తొట్టిచెక్క(1), తొట్టిబొమ్మ, తొట్టిమూత, దాపుచెక్క, దాపుడుముక్క, దొప్ప, పక్కబొమ్మ, పీట(13), పేటీబొమ్మ, పోటుబల్ల, బొమ్మకొయ్య(3), బొమ్మచెక్క(2), ముసుగుచెక్క, మూత(2), మూతచెక్క, మొత్తచెక్క, లాటుబొమ్మ, సట్టరుబొమ్మ, సట్టరుమొకం. మరమగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి పానుపుపట్టెకు రెండు కొసలా ఉంటాయి. చూ. చిత్రం 118.16 (తె. 24, 31; రా. 5-8, 11· 13-15, 17, 18, 23, 24); **10.** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు నిలువుపట్టెకు పటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడత దారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (కో. 2; తె. 11); **11.** పర్యా. చూ. గుర్రం(4). మరమగ్గం సొరుగుకు మొదట బిగించిన చెక్క; దవడచెక్కలకు నాడెదెబ్బ తగలకుండా ఇటువంటివి రెండు బిగిస్తారు. చూ. చిత్రం 118.19 (రా. 7, 23); **12.** పర్యా. చూ. చెవుకట్టు(2). పుల్లిరును నిలవటానికి పైపట్టికి బిగించినచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121 చ. 4, 121 ప. 2 (కో. 2; రా. 14); **13.** పర్యా. కత్తెర(2). ఒకరకం డిజైను నేతనేసేటప్పుడు అడ్డబేలు దారాలను పైకి ఎత్తటానికి వాడే కొయ్యపనిముట్టు. చూ. చిత్రం 137 (తె. 5, 18); **14.** డాబీకుక్కను గుంజే కొయ్యపుల్ల. చూ. చిత్రం 132 క. 7 (రా. 11, 13); **15.** డాబీ కుక్కకు, పట్టెకు మధ్య ఇనపరేకు (రా. 15); **16.** ?డాబీసలాకిని గుంజే కొయ్యపుల్ల (రా. 24); **17.** పర్యా. జంతరబొమ్మ. గొంగడిమగ్గం జంత్రంలో కింది కట్టెను, పైకట్టెను కలిపే నగిషీచెక్క; ఇటువంటివి మూడుంటాయి. చూ. చిత్రం 316.2 (తె. 3, 9-11, 22, 27, 28).

**బొమ్మకట్టె** **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 19); **2.** ఉ. -కట్టి; పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (రా. 13, 14, 23).

**బొమ్మకాల** పర్యా. చూ. చీరె. రాట్నం 'బొమ్మ'లో వడిదారం తిరగటానికి చెక్కినగాడి. చూ. చిత్రం 15.11 (తె. 29).

**బొమ్మకొయ్య** **1.** పర్యా. చూ. బొమ్మ(3). రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువు కొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడిబొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చిత్రం 15.10 (కో. 6); **2.** పర్యా. చూ. చెయ్యి(2). రాట్నం ఇరుసు తిప్పే కొయ్యపిడి. చూ. చిత్రం 15.9 (రా. 1; 21); **3.** ఉ. -కొయ్యి. పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర నాడెబయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. చూ. చిత్రం 118.16(రా. 1).

**బొమ్మచెక్క** **1.** పర్యా. చూ. బొమ్మ(3). రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువు కొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడిబొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చిత్రం 15.10 (కో. 14)· **2.** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర నాడెబయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో. 5).

**బొమ్మంచు** **1.** డాబీమగ్గంమీద, డిజైను(=బొమ్మ)లు నేసిన అంచు (కో. 8, 9బి); **2.** తెల్లచీరకు పెట్టిన ఎర్రంచు (కో. 7).

**బొమ్మంచుచీర** ఎర్రంచు తెల్లచీర (కో. 7).

**బొమ్మపట్టె** ఉ. -పట్టి, బొమ్మప్పట్టె, బొమ్ముపట్టి. **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (కో. 6; రా. 14, 17); **2.** పర్యా. చూ. బొమ్మ(3). రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడి బొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చిత్రం 15.10 (కో. 27); **3.** పర్యా. చూ. బొమ్మ(5). డబ్బా రాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (రా. 23); **4.** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడత దారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (రా. 17).

**బొమ్మపేటంచు** ఒకరకం డిజైనులో నేసిన అంచు (కో. 26).

**బొమ్మప్ప** పర్యా. చూ. బొమ్మ(3). రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడి బొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చిత్రం 15.10 (రా. 18).

**బొమ్మబద్ద** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (తె. 19).

**బొమ్మబల్ల** పర్యా. చూ. బొమ్మ(3). రాట్నం పీటకు ఎడమ వైపున కదురు బిగించే నిలువుకొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడి బొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చిత్రం 15.10 (కో. 29).

**బొమ్మలకట్టె** పర్యా. చూ. నాగవాసం (6). గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె; మామూలుగా వంపుగా ఉంటుంది. చూ. చిత్రం 316.3 (తె.10).

**బొమ్మలకొయ్య** పర్యా. చూ. బొమ్మ(5). డబ్బా రాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 41 క. 5 (రా. 1).

**బొమ్మ(ల)పీట** పర్యా. చూ. బొమ్మ(3). రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడి బొమ్మ ఆకారంలో చెక్కుతారు. చూ. చిత్రం 15.10 (కో. 3, 28; తె. 18, 19, 24, 28, 29).

**బొమ్మె** చూ. బొమ్మ(3) (రా. 17).

**బొరక** కన్నం; చిల్లి (రా. 7).

**బొరడు** చెట్టుబెరడు (కో. 1)

**బొర్ర** పర్యా. చూ. పూనుగర్ర. ?పావుచెక్క తొక్కినప్పుడు, అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండు వైపులా అచ్చుకర్రలతాళ్ళూ మధ్యలో పావుచెక్కల తాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (రా. 19).

**బొల్లి** (-పడు). పడుగుకు గంజిపెట్టేటప్పుడు గంజి అంటకుండా అక్కడక్కడ మిగిలిన పడుగుభాగం (కో. 32).

**బొల్లిగొర్రె** మొహం తెల్లగా ఉన్నగొర్రె (తె.22).

**బొల్లు** ఉ. బొళ్ళు; పర్యా. చూ. డొల్ల. పడుగులో పైపోగులకు, కింది పోగులకు మధ్య వెలితి; అనిలేని భాగం; మామూలుగా రెండు అనుల నడుమ పోగులకు డొల్ల ఉంటుంది; సరిచేసేటప్పుడు అనిలాకలు తీసేసి డొల్ల చేస్తారు (తె. 5; రా. 12, 18).

**బోకి** 1. పర్యా. పెంక(1). కుండపెంకు; మధ్య పల్లంగా ఉన్నది; ఉన్ని నూలు కూర్చొని వడికేటప్పుడు కుదురు దీనిమీద పెట్టి తిప్పుతారు; కొన్నిచోట్ల కదురు మొలికి అరగకుండా దీంట్లో బట్ట వేస్తారు. చూ. చిత్రం 308.3 (తె. 9, 20, 30); **2.** నేతనేసేటప్పుడు గొంగడి ముందు భాగం తడపటానికి అంబలిపోసిన ముంత (తె. 27).

**బోటు** ఉ. బొట్టు. **1.** (-చుట్టు) పర్యా. చూ. కండె(2). రాట్నంమీద జొన్నదంటుముక్కకు చుట్టిన నూలు; పేకకు(=నేతలో అడ్డానికి) వాడే నూలు కండె(=చుట్ట)లుగా చుడతారు; నేత నేసేటప్పుడు దీన్ని నాడెగాడిలో అమరుస్తారు. చూ. చిత్రం 51 (కో. 4-7, 9, 18; తె. 11, 13-16; రా. 9-12, 19-21); **2.** పర్యా. చూ. కండెబోటు(2). నిండుకండెలో కొంత దారం ఉపయోగించుకోగా మిగిలింది. చూ. చిత్రం 52 (కో. 11, 20, 21); **3.** చిన్నకండె (కో. 8, 11, 12ఎ, 17; రా. 2, 5, 6); **4.** రాట్నంమీద వడికిన (ఖాదీ)నూలు (కో. 14; తె. 17); **5.** (< bolt) దే చెక్క ఇనపకడ్డీని బిగించటానికి పెట్టిన ఒరలచుట్టు. చూ. చిత్రం 283 జ. 2 (రా. 10); **6.** పర్యా. చూ. కండె(4). నవారు నేతలో వాడే పేకదారంచుట్టు; రాట్నంమీద జొన్నపుల్లకు చుడతారు. చూ. చిత్రం 324 క. 6 (రా. 10).

**బోటుచెక్కు** (క్రి.) పర్యా. కండెవాటు. నాడె ముల్లుకు పేకదారం కండె(=బోటు)గుచ్చటం (కో. 4).

**బోట్లడ్డ** బోట్లపింజెర మధ్య అమర్చిన కొయ్యగుండు (=అడ్డ); దీనికి అక్కడక్కడ బొడిపెలు(=బోట్లు)చేసి ఉంటాయి. చూ. చిత్రం 132 చ. 1 (తె. 22).

**బోట్లతొట్టి** పేకదారంకండె(=బోటు)లు వేసుకొనే తొట్టి; దీంట్లో నీళ్ళుపోసి మగ్గందగ్గర పెట్టుకొంటారు. (రా. 19బి).

**బోట్లపింజెర** పర్యా. అడదొడ్డి, అడ్డపింజెర(ం), దిండుపింజెర, బుడ్డిపింజెర, బొడ్డెల పింజెర. ఒకరకం డాడీ; దిండుకు బొడిపెలు(=బోట్లు)చేసింది; దిండుతిరిగినప్పుడు బొడిపెలు కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ (తె. 23).

**బోట్లరాటం** పర్యా. చూ. కండె(ల)రాట్నం. పేకకు పనికివచ్చే దారపుకండెలు (=బోట్లు) చుట్టే రాట్నం; మామూలు రాట్నం మీదనే కండెలు చుడతారు. చూ. చిత్రం 53 (రా. 11).

**బోట్లు** ?మరమగ్గం చట్రం బిగించిన పలకలు(కో. 35).

**బోడకుప్పనంఅంచు** ఉ. బోడకుపనంఅంచు. ఒక రకం కుప్పడం అంచు; చూ. కుప్పడంఅంచు (తె. 12).

**బోడకోక** అంచులేనిచీర; ముడిచీర (రా. 11).

**బోడసరం(అంచు)** రూ. బొగడసరం అంచు. ఒక రకం డిజైనులో నేసిన అంచు. చూ. చిత్రం 226 (కో. 6, 32, 34, 36, 37).

**బోడసరంచాపు** ఒకరకం చాపు; రెండు పంచెలు (కో. 37).

**బోడసరంచీర** రూ. బొగడసరంచీర. ఒకరకంఅంచు (బోడసరం అంచు)పెట్టి నేసిన చీర; చూ. బోడసరం అంచు (కో. 33, 36, 37).

**బోడసరంపేటు** అంచులోనేసే ఒకరకం డిజైను. చూ. చిత్రం 226 (కో. 6, 33, 34, 36, 37).

**బోడెంచు** ఉ. బోడంచు. **1.** మూడు నాలుగు వేళ్ళ వెడల్పు నేసిన ముద్దంచు; మామూలు అంచు (కో. 5; రా. 18); **2.** రంగు గీరలు లేకుండా నేసిన మైనూరంచు; బోడఅంచు (కో. 6); **3.** గుండంచు (కో. 8).

**బోంతకట్టు** (క్రి.) జంపఖానానేతలో అడ్డంలో రెండువైపులా తెల్లపట్టెలు, మధ్యలో ఎర్రపట్టె చొప్పున పడేట్టు వరసగా నెయ్యటం (తె. 17).

**బోనగర్ర** ఉ. బూనకర్ర, బోనకర్ర; పర్యా. చూ. అనుగొట్టం(1). అనుపోసేగొట్టం; దీంట్లోకి పోగుతీసుకొని అనుపోస్తారు. చూ. చిత్రం 48 (కో. 16, 21, 23-26, 28, 29, 32, 35-37).

**బోనచ్చు** (<బోను + అచ్చు) ఒకరకం అచ్చు; బోనుకమ్మి(=కమ్మిలో డిజైన్లు పడేది) నేతకు పనికి వచ్చేది; పన్నెగూడులో పైన కింద రెండేసి పోగుల చొప్పున దూర్చి అచ్చువడుల్లోకి ఎక్కిస్తారు. చూ. చిత్రం 101 చ (కో. 5, 7-10; తె. 13).

**బోను(అచ్చు)కమ్మి** ఉ. బోనచ్చుకమ్మి. మగ్గంలో ఎనిమిదికర్రల అచ్చు(=బోనచ్చు) అమర్చినేసిన ఒకరకం కమ్మి; దీంట్లో నాలుగుపోగులు కిందికి వస్తాయి; కొన్ని చోట్ల రేషం(=పట్టు)పెట్టి నేస్తారు (కో. 5, 7-9, 11-15; తె. 13, 14).

**బోనుకోలు** ఉ. బూనకోలు; పర్యా. చూ. అనుగొట్టం(1). అనుపోసేగొట్టం; దీంట్లోకి పోగు తీసుకొని అనుపోస్తారు; దేవాంగుల వాడుక. చూ. చిత్రం 48 (కో. 1, 7).

**బోనుగొట్టం** పర్యా. చూ. అనుగొట్టం(1). అనుపోసేగొట్టం; దీంట్లోకి పోగుతీసుకొని అనుపోస్తారు. చూ. చిత్రం 48 (కో. 33).

**బోరెం** జనపనారతో నేసిన పెద్ద గోతం; చూ. మాండలిక వృత్తిపదకోశం, ప్రథమ సంపుటం, వ్యవసాయ పదాలు (పుటలు 167, 294) (తె. 25).

**బోర్లె** పర్యా. మంగలం. చింతగింజలు వేయించే పెద్దకుండ; పెద్దబోకి (తె. 22).

**బోల్టుమగ్గం** ఒకరకం మరమగ్గం; మగ్గంచట్రం నిలువులను పై అడ్డపట్టెలకు బోల్టు(=స్క్రూమేకు)లతో బిగించింది. చూ. చిత్రం 112 (కో. 12).

**బ్రహ్మచారంచు** రెండు ఒకాల రంగు పోగులు, కొన్ని ఎక్కువ కొన్ని తక్కువపెట్టి నేసిన అంచు (కో. 12).

**బ్రిక్‌గడిచీర** (< brick-) ఇటికెల కట్టుబడి మాదిరి నమూనాలో నేసిన చీర; చూ. ఇటికెపెల్లంచు. చూ. చిత్రం 143 (కో. 2).

**బ్రెమ్మకమ్మి** ఒకరకం చీరకమ్మి; జైనెడు వెడల్పు చెంగునేసి, వేలెడు వెడల్పు పట్టెలుపెట్టి, చివర్లుపెట్టి నేసిన కమ్మి (కో. 4).

**బ్రేకు** **1.** మరానుచ్చెక్రాన్ని ఆపటానికి అమర్చిన పనిముట్టు (కో. 14); **2.** పర్యా. చూ. కమాను(3). మరనాడెగాడిలో ముల్లుకుగుచ్చిన కొయ్యకండె ఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడిరేకు. చూ. చిత్రం 131 త. 2 (రా. 15, 16); **3.** డాబీకట్టుబడిలో దిండును నిలపటానికి పెట్టిన ఇనపకొండి; చూ. కుక్క. చూ. చిత్రం 132 చ. 7 (కో. 25, 33).

**బ్రౌను** ఉ. బ్రవును బ్రౌన్. **1.** గోధుమరంగు; brown. చూ. చిత్రం 288 (కో. 2, 4, 7-9, 20, 21; రా. 8, 12, 24); **2.** ఎండు(ముదురు)పొగాకు కాడ రంగు (కో. 8, 12).

**బ్లాటింగు** లేతగులాబిరంగు; సిరా అద్దే కాయితం (blotting paper) రంగు (కో. 11).

**బ్లూ** ఉ. బునుగు, బులూ, బ్లు; రూ. బులుగు; పర్యా. చూ. నీలం. వయిలెట్, సిరా రంగులు కలిసిన ఒకరకం రంగు; blue; కొన్నిచోట్ల నక్కబాయికంటె లేతరంగు; గార్నెట్ (ఎ.) బి. ఒ.తో తయారు చేస్తారు. చూ. చిత్రం 288 (కో. 2, 11, 12, 15, 18-21, 35, 36; తె. 20, 25; రా. 6, 8, 13, 15, 19, 23, 24).

## భ

**భత్తురాలు** కలంకారీ అద్దకం డిజైన్లలో ఒకరకం. చూ. చిత్రం 283 ద. 4 (కో. 12).

**భగోణి** రూ. బొగోణి. ఒకరకం ఇత్తడిపాత్ర; కళాయిగిన్నె; దీంట్లో నూలులడీలు, కొన్నిచోట్ల పట్టు, నానబెడతారు (తె. 21).

**భట్టిప్రోలురుమాలు** ఉ. బట్టిప్రోలు-. ఒకరకం తల పాగ; తెలుపు, ఎరుపు, నలుపుగీరలు నల్చదరం గళ్ళుగా పడేట్టు నేసింది (తె. 19).

**భత్రాజులు** ఉ. బొత్రాజులు. తొగట(=నేతపని చేసే వాళ్ళలో ఒక తెగ) వారి దగ్గర అడుక్కొనే వాళ్ళు (రా. 9, 13, 15-17, 23).

**భమిడిపత్తి** చూ. పమిడిపత్తి (కో. 13).

**భావనారాయణ** పద్మసాలీల కులదేవుడు; గురువు; భావనారుషి (రా. 8).

**భావనారుషి** చేనేతపనిచేసే పద్మసాలీల కులదేవుడు; గురువు; భావనారాయణ అనీ అంటారు (కో. 1, 3, 6, 7, 30, 34, 37; తె. 4; రా. 1, 10).

**భావనారుషితిరణాల** పద్మసాలీలు చేసుకొనే పండుగ; మామూలుగా సంక్రాంతి వెళ్ళిన తరవాత చేస్తారు; కొన్నిచోట్ల మాఘమాసంలోగాని వైశాఖ మాసంలోగాని చేస్తారు; మట్టిబొమ్మకు పూజలుచేసి నాలుగోరోజున చెరువులో కలుపుతారు; కొన్నిచోట్ల కనుము పండుగ నాటినించి అయిదు రోజులు చేస్తారు (కో. 6).

**భావనారుషిపండుగ** పద్మసాలీలుచేసుకొనే పండుగ; మామూలుగా సంక్రాంతి వెళ్ళిన తరవాత చేస్తారు; కొన్నిచోట్ల మాఘమాసంలోగాని వైశాఖమాసంలో గాని చేస్తారు; మట్టిబొమ్మకు పూజలుచేసి నాలుగో రోజున చెరువులో కలుపుతారు; కొన్నిచోట్ల కనుము పండుగనాటినించి అయిదు రోజులు చేస్తారు (కో. 30, 34, 37).

## మ

**మగటం** ఒకరకం మడి(=మడుగు)పంచె; చిన్నది (రా. 14).

**మగపోగు** పర్యా. దండెపోగు(1). అనుపోసినప్పుడు పడుగులో పైకి వచ్చిన ఉన్నిపోగు (తె. 20).

**మగ్గం** ఉ. మఘ్గం, మొగ్గం. **1.** నేతబయలులో, బట్టలు నెయ్యటానికి అమర్చిన కొయ్యపలకలు(=పన్నె బిగించినవి), అచ్చు, దోనె మొ. వాటి మొత్తం; చేత్తో కుచ్చుగుంజుతూ నేసేమగ్గం(=మరమగ్గం)పలకలు ఒక కొయ్యచట్రంలో బిగిస్తారు. చూ. చిత్రాలు 108, 109, 127 (కో; తె; రా); **2.** పర్యా. చూ. మగ్గంచట్టం(1). మరమగ్గంలో, పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగు పట్టెల చట్రం; మామూలుగా దీని నిలువుపట్టెలకు కుచ్చు తాళ్ళు కట్టే కొయ్యలు బిగిస్తారు; కిందిపట్టెమీద(కండె) నాడె అడుతుంది. చూ. చిత్రం 118 (కో. 9, 24; రా. 5, 10); **3.** ఉ. మొగ్గం. తివాచీలునేసే సాధనం. చూ. చిత్రం 320 (కో. 16; తె. 10, 17).

**మగ్గంకొట్టు** (క్రి.) పర్యా. చూ. పలకకొట్టు. నేత నేసేటప్పుడు పడుగులో నాడె(=పేకదారంకండెగలది) చేసిన తరవాత పోగు దగ్గరబడేట్టు చేతిపలకతో అద మటం (రా. 19).

**మగ్గంకొయ్య** ఉ. మొగ్గంకొయ్య; పర్యా. చూ. కత్తెరగుంజ. మరమగ్గంచట్రం నిలబెట్టటానికి నేత బయలులో పాతిన ఒకరకం గుంజ; పైన ఒకటి, ఏట వాలుగా మరొకటి కొయ్యపట్టెలు బిగించింది; కత్తెర మాదిరిగా, లేక రైలురెక్క మాదిరిగా ఉంటుంది; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 117 (కో. 36).

**మగ్గంగజెం** ?కత్తెరగుంజకు, అడ్డంగా కొయ్యపట్టె బిగించిన ఇనపకడ్డీ (కో. 32).

**మగ్గంగడి** పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు; నేతనేసేటప్పుడు నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (కో. 27).

**మగ్గంగద్దె** ఉ. మొగ్గంగద్దె; పర్యా. చూ. పీర పట్టు. మగ్గంముందు నేతపనివాడు కూర్చొనేచోటు; మెరకగా ఉన్నది. చూ. చిత్రం 108.3 (తె. 25).

**మగ్గంగుంజ** పర్యా. చూ. సట్టరుగుంజ(1). మర మగ్గంచట్రం నిలబెట్టటానికి నేతబయలులో పాతిన కొయ్యరాట; ఇటువంటివి నాలుగుంటాయి; కొన్ని చోట్ల రెండు. చూ. చిత్రం 116.2 (రా. 20).

**మగ్గంగుంట** ఉ.మొగ్గంగుంట; రూ. మగ్గంగుంత(1). పర్యా. గుంట(2), గొయ్యి(2), మగ్గంగొయ్యి. నేత బయలులో పావుకోళ్ళు అమర్చటానికి తవ్వినచోటు; మోకాలులోతు ఉంటుంది. చూ. చిత్రం 108.2 (కో. 3, 5, 7, 10, 30; తె. 14-16, 18, 28-33; రా. 15).

**మగ్గంగుండి** పర్యా. చూ. పలక(7). మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క; నేతనేసేటప్పుడు పడుగులో పేక వేసి దీంతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (కో. 28).

**మగ్గంగుండు** **1.** పర్యా. చూ. గుండు(4). చేతి మగ్గంపన్నె బిగించిన కిందికొయ్య; రోకలి మాదిరిగా గుండ్రంగా ఉంటుంది; దీన్ని పలకసీలలతో పైపలకకు బిగిస్తారు. చూ. చిత్రం 109 చ. 7 (రా. 7, 8); **2.** ఉ. మొగ్గంగుండు; పర్యా. చూ. పానుపుపట్టె. మర మగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు

దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండుచివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 2; రా. 7, 8).

**మగ్గంగుంత** ఉ.మొగ్గంగుంత. **1.** చూ. మగ్గంగుంట (కో. 1, 2, 6, 9; తె. 1, 2, 4-9, 12, 13, 21, 23, 25, 27; రా. 1-14, 16-18, 20, 21, 23, 24); **2.** గొంగడి నేసేవాడు మగ్గందగ్గర కూర్చున్నప్పుడు కాళ్ళు పెట్టుకోటానికి తవ్విన చిన్నగొయ్యి. చూ. చిత్రం 315.19 (తె. 6, 26).

**మగ్గంగూటం** ఉ. మొగ్గం-. **1.** పర్యా. చూ. వెన్నుగూటం. ఉన్నిమగ్గం దోనుగను మోసే ఎడమవైపు కొయ్యగూటం. చూ. చిత్రం 315 క. 2 (తె. 7, 27); **2.** పర్యా. చూ. తలగూటం. ఉన్ని మగ్గానికి వేసిన పడుగు బిగింపుకోసం చివర నేలలో పాతిన కొయ్య; కొన్నిచోట్ల రాయి; మగ్గంతాడు దీనికి తగిలించి బిగిస్తారు. చూ. చిత్రం 315 క. 18 (తె. 26); **3.** నవారుమగ్గం కట్టుబడిలో వడిదారాలు అల్లిన కర్రలకు ఆధారంగా నేలలో పాతినకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 324 క. 3 (తె. 6).

**మగ్గంగొయ్యి** ఉ. మొగ్గం-; పర్యా. చూ. మగ్గంగుంట. నేతబయలులో పావుకోళ్ళు అమర్చటానికి తవ్వినచోటు; మోకాలులోతు ఉంటుంది. చూ. చిత్రం 118.2 (కో. 20, 22, 23, 25-29, 31-33, 35-37).

**మగ్గంచట్టం** ఉ. మొగ్గంసట్టం. **1.** పర్యా. చట్టం (2), పంజెరం(2), బడ్డీ(3), మగ్గం(2), మగ్గంబడ్డీ(2), మరచట్టం, లాటు, సజ్జు, సట్టరు(1). మరమగ్గంలో, పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగు పట్టెలచట్రం; మామూలుగా దీని నిలువుపట్టెలకు కుచ్చుతాళ్ళుకట్టే కొయ్య బిగిస్తారు; కింది పట్టెమీద(కండె)నాడె ఆడుతుంది. చూ. చిత్రం 118 (రా. 18-20); **2.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 3; రా. 5).

**మగ్గంచదర** పర్యా. చదర. నేతనేసేటప్పుడు నేతపనివాడు కూర్చొనే చిన్నచాప; కొన్నిచోట్ల తడిక; కొన్నిచోట్ల నాడె మగ్గంగుంటలో పడకుండా గుంటమీద పెడతారు (కో. 17).

**మగ్గంచెవు** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (కో. 10).

**మగ్గంజిల్ల** ఉ. మొగ్గం-; పర్యా. చూ. చిల్ల(7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118 క. 8 (రా. 4).

**మగ్గంజొరు** (క్రి.) ఉ. మొగ్గంజొర్రు. మగ్గంముందు కూర్చొని నేతపని ప్రారంభించటం (తె. 12, 17).

**మగ్గంతాడు** **1.** పర్యా. చూ. చెంపతాడు(4). కుచ్చుతాళ్ళలో డైమనుతాడుకు ఒకవైపు కట్టిన దారం; దీనిపైన మగ్గం నిలువుపట్టెకూ కింద ఉడతతాడుకూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.23 (కో. 11, 13, 15, 23); **2.** పర్యా. చూ. నేతమోకు. మగ్గంమీద నేతపడుగును బిర్రుపెట్టే లావుపాటితాడు; ఒకవైపు పెడకోలకు మధ్యగా కట్టి మిడిగూటానికి మెలివేసి రెండోవైపు చేతిగూటానికి కడతారు; నేత దగ్గరికి రావటానికి మోకు వదులుతారు; వెనక్కు జరగటానికి బిగలాగుతారు. చూ. చిత్రాలు 121 క. 1, 127.15 (తె. 6; రా. 3).

**మగ్గంనిడువకమ్మి** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గంచట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ.చిత్రం118.1(కో.22).

**మగ్గంనిలువు** ఉ. మొగ్గం-; పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గంచట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 25; రా. 7).

**మగ్గంపందిరి** ఉ. మొగ్గం-; పర్యా. పందిరి, బడ్డీ(2), మగ్గంబడ్డీ(1). నేతబయలులో మరమగ్గంచట్రం నిలబెట్టటానికి నిలువురాటలకు అడ్డంగా మంచె మాదిరిగా బిగించినకర్రలు; మగ్గంగుంటకుపైన, ఎత్తుగా వేస్తారు. చూ. చిత్రం 116 (కో. 7, 8, 9బి, 10, 22; తె. 15, 16).

**మగ్గంపలక** ఉ. మొగ్గం-. **1.** పర్యా. చూ. పలక(4). చేతిమగ్గం పన్నె బిగించిన పైచెక్క; పలచగా పొడుగ్గా ఉంటుంది; దీనికి గుండు బిగిస్తారు; దీనికి పైన దారాలు కట్టి వేలాడదీస్తారు; నేతనేసేటప్పుడు పోగు దగ్గరపడటానికి దీంతో అదుముతారు. చూ. చిత్రం 109 చ. 1 (కో. 25-28, 32; రా. 19); **2.** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి కుచ్చుచెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (రా. 4); **3.** పర్యా. చూ. పలక(7). మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క; నేతనేసేటప్పుడు పడుగులో పేకపోగు వేసి దీంతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (కో. 7, 32).

**మగ్గంపొగడ** ఉ. మొగ్గంపొగడా; పర్యా. చూ. చుట్టు(4). మగ్గానికి అమర్చి, నేతబయలులో చాపిన పడుగునూలు; ఒక ఉరువు(బట్ట)నేతకు సరిపడేది; 8-10 మూరల పొడుగు ఉంటుంది. (తె. 27).

**మగ్గంపీట** నేతపనివాడు మగ్గందగ్గర కూర్చోటానికి వేసుకొనేపీట (కో. 37).

**మగ్గం(పు)తాడు** ఉ. మొగ్గపుతాడు, మొగ్గంతాడు; పర్యా. చూ. నేతతాడు(2). గొంగడి నేసే మగ్గం బిగించేతాడు; దీన్ని చివర ఊడుగోలకు కట్టి తలగూటానికి చుట్టి చేతిదగ్గర గూటానికి బిగిస్తారు; కొన్నిచోట్ల తట్టుగూటం దగ్గరనించి గుంజుతారు. చూ. చిత్రం 315.16 (తె. 7, 9, 11, 26, 28).

**మగ్గంపురితాడు** ఉ. మొగ్గం-; పర్యా. చూ. బిరుతాడు(2). మరమగ్గం నిలువుపట్టెను మేరుపుపలకకు బిగించి, సన్నపుల్లతో వడిపెట్టిన దారం; మేరుపుపలకను పైకిగాని, కిందికిగాని జరుపుకొని దీంతో బిరుపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 2).

**మగ్గంబడితె** ఉ. మొగ్గం-. 1. పర్యా. చూ. అడ్డకట్టె(10). నేతబయలులో మరమగ్గంచట్రం నిలబెట్టటానికి నిలువురాటలకు అడ్డంగా మామూలుగా బిగించిన కర్ర; కొన్నిచోట్ల దీనికి అచ్చుతాళ్ళు తగిలిస్తారు. చూ. చిత్రం 116.1 (తె. 32); 2. పర్యా. చూ. సూత్రాలకట్టె. మగ్గంతాళ్ళు (పలకతాళ్ళు, కోతిపుల్లలతాళ్ళు, గిరకలతాళ్ళు, పుల్లిరుసుతాళ్ళు మొ.వి) కట్టటానికి ఆధారంగా మగ్గానికిపైన అమర్చినకర్ర; కొన్నిచోట్ల వెదురుడి. చూ. చిత్రం 121 క. 14 (తె. 32).

**మగ్గంబడ్డి** 1. ఉ. మొగ్గం-; పర్యా. చూ. మగ్గంపందిరి. నేతబయలులో మరమగ్గంచట్రం నిలబెట్టటానికి నిలువురాటలకు అడ్డంగా మంచె మాదిరిగా బిగించిన కర్రలు; మగ్గంగుంటకు పైన ఎత్తుగా వేస్తారు. చూ. చిత్రం 116 (కో. 23); 2. పర్యా. చూ. మగ్గంచట్టం (1). మరమగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగుపట్టెలచట్రం; మామూలుగా దీని నిలువుపట్టెలకు కుచ్చుతాళ్ళుకట్టే కొయ్యలు బిగిస్తారు; కిందిపట్టెమీద(కండె)నాడె ఆడుతుంది. చూ.చిత్రం118(కో.26).

**మగ్గంబయలు** పర్యా. నేతబయలు. ఇంట్లో నేతపనికి కేటాయించిన చోటు; ఇక్కడ మగ్గం అమరుస్తారు. చూ. చిత్రం 108 (రా. 13).

**మగ్గంబల్ల** ఉ. మొగ్గం-; పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగు లుంటాయి. చూ. చిత్రం 18.9 (కో. 7, 32).

**మగ్గంబెడుగు** పర్యా. చూ. మేరుపుపలక. మరమగ్గంచట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి కుచ్చుచెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు ఇది మగ్గంపందిరమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 10).

**మగ్గంమేకు** పర్యా. చూ. చిల్ల(7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (రా. 1).

**మగ్గంమోకు** ఉ. మొగ్గం-; పర్యా. చూ. నేతమోకు. మగ్గంమీద నేతపడుగును బిరుపెట్టే లావుపాటి తాడు; ఒకవైపు పెడకోలకు మధ్యగా కట్టి మిడిగూటానికి మెలివేసి రెండోవైపు చేతిగూటానికి కడతారు; నేత దగ్గరికి రావటానికి మోకు వదులుతారు; వెనక్కు జరపటానికి బిగలాగుతారు. చూ. చిత్రాలు 121 క. 1, 127.15 (కో. 24; తె. 1).

**మగ్గంలాక** ఉ. మొగ్గం-; పర్యా. చూ. నేతలాక. నేతపడుగులో పైపోగులకు, కిందిపోగులకు మధ్య దూర్చిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 127.6 (రా.4).

**మగ్గంవైను** ఉ. మొగ్గం-; పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; దీనికి రెండు చివరలా సొరుగులుంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 22).

**మగ్గంవాడిచేయు** (క్రి.) నేతకు మగ్గం సిద్ధం చెయ్యటం; దేవాంగులవాడుక (కో. 7).

**మగ్గంవీధి** ఉ. -ఊది. మగ్గానికి తగిలించిన పడుగులో దోనె దగ్గరినించి దండెవరకూ ఉన్న భాగం. చూ. చిత్రం 127 (రా. 11, 13, 14).

**మగ్గంసందు** పర్యా. చూ. వాయిదారి. మగ్గం దోనెకూ దండెకూ మధ్యభాగం (తె. 33).

**మగ్గంస్తంభం** ఉ. -స్తంబం; పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గంచట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 32).

**మగ్గాలఇల్లు** ఉ. మొగ్గాలిల్లు. ఇంట్లో నేతపనికి కేటాయించిన ప్రదేశం; ఇక్కడమగ్గం అమరుస్తారు; చూ. నేతబయలు (తె. 8).

**మగ్గీ** తివాసీమగ్గం అచ్చుకర్రలకు అల్లిన వడిదారం; చూ. అచ్చు. చూ. చిత్రం 320.3 (కో. 16).

**మంతెన** (బహు. మంతెండ్లు). రంగునీళ్ళ అండాలో ఉడకబెట్టటానికి నూలులడిలు తగిలించిన ఇనపఊచ; దీన్ని పట్టుకోటానికి వీలుగా రెండువైపులా వంపులు

ఉంటాయి; దీంతో అడీలు రంగునీళ్ళలో ముంచి అండా అంచులమీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (తె. 18).

**మంగమ్మచీర** నిలువుకు తెలుపునూలు, పేకకు ఎరుపునూలుపెట్టి నేసిన కలనేతచీర (రా. 11).

**మంగలం** పర్యా. బోకె. చింతగింజలు వేయించే పెద్ద కుండపెంకు; పెద్ద బోకి (తె. 20, 25).

**మంగలాపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను. చూ. చిత్రం 264 (రా. 12).

**మచ్చుపెట్టు** (క్రి.) నేతపడుగుమీద గుర్తుపెట్టటం; నేతకు అవసరమైన పడుగు విడదీసుకోటానికిగాని మూరలలెక్క చూసుకోటానికిగాని గుర్తులు పెడతారు (కో. 37).

**మచ్చెర్దాన్‌నేత** దోమతెరనేత (తె. 28).

**మజీతుచెక్క** రంగుల అద్దకంలో వాడే ఒకరకం కొయ్యచెక్క (కో. 12).

**మంచిగంధంరంగు** ఒకరకం గోధుమరంగు (కో. 18).

**మంచిపట్టు** పర్యా. మంచిరేషం, మేలురేషం. మంచిరకం పురుగులనుంచి వచ్చే పట్టు; పోగు ఒకచోట లావు, ఒకచోట సన్నం లేకుండా అంతటా సమంగా ఉంటుంది (కో. 14, 15, 26).

**మంచిరేషం** పర్యా. చూ. మంచిపట్టు. ఒకరకం పురుగులనుంచి వచ్చే పట్టు; పోగు ఒకచోట లావు, ఒకచోట సన్నం లేకుండా అంతటా సమంగా ఉంటుంది. (తె. 21).

**మంజారుకొంగు** పర్యా. చూ. పైటచెరగు. చీర కట్టుకొన్నప్పుడు బుజంమీద వేలాడేట్టు వేసుకొనే చెరగు; చీరచివరి మూరెడుభాగం; మామూలుగా ఇది మొట్టమొదట నేస్తారు (తె. 13).

**మట్టకైల** ముప్పాతికగజం వెడల్పుపెట్టి నేసిన ఒకరకం తురకల గళ్ళలుంగి (కో. 1).

**మట్టమంచు** మూలమట్టం(=తాపీపనివాళ్ళ పరికరం; 'L' ఆకారంలో ఉండేది) ఆకారంలో డిజైను నేసిన అంచు; చూ. మెట్టుడిజైనంచు. చూ. చిత్రం 239 (రా. 19బి).

**మట్టాబుకర్ర** పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికిలాగే కర్ర; అచ్చు అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది; దీనికి రెండువైపులా అచ్చుకర్రలతాళ్ళూ మధ్యలో పావు చెక్కలతాళ్ళూ కట్టి ఉంటాయి; ఇటువంటి కర్రలు రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 5 (కో. 24).

**మట్టికుండ** పర్యా. కుండ(1). ఒకరకం మట్టిపాత్ర; మామూలుగా, పొయ్యిమీద ఎసరుపెట్టటానికీ గంజి పోసుకోటానికీ వాడేది (కో. 17).

**మట్టిబెంకె** ఉ. మట్టెంకె. ఒకరకం మట్టిపాత్ర; పెద్దమూకుడు చిప్ప మాదిరిది; దీంట్లో రంగునీళ్ళుపోసి, నూలులడీలు తడుపుతారు. చూ. చిత్రం 282 ట. 1 (తె. 16).

**మట్టిబాన** నీళ్ళు పోసుకొనే తొట్టి; రంగు అద్దిన బట్టలు దీంట్లో నానబెడతారు (కో. 26).

**మట్టిబోకె** ఒకరకం మట్టిపాత్ర; దీంట్లో రంగునీళ్ళు పోసి నూలులడీలు తడుపుతారు (తె. 29).

**మట్టిరంగు** ?ఒకరకం గోధుమ రంగు (కో. 2).

**మట్టు(కర్ర)** అనుపోసేటప్పుడు నూలుడబ్బాగాని పంటెగాని అమర్చే కొయ్యపనిముట్టు(కో. 25 27,28).

**మట్టుగర్ర** ఉ. మట్టుకర్ర; పర్యా. చూ. పూనుగర్ర. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; అచ్చుకర్రంత పొడుగునా అడ్డంగాఉంటుంది. దీనికి రెండువైపులా అచ్చుకర్రలతాళ్ళు కట్టి ఉంటాయి; ఇటువంటికర్రలు రెండుంటాయి; హరిజనుల వాడుక. చూ. చిత్రం 121 క. 5 (కో. 8, 9ఎ).

**మట్టుగర్రతాడు** పర్యా. చూ. అచ్చుగుది(2). మగ్గంలో పూనుగర్రకు కట్టిన దారం; అచ్చులో కింది కర్రకు ఉండేది; ఇటువంటివి కర్రకు రెండేసి ఉంటాయి. చూ. చిత్రం 121 క. 6 (కో. 9).

**మట్టుబల్ల** **1.** పర్యా. చూ. అడ్డపీట(1). పత్తి రాట్నం కిందిపీట. చూ. చిత్రం 1.2 (కో. 36); **2.** పర్యా. చూ. పీట(2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15.1 (కో. 34); **3.** పర్యా. చూ. తలచిట్టె(1). పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డ బద్దల్లో పైది. చూ. చిత్రం 19 క. 3 (కో. 37).

**మట్టె** పికానితాడు, కుచ్చుతాడు కలిపే చుట్టు; ఉంగరం లాంటిది. చూ. చిత్రం 118.25 (తె. 31).

**మడక** పర్యా. చూ. నాగలి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు పేటు అడపోగులు ఎత్తిపట్టుకొనే కొయ్య పనిముట్టు; నాగలి ఆకారంలో ఉంటుంది; దీన్ని మగ్గానికి పైనుంచి వేలాడదీస్తారు. చూ. చిత్రాలు 111 చ. 2, 136 త. (రా. 14).

**మడత** **1.** (-అతుకు) పర్యా. మడతపడుగు, మూగ, మూగఎంటి, మూగపడుగు, మూగసరి, మొండెం, మొండెంసరి, మోడి. అచ్చుతికేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు (కో. [illegible], 5-7, 10; తె. 11; రా. 13); **2.** చూ. [illegible]మడుపు (కో. 8).

**మడతకోల(లు)** ఒకరకం ఆను చివరిపీట[illegible]బిగించిన

కొయ్య(లు); పడుగు పెద్దది కావాలంటే వీటినిగూడా కలిపి అనుపోస్తారు (కో. 25).

**మడతచ్చు** పర్యా. ఒంటెచ్చు. ఒకరకం అచ్చు; నేతపడుగులో కిందిపొర పోగులు, పై పొర పోగులు అతికి నేసేది (కో. 2, 3).

**మడతపంచె** గొల్లవాళ్ళు కట్టుకొనే ఒకరకం పంచె; మూర పెద్దది (రా. 10).

**మడతపడుగు** పర్యా. చూ. మడత(1). అచ్చుతికే టప్పుడు కిందిపోగూ పైపోగూ కలిపి మొత్తం అతికే పడుగు (కో. 6).

**మడితబల్ల** పర్యా. చూ. వెనక(టి)పీట. అనుపీటల్లో చివరిది; దీనికి ఒకచాలులో అనుకొయ్యలు బిగించి ఉంటాయి. చూ. చిత్రం 45 క. 3 (కో. 25).

**మడతమాను** చూ. మర్తుమాన్ (తె. 19).

**మడతమోకు** రెండు వరసలుగా నేసిన నేతమోకు; దీంతో నేతపడుగు బిగిస్తారు (కో. 2).

**మడతసెల్లా** పర్యా. పచ్చడం(1). ఒంటిమీద కప్పు కోటానికి నేసిన ఒకరకం ముతకబట్ట; రెండుపొరలు (=మడత)గా నేసిన దుప్పటి; కొన్నిచోట్ల ఆరో నెంబరు నూలుపెట్టి రెండువేళ్ళవెడల్పు బొద్దంచులు, కమ్ములు నేస్తారు (రా. 11).

**మడతాను** (మడత+అను) అనుల్లో ఒకరకం: **1.** కొయ్య(=బిల్ల)ల సంఖ్య ఎక్కువ ఉన్న అను; 6 : 12 : 7 చొప్పున వరసగా ఉంటాయి (తె. 12); **2.** ఎదురు, వాలు అనులు పడేట్టు పడుగుపోసే అను; ఎక్కువ పుంజాల నూలుపోసే చేతిఅనుకాని మరాను కాని కావచ్చు (కో. 5, 7, 12ఎ; తె. 13); **3.** ముప్పయి రెండు మూరల పడుగుపోసే అను; దీనికి వరసగా 9 : 16 : 8 చొప్పున అనుకొయ్యలు ఉంటాయి (తె. 14).

**మడాయించు** (క్రి.) మండిగలో గంజికలియబెట్టటం (కో. 32).

**మడి** పర్యా. చూ. గడి. ఒకరంగు బట్టలో వేరే రంగు పోగులతో నేసిన చతురం (కో. 4).

**మడికెల** **1.** ఉ. మడికల, మడికాల; పర్యా. చూ. అల్లు(1). అచ్చుతికినపడుగు(కో. 4; తె. 8; రా. 7, 8, 11, 13, 22); **2.** (-కట్టు) మగ్గానికి అమర్చి నేత బయలులో చాపిన మొత్తం పడుగునూలు; ఆరుబయట మలగర్రలకు కట్టి తెచ్చింది (రా. 13).

**మడికెలకట్టు** (క్రి.) ఉ. మడికాల-. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపు చెయ్యటం; పడుగుమీద గుర్తులువేసి చివరిపాయలకు ముడులువేసి మగ్గానికి అమరుస్తారు; చూ. అల్లుచేయు (కో. 4; రా. 11, 13, 22).

**మడికెలకట్టె** ఉ. మడికల-; పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (తె. 2; రా. 10).

**మడికెలగుది** ఉ. -గుతి; పర్యా. చూ. మలగుద(2). పెడకోలకు తగిలించే, మలగర్ర-కొన్నిచోట్ల మలబద్ద-దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (తె. 7).

**మడికెలపట్టు** (క్రి.) పర్యా. అల్లుచేయు. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపు చెయ్యటం; పడుగుమీద గుర్తులువేసి చివరి పాయలకు ముడులువేసి మగ్గానికి అమరుస్తారు (కో. 6; రా. 7, 8).

**మడికెలబొంగు** ఉ. మడికల-; పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలుచుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (తె. 7).

**మడికోలకర్ర** పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరి పాయలు బిగించిన కర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (తె. 5).

**మడికోలగుది** ఉ. -గుతి; పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరిపాయకు కట్టినదారం; పొట్టెకొక దారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రం 127.8 (తె. 5).

**మడికోల(బొంగు)** పర్యా. చూ. మలగర్ర. నేత పడుగులో చివరిపాయలు బిగించినకర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్ని చోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (తె. 3, 5, 9).

**మడిచాపు** విశంతువులు కట్టుకొనే(మడి)బట్టలజత (కో. 9బి, 33).

**మడిచీర** విశంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకం బట్ట; తెల్లది; మామూలుగా 60 - 100 నెంబరు నూలుతో నేస్తారు; మామూలుగా ఒకకొంగుకి మామి డంచు పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల గోరంచుగాని కడ్డీ అంచుగాని పెట్టి నేస్తారు (కో. 19; తె. 15).

**మడిధోతి** పర్యా. చూ. మడిపంచె. విశంతువులుకట్టుకో టానికి నేసిన ఒకరకం బట్ట; తెల్లది; మామూలుగా 60-100 నెంబరు నూలుతో నేస్తారు; మామూలుగా ఒకకొంగుకి మామిడంచు పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల

గోరంచుగాని, కడ్డీఅంచుగాని పెట్టి నేస్తారు; దీనికి రెండువైపులా ఒకే రకం కమ్మి నేస్తారు (కో. 14).

**మడిపంచె** ఉ. -పంచి; పర్యా. మడిధోతి, మడుగు పంచె. వితంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకం బట్ట; తెల్లది; మామూలుగా 60-100 నెంబరు నూలుతో నేస్తారు; మామూలుగా ఒకకొలికి మామిడంచుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల గోరంచుగాని కడ్డీఅంచుగానిపెట్టి నేస్తారు. (కో. 9, 11, 12, 15, 22, 32, 34, 35; తె. 19).

**మడిమకొయ్య** ఉ. మడెమ-, మెడమ-; పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా వెనకవైపు మడిమ దగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 5, 15, 24).

**మడిమతాడు** ఉ. మడిమి-, మడిమె-, మడెం-, మెడమ-, మెడిమె-; పర్యా. అడ్డతాడు(2), ఇమురు తాడు, గూటంతాడు, తొక్కుడు చెక్కలతాడు, పాక చెక్కలతాడు, పాకోడు(చెక్క)తాడు, పావుచెక్కల తాడు, పిఛాడీతాడు, మిడిగూటంతాడు. పావుచెక్కను గూటానికి బిగించే వెనకతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 3 (కో. 10; తె. 7, 9, 13, 22-24).

**మడుగుపంచె** ఉ. మొడుగు-; పర్యా. మడిపంచె. వితంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకంబట్ట; తెల్లది; మామూలుగా 60-100 నెంబరు నూలుతో నేస్తారు; మామూలుగా ఒక కొలికి మామిడంచుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల గోరంచుగాని కడ్డీఅంచుగానిపెట్టి నేస్తారు (రా. 16).

**మడుపు** (-పారు). రూ. మడత(2); పర్యా. చూ. చుట్టు(4). మగ్గానికి అమర్చి నేతబయలులో చాపిన పడుగునూలు; ఒక ఉరువు(బట్ట)నేతకు సరిపడేది; 8-10 మూరల పొడుగుంటుంది (కో. 6, 9).

**మడుపుకచ్చులువేయు** (క్రి.) పడుగులో ఒకబట్ట నేతకు సరిపడే నూలు(=మడుపు)లో రెండేసి కచ్చులు వెయ్యటం; చూ. కచ్చి (కో. 9).

**మడుపుకట్టు** (క్రి.) పర్యా. చూ. మలచుట్టు. అల్లు చేసిన పడుగును మల(=ఒకబట్ట నేతకు సరిపడే పడు గు)లుగా విడదీసి చుట్టటం; ఒక్కొక్క మల ఒక్కొక్క చుట్టగా వస్తుంది (రా. 19).

**మడుపుకట్టె** పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్ని చోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (రా. 19).

**మడుపుకర్ర** పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్ని చోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు; కొన్నిచోట్ల హరిజనులవాడుక. చూ. చిత్రాలు 127.10, 128 త. 3 (కో. 6, 9; తె. 13; రా. 21).

**మడుపుపారు** (క్రి.) మగ్గంమీద ఒకనేతకు సరిపడే పడుగు(=మడుపు) విస్తరిల్లటం (కో. 6).

**మడుపుసాగు** మగ్గానికి చాపిన పడుగు (కో. 6).

**మద్దిచాయ** ఉ. -సాయ. మద్దిచెక్కతో తయారు చేసిన ఎర్రరంగు (కో. 10).

**మద్దిచెక్క** మద్దిచెట్టుచెక్క; దీన్ని పొడిచేసి ఎరుపు రంగు(=తొగరు) తయారుచేస్తారు; పూర్వం వాడుకలో ఉండేది (కో 10; తె. 11; రా. 16).

**మద్దిచెక్కరంగు** ఒకరకం ఎరుపురంగు; మద్దిచెట్టు చెక్క పొడిచేసి తయారు చేస్తారు; పూర్వం వాడుకలో ఉండేది (తె. 11).

**మద్దిరంగు** 1. ఎరుపులో ముదురువన్నె (రా. 16). 2. వన్యంరంగుకంటె ముదురువన్నె; పూర్వం వాడుకలో ఉండేదట (రా. 18).

**మద్దిలుంగీచీర** మద్దివన్నె(=ఒకరకం ఎరుపు)గీరలు పడేట్టు నేసిన గళ్ళచీర; తురకల లుంగీ మాదిరిది (రా. 16).

**మణిగె** చూ. మండిగె(3) (కో. 8).

**మణిపూస** పర్యా. చూ. పూస(6). మరనాడెలో కండెపోగు బయటికి రావటానికి బెజ్జంలో బిగించిన గాజు పూస; కొన్నిచోట్ల పోగుదూరే సందు(=బెజ్జం);దీంట్లో నుంచి పోగు సాపుగా వస్తుంది; మామూలుగా ఒకటి ఉంటుంది; కొన్నిచోట్ల 2-0 ఉంటాయి. చూ. చిత్రం 131 త. 1 (తె. 2).

**మంటికాగు** నూలులడిలు రంగునీళ్ళలో ఉడకబెట్టే మట్టిపాత్ర (తె. 3).

**మంటిగోలెం** నూలులడిలు నానబెట్టే మట్టిపాత్ర; కొన్నిచోట్ల దీంట్లో నీళ్ళు పోసుకొంటారు. చూ. చిత్రం 282 క. 8 (తె. 5).

**మండ** 1. వెడల్పుమూతి మట్టిపాత్ర; నూలు చిలపలు దీంట్లోవేసి తడుపుతారు. చూ. చిత్రం 40 (తె. 16); 2. పర్యా. అలుకుమండ. సరిచేనేటప్పుడు పడుగుమీద గంజి చిలికే ఆకులరెమ్మ; వేప, వెంపలి మొ. చెట్ల మండలు వాడతారు (రా. 8).

**మండిగె** ఉ. మండిక, మండికి, మండిగ, మండిగి. **1.** రూ. మండ్రిగె; పర్యా. గంజిమండిగె, సరిమండిగె వెడల్పుమూతిగల గుండ్రటిపాత్ర; మామూలుగా పడుగుకు పెట్టే గంజి దీంట్లోకి తీసుకొంటారు. చూ. చిత్రం 139.3 (కో. 16-30, 32, 36); **2.** పర్యా. కండెల మండిగ. పేకదారం కండెలు వేసుకొనే మట్టి పాత్ర; దీంట్లో నీళ్ళుపోసి మగ్గందగ్గర పెట్టుకొంటారు (కో. 19, 25, 26, 28-33, 35-37); **3.** రూ. మణిగె. మండె, మనికె, మానిగ. ఒకరకం మట్టిపాత్ర; మూకుడు మాదిరిది; దీంట్లో రంగులు కలుపుతారు (కో. 16, 17 19-21, 26).

**మండె** చూ. మండిగ(3). (కో. 8).

**మండోదరి** సిల్కాలివురంగులో మబ్బుగా ఉండే రంగు (కో. 2).

**మండ్రిగె** చూ. మండిగె(1). (కో. 34).

**మతి** పర్యా. చూ. చేడుబద్ద(1). దోనెముందర నేసినబట్ట ముడుచుకు పోకుండా అడ్డంగా, పైవైపు బిర్రుపెట్టే కొయ్యబద్ద(లు); ఇటువంటి రెండు బద్దలకు ముళ్ళు బిగించి ఉంటాయి; కొన్నిచోట్ల దారాలుకట్టి వాటిలో ముళ్ళుదూర్చి మెలిపెడతారు; మామూలుగా మరమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 124ఎ (తె. 21, 28).

**మతుబు** ముదురు ఆకుపచ్చరంగు; పూర్వంనుంచి వాడుకలో ఉన్న పేరు (తె. 14-16).

**మతేదులు** బహు. జంపఖానా నేసేటప్పుడు అడ్డాన్ని బిర్రుపెట్టటానికివాడేకర్రలు; చూ. చేడుకర్రలు(తె.17).

**మత్తమాల** చూ. మర్తుమాన్ (తె. 28).

**మదిర(చాయ)** ఉ. మదిరిసాయి, మదిరె. **1.** ఒక రకం ఎరుపురంగు; మిరప్పండురంగు; పూర్వం పోలీసులు ఈ రంగుటోపీలు పెట్టుకొనేవారట (కో. 3, 20, 22; తె. 8); **2.** దానిమ్మరెక్కరంగు (తె. 13).

**మద్ది** పపుగా పెరిగే ఒకరకం చెట్టు (*Morinda tinctoria*, Roxb., *Morinda tomentosa*, Heyne.); దీని ఆకులు దసలి(పట్టు)పురుగులకు ఆహారం; కొన్నిచోట్ల దసలి పురుగులను ఈ రకం చెట్లమీదికి ఎక్కిస్తారు (తె. 7).

**మద్దికాయకలశంపేటు** ఉ. -కలసంపేటే. అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 2).

**మద్దికాయ(ల)చీర** నేతమధ్యలో మద్దికాయల మాదిరి డిజైన్లు నేసిన చీర (తె. 14; రా. 20).

**మద్దికాయలు** నేతలో మద్దికాయల నమూనాలు నేసిన డిజైను (తె. 18).

**మద్దికాయవంకచీర** ఒకరకం డిజైనులో నేసిన చీర (తె. 10).

**మద్రాసుమగ్గం** ఒకరకం మగ్గం; మద్రాసులో తయారైంది; మిల్లుమగ్గం మాదిరిది; ఇటీవల వాడుకలోకి వచ్చింది (కో. 8).

**మధుపర్కం** ఉ. మదుపరకం, మదుపర్కం, మాదమార్కం. పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు కట్టుకొనే బట్ట(లు); పంచెగాని చీరగాని; మామూలుగా జరీగాని ఎర్రవన్నెనూలుగాని పెట్టి అంచులూ కమ్ములూ నేస్తారు; ఇటీవల కొన్నిచోట్ల పచ్చంచుకూడా పెడుతున్నారట; 60-120 నెంబరు నూలుతో నేస్తారు (కో. 11-28; తె 31).

**మధుర** కుంకుమరంగు; చూ. మదిర (తె. 19).

**మధురలత** తీగ, ఆకులు, పువ్వులు డిజైనులో పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 162 (కో. 34).

**మధ్యకట్టె** ఉ. మద్దెకట్టె; పర్యా. చూ. అడ్డపట్టె (14). మరమగ్గం చట్రంలో మేరువుపలకకు కిందగా, నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (తె. 1).

**మధ్యచెక్క** ఉ. మద్దెచెక్క; పర్యా. చూ. అడ్డపట్టె(14). మరమగ్గం చట్రంలో మేరువుపలకకు కిందగా నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్ని చోట్ల దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (కో. 7).

**మధ్యనేత** ఉ. మద్దినేత, మద్దెనేత; పర్యా. చూ. నడిమినేత. నేతలో రెండంచులకూ మధ్యభాగం (రా. 16, 24).

**మధ్యపట్టె** ఉ. మద్దెపట్టె; పర్యా. చూ. అడ్డపట్టె (14). మరమగ్గంచట్రంలో మేరువుపలకకు కిందగా నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (రా. 23).

**మనికె** చూ. మండిగ(3). (కో. 2; రా. 8).

**మనోరంజనచీర** కొంగులో ఆకులు, పూలు, నడిమిభాగంలో మీనాబుటాలు పడేట్టు నేసిన చీర (తె. 21).

**మనోరమ** ఎండుపొగాకు మాదిరి రంగు (కో. 7).

**మందకడుగుడు** బొచ్చుకత్తిరించేముందు గొర్రెల మంద చెరువులో కడగటం (తె. 20).

**మందపోచెమ్మజాతర** ఉ. మందపోసెమ్మ-. గొర్రెలమంద క్షేమంకోసం మందపోచెమ్మ(=కురమలు కొలిచే గ్రామదేవత) పేరుమీద చేసే పండుగ (తె. 20,25).

**మందారపూపు** ఎరుపురంగు (కో. 35).

**మందారపూవుచీర** ఎరుపురంగుచీర (కో. 35).

**మందారం** ఎరుపురంగు (కో. 26).

**మందారంచీర** ఎరుపురంగుచీర (కో. 26).

**మబ్బుచాయచీర** ఉ. మబ్బుసాయసీర. ఎరుపు వన్నెలో నిలువు, నలుపువన్నెలో పేక పెట్టి నేసిన చీర (కో. 4).

**మబ్బుపట్టెజాడి** తెలుపు, నలుపు పట్టెలు పడేట్టు నేసిన గొంగడి డిజైను (తె. 6).

**మబ్బురంగు** 1. లేతనలుపు; మొగిలురంగు. (కో. 2, 22-24); 2. లేతనీలంరంగు (కో. 6).

**మయమేయు** సరిచేసేటప్పుడు పడుగుతిరగేసి కుంచె వెయ్యటం (కో. 31).

**మయంకర్ర** పర్యా. చూ. ఊడ్తెదండె. ఊడ్తె పై వైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (కో. 24).

**మయంగూటం** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతిన కొయ్య; దీనికి నేత మోకుతో కొలికివేసి పెడకోలకుచుట్టి పడుగు బిర్రు పెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేత మోకు పెడకోలకు కట్టి దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (రా. 1).

**మయంతాడు** పర్యా. చూ. కుచ్చుతాడు. మరమగ్గంలో నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టిన దారం. చూ. చిత్రం 118.22 (కో. 24).

**మయంపాయ(లు)** ఉ. మయింపాయ; పర్యా. చూ. నడి(ం)పాయ. అచ్చువడుల్లో అచ్చుకర్ర చివరి గుదులు రెంటికీ మధ్యభాగం; సగానికి చీలి ఉన్నది; దాంతోబాటు పడుగులో చీలిన పక్కపాయలు రెంటికీ మధ్యభాగం. చూ. చిత్రం 100.7 (కో. 23, 24).

**మరఉండ** పర్యా. చూ. ఉండ(3). వడికి చుట్టిన ఉన్నిదారం; గుండ్రటిది; కొన్నిచోట్ల పడుగుకు సరిపడే టంత దారం ఒక ఉండగా చుడతారు (తె. 22).

**మరచట్టం** పర్యా. చూ. మగ్గంచట్టం(1). మరమగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగుపట్టెల చట్రం; మామూలుగా దీని నిలువుపట్టెలకు కుచ్చుతాళ్ళు కట్టే కొయ్యలు బిగిస్తారు; కిందిపట్టెమీద కండెనాడె ఆడుతుంది. చూ. చిత్రం 118 (కో. 33).

**మరచాయ** ఉ. మరసాయి. 1. ఎర్రతొగరురంగు మీద సుర్లచెక్కపొడి, ఆముదం కలిపి వేసిన రంగు (కో. 1); 2. మిల్లులో తయారైన రంగు (కో. 8).

**మరచాయచెక్కతొగరు** ఉ. మరసాయిసెక్క తొగురు. మిల్లులో తయారయిన చెక్కతొగరురంగు (కో. 8).

**మరచుట్టుడు** శారతీసినపోగు కదురుకు చుట్టటం (తె. 22).

**మరనాడె** ఉ. మర్నాడె మొర్నాడె; పర్యా. కట్టెలాడికొమ్ము, లాటుకొమ్ము, లాటునాడె, పటాలుకొమ్ము, సట్టరునాడె, సంటరునాడె. ఒకరకంనాడె; మరమగ్గంది; పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్య పేకదారం పరటానికి కండెఅమర్చి కుచ్చుతాళ్ళసాయంతో విసిరే నాడె; కొయ్యనాడె; కుచ్చుగుంజినప్పుడు పడుగుపోగుల మధ్య పానుపుపట్టెమీద ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి పరుగెడుతుంది; చేతినాడెకంటె ఉడవు పెద్దది; దీంతో నేత సులువుగా తొందరగా అవుతుంది. చూ. చిత్రం 131 క (కో. 9, 23, 24, 30, 33, 37).

**మరనూలు** ఉ. మర్నూలు. మిల్లులో యంత్రాల మీద తయారయిన నూలు (కో. 7, 12, 17).

**మరబింప** ఒకరకం కదురుబిళ్ళ; ఆడవాళ్ళు వడికే కదురుది; మందంగా ఉంటుంది. చూ. చిత్రం 311 చ. 3 (తె. 25).

**మరమగ్గం** పర్యా. ఎగువమగ్గం, కుచ్చుమగ్గం, జన్నామగ్గం, తాకుమగ్గం, జడ్డీమగ్గం, విస(ను)మగ్గం, లాటుమగ్గం, పటలుమగ్గం, సట్టరుమగ్గం, సంటరుమగ్గం, సీమమగ్గం. ఒకరకం మగ్గం; నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజేది; మగ్గంపలక, పన్నె ఒక కొయ్యచట్రంలో బిగించి పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు. చూ. చిత్రం 108 (కో. 3-8, 10-24, 26, 29, 30, 32, 33, 35-37; తె. 13-16; రా. 2, 20).

**మరరాటం** 1. పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం; మరరాటం. చూ. చిత్రం 41 (కో. 3-5, 7, 13, 18; రా. 20); 2. ఒకరకం రాట్నం; పేకకు పనికివచ్చే దారపుకండెలు దీని మీద చుడతారు (కో. 9బి).

**మరాటి(ద్రావకం)** ఉ. మరాటీ-. అద్దకంరంగు తయారు చెయ్యటానికి ముడిరంగులో కలిపే ఒకరకం రసాయనం; Sulphuric acid; చూ. మురాటి (కో. 2, 5, 6).

**మరాసు** (< మర + ఆసు; -విసురు) పర్యా. ఆలు(2), ఆసు(2), జంత్రం(1), డోలి, మిషనాసు మాను. పెద్దపడుగులు ఒకేసారి పోసే ఒకరకం ఆసు; ఒక గోతిలో పెద్దచెక్రం అమర్చి, దాన్ని తిప్పుతూ పడుగుపోస్తారు; 12-24 పడుగుల వరకూ ఒకేసారి దీని మీదికి తోడవచ్చు. చూ. చిత్రం 50 (కో. 3-19, 21-24, 26, 36).

**మరాసుగొయ్యి** పర్యా. అలుగుంట, గుంట(1), గొయ్యి(1). మరాసుచెక్రం తిరగటానికి అనువుగా తవ్విన పల్లపు ప్రదేశం. చూ. చిత్రం 50.6 (కో. 26).

**మరాసువిసురు** (క్రి.) ఉ. -ఇసురు. నేతలో నిలువుకువాడే నూలు చుట్టటానికి మరాసుచెక్రం తిప్పటం; చెక్రం తిప్పినప్పుడు దశ్వాలకు ఉన్ననూలు మరాసుకు చుట్టుకొంటుంది (కో. 23, 24).

**మరిపిచ్చులాక** పర్యా. చూ. బద్దెగుచ్చు(డు)లాక. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద; కొన్ని చోట్ల కర్ర; పూర్వం అనేవారట. చూ. చిత్రం 124.1 (రా. 7).

**మరుచాయ** ఉ. -సాయ. ఒకరకం ఎరుపురంగు (కో. 2, రా. 7).

**మరున్** (<maroon) ఎరుపు, వయిలెటు రంగులు కలిసినట్టుండే ఒకరకం ముదురురంగు (కో. 2).

**మరువనిచాయ** ఉ. -సాయ. చైకిలెట్టు రంగులో నలుపువన్నె కలిసిన రంగు (కో. 2).

**మర్తబాన్** (హిం.) చూ. మర్తుమాన్ (తె. 8).

**మర్తుమాన్** రూ. మడతమాను, మత్తమాల, మర్తబాన్; పర్యా. బర్ని. జాడీ; కొన్నిరంగులు, ద్రావకాలు జాడీల్లోపోసి అమ్ముతారు (తె. 19).

**మల** ఉ. మొల. **1.** సరిచెయ్యటానికి చాపినపడుగు (కో. 5); **2.** పడుగేరుకర్రలమీద నెరపిన పడుగు (పోగులు). (కో. 6); **3.** పర్యా. చూ. అల్లు(1). అచ్చతికిన పడుగు (కో. 5, 6, 10, 24; తె. 21, 32); **4.** నేతకుసిద్ధంచేసి చుట్టినపడుగు (తె. 28); **5.** పర్యా. చూ. చుట్టు(4). మగ్గానికి అమర్చి నేతబయలులో చాపినపడుగునూలు; ఒక ఉరువు(బట్ట)నేతకు సరిపడేది; 8-10 మూరల పొడుగుంటుంది (కో. 3, 7, 9, 12, 24; తె. 13, 15, 16, 30); **6.** పడుగుపాయకు చివర వేసిన ముడి; మెలిక (తె. 11, 12); **7.** పర్యా. మల సాగు(2), మునుము. నేతసాగులో దంతె దగ్గరినించి చివరిదాకా చాపినపడుగు; పట్టుమగ్గం నేసేవారి వాడుక. చూ. చిత్రం 127 (కో. 22; తె. 21, 26, 27).

**మలఎలుపు** (క్రి.) అల్లుచేసేటప్పుడు, పడుగుపోగులు నెరపటం; దేవాంగులవాడుక (కో. 7).

**మల(కచ్చి)** (-చేయు, -వేయు) ఉ. మొలకచ్చి. సరిచేసిన పడుగులో అనికిదగ్గరగా లాకలు చేర్చిన కచ్చి (అనికి దూరంగా లాకలుంచే కచ్చి, దగ్గరికి చేరిస్తే మల కచ్చి); ఇటువంటివి రెండు మిగిల్చి, మిగిలినవి తీసేస్తారు; సరిచుట్టేటప్పుడు లాకతీసేసి దారం ఎక్కిస్తారు (తె. 11, 14, 17).

**మలకట్టు** పర్యా. చూ. మలుకు. పన్నెకట్టుబడిలో దంతెలమధ్య బిగించిన ఈనెకు దారంతో వేసిన ముడి. చూ. చిత్రం 88 క. 12 (కో. 33).

**మలకలపౌర్ణమి** చూ. మొలకలపున్నమి (రా. 5).

**మల(క)వేయు** ఉ. మలకేయు, మలేయు. **1.** పర్యా. బిడివేయు(2). మగ్గంమోకు చేతిగూటానికి ముడి వెయ్యటం (కో. 35; తె. 7); **2.** (<మలకువేయు) ఉన్నికదురుకు చుట్టిన పోగు ఊడిపోకుండా పైగాడి (కాటు)లో మెలిక వెయ్యటం (తె. 20).

**మలకొయ్య** **1.** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకుకట్టేకొయ్య. నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16(కో. 32,35); **2.** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతినకొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి పెడకోలకుచుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేతమోకు పెడకోలకు కట్టి దీనికి ఏనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం127.13 (తె. 33).

**మలకోల** **1.** పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి నున్నటి కర్ర; దీన్ని కోత్తలవెంబడి దూరుస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 69 (తె. 20); **2.** పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (తె. 20-22, 29, 31-33).

**మలకోలగుది** పర్యా. చూ. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగర్ర-కొన్నిచోట్ల మలబద్ద-దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (తె. 29).

**మలగట్టు** (క్రి.) ఉ. మొలకట్టు, మొలగట్టు. **1.** అచ్చతికి చాపిన పడుగులో చివరిపాయలు కట్టటం; పైనా కిందా రెండు కర్రలుపెట్టి దారంతో మెలికలు వేస్తారు; కొన్నిచోట్ల కర్రలకు చుడతారు; కొన్నిచోట్ల మలగట్టుకర్రలకు పొట్టెదారాలు కడతారు (కో. 11, 19, 20, 24, 27, 28, 30, 31; తె. 10, 11-13, 15, 21, 25); **2.** పర్యా. చూ. అల్లుచేయు. అచ్చతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపు చెయ్యటం; కొన్నిచోట్ల పట్టుసాలీల వాడుక (కో. 5, 7, 10, 13, 15, 19).

**మలగట్టుకర్ర** **1.** అచ్చుకట్టేటప్పుడు జంత్రం కొయ్యలకు పైవైపున అడ్డంగా కట్టిన కర్ర. చూ. చిత్రం 91 క. 6 (కో. 23); **2.** ఉ. మొలగట్టుకర్ర; పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరిపాయలు

బిగించిన కఱ్ఱ; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (కో. 14, 15, 18, 19, 25, 27, 30; తె. 10-14. 17).

**మలగట్టుకొయ్య** **1.** పర్యా. మలగఱ్ఱ. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కఱ్ఱ; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (తె. 21); **2.** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతినకొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి పెడకోలకుచుట్టి పడుగు బిర్రు పెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేత మోకు పెడకోలకు కట్టి దీనికి ఓనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 21 25).

**మలగట్టుకోల** పర్యా. చూ. మలగఱ్ఱ. నేతపడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (కో. 25; తె. 18, 19, 23, 25, 28, 30).

**మలగట్టుగుది** **1.** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరిపాయ(=పొట్టె)కు కట్టిన దారం; పొట్టెకొక దారం చొప్పున మలగఱ్ఱకు కడతారు. చూ. చిత్రం 127.8 (తె. 17); **2.** ఉ. -గుతి; పర్యా. చూ. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగఱ్ఱ-కొన్నిచోట్ల మలబద్ద-దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (తె. 20, 25).

**మలగట్టుచివ్వ** ఉ. -సివ; పర్యా. చూ. మలగఱ్ఱ. నేతపడుగులో చివరి పాయలు బిగించిన కఱ్ఱ; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (కో. 31).

**మలగట్టుతాడు** ఉ. మలగత్తాడు. పడుగు చివర మలగట్టుకఱ్ఱనూ లాకనూ కలిపి కట్టినతాడు (కో.27)

**మలగట్టుబద్ద** పడుగులో చివర, కఱ్ఱకు జోడించిన లాక(=బద్ద) (కో. 27).

**మలగఱ్ఱ** ఉ. మలకఱ్ఱ, మొలకఱ్ఱ; పర్యా. అల్లుకట్టె, చుట్టుకట్టె(2), చుట్టుకఱ్ఱ, చుట్టుకోల, చుట్టుబొంగు, దండెకోలు, పల్లెకట్టె, పల్లెకోల, పొట్టెలకఱ్ఱ, మడికెలకట్టె, మడికెలబొంగు, మడికోలకఱ్ఱ, మడికోల(బొంగు), మడుపుకట్టె, మడుపుకఱ్ఱ, మలకోల, మలగట్టుకఱ్ఱ(2), మలగట్టుకొయ్య(1), మలగట్టుకోల, మలగట్టుచివ్వ, మలచుట్టుకఱ్ఱ, మలచుట్టుకోల, మెలికోల, సుంగులకట్టె(2). నేతపడుగు(=మల)లో చివరి పాయలు బిగించిన కఱ్ఱ(కొన్నిచోట్ల వెదురుది); మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలుచుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు; మామూలుగా, బయట అల్లు చేసేటప్పుడు కొన్నిచోట్ల నేతబయలులో మగ్గందగ్గర కడతారు. చూ. చిత్రాలు 127.10, 128 త. 3 (కో. 3, 7. 11, 12, 16, 17, 22, 27-28; తె. 7, 12).

**మలగుది** ఉ. మొలగుది. **1.** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరిపాయకుకట్టిన దారం; పొట్టెకొకదారం చొప్పున మలగఱ్ఱకు కడతారు. చూ. చిత్రం 127.8 (తె.32); **2.** పర్యా. గుది(10), జోడాగుది(2), తాడు(12), దండెబొంగుతాడు, పెట్టుకోలగుది, పెడకోలగుది, పెడతాడు, మడికెలగుది, మలకోలగుది, మలగట్టుగుది(2), మలబద్దగుది, విరుప్రగుది, సింగితాడు. పెడకోలకు తగిలించే మలగఱ్ఱ-కొన్నిచోట్ల మలబద్ద-దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (కో. 25-28; తె. 22, 23).

**మలచివ్వ(లు)** ఉ. మొలచివ్వ. నేతపడుగులో చివర పెట్టిన సన్నబెత్తం (కో. 22).

**మలచుట్టు** (క్రి.) ఉ. మొలసుట్టు; పర్యా. చుట్టుగట్టు, చుట్టుచుట్టు, చుట్టుపట్టు(2) చుట్టువేయు, మడుపుకట్టు. అల్లుచేసిన పడుగును మల(=ఒక బట్టనేతకు సరిపడే పడుగు)లుగా విడదీసి చుట్టటం; ఒక్కొక్క మల ఒక్కొక్క చుట్టుగా వస్తుంది (కో. 9).

**మలచుట్టుకఱ్ఱ** (క్రి.) ఉ. మొలసుట్టుకఱ్ఱ; పర్యా. చూ. మలగఱ్ఱ. నేతపడుగులో చివర పాయలు బిగించిన కఱ్ఱ; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (కో. 9).

**మలచుట్టుకోల** పర్యా. చూ. మలగఱ్ఱ. నేతపడుగులో చివర పాయలు బిగించిన కఱ్ఱ; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్ని చోట్ట పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (తె. 26, 27).

**మలజాపు** (క్రి) ఉ. మొలజాపు. **1.** పర్యా. చూ. అల్లుచేయు. అచ్చతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపుచెయ్యటం; పడుగుమీద గుర్తులువేసి చివరి పాయలకు ముడులువేసి మగ్గానికి అమరుస్తారు (కో. 11); **2.** మగ్గంబయలులో పడుగు చాపటం (తె. 11).

**మలజేయు** (క్రి.) ఉ. మలచేయు, మొలచేయు, మొలసేయు. 1. పడుగు పోగులు సాపుజేసుకోటం (కో. 5; తె. 3); 2. పరినపడుగుచుట్టటం (తె. 20); 3. పడుగేరిన తరవాత అని చివరికి జరపటం (తె. 31).

**మలజోడు** పర్యా. చూ. జోడా(2). నేతపడుగుకు చివర పెట్టిన రెండు కర్రలు; మలగర్ర, మలబద్ద. చూ. చిత్రం 129 చ. 1 (కో. 1).

**మలతడుపు** (క్రి.) పడుగేరుకర్రమీది పడుగు పోగులు గంజితో తడపటం (కో. 6).

**మలతాడు** ఉ. మొల్తాడు; పర్యా. చూ. అల్లిక దారం. అచ్చుతికిన పడుగులో చివర పొట్టెల ముడుల వెంబడి దూర్చిన దారం; దీన్ని మగ్గం దగ్గర చుట్టు గర్రకు కడతారు; కొన్నిచోట్ల పడుగుమీద గుర్తులు పెట్టటానికి దీంతో కొలత చూసుకొంటారు. చూ. చిత్రాలు 128 త. 2, 129 త. 2 (కో. 24).

**మలదోయు** పర్యా. చూ. అల్లుసేయు. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి నేతకు అనుకూలంగా సాపు చెయ్యటం; పడుగుమీద గుర్తులువేసి చివరి పాయలకు ముడులువేసి మగ్గానికి అమరుస్తారు (కో. 3).

**మలపట్టు** (క్రి.) పర్యా. చూ. అల్లుచేయు. అచ్చుతికిన పడుగు ఆరుబయట చాపి, నేతకు అనుకూలంగా సాపుచెయ్యటం; పడుగుమీద గుర్తులువేసి, చివరి పాయలకు ముడులువేసి మగ్గానికి అమరుస్తారు (కో. 6).

**మలపొడుచు** (క్రి.) పడుగేరుకర్రమీది పడుగు పోగులు సమంగా ఉండేట్టు చేత్తో తట్టటం (కో. 6).

**మలబద్ద** ఉ. మొలబద్ద; పర్యా. గుదుల బద్ద, గుదుల్లాక, చుట్టుబద్ద(1), చుట్లులాక. నేతపడుగు చివర పొట్టెలు చుట్టే వెదురుబద్ద; దీన్ని పొట్టెకోలకుగాని, మలగర్రకు గాని జోడిస్తారు; కొన్నిచోట్ల దీనికి పొట్టెతాళ్ళు కడతారు; దీని చివరిగుదులు పెడకోలకు తగిలిస్తారు. చూ. చిత్రం 129 త. 2 (కో. 16, 17, 20-22, 27).

**మలబద్దగుది** పర్యా. చూ. మలగుది(2). పెడకోలకుతగిలించే మలగర్ర-కొన్నిచోట్లమలబద్ద-దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (కో. 17).

**మలబిగించు** (క్రి.) నేతమోకుతో మగ్గంమీద పడుగు బిగించటం (కో. 36).

**మలమగ్గం** 1. ఉ. మొలమొగ్గం; పర్యా. చూ. చుట్టుమగ్గం. మగ్గంమీది పడుగులో చివరి భాగం కర్రలకు చుట్టి నేసే మగ్గం(కో. 1, 7); 2. మగ్గంమీది పడుగులో చివర, పొట్టెలుకట్టి నేసే మగ్గం (కో. 2).

**మలలాక** ఉ. మల్లాక. 1. పర్యా. చూ. ఎక్కింపు చివ్వ(2). అచ్చుతికిన పడుగులో మొదట అచ్చుదగ్గర ఎక్కించిన కర్ర; కొన్నిచోట్ల బద్దగాని, సన్నబెత్తంగాని, ఇనపకడ్డీగాని ఎక్కిస్తారు. చూ. చిత్రం 128 జ (తె. 32); 2. పడుగు మధ్యభాగంలో అని వెంబడి దూర్చిన బద్ద. చూ. చిత్రం 69 (తె. 31).

**మల(లు)చేయు** (క్రి.) 1. ఉ. మొలచేయు. పడుగేరు కర్రమీద పడుగుపోగులు వరసగా నెరిపి సాపు చెయ్యటం (తె. 15-17, 21; రా. 20, 24); 2. నరి చేసేటప్పుడు పడుగుపోగులు సమంగా సర్దటం(తె.24).

**మలలువేయు** (క్రి.) ముడులు వెయ్యటం: పడుగులో మొదటి(=బద్దె)పోగులకు ముడులువేసి మగ్గం దోనెలో పుల్లలకు కడతారు (తె. 17).

**మలలెక్కించు** (క్రి.) (< మలలు + ఎక్కించు) అల్లుచేసేటప్పుడు పడుగుకు మసిగుర్తులువేసి లాకలు, కర్రలు దూర్చటం (కో. 35).

**మలలేరు** (<మలలు + ఏరు) పర్యా. కరకేరు(2). పడుగును మొదటినించి చివరివరకూ పాయలుగా విడవిడదీసుకోటం (తె. 33).

**మలసాగు** 1. పర్యా. చూ. నేతసాగు(1). మగ్గానికి అమర్చి నేతబయలులో చాపిన పడుగునూలు. చూ. చిత్రం 127.17 (తె. 17); 2. పర్యా. చూ. మల(7). నేతసాగులో దండెదగ్గరనించి చివరిదాకా చాపిన పడుగు. చూ. చిత్రం 127 (కో. 22).

**మలుకు** (-వేయు) పర్యా. దారబందం మెలక, మలకట్టు, సంగ్లీ. పన్నెకట్టుబడిలో దండెల మధ్య బిగించిన ఈనె(ల)కు దారంతో వేసిన ముడి. చూ. చిత్రం 88 క. 12 (కో. 1).

**మలుకేయు** (<మలుకువేయు). (క్రి.) చూ. మలేయు(2). (కో. 27, 31).

**మలుపు(డు)** (క్రి.) నేతపడుగులో బెండతో పేక పోగు తిప్పటం; కుప్పడంనేతలో అంచుకు వేరేరంగు పేకపోగులు పెట్టి నేస్తారు (తె. 15).

**మలుపుడుచీర** పర్యా. కుప్పడంచీర(1). అంచుకు పేకరంగుపోగు కలవకుండా వేరేరంగు నూలు పెట్టి రెండు నాడెలతో పోగులు మలుపుతూ నేసిన చీర; ఇలా రకరకాల డిజైన్లు నేస్తారు; ఆడపిల్లలు సమర్తాడినప్పుడు, మతుబు(=ఒకరకం ఆకుపచ్చ)రంగులోగాని మాయపట్టురంగులోగాని నేసిన మలుపుడుచీర కట్టిస్తారు (తె. 15).

**మలేయు** (క్రి.) 1. నరిచేసేటప్పుడు పడుగు తిరగ వెయ్యటం (కో. 29, 37); 2. రూ. మలుకేయు. మెలి తిప్పటం; మెలికవెయ్యటం; అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రమీద పడిదారంతో మెలికవేస్తారు (కో. 35; తె.17).

**మల్తాడంచు** ఒకవరసలో లాహిరీ, దాన్ని అను

కొని పైన, కింద గీరలూ పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 227 (తె. 31).

**మల్బరీఆకు** (<mulberry-) మల్బరిచెట్టు ఆకు; పట్టుపురుగుకు ఆహారం. చూ. చిత్రం 289 (కో. 14).

**మల్లచిప్ప** మట్టిమూకుడు; నేతనేసేటప్పుడు దీంట్లో పేకదారం కండెలు వేసుకొంటూరు (కో. 15).

**మల్లన్నపండుగ** పర్యా. మల్లప్పపండుగ, మల్లయ్యపండుగ, శ్రీశైలమల్లికార్జునుణ్ణి కొలిచే పండుగ; గొంగళ్ళు నేసే కురమలు శివుణ్ణి కొలుస్తారు (తె. 6, 9, 11, 20, 22, 26-28).

**మల్లప్పపండుగ** పర్యా. చూ. మల్లన్నపండుగ. శ్రీశైలమల్లికార్జునుణ్ణికొలిచే పండుగ; గొంగళ్ళు నేసే కురమలు శివుణ్ణి కొలుస్తారు (తె. 3).

**మల్లమ్మబార్డరు** ఉ. -బాడరు. కృత్రిమపుపట్టు (=నార)తో కడ్డీ మాదిరిగా నేసి నీలిరంగులో చిన్న కడ్డీలు పడేట్టునేసిన అంచు (రా. 11).

**మల్లయ్యపండుగ** పర్యా. చూ. మల్లన్నపండుగ. శ్రీశైలమల్లికార్జునుణ్ణి కొలిచే పండుగ; గొంగళ్ళు నేసే కురమలు శివుణ్ణి కొలుస్తారు (తె. 25).

**మల్లిపందిరి** **1.** ఒకరకం గళ్ళుపడేట్టు నేసిన అంచు (కో. 23); **2.** పెద్దగడిలో సన్నగళ్ళు పడేట్టు నేసిన చీర; సారంగి అని అంటారు. చూ. చిత్రం 275 (తె. 1)

**మల్లిమొగ్గ** నేతలో మల్లిమొగ్గ నమూనాలో నేసిన డిజైను (తె. 10).

**మల్లిమొగ్గంచు** మల్లిమొగ్గ మాదిరి డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 170 (కో. 23, 36; తె. 7, 10).

**మల్లిమొగ్గపేటు** అంచులో మల్లిమొగ్గ ఆకారంలో నేసిన డిజైను. చూ. చిత్రం 170 (రా. 8).

**మల్లిమొగ్గబుటా** బట్ట మధ్యభాగంలో మల్లిమొగ్గ మాదిరి నేత డిజైను (కో. 24).

**మల్లీశ్వరంచు** మూడురంగులుపెట్టి నేసిన ఒకరకం అంచు; ఒక సినిమా పేరుతో ప్రచారంలోకి వచ్చింది (రా. 24).

**మల్లీశ్వరి** ఒకరకం పచ్చ-నూర్జహానుకంచె తెలుపు-వన్నె (కో. 36).

**మల్లీశ్వరికమ్మి** ఒక పెద్దపట్టె(=నాయకం)కు రెండు వైపులా మూడేసి చిన్నపట్టెలు నేసిన కమ్మి (కో. 16).

**మల్లీశ్వరిచీర** ఒకరకం పచ్చ-నూర్జహాను కంచె తెలుపు-వన్నె చీర (కో. 36).

**మల్లుబెళ్ళిపంచె** ఉ. మల్లుబెల్లి-. పెళ్ళి అయిన తరవాత పెళ్ళికొడుకు అత్తవారింటికి వెళ్ళేటప్పుడు (=మల్లుబెళ్ళికి పోయేటప్పుడు)కట్టుకొనే పంచె(కో. 4).

**మల్లెపువ్వంచు** ఉ. మల్లిపువ్వంచు. మల్లెపువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 228 (తె. 4, 5, 15, 16).

**మల్లెపువ్వుబొగిడి** అంచులో మల్లెపువ్వు, మొగ్గ పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 226 (తె. 12).

**మల్లెపూవుచీర** మధ్యభాగంలో మల్లెపువ్వుమాదిరి డిజైన్లు నేసిన చీర (తె. 7).

**మల్లెమొగ్గచాపు** అంచులో మల్లెమొగ్గ ఆకారంలో డిజైన్లు నేసిన చాపు (=రెండుపంచెలు). (కో. 30).

**మల్లెమొగ్గచీర** **1.** అంచులో మల్లెమొగ్గ మాదిరి డిజైన్లు నేసిన చీర (కో. 2; తె. 7); **2.** అంచుల మధ్యభాగంలో మల్లెమొగ్గ ఆకారం డిజైన్లు నేసిన చీర (తె. 7).

**మస** డిజైను అద్దకంలో, అంచులో మొదట అద్దే కొయ్యఅచ్చు(మేనా); అచ్చుతో మొదట అద్దిన రేఖాచిత్రం (outline) (కో. 7).

**మసర(నూలు)** చూ. మసరు (కో. 15).

**మసరు** రూ. మసర(నూలు); పర్యా. చూ. కోరా (నూలు). చలవచెయ్యనిముడినూలు; unbleached yarn; ఇది గోధుమరంగులో ఉంటుంది (కో. 24).

**మసాలా** అద్దకంరంగు తయారు చెయ్యటానికి ముడిరంగులో కలిపే పదార్థాలు; పటిక, కాస్టిక్ సోడా, తేజాపు, నైట్రాన్, తర్కిలేటు(నూనె) మొ. వాటి మిశ్రం (తె. 17, 24, 25, 30).

**మసెంటు** (<మసి + అంటు) పర్యా. చూ. లచ్చన. అచ్చుతికిన పడుగుమీద కొలతనుబట్టి వేసిన గుర్తు; మామూలుగా మసిగుర్తులు వేస్తారు; కొన్నిచోట్ల చిక్కుడు, బీర మొ.వాటి ఆకుపసర్లతో గజానికి ఒకటి చొప్పునగాని మూరకు ఒకటి చొప్పునగాని గుర్తులు వేస్తారు (కో. 15).

**మస్కాట్** నార(=కృత్రిమపుపట్టు), నూలు కలిసిన ఒకరకం దారం (తె. 19).

**మస్కాట్అంచు** ఉ. మస్కాట్-. ?కృత్రిమపు పట్టు, నూలు కలిపినేసిన ఒకరకం అంచు (తె. 6).

**మస్టర్డుకలరు** ఒకరకం పసుపురంగు (రా. 15).

**మహాద్రావకం** గంధకిదామ్లం; Sulphuric acid; అద్దకంరంగు తయారు చెయ్యటానికి ముడిరంగులో కలుపుతారు (కో. 7).

**మహేశ్వరిపేటంచు** మహేశ్వరిపేటు పెట్టి నేసిన అంచు; మొత్తం అరవైకొలుకుల దారంపెట్టి నేస్తారు. చూ. చిత్రం 229 (రా. 13, 14).

**మహేశ్వరిపేటు** రెండు సన్నకడ్డీలు, రెండు లాహిరిలు, ఒకవరస గోమి అంచులో వరసగా పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 229 (రా. 12-14).

**మళ్ళచీర** ఉ. మల్లసీర; పర్యా. చూ. గళ్ళచీర. అంచుల మధ్యభాగంలో రంగుపోగులు పెట్టి గడులు గడులుగా నేసిన చీర; మామూలుగా నల్పుదరపు గళ్ళు నేస్తారు; మడి అంటే గడి (తె. 13, 14).

**మాకు** 1. పర్యా. తివాసీమగ్గం. తివాసీలు నేసే మగ్గం. చూ. చిత్రం 320 (తె. 17), 2. తివాసీమగ్గం కట్టుబడిలో స్తంభాలకుపైన అమర్చిన కొయ్యదూలం; పైదోనె. చూ. చిత్రం 320.8 (తె. 17).

**మాగిఉన్ని** ఉ. మాగుని. చలికాలం(=మాగి)లో కత్తిరించిన ఉన్ని; ఇది బరువుగా ఉంటుంది; చెమటఉన్ని (తె. 3).

**మాగికత్తిరింపు** పర్యా. మాగికోత. చలికాలంలో ఉన్ని కత్తిరించటం (తె. 27, 28).

**మాగికోత** పర్యా. మాగికత్తిరింపు. చలికాలంలో ఉన్ని కత్తిరించటం (తె. 9).

**మానిక్యం** చౌడేశ్వరిపూజ చేసేటప్పుడు దీపం పెట్టటానికి, గోధుమపిండితో చేసిన ప్రమిద(=చిన్న గుంగె); దీంట్లో మంచినూనె పోసి అమ్మవారి నాలికె (పట్టు) ముందు పెడతారు (తె. 24).

**మానిగ** చూ. మండిగ(3). కొన్నిచోట్ల ఒకరకం ఇత్తడిపాత్ర (రా. 24).

**మానుకర్ర** పర్యా. చూ. అసుజంగ. అసుపీటలు బిగించిన పొడుగుపట్టె(లు); ఇవి ఒకటినించి మూడువరకూ ఉండవచ్చు. చూ. చిత్రం 45 క. 7 (కో. 8).

**మానుగాయరంగు** ఉ. మానుకాయ-. ఆకుపచ్చలో నలుపుచాయ కలిసిన రంగు; ఆలివురంగు (కో. 7).

**మానుతొట్టి** కొయ్యతొట్టి; దీంట్లో రంగునీళ్ళు పోసుకొంటారు. చూ. చిత్రం 282 ప. 2 (రా. 15).

**మామిడంచు** 1. ఉ. మావిడంచు. తెలుపు వస్త్రానికి, రెండు మూడు జమిలిపోగులు (తెల్లవి) నిలువుకు పెట్టి నేసిన అంచు; మామూలుగా వితంతులు కట్టుకొనే పంచెలకు నేస్తారు; కొన్నిచోట్ల రంగులేని బొత్తంచు (కో. 5, 7, 10, 11, 15, 19, 22-24, 26); 2. మామిడిచిగురు రంగులో నేసిన అంచు (కో. 11).

**మామిడంచుకమ్మి** తెల్లజమిలిపోగులుపెట్టి నేసిన ఒకరకం కమ్మి; మామూలుగా వితంతువులు కట్టుకొనే పంచెలకు నేస్తారు (కో. 12).

**మామిడంచుచీర** పర్యా. మామిడంచుపంచె. వితంతువులు కట్టుకొనే బట్ట; మామూలుగా తెల్లది; 20-100 నెంబర్లలలో తెల్లజమిలి పోగులతో మామిడంచుపెట్టి నేస్తారు (కో. 16, 17).

**మామిడంచుజామారు** వితంతువులు కట్టుకొనేబట్ట; మామూలుగా తెలుపుని; కొన్నిచోట్ల అనసూయరంగు కాని, రూబీరంగుకాని పెట్టి నేస్తారు (కో. 12).

**మామిడంచుపంచె** పర్యా. మామిడంచుచీర. వితంతువులు కట్టుకొనే బట్ట; మామూలుగా తెల్లది; 20-100 నెంబర్లలలో తెల్లజమిలి పోగులతో మామిడంచు పెట్టి నేస్తారు (కో. 18, 20, 21).

**మామిడికాయలంచు** మామిడికాయ ఆకారంలో డిజైను నేసిన అంచు; కొన్నిచోట్ల మామిడికాయ, పిందె, అడుగు, ముచ్చెర కొలుకులు, మల్లెపువ్వు, ముచ్చెర, కటారి, చిగురు వరసగా పడేట్టు నేస్తారు (తె. 13).

**మామిడిచిగురు(రంగు)** ఉ. మామిడిసిగురు, మావిడిసిగురు. 1. ఎరుపులో బాగా నలుపువన్నె కలిసిన ఒకరకం రంగు; రెడ్ బి; బి. ఒ. వేసి తయారు చేస్తారు (కో. 6, 8, 9, 12; తె. 4, 13-15); 2. చేకిరేటురంగు (కో. 18, 19).

**మామిడిపిందె** 1. ఉ. మావిడి-. మామిడిపిందె మాదిరి నేతడిజైను. చూ. చిత్రం 231 (కో. 9); 2. బట్టలమీద వేసే కలంకారీ అద్దకం డిజైనుల్లో ఒక రకం; మామిడిపిందె మాదిరిది (కో. 12).

**మామిడపిందెబార్డరు** ఉ. మావిడిపింది-; పర్యా. మామిడిపిందె(ల)అంచు. మామిడిపిందెల వరసలో డిజైను నేసిన అంచు చూ. చిత్రం 231 (రా. 14).

**మామిడిపిందె(ల)అంచు** ఉ. మామిడిపింది-; పర్యా. మామిడిపిందె(ల)పేటంచు, మామిడిపిందెబార్డరు మామిడిపిందెల వరసలో డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 231 (కో. 13, 15, 20, 21, 24, 34, 37; తె. 1, 4, 17, 18, 22, 23; రా. 1, 7).

**మామిడిపిందెల(అంచు)చీర** అంచులో మామిడిపిందెల ఆకారంలో డిజైను నేసిన చీర (కో. 12, 21, 34, 36, 37).

**మామిడిపిందెలపేటంచు** ఉ. మావిడి-; పర్యా. మామిడిపిందె(ల)అంచు. మామిడిపిందెల వరసలో డిజైనునేసిన అంచు. చూ. చిత్రం 231 (కో. 2,9,12).

**మామిడిపిందెలపేటు** ఉ. -పేటి, -ప్లేటు; పర్యా. పిందెలపేటు. మామిడిపిందెల వరసలో నేసిన డిజైను. చూ. చిత్రం 231 (కో. 2, 9, 12, 13, 15, 20, 21, 34, 37; తె. 1, 2, 4, 17, 18, 22, 23; రా. 1, 7).

**మామిడిపిందెలాహిరీ** చీరఅంచులో మామిడిపిందె, పక్కన లాహిరీ వరసగానేసిన డిజైను; చూ. లాహిరీ. చూ. చిత్రం 231 (తె. 2).

**మామిడిపూత** ఒకరకం ఎరుపురంగు; బి. టి. కాస్టిక్ సోడాలతో ఉకారు చేసి, రెడ్ బి., పటిక, తేజాపు, నైట్రేట్ సల్ఫ్ వేసి తయారు చేస్తారు (తె. 5).

**మామూలంచు** తొమ్మిదంగుళాల వెడల్పున నేసిన అంచు (రా. 14).

**మాంబళం** మామిడిపండువన్నె; నింబావళి, ఆరంజి కలిసిన వన్నె (రా. 15).

**మాయపట్టు** **1.** కృత్రిమపుపట్టు; art silk (కో. 13, 23); **2.** పచ్చిపసుపురంగు (తె. 13); **3.** బీరపువ్వుకంటె ముదురువన్నె (తె. 15); **4.** బీరపువ్వువన్నె (తె. 16).

**మాయిపట్టిచీర** రెండురంగుల గీరలు పడేట్టు నేసిన చీర (రా. 24).

**మారుకత్తి** పర్యా. చూ. సాపుకత్తి. పన్నెండంచెల మధ్య వరసగా బిగించిన పుల్లలు సాపుచేసే కత్తి; ఒక మొద్దుకత్తి, ఒక పదునుకత్తి వాడతారు. చూ. చిత్రాలు 89 క. 1, 89 చ. 1 (కో. 24).

**మారుకుంచె** (-వేయు) ఉ. మారుగుంచె. సరిచేసే టప్పుడు పడుగు ఆరుబదునులో ఉండగా సందు (=రెండు కచ్చుల మధ్యభాగం) సందుకూ రెండు మూడుసార్లు నిదానంగా దువ్వేకుంచె (కో. 3, 4, 8; తె. 14, 24).

**మారుగారంతొగరు** రెండుసార్లు కారంతిర్చి నూలుకు అద్దే తొగరురంగు; ఒకరకంఎరుపు (కో. 4).

**మారుగోల** పడుగు చివరివైపు దూర్చే పడుగేరు కర్ర (కో. 33, 36).

**మారుగోలకొయ్య(లు)** పర్యా. చూ. వెనక(టి) కొయ్య. ఆసు వెనకపీటకు బిగించిన పుల్ల(లు); తల కొయ్యలకంటె వీటిసంఖ్య ఒకటి తక్కువ ఉంటుంది. చూ. చిత్రం 45 క. 4 (కో. 36).

**మారునేత** ఉ. మార్నేత. **1.** పడుగుకు ఒకనెంబరు దారం, పేకకు మరొక దారంపెట్టి నేసిననేత (కో. 12); **2.** ఒకరకం గడినేత; మూడుకొలుకుల దారం ఒకరంగు మూడుకొలుకులు మరొక రంగులు పెట్టి నేస్తారు; పడుగులో రంగులను బట్టి పేకలో రంగుగళ్ళు పడేట్టు నాడెలుమార్చి నేస్తారు (కో. 18).

**మారుపూత** రెండోసారి పడుగుకు పూసిన గంజి (రా. 10).

**మారుపూతవేయు** (క్రి.) సరిచేసేటప్పుడు రెండోసారి కుంచెతో దువ్వటం (రా. 10).

**మారుపోగు** (-వేయు) వడకటానికి ముందు, కదురుకు చుట్టిన ఉన్నిపోగు (తె. 20).

**మార్కట్టె** (హిం. మార్-) నేతనేసేటప్పుడు పడుగు చుట్టినగుండ్రటిదోనె(=బీమ్)చెక్కాన్నిచేత్తో తోసే కట్టె; ఇలా తోసినప్పుడు దోనె తిరిగి పడుగు ఇవతలికి వస్తుంది; దొబ్బుడుకట్టె (తె. 8).

**మార్కండేయగోత్రం** పద్మసాలీల వంశగోత్రం (కో. 22; రా. 1).

**మార్కు** (< mark) జరీపోగులలెక్క : సుమారు 20 తులాల బరువు తూగేది; ఒక మార్కు ఫ్లాట్ జరీ పోగు 444 గజాల పొడుగుంటుంది (రా. 14).

**మార్వాడీతువ్వాలు** ఉ. -తువాలు. ? మార్వాడీ వాళ్ళు భుజంమీద వేసుకోటానికి నేసిన ఒకరకం తువ్వాలు; ఎరుపులో తెల్లపోగులు పెట్టి గళ్ళుగా నేస్తారు; దాంతో సిరిపదుతుందని నమ్మకం (తె. 25).

**మాల** రాట్నం పెద్దచక్రాన్నీ చిన్నచక్రాన్నీ కలిపే కట్టేదారం; పెట్టెరాట్నానికిగాని కిసాన్‌రాట్నానికిగాని వాడతారు; చూ. పురి. చూ. చిత్రం 16.1 (తె. 28).

**మాలక్ష్మమ్మచీర** గంగానమ్మచీర మాదిరిగానేసి ఒక కమ్మి తొగరురంగులోను, మరొకటి నీలిరంగులోను నేసిన చీర (కో. 16).

**మాలనూలు** ఉ. మాల్నూలు. మాలవాళ్ళు వడికిన నూలు; ఇది సన్నదనానికి ప్రసిద్ధి; పుంజం నూలు అయిదారణాల ఎత్తు తూగుతుంది (కో. 7, 22, 23; తె. 5).

**మాలపిల్లచీర** గళ్ళచీరల్లో ఒకరకం : **1.** ఒకరకం పెద్దగడిచీర; ఒక సినిమామీదుగా ప్రచారంలోకి వచ్చింది (తె. 11, 25, 27); **2.** 1-5-3-2 కొలుకుల చొప్పున రెండురకాల రంగుపోగులు వరసగా వచ్చేట్టు నేసిన చీర; దీనికి రిబ్బనుమాదిరి అంచు నేస్తారు (రా. 15); **3.** సిరారంగు, బీరపువ్వురంగు, తెలుపు మొత్తం పేలెడు వెడల్పు పడుగు, పేక పెట్టి నేసిన చీర (తె. 15); **4.** ముందు దాపు. ఒకరంగు కొలికి, సన్నపట్టె, మరొక రకం రంగు కొలికి, రెండు సన్నపట్టెలు, మొదటిరంగు, ఒకకొలికి సన్నపట్టె. రెండోరంగు, ఒకకొలికి సన్నపట్టె వరసగా పడేట్టు నేసినచీర (తె. 13).

**మాలపున్నమి** ఉ.-పున్నమ. చేనేతపనివారు చౌడేశ్వరి పండుగ చేసేరోజు; చూ. నూలుపున్నమ (రా. 18, 19 బి).

**మాలసీడు** మాలవాళ్ళు వడికి అనుపోసిన నూలు; ఇది సన్నదనానికి ప్రసిద్ధి; అనులుపడకుండా అనుపోస్తారు (తె. 12).

**మాలెగాంఅంచు** **1.** రెండు వరసల లాహిరీలు, నులికాయ (=పటవాలుగీరలు), రెండుమొగ్గలు వరసలుగా నేసిన అంచు (తె. 22); **2.** ఒకగోమి (=చిన్న పటవాలు గీరలు), రెండువరసల లాహిరీలు, రెండు సన్నకడ్డీలు వరసగానేసిన అంచు (తె. 23, 25); **3.** తాడుపురి మాదిరి వంపులువంపులుగా నేత వచ్చేట్టు డిజైనుపెట్టిన అంచు (తె. 31); **4.** ఒకరకండిజైనులో నేసిన అంచు చూ. చిత్రాలు 232 క, చ, ట (తె. 19).

**మాలెగాంచీర** మాలెగాంఅంచు (పటవాలు గీరలు,

లాహిరీ, రెండు సన్నకడ్డీలు పడేది) పెట్టి నేసిన చీర (తె. 25).

**మావీ** ఊదారంగు; తివాసీ నేతపనివాళ్ళ వాడుక (కో. 16).

**మావులపత్తి** ఒకరకం ఎర్రపత్తి; కాయ చిన్నది (రా. 21).

**మాసం** అణావత్తు తూకం; నూలు తూచేటప్పుడు (తె. 5).

**మాస్టీనువాళ్ళు** అద్దకానికి పనికివచ్చే కొయ్య అచ్చులు డిజైన్లుగా చెక్కేవాళ్ళు; ఒకతెగ (కో. 8).

**మిక్సెడ్ సిల్కు** ఒకరకంపట్టు; మామూలుగా అరటి నార, జనపనార, గోగునార మొ. వాటితో తయారు చేసింది (కో. 16).

**మిక్స్చర్‌గడి** ఉ. మికశర్‌గడి. రెండు మూడు రంగుల దారాలు కలిపి నేసిన గడి (కో. 16).

**మిట్ట** (బహు. మిట్లు) **1.** పర్యా. చూ. చిట్టె (2). పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద (లు). చూ. చిత్రం 19 క. 3 (కో. 27, 30); **2.** తొవరరాటి (=ఒకరకం రాటి) పొడుగుబద్దలను కిందివైపు బిగించిన పుల్ల; ఇటు వంటివి మామూలుగా ఎనిమిది ఉంటాయి; చూ. రాటి (కో. 30).

**మిడత** పర్యా. చూ. గుర్రం మరమగ్గం సొరుగుకు మొదట బిగించిన చెక్క; దవడచెక్కలకు నాడెదెబ్బ దగలకుండా ఇటువంటివి రెండు బిగిస్తారు. చూ. చిత్రం 118.19 (కో. 37).

**మిడతకన్ను** (-పడు) నేతలో నిలువుపోగు తెగి ముడుచుకు పోయినప్పుడు నేత పడకుండా గుండ్రంగా వచ్చిన వెలితి (కో. 25-32, 35-37; రా. 8).

**మిడిగుంజ** 1. పడుగు ఎంట్లు అల్లుచేయటానికి ఆరు బయట చాపి రెండోవైపున కట్టటానికి పాతిన గూటం (రా. 13); **2.** పర్యా. చూ. మిడిగూటం (2). నేత బయలులో చివరపాతిన కొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రుపెట్టటా-నికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేతమోకు పెడ కోలకు కట్టి దీనికి పనుగమెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127. 13 (రా. 13).

**మిడిగూటం** ఉ. మిడిగూటాం. **1.** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బింగుపుకు పాతిన కొయ్య; మామూలుగా వెనకవైపు మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల ఇటువంటి గూటాలు పావు చెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (రా. 9, 23, 24); **2.** పర్యా. ఎదురుకొయ్య, ఎదురుగుంజ, ఎదురుమేకు, కొయ్య(6), తలగట్టు కొయ్య, తాడుకొయ్య (3), తాడుగూటం (1), తోక గూటం(2), దిగు (డు) దలకొయ్య, దిగుదలమేకు, దిగ్గొయ్య(2) నిడిగూటం, నిలుగొయ్య, పరదేసికొయ్య, బిగుకొయ్య, మయంగూటం, మలకొయ్య(2), మల గట్టుకొయ్య (2), మిడిగుంజ (2), మేకుగొట్టుకొయ్య, మోకుదిబ్బ, రామలింగంకొయ్య, రామలింగంగూటం, రామలింగప్పగూటం, సమగొయ్య, శివారుగుంజ, సూత్ర(పు)కొయ్య. నేతబయలులో చివర పాతిన కొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేతమోకు పెడకోలకు కట్టి దీనికి పనుగు మెలికవేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (కో. 1-4, 6, 8, 9 బి; రా. 7-9,11-20, 22).

**మిడిగూటంతాడు** పర్యా. చూ. మడిమతాడు. పావుచెక్కను గూటానికి బిగించే వెనకతాడు; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 3 (రా. 23).

**మిత్రలాభం** అంచులో నేసే ఒకరకం డిజైను. చూ. చిత్రం 260 (రా. 8).

**మిరపపండు (రంగు)** రూ. మిరప్పండ్లరంగు; పర్యా. మిర్చి(రంగు)(1). ముదురు ఎరుపురంగు; పండు మిరప (కాయ) రంగు; బి. ఎస్, ఎ. ఎస్. డబ్ల్యు. లతో ఉకారుచేసి ఆరంజెన్, స్కార్లెట్, ఆర్. సి., పటిక, తేజాపు, నైట్రేట్ సల్ఫ్ వేసి తయారుచేస్తారు (కో. 9, 16).

**మిరపపండ్లరంగు** ఉ. మెరప్పండ్లరంగు; చూ. మిరప్పండు(రంగు). (కో. 13, 14).

**మిరపపూలు** అంచులోనేసే ఒకరకం డిజైను. చూ. చిత్రం 233 (తె. 24).

**మిరపపూలంచు** ఉ. మిరప్పూఅంచు. ఒకరకం డిజైనులో నేసిన అంచు. చూ. చిత్రం 233(తె. 24, 31).

**మిరాట్‌బ్లాకు** చేత్తో డిజైను(రంగు) అద్దే ఒకరకం కొయ్యఅచ్చు; దీనికి రెండువైపులా డిజైన్లు చెక్కి ఉంటాయి; చూ. అచ్చు (రా. 24).

**మిరియం** (-అద్దు) నూలుచిలపకు అచ్చుతో అద్దిన రంగుచెక్క (కో. 24).

**మిర్చి(రంగు)** ఉ. మిడ్చి, మిర్కి. **1.** పర్యా. మిరప పండు (రంగు), ముదురు ఎరుపురంగు; పండుమిరప (కాయ) రంగు; బి. ఎస్., ఎ. ఎస్. డబ్ల్యు. లతో ఉకారుచేసి ఆరంజెన్, స్కార్లెట్, ఆర్. సి., పటిక,

లేజాపు, సైక్రేట్ సల్ఫ్‌వేసి తయారుచేస్తారు (తె. 4,5, 10-13, 15-18); 2. అరుద్రపురుగు రంగు (తె.21).

**మిర్గు** మృగశిరకార్తె (=జూన్ నెలలో వచ్చేది); గొర్రెబొచ్చు రెండోసారి ఈ కార్తెలో కత్తిరిస్తారు (తె. 27, 28).

**మిర్గుకత్తెర** మృగశిరకార్తెలో ఉన్ని కత్తిరించటం (తె. 28).

**మిల్లునూలు** పర్యా. గిర్నినూలు, సెంబరునూలు, పెట్టెనూలు, మరనూలు, మిషనునూలు, సీమనూలు. మిల్లులో యంత్రాలమీద తయారయిన నూలు (కో. 1, 4, 11-28, 31, 32, 36; తె. 25, 27; రా. 11).

**మిషనంచు** ఉ. మిసనంచు. మొగ్గ, ఏటవాలుగీరలు, ఒంటికటారు వరసగా పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 167 (తె. 5).

**మిషనానుమాను** రూ. మిసనానుమాను; పర్యా. చూ. మరాను. పెద్దపడుగులో ఒకేసారి పోసే ఒకరకం అను (మాను); ఒకగోతిలో పెద్దచెక్రం అమర్చి దాన్ని తిప్పుతూ పడుగు పోస్తారు; 12-24 పడుగుల వరకూ ఒకే సారి దీనిమీదికి తోడవచ్చు. చూ. చిత్రం 50 (రా.2).

**మిషను** పర్యా. చూ. డాబీ. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గంపైన అమర్చే యంత్రం. చూ. చిత్రం 132 (కో. 21).

**మిషనుకత్తి** ఉ. మిసనుకత్తి; పర్యా. చూ. కుక్క (2). డాబీకోలలను పైకిలేపటానికి దిండుచెక్రాన్ని-కొన్నిచోట్ల దిండుగాడిని-గుంజే ఇనపరేకు; దీనికి ఒక వైపున పేటుతాళ్ళు కడతారు; పావుచెక్క తొక్కినప్పుడు పళ్ళచెక్రాన్నిగాని దిండు ఊచలచెక్రాన్నిగాని గుంజుతూ కిందికీ పైకీ ఆడుతుంది. చూ. చిత్రం 132 క. 3, 132 చ. 7, 132 ట. 3 (కో. 24).

**మిషనుడాబీ** అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి వాడే ఒకరకం డాబీ; చూ. డాబీ (కో. 15).

**మిషనునూలు** ఉ. మిసను-; పర్యా. చూ. మిల్లునూలు. మిల్లులో యంత్రాలమీద తయారయిన నూలు (రా. 21).

**మిసనుమగ్గం** చూ. మిస(ను) మగ్గం (రా. 7).

**మిస్సమ్మగడిచీర** ఒకరకం నల్చదంపు గడిచీర; ఒక సినిమాపేరుమీద ప్రచారంలోకి వచ్చింది (కో. 35).

**మీటర్‌గడిపరికరం** ఖద్దరునూలు; మీటరుపొడుగున చిలపలుగా చుట్టటానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 287 చ. 3 (తె. 2).

**మీటుపుల్ల** పర్యా. చూ. బుసిపుల్ల. చేతినాడెగాడిలో అడ్డంగా బిగించిన పుల్ల; పేకపోగు చిక్కుపడకుండా సాపుగా రావటానికి దీనికి వెనకనుంచి పోగు తీస్తారు; కొన్నిచోట్ల దీనికి ఉంగరం వేస్తారు. చూ. చిత్రం 131 చ. 2 (కో. 37).

**మీదికచ్చు** అనులో మధ్యాకీటకు బిగించిన మొదటి కొయ్య. చూ. చిత్రం 45 క. 13 (తె. 33).

**మీదికొయ్య** పర్యా. చూ. కొలతకొయ్య. చట్రం అను నిలువుపట్టెకు బిగించిన కొయ్య(లు); మామూలుగా ఇవి నాలుగుంటాయి; పడుగు పెద్దదికావాలంటే వీటినికూడా కలిపి అనుపోస్తారు. చూ. చిత్రాలు 45 ట. 2-5, 45 త.1 (కో. 34).

**మీదికోల** అనుకొయ్యలలో మొదటికొయ్య; కోల కొయ్య. చూ. చిత్రం 45 క. 10 (తె. 23, 25).

**మీదిగుండు** పర్యా. చూ. పలక(4). చేతిమగ్గం పన్నె బిగించిన పైచెక్క; పలచగా, పొడుగ్గా ఉంటుంది; దీనికి కింద గుంపు బిగిస్తారు; దీనికి పైన దారాలు కట్టి వేలాడదీస్తారు; నేత నేసేటప్పుడు పోగు దగ్గరపడటానికి దీంతో అదుముతారు. చూ. చిత్రం 109 చ. 1 (కో. 29).

**మీనా** 1. నేతలోపడే రంగుచుక్క (రా. 15); 2. చూ. మైనా (కో. 8).

**మీనాపనివాళ్ళు** నేతబట్టలకు కొయ్య అచ్చులతో రంగులు అద్దే పనివాళ్ళు; చూ. మైనా (కో. 8).

**మీనాబార్డరు** ఒకరకం అంచు (తె. 6).

**మీనాముత్తు** నేతలో మధ్య రంగులో వచ్చిన ముత్యంపేటు (రా. 15).

**మీనారంగు** పర్యా. సప్పారంగు. చేతిఅద్దకంలో మైనా (=ఒకరకం అద్దకం అచ్చు)తో అద్దిన రంగు (కో. 8.)

**మీరాబాయి** ఒకరకం నీలంరంగు; గాజునీలం (కో. 12, 13).

**మీరాబాయిపచ్చ** ఒకరకం పచ్చరంగు. చూ. చిత్రం 288 (కో. 24).

**ముకుతాడు** చూ. ముక్కుతాడు (కో. 28).

**ముక్కచ్చి** (-ఎత్తు, -కూర్చు, -చేయు, -చేర్చు, -దూయు, -వేయు) రూ. ముక్కచ్చె. సరిచేసిన పడుగులో మూడు లాకలతో ఒకచోటికి చేర్చిన రెండు అనులున్న భాగం. చూ. చిత్రం 82 (కో. 1, 3, 5, 7, 10; తె. 17; రా. 8).

**ముక్కచ్చిచేయు** (క్రి.) 1. సరిచేసిన పడుగులో మూడులాకలతో రెండు అనులు ఒకచోటికి చేర్చటం (కో. 3, 5); 2. సరిచేసిన పడుగులో మూడుకచ్చులు మిగిల్చి తక్కినవి తీసివెయ్యటం (కో. 4).

**ముక్కచ్చిదూయు** (క్రి.) ముక్కచ్చిలాకలు తీసి వెయ్యటం; చూ. ముక్కచ్చి (కో. 7).

**ముక్కచ్చె** (-చేయు) చూ. ముక్కచ్చి (కో. 6).

**ముక్కట్టుతాడు** పర్యా. చూ. ముక్కుతాడు. పంటెకి కిందివైపున ఆకులచివర్లను కామకు కలిపికట్టిన తాడు. చూ. ముక్కుకట్టు. చూ. చిత్రం 19 క. 7 (కో. 27).

**ముక్కాలుకొయ్య** ఆసుపోసిన నూలు (=పడుగు) మూడు జేనల పొడుగు అదనంగా రావటానికి బిగించిన కొయ్య. చూ. చిత్రం 45 ట. 4 (కో. 37).

**ముక్కు** పర్యా. చూ. నాడెముక్కు. నాడెచివర కొనదేలిన భాగం; మరనాడె మొనకు ఇనపపొన్ను బిగిస్తారు; కొన్నిచోట్ల లక్కమొన పెడతారు. చూ. చిత్రం 131 చ. 4 (కో. 5, 10; తె. 9).

**ముక్కుకట్టు** ఉ. ముక్కట్టు; పర్యా. గుత్తికట్టు, బిగువుకట్టు, ముక్కుదారంకట్టు, మునిముక్కట్టు, మూతికట్టు. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కామకు కలిపివేసిన కట్టు; చూ. ముక్కుతాడు. చూ. చిత్రం 19 క. 7 (కో. 7. 8. 36, 37; తె. 11, 13, 14, 20).

**ముక్కుతాడు** రూ. ముకుతాడు, ముగుదాడు; పర్యా. ముక్కట్టుతాడు, ముక్కుదారం. పంటెకు కింది వైపున ఆకుల చివర్లను కామకు కలిపికట్టిన తాడు; చూ. ముక్కుకట్టు. చూ. చిత్రం 19 క. 7 (తె. 5-7, 9, 21; రా. 23).

**ముక్కుదారం** పర్యా. చూ. ముక్కుతాడు. కంటెకు కిందివైపున ఆకుల చివర్లను కామకు కలిపి పట్టిన తాడు; చూ. ముక్కుకట్టు. చూ. చిత్రం 19 క. 7 (తె. 2, 12, 30).

**ముక్కుదారంకట్టు** పర్యా. చూ. ముక్కుకట్టు. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కామకు కలిపి వేసినకట్టు; చూ. చిత్రం 19 క. 7 (తె. 12).

**ముక్కుపొడిచాయ** ఉ. -సాయ; పర్యా. చూ. నస్యం(రంగు)(1). ముక్కుపొడుంరంగు; snuff colour: స్కార్లెట్ ఆర్. సి., తేజాపు, పటిక, నైట్రేట్‌సల్ఫ నెప్తాల్ రంగు, బ్రౌన్ ఆర్. 800, కాస్టిక్‌సోడా, హైడ్రోసల్ఫ వేసి ఇండెంత్రీన్ రంగు తయారు చేస్తారు (కో. 22).

**ముక్కెరకోలుకులు** చూ. ముచ్చెరకోలుకులు (తె. 12).

**ముఖి** కలంకారీ అద్దకానికి కొయ్యఅచ్చుమీద గుద్దే గూటం. చూ. చిత్రం 283 ప. 1 (కో. 12).

**ముగుదాడు** చూ. ముక్కుతాడు (కో. 34).

**ముగ్గుపేటు** 1. ఒకేరంగు చీరలో మధ్య బుటాలు పడేట్టు నేసిన డిజైను (కో. 12, 13, 15); 2. చీరలో వంకరగీరలు, చుక్కలు పడేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 234 (కో. 14).

**ముగ్గోరంచు** మూడుగీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు. చూ. చిత్రం 185.3 (కో. 30).

**ముంగటికొయ్య** ఉ. ముంగడి-; పర్యా. చూ. తలకొయ్య. తలపీటకు ఉండే మొదటి వరసకొయ్య(లు); వెనకపీటకొయ్యలకంటె వీటి సంఖ్య ఎక్కువ. చూ. చిత్రం 45 క. 5 (తె. 29, 31, 33).

**ముంగటిపట్టె** పర్యా. చూ. తలపీట. ఆసుపీటల్లో మొదటిది; దీనికి ఒకటి రెండు చాళ్ళలో ఆసుకొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (తె. 31).

**ముంగటిపీట** ఉ. ముంగడి-; రూ. ముందటిపీట; పర్యా. చూ. తలపీట. ఆసుపీటల్లో మొదటిది; దీనికి ఒకటి రెండు చాళ్ళలో ఆసుకొయలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (తె. 29, 33).

**ముంగడిపీట** 1. బొందురాట్నం తొక్కుడుపీటకు ఎడమవైపు బిగించిన చిన్నపట్టె (తె. 10); 2. పర్యా. చూ. అడ్డపట్టె(5). డబ్బారాట్నం తొక్కుడుపీటకు ఎడమవైపు బిగించిన చిన్నపట్టె. చూ. చిత్రం 41 క. 4 (తె. 10).

**ముంగారుపత్తి** ఉ. ముంగారి-. ఏడాదిలో మొదటి పంటగా పండించేది; గింజలు ఎక్కువ; అంత మేలిరకం కాదు (కో. 14; రా, 22).

**ముంగి** నేతలో వచ్చే చిన్నగడి. చూ. చిత్రాలు 235.1, 281 (తె. 6, 7, 22, 23; రా. 14).

**ముంగిఅంచు** చేత్తో పోగులు మలిపి నేసిన ఒకరకం అంచు; చిన్నగళ్ళు పడతాయి. చూ. చిత్రం 235 (తె. 25).

**ముంగిచీర** ఒకరకం చిన్నగడిచీర; రెండు కోలుకులు ఒక వన్నె, ఒక కోలికి మరొకవన్నె (కాటువన్నె) పెట్టి గీరలుగీరలుగా పడుగుపేకలు నేస్తారు. చూ. చిత్రం 281 (తె. 1, 2, 5-7, 10-12, 17, 18, 21-23, 25; రా. 14, 23).

**ముంగినేత** 1. రూ. మూగినేత. రెండు మూడు రంగులు కలిపి నేసిన గడినేత; దీంట్లో భేదాలు: సాదా ముంగి, కసకసముంగి, కడ్డీముంగి మొ.వి (తె. 23); 2. నిలువుకు పెట్టినన్ని రంగులు పేకకు కూడా పెట్టి నేసిన ఒకరకం నేత (తె. 32).

**ముచ్చెని** (< ముచ్చి + అని) మగ్గంగుంటలో పావుచెక్క తొక్కినప్పుడు సగంవరకే తెచిసఅని (రా. 18).

**ముచ్చెరకోలుకులు** రూ. ముక్కెరకోలుకులు; పర్యా. చూ. ముత్యం(పేటు). జరీతోగాని కృత్రిమపు పట్టుతోగాని వరసగా 2-6 పోగులతో నేసిన డిజైను;

కొన్నిచోట్ల జంటగీరలుగాను కొన్నిచోట్ల చదరంగాను నేస్తారు. చూ. చిత్రం 236 (తె. 13).

**ముంజివర** నేతపడుగులో అచ్చుదగ్గర దూర్చిన సన్నబెత్తం (రా. 16).

**ముట్టి** ఉ. ముట్టీ, ముశీ; చూ. ముష్టి (తె. 1, 6, 20-28).

**ముట్టికట్టె** పర్యా. చూ. కుంచెపిడి. పడుగుదువ్వే కుంచె పట్టుకోటానికి బిగించినకొయ్య. చూ. చిత్రం 76 క. 1 (తె. 20).

**ముట్టికొమ్మ(లు)** పసుపుకొమ్ములు; రంగుల తయారీలో వాడతారు (కో. 1).

**ముట్టితాడు** చూ. ముష్టితాడు (తె. 20-22, 26-28).

**ముట్టీ** ఉ. ముశీ, ముశ్టీ. తివాసీపడుగు చివర పొట్టెలకు వేసిన ముడి. చూ. చిత్రం 321.2 (కో. 16; తె. 17).

**ముట్టీలకర్ర** ఉ. ముశ్టీలకర్ర. తివాసీమగ్గం పైభాగాన; పడుగు చివరి పొట్టెముడులు(=ముట్టీలు)తగిలించింది; దీనికి బిగించిన మేకులకు ముడులు తగిలిస్తారు. చూ. చిత్రం 320.8 (కో. 16).

**ముట్టు** 1. పిడి; తివాసీ నేసేటప్పుడు ఉన్నిపోగులు కోసేకత్తి పిడి. చూ. చిత్రం 322 చ. 1 (తె. 17); 2. పంజాపిడి; చూ. పంజా. చూ. చిత్రం 322 క. 1 (తె. 17).

**ముట్టుపోగు** వడికేముందు ఏకుకు అంటించే కదురు పోగు; కదురుకు చివర మిగిల్చింది.

**ముడి** తివాసీ నేసేటప్పుడు డిజైన్నుబట్టి పడుగులో వేసే పేకపోగుల అల్లిక (తె. 10).

**ముడిఅంచు** మొత్తం ఒకేరంగులో నేసిన మామూలు అంచు (కో. 9బి).

**ముడిచీర** పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర; అంచులేనిది (తె. 16).

**ముడితాను** అంచులేకుండా నేసిన పొడుగుబట్ట (=తాను). (కో. 9).

**ముడినూలు** పర్యా. చూ. కోరా(నూలు). చలవ చెయ్యని ముడినూలు; unbleached yarn; ఇది గోధుమ రంగులో ఉంటుంది (రా. 23).

**ముండచీర** వితంతువులు కట్టుకొనే ఎర్రచీర (రా. 16).

**ముతకదుప్పటి** మందపు దారాలతో నేసిన దుప్పటి (రా. 4).

**ముతకనూలు** రూ. ముదుగునూలు; పర్యా. గులిగి, దప్పం, దొడ్డునూలు, లావునూలు. పోగు మందంగాఉండే నూలు; 10 నుంచి 60 నెంబర్లదాకా. (కో. 6, 11-18, 21; రా. 4, 10).

**ముత్తంచు** ముత్యపేటుపెట్టి నేసిన అంచు(రా.3).

**ముత్తసూరి** చూ. మోతిచూరు (కో. 23).

**ముత్తుకడ్డీ** అంచుడిజైనులో రెండువైపులా ముత్యాలు పెట్టి నేసిన సన్నపట్టె(=కడ్డీ) చూ. చిత్రం237(కో.2).

**ముత్తుకమ్మి** ముత్యమంత భాగంలో చిన్నదారపు పోగులు పదనగా పడేట్టు నేసిన కమ్మి; జరీగాని (కృత్రిమపు)పట్టు పోగులుగాని పెట్టి నేస్తారు (కో. 2).

**ముత్తుగడిచీర** ఒకరకం గళ్ళచీర (రా. 7).

**ముత్తుపలక** డిజైన్లు నేసేటప్పుడు పేటుదారాలను పైకి ఎత్తే కొయ్యచెక్క; 2½ గ. పొడుగు, 3 అం. ల వెడల్పు ఉంటుంది (కో. 2).

**ముత్తు(పేటు)** చూ. ముత్యం(పేటు). (కో. 2, 7; రా. 7, 11).

**ముత్తుమండపం** ఒకరకం చిన్నగడినేత చీర(రా.3).

**ముత్తుసరికమ్మి** మూడు గీరలుపెట్టి నేసిన కమ్మి (కో. 34, 36).

**ముత్తెంరంగు** ఒకరకం ఎరుపురంగు (కో. 2).

**ముత్తెలకమ్మి** ఒకరకం చీరకమ్మి (కో. 33).

**ముత్యం(పేటు)** ఉ. ముచ్చెం(పేటు), ముత్తెం(పేటు); రూ. ముత్తు(పేటు); పర్యా. కేతింకొలుకులు, తణుకు, ముచ్చెరకొలుకులు మొలుకులపేటు, మోతిచూరు. జరీగాని కృత్రిమపుపట్టు(=కేతర)గాని వరసగా 2-6 పోగులతో నేసిన డిజైను; కొన్నిచోట్ల జంటగీరలుగా, కొన్నిచోట్ల చదరంగాను నేస్తారు. చూ. చిత్రం 236 (తె. 1, 5, 22; రా. 24).

**ముత్యంపేటుదుప్పటి** ఉ. ముచ్చెంపేటు—. రెండేసి కొలుకుల చొప్పున ముత్యంపేటు డిజైను పెట్టి నేసిన దుప్పటి (తె. 5).

**ముత్యాలపందిరి** ఉ. ముచ్చెలపందిరి: ముత్తెలపందిరి. ఒకరకం చిన్నగడిచీర; నూలులోనూ పట్టులోనూ రకరకాల డిజైన్లుపెట్టి విలువైన చీరలు నేస్తారు; కొన్నిచోట్ల ఎరుపుగాని వయిలెటుగాని అంచుల మధ్యపడుగు(=తల్లిపడుగు)కు పెట్టి పదేసి కొలుకుల గళ్ళుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల ఆకుపచ్చ రంగుమీద చిన్నగళ్ళు పడేట్టు నేస్తారు; మరికొన్నిచోట్ల తెలుపు నాలుగు కొలుకులు, ఎరుపు నాలుగు కొలుకులు పెట్టి నిలువు, పేక నేస్తారు (కో. 7, 33, 34, 37; తె. 4, 11, 13).

**ముత్యాలపేటంచు** ?జరీతోగాని కృత్రిమపుపట్టుతోగాని నేతనేసేటప్పుడు ముత్యమంతమేర పోగులు మలిపి వరసగా నేసిన అంచు. చూ. చిత్రం 236 (తె. 1).

**ముత్యాలమ్మచీర** ఉ. ముత్తెలమ్మసీర. ఒకవైపున ఎరుపు, మరొకవైపున నలుపురంగు బెత్తెడేసి వెడల్పున అంచుపెట్టి నేసిన చీర; మొక్కుబళ్ళకు పెడతారు (కో. 14; తె. 15).

**ముదుగునూలు** చూ. ముతకనూలు (కో. 8, 14, 19, 20; రా. 5, 20).

**ముదురుగులాబి** ఒకరకం గులాబిరంగు; ఎరుపు (కో. 35).

**ముదురునీలం** 1. నలుపులో తెలుపువన్నె కలిసిన రంగు; చూ. ఆస్మాన్(తె. 12); 2. ఒకరకం(ముదురు) నీలం రంగు; Royal-blue (కో. 19, 35).

**ముద్ద** పర్యా. చూ. దూపిరి(3). రాటితిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 5, 7, 10; తె. 16; రా. 6).

**ముద్దకమ్మి** 1. రంగునూలుతో నేసిన ఒకరకం కమ్మి (కో. 14); 2. పర్యా. రంగడుకమ్మి(2). లింగడు కమ్మిలో సన్నటి నిలువుగీరలుపెట్టి నేసిన కమ్మి (కో. 9).

**ముద్దకాయ** ఉ. ముద్దగాయ్; చూ. ముద్దగొయ్య (2). (తె. 2; రా. 24).

**ముద్దగూటం** 1. ఉ. ముద్దిగూటం; పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (రా, 1); 2. పర్యా. చూ. గూటం(2). రాటి తిరగటానికి ఆధారంగా దూపిరికి దిగగొట్టిన కొయ్యగూటం చూ. చిత్రం 31 చ. 1 (కో. 6).

**ముద్దగొయ్య** ఉ. ముద్దకొయ్య, ముద్దగొయ; 1. పర్యా. కాలిమొద్దు, గిరకమొద్దు(1), పంటెమొద్దు. పంటెకు నూలుచుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టే మొద్దు; దీనిపైన అమర్చిన పంగలకర్రమీద పంటె ముక్కు ఆని ఉంటుంది. చూ. చిత్రం 24 (తె. 18. 20–24, 28, 29, 33); 2. రూ. ముద్దకాయ; పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (తె. 3–5); 3. పట్టుదారం తోడటానికి చిలప తగిలించే గూటంకింది దిమ్మ; మట్టి ముద్దగాని కొయ్యదిమ్మగాని వాడతారు; ఇటువంటివి మామూలుగా మూడుంటాయి. చూ. చిత్రం 294 క. 1 (తె. 23); 4. పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది, కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటికట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 2).

**ముద్దగొయ్యకోల** ముద్దగొయ్యకు బిగించిన చువ్వ; ఇటువంటివి మూడుచువ్వలకు కలిపి చిలప తొడుగుతారు. చూ. చిత్రం 293 చ. 2 (తె. 23).

**ముద్దగోలు** ఉ. ముద్దుగోలు. పంటెకు నూలు చుట్టటానికి ఊనికగా పెట్టే మట్టిముద్ద. చూ. చిత్రం 25 (రా. 24).

**ముద్దంచు** 1. బెత్తెడు వెడల్పుకు పైగా రంగులో నేసిన మామూలంచు (కో. 7); 2. వేలెడు వెడల్పు కడ్డీలు పడేట్టు నేసిన అంచు; కడ్డీఅంచు (తె. 4).

**ముద్దుగూటం** చూ. మొద్దుగూటం(4). (రా. 12).

**మునగబెండునార** మునగచెట్టు బెరడునుంచి తీసిన నార; కుంచెకట్టుబడిలో వెన్నుభాగంలోనూ పురి పైభాగంలోనూ దీంతో గట్టిగా కట్లువేస్తారు (రా. 18).

**మునిగట్టుచివర** ఉ.-సివర. మగ్గం దండె దగ్గర నేత పడుగులో దూర్చిన చువ్వ (రా. 15).

**మునిగూటం** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా వెనకవైపు మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల ఇటువంటిగూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (రా. 24).

**మునిముక్కట్టు** పర్యా. చూ. ముక్కుకట్టు.పంటెకు కిందివైపున ఆకులచివర్లను కామకుకలిపి వేసిన కట్టు; చూ. ముక్కుతాడు. చూ. చిత్రం 19 క. 7 (తె.31).

**మునిముక్కు** ఉ. మును-; పర్యా. చూ. పంటెముక్కు. పంటెకు కిందివైపున ఆకుల చివర్లను కలిపి కట్టిన కొన. చూ. చిత్రం 19 క. 6 (తె. 15–17, 21, 24, 26, 27–32).

**మునుము** పర్యా. చూ. మల (7). నేత పాగులో దండెదగ్గరినించి చివరిదాకా చాపిన పడుగు; నట్టరు మగ్గంనేసేవారి వాడుక. చూ. చిత్రం 127 (తె. 32).

**మునుముచివ్వ** ఉ.- సివ. నేతపడుగులో దండెకు అవతలదూర్చిన కర్ర (కో. 25).

**మును(ము)లాక** ఉ. మునుంలాక; రూ. మునుములేక. నేతపడుగులో దండెదగ్గర (? అవతల) దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 127.5 (కో. 14; తె. 15–17, 26–27, 31, 32).

**మునుములేక** చూ. మును(ము)లాక (తె. 21).

**మునెంచు** (<ముని + అంచు) పర్యా. చూ. చిగురు. అంచులో చిట్టచివరి భాగం; కొన్నిచోట్ల చివర కొంత విడిచి అంచు నేస్తారు; కొన్నిచోట్ల చివరిభాగం

లోనే నేస్తారు; మామూలుగా ఈ నేతకు జమిలిపోగులు వాడతారు. చూ. చిత్రం 155.1 (కో. 6; తె. 13).

**ముంత** పర్యా. చూ. దిండు (1). రాట్నం రెండు చక్రాలనూ (ఆకులు) వేరుచేసే కొయ్య; ఇరుసు దీని మధ్య ఉంటుంది. చూ. చిత్రం 15. 8 (తె. 16).

**ముందటిపీట** చూ. ముంగటిపీట (తె. 26).

**ముందరిచిరతతాడు** కుచ్చుతాడుకూ మగ్గం నిలువు పట్టెకూ కట్టిన పక్కదారం; ఇటువంటివి రెండు నిలువు పట్టెలకూ కడతారు. చూ. చిత్రం 118.24 (రా.21).

**ముందుకొయ్య** పర్యా. చూ. తలకొయ్య. తల పీటకు ఉండే (మొదటివరస) కొయ్య(లు); వెనకటి కొయ్యలకంటె వీటిసంఖ్య ఎక్కువ. చూ. చిత్రం 45 క. 5 (కో. 30).

**ముందుచివ్వ** ఉ.-సివ. మగ్గం దండెదగ్గర నేతపను గులో దూర్చిన చువ్వ (కో. 34).

**ముందుబల్ల** పర్యా. చూ. తలపీట. ఆసుపీటల్లో మొదటిది; దీనికి ఒకటి రెండు చాళ్ళలో ఆసుకొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (కో. 30).

**ముప్పట్టికమ్మి** మూడు పట్టెలుగా నేసిన కమ్మి (కో. 34, 36).

**ముప్పురి** మూడుపోగులు కలిపి పురిపెట్టిన నూలు (తె. 26; రా. 3).

**ముప్పురిఅతుకు** (క్రి.) అచ్చుతికేటప్పుడు రెండు పోగులు కొలికివేసి మరొక పోగు కొలికిలోకి దూర్చి అచ్చుతకటం (రా. 14).

**ముప్పురిదారం** మూడుపోగులు పురిపెట్టిన దారం (తె. 27).

**ముప్పేటకమ్మి** మూడుపట్టెలు వరసగా నేసిన కమ్మి (కో. 16, 20, 21, 23).

**ముప్పోం** చూ. ముప్పోగు (కో. 22-24).

**ముప్పోగు** రూ. ముప్పోం, మూటపోగు. మూడు పోగులదారం (కో. 2,3,7-9,12,21; రా. 6, 9, 11, 12, 15, 16, 24).

**ముబాదల** నిర్ణయించిన కూలికంటె. నేతపనివాడికి చెట్టి (=master-weaver) అదనంగా (బహుమతిగా) ఇచ్చిన రొక్కం (కో. 7).

**ముబ్బాగమంచు** చీరవెడల్పులో మూడోవంతు మేరకు నేసిన అంచు (రా. 14).

**ముమ్మెర** నీలికూసం (=ఎర) విడిచిన తరవాత పదిరోజులకు దసలిపురుగు విడిచే కూసం; మూడోసారి విడిచింది (తె. 7).

**మురాటి** ఉదజహరికామ్లం; Hydrochloric acid; అద్దకంరంగు తయారు చెయ్యటానికి, ముడిరంగులో కలిపే ఒక రసాయనం; చూ. మరాటి. (కో. 7-9; తె. 13).

**మురి** పర్యా. చూ. సంగటికోల. పత్తిరాట్నం నిలువుంమధ్య రూళ్ళకర్ర మాదిరిగా ఉండేకట్టె; ఇటు వంటివి రెండు ఒకదానొక్కటి అనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటిమధ్య ముడిపత్తి పెట్టినప్పుడు ఒక వైపు గింజలు, మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1.1 (రా. 15).

**ములకలిపున్నమి** చూ. మొలకలపున్నమి (రా.6).

**ములికి** ఉ. ములుకు. **1.** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో ఒద్దెచువ్వ పెంచటానికి అమర్చిన కొయ్య పుల్లి; కొన్నిచోట్ల ఇనపపుల్లి; కొండి. చూ. చిత్రం 121 క. 4. (తె. 22); **2.** చూ. ముల్లు (4). (రా. 4, 11); **3.** (-పెట్టు). పట్టంచుకు, తెల్లంచుకు మధ్య నేసిన గోరంత చిన్నబొడిపె (తె. 12); **4.** నారవడికే కదురు కిందికొసకు వేసిన ముల్లు; ఇనపమేకు; కుండపెంకు (=డాకి)లో పెట్టి తిప్పేటప్పుడు కొస అరగకుండా ఉండటానికి నేస్తారు. చూ. చిత్రం 302.3 (తె. 25); **5.** చూ. మొలికి (1). (తె. 27,28); **6.** పర్యా. చూ. చేడుముల్లు (2). చేడు చివరి ఇనపమొన; దీన్ని గొంగడి అడ్డకొసలో గుచ్చుతారు; చూ. చేడు (తె. 25, 28).

**ములుగట్టుగుది** పర్యా. చూ. చేడుపలుపు(1). చేడుకర్రకు-కొన్నిచోట్ల చేడుబద్దకు-చివర కట్టిన దారం; ఇటువంటివి మూడు నాలుగుంటాయి; నేత అడ్డంలో ముల్లుగుచ్చి దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125 క. 3 (కో. 30, 31).

**ములుగట్టుబొందు** పర్యా. చూ. చేడుబొందు. చేడుకర్రల బిగింపుకు దారాలకువేసే లోహపుచుట్టు; ఇనపదిగాని ఇత్తడిదిగాని. చూ. చిత్రం 125 క. 1 (కో. 34).

**ములుగుట్టుకర్ర** ఉ. ములుకుట్టుకర్ర; పర్యా. చూ. చేడుకర్ర. దోనెముందర, నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టేకర్ర; దీనికి దారాలు (చేడుపలుపులు), ఇత్తడిముళ్ళు (కొన్ని చోట్ల ఇనపవి) ఉంటాయి; మామూలుగా చేతిమగ్గా లకు వాడతారు. చూ. చిత్రం 124 క (కో. 30, 34; తె. 24).

**ములుగుట్టుతాడు** పర్యా. చూ. బొడ్డుతాడు. నేతబట్టమీద చేడుకర్రలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగు దారం; దీనికొసలు చేడుబొందులు - కొన్నిచోట్ల కర్రలు-రెంటికీ కడతారు; ఇదిలాగితే కర్రలు బిగు స్తాయి. చూ. చిత్రం 125 క. 5 (కో. 31).

**ములుగుట్టుపూజు** పర్యా. చూ. బిగుతాడు (3).

చేడుకర్రలమధ్య రెంటినీ బిగించే పై తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 125 క. 4 (కో. 34).

**ములుగుట్టుబద్ద** ఉ. ములుగుటుబద్ద; పర్యా. చూ. చేడుబద్ద (1). దోనె ముందర నేసినగుడ్డ ముడుచుకు పోకుండా అడ్డంగా పైవైపు బిర్రుపెట్టే కొయ్యబద్ద(లు); ఇటువంటివి రెండుబద్దలకు ముళ్ళు బిగించి ఉంటాయి; కొన్నిచోట్ల దారాలుకట్టి వాటిలో ముళ్ళుదూర్చి మెలిపెడతారు; మామూలుగా మర మగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 124 చ (కో. 22, 27).

**ములుగుట్టుకర్ర** పర్యా. చూ. చేడుకర్ర. దోనె ముందర నేసినగుడ్డ ముడుచుకుపోకుండా అడ్డంగా కిందివైపు బిర్రుపెట్టే కర్ర(లు); దీనికి దారాలు (చేడు పలువులు), ఇత్తడిముళ్ళు (కొన్నిచోట్ల ఇనపవి) ఉంటాయి; మామూలుగా చేతిమగ్గాలకు వాడతారు. చూ. చిత్రం 124 క (కో. 31).

**ములుగొట్టం** పర్యా. చెముడుములుగొట్టం. చేడు ముళ్ళు వేసుకొనే వెదురుగొట్టం (కో. 36, 37).

**ముల్కేషానవాస్ ఖానీ** తివాసీనేతలో వచ్చే ఒక రకం డిజైను (కో. 16).

**ముల్లిగొర్రె** చెవులులేనిగొర్రె (తె. 25).

**ముల్లు** ఉ. ముల్ల. **1.** పర్యా. చూ. చేపదవడ. పత్తినించి గింజలు వేరుచేసే పనిముట్టు; కొన్నిచోట్ల దీంతో పత్తితోమి శుభ్రంచేస్తారు. చూ. చిత్రం 6.1(కో. 34); **2.** పర్యా. చూ. బెంతికదురు. అచ్చుకట్టేటప్పుడు పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల; మామూలుగా ఇనపది; కంటాణీలాంటిది; దీనికి పదునుగా ఉన్నవైపు పోగు దూర్చటానికి చిన్నకొక్కెం ఉంటుంది. చూ. చిత్రం 94 (రా. 6); **3.** (బహు. ముండ్లు, ముళ్ళు) పర్యా. చూ. చేడుముల్లు(1). నేతనేసేటప్పుడు గుడ్డను బిర్రుపెట్టటానికి అంచుచివర గుచ్చే సన్నటి లోహపుముక్క; చివర వాడిగా ఉంటుంది; ఇత్తడి, ఇనుము, రాగి మొ. వాటితో నేస్తారు; కొన్నిచోట్ల బలుసుముల్లు; దీన్ని చేడుపలువులకు ముడిపెడతారు; కొన్నిచోట్ల చేడుబద్దకు చివర బిగించింది; ఇటువంటివి రెండువైపులా ఉంటాయి. చూ. చిత్రం 125 క. 6 (కో. 8,9,20,22,27,30,31; తె. 5,8,10,11,13-17, 21; రా. 13-15, 18, 23, 24); **4.** రూ. ములికి (2); పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (కో. 1-7, 10, 13-37; తె. 4,5,7-14, 18, 19, 25, 29; రా. 2, 5-7, 10, 12-14, 16-20, 24); **5.** పర్యా. చూ. ములికి (1). ఉన్నికదురు ఊచకు కింద బిగించిన మేకు; మామూలుగా ఆడవాళ్ళు వడికేకదుర్లకు, పెద్దకదురుకు బిగిస్తారు. చూ. చిత్రం 311 చ. 4 (తె. 26); **6.** పర్యా. చూ. చేడుముల్లు(2). చేడు చివరి ఇనప మొన; దీన్ని గొంగడి అడ్డకొనలో గుచ్చుతారు (తె. 11, 22).

**ముల్లుకుట్టుతాడు** పర్యా. చూ. చేడుపలువు (1), చేడుకర్రకు - కొన్నిచోట్ల చేడుబద్దకు - చివర కట్టిన దారం; నేత అడ్డంలో ముల్లుగుచ్చి దీనికి మెలిపెడతారు. చూ. చిత్రం 125 క. 3 (కో. 22).

**ముల్లుగట్టుసివర** పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం (=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల ఇనపచువ్వగాని వెదురుబద్ద గాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (రా. 19 బి).

**ముల్లుడబ్బి** నేతఅయిన తరవాత చేడుముళ్ళు వేసుకొనే డబ్బి (తె. 20).

**ముల్లె** పదివేల దసలికాయల లెక్క. (తె. 17).

**ముష్టి** రూ. ముట్టి; పర్యా. చూ. కుచ్చు. మర మగ్గంలో ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో తాళ్ళను గుంజే పిడి; మామూలుగా గుడ్డపేలిక-కొన్నిచోట్ల, బద్దెపేలిక-లు కలిపి కట్టింది; కొన్నిచోట్ల దారపురీలు కడతారు. చూ. చిత్రం 118.2 (తె. 9, 19, 23, 25).

**ముష్టితాడు** రూ. ముట్టితాడు; పర్యా. చూ. కుచ్చుతాడు. మరమగ్గంలో నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చు కట్టిన దారం. చూ. చిత్రం 118.22 (తె. 9, 19, 23, 25).

**ముసుగుకమ్మి** ఉ. ముసుగ్గమ్మి. చీర కట్టుకొన్నప్పుడు తలమీద కప్పుకొనే చెరగు; చీరచివరి మూరెడు భాగం; మామూలుగా ఇది మొట్టమొదట నేస్తారు; చూ. పైటచెరగు (తె. 18).

**ముసుగుచీర** ఆడవాళ్ళు తలమీద కప్పుకొనే పెద్ద కొంగుచీర; పెద్దచీర; విలువైనది (రా. 14, 15).

**ముసుగుచెక్క** పర్యా. చూ. బొమ్మ (9). మర మగ్గం సొరుగుకు చివర నాడెబయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118. 16 (కో. 7).

**ముసుగ్గుడ్డ(లు)** లంబాడీ ఆడవాళ్ళు తలమీద కప్పుకొనేబట్ట; అంచులకు వేరేపోగులు మలిపి (=కుప్పడం పట్టి) రకరకాల డిజైన్లలో నేస్తారు (తె. 16).

**ముళ్ళగోరంకి** లాకీ (=ముగురు ఎరుపు) రంగులో తెల్లచాయ (కో. 8).

**ముళ్ళగోరింట** ఉ. ముల్లుగోరింట. **1.** రూ. ముళ్ళ గోరింత. ముదురు పసరురంగు; ముళ్ళగోరింట పువ్వు రంగు (కో. 11, 13); **2.** బంగారం మాదిరి పసుపు వన్నె (కో. 15).

**ముళ్ళగోరింత** చూ. ముళ్ళగోరింట(1). (కో.12).

**మూకగీత(లు)** ఒక నమూనాకోసం గీసినగీత(లు); outlines; sketch (కో. 12).

**మూకంచు** **1.** చిన్నపట్టె మాదిరిగా నేసిన మామూలంచు (రా. 14, 15, 23, 24); **2.** చూ. బోడెంచు (రా. 18).

**మూకిజాడి** ?నలుపురంగులో ఉన్న ముదురుగొర్రె ఉన్నితో నేసిన గొంగడి (తె. 6).

**మూగ** ఉ. ముగ; పర్యా. చూ. మడత(1). అచ్చు తికేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు (తె. 11, 13).

**మూగపంటి** పర్యా. చూ. మడత(1). అచ్చుతికేటప్పుడు కింది పోగులూ పై పోగులూ కలిపి మొత్తం అతికే పడుగు (కో. 13).

**మూగపడుగు** పర్యా. మడత(1). అచ్చుతికేటప్పుడు కింది పోగులూ పై పోగులూ కలిపి మొత్తం అతికే పడుగు (తె. 26).

**మూగసరి** (-అతుకు) పర్యా. చూ. మడత(1). అచ్చుతికేటప్పుడు కిందిపోగులూ పై పోగులూ కలిపి మొత్తం అతికే పడుగు (కో. 14; తె. 21).

**మూగాసు** మూగపడుగు పోసే అసు; చూ. **మూగ పడుగు** (తె. 11).

**మూగితువ్వాలు** ఉ. మూగితువాలు. ఒకరకం తువ్వాలు; మూగి(=చిన్నగడి)నేతది (తె. 24).

**మూగినేత** చూ. ముంగినేత(1). (తె. 24, 29).

**మూగు** ఒకేపొర అచ్చుతికిన పట్టుపడుగు; ఒక పంచెల చాపుకుగాని చీరకుగాని సరిపోయేది (తె. 12).

**మూట** పర్యా. చూ. పేటుమూట. పడుగులో అతికిన పేటుపోగులు బిర్రుగా ఉండటానికి మగ్గానికి పైన దండెంమీదినించి వేలాడదీసి చివరకట్టిన బరువు; మామూలుగా ఇసకమూట; కొన్నిచోట్ల రాళ్ళు; మగ్గంమీద ఎత్తుగా గిలకలు అమర్చి పేటుదారాలు వాటికి తగిలించి చివర బరువులు కడతారు. చూ. చిత్రం 133.1 (కో. 7; రా. 2).

**మూటపోగు** చూ. ముప్పోగు (రా. 1).

**మూటం** పర్యా. **లోఅంచు**. అంచులో మొదటి భాగం; పడుగు వైపుది. చూ. చిత్రం 148.1 (తె. 14).

**మూడుకటారి** మూడంచులున్న లాహిరీ; చూ. లాహిరి చూ. చిత్రం 288 (తె. 24).

**మూడునాడెలనేత** పర్యా. చూ. కుప్పడంనేత. అంచుల్లో వేరేరంగు పేకదారాలు పెట్టి డిజైన్లు-పువ్వులు, మొగ్గలు, ఆకులు మొ.నవి పడేట్టు నేసే నేత; అంచులకు వేరుగా రెండు నాడెలు, మధ్యభాగానికి మరొక నాడె పెట్టి చేతిమగ్గంమీద నేస్తారు; కొన్నిచోట్ల జరీపోగులు కలుపుతారు; ఈ నేతకు ఎడమవైపున మరొక మనిషి కూర్చొని అంచుపోగులు మలపాలి (తె. 22).

**మూడునాడెలపట్టింగు** ఉ. మూన్నాళ్ళపట్టింగు. మూడు నాడెలతో నేసిన ఒకరకం చొక్కాగుడ్డ (కో.6).

**మూడులాకలకమ్మి** ఉ. మూళ్ళాకలకమ్మి. ఒక రకం చీరకమ్మి; చీరపడుగును మూడుపాయలుగా విడదీసి రంగుపోగులతో నేసింది (తె. 15).

**మూత** **1.** పర్యా. చూ. చిప్ప(1). రాటి పైబద్దలను బిగించి వాటిమధ్య బోర్లించి కట్టిన చిప్ప; మామూలుగా కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల కర్రచిప్పగాని రేకుమూతగాని వాడతారు; ఇది రాటినూలం మీద అనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (రా. 18); **2.** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో. 8); **3.** పర్యా. చూ. కప్పు చెక్క. మగ్గం సొరుగుమీద బిగించిన చెక్క. చూ. చిత్రం 118.17 (తె. 12, 15, 17).

**మూతచెక్క** పర్యా. చూ. బొమ్మ(9). మర మగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో. 6-8).

**మూతమగ్గం** ఒకరకం మరమగ్గం; తొట్టికి చివర మూతచెక్క బిగించింది; చూ. బొమ్మ (కో. 10).

**మూతికట్టు** పర్యా. చూ. ముక్కుకట్టు. పంచెకు కిందివైపున ఆకుల చివర్లను కామకు కలిపి వేసిన కట్టు; చూ. ముక్కుతాడు. చూ. చిత్రం 19 క.7(కో.30,31).

**మూపురం** ఉ. మూపరం; రూ. మోపురం(2); పర్యా. చూ. ఊపురం. చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం; నేతనేసేటప్పుడు పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు; చూ. పలకకొట్టు. చూ. చిత్రం 109 చ. 5 (కో. 16, 20, 21).

**మూరకొయ్య(లు)** పర్యా. చూ. కొలతకొయ్య. అను పొడుగుపీటకు బిగించిన కొయ్య(లు); ఇవి మూడుంటాయి; పడుగు ఎక్కువ కావటానికి వీటికి చుట్టి అసు పోస్తారు. చూ. చిత్రం 45 ట. 2-5 (కో. 29).

**మూరగుంజ** పర్యా. మూరగూటం. ఉన్ని పడుగు

తోడేటప్పుడు మూర కొలుచుకోటానికి బిగించిన అను గూటం: కొన్నిచోట్ల ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 312.4 (తె. 26).

**మూరగూటం** పర్యా. మూరగుంజ. ఉన్నిపడుగు తోడేటప్పుడు మూర కొలుచుకోటానికి బిగించిన అను గూటం; ఇటువంటివి కొన్నిచోట్ల రెండుంటాయి. చూ. చిత్రం 312.4 (తె. 6, 7, 9, 27, 28).

**మూరంటు** (< మూర + అంటు: -వేయు) పర్యా. చూ. అచ్చన. అచ్చుతికిన పడుగుమీద కొలతనుబట్టి వేసిన గుర్తు; మామూలుగా మసిగుర్తువేస్తారు; కొన్ని చోట్ల చిక్కుడు, బీర మొ. వాటి ఆకుపసర్లతో గజానికి ఒకటి చొప్పునగాని మూరకు ఒకటి చొప్పునగాని గుర్తులు వేస్తారు (కో. 9ఎ).

**మూరపుల్ల** పర్యా. చూ. అచ్చనలాక. అచ్చుతికిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనే బద్ద; మామూలుగా గజం-కొన్నిచోట్ల మూరెడు-పొడుగుది; కొన్నిచోట్ల మలగర్రతో కొలుస్తారు. (కో. 9).

**మూర్తపుగుడ్డ(లు)** (< ముహూర్తపు-) పెళ్ళి లగ్గానికి పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు కట్టుకొనే బట్ట(లు) (కో. 8).

**మూర్తంకోక** (<ముహూర్తపు-) పెళ్ళి ముహూర్తానికి పెళ్ళికూతురు కట్టుకొనే తెల్లచీర (కో. 1).

**మూర్తంపంచె** పెళ్ళి ముహూర్తానికి పెళ్ళికొడుకు కట్టుకొనే పంచె; తలంబ్రాలపంచె (కో. 1).

**మూర్తి** పర్యా. చూ. ఉరుపు. నేసిన ఒక బట్ట; single unit (కో. 23).

**మూలతైరు** కొంగు నేసిన తరవాత కొసకు నేసిన చిన్న బొగిడి; ఇటువంటివి రెండు కొసలకు నేస్తారు (తె. 12).

**మూలకొయ్య** పర్యా. చూ. మూలగూటం. మిడి గూటానికి వేసిన నేతమోకు పడుక్కు అడ్డురాకుండా తగిలించటానికి నేతబయలులో ఒక మూలకు పాతిన గూటం; చూ. తట్టు(డు)కొయ్య (కో 29, 32-36).

**మూలగడి** ఒకరకం గడినేత (కో. 15).

**మూలగూటం** పర్యా. చూ. మూలకొయ్య. మిడి గూటానికి వేసిన నేతమోకు పడుక్కు అడ్డురాకుండా తగిలించటానికి నేతబయలులో ఒక మూలకు పాతిన గూటం; చూ. తట్టు(డు)కొయ్య (రా. 7).

**మూలనేత** ఉ. మూర్నేత. అయిమూల డిజైను వచ్చేట్టు నేసిన నేత; ఒక పోగుకింద, రెండు పోగులు పైన వస్తాయి; బట్ట రెండువైపులా రెండు రకాలుగా ఉంటుంది (కో. 7, 9, 11-13).

**మూలబద్ద** పర్యా. అడ్డపట్టె(10), అడ్డబద్ద(4), కాను, క్రాసుబద్ద, జాయింటుబద్ద. మరాసుకట్టుబడిలో అడ్డపట్టెలను, ఆకులను బిగించిన కట్టె(లు); ఏటవాలుగా బిగిస్తారు (కో. 24).

**మూలబుటా** ఉ. -బుట్ట. దుప్పట్లకు మూలల్లో అద్దే రంగు డిజైను; కొయ్య అచ్చుతో అద్దుతారు. చూ. చిత్రం 283 ద. 5 (రా. 24).

**మూలమట్టం** మరాసుకట్టుబడిలో కీలును ఒగ్గుల పట్టెను కలిపిన ముక్కోణపు రేకు; కీలు ఆడినప్పుడు ఇది ఒగ్గులపట్టెను ఆడిస్తుంది. చూ. చిత్రం 50.13 (కో. 17, 20; తె. 13).

**మెజంటా** ఉ. మెజెంట్, మెజెంట. **1.** రూ. మెజంతా(1). ఒకరకం నీలం(=చెంద్రకాంత పుష్పం) రంగు; నలుపు, ఊదా కలిసింది. చూ. చిత్రం 288 (కో. 3, 13, 19; తె. 5, 11, 17); **2.** బచ్చలిపండు రంగు; పల్కజిమ్మడిపండు రంగు (తె. 12); **3.** వెంపలి పువ్వురంగు; బచ్చలిపండు వన్నెకంటె బేలగా ఉండే రంగు (తె. 13); **4.** ఎరుపు, ఊదా కలిసిన రంగు; గురుమాసి (తె. 19).

**మెజంతా** **1.** చూ. మెజంటా(1); **2.** నలుపు, నీలం కలిసిన (ఇండంత్రిన్) రంగు (తె. 24, 25); **3.** నలుపు, ఊదా కలిసిన రంగు (తె. 10, 18, 20, 22, 23, 31).

**మెట్ట** ఉ. ?మెట(లు); పర్యా. చిల్ల(7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువు పట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (రా. 10).

**మెట్టపత్తి** మెట్టచేలో పండించే పత్తి; మరనూలుకూ పడుకునూలుకూ కూడా వాడతారు (కో. 13).

**మెట్టు** **1.** పర్యా. చూ. చేపుబొండు. చేమకర్రల బిగింపుకు దారాలకువేసే లోహపుచుట్టు; ఇనపదిగాని ఇత్తడిదిగాని చూ. చిత్రం 125 క. 1 (కో. 10); **2.** పర్యా. చూ. జంత్రందిండు. గొంగడినేసే మగ్గం జంత్రానికి కింద బిగించిన కొయ్యచెక్క. చూ. చిత్రం 316.1 (తె. 26).

**మెట్టె** పర్యా. ఉంగరం(10). అచ్చుగుదులు తగిలించిన(ఇనప)చుట్టు; దీన్ని మగ్గం పై దంటెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి; చూ. కొండి (రా. 21).

**మెట్నడిజైనంచు** మూలమట్టం(=తాపీపనివాళ్ళ కొలత పనిముట్టు; "L" ఆకారంలో ఉండేది; మెట్నా) మాదిరి డిజైను నేసిన అంచు; మామూలుగా దుప్పట్లకు నేస్తారు. చూ. చిత్రం 239 (తె. 5).

**మెంపె** పోనెగాడిలో లాక బిగించటానికి పెట్టిన సీల (రా. 19ఎ).

**మెండు** (-పెట్టు) మెలిక; మిడిగూటానికి వేసిన నేతమోకు ఇవతలికిలాగి చేతిగూటానికి మెలివేస్తారు; చూ. చేతిగూటం (రా. 16).

**మెతకగొట్టు** (క్రి.) ఉ. మెతగ్గొట్టు; పర్యా. పడుగు తడుపు(1). గుడ్డపిడచతో పడుగుకు గంజి పట్టించటం; పోగు బిరుసెక్కటానికి గంజి పట్టిస్తారు; కొన్నిచోట్ల అంబలి పెడతారు (రా. 12).

**మెతకనూలు** ఉ. మెత్క-; రూ. మెతువునూలు. పురితక్కువ నూలు; పందలపాక (తూ. గో. జిల్లా) నూలును అనేవారు (తె. 13; రా. 20).

**మెతువునూలు** రూ. మెతకనూలు; పర్యా. చచ్చు నూలు, పీకునూలు, సాచినూలు. మెత్తటినూలు; ఇది పేకకు వాడతారు (రా. 7, 8, 11).

**మెత్త** 1. కమాను(=దూదిపకే కొయ్యపనిముట్టు); దండెను పట్టుకోటానికి అనువుగా చుట్టిన కట్టెదిండు. చూ. చిత్రం 9.7 (కో. 6); 2. రంగుతొట్టిలో పరువు మీద వేసిన ముతకగుడ్డ; దీనిమీద రంగుపోసి అచ్చు అద్దుతారు. చూ. చిత్రం 283 క. 3 (కో. 12, 26); 3. కలంకారీ అద్దకంలో రంగులద్దే బట్ట పరవటానికి ఒత్తుగా గుడ్డలు పెట్టిన బల్ల. చూ. చిత్రం 283 ప. 4 (కో. 12).

**మెత్తపట్టు** మృదువుగా ఉండే పట్టు; పురివేయని కృత్రిమపుపట్టు (కో. 12).

**మెదుగు** (క్రి.) మెత్తబడటం (కో. 9).

**మెదువగు** (క్రి.) వండేటప్పుడు అన్నంమెత్తబడటం (తె. 11, 14, 17).

**మెరుగుకాయితం** ఉ. మెరుక్కాయితం. నాడె దెబ్బతిని వేడుతేచినప్పుడు నున్నబరచటానికి రుద్దే గరుకుకాయితం; దీన్నే కొన్నిచోట్ల 'ఉప్పుకాయితం' అనీ 'ఇసకకాయితం' అనీ అంటారు (కో. 12).

**మెరోను** వార్నిషురంగు (రా. 12.)

**మెర్క్యూరీ** పాదరసరంగు (కో. 24).

**మెలకోల** డిజైన్లు నేసేటప్పుడు నూలు కొలుచు కొనే కఱ్ఱ; చూ. మెలికోల (తె. 24, 29).

**మెలికంచు** రెండురకాల రంగుపోగులు ఒక్కొక్క కొలికిచొప్పున పురిపెట్టి నేసిన అంచు; ఒకేదారంలో రెండురంగులు కనిపిస్తాయి; ఈ అంచుకు చిగురువదిలి నేస్తారు (కో. 7, 8).

**మెలికె** ఉ. మలికి; పర్యా. చూ. కొలికి(3). అచ్చు కట్టేటప్పుడు రెండు అచ్చుకఱ్ఱల వడిదారాలకు వేసిన లంకె; నేతనేసేటప్పుడు పడుగుపోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ లంకెల్లోనుంచి పెంపుపోగులు దూస్తారు. చూ. చిత్రం 100.3 (రా. 3, 4, 6).

**మెలికోల** పర్యా. చూ. మలగఱ్ఱ. నేతపడుగులో చివరిపాయలు బిగించిన కఱ్ఱ; మామూలుగా దీనికి మలజడ్డ జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127. 10 (తె. 24).

**మెలిగర్లు** పర్యా. చూ. మెలుగు(లు). గొంగడినేసే మగ్గం జంత్రాన్ని అచ్చుకోలను కలిపే నరాలు; జంత్రం నాగవాసానికి మెలిపెట్టి కట్టినవి. చూ. చిత్రం 315.10 (తె. 9).

**మెలిగుడి** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరిపాయకు కట్టినదారం చొప్పున మలగఱ్ఱకు కడ తారు. చూ. చిత్రం 127. 8 (తె. 24).

**మెలిబొంగు** పట్టుమగ్గానికి తగిలించిన పడుగు చివరి పాయలు కట్టిన వెదురుకఱ్ఱ; చూ. మలగఱ్ఱ (తె.7).

**మెలుగు(డు)** 1. అచ్చుకోలకు ఉన్నదారంతో వేసిన లంకె; "అచ్చుదారాన్ని అచ్చుగోలకువేసి మెలుగు తేస్తాం"(తె. 9); 2. పర్యా. బిడి. మెలి; వడి (కో. 9 బి; తె. 15).

**మెలుగుడుపుల్ల** పర్యా. చూ. బిర్రుపుల్ల (2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి తాడు వడిపెట్టే పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118. 7 (కో. 9 బి).

**మెలుగుతాడు** పర్యా. చూ. బిర్రుతాడు (2). మర మగ్గం నిలువుపట్టెను మేరువుపలకను పైకిగాని కిందికి గాని జరుపుకొని దీంతో బిర్రుపెడతారు. చూ. చిత్రం 118. 6 (తె. 15).

**మెలుగునరం** పర్యా. చూ. మెలుగు(లు). గొంగడి నేసే మగ్గం జంత్రాన్ని, అచ్చుగోలను కలిపే నరం; జంత్రం నాగవాసానికి మెలిపెట్టి కట్టింది. చూ. చిత్రం 315. 10 (తె. 11).

**మెలుగు(లు)** ఉ. మెలగులు; పర్యా. జత్రంవారు (లు), మెలిగర్లు, మెలుగునరం. గొంగడినేసే మగ్గం జంత్రాన్ని, అచ్చుగోలను కలిపే నరం; జంత్రం నాగ వాసానికి మెలిపెట్టి కట్టింది. చూ. చిత్రం 315. 10 (తె. 25 28).

**మెహబూబ్‌ఖానీ** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (తె. 17).

**మేకు** 1. పర్యా. చూ. ఆసుకొయ్య (3). ఆసు పీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టి వచ్చేట్టు ఆసుకు నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (కో. 2; తె. 14); 2. పర్యా. చూ. చిరతలి.

ఆసుపీటల బిగింపుకు వేసే కొయ్యపేడు; నేతపోడుగును బట్టి ఆసుపీటలను దగ్గరకుగాని దూరానికిగాని జరుపుకొని పేడు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 8 (రా. 10); **3.** పర్యా. సీల (3). మరాసుమీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులురావటానికి అడ్డకట్టెకు బిగించిన ఇనపపుల్ల; మరాసుతిరిగేటప్పుడు ఒగ్గులపట్టె పక్కకు జరిగి పోగులు అనిపడేట్టు దీనికి చుట్టుకొంటాయి; ఇటువంటివి 60-100 ఉంటాయి. చూ. చిత్రం 50 (కో. 11-13, 15,16,18-20,24,36); **4.** పర్యా. చూ. సరిగుంజ (1). ఆరుబయట చాపిన పడుగు రెండో వైపు కట్టటానికి పాతిన కొయ్య; హరిజనులవాడుక. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (కో. 6,9); **5.** పర్యా. చూ. చిల్ల(1). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (తె. 14; రా. 1, 3); **6.** పర్యా. చూ. వారుపుల్ల. మరమగ్గం ఉడతకుపైన ఉడతతోలు (=వారు) కొసలు బిగించిన ఇనపపుల్ల. చూ. ఉడత. చూ. చిత్రం 119. 3 (కో. 12; రా. 5); **7.** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా వెనకవైపు మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల ఇటువంటి గూటలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 8, 10, 11, 15); **8.** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (రా. 1, 2, 4, 7, 8, 10); **9.** పర్యా. చూ. దిమ్మ (5). డాబీదిండుకు చేసిన బొడిపె(లు); దిండు తిరిగినప్పుడు ఇవి కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 క. 2 (కో. 7); **10.** పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో పేకదారంకండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (కో. 8, 12, 19; రా. 3).

**మేకుగొట్టుకొయ్య** ఉ. మేగ్గొట్టుకొయ్య; పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివర పాతిన కొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేతమోకు పెడకోలకుకట్టి దీనికి పనుగు మెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు; హరిజనులవాడుక. చూ. చిత్రం 127.13 (తె. 13).

**మేకు(ల)కమ్మి** పర్యా. చూ. అనిపట్టె, ఆసుపెండె, కమ్మి (5), కొలుకులకోల, కొలుకులపట్టె, పొడవుబల్ల, మేకులపట్టె, మేకులబద్ద, సీలలపట్టె. మరాసుమీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులు రావటానికి మేకులు బిగించిన అడ్డకట్టె; ఒగ్గులపట్టె పక్కకు జరిగినప్పుడు పడుగులో అనులుపడతాయి; ఇటువంటివి 8-20 ఉంటాయి. చూ. చిత్రం 50. 8 (కో. 17, 18, 21, 24).

**మేకులపట్టె** పర్యా. చూ. మేకులకమ్మి. మరాసు మీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులురావటానికి మేకులు బిగించిన అడ్డకట్టె; ఒగ్గులపట్టె పక్కకు జరిగినప్పుడు పడుగులో అనులుపడతాయి; ఇటువంటివి 8-20 ఉంటాయి. చూ. చిత్రం 50.8 (కో. 7, 10).

**మేకులబద్ద** పర్యా. చూ. మేకులకమ్మి. మరాసు మీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులురావటానికి మేకులు బిగించిన అడ్డకట్టె; ఒగ్గులపట్టె పక్కకు జరిగినప్పుడు పడుగులో అనులు పడతాయి; ఇటువంటివి 8-20 ఉంటాయి. చూ. చిత్రం 50.8 (కో. 12ఎ, 26).

**మేకుసీల** పర్యా. చూ. తూకం. పేటువడికి కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపపుల్ల; కొన్నిచోట్ల సత్తుది; నేతనేసేటప్పుడు అని మూసిన తరవాత వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి రెండు పక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (రా. 18).

**మేజు** పట్టుపురుగులను పెంచే తట్టలు అమర్చిన మంచె; అరలుఅరలుగా ఉంటుంది; దీన్ని దడ్డెలు అనీ అంటారు. చూ. చిత్రం 289 ట (రా. 1).

**మేజుగుడ్డ** మేజాబల్లలమీద పరుచుకొనే బట్ట; table cloth (కో. 12).

**మేజ్రైఅంచు** చిట్టచివర తెలుపువదిలి, మూడురకాల రంగుల్లో మూడేసి కొలుకుల బిళ్ళలు పడేట్టు నేసిన అంచు; ఇటువంటివి పదిబిళ్ళలు నేస్తారు (కో. 5).

**మేడిబద్ద** పర్యా. చూ. ఉండేలు(బద్ద). తాడుకట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం 9.12 (కో. 5).

**మేడిమలక** ఉ. మేడిమల్క. **1.** రూ. మేడిమెలక, మేడిమెలిక; పర్యా. పనుగుమెలత. ఒకరకం మెలిక; అచ్చుకర్రమీది కొండితాడుకు వడితో మెలికవేస్తారు. (రా. 13); **2.** ఒకరకం మెలిక; పనుగుమెలిక; నేతను బిర్రుపెట్టటానికి నేతమోకుతో చేతిగూటానికి ముడి వేస్తారు. చూ. చిత్రం 122 క. 2 (తె. 4, 5, 13, 17).

**మేడిమలకవేయు** (క్రి.) పడుగులో చివరిపాయలు మలగర్రలకు ముడివెయ్యటం; చూ. మేడిమలక (తె.5).

**మేడిమెలిక** (-పెట్టు) చూ. మేడిమలక (1); ఊడ్డెకు కట్టిన తాడుతో కిందిగూటానికి మెలిక వేస్తారు. చూ. చిత్రం 72 (తె. 12).

**మేడిమెలిక** చూ. మేడిమలక (1). పన్నె కట్టే టప్పుడు దండెలమధ్య బిగించిన ఈనె(ల)కు గట్టి మెలిక దారంతో వేస్తారు (కో. 6).

**మేదరదబ్బ** పర్యా. చూ. దవడ. పన్నె కట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్లుబద్ద; నేత నేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 88 క. 10 (కో. 3).

**మేనక(పచ్చ)** ఒకరకం (బాగా లేత) పచ్చరంగు. చూ. చిత్రం 288 (కో. 2–4, 12, 15, 24, 35; రా. 8).

**మేపువ** పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచెభాగం; మొగలినారతోగాని పేముతోగాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (కో. 33, 37).

**మేరుపుపలక** పర్యా. అడ్డకట్టె(9), అడ్డకమ్మి(7), అడ్డకర్ర (2), అడ్డదండె (4), అడ్డపట్టె (15), అడ్డ బద్ద (3), అడ్డబల్ల (5), అడ్డబెండు (2), కత్తిబల్ల, కదురుకొయ్య, కొయ్యపట్టె, గాడిబద్ద, తలకమ్మి, తల పట్టె(2), తిరుగుడుగుండు, దండె(5), పలకపట్టె, పారు పట్టె, పైకమ్మి, పైదండె(1), పైపట్టె(4), పైపెండె, పైబద్ద(2), పైబల్ల, పైబెండు, బారాపలక, బారు పట్టె(3), మగ్గంపలక (2), మగ్గంబెదుగు, రేకుపట్టె, వగ్గిలకమ్మి, సట్టరుదండె, సూత్రాలకట్టె (1). మర మగ్గంచట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డ పట్టె; కొన్నిచోట్ల దీనికి చివర రేకులు వేస్తారు; కొన్ని చోట్ల దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసే టప్పుడు ఇది మగ్గంపందిరిమీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 1).

**మేలిచీర(లు)** ఎనిమిదిగజాల పొడుగుపెట్టి నేసిన పెద్దచీర(లు); పెద్దవాళ్ళు కట్టుకొనేవి (రా. 17).

**మేలుకొయ్య** **1.** పర్యా. చూ. తలకొయ్య. తల పీటకు ఉండే (మొదటివరస) కొయ్య(లు); వెనకపీట కొయ్యలకంటె పీటిసంఖ్య ఎక్కువ. చూ. చిత్రం 45 క. 5 (కో. 37); **2.** ఆసు కొలతకొయ్యలలో మొదటిది. చూ. చిత్రం 45 ట. 2 (కో. 37).

**మేలుపట్టె** ఉ. మేలుపట్టి; పర్యా. చూ. తలపీట. ఆసుపీటల్లో మొదటిది; దీనికి ఒకటిరెండు చాళ్ళలో ఆసుకొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (కో. 37).

**మేలుముసుగు** ఆడవాళ్ళు తలమీద కప్పుకొనే పెద్ద (కొంగు) చీర; విలువైనది (రా. 24).

**మేలురేషం** పర్యా. చూ. మంచిపట్టు. మంచిరకం పురుగులనుంచి వచ్చే పట్టు; పోగు ఒకచోట లావు, ఒక చోట సన్నం లేకుండా అంతటా సమంగా ఉంటుంది. (రా. 14).

**మేల్కమ్మి** (< మేలు + కమ్మి) ఒకరకం కమ్మి; లక్కాకంచు బట్టకు రెండువేళ్ళ వెడల్పున నేస్తారు (కో. 8).

**మైనా** రూ. మీనా (2); పర్యా. సప్పా(2). చేత్తో డిజైను (రంగు) అద్దే ఒకరకం కొయ్యఅచ్చు; ఒకేసారి డిజైను అద్దేది; మామూలుగా (చీర) రెండుఅంచు లకూ మధ్యభాగం (=గర్భం)లో దీంతో రంగు అద్దు తారు; సుమారు పదంగుళాల పొడుగు, నాలుగున్నర అంగుళాల వెడల్పు ఉంటుంది (కో. 3, 7).

**మైజారు** ఉ. మైజార్; పర్యా. చూ. పైటచెరగు. చీర కట్టుకొన్నప్పుడు భుజంమీద వేలాడేట్టు వేసుకొనే చెరగు; చీర చివరి మూరెడు భాగం; మామూలుగా ఇది మొట్టమొదట నేస్తారు (కో. 35).

**మైజారుకమ్మిచీర** చెంగులో డిజైనుకమ్మి నేసిన చీర (కో. 8).

**మైజారుచీర** ఉ. మైజారిచీర. పైటకొంగు(=మైజారు)లో డిజైను నేసిన చీర; దీన్ని అయిదు పావుచెక్కల మీద నేస్తారు; కొన్నిచోట్ల నలుపు తొగరు రంగుల్లో దోసెడు వెడల్పున కమ్మి నేసి పట్టు నలుపు రంగుల్లో ఒక్కొక్క కొలికి చొప్పున పెట్టి రెండువేళ్ళ వెడల్పున నేసి నాలుగుచోట్ల నాలుగు బానికాలు(=కుట్టుపోగులు) తీరుస్తారు (కో. 4, 10).

**మైదాగంజి** ఉ. మైదగంజి. మైదాపిండి ఉడకబెట్టి చేసిన పలచని జావ; దీన్ని పడుగుకు పెడతారు (తె. 2; రా. 1, 2).

**మైదానం** చీరనేతలో రెండు చెంగులకూ (కట్టు చెంగు, పైటచెంగుల) మధ్యభాగం (రా. 15).

**మైనపుకలం** కలంకారీ అద్దకంకోసం కరగబెట్టిన వేడిమైనంలో ముంచే కుంచె; చూ. కలం. చూ. చిత్రం 283 గ. 2 (కో. 12).

**మైనపుతాడు** పర్యా. చూ. మైనపువడి. మైనం పూసిన వడి; దీన్ని పేటుదారానికి చివర కడతారు; దీనికి మధ్య అంచుపోగులు దూరుస్తారు; చూ. వడి. (కో. 36).

**మైనపువడి** పర్యా. ఊక్పోడి, మైనపుతాడు, వార్నీషువడి. మైనంపూసిన వడి; దీన్ని పేటుదారానికి చివర కడతారు; దీనికి మధ్య అంచుపోగులు దూరుస్తారు; చూ. వడి (కో. 7, 20, 23, 25, 26; రా. 11, 14, 15).

**మైయేయు** (క్రి.) సరిచేనేటప్పుడు పడుగు తిరగ వేసి కుంచెతో దువ్వటం (కో. 34).

**మైల(లు)దీయు** (క్రి.)అమ్మవారిగుడిముందు ఊడ్చి శుభ్రం చెయ్యటం (తె. 24).

**మైసూరంచు 1.** పదికొలుకుల దారం చిగురు వదిలి ఒక కొలికి రంగు, ఒక కొలికి తెలుపు, నాలుగు కొలు కులురంగు, ఒక కొలికి తెలుపు వరసగా వచ్చేట్టు నేసిన అంచు (కో. 8); **2.** రెండు లాహిరీల మధ్య ఆకు, తీగ, మొగ్గ డిజైనులో పడేట్టు నేసిన అంచు (తె. 18).

**మొఖరం** తివాసీమగ్గం కట్టుబడికి నేలలో పాతిన పొడుగుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 320.2 (కో. 16).

**మొగకట్టుచాపు** ఉ. మొక్కట్టుసాపు; పర్యా. చూ. చాపు(5). మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేత బట్ట; బద్దెతో కలిసి ఉన్నది (కో. 32).

**మొగకదురు** ఉ. మొక్కదురు; పర్యా. చూ. దండెగదురు. ఒకరకం ఉన్ని కదురు; మగవాళ్ళు వడి కేది; మంద తోలుకెళ్ళేటప్పుడుకూడా నడుస్తూ. దీంతో వడుకుతారు. చూ. చిత్రం 311 క (తె. 22).

**మొగకాయ** మగ దసలిపురుగు అల్లినగూడు(తె.7).

**మొగదసలిపురుగు** దసలి(పట్టు)ఉత్పత్తిచేసే పురు గుల్లో మొగది; పొట్టసన్నం, రెక్కలు చిన్నవి; ఆడ పురుగు కంటె చిన్నది కావటంవల్ల దారం ఎక్కువవు తుంది (తె. 7).

**మొగంగాడి** ఉ. మొకం-; పర్యా. చూ. చీరె. రాట్నం "బొమ్మ"లో వడిదారం తిరగటానికి చెక్కిన గాడి. చూ. చిత్రం 15.11 (తె. 22).

**మొగంబల్ల** ఉ.మొకంబల్ల; పర్యా.చూ.బొమ్మ(3) రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువు కొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడి బొమ్మ ఆకా రంలో చెక్కుతారు. చూ. చిత్రం 15.10 (కో. 22, 30, 31, 33, 34; తె. 22, 23).

**మొగరం** ఉ. మొగురం; పర్యా. చూ. నిలువు(3). రాటికి ఆధారంగా పాతిన నిలువుకొయ్య. చూ. చిత్రం 31 ప. 1 (తె. 23).

**మొగలాసు** ఒకరకం అసు. చూ. చిత్రం 47(తె.19).

**మొగలినార** ఉ. మొగల్నార, మొగిల్నార; పర్యా. కేదగిబెండు. మొగలిచెట్టు (?)ఊడలనుంచి తీసిన నార; కుంచె కట్టుబడిలో వెన్నుభాగంలోనూ పురికి పైభాగం లోనూ దీంతో కట్లువేస్తారు (కో. 2, 5, 8, 11, 14, 27, 35; తె. 12-14, 16, 18, 26, 28; రా. 11, 13, 23).

**మొగిలాకుపేటు** మగ్గానికి పేటుదారాలు కట్టి నేత అయిమూలవరసల్లో వచ్చేట్టు మూలనేతలో మొగలి ఆకు ఆకారంలో నేసిన డిజైను. చూ. చిత్రం 240 (కో. 10).

**మొగిలిచన్నునార** ఉ. మొగిలిసన్ను-. మొగలి చెట్టు (?)ఊడనుంచి తీసిన నార; కుంచెకట్టుబడిలో వెన్నుభాగంలోనూ పురికి పైభాగంలోనూ దీంతో కట్లు వేస్తారు (తె. 5).

**మొగిలినార** ఉ. మొగిల్నార, మొగుల్నార. మొగలిచెట్టుమట్టలనుంచి తీసిన నార; నులక పేనటానికి, కుంచెకట్టుబడిలోనూ వాడతారు (కో.11,12.14,17).

**మొగిలిరంగు** నీలంరంగు; ఆస్మాన్ (తె. 4, 5).

**మొగ్గ 1.** పర్యా. చూ. బుగిడి. మొగ్గ ఆకారంలో నేసిన డిజైను; కొన్నిచోట్ల మొగ్గలో సగం(=అర్ధ బుగిడి) నేస్తారు. చూ. చిత్రం 221 (కో. 7); **2.** ఒక రకం అద్దకం డిజైను; అంచులో నేస్తారు (కో. 3).

**మొగ్గకమ్మి** మొగ్గ మాదిరి డిజైన్లు నేసిన కమ్మి (కో. 5).

**మొగ్గచాపు** అంచులో మొగ్గలు పడేట్టు రెండు నాడెలతో ఇద్దరు కలిసి కుప్పడంపట్టి నేసిన పంచెలజత; మామూలుగా పెళ్ళిళ్ళకు పెడతారు; చూ. కుప్పడం (కో. 5).

**మొగ్గంచు** గీరలు, మొగ్గలు పెట్టి నేసిన అంచు. చూ. చూ. చిత్రం 221 (కో. 36).

**మొగ్గపేటంచు** మొగ్గలు వరసగా పడేట్టు నేసిన అంచు. చూ. చిత్రం 221 (తె. 14).

**మొగ్గపేటు** అంచులో, మొగ్గ ఆకారంలో నేసిన డిజైను. చూ. చిత్రం 221.1 (కో. 16, 20).

**మొగ్గలంచుచీర** అంచులో మొగ్గలమాదిరి డిజైన్లు నేసిన చీర (కో. 30).

**మొట్టెగుజ్జు** పంటెమొట్టె(=అనుపోసేటప్పుడు పంటె అమర్చుకోటానికి పెట్టుకొనే సాధనం)కు ఆధా రంగా ఉండే కింది మొద్దు (తె. 31).

**మొదతాడు** చూ. మొలతాడు(దారం) (రా. 21).

**మొదతాలు 1.** చూ. మొలతాడు(దారం) (కో. 9); **2.** చూ. మొలతాడు(1) (కో. 9).

**మొండిఅంగిగుడ్డ** ఉ. మొండెంగిగుడ్డ. చంకబనీను (=మొండిఅంగి)ల కోసం నేసినగుడ్డ (రా. 16).

**మొండెం** (-అతుకు) పర్యా. చూ. మడత(1). అచ్చుతికేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు (రా. 11, 14, 16-18).

**మొండెంసరి** పర్యా. చూ. మడత(1). అచ్చుతికే టప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికిన పడుగు (రా. 18).

**మొత్తచెక్క** పర్యా. చూ. బొమ్మ(9). మగ్గం సొరుగుకు చివర నాడె బయటకి పోకుండా ఆపటానికి బిగించిన **కొయ్యచెక్క**; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (కో. 3).

**మొదటికొయ్య** పర్యా. చూ. తలకొయ్య. తలపీటకు ఉండే మొదటివరస కొయ్య(లు); వెనకపీట కొయ్యలకంటె వీటిసంఖ్య ఎక్కువ. చూ. చిత్రం 45 క. 5 (తె. 32).

**మొదటికోల** పర్యా. చూ. తలకొయ్య. తలపీటకు ఉండే మొదటివరస కొయ్య(లు); వెనకపీట కొయ్యలకంటె వీటిసంఖ్య ఎక్కువ. చూ. చిత్రం 45 క. 5 (కో. 25).

**మొదటిపీట** పర్యా. చూ. తలపీట. ఆసుపీటల్లో మొదటిది; దీనికి ఒకటిరెండు వాళ్ళలో ఆసుకొయ్యలు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 1 (తె. 32).

**మొదటివిరుపు** నేతపడుగులో మగ్గంకోలతకు సరిపడ్డ భాగం; నేతపడుగును విరుపు (=మడుపు) లుగా మడిచి చుడతారు (కో. 32).

**మొదిమివేళ్ళు** ఒకరకం గడ్డిమొక్క వేళ్ళు; వీటితో కుంచెపురి కడతారు; చూ. పురి (తె. 6).

**మొద్దు 1.** పర్యా. చూ. పీట(2). రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట. చూ. చిత్రం 15. 1 (తె. 1, 2; రా. 18); **2.** పర్యా. కండెలదిబ్బ, మొద్దుగూటం (2). నూలుడబ్బా తిరగటానికి వంపుదిరిగిన ఇనపచువ్వ దిగగొట్టిన కొయ్యమొద్దు. చూ. చిత్రం 30.1 (కో. 14; రా. 13); **3.** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి రాటిసూలానికి ఆధారంగా ఉన్నకొయ్య మొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 6ఎ, 8, 9, 13, 14; తె. 1, 6, 7, 9, 11, 13, 15, 17, 18, 24, 27, 30, 31, 33; రా. 11, 16, 17); **4.** పర్యా. చూ. అడ్డకట్టె(4). అడ్డగుమ్మి కింది పీట; దీనికి నిలువులు బిగిస్తారు. చూ. చిత్రం 34.1 (తె. 18); **5.** పర్యా. చూ. ఆసుపీట. ఆసుకొయ్య (= ఆసుకు బిగించిన నిలువుపుల్లలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె(లు); ఇటువంటివి మామూలుగా మూడు, కొన్నిచోట్ల రెండు ఉంటాయి. చూ. చిత్రం 45 క. 1-3 (తె. 18, 20); **6.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (రా. 24); **7.** పట్టుదారం పంటెకు తోడేటప్పుడు పంటెకామ కింద ఊనిగా పెట్టే కొయ్య (కో. 14).

**మొద్దుకాలు** పర్యా. కాలు (2). అడ్డగుమ్మి అమర్చిన తిరగేసిచట్టం కిందిపీటకు వేసిన పొడుగుపట్టె. చూ. చిత్రం 34.2 (తె. 17).

**మొద్దుగట్టం** కొయ్యదిమ్మ; చేత్తో డిజైన్లు అద్దేటప్పుడు బట్టకు నునుపురావటానికి దీనిమీద గట్టం (=గూటం)తో కొడతారు; కొన్నిచోట్ల చలవచేసిన ఖాదీ తువ్వాళ్ళు మడతలు చదునుచెయ్యటానికి వాడతారు. చూ. చిత్రం 287 చ. 2 (రా. 24).

**మొద్దుగులాబి** లంబాడి ఆడవాళ్ళు వాడే ఒకరకం నేతబట్ట; అంచులో సన్నగీరలుపెట్టి నేస్తారు (తె. 24).

**మొద్దుగూటం 1.** పర్యా. చూ. కాటుపీట. పంటెకు నూలుచుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టే కొయ్య. చూ. చిత్రం 28 (కో. 2); **2.** పర్యా. చూ. మొద్దు (1). నూలుడబ్బా తిరగటానికి వంపుదిరిగిన ఇనపచువ్వ దిగగొట్టిన కొయ్యమొద్దు. చూ. చిత్రం 30.1 (రా. 24); **3.** పర్యా. చూ. గూటం(2). రాటి తిరగటానికి ఆధారంగా దూపిరికి దిగగొట్టిన కొయ్య గూటం. చూ. చిత్రం 31 చ. 1 (రా. 17); **4.** ఉ. మొద్దుగూటాం; రూ. ముద్దుగూటంపర్యా. చూ. దూపిరి (3). రాటి తిరగటానికి రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 2).

**మొద్దుగొయ్య** పర్యా. చూ. దూపిరి (3). రాటి తిరగటానికి రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (రా. 18).

**మొద్దుతిరిగిణి** ఉ.- తిరిగిని; పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంటె మొ. వాటికి దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు; చూ. తిరిగిణి. చూ. చిత్రం 31 (రా. 17).

**మొద్దునిలువు** పర్యా. చూ. నిలువు (3). రాటికి ఆధారంగా పాతిన నిలువుకొయ్య; ఒకటిగాని రెండుగాని ఇలాటివి ఉంటాయి. చూ. చిత్రం 31 ప. 1 (తె. 24).

**మొద్దుపీట** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (తె. 24).

**మొద్దుపుల్ల** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటి కట్టుబడిలోనే ఒకభాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 31).

**మొన** పర్యా. చూ. నాడెముక్కు. నాడెచివర

కొనదేలిన భాగం; మరనాడె మొనకు ఇనపపొన్ను బిగిస్తారు; కొన్నిచోట్ల లక్కమొన పెడతారు. చూ. చిత్రం 131 చ. 4 (కో. 16, 17, 20, 21, 25, 29. 34; రా. 8, 11, 13, 14, 16, 18).

**మొరుకుడు** (బహు. మొరుకుల్లు). వెప్పుకుండలో దసలికాయలు ఉడకబెట్టినప్పుడు ఉడకని కాయ (తె. 17).

**మొల 1.** పర్యా. చూ. అసుకొయ్య(3). అసుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటినిచుట్టి వచ్చేట్టు అసుకు నూలు పోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6(తె. 10, 19, 20); **2.** అడ్డగుమ్మి ఇరుసుకొన; ఇటువంటివి రెండుకొనలు నిలువుకొయ్యలమీద అని ఉంటాయి (తె. 21); **3.** పర్యా. చూ. నాడెముల్లు. నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల; దీన్ని నాడెగాడిలో ఒకవైపున బిగించి ఉంటారు. చూ. చిత్రం 131 క. 3 (కో. 9; తె. 1, 6); **4.** డిజైన్లు నేసే(పట్టు)మగ్గంలో పేటుదారాల వదులకు బరువుకోసం కట్టిన ఇనపపుల్ల(లు); చూ. పేటుతూకం. చూ. చిత్రం 134 చ(తె. 5, 8); **5.** పర్యా. చూ. దోనుగపన్ను. ఉన్నిమగ్గం దోనుగగాడిలో చువ్వ బిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల(లు). (తె. 11); **6.** గొంగడిమగ్గంలో జంత్రం పైకట్టెకు కిందికట్టెకు బిగించిన మేకు (తె. 22); **7.** తివాసీ మగ్గం పై దోనెకు పడుగుపొట్లెలను కట్టటానికి బిగించిన మేకు; ఇటువంటివి దోనె పొడుగునా వరసగా ఉంటాయి. చూ. చిత్రం 320.12 (తె. 17).

**మొలకలపున్నమి** ఉ. మొల్కలపున్నమి; రూ. మలకలపౌర్ణమి, ములకలి పున్నమి. శ్రీరామనవమి తరవాత మార్చినెలలో వచ్చే పౌర్ణమి; వ్యాసపౌర్ణమి; ఈనాడు చేనేతపనివారు పండుగ చేసుకొంటారు (రా. 10).

**మొలతాడు** ఉ. మల్తాడు, మొల్తాడు. **1.** రూ. మొడతాలు (2); పర్యా. చూ. తలకట్టుతాడు. పంచెతలచిట్టెలకు పైవైపున ఆకుల్ని కలిపి కట్టిన తాడు. చూ. చిత్రం 19 క. 5 (కో. 6, 33, 34; తె. 5; రా. 6, 16, 17); **2.** పర్యా. చూ. బిరుతాడు. (3). అడ్డగుమ్మి ఆకులను కలిపికట్టిన తాడు. చూ. చిత్రం 34.4 (రా. 13).

**మొలతాడు (దారం)** ఉ. మల్తాడు, మొల్తాడు; రూ. మొడతాడు, మొడతాలు(1); పర్యా. చూ. అకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టిన తాడు; ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు పటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (తె. 4-7; రా. 5, 7, 8, 12, 19, 24).

**మొలలగుంత** పర్యా. చూ. వక్కగుంట. పేటు తూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి తీసిన చిన్న గొయ్యి; ఇటువంటివి రెండు పక్కలా రెండుంటాయి. చూ. చిత్రం 132 చ. 16 (తె. 8).

**మొలికి** ఉ. మొల్కి. **1.** రూ. ములికి(5); పర్యా. కదురుమొల, దామమొలికి, ముల్లు(5). ఉన్నికదురు ఊచకు కిందబిగించిన మేకు; మామూలుగా ఆడవాళ్ళు వడికే కదుర్లకు, పెద్దకదురుకు బిగిస్తారు. చూ. చిత్రం311 చ. 4 (తె. 10, 11, 25); **2.** కందిగింజంత ఉరువున అడ్డంగా మూడు కొలుకులు నేసి దానికిపైన నిలువుగా రెండుకొలుకులు నేసిన ఒకరకం డిజైను; శిలువలో సగం ఉన్నట్టుంటుంది. చూ. చిత్రం 241 (తె. 13).

**మొలుకులపేటు** పర్యా. ముత్యం (పేటు). జరీతో గాని కృత్రిమపుపట్టుతోగాని వరసగా 2-6 పోగులతో గీరలు నేసిన డిజైను; కొన్నిచోట్ల జంటగీరలు, కొన్నిచోట్ల చదరంగాను నేస్తారు. చూ. చిత్రం 236 (తె. 14).

**మొల్తాడుకసీదా** ఉ.-కస్సిద. మొలతాడు మాదిరిగా అంచులో నేసిన డిజైను. చూ. చిత్రం 227 (తె. 17).

**మొహర్రం** తురకలపండుగ; తివాసీనేతపనివాళ్ళు చేసుకొనే పండుగ; పీర్లపండుగ (కో. 16).

**మోకు 1.** (-పన్ను) పర్యా. చూ. ఊద్దెతాడు(1). ఊద్దెను నిలబెట్టి కిందిగూటానికి బిగించేతాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (కో. 2-9, 12, 17, 20, 21, 26, 29, 32-37; తె. 1, 2; రా. 1, 2, 5-13, 15, 18-21, 23, 24); **2.** పర్యా. చూ. నేతమోకు. మగ్గంమీద నేతపడుగును బిర్రుపెట్టే లావుపాటి తాడు; ఒకవైపు పెడకోలకు మధ్యగాకట్టి మిడిగూటానికి మెలివేసి రెండోవైపు చేతిగూటానికి కడతారు; నేతదగ్గరికి రావటానికి మోకు వదులుతారు; వెనక్కు జరగటానికి బిగిలాగుతారు. చూ. చిత్రాలు 121 క. 1, 127.15 (కో. 1, 2, 4, 11-13, 15, 17, 19, 20, 23; రా. 6, 19 ఎ).

**మోకుగుది** ఉ. మొగ్గుది; పర్యా. చూ. ఊద్దెగుది (2). పడుగు చాపేటప్పుడు ఊద్దె అడ్డపట్టెనూ పడుగెరుకర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (కో. 34).

**మోకుగూటం** ఉ. మొగ్గూటాం; పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 1, 2; రా. 3, 15).

**మోకుచుట్టుకఱ్ఱ** మగ్గం దగ్గర చేతిగూటానికి కట్టిన తాడులో చివరిభాగం చుట్టిన కఱ్ఱ (కో. 27, 30).

**మోకు(డు)గుంజ** ఉ. మోగ్గుంజ; పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేతబిర్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతి వైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 3, 4, 8; రా. 8, 12, 13).

**మోకుతిప్పుడుగుంజ** పర్యా. చూ. చేతిగూటం (1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకుకట్టే కొయ్య; నేత పనివాడికి కుడిచేతివైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (రా. 7, 19).

**మోకుదిప్పు(డు)కొయ్య** ఉ. మోకదిప్పకొయ్య; మోకుతిప్పుడుకొయ్య, మోకుదిప్పకొయ్య; పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతి వైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 2, 16, 17, 21, 23, 24, 26, 33, 36).

**మోకుదిబ్బ** పర్యా. చూ. మిడిగూటం(2). నేత బయలులో చివర పాతిన కొయ్య; దీనికి నేతమోకుతో కొలికి వేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేతమోకు పెడ కోలకు కట్టి దీనికి ఏనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు; దేవాంగుల వాడుక. చూ. చిత్రం 127.13 (కో. 7).

**మోకుదిబ్బకఱ్ఱ** పర్యా. చూ. చేతిగూటం (1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకుకట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతి వైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 20).

**మోకుపుల్ల** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గం మీద నేత బిర్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య; నేత పనివాడికి కుడిచేతి వైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 12).

**మోకుబిడికొయ్య** పర్యా. చూ. చేతిగూటం(1). మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకు కట్టే కొయ్య; నేతపనివాడికి కుడిచేతి వైపున నేలలో పాతి ఉంటుంది. చూ. చిత్రాలు 108.5, 122, 127.16 (కో. 29).

**మోచ్చీర్** చూ. మోతిచూరు (తె. 7).

**మోడి** (-అతుకు) పర్యా. చూ. మడత(1). అచ్చ తికేటప్పుడు కిందిపోగులూ పైపోగులూ కలిపి మొత్తం అతికే పడుగు (రా. 15).

**మోతిచూరు** రూ. ముత్తసూరి, మోచ్చీర్, మోతుకు చూరు; పర్యా. చూ. ముత్యం(పేటు). జరీతోగాని కృత్రిమపుపట్టుతోగాని వరసగా 2-6 పోగులతో నేసిన డిజైను; కొన్నిచోట్ల జంటగీరలు, కొన్నిచోట్ల చదరం గాను నేస్తారు. చూ. చిత్రం 236 (తె. 2).

**మోతీలాలీ** ఒకరకం తేతనీలంరంగు. (కో. 2).

**మోతుకుచూరు** చూ. మోతిచూరు (కో. 24).

**మోదపురి** మోదగడ్డి(=ఒకరకం గడ్డిమొక్క) వేళ్ళతో కట్టిన కుంచెపురి; చూ. పురి (తె. 22).

**మోదుగపువ్వు** ఎరుపులో తెలుపు పన్నె (తె. 15).

**మోదుపునార** మోదుగుచెట్టునుంచి తీసిన నార; కుంచెకట్టుబడిలో వెన్ను భాగంలోనూ పురికి పై భాగం లోనూ దీంతో గట్టిగా కట్లు వేస్తారు (తె. 16).

**మోపురం** 1. పర్యా. చూ. పలకబుజం(1). చేతి మగ్గం పలక వేలాడదియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం; కొన్నిచోట్ల దీనికి నగిషీలు చెక్కుతారు; ఇటువంటి రెండు భాగాలకు చిల్లులుచేసి పలకసూత్రాలు కడతారు. చూ. చిత్రం 109.4 (కో. 24); 2. ఉ. మోపరం, మోప్రం; చూ. మూపురం (కో. 11-13, 15, 17, 22-24).

**మోమెనువాళ్ళు** ఉ. మోమెనోళ్ళు. అచ్చులు కట్టేవాళ్ళలో ఒక తెగ; ?Momin (రా. 21).

**మోంబత్తి** ఉ. మొంబత్తి, మొంబొత్తి, మోము బత్తి; పర్యా. ఒత్తి. కొవ్వుతో చేసిన బిళ్ళ; సబ్బు బిళ్ళంత ఉంటుంది; నేతనేసేటప్పుడు నాడెను-కొన్ని చోట్ల పన్నెను-సాపుచెయ్యటానికి దీంతో రుద్దుతారు (తె. 5, 9, 18, 21, 33; రా. 24).

**మోరకట్టు** పర్యా. చూ. చెంపతాడు(3). చేతి మగ్గం పలకను గుండును కలిపి బిగించిన దారం; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 ట. 1 (కో. 33).

**మోరేచీర** ఒకరకం గళ్ళచీర; చూ. మాలపిల్లచీర (రా. 13).

**మోహినీపేటు** అంచులో నేసే ఒకరకం డిజైను (కో. 23; రా. 8).

**మోహినీ(పేటు)అంచు** ఒకరకం డిజైను పెట్టి నేసిన అంచు (కో. 23).

## య

**యమరాళ్ళపచ్చ** ఉ. ఎమ్రాల్లపచ్చ, యమరాల పచ్చ. 1. ఒకరకం పచ్చరంగు; శకుంతల పచ్చకంటె ముదురుపన్నె; emerald green. చూ. చిత్రం 288 (కో. 4, 6, 9బి); 2. పసిమిలో నలుపుచాయ కలిసిన

రంగు (కో. 8); **3.** దమయంతిపచ్చ కంటె లేతరంగు (కో. 16); **4.** లేలపువ్వు, పచ్చ వన్నెలు కలిసిన రంగు (తె. 15).

# ర

**రక్తకాౖపేరుచీర** ఉ. రక్తకాపేరి-, రక్తకాపేరు-; చూ. రక్తకాౖపేడుచీర. **1.** రెండు వేళ్ళ వెడల్పు తెల్లపట్టె, నాలుగు కొలుకులు నీలి, రెండువేళ్ళ వెడల్పు తెల్లపట్టె, నాలుగు కొలుకులు ఎరుపు చొప్పున నిలువు, పేక నేసిన తెల్లచీర (కో. 3, 4); **2.** ఒక అంచు ఎరుపు, ఒక అంచు నలుపు పెట్టి కమ్మిలో కండ్లుతీసి నేసిన తెల్లచీర (కో. 5).

**రక్తకాౖపేకుకోక** ఉ. రక్తకాౖపెకుకోక; పర్యా. చూ. రక్తకాౖపేడుచీర. గర్భవతులు దుష్ట గ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి కట్టుకొనే ఒకరకం చీర: **1.** తెలుపు, ఎరుపు రంగుల్లో అంగుళం వెడల్పు పట్టెలు నిలువు అడ్డంనేసి నలుపంచుపెట్టి నేసిన చీర (కో. 8); **2.** బొటనవేలెడు వెడల్పు తెలుపు నేతలో రెండు కొలుకులు నలుపు రెండు కొలుకులు ఎరుపూ పడేట్టు నేసిన చీర; దీన్ని పడుచువాళ్ళు వెయ్యకూడదట (తె. 15).

**రక్తకాౖపేకుచీర** ఉ. రక్తకాౖపేకుసీర; చూ. రక్తకాౖపేడు చీర (తె. 13).

**రక్తకాౖపేడుచీర** ఉ. రక్తకాపేడి-, రక్తకాపెడి-, రగతకాపెడు-; రూ. రక్తకాపేరుచీర, రక్తకాౖపేకు చీర, రక్తకాౖపేనుచీర, రక్తకాౖపేలుచీర; పర్యా. రక్తకాౖపేకుకోక, రక్తపింజేరచీర. గర్భవతులు దుష్ట గ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి కట్టు కొనే ఒకరకం చీర : **1.** అంచుకు ఒకపక్క ఎర్రకొలికి, మరొకపక్కన నల్లకొలికి పెట్టి నేసిన తెల్లచీర(కో.12); **2.** తెల్లరంగు పట్టెలు పడేట్టు నేసిన ఎర్రచీర(కో.13); **3.** ఎరుపు, తెలుపు, నలుపు రంగులు పెట్టి చెంచుకాపేరి చీర మాదిరిగా నేసింది (కో. 3); **4.** ఎరుపురంగులో అంచులు, కమ్ములు పెట్టి నేసిన తెల్లచీర (కో. 7); **5.** ఎరుపు, నీలిరంగుల్లో పెద్దగడి పడేట్టు నేసిన చీర; దీన్ని పడుచువాళ్ళు వెయ్యకూడదట (కో. 14).

**రక్తకాౖపేనుచీర** ఉ. రగతకాౖపేనుచీరె; చూ. రక్తకాౖపేడు చీర (రా. 10).

**రక్తకాౖపేలుచీర** ఉ. రగతకాౖపేలుసీర; చూ. రక్తకాౖపేడుచీర (తె. 16).

**రక్తపింజేరచీర** ఉ. రగతపింజేరసీర; పర్యా. చూ. రక్తకాౖపేడుచీర. గర్భవతులు దుష్టగ్రహాలు సోకి గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి, కట్టుకొనే ఒక రకం చీర; ఎరుపు, నలుపు, తెలుపు పట్టెల్లో నేస్తారు; దీన్ని పడుచువాళ్ళు వెయ్యకూడదట (కో. 10).

**రంగడుకమ్మి** **1.** చీరకొంగులో మామూలుగా నేసిన పట్టె(=గడ్డ); **2.** పర్యా. ముద్దకమ్మి(2). లింగడు కమ్మిలో సన్నటి నిలువు గీరలుపెట్టి నేసిన కమ్మి (కో. 9).

**రంగపూరంచు** చిట్టచివర రంగులో నేసి పైన అయిదు కొలుకుల గీరలు పడేట్లు నేసిన అంచు (కో.3).

**రంగుగురిగె** ఉ. రంగు గురిగి; రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది. చూ. చిత్రం 282 ప. 1 (తె. 25).

**రంగునూలు** రంగువేసిన నూలు (కో. 29, 30, 35).

**రంగు** పర్యా. ఛాయ, వన్నె. కాంతికిరణాలవల్ల కంటిలోపలి తెర(రెటీనా)ఆధారంగా కలిగే వర్ణజ్ఞానం. చూ. చిత్రం 288 (కో. 2, 3, 6, 9, 12-16, 18, 20, 24, 36; తె. 1-28, రా. 1,3, 5, 6, 8, 11, 12, 14, 19-24).

**రంగునేత** రంగుదారాలతో నేసిన నేత; కొన్ని చోట్ల నిలువూ అడ్డం ఒకే రంగులో నేసింది (కో. 16, 20).

**రంగుపావు** పర్యా. చూ. పావు(2). రంగు కొలుచు కొనే చిన్న పాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది. చూ. చిత్రం 282 ప. 1 (తె. 23).

**రంగులఅద్దకం** నూలుకు రంగులు వెయ్యటం (కో. 12).

**రంగు(ల)తొట్టి** రంగులు కలిపే తొట్టి; కొన్ని చోట్ల దింట్లో రంగుపోసుకొని నేతబట్ట(ల)కు కొయ్య అచ్చు(=మైనా)తో రంగు అద్దుతారు; మామూలుగా పెద్దది; కొన్నిచోట్ల చిన్నది (కో. 3, 7, 33; రా. 24).

**రంగులద్దు** (క్రి.) పర్యా. రంగులువేయు. నూలుకు రంగులు పట్టించటం; రంగునీళ్ళలో ముంచుతారు (తె. 8).

**రంగు(లు)వేయు** (క్రి.) ఉ. రంగేయు; పర్యా. వన్నెఅద్దు, వన్నె వేయు, ఛాయ(లు)వేయు, రంగులద్దు. నూలుకుగాని, బట్ట(ల)కుగాని రంగు(లు)పట్టించటం; రంగునీళ్ళలో ముంచుతారు (కో. 2, 3, 6-9, 12-16, 18-24, 33, 36; తె. 1-7, 9-24, 26, 28; రా. 1, 3, 5, 6, 8, 11, 12, 14, 19, 19ఎ, 19బి, 22-24).

**రచ్** పర్యా. చూ. అచ్చు(1). నేత నేసేటప్పుడు పడుగులో పై పోగులను కిందికీ కింది పోగులను పైకీ జరపటానికి వీలుగా నాలుగు కర్రలకు వడిదారాలతో

లంకెలువేసిన పనిముట్టు; పన్నెగూళ్ళలో దూరినపోగులు అచ్చువడుల కొలుకుల్లోకి ఎక్కిస్తారు; నేతనేసేటప్పుడు ఒక పావుచెక్కను కాలితో తొక్కితే అచ్చులో ఒక వైపు కిందకి దిగి అనిపోగులు విచ్చుకొంటాయి; కాలు తియ్యగానే అచ్చు మామూలుగా వచ్చి అనిపోగులు మూసుకొంటాయి; అచ్చుకట్టే సాయేబుల వాడుక చూ. చిత్రం 100 (కో. 5).

**రంజాన్** తురకల పండుగ; తివాసీనేత పనివాళ్ళు చేసుకొనే పెద్దపండుగ (కో. 16).

**రతల్** (బహు. రతళ్ళు) ఉ. రతళ్; రూ. రతి(1). పౌను; నలభై తులాల తూకం; పట్టుదారం ఈ లెక్కలో తూస్తారు (తె. 5, 21, 28).

**రతి 1.** చూ. రతల్ (రా. 14); **2.** ఒకరకం నీలం (=రూబీకంటే లేత)రంగు. చూ. చిత్రం 288(కో. 2).

**రత్నపొప్పిళి** ఒకరకం గడి(=పొప్పిళి)చీర(రా.14).

**రత్నావళి** ఉ. రత్నావలి. **1.** ఒకరకం లేత నీలం రంగు. చూ. చిత్రం 288 (కో. 6, 20, 26, 35; తె. 14); **2.** పచ్చ, సిరారంగు కలిసిన వన్నె (తె. 15); **3.** లేత ఆకుపచ్చరంగు (తె. 27).

**రత్నావళిచీర** ఒకరకం లేత నీలంరంగు చీర (కో. 20, 26, 35; తె. 14, 15, 27).

**రందా** పర్యా. చూ. పానుపువట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (తె. 20).

**రంధ్రం** పర్యా. చూ. నాలికతొలి(1). డోనె(పలక) తిప్పటానికి పల్లెకట్టె దూర్చే దోనెగాడి; కుడివైపున ఉంటుంది; ఇటువంటివి నాలుగు ఉంటాయి. చూ.చిత్రం 123 క. 10 (తె. 21).

**రబ్బరుచేతులు** ఉ. లబ్బర్సేతులు. చేతులకు తొడుక్కొనే రబ్బరు తొడుగులు; నూలుకు రంగు అద్దేటప్పుడు తొడుక్కొంటారు (తె. 14).

**రబ్బరుపొప్పిళిచీర** పడుగులో మూడుగీరలు ఒక చోట మూడుగీరలు మరొక చోట వచ్చేట్టు నేసిన ఒక రకం గడి(=పొప్పిళి)చీర (రా. 17).

**రమామణిపొప్పిళి** జరిపెట్టి నేసిన ఒకరకం గడి (=పొప్పిళి)చీర (రా. 14).

**రంపం** పన్నెకట్టుబడికోసం వెదురుదంటెలు కోసే పనిముట్టు. చూ. చిత్రం 89 ట. 1 (రా. 24).

**రంపం(పేటు)** రంపంపళ్ళ మాదిరిగా మొనలుదేలి (త్రికోణాకారంగా)నట్లు నేసిన డిజైను: కొన్నిచోట్ల చిన్నది నేస్తారు. చూ. చిత్రం 182 (కో. 7, 20, 23; తె. 13).

**రవేరాగడి** నాలుగు రంగుల పోగులు పెట్టి నేసిన గడి (కో. 34).

**రవ్వకుంచె** ఉ. రవకుంచి, రవ్వకుంచి; పర్యా. అలుక్కుంచె. ఒకరకం కుంచె(=పడుగుదువ్వేది); సుమారు రెండు జేనల పొడుగుంటుంది; సరిచేసేటప్పుడు పడుగు ఆరుబదునులో ఉన్నప్పుడు దీంతో పైన గంజి చిలకరిస్తారు; పడుగేరేటప్పుడు పోగులు సాపుచెయ్యటానికి దీంతో దువ్వుతారు. చూ. చిత్రం 79 (కో. 17, 20).

**రవ్వ(-వేయు)** పర్యా. చూ. అలుకు(2). సరిచేసేటప్పుడు పడుగు బాగా బిరుసెక్కటానికి పైన చిలికిన గంజి; గంజిపిడచ ఒకచేత్తో పట్టుకొని రెండోచేత్తో దాని మీద అలుక్కుంచెతో దువ్వితే పడుగుమీద గంజి పడుతుంది. కొన్నిచోట్ల వెంపలి మండలతో చిలుకుతారు (కో. 17, 20, 21, 23, 24).

**రస్** ఉ. రసు. తివాసీ నేసేటప్పుడు పడుగులో ఉన్నిదారం దూర్చి పంజాకొట్టి నేసిన వరస (తె. 17).

**రస్టుకలరు** (Rust colour) తుప్పు(=ఒకరకం ఎరుపు) రంగు (రా. 15).

**రాకీఅంచు** బిళ్ళలు బిళ్ళలుగా డిజైను పెట్టి నేసిన ఒకరకం అంచు (తె. 8).

**రాకీ(ల)పున్నమ** ఉ. రాకిపున్నమ, లాకిపున్నమ. శ్రావణ పౌర్ణమి; నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ; కొత్త జంధ్యాలు వేసుకొంటారు; రాఖీలు కట్టుకొంటారు; చౌడీశ్వరికి జ్యోతి ఉత్సవం చేస్తారు; అగ్నిగుండంలో నడవటం; గంగపూజ చెయ్యటం; ఆనందంవేయటం మొ.వి చేస్తారు(తె. 10, 19, 20, 22).

**రాకెటుమగ్గం** ఒకరకం మరమగ్గం; మగ్గంచట్రం నిలువులకు పైన రాకెట్‌బొమ్మ మాదిరి కమ్మి (=గొళ్ళెలకమ్మి) అమర్చింది. చూ. చిత్రం 115 (కో. 12).

**రాగావళిచీర** ఒకరకం గడి చీర; దమయంతి పొప్పిళిచీర మాదిరిగా నేసి ఒక గీరకు బదులు రెండు కొలుకుల గీరలు పెట్టి నేస్తారు (రా. 17).

**రాగిగంజి** ఉ. రాగ్గంజి; పర్యా. తైద(ల)గంజి. రాగులు పిండిగొట్టి కాచిన గంజి; దీన్ని పడుగుకు పెడతారు (కో. 4, 6; తె. 2; రా. 1, 3-14, 17, 19-21, 24).

**రాగిసరి** రాగులు పిండిగొట్టి కాచిన గంజి; దీన్ని పడుగుకు పెడతారు (కో. 2).

**రాగోల(కట్టె)** (బహు. రాగోళ్ళు) ఉ. రాగలకట్టె; పర్యా. ఎత్తినకోల. సరిచేయటానికి చాపిన ఉన్నిపడుగులో చివర దూర్చిన తలకోలను మోయటానికి ఆధారంగా నేలలో పాతిన పంగలకొయ్య; మామూలుగా

తలకోలను మోసేది; కొన్నిచోట్ల తాళ్ళతోను, కొన్ని చోట్ల (ఇనప) కన్నెలతోను తలకోలను కలిపినది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 314.7 (తె. 28).

**రాజమహేంద్రకోక** ఒకరకం నేతచీర (రా. 19ఎ).

**రాజమాలుపేటు** ఉ. రాజమాలుపేటి. అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 2, 7).

**రాజమోహిని** ఒకరకం అంచు; పూర్వం నేసేవారట (కో. 24).

**రాజహంస** బట్టలమీదవేసే కలంకారీ అద్దకం డిజైనుల్లో ఒకరకం. చూ. చిత్రం 283 డ. 2 (కో. 12).

**రాజహంసపేటు** అంచులోనేసే ఒకరకం డిజైను. చూ. హంసపేటు. చూ. చిత్రం 157 (రా. 8).

**రాజాకమలంపేటు** అంచులోనేసే తామరపువ్వు డిజైను (కో. 20).

**రాట** పర్యా. చూ. నిలువు(2). ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య. ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (కో. 16, 25, 26).

**రాటన్‌ఫానీ** తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను (కో. 16).

**రాటం** ఉ. రోటం. **1.** చూ. రాట్నం(1) (కో. 2-11, 12ఎ, 13-14, 18, 20, 27; తె. 10; రా. 3, 6-13, 16-21, 23); **2.** చూ. రాట్నం(2) (కో. 11, 13-15, 18; రా. 6, 8, 9, 16, 19, 21); **3.** నవారు నేతకు వాడే దారం పురిపెట్టే రాట్నం; కొన్నిచోట్ల దీనిమీద పేకదారం కండెలు పడతారు (రా. 14).

**రాటంకాలు** పర్యా. చూ. తొక్కుడుపట్టె(1). పత్తి పట్టేటప్పుడు రాట్నం కదలకుండా తొక్కిపట్టటానికి అమర్చిన పట్టె. చూ. చిత్రం 1.4 (కో. 8).

**రాటంచెయ్యి** పర్యా. చూ. చెయ్యి(4). పట్టు దారం వడికే పెద్దరాట్నం కట్టుబడిలో ఇరుసు తిప్పటానికి బిగించిన కొయ్యపిడి; కొన్నిచోట్ల దీనికి చేసిన చిల్లిలో వేలుపెట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 293 చ. 6 (తె. 10).

**రాటపాకులకమ్మి** రాట్నంఆకంత వెడల్పు పట్టెలు నేసిన కమ్మి; కొన్నిచోట్ల కమ్మి నేతలో చీరరంగు పోగులు ఒక కొలికి పెట్టి గీర పడేట్టు (కమ్మి పగల గొట్టి) నేస్తారు (కో. 8).

**రాటి** ఉ. రాటీ, రాకె; పర్యా. ఇచ్చెలబండి, కోణతలి(1), గిరక(3), గుమ్మటం, గుమ్మి(1), చిట్టెలబరాటి, చిట్టెలరాటం(3), చిలపలబండి, డోలక(1), తిక్కిడి(2), తిరిగిణి(2), తిరుగుడుపంకె, దళచరంపంకె, పడత, పంట్లాం, పరదా, బండి(1), బండిపంకె, బరాటి, బొంగరం(1). మొద్దు తిరిగిణి, రాడ, వలింపంకె. గుమ్మటంలాంటి పనిముట్టు; పంకె మొ. వాటికి దీనికి తగిలించిన చిలప(ఇచ్చె)నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 క-ప (కో. 16, 19, 22-33, 35-37; తె. 7-9).

**రాటిఆకు** ఉ. రాటీ ఆకు; పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురు బద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 7, 9).

**రాటికర్ర** ఉ.రాకెకర్ర; పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది. కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్ని చోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 27).

**రాటిగొట్టం** ఉ. రాకెగొట్టం; పర్యా. చూ. గొట్టం(2). రాటి ఆకులు బిగించిన వెదురుగొట్టం. దీన్ని సూలానికి దూర్చి రాటి తిప్పుతారు. చూ. చిత్రం 31 త. 1 (కో. 28, 30, 31, 37).

**రాటితాడు** పర్యా. చూ. గుమ్మిదారం. రాటి ఆకులు (పైవీ కిందివీ) కలిపి కట్టిన దారం, చూ. చిత్రం 31 ప. 4 (కో. 25, 32, 37).

**రాటిదారం** పర్యా. చూ. గుమ్మిదారం. రాటి ఆకులు (పైవీ కిందివీ) కలిపి కట్టిన దారం. చూ. చిత్రం 31 ప. 4 (కో. 29).

**రాటిదిమ్మ** ఉ. రాటిదిమ్మి, రాకెదిమ్మ; పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (కో. 22, 30, 31).

**రాటిదుక్క** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. చూ. రాటి. చూ. చిత్రం 31 క.1,36(కో.33).

**రాటిపుల్ల** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 31).

**రాటిపుల్ల(లు)** పర్యా. చూ.ఆకు(5). రాటికిపైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (కో. 35, 36).

**రాటిబద్ద** ఉ. రాకెబద్ద. రాటికి పైనా కిందా పెట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (కో. 25-32, 35).

**రాటిబల్ల** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనాకిందా కట్టిన బద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (కో. 37).

**రాటిబురక** ఉ. రాటెబురక; పర్యా. చూ. చిప్ప (1). రాటి పైబద్దలను బిగించి వాటిమధ్య బోర్లించి కట్టిన చిప్ప; మామూలుగా కొబ్బరిచిప్ప వాడతారు; కొన్నిచోట్ల కర్రచిప్పగాని రేకుమూతగాని వాడతారు; ఇది రాటిసూలంమీద ఆనుతుంది. చూ. చిత్రం 31 క. 5 (కో. 31).

**రాటిముక్కు** రాటిసూలం పైకొన; చూ. రాటి. చూ. చిత్రం 31 ప. 2 (కో. 37).

**రాటిమొద్దు** **1.** పర్యా. చూ. దూపిరి(3). రాటి తిరగటానికి రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు; చూ. రాటి. చూ. చిత్రాలు 31 క. 1, 36 (తె. 7, 9); **2.** అడ్డగుమ్మి అమర్చే ఫ్రేము; చూ. దొడ్డి (తె. 8).

**రాటిమొల** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది, కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 9).

**రాటిసూలం** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది, కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (కో. 28, 30, 36, 37).

**రాట్టం** **1.** చూ. రాట్నం(1) (కో. 19, 20, 21, 24); **2.** చూ. రాట్నం(2) (కో. 19).

**రాట్నం** **1.** రూ. రాటం(1), రాట్టం(1), ?రాట్లం (1). పర్యా. చెరక. నూలు వడికే కొయ్యయంత్రం; పంటెకుగాని డబ్బాలకుగాని నూలు తోడుకోటానికీ కండెలు చుట్టటానికీ వాడతారు. చూ. చిత్రం 15 (కో. 1, 12, 16, 17, 21-23, 25, 26, 28-37; తె. 1-33; రా. 1-3, 5, 22, 24ఎ); **2.** రూ. రాటం (2), రాట్టం(2) రాట్లం(2). పర్యా. చూ. డబ్బా(ల) రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం. చూ. చిత్రం41 (కో. 12, 16, 17, 26; తె. 13, 14; రా. 2).

**రాట్నంగిల్ల** పర్యా. చూ, చెక్రం(13). పట్టువడికే పెద్దరాట్నం కట్టుబడిలో ఇరుసుకు బిగించిన ఇనపచెక్రం చూ. చిత్రం 293 చ. 2 (తె. 12).

**రాట్నంచెవి** పర్యా, చూ. నిలువు(2). ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 15.2 (తె. 19).

**రాట్నంపంటె** రాట్నం కదురుకు తగిలించి నూలు చుట్టే చిన్న పంటె; చెలకపంటె కంటె కొంచెం చిన్నది; చూ. చెలకపంటె (తె. 12).

**రాట్నంపట్టి** పర్యా. చూ. చెక్రం(3). పట్టువడికే పెద్దరాట్నం కట్టుబడిలో ఇరుసుకు బిగించిన ఇనప చెక్రం. చూ. చిత్రం 293 చ. 2 (తె. 5).

**రాట్నంపయ్య** పర్యా. చూ. చెక్రం(4). డబ్బా రాట్నం ఇరుసుకు బిగించిన రేకుచెక్రం; దీనిమీద వడి దారం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 9 (తె. 8).

**రాట్నంసారె** ఆడపిల్లకు పెళ్ళిలో సారెగా రాట్నం ఇచ్చే ఆచారం (కో. 17).

**రాట్లం** ఉ. రోట్లం. **1.** చూ. రాట్నం(1) (రా.4, 14, 15); **2.** చూ. రాట్నం(2) (రా. 4)

**రాడ** పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పని ముట్టు. పంటె మొ. వాటికి దీనికి తగిలించిన చిలప నుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 క-ప (రా. 15).

**రాతినార** ఒకరకం కృత్రిమపుపట్టు; **art-silk**; అంచుల నేతకు వాడతారు (రా. 13).

**రాధిక** ఒకరకం నీలంరంగు; చూ. సక్కుబాయి (కో. 7).

**రాపిడిరంగు** చేత్తో అచ్చుకొట్టే అద్దకంరంగు; printing colour (కో. 8).

రాబట్ఖానీ తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (కో. 16).

**రామకలరు** ఉ. రాంకలర్. **1.** పర్యా. రామనీలం. ముదురు నీలంరంగు (కో. 14); **2.** పచ్చ, వయిలెట్ కలిసిన రంగు (తె. 15); **3.** ఒకరకం నీలం రంగు (రా. 3, 12, 15).

**రామ(చిలక)పచ్చ** ఉ. రామసిలకపచ్చ, రామా పచ్చ. ముదురు ఆకుపచ్చరంగు (కో. 9, 11, 15; రా. 7).

**రామనీలం** పర్యా. రామకలరు(1). ముదురు నీలం రంగు (కో. 18).

**రామలింగంకొయ్య** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివరపాతినకొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి పెడకోలకు చుట్టి, పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేతమోకు పెడకోలకుకట్టి దీనికి పనుగుమెలికవేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 8).

**రామలింగంగూటం** పర్యా. చూ. మిడిగూటం(2). నేతబయలులో చివరపాతిన కొయ్య; దీనికి నేత

మోకుతో కొలికివేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రు పెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేత మోకు పెడకోలకు కట్టి దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 7).

**రామలింగప్పగూటం** పర్యా. చూ. మిడిగూటం (2). నేతబయలులో చివరపాతినకొయ్య; దీనికి నేత మోకుతో కొలికివేసి పెడకోలకుచుట్టి పడుగు బిర్రు పెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేత మోకు పెడకోలకు కట్టి దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 6).

**రామ్‌చందర్‌ఖానీ** తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను (కో. 16).

**రాము** (క్రి.) **1.** పర్యా. చూ. తోము. గంజి వడకట్టటానికి గుడ్డలో పోసి రుద్దటం; పామటం(రా.22); **2.** రాయటం; కలియదిప్పటం; ఒకతొట్టెలో రంగు, కాస్టిక్‌సోడా, హైడ్రోసుద్రావకం వేసి బాగా కలుపుతారు (రా. 11, 22).

**రాయబారపుకొయ్య** పర్యా. చూ. రాయబారపుకర్ర. వేలాడదీసిన పడుగుచుట్టను దగ్గరికిగాని దూరానికి జరుపుకోటానికి వీలుగా మగ్గానికిపైన పెట్టిన కర్ర. చూ. చిత్రాలు 129 క. 4, 129 చ.2 (కో.26).

**రాయబారపుగొట్టం** పర్యా. (రాయబారపు) బండి. రాయబారపుకర్రకు (కొన్నిచోట్ల తాడుకు) వేసిన గొట్టం; కొన్నిచోట్ల కొయ్యగిలక; నేతనేసేటప్పుడు పడుగుచుట్టను ముందుకుగాని వెనక్కుగాని జరపటానికి వేస్తారు. చూ. చిత్రం. 129 క. 2 (కో.33 37).

**(రాయబారపు)బండి** పర్యా. రాయబారపుగొట్టం. రాయబారపుకర్రకు (కొన్నిచోట్ల తాడుకు) వేసిన గొట్టం; కొన్నిచోట్ల కొయ్యగిలక; నేతనేసేటప్పుడు పడుగుచుట్టను ముందుకుగాని వెనక్కుగాని జరపటానికి వీలుగా వేస్తారు. చూ. చిత్రం 129 క. 2 (కో. 31; రా. 1).

**రాయబార(ం)పుకర్ర** పర్యా.ఉయ్యాలకర్ర, గ్రేనాంకర్ర, దండెం(3), రాయబారపుకొయ్య. వేలాడదీసిన పడుగుచుట్టను దగ్గరికిగాని దూరానికి జరుపుకోటానికి వీలుగా మగ్గానికి పైనపెట్టినకర్ర. చూ. చిత్రాలు 129 క. 4, 129 చ. 2 (కో. 23, 24, 29, 32-34, 36, 37).

**రాయబార(ం)పుతాడు** పర్యా. ఉయ్యాలతాడు, గ్రేనాంతాడు, పడుగెత్తుగుది. పడుగుచుట్టకు రెండువైపులా కట్టి మగ్గానికిపైన - కొన్నిచోట్ల రాయబారపు కర్రకు వేలాడదీసిన తాడు; కొన్నిచోట్ల ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 129 క. 1(కో. 23, 24, 26, 29, 31-34, 37; తె. 17).

**రాయిబారుతాడు** పర్యా. దండెతాడు(2). దండెకు ఒకవైపు చువ్వకు (మధ్యగా) కట్టి రెండోవైపున సవలకుగుండు వేలాడదీసిన తాడు. చూ. చిత్రం 126.2 (కో. 24).

**రాయల్‌బ్లూ** ఒకరకం నీలంరంగు; గాజురంగుకంటె కొద్దిగా లేతరంగు. (కో. 2, 18, 21, 35).

**రాయిభారం** ఉ. రాయిబారం; పర్యా. చూ. సవలకుగుండు. దండెదగ్గర పడుగులోదూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండెఅవతలికి వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల ఇనపగుండుగాని చిన్నచెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 22, 37).

**రాయు** (క్రి.) పర్యా. చూ. తోము. గంజి వడగట్టటానికి గుడ్డలో పోసి రుద్దటం (రా. 5).

**రావోలిచీర** పచ్చ కపిల, కిర్మింజిరంగులు వచ్చేట్టు పట్టు, నూలు కలిపి నేసిన చీర (తె. 5).

**రాసకమ్మి** నాలుగుకొలుకుల దారంతో తలచిట్టె నేసి బొటనవేలెడు వెడల్పునందు, పదహారు కొలుకులుగాని ఇరవై కొలుకులుగాని ఒక పట్టె నేసిన కమ్మి (కో. 7).

**రాసికడం(చీర)** నిలువుకు తెలుపు, పేకకు మరొక వన్నె పెట్టినేసిన గళ్ళచీర; గళ్ళమధ్య తెలుపు వస్తుంది (తె. 13, 14).

**రాస్తచీర** రెండుకొలుకులు పచ్చ. ఒకకొలికి నలుపు చొప్పున పడుగుపోగులు అతికి నేసిన చీర; రాస్తాచీర (తె. 18).

**రాస్తా(కమ్మి)** పర్యా. చూ. పానుపుపట్టె. మర మగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 11, 15).

**రాస్తా(లు)** అంచులో నేసిన ఒకరకం గీర(లు). చూ. చిత్రం 152 (తె. 23).

**రింగు** **1.** పర్యా. చూ. ఉంగరం(3). మరాసు ఒగ్గుల పట్టెకు బిగించిన చిన్న ఇనపచుట్టు; దీనిగుండా పడుగుపోగు మరాసు మీదికి పోతుంది. చూ. చిత్రం 50.15 (కో. 26); **2.** పర్యా. చూ. ఉంగరం(7). చేతినాడె గాడిలో బుసిపుల్లకు వేసిన చిన్నచుట్టు; ఇత్తడిదిగాని, ఇనపదిగాని; పేకదారం పోగు చిక్కుపడకుండా రావటానికి దీంట్లోనుంచి తీస్తారు. చూ. చిత్రం 131 చ. 3 (కో. 22; తె. 16); **3.** డాబీగొలుసు

బద్ద(ల)ను కలిపిన ఇనపచుట్టు. చూ. గొలుసు (తె. 18, 20).

**రింగులబద్ద** మరాసు కట్టుబడిలో పడుగుపోగులు దూర్చే ఉంగరాలు(=రింగులు), రేకుముక్క(బగ్గి)లు బిగించిన కొయ్యపట్టె. చూ. చిత్రం 50.11 (కో. 12). **1.** ఒకే రంగులో, మూడంగుళాల వెడల్పున నేసిన అంచు. చూ. చిత్రం (కో. 12).

**రిబ్బనంచు** ఉ. రిబ్బెనంచు; పర్యా. రిబ్బనుబార్డరు. జెడరిబ్బను మాదిరి అంచు; కొన్నిచోట్ల ముచ్చెర, సందు, బనారస్, లాహిరి, గువ్వకన్ను, లాహిరి, సందు, బనారస్, ముచ్చెర, చిగురు వరసగా వచ్చేట్టు నేస్తారు. కొన్నిచోట్ల మొగ్గ, బనారస్ వరసగా పడేటట్లునేస్తారు. చూ. చిత్రం 242 (కో. 5, 9; తె. 1, 4-6, 11-14, 26, 27; రా. 23).

**రిబ్బనుకమ్మి** జెడరిబ్బను మాదిరిగా నేసిన ఒకరకం కమ్మి (రా. 1).

**రిబ్బనుగడిచీర** అంగుళం పొడుగు, అంగుళం వెడల్పు చొప్పున గళ్ళు పడేటట్లు నేసిన చీర; ఒక కొలికి రంగుగీర, ఒక కొలికి తెలుపుగీర, ఒక కొలికి రంగు గీర వరసగా పడేటట్లు నేస్తారు (కో. 7).

**రిబ్బనుబార్డరు** పర్యా. రిబ్బనంచు(2). జెడరిబ్బను మాదిరి అంచు; కొన్నిచోట్ల ముచ్చెర, సందు, బనారస్, లాహిరి, గువ్వకన్ను, లాహిరి, సందు, బనారస్, ముచ్చెర, చిగురు వరసగా వచ్చేటట్లు నేస్తారు; కొన్ని చోట్ల మొగ్గ, రిబ్బను వరసగా పడేటట్లు నేస్తారు. చూ. చిత్రం 242 (రా. 16).

**రిబ్బను(బార్డరు)పేటు** ఉ. రిబ్బనుబార్డుపేటు; రూ. రిబ్బనుపేటు. రెండుమూడు వేళ్ళ వెడల్పున అంచులో అయిమూలలగా (మూలనేత) నేసిన డిజైను. చూ. బనారస్ (కో. 9-11, 15).

**రివల్యూషన్‌బద్ద** ?మరాసు కట్టుబడిలో రంపాన్ని కలిపే బద్ద; కీలుకు బదులు అమర్చినది; చూ. కీలు (కో. 26).

**రీపరుబద్ద** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; పావుచెక్కలను తొక్కినప్పుడు గొలుసు పిక్కలుగాని దిండు దిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (కో. 24).

**రీలు** పర్యా. చూ. దారపుబండి(2). బరువుకట్టిన అంచు పేటుదారాలు తగిలించే కొయ్యగిలక(కొయ్య రీలు); దీన్ని మామూలుగా మగ్గంమీద ఎత్తుగా అమరుస్తారు. చూ. చిత్రం 133.2 (రా. 24).

**రీలు(దారం)** ఉ. రీలి, రీల్దారం; పర్యా. చూ. వడి (దారం)(3). అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల మిషనురీలు(=దారపుబండి) దారం వాడతారు; మొదట అచ్చుబిళ్ళకు చుట్టి తరవాత కర్రకు దూరుస్తారు; చూ. వడి (కో. 5, 27; తె. 31).

**రీలుదారంగిరక** ఉ. రీలుదారంగిర్క; పర్యా. చూ. దెండు(4). గంటానికి బిగించిన రీలుదారపుబండి; డబ్బారాట్నం వడిదారం దీని గాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క. 13 (తె. 14).

**రీలుదిమ్మ** అచ్చుకట్టేటప్పుడు మిషనుదారపుబండి (రీలు)తగిలించిన కొయ్యమొద్దు; దీనికి బిగించిన కర్రకు దారబ్బండి తగిలించి పోగుతీసుకొని అచ్చుకడతారు. చూ. చిత్రం 95 (కో. 27).

**రీలుపూన** పర్యా. చూ. పికాసి. మరమగ్గంనాడెను ఒక సొరుగులోంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్యగిలక; మామూలుగా మిషనుదారం చుట్టే కొయ్యరీలు; ఇటువంటివి ఉడతలకు బదులు రెండు సొరుగుల్లోనూ అమరుస్తారు. చూ. చిత్రం 120(తె.10).

**రీలుబిళ్ళ** ఉ. రీలుబిల్ల; పర్యా. చూ. దారపుబండి (2). మిషను వడిదారం (=అచ్చువడి కట్టేది) చుట్టిన కొయ్యగిలక. చూ. చిత్రం 95.1 (తె. 1).

**రీలువడి** పర్యా. చూ. వడి(దారం)(3). అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల మిషనురీలు(దారబ్బండి)దారం వాడతారు; మొదట అచ్చుబిళ్ళకు చుట్టి తరవాత కర్రకు దూరుస్తారు. చూ. వడి (కో. 3).

**రుంజకట్టె** పర్యా. చూ. కాటుపీట. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టే కొయ్య. చూ. చిత్రం 28 (తె. 33).

**రుంజు** (క్రి.) నూలుచుట్టటానికి పంటె తిప్పటం (తె. 21, 24, 28, 33).

**రుంజుడుమొద్దు** రూ. రుంజెమొద్దు; పర్యా. చూ. కాటుపీట. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకామకు ఊనికగా పెట్టే కొయ్య. చూ. చిత్రం 28 (తె. 28).

**రుంజెమొద్దు** చూ. రుంజుడుమొద్దు (తె. 24).

**రుణానుబంధంచీర** పెద్దగళ్ళలో చిన్నగళ్ళు వచ్చేట్లు నేసిన ఒకరకం చీర; ఒక సినిమాపేరునుబట్టి ప్రచారంలోకి వచ్చింది (కో. 35).

**రుద్దకంబిళ్ళ** ఉ. రుద్దకంబిల్ల; పర్యా. చూ. దిద్దు(డు) బిళ్ళ. అచ్చుకర్రకు కట్టిన వడిదారం బిర్రుగా ఉండటానికి పైమెలికె(పూన)ల మీద రుద్దే దుప్పికొమ్ము. చూ. చిత్రం 96 (రా. 7).

**రుద్దుగంజి** అన్నం జావగావండి వస్త్రకాళితంచేసిన ద్రవం; దీంతో పసుగు తడుపుతారు (కో. 33).

**రుద్రాక్షకమ్మి** రుద్రాక్ష (కాయ) ఆకారంలో డిజైనునేసిన కమ్మి; పంచెలకు నేస్తారు; చూ. రుద్రాక్ష పేటు (కో. 6; తె. 13, 14).

**రుద్రాక్షగడి** ఒకరకం నేతగడి (కో. 20).

**రుద్రాక్షధోతి** అంచుతో రుద్రాక్షపువ్వు మాదిరి డిజైను (రుద్రాక్షపేటు) నేసినపంచె (తె. 24).

**రుద్రాక్షపువ్వు** ఉ. రుద్రాక్షపూవు; పర్యా. రుద్రాక్ష పేటు. రుద్రాక్షపువ్వు అకారంలో నేసిన డిజైను; మామూలుగా అంచులో నేస్తారు. చూ. చిత్రం 243 (తె. 5, 22).

**రుద్రాక్షపేటు** ఉ. రుద్రాచ్చపేటి. పర్యా. రుద్రాక్ష పువ్వు. రుద్రాక్షపువ్వు ఆకారంలో నేసిన డిజైను; మామూలుగా అంచుల్లో నేస్తారు. చూ. చిత్రం 243 (కో. 33; తె. 1, 2, 26; రా. 16-19).

**రుద్రాక్ష(పేటు)అంచు** ఉ. రుద్రాచ్చ(పేటి) అంచు, రుద్రాట్ష అంచు, రుద్రాటి అంచు. రుద్రాక్ష కాయ ఆకారంలో డిజైన్లు నేసిన అంచు. చూ. చిత్రం 244 (కో. 14; తె. 1, 2, 24, 26; రా. 14, 16, 17, 21, 24).

**రుబ్బుగుండు** పర్యా. చూ. రుబ్బురాయి. రోట్లో పిండి రుబ్బే రాయి; చింతగింజలు నానబోసి రోట్లో రుబ్బి ఉడకబెడతారు (తె. 25).

**రుబ్బురాయి** పర్యా. పొత్రం, రుబ్బుగుండు, సరి గుండు(2). రోట్లో పిండి రుబ్బే రాయి; చింతగింజలు నానబోసి రోట్లో రుబ్బి ఉడకబెడతారు (తె. 9, 10, 20, 22).

**రుమాలు** (బహు. రుమాంట్లు, రుమాళ్ళు) ఉ. రుమాల. **1.** పర్యా. చూ. పాగ. తలకు చుట్టుకోటానికి నేసిన బట్ట; మామూలుగా అయిదు (కొన్నిచోట్ల $2\frac{1}{2}$ -3) గజాల పొడుగు నేస్తారు; అడ్డం ముప్పాతిక గజం నుంచి గజంపై వరకూ పెడతారు; కొన్నిచోట్ల అంచు లేకుండా నేస్తారు; మామూలుగా తెల్లది; కొన్నిచోట్ల రంగులు, గీరలు, గళ్ళు మొ.వి పెట్టి నేస్తారు; కొన్ని చోట్ల తురకలపాగా (గుడ్డ) (కో. 7, 8, 23, 30; తె. 18, 22, 23, 25; రా. 1, 3-8, 11, 15, 18, 24); **2.** నల్చదరపు గడి పడేట్టు నేసిన తలపాగ (తె. 8).

**రుయిపూలంచు** ఉ. రుయ్యి. చిన్న పత్తి పూలడిజైను నేసిన అంచు. చూ. చిత్రం 245 (తె. 17, 31, 32).

**రూపాయిగడి** ఒకరకం నేతగడి; డామ్‌గడి (కో. 7).

**రూపురం** చూ. ఊపురం (తె. 14).

**రూబీ** ఉ. రూబి, రోబీ. బచ్చలపండురంగు; నక్కు పాయికంటె లేత, బులుగుకంటె ముదురు రంగు; సాటీను; (చిలగడ) దుంపరంగు. చూ. చిత్రం 288 (కో. 2, 3, 8, 12, 15, 18, 20; రా. 8).

**రూలరు** ఉ. రూల్రు; చూ. రోలరు (3) (కో. 23, 24).

**రూలరుకర్ర** పర్యా. చూ. పైపట్టె(3) పుల్లిరుసు చెవుకట్లకు ఆధారంగా పైన బిగించిన పొడుగుచెక్క. చూ. చిత్రం 121 ప. 5 (కో. 15).

**రూలరుతాడు** ఉ. లోలరుతాడు; పర్యా. చూ. పుల్లి రుసుతాడు. పుల్లిరుసుకు వేసిన అచ్చుసూత్రం; ఇటు వంటివి రెండుంటాయి; వాయితాడు. చూ. చిత్రం 121 చ. 5 (కో. 15).

**రూలరుబద్ద** పర్యా. చూ. చెవుకట్టు(2). పుల్లిరుసు నిలవటానికి పైపట్టెకు బిగించిన చెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 చ. 4, 121 ప. 2 (కో. 15).

**రూలు** **1.** ఉ. రూల్. పర్యా. చూ. పుల్లిరుసు. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలివంటి గుండ్రటి పొడుగుకర్ర; గిలకలకు మారుగా అమర్చింది; కొన్ని చోట్ల ఇటువంటివి రెండుంటాయి; నేతనేసేటప్పుడు అచ్చుతాళ్ళు దీనిమీద ఆడతాయి. చూ. చిత్రాలు 121 చ. 3, 121 ప. 1 (తె. 8); **2.** చూ. రోలరు (3). (తె. 5); **3.** డాబీనుంచి కిందికివేలాడే లావుదారాలు దూర్చిన ఈనెలచట్రం, చిన్న పక్కపన్నె. చూ. చిత్రం 132 చ. 9 (కో. 25).

**రూలు(కర్ర)** పర్యా. చూ. పిడుపుకర్ర. రంగు అద్దిన నూలులడీలు (గుంజకు తగిలించి) పిండే కర్ర; గుండ్రటిది; దీన్నిలడీల్లో దూర్చి మెలిపెడతారు; దీంతో పోగులు విదిలిస్తారు; కొన్నిచోట్ల రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. చూ. చిత్రం 282 క. 5 (తె. 5, 14, 18).

**రూలుగుండు** పర్యా. చూ. పుల్లిరుసు. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలివంటి గుండ్రటి పొడుగు కర్ర; గిలకలకు మారుగా అమర్చినది; కొన్నిచోట్ల ఇటువంటివి చిన్నవి రెండుంటాయి; నేతనేసేటప్పుడు అచ్చుతాళ్ళు దీనిమీద ఆడతాయి. చూ. చిత్రాలు 121 చ. 3, 121 ప. 1 (రా. 14, 15).

**రూలుగుండుబొమ్మ** పర్యా. చూ. చెవుకట్టు(2). పుల్లిరుసు నిలవటానికి పైపట్టెకు బిగించిన చెక్క; ఇటు వంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 చ. 4, 121 ప. 2 (రా. 8).

**రూలుచెక్రం** పర్యా. చూ. డాబీచెక్రం. డాబీ దిండుకుపక్కగా అమరిన్చచెక్రం; మామూలుగా రెండు

గుండ్రటి బిళ్ళలకు మధ్య ఇనపఊచలు బిగించినది; కొన్నిచోట్ల (రేకు) పండ్లచక్రం; దీని పండ్లను కుక్క గుంజినప్పుడు దిండు తిరుగుతుంది. చూ. చిత్రం 132 చ. 11 (తె. 5).

**రూలుచెవు** చూ. పుల్లిరుసుచెవి (తె. 8).

**రూలుపట్టె** ఉ. రూలుపట్టి; పర్యా. చూ. పైపట్టె (3), పుల్లిరుసు చెవుకట్లకు ఆధారంగా పైన బిగించిన పొడుగుచెక్క. చూ. చిత్రం 121 ప. 5 (రా. 15).

**రూలుమొల** పుల్లిరుసు(=రూలు)చెవిలో దూర్చిన ఇనపపుల్ల(లు); దీన్ని పుల్లిరుసు సందులో బిగించి ఉంటారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 ప (తె. 8).

**రెక్క** **1.** పర్యా. అడ్డపట్టె(17), అడ్డుముక్క, ఉడత రెక్క, కల్లెం, కాపుచెక్క, కోతిపుల్ల(4), గుర్రం(1), చెవు, చెవుకట్టు(2), చెరులకమ్మి, జవ, తన్నుడుచెక్క, తొట్టికట్టె, డబ్బ(8), దాపకర్ర, పట్టె(6), బరువుబద్ద, బొమ్మ(10), బొమ్మకట్టె(2), బొమ్మపట్టె(4), బొమ్మ బద్ద, మగ్గంచెవు, రెక్కపలక, లాటుచెవు, సట్టరుబుజం, సన్నపట్టె, సొరుగుచెయ్యి. మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు, పటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడత దారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118 క. 18 (కో. 9, 17; తె. 15); **2.** ఒక(విడి) పంచె (తె. 4); **3.** అయిదు మూరల నేతబట్ట (తె. 12).

**రెక్కచాపు(లు)** **1.** ఒక పంచె, ఒక కండువా కలసి ఉన్న నేతబట్ట (కో. 13); **2.** పైమీద వేసుకొనే కండువా(లు) (రా. 8); **3.** ఒక పంచె (విడిగా ఉన్నది) (కో. 23).

**రెక్కతాడు** పర్యా. చూ. ఉడతతాడు. మగ్గం ఉడతకు పైన కట్టిన దారం; ఇటువంటివి రెండు ఒకటి కుచ్చుతాడుకూ మరొకటి రెక్కకూ కడతారు. చూ. చిత్రం 118.20 (కో. 28).

**రెక్కదుప్పటి** ఒక(విడి)దుప్పటి (కో. 4).

**రెక్కలపండుగ** శ్రమజీవులు(=రెక్కలువంచి పని చేసేవాళ్ళు)చేసుకొనే పండుగ; వినాయక చవితి; నేత పనివాళ్ళకు "రెక్కలపండుగ"; ఆ రోజున పని మానేస్తారు (తె. 12).

**రెక్కపలక** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు పటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118 క. 18 (కో. 28).

**రెక్కబద్ద** పర్యా. చూ. నిలువుపట్టె(10). మర మగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (కో. 14).

**రెక్కమాను** పర్యా. చూ. కత్తెరగుంజ(2). మర మగ్గం చట్రం నిలబెట్టటానికి నేతబయులులో పాతిన ఒక రకం నిలువుగుంజ; పైన ఒకటి, పటవాలుగా మరొకటి కొయ్యపట్టె(కత్తెర మాదిరిగా, లేదా రైలురెక్క మాదిరిగా ఉంటుంది); ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 117 (రా. 1, 4, 7, 8).

**రెక్కసరిచేయు** (క్రి.) పడుగు మడత విప్పి సరి చెయ్యటం (కో. 34).

**రెట్టకొలికి** కమ్మిపక్కన (ఇవతల)వరసగా నేసిన రెండు కొలుకుల రంగుదారాలు; వాటిమధ్య ఒక కొలికి తెల్లదారం పెడతారు; కమ్మికి రెట్టకొలికి వేస్తే కమ్మికి అందం ఇస్తుంది. చూ. చిత్రం 272.1 (కో. 7).

**రెట్టంచు** జంట అంచు (రా. 3).

**రెట్టపోగు** కమ్మి పక్కన నేసిన రెండు పోగుల జమిలిదారం; చూ. రెట్టకొలికి. చూ. చిత్రం 272.1 (కో. 1).

**రెడ్‌బ్రౌను** ఉ. రెడ్‌బ్రవును. **1.** గోధుమవన్నెలో ఎరుపుచాయ కలిసిన రంగు (కో. 7); **2.** ముదురు పొగాకుకాడ కంటె ఎరుపువన్నె (కో. 12).

**రెడ్డిబాడరు** రెండు పువ్వులమధ్య రెండురకాల డిజైన్లు పడేటట్లు నేసిన ఒకరకం అంచు (తె. 24).

**రెండుముళ్ళకాయ** ఒకరకం ముళ్ళకాయ; 'తేలుకొండికాయ' అనీ అంటారు; దీనికి రెండు ముళ్ళుంటాయి; గొర్రెలు మేతకు తిరిగేటప్పుడు ఇవి అప్పుడప్పుడు బొచ్చులో ఇరుక్కొంటాయి (తె. 28).

**రెప్ప(లు)** (బట్ట) తాను చివరిభాగం; ఇటువంటివి రెండువైపులా రెండు (పైరెప్ప, కిందిరెప్ప) ఉంటాయి కో. 1).

**రేక** **1.** చూ. రేకు (5) (కో. 23, 28–31, 36, 37); **2.** పర్యా. ఆకు (8). మరాసు చక్రం కట్టుబడిలో అడ్డపట్టె (ల)ను, ఇరుసును కలిపే కొయ్యపట్టె(లు); ఒక్కొక్క పక్క ఎనిమిదేసి ఉంటాయి. చూ. చిత్రం 50.2 (కో. 36); **3.** చూ. రేకు(6) (కో. 36).

**రేకంచు** కండువాలకు నేసే ఒకరకం అంచు (రా. 1).

**రేకలకమ్మి** ఒక్కొక్కరంగు ఒక్కొక్కకొలికి చొప్పున అయిదు రంగుపోగులు పడేట్లు నేసినకమ్మి (తె. 15).

**రేకలదారం** ఉ. రేకల్దారం; చూ. రేకులదారం(1). (కో. 29, 31).

**రేకు** **1.** పర్యా. చూ. ఒగ్గి. మరాసుమీద పడుగు తోడేటప్పుడు అనులు పడేట్టు పోగును జరపటానికి ఒక కొయ్యపట్టెకు బిగించిన రేకుముక్క; సుమారు

మూడంగుళాల పొడుగుది; దీని కొబ్బరిలోనుంచి తీసిన పోగు మరానుకు చుట్టుకొంటుంది; మరాను తిరిగి నప్పుడు కీలు ఆడుతూ కొయ్యపట్టె జరిగి దానికి బిగించిన ఈ రేకుముక్క పోగునుగూడా జరుపుతుంది; ఇలా జరగటంలో పడుగులో అని పడుతుంది; ఇటు వంటివి పట్టెపొడుగునా వరసగా (కొన్నిచోట్ల) 40 ఉంటాయి. చూ. చిత్రం 50.14 (కో. 4); **2.** పర్యా. పలకరేకు, పాలం(1), వేలురేకు. నేతనేసేటప్పుడు మరమగ్గం మేరువుపలక సులువుగా ఆడటానికి బిగించిన ఇనపరేకు; కొన్నిచోట్ల నట్టురుగుంజ అడ్డపట్టెకు బిగి స్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.5 (కో. 17; రా. 1, 2, 4, 7-10, 19); 3. పర్యా. చూ. కమాను(3). మరనాడె గాడిలో ముల్లుకు గుచ్చిన (కొయ్య) కండె ఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడిరేకు. చూ. చిత్రం 131 త. 2 (కో. 2, 3; రా. 11, 14, 17); **4.** వితంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకం బట్ట; తెల్లది (మామూలుగా 60-100 నెంబరు నూలుతో నేస్తారు; మామూలుగా (ఒకకొలిక) మామి డంచుపెట్టి నేస్తారు; కొన్నిచోట్ల గోరంచుకాని కడ్డీ అంచుకాని పెట్టినేస్తారు (కో. 21); **5.** రూ. రేక(1). పర్యా. చూ. ఆకు(1). రాట్నం ఇరుసుమీద తిరగటానికి చక్రంమాదిరిగా అమర్చిన సాపుచెక్క(లు); ఇలాటివి మామూలుగా నాలుగుంటాయి. చూ. చిత్రం 15.4 (కో. 25-27, 32, 35); **6.** రూ. రేక(3). పర్యా. చూ. ఆకు(2). పంటెకామ చుట్టూ వంచికట్టిన వెదురు బద్ద(లు); పంటెకట్టుబడిలో ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి. చూ. చిత్రం 19 క. 2 (కో. 30-33, 35); **7.** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్దలు. చూ. చిత్రం 31 క. 3 (కో. 33).

**రేకుడొక్క** రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదు తులాలు పట్టేది; చూ. పావు. చూ. చిత్రం 282 ప. 1 (కో. 26).

**రేకుతొట్టి** రంగునీళ్ళుకాచే పెద్ద ఇనపడబ్బా. చూ. చిత్రం. 282 క. 3 (కో. 13).

**రేకుపట్టె** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్టంలో నిలువుపట్టెకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల దీనికి చివరరేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి కుచ్చుచెంప తాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (రా. 1).

**రేకులతాడు** ఉ. రేకుల్తాడు; పర్యా. చూ. ఆకుల తాడు(1). రాట్నం ఆకులకు చుట్టిన తాడు. ఒకవైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు ఏటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (కో. 13, 25, 26, 28, 32, 35-37).

**రేకులదారం 1.** రూ. రేకలదారం; పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టిన తాడు. ఒక వైపు ఆకునుంచి రెండోవైపు ఆకుకు ఏటవాలుగా అల్లు తారు. చూ. చిత్రం 15.5 (కో. 26, 27); **2.** పర్యా చూ. గుమ్మిదారం. రాటిఆకులు పైవీ కిందివీ కలిపి కట్టేదారం. చూ. చిత్రం 31 ప. 4 (కో. 33).

**రేనిచెట్టు** ఒకరకంచెట్టు; దీని ఆకులు దసలి(పట్టు) పురుగులకు ఆహారం (తె. 7).

**రేలపువ్వు 1.** పసుపచ్చరంగు (తె. 13); **2.** బీర పువ్వులో లేతరంగు (తె. 15, 16).

**రేలపూత** తంగెడుపువ్వుకంటె కొంచెం తెలుపువన్నె; రేలపువ్వు రంగు (తె. 12).

**రేలపూరంగు** గుమ్మడిపువ్వురంగు; రేలపువ్వురంగు (తె. 14).

**రేవగర్ర** రేవచెట్టు కర్ర; దీంతో ఉండేలుబద్ద చేస్తారు; చూ. ఉండేలు. (కో. 34).

**రేవుతాడు** పర్యా. చూ. కొండితాడు. అచ్చుకట్టే టప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలి కల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరు స్తారు. చూ. చిత్రం 100.5 (కో. 1, 5-7).

**రేవు(దారం)** పర్యా. చూ. కొండితాడు. అచ్చు కట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లోదూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 3, 6).

**రేవు(లు)తిప్పు** (క్రి.) అచ్చువళ్ళలో పడుగు పోగులు తగిలే భాగం (= రేవు) పక్కకు జరపటం; అచ్చు కర్ర కొద్దిగా పక్కకు తిప్పి రేవులు జరుపుతారు; వడి పోగులు నలిగినప్పుడు రేవులు తిప్పుతారు. (కో. 1,4, 6ఎ, 22; రా. 11, 13, 18, 23, 24).

**రేషన్ 1.** పర్యా. చూ. పట్టు. పట్టుపురుగులనుంచి వచ్చేదారం (రా. 14); **2.** పర్యా. రేషం(2). కృత్రిమ పుపట్టు; అంచులు, కమ్ములు నేస్తారు (కో. 13,14,15).

**రేషన్ఆకు** చూ. రేషంఆకు (రా. 24).

**రేషన్పురుగు** చూ. రేషంపురుగు (రా. 24).

**రేషం 1.** పర్యా. చూ. పట్టు. పట్టుపురుగులనుంచి వచ్చేదారం (తె. 5, 8, 12, 18, 19, 21; రా. 14); **2.** పర్యా. రేషన్(2). కృత్రిమపుపట్టు; అంచులు, కమ్ములు నేస్తారు (కో. 14).

**రేషంఆకు** రూ. రేషన్ఆకు. పట్టుపురుగు తినే (? మల్బరీ) ఆకు. చూ. చిత్రం 289 (రా. 14).

**రేషంగూటం** పట్టు (=రేషం) దారం తోడటానికి చిలప తగిలించే కొయ్య; కొన్నిచోట్ల మట్టిముద్దకు బిగించిన కొయ్య; ఇటువంటివి మామూలుగా మూడుంటాయి. చూ. చిత్రాలు 294 క-ట (రా. 14).

**రేషందారం** ఒకరకం పురుగునుంచి వచ్చే దారం; బట్టలనేతకు వాడతారు (తె. 5).

**రేషంనూలు** ఒకరకం పురుగులనుంచి వచ్చే దారం; బట్టలనేతకు వాడతారు (కో. 21).

**రేషంపట్టు** నారతో తయారైన కృత్రిమపుపట్టు; తెల్లగా ఉంటుంది; అంచులు, కమ్ములు నెయ్యటానికి వాడతారు (కో. 11).

**రేషంపురుగు** రూ. రేషన్‌పురుగు; పర్యా. పట్టుపురుగు; పట్టు (రేషం) దారం ఉత్పత్తి చేసే పురుగు; సాలిపురుగు మాదిరిది; 'మల్బరీ' చెట్లఆకులు తింటుంది; గుడ్లుపెట్టే కాలంలో పసుపు వన్నెలో ఉంటుంది; ఇటువంటి పురుగుల్నిపట్టి తెచ్చి తొట్టెల్లో పెంచుతారు; మల్బరీ చెట్లఆకులు రెండు మూడు సన్నగా కత్తిరించి దీనికి ఆహారంగా వేస్తారు; దీనినోట్లోనుంచి వచ్చే జిగురుపదార్థం దారంలా వస్తుంది; ఈ పురుగు ఆదారాన్ని చుట్టూ అల్లుకొని లోపల ఇరుక్కుపోతుంది; దాన్ని 'పట్టుకాయ' అంటారు; ఈ కాయలు వేణ్ణీళ్ళలో వేస్తే లోపలిపురుగు చచ్చిపోతుంది; అప్పుడు దారం తీస్తారు. చూ. చిత్రం 289 (రా. 14).

**రేషంమగ్గం** ఉ. రేషమ్మొగ్గం. పట్టుబట్టలు నేసే ఒకరకం చేతిమగ్గం; కొన్నిచోట్ల దీనికి డాబీ అమరుస్తారు. చూ. చిత్రం 111 చ (తె. 18).

**రేషంరంగు** రేషం (=పట్టు)కు వేసేరంగు (రా.16).

**రేషంలడీ** పట్టుదారంలెక్క: చూ. లడీ; ఇది అయిదు తులాలనుంచి ఇరవై తులాలవరకూ బరువు ఉంటుంది (తె. 21).

**రైక(ల)గుడ్డ** ఉ. రైగ్గుడ్డ; పర్యా. చోళీగుడ్డ, జాకెట్టుగుడ్డ. ఆడవాళ్ళ రవికెలకోసం నేసినబట్ట; కొన్నిచోట్ల డిజైన్లు పెట్టి నేస్తారు (కో. 4, 5, 24).

**రైఫేరంచు** సాదాఅంచుకు పైనగాని కిందగాని నాలుగు గీరలు వచ్చేటట్లు నేసిన అంచు (కో. 3).

**రైతుపత్తి** తెల్లపత్తిలో ఒకరకం (కో. 36).

**రైతుపిల్ల(చీర)** దీర్ఘచతురస్రపు గడిలో వేరే రంగు అడ్డపోగులువేసి గడి చతురస్రం అయేట్టు నేసిన చీర (తె. 13).

**రైతుబిడ్డ** అంచులో నేసే ఒకరకం డిజైను (రా. 8).

**రైతుబిడ్డగడిచీర** బెత్తెడు వెడల్పున గళ్ళుపడేట్లు నేసిన ఒకరకం చీర (కో. 16).

**రైలంచు** పర్యా. చూ. రైలుపట్టా(ల)అంచు. రైలుపట్టాల మాదిరిగా రెండు సమాంతరరేఖలు పడేట్టు నేసిన అంచు; కొన్నిచోట్ల రంగుఅంచులో తెల్లగీరలు పడేటట్లునేస్తారు (కో. 5; తె. 14).

**రైలుపట్టా(ల) అంచు** పర్యా. రైలంచు, రైల్వేబార్డరు. రైలుపట్టాల మాదిరిగా రెండు సమాంతర రేఖలు పడేట్టు నేసిన అంచు; కొన్నిచోట్ల రంగు అంచులో తెల్లగీరలు పడేటట్లు నేస్తారు (తె. 1, 11, 12, 17, 23-27, 30).

**రైలుపప్పళి** ఉ. రైలుపప్లీ. ఒకరకంగడి(=పొప్పళి) చీర; నాలుగు కొలుకులు నలుపు. నాలుగు కొలుకులు ఇటాలి, నాలుగు కొలుకులు నలుపు చొప్పున పెట్టి తరవాత ఒకకొలికి ఇటాలి, ఒక కొలికి నలుపుచొప్పున రెండు వరసలు పెట్టి అచ్చు అతికిన పడుగులో పేక దారంకూడా అదేమాదిరిగా పడేట్టు నేస్తారు (రా. 24).

**రైల్వేబార్డరు** ఉ. రైల్వేబాడరు; పర్యా. చూ. రైలుపట్టా(ల) అంచు. రైలుపట్టాలమాదిరిగా సమాంతరరేఖలు పడేటట్లు నేసిన అంచు; కొన్నిచోట్ల రంగు అంచులో తెల్లగీరలు పడేటట్లు నేస్తారు (రా. 11).

**రొల్లాలుగాఉండు** (క్రి.) వదులుగా ఉండటం; పడుగు పొర రొల్లాలుగా ఉంటే కోల పొరంటారు (కో. 34).

**రో** (పడుగు బయలుకు, ఒక) వైపు; "అచ్చు గుతులు నరిగుంజ గొల్సుకు తగిలిచ్చి ఊద్దె రోకు సాపాలి; కింద రోకుపడుగు సాపుకుంటపోయి...తాడు బిర్రుగుంజాలె" (తె. 11, 14).

**రోకటిబండ** ఉన్ని (శుభ్రం) చెయ్యటానికి బండ మీద వేసి దంచే కొయ్య; చూ. కొడతం(తె. 25, 28).

**రోజా(రంగు)** 1. ఒకరకం ఎరుపురంగు; (ముదురు) గులాబిపువ్వురంగు. చూ. చిత్రం 288 (కో. 2, 4, 6, 7, 10, 21, 26, 36; రా. 7, 8, 9, 11, 16). 2. చెంగావిరంగు (కో. 14).

**రోజియాదూది** ముతకనూలు తీసేపత్తి; దీని పసెలు అరంగుళం పొడుగుంటాయి (కో. 14; తె. 28).

**రోజ్జేకమ్మి** ఒకవైపున చిన్నపట్టె, మరొకవైపున పెద్ద పట్టెపెట్టి మధ్య రెండు కొలుకుల తెల్లపోగులు పెట్టి నేసిన కమ్మి (కో. 8).

**రోటుడుకట్టె** పర్యా. తొడుడుకట్టె. పంటెకు నూలు చుట్టటానికి చేత్తో తిప్పే కాముకు ఊనికగా తొడమీద పెట్టుకొనే కట్టె; గుండ్రటిది (తె. 7).

**రోడ్డుకమ్మి** ఉ. రోడ్డుకమ్మె, రోడ్రకమ్మి, రోడ్రు కమ్మి; పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద

నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 16, 21, 23-25).

**రోడ్డుకర్ర** ఉ. రోడ్రకర్ర; పర్యా. చూ. పానుపు పట్టె. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య; నేత నేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 26).

**రోడ్డుబల్ల** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండుచివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 33).

**రోలరు 1.** ఉ. రోల్రు, లోరల్, లోలరు. **2.** పర్యా. చూ. పుల్లిరుసు. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలివంటి గుండ్రటి పొడుగుకర్ర; గిలకలకు మారుగా అమర్చింది; కొన్నిచోట్ల ఇటువంటివి చిన్నవి రెండుంటాయి; నేతనేసేటప్పుడు అచ్చుతాళ్ళు దీనిమీద ఆడతాయి. చూ. చిత్రాలు 121 చ. 3, 121 ప. 1 (కో. 3, 17, 19, 21, 23, 24); **2.** ఒకరకం దోనె; రోలరు మగ్గంలో నేతగుడ్డ చుట్టే గుండ్రటి దూలం (కో. 24); **3.** రూ. రూలరు, రూలు(2); పర్యా. చూ. దిండు(7). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు; బోట్ల పింజెర దిండుకు బొడిపెలు, తొల్లపింజెర దిండుకు గాళ్ళూ ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు; కొన్నిచోట్ల దీనికి చివర ఇనపఊచల చెక్రం గాని (రేకు) పళ్ళచెక్రం గాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (కో. 10); **4.** పర్యా. చూ. ఎదురుదోనె. మగ్గంచివర పడుగుమాలు చుట్టే కొయ్యదూలం; రోకలి మాదిరిది; కొన్నిచోట్ల నలుపలకలది; మలగర్రకు బదులు అమరుస్తారు. చూ. చిత్రం 110.1 (కో. 33).

**రోలరుఇరుసు** ఉ. రోల్రుఇరుసు. పుల్లిరుసు (=రోలరు)తిరగటానికి ఆధారంగా చెవుకట్లకు మధ్యగా బిగించిన ఇనపకడ్డీ. చూ. చిత్రం 121 ప. 3 (కో. 23).

**రోలరుకమ్మి** ఉ. లోలరుకమ్మి. **1.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 17); **2.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గం చట్రంలో కింది పట్టె. చూ. చిత్రం 118 క. 9(కో. 17).

**రోలరుకొయ్య(లు)** రోలరు(=గుండ్రటి మగ్గం దోనె)ను మోసే గూటం; నేలలోపాతింది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 123 త. 1 (కో. 33).

**రోలరుచెక్క** ఉ. రోల్రుచెక్క; పర్యా. చూ. చెవు కట్టు(2). పుల్లిరుసు నిలవటానికి పై పట్టెకు బిగించిన చెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 చ. 4, 121 ప. 2 (కో. 24).

**రోలరుచెక్రం** ఉ. రోల్రుచెక్రం; పర్యా. చూ. పళ్ళ చెక్రం(2). నేతమోకు బిగించటానికి ఒకరకం(పళ్ళచెక్రం కొయ్య)చేతిగూటానికి కిందివైపు అమర్చిన ఇనపచెక్రం చూ. చిత్రం 122 ట. 1 (కో. 24).

**రోలరుతాడు** ఉ. రోల్రుతాడు; పర్యా. వాయి తాడు(2). పుల్లిరుసు(=రోలరు)కు వేసిన అచ్చుతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 చ. 5, ప. 4 (కో. 23).

**రోలరుమగ్గం** పర్యా. చూ. ఎదురుదోనెమగ్గం. మగ్గంమీద చాపిన పడుగులో చివరభాగం చుట్టటానికి ఎదురుగా రోకలివంటి కొయ్య(=ఎదురుదోనె)అమర్చిన మగ్గం; దీన్ని కొంచెం చోటులోనే అమర్చుకోవచ్చు. చూ. చిత్రం 110 (కో. 7).

**రౌజు** ఏకేటప్పుడు దూదినుంచి రాలిన తుక్కు; "దూదిలోఉన్న రౌజు తడికెలోనుంచి కిందికి దిగిపోద్ది" (కో. 14).

**రౌతు 1.** రాయి; ఉన్ని శుభ్రం చెయ్యటానికి దీని మీద పరిచి దంచుతారు (తె. 26); **2.** పర్యా. చూ. దానెరాయి. సరిచేసేటప్పుడు ఉన్ని పడుగులో చివర ఎక్కించిన కర్ర(దానె)బిగింపుకోసం నేలలో పాతిన రాయి; ఇటువంటివి మామూలుగా ఒకవైపున రెండు మరొకవైపున ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 314.2 (తె. 20).

**రౌండ్‌జరీ** రెండు పోగులు కలిపి పురిపెట్టి నేసే జరీ; పోగుసన్నం (రా. 14).

## ల

**లక్కకమ్మి** కొంగులో బెత్తెడు వెడల్పున నేసిన పట్టె (కో. 16).

**లక్కచాయ** ఉ. లక్కసాయి. నల్లపోకచెక్క (=పీకేవక్క)రంగు (కో. 3).

**లక్కంచు** బట్టకు చివర బొటనవేలెడి వెడల్పున, సుమారు 24 కొలుకుల దారంపెట్టి ఎర్రరంగులో నేసిన అంచు; లక్కగాజు మాదిరిది (కో. 3, 5, 7, 10, 11, 14; తె. 15).

**లక్కంచుచీర** ముదురు ఎరుపురంగు బొత్తంచు పెట్టి నేసిన చీర (కో. 5.24).

**లక్కపేటు** అంచులో నేసిన ఒకరకం డిజైను (రా. 8).

**లక్కమొన** లక్క అతికించిన నాడికొన; లక్క అతికిస్తే నేత నేసేటప్పుడు పోగులు తెగవట; చూ. నాడెముక్క (కో. 37).

**లక్కాకు** 1. పర్యా. చూ. దిండు(3). చెక్రం మధ్య ఆకుల బిగింపుకు అమర్చిన కొయ్య. చూ. చిత్రం 41 ట. 1 (కో. 13); 2. పర్యా. బండి(3), బల్ల(4), బిళ్ళ(5). దబ్బారాట్నం చెక్రానికి నిలువుకు మధ్య వేసిన కొయ్యబిళ్ళ; ఇటువంటివి రెండుంటాయి; చెక్రం పక్కలకు జరగకుండా ఆపుతాయి. చూ. చిత్రం 41 త. 1 (కో. 10).

**లక్కాకంచు** 1. తొగరురంగు నూలు పదిపోగులు పెట్టి నేసిన అంచు; మామూలుగా పంచెలకు నేస్తారు (కో. 9; తె. 15; రా. 21); 2. చిగురు వదలకుండా సుమారు రెండువేళ్ళ వెడల్పున రంగులో నేసిన అంచు (కో. 4, 6).

**లగాంతాడు** పర్యా. చూ. బిరుతాడు(2). మరమగ్గం నిలువుపట్టెను, మేరువుపలకకు బిగించి, సన్న పుల్లతో వడిపెట్టిన దారం; మేరువు పలకను పైకిగాని కిందికిగాని జరుపుకొని దీంతో బిరుపెడతారు. చూ. చిత్రం 118.6 (కో. 35).

**లగాంపుల్ల** పర్యా. చూ. బిరుపుల్ల(2). మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి తాడు వడిపెట్టే పుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.7 (కో. 35).

**లగ్గపువల్లె** ఉ. లగ్గపొల్లె. లగ్నానికి పెళ్ళికూతురు కట్టుకొనే చిన్నచీర; తలంబ్రాలచీర (తె. 11, 25, 29).

**లగ్గాంకొయ్య** పర్యా. చూ. పావుచెక్కల గూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా వెనకవైపు మడిమదగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్ని చోట్ల ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 37).

**లంకపూగొంగడి** పర్యా. నీల(పురి)గొంగడి. నీలం రంగు ఉన్నితో నేసిన గొంగడి (తె. 22).

**లంకెతాడు** పర్యా. చూ. ఆకులతాడు(1). రాట్నం ఆకులకు చుట్టిన తాడు. ఒకవైపు ఆకునుంచి మరొక వైపు ఆకుకు పటవాలుగా అల్లుతారు. చూ. చిత్రం 15.5 (కో. 20),

**లంగాగుడ్డ** పర్యా. పరికిణీగుడ్డ. ఆడవాళ్ళ పరికిణీల కోసం నేసిన గుడ్డ; కొన్నిచోట్ల లంబాడీవాళ్ళు కట్టుకొనే పరికిణీగుడ్డ (కో. 13, 14).

**లచ్చ** చూ. లచ్చన (కో. 26, 28–37).

**లచ్చన** (-అంటించు, -పెట్టు, -వేయు) ఉ. లచ్చెన; రూ. లచ్చ, లచ్చిగి; పర్యా. అంటు(1), ఆనవాలు, ఎరక, గజెంగుర్తు, గుర్తు, మసెంటు, మూరంటు, లచ్చన గుర్తు. అచ్చుతికిన పడుగుమీద కొలతను బట్టి వేసిన గుర్తు; మామూలుగా మసిగుర్తు వేస్తారు; కొన్నిచోట్ల చిక్కుడు, బీర మొ. వాటి ఆకుపసర్లతో గజానికి ఒకటి చొప్పునగాని మూరకు ఒకటి చొప్పునగాని గుర్తులు వేస్తారు (కో. 25, 27; తె. 9–12; 17, 20–24, 26–33; రా. 18, 23, 24).

**లచ్చనకట్టె** పర్యా. చూ. లచ్చనలాక. అచ్చుతికిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనే బద్ద; మామూలుగా గజెం – కొన్నిచోట్ల మూరెడు-పొడుగుది; కొన్నిచోట్ల మలగట్టుకర్రతో కొలుస్తారు (తె. 9, 26).

**లచ్చనకోల** పర్యా. చూ. లచ్చనలాక. అచ్చుతికిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి కొలతచూసుకొనే బద్ద; మామూలుగా గజెం–కొన్నిచోట్లమూరెడు-పొడుగుది; కొన్నిచోట్ల మలగట్టుకర్రతో కొలుస్తారు (తె. 22, 24. 27).

**లచ్చనగుర్తు** (-పెట్టు) పర్యా. చూ. లచ్చన. అచ్చుతికిన పడుగుమీద కొలతనుబట్టి వేసిన గుర్తు; మామూలుగా మసిగుర్తు వేస్తారు; కొన్నిచోట్ల చిక్కుడు, బీర మొ. వాటి ఆకుపసర్లతో గజానికి ఒకటి చొప్పున గాని మూరకు ఒకటి చొప్పున గాని గుర్తులు వేస్తారు (తె. 28).

**లచ్చనలాక** ఉ. లచ్చన్లాక, లచ్చెన్లాక; పర్యా. అంట్లబద్ద, అంటుకర్ర, కొలతదబ్బ, గజెందబ్బ, గుర్తులలాక, మూరపుల్ల, లచ్చనకట్టె, లచ్చనకోల, లచ్చన్లగర్ర. అచ్చుతికిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనే బద్ద; మామూలుగా గజెం-కొన్నిచోట్ల మూరెడు-పొడుగుది; కొన్నిచోట్ల మలగట్టుకర్రతో కొలుస్తారు (తె. 11, 17, 21; రా. 23).

**లచ్చనపెట్టు** (క్రి.) గుర్తుపెట్టడం; పడుగుమీద గుర్తులుపెట్టి నేతపని ప్రారంభిస్తారు (తె. 17).

**లచ్చన్లగర్ర** పర్యా. చూ. లచ్చనలాక. అచ్చుతికిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనే బద్ద; మామూలుగా గజెం-కొన్నిచోట్ల మూరెడు-పొడుగుది; కొన్నిచోట్ల మలగట్టుకర్రతో కొలుస్తారు (తె. 12).

**లచ్చిగి** (-చేయు) చూ. లచ్చన (రా. 16).

**లట్టి** తివాసీనేతకు వాడే ఉన్నిదారం చుట్ట; లడీ (తె. 17).

**లట్టివేయు** (క్రి.) తివాసీనేతకు వాడే ఉన్నిపోగులు కాళ్ళకు చుట్టి లడీ తయారుచెయ్యటం (తె. 17).

**లట్టీ** చూ. లడీ(1) (తె. 28).

**లడిగె** ఉ. లడిగ; చూ. లడీ(1) (రా. 12, 13).

**లడీ** 1. ఉ. లడి, లడె; రూ. లట్టీ, లడిగె, లడ్డీ; పర్యా. అరపిడి, టోకు(1), తిడి, దడ(2), పిడి(4), బందు(1), సీడీ. పెట్టెలో ఉండే నూలుకట్ట; ఏ నెంబరు నూలో అన్ని లడీలు ఒక్కొక్క పెట్టెలో ఉంటాయి; లడీ బరువు = $\frac{\text{పదిపౌన్లు}}{\text{నూలు నెంబరు}}$ (కో. 2, 13; తె. 1-9, 11-17, 19-26, 29-33; రా. 1, 2, 5-8, 16-20, 23, 24); 2. జరిపోగులలెక్క : నాలుగు వందల వాట్లకు సరిపడే జరి (కో. 24).

**లడీకమ్మి** ఒకలడీ నూలుపెట్టి నేసిన కమ్మి; నాలుగు వందలవాట్లు పడతాయి (కో. 24).

**లడ్డీ** ఉ. లడ్డి; చూ. లడీ (కో. 1, 3-10, 15, 22).

**లతబోర్డరు** పర్యా. తీగంచు. తీగ మాదిరి డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 147 (రా. 24).

**లతాంగి** ఒకరకం అంచు; లతలూ పువ్వులూ డిజైన్లలో నేసింది. చూ. చిత్రం 162 (కో. 23).

**లపేటా** ఉ. లపీట; పర్యా. చూ. పంకరు. నూలు చిలపలుగా చుట్టే కొయ్య పనిముట్టు. చూ. చిత్రం 38 (తె. 11).

**లంబడంచుధోతి** లంబాడీవాళ్ళు కట్టుకొనే ఒకరకం పంచె; పెద్దఅంచు పెట్టి నేసింది (తె. 24).

**లంబడిచీర** లంబాడి జాతివాళ్ళు కట్టుకొనే బట్ట (తె. 24).

**లంబడివాళ్ళదుప్పటి** ఉ. లంబడోళ్ళదుప్పటి. చెరుగులో ఒకవైపు ఎర్రరంగు పెట్టి రెండోవైపు మామూలుగా నేసిన దుప్పటి; లంబాడీవాళ్ళు లగ్న సమయంలో పెళ్ళికొడుక్కు కప్పేది (తె. 12).

**లంబాడీలు** నారదారం వడికే వాళ్ళలో ఒకతెగ (కో. 13).

**లలితరంగు** ఒకరకం ఆకుపచ్చరంగు; లేత చిలకపచ్చ రంగు (తె. 2).

**లలితరంగుచీర** లేత చిలకపచ్చరంగు చీర (తె. 2).

**లవంగపూవుచీర** ఒకరకం రంగు చీర (కో. 26).

**లవంగంమొగ్గ** అంచులో నేసే ఒకరకం డిజైను (రా. 18).

**లవండరు** ఉ. లవండ్రి, లెవెండర్, లెవెండరు. 1. ఒకరకం లేతనీలం రంగు. చూ. చిత్రం 288 (కో. 2, 24, 36; రా. 11, 15); 2. పన్నీరురంగు (కో. 11); 3. లేతవంకాయ రంగు (కో. 12, 15); 4. దేవకాంచనపుష్పం రంగు; మెజంటాలో తెలుపువన్నె (తె. 13).

**లవసంతానం** సన్నగా మెత్తగా ఉండే ఒకరకం పట్టు(కో. 14).

**లక్షవరాలగుండు** పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండెఅవతలకు వేలాడ దీసిన(గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల ఇనపగుండుగాని, చిన్న చెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (రా. 18).

**లక్ష్మినారాయణంచు** ఉ. లచ్చిన్నారాయణంచు, లచ్ఛిన్నారాయణంచు, లక్ష్మిన్నారాయణంచు. పంచెలకు నేసే ఒకరకం అంచు; అంచులో చివర పది కొలుకులు తెలుపు వదిలి ఒక్కొక్క కొలికి నీలి, తెలుపు, నీలి పెట్టి తరవాత అంతా తెలుపు వరసగా వచ్చేట్టు నేసిన అంచు; కొన్నిచోట్ల నలుపు, సీమపట్టురంగు పెడతారు; ఈఅంచు పంచెకు మామూలుగా రాట్నపాకుల కమ్మి పగంగొట్టి నేస్తారు (కో. 8, 10; తె. 14, 15; రా. 21).

**లక్ష్మీపత్తి** చూ. లక్ష్మీఘారంపత్తి (కో. 14; తె. 28; రా. 6).

**లక్ష్మీఘారంపత్తి** ఉ. లచ్చింపారంపత్తి. లచ్చింవారం పత్తి. మేలిరకం పత్తి; చెట్టు గుబురుగా పొట్టిగా ఉంటుంది. కాయ నిమ్మకాయంత ఉరువు; గింజలు ఎక్కువ; దూది తెలుపు; ఇది కర్నూలు, కడప ప్రాంతాల్లో పండుతుంది; దీంతో 16-240 నెం.ల దాకా నూలు తియ్యవచ్చు (రా. 16-19, 22).

**లాక** 1. పర్యా. చూ. ఆకు(1). రాట్నం ఇరుసు మీద తిరగటానికి చక్రం మాదిరిగా అమిర్చిన సాపు చెక్క(లు); ఇలాటివి మామూలుగా నాలుగుంటాయి. చూ. చిత్రం 15.4 (రా. 5); 2. (-ఎక్కించు, -ఏరు; -కూర్చు, -గుచ్చు, -తొక్కు, -తొడుగు, -పెట్టు, -వేయు) రూ. లేక(1). పర్యా. అనిలాక(1), కచ్చిబద్ద(2), కచ్చిలాక, నాగబద్ద, పడుగుకోల(2), పడుగులాక, పడుగెరిలాక, లాకబద్ద(2), వెదటిలాక(1). పడుగులో అని వెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా ఇటువంటివి అనికి రెండు వైపులా ఉంటాయి; పడుగులో అని చెదిరిపోకుండా ఉండటానికి లాకలువేస్తారు. చూ. చిత్రం 63 చ. 3 (కో. 2, 4-11, 13-24, 28, 37; తె. 1, 3, 5, 7, 9-20, 22-33; రా. 1-24); 3. పర్యా. చూ. కుంచెలాక. కుంచెకట్టుబడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (కో. 9ఎ, 14, 17, 26, 30, 33, 37; తె. 5, 11, 13, 14, 16, 18, 22, 23, 25, 32, 33; రా. 11, 13, 15, 23); 4. (-కుట్టు) పర్యా. చూ. బద్దెగుచ్చు(డు)లాక. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురు

బద్ద; కొన్నిచోట్ల కఱ్ఱ. చూ. చిత్రం 124.1 (రా. 7, 8, 19); **5.** రూ. లేక(2); పర్యా. చూ. నేతలాక. నేతపడుగులో పై పోగులకు కింది పోగులకు మధ్య (=పొరలమధ్య) దూర్చిన వెదురుబద్ద. చూ. చిత్రం 127.6 (కో. 1, 2, 4-8, 14, 21-24, 28, 30, 37; తె. 2-5, 11-20, 23-33; రా. 1-5, 7-11, 13-22, 24); **6.** పర్యా. చూ. డాబీకోల. పేటుదారాలకు ఆధారంగా డాబీ చట్రంలో అమర్చిన సన్నబద్ద; పావు చెక్కలను తొక్కినప్పుడు గొలుసు పిక్కలుగాని దిండు దిమ్మలుగాని కోలలను పైకి లేపుతాయి. చూ. చిత్రం 132 చ. 6 (రా. 11, 14, 24) **7.** శివాసీమగ్గానికి బిగించిన పడుగులో అనిపోగుల్లో దూర్చిన వెదురుబద్ద; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 320.13 (తె. 10).

**లాకగుచ్చు** (క్రి.) పర్యా. చూ. లాక(లు)కుట్టు(1). పడుగులో అడ్డబద్ద(లాక)దూర్చటం (కో. 7).

**లాకచీటు** (క్రి.) నేతపడుగులో లాక జరపటం; చువ్వలతో జరుపుతారు (కో. 24).

**లాకతట్టు** (క్రి.) ఉ. లాకదట్టు; రూ. లేకతట్టు. సరి చేసేటప్పుడు పడుగులో సందుపోగులు విడబడటానికి లాకతో తట్టడం (కో. 6).

**లాకదబ్బ** చూ. లాకబద్ద(2) (రా. 4).

**లాకదారం** మగ్గానికి బిగించిన పడుగులో అనిపోగుల వెంబడి దూర్చిన; లాకకు కట్టిన పొడుగు దారం. చూ. చిత్రం 128 డ (రా. 7).

**లాకపచ్చె** పర్యా. చూ. కుంచెలాక. కుంచెకట్టు బడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (తె. 12).

**లాకబద్ద** **1.** పర్యా. చూ. ఉండేలు(బద్ద). తాడు కట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం 9.12 (తె. 17); **2.** రూ. లాకదబ్బ; పర్యా. చూ. లాక(2). పడుగులో అనివెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా ఇటు వంటివి అనికి రెండువైపులా ఉంటాయి; పడుగులో అని చెదరిపోకుండా ఉండటానికి లాక వేస్తారు. చూ. చిత్రం 63 చ. 3 (కో. 19); **3.** రూ. లేక బద్ద; పర్యా. చూ. కుంచెలాక. కుంచెకట్టుబడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (కో. 7, 11, 19, 24; తె. 1, 17, 18); **4.** పర్యా. చూ. బద్దెగుచ్చు(డు)లాక. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద; కొన్నిచోట్ల కఱ్ఱ. చూ. చిత్రం 124.1 (తె. 24); **5.** పర్యా. చూ. ఆకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 17).

**లాకబద్దకమ్మి** వెదురుబద్ద వరస మాదిరిగాపట్టెలు పడేట్లు నేసిన కమ్మి; పంచెలకు నేస్తారు (తె. 14).

**లాకలకట్టు** దండె తరవాత పడుగులో దూర్చిన లాక(=మునుములాక)లు చివరికి జారకుండా దారంతో దండెకు కలుపుతూ వేసిన కట్టు (తె. 31).

**లాకలగుండు** పర్యా. చూ. సవలతుగుండు. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల ఇనపగుండుగాని, చిన్న చెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 30).

**లాక(లు)కుట్టు** (క్రి.) **1.** పర్యా.లాకగుచ్చు, లేక తొడుగు. పడుగులో అడ్డబద్ద(లాక)దూర్చటం (కో. 2); **2.** అచ్చు(బద్దెలో)లాక దూర్చటం (రా. 7, 10). **3.** బెంతుదారంలో అని వెంబడి లాకలు దూర్చటం (కో. 35, 37; రా. 1, 4, 76).

**లాక(లు)తొక్కు** (క్రి.) **1.** పర్యా. లాకలు తొడుగు. పడుగులో అని వెంబడి అడ్డబద్దలు దూర్చటం (కో. 30, 32, 33, 37); **2.** అచ్చులో అడ్డబద్ద దూర్చటం (కో. 35).

**లాకలుతొడుగు** (క్రి.) పర్యా. లాక(లు)తొక్కు. పడుగులో అడ్డబద్దలు దూర్చటం (కో. 26).

**లాకలుదుస్సు** (క్రి.) చూ. లాకలు దూయు (కో. 9; రా. 18, 19బి).

**లాక(లు)దూయు** (క్రి.) రూ. లాకలుదుస్సు. పడుగులో అడ్డబద్దలు తీసివెయ్యటం (కో. 5, 6).

**లాకలునడుపు** (క్రి.) సరిచేసేటప్పుడు పడుగులో లాకలు ఒకవైపుకు జరపటం (రా. 19బి).

**లాకలులేబట్టు** (క్రి.) సరిచేసేటప్పుడు పడుగులో లాకలు పైకి ఎత్తటం; కిందిపోగులు, పైపోగులు విడదియ్యటానికి లాకలు ఎత్తుతారు (తె. 17).

**లాకలెగేయు** (క్రి.) పర్యా. చూ. లాకలెత్తు. పడుగు ఆరుతున్నప్పుడు కచ్చిపోగులు అంటుకుపోకుండా లాకలు ఎత్తటం; అనిలాక దగ్గర మరో లాక దూర్చి పైపోగులు పైకీ కిందిపోగులు కిందికీ లాకలతో విడదీస్తారు (తె. 17, 33).

**లాకలెత్తు** (క్రి.) పర్యా. నాగులెత్తు, లాకలెగేయు. పడుగు ఆరుతున్నప్పుడు కచ్చిపోగులు అంటుకు పోకుండా లాకలు ఎత్తటం; అని లాక దగ్గర మరో లాక దూర్చి, పైపోగులు పైకీ కిందిపోగులు కిందికీ లాకలతో విడదీస్తారు (కో. 30; రా. 4, 5).

**లాకలేరు** (క్రి.) పర్యా. నాగులేరు, బద్దలేరు. పడుగేరేటప్పుడు లాకలమీది పోగులు సరిదిద్దటం (కో. 28-30, 37).

**లాకవిరగుద్దు** (క్రి.) ఉ. -ఇరగుద్దు. పట్టుపడుగులో పై పోగులకు కింది పోగులకు మధ్య ఎక్కించిన లాకను చేత్తో తట్టటం (తె. 12).

**లాకీడమాస్‌చీర** లాకీరంగు పడుగులో మూడేసి వేళ్ళ వెడల్పు పట్టెలు మూడేసి వేళ్ళ ఎడంలో పడేట్టు నేసినచీర; పేకకు(సాదా)నేతలో లాకీ పెడతారు; పట్టె తరవాత ఎనిమిది కొలుకుల జమిలిపోగులు రోజా వన్నెవి అతికి నేస్తారు (కో. 7).

**లాకీ(రంగు)** ఉ. లాకి, లాకెరంగు. ముదురు ఎరుపు రంగు; మంచి మిరప్పండురంగు; తొగరు. (కో. 2, 4, 6, 9, 10, 11, 13, 14, 18, 21; రా. 5, 7, 8, 11, 12, 14, 19, 19బి, 20, 24).

**లాక్నలగొలుసు** పర్యా. చూ. గొలుసు(5). డాబీ కోలలు లేపటానికి గొలుసుమాదిరిగా సన్నబద్దలు కూర్చిన సాధనం; ఈ బద్దలకు చిన్నపిక్కలు బిగిస్తారు; దీన్ని దిండుకు తగిలిస్తారు. చూ. చిత్రం 132 త. 1 (తె. 5).

**లాగుడడ** (<లాగుడు+అడ) డిజైన్లు నేసేటప్పుడు చేత్తో లాగే పేటుదారాలు (కో. 2).

**లాగుడుతాళ్ళు** ఒకరకం డిజైను నేతలో అడను గుంజటానికి వేసిన తాళ్ళు; చూ. అడ (కో. 7).

**లాగుడుపేటు** పేటుదారాలు చేత్తోలాగుతూ నేసిన డిజైను నేత; పెద్దపేటు (కో. 6).

**లాటీ** పర్యా. చూ. గొలుసుబద్ద. డాబీగొలుసుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద(లు); వీటికి కొయ్యపిక్కలు బిగిస్తారు; ఇవి దిండునుచుట్టి తిరుగుతూ ఉంటాయి. చూ. చిత్రం 132 త. 2 (కో. 33).

**లాటీకర్ర** పర్యా. చూ. పిడుపుకర్ర. రంగు అద్దిన నూలులడీలు గుంజకు తగిలించి పిండే కర్ర; గుండ్రటిది; దీన్ని లడీల్లో దూర్చి మెలిపెడతారు; దీంతో పోగులు విదిలిస్తారు; కొన్నిచోట్ల రంగు నీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు. చూ. చిత్రం 282 ళ. 5 (కో. 8).

**లాటు** పర్యా. చూ. మగ్గంచట్టం(1). మరమగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగు పట్టెలచట్టం; మామూలుగా దీని నిలువుపట్టెలకు కుచ్చుతాళ్ళు కట్టే కొయ్యలు బిగిస్తారు; కింది పట్టెమీద నాడె బిగిస్తారు. చూ. చిత్రం 118 (రా. 12).

**లాటుదత** పర్యా. చూ ఉడత. మరమగ్గం నాడెను ఒక సొరుగులో నుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; ఇటువంటివి రెండు సొరుగులపైనా అమరుస్తారు. చూ. చిత్రం 119(రా. 13).

**లాటుకొమ్ము** పర్యా. చూ. మరనాడె. ఒకరకం నాడె మరమగ్గంది; పడుగు పైపోగులకు కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే నాడె; నాడె(కుచ్చు గుంజినప్పుడు పడుగు పోగుల మధ్య పానుపుపట్టెమీద ఒక సొరుగులోంచి మరొక సొరుగులోకి పరుగెడుతుంది); చేతినాడె కంటె ఉరువు పెద్దది; దీంతో నేత సులువుగా తొందరగా అవుతుంది. చూ. చిత్రం 131 క(రా. 14, 18).

**లాటుకొమ్ముర్రేకు** పర్యా. చూ. కమాను(3). మరనాడె గాడిలో ముల్లుకు గుచ్చిన (కొయ్య) కండె ఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడిరేకు. చూ. చిత్రం 131 త. 2 (రా. 11).

**లాటుగుంజ** పర్యా. చూ. సట్టరుగుంజ(1). మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల రెండు. చూ. చిత్రం 116.2 (రా. 12, 13).

**లాటుచెవు** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు నిలువుపట్టెకు పటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (రా. 12).

**లాటుతొట్టి** పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గం చట్టంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు; నేతనేసేటప్పుడు నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (రా. 12, 13).

**లాటునాడె** పర్యా. చూ. మరనాడె. ఒకరకం నాడె; మరమగ్గంది; పడుగు పైపోగులకు కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి, కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే కొయ్య నాడె; కుచ్చు గుంజినప్పుడు పడుగుపోగుల మధ్య పానుపుపట్టెమీద ఒక సొరుగులో నుంచి మరొక సొరుగులోకి పరుగెడుతుంది; చేతినాడె కంటె ఉరువు పెద్దది; దీంతో నేతసులువుగా తొందరగా అవుతుంది. చూ. చిత్రం 131 క (రా. 22).

**లాటుపట్టె** పర్యా. చూ. అడ్డకట్టె (10). నేత బయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువు రాటలకు అడ్డంగా బిగించిన కర్ర; కొన్నిచోట్ల దీనికి అచ్చుతాళ్ళు తగిలిస్తారు. చూ. చిత్రం 116.1 (రా.12).

**లాటుపంటె** పర్యా. చూ. అడ్డగుమ్మి. అడ్డంగా అమర్చిన రాటి; చూ. రాటి. చూ. చిత్రం 34 (రా.12).

**లాటుబొమ్మ** పర్యా. చూ. బొమ్మ(9). మర

మగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (రా. 12)

**లాటుమగ్గం** పర్యా. చూ. మరమగ్గం. ఒక రకం మగ్గం; నేత నేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజేది; మగ్గం పలక, పన్నె ఒక కొయ్యచట్రంలో బిగించి పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు; చూ. మగ్గం చట్టం. చూ. చిత్రం 108 (రా. 7 9,11 12,14 18, 19, 21, 24).

**లాటూచ** ఉ. లాటూస; పర్యా. కొయ్యకండె. పేకదారం చుట్టే కొయ్యపుల్ల; దీంతో చుట్టిన కండె; మరమగ్గం నాడెలో అమరుస్తారు. చూ. చిత్రం 51. చ (రా. 18).

**లాఢం** చూ. లాలం (కో. 6).

**లాడె** (కన్నడ. లాళి) ఉ. లేడి; చూ. నాడె(1). (తె. 3, 6, 7, 9).

**లాడెకొమ్ము** 1. ఉ. లాడికొమ్ము; పర్యా. చూ. నాడె (1). నేత నేసేటప్పుడు పడుగుపై పోగులకు, కిందిపోగులకు మధ్య వేసే పేకదారం కండె అమర్చిన పనిముట్టు; గేదెకొమ్ము, కొయ్య, వెదురుగొట్టం మొ. వాటితో చేస్తారు. చూ. చిత్రం 131 (రా. 16, 17). 2. చూ. నాడెకొమ్ము (1) (తె. 2; రా. 22).

**లాడెగాడి** చూ. నాడెగాడి (తె. 9).

**లాడెముక్కు** చూ. నాడెముక్కు (తె.9).

**లాడ్‌ఖానా** రూ. లాల్‌ఖానా; పర్యా. చూ. కాని (గుంజ). రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలోపాతిన పొడుగు రాట; మామూలుగా కొయ్యది; కొన్నిచోట్ల ఇనపది; మామూలుగా దీనికి శిలువ మాదిరిగా అడ్డకట్టె అమర్చి ఉంటుంది; కొన్నిచోట్ల గుంజకు చిల్లిచేసి దాంట్లో గునపందూర్చి లడీలు తగిలించి పిడుపుకర్రతో పిండుతారు. చూ. చిత్రం 282 క. 1 (తె. 5).

**లాలం** రూ. లాడం; పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 181 క. 1 (కో. 4, 6 ఎ).

**లాల్‌ఖానా** చూ. లాడ్‌ఖానా (తె. 14).

**లాల్‌రంగు** ఎరుపురంగు; రక్తవర్ణం (తె. 7).

**లాల్దువ్వు** (క్రి) గంజిపెట్టిన బెంతు(పడుగు) దారాలు సాపుచెయ్యటం; తరవాత వీటిని పన్నె గూళ్ళలో దూరుస్తారు (కో. 35).

**లావునూలు** పర్యా. చూ. ముతకనూలు. పోగు మందంగా ఉండే నూలు, 10 నుంచి 60 నెంబర్లదాకా (కో. ౬; రా. 2, 6-8, 11).

**లాహిరీ** ఉ. లాయిరి, లాయిరీ, లాహిరి; పర్యా. అల్లె, ఇరక(1), కటారి(1). ఒకవైపుకు మొనదేలిన గుర్తులు దగ్గరదగ్గరగా వరసగా వచ్చేట్టు నేసిన డిజైను. చూ. చిత్రం 149.2 (తె. 1, 4–7, 9, 15, 16, 18–20, 22, 26, 27; రా. 11, 13, 14, 17).

**లాహిరీఅంచు** ఉ. లాయిరంచు, లాయిరీఅంచు, లాహిరంచు; పర్యా. కటారిఅంచు, లాహిరీపేటు అంచు. శాకుమొన ఆకారంలో (=లాహిరీ) డిజైన్లు పడేటట్లు నేసిన అంచు; కొన్నిచోట్ల చిన్నలాహిరీలు నేస్తారు. చూ. చిత్రం 149 (తె. 4–7, 9, 15, 16, 18, 19, 22, 26, 27).

**లాహిరీకోల(లు)** ఒకరకం డిజైను (లాహిరీ) నేత కోసం మగ్గానికి అమర్చిన కర్ర(లు) (తె. 20).

**లాహిరీపేటంచు** ఉ. లాయిరీపేటంచు; పర్యా. చూ. లాహిరీఅంచు. శాకుమొన ఆకారంలో (=లాహిరీ) డిజైన్లు పడేటట్లు నేసిన అంచు; కొన్నిచోట్ల చిన్న లాహిరీలు నేస్తారు. చూ. చిత్రం 149 (రా. 13, 15).

**లాహిరీబుగిడి** ఉ. లాహిరిబుగిడి. అంచులో లాహిరీ, బుగిడి వరసగా నేసిన డిజైను (తె.7).

**లాహిరీవడి** అంచునేతలో లాయిరీ డిజైను పడేటట్లు అమర్చుకొన్న పేటువడి; చూ. వడి (తె.20).

**లింకు** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర (ఇనప) ఊచ; దీన్ని మామూలుగా మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల గిరక, కొండి కూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (రా. 2).

**లింగంకాయ** (< ? లింగంకొయ్య) పర్యా. చూ. నాగవాసం. గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పై కట్టె; మామూలుగా వంపుగా ఉంటుంది. చూ. చిత్రం 316.3 (తె. 22బి).

**లింగడుకమ్మి** 1. చీరకొంగులో మామూలుగా నేసిన పట్టె; రంగడుకమ్మిలో గీరలు పెట్టి నేస్తారు (కో. 7); 2. పైటకొంగులో రెండంగుళాల వెడల్పు పట్టెకు రెండువైపులా సన్నిటిగీరలు, ఎడమవైపున అరంగుళంవరకూ విడిచి తరవాత మూడుగీరలు పడేట్లు నేసిన కమ్మి (కో. 9, 10; తె. 4).

**లింగబలిజవాళ్ళు** ఉ. లింగబలిజోళ్ళు. నేతపని చేసే దేవాంగుల దగ్గర అడుక్కొనే ఒక జాతివారు (కో. 3).

**లింగాలమండపం** చిటికెనేతలో నేసిన ఒకరకం (చీర)అంచు డిజైను. చూ. చిత్రం 258 (తె. 10).

**లింగాస్త్రం** చిన్న అంగవస్త్రం; లింగవస్త్రం (కో. 18).

**లింగోస్త్రం** లింగబలిజె (ఒకతెగ)లు కట్టుకొనే ఒకరకం బట్ట; లింగవస్త్రం (రా. 13).

**లిల్లికప్పు** తూటిపువ్వు (=ఒకరకం లేత ఎరుపు) రంగు (కో. 11, 35).

**లివరు** పర్యా. చూ. కమాను(3). మరినాడె గాడిలో ముల్లుకు గుచ్చిన కొయ్య కండెఊచ ఊడి పోకుండా బిగించిన ఇత్తడిరేకు. చూ. చిత్రం 131 త. 2 (రా. 13, 23).

**లీలావతి** ఒకరకం పచ్చరంగు; సరస్వతి పచ్చ (మాదిరిది) (కో. 2. 35).

**లీలావతి(చీర)** ఒకరకం పచ్చరంగు చీర; సరస్వతి పచ్చ మాదిరిది (కో. 2. 35).

**లుంగ** నూలులెక్క : **1.** నాలుగులడీల నూలు (రా. 5); **2.** రెండులడీల నూలు(11); **3.** నూలుచుట్ట; లెంక (తె. 12).

**లుంగీ** **1.** పర్యా. అడ్డకట్టుపంచె, అడ్డపంచె, గూడకట్టుపంచె, లుంగీపంచె. మగవాళ్ళు నడుముకు చుట్టుకొనే బట్ట; 2-4 గజాల పొడుగు నేస్తారు; మామూలుగా తెలుపులో నేసి రంగులో అంచులు, కమ్ములు పెడతారు; కొన్నిచోట్ల రంగుల్లోను, డిజైన్లలోను, గళ్ళలోను గీరల్లోను నేస్తారు (కో. 11, 13-16,18,22,23,31-34,36; తె. 18, 23; రా. 13); **2.** తురకలు నడుముకు చుట్టుకొనే ఒకరకం లుంగీ; 40,60 నెంబర్ల నూలుతో నేస్తారు (కో. 2; రా. 16).

**లుంగీచీర** **1.** తురకల లుంగీల గళ్ళ మాదిరిగా ఒక్కొక్క చదరపుఅంగుళం గళ్ళు పడేట్లు నేసిన చీర (కో. 7); **2.** అడ్డంగా ఎర్రనామ్దారీ మాదిరిగా డిజైను వచ్చేట్టు నేసిన చీర (రా. 16).

**లుంగీపంచె** పర్యా. చూ. లుంగీ(1). మగవాళ్ళు నడుముకు చుట్టుకొనే బట్ట; 2-4 గజాల పొడుగు నేస్తారు; మామూలుగా తెలుపు నేసి రంగులో అంచులు, కమ్ములు పెడతారు; కొన్నిచోట్ల రంగుల్లోను, డిజైన్లలోను, గళ్ళలోను, గీరల్లోను నేస్తారు. (కో. 16).

**లుయి** పట్టుదారం లెక్క : నూరుపోగుల పడుగు నూలు (రా. 14).

**లెక్కాచారం** లెక్కచూసుకొనే (=కొలుచుకొనే) పద్ధతి; ఏరంగు ఎంత వెయ్యాలో కొలుచుకొని వేస్తారు (రా. 5).

**లెంక** **1.** రెండులడీల నూలుకట్ట (తె. 11); **2.** రెండు చిలపలనూలు (తె. 17); **3.** నూలుచుట్ట; లుంగ (తె. 12); **4.** నూలుచిలప (తె. 17).

**లెంకెలుకట్టు** (క్రి.) పడుగుచివరపొట్టె ముడులు వెయ్యటం (తె. 10).

**లెమను** ఉ. లెమెన్. **1.** పచ్చిపసుపు రంగు; తిరుచూర్ణంపచ్చ (కో. 7, 9 B); **2.** పసుప్పచ్చరంగు. చూ. చిత్రం 238 (కో. 3,11,14,24,26,35,36); **3.** నింబావళికి, కొద్దితేడాలో ఉండేరంగు (రా. 15).

**లెమనుచీర** పసుప్పచ్చరంగు చీర (కో. 7).

**లేతగులాబి** గులాబిరంగులో తేలికవన్నె; ఎర్రఉల్లిగడ్డరంగు (కో. 35; తె. 4).

**లేతనీలం** తేలిక నీలంరంగు; సెమీబ్లూ (కో. 35).

**లేతపచ్చ** పర్యా. తేలికపచ్చ. అరటైకు (మాదిరి లేత ఆకుపచ్చ) రంగు (రా. 22).

**లేసుకాయలచీర** ఒకరకం డిజైనులో నేసిన చీర (రా. 19బి).

**లేసుపేటు** అంచులోనేసే ఒకరకం డిజైను. చూ. చిత్రం 246 (రా. 22).

**లైక** **1.** చూ. లాక(2). దేవాంగులవాడుక (కో. 1, 3, 7, 12; తె. 2, 6, 21, 22); **2.** చూ. లాక(5) (కో. 1, 3, 7; తె. 6, 21, 22).

**లైకతట్టు** (క్రి.) చూ. లాకతట్టు (కో. 3).

**లైకతొడుగు** పర్యా. చూ. లాకకుట్టు(1). పడుగులో అడ్డబద్ద దూర్చటం; దేవాంగుల వాడుక (కో. 7).

**లైకబద్ద** చూ. లాకబద్ద(3) (కో. 12).

**లైటిష్‌డాబీ** పర్యా. చూ. గొలుసుపింజెర. ఒకరకం డాబీ; సన్నబద్దల గొలుసు దిండుకు తగిలించింది; lattice=తడిక. చూ. చిత్రం 132 త (కో. 7).

**లైట్‌కనకాంబరం** ఒకరకం లేత ఎరుపురంగు; లేత కనకాంబరం రంగు (రా. 8).

**లైట్‌చిలకపచ్చ** ఉ. లైట్‌సిలకపచ్చ. లేత చిలకాకుపచ్చరంగు (రా. 15).

**లైట్‌తార** బాగా లేతగా ఉండే నీలంరంగు(కో. 2).

**లైట్‌నూర్జహాను** ఒకరకం ఆకుపచ్చ(=అరిటైకు పచ్చలో బాగా లేత)రంగు (కో. 2).

**లైట్‌పవలం** పవళం(=ఒకరకం నీలం)రంగు కంటె బాగా లేతరంగు. (రా. 11).

**లైట్‌బ్రౌన్** లేత గోధుమరంగు. చూ. చిత్రం (కో. 2).

**లైట్‌వైలేటు** క్రోటనురంగు.

**లైట్‌సీత** ఒకరకం లేత ఆకుపచ్చరంగు; లేత కాఫీ రంగు మాదిరిది. చూ. చిత్రం (కో. 2).

**లైనుఖల్ల** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (కో. 27, 28, 31).

**లైనంచు** వంకీలువంకీలుగా జరీ పెట్టి నేసిన అంచు. చూ. చిత్రం 246 (తె. 4, 5, 11).

**లొండకొయ్య** పర్యా. చూ. పన్ను(2). దోనె గాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (తె. 29).

**లొద్దు 1.** ?ప్రాంతం (కో. 21); **2.** మామూలుగా నేసిన దుప్పటి (తె. 24).

**లోఅంచు** పర్యా. అంచుకోపు, దాపు(2) మూటం. అంచులో పడుగువైపు భాగం. చూ. చిత్రం 148.1 (కో. 4).

**లోగోల** మగ్గంమీది ఉన్నిపడుగులో జంత్రానికి పండ్లకట్టెకు మధ్య ఎక్కించిన కర్ర. చూ. చిత్రం 315.8 (తె. 3, 6, 9).

**లోటా 1.** పర్యా. చూ. డబ్బా(1). పంకెకు బదులు నూలు చుట్టుకొనే రేకుడబ్బా; కొన్నిచోట్ల రేకుపట్టెలు బిగించింది; కొన్నిచోట్ల కొయ్యది. చూ. చిత్రం 30 (కో. 8, 9); **2.** రంగు కొలుచుకొనే చిన్నపాత్ర; సుమారు అయిదుతులాలు పట్టేది. చూ. చిత్రం 282 ప. 1 (కో. 6, 12-14).

**లోపలికొంగు** పర్యా. చూ. కట్టుచెరగు. చీరకట్టు కొనేటప్పుడు లోపల నడుముకు చుట్టుకొనే చెరగు; మామూలుగా డిజైన్లు లేకుండా చిన్నది నేస్తారు (తె. 2, 6).

**లోలకుపేటు** ఉ. -ప్లేటు. అంచులో చెవిలోలకుల మాదిరి నేసిన ఒకరకం డిజైను (కో. 11).

**లోలకులంచు** చెవిలోలకు మాదిరి డిజైను పెట్టి నేసిన అంచు (తె. 5).

**లోలకులబేలు** ఉ. లోలోకుల-. చెవిలోలకు(=ఒక రకం కర్ణాభరణం) మాదిరి నేతడిజైను (తె. 21).

## వ

**వక్క** ఉ. ఒక్క. నూలులెక్క: లడీలో సగం నూలు (తె. 26, 27).

**వక్కచాయ** ఉ. వక్కసాయి; పర్యా. చూ. వక్క రంగు(1). నల్లపోకచెక్క(=పీకివక్క)రంగు (కో. 2,4; రా. 10).

**వక్కచాయచీర** ఉ. వక్కసాయిచీర. కెంపుమీద నలుపువన్నెలో ఉండే రంగు చీర (రా. 10).

**వక్క(రంగు) 1.** ఉ. ఒక్కరంగు; పర్యా. వక్క చాయ, వక్కాకలరు(1). నల్లపోక చెక్క (=పీకివక్క) రంగు (కో. 21; రా. 1, 3,5,6, 11,12, 14, 15, 17, 19, 20, 22, 24). **2.** చేకిలేటురంగు. (కో. 7); **3.** ఒకరకం నలుపు వన్నె (కో. 16); **4.** కాఫీపొడి మాదిరి రంగు (కో. 18).

**వక్కాకలరు** పర్యా. చూ. వక్కరంగు (1). నల్ల పోకచెక్క (=పీకివక్క) రంగు (రా. 23).

**వగరుతీయు** (క్రి.) చింతగింజలు రోట్లోదంచి పై పొట్టు తియ్యటం (తె. 10).

**వగురుతీయు** (క్రి.) రంగు అద్దిన తరవాత నూలు ఉతికి పిండటం (తె. 10).

**వగ్గీలకమ్మి** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు ఇది మగ్గంపందిరి మీద అటూఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.3 (కో. 21).

**వంకతిప్పినకోక** ఉ. ఒంకతిప్పినకోక. ఒకరకం నేతచీర (రా. 19ఎ).

**వంకరపేటు** ఉ. ఒంకరపేటి. చూ. వంకిపేటు (రా. 16).

**వంకరపేటంచు** ఉ. ఒంకరపేటి-. రూ. వంకిపేటంచు (రా. 16).

**వంకాయముంగి** ? వంకాయ రంగు దారంతో నేసిన చిన్నగడి (తె. 22).

**వంకాయ(రంగు)** నీటివంకాయరంగు; నలుపులో ఊదా; కొన్నిచోట్ల మానుగాయరంగులో నూటికి పదిపాళ్ళవరకూ ఎరుపుండేది; వయొలెట్ ఆర్.ఆర్.తో వచ్చే రంగు (కో. 8,9,11,14,16; తె. 1,4,10,18,20, 22,28,30).

**వంకి** ఉ. ఒంకి; రూ. వంకెర; పర్యా. చూ. వంకి పేటు. బుజానికి పెట్టుకొనే వంకి మాదిరిగా అంచులో నేసిన డిజైను; కొన్నిచోట్ల రంపంపళ్ళ మాదిరిగా వంకరగీర పడేట్టు నేస్తారు. చూ. చిత్రం 246 (కో. 7, 10).

**వంకిపేటంచు** ఉ. ఒంకిపేటంచు, వంకివేటంచు; రూ. వంకరపేటంచు; పర్యా. వంకిబోర్డరు. బుజానికి పెట్టుకొనే వంకిమాదిరి డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 246 (తె. 1; రా. 11, 14).

**వంకిపేటు** ఉ. ఒంకిపేటు, వంకపేటి; రూ. వంకర

పేటు; పర్యా. వంకి. బుజానికి పెట్టుకొనే వంకి మాదిరిగా అంచులో నేసిన డిజైను; కొన్నిచోట్ల రంపంపళ్ళ మాదిరిగా వంకరగీర పడేట్టు నేస్తారు. చూ. చిత్రం 246 (తె. 1; రా. 11, 14).

**వంకిబోర్డరు** పర్యా. వంకిపేటంచు. బుజానికి పెట్టుకొనే వంకి మాదిరి డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 246 (రా. 24).

**వంకి** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ; దీన్ని మామూలుగా మగ్గం పై దండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల గిటక, కొండి కూడా కడతారు. చూ. చిత్రం 121 క.9 (కో. 17).

**వంకె** రంగునీళ్ళలో ఉడకబెట్టటానికి నూలు లడీలు తగిలించిన ఇనపఊచ; దీన్ని పట్టుకోటానికి వీలుగా రెండువైపులా వంపులు ఉంటాయి; దీంతో లడీలు రంగునీళ్ళలోకి దించి అండాఅంచులమీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (కో. 9, 14).

**వంకెండ్లకొంకి** ఉ. అంకెండ్లకొంకి. ఊడై ఆడ్డపట్టెకు గాని నరిగుంజల ఆడకట్టెకుగాని తగిలించే ఇనపకొక్కెం. చూ. చిత్రం 63 గ. 1 (తె. 31).

**వంకెండ్లకొండె** ఉ. అంకెండ్లకొండి. ? పడుగు బిగింపుకోసం పడుగేరుకర్రకు తగిలించే ఇనపకొక్కెల గొలుసు; చూ. వంకెన (తె. 31).

**వంకెన** ఉ. అంకెన; పర్యా. అడ్డగొలుసు, తిరుగుడు (2). పడుగు బిగింపుకోసం పడుగేరుకర్రకు తగిలించే ఇనపకొక్కెల గొలుసు. చూ. చిత్రం 70 ట, త (తె. 17, 26, 30).

**వంకెనకడియం** ఉ. వంకెనకడెం; పర్యా. ఉంగరం (6). వంకెన (=పడుగేరుకర్ర బిగింపుకోసం తగిలించే ఇనపకొక్కెల పనిముట్టు) కు వేసిన ఇనపచుట్టు. చూ. చిత్రం 70 క. 1 (తె. 17).

**వంకెం** పర్యా. చూ. కొంకి(1). ఊడైతాడు తగిలించి బిర్రుపెట్టే పంగలకొయ్య; కొన్నిచోట్ల దుప్పికొమ్ము వాడతారు. చూ. చిత్రం 63 క. 6(కో. 7ఎ).

**వంకెర** చూ. వంకి (రా. 13).

**వంగ(పండు)రంగు** ఒకరకం పసుపురంగు (కో. 21, 35).

**వంగపూచీర** లేత వయిలెట్ రంగు నూలుపెట్టి నేసిన చీర (కో. 32).

**వంగపూరంగు** ఉ. వంగపువ్వురంగు; పర్యా. కత్రీపూవన్నె. ? లేత మబ్బురంగు (కో. 14, 32).

**వజను** (బహు. వజండ్లు). పర్యా. చూ. తూకం. పేటువడికి కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపవుల్లు; కొన్నిచోట్ల సత్తుది; నేతనేసేటప్పుడు అని మూసిన తరవాత వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి రెండుపక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 1.2 చ. 15 (తె. 18, 19, 20, 22-24, 29, 31).

**వజాఉరి** వజానేత నేసే మగ్గంలో అంచుపడుగు పోగులను పైకి ఎత్తటానికి దొడ్డితాడుకు చివర తగిలించిన వడిదారం; ఇటువంటివి వరసగా ఉంటాయి. చూ. చిత్రం 134 చ. 12 (కో. 37).

**వజాకట్టు** (క్రి.) ఉ. వజ్రెకట్టు. అంచులో ఒకరకం (కుప్పడం) నేత నెయ్యటానికి డిజైను వేసుకోటం; అంచుల్లో వేరేరంగు పేకపోగులు మలుపుతూ నేస్తారు (కో. 23).

**వజాకమ్మి** ఒకరకం డిజైనునేత (=వజానేత)లో నేసినకమ్మి (కో. 36).

**వజాకర్ర(లు)** ఉ. వజ్రెకర్లు. అంచుల్లో నేసే ఒకరకం కుప్పడండిజైన్లు పడటానికి అచ్చు దగ్గరపెట్టిన కర్ర (లు); కొన్నిచోట్ల ఇటువంటివి ఎనిమిది ఉంటాయి; నేతనేసేటప్పుడు వీటిని లేపుతూ దించుతూ ఉంటారు (కో. 23, 27).

**వజాకుప్పడం** 1. ఒకరకం కుప్పడంనేత; చూ. కుప్పడం (కో. 34); 2. రూ. కుప్పడంవజా. ఒకరకం కుప్పడంనేత; చీరఅంచులో (తామర) పువ్వులు పడేట్లు వేరేరంగు పోగులు మలిపి నేసిన డిజైను (నేత) (కో. 34, 36).

**వజాచీర** అంచులో డిజైన్లు పడేటట్టు వజానేతలో నేసిన చీర (కో. 34, 37).

**వజాజముదాని** ఉ.-జందాని. 1. ఒకరకం జముదాని నేత; అంచులకు డిజైన్లుపెట్టి మధ్యభాగంలో పువ్వులు పడేటట్టు పోగులు మలుపుతూ నేస్తారు (కో. 34); 2. ఒకరకం డిజైనునేత; చిలక, ఏనుగు మొ. నమూనాల్లో డిజైన్లు నేస్తారు; అంచులకు డిజైన్లుపెట్టి మధ్యభాగంలో పువ్వులు పడేటట్టు నేస్తారు (కో. 34).

**వజా(నేత)** ఉ. వజ, వజ్రె. ఒకరకం డిజైనునేత; మగ్గానికి పైన దొడ్డి అమర్చి నేస్తారు; అంచులో పువ్వులు, చెక్రాలు సమంగా నేసిన డిజైనునేత; దొడ్డినేత. చూ. చిత్రం 134 (కో. 23, 33, 34, 37).

**వంచుకుంచె** (-వేయు) ఉ. ఒంచుకుంచి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబదునులో ఉండగా సందు (=రెండు కచ్చుల మధ్యభాగం) సందుకూ రెండు మూడుసార్లు కుంచె ఆపుతూ నిదానంగా దువ్వటం (కో. 23).

**వట్టిపువ్వావు** ఎండినపొగాకు రంగు; రెడ్ ఆర్.సి.,

తేజాపు, నైట్రేట్ సల్ఫ్‌వేసి (ఇక్కడికి నింబోలిరంగు వస్తుంది) తరవాత కాకి 2 జి. 800 కాస్టిక్‌సోడా, హైడ్రోసల్ఫ్‌వేసి తయారుచేస్తారు (తె. 5).

**వడపోయు** (క్రి.) సరిచేసి చుట్టిన ఉన్నిపడుగు (=వలెం) అచ్చుకోలకు వెయ్యటం (తె. 22).

**వడి** ఉ. అడి, ఒడి, వొడి. **1.** పర్యా. చూ. పురి (1). రాట్నం ఆకుల తాడును, కదురును కలిపే గట్టి దారం; దీనివల్ల కదురు తిరుగుతుంది. చూ. చిత్రం 15.6(కో.1-7, 9, 10, 14, 26, 28-31, 33, 34, 36 37; రా. 4-18, 20-22, 24); **2.** పర్యా. చూ. వడిదారం(2). డబ్బాచక్రాన్ని గంటాన్ని కలిపే గట్టి దారం; దీనివల్ల గంటం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క.8 (రా. 20); **3.** (-పెట్టు) పర్యా. చూ. పురి (2). దారపుపోగు మెలిదిరగగా వచ్చిన గట్టిదనం (తె. 6, 16); **4.** (-అతుకు,-కట్టు) పర్యా. చూ. అచ్చు (1). నేతనేసేటప్పుడు పడుగులో పైపోగులను కిందికీ కిందిపోగులను పైకీ జరపటానికి వీలుగా నాలుగు కర్రలకు వడిదారాలతో లంకెలు వేసిన పనిముట్టు; పన్నెగూళ్ళలో దూర్చిన పోగులు అచ్చువడుల కోలు కుల్లోకి ఎక్కిస్తారు; నేతనేసేటప్పుడు ఒక పావుచెక్కను కాలితో తొక్కితే అచ్చులో ఒకవైపు కిందికిదిగి అని పోగులు విచ్చుకొంటాయి; కాలుతియ్యగానే అచ్చు మామూలుగా వచ్చి అనిపోగులు మూసుకొంటాయి. చూ. చిత్రం 100 (కో. 37; తె. 24); **5.** (-కట్టు,-పొందేయు) పర్యా. అచ్చువడి, వడికట్టు (2). అచ్చు కట్టేటప్పుడు రెండుఅచ్చుకర్రలకు కట్టిన పురిదారాలకు లంకెపడేటట్టు వేసిన అల్లిక; నేతనేసేటప్పుడు పడుగులో అనిపోగులను పైకిలేపటానికి కిందికి దింపటానికి పనికి వస్తుంది. చూ. చిత్రం 100·2 (కో. 1-12, 17, 23-27; తె. 5, 7-16, 18, 29, 32, 33; రా. 1-24); **6.** పర్యా. ఉరి, జాలి (వడి), పింజెరజాలి, పూస(7), పేటువడి, వైలు. పేటుదారానికి చివరకట్టిన పురిదారం; మామూలుగా మైనంపూసింది; కొన్నిచోట్ల ఇనపతీగ; దీనికి మధ్య బెజ్జంచేసిన చిన్న (ఇనప) బిళ్ళ ఉంటుంది; డాబీ కోలలు పైకిలేచినప్పుడు ఇవి అంచుపోగులను లేపు తాయి. చూ. చిత్రం 132 చ. 12 (కో. 1, 6, 7, 10, 20, 23-26; తె. 5, 18, 19, 25; రా. 11, 13-15, 23, 24); **7.** పర్యా. అని (3), ఉచ్చు. నవారుమగ్గం కట్టుబడిలో పైపట్టెకు కింద బిగించిన కర్రకు అల్లిన పురిదారం; ఇటువంటివి కర్రపొడుగునా ఉంటాయి. చూ. చిత్రం 324.2 (తె. 12); **8.** పర్యా. చూ. పూస(7). పేటుదారానికి చివరకట్టిన పురిదారంలో అంచుపోగు దూర్చేసందు (=సన్నబెజ్జం); కొన్నిచోట్ల బెజ్జంవేసిన చిన్నఇనపబిళ్ళ. చూ. చిత్రం 132 చ. 14 (రా. 16 17).

**వడిఅతుకు** (క్రి.) ఉ. అడిఅతుకు; పర్యా. చూ. అచ్చతుకు. బద్దెపోగులకు పడుగుపోగులు కలిపి వడి పెట్టటం (తె. 24).

**వడికట్టు** ఉ. అడికట్టు, ఒడికట్టు. **1.** (క్రి.) అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్రలకు పురిదారం కట్టటం; లంకె పడేటట్లు అల్లటం (తె. 12); **2.** (-కట్టు) పర్యా. చూ. వడి (5). అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రలకు కట్టిన పురిదారాలకు లంకెపడేటట్లు వేసిన అల్లిక; నేతనేసేటప్పుడు అనిపోగులను పైకిలాగటానికి, కిందికి దింపటానికి పనికివస్తుంది. చూ. చిత్రం 100.2 (కో. 8, 18, 19, 22; తె. 25, 30, 31).

**వడికట్టుజరుపు** (క్రి.) ఉ. అడికట్టుజరుపు. అచ్చతికిన పడుగులో అతుకుపోగులు అచ్చులో నుంచి పన్నె ఇవతలికి జరపటం (తె. 22, 30).

**వడికట్టుబద్ద** ఉ. అడికట్టబద్ద. అచ్చుకట్టేటప్పుడు వడిదారాల లంకెల్లో దూర్చినబద్ద; వడికట్టును సరిచెయ్యటానికి వాడతారు (తె. 31).

**వడికత్తెర** ఉ. అడికత్తెర; పర్యా. చూ. కొలికి(3). అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె; నేతనేసేటప్పుడు పడుగుపోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ లంకెల్లోనుంచి బెంతు పోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (తె.24).

**వడికెపీట** ఉ. అడికెపీట; పర్యా. చూ. దాకెపీట (2). ఉన్ని వడికేటప్పుడు ఆడవాళ్ళు కూర్చోటానికి వేసుకొనేపీట. చూ. చిత్రం 308.2 (తె. 25).

**వడికొలికి** ఉ. ఒడికొలికె; పర్యా. చూ. కొలికి(3). అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె; నేతనేసేటప్పుడు పడుగు పోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ లంకెలోనుంచి బెంతు పోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (రా. 14, 15).

**వడికోల** ఉ. అడికోల; పర్యా. చూ. అచ్చుకర్ర(1). అచ్చులో వడిదారం కట్టిన కర్ర; అచ్చుకట్టేటప్పుడు దీన్ని జంత్రంకొయ్యలకు బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; బోనచ్చుకు ఎనిమిది ఉంటాయి. చూ. చిత్రాలు 91 క. 7, 100.1, 121, క. 8(తె. 24, 31).

**వడిగర్ర** ఉ. వడికర్ర; పర్యా. చూ. అచ్చుకర్ర(1). అచ్చులో వడిదారం కట్టిన కర్ర; అచ్చుకట్టేటప్పుడు దీన్ని జంత్రంకొయ్యలకు బిగిస్తారు; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; బోనచ్చుకు ఎనిమిది

ఉంటాయి. చూ. చిత్రాలు 91 క. 7, 100.1, 121 క. 8 (కో. 23, 27, 28, 37).

**వడిగిరక** ఉ. వడిగిర్క; పర్యా. చూ. దారపుబండి (2). మిషను వడిదారం (=అచ్చువడి కట్టేది) చుట్టిన కొయ్యగిలక చూ. చిత్రం 95.1 (తె. 5).

**వడిగుది** ఉ. అడిగుది; పర్యా. చూ. అచ్చుగుది (1). అచ్చుకర్రకు పైన కట్టినదారం; సుమారు జానెడు పొడుగుది; ఇటువంటివి కర్రకు రెండేసి కడతారు; అచ్చును మగ్గానికి అమర్చటానికి వీటితో వేలాడదీస్తారు; కిందిగుదులు అడుగర్రల తాళ్ళకు కడతారు. చూ. చిత్రాలు 91 క. 8, 100. 9, 100. 11, 121 క. 6 (కో. 37; తె. 24, 31).

**వడిగూడు** పర్యా. చూ. కొలికి (3). అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన అంకె; దీంట్లోంచి బెంతుపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు పడుగుపోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ అంకెల్లోంచి దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (తె. 31).

**వడితాడు** ఉ. ఒడితాడు, వడిదాడు; **1.** పర్యా. చూ. పురి (1). రాట్నం ఆకులతాడును, కదురును కలిపే గట్టిదారం. దీనివల్ల కదురు తిరుగుతుంది. చూ. చిత్రం 15.6 (కో. 7, 36, 37); **2.** పర్యా. చూ. వడిదారం (2) డబ్బారాట్నం చెక్రాన్ని గంటాన్ని కలిపే గట్టిదారం; దీనివల్ల గంటం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 8 (కో. 36); **3.** పర్యా. చూ. వడి (దారం)(3). అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల మిషనురీలు (=దారబ్బండి) దారం వాడతారు. మొదట అచ్చుబిళ్ళకు చుట్టి, తరవాత కర్రకు దూరుస్తారు; చూ. వడి (తె. 12); **4.** పర్యా. చూ. కొండితాడు. అచ్చు కట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన లావుదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 2; రా. 1); **5.** వజా నేతనేసేమగ్గంలో అంచుపడుగు పోగులను పైకి ఎత్తటానికి దొడ్డితాడుకు చివర తగిలించిన గట్టి పురిదారం; కొన్నిచోట్ల దీనికి పూసలు వేస్తారు, చూ. చిత్రం 134 చ. 12 (కో. 37).

**వడి(దారం)** ఉ. ఒడిదారం. **1.** పర్యా. చూ. పురి (1). రాట్నం ఆకులతాడును, కదురును కలిపే గట్టిదారం. దీనివల్ల కదురు తిరుగుతుంది. చూ. చిత్రం 15.6 (కో. 1-7, 9, 10, 14, 26, 28-31, 33, 34; రా. 4-18, 20-22, 24); **2.** పర్యా. డబ్బాలదారం, తాడు(4), దారం (4), పురిదారం(2), వడి(2), వడితాడు(2). డబ్బారాట్నం చెక్రాన్ని గంటాన్ని కలిపే గట్టిదారం; దీనివల్ల గంటం తిరుగుతుంది. చూ. చిత్రం 41 క. 8 (కో. 2 3,7,9.10; రా. 5-11); **3.** పర్యా. అచ్చుగట్టుదారం, తాడు(7). ధాగా, పురిదారం(3), బండిదారం, బిళ్ళదారం, రీలు(దారం), రీలువడి, వడితాడు(3) వడిపోగు(లు), వడిబద్దె, వడిసరి. అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల మిషను రీలుదారం వాడతారు; మొదట అచ్చుబిళ్ళకు చుట్టి తరవాత కర్రకు దూరుస్తారు. (కో. 1, 4, 6, 7, 12-15, 24, 37; తె. 11, 13-16, 28; రా. 23); **4.** పర్యా. చూ. కొండితాడు, అచ్చుకట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం; దీన్ని అచ్చుకదురుతో దూరుస్తారు. చూ. చిత్రం 100.5 (కో. 12; రా. 5, 6, 8, 10-14, 16, 18, 22, 24); **5.** పర్యా. అచ్చుదారం (2), అచ్చుపోగు(3), దండెపోగు(2). ఉన్నిపడుగు మీద అచ్చుకోలకు అనులు వేస్తూ అల్లిన లావుపాటి పోగులు; మామూలు పోగులు ఏడేసి కలిపి పురిపెడతారు. (తె. 26).

**వడిదిప్పు** (క్రి.) అచ్చుకట్టేటప్పుడు అచ్చుబిళ్ళకు వడిదారం చుట్టి కట్టటం (కో. 27).

**వడినూలు** చూ. వడుకునూలు (తె. 26).

**వడిపుల్ల** **1.** పర్యా. చూ. బెంతికదురు. అచ్చుకట్టేటప్పుడు పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల; మామూలుగా ఇనపది(కంటాణీలాంటిది); దీనికి సూదిగా ఉన్న వైపు పోగుదూర్చటానికి చిన్న కొక్కెం ఉంటుంది; కొన్నిచోట్ల రెండో వైపున పిడి ఉంటుంది. చూ. చిత్రం 94 (కో. 35); **2.** పర్యా. అచ్చుపుల్ల(3). అచ్చుకట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో కొండితాడుకు బదులు దూర్చిన సన్నపుల్ల; మామూలుగా కొబ్బరిఈనె దూరుస్తారు; చూ. కొండితాడు (కో. 37).

**వడిపోగు(లు)** పర్యా. చూ. వడి(దారం)(3). అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల మిషను రీలు దారం వాడతారు; మొదట అచ్చుబిళ్ళకు చుట్టి తరవాత కర్రకు దూరుస్తారు (తె. 15).

**వడిబండి** ఉ. ఒడిబండి; పర్యా. చూ. దిండు(4). గంటానికి బిగించిన రీలు దారపు బండి; డబ్బారాట్నం వడిదారం దీని గాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క. 13 (రా. 5).

**వడిబద్దె** ఉ. అడిబద్దె; పర్యా. చూ. వడి(దారం) (3). అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం;

కొన్నిచోట్ల మిషను రీలు(=దారపుబండి)దారం వాడతారు; మొదట అచ్చుబిళ్ళకు చుట్టి తరవాత కర్రకు దూరుస్తారు; చూ. వడి (తె. 32).

**వడిబిళ్ళ** ఉ. ఒడిబిల్ల, ఒడిబిళ్ళ. **1.** పర్యా. చూ. దిండు(4). గంటానికి బిగించిన రీలుదారపు బండి; దబ్బా రాట్నం వడిదారం దీని గాడిలో తిరుగుతూ గంటాన్ని తిప్పుతుంది. చూ. చిత్రం 41 క. 13 (రా. 11); **2.** పర్యా. చూ. అచ్చుబిళ్ళ. అచ్చుకట్టేటప్పుడు వడిదారం చుట్టే కొయ్య; దీనికి చుట్టిన వడిదారం అచ్చుకర్రలకు దూరుస్తారు. చూ. చిత్రం 92 (కో. 8); **3.** పర్యా. చిరత(3), చిల్ల(4), తీర్పుబిళ్ళ, నాకలి పిరకం. బిగింపుచిల్ల, బిగు, బిగుచెక్క, బిగుబిళ్ళ, బిగు(వు)బద్ద (1), బిరుచెక్క, బిళ్ళ(11). అచ్చుకట్టేప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రాపటానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క(లు); ఒకవైపు వెడల్పుగాను ఒకవైపు సన్నగాను ఉండేది; అచ్చుకట్టిన తరవాత దీంతో వడిదారాలు దిద్దుతారు; ఇటువంటివి ఎనిమిది, తొమ్మిది ఉంటాయి; మామూలుగా శేకిచెక్కతో చేస్తారు. చూ. చిత్రం 93 (రా. 11, 23).

**వడిమెలికె** ఉ. ఒడిమెలికి; పర్యా. చూ. కొలికి(3). అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె; నేత నేసేటప్పుడు పడుగుపోగులను పైకి లేపటానికి, కిందికి దింపటానికి ఈ లంకెల్లోనుంచి కొంతు పోగులు దూరుస్తారు. చూ. చిత్రం 100.3 (రా. 6).

**వడిసంచి** రైతులు విత్తనాలు పోసుకోటానికి వాడే సంచి; నవారు పట్టాతో తయారు చేసింది; కొంతమంది ఇటువంటి సంచిలో డబ్బుపోసి భద్రతకోసం నడుముకు చుట్టుకొంటారు (తె. 6).

**వడిసరి** పర్యా. చూ. వడి(దారం)(3). అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం; కొన్నిచోట్ల మిషను రీలు(=దారబ్బండి)దారం వాడతారు. మొదట అచ్చుబిళ్ళకు చుట్టి తరవాత కర్రకు దూరుస్తారు; చూ. వడి (తె. 17).

**వడిసూత్రం** ఉ.ఒడిచూత్త్రం,వడిసూత్త్రం.;పర్యా. చూ. అచ్చుసూత్రం(2). అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు; దీనికి కొన్నిచోట్ల కోతిపుల్ల కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 గ. 1 (తె. 31; రా. 12).

**వడుకు** (క్రి.) ఉ. అడుకు, ఒడుకు. రాట్నంమీద కాని చేతికదురు మీదకాని ఏకునుంచి దారం తియ్యటం (కో. 1-10, 16-20, 33, 34, 36, 37; తె. 2, 3, 5-13, 15-17, 20, 22, 25-28, 30; రా. 7, 12, 13, 15-18, 23, 24).

**వడుకుకట్టె** ఉ. ఒడుక్కట్టె. వడకటానికి నారకట్టిన కర్ర; పొడుగ్గా ఉంటుంది; దీన్నించి ఒక్కొక్కపోచ తీసుకొని వడుకుతారు. చూ. చిత్రం 299 (తె. 25).

**వడుకుడుకండె** ఉ. ఒడుకుడుకండి. రాట్నం మీద వడికి చుట్టిన నూలు (కో. 7).

**వడుకుడుకొమ్ము** పర్యా. పూన్పు. దసలిదారం వడికే కొయ్యపనిముట్టు; చూ. చిత్రం 292 (తె. 7).

**వడుకుడుదారం** ఉ. ఒడుకుడుదారం; పర్యా. చూ. పురి(1). రాట్నం ఆకుల తాడును, కదురును కలిపే గట్టిదారం; దీనివల్ల కదురు తిరుగుతుంది. చూ. చిత్రం 15.6 (రా. 7).

**వడుకుడుపీట** పర్యా. చూ. దాకెపీట. ఉన్ని వడికేటప్పుడు (ఆడవాళ్ళు) కూర్చోటానికి వేసుకొనే పీట. చూ. చిత్రం 308.2 (తె. 7, 9).

**వడుకుడునూలు** ఉ. ఒడుకునూలు; చూ. వడుకునూలు (కో. 4; రా. 15).

**వడుకుడురాట్నం** ఉ. ఒడుకుడురాట్నం; చూ. వడుకురాటం (తె. 12).

**వడుకునూలు** రూ. వడినూలు, వడుకుడునూలు. రాట్నం మీద గాని చేతికదురు మీద గాని వడికిన నూలు (కో. 11, 13-16, 18-20, 36; రా. 23).

**వడుకురాటం** ఉ. ఒడుకురాటం; చూ. వడుకు రాట్నం (కో. 6).

**వడుకురాట్నం** ఉ. ఒడుకురాట్నం; రూ. వడుకు రాటం, వడుకుడురాట్నం. నూలుతీసే రాట్నం; చూ. రాట్నం. చూ. చిత్రం 15 (కో. 34, 36, 37).

**వడులురాల్చు** (క్రి.) అచ్చులో అంచుబద్దె పోగులు వడులగుండా పన్నె ఇవతలకు తియ్యటం (కో. 22).

**వడ్రంగి** కొయ్యపని చేసేవాడు; మగ్గాలు తయారు చేస్తాడు (రా. 3).

**వడ్లపూసలపేటు** ఉ. వడ్లపూసలపేటి. అంచులో వడ్లగింజల ఆకారంలో వరసగా నేసిన డిజైను. చూ. చిత్రం 146 (తె. 2).

**వడ్లవాళ్ళు** ఉ. ఒడ్లవాల్లు, ఒడ్లవాళ్ళు, ఒడ్లోల్లు. కొయ్యపనిచేసేవాళ్ళు; వడ్రంగులు; మగ్గాలు తయారు చేస్తారు (రా. 4, 6, 9, 10, 19, 19ఎ, 20).

**వదడునేయు** (క్రి.) ఉ. ఒదరునేయు. పర్యా. చూ. వాదాడిచేయు. బట్ట నెయ్యటం ప్రారంభించే ముందు ఒకటి రెండు వేళ్ళ వెడల్పున బద్దెనేసి నేత బాగా రావటానికి అచ్చుతాళ్ళూ పలకతాళ్ళూ సర్దుకోటం (తె. 29).

**వద్దెపేర్పు** అయిరేని కుండల్లో చిన్నది (తె. 13).

**వంతెనకట్టు** (క్రి.) సరిగుంజకు, ఊడైకు మధ్య

వంతెన మాదిరిగా పడుగులో లాకలు దూర్చి చాపటం (తె. 17).

**వన్నె** ఉ. ఒన్నె; పర్యా. చూ. రంగు. కాంతికిరణాలవల్ల కంటిలోపలి తెర(రెటీనా)ఆధారంగా కలిగే వర్ణజ్ఞానం. చూ. చిత్రం 288 (కో. 7; రా. 5, 14, 24).

**వన్నెఅతుకు** (క్రి.) ఉ. వన్నిఅతుకు. పడుగులో కలపవలసిన రంగుపోగులు అతకటం (కో. 7).

**వన్నెఅద్దు** (క్రి.) పర్యా. చూ. రంగువేయు. నూలుకుగాని బట్టలకుగాని రంగు(లు) పట్టించటం; రంగునీళ్ళలో ముంచుతారు. (రా. 5, 14, 24).

**వన్నెవేయు** (క్రి.) పర్యా. చూ. రంగువేయు. నూలుకుగాని, బట్ట(ల)కుగాని రంగు(లు)పట్టించటం; రంగునీళ్ళలో ముంచుతారు (రా. 24).

**వయిలెట్** ఉ. ఒయిలేట్, ఒయిలేటు, వయిలెట్టు, వయిలేట్, వయిలేటు, వయొలెట్, వాయిలెట్, వైలెట్. **1.** నల్లద్రాక్షపండు రంగు; బచ్చలపండు కంటె ఒకవన్నె ఎక్కువది; ఆర్. ఆర్., కాస్టిక్ సోడా హైడ్రోసల్ఫ్ వేసి తయారుచేస్తారు (కో. 2, 3, 4, 6, 9, 18, 21, 30, 36; తె. 12, 16; రా. 14 15); **2.** వంకాయరంగులో నలుపుకత్తు కలిసిన వన్నె (కో. 7); **3.** నల్లవంకాయ రంగు (కో. 12, 15; తె. 13, 14); **4.** నీలం, ఎరుపు కలిసిన రంగు (కో. 8, 14); **5.** నలుపులో ఎరుపురంగు (తె. 19); **6.** బులుగు (నీలం)ఊదా కలిసింది (తె. 23); **7.** తెలుపులో నలుపు (తె. 24).

**వయిలెట్‌చీర** బచ్చలపండురంగు చీర(కో. 30, 36).

**వరయూరంచు** ఒకరకం అంచు; ?వరయూరు (తమిళనాడు)లో తయారయే చీరలకు నేసేది (కో. 21).

**వరస** నేతలో వచ్చే డిజైను; చూ. పనివరస (తె. 12).

**వరసకట్టు** (క్రి.) డిజైను తయారు చేసుకోటం (తె. 12).

**వరసపుల్ల** పర్యా. చూ. అనుకొయ్య(3). అనుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టి వచ్చేటట్టు అనుకు నూలుపోస్తారు. చూ. చిత్రం 45 క. 4-6 (కో. 22).

**వరసపోగు** పట్టుపడుగులో వరస తప్పకుండా చిక్కులు పడకుండా వచ్చే పోగు (తె. 12).

**వరసవేయు** (క్రి.) పట్టునేతలో డిజైన్లు(=వరసలు) నెయ్యటానికి పడిదారాలతో చిక్కు కట్టుకోటం(తె.12).

**వరిగంజి** ఉ. ఒరిగెంజి; పర్యా. బియ్యపుగంజి, బూగంజి, వార్పుగంజి. బియ్యం ఉడకబెట్టి వార్చిన నీళ్ళు; దీన్ని పడుగుకు పెడతారు (కో. 3, 15, 22-24, 26, 28, 30; తె. 1-3, 5-11, 17-29; రా. 6, 9, 11, 19, 22, 23).

**వర్రెంచుచీర** ఒకవైపు నల్లఅంచు, మరొకవైపు ఎర్రఅంచుపెట్టి నేసిన చీర (తె. 32).

**వర్రేకంచు** (< వరి + ఆకు + అంచు) ఉ. ఒర్రేకంచు **1.** అంచులో చివర పదికొలుకుల రంగు పోగులు పెట్టి పైన ఒక కొలికి తెలుపు, ఒక కొలికి రంగు చొప్పున మారుస్తూ నేసిన అంచు; దీనికి చివర జమిలి పోగులు పెట్టరు (కో. 2, 3; తె. 13); **2.** జరీపెట్టి నేసిన ఒక రకం అంచు. చూ. చిత్రం 240 (రా. 7, 8).

**వర్రేకంచుమొగ్గ** వర్రేకంచులో మొగ్గ మాదిరిగా నేసిన డిజైను. చూ. చిత్రం 240 (రా. 7).

**వర్రాకంచుచాపు** (< ?వర్రేకంచు) జరీపెట్టి నేసిన ఒకరకం చాపు; రెండు పంచెలు (కో. 16).

**వల 1.** రాత్రివేళ గొర్రెలమంద చెదరకుండా ఉండటానికి పెట్టేది; జనపనారతో అల్లుతారు. చూ. చిత్రం 305 (తె. 25); **2.** ఉన్ని శుభ్రం చేసేటప్పుడు ఎగిరిపోకుండా కప్పేది. చూ. చిత్రం 307.1 (తె. 6).

**వలపటిపాయ** అచ్చుగుదె పాయల్లో కుడివైపుది; చూ. అంచగుదిపాయ. చూ. చిత్రం 100.8 (కో.26).

**వలపొల్లె** ?శుభకార్యాల్లో కట్టించే ఒకరకం చీర; వలిపెం (తె. 24).

**వలబద్ద** మరమగ్గం కట్టుబడిలో కుడివైపు బద్ద. చూ. చిత్రం 118 క (కో. 27).

**వలింపంచె** ఉ. ఒలిం-; పర్యా. చూ. రాటి. గుమ్మటంలాంటి పనిముట్టు; పంచె మొ. వాటికి దీనికి తగిలించిన చిలపనుంచి నూలు తోడుకొంటారు. చూ. చిత్రం 31 (రా. 1).

**వలెం** (-చుట్టు) సరిచేసిన తరవాత వడిపెట్టి చుట్టిన ఉన్నిపడుగు; చిటికెనవేలికి, బొటనవేలికి చుడతారు (తె. 22).

**వలెంచుట్టు** (క్రి.) పడుగు వడిపెట్టి చుట్టటం(తె.17).

**వల్దండిగ** పర్యా. దండెకోల(2). ఉన్ని పడుగు మధ్యలో అనిపోగులు విడదియ్యటానికి(=అని తెరవటానికి)అచ్చు దగ్గర ఎక్కించిన కర్ర; అనిపోగుల మధ్య నుంచి పేకపోగు వేస్తారు (తె. 25).

**వల్లె** ఉ. ఒల్లి. **1.** పర్యా. చూ. పాగ. తలకు చుట్టుకోటానికి నేసిన బట్ట; మామూలుగా అయిదు కొన్నిచోట్ల $2\frac{1}{2}$-3 గజాల పొడుగు నేస్తారు; అడ్డం ముప్పాతిక గజం నుంచి గజంపైవరకూ పెడతారు; కొన్నిచోట్ల అంచు లేకుండా నేస్తారు; మామూలుగా తెల్లది; కొన్నిచోట్ల రంగులు, గీరలు, గళ్ళు మొ.వి

పెట్టి నేస్తారు (రా. 17). **2.** పర్యా. కిరిగె, కిర్దిచీర, దట్టీ(1). కన్నెపిల్లలు కట్టుకొనే చిన్నచీర; కొన్నిచోట్ల పదిపన్నెండు మూరల పొడుగున రెండు మూరల వెడల్పున నేస్తారు (కో. 34; తె. 4, 18, 19, 22, 23).

**వల్లెకోక** ఉ. ఒల్లికోక, వల్లికోక. ఒకరకం నేత చీర; ఒక పోగురంగు నాలుగు పోగులు తెలుపు చొప్పున నిలువు అడ్డం పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల తెల్లపడుగుకు ఎర్రంచు పెట్టి నేస్తారు; ?ఆరు కొలుకులకు ఒక్కొక్క చివర ఎరుపు పెడతారు (కో. 22, 31).

**వల్లెచీర** ఉ. ఒల్లిచీర. ఒకరకం నేతచీర; రెండు రంగుల(=తెలుపు, నలుపు)పోగులు ఒక్కొక్క కొలికి చొప్పున పెట్టి ఎర్రబొత్తంచు పెట్టి నేస్తారు(కో.24).

**వస్త్రగాలితంచేయు** (క్రి.) పడుగుకుపెట్టే అంబలి, గుడ్డలోపోసి చేత్తో రుద్దటం; పలుకులేని అంబలి, గుడ్డ సందుల్లో గుండా కిందికి దిగుతుంది (కో. 30).

**వళ్ళకట్టె** **1.** డిజైన్లు నేసే మగ్గంలో (అడ్డబేలు) పేటుదారాలను పైకిఎత్తటానికివాడేకొయ్యపనిముట్టు. చూ. చిత్రం 294 వ (తె. 2); **2.** ఉ. ఒళ్ళకట్టె. నవారు మగ్గానికి వడిదారాలు అల్లిన కర్ర; దీన్ని పైపట్టెకు కింద బిగిస్తారు. చూ. చిత్రం 324 చ. 1 (తె. 12).

**వళ్ళగుంట** పర్యా. చూ. నీలలగుంత. పేటు తూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి మగ్గం గుంటకు పక్కగా తీసినగొయ్యి; ఇటువంటివి రెండు పక్కలా ఉంటాయి. చూ. చిత్రం 132 చ. 16(కో.10).

**వళ్ళమొల** ఉ. వల్లమొల. అచ్చుకట్టేటప్పుడు వడి దారాల లంకెల్లో దూర్చిన సన్న బెత్తం; వడికట్టును సరి చెయ్యటానికి వాడతారు (తె. 21).

**వాగొంగు** చీర అడ్డకొన(=కమ్మి)లో మొదట నేసింది (తె. 12).

**వాటకొయ్య** ఉ. ఓటకొయ్య; పర్యా. చూ. సరి కొయ్య(1). ఊడ్డెను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్యగూటం; కొన్నిచోట్ల ఇనపది. చూ. చిత్రం 63 క. 7 (కో. 28, 37).

**వాటు** ఉ. వాట. **1.** పర్యా. దంతెకట్టె(1). కమానుకు పైవైపున పట్టుకోటానికి అనువుగా కట్టిన కర్ర ముక్క. చూ. చిత్రం 9 చ. 1 (తె. 28); **2.** పర్యా. కొమ్మువాటు. నేతనేసేటప్పుడు పడుగు పైపోగులకు కిందిపోగులకు మధ్య పేకదారం వచ్చేటట్టు(కండె)నాడె వెయ్యటం (కో. 7; తె. 8); **3.** పడుగులో కండెనాడె ఒకవైపునుంచి మరొక వైపుకు పారటం (రా. 11, 13); **4.**పడుగులో నాడె(పోగు)కుడివైపునుంచి ఎడమవైపుకు వెళ్ళి తిరిగి వెనక్కు-రావటం (కో. 23, 24; రా. 8, 16, 23, 24); **5.** నాడె ఒకవైపునుంచి మరొక వైపుకు వెళ్ళినప్పుడు నేతలో కలిసిన రెండు పోగులు; కొలికి (రా. 1); **6.** చేతిమగ్గం నేతలో ఒకవైపునుంచి మరొక వైపుకు వెళ్ళిన పేకపోగు (రా. 14); **7.** మరమగ్గంలో నాడె ఆడేట్టు కుచ్చు గుంజటం (రా. 14).

**వాటులాగు** (క్రి.) పర్యా. కొమ్మువాటుఇగ్గు. నేతపడగులో పేకదారం పడటానికి మరమగ్గం కుచ్చు (=పిడి) గుంజటం; కుచ్చు ఏవైపుకు గుంజితే నాడె ఆవైపుకు వెళ్తుంది (రా. 1).

**వాటేయు** (క్రి.) (< వాటువేయు) పర్యా. కొమ్ము వాటేయు. పడుగుపోగులకు మధ్యగుండా పేకదారపు కండె (నాడె) ఒకవైపునుంచి మరొకవైపుకు పారేట్టు చెయ్యటం; చేతిమగ్గం నేతలో విసురుతారు; మరమగ్గం నేతలో కుచ్చు గుంజుతారు (కో. 1-4, 7, 8; రా. 1, 8, 11, 14, 23, 24).

**వాడపువ్వుచీర** సన్నగిరలు పడేట్టు నేసిన చీర (రా. 7).

**వాడమల్లి** ఒకరకం లేత నీలంరంగు (రా. 3).

**వాడి** ? పూర్తి అయిన నేత (కో. 36).

**వాడెచీర** ఒకరకం నేతచీర (తె. 24).

**వాండ్ల** పర్యా. పిసి, వాలు(1). పడుగులో పడుగేరుకర్రకు వెనకఉన్న పోగులు; సరిచేసేటప్పుడు వీటిని కర్రతో తిప్పి వాండ్లకుంచె (=అలుక్కుంచె)తో దువ్వుతారు. చూ. చిత్రం 80·1 (తె. 3,4; రా. 23).

**వాండ్లకుంచె** (-పెట్టు)పర్యా. వాలుకుంచె. ఒకరకం కుంచె(=పడుగు దువ్వేది); సరిచేసేటప్పుడుగాని పడుగేరేటప్పుడుగాని పడుగేరుకర్ర పక్కపోగులు (=వాండ్ల) సాపుగాదువ్వేది; సుమారు రెండుజేనల పొడుగుంటుంది; సరిచేసే పడుగు ఆరుబదునులో ఉన్నప్పుడుదీంతో పైన గంజి చిలకరిస్తారు. చూ. చిత్రం 79 (తె. 3; రా. 23).

**వాణి** **1.** చూ. ఓణి (కో. 16,19,21,32); **2.** చిన్న పిల్లలు కట్టుకొనేచీర (కో. 35); **3.** పర్యా. చూ. కండువా. బుజాలమీద కప్పుకోటానికి నేసిన చిన్నబట్ట; గోరంచు, కడ్డీ అంచు, అత్తాకోడలంచు పూవంచు మొ. వి పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల మడిచి బుజంమీద వేసుకొంటారు; కొన్నిచోట్ల మెడమీద వేసుకొంటారు; కొన్నిచోట్ల 16-20 మూరల పొడుగు నేస్తారు; కొన్ని చోట్ల (గొల్లవాళ్ళ కోసం)రెండున్నర గజాల పొడుగు నేస్తారు (కో. 35).

**వాణికమ్మి** ఒకరకం కమ్మి; **1.** ? అంచుఅమధ్య కోరాపెట్టి అంచులో తెలుపుపెట్టి నేసిన పైటకమ్మి; ఓణీకమ్మి (కో. 25, 28, 33, 34, 36); **2.** పెద్దకమ్మి (కో. 27).

**వాదట్టు** ఉ. ఓదట్టు, వాదటు; చూ. వాదాడి(1) (కో. 27, 28, 31).

**వాదడి** ఉ. ఓదటి. **1.** చూ. వాదాడి(1) (కో. 22, 25; రా. 13); **2.** చూ. వాదాడి (3) (తె. 20).

**వాదర** మగ్గంలో దోనెకూ పన్నెకూ మధ్యనేత పడుగు (కో. 1).

**వాదరగుంత** పర్యా. చూ. వాదాడి(1). మగ్గం చట్రం కిందిభాగం (=తొట్టి ఉన్న వైపు); నేతనేసేటప్పుడు ముందుకు వెనక్కు జరగటానికి అనువుగా చేసిన పల్లపుచోటు; ఇటువంటివి మగ్గంగుంటకు రెండు వైపులా ఉంటాయి; కొన్నిచోట్ల వీటిలో కండెఊచలు వేసుకొంటారు (రా. 8).

**వాదరగూడు** పర్యా. ఇరుక్కంతె, వాదాడి(2). నేతనేసేటప్పుడు మగ్గంచట్రం ముందుకు, వెనక్కు ఆడటానికి అనువుగా ఒకవైపు గోడలో చేసినకంత (గూడు) (రా. 8).

**వాదరవేయు** (క్రి.) ? పర్యా. చూ. వాదాడి చేయు. బట్టనెయ్యటం మొదలుపెట్టేముందు ఒకటి రెండువేళ్ళవెడల్పున బద్దెనేసి నేత బాగా రావటానికి అచ్చుతాళ్ళు, పలకతాళ్ళు సర్దుకోటం (రా. 19).

**వాదరి** ఉ. వాదర, వాదల. **1.** చూ. వాదాడి(1) (కో. 1-3, 10; రా. 1, 7); **2.** మగ్గంలో దోనె దగ్గర నుంచి పేకపోగు వేసినంతవరకూ నేసిన బట్ట (కో. 6).

**వాదరినేత** ఉ. వాదర్నేత. **1.** దోనెదగ్గరినుంచి పన్నెవరకూ నేసిన నేత (కో. 3, 5); **2.** దోనె దగ్గరి నుంచి దండెవరకూ నేసిన నేత; దేవాంగుల వాడుక. (కో. 7); **3.** కొంతవరకూ నేసినబట్టలో చివరి పేకపోగు (కో. 7).

**వాదాటు** పర్యా. చూ. సీలలగుంత. పేటుతూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి మగ్గంగుంటకు పక్కగాతీసిన గొయ్యి; ఇటువంటివి రెండు పక్కలా రెండుంటాయి. చూ. చిత్రం 132 చ. 16 (రా.24).

**వాదాడి** ఉ. ఆదడు, ఆదాడు, వాదాటి, వాదాటు, వాదాడు; **1.** రూ. వాదడి(1), వాదట్టు, వాదరి(1); పర్యా. తీనెగుంత, వాదరగుంత, వారటగొయ్యి. మగ్గంచట్రం కిందిభాగం (=తొట్టిఉన్న వైపు) నేత నేసేటప్పుడు ముందుకు వెనక్కు జరగటానికి అనువుగా చేసిన పల్లపుచోటు; ఇటువంటివి మగ్గంగుంటకు రెండు వైపులా ఉంటాయి; కొన్నిచోట్ల వీటిలో కండె ఊచలు వేసుకొంటారు (తె. 8, 31; రా. 11,14,18, 22, 23); **2.** పర్యా. చూ. వాదరగూడు. నేతనేసేటప్పుడు మగ్గం చట్రం ముందుకూ వెనక్కూ ఆడటానికి అనువుగా ఒకవైపు గోడలోచేసినకంత(రా. 12); **3.** రూ. వాదడి(2) మగ్గందోనెకు, దండెకు మధ్య ఉన్న నేతపడుగు (తె. 22, 26); **4.** సవారు నేసేటప్పుడు పడుగులోవేసిన పేకపోగు దట్టించే కొయ్యకత్తి కిందిఅంచు; కత్తివాదర (రా. 10).

**వాదాడిచేయు** (క్రి.) ఉ. ఓదాడుచేయు, వాదాడుచేయు; పర్యా. వదడునేయు, వాదరవేయు. బట్టనెయ్యటం మొదలుపెట్టే ముందు ఒకటి రెండువేళ్ళ వెడల్పున బద్దెనేసి నేత బాగారావటానికి అచ్చుతాళ్ళు పలకతాళ్ళు సర్దుకోటం (తె. 13,21, 26-28, 30; రా. 10).

**వాయి** ఉ. వాయ. **1.** పర్యా. చూ. పరుపు(1). కుంచె (=పడుగు సాపుచేసేది) పురి అడుగుభాగం; పడుగుచేసేటప్పుడు పడుగుమీద (సమంగా) ఆనుతుంది. చూ. చిత్రం 76 క. 11 (కో. 10), **2.** (-జరుపు, -తుడుచు, -నేయు) నేతనేసేటప్పుడు పన్నెదగ్గరినించి గుడ్డవరకూ నాడె దూరటానికి పైకీ కిందికీ తెరుచుకొనే పడుగుపోగులమధ్య సందు; కొన్నిచోట్ల పడుగుపోగులు; నేతపనివాడు ఒక పావుకోడు తొక్కితే వాయి తెరుచుకొంటుంది; కాలు తియ్యగానే మూసుకొంటుంది (కో. 14, 22 25; తె. 8); **3.** పర్యా. నేతసందు. నేసినబట్ట దగ్గరనించి పన్నెవరకూ మగ్గంమీద ఉన్నపడుగు (తె. 21, 26, 27, 30; రా. 16); **4.** నేసిన నేతలో ఒక కొలత (తె. 24,29).

**వాయికుండ** ఉ. అయికుండ. గంజిపోసుకొనే మట్టి పాత్ర; నేతనేసేటప్పుడు బట్టముందు భాగం (=వాయి) బిరుసెక్కటానికి పూసే (గంజి కొన్నిచోట్ల అంబలి) దీంట్లో పోసుకొంటారు (తె. 29).

**వాయిగీరు** (క్రి.) మగ్గానికి అమర్చిన పడుగులో కొంతవరకూ నేసిన బట్ట దగ్గరినించి పన్నెవరకు ఉన్న పడుగు (=వాయి)లో పోగులు సాపుగా విచ్చుకోటానికి పుల్ల (=గీరుపుల్ల)తో గీరటం (తె. 8).

**వాయిచెక్రం** పర్యా. చూ. గిరక(6). మగ్గంమీద అచ్చుగుదులు తగిలించే కొయ్యకప్పి; దీన్ని మగ్గం పై దండెకు వేలాడదీస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 11 (కో. 24).

**వాయితాడు** **1.** పర్యా. చూ. పావుతాడు. పూను గర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 4 (కో. 24); **2.** పర్యా. రోలరుతాడు. పుల్లిరుసు (=రోలరు)కు వేసిన అచ్చుతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రాలు 121 చ. 5, 121 ప. 4 (కో. 24).

**వాయితొక్కు** (క్రి.) ఉ. వాయిదొక్కు. పడుగు

పోగులు కొన్నిపైకి కొన్నికిందికి వచ్చి అనిపోగులు విడబడటానికి పావుచెక్కను కాలితో తొక్కటం (కో. 24, 27, 28, 30–32, 37).

**వాయిదం** ఉ. అయిదం; పర్యా. చూ. పరుపు(1). కుంచె (=పడుగు సాపుచేసేది) పుర అడుగుభాగం; కుంచె వేసేటప్పుడు పడుగుమీద సమంగా ఆనుతుంది. చూ. చిత్రం 76 క. 11 (తె. 15).

**వాయిదారి** 1. ఉ. అయిదారి; పర్యా. చూ. పరుపు (1). కుంచె (=పడుగు సాపుచేసేది) పురి అడుగుభాగం; కుంచెవేసేటప్పుడు పడుగుమీద సమంగా ఆనుతుంది. చూ. చిత్రం 76 క. 11 (తె. 15); 2. పర్యా. అడవాల్లు, గర్భం, గర్భసందు, దండెబారు, మగ్గంసందు వాయిసందు. మగ్గం దోనెకూ దండెకూ మధ్య నేత భాగం (తె. 25).

**వాయిపిడచ** ఉ. అయిపిడచ. నేతనేసేటప్పుడు బట్ట ముందుభాగం (=వాయి) బిరుసెక్కటానికి గంజి (కొన్నిచోట్ల అంబలి) పూసే గుడ్డ. చూ. చిత్రం 142.1 (తె. 24, 29, 31–33).

**వాయిమట్టి** మగ్గందోనెకు దండెకు మధ్యభాగం (కో. 35).

**వాయిరోలరు** ఉ. వాయిరోల్రు; పర్యా. చూ. పుల్లిరుసు. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలి వంటి గుండ్రటి పొడుగుకర్ర; గిలకలకు మారుగా అమర్చింది; కొన్నిచోట్ల ఇటువంటివి రెండుంటాయి; నేత నేసేటప్పుడు అచ్చుతాళ్ళు దీనిమీద ఆడతాయి. చూ. చిత్రాలు 121 చ. 3, 121 ప. 3 (కో. 24).

**వాయిసందు** పర్యా. చూ. వాయిదారి(2). మగ్గం దోనెకూ దండెకూ మధ్య భాగం; మామూలుగా ముప్పాతిక గజం పొడుగు (తె. 21బి).

**వార** (బహు. వార్లు) నూలులెక్క: **1.** 24 మూరల పొడుగు (వడుగు)నూలు (కో. 5); **2.** లడీ నూలు (కో. 5, 13); **3.** అనుపోసిన కొంతభాగం నూలు; పాగడ (కో. 3); **4.** అనుపోసిన లడీనూలు (కో. 4); **5.** ఒకసారి ఆనుపోసిన అయిదుసీళ్ళ నూలు (రా. 8); **6.** ఆరుపుంజాల పడుగునూలు (రా. 10).

**వారంచు** చీరకు రెండువైపులా రెండురకాల రంగులు పెట్టి నేసిన అంచు; మామూలుగా నీలి-ఎరుపు గాని ఆస్మాన్-గులాబిగాని పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల బొత్తంచు (=పెద్ద గోరంచు) మాదిరిగా నేస్తారు (కో. 10, 23, 30, 33; తె. 5, 15; రా. 13, 14, 23).

**వారంచుకోక** పర్యా. వారంచుచీర. రెండు అంచులకూ రెండురకాల రంగులుపెట్టి నేసిన చీర; అత్తాకోడలంచుచీర (కో. 10).

**వారంచుచీర** పర్యా. వారంచుకోక. రెండంచులూ రెండురకాల రంగుల్లో నేసే చీర; నూకాలమ్మ (=ఒక గ్రామదేవత)కు మొక్కుబడికి నేయించి పెట్టే ఒకరకం చీర; అత్తాకోడలంచుచీర (కో. 30 33).

**వారటగొయ్యి** ఉ. వారటగొయ్య; పర్యా. చూ. వాదాడి(1). మగ్గంచట్రం కిందిభాగం (=తొట్టి ఉన్న వైపు) నేతనేసేటప్పుడు ముందుకు, వెనక్కు జరపటానికి అనువుగా చేసిన పల్లపుచోటు; ఇటువంటివి మగ్గంగుంటకు రెండువైపులా ఉంటాయి (కో. 17).

**వారలుతీయు** (క్రి.) ఆనుమీద పడుగు (=వారలు) పొయ్యటం (కో. 4).

**వారవచ్చు** (క్రి.) పర్యా. బిక్కోయ్యపడు. నేత నేసేటప్పుడు పేకపోగు సరిగాపడక బట్టకు ఒకవైపున ఎక్కువ, మరొకవైపున తక్కువ రావటం (కో. 27).

**వారాలపుల్లయ్య** ఉ. వార్లపుల్లయ్య. పత్తిబలిజె కులానికి చెందినవాడు; ఊళ్ళో ఏకులు ఇచ్చి వారం వారం కండెలు వసూలుచేసుకొనే వాడట; అందరికీ ఇచ్చినట్టే గ్రామదేవత పోచెమ్మకు కూడా వడకటానికి ఏకులు ఇచ్చాడట; వాటితో ఆమె గుళ్ళో దీపం పెట్టుకొంది; పై వారంనాడు పుల్లయ్యవచ్చి కండెలు అడిగేసరికి ఆమె భయపడి పారిపోయి బావిలో దాక్కొంది; వారాల పుల్లయ్యంటే అమ్మవారికి భయం కనక, ఆమెను మళ్ళగొట్టటానికి ఇతని బొమ్మచూపెడతారు (తె. 17).

**వారాలవాళ్ళు** పత్తిబలిజెకులానికి చెందినవారు; పూర్వం దూదేకులవాళ్ళచేత ఏకులువడికించి వారం వారం నూలుకండెలు వసూలు చేసుకొనేవారట (తె. 17).

**వారు** **1.** కమాను (=దూదిఏకే కొయ్యపనిముట్టు) నరం ఒత్తడి తగలకుండా అమర్చిన మేకతోలు. చూ. చిత్రం 9.5 (కో. 6, 7); **2.** పర్యా. చూ. ఉడత తోలు. మరమగ్గం ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు; దీనికొనలు ఉడతచిల్లిలోంచి పైకిదూర్చి బిగిస్తారు; నాడెమొన దీంట్లోకి దూరుతుంది. చూ. చిత్రం 119.2 (రా. 9).

**వారుగుదిపాయ** పర్యా. చూ. అంచగుదిపాయ. అచ్చుగుదిపాయల్లో చివరిది; ఇటువంటివి కుడివైపున, ఎడమవైపున రెండుంటాయి. చూ. చిత్రం 100.6, 100.8 (రా. 4).

**వారుపుల్ల** పర్యా. చెమడాముల్లు, మేకు(6), సీల (8). మరమగ్గం ఉడతకుపైన ఉడతతోలు (=వారు) కొనలు బిగించిన ఇనపపుల్ల. చూ. చిత్రం 119.3 (రా. 12).

**వారుసాల** అంచులో నేసే ఒకరకం డిజైను (తె.7).

**వార్చు** (క్రి.) అన్నం ఉడికిన తరవాత, మిగిలివున్న నీళ్ళు వంచేయటం (25-22, 36).

**వార్నిషువడి** పర్యా. చూ. మైనపువడి. మైనం పూసిన వడి; దీన్ని నేటుదారానికి చివరకడతారు; దీనికి మధ్య అంచుపోగులు దూరుస్తారు. చూ. వడి (రా.24).

**వార్పుగంజి** బియ్యం ఉడకబెట్టి, వార్చిననీళ్ళు; దీన్ని పడుగుకు పెడతారు (కో. 12, 23, 29, 32, 33, 37).

**వాల్లదువ్వు** (క్రి.) (< కివాలలు-) పడుగులో అంచుపోగులు సంచెయ్యటం (రా. 7).

**వాలినకర్ర** ? కిందికోత్తల; దీనికి అని ఉండదు (కో. 3ఎ).

**వాలు** (-తిప్పు) 1. పర్యా. చూ. వాండ్లు. పడుగలో. పడుగేరుకర్రకు ఉన్నపోగులు సంచేసేటప్పుడు వీటిని కర్రతో తిప్పి, వాండ్లకుంచె(=అలుక్కుంచె)తో దువ్వుతారు. చూ. చిత్రం 80.1 (రా. 13, 24); 2. (బహు. వాళ్ళు). పర్యా. కిత్తా. డఫా; పర్యాయం (కో. 2, 4).

**వాలుకుంచె** పర్యా. వాండ్లకుంచె. ఒకరకం కుంచె(=పడుగుదువ్వేది); సంచేసేటప్పుడుగాని పడుగేరేటప్పుడుగాని పడుగేరుకర్ర పక్కపోగులు (=వాలు) సాపుగా దువ్వేది; సుమారు రెండు జానల పొడుగుంటుంది; సరిచేసే పడుగు ఆరుబయలులో ఉన్నప్పుడు దీంతో పైన గంజి చిలకరిస్తారు చూ. చిత్రం 79 (రా. 13).

**వాలుగదవడ** చూ. చేపదవడ. పత్తినించి గింజ వేరు చేసే పనిముట్టు; కొన్నిచోట్ల దీంతో పత్తిని శుభ్రం చేస్తారు. చూ. చిత్రం 6.1 (కో. 33).

**వాలుతిప్పు** (క్రి.) ఉ. వాలతిప్పు. పడుగులో పడుగేరు కర్రకు వెనక ఉన్న పోగులు(వాలు) పైకి తిప్పటం; గంజి అంటటానికీ కుంచె తాకటానికీ వాలు తిప్పుతారు (రా. 24).

**వాల్పువేయు** (క్రి.) సంచేసేటప్పుడు పడుగు ఆరుబయలులో ఉండగా సందు(=రెండు కచ్చుల మధ్య భాగం) సందుకూ కుంచెతో రెండోసారి దువ్వటం (రా. 21).

**వావిలి** ఒకరకం చెట్టు; దసలికాయలు ఉడకబెట్టేటప్పుడు వెప్పుకుండలో దసలికాయలుపోసి గడ్డివేసి కుండ తలకిందుగా చేసినప్పుడు దసలికాయలు జారిపోకుండా ఉండటానికి ఈ చెట్టు కర్రలు గడ్డిమీద పెడతారు (తె. 7).

**వాసం** నూలుచిలపలు ఆరవేసే వెదురుబొంగు (కో. 12).

**వాసుకంచు** పాము ఆకారంలో డిజైను నేసిన అంచు. చూ. చిత్రం 199 (కో. 23).

**విఘ్నేశ్వరపండుగ** పర్యా. చూ. వినాయకచవితి. భాద్రపదశుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గం సామాను లన్నీ కడిగి బొట్లుపెట్టి పూజచేసి పండుగ చేసుకొంటారు (రా. 7).

**విఘ్నేశ్వరుడిచవితి** పర్యా. చూ. వినాయకచవితి. భాద్రపదశుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గం సామాను లన్నీకడిగి బొట్లుపెట్టి పూజచేసి పండుగ చేసుకొంటారు (కో. 31).

**విజియాదూది** ఒకరకం పత్తి (కో. 14).

**విడదీసుడు** ఉ. ఇడదీసుడు. కత్తిరించిన ఉన్నిని పరంగు కారంగు విడదియ్యటం (తె. 20).

**విడబడు** (క్రి.) ఉ. ఇడబడు. సరిచేసిన పడుగు పోగులు అరి విడివిడిగా కావటం; వేరుపడటం (కో. 34).

**విడెంకనుము** సారెకుపెట్టే రవికెలగుడ్డ; తెల్లది (తె. 24).

**విడెపువల్లె** ఉ. విడపొల్లె. చూ. విడెమొల్లె (తె. 11, 31, 32).

**విడెమొల్లె** (<విడెం+ఒల్లె) రూ. విడెపువల్లె; పర్యా. చూ. ప్రధానపుచీర. తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టేచీర; కొన్నిచోట్ల పట్టుది; పచ్చరంగులోగాని వయిలెట్ రంగులోగాని రెండువేళ్ళ వెడల్పు అంచులు, బెత్తెడు వెడల్పు కమ్ములూ నేస్తారు; మామూలుగా తెల్లచీర (చిన్నది); ఇటీవల కొన్నిచోట్ల ఆకుపచ్చ, పసుపుపచ్చ, గులాబి మొ. రంగుల్లో నేస్తున్నారు; మూరెడు పొడుగు కొంగు రంగులోనూ జరిలోనూ నేస్తారు; కొన్నిచోట్ల బీరపువ్వు, తెలుపు రంగుల పోగులు వరసగా పెట్టి అంచులో డిజైన్లు నేస్తారు; ఎరుపు, నలుపు రంగులు మాత్రం వాడరట (తె. 25).

**వినాకమయ్యపండుగ** ఉ. ఇనాకమయ్యపండగ, ఇనాకమయ్యపండుగు; రూ. బెనకయపండుగ; పర్యా. చూ. వినాయకచవితి. వినాయకచవితి పండుగ; భాద్రపదశుద్ధ చవితినాడు నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజచేసి పండుగ చేసుకొంటారు (రా. 7, 9, 11, 12, 19).

**వినాయకచవితి** ఉ. ఇనాయకసవితి, వినాయక చవతి, వినాయకచవుతి, వినాయకచౌతి, వినాయక సవితి, వినాయకసౌతి; రూ. వెనకయచవితి; పర్యా. ఉండ్రాళ్ళచవితి, గణపతిచవితి, గణపతిపండుగ, చవితి (పండుగ), పిళ్ళారి చవితి, పెద్దపండుగ, బెనకల్ పండుగ, బెనగల్‌చవితి, విఘ్నేశ్వరపండుగ, విఘ్నేశ్వరుడిచవితి, వినాకమయ్యపండుగ, సిద్ధివినాయక చవితి, భాద్రపదశుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గం

సామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజచేసి పండుగ చేసుకొంటారు (కో. 6, 22, 26, 28, 32, 34, 36, 37; తె. 21, 24, 26, 28; రా. 3, 4, 10, 13, 19, 20, 23).

**వినాయకపీఠం** ఇంట్లో మగ్గం అమర్చుకొన్నచోట గోడకు తగిలించిన విఘ్నేశ్వరుడిబొమ్మ. చూ. చిత్రం 108.1 (కో. 36).

**వినోలా** ?లేత బ్రౌనురంగు (కో. 3).

**విప్పు** (క్రి.) ఉ. ఇప్పు; పర్యా. చూ. ఏకు(1). కమానుతో దూది పింజెపింజెలుగా విప్పుకొనేటట్లు చెయ్యటం (తె. 5, 11).

**విభూతిరంగు** బూడిదరంగు; గ్రేకలరు (తె. 26).

**వియ్యంపొత్తు** ఉ. ఇయ్యంపొత్తు. పెండ్లికి పిల్లను ఇచ్చి పుచ్చుకొనే (=వియ్యమందే) అనుకూల్యం; పత్తికంకణం కులములకు, ఉన్నికంకణం కులములకు కంచంపొత్తే కాని వియ్యంపొత్తులేదు (తె. 23).

**విరగుంచె** (-పెట్టు -వేయు) ఉ. ఇరగుంచె ఈరగుంచె, ఈరిగుంచె; రూ. విర్లుకుంచె. సరిచేసేటప్పుడు పడుగు అరుబదునులో ఉండగా అంటుకొన్న పోగులు విడబడేటట్లు కుంచెతో దువ్వటం; సందు(=రెండు కచ్చుల మధ్య భాగం)సందుకూ కుంచె ఆపుతూ దువ్విన చోటనే మళ్ళీ దువ్వుతారు (తె. 11-13, 17).

**విరగుద్దు** (క్రి.) ఉ. ఇరగుద్దు. పడుగుపోగులు విడబడేట్లు తట్టటం (తె. 16).

**విరగుప్పాడు** (క్రి.) ఉ.ఇరగుప్పాడు. ఇరగుబ్బాడు. అరిన నూలును విదిలించటం (తె. 10, 31).

**విరగుబ్బు** (క్రి.) ఉ. ఇరగుబ్బు. దులపటం; విడదియ్యటం; విరగుప్పటం; రంగు అద్దిన నూలులడీలు పిడుపుకర్రతో దులుపుతారు (కో. 2).

**విరదీయు** (క్రి.) ఉ. ఇరదీయు. సరిచేసేటప్పుడు పడుగుపోగులు విప్పటం (కో. 37).

**విరుచు** (క్రి.) ఉ. ఇరుచు; పర్యా. విరుపేయు (2). పడుగును రెండేసి గజాలకు ఒక్కొక్క మడతగా విడదియ్యటం; మామూలుగా మగ్గం అమర్చుకొనే ఇళ్ళు చిన్నవిగా ఉంటాయికనక నేతబయలు పొడుగుకు తగ్గట్టు పడుగు మడతలేస్తారు (కో. 34).

**విరుపు** ఉ. ఇరుపు. **1.** పడుగులో కొలతనుబట్టి వేసిన మడత (కో. 33); **2.** పర్యా. విరుపుచివ్వ. కొలతనుబట్టి పడుగు మడిచినచోట ఎక్కించిన కర్ర; మామూలుగా ఒకకర్ర, ఒకబద్ద ఎక్కిస్తారు (కో. 34, 36).

**విరుపుకోల** పడుగుమడత (=విరుపు)లో దూర్చిన కర్ర. చూ. చిత్రం 129 ట (కో. 36).

**విరుపుగుది** ఉ. ఇరుపుగుది; పర్యా. చూ. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగర్ర-కొన్నిచోట్ల మలబద్ద-దారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (కో. 29, 32, 34-36).

**విరుపుచివ్వ** ఉ. ఇరుపుసివ; పర్యా. విరుపు(2). కొలతనుబట్టి పడుగు మడిచినచోట ఎక్కించిన కర్ర; మామూలుగా ఒకకర్ర, ఒకబద్ద ఎక్కిస్తారు (కో. 25, 26, 32).

**విరుపుమల** పర్యా. చూ. సరెంటి(3). చుట్టచుట్టిన పడుగునూలు; మగ్గంమీద కొంత చాపగా మిగిలింది ఒకకర్రకు చుడతారు; కొన్నిచోట్ల పెడకోలకు కట్టి ఉంచుతారు. చూ. చిత్రాలు 128 ట. 1, 128 జ. 2 (కో. 33).

**విరుపులాఠ** కొలతనుబట్టి పడుగు మడిచినచోట ఎక్కించే వెదురుబద్ద; మామూలుగా ఒకకర్ర, ఒకబద్ద ఎక్కిస్తారు. చూ. చిత్రం 129 ట (కో. 32, 36).

**విర్లబడు** (క్రి.) ఉ. ఇర్లబడు. ఏకేటప్పుడు దూది విచ్చుకోటం (కో. 7).

**విర్లుకుంచె** ఉ. ఇర్లుకుంచె; చూ. విరగుంచె (కో. 9; తె. 12).

**విల్లంబు** (< విల్లు + అంబు) ఉ. ఇల్లంబు; పర్యా. చూ. ఉండేలు(బద్ద). తాడుకట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం 9.12 (కో. 13, 14).

**విల్లు** ఉ. ఇల్లు; పర్యా. చూ. ఉండేలు(బద్ద). తాడుకట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు. చూ. చిత్రం 9.12 (రా. 7).

**విష్ణుకాంతరంగు** ఉ. ఇష్ణుకాంతరంగు. ఒకరకం లేతనీలం (=మబ్బు) రంగు; విష్ణుకాంతపుష్పం రంగు; ఆనందకలర్ (తె. 12).

**విసినెకర్రచీరె** ఉ. ఇసనకర్రసీరె. అంచులమధ్య పడుగులో విసినెకర్రమాదిరి డిజైన్లువేసిన చీర (తె. 11).

**విసిరినపడుగు** ఉ. ఇసిర్నిపడుగు. మరానుకుచుట్టిన పడుగునూలు (కో. 27).

**విసురు** (క్రి.) పర్యా. చూ. అనుపోయు. అనుగొట్టలోకి పోగు తీసుకొని అనుకొయ్యలకు చుట్టి వచ్చేట్లు చెయ్యటం (కో. 16-18, 21, 23, 24, 28, 29, 30, 32, 33, 35-37).

**వీడు** (క్రి.) ఉ. ఈడు. సరిచేసిన పడుగుపోగులు అరి విడివిడిగా కావటం; వేరుపడటం (కో. 34).

**వీధి** ఉ. ఈది. మొదటి అనుపీట కొయ్యలకు, చివరి అనుపీట కొయ్యలకు మధ్యభాగం (కో. 33, 34, 36, 37).

**వీరజెట్టికండువా** ఉ. వీరజెట్టికండ్వా. ఒకరకం

కండువా; వీరుల సంబరం చేసేటప్పుడు వేసుకోటానికి నేసింది (కో. 19).

**వీరముష్టులు** ఉ. వీరముట్లు. నేతపనిచేసే దేవాంగులను అడుక్కొనే ఒక తెగవారు; కానాసులు; దేవాంగుల ఇళ్ళలో భోంచేస్తారు (కో. 23 24).

**వెంకప్పరంగు** ఉ. ఎంకప్పరంగు. ముదురుమామిడి చిగురు రంగు (కో. 24).

**వెంటి** చూ. ఎంటి (కో. 11).

**వెండిజరీ** ఉ. ఎండి-. వెండినుంచి తీసిన సన్నదారం; దీనికి బంగారుపూత వేస్తారు (కో. 33).

**వెదటిబద్ద** 1. పర్యా. చూ. అకు(5). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్దలు. చూ. చిత్రం 31 క. 3 (తె. 10); 2. ఉ. ఎదటిబద్ద; చూ. వెదురుబద్ద (తె. 13).

**వెదటిలాక** ఉ. ఎదటిలాక. 1. పర్యా. చూ. లాక (2). పడుగులో అనివెంబడి దూర్చిన వెదురుబద్ద; మామూలుగా ఇటువంటివి అనికి రెండువైపులా ఉంటాయి; పడుగులో అని చెదిరిపోకుండా ఉండటానికి లాకలువేస్తారు. చూ. చిత్రం 63 చ. 3 (తె. 17); 2. చూ. వెదురులాక (తె. 5, 12).

**వెదడుదబ్బ** ఉ. ఎదడుదబ్బ; పర్యా. చూ. కుంచెలాక. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద (లు); కొన్నిచోట్ల అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (తె. 5).

**వెదురుకర్ర** ఉ. ఎదురుకర్ర. నూలుచిలపలు ఆరేసే బొంగు; తడినూలు చిలపలు చిన్నబొంగులతో పిండి పెద్దకర్రలమీద ఆరేస్తారు (కో. 14, 20, 21).

**వెదురుగుండు** ఉ. ఎదురు-. ?దసలి (పట్టు)పడుగు నరిచెయ్యటానికి నిలబెట్టే ఊత్తైకుపైన బిగించిన అడ్డకట్టె. చూ. చిత్రం 297.10 (తె. 7).

**వెదురునాడె** ఉ. ఎదురునాడె. వెదురుగొట్టంతో చేసిన నాడె; చూ. నాడె (కో. 34).

**వెదురుబద్ద** ఉ. ఎదురుబద్ద. రూ. వెదటిబద్ద. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండుపక్కలావేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (కో. 8, 35; తె. 10).

**వెదురుబర్రె** పర్యా. చూ. అకు(1). రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద(లు). చూ. చిత్రం 31 క. 3 (తె. 2).

**వెదురులాక** ఉ. ఎదురులాక; రూ. వెదటిలాక. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండువక్కలా వేసి కట్టిన వెదురుబద్ద(లు); కొన్నిచోట్ల అయిమూలగా కడతారు. చూ. చిత్రం 76 క. 5 (కో. 17).

**వెనకచివర** ఉ. ఎనికిసివర. దండెదగ్గర నేత పడుగులో దూర్చిన చువ్వ (రా. 16).

**వెనక(టి)కొయ్య(లు)** ఉ. ఎంగటికొయ్య, ఎనక్కొయ, ఎనిక్కొయ్య; పర్యా. కొనకొయ్య, మారుగోలకొయ్య. ఆసు వెనకపీటకు బిగించిన పుల్ల(లు); తలకొయ్యలకంటె వీటిసంఖ్య ఒకటి తక్కువ ఉంటుంది. చూ. చిత్రం 45 క. 4 (కో. 26-35, 37; తె. 24, 29, 32, 33).

**వెనక(టి)పీట** ఉ. ఎంగటిపీట, ఎనకటిపీట, ఎనికిపీట; పర్యా. కొనపీట, చిన్నఅడ్డపీట, చిన్నపీట, మడతబల్ల, వెనకపట్టె, వెనకబల్ల. ఆసుపీటల్లో చివరిది; దీనికి మామూలుగా ఒక చాలులో ఆసుకొయ్యలు బిగించి ఉంటాయి. చూ. చిత్రం 45 క.3 (కో. 28; తె. 26, 29, 32, 33).

**వెనకనిచ్చెన** తివాసీ నేసేటప్పుడు నేతపనివాడు కూర్చొనే బల్లను ఎత్తుచెయ్యటానికి వెనకాలవైపు అమర్చిన నిచ్చెన (కో. 16).

**వెనకపట్టె** ఉ. ఎనికిపట్టె; పర్యా. చూ. వెనక(టి)పీట. ఆసుపీటల్లో చివరిది; దీనికి మామూలుగా ఒక చాలులో ఆసుకొయ్యలు బిగించి ఉంటాయి. చూ. చిత్రం 45 క. 3 (కో. 37; తె. 31).

**వెనకబల్ల** ఉ. ఎనికిబల్ల; పర్యా. చూ. వెనక(టి)పీట. ఆసుపీటల్లో చివరిది; దీనికి మామూలుగా ఒక చాలులో ఆసుకొయ్యలు బిగించి ఉంటాయి. చూ. చిత్రం 45 క. 3 (కో. 26, 27, 29-32, 35).

**వెనకయచవితి** ఉ. ఎంకయసవితి; చూ. వినాయకచవితి (తె. 3-5).

**వెనకయ్య(పీట)** ఉ. ఎంకయ, ఎంకాయ, ఎనుకయ్య, ఎన్కయ్య. 1. పర్యా. చూ. బొమ్మ(3). రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువు కొయ్య; చాలాచోట్ల దీన్ని వినాయకుడిబొమ్మ ఆకారంలో చెక్కుతారు; వెనకయ్య అంటే వినాయకుడు. చూ. చిత్రం 15.10 (తె. 3-7, 9, 15, 17, 21, 25-27, 30, 31); 2. పర్యా. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 5).

**వెనక్కొయ్య** ( < వెనక+కొయ్య ) ఉ. ఎనక్కొయ్య; పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా వెనకవైపు మడిమ దగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (తె. 29).

**వెన్ను** పర్యా. కుంచెగోడి, కుంచెగోడ, కుంచెగోడు, కుంచెబుజం(1), కుంచెమేరువ, కుంచెవెన్ను, కుంచెవీపు, గోడు, దండెకట్టు(1), మేరువ, వెన్నుకట్టు. పిడికి కిందగా ఉండే కుంచె పై భాగం; మొగలినారతోగాని, పేముతోగాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (కో. 8; తె. 15, 20, 26, 29).

**వెన్నుకట్టు** పర్యా. చూ. వెన్ను. పిడికి కిందగా ఉండే కుంచె పై భాగం; మొగలినారతోగాని పేముతో గాని దీన్ని కడతారు. చూ. చిత్రం 76 క. 3 (తె. 29).

**వెన్నుగూటం** ఉ. ఎన్నుగూటం, ఎన్నుగోటం; పర్యా. గూటం(12), తోకగూటం(4), దోనుగగూటం, మగ్గంగూటం(1). ఉన్నిమగ్గం దోనుగను మోసే ఎడమ వైపు కొయ్యగూటం. చూ. చిత్రం 315.2 (తె. 10, 11, 25, 28).

**వెప్పుకుండ** ఉ. ఎప్పుకుండ; రూ. ఉప్పెకుండ. దసలికాయలను ఆవిరిమీద ఉడకబెట్టే కుండ. చూ. చిత్రం 290 (తె. 7, 17).

**వెప్పుపెట్టు** (క్రి.) దసలికాయలను కుండలో పోసి ఆవిరిమీద ఉడకబెట్టటం (తె. 17).

**వెప్పువేయు** (క్రి.) ఉ. ఎప్పు-. నీళ్ళు వెచ్చబెట్టటం; కాచడం (రా. 18).

**వెయ్యిగండ్లకోక** ఉ, ఎయ్యిగండ్లకోక. పర్యా. వెయ్యిగండ్లచీర. ఒకరకం గళ్ళచీర; ఊళ్ళో జాతరలకు కట్టుకొంటారు; నాలుగు కొలుకులు తొగరు, రెండు కొలుకులు తెలుపు పెట్టి నేసిన చీరను 'ఎమ్మనూరి ఎయ్యిగండ్లకోక' అంటారు (రా. 19ఎ).

**వెయ్యిగండ్లచీర** రూ. వెయ్యిగన్నులచీర; పర్యా. వెయ్యిగండ్లకోక. ఒకరకం గళ్ళచీర; ఊళ్ళోజాతరలకు కట్టుకొంటారు (రా. 19బి).

**వెయ్యిగన్నులచీర** చూ. వెయ్యిగండ్లచీర(రా.20).

**వెలితికట్టు** (క్రి.) ఉ. ఎలితికట్టు. పన్నెకట్టుబడిలో దండెలమధ్య పుల్లలు దూరదూరంగా పెట్టి పుల్లల మధ్య సందులు వెడల్పుగా ఉండేటట్లు కట్టటం (కో.33).

**వెలితిపుంజంపన్నె** ఈనెలు దూరంగా వచ్చేట్టు కట్టిన పన్నె (కో. 2).

**వెలిబూడిదె** పిడకలబూడిద; తెల్లటిది; అచ్చుతీకే టప్పుడు వేళ్ళకు చెమట పట్టకుండా పొడిగా ఉండటానికి రాసుకొంటారు (కో. 20).

**వెలుచు** (క్రి.) ఉ. ఎలుపు. 1. రూ. ఎలుచు. పర్యా. చూ. తోడు(1). పంకెకుగాని డబ్బాకుగాని నూలు చుట్టటం (కో. 11, 21); 2. పోగులు విడదియ్యటం (రా. 17).

**వెల్తినేత** ఉ. ఎల్తినేత; పర్యా. చూ. చన్నేత. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్లు నేసిన నేత; మేటీనేత మాదిరిది; అనిమూసి నేస్తారు (కో. 11; రా. 12).

**వెల్ల** పర్యా. తెల్ల(ఛాయ). తెలుపురంగు (కో.7).

**వేటుకుంచె** (-తీయు) ఉ. ఏటుకుంచె. సరిచేసే టప్పుడు పడుగు ఆరుబదునులో ఉండగా అంటుకొన్న పోగులు విడబడేటట్లు కుంచెతో దువ్వటం; సందు (=రెండు కచ్చుల మధ్యభాగం) సందుకూ కుంచె ఆపుతూ వేసిన చోటనే మళ్ళీ వేస్తూ దువ్వుతారు (కో. 1, 6).

**వేలకగుండు** ఉ. వేలచ్చగుండు; పర్యా. చూ. నవలకగుండు. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల ఇనపగుండు గాని చిన్న చెక్కంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 9; తె. 4, 5).

**వేలుచెక్క** పర్యా. చెయ్యి(4). పట్టుదారం వడికే పెద్దరాట్నం కట్టుబడిలో ఇరుసు తిప్పటానికి బిగించిన కొయ్యపిడి; కొన్నిచోట్ల దీనికి చేసిన చిల్లిలో వేలుపెట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 293 చ. 6 (తె.7).

**వేసంగిఉన్ని** ఉ. ఏసంగిఉన్ని. ఏరువాకవున్నమికి కత్తిరించే ఉన్ని; పింజుడున్ని (తె. 7).

**వైట్** పెద్దడబ్బా; పూర్వం విదేశాలనుంచి వచ్చే రంగులు పెద్దడబ్బాలలో దిగుమతి అయేవి (తె. 8).

**వైట్‌కలరు** ఉ. వైడ్‌కలరు. వేణ్ణీళ్ళలో ఉడకబెట్టి తయారుచేసే రంగు(లు); ?Vat colour; నీలం, గ్రీను, వయిలెట్, చెంద్రకాంత మొ. రంగు(లు); ఇండంత్రీన్ రంగు(లు). (కో. 2, 11,-13, 15; రా. 8).

**వ్యవసాయమంచుపేటు** ఉ.- పేటి. నాగలి, రెండెడ్లు, రైతు కలిసి ఉన్నట్లు నేసిన ఒకరకం అంచు డిజైను. చూ. చిత్రం 248 (తె. 21).

**వ్యవసాయమంచుబేలు** చీర అంచులో నాగలి, రెండు ఎడ్లు, మనిషి నమూనాలు పడేట్టు నేసిన డిజైను (తె. 21).

**వైక్రాంతచీర** అంచులో ఒకరకం డిజైను నేసినచీర (కో. 34).

**వైక్రాంతం** అంచులో నేసే ఒకరకం డిజైను. చూ. చిత్రం 247 (కో. 34).

**వైగదురు** పర్యా. తొడగదురు. ఒకరకం ఉన్ని కదురు; ఆడవాళ్ళు వడికేది; తొడమీదపెట్టి తిప్పుతూ వడుకుతారు. చూ. చిత్రం 311 చ (తె. 10).

**వైలు** పర్యా. చూ. వడి(6). పేటుదారానికి చివర కట్టిన పురిదారం; మామూలుగా మైనం పూసింది;

కొన్నిచోట్ల ఇనపతీగ; దీనికి మధ్యన బెజ్జంచేసిన చిన్న ఇనపబిళ్ళ ఉంటుంది; డాబీకోలలు పైకి లేచినప్పుడు ఇవి అంచుపోగులను పైకిలేపుతాయి. చూ. చిత్రం 122 చ. 12 (తె. 24, 29).

## శ

**శకుంతలచీర** ఒకరకం ఆకుపచ్చ(=శకుంతలపచ్చ) రంగులో నేసిన చీర (తె. 10).

**శకుంతల(పచ్చ)** ఉ. శకుంతలా, సెకుంతల. **1.** ఒకరకం లేత ఆకుపచ్చరంగు; (కో. 14; తె. 5, 18; రా. 10, 20); **2.** రామపచ్చలో లేతరంగు (కో. 2); **3.** తెలుపులో పసుప్పచ్చ (తె. 10); **4.** పచ్చలో నలుపు, తెలుపు కలిసిన వన్నె (తె. 20, 22); **5.** ముదురు పచ్చలో నలుపుచాయ (తె. 26).

**శతరంజి** లావుపాటినూలు(6-10 నెంబరునూలు)తో నేసిన ఒకరకం దుప్పటి; కింద పరుచుకొనేది; జంపఖానా (తె. 17).

**శబరి** ఒకరకం ఆకుపచ్చరంగు.

**శబరిచీర** ఒకరకం ఆకుపచ్చరంగు చీర (కో. 35).

**శారుకావివన్నె** ఉ. -ఎన్నె. ఒక కొలికి తెలుపు, రెండు కొలుకులు నీలిరంగు. ఇలా మూడు వరసలు నేసి తరవాత రెండు కొలుకులు తెలుపు, రెండు కొలుకులు నీలి చొప్పున పెట్టి నేసిన నేత (రా. 19).

**శాలువ** ఉ. శాలవ. బుజాలు కప్పుకొనే ఒకరకం నేతబట్ట; ఒంటిపొరది (కో. 26; తె. 6).

**శాల్తి** పర్యా. చూ. ఉరువు. నేసిన ఒకబట్ట; single unit (కో. 23).

**శిరంజిపూలు** ఒకరకం పువ్వు (శిరంజిపువ్వు) నమూనాలో నేసిన డిజైను (కో. 9).

**శివారుగుంజ** పర్యా. చూ. మిడిగూట (2). నేత బయలులో చివర పాతిన కొయ్య; దీనికి నేతమోకుతో కొలికివేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేతమోకు పెడకోలకు కట్టి దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (తె. 19).

**శుభ్రకాటుచీర** తెల్లరంగు పట్టుతో నేసిన చీర (తె. 21బి).

**శుభ్రకుప్పణంచీర** ఉ. శుభ్రకుపునం-. ఒకరకం కుప్పడం నేతచీర; చూ. కుప్పడం (తె. 28).

**శుభ్రకుప్పణంఅంచు** ఉ. శుభ్రకుప్పనం-. ఒకరకం కుప్పడం అంచు; చూ. కుప్పడం (తె. 28).

**శుభ్రగళ్ళచీర** తెల్లగళ్ళచీర (తె. 28).

**శుభ్రగళ్ళంచు** తెల్లగళ్ళ అంచు (తె. 28).

**శుభ్రపట్టి** తెల్లపట్టెలు పడేట్టు నేసిన అంచు(తె.28).

**శుభ్రపట్టిచీర** తెలుపు పట్టెలు వచ్చేట్టు నేసిన ఒకరకం చీర (తె. 26).

**శోభ** ఉ. శోబ. అంచులో నేసే ఒకరకం డిజైను (తె. 25).

**శోభనకడ్డి** ఉ. శోబనకడ్డీ. అంచులో నేసిన ఒకరకం సన్నపట్టె (తె. 25).

**శోభనతీగ** ఉ. శోబన్‌తీగ, శోబనతీగె. అంచులో నేసిన ఒకరకం డిజైను. చూ. చిత్రం 249 (తె. 25, 31).

**శోభనంచీర** ఉ. శోబనంచీర; పర్యా. చూ. కార్యం చీర. గర్భాధానంనాడు పెండ్లికూతురికి పెట్టే తెల్లచీర; జరీలోగాని మామూలుగాగాని వెడల్పాటి అంచులు పెట్టి నేస్తారు (కో. 24).

**శ్యామసుందరంచు** ఉ. శామసుందరంచు. ఒకరకం రంగులో నేసిన చీరఅంచు (తె. 6).

**శ్రావణపౌర్ణమి** పర్యా. చూ. నూలుపున్నమ. శ్రావణపౌర్ణమి; నేతపనివాళ్ళు ముఖ్యంగా చేసుకొనే పండుగ; కొత్తజంధ్యాలు వేసుకొంటారు; రాఖీలు కట్టుకొంటారు; చౌడేశ్వరికి జ్యోతి ఉత్సవం చేస్తారు; అగ్నిగుండంలో నడవటం, గంగపూజచెయ్యటం, ఆనందంవేయుటం మొ.వి చేస్తారు (రా. 1).

## ష

**షర్టింగు** ఉ. సర్టింగ్; పర్యా. చూ. అంగీగుడ్డ. చొక్కాలకోసం నేసిన బట్ట; రకరకాల రంగుల్లోను, గళ్ళలోను, చారల్లోను, డిజైన్లలోను నేస్తారు (కో. 6, 11-15, 18, 19, 36).

**షా** నలుపువన్నె; తివాసీనేతపనివాళ్ళ వాడుక (కో. 16)

**షాంబాడరు** లాహిరి, గొలుసు, మొగ్గ వరసగా పడేట్టు నేసిన అంచు (తె. 18).

**షావుకారు** నేతపనివాళ్ళకు కూలిఇచ్చి పనిచేయించేవాడు; master-weaver (కో. 23).

**షికారికొంగు** జింక, పెద్దపులి, పక్షులు, తుపాకి పట్టుకొన్న వేటగాడు కలిసి పడేట్టు డిజైను నేసిన చీర అడ్డకొంగ(=కొంగు) (తె. 21).

**షెమ్లా** ఉ. షమ్లు, సెమ్లు, సెమ్లా; పర్యా. చూ. పాగ. తలకు చుట్టుకోటానికి నేసినబట్ట; మామూలుగా అయిదు, కొన్నిచోట్ల 2½-3, గజాలపొడుగు నేస్తారు; అడ్డం ముప్పాతిక గజం నుంచి, గజంపైవరకూ పెడతారు; కొన్నిచోట్ల అంచు లేకుండా నేస్తారు; మామూలుగా తెల్లది; కొన్నిచోట్ల రంగులు, గీరలు గళ్ళు మొ.వి పెట్టి నేస్తారు; కొన్నిచోట్ల పెళ్ళికొడుకు తలకు చుట్టుకోటానికి జరిపెట్టి నేస్తారు; తలంబ్రాలసెల్లా; ఒక కొస తోకమాదిరిగా వెనకాల విడిచి తక్కిన భాగం తలకు చుట్టుకొంటారు (తె. 4, 5, 8, 11, 31).

**షోడా** పర్యా. చూ. కాస్టిక్ (సోడా). అద్దకంరంగు తయారుచెయ్యటానికి వేడినీళ్ళలో కలిపే ఒకరకం లవణం; caustic soda (రా. 5).

# స

**సకేరియా** ముదురు చందనంరంగు (కో. 23).

**సక్కట్టు** పర్యా. చూ. ఉడత. మరమగ్గంనాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి, కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ; ఇటువంటివి రెండు సొరుగులపైనా అమరుస్తారు. చూ. చిత్రం 119 (రా. 10).

**సక్కుబాయి** ఒకరకం లేత నీలంరంగు; సిరారంగు (కో. 8, 14, 21, 24; తె. 15, 17; రా. 7, 19బి).

**సగంకట్టు** (-వేయు) రాట్నంమీద చుట్టిన అర చిలప పట్టుదారం; ఒక తులం బరువు తూగేది (తె.21).

**సగంకమ్మి** ఎరుపు, కపిల, బిరపువ్వు, తెలుపు రంగుల్లో అడ్డకొస నేసిన జంపఖానా (తె. 17).

**సగంకొయ్య** జైనకొయ్యకు మరొక జైనెడు దూరంలో బిగించిన కొయ్య; దీనికూడా అనుపోస్తే పడుగు మరొక జైనెడు పెరుగుతుంది; దీన్ని 'మూరెడు కొయ్య' అంటారు. చూ. చిత్రం 45 ట.3 (కో. 37).

**సగంపలక** ఉ. సొకంపలక. దోనెకూ చేతిపలకకూ మధ్య సగం వరకూ నేసిన నేత (కో. 3ఎ).

**సగంపాయ** పర్యా. చూ. నడింపాయ. అచ్చు వళ్ళలో అచ్చుకర్ర చివరిగుదులు రెంటికీ మధ్యభాగం; సగానికి చీలిఉన్నది; దాంతోబాటు పడుగులో చీలిన పక్కపాయలు రెంటికీ మధ్యభాగం. చూ. చిత్రం 100.7 (కో. 28).

**సగ్గపొర** ?సరిచేసిన తరవాత పడుగులో సగం వరకూ చుట్టిన పైపోగులు (కో. 33, 34).

**సంకటి** ఉ. సంకట. గంజివార్చకుండా ముద్దగా వండిన అన్నం; దీన్ని గుడ్డమీద తోమి వచ్చిన గంజి పడుగుకు పెడతారు (కో. 8; తె. 1).

**సంకటికుంచె** ఉ. సంగటికుంచె. పర్యా. చూ. అలుక్కుంచె. ఒకరకం కుంచె(=పడుగుదువ్వేది); సుమారు రెండు జైనల పొడుగుంటుంది; సరిచేసేటప్పుడు పడుగు ఆరుబయటులో ఉన్నప్పుడు దీంతో పైన గంజి చిలకరిస్తారు; అల్లుచేసేటప్పుడు అతుకుపోగులకు సంకటి (=ముద్దగా వండిన అన్నం)పూసి దువ్వుతారు; పడుగేరే ఉప్పుకు పోగులు సాపుచెయ్యటానికి దీంతో దువ్వుతారు. చూ. చిత్రం 79 (రా. 12).

**సంక్రాంతికమ్మి** ఒకరకం చీరకమ్మి (రా. 24).

**సంగటికోల** పర్యా. ఇరుసు(1), కోడు(1), కోల (1), గిరక(2), గిరకకదురు, గిరకకోల, గుండ్రకొయ్య, నడ్డకోల, పోరు, ముకి. పత్తిరాట్నం నిలువుల మధ్య రూళ్ళకర్ర మాదిరిగా ఉండే కట్టె; ఇటువంటివి రెండు ఒకదానొకటి అనుకొని తిరుగుతూ ఉంటాయి; వాటి మధ్య ముడిపత్తి పెట్టినప్పుడు ఒకవైపు గింజలు, మరొకవైపు పత్తి పడతాయి. చూ. చిత్రం 1·1(తె.12).

**సంగడం** (-పట్టు) రూ. సంగడి. పత్తిరాట్నం కోలకు చుటూ గాట్లుపెట్టి చేసే వడ్రంగిపని (తె. 13).

**సంగడి** చూ. సంగడం (తె. 12).

**సంగ్లి** పర్యా. చూ. మలుకు. ముడి; మెలిక; పన్నె కట్టుబడిలో దండెల మధ్య బిగించిన ఈనెకు దారంతో వేసిన ముడి. చూ. చిత్రం 88 క. 12 (కో. 7).

**సజ్జ** పర్యా. చూ. మగ్గంచట్టం. మరమగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగుపట్టెలకు కుచ్చుతాళ్ళు కట్టే కొయ్యలు బిగిస్తారు; కింది పట్టెమీద (కండె) నాడె అమరుతుంది. చూ. చిత్రం 118 (కో. 27).

**సటలుమగ్గం** ఉ. చటల్మొగ్గం; సటాలుమొగ్గం; రూ. సటిల్ మగ్గం. ఒకరకం మగ్గం; నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజేది; మగ్గం పలకలో పన్నె ఒక కొయ్యచట్రంలో బిగించి పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు. చూ. చిత్రం 108 (రా. 16, 23, 24).

**సటాలుకొమ్ము** ఉ. సటాల్కొమ్ము; పర్యా. చూ. మరనాడె. ఒకరకం నాడె; మరమగ్గంది; పడుగు పైపోగులకు కిందిపోగులకు మధ్య వేసే పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే కొయ్యనాడె; కుచ్చుగుంజినప్పుడు పడుగుపోగుల మధ్య పానుపుపట్టెమీద ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి పరుగెడుతుంది; చేతినాడె కంటె ఉరువు పెద్దది;

దీంతో నేత సులువుగా తొందరగా అవుతుంది. చూ. చిత్రం 131 క (రా. 24).

**సటాలుడబ్బా** ఉ. సటాల్డబ్బ; రూ. సటిల్‌డబ్బా. పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు; నేత నేసేటప్పుడు నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (రా.23).

**సటిల్‌గుంజ** మరమగ్గం చట్రం మోపటానికి నేత బయలులో పాతిన రాట; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; చూ. మగ్గంచట్టం (తె. 7).

**సటిల్‌డబ్బా** ఉ. -డబ్బ; చూ. సటాలుడబ్బా (తె. 7).

**సటిల్‌దండ** మరమగ్గం చట్రంలో మధ్య బిగించిన అడ్డపట్టె. చూ. మగ్గంచట్టం (తె. 7).

**సటిల్‌మగ్గం** ఉ. -మొగ్గం; చూ. సటలుమగ్గం (తె. 7).

**సట్టరచ్చు** (< సట్టరు + అచ్చు) అంచులో డిజైన్లు పడటానికి తయారుచేసే ఒకరకం అచ్చు; జంటఅచ్చు; పైన నాలుగు, కింద నాలుగు కర్రలు అమర్చి వడి దారాలు కట్టింది; ఇది అమర్చిన మగ్గానికి నాలుగు పావుచెక్కలు కడతారు (తె. 8, 18).

**సట్టరు** 1. ఉ. సటర్, సట్టర్; రూ. సంటరు; పర్యా. చూ. మగ్గంచట్టం. మరమగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగుపట్టెల చట్రం; మామూలుగా దీని నిలువు పట్టెలకు కుచ్చుతాళ్ళు కట్టే కొయ్యలు బిగిస్తారు; కింది పట్టెమీద(కండె) నాడె ఆడుతుంది. చూ. చిత్రం 118 (తె. 3, 8, 19-22, 25); 2. పర్యా. చూ. పానుపుకట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (తె. 19).

**సట్టరుఅడ్డపట్టె** పర్యా. చూ. అడ్డపట్టె(14). మరమగ్గంచట్రంలో మేరువుపలకకు కిందగా నిలువుపట్టెలు బిగించిన మధ్యకర్ర; కొన్నిచోట్ల దీనికి కుచ్చుతాడు కడతారు. చూ. చిత్రం 118.2 (తె. 18).

**సట్టరుకొయ్య** ఉ. సటర్కొయ్య; పర్యా. చూ. సట్టరుగుంజ(1). మరమగ్గంచట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల రెండు. చూ. చిత్రం 116.2 (తె. 31).

**సట్టరుగుజ్జు** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 30).

**సట్టరుగుంజ** 1. పర్యా. కాలుగుంజ, కుత్తికాలు, గుంజు(8). గోడిగుంజ, నిలువు(3), నిలువుకొయ్య(5), నిలువుగుంజ(5), నిలుపుస్తంభం(2), ఫ్రేంగుంజ, మగ్గం గుంజ, లాటుగుంజ, సట్టరుకొయ్య, సట్టరుసింగర్, సోగ, స్తంభం(3). మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల రెండు. చూ.చిత్రం 116.2 (తె. 20, 23, 26, 28, 30); 2. పర్యా. కత్తెరకొయ్య. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా మగ్గంగుంటకు పక్కన పాతిన ఒకరకం పొడుగురాట; దీనికి పైన ఒకటి, ఏటవాలుగా మరొకటి చిన్నకొయ్యలు బిగించి ఉంటాయి (తె. 8).

**సట్టరుచంక** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 26).

**సట్టరుచెంప** ఉ. సట్టరుసెంప; పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 19).

**సట్టరుచెయ్యి** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1(తె. 33).

**సట్టరుజబ్బ** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 25).

**సట్టరుడబ్బా** ఉ. సటర్డబ్బా; పర్యా. చూ. సొరుగు (2). మరమగ్గంచట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు; నేతనేసేటప్పుడు నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (తె. 19, 20, 32, 33).

**సట్టరుతాడు** మరమగ్గం చట్రంలో నిలువుకొయ్య బిగించిన తాడు. చూ. చిత్రం 118 క. 6 (తె. 11).

**సట్టరుదండె** పర్యా. చూ. మేరువుపలక. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె; కొన్నిచోట్ల దీనికి చివర రేకులు వేస్తారు; కొన్నిచోట్ల దీనికి కుచ్చు చెంపతాళ్ళు కడతారు; నేతనేసేటప్పుడు ఇది మగ్గంపందిరిమీద అటూ ఇటూ ఆడుతుంది. చూ. చిత్రం 118.8 (తె. 8, 18, 19, 25).

**సట్టరునాడె** ఉ. సటర్నాడె; రూ. సట్టరులాడె; పర్యా. చూ. మరనాడె; ఒకరకం నాడె; మరమగ్గంది; పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే కొయ్యనాడె; కుచ్చు గుంజినప్పుడు పడుగుపోగుల

మధ్య పానుపుపట్టెమీద ఒక సొరుగులోంచి మరొక సొరుగులోకి పరుగెడుతుంది; చేతినాడె కంటె ఉరువు పెద్దది; దీంతో నేత సులువుగా తొందరగా అవుతుంది. చూ. చిత్రం 131 క (తె. 8, 10, 11, 15, 17-19, 25-28, 33).

**సట్టరునిలువు** పర్యా. చూ. నిలువుపట్టె(10). మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.1 (తె. 22, 24).

**సట్టరుపన్నె** ఒకరకం పన్నె(=దువ్వెన లాంటి పరికరం) సట్టరు మగ్గానికి బిగించేది; కొన్నిచోట్ల పన్నె దంతెలమధ్య కొన్ని కలపపుల్లలు, కొన్ని ఉక్కుఊచలు బిగిస్తారు (తె. 18).

**సట్టరుపలక** ఉ. సటరుపలక, సటర్పలక; పర్యా. చూ. పలక(7). మరమగ్గంలో పన్నె బిగించిన పై చెక్క; నేతనేసేటప్పుడు పడుగులో పేకపోగు వేసి దీంతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (తె. 24, 26, 27, 29, 33).

**సట్టరుపాను** ఉ. సటర్పాను, సట్టరుపాన; పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (తె. 8, 28, 29).

**సట్టరుపికాసి** పర్యా. చూ. పికాసి. మరమగ్గ నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్య గిలక; మామూలుగా మిషను దారం చుట్టే కొయ్యరీలు; ఇటువంటివి ఉడతలకు బదులు రెండు సొరుగుల్లోనూ అమరుస్తారు. చూ. చిత్రం 120 (తె. 5).

**సట్టరుపేటీ** ఉ. సటర్పేటీ, సట్టర్పేటీ; పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు; నేతనేసేటప్పుడు నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.3 (తె. 23, 25, 29).

**సట్టరుబుజం** పర్యా. చూ. రెక్క(1). మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించినకర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (తె. 29).

**సట్టరుబొమ్మ** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (తె. 19, 20).

**సట్టరుమగ్గం** ఉ. సటర్మొగ్గం. పర్యా. చూ. మరమగ్గం. ఒకరకం మగ్గం; నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజేది; మగ్గం పలక, పన్నె ఒక కొయ్యచట్రంలో బిగించి పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు. చూ. మగ్గచట్టం. చూ. చిత్రం 108(తె. 1, 3, 9-11, 17-19, 21-29, 32, 33).

**సట్టరుమొకం** పర్యా. చూ. బొమ్మ(9). మరమగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.16 (తె. 21).

**సట్టరులాడె** ఉ. సటర్లాడె; చూ. సట్టరునాడె. (తె. 3, 6).

**సట్టరుసింగర్** ఉ. సటర్సింగర్; పర్యా. చూ. సట్టరుగుంజ(1). మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట; ఇటువంటివి మామూలుగా నాలుగుంటాయి; కొన్నిచోట్ల రెండు. చూ. చిత్రం 116.2 (తె. 32).

**సట్టరుసూత్రం** పర్యా. చూ. చెంపతాడు(4); కుచ్చుతాళ్ళలో డైమనుతాడుకు ఒకవైపు కట్టిన దారం; దీన్ని పైన మగ్గం నిలువుపట్టెకూ కింద ఉడతతాడుకూ కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.23 (తె. 18),

**సట్టికత్తిరింపు** చలికాలంలో ఉన్ని కత్తిరించటం; మాగి కత్తిరింపు (తె. 27).

**సడుగు** పర్యా. చూ. తూకం. పేటువడికి కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపపుల్ల; కొన్నిచోట్ల సత్తుది; నేతనేసేటప్పుడు అని మూసిన తరవాత వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి రెండు పక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (తె. 21).

**సడువు** బరువు (తె. 13).

**సడెంనూలు** తెల్లటి జనపనార; దీన్ని కదురుమీద వడికి దారంతీస్తారు; నేతలోనిలువుకు వాడతారు(తె.25).

**సంటరు** ఉ. సంటర్; చూ. సట్టరు(1). (తె. 31).

**సంటరుడబ్బా** పర్యా. చూ. సొరుగు(2). మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు; నేతనేసేటప్పుడు నాడె బయటికి పోకుండా ఆపేది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.13 (తె. 31).

**సంటరునాడె** ఉ. ఉ. సంటర్నాడె; పర్యా. చూ. మరనాడె. ఒకరకం నాడె; మరమగ్గంది; పడుగు పై పోగులకు కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి

కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే కొయ్య నాడె; కుచ్చుగుంజినప్పుడు పడుగుపోగులమధ్య పానుపు పట్టెమీద ఒక పొరుగులోనుంచి మరొక పొరుగులోకి పరుగెత్తుతుంది; చేతినాడె కంటె ఉపువు పెద్దది; దీంతో నేత సులువుగా తొందరగా అవుతుంది. చూ. చిత్రం 131 క (తె. 31, 32).

**సంటుపపలక** ఉ. సంటుర్పలక; పర్యా. చూ. పలక (7). మరమగ్గంలో పన్నె బిగించిన పై చెక్క; నేతనేసేటప్పుడు పడుగులో పేకపోగువేసి దీంతో అదుముతారు. చూ. చిత్రం 118.10 (తె. 31).

**సంటురుమగ్గం** పర్యా. చూ. మరమగ్గం. ఒకరకం మగ్గం; నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజేది; మగ్గంపలక, పన్నె ఒక కొయ్యచట్రంలో బిగించి పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు. చూ. చిత్రం 108 (తె. 30, 36).

**సన్‌ప్రూఫ్‌చీర** పడుగుకు లాకీ పేకకు దమయంతి పచ్చ రంగులుపెట్టి నేసిన కలనేత చీర (కో. 7).

**సనుగు 1.** రూ. సనువు. ఒక నేతకు సరిపడే నూలు; మామూలుగా పదహారు మూరల పొడుగు ఉంటుంది; పన్నెండు చిలపల నూలు పడుతుంది (తె. 3, 20, 31, 33); **2.** ఒక నేతబట్ట; శాల్తీ; చీరగాని, పంచెల చాపు గాని (తె. 1-5, 23, 32).

**సనుగు(నూలు)** ఒక గొంగడికి సరిపడేటంత(చుట్టిన) ఉన్నిదారం (తె; 20, 25).

**సనుగుబద్దె** పర్యా. చివరిబద్దె. బట్ట(=సనుగు)లో చివరివైపు నేసి వదిలిన బద్దె (తె. 2).

**సనుపు** గొర్రెబొచ్చు మెత్తదనం; "కొదమగొర్రెల ఉన్ని సనుపు"(తె. 11).

**సనువు** చూ. సనుగు(1). (తె. 10).

**సంతన్‌కోరా** ఉ. -కోర. పసుప్పచ్చ పన్నెలో ఉండే ఒకరకం ముడిపట్టు; దీని చిలప పెద్దది; వెడల్పుగా ఉంటుంది; పొడుగు ఆరు గజాలు (తె. 12).

**సంతానంపేటు** బాతుపిల్లల బొమ్మలు పడేట్టు అంచులో నేసిన డిజైను. చూ. చిత్రం 250 (రా. 8).

**సందు 1.** (-ఎత్తు, -పరు, -వేయు) పర్యా. అంటు(3). కచ్చి(4), సందుకచ్చె. పడుగులో రెండు అనుల మధ్యభాగం (కో. 1, 3, 4, 6, 10; తె. 7, 28; రా. 1, 8, 10, 11, 13, 15-19, 23, 24); **2.** పర్యా. చూ. గూడు(3). పన్నెదండెలకు బిగించిన పుల్లల మధ్య వెలితి; అచ్చుకట్టేటప్పుడు ఒక్కొక్కదాంట్లో రెండేసి బద్దెపోగులు దూరుస్తారు; నేతనేసేటప్పుడు పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి. చూ. చిత్రం 83 క. 9 (కో. 1, 7, 24; రా.11); **3.** పర్యా. గోటు, చిట్టి(1). అంచులో రెండు రకాల డిజైన్లలో నేసిన భాగాలకుమధ్య మామూలుగా నేసిన భాగం. చూ. చిత్రం 162.1 (తె. 13, 14); **4.** కమ్మినేతలో తలచిట్టెకు, పెద్దపట్టెకుమధ్య మామూలుగా నేసిన భాగం (కో. 5); **5.** కమ్మి చివరి బద్దెకు తలచిట్టెకు మధ్యభాగం. చూ. చిత్రం 272 (కో. 6).

**సందుకచ్చె** పర్యా. చూ. సందు(1). పడుగులో రెండు అనుల మధ్యభాగం (కో. 6).

**సందుకుంచె** (-ఈడ్చు, -తీయు, -వేయు) ఉ. సందుకుంచి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబయటలో ఉండగా సందు(=రెండు కుచ్చుల మధ్యభాగం)సందుకూ కుంచె అవులాగ దువ్వటం; పడుగు బాగా ఆరేవరకూ సందుసందుకూ రెండు మూడుసార్లు నిదానంగా దువ్వుతారు; కొన్నిచోట్ల సన్నపడుగులు ఇలా దువ్వుతారు (కో. 2, 7ఎ; రా. 11, 13, 15-17, 23).

**సందునేత** చీర కొంగులో రెండు పట్టె(=సెలువు)ల నడిమినేత (రా. 14).

**సందుపోగు** పడుగులో కిందిపోగులకూ పైపోగులకూ మధ్య అనిలోకి వచ్చిన దారం (కో. 2).

**సందులాక** పడుగులో రెండు కచ్చుల మధ్య(సందు)లో దూర్చే అడ్డబద్ద; మామూలుగా అని లేపటానికి అనిలాక వెంబడి మరొక లాక దూరుస్తారు (రా. 11, 13, 23).

**సందులుకొట్టు** (క్రి). ఉన్నిపడుగు సరిచేసేటప్పుడు అనులమధ్య(=సందు) పోగులు అంటుకుపోకుండా తిప్పటం(తె. 11).

**సందులెత్తు** (క్రి.) **1.** పడుగులో రెండు కచ్చుల మధ్య(సందు) పోగులు అంటుకుపోకుండా లాకలతో విడదియ్యటం (కో. 4, 6; రా. 1, 8, 10, 11, 15-17, 19, 23, 24); **2.** పడుగులో అనిపోగులు లాకలతో విడదియ్యటం (కో. 2, 8; రా. 13).

**సందులేయు** (క్రి). ?సరిచేసేటప్పుడు అనులెత్తటం (రా. 18).

**సంధ్యాబొగిడి** నిండుబుగిడి(=మొగ్గ) కింద మరొక అర్ధబుగిడి (త్రిభుజాకారంలో) పడేట్టు నేసిన డిజైను; అంచుల్లోనూ కమ్ముల్లోనూ నేస్తారు (తె. 12).

**సన్నగళ్ళగుడ్డ** ఒకరకం చొక్కాగుడ్డ; సన్నగళ్ళు పెట్టి నేసినది (కో. 34).

**సన్నగుది** పర్యా. చూ. పంటిగుది. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి పుల్ల(పన్ను)కు కట్టినతాడు; ఇటువంటివి పంటికి ఒక్కొక్కటి ఉంటాయి. చూ. చిత్రం 124.1 (రా. 1).

**సన్నగోరంచు** రెండుపోగుల దారంతో సన్నటి గిర పడేట్టు నేసిన అంచు (కో. 33).

**సన్నజాజిపేటు** అంచులో సన్నజాజిపువ్వు ఆకారంలో నేసిన డిజైను. చూ. చిత్రం 173 (కో. 16, 20).

**సన్నజాజిబుటా** సన్నజాజిపువ్వు మాదిరి నేత డిజైను (కో. 24).

**సన్నడోరియా** అంగీగుడ్డలో ఒకరకం నేత (తె.24).

**సన్ననూలు** పర్యా. సయం(నూలు). పోగుసన్నగా సున్నితంగా ఉండే నూలు; నాణ్యమైన నూలు (కో. 3, 8-21; రా. 3).

**సన్నపట్టె** పర్యా. చూ. రెక్క(1). మగ్గం బొమ్మకు నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర; దీనికి ఉడతదారం కడతారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.18 (తె. 1).

**సన్నపుటాణిచీర** రెండు కొలుకులు కలుపు, రెండు కొలుకులు లాకీ పెట్టి నేసిన సరివన్నె(=రెండురంగులూ సమానంగా పెట్టి నేసిన)చీర; పుటానీగడి పాతిక అంగుళం పొడుగు వెడల్పు ఉంటుంది (కో. 7).

**సన్నపుసరి** సన్నపోగుల పడుగు; సరిచేసేటప్పుడు దీన్ని కుంచెతో రెండోసారి దువ్వుతారు (తె. 14).

**సన్నబుగిడి** సన్నటి మొగ్గ ఆకారంలో నేసిన డిజైను (తె. 1).

**సన్నమండిక** సరిచేసేటప్పుడు పడుగుమీద చిలకరించటానికి గంజి పోసుకొనే ఒకరకం చిన్న మట్టిపాత్ర (కో. 28).

**సన్నముంగి** ఒకరకం చిన్నగడి (తె. 6).

**సన్నయికోటుచీర** ఒకరంగు రెండుకొలుకులు ఒకరంగు ఒకకొలికి చొప్పున అచ్చుతికి పడుగు, పేక సమంగా నేసిన చీర (రా. 17).

**సన్నసందు** (-వేయు) పడుగులో రెండుఅనుల మధ్య వెలితి తక్కువ ఉండటం; పడుగు కొద్దిగా ఆరినప్పుడు వెలితి తక్కువగా ఉంచుతారు (రా. 18).

**సపోటా** సపోటాపండురంగు (కో. 2, 6; రా. 8).

**సప్తదారి(చీర)** అంచుల్లో ఏడేసి జరిగళ్ళు వరసగా నేసిన చీర (తె. 28).

**సప్పకొరడు** **1.** నూలులడీలు తడిపి మురికి పోవటానికి దంచే కొయ్య (తె. 24); **2.** నీళ్ళలో తడిపిన లడీల మురికి పోవటానికి బండమీద కొట్టే కర్ర. చూ. చిత్రం 282 చ. 1 (తె. 24).

**సప్పా** **1.** పర్యా. చిలకపుల్ల(2). ఒకరకం పావు చెక్క; పొడుగాటిది; నేతనేసేటప్పుడు పడుగులో అని (పోగులు) తెరవటానికి పావుచెక్క తొక్కుతారు; చూ. పావుచెక్క (కో. 24); **2.** పర్యా. మేనా. చేత్తో డిజైను(రంగు)లు అద్దే ఒకరకం కొయ్యఅచ్చు. చూ. చిత్రం 283 క. 1 (కో. 8).

**సప్పాకొయ్య** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య; మామూలుగా వెనకవైపు మడిమ దగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనకతాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (కో. 24).

**సప్పారంగు** పర్యా. మీనారంగు. చేతి అద్దకంలో మేనా(సప్పా, ఒకరకం కొయ్య అచ్చు)తో అద్దినరంగు (కో. 8).

**సప్పురి** (కన్నడ.సప్పు=తక్కువ)కొద్దిపాటి దారపు వడి (రా. 14).

**సప్పురినూలు** (< సప్పు+పురి-) రూ. జబ్బురి నూలు. పురి తక్కువగా ఉండే నూలు (రా. 24).

**సప్పురిరేషం** పురి తక్కువ ఉన్న పట్టుదారం; దీన్ని పేకకు వాడతారు (రా. 14).

**సబ్బల్** తివాసీమగ్గం దోనె బిగింపుకు పక్కన బెజ్జంలో దూర్చిన గడ్డపార. చూ. చిత్రం 320.10 (తె. 17).

**సమగడిచీర** నలుచదరపు గళ్ళు నేసిన చీర(కో.24).

**సమగొయ్య** పర్యా. చూ. మిడిగూటం(2). నేత బయలులో చివర పాతినకొయ్య; దీనికి నేతమోకుతో కొలికి వేసి పెడకోలకు చుట్టి పడుగు బిర్రుపెట్టటానికి వెనక్కు గుంజుతారు; కొన్నిచోట్ల నేతమోకు పెడకోలకు కట్టి దీనికి పనుగుమెలిక వేస్తారు; కొన్నిచోట్ల ఇది అరిగిపోకుండా గొట్టం తొడుగుతారు. చూ. చిత్రం 127.13 (కో. 27, 31).

**సమతానిచీర** ఒకరకం చిన్న గడిచీర; సాతానిచీర: సంతానం కోరేవాళ్ళు కట్టుకొంటారు (కో. 19).

**సమయంవాళ్ళు** ఉ. సమయమోళ్ళు. పద్మసాలీల దగ్గర అడుక్కొనేవాళ్ళు; ఏటేటా వచ్చి మగ్గానికి కొంత చొప్పున అడుక్కొంటారు (కో. 5, 7, 10, 22, 23).

**సముచాపు** ఉ. సముసాపు. సమానంగా నేసిన రెండు పంచెలు; ఒక బద్దెకు కలిసి ఉన్నవి (కో. 24).

**సముద్రకుమారిపేటు** సముద్రంకెరటాల మాదిరిగా అంచుల్లో నేసే డిజైను (కో. 12ఎ).

**సముద్రలహరి** సముద్రంకెరటాల నమూనాలో అంచుపెట్టి నేసిన చీర; దీన్ని జాకార్డుదాబీమీద నేస్తారు (తె. 28).

**సంపంగి** **1.** వాసనలేని చిన్న సంపంగి పువ్వుల రంగు (కో. 2, 4, 6-9, 36, 37; తె. 13,

15, 17; రా. 1, 7, 8, 10, 11, 14. 19, 20, 22); **2.** గోధుమవన్నె మాదిరి రంగు (కో. 11); **3.** పసుపులో నలుపువన్నె (కో. 14); **4.** ఆకుపచ్చలో పసుపువన్నె (కో. 16); **5.** పంజుపొగాకురంగు (తె. 12); **6.** ముదురు నస్యం రంగు (తె. 27).

**సంపంగిచీర** సంపంగిపువ్వు రేకలరంగు చీర (కో. 2, 4, 9, 14, 36, 37; తె. 12, 15; రా. 1, 7, 8, 10, 14, 19, 20, 22).

**సంబారితాడు** పర్యా. చూ. ఊడ్త్రైతాడు(1). ఊడ్త్రైను నిలబెట్టి కిందిగూటానికి బిగించేతాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (కో. 12).

**సమ్మెలు** ఒక తెగ బిచ్చగాళ్ళు; చేనేత పనివారి దగ్గర వంశకథలు చెప్పి అడుక్కొంటారు (కో. 34).

**సమ్మెట** ఉ. సమ్మిట; పర్యా. దుక్క(2). పెద్ద సుత్తి; దీంతో ఊడ్త్రైగూటాన్ని నేలలోకి దిగ్గొడతారు (కో. 32, 33, 35, 36).

**సంరక్ష(ణ)గుండు** ఉ. సవరచ్చగుండు, సౌరచ్చ గుండు; పర్యా. చూ. సవలతుగుండు. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి; కొన్నిచోట్ల ఇనపగుండుగాని చిన్నచెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 9; తె. 4, 5).

**సంసారంచీర** నలుపు, కెంపు రంగుల్లో నేసిన చీరలో నిలువుగా బీరపువ్వురంగు గీరలు పడేట్టు నేసిన చీర; ఒక సినిమా పేరుమీద ప్రచారంలోకి వచ్చింది (తె. 15).

**సరట్లగుంజ** పర్యా. చూ. గూటం(3). ఊడ్త్రైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం; కొయ్యదిగాని ఇనపదిగాని రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7 (తె. 22).

**సరట్లతాడు** పర్యా. చూ. సరితాడు(3). సరిచేయటానికిచాపిన ఉన్నిపడుగును గూటాలకు బిగించే తాడు. చూ. చిత్రం 314.8 (తె. 22).

**సరట్టి** (బహు. సరట్లు) ఉ. సరట్ట, సరట్టు. **1.** పర్యా. చూ. సరిగుంజ(1). ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతినకొయ్య; కొన్నిచోట్ల రాతిస్తంభం; ఇటువంటివి రెండు ఉంటాయి. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (తె. 19, 22, 23, 28, 29, 33); **2.** పర్యా. చూ. సరిగూటం (3). సరిచేసేటప్పుడు ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్ర(=దానె)ను బిగించటానికి నేలలో పాతినకొయ్య; ఇటువంటివి మామూలుగా ఒకవైపు రెండు, మరొకవైపు ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 314.11 (తె. 20. 22).

**సరట్టిగుది** ఉ. సరట్టుగుది; పర్యా. చూ. సరిమట్టుగుది. సరిగుంజల అడ్డకట్టెకు వేసినతాడు; మామూలుగా ఇటువంటివి రెండుంటాయి; వీటికి పడుగేరుకర్ర తగిలిస్తారు. చూ. చిత్రం 65 ట. 1 (తె. 22, 29, 33).

**సరట్టిబడితె** ఉ. సరెట్టుబడితె; పర్యా. చూ. సరిమట్టుబడితె. సరిగుంజల పైవైపున అడ్డంగా కట్టిన కట్టె. చూ. చిత్రం 65 క. 1 (తె. 29).

**సరస్వతిపేటుచీర** ఉ. సరస్వతిపేటి-. ఒకరకం డిజైనులో నేసిన చీర (తె. 7).

**సరస్వతి(రంగు)** **1.** మెజంటాలో లేతరంగు (కో. 9); **2.** ఒకరకం ఎరుపు(క్రిమ్సన్)రంగు (రా. 3, 19బి, 24).

**సరాట** (? < సరివాటు) ఉ. సరటు, సరాటు, సరోటి, స్రరాట, సౌరట, సౌరవటి, సౌరాట; పర్యా. చూ. ఊడ్త్రై. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్య పనిముట్టు; రెండు పొడుగుపట్టెలు మడత మంచం కోళ్ళ మాదిరిగా అమర్చి పైన అడ్డపట్టె చేర్చి బిగించి ఉంటారు; కొన్నిచోట్ల దీని నిర్మాణం వేరుగా ఉంటుంది; తొగటవాళ్ళ వాడుక. చూ. చిత్రం 63 క (కో. 8; రా. 4, 6, 11, 13-15, 17-19).

**సరాటకాలు** ఉ. సొరాటకాలు; పర్యా. చూ. ఊడ్త్రైకాలు. నేలమీద మోసే ఊడ్త్రైకొయ్య; ఇటువంటివి మడతమంచం కోళ్ళమాదిరిగా రెండుంటాయి; వీటిపైన అడ్డపట్టె బిగిస్తారు. చూ. చిత్రం 63 క. 1 (రా. 11).

**సరాటగుంజ** ఉ. సరటుగుంజ; సొరాటుగుంజ; పర్యా. చూ. సరిగుంజ(1). ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య; కొన్నిచోట్ల రాతిస్తంభం; ఇటువంటివి ఒకటి రెండుంటాయి. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (రా. 11, 14).

**సరాటగుది** పర్యా. చూ. ఊడ్త్రైగుది(2). పడుగు చాపేటప్పుడు ఊడ్త్రై అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపేతాడు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 8 (రా. 18).

**సరాటతాడు** ఉ. సరోటితాడు. పర్యా. చూ. ఊడ్త్రైతాడు(1). ఊడ్త్రైను నిలబెట్టి కింది గూటానికి బిగించేతాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (రా. 4, 17).

**సరాటపట్టె** ఉ. సొరాటపట్టె; పర్యా. చూ. ఊడ్త్రైదండ. ఊడ్త్రై పైవైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (రా. 11).

**సరాటమోకు** ఉ. సరటుమోకు; పర్యా. ఊడ్త్రై

తాడు(1). ఊడైను నిలబెట్టి కిందిగూటానికి బిగించే తాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (రా. 15).

**సరి** **1.** పర్యా. సరిసాగు. గంజిపెట్టి చాపిన పడుగు (కో. 8, 9, 22-24, 32; తె. 1, 2, 6, 7, 9, 11-14, 19-22; రా. 8 16, 18, 19ఎ, 22, 24); **2.** గంజి ఆరబెట్టి నేతకు అనుకూలంగా పోగు బిరుసెక్కేటట్టు చేసిన పడుగు (తె. 8, 10, 19-26, 28-33; రా. 17, 18, 23, 24); **3.** పడుగు (కో. 28, 29, 30, 35; రా. 15, 17); **4.** పడుగుకుపెట్టే గంజి; కొన్నిచోట్ల అంబలి; నూలు బిరుసెక్కటానికి దీంతో పడుగు తడుపుతారు (కో. 2-7, 10); **5.** నార పడుగును తడిపే చింతగంజి (తె. 25); **6.** నేతలో నిలువు(తె.32); **7.** పర్యా. చూ. పడుగు(3). నేతలో నిలువుకు వాడే పట్టు (తె. 21); **8.** (-తడుపు) పర్యా. పడుగు(4), సరిపడుగు(3). ఉన్ని నేతలో ఆనుపోసి నిలువుకువాడే నూలు; పోగులు బిరుసెక్కటం కోసం దీన్ని చింతఅంబలితో తడిపి ఆరబెడతారు. చూ. చిత్రం 314.3 (తె. 7, 9, 25, 26).

**సరిఅటికె** ఉ. సరిఅటిక. **1.** పర్యా. గంజిఅటికె. పడుగుకుపెట్టే గంజి పోసుకొనే ఒకరకం మట్టిపాత్ర (తె. 2, 4, 6, 7; రా. 15); **2.** ఉన్నిపడుగుకు పెట్టే చింతఅంబలి పోసిన చిన్నకుండ. చూ. చిత్రం 314.13 (తె. 6).

**సరిఅతుకు** (క్రి.) పర్యా. చూ. అచ్చతుకు. బద్దె పోగులకు పడుగుపోగులు కలిపి వడిపెట్టడం (తె. 16).

**సరిఎత్తు** (క్రి.) పడుగు ఆరుతున్నప్పుడు కచ్చి పోగులు అంటుకుపోకుండా విడదియ్యటం; మామూలుగా అనిలాక దగ్గర మరొక లాక దూర్చి పైపోగులు పైకీ కింది పోగులు కిందికీ విడదీస్తారు (తె. 26).

**సరికచ్చి** (-పట్టు) పడుగులో అని వెంబడి దూర్చిన రెండు లాకల మధ్యభాగం (తె. 25).

**సరికట్టు** (క్రి.) గంజిపెట్టిన పడుగును నేతకు అనువుగా సాపుచెయ్యటం; ఊడైలకు చాపి కుంచెతో దువ్వుతూ ఆరబెడతారు (కో. 14).

**సరికాకు** చింతఅంబలి కాచే కుండ (తె. 7).

**సరికానోడు** నేతలో నిలువుకువాడే నూలుకు గంజి పెట్టి సాపుచేసేవాడు; సరిచేసేవాడు (కో. 1).

**సరికుంచె** **1.** (-పెట్టు) ఉ. సరికుంచి; పర్యా. చూ. కుంచె. గంజిపెట్టిన పడుగును ఆరుబయటచాపి దువ్వే పనిముట్టు; గంజి ఆరటానికి దీంతో దువ్వుతారు. చూ. చిత్రం 76 (తె. 11, 22, 26, 30, 33); **2.** పర్యా. చూ. కురమకుంచె. అంబలి పెట్టిన ఉన్ని పడుగును దువ్వేకుంచె; గొంగళ్ళు నేసే కురమవాళ్ళది; పదెగడ్డి వేళ్ళు(=పురి)కూర్చి కట్టింది; దీనికి పిడి ఉండదు. చూ. చిత్రం 314.12 (తె. 6).

**సరికుండ** **1.** గంజి తియ్యటానికి అన్నంవండే కుండ; ఈ గంజి పడుగుకు పెడతారు (తె. 27, 32); **2.** చింత అంబలి (ఉన్నిపడుగు తడిపేది) కాచేకుండ (తె. 6).

**సరికూటిగంజి** పర్యా. కూటిగంజి. పడుగుకుపెట్టే గంజి (కో. 7).

**సరికూడు** గంజి, అన్నం (కో. 3).

**సరికూలి** నిర్ణయించిన దానికంటె అదనంగా నేత పనివాడికి బహుమతిగా ఇచ్చిన కూలి; సీతాదేవి సరికూలి ఇచ్చినట్టు కథ చెపుతారు (తె. 14, 7).

**సరికొండె** ఉ. సరికొంకె; పర్యా. చూ. గద్దగోరు. ఊడై అడ్డపట్టెకు బిగించిన ఇనపకొక్కెం; సరిచేసేటప్పుడు వాడుక. చూ. చిత్రం 63 గ. 1 (తె. 19, 24).

**సరికొయ్య** **1.** ఉ. సరిగొయ్య; పర్యా. కొయ్య (3), గూటకొయ్య(1), పడుగుకొయ్య, వాటకొయ్య. ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్యగూటం. చూ. చిత్రం 63 క. 7 (కో. 25, 27, 31; తె. 10, 11, 17, 24, 25, 28-30, 33); **2.** పర్యా. చూ. సరిగుంజ(1). ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతినకొయ్య; ఇటువంటివి ఒకటి, రెండు ఉంటాయి; ఒకవైపున ఊడై, రెండోవైపు సరిగుంజ(లు) పాతుతారు. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (రా. 22).

**సరికోల** **1.** పర్యా. చూ. ఊడైదండె. ఊడై పైవైపున బిగించిన అడ్డపట్టె. చూ. చిత్రం 63 క. 3 (తె. 20); **2.** పర్యా. చూ. గూటం(3). ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం. చూ. చిత్రం 63 క. 7 (తె. 12); **3.** పర్యా. చూ. పడుగేరుకర్ర. పడుగు చాపినప్పుడు కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటి కర్ర; ఇటువంటివి రెండుంటాయి; మామూలుగా సరిచేసేటప్పుడు వాడుక. చూ. చిత్రం 69 (తె. 8, 22-24, 29 31,32).

**సరిగ** పర్యా. చూ. జరీ. బట్ట అంచులకుగాని డిజైన్లకోసంగాని నేతలో వాడే సన్నటి మెరుపు దారం; బంగారం, రాగి, వెండి మొ. వాటితో తయారు చేస్తారు (కో. 3).

**సరిగచీర** జరిపెట్టి నేసిన చీర (కో. 3)

**సరిగగంజి** మెత్తగా ఉడకబెట్టిన బియ్యపుజావ; దీన్ని ఒక గుడ్డలో తోమి పడుగుకు పెడతారు(కో.34).

**సరిగదబ్బ** చూ. సరిగబద్ద (తె. 6).

**సరిగబద్ద** యా. సరిగదబ్బ; పర్యా. చూ. సరిబద్ద.

ఉన్నిపడుగులో అనిపోగుల్లో దూర్చి వెదురుబద్ద; పడుగుపోగులు నాపుగా ఉండటానికి ఇటువంటివి దూరుస్తారు; కొన్నిచోట్ల తాటిబద్దలు వాడతారు. చూ. చిత్రం 314.4 (తె. 6).

**సరిగుంజ** 1. పర్యా. అరేట్లగుంజ, కడి, కంజం(2), కొయ్య(2), గుంజ(14), నిలువురాయి, పడుగుగుంజ (2), మేకు(4), మొద్దు, సరట్టి(1), సరాకిగుంజ, సరికొయ్య(2), సరిముట్టు. ఆరుబయట చాపిన పడుగు (=సరి) రెండోవైపు కట్టటానికి పాతినకొయ్య; కొన్నిచోట్ల రాతి స్తంభం; ఇటువంటివి ఒకటి రెండుంటాయి; ఒకవైపున ఊడై, రెండో వైపున సరిగుంజ(లు) పాతుతారు. చూ. చిత్రాలు 63 ఈ. 1 63 ఏ. 1 65 (కో. 13, 14; తె. 1, 2, 5, 6 9-18, 20, 21, 25-27; రా. 4, 6, 23); 2. పర్యా. చూ. గూటం (3). ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతినగూటం. చూ. చిత్రం 63 క. 7 (తె. 19).

**సరిగుండు** 1. సరిబండిమీద ఉన్ని రుబ్బే పొత్రం (రాయి). (తె. 7); 2. పర్యా. చూ. రుబ్బురాయి. రోట్లో పిండి రుబ్బే రాయి; చింతగింజలు నానబోసి రోట్లో రుబ్బి ఉడకబెడతారు (తె. 7).

**సరిగుది** ఉ. సరిగుతి; పర్యా. చూ. తిరుగుడుగురి. తిరుగుడుకు రెండువైపులా కట్టిన తాళ్ళు; ఊడై అడ్డపట్టెను పడుగేరుకర్రలను కలిపేవి. చూ. చిత్రం 71.2 (తె. 9; 19, 24).

**సరిగునపం** పర్యా. చూ. గడ్డపారి(1). ఊడైను నిలబెట్టి మోకుతో బిగించటానికి నేలలో పాతిన గునపం. చూ. చిత్రం 63 త. 1 (కో. 30).

**సరిగుర్రం** పర్యా. చూ. దొగ్గనం. ఆరుబయట ఊడైలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు; ఊడై మాదిరిగా వెదురు కర్రలు బిగించింది; చాపిన పడుగును బట్టి ఇటువంటివి 1-3 వాడతారు. చూ. చిత్రం 107 (రా. 1).

**సరిగూటం** 1. పర్యా. చూ. గూటం(3). ఊడైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం; కొయ్యదిగాని ఇనపదిగాని రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7 (కో. 25; తె. 6; రా. 23); 2. పర్యా. చూ. గూటం(4). ఊడైగూటాన్ని నేలలో దిగగొట్టే ఇనపమొద్దు (కో. 25); 3. పర్యా. ఊకరగుంజ, తలగూటం(1), సరట్టి(2). సరిచేసేటప్పుడు ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్ర (=దానె) బిగింపుకోసం నేలలో పాతిన కొయ్య; ఇటువంటివి మామూలుగా ఒకవైపు రెండు, మరొకవైపు ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 314.11 (తె. 6, 10, 25-28).

**సరిగొలుసు** పర్యా. చూ. గొలుసు. ఊడై అడ్డపట్టెకుగాని సరిగుంజకుగాని బిగించిన ఇనపపనిముట్టు; దీనికి పొడుగాటి ఇనపకొండ్లు రెండుంటాయి. చూ. చిత్రాలు 63 ఏ. 2, 70 (కో. 9).

**సరిగొలుసుతాడు** పడుగుచాపేటప్పుడు గొలుసు కడియాన్ని సరిగుంజకు కలిపికట్టే తాడు. చూ. చిత్రం 64 క. 1 (తె. 2)

**సరిగోక** ఉ. సరిగాక, సరిగోకు; పర్యా. చూ. పిడచ(1). పడుగు ఎడపటానికి గంజిలో ముంచిన గుడ్డ; కొన్నిచోట్ల ఒడ్డివేలికలు కుప్పచేసి పిడచగా ఉపయోగిస్తారు; దీంతో పడుగుకు గంజికాని అంబలికాని పట్టిస్తారు. చూ. చిత్రం 74.2 (కో. 3, 7, 12, 20, 21, 22, 25, 26, 28, 29, 32, 33, 35-37).

**సరిచిలకడ** ఉ. సరిచిలికడ; పర్యా. చూ. చిలకడ(1). సంచేయటానికిగాని నేతనేయటానికిగాని చాపిన ఉన్ని పడుగు బిగింపుకు తలకోలకు తగిలించినతాడు; దీన్ని ఊడుగోలకు వేస్తారు; సరిచేసేటప్పుడు సరట్టకు వేస్తారు; మామూలుగా ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 314.9 (తె. 6, 11).

**సరిచేయు** (క్రి.) ఉ. సరజేయు. 1. పర్యా. చూ. ఏరు. ఆరుబయట చాపిన పడుగు(=నేతలో నిలువుకు వాడే నూలు)పోగులు అంటుకుపోకుండా విడదీసి నెరపటం; తెగినపోగులు సరిచూసుకొని అతుకుతారు (కో. 20); 2. పర్యా. అరకజేయు, పడుగుచేయు. గంజిపెట్టిన పడుగును ఊడైలకు చాపి కుంచెతో దువ్వుతూ నేతకు అనుకూలంగా చెయ్యటం (కో. 8-10, 12, 19, 20, 23, 25; తె. 1-18, 23, 28,30-33; రా. 1, 10, 11, 13, 15-20, 22, 23).

**సరిజావ** మెత్తగా ఉడకబెట్టిన బియ్యపుజావ; దీన్ని ఒక గుడ్డలో తోమి పడుగుకు పెడతారు (కో. 34).

**సరిపెద్దు** (-పెట్టు) (? < సరాటువొద్దు) రూ. సరిసెద్దు, సరెద్దు; పర్యా. చూ. ఊడై. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు; రెండు పొడుగు పట్టెలు మడతమంచం కోళ్ళ మాదిరిగా అమర్చి పైన అడ్డపట్టె చేర్చి ఉంటారు; తొగటవాళ్ళ వాడుక. చూ. చిత్రం 63 క (కో. 4).

**సరితడుపు** (క్రి.) ఉ. సరిదడుపు. పడుగుకు గంజిపెట్టటం (కో. 9; తె. 2, 6, 7-11, 15, 17, 26-28; రా. 21, 22).

**సరితాడు** 1. కమాను(=దూదిఏకే కొయ్యపనిముట్టు) నరం నునుపుగా వచ్చేటట్టు చేసే ఈతనారతాడు (తె. 28); 2. ఉ. సర్తాడు, సర్దాడు; పర్యా. చూ. ఊడైతాడు(1). ఊడైను నిలబెట్టి కిందిగూటానికి

బిగించే తాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి; ఊ డై అడ్డపట్టెనుంచి కొంకివరకూ, లేదా బిళ్ళవరకూ ఒకటి, కొంకి నుంచి గూటం వరకూ మరొకటి ఉంటాయి; కొన్నిచోట్ల సరిచేసేటప్పుడు ఊ డైను బిగించే తాడు, చూ. చిత్రం 63 క. 5. (కో. 9. 14, 28 30; తె. 1 3. 4, 8, 10-13, 15-17, 19 20, 24, 25, 29, 31, 33); **3.** పర్యా. ఊకరతాడు, ఊడుగుతాడు, సరట్లతాడు, సరిపగ్గం. సరిచేయటానికి చాపిన ఉన్ని పడుగును గూటాలకు బిగించే తాడు. చూ. చిత్రం 314.8 (తె. 6, 9, 25, 26, 28).

**సరితిరుగుడు** పర్యా. తిరుగుడు(1). చాపిన పడుగు తిరగవెయ్యటానికి ఉపయోగించే కొయ్యపనిముట్టు; దీన్ని ఊ డైకుగాని సరిగుంజకుగాని తాళ్ళతో కడతారు; కొన్నిచోట్ల ఇనపది; కొన్నిచోట్ల తాడు; సరిచేసే టప్పుడు అంటారు. చూ. చిత్రం 71 (తె. 19).

**సరితొట్టి 1.** పర్యా. చూ. గంజితొట్టి(1). ఒకరకం మట్టిపాత్ర; పడుగుకు పెట్టటానికి దీంట్లో గంజి పోసు కొంటారు (తె. 11, 22, 25); **2.** పర్యా. చూ. అంబలి తొట్టి(2). చింతఅంబలి పోసిన తొట్టి; చిన్నకుండ (తె. 25).

**సరిదండిగె** పర్యా. చూ. దాన(1). సరిచేసేటప్పుడు ఉన్నిపడుగు ముందువైపు దూర్చిన లావాటి కర్ర; పడుగేరుకర్ర మాదిరిది; కొన్నిచోట్ల పడుగులో చివర ఎక్కించి సరిగుంజకు బిగిస్తారు. చూ. చిత్రం 314.1 (తె. 28).

**సరినక్క** పర్యా. చూ. గూటం(3). ఊ డైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్య గూటం; కొయ్యదిగాని ఇనపదిగాని రాతిదిగాని. చూ. చిత్రం 63 క. 7 (కో. 30).

**సరినీళ్ళు** పడుగు తడిపే గంజి(నీళ్ళు). (రా. 21).

**సరినూలు** పర్యా. పడుగునూలు. నేతలో పడుక్కు వాడే నూలు (కో. 20).

**సరినెరవు** (క్రి.) పర్యా. పొడుగునెరవు. సరిచేసే టప్పుడు పడుగుపోగులు విడదీసి వెడల్పుగా పరవటం (కో. 32).

**సరినేత 1.** రెండు రంగులనూలు చెరొక సగం పెట్టి నేసిన నేత (రా. 1, 19); **2.** నిలువు, అడ్డం ఒకే నెంబరు నూలుపెట్టి నేసిన నేత (కో. 12); **3.** ?ఒక రకం దారం పైనా ఇంకొకరకం దారం కిందా సమంగా వచ్చేట్టు నేసిన నేత(కో. 13); **4.** ?పచ్చినూలు సరిచేసి నేసిననేత (కో. 20).

**సరిపగ్గం** పర్యా. చూ. సరితాడు(3). సరిచేయ టానికిచాపిన ఉన్ని పడుగును గూటాలకు బిగించే తాడు. చూ. చిత్రం 314.8 (తె. 27).

**సరిపంగి** (-వచ్చు) పర్యా. పంగి. పడుగులో పై పోగులూ కింది పోగులూ కలవకుండా ఉండటం; కచ్చులు వేస్తే సరిపంగి వస్తుంది (తె. 5).

**సరిపట్టు** (క్రి.) **1.** పర్యా. చూ. చాపు(2). ఆరు బయట పడుగు పరవటం; రెండు ఊ డైలకు మధ్యగాని ఒక ఊ డైకూ సరిగుంజ(ల)కూ మధ్యగాని పడుగు చాపుతారు (తె. 5); **2.** పడుగుకు గంజి అంటటం; పడు గుకు గంజి పట్టకపోతే సరిచేసేటప్పుడు అలుకు వేస్తారు (కో. 7); **3.** నేతలో నిలువుకు వాడే పట్టుదారం(తె. 5).

**సరిపడుగు 1.** గంజిపెట్టిన పడుగు (కో. 10; తె. 1, 2); **2.** పర్యా. చూ. పడుగు(3). నేతలో నిలువుకు వాడే పట్టు (తె. 21); 3. పర్యా. చూ. సరి(8). ఉన్ని నేతలో ఉడుపోసి నిలువుకు వాడే నూలు; పోగులు బిరు సెక్కటం కోసం దీన్ని చింతఅంబలితో తడిపి ఆరబెడ తారు. చూ. చిత్రం 314.3 (తె. 7).

**సరిపాయ** పర్యా. చూ. పాయ(8). పడుగుపోగుల్లో కొంతభాగం; అచ్చతికేటప్పుడు పడుగు పాయలుగా విడ దీసి ఒక్కొక్క పోగే అచ్చుపోగుకు అతుకుతారు. చూ. చిత్రం 102 క. 4 (కో. 33).

**సరిపిడచ** ఉ. సరిపిడన, సరిపిడీని; పర్యా. చూ. పిడచ(1). పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ; కొన్నిచోట్ల బద్దెపేలికలు కుప్పచేసి పిడచగా ఉపయో గిస్తారు; దీంతో పడుగుకు గంజికాని అంబలికాని పట్టి స్తారు. చూ. చిత్రం 74.2 (కో. 31, 36; తె. 16, 22-25, 32; రా. 23).

**సరిపీట** పర్యా. పూతపీట. సరిచేయటానికి చాపిన ఉన్నిపడుగును బిరుపెట్టటానికి సరితాడుకు తగిలించిన కొయ్యబిళ్ళ. చూ. చిత్రం 314.10 (తె. 26).

**సరిపూయు** (క్రి.) పడుగుకు గంజిపెట్టటం; గంజి పూయటం (కో. 2).

**సరిపెట్టు** (క్రి.) పడుగుకు గంజిపెట్టటం (కో. 6ఎ).

**సరిపోగు** అచ్చతికే పడుగుదారం (తె. 15).

**సరిబండ** పర్యా. చూ. గంజిబండ. గంజి, అంబలి మొ. వాటితో పడుగు తడపటానికి పరిచిన రాయి. చూ. చిత్రం 74.1 (కో. 4, 6, 9, 14, 30; తె. 1, 3, 7-9, 11, 13-15, 19, 21-28, 30, 31; రా. 11, 22-24).

**సరిబద్ద** పర్యా. పడుగేరుబద్ద, బద్ద(11), సరిగబద్ద, సరిసలిగె. ఉన్నిపడుగులో అనిపోగుల్లో దూర్చిన వెదురు బద్ద; పడుగుపోగులు సాపుగా ఉండటానికి ఇటువంటివి దూరుస్తారు; కొన్నిచోట్ల తాటిబద్దలు వాడతారు. చూ. చిత్రం 314.4 (తె. 9, 11, 25-28).

**సరిబయలు** సరిచెయ్యటానికి పడుగుచాపే బహిరంగ ప్రదేశం (రా. 15-18, 24).

**సరిబాన** పర్యా. చూ. గంజిబాన. పడుగుకు పెట్టటానికి గంజి పోసుకొనే ఒకరకం మట్టిపాత్ర (తె. 19).

**సరిమట్ట** ఉన్నిపడుగులో కిందిపోగులకు, పైపోగులకు మధ్య దూర్చిన తాటిబద్ద(లు); పడుగుపోగులు సాపుగా ఉండటానికి ఇటువంటివి దూరుస్తారు; కొన్నిచోట్ల వెదురు బద్దలు వాడతారు; చూ. సరిబద్ద. చూ. చిత్రం 314.4 (తె. 10).

**సరిమట్టు** ఉ. సరిమట్ట; పర్యా. చూ. సరిగుంజ(1). ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య; కొన్నిచోట్ల రాతి స్తంభం; ఇటువంటివి ఒకటి రెండుంటాయి. చూ. చిత్రాలు 63 ట. 1, 63 ర. 1, 65 (తె. 30-32).

**సరిమట్టుగుది** ఉ. సరిమట్టగుది; పర్యా. అట్టిగుది, సరట్టిగుది, సరిమట్టుతాడు. సరిగుంజల అడ్డకట్టెకు వేసిన తాడు; మామూలుగా ఇటువంటివి రెండుంటాయి; వీటికి పడుగేరుకర్ర తగిలిస్తారు. చూ. చిత్రం 65 ట. 1 (తె. 31, 32).

**సరిమట్టుతాడు** పర్యా. చూ. సరిమట్టుగుది. సరిగుంజల అడ్డకట్టెకు వేసిన తాడు; మామూలుగా ఇటువంటివి రెండుంటాయి; వీటికి పడుగేరుకర్ర తగిలిస్తారు. చూ. చిత్రం 65 ట. 1 (తె. 30).

**సరిమట్టుబడితె** ఉ. సరిమట్టబడితె; పర్యా. అడ్డకట్టె(8), అడ్డపట్టె(12), అడ్డబడె(1), అడ్డెట్లబడె బయలుకట్టె, సరట్టిబడితె. సరిగుంజల పైవైపున అడ్డంగా కట్టిన కట్టె. చూ. చిత్రం 65 క. 1 (తె. 31, 32).

**సరిమండిగె** ఉ. సరిమండిక; పర్యా. చూ. మండిగె (1). వెడల్పు మూతిగల గుండ్రటి మట్టిపాత్ర; మామూలుగా పడుగుకు పెట్టే గంజి దీంట్లోకి తీసుకొంటారు (కో. 29, 31).

**సరిమల్లు** ?ఒకరకం గడినేత; సరిమళ్ళు (రా. 10).

**సరిముట్టా** 1. (-చుట్టు) పడుగులో చివర చుట్టిన పాయ (తె. 1, 2, 6); 2. పర్యా. చూ. పాయ(8). పడుగుపాయల్లో కొంత భాగం; అచ్చుతికేటప్పుడు పడుగును పాయలుగా విడదీసి ఒక్కొక్క పోగే అచ్చుపోగుకు అతుకుతారు. చూ. చిత్రం 102 క. 4 (తె. 1, 9).

**సరిముంత** కుండలో నుంచి అంబలి తీసుకొనే పిడత (తె. 33).

**సరిమోకు** పర్యా. చూ. ఊడ్డైతాడు(1). ఊడ్డైను నిలబెట్టి కింది గూటానికి బిగించే తాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63 క. 5 (కో. 10, 16, 26, 32, 34, 35; తె. 1, 2; రా. 23).

**సరిమోకుబిడి** సరిమోకు (=ఊడ్డైతాడు) బిగించి వేసిన ముడి (కో. 34).

**సరింబేక(లు)** పర్యా. చూ. నిలువుంబేక(లు). నేతలో పొడుగు, అడ్డం (తె. 32).

**సరిరాయి** పర్యా. చూ. దానెరాయి. సరిచేసేటప్పుడు ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్ర (=దానె) బిగింపుకోసం నేలలో పాతిన రాయి; ఇటువంటివి మామూలుగా ఒకవైపున రెండు, మరొకవైపున ఒకటి ఉంటాయి. చూ. చిత్రం 314.2 (తె. 25).

**సరిలాక** (-ఎక్కించు, -నడుపు) ఉ. సర్లాక; పర్యా. అనిలాక. సరిచేసేటప్పుడు పడుగులో దూర్చిన అడ్డబద్ద(లు); మామూలుగా అని వెంబడి దూరుస్తారు; చూ. లాక (కో. 28; తె. 19, 20, 22-25, 29, 31, 32).

**సరివడుకు** (క్రి.) ఉ. -ఒడుకు. నేతలో నిలువుకు వాడే పట్టుదారం; పెద్దరాట్నంమీద; వడకటం (తె. 5).

**సరివన్నె(నేత)** పడుగు, పేక ఒకేరంగు పోగులు (సమానమైన సంఖ్యలో) పెట్టి నేసిన నేత (కో. 7).

**సరిసలిగె** పర్యా. చూ. సరిబద్ద. ఉన్నిపడుగులో అనిపోగుల్లో దూర్చిన వెదురుబద్ద; పడుగుపోగులు సాపుగా ఉండటానికి ఇటువంటివి దూరుస్తారు. చూ. చిత్రం 314.4 (తె. 7).

**సరిసాగు** పర్యా. సరి(1). గంజిపెట్టి చాపిన పడుగు (తె. 15).

**సరిసారు** (క్రి.) ?సరిచేసేటప్పుడు పడుగుకు పెట్టిన గంజి చేతులతో సమంగా రుద్దటం (తె. 16).

**సరిసుక్కిచీర** రెండు కొలుకులు తెలుపు, రెండు కొలుకులు వక్కరంగు పెట్టి అంచుల మధ్య నేసిన చీర (రా. 15).

**సరిసెద్దు** చూ. సరిఎద్దు (రా. 16).

**సరిసెద్దుబయలు** సరిచెయ్యటానికి ఊడ్డై(సరిసెద్దు)లకు పడుగు చాపే బహిరంగప్రదేశం (రా. 16).

**సరుకుచెక్కరంగు** సరుకుచెట్టు ఆకుతోగాని చెక్కతోగాని తయారుచేసిన ఎరుపురంగు (కో. 7).

**సరుగుడు** బియ్యం నానబోసి రుబ్బి ఉడకబెట్టింది; ఇది పడుగుకు పెడతారు (కో. 5).

**సరుగునేత** (? < చెరగు-) పర్యా. చూ. గట్టినేత. పడుగులో పేకదారం పోగులు కలిసిపోయేటట్లు చిక్కగా నేసిన నేత (రా. 3).

**సరెంటి** (-వేయు) ఉ. సరెంటు, సరెంటె. **1.** పర్యా. ఎంటి(1). వడిదిప్పి చుట్టిన నూలు; సరిచేసిన తరవాత మామూలుగా ఒక కర్రకు చుడతారు; అల్లుచేసిన తరవాత చుట్టుగా చుడతారు. చూ. చిత్రం 83 (తె. 4, 5, 11-15); **2.** పర్యా. చూ. ఎంటి(2). అచ్చుతికిన తర

వాత చుట్టబెట్టిన పడుగునూలు. చూ. చిత్రం 112 క. 5 (తె. 10); **3.** (< సరి + ఎంటి) పర్యా. ఎంటి(5). చుట్టు(5), జెతకట్టు, నూలుంట, పడుగుకట్ట, పడుగు చుట్ట, పాగడ(4), విరుపుమల. చుట్టచుట్టిన పడుగు నూలు; మగ్గంమీద కొంత చావగా మిగిలింది ఒక కర్రకు చుడతారు; కొన్నిచోట్ల పురబెట్టి చుడతారు; కొన్ని చోట్ల పెడకోలకు కట్టి ఉంచుతారు. చూ. చిత్రం 128 ట. 1, 128 జ. 2 (తె. 4, 15).

**సరెంటిపాగడ** సరిచేసిన తరవాత చుట్టిన పడుగు (తె. 12).

**సరెంవేయు** (క్రి.) పర్యా. ఎంవేయు. సరిచేసిన పడుగు చుట్టి వెయ్యటం (తె. 13, 14).

**సరెద్దు** ఉ. సరద్దు; పర్యా. చూ. ఊత్రై. ఆరు బయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు; రెండు పొడుగుపట్టెలు మడతమంచంకోళ్ళ మాదిరిగా అమర్చి పైన అడ్డపట్టె చేర్చి ఉంటారు; హరిజనుల వాడుక. చూ. చిత్రం 63 క (కో. 6, 8, 9; తె. 13; రా. 21).

**సరెద్దుమోకు** పర్యా. ఊత్రైతాడు(1). ఊత్రైను నిలబెట్టి కింది గూటానికి బిగించేతాడు; ఇటువంటివి మామూలుగా రెండుంటాయి. చూ. చిత్రం 63క. క (కో. 9).

**సరేపోలమ్మపండుగ** దేవాంగులు వైశాఖమాసంలో చేసుకొనే ఒక పండుగ; ఇల్లు శుభ్రం చేసుకొని బంధు బలగాన్ని పిలుచుకొని అట్లు, బూరెలు, గారెలు, పళ్ళు, బియ్యం, పసుపు, కుంకుమ, మొ.వి కొత్తకుండలో పెట్టి పైన అన్నముద్దంపెట్టి దానిపైన దీపంపెట్టి నెత్తిమీద పెట్టుకొని అమ్మవారి గుడికి వెళ్తారు (కో. 35).

**సరోజ** ఒకరకం గులాబి(లేత)రంగు (కో. 2).

**సర్వ** గుండ్రంగా ఉండే ఒకరకం ఇత్తడిగిన్నె; పట్టుపడుగుకు పెట్టే గంజి తయారీకి దీంట్లో తెల్ల జొన్నలు నానబెడతారు (తె. 17).

**సర్వటిగుంజ** దనలి(పట్టు)పడుగు సరిచెయ్యటానికి ఊత్రైకు రెండోవైపు నేలలో పాతిన కొయ్యరాట; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 297.6 (తె. 7).

**సలకం** పర్యా. చూ. గొట్టం(2). రాటిఆకులు బిగించిన వెదురుగొట్టం; దీన్ని సూలానికి దూర్చి రాటి తిప్పుతారు. చూ. చిత్రం 31 త. 1 (తె. 32).

**సలాక** ఉ. సలాకు. **1.** రూ. సలాకి(2). పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటి కట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 17 19 27 32); **2.** పర్యా. చూ. పలక(7). మరమగ్గంలో పన్నె బిగించి పైచెక్క; నేతనేసేటప్పుడు పడుగులో పేకపోగు వేసి దీంతో అదముతారు. చూ. చిత్రం 118.10 (తె. 16); **3.** రూ. సలాయి; పర్యా. కడ్డీ(5) కమ్మి(10). నేత బద్దెను దోనెకు బిగించే పొడుగాటి ఇనపచువ్వ; చూ. బద్దెచువ్వ (తె. 22); **4.** రంగునీళ్ళ అండాలో ఉడక బెట్టటానికి నూలులడీలు తగిలించిన ఇనపఊచ; దీన్ని పట్టుకోటానికి వీలుగా రెండు వైపులా వంపులు ఉంటాయి; దీంతో లడీలు రంగునీళ్ళలోకి దించి అండా అంచుల మీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (తె. 1, 2, 6, 23, 24).

**సలాకి** **1.** రాటి సూలం దూర్చిన ఇనప ఊచ. చూ. చిత్రం 31 త. 2 (తె. 14); **2.** చూ. సలాక(1) (తె. 10, 11, 14); **3.** దండెదగ్గర నేతపడుగులో దూర్చిన ఇనపఊచ; వెదురుబెత్తానికి మారుగా పెడతారు (తె. 19); **4.** పర్యా. చూ. పానుపుపట్టె. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య; నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది; దీనికి రెండు చివరలా సొరుగులు ఉంటాయి. చూ. చిత్రం 118.9 (తె. 15).

**సలాకులు** జంపఖానా మగ్గం దోనె గాడిలో బిగించిన చిన్నపుల్లలు; పండ్లు (తె. 17).

**సలాఖ** పర్యా. చూ. కొడుపు. పత్తినుంచి గింజలు వేరుచెయ్యటానికి వాడే ఇనపకడ్డీ; ఇది అప్పడాలకర్ర లాగ ఉపయోగిస్తుంది. చూ. చిత్రం 2.2 (తె. 28).

**సలాయి** చూ. సలాక(3) (తె. 9).

**సలాయి(చీర)** **1.** అంచుల మధ్య నేతలో సన్న గీరలు పడేట్టు నేసిన చీర (తె. 24); **2.** అయిదు కొలుకుల దారం కడవనల్ల(=నీలి), రెండుకొలుకుల దారం మరొక రంగు పెట్టి నేసిన చీర (రా. 24).

**సవకాలగడి** ఒకరకం నేతగడి (కో. 20).

**సవకాలగడిచీర** చూ. చౌకంగడిచీర (కో. 20,21).

**సవకాలచీర** ఉ. సవకాళ్చీర. ఒకరకం గళ్ళచీర; మట్టిరంగు పడుగులో తెల్లగళ్ళు పడేట్టు నేస్తారు; ఈ రకం చీరకు ఎర్రగుండంచు పెడతారు (కో. 22).

**సవర** ఉ. సౌర. నూలుపోగులలెక్క: **1.** ఆరుపోగుల దారం (తె. 23, 33); **2.** నాలుగు పోగులదారం; చూ. సవెడు (కో. 30).

**సవరచేయు** (క్రి.) రూ. జవరచేయు. సరిచేసేప్పుడు పడుగుకు పెట్టిన గంజి చేతులతో సమంగా రుద్దటం (తె. 18, 20, 22).

**సవలక్షగుండు** ఉ. సవలచ్చగుండు, సవలక్షగుండి,

నవాలక్షగుండు, సొలతుగుండు; పర్యా. ఊటగుండు, కూకుడుగుండు, గజ్జిరాయిగుండు, గుండు(8), గుండ్రాయి(1), చివరరాయి, చివ్వగుండు, చూకరాయి, తూకంగుండు, తూకు(డు)రాయి, తూగుడుగుండు, తూంగుండురాయి, తూట్రాయి, తూనికగుండు, తూనికరాయి, దండెగుండు, దండెదురురాయి, దండెముందలిరాయి, నడిమిగుండు, పూనుగురాయి, బింగిసిరాయి, రాయిభారం, లక్షవరాలగుండు, లాకలగుండు, వేలక్షగుండు, సంరక్ష(ణ)గుండు, సూత్రపుగుండు(2). దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన (గుండ్రటి) రాయి; కొన్నిచోట్ల ఇనపగుండుగాని చిన్న చెక్రంగాని కడతారు. చూ. చిత్రం 126.3 (కో. 14; తె. 1, 2, 7-5, 21-23 25-28; రా. 23, 24).

**సవిలె** నూలుపోగులలెక్క: నాలుగు పోగులదారం; చూ. సవెడు (తె. 5).

**సవెడు** ఉ. చౌడు, సవడు, సవ్వడు, సౌడు; పర్యా. పణం. నూలుపోగులలెక్క: **1.** మూడుపోగులదారం (తె. 9, 11); **2.** నాలుగుపోగుల దారం; కొన్నిచోట్ల పట్టుదారం (కో. 19, 22, 27; తె. 5, 12).

**సాగనార** నడిమి ఎత్తుకు పెరిగే ఒకరకం మొక్క మట్టలనుంచి తీసిన నార; కిత్తనార (కో. 11. 13).

**సాగు** **1.** పర్యా. చూ. తొక్కుడుపట్టె(2). రాట్నం అడ్డపట్టె; దీన్ని ఒక కాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు. చూ. చిత్రం 15.3 (తె. 9). **2.** పర్యా. జారు(3). పడుగేరేటప్పుడు, సరిచేసేటప్పుడు, అల్లుచేసేటప్పుడు చాపిన పడుగు; ఆరుబయట రెండు ఊడ్తెలకు మధ్యగాని ఒక ఊడ్తెకు సరిగుంజ(ల)కు మధ్యగాని చాపుతారు; నేతనేసేటప్పుడు దోనెకు, మలగట్టు కర్ర(ల)కు మధ్య చాపుతారు (కో. 6, 9బి, 10); **3.** పర్యా. చూ. నేతసాగు(2). మగ్గానికి అమర్చి. నేతబయలులో చాపిన పడుగు నూలు. చూ. చిత్రం 127.17 (కో. 9బి; తె. 8, 17, 25, 32).

**సాగుకేయు** (క్రి.) ఉ. సాక్కేయు. అల్లుచెయ్యటానికి ఆరుబయట పడుగు చాపటం (కో. 6ఎ).

**సాగుచాపు** (క్రి.) ఉ. సాగుసాపు. ఆరుబయట సాగు(=చాపేపడుగు)పరవటం; రెండు ఊడ్తెలకు మధ్యగాని ఒక ఊడ్తెకూ సరిగుంజ(ల)కూ మధ్యగాని చాపుతారు (కో. 10).

**సాచినూలు** పర్యా. మెతుపునూలు. మెత్తగా ఉండి తెగే నూలు; పందలపాక నూలును అనేవారు(రా.20).

**సాంచా** పర్యా. చూ. అడ్డబేలు. చేతిమగ్గంమీద డిజైన్లు నెయ్యటానికి నేతపడుగుకు పైన వంతెన మాదిరిగా అడ్డంగా కట్టిన లావుదారాలు. చూ. చిత్రం 136 క. 1 (తె. 21).

**సాంచె(లు)** డిజైన్లు నేసే చేతిమగ్గంలో అడ్డబేలు నుంచి పడుగులోకి వేలాడే దారాలు. చూ. చిత్రం 136 క. 3 (తె. 18).

**సాంజ్** (హిం.) పర్యా. చూ. గూడు(3). పన్నె దండెలకు బిగించిన పుల్లమధ్య వెలితి; అచ్చుకట్టేటప్పుడు ఒక్కొక్క దాంట్లో రెండేసి బద్దెపోగులు దూరుస్తారు: నేతనేసేటప్పుడు పడుగులో కిందిపోగు ఒకటి, పైపోగు ఒకటి దీంట్లో ఆడతాయి; పన్నెగట్లవాళ్ళ వాడుక. చూ. చిత్రం 88 క. 9 (కో. 7).

**సాటా** (హిం.) పర్యా. చూ. దండె(3). పన్నెకట్టుబడిలో ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురు బెత్తం; ఇటువంటివి పైనా కిందా రెండేసి ఉంటాయి; పన్నెగట్లవాళ్ళ వాడుక. చూ. చిత్రం 88 క. 5 (కో. 5, 7; రా. 24).

**సాటింగుపేటంచు** రిబ్బను మాదిరిగా నేత అయిమూలగా కనబడేట్టు (=రిబ్బనుపేటు) నేసిన అంచు; ?సైటిన్‌పేటు (రా. 7).

**సాదాఅచ్చు** మామూలు అచ్చు; పైన ఒక పోగూ కింద ఒక పోగూ పన్నెగూట్లో నుంచి దూర్చింది. చూ. అచ్చు (కో. 9).

**సాదాఅంచు** చీర అంచులో నిలువుకు రంగుపోగులు పెట్టి అడ్డానికి పేకదారంపెట్టి నేసిన మామూలుఅంచు; సుమారు బెత్తెడు వెడల్పుది (కో. 5, 8, 9, 13, 34, 37; రా. 13, 16, 17).

**సాదాకండువా** ఉ. సాదాకాండువా. మామూలుగా నేసిన కండువా (కో. 34).

**సాదాకమ్మి** మామూలుగా బెత్తెడు వెడల్పున నేసిన కమ్మి; కొన్నిచోట్ల బొటనవేలెడు వెడల్పు పిల్లచెరగు నేసి రెండువేళ్ళ వెడల్పు మామూలు గళ్ళు నేస్తారు (కో. 4, 10, 13, 25, 26, 30; రా. 8, 11).

**సాదాకుంచె** ఉ. సాదాకుంచి. **1.** పర్యా. చూ. పలకకుంచె. కుంచెపరుపు(=పురి అడుగుభాగం)సమతలం (=చదును)గా ఉన్న కుంచె. చూ. చిత్రం 76 క. 11 (రా. 15, 17); **2.** (-లాగు, -వేయు) పడుగు మీద ఒకవైపునుంచి మరొక వైపుకు ఆపకుండా కుంచెతో దువ్వటం; సరిచేసేటప్పుడు మొదట కొంతసేపు ఇలా దువ్వుతారు (కో. 7; రా. 1, 2, 7, 8).

**సాదాకుప్పడం** అంచులకు ప్రత్యేకంగా వేరేరంగు పేకదారాలు పడేట్టు నేసిన మామూలునేత; చూ. కుప్పడం (కో. 34, 36).

**సాదాకొంగు** పడుగుకు ఏదైనా రంగుపెట్టి డిజైన్లు లేకుండా మామూలుగా నేసిన చీర చెరగు (తె. 18).

**సాదాగట్టికమ్మి** డిజైన్లు లేకుండా మామూలుగా చిక్కగా నేసిన కమ్మి (కో. 5).

**సాదాగడిచీర** మామూలుగా నేసిన గళ్ళచీర (కో. 12).

**సాదాచీర** డిజైన్లు లేకుండా నేసిన మామూలు నేత చీర; మామూలుగా పడుగు చిగురంచు ఒకరంగు(తెలుపు)లోను అంచు, కమ్మి ఒకరంగు(నలుపు)లోను పెట్టి నేస్తారు (కో. 6; రా. 3).

**సాదాచెట్లకమ్మి** చెట్ల మాదిరి నమూనాలు నేసిన ఒకరకం కమ్మి (తె. 13).

**సాదాజముఖానా** ఒకేరంగు నూలుతో నేసిన జంపఖానా (తె. 1).

**సాదాతువ్వాలు** ఉ. సాదాతువాలు. మామూలుగా నేసిన తువ్వాలు (తె. 1, 24, 25).

**సాదాధోతి** ఉ. సాదాదోతి. మామూలుగా నేసిన పంచె (తె. 23).

**సాదానాడె 1.** ఉ. సాదానాడి. మామూలు నేత నాడె; చూ. నాడె. (కో. 25-28, 30-32); **2.** వజా నేతలో అంచుల మధ్యభాగం నెయ్యటానికి పేకదారం కండె బిగించిన మామూలునాడె; చూ. నాడె. చూ. చిత్రాలు 131 క, 131 చ (కో. 34).

**సాదానేత** ఉ. సాదనేత. పడుగు, పేక ఒకే రకంగా ఉండేటట్టు నేసిన నేత; డిజైన్లు లేకుండా నేసిన నేత (కో. 4, 6, 9, 11-21, 24, 26, 29, 31-37; తె. 1, 4, 5, 11-17, 23-33; రా. 3, 7, 9, 10, 12-15, 19-22).

**సాదాపరుపుకుంచె** పర్యా. చూ. పలకకుంచె. కుంచె పరుపు (=పురి అడుగుభాగం) సమతలం (=చదును)గా ఉన్నకుంచె. చూ. చిత్రం 76 క. 11 (రా. 11).

**సాదాపేటు** అంచులో నేసిన ఒకరకం డిజైను (రా. 19బి).

**సాదాబుటా** రెండు అంచుల మధ్యభాగంలో నేసిన ఒకరకం డిజైను (కో. 17).

**సాదామలుకు** పన్నెకట్టుబడిలో దండెల మధ్య ఈనెలు బిగించి దారంతోవేసిన మామూలు కట్టు (కో. 1).

**సాదాముంగి** మామూలు నేతగడి; చిన్నది (తె.23).

**సాదారేషన్** మామూలుపట్టు(=రేషన్ (కో. 15).

**సాదాలుంగీ** మామూలుగా నేసిన లుంగి (కో. 36).

**సాదావజా** పేకపోగులు అంచులోకి రాకుండా వేరే పోగులు పెట్టి నేసిన డిజైను నేత (కో. 34, 37).

**సాదావడి** మామూలు దారంతో అచ్చుకర్ర(ల)కు వేసిన అల్లిక; చూ. వడి (కో. 26).

**సాదావల్లె** ఉ. -ఒల్లె. కన్నెపిల్లలు కట్టుకొనే చిన్న చీర; మామూలుగా నేసింది (తె. 23).

**సాధనాశూరులు** పద్మసాలీల దగ్గర గారడివంటి వినోదవిద్యలు ప్రదర్శించి అడుక్కొనేవాళ్ళు; పద్మసాలీలలో ఒక శాఖ (కో. 3, 7; తె. 4).

**సాన(రాయి)** ఉ. సాన్రాయి; పర్యా. నిషానా. పన్నె కట్టటానికి వాడే కత్తులకు పదునుపెట్టే సున్నపురాయి. చూ. చిత్రం 89 త. 1 (కో. 1, 5).

**సానిక** వెడల్పు మూతిగల తొట్టె(=మూకుడు); దీంట్లో నూలుకండెలు వేసుకొంటారు; కండెలు చుట్టేటప్పుడు దీంట్లో నీళ్ళుపోసి ఉంగరంగాని గుండుగాని పెట్టి పోగు తీస్తారు. చూ. చిత్రం 55 (కో. 6).

**సాపుకత్తి** పర్యా. పనికత్తి, మారుకత్తి. పన్నె దండెల మధ్య బిగించిన పుల్లలు సాపుచేసే కత్తి; ఒక మొద్దుకత్తి, ఒక పదునుకత్తి వాడతారు. చూ. చిత్రాలు 89 క. 1, 89 చ. 1 (కో. 33).

**సాప్పి** రేకుడబ్బాల మీద నూలుచుట్టే యంత్రం; నూలుమిల్లుల్లో ఉండేది (రా. 17).

**సాఫ్లవరు** ఉ. సాప్లవరు. ఒకరకం లేత నీలంరంగు (కో. 24).

**సాబుదానాగంజి** ఉ. సాబుదానగంజి. సగ్గుబియ్యం ఉడకబెట్టి చేసిన గంజి; దీన్ని పడుగుకు పెడతారు (తె. 21).

**సాంపోంకాహునర్** తివాసీనేతలో పాముల నమూనాలు నేసిన డిజైను (తె. 17).

**సాయబ్బులు** తురక(సాయెబు)లు; చేనేతకు పనికి వచ్చే పన్నె, అచ్చు మొ. తయారుచేస్తారు (రా. 1, 5, 6, 21).

**సారం** పర్యా. చూ. కారం(2). చౌడు, సున్నం కలిపిన నీళ్ళు; రంగు అద్దేముందు దీంట్లో నూలులడీలు వేసి ఉడకబెడతారు (రా. 13).

**సారంగి** పెద్దగడిలో సన్నగళ్ళు పడేట్టు నేసినచీర; మల్లెపందిరి అనీ అంటారు. చూ. చిత్రం 275 (తె. 1).

**సారణంచేయు** (క్రి.) ?సరిచేసేటప్పుడు పడుగుకు పెట్టిన గంజిచేతులతో సమంగా రుద్దటం (తె. 16).

**సారంతీయు** (క్రి.) రంగు అద్దే ముందు నూలు తడపటానికి చౌడు, సున్నం నీళ్ళలో కలపటం (రా. 13).

**సారెచీర** పెళ్ళికూతురుకు అత్తవారు సారెపెట్టే చీర (కో. 33, 35).

**సారాల్లె** (<సారె+వల్లె) పిల్లను అత్తవారింటికి

పంపేటప్పుడు పుట్టింటివారు పెట్టే చిన్నచీర; ఆడపిల్లలకు పెట్టే సారెచీర; తెల్లటిది (తె. 31, 32).

**సాలారిఅంచు** ఒకరకం సన్నఅంచు (రా. 3).

**సాలారిచీర** నేతలో నిలువున పదిపన్నెండు కోలుకుల గీరలు పడేట్టు నేసిన చీర (రా. 14, 15).

**సాలికట్టునేత** రూ. సాలుకుట్టునేత; పర్యా. చూ. చల్నేత. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్లు నేసిన నేత; మేటీనేత మాదిరిది; అనిమూసి నేస్తారు (రా. 7, 8).

**సాలిపెద్దీలు** రెండు మూడేళ్ళ కొకసారి సేనాపతుల దగ్గర అడుక్కొనేవాళ్ళు (కో. 22).

**సాలుకుట్టునేత** చూ. సాలికట్టునేత (రా. 13).

**సాలుమలేయు** (క్రి.) నరిచేనేటప్పుడు పడుగు తిరగెయ్యటం (కో. 37).

**సాలెబత్తులు** చేనేతపనిచేసే వాళ్ళలో ఒక తెగ; సాలీలు (కో. 18).

**సాల్నాడె** ఉ. సాల్నాడి; పర్యా. అంచునాడె. అంచునేతకు ప్రత్యేకంగా వాడే కొమ్మునాడె; చిన్నది; వజానేతకు వాడతారు. చూ. చిత్రం 131 ట (కో. 33, 34, 36, 37).

**సావా** నూలుపోగుల లెక్క: ఆరుపోగుల దారం (తె. 27).

**సిగ** ?అనికట్టు (కో. 1).

**సిగకొండి** ఉ. సిక్కొండి. ?అంచుల్లో డిజైన్లు పడటానికి మగ్గానికి పైన అమర్చిన ఒకరకం పనిముట్టు; దీంతో నేసే మగ్గానికి మగ్గంగుంటలో మూడు పావుచెక్కలు అమరుస్తారు (తె. 25).

**సిగకొండి(అంచు)** ఉ. సిక్కొండి-. మగ్గానికి పైన సిగకొండి(=డిజైను నేతనేసే ఒకరకం పనిముట్టు) అమర్చి పేకదారంరంగు అంచులో కలవకుండా వేరే రంగు దారంతో నేసిన అంచు; పైన కొండ్లుగట్టి మగ్గంగుంటలో పావుచెక్కలకు దారంకట్టి నేస్తారు (తె. 25).

**సిగకొండికోతికొయ్య** ఉ. సిక్కొండి-. అంచుల్లో డిజైన్లు పడటానికి మగ్గానికి అమర్చిన ఒకరకం పనిముట్టు కట్టుబడిలో ఒక భాగం (తె. 25).

**సిగకొండికోల** ఉ. సిక్కొండి-. అంచుల్లో డిజైన్లు పడటానికి మగ్గానికి అమర్చిన ఒకరకం పనిముట్టు(=సిగకొండి)కట్టుబడిలో భాగం (తె. 25).

**సిగకొండినేత** ఉ. సిక్కొండి-. మగ్గానికి పైన సిగకొండి(=అంచుల్లో డిజైన్లు పడటానికి ఉపయోగించే ఒకరకం సాధనం) అమర్చి నేసిన నేత; మగ్గంగుంటలో మూడుపావుచెక్కలు అమర్చి రెండునాడెలతో నేస్తారు; అంచులకు వేరే నూలు పెడతారు (తె. 25).

**సిగకొండిసూత్రం** ఉ. సూత్ర్రం. అంచుల్లో డిజైన్లు పడటానికి మగ్గానికి పైన అమర్చిన ఒకరకం పనిముట్టు(=సిగగొండి)కట్టుబడిలో ఒక భాగం (తె. 25).

**సిగళ్ళకోల** ఉ. సీళ్ళకోల; పర్యా. చూ. పైకోత్రిల. ఆసుపోసిన పడుగులో మొదటి అని పడ్డ భాగం (=కోత్రిల) (కో. 1).

**సిగరె** 1. చూ. సివర (తె. 4); 2. చూ. సూరె (4) (తె. 4).

**సిగుడు** చూ. సీకు(5) (రా. 7).

**సిగురుపుల్ల** పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం(=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల ఇనపచువ్వగాని వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (తె. 21).

**సిగ్గి** చిన్నకంచెలబేలు (తె. 11).

**సిగ్నలు** పర్యా. చూ. కత్తెరగుంజ(2). మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నేతబయలులో పాతిన ఒకరకం నిలువుగుంజ; పైనఒకటి, పటవాలుగా మరొకటి కొయ్యపట్టెలు బిగించింది; కత్తెర మాదిరిగా, లేక రైలురెక్కమాదిరిగా ఉంటుంది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 117 (కో. 32, 33).

**సిగ్నలుకర్ర** ఉ. సిగినలుకర్ర. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా కత్తెరగుంజకు పైన అడ్డంగా బిగించిన కొయ్యపట్టె. చూ. చిత్రం 117.1 (కో. 32).

**సింగపూరుకైల** సింగపూరుకు ఎగుమతి చెయ్యటానికి నేసిన తురకల గళ్ళలుంగీ (కో. 1).

**సింగంవాళ్ళు** ఉ. సింగమోళ్ళు. నేతపనిచేసే దేవాంగుల దగ్గర అడుక్కొనేవాళ్ళు (కో. 1. 3).

**సింగల్ బాణా** ఒకరకం కృత్రిమపుపట్టు(=బాణా); పురిలేకుండా ఒకే పోగుగా ఉన్నది (తె. 28).

**సింగాలు** నేతపనిచేసే దేవాంగుల దగ్గర అడుక్కోటానికి వచ్చేవాళ్ళు; అచ్చులు కడతారు; వీళ్ళకు కంబళ్ళు ఇవ్వటం మామూలట (కో. 23).

**సింగితాడు** పర్యా. చూ. మలగుది(2). పెడకోలకు తగిలించే మలగర్ర కొన్నిచోట్ల మలబద్దదారం; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 127.11 (తె. 18).

**సిడిమాను** బండిమీద ఎత్తుగట్టిన నొగలాంటి కర్ర; "నరేపోలమ్మ" పండుగనాడు దేవాంగులు అమ్మవారి గుడికి వెళ్ళేటప్పుడు ముందర దీన్ని తీసికెళ్తారు(కో. 35).

**సిత్తి** (బహు. సిత్తులు) ?కృత్రిమపుపట్టు(=నార) చిలప (రా. 9).

**సిద్దిపేటు** పర్యా. చిత్రబుగిడి. రెండుమొగ్గ

(=బుగిడి)ల వరసలో బొమ్మలు పడేటట్టు నేసిన డిజైను చూ. చిత్రం 186 (తె. 19).

**సిద్ధివినాయకచవితి** ఉ. సిద్ధ-: పర్యా. చూ. వినాయక చవితి భాద్రపదశుద్ధ చవితి; నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజచేసి పండుగ చేసుకొంటారు (కో. 34).

**సిందూరం** ఒకరకం ఎర్రరంగు; సిందూరతిలకం రంగు (కో. 9).

**సిబురు** చూ. సివర (రా. 24).

**సిబ్బి** ఉ. చిబ్బి. మట్టిమూత; గంజిపోసినకుండ మీద మూత పెడతారు (తె. 11, 14, 17).

**సిమెంటురోడ్డంచు** రంగుదారంతో పట్టె మాదిరిగా నేసిన అంచు (తె. 31).

**సిమ్మెంటుకలరు** ఉ. సిమ్మెంటుకల్రు. పర్యా. సిమ్మెంటు(రంగు). ఒకరకంబూడిదరంగు(కో.10; రా.6).

**సిమ్మెంటు(రంగు)** ఉ. సిమెంట్, సిమెంటు(రంగు) సిమ్మెంట్రంగు; పర్యా. సిమ్మెంటుకలరు. ఒకరకం బూడిదరంగు (కో. 2, 6, 18, 19, 22 23).

**సిమ్మెంటులైట్** లేత బూడిదరంగు (కో. 2).

**సింహాలంచు** సింహంఆకారంలో డిజైన్లు పడేట్టు నేసిన అంచు; నేత ఉల్టా సీదా(=పైన ఒకరకంగానూ కింద ఒకరకంగానూ కనిపించే నేత)గా వస్తుంది; దీన్ని నెయ్యటానికి మగ్గంగుంటలో రెండు పావుచెక్కలు అదనంగా అమరుస్తారు (తె. 5).

**సిరంజిచెక్క** రంగుల అద్దకం తయారీలో వాడే ఒకరకం కొయ్యచెక్క (కో. 12).

**సిరారంగు** ఒకరకం నీలంరంగు: 1. వయిలెట్‌లో లేతరంగు (కో. 9, 9బి); 2. వయిలెట్, సిరావన్నె కలిసినరంగు (తె. 15); 3. ఆస్మాన్‌రంగు (తె. 16).

**సిరికచ్చు** పర్యా. కచ్చు(4). నేతలో రెండు పోగుల మధ్య వచ్చిన వెలితి; పలచగా చరన్నేత నేసినప్పుడుగాని పోగులు తెగినప్పుడుగాని పేకపోగుల మధ్య వెలితి జాడలుగా వస్తుంది (కో. 26, 37).

**సిరివేరుచాయ** ఉ. సిరివేరుసాయి. పర్యా. సిల్వేరి(చెక్క)రంగు. ఒకరకం ఎరుపురంగు; చిక్కటి రక్తం రంగు; సిల్వేరిచెట్టు చెక్క పొడిచేసి తయారుచేస్తారు; పూర్వం వాడుకలో ఉండేది (కో. 7).

**సిరిమానుఅంటు** సిరిమానుచెట్టు జిగురు; పట్టుపడుగుకు పెట్టే గంజిలో కలుపుతారు (రా. 22).

**సిలకపంజె** (<silk-) పట్టుదారం చుట్టే ఒకరకం కొయ్యపంజె; చూ. చెలకపంజె (తె. 18).

**సిలారునేత** పడుగుకు రెండు రంగులూ పేకకు ఒక రంగూ పెట్టి నేసిన నేత (తె. 32).

**సిలిండరు** పర్యా. చూ. దిండు(1). డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు; బోట్లపింజెర దిండుకు బొడిపెలు, తొల్లపింజెర దిండుకు గాళ్ళూ ఉంటాయి; గొలుసుపింజెర దిండుకు ఇవి ఉండవు; కొన్నిచోట్ల దీనికి చివర ఇనపమేకుల చెక్రంగాని రేకు పళ్ళచెక్రంగాని బిగిస్తారు. చూ. చిత్రం 132 క. 1 (కో. 12).

**సిల్కాలివు** ఉ. సిర్క్‌ఆలివ్, సిల్కాలీబు. **1.** పాచిరంగులో లేత వన్నె (కో. 2; రా. 8); **2.** పేడరంగు; silk olive. చూ. చిత్రం 288 (కో. 18).

**సిల్కు** ఉ. సిలక, సిలుకు. **1.** పర్యా. చూ. పట్టు. పట్టుపురుగుల నుంచి వచ్చేదారం (కో. 16, 19, 23, 36; తె. 24); **2.** ఒకరకం కృత్రిమపుపట్టు; రాతినార (తె. 8; రా. 15).

**సిల్కుపేటంచు** ఉ. సిలుకుపేటిఅంచు. ?పట్టులో డిజైను పడేట్టు నేసిన ఒకరకం అంచు (రా. 16).

**సిల్కుపంజె** ఉ. సిలకపంజె. పట్టుదారం చుట్టే కొయ్య పనిముట్టు; నూలుపంజెకంటె చిన్నది; చూ. పంజె (తె. 10, 18).

**సిల్కుమైజారు** ఉ. సిలక మైజారు. పట్టునూలు పెట్టి నేసిన పైటకొంగు (కో. 24).

**సిల్కులడి** ఉ. సిలుకు-. పట్టుదారంలెక్క : చూ. లడి (రా. 15).

**సిల్వరుపట్టె** పర్యా. చూ. ఒగ్గులపట్టె. మరాను కట్టుబడిలో పడుగుపోగులు దూర్చే జెజ్జాలుగల రేకు ముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె. చూ. చిత్రం 50.11 (కో. 4).

**సిల్వర్‌గ్రే** ఒకరకం బూడిదరంగు (రా. 15).

**సిల్వర్‌రంగు** అల్యూమినియం(జెర్మన్‌సిల్వర్)రంగు (తె. 13).

**సిల్వరుతాంబుచీర** అంచులో తెల్లగీరలు పడేట్టు నేసిన చీర (తె. 24).

**సిల్వరురుమాలు** ఉ. సిల్వర్రుమాలు. తెల్లనూలుతో నేసిన తలపాగ (తె. 24).

**సిల్వేరి(చెక్క)రంగు** ఉ. సిర్వేరురంగు; పర్యా. సిరివేరుచాయ. ఒకరకం ఎరుపురంగు; చిక్కటి రక్తం రంగు; సిల్వేరిచెట్టు చెక్క పొడిచేసి తయారుచేస్తారు; పూర్వం వాడుకలో ఉండేది (తె. 4, 5, 13).

**సిల్వేరిబండ** సిల్వేరిచెక్క పొడుంకొట్టే రాయి; పెద్దది (తె. 5).

**సివర** (-తొడుగు) ఉ. చివర; రూ. సిగిరె(1), సిబురు; పర్యా. చూ. బద్దెచువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం(=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్ని

చోట్ల ఇనపచువ్వగాని వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (రా. 3 11, 14, 17, 18, 23).

**సివాగం** (బహు. సివాగులు) అచ్చతికే బద్దెపోగుల పాయ; చెమికె-(చూ.)కొయ్యగా మిగిలింది; ఇటువంటి పాయలు వరసగా ఉంటాయి (రా. 24).

**సివాబంద** పర్యా. చూ. బద్దెసువ్వ. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం(=బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం; దీన్ని దోనెగాడిలో పండ్లగుదులతో బిగిస్తారు; కొన్నిచోట్ల ఇనపచువ్వగాని వెదురుబద్దగాని వేస్తారు. చూ. చిత్రం 124.1 (కో. 16).

**సిస్తచ్చు** ఒకరకం అచ్చు; ఎక్కువ పుంజాల నూలు పడుగు (పెద్దపడుగు) అతికి నేసేది; డిజైనునేతకు ఉపయోగిస్తారు (తె. 11).

**సీకు 1.** పర్యా. చూ. సూలం(1). రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు; మామూలుగా ఇనపది; కొన్నిచోట్ల కొయ్యది; కొన్నిచోట్ల రాటికట్టుబడిలోనే ఒక భాగంగా ఉంటుంది; కొన్నిచోట్ల దూపిరికి దిగగొట్టి ఉంటుంది. చూ. చిత్రం 31 క. 2 (తె. 10, 19, 20); **2.** పడుగు చివరిభాగంలో ఎక్కించిన కర్ర (తె. 10); **3.** రంగునీళ్ళ అండాలో ఉడకబెట్టటానికి నూలులడీలు తగిలించిన ఇనపఊచ; దీన్ని పట్టుకోటానికి వీలుగా రెండువైపులా వంపులు ఉంటాయి; దీంతో లడీలు రంగునీళ్ళలో దించి అండాఅంచులమీద మోపుతారు. చూ. చిత్రం 282 క. 4 (తె. 19, 20, 22).

**సీంగ్** (హిం; బహు. సీంగాం)పర్యా. చూ. దిద్దు(డు) బిళ్ళ. అచ్చుకర్రకు కట్టిన వడిదారం బిర్రుగా ఉండటానికి పైమెలికె(=పూస)లమీద రుద్దే దుప్పికొమ్ము; అచ్చుకట్టే సాయెబుల వాడుక. చూ. చిత్రం 96 (కో. 5).

**సీడీ** పర్యా. చూ. లడీ(1). పెట్టెలో ఉండే నూలు కట్టె. ఏ నెంబరు నూలో అన్ని లడీలు ఒక్కొక్క పెట్టెలో ఉంటాయి. $\text{సీడీబరువు}=\frac{\text{నూలు నెంబరు}}{\text{పదిపౌన్లు}}$ (కో. 27).

**సీడు** ఉ. చీడి, చీడు, షీడు, సిడి, సీడి, సీలు. **1.** నూలు లెక్క: లడీలో పదోవంతు నూలు (కో. 25, 26, 28-30; తె. 26); **2.** లడీలో అయిదోవంతునూలు (కో. 1; రా. 4); **3.** 80 నెంబరు లడీలో ఇరవయ్యోవంతు నూలు (కో. 24); **4.** ఒక లడీనూలు (కో.27); **5.** రూ. సిగుడు. అనులుపడకుండా ఆసుపోసిన నూలు. కొన్నిచోట్ల వడికిననూలూ మిల్లునూలూ కూడా సీడంటారు (కో. 1, 25-30; తె. 5, 11; రా. 4, 7, 8, 17, 18, 23, 24); **6.** పడుగులో సగంనూలు(కో. 6ఎ, 8; తె. 6; రా. 16); **7.** పడుగులో కొంతభాగం నూలు (కో. 7; తె. 2; రా. 11, 13, 16); **8.** ఆసుపొయ్యటం ఉపవృత్తిగా గల రైతులు మొ.వారు అనులు లేకుండా పోసిన నూలు; పూర్వం వాడుకలో ఉండేది (కో. 9ఎ; తె. 12); **9.** పర్యా. చూ. పడుగు (2). ఆసుపోసిన నూలు; నేతలో నిలువుకువాడే నూలు (కో. 8, 9ఎ; రా. 9, 15, 18, 20); **10.** (-పాపు) పర్యా. చూ. పాయ(4). పడుగులో విడదీసిన కొంత భాగం; సరిచేసేటప్పుడు పడుగులో చివరిభాగం పాయలు పాయలుగా విడదీస్తారు (తె. 1).

**సీడుకొయ్య** పర్యా. చూ. అనుగొట్టం(1). ఆసుపోసే గొట్టం; దీంట్లోకి పోగు తీసుకొని ఆసుపోస్తారు. చూ. చిత్రం 48 (రా. 15).

**సీడుజరుపు** (క్రి.) పర్యా. చూ. అతుకులుదాటించు. అచ్చతికిన పడుగులో అతుకుపోగులు అచ్చులోనుంచి ఒన్నె ఇవతలకు జరపటం (తె. 31).

**సీడుపోయు** (క్రి.) పర్యా. చూ. ఆసుపోయు. ఆసుగొట్టంలోకి పోగు తీసుకొని ఆసుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చెయ్యటం (రా. 15, 18, 19).

**సీడుమాను** పర్యా. చూ. ఆసు(1). పడుగునూలు పోసే కొయ్యపనిముట్టు. చూ. చిత్రాలు 45-47 (రా. 15).

**సీడులాక** పడుగులో మొదట దూర్చిన లాక(తె.31).

**సీత(కలరు)** ఉ. సీతకల్రు. ఒకరకం రంగు; కాఫీరంగు మాదిరది. చూ. చిత్రం 288 (కో. 2, 7, 10, 12, 21).

**సీతడీప్** ఒకరకం ముదురు రంగు; లేత కాఫీరంగు మాదిరిది. చూ. చిత్రం 288 (కో. 2).

**సిపాన్‌తాడు** ?ఒకరకం డిజైనునేతలో అనులు లేపటానికి కట్టినతాడు (తె. 21).

**సీమకాటురంగు** ఉ. చీమకాటురంగు. నారింజరంగు; ఆరంజెన్, పటిక, తేజాపు, నైట్రేట్ సోడాలు కలిపి తయారుచేస్తారు (తె. 5, 21, 27).

**సీమనీలి** ముదురు నీలిరంగు; విదేశాల(=సీమ)నుంచి దిగుమతి అయింది (కో. 7, 8).

**సీమనూలు** పర్యా. చూ. మిల్లునూలు. మిల్లులో యంత్రాలమీద తయారయిన నూలు (కో. 6, 33, 34, 37).

**సీమపట్టు(రంగు)** ఉ. చీమపట్టు, సీమపొట్టు. **1.** ఒకరకం(ముదురు)నారింజ(పండు)రంగు (తె. 12, 15, 16); **2.** గుమ్మడిపువ్వులో ఎరుపువన్నె కలిసిన రంగు (తె. 14); **3.** తిరుచూర్ణంరంగులో నిండురంగు (కో. 7).

**సీమపత్తి** ఉ. సీంపత్తి. పెద్దకాయపత్తి; దూది తెలుపు; బరువు తక్కువ (రా. 2, 24).

**సీమమగ్గం** ఉ. సీమ్మొగ్గం; పర్యా. చూ. మరమగ్గం. ఒకరకం మగ్గం; నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజేది; ఇంగ్లీషువాళ్ళ కాలంలో వాడుకలోకి వచ్చిందట; మగ్గం పలక, పన్నె ఒక కొయ్యచట్రంలో బిగించి పైన కుచ్చుతాళ్ళు కడతారు; దీంతో తొందరగా నెయ్యవచ్చు. చూ. చిత్రం 108 (కో. 1).

**సీల** ఉ. చీల. **1.** పర్యా. చూ. అసుకొయ్య(3). అసుపీటలకు దిగగొట్టిన నిలువుపుల్ల(లు); వీటిని చుట్టివచ్చేటట్టు ఆసుకు నూలు పోస్తారు. చూ.చిత్రం 45 క. 4-6 (కో. 16); **2.** పర్యా. చూ. చిరతలి. ఆసుపీటల బిగింపుకు వేసే కొయ్యపేడు; నేత పొడుగును బట్టి ఆసుపీటలను దగ్గరికిగాని దూరానికిగాని జరుపుకొని పేడు బిగిస్తారు. చూ. చిత్రం 45 క. 8 (కో. 7, 10); **3.** పర్యా. చూ. మేకు(3). మరాసుమీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులు రావటానికి అడ్డకట్టెకు బిగించిన ఇనపపుల్ల; మరాసు తిరిగేటప్పుడు ఒగ్గులపట్టె పక్కకు జరిగి పోగులు అనిపడేట్టు దీనికి చుట్టుకొంటాయి; ఇటువంటివి 60—100 ఉంటాయి. చూ. చిత్రం 50 (కో. 14; తె. 13; రా. 2); **4.** పర్యా. చూ. ఒగ్గి. మరాసుమీద పడుగుతోడేటప్పుడు అనులుపడేట్టు పోగును జరపటానికి ఒక కొయ్యపట్టెకు బిగించిన రేకుముక్క; సుమారు మూడంగుళాల పొడుగుది; దీని బెజ్జంలోనుంచి తీసిన పోగు మరాసుకు చుట్టుకొంటుంది; మరాసు తిరిగినప్పుడు కీలు ఆడుతూ కొయ్యపట్టె జరిగి దానికి బిగించిన ఈ రేకుముక్క పోగునుగూడా జరుపుతుంది; ఇలా జరగటంలో పడుగులో అని పడుతుంది; ఇటువంటివి పట్టె పొడుగునా వరసగా(కొన్నిచోట్ల 40) ఉంటాయి; వీటికి ఎదురుగా పట్టెకు రెండోవైపు బిగించిన రింగులను గూడా సీలలనే అంటారు. చూ. చిత్రం 50.14 (కో. 2); **5.** పర్యా. ఊడైసీల. ఊడైకాళ్ళు బిగించిన మేకు; కొన్నిచోట్ల కొయ్యపేడు; ఊడైకాళ్ళు కలిసేచోట అడ్డపట్టెకు బిగించే చోట వేస్తారు. చూ. చిత్రం 63 క. 2 (కో. 26, 32, 34, 37); **6.** పర్యా. చూ. పలకసీల. చేతిమగ్గం పలకనూ గుంజనూ కలిపి బిగించిన కొయ్య; కొన్నిచోట్ల దీనికి పైభాగంలో నగిషీలు చెక్కుతారు; కొన్నిచోట్ల దీన్ని తొలిచి లోపల గజ్జెలు బిగిస్తారు; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 109 చ. 3 (కో. 3, 9, 22-24; తె. 21); **7.** పర్యా. చూ. చిల్ల(7). మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 118.8 (కో. 21; రా. 9); **8.** పర్యా. చూ. వారుపుల్ల. మరమగ్గం ఉడతకు పైన ఉడతతోలు(=వారు) కొసలు బిగించిన ఇనపపుల్ల. చూ. చిత్రం119.3(తె.16); **9.** పర్యా. చూ. పావుచెక్కలగూటం. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; మామూలుగా వెనకవైపు మడిమ దగ్గర ఉంటుంది; పావుచెక్కల వెనక తాళ్ళు దీనికి కడతారు; కొన్నిచోట్ల ఇటువంటి గూటాలు పావుచెక్కలకు పక్కగా రెండుంటాయి. చూ. చిత్రం 121 క. 2 (రా. 3, 6, 9); **10.** పర్యా. చూ. పన్ను(2). దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల; కొన్నిచోట్ల ఇనపపుల్ల; కొండి. చూ. చిత్రం 121 క. 4 (తె. 24; రా. 9); **11.** పర్యా. చూ. కొండి(6). అచ్చుగుదులు తగిలించే వంకర ఇనప ఊచ; దీన్ని మామూలుగా మగ్గం పైదండెకు వేలాడదీస్తారు; కొన్నిచోట్ల అచ్చుగుదికి తగిలిస్తారు; ఇటువంటివి రెండుంటాయి; కొన్నిచోట్ల గిరక, కొండి కూడా కడతారు. చూ. చిత్రం 121 క. 9 (రా. 11); **12.** పర్యా. చూ. నాడెగుబ్బ. మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; కొన్నిచోట్ల ఇత్తడిది; ఇటువంటివి రెండుంటాయి. చూ. చిత్రం 131 క. 1 (రా. 10); **13.** పర్యా. చూ. తూకం. పేటువడికి కింద వేలాడగట్టిన బరువు; మామూలుగా ఇనపపుల్ల; కొన్నిచోట్ల నత్తుది, నేతనేసేటప్పుడు అనిమూసిన తరవాత వడి కిందికి దిగటానికి కడతారు; ఇటువంటివి రెండు పక్కలా గుంటల్లో వేలాడతాయి. చూ. చిత్రం 132 చ. 15 (రా. 7, 12, 13).

**సీలతొలి** పర్యా. చూ. నాలికతొలి(1). దోనెపలక విప్పటానికి పల్లెకట్టె దూర్చే దోనెగాడి; కుడివైపున ఉంటుంది; ఇటువంటివి నాలుగుంటాయి. చూ. చిత్రం 123 క. 10 (తె. 19).

**సీలలగుంత** ఉ. చీలలగుంత. పర్యా. జాల్లగుంట, తూకాలగుంత, పేటుగుంత, వళ్ళగుంట, వాదాటు. పేటుతూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి మగ్గం గుంటకు పక్కగా తీసిన గొయ్యి; ఇటువంటివి రెండు పక్కలా రెండుంటాయి. చూ. చిత్రం 132 చ. 16 (రా. 12, 13).

**సీల(ల)పట్టె** పర్యా. చూ. మేకులకమ్మి. మరాసు మీద పడుగుపోసేటప్పుడు పడుగులో అనులు రావటానికి మేకులు బిగించిన అడ్డకట్టె; ఒగ్గులపట్టె పక్కకు జరిగినప్పుడు పడుగులో అనులు పడతాయి. చూ. చిత్రం 50.8 (కో. 6).

**సిల్కాదెషర్టింగు** నేతనేసేటప్పుడు నాడెలుమారుస్తూ

నేసిన ఒకరకం చొక్కాగుడ్డ; మూడురంగుల దారపు కండెలు మూడు నాడెల్లో బిగించి రెండేసి కొలుకుల చొప్పున రెండు రంగులు ఒక కొలికి మరొక రంగుపెట్టి నేస్తారు (కో. 6).

**సిల్లాక 1.** (?<సీడులాక) అల్లు చేసేటప్పుడు పడు**గులో** దూర్చిన వెదురుబద్ద (తె. 32); **2.** పర్యా. చిరులాక(2). నేతపడుగులో దండెకూ అచ్చుకూ మధ్య దూర్చిన వెదురుబద్ద (తె. 31, 32).

**సీళ్ళపంటె** పర్యా. చూ. పంటె. చేత్తోనూలు (=సీళ్ళు)చుట్టే పనిముట్టు. చూ. చిత్రం 19 (రా. 8).

**సీళ్ళరాటం** పర్యా. చూ. డబ్బా(ల)రాట్నం. డబ్బాలకు నూలుతోడే రాట్నం: చూ. సీకు. చూ. చిత్రం 41 (రా. 8).

**సుకన్యాషేటుచీర** ఒకరకం డిజైనులో నేసిన చీర (తె. 7).

**సుక్కతీగ** నేతలో తీగ మాదిరిగా నేసిన ఒకరకం డిజైను (తె. 25).

**సుఖ(ం)సాలీలు** ఉ. సుకసాలీలు. నేతపని చేసే వారిలో ఒక తెగ (రా. 8, 16).

**సుగిరె** చూ. సూరె(4). (తె. 5).

**సుంకలకోల** చూ. సుంగుడుకోల (తె. 1).

**సుంకు** (-పోవు) ?మాలిన్యం; దసలి(పట్టు)పురుగులు పెట్టిన గుడ్లను ఒక గొంగడిలో పోసి శుభ్రంచేస్తారు (తె. 7).

**సుంకోల** చూ. సుంగుడుకోల (రా. 24).

**సుంగితాడు** ఉ. సింగితాడు; పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరి పాయకు కట్టిన దారం; పొట్టెకొక దారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రాలు 127.8, 128 చ. 1 (తె. 22. 23, 25, 29, 33).

**సుంగు 1.** (-వేయు) పర్యా. చూ. పొట్టె(7). పడుగునూలులో చివరపాయగా విడదీసిన పోగులు; అల్లుచేసేటప్పుడు పడుగును పాయలుగా విడదీస్తారు; మగ్గంమీద ముడులు వేస్తారు; కొన్నిచోట్ల కర్రలకు చుడతారు. చూ. చిత్రం 127.7 (రా. 16 17; **2.** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివర పాయకు కట్టిన దారం; పొట్టెకొక దారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రాలు 127.8, 128 చ. 1 (తె. 23); **3.** కమ్మిపక్కన(=ఇవతల) మామూలుగా నేసిన భాగం; సుమారు జెత్తెడు లగాయితు జేనెడు పొడుగు వరకూ నేస్తారు (కో. 2).

**సుంగుడుకోల** రూ. సుంకలకోల; సుంకోల; పర్యా. చూ. పొట్టెకోల. నేతపడుగు చివర పాయలతాళ్ళు కట్టిన కర్ర; దీనికి కొన్నిచోట్ల మలబద్ద జోడిస్తారు; కొన్నిచోట్ల దీనికి పొట్టెలు మెలివేస్తారు. చూ. చిత్రం 128 త. 1 (రా. 23).

**సుంగుదారం** పర్యా. చూ. పొట్టెతాడు. నేతపడుగులో చివరి పాయకు కట్టిన దారం; పొట్టెకొక దారం చొప్పున మలగర్రకు కడతారు. చూ. చిత్రం 127.8 (రా. 16, 17).

**సుంగుబద్ది** రూ. బద్దిసుంగు; పర్యా. ఒరబద్దె. నేత చీరకు ముందువైపు వదిలిన బద్దె; బట్ట కట్టుకొనే ముందు ఈ బద్దెకోసి పారేస్తారు; చూ. బద్దె (కో 2).

**సుంగులకట్టె 1.** ఉ. సుంగలకట్టె, సుంగులుకట్టె, సుంగుల్కట్టె; పర్యా. చూ. పొట్టెకోల. నేతపడుగు చివర పాయలతాళ్ళు కట్టిన కర్ర; దీనికి కొన్నిచోట్ల మలబద్ద జోడిస్తారు; కొన్నిచోట్ల దీనికి పొట్టెలు మెలివేస్తారు. చూ. చిత్రం 128 త. 1(తె. 2; రా,16-18); **2.** ఉ. సుంగలకట్టె; పర్యా. చూ. మలగర్ర. నేతపడుగులో చివరి పాయలు బిగించినకర్ర; మామూలుగా దీనికి మలబద్ద జోడించి పాయలు చుడతారు; కొన్నిచోట్ల పొట్టెలుగాని పొట్టెతాళ్ళుగాని కడతారు. చూ. చిత్రం 127.10 (తె. 1, 2).

**సుజినీ 1.** చూ. సుదినీ (కో. 17); **2.** నెమలికన్ను నేతలో నేసిన జంపఖానా (తె. 1).

**సుడినూలు** చూ. సురినూలు (కో. 19).

**సుతిలి** పర్యా. పకునార. పకుబద్దకు కట్టిన గట్టి పురిదారం; నారతాడు; దీనిమీద గూటాలతో కొడుతూ ఉన్ని పకుతారు. చూ. చిత్రం 309.1 (తె. 28).

**సుత్తిడోరి** దారం; తివాసీనేతలో నిలువుకు వాడతారు (తె. 17).

**సుత్తిదారం** నారతో పేనిన తాడు; పురికోస; చిటికె అద్దకంలో నూలుబొందుకు కడతారు (తె. 5).

**సుత్తె** ఊడ్తె గూటాన్ని నేలలోకి దిగగొట్టే సుత్తి (కో. 28. 29).

**సుదినీ** ఉ. సుతినీ, సూదినీ; రూ. సుజినీ(1); పర్యా. గింటందుప్పటి, ఒములుదుప్పటి. నేతలో నిలువుకు, అడ్డానికి రెండేసి పోగుల చొప్పున పెట్టి నేసిన దుప్పటి; కొన్నిచోట్ల గళ్ళుగళ్ళుగా నేస్తారు (తె. 11, 13, 14).

**సుద్దులవాళ్ళు** ఉ. సుద్దులోళ్లు. నేతపనిచేసే దేవాంగుల దగ్గర కథలు చెప్పి అడుక్కునేవాళ్ళు (రా. 18బి).

**సుందరమణిచీర** డైమండ్‌చుక్క మాదిరి డిజైన్లు పడేట్టు నేసిన చీర (కో. 33, 34, 37).

**సున్నం** నూలును చలవచెయ్యటానికి చౌడుతో బాటువేసి ఉడకబెట్టే ఒక పదార్థం; lime (రా. 6.15).

